# సుప్రసిద్ధి బోధ

## (ప్రవచన మాలిక-2)

| | | | |
|---|---|---|---|
| జీవుడు | - దేవుడు | కి - | దేవుడు |
| కుమారుడు | - తండ్రి | కి - | తండ్రి |
| మనిషి | - అల్లాహ్ | కి - | అల్లాహ్ |

↓ ↓ ↓

| | | |
|---|---|---|
| అన్నీ అనుభవిస్తాడు | అన్నీ చేస్తాడు | ఏమీ చేయడు |

↓ ↓ ↓

| | | |
|---|---|---|
| నీవు | నీ లోపలి వాడు | నీ బయటి వాడు |


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు







# సుప్రసిద్ధి బోధ


<u>రచయిత :</u> త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, 98 వ గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-40 ప్రథమ ముద్రణ : నవంబర్-2018

ప్రతులు : 1000 వెల : **650/-**

02 **"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు**

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము.
98) సుప్రసిద్ధి బోధ.
99) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
100) ౧౦౦, శతము, 100
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) సున్న.
105) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.

82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం.
138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి (ప్రెసిడెంట్)**
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# విషయ సూచిక

**భగవద్గీతలో...**

"జ్ఞానం అనే అగ్ని చేత నీ కర్మ కాల్చివేయబడుతుంది" అని చెప్పాడు.

**బైబిల్‌లో...**

"దేవుడు పాపాన్ని క్షమిస్తాడు" అని చెప్పినాడు.

**ఖురాన్‌లో...**

"దేవుడు క్షమాశీలుడు" అని అన్నారు.

# 64. మూడు పుట్టుకలు-రెండుజాగాలు

**(తేది : 05.04.2013)**

మనందరికీ జన్మదినము ఒక్కటే గలదు. మధ్యలో మనం జరుపు కుంటున్నవన్నీ జన్మదినాలు కావుగానీ, మరణదినాలుగా లెక్కబెట్టుకో వలసిందే. ఏ రోజైతే మనం పుడుతున్నామో, అదే రోజే మనము చనిపోతేనే పుట్టుక సాధ్యమగును. చావు, పుట్టుకల గురించి చాలా గందరగోళాలు ఉన్నాయి. మేము ఇంతకుముందు **"జనన మరణ సిద్ధాంతము"** అనే గ్రంథాన్ని వ్రాసాము. దాని తరువాత **"మరణ రహస్యము"** అని, మరణాన్ని విపులీకరిస్తూ మరియొక గ్రంథాన్ని వ్రాసాము. మన శాస్త్రవేత్తలు, పరిశోధకులు వేయి సంవత్సరాలు పరిశోధన చేసినా, కనుగొనలేని రహస్యమిది. మరి మీరు ఎట్లు ఆ విషయాలను చెప్పగలిగి వ్రాయగలిగా రంటే, నేను ఏదీ సొంతంగా వ్రాయలేదు. నా లోపలున్నవాడు ఎరుకపరిస్తేనే నేను మీకు ఎరుక పరుస్తున్నాను. ప్రతీ వ్యక్తిలోనూ ఇద్దరు వ్యక్తులున్నారు. నేను జీవున్ని, వ్యక్తమవుతూ బయటకు తెలుస్తున్నాను. రెండవవాడు శరీరములోనే ఉండి వ్యక్తము కాకుండా ఉన్నాడు. వాడిని **'గుప్తుడు'** అంటాము. గుప్తముగా ఉండేవాడిని గుప్తుడు అంటాము. ఆ విధంగా ఎవరికీ తెలియబడక చిత్రంగా ఉన్నాడు కనుకనే ఆయనను **'చిత్రగుప్తుడు'** అని కూడా అన్నారు.

చిత్రగుప్తుడు అంటే యమలోకంలో ఉంటాడు అని అనుకోవద్దండి. ప్రతివ్యక్తి శరీరంలోనూ ఉన్నాడు. ఆయనకు అన్ని జ్ఞానములు తెలుసును. ఆయన మనకు ఏది చెప్పినా వాస్తవమే. అటువంటి విషయములే మీకు ఇక్కడ చెప్పబడుచున్నాయి. మేము చెప్పిన విషయాలు నూటికి నూరు పాళ్ళు గ్రహించుకునేవారున్నారు. తక్కువ మోతాదులో గ్రహించుకునే

వారూ ఉన్నారు. లోపలున్న వాడు ఏది చెప్పితే ఇక్కడ అదే చెప్పబడుతుంది. దానిని నూటికి నూరుపాళ్ళు గ్రహించుకుంటే మంచిది. బైబిల్‌లో **"జ్ఞానము"** అని వ్రాయవలసిన చోటంతా దానిని తెలుగులోకి అనువాదం చేసినవారు అలా వ్రాశారు. **"నీతి"** అని వ్రాసుకున్నారు. "నీతి" అనేది ప్రపంచ సంబంధమైనది. "జ్ఞానము" పరమాత్మ సంబంధమైనది. అనువాదం సరిగ్గా లేకపోతే భావం మారిపోతుంది. పాప పుణ్యములను ఆంగ్లములోకి అనువాదం చేసిన వారంతా పాపాన్ని **'సిన్'** అన్నారు. పుణ్యమునకు మాత్రం సరిఅయిన పదం వాడలేదు అప్పుడు పుణ్యం అనే వ్రాయాలి. దానికి సరైన అర్థం ఇచ్చే పదం లేదు. ఇంకా కొందరు 'మెరిట్' అని వాడుచున్నారు. మెరిట్ అంటే ప్రతిభ అని అర్థం కానీ పుణ్యం అనే మాటకు సరిపోదు. అనువాద గ్రంథాలలో కొంత భావమార్పిడి జరిగింది. అటువంటి గ్రంథాలు చదివినప్పుడు గందరగోళం ఏర్పడవచ్చును. కనుక వాటిని అర్థం చేసుకునేటప్పుడు జాగ్రత్తగా అర్థం చేసుకోవలెను. మీరందరూ ఇక్కడకు ఎందుకు వస్తున్నారు? మా మీద నమ్మకంతో వస్తున్నారు. ఎక్కడా చెప్పని జ్ఞానాన్ని ఇక్కడ మీరు వింటున్నందుకు సంతృప్తితో వస్తున్నారు. ఆ నమ్మకాన్ని వమ్ము చేయకుండా ఉండేందుకు మా వెనుక ఉన్నవాడు నడిపిస్తున్నాడు. అదే మేము మీకు చెప్తున్నాము. ఆ విషయాలను తెలియజేయటం కొరకు ఇంకొక గ్రంథము వ్రాయవలసిన పనివచ్చింది. ఆ గ్రంథము పేరు **"తీర్పు"**. ఆ తీర్పును మనం తీర్చలేముగానీ, తీర్పు అనేది ఒకటుంది అని మాత్రం హెచ్చరించటం జరిగింది. ఇవన్నీ రహస్యాలతో కూడుకున్న విషయాలు. వీటిని 'విపులీకరించి చెప్పెదను' అని దేవుడు ముందే చెప్పినాడు. ఇదే విషయం మీకు భగవద్గీతలో విజ్ఞానయోగము అనే అధ్యాయంలో 2వ శ్లోకాన్ని చెప్పుచున్నాము. మాకు సంస్కృతం చదవటం రాదు. తప్పులుంటే సర్దుకు పోండి ఆ శ్లోకమేమిటంటే.

శ్లో॥ జ్ఞానంతేహం సవిజ్ఞానమ్ ఇదం వక్ష్యామ్యశేషత: ।
యద్జ్ఞాత్వా నేహ భూయోఅన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ॥

"ఇప్పుడు నేను చెప్పే జ్ఞానం **విజ్ఞానసహితము**గా ఉంటుంది. ఏది తెలుసుకున్న తరువాత ఏది తెలుసుకోవాలో మీకు అది తెలుస్తుంది. ఏది తెలుసుకున్న తరువాత ఇంకా తెలుసుకోవలసినది మిగలదో దానిని **విజ్ఞాన సహితము**గా వివరిస్తాను విను". అని మనందరికీ (మీ అందరికీ) తెలియ జేస్తున్నాడు. ఇంకొక అధ్యాయంలో భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగము అనే అధ్యాయంలో 2వ శ్లోకంలో...

శ్లో॥ 2. రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥

"విద్యలలో కల్లా పెద్దది. రహస్యములలోకంటే రహస్యమైనది, పవిత్రమైన దానిని గూర్చి చెప్పుచున్నాను. అటువంటి దానిని నీవు శ్రద్ధగా విను. ఇది ప్రత్యక్షమైన ధర్మం". దీనిని తప్పుగా మాత్రం అర్థం చేసుకోవద్దండి.

ద్వితీయ దైవగ్రంథము అను మూలగ్రంథంలో ఈ విధంగా చెప్పబడుతూ ఉంది. **"మీకు ఈ విషయములన్నింటినీ గూఢార్థముగా చెప్పుచున్నాను. కానీ నేనెప్పుడూ ఇక గూఢార్థముగా మాటలాడక దేవుని గూర్చి స్పష్టముగా మాట్లాడు ఘడియ వచ్చుచున్నది."** అని చెప్పాడు. మనం ఆ ఘడియ వచ్చింది అని అనుకుందాము. అదే విధంగా ఖురాన్ గ్రంథాన్ని చూస్తాము. ఇప్పుడు మీరు వేరే మతస్థుల గ్రంథమును చూడాల్సిన అవసరమే మొచ్చింది అని అడగవచ్చు. ఈ మతము, ఆ మతము అని పేరు పెట్టకుండా దేవుడు జ్ఞానం చెప్పాడు. ఆ జ్ఞానాన్ని భూమి మీద మనుష్యులు మా మతం, మా మతం అని చీల్చుకున్నారు. **"ఇవి సర్వమానవులకు సంబంధించినవి"**

అని చెప్పబడింది. ఎవరైనా వీటి గురించి మాట్లాడవచ్చు అని దేవుడే చెప్పాడు. కనుక ఆ ధైర్యంతో చెప్తున్నాను.

కొందరు ముస్లీమ్‌లు ఉన్నారు, వారు భగవద్గీత, పురాణాలు, వేదాలు, ఉపనిషత్తులను కంఠస్తం చేసారు. ఇప్పుడు మేము ఏ శ్లోకం చెప్పాలన్నా పుస్తకం చూసి చదువుతాము. వారికి అది అక్కరలేదు. ఎక్కడ ఏ శ్లోకం, ఏ పేజీలో ఉందో చూడకుండా ఆ శ్లోకాన్ని చదవగలరు. అటువంటి జ్ఞాపకశక్తి ఉన్నవారిని అందరినీ కలిపి సంఘాలు ఏర్పరచుకుని, ఈ శ్లోకాన్ని వల్లెవేస్తూ, ఈ శ్లోకాలన్నీ మా ఇస్లామ్ గూర్చే చెప్పుచున్నవి కనుక ఈ ఇస్లాం మతమే గొప్పది అని చెప్పి, మరల మతమునే తెచ్చిపెట్టి చెప్తున్నారు. ప్రతీ ఒక్కడు తన మతం గూర్చి గొప్పగా చెప్పుకోవాలని ప్రయత్నం చేస్తున్నారు తప్ప, దేవుని జ్ఞానాన్ని గొప్పగా చెప్పాలనే ఉద్దేశ్యం మాత్రం లేదు. దేవుని జ్ఞానాన్ని తప్ప, మతం గురించి చెప్పావా, నీకు శిక్ష తప్పదు అని చెప్పాము. అదే విషయాన్ని "తీర్పు" అనే గ్రంథంలో హెచ్చరించడమైనది. ఆ శిక్ష కొన్ని జన్మల పర్యంతం ఉంటుంది. ఈ విషయమై భగవద్గీతలో 17వ అధ్యాయం దైవాసురసంపద్విభాగ యోగములో 19వ శ్లోకంలో శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పాడు చూడండి.

*శ్లో॥ 19. తానహం ద్వేషత: క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।*
*క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీష్వేవ యోనిషు! ॥*

"జ్ఞానం తెలియకుండా ఉన్నవారిని, అసుర యోనులయందే పుట్టింతును." అన్నాడు. ఇదేమి? దేవునికేమి కోపం? అని అనుకోవద్దండి, అది ప్రత్యేకమైన కోపం. అది, ఇంకా ఏమి చెప్తున్నాడంటే....

శ్లో॥ 20. ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాం గతిమ్ ॥

“ఈ అసురయోనులలో జన్మించి, నాకు ఇంకా దూరమైపోతారు. జ్ఞానం అనేది తెలియకుండా పోతుంది. చివరికి అధోగతికి వెళ్ళిపోతారు” అని చెప్పటం జరిగింది. (మనుషులు) ప్రపంచ సంబంధమైన తప్పులు చేస్తే కష్టముల రూపంలో ఈ యుగంలో అనుభవిస్తే అయిపోగలదు. కానీ నన్ను గానీ, జ్ఞానాన్ని గానీ దూషిస్తే రెండు యుగముల పర్యంతం దానిని కష్టాల రూపంలో అనుభవించినా తీరదు. కనుక జ్ఞాన విషయాలలో జాగ్రత్తగా ఉండాలి. భగవద్గీత, బైబిల్ అనే గ్రంథాలనుండి కొన్ని విషయాలను చెప్పుకున్నాము. ఇక ఖుర్ఆన్ నుండి కూడా చెప్పుకుందాము. దేవునిపై విశ్వాసము ఉన్నవాడు ఎవరైనా ముస్లీమే. మనకందరికీ దేవుని పైన విశ్వాసం ఉంది కనుక గడ్డం పెంచుకునే ముస్లీమ్స్‌కంటే పెద్ద ముస్లీమ్స్ మనమే. ఖురాన్‌లో, 6వ సూరా ‘అల్ అన్ ఆమ్’ 95వ ఆయత్‌లో ఏముందంటే **“గింజనైనా, పండుటెంకనైనా చీల్చేవాడు కేవలం అల్లాహ్ మాత్రమే అంటే దేవుడు మాత్రమే. ఆయనే సజీవమైన దానిని నిర్జీవమైన దానినుండి తీస్తాడు. ఇంకా నిర్జీవమైన దానిని సజీవమైన దాని నుండి విసర్జింప చేసేవాడూ ఆయనే. ఈ పనులన్నీ చేసేవాడు అల్లాహ్‌యే. అటువంటప్పుడు మీరు మార్గం తప్పి ఎటు కొట్టుకుపోతున్నారు? అంటే మీకు సరిగ్గా జ్ఞానం అర్థం కాక ప్రక్కదోవపడుతున్నారు”** అని చెప్పాడు.

మేము **“జనన మరణ సిద్ధాంతం”** అనే గ్రంథాన్ని 1980లో వ్రాయటం జరిగింది. ఆ రోజు నుండి ఈ రోజు వరకూ సంచలనమే. ఆ గ్రంథంలో **“తల్లి (దేహంలో) గర్భంలో ఉన్న శిశువుకు ప్రాణం ఉండదు. శిశువు బయటకు వచ్చిన తరువాతనే ఆ శిశువుకు ప్రాణం వస్తుంది”** అని

చెప్పాం. అది హేతుబద్ధమైనది మరియు విజ్ఞాన సహితంగా ఆ విషయం కనిపిస్తూ ఉన్నది. అయినా సరే దానిని కొందరు మూర్ఖంగా లెక్కించు కున్నారు. ఏది శాస్త్రబద్ధత, ఏది శాస్త్రబద్ధత కాదు అనే విషయాన్ని మరిచిపోయి మనకు తెలిసినదే శాస్త్రబద్ధత అని అనుకుంటున్నాము గానీ దానిని పరిశోధించి చూసుకోవటం లేదు. గర్భం ధరించినప్పుడు గర్భము నుండి వచ్చిన వాటినన్నింటిని 'పిండజములు' అంటారు. వీటిని గురించే కాకుండా, గింజల నుండి మొలక వస్తున్నది. ఆ మొలకలు ఎట్లా ప్రాణం పోసుకుని పెరుగుచున్నవి అనే దానికి వివరము చెప్పాము. అట్లే గ్రుడ్లనుండి వచ్చే పక్షులు, బల్లులు, పాములు మొదలగు వాటిని గూర్చి వివరించాము. మూడు విధముల జన్మలైన **"అండజ, పిండజ, ఉద్భిజ"** అనే వాటి వివరం అంతా **"జనన మరణ సిద్ధాంతము"** అనే గ్రంథంలో మేము వివరించాము. ఇదే విషయాన్ని 1400 సంవత్సరముల క్రితం ఖురాన్ గ్రంథంలో "జిబ్రయేల్" అనే కనిపించని దూత ద్వారా ముహమ్మద్ ప్రవక్తకు చెప్పిన జ్ఞానములో ఈ పై వాక్యం చెప్పారు.

సజీవము నుండి నిర్జీవము పుట్టటం అనేది శిశువు పుట్టిన తరువాత సజీవమౌతూ ఉంది. ఇది పిండజములు విత్తనం నుండి మొలకెత్తించేవాడూ దేవుడే. ఇది ఉద్భిజము. నిర్జీవమైన దాని నుండి సజీవమైన దానిని పుట్టిస్తున్నాడు. అది ప్రత్యక్షముగా మనముందరే జరుగుతూ ఉన్నది. తల్లి నుండి వేరై వచ్చిన గుడ్డు, కొన్ని రోజుల తరువాత ఎక్కడ పెడితే అక్కడే ఉంటుంది. ఎందుకంటే అది కదలలేదు కనుక. నిర్జీవమైన ఆ గుడ్డునుండి సజీవమైన పక్షి బయటకు వస్తున్నది. వాటినే అండజ, పిండజ, ఉద్భిజ అని పేర్లు పెట్టి మనం ఇప్పుడు చెప్పుకుంటున్నాము. ఆయన అట్లా చెప్పకుండా బ్రతికున్న దానినుండి ప్రాణం లేనిది పుడుతున్నదని

పిండజములను, ప్రాణం లేనిదానినుండి ప్రాణం ఉన్నవి పుడుతున్నదని అండజములను చెప్పారు. ఆరవ సూరా, 95వ వాక్యములో ఈ విషయం ఉంది. ఈ విషయాన్ని మనవారంతా ఏమి అర్థం చేసుకున్నారంటే దీనిని తప్పుగా అర్థం చేసుకున్నారు. దేవుడు చెప్పిన దానిని ఉన్నది ఉన్నట్లు చెప్పుకోలేదు. మేము తెలియజేసిన జనన మరణ సిద్ధాంత జ్ఞానం క్రొత్తదై పోయింది. అంతా గందరగోళం అయిపోయింది. కనుక అందరూ చెప్పిన జ్ఞానాన్ని చెప్పండి అని కొందరంటున్నారు, ప్రత్యేకమైన జ్ఞానం మాకు అవసరం లేదు అంటున్నారు. పురాణాలలో ప్రహ్లాదుడు గర్భంలో ఉన్నప్పుడే మాటలు విన్నాడు అంటే అవును, భక్తిమార్గం అప్పుడే నేర్చుకున్నాడంట అంటారు. వీరాభిమన్యుడు యుద్ధమే నేర్చుకునే వచ్చాడంట. సరే! మీరేమైనా అలా ఏమైనా నేర్చుకున్నట్లు తెలుస్తున్నదా! గర్భంలో ఉన్నప్పుడు మీరేమైనా విన్నారా? ఏమైనా నేర్చుకుని వచ్చారా? అని నేను ప్రశ్నిస్తున్నాను. గర్భము నుండి బయటకు వచ్చిన తరువాత తల్లి దగ్గర పాలు త్రాగటం కూడా తెలియదు. ప్రసవము తర్వాత ప్రాణం వస్తున్నది. ఇది సత్యం. తల్లిగర్భం నుండి సజీవంగా (ప్రాణంతో) పుడితే వానిని మనం భగవంతుడు అని అనవలెను. దేవుడే భగవంతునిగా పుట్టే అవకాశం కలదు. దేవుడు 'అజోపి' పుట్టుక లేనివాడు, 'అవ్యయుడు' చావు లేనివాడు దేవుడు పుడతాడు, చనిపోతాడు అంటే తప్పు. కానీ దేవుడు భగవంతునిగా వస్తాడు, భగవంతునిగా పోతాడు అనేది సత్యం.

**"మీ అందరూ ఈ లోక సంబంధులు, నేను పరలోక సంబంధీకున్ని. నేను ఉండే చోటుకి మీరు రాలేరు"** అని బైబిల్‌లో ఏసుగా వచ్చిన భగవంతుడు చెప్పాడు. మేము మాత్రం బాహాటంగా చెప్పటం లేదుగానీ, వారు అనగా కృష్ణుడు, ఏసుప్రభువు మాత్రం బాహాటంగానే చెప్పారు.

ఇప్పుడు జిబ్రయేల్ దూత తన జ్ఞానాన్ని ప్రవక్త గారికి చెప్పారు. చాలా గొప్పదైన జ్ఞానాన్ని చెప్పారు. ఖుర్ఆన్‌లో 6వ సూరా 95వ వాక్యము **"సజీవం నుండి నిర్జీవమైనది వస్తుంది"** అంటే వీరు ఆ వాక్యాన్ని ఎలా అర్థం చేసుకున్నారంటే "మనం ముక్కు చీదితే చీముడు వస్తుంది, కూర్చుంటే మూత్రం వస్తుంది, మలం వస్తుంది" అని పై దాని యొక్క అర్థమట. నిర్జీవమునుండి సజీవమైనది వస్తుందంటే ఏమి చెప్పుకున్నారంటే "నిర్జీవమైన మలం నుండి పురుగులు కనిపిస్తాయి. కనుక సజీవమైనవి వస్తాయి" అనేమాట సరిపోతున్నది కదా! అంటున్నారు. దేవుడు పై వాక్యాలలో ఎంతో గొప్ప జ్ఞానం చెప్పాడు. అండజ, పిండజ, ఉద్భిజ అనే పద్ధతిని చెప్పితే, ఎంత ప్రక్క ద్రోవ పట్టారో చూడండి. మనిషి మోక్షం పొందాలంటే అవే దేవుడు తెలియజేస్తాడు గానీ అనవసర విషయాలు చెప్పలేదు, చెప్పడు. దేవుని విధానాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేదు. దేవుని మాటలకు చాలామంది వివరణ వ్రాసారు. కానీ వివరంగా మాత్రం వారికి అర్థం కాలేదు. మీరు వారికి అర్థం కాలేదని ఎట్లు చెప్పగలుగుచున్నారు? అని అంటే సత్య దూరంగా ఉన్నాయి కనుక చెప్పగలుగుచున్నాము. దేవునికి వ్యతిరేఖంగా మాట్లాడితే శిక్ష పడుతుంది. ఎవరు ఏమి మాట్లాడినా నమోదు చేసుకునే వాడుంటాడు అనే నమ్మకంతో మెలగాలి. ఖురాన్ గ్రంథంలో సూరా 50లో 18వ వాక్యమునందు **"నీవేమనుకున్నా నమోదు చేసేవాడు నీ కంఠం వద్దే ఉన్నాడు"** అని చెప్పారు. ఖురాన్ గ్రంథం నుండి ఇంకొక విషయాన్ని చూసినట్లైన, ఇదే ఆరవ సూరాలో 98వ ఆయత్‌లో ఏముంది అని చూద్దాము.

మీ అందరూ ఖురాన్ గ్రంథంలో ఇంత గొప్ప వాక్యాలు ఉన్నాయా అని అనుకోవద్దండి. పరిశోధన చేస్తే పెద్ద వాక్యాలు ఉన్నాయి. వేయి సంవత్సరాలు పరిశోధన చేసినా, తెలుసుకోలేని విషయాలున్నాయి. ఇప్పుడు

98వ వాక్యం ఏమంటే **"మిమ్మల్ని ఒకే ప్రాణినుండి పుట్టించాడు. ఆయనే మరియొక స్థలము ఎక్కువ కాలముండేదీ. ఇంకొక స్థలము తక్కువ కాలముండేదిగా నిర్ధారించాడు. అర్థము చేసుకోగలిగే వారికోసం మేము ఈ సూచనలను స్పష్టముగా వివరించాము."** చూడండి, ఎంత చిన్న వాక్యమో! ప్రతీ వ్యక్తికి నివాసస్థలము ఒకటి ఏర్పరచబడి ఉంది. మరియు అప్పగింత స్థలమొకటి ఏర్పరచబడి ఉంది. **"ఈ సూచనలను అవగాహన చేసుకునేవారికొరకు విశధీకరించాము"** అంటే అవగాహన లేకపోతే వదలి వేయండి. ఈ వాక్యాలకు వివరణ మనవారు ఏమి వ్రాసుకున్నారంటే "నీకు రెండు స్థలాలు ఉన్నాయి. ఒకటి నివాసస్థలము, మరొకటి అప్పగింత స్థలము. "చాలా సమయం ఉండే స్థలం తక్కువ సమయం ఉండే స్థలము" అని వ్రాసుకున్నారు. ఇంకా వారు ఏమన్నారంటే మాది అరబిక్ భాష, మీకేమి అర్థమవుతుంది దాని వివరణ చెప్పడానికి అని అంటారు. మీ అరబిక్ భాషవారే ఖుర్ఆన్ గ్రంథమును తెలుగులోకి అనువదించారు. దానినే మేము ఇప్పుడు చెప్తున్నాము. పై వాక్యాన్ని పండితులు వివరిస్తూ ఇంకా ఏమి చెప్పారంటే "నీవు తల్లి గర్భంలో ఉండి భూమి మీదకి అప్పగించబడు తున్నావు. నీవు తల్లిగర్భంలో కొంత సమయం ఉన్నావు. ఇప్పుడు ఎక్కువ సమయం ఉండేటట్లు భూమి మీదకు అప్పగించబడుతున్నావు" అని వ్రాసుకున్నారు. మనం జనన మరణ సిద్ధాంతంలో "సజీవమైన శరీరం నుండి నిర్జీవమైన శిశువు పుడుతున్నది" అని చెప్పుకున్నాము.

ఆ విధంగా శిశువు బయటకు వచ్చిన తరువాతే ప్రాణం పోసుకుంటుంది అని చెప్పాము కనుక తల్లిగర్భమే నివాస స్థలము అంటే తప్పవుతుంది. తల్లి గర్భములో తక్కువ సమయం భూమి మీదకు వచ్చిన తరువాత ఎక్కువ సమయం ఉండును అదే అప్పగించే స్థలము అని అన్నారు.

అంటే తక్కువ సమయం అంటే వారి ఉద్దేశ్యం తొమ్మిది నెలలు అని, ఎక్కువ సమయం అంటే 99 సంవత్సరాలని. సరే, తొమ్మిది నెలలు గర్భంలో ఉండి బయటకు వచ్చిన తరువాత నెలకే చనిపోతే, అప్పుడు అది ఎక్కువ సమయం, ఇది తక్కువ సమయం అయిపోతుంది. అప్పుడు దేవుడు చెప్పిన వాక్యమే తప్పవుతుంది. దేవుని మాట ఎప్పటికైనా శాశ్వతంగా సత్యమవు తుంది. ఆ వాక్యము ఎప్పటికీ ఖండింపబడని వాక్యంగా ఉంటుంది. అంటే మనం అర్థం చేసుకునే భావం తప్పు. అయితే మనమిప్పుడు ఏమని అర్థం చేసుకోవాలి. దేవుడు మనకందించిన జ్ఞానం ప్రకారం అర్థం చేసుకునేది ఏమంటే "నీవు నీ శరీరంలో గుణచక్రంలో అంటే తలలో నివాసం చేస్తున్నావు. నీవు శాశ్వతంగా అక్కడే ఉన్నావు. నీవు జ్ఞానం తెలుసుకోగలిగితే నాల్గవ స్థానంలోకి పోతావు" ఎందుకంటే నీవు గుణచక్రంలో "సాత్త్విక, రాజస, తామస" అనే మూడు భాగాలలో ఏదో భాగంలో ఉంటావు. మూడు భాగాలు సంచరించుతూ ఉంటావు. మూడు గుణ భాగాలు దాటి, నాల్గవ స్థానమైన గుణాతీతమైన భాగంలోకి రాగలవు. అప్పుడు నీవు ఆత్మకు అప్పగించబడతావు. నీవు జీవాత్మవు, ఆత్మవు అగుదువు. అప్పుడు దేవునిలోకి అనగా పరమాత్మలోకి చేరిపోతావు. ఒక పోలీస్‌కి దొరికితే వాడు నిన్ను జైలుకి అప్పగించినట్లు, నీవు ఎన్ని జన్మలు ఎత్తినావో గానీ శాశ్వతంగా ఇక్కడే అంటే శరీరములు మారినా **గుణచక్రం**లో నీవు (జీవాత్మ) స్థానం మాత్రం మారలేదు. అదే **నీ నివాసస్థలం**. నీవు జ్ఞానం తెలుసుకుంటే **అప్పగింతస్థలం** కూడా ఉంటుంది, అదే **ఆత్మ స్థలం.** అక్కడ నువ్వు ఉండేది తక్కువ సమయం. అక్కడకు చేరగానే నీవే ఆత్మవై, పరమాత్మలో కలసిపోతావు. ఎక్కువ సమయం అంటే గుణచక్రంలోనే సృష్టి ఆది నుండీ ఈ ఉన్నావు. మూడుగుణములైన మాయస్థలంలో సృష్టి ఆది నుండీ నీవు

ఉన్నావు. అది శాశ్వతమైన ఎక్కువ సమయంలో నీవు ఉండే నీ నివాసస్థలము అని అర్థం చేసుకో. అంటే నీకు రెండు నివాస స్థలములు అన్నమాట. ఒకటి గుణచక్రం మధ్యలో, రెండవది ఆత్మలో (అది తక్కువ సమయమే). అంతేగానీ తల్లిగర్భంలో ఉండేది, బయటకొచ్చేదిగా ఈ విషయాన్ని చెప్పుకుంటే, తల్లిగర్భంలో ఉన్నట్లు ఎవరికైనా అనుభవాలు చెప్పగలరా? ఎవరికైనా జ్ఞాపకం ఉన్నాయా? అని మేము ప్రశ్నిస్తున్నాము. ప్రత్యక్షంగా, విజ్ఞానసహితమైన జ్ఞానాన్ని మేము చెప్తున్నాము వినండి. దానిని తెలుసుకోండి.

దేవుడు మీకు రెండు నివాస స్థలములు ఏర్పరచినాడు. మాయ స్థానంలో ఉంటారా? మాయను దాటి పోతారా? రెండే నివాస స్థలములు ఏర్పరిచినానని దేవుడు ఖురాన్ గ్రంథంలో చెప్పెను. ఒక అప్పగింత స్థలము. అప్పగించబడేది అంటే ఆత్మస్థలం. ఆత్మ భాగం అదీ నీ శరీరంలో మూడు గుణములు దాటిన గుణచక్రం తరువాత స్థానం అది. తరువాత "నీవు ఒకే ప్రాణి నుండి పుట్టించబడినావు అని ఉంది" దేవుడు ఆ విధంగా చెప్తాడా? దేవుడు ఎప్పుడూ అసత్యం చెప్పడు. నీవు ఒకే ప్రాణి నుండి పుట్టావా? నీవు నీ తల్లిదండ్రుల వలన పుట్టావు. అలాగైనా సరే నీవు ఇద్దరికి పుట్టినట్లు కదా! ఒకే ప్రాణి నుండి ఎట్లు వచ్చానంటావు. తల్లిదండ్రులిద్దరినీ కదిలించింది ఆత్మ, కలిపింది ఆత్మ, గర్భం వచ్చేటట్లు చేసింది ఆత్మ, గర్భంలో శిశువును పెంచింది ఆత్మ, గర్భం నుండి శిశువును బయటకు తోసేది ఆత్మ, ఆ ఆత్మ ద్వారానే నీవు బయట బ్రతుకుతున్నావు. అన్నియూ **"ఒకే ఆత్మ ద్వారా"** అని అనువదించబోయి, 'ఒకే ప్రాణి' అని వ్రాసుకున్నారు. ఒకే ఆత్మయే నీ తల్లి, తండ్రిలో ఖండముగా ఉంది తప్ప, ఆత్మ మొత్తానికి అఖండమే. స్థావర జంగమమైన ఈ సృష్టిలో పుట్టినవన్నీ ప్రకృతి పరమాత్మ

అనే తల్లిదండ్రుల వలననే పుట్టాలి గానీ, వారిలో చైతన్యం మాత్రం ఆత్మయే. అందరిలో ఉండేది ఒకటే ఆత్మే, కనుక ఈ మాట ఇప్పుడు శాస్త్రబద్ధమవుతుంది.

మరి ఈ జ్ఞానం ఎందుకు ఈ విధంగా అర్థం కాలేదు అంటే మా దేవుడు ఇట్లు చెప్పాడు, మా దేవుడు ఇట్లే చెప్పాడు అని అంటున్నారు. ప్రపంచానికి అంతటికీ ఒకే దేవుడు ఉంటే మరలా మీ దేవుడు, మా దేవుడు అని చెప్పడమేమిటి? కనుక అసత్యమైన వాక్యాలు చెప్పుకునే దానికంటే జ్ఞానసంబంధమైన వాక్యాలు చెప్పుకోవటమే ముఖ్యం. అలా కాకుంటే అసత్యములు చెప్పుకుంటే తప్పవుతుంది. ఆ తప్పుకు శిక్ష తప్పదు. సాధారణంగా వినే వ్యక్తికి పెద్దగా శిక్ష లేకపోయినా చెప్పేవానికి మాత్రం అంటే మాలాంటి వారికి మాత్రం ఇబ్బంది ఎక్కువ. ఎందుకంటే, చెప్పేవారు ఎప్పుడైనా ఈ చెప్తున్న జ్ఞానం ఎంతవరకు సత్యం అని యోచన చేసుకోవాలి. కొందరు మమ్మల్ని ఒక ప్రశ్న అడిగారు. మీరు చెప్పే విషయాలు కొన్ని ఇంతకు ముందు అలా చెప్పక, ఇప్పుడు వాటిని విశధీకరించి చెప్తున్నారు. అదే విషయాన్ని ముందే ఎందుకు చెప్పలేదు? అని అడిగారు. దానికి నేను చెప్పే సమాధానం ఏమంటే "నాకు అప్పుడు అదే తెలుసు అదే చెప్పాను. ఇప్పుడు మరికొంత తెలియబడింది దానిని ఇప్పుడు చెప్పాను".

**"నేను ఈ లోకంలో ఎవరికీ తీర్పుతీర్చుటకు రాలేదు"** అని ఒక వ్యక్తి చెప్పాడు. మరియొకచోట **"తీర్పు చెప్పుటకు వచ్చాను"** అని కూడా ఉంది. తీర్పులు రెండు రకములు. ఒకటి ప్రపంచవరమైనది, రెండవది పరమాత్మ తరుపుది. మరి ఆయన పరమాత్మ తీర్పును తీర్చుటకు వచ్చి ఏమి చెప్పెను అంటే **"చూడని వారు చూడవలెననియు, చూసిన వారంతా గ్రుడ్డివారు కావాలనియు అని నేను తీర్పు తీర్చుటకు వచ్చాను"** అని అన్నాడు.

ఈ మాట వినిన కొందరు మేమంతా గ్రుడ్డివారు కావలెనని అనుకోవట మేమి? మేము కన్నులున్న వారమైతే మమ్మల్ని గ్రుడ్డివారిని చేయటానికి వచ్చినాడంట అని అనుకున్నారంతా. అందుకు ఆయన మరల ఏమి చెప్పాడంటే **"మీరు గ్రుడ్డివారు అని అనుకుంటే పాపము లేదు గానీ, చూచుచుంటిమి అని మీరు చెప్పుచున్నారు కనుక మీకు పాపము వస్తున్నది".** మీరు నిజంగా గ్రుడ్డివారు, కానీ చూస్తున్నాం అంటున్నారు. అంటే జీవుడువైన నీవు నీ అంతగా నీవు చూడలేవు, ఎందుకంటే నీవు గుణచక్రంలో రవ్వంతగా ఉంటూ, జ్ఞానేంద్రియములు తెలిపిన విషయాలను గ్రహించి, నేనే చూస్తున్నాను అని భ్రమిస్తున్నావు, కనుక నీకు పాపం తప్పదు. కనుకనే నీవు (మీరు) గ్రుడ్డివారే అని తీర్పు చెప్పి, ఆ సత్యం తెలుసుకొని మీరు గ్రుడ్డివారే అని ఒప్పించుటకే నేను వచ్చాను అని ఆయన అంటున్నాడు. కనుక మీరు చూస్తున్నాము అనే భావనను తొలగించి, గ్రుడ్డివారిగా చేసేందుకే వచ్చాను అన్నాడు.

ఈ విషయాన్ని మనం సూక్ష్మంగా ఆలోచించాలి గానీ స్థూలమైన కన్నులుగా, గ్రుడ్డితనంగా అర్థం చేసుకోరాదు. ఎందుకంటే దేవుడు ఏ జ్ఞాన విషయమైనా సూక్ష్మంగానే చెప్పును. అందుకే మనం "చూచుట" అంటే కన్నులతోనే ఆ పనిని చేయగలం అని అనుకొందురు. ఎందుకంటే నాలుకతో చూసే రుచి కూడా ఉంది. అందుకే 'నాలుకతో రుచి చూడండి' అంటారు. అంతేగానీ చేతిలో ఏదో తినే వస్తువును తీసుకుని కళ్ళతో చూస్తే రుచి తెలుస్తుందా. నోటితోనే సాధ్యమవుతుంది. కళ్లతో చూసినా, నాలుకతో చూసినా, మరల బుద్ధి అనే దానితో కూడా చూస్తాము. కేవలం కళ్ళు, నాలుక, బుద్ధి అనేవి చూస్తున్నట్లు లెక్క. బుద్ధి చూసి నీకు చెప్పితే అప్పుడు దానిని గ్రహించుచున్నాను అని అనుకుంటే ఫరవాలేదు కానీ, నేనే

చూస్తున్నాను అని నీవు చెప్పుకుంటున్నావు కనుకనే నీకు పాపం వస్తూ వుంది. వాస్తవంగా నీవు ఏదీ చూడనట్లే కదా! అందుకే నీవు గ్రుడ్డివాడివిగా నీవు గుర్తించాలని తీర్పుచెప్పుటకే నేను వచ్చితిని, అంటే జ్ఞానం చెప్పి నిన్ను మార్చాలని వచ్చాను అంతేగానీ ప్రపంచవరమైన ఏ తీర్పు తీర్చుటకు నేను రాలేదుగానీ మీకు తీర్పుతీర్చువాడు మరియొకడున్నాడు. నేను మాత్రం మీ అందరికీ జ్ఞానదృష్ఠి కలగాలని, అజ్ఞాన దృష్ఠి పోవాలి అని తీర్పు తీర్చుటకే వచ్చాను. కనుక మనం ఈ దినం మూడు గ్రంథములలో ఉన్న జ్ఞానాన్ని తెలియజేస్తూ ఈ జ్ఞానము అంతా సృష్ఠి ఆదిలోనే చెప్పబడింది. అదే మరలా 5150 సంవత్సరాల పూర్వం **'భగవద్గీత'** అనే గ్రంథం ద్వారా తెలియబడింది, అయినా అర్థంకాకపోవటం వలన మరలా మరలా ఇంకోచోట, ఇంకొక చోట చెప్పారు. ఆ విధంగా చెప్పబడిందే బైబిల్, ఖురాన్ గ్రంథములు. అవీ దైవ గ్రంథాలే, వాటిలో జ్ఞానంలేదు అనడానికి వీలులేదు. కనుక ఖురాన్ గ్రంథంలో 6వ సూరా 95, 98 వాక్యాలలో ఎంత దైవజ్ఞానం ఉందో తెలియజెప్పడమే మా ఉద్దేశ్యం గానీ, ముస్లీమ్స్ అంతా మా వెంట రండి అని మేము చెప్పటం లేదు. మా మార్గమంతా దైవజ్ఞానం తెలియ జేయటమే. అందుకే మీ మతం, మా మతం అనే భేదాలు పెట్టి జ్ఞానం నేను ఎక్కడా చెప్పలేదు. కనుక మీ అందరూ ఇక్కడ చెప్పే జ్ఞానం ఉన్నతమైనదని, మతాలకు అతీతమైనదని అసలైన దేవుని జ్ఞానమనీ, ఇక్కడ ఏ ప్రశ్నకైనా సమాధానం చెప్పబడుతుందనీ, ఎక్కడా చెప్పని సంచలనాత్మక మైన విషయాలే చెప్పబడతాయనే ఉద్దేశ్యంతో రండి, తెలుసుకోండి. మీ జీవితాలలో ఈ జ్ఞానాన్ని అమలుపరుచుకోండి.

# 65. నిదర్శ-నిరూప

**(తేది : 25.04.2013)**

ఈ సృష్ఠి అంతా ఎప్పుడో సృష్ఠించబడింది. అప్పుడు ఏ నాగరికతా లేదు. సృష్ఠి అంతా జరిగిన తరువాత ఒకదాని తరువాత ఒకటి తెలుస్తూ, ఇంత అభివృద్ధి స్థితికి చేరాము. ఈ విధంగా సృష్ఠి జరిగిన కొంతకాలానికి మనుషులు కొన్ని విద్యలను నేర్చుకొని అందులో ప్రావీణ్యం సంపాదించారు. అంతేగానీ ఒకే వ్యక్తి అన్ని విద్యలూ నేర్చుటకు అవకాశం లేదు. 64 విద్యలున్నాయని ఒక ప్రతీతి. 64 విద్యలలో 64 విద్యలూ ఎవరికీ రావు. ఒక విద్య నేర్చుకుని నేను గొప్ప అనుకొంటున్నారు. డాక్టర్‌లలో చాలామంది ఉన్నారు. అందులో చెవి, ముక్కు, గుండె డాక్టర్‌లాగా ఒక్కొక్క అవయవానికి ఒక్కొక్క ప్రత్యేక డాక్టర్‌లున్నారు. ఇది ఈ విధంగా ఉంటే, ఈ దైవ జ్ఞానం తెలుసుకున్న వ్యక్తులను చూసి, ఈ రోజుల్లో ఇదేమి పిచ్చి అని అనేవారున్నారు.

ఈ మధ్య నా భార్య దేవుని చిహ్నామైన నాలుగు చక్రములను నుదిటిపైన ధరించి, వైద్య నిమిత్తం డాక్టర్ వద్దకు వెళ్లగా అక్కడ ఆ డాక్టర్ ఈ నుదిటిపైన చక్రాల గుర్తులేమి అని అడిగినారంట. అప్పుడు ఆమె చెప్పింది ఈ చక్రాల గుర్తులు గురించి, కర్మ అనేది ప్రతీ వ్యక్తికి ముందే నిర్ణయించబడి ఉంటుంది. ఆ కర్మ అనేది కర్మచక్రంలో ఉంటుంది. దానినే తెలిపే విధంగా ఈ చక్రపు గుర్తులలో అది ఒకటి అని చెప్పితే, అప్పుడు ఆయన మనము చేసుకున్నట్లే జరుగుతుంది. ఇంకా కర్మ ఎక్కడుంది? అన్నాడు. అప్పుడు నా భార్య "మీ ఊహకు అది కనిపించదు కానీ ఉంది". మీరు అపోహతో అంటున్నారు అని ఆయన అంటూ, నేనున్నాను,

కష్టపడ్డాను, చదివాను డాక్టర్ అయినాను. సంపాదించుకుంటున్నాను, మరి డాక్టర్ వృత్తి చేయకపోతే నేనెట్లు సంపాదించగలను. అలా కాదండీ, మీరు డాక్టర్ అవ్వాలని కర్మ ఉంది కాబట్టే మీరు డాక్టర్ అయింది. అంటే అదేమీ లేదు, మనం చేసే పనినిబట్టే ఫలితం ఉంటుందిగానీ, సోమరి పోతులు అవేమీ చేయరు కనుక ఇవన్నీ అంటారు అని వారికి తెలిసిన సిద్ధాంతాలను, విషయాలను చెప్తున్నారు. ఈ విధంగా ఒక్క విద్యలో మాత్రమే ప్రావీణ్యత సాధించిన వారు ఈ బ్రహ్మవిద్యను చులకనగా చూడటం జరుగుచున్నది. ఒక ఊరు ప్రెసిడెంట్, "ఊరంతటికీ నేను పెద్ద, నేను ఊరందరికంటే తెలివైనవాడిని" అని అనుకుంటాడు. కానీ ఈ సర్పంచ్ పదవులు ముందు నుండి లేవు. బ్రిటీష్ వారు మన దేశాన్ని పరిపాలించడానికి వచ్చి వెళ్ళిన తరువాత ఏర్పడిన వ్యవస్థలు. అంటే నిన్న, మొన్నటివి. జ్ఞానము ముందు పుట్టినది, బ్రహ్మవిద్య ముందు పుట్టింది. మనమందరం నేర్చే విద్యలు నిన్న, మొన్న పుట్టాయి. మాకు ఇప్పుడు 64 సంవత్సరాలు. మేము చిన్నగా అంటే 7 లేదా 8 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు ఒకే ఒక్క కంపెనీ అగ్గిపెట్టె కంపెనీ ఉండేది. అది సూర్యమార్క్ అగ్గిపెట్టె. ఒకే సబ్బు ఎర్రసబ్బు అదే లైఫ్‌బాయ్ సబ్బు. కరెంట్ ఉండేది కాదు. కిరోసిన్ బుడ్డీలు పెట్టుకునేవారు. మరి అటువంటి స్థితి నుండి ఈ రోజు ఇటువంటి స్థితికి వచ్చాము.

ఇవన్నీ ఈ మధ్యకాలంలోనే వచ్చాయి. కానీ సృష్టి ఆదిలోనే దేవుని జ్ఞానం చెప్పబడింది. మూడు విధానాలలో ఒక విధమైన వాణి ద్వారా చెప్పబడింది. దేవుని జ్ఞానం దేశమంతా వ్యాపించి, అందరికీ తెలిసి కొంత కాలమైన తర్వాత, ఈ సమయంలో ఏమీ తెలియకుండా పోయింది. ఇప్పటికీ ఎక్కడైనా ఆ జ్ఞానం ఉన్ననూ జ్ఞానము అన్నిటికంటే ముందుది, మనం

నేర్చుకున్న విద్యలన్నీ కొత్తవి అనుకోవటం లేదు. బ్రహ్మవిద్యయే కొత్తది. వీరే ఈ విద్యను క్రొత్తగా సృష్టించుకున్నారు అని అనుకుంటున్నారు. కానీ అన్ని విద్యలు దేనితో సంబంధపడి ఉన్నాయి అని అంటే బ్రహ్మవిద్యతోనే సంబంధపడి ఉన్నాయి. బ్రహ్మవిద్యను తెలిసినటువంటి వాడు ఎవడైనాగానీ ఏ విద్యనైనాగానీ సులభముగా అర్థం చేసుకోగలడు. కానీ ప్రపంచ విద్యలు నేర్చుకున్నవారు ఎవరైనా కానీ బ్రహ్మవిద్యను నేర్చుకోవటం చాలా కష్టము తలక్రిందుల తపస్సు చేసినా వారికి అర్థం కాదు. మనం చెప్పింది వారికి అర్థం కాదు. ఎందుకంటే "కనిపించేది సత్యము. కనిపించనిదంతా అసత్యము" అనేది వారి వాదన. జ్ఞానులు కనిపించనిది దానిని గూర్చి మాట్లాడుతున్నారు. కనుక అసత్యమును ఎట్లాగైనా వారు మాట్లాడవచ్చు అంటున్నారు. మేము ఒక రోజు హైదరాబాద్ వెళ్తూ మధ్యలో జన విజ్ఞాన వేదిక కార్యాలయమునకు వెళ్ళాము. అక్కడ వారి పద్ధతి ఏమంటే కనిపించక పోతే ఏదైనా వారికి అసత్యమే. వారు శాస్త్రీయత అంటూనే అశాస్త్రీయతను ప్రచారం చేస్తుంటారు. దేనినైనా నిరూపణ చేయండి అంటుంటారు. మేము ఏమంటామంటే **'ఉంది అనేదానికి శాస్త్రబద్ధత ఎంత అవసరమో, లేదు అనే దానికి కూడా అంతే శాస్త్రబద్ధత అవసరం'**. గుడ్డిగా ఎవరైనా ఏమైనా ఉందంటే అది మూఢనమ్మకం అంటారు. మరీ గుడ్డిగా లేదన్నా అదీ మూఢనమ్మకమే అవుతుంది. కానీ లేదన్నా ఉందన్నా దానికి శాస్త్రబద్ధత అవసరం. నమ్మకం అనేది ఉంటే అది నిజం కావచ్చు, అబద్ధమూ కావచ్చు. చీకట్లో తాడుపడింది, అది పాము మాదిరి కనిపిస్తూ ఉంది. ఒకడు దానిని పామే అనుకున్నాడు. ఇంకోచోట పామే ఉంది కానీ వాడు మాత్రం తాడే అనుకున్నాడు. అంటే పామును తాడు అనుకోవచ్చు, తాడును పాముగా కూడా అనుకోవచ్చు.

అందులో ఏదో ఒకటే సత్యమవుతుంది, రెండవది అసత్యమవుతుంది. పూర్తిగా పరికించి చూస్తే దానిలో విషయం తెలిసిపోతుంది. నమ్మకము అనేది సత్యము కావచ్చు, అసత్యమూ కావచ్చు. తాడు పాము కావచ్చు లేదా తాడే కావచ్చు. కానీ వాడు ఏది అనుకుంటే అదే అక్కడ ఉండాలంటే ఎలాగ? కనిపించే పాము అక్కడ ఉందనుకో దానిని తాడనే చెప్పాలి అంటే ఎలా కుదురుతుంది. అందుకు జనవిజ్ఞాన వేదిక వారితో మేము అదే వాదించాము. కనిపించేవాటి గురించే మీరు మాట్లాడితే కనిపించకుండా ఉన్నవాటి గురించి మేము చాలా చెప్పాల్సి వస్తుంది. కనిపించకుండా ఉన్న వాటిని మనం చాలా నమ్ముతున్నాం కదా! అవి కనిపించనంత మాత్రాన అవి లేవంటే ఎలా అవుతుంది. అటువంటి వాటిని సత్యం కాదు అని మనమంటే చాలా ఇబ్బందులు పడవలసివస్తుంది. మీరు అట్లానే చెప్తుంటారు, మేము వాటిని ఖండిస్తూనే ఉంటాము. అయితే ఖండించేవారైతే అన్నింటినీ ఖండించాలి కదా! కొన్నింటినే ఎందుకు ఖండించగలుగుచున్నారు? లేదు లేదు మేము కనిపించే వాటిని తప్ప కనిపించని అన్నింటినీ మేము ఖండిస్తామన్నారు వారు. అయితే మేము ఒకటి అడిగాము. నీవు నీ తల్లిని ఎరుగుదువు కదా! ఎందుకంటే నిన్ను పాలిచ్చి, పెంచింది కనుక ప్రత్యక్షంగా ఆమెను తల్లి అని ఒప్పుకోవలసింది. అట్లాగే ఆమె నీకు చెప్పకపోయినా ఆమె నీ తల్లి అని నీకు తెలుస్తుంది. కానీ నీ తండ్రి ఇతనే అని ఆమె తెలియజేస్తేనే నీకు నీ తండ్రి ఫలానావాడు అని తెలిసేది. అందులో నమ్మకమే ప్రధానం. కానీ ఈయనే నా తండ్రా అని సందేహిస్తే అంతా అస్తవ్యస్తం అవుతుంది.

ఒకవేళ ఎవరైనా ఈయనే నీ తండ్రి అని గ్యారంటీ ఏమిటి? అంటే అప్పుడు నీవు కూడా సందేహించి ఆ రోజునుండి ఆయనను పోషించటం

మానేస్తాను అని అన్నావనుకో సత్యాన్ని కూడా అసత్యంగా పోల్చుకునేవారు కూడా ఉన్నారు అని పై వ్యక్తి చెప్పినట్లు తెలుస్తున్నది. అందువలన దేవుడు ఏదైతే చెప్పెనో దానినే శాస్త్ర ప్రమాణంగా తెలుసుకోవాలి. ప్రపంచానికి సంబంధించి ఐదు శాస్త్రములు కలవు. అందులో ఒకటి జ్యోతిష్య శాస్త్రము కొందరు నమ్మి, మరికొందరు నమ్మక ఉన్న శాస్త్రమిది. ఇక వీటన్నింటికీ పెద్దదైన బ్రహ్మవిద్యా శాస్త్రం ఒకటి ఉన్నది. అన్నిటికంటే పెద్దది, అని అర్థంకాని ప్రపంచవరమైన విద్యలు నేర్చిన వాళ్ళంతా మాత్రం దీనిని చిన్న విద్యగా లెక్కిస్తున్నారు. సరే ఉదాహరణకు నీవు డాక్టర్ విద్యను నేర్చినవాడివై ఎంతో నేర్పరితనం సంపాదించి, శరీరంలో ఉన్న ప్రతీ అవయవం గురించి క్షుణ్ణంగా తెలుసు అని అనుకుంటే నీవు బుద్ధి, మనస్సు, చిత్తం, అహం అనేవి ఎక్కడున్నాయి చెప్పగలవా? గుండెకు ఆకారాన్ని చెప్పగలవు గానీ, మనస్సుకు ఆకారం చెప్పగలవా? కనిపించేవి కొన్ని, కనిపించనివి కొన్ని ఉన్నాయి. కనిపించనివన్నీ లేవంటావా? నువ్వే అంటుంటావు నా బుద్ధితో అలోచిస్తున్నాను అని అప్పుడు నీ బుద్ధి ఉన్నట్లా లేక లేనట్లా? కనుక శాస్త్రబద్ధత లేకుండా మాట్లాడవద్దు. శాస్త్రబద్ధత ఉన్న జ్ఞానం ఎప్పటికైనా నిరూపించబడుతుంది. జ్ఞానం పూర్తిగా తెలుసుకుంటే అన్ని సమస్యలకు అది పరిష్కారం కనిపిస్తుంది అని మేము అంటున్నాము. ఆ జ్ఞానాన్నే బ్రహ్మవిద్య అని, దైవజ్ఞానమని, సూపర్ సైన్స్ అని పిలువవచ్చు. అది తెలియకపోతే ప్రతీ చిన్న సమస్య అయినా అది గుదిబండగా తయారయి పోతుంది. నిన్ను పీడుస్తుంది. దైవజ్ఞానం మాటలతో కూడుకున్నది, దేవుడు రూపం లేకుండా ఉన్నాడు. అయితే దేవుడు కనిపించడా అంటే కనిపించే వాడు దేవుడు కాదు.

మేము వ్రాసి ఇచ్చిన **"దేవుని తీర్పు"** అనే గ్రంథములో ఒక విషయాన్ని వివరించాము. అందులో వివేకానందుడు రామకృష్ణ పరమహంసను నీవు దేవుడిని చూసావా? అని అడిగారు. అప్పుడు "నేను దేవున్ని చూసాను, నీకు కూడా చూపిస్తాను" అని రామకృష్ణుడు వివేకానందునితో అన్నాడు. ఎన్నాళ్ళకూ ఆయన దేవున్ని చూపలేకపోయాడు. విసుగుచెందిన వివేకానందుడు, "ఈయన మతిభ్రమించి చెప్పుచున్న మాటలివి. ఆయన చూడలేదు. మనకు దేవున్ని చూపనూలేడు" అని చివరికి వివేకానందుడు సరిపెట్టుకున్నాడు. ఈ విషయం ప్రకారం దేవున్ని ఎవ్వరూ చూడలేదు అని అర్థమవుతూవుంది. దేవునికి ఒక చట్టము ఉంది అదేమంటే దేవుడు ఎవ్వరికీ కనిపించడు, రూపములేదు, పేరులేదు, పని చేయడు రూప, నామ, క్రియారహితుడు. ఈ సూత్రాన్ని అతిక్రమించి దేవుడు ఉండడు. మరి అటువంటి దేవుడిని ఏ విధంగా తెలుసుకోగలము? అని ప్రశ్నించుకుంటే జ్ఞానము వలన తెలుసుకోగలుగుచున్నాము అని చెప్పవచ్చును. ఈ విషయానికి **భగవద్గీత** ఆధారము. భగవద్గీత పూర్తి నిరూపణతో మరియు నిదర్శనముతో కూడుకున్నది. ఇక్కడ చిక్కు సమస్యను అర్థము చేసుకోవాలి. దర్శనము అంటే పూర్తిగా కనిపించునది. శబ్దము అంటే వినిపించునది, నిశ్శబ్దము అంటే వినిపించకుండా ఉండటం. అయితే దర్శనము అంటే కనిపించడం అయితే, నిదర్శనము అంటే 'కనిపించకుండా పోవటం' అని అర్థం. ఏదయితే కనిపించకుండా ఉందో దానిని వివరించేదే 'నిదర్శనము'. అది ఏది అనుకున్నారా మీరు? అట్లాగే నిరూప అంటే బాగా రూపంగా కనిపించేది అనుకున్నారా, కాదు 'రూపము లేనిది' అని అసలైన అర్థం. కానీ ఈ పదాలను అందరూ వ్యతిరేఖంగా వాడు కుంటున్నారు. నిరూప అంటే రూపమే లేనిది, మరి ఎక్కడా కనిపించనిది.

ఈ వాక్యాలు దైవజ్ఞానానికి సంబంధించినవి. ఇదే విషయాన్ని ఖురాన్ గ్రంథములో 4వ సురాలో 174వ ఆయత్‌లో ఈ విధంగా ఉంది **"మానవులారా! మీవద్దకు మీ దేవుని తరపునుండి స్పష్టమైన నిదర్శనం వచ్చింది. మీ వద్దకు మీకు స్పష్టమైన దారిని చూపే జ్యోతిని పంపాము. మీకు జ్యోతిని పంపాము, నిదర్శనము వచ్చింది".** జ్యోతి అంటే వెలుగు కనిపించేది. ఏది కనిపించనిదో అదే నిదర్శనము. ఇక్కడ జ్యోతి అంటే జ్ఞానము, దానివలన ఏమి తెలుస్తుంది? కనిపించని ఆ దైవం గూర్చి తెలుస్తుంది. ఆ జ్యోతి అనే వెలుగులో నీకేదైనా కనిపిస్తే, అది దేవుడు కాదు. ఎందుకంటే కనిపించేవాడు దేవుడు కాదు. అందుకే అయన నిదర్శ. అందుకే మేము ఒక గ్రంథములో **"దేవుడు నిజముగా లేడు కానీ అబద్ధంగా ఉన్నాడు"** అని వ్రాసాము. "నిజ" అనే పదంలో "జ"అనగా పుట్టడం. "ని" అనగా 'లేదు' అని అర్థం. అంటే పుట్టుక లేనివాడు. అనగా పుట్టడం అనే క్రియ లేకుండా ఉన్నవాడు దేవుడు. ఇంకా దేవుడు అబద్ధంగా ఉన్నవాడు కూడా. ఇక్కడ బద్దము అనగా కట్టడి, బంధము ఉన్నట్లు. అది లేనివాడు దేవుడు. మనమందరం కర్మలు అనే బద్దముతో కట్టబడి ఉన్నాము. కాబట్టి మనం బద్దులం, కానీ దేవుడు అబద్దుడు. అలాగే దేవుడు నిదర్శ, నిరూప కూడా. కానీ ఆయనను తెలుసుకోవాలంటే, ఖురాన్‌లో "నిదర్శనము మీ దగ్గరకు వచ్చిఉంది. దేవుడిచ్చిన జ్యోతి ఒకటుంది" అనివుంది. అదే జ్ఞానము. దానివలన కనిపించని దానిని (దేవున్ని) తెలుసుకోవచ్చు. నిబద్ధతతో, నిదర్శనం నిరూపమైనటువంటిది ఏది అంటే దేవుడు. అయితే ఈ పదాలను దేవునికి సంబంధంగా వాడాలా? ప్రపంచ సంబంధంగా వాడాలా? అంటే ఎక్కువుగా ప్రపంచ సంబంధంగానే వాడుచున్నాము. అలా వాడేవారిని ఇవి ఆ అర్థముతో వాడకూడదు కదా! అని అడగండి.

ఈ విధంగా వాస్తవమైన అర్థమును తీసుకుంటే ఆ పదాలన్నీ (నిదర్శ, నిరూప, నిబద్ధ) దేవుని సంబంధమైనవే అనే విషయం అర్థమవుతున్నది. మనిషి కనిపించేవాటికే ప్రాధాన్యత ఇస్తున్నాడు. కనిపించేది ఏదైతే ఉందని నీవు నమ్ముతున్నావో అదంతా కనిపించని దాని మీద ఆధారపడి ఉంది. నీవు ధనికుడుగా ఉన్నా, నీవు పేదవానిగా ఉన్నా దానివెనుక కనిపించని కర్మ అనేది ఉంది. ప్రతిది కర్మవలన జరుగుచున్నదను ధ్యాస కూడా మనిషికి లేదు. తానే స్వంతంగా అన్ని పనులు చేసుకుంటున్నాను అని అనుకొంటున్నాడు. ప్రతీ వ్యక్తి ధనికుడు అవ్వాలి అని అనుకున్నా అవటం లేదు కదా. ఏదో ఒకలాగ బ్రతకాలన్నా బ్రతకటం లేదు కదా! చాలామంది ఏదో కావాలని ప్రాకులాడినా కర్మలో ఏది ఉంటే అదే జరుగుతుంది. మనందరికీ ఒక ధైర్యం ఉంది ఏమనంటే, మన కర్మలో ఏది జరగాలో అదే జరుగుతుంది. అందుకే మనం ఏమి చెప్పుచున్నాము, అంటే కనిపించే దంతా కనిపించని దానిమీద ఆధారపడి ఉంది. ఈ విధంగా కనిపించే దానినే నమ్ముతాము అనే వారంతా బ్రహ్మవిద్యను హేళనగా మాట్లాడుచున్నారు. ఇప్పుడు నీవేదైనా దూషణగా మాట్లాడవచ్చు కానీ కనిపించని పాపం వస్తుంది. దానిని అనుభవించే పని వస్తుంది.

కర్ణాటకలో బీదర్ వద్ద ఒక ఆశ్రమం ఉంది, ఆ ఆశ్రమంలో ఉన్న గురువు రెండురోజుల క్రితం చనిపోయినాడంట. చనిపోయేముందు ఆయన ఏమి చెప్పెనంటే "నేను చనిపోతాను కానీ స్వర్గానికీ పోను, నరకానికీ పోను, నేరుగా కైలాసానికే పోతాను. నా మీద విశ్వాసం ఉన్నవారు నేను చనిపోయిన తరువాత వస్తే కైలాసంలో మీకు చోటును ఉంచుతాను" అని అన్నాడంట. ఆయన చనిపోయిన నెల రోజులకు 16, 17 సంవత్సరాలు వయస్సు కలిగిన ఇద్దరు శిష్యులు, 52 సంవత్సరాలు వయస్సు కలిగిన

ఒకరు మొత్తం ముగ్గురు కలసి పెద్ద పెద్ద కట్టెలు పేర్చి, చితిపేర్చి, వీడియో వారినందరినీ పిలిచి “మా గురువు గారు చెప్పారు. మేమూ అక్కడకే వెళ్ళుతున్నాము” అని చెప్పి, ఆ మంటల్లో దూకి చనిపోయారు. ఈ విషయం టీవీల్లోనూ, పేపర్స్‌లో కూడా వచ్చింది. ఈ విధముగా జరగటం సమంజసమేనా అని ఆలోచిస్తే, వారికి పూర్తిగా జ్ఞానం అర్థం కాలేదు అనే విషయం తెలుస్తుంది. **‘మరణించే వాడు తిరిగి పుట్టవలెను’** అనే భగవద్గీతా జ్ఞానాన్ని తెలుసుకోవటం మరిచారు.

దేవుడు ఎక్కడా భగవద్గీతలో కైలాసం, నరకం, స్వర్గం అని చెప్పలేదు. జ్ఞానం తెలుసుకుంటే మూడు లోకములూ ఇక్కడే గలవు. ఇది తెలియక ఆ గురువు కైలాసం ఎక్కడో ఉంటుందని చెప్పటం వలన ఈ శిష్యులు ఈ విధంగా చనిపోవటం జరిగింది. చనిపోయిన గురువు అకాల మరణం కాకపోతే ఎక్కడో పుట్టే ఉంటాడు. లేక అకాలమరణం అయితే ఇక్కడే వారి ఆశ్రమంలోనే ఉంటాడు. ఇప్పుడు అకాలమరణం పొంది ఉన్న శిష్యులు కూడా ఇక్కడే, మొత్తం నలుగురూ ఇక్కడే ఆశ్రమం వద్దనే, సూక్ష్మ శరీరులుగా ఉంటారు. సూక్ష్మశరీరులై ఉన్న ఆ శిష్యులు ఇదేమిరా మనం ముగ్గురం మరలా ఇక్కడనే ఉన్నాము. కైలాసానికి పోలేదు, స్వర్గానికీ పోలేదు అని అనుకుంటూ ఉన్నప్పుడు ఒకవేళ వారి గురువు అక్కడే సూక్ష్మ శరీరంతో ఉంటే, ఇదేమి గురువా మీరు చెప్పినది ఏమిటి? ఇప్పుడు జరిగింది ఏమిటి? మేము ముగ్గురం మీరూ అందరం కలిసి దయ్యాలయ్యాం కదా! అని వాపోయి ఉంటారు. ఈ విధంగా జ్ఞానం తెలియని పరిస్థితిలో ఈ విధంగా చస్తే ఉంటారు. ఈ రకంగా సత్యాసత్యాలు తెలియకపోవటం వలన ఇంతటి గందరగోళ పరిస్థితి ఎదురయింది.

ఈ దైవజ్ఞానాన్ని తెలుసుకోకపోవటం మీ తప్పు. తప్పు జరగకుండా ఉండాలనే సృష్టి ఆదిలోనే ఈ జ్ఞానాన్ని తెలిపి ఉన్నాను. దీనిని విడిచిపెట్టి ప్రక్కకు పోయారు కనుక నా జ్ఞానం తెలియకుండా పోయింది. ఇప్పుడైనా ఎందుకు తెలుసుకోకూడదు అని దేవుడు అడుగుతాడు. ఇప్పుడు ఈ ఆకాలమరణాలలో ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు గల శరీరములు మాత్రం లేకుండా పోతాయి గానీ, మిగతా 15 భాగాలు మిగిలే ఉంటాయి. వారికీ ఆకలిదప్పులు తప్పవు. కష్టసుఖాలు తప్పవు. చనిపోయిన చోట ఎవరిని పిలిచినా అక్కడున్న వారు పలుకరు. సూక్ష్మశరీరంతో ఉన్న వారు అన్నీ చూడగలరు గానీ, ఎవరికీ వారు మాత్రం కనిపించరు. ఎందుకనగా వారు సూక్ష్మశరీరులై ఉన్నారు. చాలామంది ఆ విధంగా అకాల మరణం పొందినవారు, ఆ ఇళ్ళలోనే ఎవరూ పలకరించకపోయినా ఉంటూ, దొరికింది తింటూ మరలా ఆయుష్షు తీరేంతవరకు ఉండి, తరువాత కాలమరణం పొంది మరలా క్రొత్త శరీరంలోకి వెళ్ళి ఎక్కడో జన్మిస్తారు. ఈ విధంగా అకాలమరణం పొందేది, వారు స్వయంగా చేసుకున్నది కాదు. వారి గతజన్మలలో ఉండే కర్మలననుసరించి జరిగినదే. ఈ విషయాలు తెలియకపోవటం అజ్ఞానం. మరి జ్ఞానాన్ని తెలుసుకోవాలంటే ఏమి చేయాలి? శ్రద్ధ కావాలి. కొంతమంది మాకు శ్రద్ధ కావాలంటే ఏమి చేయాలి అని అడుగుతారు. శ్రద్ధ అనేది ఏమీ కొనితెచ్చుకునే వస్తువేమీ కాదు. మనం స్వయంగా కలుగజేసు కోవాల్సింది. జీవునికి శ్రద్ధ అనేది ఒక హక్కు. నీవు శ్రద్ధ కలుగజేసుకుని ఎంతటి జ్ఞానాన్నైనా తెలుసుకోగలవు. తాత్కాలికంగా ఉండే ప్రపంచ విషయాలపైనే నీ శ్రద్ధ ఉంటే, శాశ్వతంగా ఉండే దేవుని జ్ఞానంపైన ఎందుకు శ్రద్ధ ఉండకూడదు అనే ప్రశ్న వస్తుంది.

సృష్టి ఆదిలోనే పుట్టిన నీవు ఎన్నోసార్లు మరణించి, మరలా ఎన్నో మార్లు జన్మలెత్తి తిరుగుతూ, కృత, త్రేతా, ద్వాపర అయిపోయి, కలియుగంలో

ఇంతవరకు వచ్చి, ఏదో ఒక శరీరంలో స్త్రీగానో, పురుషునిగానో ఉంటూ కాలాన్ని గడుపుతున్నావు. ఈ శరీరంతో అవసరం తీరినంత వరకు ఉంది తరువాత మరొక జన్మకు పోవాల్సిందే. ఈ విధంగా ఎందుకు మారవలసి వస్తున్నదంటే ఇంతవరకూ సరైన జ్ఞానం తెలియకపోవటం వలన. కనుక ఇప్పటికైనా ఆ జ్ఞానాన్ని తెలుసుకునేందుకు ప్రయత్నం చేయండి. ఆ ప్రయత్నంలో భాగంగానే మీ అందరూ ఇక్కడకు వచ్చారు. మేము ముందే చెప్పాము. ఈ ప్రపంచం ఎప్పటికీ నాశనం అవదు అని. ఈ మధ్య టీవీ9లో '30 మినిట్స్' కార్యక్రమంలో చెప్తున్నారు. 2013-14 సంవత్సరాలలో ఉత్పాతాలు ఆకాశంలో జరిగి, అగ్ని వాన కురుస్తుంది. ప్రపంచం నాశనం అవుతుంది అని ఉంది అయితే డిసెంబర్ 21 లాగే ఇదీ జరిగే అవకాశమే లేదు. ఎందుకంటే మనకు కర్మలు ఉన్నంతవరకు జన్మలు ఉంటాయి. ఈ జన్మలలో సుఖాలు ఎట్లాగో అనుభవిస్తాము. కష్టాలు అనుభవించేది ఎట్లా? అనుకోకూడదు. గతంలో అనుభవించాము. ఇప్పుడు ఈ జన్మలో అనుభవిస్తున్నాము. భవిష్యత్తు జన్మలలో అనుభవిస్తాము. ఇటువంటి కష్టాలను అనుభవించే కర్మనుండి తప్పించుకోవాలంటే మొట్ట మొదట, దేవుడు నేర్పిన విద్యను నేర్చుకోవాల్సిందే. అదే బ్రహ్మవిద్య. దానిని తెలుసుకుంటే జన్మలు లేకుండాపోయి, జన్మరాహిత్య స్థితికి వెళ్తాము. జన్మరాహిత్య స్థితి వలన ఏమిటి ఉపయోగం అంటే ఈ విషయం చెప్పితే, కొందరేమి అంటారంటే, జన్మలేకపోతే ఎలాగా? జన్మ ఉంటే ఎక్కడో ఒక దగ్గర తిప్పలు పడి బ్రతకవచ్చు, జన్మలు లేకపోతే పొద్దుపోయేది ఎట్లా? అని ప్రశ్నించేవారికి ఇంకేమి చెప్తాము. అసలు నీవు అనేవాడివి ఉంటే కదా! పొద్దుపోయేది?

మోక్షము అనగా విడుదల, ముక్తి అని అర్థము. ఆ మోక్షము అనేది ఈ ప్రపంచం ఉన్నట్లుగా ఏమీ ఉండదు. దేవునిలా ఉంటుంది. దేవుడు అణువణువునా వ్యాపించినట్లు, మోక్షం పొందిన వ్యక్తి కూడా అణువణువునా వ్యాపించి ఉంటాడు. అగ్నిలో కూడా దైవత్వం ఉంది. కనుక నీవు కూడా అగ్నివలె అవుతావు. ఇప్పుడు నీకు అగ్ని కాలుతుంది. అప్పుడు నిన్ను అది కాల్చదు. దానివలన నీకు బాధే లేదు. మరి అన్ని శక్తులలోనూ నీవు ఉ న్నావు కనుక నిన్ను ఏ శక్తి పీడించలేదు. దానినే జన్మరాహిత్య స్థితి, మోక్షము అంటారంతే. అయితే కొందరు చాలా గ్రంథాలలో దానినే స్వర్గానికి పోతారు అని మార్చి చెప్పారు. వాస్తవానికి స్వర్గము వేరు, మోక్షము వేరు. స్వర్గానికి పోతే సుఖాలు వస్తాయి. సుఖాలు అయిపోతే కష్టాలు కూడా ప్రాప్తిస్తాయి. ఈ కష్టాలు, సుఖాలు మనుషులు ఉన్నంత వరకు ఉంటాయిగానీ, జన్మలు లేకుండా పోతే ఏమీ ఉండవు. నీకు మనస్సు అనేది ఉంది కనుక నిన్ను మనిషి అన్నారు. మనస్సు, బుద్ధి, చిత్తము. ఇంద్రియాలు జీవుడు మొత్తం ఏమీ మోక్షం పొందే స్థితిలో ఉండవు. అవును నీవు జీవునివి కాకుండా దేవునిగా మారితే అదే మోక్షం. క్రైస్తవులలో కొందరు గుంపులు గుంపులుగా ఈ రోజు శుభదినం, ఈ రోజు మరణిస్తే మోక్షముకు పోతామని ఆత్మహత్యలు చేసుకున్నవారున్నారు. వారందరూ దెయ్యాలై ఉన్నారు. అదంతా సూక్ష్మప్రపంచం. ఆ ప్రపంచములో రౌడీలు ఉన్నారు, చెడ్డవారున్నారు, మంచి వారున్నారు. నీవు మినిష్టర్ కొడుకుగా ఉండి నీవు చనిపోతే అక్కడ దెయ్యాలలో ఉన్న పెద్దవాడు తన గుడ్డలు ఉతకమంటాడు. నేను మినిష్టర్ కొడుకునంటే క్రిందవేసి గుద్దులు గుద్దుతాడు.

ఇక్కడైతే కంప్లైంట్ ఇవ్వడానికి పోలీసులు ఉంటారు. అక్కడ ప్రభుత్వమే లేదు. (అక్కడ అంటే, ఎక్కడో అని మరోలోకం ఉంది

అనుకోరాదు. ఎందుకంటే వారందరూ కనిపించకుండా ఈ భూమిమీదే మనతో పాటు ఉన్నారు) ఒక ఊరిలో కొద్దిమంది మనుష్యులుంటే దానికంటే రెట్టింపుగా గానీ, అంతకంటే ఎక్కువగానీ సూక్ష్మశరీరులు (దెయ్యాలు) అదే ఊరిలో ఉంటారు. వారు కూడా సమావేశాలు అవుతారు. ఆ సమావేశంలో వాడు పెద్దవాడు వారికి ఆదేశాలు జారీచేస్తుంటాడు. నువ్వు వీడిని పీడించు, వాడిని నీవు పీడించు అని చెపుతుంటారు. ఈ విషయాలన్నీ నాకు వారే చెప్పారు. అందుకు అటువంటి సూక్ష్మశరీరులై ఉంటే, అప్పుడు పరిస్థితి ఎట్లుంటుందో చెప్పలేము గానీ, బ్రతికి ఉన్నప్పుడే ఈ జ్ఞానం గొప్పదని తెలుసుకోవలెను. దీనినే బ్రహ్మవిద్య అంటారని, తెలుసుకోవలెను. హేళనగా మాట్లాడిన వారికి ఈ జ్ఞానం అర్థం కాదు. అందుకు ఈ బ్రహ్మవిద్య అర్థం కావాలని దేవున్ని కోరుకోవలెను. అప్పుడే నీకు ఇది లభ్యమవుతుంది. అందుకే ఒక గ్రంథంలో మేము వ్రాశాము. నిన్ను దేవుని మార్గంలోకి పంపించాలన్నా, ప్రపంచ మార్గంలోకి పంపాలన్నా నీ ఇష్టంపైన ఆధారపడి ఉంటుంది. నీకు ప్రపంచ జ్ఞానము మీద ఇష్టం ఉంటే నిన్ను అందులోకే పంపిస్తాడు, లేదు నాకు దేవునియందు శ్రద్ధ ఉంది అంటే నిన్ను అందులోకే పంపిస్తుంది. నిన్ను దేవునిలోకి పంపించేదీ మాయే. మాయ అంటే దేవునికి వ్యతిరేఖం అని అనుకోవద్దండి. నిన్ను రెండింటిలో దేనిలోనికైనా పంపించే ఆదికర్త మాయయే.

దేవుడు ఏమీ చేయడు. ఆయన నిదర్శనుడు కదా! నిరూపణుడిగా కూడా ఉంటాన్నాడు. జ్ఞానం చెప్పే నేను ఎరుకతోనే ఉంటాను. కూర్చుంటే నాకు మోకాలు నొప్పిపెడుతూ ఉంది. తలనొప్పిపెడుతూ ఉంది. మామూలు మనుషులకంటే హీనంగా ఉన్నాము అని నాకు ధ్యాస ఉంటుంది. జ్ఞానం గూర్చి తెలుసుకనుక చెప్పుకుంటున్నాము. కొందరు మాత్రం పదిమంది

జనాలు వాడిచుట్టు మూగితే చాలు నేను దేవున్ని అనుకుంటాడు. అంతేకాదు నేను దేవునికంటే గొప్ప అని కూడా అనుకుంటాడు. కొందరు వారి పేర్లముందర భగవాన్ అని వ్రాసుకున్నారు. మాపేరుముందర భగవాన్ అని వ్రాసిలేదు గానీ, కొందరు నడయాడే దేవుడు అని తమ పేరు ముందర వ్రాసుకున్నారు. కనపరానివాడే దేవుడు అని మనం అంటే, నడిచేవాడు దేవుడు అని వారు అంటున్నారు. దేవునికి ఉండే పద్ధతిని తీసేసి మాట్లాడు చున్నారు. ఈయన ప్రత్యక్ష దైవం అంటారు. ఆయన కనబడును అని అంటే వీరు చెప్పేది "దేవుడు" అనే మాటకే విరుద్ధం. పేర్ల ముందర భగవాన్ అని పేరు పెట్టుకున్నారంటే అర్థం వారికి తెలియదు అని మనకు తెలుస్తున్నది. భగవాన్ అనే దానికి అర్థం తెలిస్తే ఆ పేరు పెట్టరు. ఉదాహరణకు గోవిందా... గో...విందా అని అంటే ఎందుకు ఆ విధంగా అంటున్నారో తెలియదు. ఈ విధంగా శాస్త్రబద్దంగా ఏ విషయాన్నీ చెప్పలేక "మన పెద్దలు అనుసరించారు, కనుక మనం అనుసరిస్తున్నాము" అంటున్నారు. కనుకనే హేతువాదులు అని, నాస్తికవాదులని పేరు పెట్టుకున్న వారంతా ఎవరో ఒక స్వామీజీ అశాస్త్రీయమైన మాట మాట్లాడినాడు అని పట్టుకుని, "స్వామీజీలందరూ చెప్పేదంతా అబద్ధమే, దేవుడు లేనేలేడు, దేవుడు అని పేరుపెట్టుకుని వీరు బ్రతుకుతెరువుకోసం పాటుపడుచున్నారు" అని ఆరోపిస్తున్నారు. ఈ ఆరోపణలు ఖండించే నిమిత్తం, **"హేతువాదము, ప్రతివాదము, అతివాదము, మితవాదము, ఉగ్రవాదము"** అని పేరుపెట్టి ఒక గ్రంథాన్ని వ్రాశాము. అందులో నాస్తికవాదులకు, హేతువాదులకు సరైన సమాధానం చెప్పబడుతుంది. మేము కూడా హేతువాదులకు ప్రశ్నిస్తున్నాము. మీరు జవాబు చెప్పండి. మీరు ఎన్ని ప్రశ్నలు వేసినా జవాబు మేము చెప్పగలము. మేము వేసిన ఒక్క ప్రశ్నకు జవాబు చెప్పగలరా? మీరు చెప్పలేరు. మీకు ఇంకా సైన్స్ తెలుసు అంటున్నారు కదా. మీ సైన్స్

జనరల్ సైన్స్ మాత్రమే అంటే సామాన్య శాస్త్రం మాత్రమే. ఆయన (దేవుడు) కనిపించడు. మరి పనులన్నింటినీ చేసేది, చేయించేది ఆత్మ. కనిపించే శరీరము మనకు తల్లి అయిన ప్రకృతిదే, దేవుని జ్ఞానం జ్యోతిలాంటిది, ఆయన మాత్రం నిరూప, నిదర్శ. ఈ విషయాలు విన్న కొందరు ఇవేమి తిక్కమాటలు అని అనుకోవచ్చు. కానీ ఆ తిక్కను వదిలించేందుకు చెప్పే మాటలే ఇవి. ఆలోచన లేకుండా చెప్పే జ్ఞానం కాదిది. రూపము లేని స్థితికి నీవు మారాలంటే, రూపం లేనివాడిని గురించి ముందు తెలుసుకో.

ఈ రోజు సైంటిస్టులు చాలా వాటిని మేము కనుకొన్నాము అంటున్నారు. నిజమే కనుగొనుట అంటే ఏమి అర్థమో తెలుసా **"ముందర ఉన్నదానిని చూచుట"** అని అర్థం. దేవుడు నీ చెవిగూబ పట్టుకుని చూపిస్తే నీవు దానిని చూసి నేను కనుగొన్నాను అని అంటున్నావు. ముందు ఒకడు తయారు చేసి ఉంచితే నీవు దానిని చూసి చెప్పినట్లుంది. అందరి పరిశోధనలు దేవుడు యోచన రూపంలో మీకు అందిస్తే, మీరు దానిని కనుగొంటున్నారు. ఆ విషయం తెలియక 'మేమే కనుగొన్నాము అంటున్నారు. ఈ మధ్య సాక్షి టీవీలో ప్రోగ్రామ్ చూస్తున్నాము. అందులో పాటలు పాడే జానకి గారు వారి పరిచయంలో చెప్పుచున్నారు, ఏమి చెప్తున్నారంటే "నేను చాలా పాటలు పాడాను. ఎంతో పేరు వచ్చింది. అంతా బాగానే ఉంది. కానీ నాది ఒకే కోరిక మిగిలి పోయింది. నాకు దేవున్ని తెలుసుకోవాలని ఉంది. నేను జీవున్నే అని నాకు అర్థమయింది. నా శరీరంలోనే ఆ దేవుడు ఉన్నాడని తెలిసింది. కానీ ఎట్లా తెలుసుకోవాలో అనే మార్గం మాత్రం నాకు తెలియటం లేదు. అదే నా కోరిక" అని ఆమె చెప్పింది. తెలుసుకోవాలి అని ఆమె అనుకున్నది కనుక దేవుడు ఎప్పటికైనా తెలియజేస్తాడు. మనమందరము కూడా ఆ విధంగానే దేవున్ని తెలుసుకోవాలని ధ్యాస కల్గి

ముందుకు పోతే దేవున్ని తెలుసుకునేందుకు అవకాశం ఉంది. అంతేగానీ ఈ రోజు మా దగ్గరకు వచ్చి, ఏదో ప్రసంగం వినేసి, 29 రోజులు వృథాగా గడిపేసి, 30వ రోజున ఇక్కడికి మరలా వస్తానంటే ఏమీ ప్రయోజనం లేదు. కనుక ఇప్పటినుండి దినంలో 24 గంటలూ నేను చాలా చిన్నవాడిని, దేవుడు చాలా గొప్పవాడు ఆయనను ఎలాగైనా తెలుసుకోవాలనే ధ్యాస ఉండాలని, అప్పుడే దేవుడు తెలియబడి, ముక్తిని పొందుతారని ఆశిస్తూ ముగిస్తున్నాము.

## 66. గురువు ఎవరు?

**(తేది : 22.07.2013)**

**"దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఎవరికీ తెలియదు".** ఏ మనిషీ దేవుని జ్ఞానాన్ని చెప్పలేడు. కనుక దేవుడే ఆ జ్ఞానాన్ని చెప్పవలెను. ఈ జ్ఞానము రహస్యమైనది అని భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్యా యోగము అనే అధ్యాయములో చెప్పబడింది. "రాజవిద్యా' అంటే పెద్ద విద్య అని అర్థము. రహస్యములలో కెల్లా రహస్యమైనది 'రాజగుహ్యాము'. గుహ్యాము అంటే రహస్యమైనదని అర్థము. ఈ జ్ఞానాన్ని తెలుసుకోవాలంటే పెద్దదై ఉంటుంది మరియు రహస్యంగా ఉంటుంది అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన దానిని శ్లోక రూపంలో ఏముందో చూద్దాము.

శ్లో॥ 1: ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞాన సహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్ ॥

"నీకు శుభములు కలుగజేసేది, మోక్షమును కలుగజేసేది అయిన ఈ అతి రహస్యమైన జ్ఞానాన్ని నేను నీకు విజ్ఞాన సహితముగా, అర్థము

అయ్యే విధంగా చెప్తాను విను" అని చెప్పుచున్నాడు. ఇంకా ఏమి చెప్తున్నాడంటే...

శ్లో॥ 2. రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥

"నీవు అనుష్ఠింప తగినది, నీవు ఆచరింపదగినది, ఉత్తమమైనది, రహస్యములలోకెల్లా రహస్యమైన జ్ఞానము, అటువంటి జ్ఞానాన్ని వివరంగా అర్థమయ్యేటట్లు చెప్తాను".

ఈ విషయాలు ఎవరు చెప్పారు? కృష్ణుడు చెప్పాడు. శ్రీకృష్ణుడు కూడా మనలాంటి మనిషే కదా! అని సంశయము వస్తుంది. అయినా మనిషి చెప్పినదే వినాలి. దేవుడు ఎవరికీ కనిపించడు, వినిపించడు మరియు ఏ పనీ చేయనివాడు. సరే దీనిని విడిచిపెట్టి, మరో మత గ్రంథములో ఏముందో చూద్దాము. **"మనుషులు జ్ఞానాన్ని తెలుసుకునే వారేగానీ, చెప్పేవారు కాదు"** దేవునికే దేవుని జ్ఞానము తెలియును. మరి ఈ విషయం చిక్కు సమస్యగా ఉంది కావున, దీనికి పరిష్కారంగా ఒక మధ్యవర్తిని పెట్టారు. ఆయననే **గురువు** అంటాము. ఆయనను మనిషి అనకూడదు. అంటే దేవుని జ్ఞానాన్ని గురువు చెప్పగలడు. దేవుని జ్ఞానము గురించి గురువుకు తెలుసు కానీ ఏ మానవునికీ తెలియదు. అయితే ఇప్పుడు గురువుగా ఉన్నవారు మనిషి కాదా? అని ప్రశ్న వస్తుంది. గురువు, మనిషి, లోకములో ఒకేలాగా ఉంటారు. అంటే గురువు మనిషిలాగే ఉంటాడుగానీ మనిషి కాడు. కావున ఈ లోకంలో ఎవరూ గురువును గుర్తు పట్టలేరు, అంటే "విశ్వరూపుడై ధరణి నీవు సాకార రూపమున వెలసి" అన్నాము. అంటే విశ్వమంతా ఆవహించి ఉన్నవాడే సాకారంగా వస్తాడు అనేది నిజమే గానీ,

ఇంతమందిలో ఎవరిని ఆ విధంగా సాకారంగా వచ్చిన దేవున్ని గుర్తు పట్టడము ఎలాగ? మరి ఈ దేశంలో ఎందరో గురువులు, ఎన్నో గురు బోధలున్నాయి.

మరి వారందరిలో అసలైన గురువు ఎవరు? మరి వారంతా గురువులు కారా? నీవనుకోవచ్చు గురువులని, కానీ వారెవరూ గురువులు కారు. నియమము ప్రకారము గురువులు కారు అని మేము చెప్తాము తప్ప, నేను గురువును అని నీకు నీవే అనుకుంటే నేనెందుకు వద్దంటాను. ఎందుకంటే గురువు మనిషివలె ఉంటాడు కనుక నీవు గురువు కావచ్చు, కానీ అసలైన గురువు వస్తే మాత్రము, ఆయన నేను గురువును కాను అని ముందే చెప్పుకుంటాడంట. నేను మనిషిని అని చెప్తాడంట. మనిషి మాత్రము నేను గురువునే అని చెప్పుకుంటాడు. కనుక ఈ సమయంలో ఎవరు గురువో చెప్పుటకు అవకాశమే లేదు. వ్యక్తిలాగా కనిపించే గురువును మనము కనుక్కోలేము. ఈ వ్యవహారమంతా దోబూచులు ఆడినట్లు ఉంది. దేవుడు మనిషివలె వచ్చి జ్ఞానము చెప్తాడు, అని తెలిసినా సరే, మనము మరి ఎందుకు అతన్ని గుర్తుపట్టలేక పోతున్నాము? ఎందుకంటే దేవుని జ్ఞానము ఇదేనేమో అనే ఉద్దేశ్యముతో వేరువేరు జ్ఞానములు తెలుసుకుంటున్నాము. అంటే మనము పొరపాటు పడుచున్నాము. ఎవరో ఒకరు నేను గురువును అని చెప్పి జ్ఞానము చెప్తే, ఇతను గురువేనేమో అని అతనిని అనుసరిస్తున్నాము. కానీ అది అసలైన జ్ఞానమో కాదో తెలుసుకునే స్థోమత మనకు లేదు. అందువలననే లోకంలో ఈ రోజు ఇన్ని రకముల జ్ఞానాలు వచ్చాయి. అందరూ వారికి వారు వారిదే సరైన జ్ఞానము అని చెప్పుకుంటూ ఉండటం వలన ఏది సరైన జ్ఞానమో మనము తెలియలేకపోతున్నాము. మరి ఇటువంటి సందర్భములో అసలైన జ్ఞానాన్ని

ఏ విధంగా గుర్తుపట్టగలము? గురువును గుర్తించలేనప్పుడు జ్ఞానాన్ని కూడా గుర్తించలేము, ఎందుకంటే అతను వ్యక్తిగానే కనిపిస్తూ జ్ఞానము చెప్పటం వలన అందరిలాంటి మనిషిగానే గుర్తిస్తాము. పోనీ అతనికి ఏవైనా గుర్తులు ఉంటాయా? గుర్తించేందుకు, అంటే అలాంటి గుర్తులు గురువుకు ఏమాత్రము ఉండవు.

గురువు ఒక్కడున్నాడు అని తెలిపేందుకు **'గురుపౌర్ణమి'** అని పెట్టుకుంటే, జ్ఞానానికి గుర్తుగా పౌర్ణమిని పెట్టుకున్నాము. పూర్ణజ్ఞానము కలవాడే గురువు అని తెలుసుకునేందుకు గురుపౌర్ణమి అని పెట్టుకున్నాము. కనుక గురువు అనేవాడు ఈ ప్రపంచములో ఉన్నట్లే లెక్క. సరే గురువును గుర్తించేందుకు ఎంతకాలం పడుతుంది? అంటే దానిని మనము చెప్పలేము. గురువు మాటనుబట్టి, నడకనుబట్టి నేను గురువును గుర్తుపట్టగలను అన్నా కూడా, అలా కూడా వీలులేదు. అతని భాషనుబట్టి గుర్తుపట్టేస్తాము అంటే, అతను తప్పులున్న భాషనే మాట్లాడుతాడు. కనుక ఆ విధంగా గుర్తు పట్టలేవు. అలాగని స్పష్టముగా మాట్లాడినవాడే గురువంటే అలా స్పష్టముగా మాట్లాడేవారు చాలామంది ఉన్నారు. అందులో ఎవరని? కనుక అలా కూడా నీవు గుర్తుపట్టలేవు. అయితే సరే ఆ విధంగా గురువును తెలుసుకునే ప్రయత్నం మానుకుంటే మంచిది కదా! అంటే మరి ఆ విధంగా మానుకుంటే నీకు జ్ఞానము ఎట్లు తెలుస్తుంది? అను ప్రశ్న మళ్ళీ వస్తుంది. ఇదేమి? ప్రయత్నం చేయాలంటారు, గురువును ఆయన జ్ఞానాన్ని గుర్తుపట్టలేవు అంటారు, మరి దీనికి పరిష్కార మార్గము ఎట్లు? అని నీవు ప్రశ్నవేసుకుంటే, ప్రతీ దానికి పరిష్కారం ఉంటుంది. ఎక్కడ ఉంది ఈ పరిష్కారం అంటే, భగవద్గీతలో **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"** అని ఉంది. శ్రద్ధను బట్టి నీకు జ్ఞానము లభిస్తుంది అని భగవంతుడు అన్నాడుగానీ "గురువు వలన నీకు

జ్ఞానము లభిస్తుంది" అని అనలేదు. జ్ఞానము తెలిసినవాడు దేవుడు, చెప్పేవాడు మాత్రము గురువు. నీకు శ్రద్ధ ఉంటే జ్ఞానము లభిస్తుంది. చెప్పేవాడు గురువు, తెలుసుకునేవాడు మనిషి. మరి మనిషి గురువును కనుక్కోవడానికి అవకాశమే లేదు. దీనికంతటికీ ఒక్కటే సూత్రము నీకు శ్రద్ధవుంటే జ్ఞానము లభిస్తుంది అని చాలా సులభంగా చెప్పాడు. భగవద్గీతలో కృష్ణుడు నేను చెప్పే జ్ఞానము రహస్యమైనది అని చెప్పాడుగానీ, ఆయన గురువో మనిషో ఈ రోజుకి కూడా గుర్తించలేక పోయారు. సరే మనకు శ్రద్ధ ఉంది కనుక భగవద్గీతలో ఉండే జ్ఞానమే గొప్పదని మనకు తెలిసింది.

ఇక్కడ కృష్ణుడు గురువా, మనిషా? అని కాదండి. అలాగే ఇంత మందిలో ఎవరు గురువు అని కూడా మీకు అవసరం లేదండి, కానీ మీకు దైవజ్ఞానము అసలైన దానిని తెలుసుకోవాలని కోరిక ఉంటే, ఎవరినీ గురువు అనుకోకండి, ఎవరినీ దేవుడు అని అనుకోకండి, కేవలము దేవుని జ్ఞానము తెలియాలనే శ్రద్ధ ఉంటే చాలు నీకు తెలియబడుతుంది. ఎట్లు తెలియబడు తుంది? అంటే అసలైన గురువు ద్వారా తెలియబడుతుంది అని చెప్పవచ్చును. ఆయనకు నీవు వెతికేవాడివి కాలేవు, గానీ ఆయన నీకు జ్ఞానమును అందిస్తాడు. నిజమైన శ్రద్ధ ఎవరికి ఉందో ఆయనకు తెలుసు. ఒక పక్షి ఉంది, దాని ఆహారం అక్కడకు పదికిలోమీటర్ల దూరంలో చచ్చిన పశువు రూపంలో ఉంది. దానికి దేవుడు పెట్టిన గ్రాహితశక్తి (సెన్సార్) ద్వారా ఎటువైపు ఆ చచ్చిన పశువు ఉందో, అటువైపే పక్షి రెక్కలలో వెంట్రుకలు నిక్కబొడుస్తాయి. అప్పుడు ఆ పక్షి అటువైపే ఎగిరి ఎగిరి చివరకు ఆ వైపునే ఖచ్చితంగా చచ్చిన ఆ పశువును ఆహారంగా కనుగొనగలదు. అట్లాగే శ్రద్ధ ఎటువైపు అయితే ఉన్నదో గురువుకు కూడా ఆ వైపు తెలుస్తుంది అని అనుకోండి. అప్పుడు ఆ గురువు నా శిష్యుడు ఇటువైపు ఉన్నాడు

అని ఆయన తెలుసుకుంటాడు అంటే కనుక్కోవలసింది ఆయన, మీరు కనుక్కోలేరు. మరి ఎలాగా అంటే మీకది అవసరము లేదు. నీకు శ్రద్ధ ఉంటే చాలు. నీకు శ్రద్ధ లేకపోతే, నీవు నీవే, ఆయన ఆయనే. అలా కాకుండా శ్రద్ధ ఉంటే ఆయనకే నీవు తెలియబడుతావు.

అప్పుడు నీవు జ్ఞాన మార్గములోకి వచ్చినట్లు అవుతుంది. ఇదంతా కొందరికి ఏమీ అర్థము కాలేదు. దేవుని జ్ఞానము దేవునికే తెలుసు అంటారు, గురువే జ్ఞానము చెప్తాడంటారు, మనిషే చెప్తాడు అంటారు, మనిషి గురువు కాదు అంటారు. నిజంగా గురువు మనిషి కాదుగానీ దేవుడే మనిషిగా జ్ఞానము చెప్తాడు. గురువు సాక్షాత్తూ రూపము మారిన దేవుడు. మరి ఆయన చెప్పినది జ్ఞానము ఎట్లు ఉంటుంది అంటే, ఇంతకుముందు ఎవరూ చెప్పని జ్ఞానమై ఉంటుంది. సరే ఇతను చెప్పిందే సరైనది అని తెలియాలి. అతనే గురువేమో అని నీవు అనుకోవాలి, కానీ ప్రత్యక్షముగా ఆయనే గురువు అని నీవు కనుక్కోలేవు. మరి నేను కనుక్కొన్నాను, అతనే గురువు అని అంటే, కావచ్చునేమో, కాదనడానికి లేదు, అవును అనడానికి లేదు. కనుక నీకు సాధ్యమయ్యేది ఒకటుంది. అదే చెయ్యి. అదేమంటే దైవజ్ఞానము తెలియాలని శ్రద్ధ పెంచుకో అంతే. ఒక వ్యక్తి రోగంతో వచ్చి, నీ దగ్గరకు వచ్చాను, నాకు రోగం పోతుందా అని అడుగుతాడు. అప్పుడు నేను ఏమంటానంటే, దేవుని జ్ఞానము తెలుసుకుంటే కర్మలు పోతాయి కదా! మరి నీవు జ్ఞానము తెలుసుకో, అప్పుడు నీ కర్మపోతే నీకు రోగం పోతుంది. ఇప్పుడు శ్రద్ధగలిగి ఉంటే, వాస్తవమైన జ్ఞానము తెలిస్తే, ఇతనే గురువు అని తెలియుటకు అవకాశము ఉంది కదా! అని ఎవరయినా అంటే, అప్పుడు కూడా ఇతను గురువే అని తెలియలేదు. ఎందుకంటే ఇతను గురువు కాదు అనేటట్లు అనుమానాలు గురువే తెప్పిస్తాడుగానీ ఆయన దొరకడు.

నీవు ఆయనను చూడకు, ఆయన చెప్పే జ్ఞానాన్నే చూడు. అలాగాదు నేను గురువును గుర్తించాను అని అనుకుంటే అతను అనేక సమస్యలు కలిగేటట్లు చేసి, ఆ భావన నుండి నిన్ను తప్పించవచ్చును. అప్పుడు నీవు గందర గోళములో పడతావు. కనుక నీవు ఆయన చెప్పే జ్ఞానమునే చూడు. అప్పుడు మోక్షము అంటే ఏమిటి? దేవుడు అంటే ఎవరు? అనేది తెలుస్తుంది. కానీ జ్ఞానము అంచెలంచెలుగా తెలుస్తుంది.

నేను దైవ జ్ఞానము ఈ మార్గము ద్వారా తెలుసుకుంటున్నాను అని అనుకోవటానికి అవకాశము లేకుండా నీకు ఎలా తెలియాలో ఆయనే అమర్చి పెట్టుకుంటాడు. ఇప్పుడు కృష్ణున్ని దేవుడు అందామా అంటే, అతను దేవుడు కాదు అని అనడానికి 99 ఆధారాలు ఉన్నాయి. ఆయన 90వ సంవత్సరములో భగవద్గీత రూపంలో జ్ఞానము చెప్తే, 89 సంవత్సరాలు జ్ఞానము ఏమీ చెప్పకుండా ఆయన జీవితం ఉంది. 90వ సంవత్సరంలో అదీ ఒక 5 నిమిషాలపాటు చెప్పితే దానితో ఆయన్ని దేవుడని ఎట్లు అనగలము మనం మాత్రము జ్ఞానానికి విలువనిస్తూ, ఈయన గురువేమో అని చెప్పుకుంటున్నాము. సరే అతనే గురువు అంటే ఆయనేమైనా శిష్యులను చేర్చాడా, ఉపదేశాలులాంటివి ఇప్పట్లాగా ఇచ్చాడా? నేను గురువునే అని ఆయనేమైనా చెప్పాడా? కొందరు ఆయన జ్ఞానాన్ని కూడా ఏమంటారంటే, అర్జునున్ని యుద్ధానికి పురిగొల్పడానికి చెప్పినది తప్ప, అదేమి మనకు చెప్పలేదు అంటారు. అది మీ తెలివితక్కువ అంటారు. కానీ శ్రద్ధ ఉన్నవారికి అది అసలైన జ్ఞానము. శ్రద్ధలేనివారికి అది జ్ఞానముగా అనిపించలేదు. ఈ విధముగా మనిషి ఆకారంగా గురువు చెప్పినాగానీ అది దేవుని జ్ఞానముగా కనిపించదు. ఆయన ఎప్పుడు భూమిమీదకు

వచ్చినా ప్రత్యేకంగా వస్తాడు, ప్రత్యేకంగా ఉంటాడు. కానీ ఆ ప్రత్యేకత ఏమిటో తెలియదు. అయితే ఇప్పుడు ఒక ప్రశ్న వస్తుంది. అదేమంటే, శ్రద్ధ అనేది భూమిమీద ఎవ్వరికీ లేదు అనుకో! మరి ఆయన భూమిమీదకు వచ్చిన ప్రయోజనం ఏమి అని అడుగుచున్నారు అనుకో! అని అంటారు. అప్పుడు మేమేమి చెప్పామంటే, భగవద్గీత చెప్పిన ద్వాపర యుగములో కూడా ఎవ్వరికీ శ్రద్ధలేదు. కానీ గురువు ఏమి చేశాడు, అప్పుడు శ్రద్ధ ఒకనిలో పుట్టేటట్లు చేశాడు. అర్జునుడికి శ్రద్ధ పుట్టించి, ప్రశ్న వేసేటట్లు చేసి జ్ఞానము చెప్పాడు. అంతేగానీ అర్జునునికి ముందే జ్ఞానముపట్ల శ్రద్ధలేదు. సరే ఈ రోజు కూడా మనకెవరికీ శ్రద్ధలేదు. కనుక గురువు ఎలాగో ఒకలాగా శ్రద్ధ ఆయనే కలిగించి వాడికి దైవజ్ఞానరుచిని చూపించి, మరలా ఆ జ్ఞానము కొరకు వాడు ప్రాకులాడేటట్లు చేస్తే డబ్బులను బయటకు తీయనివాడు కూడా ఖర్చుపెట్టి మరీ నాకు జ్ఞానము కావాలి అనేటట్లు చేస్తాడు.

ఈ విధముగా దేవుడే మనందరికీ కొంత శ్రద్ధను కలిగేటట్లు చేశాడు. ఇంతకుముందు మనందరికీ ప్రపంచము పైనే శ్రద్ధ ఉండేది. ఆత్మపైన శ్రద్ధలేదు. అందరూ దేవతలను మ్రొక్కేవారే, కోరికలతో మ్రొక్కేవారే. అటువంటి వారిలో కొందరిని ప్రక్క త్రోవనుండి తన త్రోవలోకి కావాలనే తీసుకువచ్చాడు. ఈ విధముగా మనలో కొందరిని తీర్చిదిద్దాడు. కావున ఆయనే గురువు, ఆయనే భగవంతుడు అని కృష్ణున్ని మనము గొప్పగా చెప్పుకుంటున్నాము. కనుక శ్రీకృష్ణుడు మనిషి ఆకారములో ఉన్నా భగవంతునిగా ఉన్నా దేవుడే. సరే ఆయన మనిషి కదా! మరి గురువని ఎలా అనగలము అని కొందరంటారు. దానికి జవాబు ఏమనగా!

మనిషి అనే దానికి గుర్తింపు ఉంది. అదేమంటే వేలిముద్రల గుర్తు. ఒక్కసారి తన వేలిముద్ర వేశాడంటే, ఆయనను ఎక్కడున్నా పట్టుకోవచ్చును. పోలీసులు అదే పనిని చేసి ఆ వ్యక్తిని పట్టుకుంటారు. ఎందుకంటే ఏ ఒక్కరి వేలిముద్రలు ఒకలా ఉండవు. అదే మనిషి కోడ్ (సంకేతం) అని అనవచ్చును. అదే విధముగా ప్రతీ వ్యక్తికి ఒక వాసన అతని శరీరములో ఉంది. వేలిముద్ర ఎలాగైతే వేరువేరుగా ప్రతీవారికీ ఉందో, అలాగే ప్రతీ ఒక్కరికీ ఒక్కొక్క శరీర వాసన కూడా ఉంది. అందుకే కుక్కలకు ఒక్కసారి ఒక వ్యక్తిని వాసనను గుర్తిస్తే ఆ వ్యకి వేయిమందిలో ఉన్నా గ్రాహిత శక్తి ఉన్న ఆ కుక్క పట్టేయగలదు. అలాగే ప్రతీ వ్యక్తికి ఒక శక్తి ఉంది. అదే జీవశక్తి అది కూడా ప్రతీ జీవికి వేరువేరుగా ఉంటాయి. ప్రపంచములో ప్రతీ మనిషికీ ఉండే నియమం ఇది. ప్రతీ వ్యక్తికి ఒక **వేలిముద్ర, వాసన, శక్తి** వేరువేరుగా ఉంటాయి.

కానీ గురువుగా వచ్చిన మనిషి ఎవరైతే ఉన్నారో ఆ వ్యక్తి యొక్క వాసనగానీ, శక్తిగానీ, వేలిముద్రలుగానీ గుర్తించటానికి వీలుపడదు. అదే సూత్రము. ఎందుకంటే మనిషి గురువుకాదు, గురువు మనిషిగా వస్తాడు. అనే దానికి సూత్రము ఏమంటే ఈ మూడు నియమాలు ఆ గురువుగా వచ్చిన వ్యక్తికి సరిపోవు. ఆయనకు ఇంతే శక్తి ఉంది అని గుర్తించలేము. అతనిది ఇదే వాసన అని గ్రాహితశక్తి ఉన్న ఏ జంతువూ గుర్తించలేదు. ఈ విషయం అవును అని చెప్పేందుకు మనిషిగా వచ్చిన గురువులో దేవుడు పెట్టినాడు. అయితే ఆ విధంగానైనా గురువును గుర్తించవచ్చు కదా! అంటే. ఫలానా వాసన అంటే గుర్తిస్తావు కానీ ఏ వాసనా కాని దానిని ఎట్లా గుర్తిస్తావు. ఒక కుక్క ఒక మనిషిని వాసనను చూపించితే, పదివేలమందిలో ఆ మనిషి ఉన్నా గుర్తించగలవు కానీ, గురువుగా వచ్చిన వాడిని ఆ కుక్కకు

వాసన చూపించినా, ఆయన ఎక్కడున్నా, అక్కడే ఉన్నా అది గుర్తుపట్టలేదు ఎందుకంటే ఏ వాసనా ఆయననుండి అది గ్రహించలేదు. ఎందుకంటే ఆయన నుండి ఏ వాసనా లేదు. అదీ ఆయన ప్రత్యేకత, ఈ విషయం క్రొత్తది. కనుక నీవు గురువు నీ ముందుకు వచ్చినా గుర్తుపట్టాలని ప్రయత్నాలు మానివేసి, జ్ఞానంపైన మాత్రమే శ్రద్ధ పెట్టుకో, అప్పుడు ఎక్కడా చెప్పని జ్ఞానము నీకు లభ్యమవుతుంది. గురువు ఎక్కడున్నాడు, అవన్నీ నీకు అనవసరము. నీకు జ్ఞానము అవసరము. చెప్పేవాడినిబట్టి కాక వినేవానిని బట్టే జ్ఞానము ఉంటుంది. కావున చెప్పేవాడిని నేను, వినేవారు మీరు, కానీ మేము మాత్రము బోధకులమే! గురువు మాత్రము కాము, కాలేము.

ఈ మధ్య ఒక వ్యక్తి ఏది చెప్పాలన్నా, వ్రాయాలన్నా మీరే వ్రాయాలి అని మమ్మల్ని అన్నాడు. అప్పుడు మేము "నేను ఎవర్నయ్యా వ్రాసేదానికి, చెప్పేదానికి, నా వెనుక గురువు ఉంటాడు. ఆయన చెప్తే నాకు అర్థమవు తుంది. దానిని మీకు చెప్తున్నాను, దానినే వ్రాస్తున్నాను అని చెప్పాను. నాకు తెలియని విషయాలు నేను వ్రాస్తున్నాను అంటే, నాకు చెప్పేవాడు ఒకడున్నాడు వాడే గురువు. ఎక్కడున్నాడు, మీకు కనిపించాడా?" అని అడిగితే "నాకేమీ కనిపించలేదు ఆయన నాలోనే ఉంటాడు ఆయన చెప్తాడు, నేను వ్రాస్తాను అన్నాను. మరి నాకే ఎందుకు తెలుస్తుంది అంటే శ్రద్ధనుబట్టి తెలుస్తున్నది, మీకు శ్రద్ధలేదు కనుక మీకు తెలియలేదు. **నేను జ్ఞానము చెప్పాలి, తెలుసుకోవాలి అనుకోవద్దు. నీవు శ్రద్ధను పెంచుకోవాలి అనుకో.** అప్పుడు లోపలి గురువు జ్ఞానము చెప్తాడు. తెలుసుకుని ఏమి చేయాలి అని అనుకోకు, తెలుసుకో అంతే. ఏమి చేయాలో ఆయనే చేస్తాడు. నేను జ్ఞానాన్ని తెలుసుకోవడానికే అర్హుణ్ణి, మిగతా వాటికి అర్హుణ్ణి కాను

అని అనుకో. నేను అలాగే అనుకుంటాను కావున మేము కూడా ఈ విషయాలు ముందే చెప్పాలనుకోము. లోపల వాడు ఏది అందజేస్తే దానినే మీకు చెప్తున్నాము. కనుక చెప్పే విషయమంతా లోపలవానిదే కానీ, నాది కాదు.

## 67. సుఖం - ఆనందం

(తేది : 18.10.2013)

ఈ సభ ప్రారంభం అయ్యేముందు మేము గురువును స్మరించాము. మీ అందరూ ఏమనుకుంటారు అంటే, ఈయనకు గురువు ఒకడు ఉన్నాడు. అందుకు ఆయనను స్మరించుకున్నాడు. "మాకు మాత్రము గురువు ఈయనే" అని నన్ను మీరు అనుకోవచ్చును. అటువంటి వారందరికీ ముందే ఏమి చెప్తున్నామంటే, "కనిపించేవాడు గురువు కాదు" అని మేము **"గురువు"** అనే గ్రంథములో వ్రాశాము. కనుక కనిపించే నేను గురువును కాదు. నాకు గురువు అసలుకు లేడు. అదేమి మీరిన్ని క్రొత్త విషయాలు ఎలా చెప్పగలుగుతున్నాము అనేది కాకుండా క్రొత్త జ్ఞానము తెలుస్తున్నదా! లేదా అనేదే మీరు చూచుకోండి. అని మేము చెప్తున్నాము.

మరి ఈ జ్ఞానం లభిస్తే నీకు **తృప్తి** కలుగుతుంది. అన్నము తింటే మనకు ఆకలి తీరుతుంది. అన్నం ఎంత తినినా ఆకలి తీరలేదు అనుకోండి. ఆ తిండి వలన ప్రయోజనము లేదు. ఎంత తక్కువ తిన్నా ఆకలి తీరి, బలము వచ్చింది అనుకోండి, దానివలన ప్రయోజనం ఉంది అని అనుకోవచ్చు. అందుకే తెలుగు కవి ఒకరు ఒక పద్యం చెప్పాడు. "గంగిగోవు పాలు గరిటడైనను చాలు, కడవడైన ఏల ఖరము పాలు" అని

అంటే, గంటెడు ఆవు పాల ముందు, కడవడు గాడిదపాలు పనికిరావని అర్థము. అట్లాగే ఎన్ని గ్రంథములు చదివినా, ఎంత జ్ఞానము విన్నాగానీ **తృప్తి** ఇవ్వని జ్ఞానం వలన ఏమీ ప్రయోజనము లేదు. కానీ చిన్న గ్రంథము చదివినా అందులో ఉండే జ్ఞానం తృప్తిని ఇస్తే, అదే మనకు వాస్తవమైన జ్ఞానం అని తెలుసుకోవాలి. ఎప్పుడైతే దైవిక జ్ఞానం తెలియబడుతుందో, అప్పుడు మనకు ఉత్సాహం, ఆనందం మనలో కలుగుతుందో అదే నిజమైన జ్ఞానము.

నీవు జీవాత్మవు, నీతో బాటు ఆత్మ ఒకటున్నది, పరమాత్మ ఒకటున్నది. ఈ ప్రపంచములో పెద్దది ఏదైతే ఉందో అదే దేవుడు. భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగములో ఆత్మను మూడు భాగములుగా విభజించినాడు. **క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు.** ఇదే విషయం బైబిల్, ఖురాన్ గ్రంథములలో కూడా ఉన్నది. కానీ వారు వేరుగా అర్థము చేసుకున్నారు. ఎవరు ఏ విధంగా అర్థము చేసుకున్నా, ఏ మతంవాడైనా, ఆడ అయినా, మగ అయినా మూడు ఆత్మలతోనే ఉన్నాడు. ఇందులో ఏ పనీ చేయని పరమాత్మ, పని చేసే ఆత్మ ఉన్నది.

దేవుడు (పరమాత్మ), జీవుడు (జీవాత్మ) ఏ పనీ చేయరు. మధ్యలో ఒక ఆత్మ మాత్రము పని చేస్తూ ఉంది. "అన్ని పనులు నేనే చేస్తున్నాను" అని నీవు అనుకున్నా పనులన్నీ, మధ్యలో ఉన్నవాడే (ఆత్మ) చేస్తున్నాడు. "మానవాతీతంగా జరిగే పనులన్నీ దేవుడే చేస్తున్నాడు", అని అనుకున్నవన్నీ కూడా ఆత్మయే చేస్తున్నది. పరమాత్మ ఏమీ చేయటం లేదు. ఈ సత్యం తెలియనంత వరకు మనము అజ్ఞానములో ఉన్నట్లే. ఎప్పుడైతే ఆత్మజ్ఞానం తెలియబడుతుందో, అప్పుడు నీకు సంతోషం కలుగుతుంది. నీకు ప్రపంచ

జ్ఞానం ఎంత తెలిసినా నీకు ఆనందం ఏర్పడదు. అంటే ఎన్ని **సుఖాలు** అనుభవించినా ఆనందం ఉండదు. అవి చప్పగా ఉన్న సుఖములే, కానీ అందులో ఆనందం లేదు. ఆత్మకు సంబంధించిన జ్ఞానమును తెలుసుకున్న తరువాత, ఆ జ్ఞానాన్ని తలచుకున్నంతమాత్రమున కన్నుల నుండి ఆనంద భాష్పములు వస్తాయి. అది అసలైన **ఆనందం.** ప్రపంచ సంబంధ విషయములలో అటువంటి ఆనంద భాష్పములు రావు. ఒకవేళ వచ్చినా అది ఆనందం కాదు. కష్టములాంటిదే సుఖం, అది ఒక అనుభవం. ఒకటి చేదుగా అనుభవిస్తావు. ఇంకొకటి తీయగా అనుభవిస్తావు. కానీ అనుభవాలకు అతీతంగా ఉండే ఆనందం ఒకటి ఉంది. జ్ఞాన ఆనందం ఎప్పుడైతే మనిషి పొందుచున్నాడో అప్పుడు కళ్ళలో నీరు వస్తుంది, అవే ఆనంద భాష్పములు. ఆనంద భాష్పములు అన్నివేళలా రావు. కొన్ని సమయములలోనే వస్తాయి. ఆత్మ సంబంధ విషయములలోనే వస్తాయి. అందువల్ల జీవాత్మగా ఉన్న నీవు ఎప్పుడైతే ఆత్మకు సంబంధించిన విషయాలు తెలుసుకుంటావో, అప్పుడు నీకు నిజమైన ఆనందం కలుగుతుంది. ప్రపంచవరముగా అనుభవించేవన్నీ సుఖములే గానీ **ఆనందం** మాత్రము కాదు.

ఐదు జ్ఞానేంద్రియాలు మనిషికి ఉన్నాయి. ఐదు జ్ఞానేంద్రియాల ద్వారా అనుభవించేవన్నీ సుఖములే అగును. తియ్యటి లడ్డూ తింటున్నావు, తియ్యగా, హాయిగా ఉంది, సుఖంగా ఉంది. ఆనంద భాష్పములు రావు. మంచి పాట వింటున్నావు. తల ఆడిస్తున్నావు, బాగా ఉంది కానీ ఆనంద భాష్పములు రావు. అది ఒక సుఖమే, ఆనందం కాదు. ఇదేమి ఈయన అన్నీ ఈ విధంగానే చెప్తాడు అని అనుకోవద్దండి. **ఆనందం వేరు, సుఖం వేరు** అని మేము విడదీసి చెప్తున్నాము అంతే! ఆనందం నీకు ఎప్పుడైనా

ఆత్మవలనే కలుగుతుంది. అటువంటి ఆనందం మనకెక్కడా దొరకలేదు. ఎప్పుడు దొరుకుతుంది అంటే శరీరములోకి పోయి ఆత్మను వెతికితే దొరుకుతుంది. శరీరములో ఉన్న ఆత్మను తెలియకుండా బయట ఎన్ని గ్రంథములు చదివినా, ఎన్ని సుఖములు అనుభవించినా ఆనందం మాత్రము కలుగదు. ఈ విధంగా మనిషికి ఆనందం వేరు, సుఖము వేరు అనే విషయం మనకు తెలిసినది. ఇప్పుడు సుఖముల కొరకు మనము ప్రాకులాడ కూడదు. ఎందుకంటే ఎన్ని సుఖములు, ఎన్ని కష్టములు అనుభవించాలి అనేది ముందే వ్రాసిపెట్టబడి ఉంటుంది. ముందే నిర్ణయించబడి ఉంటుంది. 69 సంవత్సరముల 5 నెలల 10 రోజులకు సంపాదించుకున్న ఆగామి కర్మంతా ఒక్కసారి నీ కర్మచక్రములో సంచిత కర్మగా మారిపోతుంది. ఇదేదో క్రొత్తది, ఈయన ఏమి చెప్పినా వినాల్సిందే అని అనుకోవద్దండి. వాస్తవంగా, శాస్త్రబద్ధంగా ఉండే విషయమే ఇది. ఎన్ని ప్రశ్నలకైనా ఇందులో జవాబు ఉంటుంది. **మరణం ఒక్క క్షణం, జననం దాని మరుక్షణం.** ఆ ఒక్క క్షణంలోనే సంచిత కర్మంతా ప్రారబ్ధంగా మారిపోతుంది.

ఈ విధంగా జననానికి, మరణానికి ఒక్క క్షణమే గడువు కలదు. ఆ క్షణంలో సంచితంలో ఉన్న కర్మ, జన్మకు (క్రొత్త జన్మకు సరిపడినంత) ప్రారబ్ధకర్మ కేటాయించబడుతుంది. ఎవ్వరి చావు పుట్టుకలు కర్మలలో లిఖించబడి ఉండవు. **చావు పుట్టుకలు కర్మాతీతములు.** కష్ట సుఖములు మాత్రము కర్మలలో లిఖించబడి ఉంటాయి. అందుకే ఖచ్చితంగా ఎవరి చావు పుట్టుకల గురించి చెప్పలేము. జ్యోతిష్య శాస్త్రములో ఈయన ఆయుష్షు ఇంతే అని చెప్పుటకు అవకాశమే లేదు. మరణం అంటేనే తెలియదు. మనకు మరణాలలో కాల మరణమా, అకాల మరణమా? తాత్కాలిక మరణమా? అనే విషయం నీకు తెలియనప్పుడు, చావు రహస్యం ఇంకేమి

తెలుస్తుంది? ఒక వ్యక్తి ఊపిరి ఆడకుండా పడిపోయాడు అంటే నీ లెక్కలో చనిపోయినట్లే లెక్క! వాడిని పూడ్చి పెట్టాలి, బ్రతికాడు అంటే ఊపిరి ఆడాలి. ఊపిరి ఆడలేదు కనుక వాడు చనిపోయాడు. కానీ మరణాలు మూడు విధములు. కాలమరణము పొందిన వ్యక్తి వెంటనే జన్మిస్తాడు. అకాల మరణం పొందినా, తాత్కాలిక మరణం పొందినా, వాస్తవముగా మరణం కాదు, వాడి శరీరం చనిపోయినా, వాడు మాత్రము బ్రతికే ఉన్నాడు. అకాల మరణం పొందిన వ్యక్తికి గుణములు ఉన్నాయి, మనస్సు ఉంది, బుద్ధి, చిత్తము, అహం మొదలగు సూక్ష్మ శరీరం అంతా ఉంది.

ఈ సూక్ష్మశరీరముతో జీవుడు (ఆడ అయినా, మగ అయినా) ఆయుష్షు తీరేంత వరకూ ఉండాల్సిందే. కాలమరణం పొందేంత వరకూ సూక్ష్మశరీరంతో ఉండాల్సిందే. తాత్కాలిక మరణం పొందిన వారిని కూడా వీరు పూడ్చిపెట్టేస్తున్నారు. తద్వారా వారిని అకాల మరణం పొందునట్లు చేసేస్తున్నారు. పూడ్చిపెట్టినవారికైతే తరువాత వాడికి మరలా ప్రాణం వస్తే మట్టి చుట్టుకు పోయి అకాల మరణం పొందవలసి వస్తున్నది. కొన్నిసార్లు స్మశానంనకు వెళ్ళిన తరువాత దహనం లేదా ఖననం చేసేముందు మరలా బ్రతికిన వారున్నారు. ఇటువంటి సంఘటనలు చాలా జరుగు చున్నట్లు మనము వింటున్నాము. దీనినే మనం తాత్కాలిక మరణం అంటున్నాము. ఈ రోజు ఈ విధంగా జ్ఞానం చెప్తున్న నేను కూడా ఒకరోజు చనిపోక తప్పదు. ఒకరోజు ఈ శరీరం కదలకుండా పడి ఉండే సమయం వస్తుంది. ఎందుకంటే శరీరం పడిపోతుంది. అందులో మరే శక్తి లేదు. ఇప్పుడు నా ఈ శరీరములో చైతన్యం ఒకటున్నది. కావున జ్ఞానం చెప్పగలుగుచున్నాను, చేయి కాళ్ళను అల్లాడించగలుగుచున్నాను. చైతన్యం లేనప్పుడు మాట్లాడేందుకు అవకాశం లేదు. కాల మరణం పొందిన

వ్యక్తికి, సంచితము అనే కర్మనుండి ప్రారబ్ధము అనే కర్మ కేటాయించ బడుతుంది. ఉదాహరణకు ఒక వ్యక్తి రాజకీయంగా బాగా పలుకుబడితో ఉన్నాడు. దండిగా ఆస్తులు సంపాదించుకున్నాడు. ఆ ధనంతో ఎవరినైనా జయిస్తాను అని అనగలడు. అన్నీ నా ఇష్టానుసారమే జరుగుచున్నాయి అని అనుకుంటాడు. కానీ నా కర్మానుసారమే లభ్యమయింది అని అనుకోకుండా, నేనెవరు అని ప్రశ్నించుకోకుండా నేనే అన్నీ చేస్తున్నాను అని ఊహించుకొంటాడు. మరణం వచ్చింది అనుకోండి, అప్పుడు ఎవరైనా చనిపోవాల్సిందే. రాజ్యానికి అధిపతిగా ఉన్నవాడు చనిపోతే, చనిపోయిన మరుక్షణమే సంచితకర్మనుండి ప్రారబ్ధం నిర్ణయించబడుతుంది. అప్పుడు వెంటనే పుట్టడం జరుగుతుంది. తద్వారా వేరే శరీరములో చేరటం జరుగుతుంది. నేనక్కడ పుట్టను, ఇక్కడ పుడతాను అని అనుకోలేని నిర్భలునువి, నిస్సహాయుడివి. కానీ నీ శరీరంలో మరో శరీరములోకి నడిపించేది ఇంకొకటి ఉంటే, అన్నీ నేనే నడిపిస్తున్నానని అనుకోవటం జరుగుతుంది. కానీ నీ వలన ఏమీ జరగటం లేదు. ఇప్పుడు నీకు మనస్సు ఉంది, కనుక జ్ఞప్తి ఉంది. బుద్ధి ఉంది, కనుక యోచన ఉంది.

ఈ విధంగా శరీరములో భాగాలు పని చేస్తుంటే నువ్వు చేస్తున్నట్లుగా కనిపిస్తున్నది, కానీ మరణంలో నీ శరీరము మొత్తము ఇక్కడే ఉండిపోతుంది. అప్పుడు నువ్వు ఒక్కడివే కాకుండా నీతో పాటు నీ కర్మలు, నీ గుణములు నీతోపాటు ఉండే ఆత్మ మాత్రము నీ వెంట వస్తాయి. భగవద్గీతలో ఇదే విషయాన్ని **"శరీరం యదవాప్నోతి"** అనే శ్లోకంలో చెప్పారు. శరీరము విడిచి పెట్టినప్పుడు మీ అందరి ముఖములపైన (త్రైత సిద్ధాంత భక్తులు) ధరించిన నాలుగు చక్రముల గుర్తు బయటకు వచ్చేస్తుంది. అందులో గుణములు ఉన్నాయి. నీవైన జీవాత్మవున్నావు. మధ్యలో బ్రహ్మనాడిలో

ఆత్మ ఉంది. అణువణువునా సంధు లేకుండా పరమాత్మ ఉంది. అంటే నీతోపాటు ఆత్మ, పరమాత్మ మొత్తము మూడూ వెళ్ళిపోయినట్లే. కానీ చేరిపోయే జాగా ఎటువంటిది అని లెక్కవేస్తే, నువ్వు ఇప్పుడు పెద్ద రాజకీయనాయకుడిగా ఉండో, హోదా కలిగి ఉండో, పెద్ద పలుకుబడి కలిగియుండో నీవు చనిపోతే మరల అదే హోదా, పలుకుబడి కలిగిన జన్మే వస్తుందని అనుకోవటానికి అవకాశము ఉండవచ్చు, ఉండకపోవచ్చు. ఎందుకంటే హోదాగా పలుకుబడిగా జన్మించి బ్రతికిన వ్యక్తికి, మరలా ఉన్నతమైన ఆ జన్మే లభించకపోవచ్చు. ఎందుకనగా! అన్నీ పాపపు పనులే చేస్తున్నారు. ఇష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తూ మన వలన ఎందరు బాధపడు చున్నారు అని ఆలోచన చేయరు.

నేను చేయు ఒక్క నిర్ణయం వలన ఎందరు బాధపడతారు అనే ఆలోచన ఉండదు. ఎంతవరకు ఈ శరీరము ఉంటుంది అని ఆలోచన చేయడు. ఉన్నట్లుండి చెప్పకుండా ఒకరోజు మరణం వస్తుంది. తద్వారా జన్మ కలుగుతుంది. అప్పుడు హీనాతిహీనంగా చాలా బీదవాని ఇంటిలో పుట్టి ఉంటావు, కానీ గతజన్మ జ్ఞాపకము ఉండదు. ఎందుకంటే ముందు జన్మలో ఉండే శరీరములో ఉన్న మనస్సు క్రొత్త జన్మలో లేదు. ఇప్పుడు ఈ జన్మలో పాత మనస్సు స్థానాన్ని క్రొత్త మనస్సు ఆక్రమించింది. అందువలన నీకు ఎటువంటి గతజన్మ జ్ఞాపకము ఉండదు. కానీ అనుభవము మాత్రము తప్పదు. ఏ మతములో నిన్ను పుట్టిస్తే, ఆ మతము వాడివే అనుకుంటావు. బీదవాడిగా పుట్టిస్తే బీదవాడిని అనుకుంటావు. ధనికుడిగా పుట్టిస్తే ధనికుడనే అని అనుకుంటావు. ఇంతకుముందే మేము చెప్పాము. పాపాలు చేయవద్దండి, దక్షిణాఫ్రికా అడవుల్లో పుట్టవలసి వస్తుంది. ఇబ్బంది పడతారని. ఈ విధంగా మనిషి చేసుకున్న పాపాలు,

తరువాత జన్మలో అనుభవించలేక, గతజన్మలో ఎంత పాపము చేశానో అని అప్పుడు అనుకుంటాముగానీ, ఏమి చేశామో, మాత్రము తెలియదు. ఆ పాపాన్ని ఈ జన్మలో అనుభవించాల్సిందే. కానీ అన్ని మతములలోనూ నరకలోకం, స్వర్గలోకం ఉన్నాయి అని చెప్పుకున్నారు. నరకలోకములో చేసిన పాపాలకు, నానా తిప్పలుపడి అనుభవించి వస్తారని, చాలా వ్రాసుకున్నారు, చెప్పుకున్నారు. కానీ ఆ లోకాలు అనేవి అసలు లేనేలేవు. ఇప్పుడు నిన్ను ఎవరైనా కొట్టాలంటే కనీసం పదిమంది గుమిగూడి కొట్టాలి. మరి రోజూ చనిపోతున్న ఇంతమందిని కొట్టాలంటే ఎంతమంది యమలోక జనాభా కావాలి. యమలోకము భూలోకంకంటే చాలా పెద్దదై ఉండాలి. వాస్తవంగా ఉండేది ఒక్క లోకమే. అన్నింటినీ ఇందులోనే ఇరికించాడు దేవుడు. మీకు ఎవ్వరికీ తెలియకుండా యమలోకాన్ని, స్వర్గలోకాన్ని అన్నింటినీ ఈ లోకంలోనే ఇరికించి అమర్చినాడు.

ఏవైతే శిక్షలు నరకలోకంలో ఉంటాయని చెప్పుకున్నారో, ఆ శిక్షలన్నీ ఇక్కడే భూమి మీదనే అనుభవిస్తునారు. మనుషులు ఏదైతే సుఖములైన స్వర్గం ఉంది అని అనుకున్నారో, దానిని ఇక్కడే ఈ భూమిమీదనే అనుభవిస్తున్నారు. కథల రూపములో స్వర్గ నరకములు ఎక్కడో జరుగుచున్నా యని చెప్పుకున్నా వాస్తవంగా ఇక్కడే జరుగుచున్నాయి. ముందు జన్మలో ఎంత పెద్దవాడు అయినాగానీ ఈ జన్మలో నీచాతి నీచంగా బ్రతకవలసిన పని వస్తున్నది. తిండిలేక బ్రతికే వారిని, ఇంకా చాలా రకములైన బాధలను అనుభవిస్తున్న వారిని మనము చూస్తూ ఉన్నాము. దీనికంతటికీ పాపకర్మయే కారణం. భూమిమీద కష్టాలు అనుభవించే వారే కాకుండా, సుఖాలు అనుభవించేవారు ఉన్నారు. ఇదంతా ఈ జన్మలో ప్రారబ్ధము అనే కర్మనుండి అనుభవిస్తున్నాము. ఇది ఎప్పటిది, అంటే గత జన్మలో చేసుకున్న పాపపుణ్య

కర్మలు. ఒక జన్మలో దగ్గర దగ్గర 60 సంవత్సరాలలో సంపాదించుకున్న సంచితకర్మ ప్రారబ్ధంగా మారిపోతుంది. ఈ 60 సంవత్సరాలు ఒక జన్మలో బ్రతుకకపోతే, ఈ జన్మలో 40 సంవత్సరాలే బ్రతికితే, ఇప్పుడు 20 సంవత్సరాలు దానికి కలిసి అరవై అయిపోయి, ఆగామికర్మనుండి సంచితం తయారై ప్రారబ్ధం అవుతుంది. అందువలన కర్మల వలన జన్మలు ఏర్పడుచున్నాయి.

ఏ పని చేస్తే ఎంత పాపము వస్తుంది, ఎంత పుణ్యం వస్తుంది అని మాత్రము ఎవ్వరమూ చెప్పలేము అని ఇంతకు ముందే చెప్పాము. అయితే ప్రారబ్ద కర్మప్రకారము మనిషి కష్టసుఖాలు అనుభవించేటట్లు చేయడమే దేవుని పని. అయితే మరి ఆనందం కూడా కలగాలి కదా! మరి ఎట్లు అది లభ్యమవుతుంది? ఆనందం అనేది కర్మకు సంబంధించినది కాదు. కష్ట సుఖాలకు అతీతమైనది ఆనందం. కష్టం మరియు సుఖంలో కూడా కళ్ళలో నీళ్ళు వస్తాయి కానీ ఆనందం అనే విషయంలో వచ్చే కన్నీళ్ళు కర్మలకు సంబంధం లేకుండా ఉంటాయి. అయితే ఆనందము అనేది మనిషి ఎట్లు పొందుతాడు అంటే దేవుడు నీ శరీరాన్ని ఎప్పుడైతే ఇచ్చాడో అప్పుడే జ్ఞానము, అజ్ఞానము అనే రెండూ భాగాలు ఉంచాడు. ఒక ఫలాన్ని (పండును) ఇచ్చినప్పుడు దాంట్లో తీపిలేని భాగము, తీపి ఉన్న భాగము రెండు ఉన్నాయి. ఒక కాయ ఇచ్చాము. ఆ కాయ ఒక ప్రక్క మాగి ఉంది. రెండవ ప్రక్క మాగలేదు. మాగిన వైపు తీయగా ఉంది. మాగని వైపు పుల్లగా ఉంది. అదే విధముగా నీ కర్మయున్నది. నీ పట్టికలో ప్రారబ్ధము అమర్చబడుతున్నది. ఆ ప్రారబ్ద కర్మయంతయు 12 భాగములుగా విభజింపబడినది. ఈ పన్నెండు భాగములలో ఆరు భాగములు అనగా సగభాగం ఆనందము నకు సంబంధించినది. అంటే

కర్మపత్రంలోకి ఎక్కించలేదు గానీ, నీకు అవకాశము ఒకటి ఇచ్చినాడు. మిగతా ఆరు భాగములు నీవు అనుభవించాల్సినది. ఇవి పై ఆరు భాగములకు వ్యతిరేఖమై ఉన్నవి అని చెప్పాడు. నీకు ధనం కలుగుతుంది అని, ధనికుడవు అగుదువని నీ జాపథకములో (జాతకంలో) ఉంటే, దానికి వ్యతిరేఖమైన భాగము ఆ కర్మచక్రములోనే ఉంటుంది. ధనం లేకుండా ఉండటం అనే భాగము అన్నమాట. అయితే నీవు ధనికుడివి అవుతావా? బీదవానివి అవుతావా? అని ప్రశ్నించుకుని చూస్తే నీ జ్యోతిష్యములో తెలియును. జ్యోతి అనగా దీపం అని అర్థము. వెలుగు అని అర్థము. **"జ్యోతిశాస్త్రం"** అని దానిపేరు. దానినే జ్యోతిష్య శాస్త్రం అని "ష్య" అనే అక్షరాన్ని కలిపారు. దాని ప్రకారం చూస్తే ధనం కలుగుతుంది అని తెలియును. అయితే అది ప్రపంచ ధనమైనా కావచ్చు, పరమాత్మ ధనమైనా కావచ్చు. ప్రపంచ ధనం వలన నీకు సుఖం వస్తుంది. పరమాత్మ ధనం వలన **ఆనందం** వస్తుంది.

స్థూలమైన ఆస్తి కొరకు నీ బుద్ధిని మళ్ళించుకుంటే, స్థూలమైన ఆస్తులే వస్తాయి. సూక్ష్మమైన జ్ఞాన ఆస్తులవైపు బుద్ధిని మళ్ళిస్తే వెంటనే నీకు సూక్ష్మమైన జ్ఞానధనం లభిస్తుంది. ఈ విధంగా ప్రపంచమునకు వ్యతిరేఖముగా దైవికము కలదు. దైవిక సంబంధ విషయాలలోకి వెళ్ళేందుకు దేవుడు నీకు అవకాశం, స్వేచ్ఛ ఇచ్చాడు. ప్రతీ వ్యక్తికి ఆ అవకాశం ఉంది. కాబట్టి దైవికంగా నీవు ఏది అనుకున్నా నీవు ముందంజలో వెళ్ళవచ్చు. ప్రారబ్ధకర్మలోనే ఈ అవకాశాన్ని దేవుడు కల్పించాడు. నీవు ఎంత శ్రద్ధ పెట్టుకుంటే అంత జ్ఞానము నీకు లభ్యమవుతుంది. రెండు భాగములలో నీవు ఏ భాగపు చోటుకి వెళ్తావో నీ ఇష్టం. **"ఎవ్వరి కర్మపత్రం వారే చూసుకునే రోజు వస్తుంది"** ఈ వాక్యం ఖురాన్ గ్రంథములో వ్రాయబడి ఉంది. మనకు

ఆగామిక కర్మ, సంచిత కర్మలు ఉన్ననూ, అవి ఉన్నట్లు తెలియటం లేదు. కానీ ప్రారబ్ధము మాత్రము అనుభవిస్తున్నాము. కనుక కర్మను తెలియుటకు అవకాశము ఉన్నది. ప్రారబ్ధంలో ఏమి జరగాలో ఆ కర్మకు వ్యతిరేఖంగా జరిగే విభాగం కూడా అందులో ఉన్నది. ఎప్పుడైతే నీవు శరీరములోకి ప్రవేశిస్తున్నావో అంటే అంగములోకి ప్రవేశిస్తున్నావో, శరీరమునే అంగము అంటున్నాము. అంగము అంటే శరీరము. అంగి అంటే శరీరమును ధరించినది, ధరించువాడు. అంగి అనేదే కాకుండా అర్ధాంగి అనేది కూడా ఉంది. అర్ధాంగి అంటే సగం ధరించబడినది అని అర్థము. మన వాళ్ళంతా అర్ధాంగి అంటే శరీరములో సగం హక్కు కలిగినది అని అర్థము చెప్పుకున్నారు. ఇక ఆధ్యాత్మికంగా అర్థము కావటం కొరకు ఒక బొమ్మను గీసి సగం పురుషునిగా (ఈశ్వరునిగా), సగం ప్రకృతిగా (స్త్రీతత్త్వంగా) ఉండేటట్లు ఆ బొమ్మను వేశారు.

అందులో సగం పురుషునికి వ్యతిరేఖంగా, స్త్రీతత్త్వం ప్రక్కనే ఆ బొమ్మలోనే కనిపిస్తున్నది. దానినే **'అర్ధనారీశ్వరుడు'** అని పేరుపెట్టినారు. ఈ విషయం నీ శరీరములో కూడా ఉంది. ప్రారబ్ధంలో ఉండేది ప్రపంచ వరంగా ఉన్నదానికి (అనుభవించేందుకు) వ్యతిరేఖంగా పరమాత్మకు సంబంధించినదిగా ఉంది. అంటే దైవిక భాగం ఆరు భాగాలుగా ఏడవ స్థానం నుండి ఉంది. మిగతా ఆరు భాగాలు ప్రపంచవరమైనవిగా ఉన్నాయి. అంటే జన్మలో నీవు ఎప్పుడైతే అంగివి అయినావో (శరీరం ధరించావో) అప్పుడే నీకు అర్ధాంగి కరచుకుని ఉంది (వ్యతిరేఖ భాగం, దైవికానికి). శరీరము ఆడైనా, మగైనా సరే! ఉదాహరణకు నీకు ధనం లభ్యమయ్యేది ఉంటే, నీ శ్రద్ధనుబట్టి చూస్తే నీకు ప్రపంచ ధనం లభించవచ్చు లేక జ్ఞాన ధనం లభించవచ్చు. అది ఎలా లభిస్తుంది అంటే నీ శ్రద్ధను

అనుసరించి లభిస్తుంది. కర్మ మీద ఆధారపడి మాత్రము ఉండదు. ఆ జ్ఞానధన లభ్యత అని ముందునుండే మనము చెప్పు కుంటున్నాము. కనుక జ్ఞానాన్ని (పరమాత్మ జ్ఞానం) సంపాదించాలంటే ఎవ్వరూ ఏమీ చెయ్యనక్కర లేదు గానీ, శ్రద్ధను నీ అంతట నీవు పెంచుకుంటే చాలు. అంతేగానీ ఇతరుల దగ్గర తీసుకునేది కాదు. అంగట్లో కొనేదీ కాదు. శ్రద్ధ లేదు అంటే నీవు దానికి వ్యతిరేఖ దిశలో ఉంటావు. అదే అర్ధాంగిగా ఉంటావు. లేదు దైవికంగా నాకు శ్రద్ధ ఉంది అంటే అంగిలోకి వెళ్తావు. అంగిలో ఉంటావా? అర్ధాంగిలో ఇరుక్కుంటావో చూచుకో! ఇదేమి అంగి, అర్ధాంగి గూర్చి ఇతను క్రొత్తగా చెప్పుచున్నాడు అని అనుకోవద్దండి.

ఈ విధంగా మీరు అంగిలోకి వెళ్తే మీకు **ఆనందం** లభిస్తుంది. నీవు జ్ఞానం గురించి మాట్లాడు. నీ కళ్ళ వెంబడి నీళ్ళు వస్తాయో రావో చూసుకో! వచ్చాయి అనుకో, ఇది నిజమైన జ్ఞానము అనుకో. రాలేదు అనుకోండి ఇది నిజమైన జ్ఞానం కాదు అనుకో. మీలో కూడా చాలామందికి ఆనంద భాష్పాలు వస్తుంటే మేము కూడా చూశాము. మాకు కూడా జ్ఞానము చెప్తున్నా, వింటున్నా ఆనంద భాష్పాలు వస్తూ ఉంటాయి. అటువంటి జ్ఞానవరమైన శ్రద్ధ మీకు కలిగితే జీవితాన్ని సాఫల్యం చేసుకుంటారు. ఈ విధముగా సాఫల్యం చెందేందుకు దేవుడు మంచి అవకాశాన్ని ఇచ్చాడు. దేవుడు నీకు అటువంటి అమరిక పెట్టాడు. జ్ఞానం ఎట్లు లభిస్తుంది అంటే శ్రద్ధ వలననే లభిస్తుంది. కర్మచక్రంలో ప్రపంచ కర్మ బంధింపబడి ఉంది. ఆ విధంగా బంధింపబడి జీవులుగా మనము ఉన్నాము కదా! మనకు స్వతంత్రము లేదు కదా! అంటే అట్లాకాదు. దేవుడు స్వాతంత్ర్యాన్ని కూడా ఇచ్చాడు. కర్మ అనే దానిని పెడుతూ, దానికి వ్యతిరేఖ మైన దానిని కూడా పెట్టాడు. నీకు (ఆడైనా, మగైనా) వ్యతిరేఖమైనది

వ్యతిరేఖమైనదే. దీనిని బయటకు ఉదాహరణగా చూపించేందుకు భర్త, భార్యను పెట్టాడు. భార్యను అర్ధాంగి అన్నాడు. అంటే నీకు వ్యతిరేఖం అని అర్థము. అందుకే భార్య నేను అర్ధాంగిని కానా, నాకు సగం హక్కు ఉంది అని అంటుంది. అందుకే అర్ధాంగి నీకు వ్యతిరేఖంగా ఉన్నట్లే కనిపిస్తూవుంటుంది.

అట్లాగే జాతకచక్రంలో కూడా దేవుడు, ప్రపంచవరమైన దానిని అంతటినీ అర్ధాంగిగా పెట్టి, నీకు మాత్రము 'అంగి'గా పెట్టినాడు. నీవు నీ భార్య (వ్యతిరేఖ విభాగం) మాట వింటానంటే, నిన్నెవరూ వద్దనరు. అంటే నీ కర్మపత్రంలో, బయట కాదు. అంటే కర్మచక్రంలో ఎలాగ ఉంటే అలాగే నడవాలంటే అలాగే పో, లేదు, కర్మలను వ్యతిరేఖిస్తాను అంటే వ్యతిరేఖించు. అట్లా వ్యతిరేఖించేందుకు నీకు అవకాశము ఉంది. అందుకే మనిషి కర్మను అతిక్రమించగలడు అని ఉంది. 'నేను దైవమార్గములో వెళ్తాను' అని అనుకో. అప్పుడు నీ శరీరములో అర్ధాంగి అడ్డుపడుతుంది. మీరు భార్యలు గురించి చెప్తున్నాము అని అనుకోవద్దండి. మేము బయట భార్యలు (ఆడవారు) గురించి చెప్పటం లేదు. లోపల అర్ధాంగి గురించి చెప్తున్నాము. లోపలున్న కర్మ ఒక ప్రక్క నిన్ను లాగేస్తూ ఉంటుంది. దానిని తప్పించుకో. అలా తప్పించుకోగలిగితే నీవు కర్మను జయించినట్లే. ఎక్కడ జ్ఞానము ప్రారంభం అవుతున్నదో అక్కడే అజ్ఞానము ప్రారంభమవుతున్నది. ఈ విధంగా జ్ఞానాన్ని తెలుసుకునేందుకు అవకాశంగా పెళ్ళి తంతులో ఆ జ్ఞానాన్ని అంతటినీ పూర్వపు పెద్దలు అమర్చారు. పెళ్ళిలో ప్రతీ కార్యక్రమం జ్ఞానంతో ఇమిడి ఉన్నట్లు చేశారు. వాటిని జ్ఞాపకం చేస్తూ పెళ్ళి కార్యక్రమాన్ని జరిపించేవారు. అప్పటినుండి భార్యకు భర్త, భర్తకు భార్య తోడవుతారు. అప్పుడు భార్య అర్ధాంగిగా అవుతుంది. నీ శరీరములో నాకు సగం హక్కు ఉంది అని అంటుంది, కానీ అది కాదు అసలు విషయం.

పెళ్ళిలో ఒకరికొకరు ప్రమాణం చేసుకుంటారు. నా భార్యకు జ్ఞానము లేకపోతే నేను చెప్తాను అని భర్త, నా భర్తకు జ్ఞానము లేకపోతే నేను చెప్తానని భార్య అనుకోవాలి. అదే విషయాన్ని ప్రమాణం చేసే పెళ్ళిలో ఒక తంతు ఉంటుంది. అందుకు ప్రతీ మనిషి అంగి భాగములోకి పోవాలి. తన కర్మలో ఉన్న అర్ధాంగి భాగములోకి వెళ్ళకుండా ఉంటేచాలు. అది ఎలాగా అంటే కర్మకు వ్యతిరేఖ భావము ఉంటే చాలు. నీవు దైవికం వైపు వస్తావు. అప్పుడు నీకు ఆనందం లభిస్తుంది. అంతవరకు నీకు ఆనందం లభించనట్లే! నువ్వు ఇంతవరకు అనుభవించింది సుఖమేకానీ, ఆనందము కాదు. ఆనందము పొందాలంటే ఆత్మవైపు నుండే లభ్యమవు తుంది. అందుకే మేము **"జ్యోతిష్య శాస్త్రం"** అనే గ్రంథాన్ని వ్రాయ బోతున్నాము. అందులో అంగి, అర్ధాంగి భాగాలు నీ కర్మలో ఉన్నాయి అని చెప్పాము. కర్మలు ఆధ్యాత్మికతలో ఒక భాగము. కావున ఆ గ్రంథము వ్రాయవలసి వచ్చింది. జ్యోతి అంటే దీపము అని అర్థము. దీపం ఉన్నంతసేపు వెలుగు వస్తుంది. వెలుగు ఎక్కడనుండి వస్తోంది అని అంటే, దీపమునుండే వస్తున్నది అని చెప్తాము.

కానీ దీపం అగ్ని నుండి వస్తున్నది అని చెప్పవచ్చును. అగ్నిని ఎవరైనా చూశారా అంటే, దీపం అగ్నే కదా! అంటారు. కానీ దీపం వేరు అగ్ని వేరు. దీపం వలన వెలుగు వస్తున్నది, కానీ దీపం వెలిగేది మాత్రము అగ్ని వలన. ఇంకా ఉదాహరణ చెప్పుకుంటే, శక్తి ఉంది, శక్తి ఎవరిది ప్రకృతిది. ప్రకృతి ద్వారా శక్తి వస్తున్నది. కానీ శక్తి ఎవరిది అంటే శక్తి దేవునిది. దేవుని శక్తి ప్రకృతి ద్వారా ప్రకటితమవుతున్నది. ప్రకృతి కనిపిస్తున్నది దేవుడు కనిపించటం లేదు. జ్ఞానం ఉంది, చెప్పే బోధకుడు కనిపిస్తున్నాడు కానీ ఆ జ్ఞానంగల గురువు మాత్రము కనిపించడు. గురువు యొక్క జ్ఞానము బోధకుని ద్వారా లభ్యమవుతూ ఉన్నది. వెలుగు కూడా

దీపం ద్వారా కనిపించినా, వాస్తవంగా వెలుగు అగ్నిదే. అయితే అగ్ని కనిపించటం లేదు, కానీ దీపం కనిపిస్తూ ఉన్నది. అదేమి, మండే నిప్పును, అగ్నిని చూస్తున్నాము కదా! అని ప్రశ్నిస్తే దానికి ఇలా చెప్పుచున్నాము. ఎక్కడయినా ఒకచోట అగ్ని లేకుండా మంటలు మండుతున్నాంది. కొందరికి శరీరములు వాటంతట అవే అంటుకుంటున్నాయి, మండిపోతున్నాయి. శరీరమునుండి ఆ మంటలు ఎట్లా వస్తున్నాయో ఇంతవరకు తెలియదు. అటువంటి సంఘటనలు చాలా జరిగాయి. ఈ **దీపం** గురించి సమాచారం కావాలంటే **"మన పండుగలు"** అనే గ్రంథములో సమగ్ర సమాచారం ఉంది. దానిని ఈ మధ్యనే మరలా ఆ గ్రంథములో కలిపాము దానిని చదువగలరు. కనుక **ఆనందం వేరు, సుఖం వేరు** అనే విషయం తెలిసింది. కర్మకు వ్యతిరేఖంగా వెళ్ళేందుకు కొద్దిగా ప్రయత్నించండి. **"ఆనందాన్ని ఆత్మ ద్వారానే పొందగలరు"** అని చెప్పుచూ ముగిస్తున్నాము.

## 68. దశ దిశలు

**(తేది : 17.11.2013)**

భగవద్గీతలో 'విశ్వరూప సందర్శన యోగము' అనే అధ్యాయములో విశ్వరూపాన్ని చూచిన తరువాత అర్జునుడు కొన్ని మాటలు చెప్పాడు. నీవు విశ్వమంతా వ్యాపించినవాడివి, అణువణువునా నీవు ఉన్నావు అంటూ నమస్కరిస్తున్నాను అనుచు **"మ్రొక్కువాడ ముందుకు మ్రొక్కువాడ వెనుకకు, మ్రొక్కు వాడు సర్వదిక్కులకు"** అని చెప్పాడు. ఈ విషయాన్ని మనం ఏ విధంగా అర్థము చేసుకోవాలి. సర్వదిక్కులకూ మ్రొక్కుతున్నాను అంటే అయిపోయింది కదా! మరి వెనుకకు, ముందుకు అని అనటం ఎందుకు

అని ఆలోచిస్తే, సర్వదిక్కులకు అంటే ఎనిమిది దిక్కులు. మరల ముందుకు వెనుకకు కలిపి పది (10) దిక్కులని అర్థము. అదేమిటి? ముందుకు, వెనుకకు కూడా దిక్కులు కావా? దిక్కులు ముందుకు, వెనకకు ఉన్నాయి కదా! వాటితో కలిపే ఎనిమిది కదా! అని సందేహం రావచ్చు. అందుకు మనము కొంత యోచిస్తే, మన పెద్దలు ఒకమాట అన్నారు. అదేమంటే **"దశ దిశలు"** అంటే పది దిశలు అనే కదా! అర్థము. "దశదిశలూ వ్యాపించినవాడు దేవుడు" అని మనము కూడా చాలాసార్లు చెప్పుకున్నాము. అదేమిటి ఉండేవి ఎనిమిది దిశలే కదా! అంటే ఇక్కడే మనము అర్థము చేసుకోవాలి. సర్వదిక్కులా మరియు పైన, క్రిందనూ కూడా దేవున్ని మ్రొక్కుతున్నాము. ముందు, వెనకలను అనగా క్రింద మరియు పైన అని అర్థము చేసుకోవాలి. నా ముందర పైకి కనిపించే వాడివై ఉన్న నిన్ను మరియు వెనుకగా అనగా క్రిందికి ఉన్న నిన్ను కూడా మ్రొక్కుచున్నాను. అంటే ఎనిమిది దిశలు+పైకి+క్రింద మొత్తం పది దిశలు ఉన్నట్లు అర్థమయింది కదా! ఒకమారు పడుకొని చూడండి అర్థమవుతుంది. సరే ఈ పది దిశలతో మనకేంటి సంబంధం, అంటే దానికి సమాధానముగా మనమందరము కర్మ చేసుకుని పుట్టాము అని చెప్పవచ్చును. కర్మే మన చుట్టు ఉన్నదని కూడా చెప్పవచ్చును.

మనిషి జన్మించి అనుభవించే కర్మను ప్రారబ్ధము అంటాము. ప్రారబ్ధకర్మ అనుభవిస్తూ ఉంటే అది అయిపోతూ ఉంటుంది. అంటే ఈ జన్మకు ఎంత కేటాయించబడిందో అంతా అయిపోతుంది. అప్పుడు మరణం సంభవిస్తుంది. మరణం సంభవించేలోపల, మరలా తెలియని కర్మను, మరలా సంపాదిస్తున్నాము. ఏ కర్మను మనము అనుభవిస్తున్నాము. ఏ కర్మను మరలా సంపాదిస్తున్నాము అని తెలియదు. కర్మ అనేది సూక్ష్మం.

కంటికి కనిపించనిది. బయట సంపాదించేది స్థూలమైన విషయాలు ఉండవచ్చు. అంటే ఒక పనిచేస్తే డబ్బు రూపంలో స్థూలంగా కనిపించవచ్చు. అది కంటికి కనిపించే ఫలితము. కంటికి కనిపించకుండా ఆ కార్యములో (పనిలో) వచ్చే ఫలితము మాత్రము తెలియదు. దానిని చెప్పుకొనినా నమ్మకమేగానీ, ప్రత్యక్షంగా ఎవరూ చూడలేదు. నమ్మకముతో అది తెలుసు అంటున్నారు గానీ, కొందరు పూర్తిగా నమ్మటం లేదు. దానినే 'కర్మ' అంటాము. ఆ కర్మనే 'ఆగామి కర్మ' అంటున్నాము. సంపాదించుకునే కర్మను ఆగామి కర్మ అనీ, అనుభవించే కర్మను ప్రారబ్ధకర్మ అని తెలియవలెను. ఆగామి కర్మను సంపాదిస్తూ, ప్రారబ్ధకర్మను అయిపోయేటట్లు చేసుకుంటున్నాము. ఆ కర్మను అనుభవిస్తూ కొంత కాలానికి మరణిస్తాము. ఈ జన్మలో సంపాదించిన ఆగామికర్మను అనుభవించేందుకు మరలా జన్మించాల్సిన పని వస్తున్నది. నీవు ఆ విధంగా ఆగామి కర్మను సంపాదించు కోకపోతే, నీవు జన్మించాల్సిన అవసరము ఉండదు. కానీ మనిషి తనకు తెలియకుండా 'పాపము, పుణ్యము' అనే కర్మను సంపాదించుకుంటున్నాడు. అయితే సంపాదించే ఫలితము గురించిగానీ, అనుభవించే ఫలితాన్నిగానీ మనిషి ఎరుగడు.

మనం ఈ జన్మలో ఏ విధంగా బ్రతకాలి అనేది అందులోనే అనగా ప్రారబ్ధకర్మలోనే ఉంటుంది. ఒక మనిషి మంత్రిగా ఉన్నాడంటే అతని కర్మప్రకారమే ఆ విధముగా జరిగింది. అతను స్వయంగా తన బుద్ధితో ఏమీ సంపాదించుకోలేదు. అదే విధంగా ప్రతీ జీవరాశికీ, ప్రతీ వ్యక్తికి కర్మ ముందే నిర్ణయించబడి ఉన్నది. అదే కార్యరూపములో కనిపిస్తున్నది. ఈ సూత్రాన్ని ఎవరూ మరచిపోకూడదు. కర్మలో సంపాదించుకున్నది, కార్యముల రూపంలో అనుభవించే వాటిలో, ఏవైనా తప్పించుకునేందుకు

ఎవ్వరికీ అవకాశం లేదు. అందుకే మన పెద్దలు "కర్మలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులైనా అనుభవించి తీరాల్సిందే" అని చెప్పారు. అయితే ఆ వ్యక్తి ఏ కర్మను కార్యముల (పనుల) రూపంలో అనుభవించేందుకు అవకాశము ఉంది అని తెలుసుకునేందుకు ఒక శాస్త్రం ఉంది. అదే **"జ్యోతిష్యశాస్త్రము",** ముందు దాని పేరు 'జ్యోతి శాస్త్రం' అని ఉండేది. కాలక్రమేపీ అది 'జ్యోతిష్య శాస్త్రము' అయింది. జ్యోతిశాస్త్రములో జ్యోతి అంటే దీపం అని అర్థము. అనగా వెలుగు అని అర్థము. దీపం పట్టుకుంటే చీకట్లో ఏ వస్తువులున్నాయో తెలుస్తుంది. అందుకే పూర్వం పెద్దలు భవిష్యత్తు అంధకారం అని అన్నారు. ఎందుకంటే ఒకక్షణం తర్వాత ఏమి జరుగు తుందో చెప్పలేము. అయినా నీ జీవితం గురించి తెలుసుకోవాలంటే, చీకటికి దీపం ఉన్నట్లు, నీ అంధకార భవిష్యత్తుకు ఒక వెలుగు అవసరము, వెలుగును ఇచ్చే జ్ఞానము అనే దీపం కావాలి. బయట దీపాలు ఏవీ పనికి రావు. బయట దీపాలు స్థూలమైన వాటిని చూపగలవు. కానీ సూక్ష్మమైన కర్మను చూపుటకు **జ్ఞానజ్యోతి** కావాలి. తద్వారా సూక్ష్మమైన కర్మను చూడగలవు. దీనిద్వారా దేవుడు తెలియబడడు కానీ నీ భవిష్యత్తు మాత్రము తెలుస్తుంది. కావున దీనిని బ్రహ్మవిద్యా శాస్త్రం అని అనకుండా జ్యోతి శాస్త్రము అని అన్నారు. అదే జ్యోతిష్య శాస్త్రంగా తరువాత మారిపోయింది. పూర్వం పెద్దలు తెలుగు భాషలో ప్రతీ పదాన్ని అర్థము వచ్చే విధంగానే అమర్చినారు.

కొందరు నన్ను మీరు జ్యోతిష్యశాస్త్రాన్నే పేరు మార్చి జ్యోతిశాస్త్రం అంటున్నారు. మీరు మరోమతం గురించి బోధిస్తున్నారు అని అంటున్నారు. ఈ జ్యోతిష్యశాస్త్రాన్ని ముస్లీమ్స్ నమ్మరు, క్రిస్టియన్స్ నమ్మరు. మరి ఇతర మతంలో జ్యోతిష్యం లేనట్లే కదా! మేము హిందూమతంలో ఉన్న జ్యోతిష్యంను

పూర్వం జ్యోతిష్య శాస్త్రం అని అనేవారంటే వేరే మతంలో ఉన్నది చెప్తున్నారు అని ఎందుకు నన్ను అంటున్నారు. మేము హిందువులం అని గట్టిగా చెప్తున్న వారెవరికీ హిందూ ధర్మముల గురించి తెలియదు. వారు అజ్ఞానము లోకే వెళ్ళాలనుకుంటున్నారు తప్ప, జ్ఞానమార్గానికి రావాలనుకోవటం లేదు. సరే నేను చెప్పే జ్ఞానమును అర్థము చేసుకోవడానికి మీరు కొంతమంది ఉన్నారు. కొందరు ఆ విధంగా భవిష్యత్తును గురించి తెలుసుకోవడానికి ఈ జ్యోతిశాస్త్రాన్ని ఉపయోగించే వారు. ప్రపంచములో మనకు షట్ శాస్త్రాలున్నాయి. వాటిలో పెద్దదైనది బ్రహ్మవిద్యా శాస్త్రము. బ్రహ్మ అంటే గొప్పది లేక పెద్దది అని అర్థము. అది కాకుండా ఐదు శాస్త్రములున్నాయి. అందులో ఒకటి జ్యోతిశాస్త్రం. మిగిలినవి గణిత, ఖగోళ, రసాయన, భౌతిక శాస్త్రాలు.

ఈ నాలుగు శాస్త్రాలలో మనిషి పరిశోధన బాగా జరిగింది. వాటి ఫలితాలను మనము అనుభవిస్తున్నాము. కానీ పరిశోధన లేకుండా విడిచిపెట్టినవి బ్రహ్మవిద్యా శాస్త్రం మరియు జ్యోతిష్య శాస్త్రం. బ్రహ్మ విద్యా శాస్త్రం అంతా సూక్ష్మంగా ఉంటుంది. కనుక దానిని పరిశోధన చేయక పోయినా, బయటకు స్థూలముగా కనిపిస్తున్న ఈ జ్యోతిష్య శాస్త్రం పైన కూడా ఎవరూ పరిశోధన చేయలేదు, సరికదా దీనిని మూఢనమ్మకం అని కూడా అంటున్నారు. జ్యోతిష్యము శాస్త్రము కాదు అంటున్నారు. ఆ విధంగా అనుకోవటం వలన మిగిలినవి నాలుగు శాస్త్రాలే అవుతున్నాయి. జ్యోతిష్యం శాస్త్రమే అనేదానికి హిందూమతములో కొంత ఆధారము కనిపిస్తున్నది. **తిథి, వార, నక్షత్రాలు** చూడటం. **నవగ్రహాలు** అని చెప్పటం వాటికి పూజ చేయటంలాంటివి. కనుక, వేరే మతస్థులంతా ఆ జ్యోతిష్యం ఒక్క మతానికి సంబంధించినదిగా ఊహించుకున్నారు. కొందరు

హిందువులే దానిని మూఢనమ్మకం అని కొట్టి పారేస్తున్నారు. మూఢనమ్మకం అనే దానిని కూడా నీవు పరిశోధన చేసి చూపించు. అది మూఢనమ్మకమే నని చెప్పడానికి గానీ, కాదు అని అనేదానికైనా గానీ శాస్త్రబద్ధత ఉండాలి. అలా లేకుండా అంటే అది గ్రుడ్డినమ్మకం అవుతుంది. అది మూఢనమ్మకము అనే అంటే, దానిని నీవు పరిశోధించి, అది మూఢనమ్మకము అని నీవు చూపలేకపోతే, నీది అప్పుడు గ్రుడ్డినమ్మకం అవుతుంది. ఎక్కడా ఏ నాగరికతా లేని రోజుల్లో శాస్త్రాలన్నీ భారతదేశములోనే పుట్టాయి. ఈ జ్యోతిష్యం అనే శాస్త్రం కూడా ప్రపంచమంతా ప్రాకిపోయింది. అందుకే **ఆదివారం, సోమవారం, మంగళవారం** అని వారం పేర్లు చెప్పుచున్నాము. ఆదివారము సూర్యుని దినమని, సోమవారం చంద్రుని దినమని చెప్పు కుంటున్నట్లుగానే, మిగతా దేశాలలో కూడా వాటి వరుస తప్పకుండా సన్‌డే, మూన్‌డే అని వారు కూడా చెప్పుకుంటున్నారంటే మన నాగరికత అక్కడకు ప్రాకినట్లే కదా! మన నాగరికతను వారు ఒప్పుకున్నట్లే కదా! అలా అయితే వారు కూడా జ్యోతిష్య శాస్త్రాన్ని ఒప్పుకున్నట్లే!

పూర్వపు పెద్దలు ఈ జ్యోతిష్య శాస్త్రం పైన సంపూర్ణంగా పరిశోధించక పోయినా, కొంతలో కొంత పరిశోధన చేసి కొన్ని విషయాలు చెప్పినారు. కాని కొంత కాలానికి జ్యోతిష్యం చెప్పేవారంతా జ్యోతిష్యులు అని పేరు పెట్టుకుని, ఈ జ్యోతిష్యాన్ని రకరకాలుగా చెప్పేటట్లు చేశారు. ముఖం చూసి చెప్పేవారు, పేరు చూసి చెప్పేవారు కొందరు. పేరులో అక్షరాలు చూసి చెప్పేవారు కొందరు. కంప్యూటర్‌తో టీవీలలో కూడా జ్యోతిష్యాన్ని చెప్పేవారు తయారయినారు. కానీ మేము ఏమి చెప్తున్నామంటే జ్యోతిష్యం చెప్పే విధానం ఒక్కటే ఉండును. అనేక విధానాలు ఉండవు. మేము బ్రహ్మవిద్యా శాస్త్రమును చెప్పేవారమే అయినప్పటికీ, జ్యోతిష్య

శాస్త్రాన్ని బహిర్గతం చేయాలని అనుకుంటున్నాము. అందుకే మేము **"జ్యోతి శాస్త్రము"** అనే పేరుతో గ్రంథాన్ని వ్రాశాము. ఈ గ్రంథం మొదటి పేజీలో "ష్య" అనే పదము ఒక విధమైన రంగుతో ఉంది, మిగతా జ్యోతి శాస్త్రము అనేది ఇంకొక రంగుతో ఉండేటట్లు ప్రింట్ చేయించాము. ఎందుకనగా! జ్యోతిష్య అనే పదములో "ష్య" అనేది తరువాత చేర్చబడింది.

మన శరీరములో కర్మచక్రము 12 భాగములుగా ఉంది. గుణ చక్రము మూడు భాగములు కలదు. ఇంకా పోతే కాలచక్రము కూడా 12 భాగములు అని తెలుసు. 12 భాగాల కాలచక్రములో గ్రహములు కలవు. మనము ఇంత వరకు నవగ్రహాలు అనే తొమ్మిది గ్రహలను గురించి చెప్పాము. ఇప్పుడు మేము ఏమి చెప్తున్నామంటే, ఇప్పటి వరకు మనకు తెలిసినవి గ్రహాలు తొమ్మిదే, కానీ 12 గ్రహములు ఉన్నాయి అని చెప్పు చున్నాము. ఇక్కడ నాకు పరమానంద శిష్యుల కథ గుర్తుకు వస్తున్నది. స్నానానికి నదిలోనికి దిగిన శిష్యులు వారిని లెక్క పెట్టుకుంటూ, లెక్కపెట్టే వాడు తనను లెక్క పెట్టకుండా మిగతా వారిని లెక్క పెట్టుకోవటం వలన, ఒకరు తక్కువగా కనిపించటం వలన, ఎవరో నీటిలో మునిగిపోయి చనిపోయారని ఏడ్చుచున్నారంట! అదే విధముగా భూమి అనేది ఒక గ్రహం అని అందరికీ తెలుసు. సూర్యకుటుంబములో ఇది ఒక గ్రహం. ఈ గ్రహం మీదనే మనముంటూ దీనిని లెక్కబెట్టుకోలేదు. భూమిని లెక్క వేసుకుంటే పది అగును. భూమి కాకుండా **'చిత్ర, మిత్ర'** అని ఇంకా రెండు గ్రహములు కలవు. ఈ గ్రహాల గురించి ఎవరూ చెప్పలేదే అంటే తెలిస్తే చెప్పేవారే, తెలియలేదు కాబట్టి చెప్పలేదు. ఒక రూపాయి నాణెం క్రిందపడిపోతే ఎవరికీ కనిపించలేదు, నాకు కనిపించింది తీశాను. ఆ విధంగా శాస్త్రాన్ని పరిశోధిస్తే కాల, కర్మ చక్రాలు 12 భాగాలుగా ఎట్లు

ఉన్నాయో, అట్లాగే గ్రహములు కూడా 12 భాగములు కలవు. ఇందులో ఒకటి చీకటి గ్రహము. ఇది ఎవరికీ కనిపించదు, ఏ కిరణాలూ దానిని పట్టుకోలేవు. ఇంకొక గ్రహం కొన్ని సమయాలలో కనిపిస్తుంది, కొన్ని సమయాలలో కనిపించదు. ఆ విధంగా మొత్తము 12 గ్రహాలు ఉన్నాయి అని తెలుస్తున్నది.

మా పరిశోధనలలో తేలిన విషయమిది. ఈ పన్నెండు గ్రహాలు కాలచక్రములో తిరుగుచున్నవి. జీవులమైన మనము కర్మచక్రములో ఇరుక్కుని ఉన్నాము. మన కర్మంతా పన్నెండు భాగాలుగా విభజించబడి యుంది. ఒక్కొక్క భాగంలో ఎన్నో కర్మలున్నాయి. పన్నెండు భాగాలలో మన జీవితానికి సంబంధించిన కర్మంతా నిక్షిప్తమయి ఉన్నది. దానినే 'ప్రారబ్ధకర్మ' అని అంటాము. ప్రారబ్ధకర్మ ప్రకారము ఏది జరగాలో అది జరగాల్సిందే. సూర్యుడు ఎండకాస్తున్నాడని తెలుసు. చంద్రుడు వెన్నెల కాస్తున్నాడని తెలుసు. కానీ మిగతా గ్రహాలు ఏవీ కనిపించవు. వాటి కిరణాలు కూడా కనిపించవు. ఉదాహణరకు ఎక్స్ కిరణాలు లేదా ఎక్స్‌రేస్ అనేవి నీకు కనిపించవు, కానీ నీ శరీరములో ఉన్న భాగాలను ఫోటో తీయగలవు. అలాగే మిగతా గ్రహాల యొక్క కిరణాలు కనిపించవు. కానీ ఆ గ్రహకిరణాలు మన కర్మను ఆకర్షించి పట్టుకుంటున్నాయి. మన కర్మను అంతా పన్నెండు గ్రహకిరణాలు పరిపాలిస్తున్నాయి. క్రింది గుణచక్రములో మనము ఉన్నాము. గుణచక్రంపైన కర్మచక్రం ఉంది. పైన ఉన్న ఫోకస్ వచ్చి కర్మచక్రంపైన పడుతున్నది. కర్మయొక్క నీడ లేదా రంగు నీ మీద పడుతున్నది. నీవు పరదా మాదిరిగా ఉన్నావు. గ్రహాలు ప్రొజెక్టర్‌లాగా ఉన్నాయి, ఫిల్ము మాదిరి నీ కర్మ ఉంది. ఫిల్మ్ ఏదుంటే అదే పరదా మీద పడినట్లు, నీవు ఏ కర్మ చేసుకుంటే దానినే నీవు అనుభవించాల్సి వస్తున్నది.

ఈ కాల, కర్మ, గుణచక్రముల నిర్మాణం ప్రతీ జీవి తలలో కలదు. ఆ తలలో, జీవుడు అనే మనము, రవ్వంతగా గుణచక్రంలో ఉన్నాము. జీవునిగా నీవు చేసుకున్న కర్మను అనుభవించేందుకు తప్ప, శరీరము నీవు కాదు. నీవు వేరు, నీ శరీరం వేరు అని గుర్తెరుగుము.

ఈ విధంగా మన శరీరములోయున్న కాల, కర్మ, గుణచక్రముల అమరికను తెలుసు కుంటే వాడు సంపూర్ణ జ్ఞాని అగును. ఇవన్నీ తెలియక గుడిలోకిపోయి మంత్రములు చదివితే జ్ఞానులం అవుతామా అంటే కాదు. నీవు జ్ఞానివి కావాలంటే ఈ విషయాలన్నీ తెలిసి ఉండాలి. ఇవన్నీ తెలియాలంటే ఇప్పుడు మీకు ఒక ఆధారం ఉంది. ఇప్పుడు అన్నీ తెలియ బడుతున్నాయి కదా! ఎందుకు తెలుసుకోరు? భగవంతుడు భగవద్గీతలో శ్లోకాలు చెప్పితే ఆ శ్లోకాలకు భావములను ఒక్కొక్కరు ఒక్కొక్క కోణంలో చెప్పారు. ఇదే సంగతి అన్ని మత గ్రంథాలలోనూ జరిగినది. మరి ఈ రోజు **త్రైత సిద్ధాంతం** లోను, మిగత రెండు గ్రంథములలోను శాస్త్రబద్ధంగా మంచి జ్ఞానము తెలుస్తూ ఉంది. ప్రతీ ప్రశ్నకు జవాబు ఉంది, వివరణా ఉంది. కనుక జ్యోతిష్యమును కూడా తెలుసుకునేందుకు అవకాశము ఉంది. ఇప్పుడు జ్యోతిష్యం అని పేరు పెట్టినా, చెప్పేదంతా కాల, కర్మ, గుణచక్రముల గురించే కదా! ఎవరి కర్మను వారు అనుభవించాల్సిందే. ఏ దేవుడూ తప్పించలేడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులైనా సరే, అనుభవించాల్సిందే. యాత్రికుల బస్సులు ప్రమాదాలు జరిగి మనుషులు చనిపోవటం లేదా? మరి మళ్ళీ నీ దగ్గరకు వచ్చేటట్లు చేయమని వారంతా దేవున్ని మ్రొక్కినారు కదా! మరెందుకు చనిపోయారు అంటే "కర్మను ఎవ్వరూ తప్పించలేరు" అది శాసనం చేసి వుంటుంది. భగవద్గీత లోకి వెళ్తే జ్ఞానయోగ అనే అధ్యాయంలో 37వ శ్లోకంలో...

శ్లో॥ 37. యథైధాంసి సమిద్ధోగ్ని భస్మసాత్కురుతేర్జున ।
జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

**భావము :- "ఏ విధంగా అగ్నిలో కట్టెలు కాలిపోతున్నాయో అర్జునా! ఆ విధంగానే జ్ఞానమనే అగ్నిలో కర్మలు అనే కట్టెలు కాలిపోతాయి"** అని చెప్పాడు. అనుభవించకుండా తప్పించడానికి వీల్లేదంటూనే, నా జ్ఞానం తెలుసుకోగలిగితే, మీ కర్మలు జ్ఞానాగ్ని వలన, అవి అనుభవానికి రాకుండానే కాలిపోతాయి. ప్రారబ్ధకర్మలో ఒక వ్యక్తి కాలు విరిగిపోవాల్సింది. కానీ ఆ సమయానికి అతను కాలు విరిగిపోకుండా ఉన్నాడంటే **"యథైథాంసి సమిద్ధోగ్ని భస్మసాత్ కురుతేర్జున"** అనే శ్లోకాన్ని తీసుకోవలిసిందే.

ఈ మధ్య ఒక బస్ ప్రమాదం జరిగి 44 మంది కాలిపోయి, బొగ్గులుగా మారి చనిపోయారు. మరి వారందరికీ ఒకే రకమైన కర్మ ఉన్నదా? ఒకరికో, ఇద్దరికో ఆ రకంగా కాలిపోయే కర్మ ఉండి ఉండవచ్చు. కానీ అందరికీ ఉండకపోవచ్చు. మరి ఆ ప్రమాదం ఎట్లా జరిగింది? ఆ ప్రమాదంలో చనిపోయిన వారిని ఉద్దేశించి, వారి బంధువులు, మా వాడు చాలా భక్తుడు, దేవుడు అన్యాయం చేశాడు అంటున్నారు. దేవుడు ఎందుకు అన్యాయం చేస్తాడు? ఆయన ఏ అన్యాయం చేయడు. ఆ విధంగా బస్సులో ఉన్న అందరికీ ఒకే రకమైన కర్మ లేకపోయినా జరిగింది. ఇంకొక దగ్గర కర్మలో ఒకడు చనిపోయే కర్మ ఉన్ననూ వాడు చావలేదు. అంటే ఒక దగ్గర జరిగే కర్మను మార్చి ఆ బస్సును కాల్చివేశారు. ఇక్కడ చనిపోయే కర్మను మార్చి బ్రతికించబడింది. జరిగే కార్యం మాత్రమే కనిపిస్తున్నది. కానీ, దాని వెనుక కర్మ మాత్రము కనిపించదు.

ఆ తెలియని విధానాన్ని తెలుసుకోవాలంటే జ్యోతిష్యాన్ని తెలుసు కోవాలి. బ్రహ్మ విద్యలో (భగవద్గీత) జ్ఞానయోగము 37వ శ్లోకములో, ఈ విధంగా ఉన్నది అని నేను చెప్పాను. అందులో కర్మలు కొట్టివేయబడును అని అన్నాడు. ఏ కర్మ కొట్టివేయబడి ఉందో తెలియాలంటే బ్రహ్మవిద్యలో తెలియదు. దానిని తెలుసుకోవాలంటే జ్యోతిష్య శాస్త్రాన్ని తెలుసుకోవాలి. చీకట్లో ఉన్న మనకు అక్కడ ఏ వస్తువులు ఉన్నాయో తెలియాలంటే, దీపం కావాలి. అట్లాగే ఏ కర్మలు ఎట్లా మనకు భవిష్యత్తులో జరుగుతాయో అనే దానిని జ్యోతిశాస్త్రం ద్వారా తెలుసుకోవచ్చు. మీరు వ్రాసిన జ్యోతిశాస్త్రంలో అట్లాంటివి దొరుకుతాయా అంటే తప్పకుండా దొరుకుతాయి అని చెప్పగలము. ఎందుకంటే మా గ్రంథములలో వెలుగుతో జ్యోతి ఉన్నది కనుక తెలుస్తాయి. మిగతావారు వ్రాసిన జ్యోతిష్య శాస్త్రంలో జ్యోతి (వెలుగు) లేనందువల్ల ఏమీ పూర్తిగా తెలియదు. ఇదంతా ఎందుకు తెలుసుకోవాలి? దీనివలన లాభం ఏమిటి? అంటే దేవుని మాటలు ఎంతవరకు వాస్తవం అని తెలియుటకు దీనిని తెలుసుకోవలసిందే. ఎప్పుడైతే "యథైధాంసి సమిద్ధోగ్ని భస్మసాత్ కురుతేర్జున" అని చెప్పినాడో ఆ మాట సత్యమా, కాదా అని తెలియాలంటే ఈ జ్యోతిశాస్త్రం గురించి తెలిస్తే నీ కర్మ, జ్ఞానం ద్వారా నాశనం అయినదా లేదా అని తెలుస్తుంది. నేను భగవద్గీతను నూటికి నూరు పాళ్ళు శాస్త్రము అని తెలుసుకున్నాను. కర్మను జ్యోతిష్య శాస్త్ర ఆధారముతో తెలుసుకున్నాను. అప్పుడు నాకు భగవద్గీతలో చెప్పింది నిజమే అని తెలిసింది.

ఒక వ్యక్తికి జ్యోతిశాస్త్రములో ఉన్నట్లు అతని కర్మానుసారము ధనికుడు అయ్యే కర్మ ఉందని మేము తెలుసుకున్నాము. అయితే ఆ రోజు ఆ విధంగానే ఆ వ్యక్తి ధనికుడు అవుతాడని మేమూ నమ్మలేదు, కానీ

తొమ్మిది సంవత్సరాలు ఆ కార్యం జరిగేందుకు వేచి యుండాల్సి వచ్చింది. వాస్తవం గానే జ్యోతిష్య శాస్త్రంలో ఉన్నట్లుగానే ఆ వ్యక్తి ధనికుడు కావడము జరిగింది. అతని (జాతకంలో) జాపథకములో ఏ విధముగా ధనికుడు కావాల్సి ఉందో అట్లే ధనికుడు కావడము జరిగింది. మరి అటువంటప్పుడు ఆ జ్యోతిష్య శాస్త్రాన్ని నమ్మాల్సిందే కదా! ఇది శాస్త్రమే, శాసనమే అని మనకు అర్థమయిపోయినది కదా! తెలియనివారు ఏదైనా అనవచ్చు. కనుక నీవు ముందు తెలుసుకో. తప్పకుండా నీవు దానిని శాస్త్రమని ఒప్పు కోవలసిందే అట్లే బ్రహ్మవిద్యను కూడా తెలుసుకో, తరువాత దానిని కూడా శాస్త్రమని ఒప్పుకుంటావు. ఇప్పుడున్న న్యూమరాలజీ ప్రకారము ముఖం చూసి భవిష్యత్తు చెప్తామనీ, చెడు జరుగకుండా ఉండాలంటే శాంతులు చేయాలనీ, పూజలు చేయాలనీ పదివేలు, ఇరవైవేలు ఖర్చు అవుతుందని కొందరంటారు. కర్మానుసారం ఏది ఉందో అది జరగాల్సిందే అని బ్రహ్మవిద్యా శాస్త్రం చెప్తున్నది కదా! కర్మ బ్రహ్మవిద్యకు, జ్యోతిష్యమునకు సంబంధించిన దని తెలియక కొన్ని పనులు జరిగినప్పుడు జ్యోతిష్యమునకు సంబంధము లేన్నట్లు చెప్పి జ్యోతిష్య శాస్త్రానికి గుర్తింపు లేకుండా చేసి, అపనమ్మకం కలిగేటట్లు చేసేశారు కొందరు.

ఈ విధంగా అసలైన శాస్త్రంగా బ్రహ్మవిద్యా శాస్త్రం మరియు అపనమ్మకంగా ఉన్న జ్యోతిష్యాన్ని కూడా శాస్త్రంగా నమ్మవలసిందే. మనము చేసుకున్న కర్మ ఏదైనా అది గ్రహాల ఆధీనంపైనే ఉంటుంది. మన కర్మను చేర్చాలన్నా, తీసివేయాలన్నా గ్రహముల అనుమతి లేకుండా జరిగేందుకు అవకాశం లేదు. జ్ఞానం తెలిసిన వ్యక్తి ఎవరైనా, అంటే దైవజ్ఞానము తెలిసిన వ్యక్తి ఎవరైనా, కర్మను తీసివేయమని చెప్తే, ఆ జ్ఞానశక్తికి గౌరవం ఇచ్చి, ఆ కర్మను అనుభవరూపం దాల్చకుండానే తీసివేయగలరు. ఈ

విధంగానే ఉన్న కర్మను లేకుండా చేయవచ్చు, లేని కర్మను చేర్చనూ వచ్చును. ఇదేమి క్రొత్త పద్ధతి? ఉన్న కర్మ ఏదైనా దానిని జ్ఞానము ద్వారా కార్యరూపం దాల్చకమునుపే తీసివేసుకోవచ్చు అని చెప్పారు. కానీ ఇప్పుడు మన ప్రారబ్ధకర్మలో లేని కర్మ ఎట్లు చేరును? అని ప్రశ్నిస్తే, అందుకే భగవద్గీతలో దైవాసుర సంపద్వి భాగ యోగము అనే అధ్యాయములో 19వ శ్లోకములో **"జ్ఞానులను ద్వేషించు స్వభావం కల్గిన వానికి శిక్ష ప్రత్యేకంగా ఉంది, వారిని అసుర యోనులయందే పుట్టించి, ఘోరమైన నరకమునందు పడవేసెదను"** అన్నాడు. భగవంతుడు (దేవుడు) ఆ విధంగా అనుకోగానే అక్కడున్న గ్రహాలు వెంటనే కర్మను అదనంగా చేర్చగలవు. ఎందుకంటే దేవుడు అందరికన్నా గొప్పవాడు. కనుక ఆయన లేని కర్మను కూడా అటువంటి వ్యక్తులలో కల్పించగలడు. ఈ విధానాన్ని నడిపించేది గ్రహాలు మాత్రమే. గ్రహాలకు తెలియకుండా ఏ పనీ జరుగదు.

ఒకవేళ నీవు జ్ఞానివైతే ఉండే కర్మను అనుభవించకుండానే ప్రక్కకు ఈ గ్రహాలే పెట్టగలవు. జ్యోతిష్య శాస్త్రములో ముఖ్యమైన అంశము **గ్రహాచారము.** గ్రహాచారము ఎట్లు ఉంటే అట్లే జరుగును. ఇంకా **'దశాచారము'** అని కూడా వ్రాసియుండును. ఈ దశలో ఈ విధంగా జరుగును. ఇంకొక దశలో ఇంకొక విధముగా జరుగుతుంది అని చెప్పుచుంటారు. కానీ దశాచారముతో జ్యోతిష్యమునకు సంబంధము లేదు. అంటే గ్రహాచారము, దశాచారము అని రెండు ఉండటం జ్యోతిష్యంలో వాస్తవమేగానీ, గ్రహాచారము మాత్రమే వాస్తవం. అందులో ఏ విధంగా ఉంటే ఆ విధంగా జరిగి తీరుతుంది. అంతేగానీ దశ బాగుంది కానీ ఎందుకు ఈ విధంగా జరిగింది అని ఆలోచించేవారు ఉన్నారు. రాహుకాల మహాదశ 18 సంవత్సరాలుంటే, 9 సంవత్సరాలు అయిపోయి 9 సంవత్సరాలు మిగిలింది అని అయిపోయిన దానిని గర్భభుక్తి అని వ్రాశారు.

రాహుదశ, కేతుదశ అనేవి జ్యోతిష్యంలో ఉన్నాయి. ఈ దశలలోనే కర్మను కలపడంగానీ, కర్మను తీసివేయడంగానీ జరుగును. కానీ వాటిని అనుభవం లోకి తేవటం మాత్రము ఆ గ్రహములు చేయలేవు. నీవు అజ్ఞానివై, దైవ దూషణ, జ్ఞానదూషణ చేస్తే, లేని కర్మలను సైతం ఈ దశలలో కలపటం జరుగుతుంది. తద్వారా నీవు అనుభవానికి, ఆ కర్మలను అనుభవించవలసి వచ్చినప్పుడు, నేను ఏ పాపం చేశానని ఈ శిక్ష నాకు అనుకుంటావు. ఆ విషయాన్నే భగవద్గీతలో దైవాసుర సంపద్విభాగ యోగములో చెప్పినది.

ఇదే విషయాన్ని బైబిల్ గ్రంథములో కూడా **"ఈ యుగమునందు గానీ, రాబోవుయుగమునందు కూడా కష్టాలు తప్పవు"** అని వ్రాశారు. దైవదూషణ చేసినవాడివి గ్రహాచారంలో గత జన్మలో వచ్చిన కర్మ ప్రకారము ఏవి జరగాలో అవి జరిగితీరుతాయి. కానీ దశలలో మాత్రము ఉన్న కర్మను తీసివేయవచ్చు, లేని కర్మను పెట్టుకోవచ్చు. దశ అంటే 'అంతటా' అని అర్థము. ఈ విషయాన్ని ముందే మనము తెలుసుకున్నాము. అంతటా ఉండేవాడు దేవుడు. కనుక 'దశాచారం' అంటే దేవునికి సంబంధించినది అని అర్థము. దశ అంటే పది అని అర్థము. ఎనిమిది (8) దిక్కులు + భూమి + ఆకాశము కలిపి పది. దశ దిశ అంటే మొత్తము అంతటా వ్యాపించిన వాడు అని అర్థము. ఆ దశలే జ్యోతిష్యంలో ఉన్నవి. కనుక జ్యోతిష్యంలో రెండూ ఉన్నవి. ఒకటి గ్రహాచారం, ఇది ప్రపంచ వరమైనది. రెండూ దశాచారం, ఇది దైవికమైనది. కనుక జ్ఞానివై కర్మలను తీసివేసుకునే పద్ధతి తెలుసుకో. ఈ విషయాలన్నీ మేము వ్రాసిన **"జ్యోతిష్య శాస్త్రము"** గ్రంథములో కలవు. కనుక జ్యోతిష్య శాస్త్రములో, జ్యోతిని తెలుసుకో, జ్ఞానివై దేవున్ని తెలుసుకో...

# 69. స్వార్థ రాజకీయం

**(తేది : 16.01.2014)**

స్వార్థము అంటే ప్రతీ ఒక్కరికీ ఆ పదము యొక్క అర్థము తెలుసు. మనము "వీడు స్వార్థముగా బ్రతుకుచున్నాడు" అని అంటూ ఉంటాము. మేమైతే ప్రత్యేకంగా అందరినీ స్వార్థముగానే బ్రతకమని చెప్పుచున్నాము. ఇదేమి ఇతను జ్ఞానము చెప్పబోయి అజ్ఞానము చెప్పుచున్నాడు అని అనుకోవద్దండి. 'స్వార్థము' అనే పదములో జ్ఞాన వివరము తెలుసుకుంటే స్వార్థముగానే మనము బ్రతికితే మంచిది అనిపిస్తుంది. స్వ=నీ యొక్క అర్థము=ధనం అంటే **'నీ యొక్క ధనము'** కొరకు బ్రతకటం అని అర్థము.

ప్రపంచములో ఉండే ధనమును సంపాదించుట కొరకు ఎంతటి పని అయినా చేస్తున్నాము, దానినే ప్రపంచ స్వార్థము అంటాము. ఇది వాస్తవమే, కానీ స్వార్థములు రెండు విధములు. ప్రపంచవరముగా అందరికీ స్వార్థము కలదు. ఎంతలేదు అని అనుకొనినా, ఏదో ఒక సమయములో అది బయటపడుతూనే ఉంటుంది. ఆ లెక్కలో చూస్తే మాకూ స్వార్థము ఉంది, కానీ మీకుండే స్వార్థముతో పోల్చితే మాకుండే స్వార్థములో కొంత తేడా ఉంది. మాకుండే స్వ+అర్థము, సొంత ధనము. ప్రపంచ ధనము కాకుండా జ్ఞాన ధనము. ప్రపంచ ధనము ఎంత ఉన్ననూ అది పోతుంది. నువ్వు ఎంత ధనము సంపాదించినా, ఎంత తినాలో అంతే తింటావు. కానీ లోపల ప్రపంచ స్వార్థముతో నువ్వు ఎంత సంపాదించుకుంటే అంతే నీకు ఉపయోగపడుతుంది. నీ స్వార్థముతో అసలైన జ్ఞాన ధనమును సంపాదించుకుంటే, అది నిన్ను వీడిపోదు, నీకే ఉపయోగపడుతుంది. ఇతరులకు ఏమాత్రము నీవు సంపాదించుకొన్న జ్ఞానము అనే ధనము

దొంగలించలేరు. కనిపించే ధనము కాకుండా కంటికి కనిపించనిది జ్ఞానధనము. అంటే జ్ఞానధనము ఒకటి, ప్రపంచ ధనము ఇంకొకటి. మనమంతా ప్రపంచ ధనము కొరకు పాటుపడుతున్నాము, ప్రపంచ ధనముతోనే అన్ని పనులు జరిగిపోతున్నాయి అని అనుకుంటున్నాము. ప్రపంచ ధనము సంపాదించేది కూడా కర్మలో ఉంటేనే జరిగేది అని అంటున్నాము. ప్రతీదీ కర్మవలనే జరుగుతుంది. కనుక ప్రపంచ ధనము కర్మకు లోబడి ఉంది. కర్మతో సంబంధము లేకుండా ఉండేది జ్ఞానధనము. జ్ఞాన ధనము కర్మకు అతీతముగా ఉంటుంది. కోటి రూపాయలున్న వ్యక్తి అయినా తినేది కొంత అన్నమే. అందువలన ప్రపంచ ధనము పూర్తిగా ఉపయోగపడుతుంది అని అనలేము. కానీ పూర్తిగా ఉపయోగపడే ధనము మాత్రము జ్ఞాన ధనమే.

ఆ విధంగా జ్ఞానమును సంపాదించడమే అర్థము. అర్థము అంటే ధనము కదా. ఈ జ్ఞానధనమే నీకు తృప్తిని ఇవ్వగలదు కానీ ప్రపంచ ధనము నీకు ఎటువంటి తృప్తిని ఇవ్వలేదు. ప్రపంచ స్వార్థము నీ శరీరానికి పనికి వస్తుందిగానీ, నీకు (జీవాత్మకు) ఏ ఉపయోగం లేదు. కనుక మీ అందరు బయట స్వార్థాన్ని విడిచిపెట్టి లోపలున్న స్వార్థము కొరకు పాటుపడవలెను. ఈ ప్రపంచములో అన్నిటికంటే పెద్ద విద్య ఒకటుంది అని చెప్పాడు దేవుడు, అదే దైవ జ్ఞానము అని చెప్పాడు. ఆయనే శ్రీకృష్ణ పరమాత్మ లేక శ్రీకృష్ణభగవానుడు. ఆ జ్ఞానాన్నే మనము 'బ్రహ్మవిద్య' అంటున్నాము. బ్రహ్మ అంటే పెద్ద అని అర్థము. దానినే రాజవిద్య అని కూడా అంటున్నాము. ఇక్కడ రాజు అంటే పెద్ద లేదా గొప్ప అని అర్థము. కనుక డాక్టర్ విద్యను నేర్చుకున్న వాడిని డాక్టర్ అన్నట్లు. రాజవిద్యను నేర్చుకున్న వాడిని రాజు అని అనాలి. భగవద్గీతలో "రాజవిద్యా రాజగుహ్యా"

అనే పేరుగల అధ్యాయం ఉంది. ఆ అధ్యాయములో ఒక శ్లోకములో ఏమి చెప్పారంటే...

శ్లో॥ 2. రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥

అన్ని విద్యలకంటే గొప్పది, రహస్యమైనది అయిన రాజవిద్యను తెలియజేస్తున్నాను అన్నారు. మనకు ప్రత్యక్షముగా అనుభవమునకు వచ్చే విద్య మరియు ఉత్తమమైనది బ్రహ్మవిద్య కనుక ఈ విద్యను నేర్చుకున్న వానిని 'రాజు' అనాలి. ఈ విధముగా రాజవిద్య నేర్చుకున్న రాజులు అయినవారు ఉన్నారా? ఎలక్షన్‌లు పెట్టి గెలిచి నేను రాజును అని అంటున్నారు. దానినే రాజకీయం అని మనము అంటున్నాము. 'కీయం' అంటే 'పని' అని అర్థము. క్రియ వలన ఏర్పడేది 'కీయం'. రాజకీయం అంటే పెద్ద పని. అంటే రాజవిద్యను నేర్చుకున్నవాడు మాత్రమే రాజకీయం చేయగలడు. ఓట్లు సంపాదించుకునే వాడు ఉత్తకీయమే చేసినట్లు లెక్క. కానీ ఇప్పుడు మేము చేస్తున్నది రాజకీయం. ఏ రాజకీయం అంటే **స్వార్థ రాజకీయము**. నాది బయట రాజకీయంలాంటిది కాదు గానీ లోపలి స్వార్థ రాజకీయము. ఈ స్వార్థ రాజకీయం మీరు తెలుసుకుంటే ఎవరు రాజకీయవేత్త, ఎవరు రాజకీయ నాయకుడు అనేది తెలుస్తుంది. జ్ఞానము తెలిసినవాడే రాజకీయ నాయకుడు అగును. అప్పుడు వాడు ప్రపంచానికి రాజు కాదుగానీ జ్ఞానమునకు రాజు అగును. అందుకే ఒక వ్యక్తి తన జ్ఞానముతో "నా రాజ్యానికి నేను రాజును" అని అన్నాడు. ఆ విషయం విన్నవారికి అర్థముకాక ఈ ప్రపంచానికి రాజు అవుతాను అని చెప్తున్నాడనుకుని ఆయనను చంపేశారు. మీ అందరికీ జ్ఞాపకం ఉందో లేదో గానీ

ఆయన మీద ఆరోపణ చేసిన తరువాత ఆయనను అడిగితే, "అవును నేను అలాగే అన్నాను. నా రాజ్యానికి నేనే రాజును. మీరెవ్వరూ ఆ రాజ్యానికి రాజు కాలేరు" అని ఆయన చెప్పాడు. ప్రస్తుతము నేను కూడా అదే చెప్పుచున్నాను, నేను ఒక విధంగా స్వార్థ రాజకీయ నాయకుడినే. మీ పద్ధతిలో మీ పరిధిలో నేను ఏ విధంగా అర్థమయినాగానీ నా పరిధిలో నేను నాయకుడినే, రాజకీయ నాయకుడినే, ఇప్పటికీ మేము పెద్దవాడినే అనే విషయం అర్థమయ్యే ఉంటుంది.

ఏది ఏమైనా జ్ఞానాన్ని అసలైన అర్థముతో తెలుసుకుంటే, మనకు దాని విలువ తెలుస్తుంది. ఇంతవరకు రాజకీయం అంటే, మీ అందరికీ తెలిసింది అది ఒక రకమైన అర్థమైతే, ఇప్పుడు రాజకీయం అంటే అసలైన అర్థము తెలిసింది కదా! కనుక రాజకీయ నాయకున్ని అని నేనంటే, బయట రాజకీయ నాయకున్ని అని మీరనుకొని అసూయ పడవచ్చునేమో గానీ నేను చెప్తున్న రాజకీయ అర్థము వేరు, కనుక మీరూ ఎంతో కొంత జ్ఞానము తెలుసుకుంటున్నారు కనుక మీరూ నాయకులే. మీరు నాయకులైతే మీకంటే కొద్దిగా పెద్ద నాయకులం మేము అవుతాము అంతే కనుక అసలైన అర్థాలు తెలుసుకోకపోతే అపార్థాలు అగును. దీనికి ఒక ఉదాహరణ చెప్తాము వినండి. పూర్వం ఒక గురువు వద్దకు ఒక స్త్రీ వెళ్తే, ఆమెతో ఆ గురువు ఏమన్నారంటే, "ఏమి అమ్మా! ఇంకెంత కాలం నీ మొగుడుతో కాపురం చేస్తావు, ఇంకొక మొగుడ్ని చూచుకోవచ్చు కదా!" అని అన్నాడట. ఇదేమి ఈ గురువు ఇలా అంటున్నాడు అని ఆమె ఇలా అడిగిందట. "గురువా, స్త్రీకి ఉండేది ఒకే మొగుడు కదా! మరి ఇంకొక మొగుడు అంటారేమి ఉండేది ఒకే మొగడైతే మరొక అతన్ని ఎందుకు చేసుకోవాలి అని అడిగిందట అప్పుడు గురువు నీకర్థం కాలేదు అని అన్నాడంట.

అప్పుడు పురుషుడు ఒకడు అక్కడికి వచ్చినాడంట. అప్పుడు అతనికి కూడా ఆయన అదే విధంగా “ఏమయ్యా! ఇంకొక మొగుడ్ని పెట్టుకోవచ్చు కదా!” అని అన్నాడంట. అప్పుడు అతనికి కూడా అర్థముకాక “ఇదేమి స్వామి ఆడవారికి మొగుడుంటాడుగానీ మగవాడికి మొగుడెందుకు ఉంటాడు” అని అడిగాడంట. “ఓరి తిక్కవాడా! ఆడవారికి, మగవారికి అందరికీ కలిపి ఒక మొగుడున్నాడు” అని గురువు అన్నాడంట. ఇక్కడ గురువు చెప్పింది ఏమంటే అజ్ఞానమనే దానిని పెట్టుకుని ఎన్నాళ్ళు మీరు ఉంటారు. జ్ఞానము తెలుసుకోండి అని ఆయన భావము. కనుక ప్రతీ విషయాన్ని జ్ఞానరీత్యా అర్థము చేసుకుంటే బాగుంటుంది. నిజమైన భర్త, జగద్భర్త ఒకడున్నాడని మొదటినుండి మనము చెప్పుకుంటున్నాము. సర్వ సాధారణముగా స్త్రీలకుగానీ, పురుషులకుగానీ అధిపతి ఒకడున్నాడు. భర్త అంటే భరించువాడు అని అర్థము. మనందరినీ భరించువాడు ఎవరంటే దేవుడు. అదే విధంగా బయట ఉండే స్వార్థంకంటే లోపలుండే స్వార్థం గొప్పది. బయట ఉండే రాజకీయంకంటే లోపలుండే రాజకీయం గొప్ప, అలాగే బయట ఉండే భర్తకంటే, లోపలున్న భర్త అందరికీ భర్తే, అతడే గొప్ప భర్త.

ఈ కోణం నుండి చూస్తేనే, దేవుడు మరియు జ్ఞానము అనేది అర్థమవుతుంది. ఈ విషయం తెలియకుండా ఎన్ని తీర్థయాత్రలు చేసినా, పూజలు చేసినా ప్రయోజనం లేదు. అదే విధంగా వ్యక్తి పూజలు కూడా మంచి పద్ధతి కాదు. ఒకరి కాళ్ళకు ఇంకొకరు మ్రొక్కటం, మ్రొక్కించటం పెద్ద తప్పు. అందుకే మీ శరీరములోనే దేవుడున్నాడని మీకు తెలిస్తే, మీకే మంచిది. అంతేగాని అజ్ఞానముతో ఇంకొకరి కాళ్ళకు మ్రొక్కవద్దు, మ్రొక్కించుకోవద్దు. అందుకే నా వద్దకు వచ్చిన వారిని నేను నా కాళ్ళకు

మ్రొక్కవద్దు అంటాను. మ్రొక్కితే దేవునికి మ్రొక్కండి అని నేను చెప్తాను. బయట నీవు పేదవాడివి కావచ్చు. జ్ఞానము తెలుసుకుంటే నీవు గొప్పవాడివి అవుతావు. ఆధ్యాత్మికంగా నీవు రాజుగా ఎదిగేందుకూ అవకాశము వస్తుంది. రాజు అంటే 'గొప్ప' అని అర్థము ఉంది కదా! బయట ప్రపంచములో కాదు, లోపల నీ శరీరములో. అందరం బయట ప్రపంచములోనే లగ్నమయి పోయి దాని కొరకే ప్రాకులాడుచున్నాము. బయట ప్రపంచములో మీకు దేవుడు లేడు, వెదికినా దొరకడు. ఒకవేళ దేవుడు తెలియాలంటే లోపలి ప్రపంచములోనే వెతకాలి. భగవద్గీతలో ప్రతీ శ్లోకం శరీరములోపలికే చెప్పాడు. కనుక మనము శరీరములో ఉండే విషయాలను తెలుసుకోగలిగితే, మనకు సంపూర్ణంగా జ్ఞానం లభ్యమవుతుంది. ఎప్పుడైతే నీకు జ్ఞానం అర్థమవుతుందో అప్పుడు ఇదే నిజమైన మార్గం అని నీకు అర్థమవుతుంది.

ఆ విధంగా ఇంకా ముందుకు పోవచ్చు, మోసపోకుండా వాస్తవమైన జ్ఞానాన్ని తెలుసుకోవచ్చు. అప్పుడు మనకు తృప్తి ఏర్పడుతుంది. భగవద్గీతలోనే ఆ తృప్తిని ఇచ్చే జ్ఞానము ఉంది. దానినే మేము **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** రూపములో అందజేశాము. ద్వైత, అద్వైతములలో కూడా దేవుని జ్ఞానము ఉన్ననూ, సంపూర్ణత మాత్రము త్రైత సిద్ధాంతములోనే ఉన్నది. కానీ త్రైతము అనే పేరు వినగానే ప్రపంచములో ఉన్న కొందరు ఇది క్రైస్తవము అని పొరపాటుపడుచున్నారు. ఈ విధముగా హిందువులే మమ్మల్ని కించపరచటం జరిగింది. 'త్రైత సిద్ధాంత భగవద్గీత' అని పేరు ఉన్ననూ, కనీసం చదవకుండా దానిని చింపివేయటం మరియు కాల్చి వేయటం కూడా జరిగింది. క్రైస్తవుల గ్రంథము అయితే బైబిల్ అని పేరు ఉంటుంది కదా! భగవద్గీత అని పేరు ఉంటే అది క్రైస్తవుల గ్రంథమని, ఎట్లు హిందువులు అనుకున్నారో? ఇది చాలా పెద్ద పొరపాటు. ఈ

విధంగా బయట విషయాలే తెలియకపోతే లోపల విషయాలు ఎలా తెలుస్తాయి.

తమ మతాన్ని గుర్తించలేని పరిస్థితిలో హిందువులు ఉన్నారు. ఎంతో గొప్ప జ్ఞానాన్ని తెలియజేస్తున్నా నన్ను కించపరుస్తున్నారు. కానీ నేను మాత్రము బాధపడటం లేదు, ఎందుకంటే భగవద్గీతలో **"మానవ శరీరము ధరించి వచ్చిన నన్ను, నా శ్రేష్టత్వం తెలియక మూర్ఖులు అయిన కొందరు నన్ను అవమానపరుస్తారు"** అని దేవుడే చెప్పాడు. అంతపెద్ద దేవునికే తప్పనప్పుడు మమ్మల్ని కించపరచటం అనేది పెద్దదేమీ కాదు. కానీ మా పట్టుదల ఏమంటే మా స్వార్థం మాది. ఏ స్వార్థం గురించి మీరు తెలుసుకోవాలి దానినే మీ అందరికీ చెప్పాలి. అదే నా స్వార్థం దానిలోని భాగంగానే 100 గ్రంథాలకు పైన వ్రాశాము, వాటిలో అన్నిటికంటే **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** గొప్పది. ఇప్పటికి దగ్గర దగ్గర 360 మంది భగవద్గీతను వ్రాసినవారు ఉన్నారు. వాటిలో సరిఅయిన భావము అర్థము కాలేదు. అటువంటి సందర్భములలో తెలిసిన విధంగా మేము వ్రాసిన భగవద్గీతను క్రొత్తక్రొత్త ప్రశ్నలను రేకెత్తిస్తూ జవాబులు వ్రాయటం జరిగింది. దానిని మీరు చదివి, ఆనందిస్తున్నారు. అయితే కొందరు అసూయవరులు అది క్రైస్తవ మతము బోధించే గ్రంథము అది అని ప్రచారం చేశారు. తెలియని వారు అదే నిజమనుకున్నారు. కాని మేము చెప్తున్నది మాత్రము వాస్తవమైన జ్ఞానము అని కొందరు గ్రహించారు. దీనికి సమానమైన జ్ఞానము ప్రపంచంలోనే లేదు అనే సత్యాన్ని గ్రహించారు. అదే స్ఫూర్తితో ఇంకా ముందుకు పోయి క్రొత్తవారు చాలామంది ఈ జ్ఞానాన్ని తెలుసుకుంటున్నారు. అలా తెలుసుకోకపోతే మేమెందుకు చెప్పాలి అనే నిరుత్సాహం ఏర్పడుతుంది. కానీ ఆ నిరుత్సాహాన్ని అధికమించి దగ్గర

దగ్గర 100 గ్రంథాలకు పైన అచ్చు వేయించాము. ఇంకా చాలా గ్రంథాలు వ్రాయాలని అను కుంటున్నాము. అన్ని మతాల విషయాలు ఇక్కడనుండే బయల్పరచాము. అన్ని మతాలకు మూలం హిందూమతమే అని మేము చెప్పాలను కుంటున్నాము. అసలు మతాలే లేని పథము మనది అని చెప్పాలను కుంటున్నాము.

మేము వేసే ప్రశ్నలకు మిగత మతముల వారు జవాబులు చెప్పలేకున్నారు. ఎందుకంటే భగవద్గీతలో ఉన్న విషయాలే మిగతా గ్రంథాలలో ఉన్నాయన్న విషయం నాకు తెలిసినందువలన మేము సులభంగా వివరించగలుగుచున్నాము. అందుకే ఖురాన్ గ్రంథములో ఏమి ఉన్నదంటే **“మీకు ఇప్పుడు ఖురాన్‌ను ఇస్తున్నాను. ఇది ఇంతకుముందు వచ్చిన గ్రంథములకు ధృవీకరణగా ఈ ఖురాన్ ఉంటుంది”** అని ప్రవక్తగారు చెప్పారు. ఈ విధంగా భగవద్గీతలోని ఉన్న విషయమే ఖురాన్‌లో ఉంది అనే విషయం నిరూపణకు వచ్చినది. కనుక అన్ని మతములలో జ్ఞానం నింపబడింది మరియు పంపబడింది. ముందు నీ మతము గురించి పూర్తిగా తెలుసుకో ఏ మతము గురించి అయినా మాట్లాడగలవు. ఈ విధంగా నీవు తెలుసుకోకపోవటం వలన ద్వేషాలు ఏర్పడతాయి, పేచీలు వచ్చి పోట్లాడుకుంటారు. నీవు ఏ మతంలో ఉంటే అందులోనే ఉండు, నీవు క్రైస్తవుడివైతే బైబిల్ గ్రంథము చదువుకో. కానీ అందులో ఉండే జ్ఞానము మాత్రము భగవద్గీతా గ్రంథములోనిదే అని తెలుసుకో.

ఖురాన్ గ్రంథము తీసుకుంటే అందులో ఉండే జ్ఞానమును మేము ఒప్పుకుంటున్నాము. ఎందుకంటే ఖురాన్ యొక్క పుట్టుక భగవద్గీతలోనే ఉంది అనే విషయం మాకు తెలుసు కనుక. భగవద్గీతలో ఉండే జ్ఞానమే

అన్ని మతములలో ఉన్నది. అందుకే ఖుర్‌ఆన్‌లో 6వ సూరా, 91వ ఆయత్‌లో తౌరాత్ అనే దానిని చింపుకొని చదువుకొంటున్నారని చెప్పారు. ప్రతి దైవగ్రంథములో ప్రతీ మాటకు అర్థమును తెలుసుకోవాలి, అంతేగానీ పెడార్థాలు తీసుకోకూడదు. మేము చెప్పే ప్రతీ విషయం భగవద్గీతను అతిక్రమించలేదు. అందుకే ఇప్పుడు నేను చెప్పిన 'స్వార్థము' అనే మాట కూడా అందులోనిదే. లోపల స్వార్థము మాత్రమే కలిగి ఉండండి. బయట స్వార్థం మాత్రము వద్దండి అని మేము చెప్పేమాట భగవద్గీతలో ఉన్నదే. **అర్థము** అంటే ధనమని **'స్వా'** అనగా స్వంత ధనమని తెలియాలి. ప్రతీ వ్యక్తికి శాశ్వతమైన ధనం జ్ఞానధనమేదో, అది నీ శరీరము లోపలే ఉంది అని తెలియాలి. దానిని తెలుసుకో అని చెప్పుటయే మా ఉద్దేశ్యం. అందువలన మేము చెప్పుచున్న 'స్వార్థముతో బ్రతకండి' అనే మాటను మీరు అర్థము చేసుకోండి. మరి స్వార్థమును సంపాదించాలంటే ఏమి చేయవలెను. నీవు ఏమీ చేయవలసిన పని లేదు. దూరప్రాంతాల నుండి మీరు ఇక్కడకు రావలసిన పని కూడా లేదు. సులభంగా మా గ్రంథములు మీకు దొరుకుతాయి. ఎన్నో కోట్లలో విలువ చేసే జ్ఞానము మీకు చిన్న గ్రంథములలో లభ్యమవుతుంది. గ్రంథములు చిన్నవే అయినా కోట్లకంటే విలువైన జ్ఞానము లభించగలదు.

మా గ్రంథములు అని మేము విశ్వాసముతో చెప్తున్నాము. తెలుసుకొంటే ఆ గ్రంథముల వలన ఎంతో జ్ఞానధనం నీవు సంపాదించినట్లే కదా! అందువలన ఎంతో శ్రమకోర్చి మీకు ఆ జ్ఞానధనాన్ని అందించాలనీ, దానిని గ్రంథముల రూపంలో అందివ్వాలను ఉద్దేశ్యముతో, ఆ విధంగానే అందిస్తున్నాము. అంతేగానీ నేను బయట ప్రచారం మేము చేయదల్చు కోలేదు, నేను బయటకు రాదల్చుకోలేదు. కానీ ప్రజలకు జ్ఞానరీత్యా మాత్రమే

దగ్గరవ్వాలనుకుంటున్నాము. కనుక మీ అందరూ ఇక్కడకు రావాలని అనుకోవద్దండి, వచ్చిన ఏమీ ప్రయోజనం లేదు. నేను దగ్గరయ్యాను అనుకోండి. మీకు జ్ఞానము పైన చూపు ఉండక పోవచ్చు. నేను దూరంగా ఉన్నాననుకోండి, మీరు జ్ఞానానికి దగ్గర అవుతారు. ఆ విధంగా దగ్గరయ్యేందుకు ప్రయత్నించండి. శాశ్వతముగా మేము ఇక్కడ ఉంటామని చెప్పడము లేదు. మేము బ్రతికి ఉన్నప్పుడే మీకేమైనా సందేహాలు ఉంటే అప్పుడు నా దగ్గరకు రండి, అడగండి, తెలుసుకోండి. లేకపోతే డబ్బులు ఖర్చుపెట్టుకుని నావద్దకు రావద్దండి. ఈ విధంగా జ్ఞానధనాన్ని సంపాదించు కుంటే నీవు రాజకీయనాయకుడివి అగుదువు. ప్రపంచ పరంగా రాజకీయ నాయకునివి కావాలంటే, అందరి ఇల్లూ తిరగాలి ఎన్నో తిప్పలు పడాలి, ఎం.ఎల్.ఎ టికెట్ సంపాదించి మ్రొక్కరాని వాళ్ళందరికీ మ్రొక్కి, మాకు ఓట్లు వేయండి అని అడిగి, గెలిస్తే గెలవచ్చు లేకపోతే లేదు. ప్రపంచ పరంగా ఎక్కడో ఒకడు ఉంటాడు. అందరికంటే పెద్ద నాయకుడు, కానీ వాళ్ళందరికంటే పెద్ద నాయకునివి కావాలంటే, జ్ఞానం తెలుసుకోవలసిందే, మేమే దానికి ఉదాహరణ, మేము బయట రాజకీయంలో వాళ్ళందరికంటే పెద్ద రాజకీయ నాయకున్ని. ఆధ్యాత్మికంగా, ఒకరకంగా ప్రపంచానికే రాజుని నా లెక్కలో, జ్ఞానరీత్యా మీరు కూడా ఆ హోదాను సంపాదించు కోవచ్చును. మేము ఇప్పుడు చెప్పినదంతా వాస్తవము. ప్రపంచములో లేని హోదా జ్ఞానము ద్వారా కలుగుతుంది, అదే రాజవిద్య అని దేవుడే చెప్పాడు రాజగుహ్య అని కూడా చెప్పాడు. రహస్యములలో కంటే రహస్యమైనది, విద్యలలో అన్నిటికంటే రాజయిన విద్య. బ్రహ్మవిద్య నేర్చుకుంటే రాజకీయవేత్తవు అగుదువు, తద్వారా రాజకీయ నాయకునివి, రాజువు అవుతావు. ఆ హోదా కల్గేందుకు స్వ+అర్థముతో బ్రతకండి.

అదే జ్ఞానధనం దానిని గుర్తించుకుని మీరు ముందుకు వెళ్ళాలని అహర్నిశలు మేము యోచిస్తూ, ఎన్నో గ్రంథములు వ్రాశాము. ఆ అవకాశము దేవుడు ఇచ్చాడు. ఇంకా దేవుడు అనుకూలించితే ఇంకా కొన్ని గ్రంథములు వ్రాయిస్తాడు.

మేము వ్రాసిన గ్రంథములలో శక్తి కూడా ఇమిడి ఉన్నది. మీకు కనిపించని శక్తి అందులో ఉంది. ఆ గ్రంథములు మీ వద్ద ఉంటే, ఆ శక్తి మీ వద్ద ఉన్నట్లే. గ్రంథములలో శక్తి నిజంగా ఉంటుందా అంటే మీకు కనిపించటం లేదు కనుక లేదనుకోవద్దండి. నాకు కనిపిస్తున్నది కనుక ఉంది అంటున్నాను. ఇంకా రాబోయే గ్రంథాలు ఇంకా శక్తివంతమైనది. వాటిని తాకినా కొంతలో కొంత కర్మపోయే అవకాశము ఉంది. అటువంటి గ్రంథములను గురించి హేళనగా మాట్లాడినా, చులకనగా చూచినా, అశ్రద్ధగా పడేసినా చాలా పాపము మూట కట్టుకొన్నట్లగును.

కొందరు చిన్న పిల్లలు దైవజ్ఞానమును చెప్పటం మేము విన్నాము. చిన్న పిల్లలే ఈ జ్ఞానాన్ని తెలుసుకుని పెద్దలకు చెప్పే స్థితిలోకి వచ్చారంటే, పెద్దలుగా మీరు కూడా జ్ఞానాన్ని తెలుసుకుని, పదిమందికి తెలియజేయటం మంచి పని అగును. ఈ విధంగా అయితే దేశమంతా జ్ఞానమయం అయి పోతుంది. ఇంతవరకు త్రైతం అంటే క్రైస్తవమతము అనే అపోహ జనాలలో ఉంది. ఇప్పుడిప్పుడే ఆ అపోహ తొలిగిపోతూ ఉన్నది. క్రైస్తవంలో ఉండేది కూడా మన జ్ఞానమే అని కూడా అర్థము చేసుకుంటున్నారు. ఈ విషయాన్నే ఖురాన్, బైబిల్ గ్రంథములలో కూడా చెప్పారు. ఇది ముందు వచ్చిన గ్రంథమునకు సాక్ష్యము మరియు ధృవీకరణ మాత్రమే. బైబిల్, ఖురాన్‌కంటే ముందు వచ్చిన గ్రంథము భగవద్గీతయే. దీనినిబట్టి,

భగవద్గీతలో ఉన్నది, బైబిల్, ఖురాన్ గ్రంథములలో ఉండేది ఒక్కటే అని మనము అర్థము చేసుకోవలెను. భగవద్గీతలో ఉన్నదే మిగతా గ్రంథములలో ఉంది అని చెప్పేందుకు **"వాసాంసి జీర్ణాని యథా విహాయ"** అనే శ్లోకమును తీసుకుని **"జనన మరణ సిద్ధాంతము"** అనే గ్రంథమును వ్రాశాము. ఆ శ్లోకములో ఉండే వివరం ఇంత వరకు ఎవ్వరికీ అర్థము కాలేదు. ఇదే విషయాన్ని ఖురాన్ గ్రంథములో 6వ సూరా 95వ వాక్యములో **"ప్రాణం ఉన్న దానినుండి ప్రాణంలేనిది వస్తుంది"** అని గర్భస్థ శిశువుకి ప్రాణం లేదు అనే విషయాన్ని ఆ వాక్యములో చెప్పటం జరిగింది. అదే విషయం "వాసాంసి జీర్ణాని" అనే శ్లోకములో కలదు.

ప్రాణం ఉన్న శరీరము అంటే తల్లి శరీరము, ప్రాణం లేనిది వస్తుంది, అంటే శిశువు శరీరము అని అర్థము. మరి భగవద్గీతలో చెప్పిన "వాసాంసి జీర్ణాని శ్లోకం" ఖురాన్ చెప్పిన 6వ సూరా 95వ వాక్యం సరిపోయింది కదా! **"టెంకనుండి మొక్క మొలక వస్తున్నది, నిర్జీవమైన దానినుండి సజీవ మైనది వస్తున్నది"** అని కూడా చెప్పారు. మరి ఈ వాక్యాలకు 1000 సంవత్సరాలు పరిశోధన చేసినా సరైన అర్థము చెప్పలేరు. 'గర్భస్థ శిశువుకు ప్రాణము లేదు' అనే వివరము భగవద్గీతలో 'వాసాంసి జీర్ణాని' అనే శ్లోకములో ఉంది. ఈ విషయం నమ్మశక్యం కానిదిగా ఉన్ననూ, వాస్తవంగా అదేమాటే ఖురాన్ గ్రంథములో ఉంది. ఈ విధంగా క్రొత్త మరియు వాస్తవ జ్ఞానము ఇక్కడ మీకు తెలుస్తున్నది. ఇప్పుడు మీరు నేర్చుకున్న 'స్వార్థం' అనే పదానికి అర్థము కూడా క్రొత్త విషయమే. కనుక ప్రతీ వ్యక్తి లోపల స్వార్థాన్ని పెంచుకుని, బయట స్వార్థాన్ని విడిచిపెట్టండి. తద్వారా మీరంతా కిరాయికి ఉంటున్న ఈ శరీరాలనుండి బయటపడి, నీ స్వస్థలమునకు చేరగలవు. అదే మోక్షము, ఆ మోక్షానికి చేరాలంటే మార్గము

తెలియాలి. ఆ మార్గమును చూపించేది జ్ఞానము. ఆ జ్ఞానము భగవద్గీతలో కలదు. ఇంకా బాగా అర్థము కావాలంటే **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**ను చదవండి.

మేము చాలా భగవద్గీతలు చదివాము. కానీ ప్రతి భగవద్గీతలో ఎంతో కొంత అర్థముకాని విషయాలు ఎన్నో ఉన్నాయి. వాటిని దృష్టిలో పెట్టుకుని, మేము వ్రాసినదే **'త్రైత సిద్ధాంత భగవద్గీత'**. దీనిని చాలామంది చదివి, అసలైన జ్ఞానము తెలుసుకుంటున్నారు. చాలా సంతోషం. మేము అనారోగ్యం కారణం వలన బయటకు రాకుండా మీకు ఈ విషయాలు చెప్పుచున్నాము. ఏది చేసినా, చేయించినావాడే, (ఆత్మ) కనుక పని ఆయనది భావము మాత్రము నాది. మనమేమి చేయటం లేదు, లోపలవాడే చేయిస్తున్నాడు అని నీవు తెలుసుకో ఒక దైవగ్రంథములో **"నీవు ఏమి మాట్లాడలేదు, మాట్లాడువాడు నీలోపలివాడే"** అని ఉన్నది. అందువలన పని ఆయనది భావము మనది. భావాన్ని మంచిగా పెట్టుకోండి, మీరు ముందుకు పోగలరు, అందులో అనుమానము లేదు. మీరు ఎంత జ్ఞానము తెలుసుకుంటే అంత కర్మల నుండి బయటపడగలరు, అంతేగానీ జ్ఞానము తెలిసిన వారి దగ్గరకు పోయి వారే మన కర్మలు పోగొట్టుదరు అంటే మళ్ళీ పొరపాటు. మన దగ్గర కర్మలు అనే కట్టెలు చాలా దండిగా ఉన్నాయి వాటిని అనుభవించైనా లేకుండా చేసుకోవాలి లేదా ఆ కర్మలను జ్ఞానమనే అగ్ని ద్వారా కాల్చయినా కాల్చుకోవాలి మరో మార్గము లేదు. మీ అందరు దేవుని సేవ చేయండి. కానీ దేవునికి భజన చేయకండి. దేవునికి నీ భజన అవసరము లేదు.

మేము ఎలాగైతే మమ్మల్ని నమస్కరించవద్దు అని చెప్తున్నామో అలాగే దేవునికి కూడా ఈ నమస్కారాలు ఇష్టపడవు. ఆయనకిష్టమైనది **'దేవుని**

**పని'** అంటే ఆయన పనే, దేవుని జ్ఞానాన్ని అందరికీ తెలియజేయుటయే నిజమైన సేవ అగును. కొందరు మన గ్రంథాలను ఇతర భాషలలోకి అనువదిస్తున్నారు అదీ దేవుని సేవే. కొందరు ఇంటింటికి వెళ్ళి జ్ఞానాన్ని ప్రచారము చేస్తున్నారు. అదీ దేవుని సేవే, కనుక అసలైన దేవుని సేవ చేయండి. తీర్థయాత్రలు చేయవలసిన పనిలేదు. ఈ విధముగా జ్ఞాన ప్రచారము చేస్తే, దేవునికి దగ్గరయ్యే అవకాశము ఉంది. ఈ విధంగా చేయటం అనేది భక్తిమార్గము అవుతుంది. **కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము** అని మూడింటిలో ఈ దేవుని జ్ఞానప్రచారం భక్తియోగము భక్తిమార్గమవుతుంది. కర్మయోగం చేస్తూ భక్తియోగం కూడా చేయవచ్చు. అందుకే మీరు ఏ ఉద్యోగం చేస్తున్నా చేయండి, మానివేయద్దు. కానీ కర్మయోగ పద్ధతిలో దానిని చేయండి.

## 70. శ్రీకృష్ణుడు ఎవరు?

**(తేది : 28.08.2013)**

నేడు శ్రీకృష్ణాష్టమి అని అందరికి తెలుసు. ఇటువంటి కృష్ణాష్టములు చాలా చేసుకున్నాము. కృష్ణాష్టమి సందర్భములో కృష్ణుని గురించి చాలా చాలా చెప్పుకున్నాము. మనము కనీసము ఇక్కడ 10 సం॥ల నుండి కృష్ణాష్టమి చేసినా, మిగతా అనేక చోట్ల అంతా మేము చేయించాము. కృష్ణాష్టమి చేయడం మొదలు పెట్టి 30 సం॥ అవుతుంది. 30 సం॥ల నుండి కూడా మేము కృష్ణుని గురించి, కృష్ణాష్టమి గురించి చెప్పడము జరుగుతూవుంది. కానీ ఈ రోజు మనము చెప్పుకోవడానికి ఏమీ మిగల

లేదేమో అనిపిస్తుంది! అయినా మనము ఆయన (ఆత్మ) ఏది చెప్పిస్తే అది చెప్పాలనుకున్నాము. ఇప్పుడు దాని గురించి మాట్లాడుకుందాము.

ఈ రోజు శ్రీకృష్ణుడు పుట్టిన దినము అని జ్ఞప్తికి చేసుకుంటున్నాము. రేపు ఉత్సవము చేసే దినము గోకులాష్టమి. ఈ రోజు **శ్రీకృష్ణాష్టమి,** లేక **జన్మాష్టమి** అని అంటారు. సరే! ఇప్పుడు కృష్ణుడు ఎవరు? అని ప్రశ్నించు కోవలసిన పని వస్తుంది. ఎందుకంటే ఆధ్యాత్మిక విద్యను తెలిసినటువంటి వాళ్లు ఎంతోమంది ఉన్నారు కానీ, పూర్తి సంపూర్ణమైనటువంటి **ఆధ్యాత్మిక విద్య**ను తెలిసినటువంటి వాళ్ళు, దేవుడు ఎవరు అని బాగా అర్థము చేసుకున్నటువంటి వాళ్లు, కృష్ణుని గురించి గొప్పగా చెప్పుకోవడము, కృష్ణుని జన్మాష్టమి చేసుకోవడము జరుగుతూవుంది. అయితే కృష్ణున్ని మిగతా కొందరు ఎలా అర్థము చేసుకున్నారంటే, కృష్ణుడు బయట ప్రపంచములో జ్ఞానిగా కనిపించలేదు. ఆయన జీవితం అంతా 90 సం॥ల వయస్సు వరకు అల్లరి చిల్లరగా తిరిగినాడు. ఒకవేళ రాజ కుటుంబములో పుట్టి ఆయన పెద్ద ధనికులుగా మరియు రాజుగా ఉండినా ఆయన ఎట్లు చెలామణి అయినా ఆయనలో ఏమీ మంచి ప్రవర్తన కనిపించలేదు అని అందరూ చెప్పుకుంటున్నారు. మేము దాన్ని కూడా ఏకీభవిస్తాము. ప్రపంచములో మనుషులందరూ ఏ పనులు చేశారో అవే పనులు ఆయన కూడా చేశారు. ఆయన 'ఇది మంచి పని' అని, ప్రత్యేకించి నేను మంచివాన్ని అని చెప్పుకోవడానికి ఎక్కడా మంచి పనీ చేయలేదు. ఆ రకంగా 90 సం॥లు జీవితం గడిపిన తరువాత ఒక్కరోజు ఆయన భగవద్గీత చెప్పడము జరిగింది. ఆ ఒక్క **భగవద్గీత**తోనే ఆయన ఎవరయినది మనము అర్థము చేసుకోగల్గి నాము. మిగతా వాళ్ళు చాలామంది ఆయనను అర్థము చేసుకొనే స్థితిలో లేకుండా పోయినారు. 90 సం॥ జీవితాన్ని చూశారు కానీ ఆ తరువాత

ఉండేటటువంటి, ఆయన చెప్పినటువంటి బోధను గౌరవించలేదు. సరే! ఆయన ఆ ఒక్క రోజు చెప్పిన దానితోనే మనము ఆయనను గొప్పగా భావించుకొనే కారణం ఏమంటే, ఆయన చెప్పినటువంటి బోధ అటువంటిది. ఆయన ఏ బోధ అయితే చెప్పినాడో అది సర్వమానవులకు ఆధారమైనటు వంటిది. సర్వమానవులు కర్మల నుండి బయటపడే జ్ఞానమును చెప్పాడు. దేవుడు ఎవరు? అని మనము ప్రశ్నించుకుంటే దానికి జవాబు ఆయన బోధలోనే తెలుస్తుంది.

ఆ కాలములో ఏ బోధలో కూడా తెలియబడని జ్ఞానము ఆయన బోధలో మాత్రమే తెలిసింది. క్రైస్థవులు మా బోధ కరెక్టు, మా మతమే కరెక్ట్, వేరేవి అన్ని ఏవీ సరిగా లేవు అని చెప్పినట్లు, మీరు "ఆయన ఒక్క బోధలోనే జ్ఞానము తెలుస్తుంది. మిగతా ఏ దాంట్లోనూ తెలియదు. ఎవరూ చెప్పలేదు" అని అంటున్నారు. మరి మీరు మీ మతము గురించి గొప్పగా చెప్పుకున్నట్లే కదా! అని ప్రశ్న వేయవచ్చును, ఆయన బోధ తప్ప ఏ బోధ దేవున్ని తెలిపేటటువంటి బోధ కాదు. ఆయన తప్ప, ఎవరూ దేవుని గురించి తెల్పలేదు అన్నాను. అయితే ఎవరు ఆయన? ఎవరిని కృష్ణుడుగా మనము చెప్పుకుంటున్నాము? ఆయన కృష్ణుడేనా అని ప్రశ్న వేసుకుంటే జీవితంలో గుర్తింపు కోసం ఆయనను 'కృష్ణుడు' అని పేరు పెట్టుకున్నాము. ఇంకా వివరముగా చెప్పితే ఈ ఆధ్యాత్మిక విద్యలో ఎట్లు వుందంటే, అంతా గూఢార్థముగా చెప్పే విషయాలు చాలా ఉంటాయి. మీరు బాగా అర్థము చేసుకుంటే మనకు చాలా విషయాలు తెలుస్తాయి. కానీ అర్థము చేసు కొనేటటువంటి స్థితిలో మనిషి లేడు. ఏదైతే కనిపిస్తుందో దానినే నమ్మడం జరుగుతూ ఉంది.

కొంతమంది మమ్మల్ని ఇలా అడిగారు. ఏమయ్యా, దేవున్ని గురించి మీరు బాగా గొప్పగా చెప్పుతున్నారు అని చాలామంది చెప్పుచున్నారు. ఇక్కడకు వచ్చి చూస్తే మీరు ఒక బొమ్మను పెట్టి మ్రొక్కుతున్నారే? కృష్ణుడు అనే బొమ్మను పెట్టి మ్రొక్కుతున్నారు కదా! కృష్ణుడు దేవుడేనా? అని ప్రశ్న వేశారు. దానికి నేను 'కృష్ణుడు' దేవుడు అని ఎవరు చెప్పారయ్యా అని అన్నాను. మరి మీరు మ్రొక్కుతున్నారుగా అని వారంటే, దానికి జవాబుగా నేనుగా మ్రొక్కలేదు. మిగతావారు మ్రొక్కుతున్నారు, జ్ఞానము తెలుసుకున్న వాళ్ళు ఎవరూ మ్రొక్కరు. వాళ్ళకు జ్ఞానము తెలియలేదు కాబట్టి మ్రొక్కుతున్నారు. తెలిసింది కాబట్టి నేను ఎప్పుడూ మ్రొక్కలేదు కదా! అని చెప్పాము. దానికి దేవుడు కృష్ణుడు అంటారు. కృష్ణుడే దేవుడంటారు. మరి మ్రొక్కలేదంటారు, ఒకసారి దేవుడు కాదంటారు. ఏది నిజము అని అడిగారు. అంటే మేము ఎలా చెప్పమంటే అలా చెప్పుతాము. నీకు అనుకూలంగా చెప్పుతాము. నీకు వ్యతిరేఖముగా కూడా చెప్పుతాము. అంటే మేము చెప్పేటటువంటి మాటల్లో ఏది సత్యము అని నీవు తెలుసుకోవడము నీ కర్తవ్యము. మేము రెండూ చెప్పుతాము. కృష్ణుడు ఏం చెప్పాడు? అజ్ఞానాన్ని బోధించాడు, జ్ఞానాన్ని బోధించాడు. అజ్ఞానంగా నడుచుకున్నాడు. జ్ఞానాన్ని బోధించాడు. అయినా గానీ నన్ను గురించి తెలుసుకొనే వాళ్లు తెలుసుకుంటారు. తెలుసుకోలేని వాళ్ళు తెలుసుకోలేరు. ఆ లెక్కన మనము చూసుకుంటే ఇప్పుడు మనము కృష్ణుడు గురించి ఇంత గొప్పగా చెప్పుకోవాలసిన అవసరము ఏమి వచ్చింది. కృష్ణాష్టమి చేసు కోవలసిన పని ఏమి వచ్చింది? అని అడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా!

ప్రపంచములో శిరస్సు మీద గుర్తుగా ఆయన ఒక్కడే **నెమలి పింఛము** పెట్టుకొన్నాడు. ప్రపంచములో ఎవరూ పెట్టుకోలేదు. తరువాత ఇంకో పెద్ద రహస్యం ఏమంటే ఎవరూ 'నేను దేవున్ని' అని చెప్పలేదు. నేను దేవున్ని అని చెప్పే దానికోసం జంకారు. కానీ ఈయన "నేనే దేవున్ని" అని చెప్పాడు. "నేను ఎప్పుడో ఆదిలోనే సూర్యునికి ఈ బోధను చెప్పాను. తిరిగి ఇప్పుడు నీకు చెప్పుతున్నాను విను" అని అర్జునునికి చెప్పాడు. దానికి వెంటనే తిరిగి ప్రశ్న వేశాడు అర్జునుడు. ప్రశ్న వచ్చినప్పుడు అడుగవలసిన కర్తవ్యం ప్రతి ఒక్కరికీ ఉంది. అడగకూడదనేది ఏమీ లేదు. "సృష్ఠి ఆది అంటే ఎప్పుడో కొన్ని లక్షల సంవత్సరముల క్రితం జరిగింది కదా! ఇప్పుడు మీరు బ్రతికే ఉన్నారు, అప్పుడు ఎట్లు సూర్యునికి మీరు చెప్పివుంటిరి?" అని అడిగాడు.

ఆదిలో సూర్యునికి చెప్పాను అంటున్న నీవు ఈ మధ్యనే పుట్టావు కదా! నీవు నా కంటే 5, 6 సం॥లు పెద్దవానివి కదా!" నీ మాట ఎలా నమ్మాలి అని అర్జునుడు అడగడం జరిగింది. అడిగితే ఆయన (కృష్ణుడు) అప్పుడు చెప్పిన ఆ మాటలతో అర్జునుడు బయటపడినాడు. అర్జునుడు ప్రశ్న వేసినప్పుడు, నేను ఆదిలో నుంచి వున్నానని కృష్ణుడు చెప్పాడు. ఆదినుండి ఎప్పుడు ఏమి మాట్లాడినది నాకు తెలుసు. మీరు కూడా సృష్ఠి ఆదిలోనే సృష్ఠించబడినారు. కానీ అప్పుడు నీవు సృష్ఠించ బడినావు అని నీకు తెలియదు. చనిపోవడం, మరలా పుట్టడం, మరలా చనిపోవడం, మరలా పుట్టడం ఈ విధముగా జరుగుతూ జరుగుతూ వచ్చి ఇప్పుడు ఈ రకంగా ఈ రోజు ఈ అర్జునుడు అను పేరుతో యుద్ధం చేసే స్థితిలో నీవు వున్నావు. ఇట్లాంటివి ఎన్ని పరిస్థితులు వచ్చినవో ఏమో నీకు తెలియదు. అవన్నీ నీకు జ్ఞాపకం లేవు. నీవు వరుసగా చస్తున్నావు, పుడుతున్నావ్.

నేను అలా లేను. నాకు అవసరము వచ్చినప్పుడు నేను పుడుతున్నాను. నీవు అవసరము ఉన్నా లేకున్నా చస్తే తప్పనిసరిగా పుట్టి తీరాల్సిందే, ప్రపంచానికి నా అవసరము అనిపిస్తే నేను పుడుతాను. నాకు అన్నీ జ్ఞాపకం ఉన్నాయి, మీకు జ్ఞాపకం ఏవీ లేవు అని చెప్పాడు. సరే! మనము భగవద్గీతలో కృష్ణుని విధానాన్ని గురించి చెప్పుకుంటున్నాము. ఆయన సమాచారం గురించి, ఇప్పుడు మనము వేసుకొనే ప్రశ్న ఏమంటే ఈ 'కృష్ణుడు ఎవరు?'

కృష్ణాష్టమి రోజు కాబట్టి ఈ రోజు ప్రత్యేకంగా ఒక విషయాన్ని తీసుకున్నాము. కృష్ణుడు ఎవరు? అనే విషయాన్ని తీసుకున్నాము. ఈ కృష్ణుడు ఎవరు? అను ప్రశ్నకు మనము కొంత వెనక్కిపోయి జవాబును చూడాల్సిన పరిస్థితి వస్తుంది. వెనక్కి ముందరికి చూస్తే కృష్ణుడు ఎవరనేది తెలుస్తుంది. ఇప్పటికి భగవద్గీత వచ్చి 5150 సం॥ జరిగింది. మరి అంతకాలము వెనక్కి పోయి చూస్తే ఆ రోజు ఒకానొక సమయంలో, 90 సం॥ల వయస్సులో వృద్ధాప్యంలో, భగవద్గీతను చెప్పడం జరిగింది. భగవద్గీతను చెప్పిన తర్వాత, 36 సం॥లు బ్రతికాడు ఆయన. 126వ సం॥లో చనిపోయినాడు. ఆ రోజు ఏం చెప్పాడు? "ఈ భగవద్గీతను నేను సృష్ఠి ఆదిలోనే చెప్పినాను. ఇది మళ్ళీ ఇప్పుడు తిరిగి చెప్పుతున్నాను" అని అన్నాడు. ఇప్పుడు చెప్పాల్సిన పని ఎందుకు వచ్చింది అని అంటే, ఎప్పుడైతే ధర్మాలకు ముప్పు కలుగుతుందో, అధర్మాలు ఎప్పుడైతే చెలరేగుతాయో, అప్పుడు నేను తిరిగి ధర్మాలను గురించి బోధించాల్సిన అవసరము ఉంది కాబట్టి నేను ఇప్పుడు వచ్చాను. నా అవసరము ఇప్పుడు ఏర్పడింది, కాబట్టి నేను ఇప్పుడు చెప్పుతున్నాను అని అన్నాడు. మొట్టమొదటనే సృష్ఠి ఆదిలోనే నా ధర్మాలను గురించి చెప్పాను. ఆ రోజు

అవి అందరికీ తెలిసిపోయినాయి. అందరూ తెలుసుకొని సంపూర్ణ జ్ఞానులై ఉండేవాళ్లు. తరువాత మాయా ప్రభావం వలన అవి ఒక్కొక్కటి, ఒక్కొక్కటిగా తెలియకుండా పోయి చివరకు ఏ జ్ఞానము తెలియని స్థితిలో ఉండి పూర్తి అధర్మాలలో మనుషులంతా మునిగిపోయినారు.

ఆ మాటలు ఎప్పుడు చెప్పినాడు అంటే ద్వాపర యుగము చివరిలో చెప్పాడు. ద్వాపరయుగము చివర్లో ఆ రోజుకు ఈ రోజుకు లెక్క వేసుకొని చూస్తే, ఈ రోజుల్లో సాయంకాలం దీపారాధన చేసేవాళ్లు ఇంట్లో లేరు. కానీ ఆ రోజుల్లో ఉదయం, సాయంకాలం దీపారాధన చేసేవాళ్లు, దేవున్ని మ్రొక్కే వాళ్లు, ఎక్కడ చూసినా ఆ రోజు యజ్ఞ యాగాదులు చేసేవాళ్లు. ఆ కాలములో పూర్వమే గుడులూ గోపురాలు కట్టుకొని వాటికంతా తిరిగి నమస్కారాలు చేసి ప్రదక్షిణలు చేసేవాళ్లు. అలాంటి ఆ కాలములోనే **"అధర్మాలు చెలరేగిపోయినాయి. దేవుని జ్ఞానము ఏమిటిదో తెలియకుండా పోయినది. కాబట్టి ఇప్పుడు నేను చెపాల్సిన పరిస్థితి వచ్చింది"** అని చెప్పినాడు. అంటే అర్జునునికి అనుమానం కల్గింది, ఏమని? వ్యాసుడు వున్నాడు. అష్టాదశ పురాణాలు వ్రాశాడు. చతుర్వేదాలు వ్రాశాడు. ఇంకా కొన్ని శాస్త్రాలు కూడా అంతో ఇంతో వ్రాశాడు. పెద్ద పెద్ద మహర్షులు ఉన్నారు. నారద మహర్షి కూడా అప్పుడప్పుడూ పై నుండి క్రిందికి దిగి వస్తాడు. క్రింది నుండి పైకి పోతుంటాడు. మరి ఇంతమంది ఉంటే ఇప్పుడు అధర్మాలు చెలరేగి పోయినాయి. నేను వచ్చి చెప్పవలసిన పరిస్థితి వచ్చింది అని అంటున్నాడేంటి? అని అర్జునునికు అనుమానం వచ్చింది. బయటకు అడగలేదుగానీ, అడిగినంత అనుమానము అర్జునునికి వచ్చింది. అనుమానం వచ్చివుంటే ఆయన సంశయం నివృత్తి చేసేదానికి మళ్లీ ఈయన కొంత చెప్పాల్సిన పని వచ్చింది. ఏమి చెప్పాడంటే "ఈ జ్ఞానము అనేది

ఏదైతే ఉందో ఇది విద్యలలోకెల్లా గొప్ప విద్య. ఇది కూడా మనం నేర్చుకొనేదే కదా! ఇది విద్య అంటాము. విద్య అంటే తెలుసుకొనేది. విత్ అంటే తెలుసుకోవడం. 'విత్' అనే పదం నుండి 'విద్య' అనే పదం పుట్టింది. తెలుసుకొనేది ఏదైతే ఉందో అదియే విద్య అన్నిటికంటే గొప్పది, ఏదైతే ఉందో అదే ఈ విద్య. దీన్ని **'రాజవిద్య'** అంటారు. తరువాత **'రాజగుహ్య'** అంటారు. అంటే రహస్యాలలో కెల్లా ఏదైతే రహస్యంగా ఉందో దాన్ని 'రాజగుహ్యం' అంటారు. అటువంటి రహస్యమిది. రహస్యాలలోకెల్లా పెద్ద రహస్యం, విద్యలలోకెల్లా పెద్ద విద్య అయినటువంటి దీనిని నీకు చెప్పుతున్నాను. జాగ్రత్తగా విను" అని అన్నాడు.

కృష్ణుడు అధర్మాలు చెలరేగి పోయినాయి అని చెప్పుతూ మళ్లీ ఇప్పుడు జ్ఞానం చెప్పుతా విను అన్నాడు. ఈ జ్ఞానం సృష్టి ఆదిలోనే సూర్యుడికి చెప్పివుంటిని. తరువాత సూర్యుడు మనువుకు చెప్పాడు. మనువు ఇక్ష్వాకుడుకి చెప్పాడు. ఇక్ష్వాకుడు ఇంకొక రాజుకు చెప్పాడు. ఈ రకంగా ప్రపంచం అంతా ప్రాకి పోయింది అని చెప్పాడు కదా! ఇది ఎంతమటుకు నిజం అని అర్జునునకు అనుమానం వచ్చింది. అప్పుడు కృష్ణుడు చెప్పడంతో అర్జునునకు సంశయం తీరిపోయిందన్నమాట. **"నేనే దేవున్ని, నన్నే మ్రొక్కు, నన్నే నమస్కరించు నీకు ఇంకొక దారి లేదు"** అని చెప్పాడు. ఆ రకంగా కృష్ణుడు తప్ప ఎవరూ చెప్పలేదు. ఎక్కడ చెప్పినా, ఎవరికీ అర్థము కాకుండా కొంత మరుగున పెట్టి చెప్పారు. కానీ అలా చెప్పాల్సిన అవసరం ఏమి వచ్చింది అని ప్రశ్నించుకొంటే దాన్ని గురించి మనం కొంత ఆలోచన చేసుకోవలసిన అవసరముంది.

ఇప్పుడు కృష్ణుడు చెప్పిన జ్ఞానం గొప్ప జ్ఞానం అని అనుకున్నాము కదా! ఈ జ్ఞానము తప్ప ఇంక ప్రపంచములో వేరేది ఏదీ లేదు గొప్పది

కాదు అన్నాము కదా! ఇప్పుడు మీలో ఒక వ్యక్తి వున్నాడు, అతడు వేరే మతస్తుడుగా ఉన్నాడనుకోండి. ఇతర మతస్థుడు మా మతం గొప్ప, మా మతం గొప్ప, మా జ్ఞానం గొప్ప మా గ్రంథము గొప్ప అంటుంటాడు కదా! అలా అంటూ వేరే మతాన్ని తక్కువ చేసి మాట్లాడుతుంటారు. వేరే గ్రంథాన్ని కూడా తక్కువ చేసి మాట్లాడుతుంటారు. ఇప్పుడు మీరు కూడా ఈ రోజు అదే కోవకు చెందినట్లు మాట్లాడుచున్నారు. మీరేమి చెప్పుతున్నారు? 'ఈ జ్ఞానం తప్ప' ఏదీ గొప్పది కాదు అని అంటున్నారు. కృష్ణుడు తప్ప గొప్పగా చెప్పినవాడు ఎవరూ లేరంటున్నారు. అప్పుడేమనాలి? మీరు కూడా ఇట్లే చెప్పినట్లు కదా! అని నన్ను ప్రశ్న వేయవచ్చు.

ఇప్పుడు 'ఈ జ్ఞానం తప్ప' అని చెప్పాను, అలాగే ఈయన తప్ప ఎక్కడా చెప్పలేదు అన్నాము. వాస్తవమే ఈ జ్ఞానము తప్ప ప్రపంచములో ఎక్కడా గొప్పది లేదు అన్నాను. ఇది నూటికి నూరుపాళ్లు వాస్తవం. ఎక్కడా సంశయం లేదు. నేను 'ఈయన తప్ప' అని చెప్పాను. ఈ జ్ఞానం ఎక్కడైనా ఉండవచ్చు. ఎక్కడున్నా ఈ జ్ఞానం తప్ప వేరే జ్ఞానమంతా తక్కువదే. ఈ జ్ఞానం ఎక్కడుంది? ఒక్క భగవద్గీతలోనే ఉందా? అని మనము ప్రశ్నించు కుంటే భగవంతుడు చెప్పినటువంటిది కాబట్టి 'భగవద్గీత' అని పేరు పెట్టినారు. మళ్లీ ఇక్కడ చెప్పినది ఎవరు? కృష్ణుడు కదా! పేరు పెట్టినది ఏమని? 'కృష్ణ గీత' అని పేరు చెప్పవచ్చు లేదా 'కృష్ణ బోధ' అని చెప్పవచ్చు. ఒక నిజమైన భావంతో కూడుకొని వున్న అర్థము వచ్చేటట్లుగా 'భగవద్గీత' అన్నారు. గీత అంటే హద్దు అని, నీకు ఏర్పరచిన హద్దు అంటే భగవంతుడు చెప్పినది అది. ఇప్పుడు ఈయన కృష్ణుడా? భగవంతుడా? కృష్ణుడు పెట్టుకొన్న పేరేది? కృష్ణుడు ఒక ఆకారానికి గుర్తింపుగా పెట్టుకున్న పేరు. కృష్ణుడు దేవుడా? అంటే నేనెప్పుడూ చెప్పలేదే! కృష్ణుడు భగవంతుడని చెప్పుతాము.

ఇంక ఇప్పుడు లెక్కేసుకొంటే **'భగవంతుడు'** అనే పదం ఈయనకు వర్తించింది. భగవంతుడు అంటే ఏమిటి? అంటే ఆకారంతో పుట్టినటువంటి వాడు. ఒక ఆకారాన్ని ధరించి పుట్టినటువంటి వాడు. ఒక ఆకారాన్ని ధరించి మనము కూడా పుట్టినాము కదా! అని మీరు ప్రశ్న వేయవచ్చు. ఆకారం ధరించి మనము పుట్టినాగానీ, మనము గర్భము నుండి పుట్టలేదు. తల్లి భగం నుండి శరీరం పుట్టిన తర్వాత అందులో మనము వచ్చి చేరుకున్నాము. కాబట్టి ఎవ్వరూ కూడా శరీరంతో సహా తల్లిగర్భం నుండి పుట్టలేదు. అందువలన ఎవ్వరమూ భగవంతులు కాము. తల్లిగర్భం నుండి ఎవరైతే సజీవముగా పుట్టారో వారు మాత్రమే భగవంతుడు. అంటే మనమంతా సజీవముగా పుట్టినాము కదా! అని కొందరు అంటే అది మీ భ్రమ అని చెప్పినాము. 1980వ సం॥లోనే ఇప్పటికి 38 సం॥ల క్రితం మేము **"జనన మరణ సిద్ధాంతము"** అనే గ్రంథము వ్రాయడం జరిగింది. ఆ గ్రంథములో తల్లిగర్భంలో నుంచి ఏ మానవుడుగానీ, ఏ జీవరాశిగానీ సజీవముగా పుట్టలేదు అని చెప్పాము. తల్లిగర్భము నుంచి ఎవరైతే పుడతారో వాళ్లు మాత్రము భగవంతులు అవుతారు. వారినే పద్ధతి ప్రకారం 'భగవంతుడు' అని పిలవాలి. కానీ అలా పుట్టేవాడు ఒక్కడే ఒక్కడు పుడతాడు. అతనికి పేరు లేదు, మనకు గుర్తింపుగా "దేవుడు" అనుకుందాము. ఆయన తప్ప ఇంకెవరూ పుట్టేదానికి వీలులేదు, అలా పుట్టినటువంటి వానినే మనము "భగవంతుడు" అని అంటాము.

భగము నుంచి పుట్టినటువంటి వాడు భగవంతుడు. మన దేశంలో చాలామంది 'భగవంతుడు' అని పేరు పెట్టుకున్నారు కదా! అని కొందరు అడుగుచున్నారు. పేరు ఎవరయినా పెట్టుకోవచ్చు, దానిదేముంది? 'రామ' అంటే ఏమని, నాశనం చేయువాడు అనీ, కర్మను నాశనం చేయువాడు

అనీ, నన్ను నాశనం చేయువాడు అని అర్థము. 'మ' అంటే నేను, 'ర' అంటే నాశనం అన్నమాట. నన్ను నాశనం చేయువాడు అన్నా, నేను దానివల్ల నాశనం అవుతాను అన్నా ఒకటే. అది నన్ను నాశనం చేస్తుంది అన్నా ఒకటే. రామ అన్నా మరా అన్నా రెండూ ఒక్కటే అర్థము వస్తాయి. **శ్రీరామ అంటే కర్మంతా నశించిపోయి, నేను నశించిపోయి దేవునిలోనికి ఐక్యం అయిపోతాను అని అర్థము.** నేను నేనుగా లేకుండా దేవుని లోనికి ఐక్యమైపోతాను. నేను నాశనం అయిపోతాను అని అర్థము. నేను నాశనం అయిపోతాను అనే అర్థము, 'రామ' అనే పదంలో ఉంది. రామ అంటే మోక్షాన్ని కోరుకొను పదం. రామ అంటే గొప్ప అర్థముతో కూడుకొన్న పదం. కానీ రామ అనే పదాన్ని ఒక మనిషికి పేరు పెట్టినా అతనిని రామ అనే అంటాము. కానీ మనుషులు పేరు పెట్టుకున్నంత మాత్రమున రామ అవుతారా? నిజంగా రామ అనే శబ్దం వారికి వర్తిస్తుందా అంటే, గుర్తింపుకు పెట్టుకున్నదేకానీ, అంత భావం వాళ్లలో ఉండదు. రామ అనుకొంటేనే కర్మ పోతుందా? అంటే ఆ రెండు అక్షరాలు భావరహితముగా అనుకుంటే పోదు. ఆ రకంగా భగవంతుడు అని పేరు ఎవరు పెట్టుకున్నా గానీ, అది గుర్తింపు కోసం వాళ్లు పెట్టుకున్నదేగానీ, వాస్తవముగా వారు భగవంతులు కారు. వారు తెలియక పెట్టుకున్నారు. వాస్తవముగా భగవంతుడు అనే దానికి అర్థము తెలిసియుంటే, అంటే భావం తెలిసివుంటే, అంత పెద్ద పేరు నేను పెట్టుకోకూడదని ఎవరు కూడా పెట్టుకోరు. ఈ విషయము తెలియక వాళ్లు ఏమి చేశారంటే భగవాన్ అనే బిరుదును అతికించుకున్నారు. కానీ 'భగవాన్' అనే పేరు ఎవరికి సరిపోతుంది అంటే 5000 సం॥ల పూర్వము పుట్టిన ఒకే ఒక కృష్ణ పరమాత్మకు సరిపోతుంది. మళ్ళీ ఎవరికైనా సరిపోవచ్చును. కానీ తర్వాత పుట్టలేదు అని చెప్పే దానికి అవకాశము లేదు.

భగవద్గీత జ్ఞానం తప్ప వేరే జ్ఞానం లేదా! అంటే ఆ జ్ఞానం తర్వాత చెప్పలేదని నేను చెప్పలేదే! భగవద్గీత జ్ఞానం తర్వాత ఎప్పుడైనా చెప్పియుండ వచ్చు. మళ్ళీ ఎప్పుడు అధర్మాలు చెలరేగితే అప్పుడు ఆ జ్ఞానము చెప్పబడు తుంది. భూమి మీద 5000 సం॥ల తర్వాత మళ్లీ ఆ జ్ఞానం రాలేదా? అధర్మాలు చెలరేగలేదా? అంటే చెలరేగి ఉండవచ్చు. అప్పుడు భగవంతుడు వచ్చి ధర్మములను చెప్పియుండవచ్చు. ఆ చెప్పినవాడు ఎవడో తెలియక పోవచ్చును. ఆయన చెప్పినది నిజమైన జ్ఞానం. మేము భగవంతుడు చెప్పినది నిజమైన జ్ఞానం అని అన్నాముగానీ, వేరే మతాల్లో ఇది లేదు అని చెప్పలేదు కదా! అర్థమయిందా? సరే మళ్ళీ మీరు ఒక హిందూ మతాన్నే కాకుండా అన్ని మతాలను సమానంగా చూస్తున్నప్పుడు, అన్ని మతాలలో ఉండే జ్ఞానం సమానం అని చెప్పేటప్పుడు, దేవుని జ్ఞానం అన్నింటిలో ఒకే విధముగా వుంది అని చెప్పడానికి ఉదాహరణగా ఏమయినా ఉందా అని ప్రశ్నిస్తే దానికి జవాబుగా దేవుడు అన్ని మతములలో భగవంతునిగా వచ్చి తన జ్ఞానమునే చెప్పాడని అన్ని మత గ్రంథములలో కలదు. అంతిమ దైవగ్రంథములో **"దేవుని జ్ఞానం దేవునికి తప్ప ప్రపంచములో ఏ మానవునికీ తెలియదు"** అని అన్నాడు. అంటే ఏ మానవునికీ దేవుని జ్ఞానం తెలియనప్పుడు మనకెలా తెలుస్తుంది? ఆయనే భూమిమీదికి భగవంతునిగా వచ్చి చెప్పియుండును. అందువలన అన్ని మతములలో ఒకే దేవుని జ్ఞానము కనిపిస్తుయున్నది.

మనము ఈ రోజు ఇక్కడ దేవుని జ్ఞానాన్ని ఆశించి వచ్చాము. దేవుని జ్ఞానాన్ని తెలుసుకోవాలని వచ్చాము. మళ్లీ అటువంటప్పుడు దేవుని జ్ఞానము ఎవరికీ తెలియదు అని ఖచ్చితంగా చెప్పినప్పుడు, మళ్లీ ఎవరికీ తెలియనప్పుడు, మనము వినాల్సిన అవసరమే లేదు కదా! చెప్పే వాళ్లంతా,

దేవుళ్లు కారు, చెప్పబడేదంతా దేవుని జ్ఞానము కాదు కదా! అని మనకు ప్రశ్న వస్తుంది. కానీ ఒక విషయము ఏమంటే దేవుని జ్ఞానము ఎవరికీ తెలియదు. కానీ **శ్రద్ధ** ఉన్నటువంటి వాడు ఎవడైనా దానిని గ్రహించు కుంటాడు అని భగవంతుడు అన్నాడు. శ్రద్ధ ఉన్నవాడు ఎవడైనాగానీ గ్రహించుకోగల్గుతాడు అని దైవ గ్రంథములలో ఉంది. తెలుసుకోవాలన్న ఆసక్తి ఉన్నటువంటి వాడు ఏ మతమువాడు గానీ వానికి దేవుని జ్ఞానము తెలియబడుతుంది. నేను మీకు విషయాన్ని చెప్తుతుంటే, మీకు చెవుల ద్వారా లోపలికి పోయినటువంటి విషయాన్ని, మనస్సు దాన్ని తీసుకొని పోయి తలలోనున్నటువంటి బుద్ధికి చేర్చితే, ఆ బుద్ధి దాన్ని గ్రహించు కుంటుంది. అంటే బయట ఉండే విషయం మీ వరకు చేరి అది మీ మెదడులో ఉన్నటువంటి బుద్ధికి చేరి, ఆ బుద్ధి గ్రహించుకుంటుందన్న మాట కాదు కదా! మరి ఎట్లా గ్రహించుకుంటాము? అనే ప్రశ్న వస్తుందన్న మాట. దేవుని జ్ఞానం ఎలా తెలియబడుతుంది అని అంటే ఆయన ఇంకొక మాట చెప్పినాడు. గీతకాదు, ఖురాన్ అని నేను ఇంకొక పేరు మార్చి చెపుతున్నాను. పేరు మార్చి ఖుర్ఆన్‌లో 42వ సూరా 51వ ఆయత్‌లో **"దేవుడు నేరుగా ఎవరితోనూ మాట్లాడడు"** అని అన్నాడు. ఆయన ఊరకుండేవాడు అని చెప్పినాము కదా! ఆయన పని చేసేవాడు కాదు, ఆయనకు ఆకారము లేదు, పేరు లేదు. **రూప, నామ, క్రియలు లేనివాడు దేవుడు** అని చెప్పాము. ఆ రూలుకి వ్యతిరేఖంగా ఎక్కడా ఆయన ప్రవర్తించడు. దేవుడు ప్రత్యక్షంగా ఎవరితోనూ మాట్లాడడు. మాట్లాడితే ఆయన పని చేసినట్లవుతుంది.

కాబట్టి ప్రత్యక్షంగా దేవుడు ఎవరితోనూ మాట్లాడడు అంటే మరి దేవుని జ్ఞానము మనకు ఎలా తెలుస్తుంది? అని ప్రశ్న రావచ్చును. దానికి జవాబుగా నేను ఎవరితోనూ మాట్లాడను కానీ తెలియజేస్తాను అని అన్నాడు.

మూడు విధాల, త్రైతం ఏ విధముగా ఉందో అలాగే మూడు విధాలుగా తెలియజేస్తాను అని అన్నాడు. మూడు విధాలుగా ఎలా తెలియజేస్తాడు అంటే దానికి ఈ విధముగా చెప్పాడు. ఒకటి శబ్దము ద్వారా (వాణి ద్వారా). (వాణి అంటే ఖురాన్‌లో 'వహీ' అంటారు.) రెండోది తెరచాటు నుండి తెలియజేస్తాను అన్నాడు. (వ్యక్తి వుంటాడు, తెర అడ్డముంటుంది. వాడు ఎవడు చెప్పేది తెలియదు. ఎవరు చెప్పేది కూడా తెలియదు. కానీ తెరచాటు నుండి తెలియబడుతుంది. వ్యక్తి ఉండి చెప్పడం, దాన్ని గురించి మళ్ళీ వివరముగా చెప్తాము.) ఇంకా మూడో విధానం ఒకటి ఉంది. అది నా దూత ద్వారా మీకు తెలియబడుతుంది అన్నాడు. (దూత అంటే మనకు అర్థము కాదు. దూత అంటే, వార్తలను తీసుకొని వచ్చి మనకు అందించే వాడు అని. అక్కడ సమాచారాన్ని తీసుకొని వచ్చి ఇక్కడ మనకు అందించేవాడు అని అర్థము.) ఇప్పుడు మనము ఏమి చెప్పామంటే కృష్ణున్ని దూత అన్నాము. కృష్ణున్ని దూత అని చెప్పి, ఆయన దేవుని జ్ఞానాన్ని తీసుకొని వచ్చి అందించాడు కాబట్టి, ఈయన భగవంతుడు కాబట్టి ఇక్కడ భగవద్గీత అని పేరు పెట్టాము. ఇదంతా దేవుని జ్ఞానమే. దేవుడు ప్రత్యక్షంగా చెప్పలేదు. ఆయన దూత ద్వారా చెప్పబడింది. ఎవరి దూత? దేవుని దూత ద్వారా! దేవుని దూత ఎవరు? కృష్ణుడు. కృష్ణుడు వచ్చి ఆ విషయాన్ని చెప్పగల్గినాడు కాబట్టి ఆయన్ని దేవుని దూత అంటున్నాము. ఆయనకు భగవంతుడు అని ప్రత్యేకమైన పేరు పెట్టినాము. దూత అంటే సమాచారాన్ని తీసుకొచ్చేవాడు. మొట్టమొదట సమాచారాన్ని తీసుకొని వచ్చినవాడు ఎవడో అంతకు ముందు ఎప్పుడు చెప్పినాడో మనకు తెలియదు, కానీ ఒకసారి సమాచారాన్ని తీసుకొని వచ్చిన వాన్ని మనము 'భగవంతుడు' అన్నాము. ఆయన చెప్పిన బోధకు భగవద్గీత అని పేరు పెట్టాము. మళ్ళీ ఆయన

భగవంతుడు అయినప్పుడు, అంటే దూతగా వచ్చి చెప్పినప్పుడు, అంటే ఆయన అదే రకంగా, అదే దూతగా ఎక్కడైనా వచ్చి చెప్పవచ్చు. కానీ కృష్ణునివలె ఆ రోజున నెత్తిన కిరీటం పెట్టుకొని, నెమలిపింఛం ధరించి వచ్చి చెప్పడు. మళ్ళీ అలా వస్తే ఆయనను కనుక్కొంటారు. అందువలన ఆయన ఒకే ఆకారముతో రాడు. ఈ రోజు కృష్ణాష్టమి కాబట్టి కృష్ణుని జ్ఞాపకార్థం నేను కిరీటము పెట్టుకున్నాను. ఐదు సం॥ ల క్రితం ఇలాగే పెట్టుకున్నాను. ఈ రోజు మళ్ళీ ఇప్పుడు పెట్టుకున్నాను. కిరీటమును ఎందుకు పెట్టుకోవాల్సిన పని వచ్చిందంటే, దీనికి **త్రైత సిద్ధాంతం** గుర్తు ఉంది. దీని మీద కాల, కర్మచక్రాల గుర్తు ఉంది కాబట్టి, దీనిని పెట్టు కోవాల్సిన పని వచ్చింది.

ఈ రకంగా ఈ సిద్ధాంతం ఎంతవరకు కొనసాగుతుందో, ఎవరైతే కొనసాగిస్తారో, వాళ్ల తల మీదికంతా ఈ కిరీటం ఎక్కుతూ ఉంటుంది. మొట్టమొదటి కిరీటం ధరించిన వాన్ని నేను. త్రైత సిద్ధాంతమునకు ఈ కిరీటమునకు సంబంధము ఉంది కాబట్టి ఆ విధానం మీకు తెలియాలి అనే ఉద్దేశ్యముతో ఈ రోజు ఈ కిరీటం పెట్టుకోవడం జరిగింది. అట్లే నెమలిపింఛం పెట్టుకోవడం జరిగింది. కృష్ణుని జ్ఞాపకార్థం అంతేగానీ ఇంకొకటి ఏమీ లేదు. ఆ రోజు వచ్చిన రకంగా ఆయన రాడు. ఇంకో రకంగా వేషం మార్చుకొని రావచ్చునేమో! చెప్పలేము కదా! అదే దేవుడు ఏమి అన్నాడంటే నేను దొంగతనం మీ ఇంటికి వచ్చి చేస్తాను అన్నాడు. ఒక ఇంటికి వచ్చి దొంగతనం చేస్తాను అని ఒక వ్యక్తి చెప్పినాడు అనుకోండి. వాడు ఎట్లు వస్తాడో చూస్తామని పట్టుకుందాము అని నీవు అనుకుంటే, వాడు నీవు గుర్తించేటట్లు ఎందుకు వస్తాడు? ఒకసారి గ్రుడ్డివాని మాదిరో, ఒకసారి కుంటివాని మాదిరో, ఏదో రకంగా వచ్చి నీ ఇంట్లో ఠికానా వేసి

ఎప్పుడో ఒకసారి నీకు తెలియకుండా ఎత్తుకొని పోతాడు. దొంగతనం చేసినాను అంటాడు. చివరకు ఈ సారి ఎట్లో కనుక్కోలేదు. మళ్లీ ఈ సారి వచ్చినప్పుడు కనుక్కొంటాము అని అనుకొన్నావు అనుకో. ఆ రోజు ఇంకో వేషం మార్చుకొని వస్తాడు. ఇంకొక పేరు పెట్టుకొని వస్తాడు. దేశములో సిఐడిలు ఒక దొంగను పట్టుకోవాలన్నా లేక సమాచారాన్ని సేకరించాలన్నా, ఒక ఇంట్లోకి పోయి తిష్ఠవేసి, సమాచారాన్నంతా లాక్కొని వస్తారు. మనుషులే అలా ఉన్నప్పుడు, దేవునికి ఎందుకు చేతకాదు. ఏ రకంగానైనా ఆయన వచ్చి జ్ఞానము చెప్పిపోవచ్చు కదా! దూత వచ్చి జ్ఞానమును చెప్పినాడు అనేది మనకు తెలుసు. నేను స్వయంగా మీతో ఎప్పుడూ మాట్లాడను, నేను దూత ద్వారా నా జ్ఞానము చెప్పించాను అని దేవుడు అన్నాడు. ఆ దూత ఎవరు అంటే కృష్ణుడు అని మనము చెప్పగలము. ఆయన చెప్పినదే భగవద్గీత! బాగా జ్ఞాపకం పెట్టుకోండి. తర్వాత అతను దూతగా ఎక్కడా రాలేదా? అంటే వచ్చాడు అని చెప్పవచ్చును. కానీ ఇదే పేరెందుకు పెట్టుకొని వస్తాడు? ఇప్పుడు మనము కనుకొన్నాము. ఒకమారు దొంగగా వచ్చి దొంగతనం చేసిపోయాడు మళ్ళీ అట్లే వస్తే మనము దొంగని కనుక్కొంటాము కదా! కాబట్టి మళ్ళీ అట్లే రాడు, ఇంకో రకంగా వేరే విధంగా రావచ్చు. కృష్ణుడుగా వచ్చాడు, జ్ఞానాన్ని చెప్పినాడు, పోయినాడు. అతని పేరు కొంతకాలానికి మనకు తెల్సిందది, ఒహో! ఇది దేవుని జ్ఞానము, ఇది తప్ప గొప్ప జ్ఞానము లేదు. వచ్చినటువంటివాడు ఆయన దూత అని మనకు తెలిసిపోయింది.

మళ్లీ తరువాత ఇంకా ఎక్కడైనా వచ్చి చెప్పినాడు అనుకోండి. ఆ రోజు అదే పేరుతో, అదే ఆకారంతో ఆయన రావాల్సిన అవసరము లేదు. వేరే పేరుతో వేరే ఆకారంతో వచ్చాడనుకోండి. చెప్పే బోధ అదే. అయినా

దానికంటే మించిన బోధ లేకపోయినా మొదట వచ్చినవాడే అని గుర్తించుటకు అవకాశమే లేదు. ఆ రకంగా చెప్పిపోయిన సందర్భములు కూడా ఉన్నాయి. వేషం మార్చుకొని, పేరు మార్చుకొని ఇదే జ్ఞానాన్ని చెప్పిపోయాడు. అయితే రెండవమారు చెప్పిన బోధకు భగవద్గీత అని పేరు పెట్టలేదు. ఇక్కడ ఏ పేరు పెట్టామో అక్కడ అదే పేరు పెట్టకుండా వేరే పేరు పెట్టడము జరిగింది. వేరే వేరు పెట్టినా కూడా ఇదీ అదీ ఒక్కటే జ్ఞానమని కనుక్కోగల్గినాము. అదీ ఇదీ రెండూ ఒకటే జ్ఞానమని వారు వీరు ఇద్దరూ ఒక్కటే అని కూడా కనుక్కోగల్గినా మిగతా ప్రజలు ఎవరూ ఒప్పుకోవడము లేదు వారు వేరే, వీరు వేరే అని అనుకున్నారు. నాకు ఒక వ్యక్తి ప్రశ్న వేశారు. "ఈ రోజు మీరు ఒక గ్రంథం రిలీజ్ చేసి ఇచ్చారు. **"హేతువాదము– ప్రతివాదము"** అనే గ్రంథము. అది 450 పేజీల గ్రంథము అయితే దాంట్లో చివరి పేజీలో ఒక మాట వచ్చింది"

"దేవుని దూతగా కృష్ణుడు వచ్చాడు అని అన్నారు. తర్వాత మీ మాటల్లో దేవుని దూతగా ఏసుప్రభువు పేరు చెప్పారు. వచ్చాడు అతనే ఇతను, ఇతనే అతను అని రెండు జ్ఞానాలు ఒక్కటే అని చెప్పారు. సరే! మీరు ఎట్లయినా చెబుతారు గానీ, ఈ సారి మళ్ళీ ఎప్పుడైనా వస్తానన్నారు కదా! ఈ సారి ఎట్లు వస్తాడు? ఎప్పుడు వస్తాడు, ఏ పేరుతో వస్తాడు? అంటే మొట్టమొదట ఒక దూతను పంపాడు. మళ్ళీ రెండోసారి రెండో దూతను పంపినాడు. ఇద్దరూ ఒక్కటే అని మీరు అంటున్నారు గానీ, మేము వేరు వేరు దూతలు అనుకుంటున్నాము. మళ్ళీ ఈసారి పంపితే, ఎవరిని పంపుతాడు" అని అడిగినారు. దానికి నా జవాబు ఏమనగా! దేవునికేమైనా ఇల్లు ఉందా? వాకిలుందా? ఏమీ లేదు కదా! మరి అడ్రసు కూడా లేదు. దేవుడు అణువు అణువునా వ్యాపించి ఉన్నాడు. ఆయన

దగ్గర ఎవరుంటారని చెపుదాము మనము. పంపించే దానికి ఎవరూ లేరు, నేను దూతను పంపుతాను అనేదంతా అబద్ధం. దేవుడు ఎల్లప్పుడు నిజం చెప్పడు. అబద్ధాలు కూడా చెప్పుతుంటాడు. ఎందుకు? మీరు సత్యమైన జ్ఞానాన్ని తెలిసే దానికోసం, వాస్తవముగా ఆయన దగ్గర ఎవ్వరూ లేరు. ఒకవేళ ఆయన దగ్గరకు ఎవరైనా పోతే ఆయనలోనికే కలిసిపోతారు. ఎవరూ వేరుగా ఉండే అవకాశమే లేదు. అందువలన దేవుని దగ్గర వేరుగా ఉండేవాడు ఎవరూ లేరు. ఎవరైనాగానీ ఆయనలోనికి ఐక్యం అయిపోయి ఉంటారు. నీవు సంపూర్ణమైన జ్ఞానము తెలుసుకొని, నీ కర్మంతా లేకుండా చేసుకొంటే, కర్మంతా ఏదీ అనుభవించే దానికి లేకుండాపోతే, దేవునిలోనికి ఐక్యమైపోతావు గానీ, వేరుగా రెండుగా ఎవరూ లేరు. అంతా ఒక్కటే అయిపోతారు. కావున ఉండేవాడు దేవుడు ఒక్కడే. దూతను పంపిస్తాడంటే, వేరే దూత ఉంటే కదా! పంపించే దానికి ఒరే గ్రుడ్డివాడా గుమస్తాగా వచ్చేది ఆయనే! నీకు తెలియడం లేదు" అని చెప్పాము.

వచ్చేవాడు దేవుడని పేరు పెట్టుకొని రాడు. ఆయన భగవంతుడు అని పేరు పెట్టుకొని వస్తాడు. అంతేగానీ నేను వచ్చినానా? అంటాడు. నీవు వచ్చినావు కదా! అని అంటే నేను ఎప్పుడు వచ్చినాను? నా పేరు దేవుడు. నేను వచ్చినానా అంటాడు. కానీ ఆయన దేవునిగా ఎప్పుడూ రాలేదు. వచ్చేదానికి అవకాశమే లేదు. కానీ వచ్చేది ఆయనే. చెప్పేది ఆయనే. చెప్పినది ఒక్కటే జ్ఞానమే దాంట్లో తిరుగు లేదు. ఆ వచ్చినవాడు ఎవరు? కృష్ణుడు. ఉండేవాడు ఒక్కడే, అణువణువునా వ్యాపించి ఉన్నది ఎవరో వాడే వచ్చినాడు. నేనే వచ్చినాను అని గుర్తుగా ప్రపంచమంతా నేను ఆవహించి ఉన్నాను. నన్ను మించినది ఎవరూ లేరు. ఎవడు

మ్రొక్కినా, ఆ మ్రొక్కులు నాకే చేరుతాయి. ఎవరు ఏ విధమైన ఆరాధన చేసినా, నాకే చేరుతాయి. ఏ విధమైన పేరుతో మ్రొక్కినా అవన్నీ నాకే చేరుతాయి. ఎవడు వచ్చినా నా దగ్గరకు రావాల్సిందే అని భగవద్గీత చివరిలో చెప్పినాడు. చెప్పలేదా భగవద్గీతలో చెప్పాడు. "నన్ను మించిన ఘనత కలది వేరే లేదు పార్థా! నన్ను మించి ఉండేది వేరేది లేనే లేదు ప్రపంచములో" అన్నాడు. **"సర్వము సృష్ఠించినది నేనే. సర్వాన్ని హరించేది కూడా నేనే"** అన్నాడు. ఇవన్నీ నాశనం అయిపోవుచున్నాయి. అన్నీ నాలోకి వస్తున్నాయి. నా కాలగర్భములో కలిసిపోతున్నాయి అని చెప్పాడు.

అన్నీ నేనుగా ఉన్నాను అని వివరముగా చెప్పాడు. అక్కడ చెప్పిన తరువాత కూడా ఇంకొక గుమాస్తా వస్తాడని అనడము బుద్ధి తక్కువ పని అగును. ఒకసారి పురుషోత్తముడు అనే రాజు దగ్గరకు అలెగ్జాండరు ఒక దూతను పంపించాలని అనుకున్నాడట. వార్తాహరుడు వచ్చాడు. అలెగ్జాండర్ దగ్గరి నుండి వార్తను తీసుకొని వచ్చాడు పురుషోత్తమ రాజు దగ్గరికి, కానీ ఆయన అక్కడ మాట్లాడాలి కదా! ఆ రాజు దగ్గరకు వచ్చి అక్కడికి వచ్చి మాట్లాడాలంటే ఎవడైతే మాట్లాడుతాడో, ఏమని మాట్లాడాలో, ఎంత అవసరము ఉంటే అంత మాట్లాడాలి. కానీ అలెగ్జాండర్ చక్రవర్తే దూతగా వచ్చాడు. వార్తాహరుడిగా వచ్చాడు. వచ్చి ఆయనే స్వయంగా మాట్లాడినాడు. కానీ ఈ పురుషోత్తముడు కనుక్కొన్నాడు. ఈయన మామూలుగా వచ్చిన వార్తహరుడు కాదు. వచ్చినవాడు అలెగ్జాండర్ అని కనుక్కొన్నాడు. ఆ రకంగానే ఇక్కడ ఉండే పరిస్థితి ఏమిటంటే నేను మూడు రకాలుగా మీకు జ్ఞానాన్ని తెలియజేస్తానని చెప్పాడు. చెప్పాడా? ప్రత్యక్షంగా ఎవరితోనూ మాట్లాడను అని చెప్పాడా? నా దూత ద్వారా మీకు జ్ఞానాన్ని తెలియజేస్తాను. తెరవెనుక నుంచి తెలియజేస్తాను. ఆకాశవాణి ద్వారా తెలియజేస్తాను అని అన్నాడు కదా!

మూడు రకాలుగా తెలియజేస్తాను అని ఉంది కదా! ఈ రోజు ఇప్పుడు ఇది ఒక రకంగా దూతను పంపించడం ద్వారా తెలియజేయడం అనేది, ఈ జ్ఞానం ఎవరు చెప్పారు? దూత అంటున్నాము మనము. వచ్చేవాడు దూత అని అంటున్నాము. వచ్చేవాడు ఎవడు? వుండేది ఒక్కడే. ఇంకొక్కడంటూ ఎవడూ లేడు. కాబట్టి వచ్చినవాడు ఎవడు? వాడే. ఎవని జ్ఞానమైతే గొప్పదో ప్రపంచములో వాడే వచ్చాడు. వాడు ఎక్కడ వచ్చినా ఒక్కడే రావాల్సిందే. ఇంకొకడు వచ్చేదానికి అవకాశమే లేదు. ఈ ప్రశ్న అడిగినప్పుడు అదంతా మనకెందుకు లేవయ్యా, అదంతా పెద్ద రహస్యం మనకు వద్దులే. ఎంతమంది వున్నారో మనకు తెలియదు కదా అనుకోవచ్చు కానీ వాస్తవముగా చెప్పుకుంటే వచ్చేవాడు ఒక్కడే, వచ్చేది ఒక్కడే. ఎక్కడైనా రానీ ఒక్కడే వస్తాడు. ఒకే విషయాన్ని చెప్తాడు. ఎప్పుడైతే ధర్మాలకు ముప్పు ఏర్పడుతుందో. అప్పుడు నేను వస్తాను అన్నాడు గానీ! ఇంకొకడు వస్తానన్నాడా? నేను దూతను వస్తానన్నాడు. నా దూతను పెట్టుకొని అంటే సపరేట్‌గా వస్తాను అన్నాడా? పంపుతానన్నాడు ఆ దూత నేను కాదన్నాడా? జ్ఞానయోగము అను అధ్యాయములో 6, 7, 8 శ్లోకాలలో **"నేనే వస్తాను"** అన్నాడు. అర్థమయిందా? మరి నేను మాట్లాడను అన్నాడు. అట్లే చెప్పుతాడు ఆయన. నీకు పిచ్చిపట్టేటట్టుగా నీకు ఇలా చెప్పుతాడు, అలా చెప్పుతాడు. నీవు జ్ఞానము తెలుసుకొంటే అర్థమవుతుంది. లేకుంటే అర్థము కాదు. భగవద్గీతలో ఎప్పుడైతే ధర్మాలకు ముప్పు కలుగుతుందో అప్పుడొచ్చి ధర్మాలు తెలియజేస్తానన్నాడు. నా జ్ఞానాన్ని మూడు రకాలుగా తెలియజేస్తాను అని ఖురాన్ గ్రంథములో చెప్పినాడా లేదా? చెప్పినాడు. మళ్లీ ఇప్పుడు 'నేను చెప్పే జ్ఞానము ఏ మానవునికీ తెలియదు' అని చెప్పినది ఎక్కడ? ఖురాన్ గ్రంథములోనే చెప్పినాడు. ఖురాన్ గ్రంథములో 3వ సూరాలో 7వ ఆయత్‌లో **దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మానవునికీ**

**తెలియదు.** ఇది చాలా సూక్ష్మార్థముతో కూడుకొన్న జ్ఞానముగా ఉంటుంది. కానీ **బుద్ధి ఉన్నటువంటివాడు మాత్రము గ్రహించుకోగలడు** అన్నాడు. చూడు ఎలావుందో! తరువాత చాలా సూచనలు చేశాడు ఆయన. **"నేను తప్ప మీకు సహాయం చేసేవాడు ఎవడూ లేడు"** అని చెప్పాడు. నేను తప్ప మీకు సహాయం చేసేవాడు ప్రపంచములో ఎవ్వడూ లేడు అని చెప్పుచూ ఈయన పనే చేయనన్నాడు. మళ్లీ నీకు సహాయము చేసేవాడు ఎవ్వరూ లేరు అంటాడేంటి? అంటే అట్లే చెప్పుతాడు ఆయన. నేను రాను, మీతో మాట్లాడను, ఏమీ చేయను. నేను పని చేసేవాన్ని కాదు, నాకు పేరులేదు, రూపం లేదు ఏమీ లేదన్నాడు కదా! నేను తప్ప మీకు సహాయం చేసేవాడు లేడు అని కూడా అన్నాడు. ఆయన ఎలా చేస్తాడో మనకు అర్థము కాదు.

మనకు ఎలా సహాయము చేసేది అర్థము కావాలంటే ఆయన జ్ఞానం తెలుసుకోవాలి. నేను తప్ప మీకు సహాయం చేసేవాడు ఎవడూ లేడు అన్నప్పుడు, ఉండేది ఒక్కడే కదా! అని మరొక ప్రశ్న మనకు వస్తుంది. సహాయం అంటే ఏంటబ్బా? బస్‌చార్జీ లేక బస్టాండులో కూర్చోని ఉంటే ఎవడో ప్రక్కనవాడు వచ్చి, బస్‌చార్జీకి డబ్బులు ఇచ్చినాడు. అప్పుడు వాడు సహాయం చేసినాడు అని చెప్పవచ్చును. ఈయన మధ్యలో ఎలా సహాయము చేశాడు? అని ప్రశ్న మనము అడుగవచ్చు. అదేదో లోపలికి పోయి చూస్తే గానీ మనకు అర్థము కాదు. అంటే జ్ఞానము బాగా అర్థము చేసుకుంటేగానీ ఆ మాట అర్థము కాదు. ఆ మాట ఎందుకు చెప్పాడు? చెప్పినది ఎవరు? అని చూస్తే మామూలు మనిషి కాదు అని తెలియుచున్నది. చెప్పబడినది దేవుని జ్ఞానము. అది నూటికి నూరుపాళ్ళు సత్యమై ఉంటుంది. ఎక్కడా పొల్లు పోదు. అటువంటి జ్ఞానములో మనము ఎక్కడా కూడా పొరపాటు పడేదానికి అవకాశము లేదు. మనము అర్థము చేసుకోవడములో

తప్పులుండవచ్చు గానీ, ఆయన చెప్పడములో ఎక్కడా తప్పు ఉండదు. కాబట్టి ఆయన చెప్పిన జ్ఞానము మనకు అర్థము కావాలంటే ఆయన జ్ఞానాన్ని సంపూర్ణముగా తెలుసుకోవాలి. అర్థము కాకుండా ఉండేది ఏముంది అని మీరు అనుకోవచ్చు. నేను తప్ప నీకు సహాయం చేసేవాడు ఎవడూ లేడు అని అంటే అర్థం బాగా అవుతుంది కదా! అనుకోవచ్చు. అయితే దేవుడు ఎక్కడైనా కనిపించాడా నీకు? నేను కనిపించేవాడిని కాదు, అన్నప్పుడు ఆయన ఎట్లా సహాయం చేస్తాడు నీకు? చెప్పు! అని ప్రశ్న వేసుకుంటే ఆయనను నేను ఇంతవరకు చూడనే లేదు. నాకు ఎప్పుడు సహాయం చేసినాడు? దేవుడు ఎవడైనది నేను ఇంతవరకు చూడనే లేదు. ఆయనెప్పుడు నాకు సహాయం చేసినాడు? అని ప్రశ్న వస్తుంది. మరి దేవుని మాట అబద్దమా? కాదు సత్యం. మరి ఎట్లా సత్యమైనది? ఆ సత్యమేదో తెలుసుకోవాలి అంటే నీకు జ్ఞానము తెలిసి వుండాలి.

ఈ ప్రపంచ జ్ఞానముతో నీకు ఏమీ అర్థము కాదు. ప్రపంచ జ్ఞానముతో ఒకటి అట్లా, ఒకటి ఇట్లా రెండు రకాలుగా అర్థము అవుతుంది. దేవుడు నేను ఎవరితోనూ మాట్లాడను అని అన్నాడు. కానీ నేను నా జ్ఞానాన్ని మూడు రకాలుగా తెలియజేస్తాను అంటాడు. ప్రత్యక్షంగా ఎవరితోనూ మాట్లాడను నేను. ఒకటి దూత ద్వారా, రెండు ఆకాశం ద్వారా, ఇంకొకటి తెర వెనుక నుండి ఇలా మూడు రకాలుగా తెలియజేస్తాను అన్నాడు. ఉదాహరణకు ఖురాన్ గ్రంథము తెరచాటు నుండి చెప్పబడింది. భగవద్గీత, బైబిలు గ్రంథాలు దూత ద్వారా తెలియబడ్డాయి. సృష్టి ఆదిలో భగవద్గీత వాణి ద్వారా చెప్పబడింది. ఈ విధముగా మూడు రకాలుగా దేవుని జ్ఞానము చెప్పబడింది. సృష్టి ఆదిలో చెప్పబడిన దాన్ని మనము ఇక్కడ చెప్తూ దీనిని మనము 'భగవద్గీత' అని అన్నాము. దీనినే సృష్టి

ఆదిలో చెప్పాను అని అన్నాడు. మరి సృష్టి ఆదిలో ఏదైతే చెప్పబడినదో దానిని మనము భగవద్గీత అని అనాలి కదా! ఇప్పుడు అప్పుడు అది భగవద్గీత అయినప్పుడు మరలా తరువాత చెప్పినది కూడా భగవద్గీతే, బైబిలు కూడా భగవద్గీతే అవుతుంది. బైబిల్, భగవద్గీత అయినప్పుడు ఖురాన్ కూడా భగవద్గీతే అవుతుంది. ఎందుకంటే సూర్యునికి చెప్పినప్పుడే జిబ్రయేల్‌కు కూడా తెలియబడింది. సూర్యుడు ఒక గ్రహమే, జిబ్రయేల్ కూడా గ్రహమే. మనము సూర్యుడు అంటున్నాము. ముస్లీమ్‌లు దానినే జిబ్రయేల్ అని అంటున్నారు. జిబ్రయేల్ దేవుడు చెప్పిన జ్ఞానాన్ని గ్రహించుకొని ఇంకొకనికి తెరచాటుగా ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పాడు. అప్పుడు ప్రవక్తగారు విన్నదానిని మనకు గ్రంథ రూపంలో అందించాడు. 'ఓ ప్రవక్తా! వినుము, ఓ ప్రవక్తా వినుము' అని జిబ్రయేల్ సూర్యునివలె 'ఓ అర్జునా వినుము. ఓ అర్జునా వినుము' అని. భగవద్గీతలో ఏ రకంగా చెప్పబడిందో, ఇక్కడ కూడా అదే రకంగా చెప్పబడింది. జ్ఞానము మాత్రము రెండూ ఒక్కటే. అందువల్ల ఖురాన్‌కు, భగవద్గీతకు అనుబంధమున్నది.

ఇక్కడ 'ఖురాన్' అని పేరు పెట్టినారు. అక్కడ 'బైబిల్' అని పేరు పెట్టినారు. కానీ పేర్లు వేరువేరుగా పెట్టుకొన్నారు. అందువలన అవి వేరు వేరు మతాలుగా అయిపోయినవి. వాస్తవంగా చెప్పినది ఒక్కడే, చెప్పబడినది కూడా ఒక్కటే జ్ఞానమే! ఇప్పుడు కృష్ణుడే చెప్పితే గానీ మనకు అర్థము కాదు కృష్ణుడు చెప్పినటువంటి జ్ఞానమే ఇది, అని తెలియకపోయిన దానివలన, అక్కడ బైబిల్‌లో చెప్పినది క్రైస్థవం అయిపోయింది. ఖురాన్ రూపంలో చెప్పినటువంటిది ఇస్లామ్ అయిపోయింది. కానీ చెప్పబడిన జ్ఞానము మాత్రము ఒక్కటే. వ్యక్తులు వేరు అయినారు. అంటే అక్కడ కనిపించే వ్యక్తి వేరు అయినాడు. ఇక్కడ కూడా కనిపించే వ్యక్తి వేరు

అయినాడు. అంటే ఈ భగవద్గీతను చెప్పినటువంటివాడుగానీ, బైబిల్ చెప్పినటువంటి వాడు గానీ వేరువేరు రూపాలలో వున్నారు. అప్పుడు మనము ఏమి చేసాము? వేరువేరు పేర్లు, వేరువేరు రూపాలలో ఉండటం వల్ల వేరువేరుగా లెక్కించుకొని, వేరువేరు బోధలుగా లెక్కించుకొని, వేరువేరు మతాలుగా మనము లెక్కించుకున్నాము. ఖురాన్ చెప్పినది ఎవరు? వ్యక్తిగా ఉన్నటువంటి వాడు గాదు చెప్పినది, కనిపించనటువంటి గ్రహం. సూర్యుడు ఆ రోజు ఏ విధముగా క్రిందికి వచ్చి చెప్పినాడో ఆ రకంగా కనిపించనటు వంటి గ్రహం జిబ్రయేల్ చెప్పాడు.

తెరచాటు నుండి కనిపించుకోకుండా, చెప్పినది కూడా మొట్ట మొదట చెప్పిన జ్ఞానమే కాబట్టి దాన్ని కూడా మనము భగవద్గీతే అనాలి. బైబిల్‌ను భగవద్గీత అనాలి. భగవద్గీతను ఎటూ భగవద్గీతే అంటాము మనము. **ఈ మూడు ఒకటే సారాంశము** మీద ఆధారపడి వున్నాయి. ఒకటే జ్ఞానము మీద ఆధారపడి ఉన్నాయి. కాబట్టి వాటిలో ఎక్కడా తేడా లేదు. కాబట్టి ఈ రోజు ఈ మూడు గ్రంథాలలో ఏ వాక్యాన్నైనా సులభముగా చెప్పగల్గుచున్నాము. కానీ మా మతం వేరు, మీ మతం వేరు, మా దేవుడు వేరు, మీరు దేవుడు వేరు అనుకొనే వాళ్లు పొరపాటు పడి ఈ జ్ఞానాన్ని వేరువేరుగా లెక్కించుకొనే దానివల్ల అక్కడ చెప్పబడిన జ్ఞానము వేరుగా అర్థమయినది. చాలామందికి చెప్పిన జ్ఞానము ఏమిటో అర్థము కాకుండా పోయినది. మేము ఇస్లామ్ మతంలో ఉన్నాము. ఖురాన్ గ్రంథము ఇస్లామ్‌లో ఉండే ముస్లీమ్‌లకు మాకే అర్థము కాకుండా పోతే నీవు హిందువుగా ఉన్నటువంటి వానికి మీకెట్లా అర్థము అయివుంటుంది? అని ప్రశ్న వేయవచ్చు. నేనేమంటున్నానంటే నీకు సక్రమంగా అర్థము అయివుంటే దాంట్లో ఉన్న ప్రతి విషయము చెప్పగలగాలి కదా! 2వ సూరాలో 117 వ

వాక్యములో ఏమి ఉన్నదంటే "దేవుడు ఈ ప్రపంచాన్ని అంతా సృష్టించాడు. ఈ ప్రపంచాన్ని మొట్టమొదట సృష్టించాడు. ఆకాశాన్ని భూమిని అన్నిటిని సృష్టించాడు. కానీ ఆయన అయిపో అంటే ఆటోమేటిక్‌గా అయిపోతుంది. ఆయన పని చేసేవాడు కాదు. దేవుడు అయిపో అంటే, తలచుకుంటేనే అది అంతా అయిపోతుంది". అని ఖురాన్ గ్రంథములో 2వ అధ్యాయములో 117 వ వాక్యములో చెప్పాడు. **"దేవుడు అయిపో అంటే ఏదైనా అయిపోతుంది. దేవుడు ఏ పనీ చేయడు"** అని చెప్పారు. అర్థమయిందా?

కానీ అదే ఖురాన్ గ్రంథములో 32వ సూరాలో 4వ ఆయత్‌లో **"పైన ఆకాశములను క్రింద భూమిని మధ్యలో ఉన్న సమస్తమును దేవుడు ఆరు రోజులు శ్రమపడి తయారు చేసినాడు"** అని ఉంది. ఆరు రోజులు తయారు చేసినవాడు ఏడోరోజు తన సింహాసనం మీద కూర్చొన్నాడు. అక్కడ "అయిపో అంటే అయిపోతుంది" అని చెప్పారు. ఇక్కడేమో "ఆరు రోజులు శ్రమపడినాడు" అని అన్నారు. ఇప్పుడు అక్కడికి ఇక్కడికి పరస్పర విరుద్ధముగా కనిపించుచున్నది. రెండూ ఖురాన్‌లోని వాక్యాలే. ఇప్పుడు దీనికి ఏమి చెప్తారు? దానికి ఏమని చెప్తారంటే, అంతవరకు తిరిగి చూసుకోలేదు, వాళ్లు చెప్పే పరిస్థితి లేదు. ఇట్లా పడితే బావిలో అన్నా పడాలి, అట్లా పడితే చెరువులో అన్నా పడాలి. నేను గట్టున ఉన్నాననే పరిస్థితి లేదు. కాబట్టి అది వారికి అర్థము కాని సమస్య అయిపోయింది. ఇటువంటి సమస్యలు ఎన్ని ఉన్నాయంటే తూర్పు పడమరలాగా ద్వంద్వార్థాలతో వ్యతిరిక్త భావాలతో చాలా మాటలున్నాయి. కాబట్టి ఖుర్ఆన్ ఏమాత్రము ఎవరికీ అర్థము కాలేదు అని మొదట్లోనే చెప్పాను. నాకు తప్ప మీకు తెలియదని మీకు చెప్పలేదా? అని ఆయన అంటాడు. ఎప్పుడైతే ఈ మూడు గ్రంథములు ఒక్కటే అని తెలుసుకోగల్గుతారో, మతద్వేషాలు

ఎప్పుడైతే విడిచిపెడతారో, అప్పుడు చెప్పినది ఒక్కడే అని, చెప్పిన జ్ఞానము ఒక్కటే అని అర్థము అవుతుంది. మేము పుట్టింది ఇందువుగా, మేము చదువుకొన్నది భగవద్గీత. నేను చదువుకొన్న భగవద్గీత కూడా, ఏ ఆశ్రమాలకి ఎక్కడాపోయి చదువుకోలేదు. స్వంతంగా కూర్చొని, సంపూర్ణముగా అర్థము చేసుకుంటే అప్పుడు అన్నిటిలో యున్న జ్ఞానము అంతా అర్థమయ్యింది.

చెప్పినవాడు సామాన్యుడు కాదు అని తెలిసింది. మిగతా వాళ్ళంతా కృష్ణుడు అల్లరోడు, చిల్లరోడు అని అన్నారు. మేము చిన్నప్పటి నుండి సినిమాలు కూడా చూశాము. "కృష్ణమాయ" సినిమా దగ్గర నుండి బాగా జ్ఞాపకం ఉంది. 1957లో చూసిన సినిమా అది, ఆ సినిమా నుండి చూస్తే అంతా కృష్ణుని వ్యవహారమంతా అల్లరి చిల్లరగానే ఉంది. కౌరవులకు, పాండవులకు కావాలని కొట్లాట పెట్టినాడు. సంధి చేసే అవకాశముండి కూడా రాయబారానికి పోయి, అక్కడేమన్నా తప్పించాడంటే అట్లా చేయలేదు. ఎక్కడా మంచి పని లేదు. జీవితములో 90 సం॥ల వయస్సులో జ్ఞానం చెప్పితే ఈయనను ఎలా మంచివాడు అనుకోవాలి. అంటే నీవు అనుకో, అనుకోకపో ఆయన ఉండేది ఒక్కడే. చెప్పినది ఒక్కటే. మరి ఇలా ఎందుకు చేశాడు అంటే అందరి మాదిరి నేను చేస్తా, లేకపోతే నేను అందరిలో కలిసిపోను కదా! అంటాడు. మీరందరూ ఎలా ఉన్నారో అలా నేను నడుచుకుంటూ చివరకు నేను నా జ్ఞానాన్ని చెప్తాను. అంటే మీరు ఎట్లు ఉన్నా మీరు జ్ఞానులు కావాలనే ఉద్దేశ్యంతో, మేము జ్ఞానులుగా మారవచ్చు అని మీకు తెలిసేలా "మీరెంత దుర్మార్గానికి పోయినా, ఎంత చెడ్డపని చేసినా, ఏ రకంగా ఉన్నాగానీ నీవు కూడా జ్ఞానివి కావచ్చు" అని నిరూపణ కోసం నేను ఈ రకంగా అన్నీ చేసి చూపించాను అని చెప్పాడు. మనకు మార్గదర్శకత కొరకు చేశాడు. కానీ ఆయనకు ఏదీ అవసరము లేదు.

కృష్ణుడు భగవద్గీతను చెప్పేటప్పుడు నాకు చేయవలసిన అవసరము ఒకటి కూడా లేదు. అయినా నేను చేస్తున్నాను అన్నాడు. మీకు మార్గదర్శకత కోసము అనగా ఎవడు ఎంత దుర్మార్గుడైనా కానీ వాడు ఈ జ్ఞానము తెలుసుకోవచ్చు, బయటపడవచ్చు అని తెలియుటకు ఆ రకంగా చేసి చూపించాను. మీరు జ్ఞానము, గొప్పది కదా! మాలాంటి వారికి సరిపోదు అనే సంశయమే లేకుండా చేశాడు. ఎవరు ఎలాంటి వారైనా గానీ ప్రపంచ కర్మ దానికి సంబంధము లేదు. మీరు తెలుసుకోవచ్చు. మీరు ఈ జ్ఞానముతో ముందుకు పోవచ్చు. మీరు కర్మలు లేకుండా చేసుకొని నా వలె మీరు కూడా నా అంతవాళ్లు కావచ్చు. నాలోనికి ఐక్యం కావచ్చు అనే ఉద్దేశ్యాన్నే తెలియజేస్తూ ఆయన 90వ సంవత్సరములో అన్ని పనులు చేసి చెప్పాడు. ఆయన మనకు జ్ఞానాన్ని తెలియజేశాడు. ఆయన చెప్పినటువంటి జ్ఞానము నాకు బాగా తెలిసింది.

బాగా గమనిస్తే ఇప్పుడు మన భారతదేశములో 300 వరకు భగవద్గీతలు ఉన్నాయి. 300 మంది దాని వ్యాఖ్యానం వ్రాశారు. వారి భావాలతో విశధీకరించి వ్రాశారు. కానీ ఒకే ఒక భగవద్గీత **త్రైత సిద్ధాంత భగవద్గీత** అన్నిటినీ అధిగమించినది. మీకందరికీ తెలుసు ఆ విషయం. దీనిని చదివిన వాళ్లు మాత్రము ఇంతవరకు మాకు జ్ఞానము తెలిసింది అని అనుకున్నాము కానీ ఇప్పుడు అసలైన జ్ఞానము తెలిసింది. ఇంతకు ముందు తెలిసింది జ్ఞానమే కాదు అని అంటున్నారు. దూరంగా ఉండే వాళ్లు కూడా చదువుకొని వచ్చి ఆ విధంగా చెప్పుతున్నారు. ఆ రకంగా వాళ్లను ప్రేరేపించి ఇది జ్ఞానము అని తెలియజేసింది ఒకే ఒక త్రైత సిద్ధాంతం.

త్రైత సిద్ధాంతం అనేది సృష్టి ఆదిలోనే పుట్టింది, అది ఎవరికీ తెలియకుండా పోయింది. మళ్లీ తర్వాత ఏమయింది అంటే అద్వైతం

వచ్చింది. ద్వైతం వచ్చింది, విశిష్టాద్వైతం వచ్చింది. ఎన్నో వచ్చాయి. ఎన్ని వచ్చినా ఇప్పుడు త్రైత సిద్ధాంతం బయటకు వచ్చింది. అన్ని సిద్ధాంతములు దీనిముందర ఏమాత్రము పనికి రాకుండా పోతాయి. ఈ రోజు ఆది శంకరాచార్య సినిమా చూడండి. లేకపోతే ఆయన జీవిత చరిత్ర చదవండి. కానీ ఈ త్రైత సిద్ధాంత భగవద్గీత చదవండి. ఈ జ్ఞానము ఎలా అర్థమవుతుందో, ఏది గొప్పదో తెలుస్తుంది. మీకు సృష్ఠి ఆదిలో చెప్పిన ఈ జ్ఞానమే గొప్పది. సృష్ఠి ఆదిలో చెప్పినది భగవద్గీత. ఈ భగవద్గీత ఒకసారి మనము తెలుసుకోగల్గితే అది బైబిల్‌ను అర్థమయ్యేలా చేస్తుంది. ఆ తరువాత ముస్లీమ్‌లకు అవగాహన కాని విషయాలు ఖురాన్‌లో ఉన్నాగానీ అవి మనము సులభముగా చెప్పగల్గుతాము. ఎందుకంటే అది కూడా భగవద్గీతే. కాబట్టి నీకు ఈ భగవద్గీత అర్థమయిందా బైబిలు, ఖుర్‌ఆన్ అర్థమయినట్లే. కాబట్టి ఈ రోజు మనము **"హేతువాదము- ప్రతి వాదము"** అనే గ్రంథము వ్రాశాము. ఆ హేతువాదము అనే గ్రంథములో, మిగతా మతము వారికి ఎటువంటి రహస్యాలు తెలియకుండా పోయినాయి? ఆ రహస్యాలు ఏవిధముగా ఛేదించి మనము తెలుసుకోవచ్చు? అనే విధానాన్నంతా మేము మూడు మతాలలో ఉన్నటువంటి వాక్యాలు వ్రాసి తెల్పడము జరిగినది. ఆ గ్రంథము మీకు చాలా విషయాలు అందిస్తుంది. మరి మీరు ఆ గ్రంథము తీసుకొని చూచుకోవచ్చు. దానిలో దేవుని జ్ఞానము ఎటువంటిది అని చెప్పాము. మొట్టమొదట పుట్టినది దేవుని జ్ఞానము భగవద్గీత. ఈ జ్ఞానము తర్వాత వచ్చింది బైబిలు అయింది. తర్వాత వచ్చింది ఖుర్‌ఆన్ అయింది. దేశ కాల పరిస్థితులను బట్టి మీరు వేరువేరుగా పేర్లు పెట్టుకున్నారు. కానీ వాస్తవంగా మూడు గ్రంథాలకు ఒకే పేరు వర్తిస్తుంది. మీ లెక్కలో ఖురాన్, మా లెక్కలో భగవద్గీతే! మీ లెక్కలో

బైబిల్, మా లెక్కలో అది కూడా భగవద్గీతే!! కానీ మీ లెక్కలో మాది భగవద్గీత, బైబిల్ కాదు, ఖురాన్ కాదు అంటున్నారు. మీది మీదే. మాది మాదే అని అంటున్నారు. అయితే మా లెక్కలో మాత్రము అది **బైబిల్‌గానీ, ఖురాన్ గానీ భగవద్గీతే.** మీరు వేరుగా చూస్తున్నారు. మేము వేరుగా చూసేదానికి అవకాశమే లేదు. ఎందుకంటే మాకు వేరుగా కనిపించలేదు.

ఖుర్‌ఆన్ 2-117లో **"దేవుడు 'అయిపో' అంటే అయిపోతుంది"** అని చెప్పాడు. అలాగే 32వ సూరా 4వ ఆయత్‌లో **"దేవుడు ఆరు రోజులు శ్రమపడి సృష్ఠించినాడు. పైన ఆకాశాన్ని క్రింద భూమిని మధ్యలో వున్న సమస్తమును ఆరు రోజులలో శ్రమపడి సృష్ఠించాడు"** అని చెప్పినాడు కదా! అక్కడేమో 2-117లో 'అయిపో' అంటే అయిపోతుంది. ఇక్కడేమో 32-4 లో 'సృష్ఠిఆరు రోజులు పట్టింది' అవి రెండు పరస్పర విరుద్ధముగా ఉన్నాయి. ఆ వాక్యాలు అర్థము కావు. అవి రెండిటిని చక్కగా వివరించి చూపించాము. అక్కడ చెప్పిన వాక్యం ఒకటే, ఇక్కడ చెప్పిన వాక్యము ఒక్కటే, కానీ నీకు అర్థము కాలేదు. నాకు అర్థమయింది, అది ఎట్లు అర్థమయింది? అంటే అదే మీకు మాకు ఉన్న తేడా! హేతువాద గ్రంథము చదివితే అది ఎలా చెప్పినారనేది అర్థము అవుతుంది. అదే రకంగా ఇంకొక చోట ఖురాన్‌లో చెప్పినారు **"నీకు సహాయము చేసేవాడు ఎవడూ లేడు"** అని ఉన్నది. సహాయం చేసేవాడు లేడని చెప్పుతున్నావు కదా! నీవు చెప్పేమాట అబద్ధము అని తెలిసిపోయింది మాకు, అంటారు ఎవరైనా. ఎందుకు? దేవుడు ఎవరైనది చూడలేదు ఇంకొక చోట **"నేను తప్ప మీకు సహాయము చేసేవాడు ఎవడూ లేడు"** అని ఉన్నది. అయితే "ఇది శుద్ధ అబద్ధము. దేవుడు ఎవడో కూడా మాకు తెలియదు. దేవుడు ఎలా వచ్చి మాకు సహాయము చేస్తాడు. ఇప్పుడు సహాయము చేసేవాడు ప్రక్కలో

ఉండాలి, నాకు సహాయము చేసినవానిని విడిచిపెట్టి దేవున్నే అనడము అన్యాయం కదా!" అని కొందరు అడుగవచ్చు.

అంతేకదా! మీ ఇంట్లో మీ అన్నో, మీ అక్కో, మీ అమ్మో, మీ నాయనో ఎవరో ఒకరు సహాయం చేసివుంటే దానివల్ల నీవు బాగుపడినావు అనుకో, అప్పుడేమంటావు? మా ఇంట్లో మా వాళ్లు వచ్చి సహాయపడివుంటే నేను బాగుపడ్డాను. దేవుడు వచ్చి ఎప్పుడు సహాయం చేసినాడు? ఖురాన్‌లో ఉండే ఈ మాట అబద్దము కదా! అని అడుగవచ్చు. అయితే ఖురాన్‌లో ఉండే మాట ఎప్పటికీ అబద్ధము కాదు. అది నూటికి నూరుపాళ్ళు సత్యమే. **"దేవుడు తప్ప సహాయం చేసేవాడు ఎవడూ లేడు. నీకు సిఫారసు చేసేవాడు లేడు"** అని కూడా ఖుర్‌ఆన్‌లో చెప్పారు. నిన్ను గురించి సిఫారసు చేసేవాడు కూడా ఎవడూ లేడు, నేను తప్ప నీకు సహాయం చేసేవాడు ఎవడూ లేడు అని చెప్పినప్పుడు నా మాటలు మీరు ఎందుకు గ్రహించుకోలేదు? అని అన్నాడు. అక్కడనే దానిప్రక్కనే, అయినా నా మాటను మీరు ఎందుకు గ్రహించుకోలేదు? మీకు ఎందుకు అర్థము కాలేదు? అర్థము కానిది ఏముంది? ఇంతకుముందు ఆరు రోజులు తయారు చేసినాడు అని అన్నారు, అది బాగా అర్థము అయింది. ఇంకా ఎవడూ సహాయం చేసేవాడు లేడు అన్నారు. అది కూడా అర్థమయింది. ఇవన్నీ అబద్దపు మాటలని అర్థము అయినాయి. ఇంకా అర్థము కానిది ఏమిటది అంటే, నేను చెప్పినది మీకు ఎందుకు అర్థము చేసుకోలేదు అనేమాట అర్థము కాలేదు.

ఎప్పుడైతే మనుషులు తప్పులో కాలేస్తున్నారో, ప్రక్కన తప్పుటడుగు వేస్తున్నారో, తెలియకుండా తికమక అవుతున్నారో, అప్పుడు దేవుడు చెప్పిన మాటను చూడాలి. ఖురాన్‌లో మాత్రము ప్రతిచోట ఇలానే వ్రాసిపెట్టబడి ఉంటుంది. వాక్యము క్రింద "మీరు తప్పు దోవపట్టి నడుస్తున్నారు. తప్పు భావంలోకి పోతున్నారు. మీరెందుకు అర్థము చేసుకోలేక పోతున్నారు"

అని చాలాచోట్ల చెప్పడము జరిగింది. దానికి చాలాచోట్ల మేము వివరము చెప్పాము. ఈ రకంగా అక్కడే కాకుండా బైబిల్‌లో కూడా ఏమి చెప్పారంటే" నేను ఇంతవరకు గూఢార్థముతో చెప్పిన విషయాలు మీకు ఏమీ అర్థము కాలేదు" అన్నాడు ఆయన. అంటే అర్థము కానిది ఏముంది. ఉదాహరణకు ద్రాక్షరసం ఇచ్చి, ఇది నా రక్తం త్రాగండి అని అన్నాడు. అట్లే ఒక రొట్టె ఇచ్చి ఇది నా శరీరము తినండి అన్నాడు. ఇంకా అర్థము కానిది ఏముంది? పబ్లిక్‌గా చూపిస్తున్నాడు, చెప్పుతావున్నాడు. అన్నీ అర్థమయ్యే విషయాలే కదా! అని అనుకోవచ్చు వాళ్లు.

కానీ చివరిలో ఏమి చెప్పినాడు అంటే, నేను ఇంతవరకు గూఢార్థముగా విషయాలు చెప్పినాను, మీకు అర్థము కాలేదు. ఇంకా చెప్పబోయే విషయాలు ఎన్నో ఉన్నాయి. మీకు అర్థము కావు అని వదిలివేస్తున్నాను, కానీ ఇక నుంచి గూఢార్థముగా చెప్పకుండా వివరంగా చెప్పే ఘడియ వస్తుంది అని చెప్పాడు. "వివరంగా తెలియబరచు ఘడియ వస్తుంది" అన్నాడు. రాబోతుంది అన్నాడు అలాగే అక్కడ మీకు రహస్యము ఏదీ తెలియదు. అంటే బైబిల్‌లో కూడా మీకు ఒక్కటి కూడా అర్థము కాలేదు అని ఆయన ఒకే మాటలో చెప్పేశాడు. అంతే కదా! ఆయన బోధ ఏమీ అర్థము కాలేదు. ఇక ఖురాన్ విషయానికి వస్తే ఇక్కడ కూడా మీకు అర్థము కాదని చూపించినాడు. అక్కడేమో 'అయిపో' అంటే అయిపోతుంది. ఇక్కడేమో వచ్చి 'ఆరు రోజులు' పట్టాయి, ఇంక ఎక్కడ అర్థము అయింది మీకు? అక్కడనే అర్థము కాలేదు. ఇట్లానే ఉంటుంది ఖురాన్, బైబిలు, భగవద్గీత.

ఇంక భగవద్గీత దగ్గరకు వస్తే ఆయన ఏమి చెప్పుతాడు. ఇది సామాన్యంగా అర్థము కాదు. ఇది విద్య, ఏమైనా చిన్న విద్య అనుకున్నారా?

పెద్ద విద్య, పెద్ద రహస్యం అన్నాడు. అంటే పెద్ద రహస్యం అన్నమాట. చిన్న చిన్న రహస్యాలే మనకు తెలియదు. పెద్దపెద్ద రహస్యాలు మనకు తెలుస్తాయా? ఒకవేళ మనకు తెలుసులే అని వీళ్ళు అనుకోవచ్చు గానీ, అది అంత సులభంగా అర్థమయ్యేది కాదు. ఇది అటువంటిదే అని మూడు గ్రంథాలలో చెప్పాడు, నేను తిరిగి చేప్తే మీకు అర్థము అవుతుంది అన్నాడు. కాబట్టి ఆయన ఏమి చెప్పుతాడో మనము తెలుసుకోవాలి. ఆయన ఏ రకంగా విప్పి చెప్పుతాడో మనము తెలుసుకోవాలంటే మనము ఏమి చేయాలి? మనము కొంత గ్రంథ పఠనం చేయాలి. లేకపోతే ఎక్కడైనా పోయి వినాలి. అలా విన్నా కూడా ఎదురుగా చెప్పేవాడు మనిషే కాబట్టి మనము ఈ బోధలు నమ్మకూడదు. మనిషి చెప్పేదంతా నిజము కాదు. భగవంతుడు చెప్పేది మాత్రము నిజము. భగవంతుడు ఎవరు? మనిషే! **మనిషి భగవంతుడు కాదు కానీ, భగవంతుడు మనిషి అవుతాడు.** ఇది ఏమిటో అర్థము కాలేదు అనుకోవచ్చు మనిషి భగవంతుడు కాదు కానీ, భగవంతుడు మనిషిగా వస్తాడు. భగవంతుడు మనిషిగా ఉంటాడు గానీ మనిషి ఎప్పుడూ భగవంతుడు కాడు. ఇది కూడా అర్థము కాలేదు మనకు. ఈ రకంగా ఉంటుంది ఆయన బోధ అంతా! కానీ అర్థము కావాలంటే మనకు **శ్రద్ధ** కావాలి.

నేను మొట్టమొదటనే చెప్పాను. దేవుని జ్ఞానము మీకు బాగా అర్థము కావాలంటే దాన్ని తెలుసుకోవాలనే శ్రద్ధ కావాలని, కొంతమంది పెద్దలు అన్నారు. ఇప్పుడు గమనిస్తే, ఇక్కడకు ఎక్కడి నుండో చాలా దూరప్రాంతాల నుండి వచ్చి జ్ఞానము తెలుసుకుంటున్నారు. చాలామంది పెద్దపెద్ద రోగస్తులు, ఇక చచ్చిపోతాము అనే వాళ్లు, ఇక బ్రతకలేము అనే వాళ్లు, ఇక్కడికి వచ్చిన వెంటనే వారికి రోగాలు నయము కావడము జరుగుతుంది. ఎందుకు ఇలా జరుగుతుంది? మాకు ఏమీ అర్థము కాలేదు.

మరి ఏమి జరుగుతుంది ఇక్కడ? మీకు ఎందుకు అర్థము కాలేదు? అంటే మీకు శ్రద్ధ లేదు, కాబట్టి అర్థము కాలేదు. వాళ్లకు శ్రద్ధ ఉంది కావున వారికి అర్థము అవుతుంది. దేవుని జ్ఞానము గొప్పది. ఏమైనా చేస్తుంది అని చెప్పాము. వాళ్ళు నమ్ముకున్నారు కాబట్టి వాళ్లకు నయము కావడము జరిగింది.

నిన్న ఒక ఆమె వచ్చి నాకు ఒక చిన్న ఉంగరం తొడిగి పోయింది. వాళ్లని మామూలుగా సమాజమంతా తక్కువ కులం క్రింద వేసి మాట్లాడుతారు. వారు బీదవారు, పని చేసుకొని బ్రతికేవాళ్లు. నీవు వచ్చి నాకు ఉంగరం తొడిగేది ఏంటమ్మా అని అడిగితే, "నాకేమి? అన్ని రకాలుగా బాగా ఉన్నాను. మా తృప్తి కోసమని మూడు గంటలసేపు బయట కూర్చోని, అవకాశము దొరికినప్పుడు వచ్చి, నాకొచ్చి ఉంగరం తొడిగింది. అంటే నాకు విచిత్రంగా నవ్వు వచ్చి "నాకు తొడగాల్సిన పని ఏమొచ్చింది" అని నేను అంటే, ఆమె ఇలా చెప్పింది. "డాక్టర్లు మావల్ల కాదు అని చెప్పి పంపించిన రోగము పోయింది. మీకు ఏమి ఇచ్చినా తక్కువే" అన్నది. వారికి నేను ఇక్కడికి వచ్చి మూడు రోజులు ఉండి పోండి అని చెప్పాను. దేవున్ని నమ్ముకోండి, నేను ఏమీ చేయను అని చెప్పాము. నేను ఎవరికీ ఏమీ చేయను కదా! అయినా రోగము బాగయింది. అక్కడికి పోయాక డాక్టర్ ఆమెను అడిగాడంట ఎట్లా బాగయిందని? వాళ్లకేమీ అర్థము కాలేదు. ఇక్కడకు వచ్చిన దానివల్ల బాగయిందనేది మాత్రము వాస్తవము. అంటే ఇక్కడికి వచ్చిన తర్వాత బాగయిందంటే "ఇందులో నా గొప్పతనం ఏముంది? నా గొప్పతనం ఏమీ లేదు కదా!" అని నేను అంటే, ఆమె "ఏమో మాకు మాత్రం ఇక్కడికి వచ్చిన దానివలన, మీవల్లే మేము బాగుపడినాము అనే తృప్తితో అట్లా మేము ఉంగరం తొడిగాము" అని అంటే, సరేసరే అని అట్టేగాని, పోయిరండని చెప్పినాము.

అంటే వాళ్ళు ఆ రకంగా అనుకున్నా గానీ, నేను ఏమి చెప్పుతున్నా నంటే వాస్తవముగా మాలో ఏమీ లేదు. నేను మనిషినే, మేము చెప్పేటివి కొన్ని నిజాలు, కొన్ని అబద్దాలు రెండు ఉండవచ్చు. అదే పనిగా కూడా అబద్ధాలు చెప్పుతా వుంటాను. ఆ విధంగా కూడా ఉంటాయి. ఎందుకంటే ఇప్పుడు ఒకరు అడిగినారు. భగవద్గీతలో సూర్యునికి చెప్పినప్పుడు లోపల ఆత్మగానే బోధించింది అని చెప్పినారే మళ్లీ ఆకాశముగా చెప్పినది అన్నారే? ఇది రెండు రకాలుగా ఉందే? ఇప్పుడు జిబ్రయేల్ సూర్యునికి చెప్పివుంటే విన్నాడా లేదా సూర్యుడు చెబుతావుంటే విన్నాడా? అని ప్రశ్న వేశారు. ఇక్కడ వ్రాసినది అంతే, అక్కడ వ్రాసినది అంతే, రెండూ కన్ఫ్యూజన్‌గా (గందరగోళంగా) ఉంటాయి. నేను చెప్పినవి అన్నీ సత్యమే అయితే నేనే దేవున్ని అవుతాను. కాబట్టి అట్లా చెప్పకూడదు. **"సత్యాన్వేషి కథ"** అను గ్రంథములో 'ఎవరు పెద్ద గురువు' అనేది దాచిపెట్టాము. 530 పేజీల గ్రంథము అయినా గానీ, చివరి వరకు ఇద్దరు వ్యక్తులను పెట్టి ఇద్దరు స్వాములలో, ఎవరు పెద్ద అయినది అర్థము కాకుండా చేసినాము. తేల్చి చెప్పలేదు, అర్థము అయిందా! ఇప్పుడు కూడా ఎవరు దేవుడు అనునది తేల్చి చెప్పము. ఎవరు మనిషి అనేది తేల్చి చెప్పము. ఎవరు భగవంతుడు, అనేది తేల్చి చెప్పము. తేల్చి చెప్పకుండా ఉండేదే జ్ఞానము. ఇది ఇంతటితో ఈ రోజు కృష్ణాష్టమి కాబట్టి ఆ కృష్ణుని గొప్పతనం ఎంత చెప్పకున్నా తరిగిపోదు. ఇంకొక గంట చెప్పుకున్నా ఉంటుంది. ఇంతటితో ఈ సమావేశాన్ని సమాప్తం చేస్తున్నాము.

# 71. బ్రహ్మావిద్య

**(తేది :03.12.2017)**

ఈ సమావేశంలో హాజరైన ప్రతి ఒక్కరు చెప్పే విషయం మీద ధ్యాస పెంచుకొని శ్రద్ధగా వింటే, మీలో ఉండేటటువంటి ఆత్మ మీకు ఆ విషయాన్ని అవగాహన చేయించాలని కోరుతూ, మీరు శ్రద్ధ వహించి వినవలెనని తెల్పడం జరుగుతూవుంది. ఇప్పుడు చెప్పబోయె విషయం 'బ్రహ్మవిద్య' అనే విషయం. బ్రహ్మవిద్య అనే దానిని మీరు చాలామార్లు విన్నాము. కానీ మనము ఇప్పుడు తెలుసుకొనే కోణము ప్రత్యేకంగా, క్రొత్తగా ఉంటుంది కాబట్టి దీన్ని శ్రద్ధగా వినండి అని తెలుపుతున్నాము. మనము నేర్చుకొనే విద్యలు ప్రపంచములో చాలా ఉన్నాయి. ప్రతీదీ మనము నేర్చుకొనేంత వరకు విద్యగానే ఉంటుంది. ఈ విద్యలు 64 కళలుగా ఉన్నాయి అని చెప్పుతున్నారు. అంటే 64 విధాలుగా ఉన్నాయని పెద్దలు చెప్పుతున్నారు. వాటిని 'చతుర్ షష్ఠి' విద్యలు అంటారు. అంటే 64 విద్యలు అని అర్థము. ఎన్ని విద్యలు అయినా కానీ 6 శాస్త్రాలకు లోబడి ఆ విద్యలన్నీ ఉంటాయి, అన్ని విద్యలు శాస్త్రబద్ధముగా ఉంటాయి. ఏ విద్య అయినా ఒక శాస్త్రీయతకు లోబడి ఉంటుంది. విద్యలు ఆరు శాస్త్రాలకు లోబడే ఉంటాయి. వాస్తవంగా చెప్పాలంటే ప్రపంచ విద్యలు పరమాత్మ విద్యలు అని రెండు రకములు గలవు. నాలుగు శాస్త్రాలు ప్రపంచ విద్యలను శాసిస్తూ ఉంటాయి. ఒక విద్య మాత్రము ఇటు దైవ సంబంధముగా, అటు ప్రపంచ సంబంధముగా రెండిటిలో కలిసి ఉంటుంది. ఇక మరొక విద్యమాత్రము పూర్తి దైవికమైనటువంటి విద్యగా ఉంటుంది.

ఈ విధముగా ఈ 64 విద్యలు, 6 శాస్త్రాలకు సంబంధించి ఉంటాయని చెప్పాము కదా! సరే, ఇప్పుడు ఒకరు ఒక విద్యలో ప్రావీణ్యుడు అయినాడు అనుకోండి. అతను ఆ విద్యను సంపూర్ణముగా నేర్చుకున్నట్లుగా లెక్కించబడుతుంది. ఈ విధముగా ప్రపంచ విద్యలలో ఏ విద్యను నేర్చుకున్నా కానీ, వాడు సంపూర్ణముగా దానిని తెలుసుకోవచ్చు. ఆ విద్యను పూర్తి అధ్యయనం చేయవచ్చు. అలాగే బ్రహ్మవిద్యను కొంతమంది పూర్తి తెలియనివాళ్లు ఉండవచ్చు కానీ, తెలుసుకొను వారు మాత్రము సంపూర్ణముగా తెలుసుకొనవచ్చు. ఈ విద్యను నేను సంపూర్ణముగా తెలుసుకున్నాను అని చెప్పొచ్చు. ఆ రకంగా ఈ ప్రపంచ విద్యలన్నింటిని మనము నేర్చుకోగల్గుతున్నాము. నేర్చుకొని చూపిస్తున్నాము. తరువాత ఇంకా ముందుకు పోయి తెలియని రహస్యాలు కూడా శోధించి మనము తెలుసుకుంటున్నాము. ఇవన్నీ కూడా నాల్గు శాస్త్రాలకు లోబడి ఉంటాయి. ప్రతీదీ శాస్త్రబద్ధముగా ఉంటుంది. ఈ రోజు రసాయనశాస్త్రమును తీసుకుంటే, దాంట్లో ఎన్నో క్రొత్త విషయాలు మనము కనుగొన్నాము. శాస్త్రబద్ధముగా నేర్చుకొన్నటువంటి విద్యల ఫలితాలన్నీ మానవుడు అనుభవిస్తున్నాడు. ఆ రకంగానే భౌతిక శాస్త్రములోగానీ, రసాయన శాస్త్రములోగానీ, గణిత శాస్త్రములో గానీ, ఖగోళ శాస్త్రములోగానీ మనిషికి తెలియని విషయమంటూ లేదు. సంపూర్ణముగా తెలుసుకున్నామను గుర్తుకు 'డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ' అని ఆ విద్యకు మనము పేరు పెట్టుకుంటున్నాము. అంటే ఆ విద్యను సంపూర్ణముగా తెలుసుకున్నామని పి. హెచ్. డి బిరుదులు తీసుకుంటున్నారు. అంటే ఆ విద్యలో పండితుడు అయిపోయినాము. అంటే పండిపోయినాము అని, సంపూర్ణముగా తెలుసుకోగల్గినాము అని మనము చెప్పుకుంటున్నాము.

మొత్తము విద్యలన్నీ ఆరు శాస్త్రాలకు లోబడి ఉంటే, ఆరు శాస్త్రాలలో, ఐదు శాస్త్రాల పేర్లు మనము వరుసగా చెప్పుకుంటే గణిత శాస్త్రము, ఖగోళ శాస్త్రము, రసాయన శాస్త్రము, భౌతిక శాస్త్రము, జ్యోతిష్యశాస్త్రము అని చెప్పుకోవచ్చు. ఈ ఐదు శాస్త్రములకు మాములుగా శాస్త్రము అని పేరు ఉంది. భౌతిక, రసాయన, ఖగోళ గణిత, జ్యోతిష్య అని పేర్లు ఉన్నాయి, కానీ దీనికి 'విద్య' అనే పేరు ఎక్కడా కలిసి ఉండలేదు. కానీ **'బ్రహ్మవిద్యా శాస్త్రము'** అనేదానికి మాత్రము అది బ్రహ్మశాస్త్రము అనేది కాకుండా 'విద్యా శాస్త్రము' అని ఉంది. మిగతా ఐదు శాస్త్రాలకు ఈ పేరు లేదు. కానీ ఒక బ్రహ్మశాస్త్రానికి మాత్రమే ఆ పేరు ఉంది. ఇప్పుడు ఇది శాస్త్రము అయితే ఏ విద్య దీనికి సంబంధించినది అని మనము లెక్కవేసుకోవాలి కదా! కానీ విద్యలు వేరు, శాస్త్రము వేరు. శాస్త్రము అనేది ఈ విద్య ఇట్లే ఉండాలి అని కట్టడి చేస్తుంది. నీవు దాన్ని తప్పుగా చెప్పితే ఒప్పుకోదు. దానికి శాసనము వుండి ఈ పద్ధతిగా విద్య ఉండాలి అని చెప్పగల్గుతుంది. మనము ఇప్పుడు ఆధ్యాత్మిక విద్యలోనికి పోతే, భగవద్గీత ఉంది. భగవద్గీత అనేది ఒక గ్రంథము. అది శాస్త్రబద్దంగా ఉందా లేదా అని చూచుకోవాలంటే మనము ఏమి చేయాలి. బ్రహ్మవిద్యా శాస్త్రాన్నే చూడాలి. అంటే అది దేవుని శాసనాలతో కూడుకొని ఉంటుంది. బ్రహ్మవిద్య అంటే పెద్ద విద్య అని అర్థము. దీంట్లో దేవునికి సంబంధించిన విషయాలన్నీ శాస్త్రబద్ధముగా ఉంటాయి. దేవునికి సంబంధించిన విషయాలు ఏ గ్రంథములో ఉన్నా, అవి ఇట్లే ఉండాలని, దీన్ని అతిక్రమించి ఉండ కూడదని, దానిని తప్పా ఒప్పా అని చూపించేటటువంటిది శాస్త్రము. భగవద్గీత శాస్త్రము ఉంది. భగవద్గీతను మనము ఏమి చేస్తామంటే శాస్త్రములో చెప్పవచ్చు. అంటే అది బ్రహ్మవిద్యా శాస్త్రమునకు అనుగుణముగా ఉండి ప్రతి విషయము

శాసనాలతో కూడుకొని ఉంటుంది. అది అలా లేకుండా ఉంటే ఎక్కడైనా గానీ అది తప్పని మనము చెప్పవచ్చు. ఇది బ్రహ్మవిద్యా శాస్త్రానికి సంబంధించిన విషయం కాదు అని చెప్పవచ్చును.

ఇప్పుడు మనము భగవద్గీతలో ఒక విషయాన్ని తీసుకొందాము **"చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్ గుణకర్మ విభాగశః"** అని భగవద్గీతలో ఒక శ్లోకము ఉంది. ఇది బహుశా చాలామందికి తెలిసిన శ్లోకమే. దానిని పట్టుకొని ఏమి చేశారంటే, ఇప్పటికి మన దేశములో 330 భగవద్గీతలు అనువదింపబడినాయి. సంస్కృత భాషలో ఉన్నటువంటి దానిని, అనేక భాషలలో వివరముగా చాలామంది స్వామీజీలు చెప్పుకున్నారు. అలా చెప్పుకొన్నప్పుడు ప్రతి ఒక్కరు చెప్పిన విషయములో ఏముంది అని గమనిస్తే, ఈ శ్లోకము దగ్గరికి వచ్చే సరికి నాలుగు (4) రకాల కులాలు ఉన్నాయి అని చెప్పారు. అంటే నాలుగు (4) కులాలుగా విభజించారు. "చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్" అని ఆయన చెప్పితే, అంటే నేను నాలుగు వర్ణాలుగా తయారు చేసినాను అని చెప్పితే, రచయితలు అందరూ నాలుగు వర్ణాలను, నాలుగు కులాలుగా పోల్చి చెప్పారు. ఈ విషయమును అది శాస్త్రబద్ధమా కాదా దేవుడు చెప్పినది అది కరెక్టా కాదా అని లెక్కవేస్తే, అది దేవుడు చెప్పిన విషయం కాదు. అది శాస్త్రబద్ధము కాదు. దేవుడు ఎక్కడా ఏ మనిషినీ ఏ కులంలో పుట్టించలేదు. ఏ మతములో కూడా పుట్టించలేదు. ఏ మతములోను పుట్టించనప్పుడు నీవు చెప్పే దానిని కులములుగా ఎలా విభజిస్తావు? కాబట్టి ఈ శ్లోకము కులాలకు సంబంధించిన శ్లోకము కాదు. ఆ రకంగా చూసుకుంటే అశాస్త్రీయం అవుతుంది. శాస్త్రబద్ధతకు లోబడి ఉండదు అని మనము తేల్చి చెప్పుకోవచ్చు.

ఆ విధముగా తేల్చి చెప్పేది బ్రహ్మవిద్యా శాస్త్రము. బ్రహ్మవిద్యా శాస్త్రము ఏది అంటే, అది ప్రత్యేకంగా మీకు కనిపించదు. కానీ సత్యముగా చెప్పుకొంటే ఆ చెప్పినటువంటి భావాలు అర్థము చేసుకోగలిగితే తెలుస్తుంది. భగవద్గీతను మనము బ్రహ్మవిద్యా శాస్త్రముగా పోల్చుకోవచ్చు. బ్రహ్మవిద్యా శాస్త్రముగా ఉండేటటువంటివి, మన దేశములో కేవలము మూడు గ్రంథాలు మాత్రము ఉన్నాయి. ఎన్నైనా వ్రాసుకోవచ్చు ఆ మూడింటికి సంబంధించి నదే బ్రహ్మవిద్య శాస్త్రముగా ఉంటుంది. ఇప్పటి వరకు నేను 100 గ్రంథాలు వ్రాశాను. ఇంకా వ్రాసేటివి ఎనిమిది ఉన్నాయి. కానీ ఇంతవరకు వ్రాసినవి గానీ, వ్రాయబోయేవి ఏ గ్రంథమైనాకానీ, నేను వ్రాసినటువంటి ఏ విషయమైనా కానీ అది భగవద్గీతకు లోబడే ఉంటుంది. కాబట్టి నేను వ్రాసేదంతా బ్రహ్మవిద్యా శాస్త్రానికి లోబడే వ్రాశాను అని చెప్పుతున్నాను. ఏదీ అశాస్త్రీయము ఎక్కడా ఉండదు. అశాస్త్రీయముగా చెప్పితే కులాలు, మతాలు చెప్పుకొన్నట్లుగా ఉంటుంది. అలా ఎక్కడా అశాస్త్రీయత ఉన్నటు వంటిది నిరూపణకు రాదు. మొన్న దేవుడు రక్షిస్తాడు అని చెప్పుతాడు. ఎలావుంటే రక్షిస్తాడు అనే విషయం తెలుసుకుంటే అది శాస్త్రీయము అవుతుంది.

దేవుడు రక్షించలేదే అంటే అది శాస్త్రీయము కాదు. ఆ రకంగా మనము చెప్పుకుంటే శాస్త్రానికి సంబంధించినటువంటి గ్రంథాలు మూడు ఉన్నాయి అని చెప్పవచ్చును. ఒకటి మొట్టమొదటిది భగవద్గీత. దాన్ని అనుసరించి బైబిలు వచ్చిందని మనము చెప్పుకుంటున్నాము. అంటే కొంతమంది భగవద్గీతను అనుసరించి బైబిల్ ఎలా వచ్చింది? అని అడుగవచ్చు. బైబిల్ చెప్పినది ఏసు ప్రభువు. భగవద్గీతను చెప్పినది శ్రీకృష్ణుడు. కృష్ణుడు రాజభోగాలు అనుభవిస్తూ, ఎన్నో ఆభరణాలు ధరించి,

విలాస పురుషుడుగా తిరుగుతూ, ఆయన చెప్పినటువంటిదేమో జ్ఞానము అని అంటున్నాము. మా ఏసుప్రభువు ఒకే అంగీ తొడుక్కొని కష్టముగా జీవితము గడిపినాడు. ఆయన కష్టాలలో ఉండి జ్ఞానము చెప్పినాడు. ఆయన చెప్పిన జ్ఞానానికి, ఈయన చెప్పిన జ్ఞానానికి ఎంతో తేడా వుంది అని కొంతమంది అనవచ్చు. కానీ పైన జీవితం ఎలా ఉన్నా, విలాస వంతముగా ఉన్నా, కష్టంగా ఉన్నా చెప్పినటువంటి జ్ఞానము ఎటువంటిది అని మనము చూడాలి గానీ బయట బ్రతికిన దానిని గురించి లెక్క పెట్టకూడదు.

మనకు తెలుసో లేదో కానీ "అంతిమ దైవ గ్రంథము" అనేది ఒకటి ఉంది. దీనిని చాలామంది ముస్లీమ్‌ల గ్రంథము అని అంటారు. అది సర్వ మానవులందరికీ సంబంధించిన గ్రంథము. కానీ 'మా గ్రంథము' అంటే అశాస్త్రీయము అవుతుంది. దానిలో ఏమి చెప్పినారు అంటే మొట్టమొదట వచ్చినటువంటి ఈ దైవిక గ్రంథము ఏదైతే ఉందో దాన్ని అనుసరించి బైబిలు పుట్టింది. దానిని అనుసరించి ఖురాన్ పుట్టింది. అంటే ఖురాన్ దానిని నిరూపణ చేస్తూవుంది. అందులోని విషయాలు సత్యమైనటువంటివి అని ఈ ఖురాన్ చెప్పుతూవుంది, నిరూపిస్తూవుంది. ఆధారముగా చూపుతుంది, సాక్ష్యం చెప్పుతూవుంది. భగవద్గీతలోని విషయం సత్యమైనది అని రెండు గ్రంథాలు చెప్పుతున్నాయి. మిగతా రెండు గ్రంథాలు ఆ మొదటి గ్రంథము ఆధారముతోనే వచ్చాయి అని, అంతిమ దైవ గ్రంథములో 5వ సూరా 48వ ఆయత్‌యందు చెప్పబడింది. కాబట్టి మనకు కూడా ఒక బలం ఏర్పడినది ఏమని అంటే బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించే మూడు గ్రంథాలు ఉన్నాయని, మనము గట్టిగా చెప్పవచ్చు. బ్రహ్మవిద్యా శాస్త్రాన్ని అనుసరించి **ఇంజీలు** అంటే బైబిల్‌గానీ,

ఖురాన్ అంటే **అంతిమ దైవగ్రంథము** గానీ, మొదటి దైవగ్రంథము అయినటువంటి **భగవద్గీత** కానీ మూడు ఉన్నాయి అని మనము చెప్పవచ్చు.

ఈ మూడు గ్రంథాలు బ్రహ్మవిద్యకు సంబంధించినటువంటివి. కేవలము దేవుని విద్యకు సంబంధించినవి అని చెప్పవచ్చు. ఈ మూడు గ్రంథాలు మా మతానికి సంబంధించినదని ఒకరు, మా మతానికి సంబంధించినది అని మరొకరు అనుకొన్నా కానీ, మీరు ఏ విధముగా అనుకొన్నా కానీ సర్వమానవులకు సంబంధించినవి మూడు గ్రంథాలు. అవి ఒకే ఒక బ్రహ్మవిద్యా శాస్త్రానికి సంబంధించినవని చెప్పవచ్చును. అందులో బ్రహ్మవిద్య శాసనాలు ఉంటాయి తప్ప, వేరే శాసనం ఉండదు. భగవద్గీతలో చెప్పిన మాటకు బైబిలు, ఖుర్ఆన్‌లో చెప్పిన మాటకు ఒకే శాసనం మీద ఆధారపడి ఉంటుంది తప్ప వేరే శాసనాలు అంటూ ఉండవు. అందుకే చాలామందికి తెలియక బైబిల్‌లో ఉండే సమాచారం వేరు, భగవద్గీతలో ఉండే సమాచారము వేరు, ఖురాన్‌లో ఉండే సమాచారము వేరు అని అంటారు. మేము ఏమి చెప్పాము అంటే ఖురాన్‌లో సమాచారమైనాగానీ, బైబిల్‌లో సమాచారమైనాగానీ, భగవద్గీతలోని సమాచారమైనా గానీ, ఒకే తాడు మీద ఆధారపడి ఉన్నాయని, ఒకే శాసనములతో కూడుకొని ఉన్నాయని, మేము మూడు రకాల గ్రంథాలు వ్రాసి చూపించడము జరిగినది. ఇంతకు ముందు భగవద్గీత అనే గ్రంథాన్ని వ్రాశాము. **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** అని మొట్టమొదటే వ్రాశాము. దీనిని 1994లో వ్రాయడము జరిగినది. ఇది 2002వ సం॥లో బయటకు వచ్చింది. తరువాత మీకు ఈ మధ్య కాలంలో అంతిమ దైవగ్రంథములో రెండు గ్రంథాలు వ్రాసి ఇచ్చాము. పెద్ద గ్రంథాలు ఒకటి **"జ్ఞాన వాక్యములు"** అని 704 పేజీలు ఒక గ్రంథము. తరువాత **"వజ్రవాక్యములు"** అను

పేరుతో 736 పేజీలు ఒక గ్రంథము. దగ్గర దగ్గర రెండు గ్రంథాలు 1440 పేజీలు ఉంటాయి. అంత పెద్ద గ్రంథాలు మీకు వ్రాసి ఇవ్వడము జరిగింది. వాటిని మీరు చదివేవుంటారు. అందులోని జ్ఞానము చాలా గొప్పది అని మీకు అర్థమయింది. కానీ మీరు ఒక హిందువుగా వుండి భగవద్గీత చదివి, మీరు భగవద్గీతను ఫాలో అవుతూ, భగవద్గీతలోని సమాచారాన్ని మీరు తెలుసుకున్న తరువాత, మరలా మీకు ఈ ముస్లీమ్ గ్రంథములో ఉండే విషయం ఎట్లా అర్థమయింది? అని కొంతమంది నన్ను ప్రశ్నించారు. మీరు ఎలా వ్రాయగలిగినారు? ఖుర్‌ఆన్ మా గ్రంథము కదా! మా గ్రంథములోని విషయాలు మీకు ఎలా అర్థమయినాయి? అని కొందరు అడిగారు. దానికి నేను **"మీ గ్రంథము, మా గ్రంథము ఏందయ్యా! మీ దేవుడు, మా దేవుడు అంతా ఒక్కడే అయినప్పుడు మా గ్రంథము, మీ గ్రంథము అనేది లేదు. ఒకే దేవుడు చెప్పిందే ఈ విషయం అంతా"** అని చెప్పాము. తరువాత ఏమి చెప్పాము అంటే నాకు ఎప్పుడైతే శాస్త్రీయత, శాస్త్రబద్ధత అర్థము అయిందో, శాస్త్రబద్ధత భగవద్గీత శాస్త్రబద్ధంగా ఉంది, అని తెలిసినప్పుడు అదే శాస్త్రము మీద ఆధారపడినటువంటి ఏ గ్రంథము అయినా నాకు సులభమే అని చెప్పాము. అందువలన నాకు బైబిలు సులభమే, ఖురాన్ సులభమే, భగవద్గీత సులభమే అయిపోయింది.

ఈ రోజు చాలామందికి తెలియని రహస్యాలన్నీ నేను ఖురాన్‌లో బాగా విడదీసి చెప్పడము జరిగింది. ఇంక తరువాత బైబిల్ విషయం కూడా చెప్పాము. కానీ భగవద్గీత అంతా 736 పేజీలు, అదే విధముగా ఖురాన్ గ్రంథము అంతా 1440 పేజీలు అయింది. 'రత్నవాక్యములు' అను బైబిలు మాత్రము 352 పేజీల వరకు ఉన్నది. బైబిల్ రత్న వాక్యములు అను చిన్న గ్రంథమైనాగానీ గొప్ప రహస్యాలు అందించబడినది. ఇప్పుడు

భగవద్గీతను చదివిన తరువాత ముస్లీమ్ గ్రంథము అయినటువంటి ఖుర్ఆన్‌ను చదివిన తరువాత, మీరు బైబిల్ ఎట్లా వ్రాయగలిగారు? అని మీకు ప్రశ్న రావచ్చు. ఎందుకంటే అది ఒక కోణంలో ఉంటుంది. ఇది ఒక కోణంలో ఉంటుంది. ఇంకొకటి ఇంకొక కోణములో ఉంటుంది అని అడుగవచ్చు దానికి నేను ఇలా చెప్పుచున్నాను. ఇప్పుడు ఒక స్వామీజీ ఉన్నాడు. నేను హిందువునని ఆయన కాషాయ గుడ్డలు వేసుకున్నాడు. గడ్డం పెంచుకొన్నాడు, జుట్టు పెంచుకొన్నాడు. నేను హిందువును. నా వేషము ఇది. నా హిందూ సాంప్రదాయము ప్రకారము నేను ఉన్నానంటాడు. ముస్లీమ్‌లు మా ముస్లీమ్ సాంప్రదాయము ప్రకారము మేము ఉన్నాము. నెత్తిన టోపి పెట్టుకొన్నాము, గడ్డము పెంచుకొన్నాము. వాళ్ళ సాంప్రదాయము ప్రకారము వాళ్లు ఉన్నారు. మా సాంప్రదాయము ప్రకారము మేము ఉన్నాము అని అనవచ్చు. ఇవి మత సాంప్రదాయాలే కానీ జ్ఞాన సాంప్రదాయాలు కావు అని మేము అంటున్నాము.

మతానికి సాంప్రదాయము ఉంది. ఆ మత సాంప్రదాయం ప్రకారము మీరు నడుచుకోండి. ఫరవాలేదు, నేను ముస్లీమ్ అనేదానికి కావలసిన ఆధారాలు ఏవైతే ఉన్నాయో అవన్నీ పొరపాటు పడకుండా ఆచరించండి. ఎందుకంటే దేవుడు నిన్ను ఆ మతంలో పుట్టించాడు కాబట్టి ఆ గుర్తుగా నీవు బ్రతుకు. దాన్ని మారవద్దు. ఎందుకంటే దేవుడు ఇక్కడ చెప్పినా అదే జ్ఞానమే, అక్కడ చెప్పినా అదే జ్ఞానమే. కాబట్టి భగవద్గీతలో ఉండే జ్ఞానము, బైబిల్‌లో వుండే జ్ఞానము ఒకటే. ఆ రెండు గ్రంథాలలో ఉన్న జ్ఞానము ఖురాన్‌లో ఉంది కాబట్టి నీవు ఏమాత్రము దిగులు చెందాల్సిన పని లేదు. నీవు ముస్లీమ్‌గా ఏ రకంగా ఉన్నావో అదే ఆచరణ ఆచరించమని నేను చెప్పాను. మతము ఎప్పుడూ మారవద్దు అని నేను చెప్పాను. అదే

విషయము క్రైస్థవులకు చెప్పుతున్నాను. అదే హిందువులకు చెప్పుతున్నాను. మీరు మతాలు మారవలసిన అవసరము లేదు. మత సాంప్రదాయములు వేరు అయినా జ్ఞానము మాత్రము ఒక్కటే కలదు. అది నీకు అర్థము కాలేదు. అర్థముకాక నీవు ఏమి చేస్తావు అంటే ఇంకొక మతము మీదికి ఆశపడుచున్నావు. హిందువులు ఇస్లామ్‌లో చేరుతున్నారు. ముస్లీమ్‌లు క్రైస్థవులలో చేరుతున్నారు. క్రైస్థవులు ఇస్లామ్‌లో చేరుతున్నారు. ఈ విధముగా ఒకరికొకరు మతము మారుచూ పోవుచున్నారు. అక్కడ ఏమి ఉందో ఇక్కడ ఏమివుందో అని ప్రాకులాడుతున్నారు ఎక్కడయినా ఒక్కటే దైవజ్ఞానము కలదని తెలుసుకోలేకపోవుచున్నారు.

అంతవరకు వుండేది **"ఒకే జ్ఞానము ఒకే దేవుడు ఏమాత్రము తేడా లేదు"** అని చెప్పాము. నేను మీకు ఒక సూత్రము చెప్పుతున్నాను. నీవు మూడు ఆత్మలతో కూడుకొన్న శరీరములో ఉన్నావు అని చెప్పాను. నీవు వున్నావు అని అంటే ఏమని "నీవు అంటే ఎవరు?" అని ముస్లీమ్‌లకు చెప్పుతున్నాను. క్రైస్థవులకు అదేమాట చెప్పుతున్నాను. తరువాత హిందువులకు కూడా అదేమాట చెప్పుతున్నాను. నీవు ఎవరన్నా కానీ నీకు మూడు ఆత్మలు ఉన్నాయి. నీవు జీవాత్మగా ఉన్నావు, 'నేను' అనే పేరు పెట్టి ఎవరైతే పిలువబడుతున్నారో, 'నేను ఫలానా వ్యక్తిని' అని నీవు అనుకుంటున్నావో ఆ వ్యక్తిగా ఉన్నటువంటి జీవాత్మ ఇప్పుడు నేను ఫలానా కష్టాన్ని అనుభవిస్తున్నాను, ఫలానా సుఖాన్ని అనుభవిస్తున్నాను అని ఆ అనుభూతిని పొందేవాడంతా జీవాత్మనే. ఆ అనుభవాలు అనుభవించువాడు జీవాత్మ. నీ శరీరాన్ని కదిలించి మెదిలించి, దాంట్లో మాట్లాడించి పనులు చేయించేటటువంటి కార్యకర్తగా ఉన్నటువంటివాడు నీ శరీరములోని ఆత్మే.

ఈ విషయం భగవద్గీతలో చెప్పారు. ఈ జీవాత్మను, ఆత్మను రెండిటినీ చూస్తూ పరమాత్మ ఉన్నాడు.

ఈ ప్రపంచమంతా మొట్టమొదట సృష్ఠికర్త ప్రపంచాన్ని సృష్ఠించి తర్వాత ఏమి చేశాడంటే మానవులను సృష్ఠించే దానికొరకు ఆత్మను సృష్ఠించాడు. తరువాత ఆత్మ సర్వజీవరాసులయిన మానవులను మిగతా జీవరాసులను అందరినీ సృష్ఠించి దాని బాగోగులు అంతా అదే చూసుకుంటుంది. ఇంకా ఆత్మ అనేవాడు మనుషులను పుట్టించేవాడు, బ్రతికించేవాడు, చంపేవాడు. అన్నిటికీ ఆత్మే ఆధారంగా ఉన్నాడు. ఇంకా ఆత్మ ఏమి పని చేస్తున్నాడు అంటే నిన్ను ఎలా నడిపించాలో అలా నడిపిస్తున్నాడు. ఏమి అనుభవాలు అనుభవింప చేయాలో అవే అనుభవింప జేస్తున్నాడు. కాబట్టి నీకు దగ్గరగా ఉండేటటువంటివాడు ఆత్మ, కొద్దిగా దూరంగా ఉన్నటువంటివాడు పరమాత్మ. కానీ పరమాత్మ అన్నీ చూస్తున్నాడు. ఏమీ చేయడు, చేసేవాడంతా ఆత్మ. అనుభవించేవాడు జీవాత్మ, చూస్తూ ఉండేవాడు పరమాత్మ. ఆడించేవాడు ఆత్మ, అనుభవించే వాడు జీవాత్మ. ఇప్పుడు నీకు ఒక రోగము వచ్చి బాధపడుతున్నావు అనుకో, బాధపడేవాడు ఎవడు? అంటే జీవాత్మ. రోగం తెప్పించే వాడు ఎవడు అంటే ఆత్మ. ఈ రెండింటినీ చూస్తూ ఉండేవాడు ఎవడు అంటే పరమాత్మ అని చెప్పాలి. పరమాత్మ ఏమీ సంబంధము లేకుండా ఉంటాడు. ఇప్పుడు మాట్లాడేవాడు ఎవడు ఆత్మ. కానీ 'నేను' అనేవాడు ఎవడు జీవాత్మవు ఒక వ్యక్తితో ఒకమాట మాట్లాడుతున్నావు అనుకొంటే, జీవాత్మవు. కాదు నీలో ఉండేటటువంటి ఆత్మే మాట్లాడుతూవుంది. నీవు పని చేస్తున్నావు అనుకొంటే అది పొరపాటే. నీవు కాదు నీలో వుండేటటు వంటి ఆత్మే చేస్తూవున్నాడు. నీవు ఒక జాబు వ్రాస్తున్నావు. నేను చాలా

తెలివిగా వ్రాసినాను అనుకొంటావు కానీ ఆ వ్రాతయంతా ఎవరిది? ఆత్మది. నీవు ఏమీ చేయలేదు. నేనే వ్రాస్తున్నానని అనుకోవడము కానీ, నేనే మాట్లాడుతున్నానని అనుకోవడము కానీ, అన్నీ జీవుని యొక్క అహంకారం తప్ప, ఇంకోటి కాదు. ఈ విషయము మొదటి నుండి చెప్పుతున్నాను. **"నీవు అనేవానివి జీరో. ఆత్మ అనే వాడు హీరో"** అన్నీ చేసేవాడు ఆత్మే. అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో ఒకచోట నేనే కార్యకర్తగా ఉన్నాను. ఎవడైతే మీలో ఉండి ఆడిస్తున్నాడో వాడే మీకు అల్లాహ్. ఆయనే కార్యకర్తగా ఉన్నాడని 6వ సూరా 102 ఆయత్‌లో చెప్పారు.

ఈ రకంగా అంటే కార్యకర్తగా శరీరములో అన్ని పనులు చేస్తూ ఉన్నాను అని ఎవడైతే చెప్పినాడో అతనే మనకు **దేవుడు.** మన శరీరములో ఎవడైతే నిన్ను మాట్లాడిస్తున్నాడో అతనే నీకు దేవుడు. ఒకచోట బైబిల్ గ్రంథములో కూడా ఒకమాట చెప్పుతాడు. మత్తయి సువార్త 10వ అధ్యాయము, 20వ వాక్యములో **"మీ తండ్రి ఆత్మ మీలో ఉండి మాట్లాడు చున్నాడే కానీ మాట్లాడువారు మీరు కాదు".** ఇప్పుడు ఆత్మ అనేవాడే మాట్లాడుతున్నాడు కానీ మాట్లాడువారు మీరు కాదు అని చెప్పారు. అంతటితో చెప్పి ఊరికే ఉన్నారా అంటే, లేదు మీ తండ్రి అయిన ఆత్మ అని చెప్పారు. నా తండ్రి, నా తల్లి అని నీవు బయటవాళ్లను చూస్తున్నావు. వారినే నీవు గుర్తుంచుకొంటున్నావు. కానీ నీకు తెలియని రహస్యం ఏమంటే నిన్ను పుట్టించినటువంటివాడు నీ శరీరములో ఉండేటటువంటి ఆత్మే. ఇంతకుముందు ప్రపంచాన్ని పరమాత్మ సృష్టించాడు. ఆయన మానవులను సృష్టించలేదు. జీవరాసులను సృష్టించలేదు. జీవరాసులను సృష్టించేదానికి, పాలించే దానికి, చంపేదానికి మళ్ళీ పుట్టించేదానికి ఈ రామాయణం అంతా నాకెందుకు అని ఆయనకు ఒక ఏజెంట్‌గా ఒక ఆత్మను సృష్టించాడు.

ఆ ఆత్మే మానవున్ని పుట్టిస్తూవుంది, బ్రతికిస్తూవుంది, చంపుతూవుంది అని చెప్పాను. ఇప్పుడు **"సర్వ జీవరాసులకు నేనే బీజదాతను"** అని భగవద్గీతలో గుణత్రయ విభాగ యోగము 3వ శ్లోకములో చెప్పాడు. అంతేకాక మీరు ఎక్కడ పుట్టినా కూడా ఎవరు ఎక్కడ పుట్టినా, ఏ జీవరాసి ఎక్కడ పుట్టినాగానీ నేను వాళ్లకు తండ్రిని, తల్లి ప్రకృతి అని చెప్పాడు. మీకు తెలియకుండానే మీకు ఒక తండ్రి ఉన్నాడు. ఆ తండ్రే ఆత్మ. మీ శరీరములో నుండి మాట్లాడువాడు మీ తండ్రేగానీ, మాట్లాడువారు మీరు కాదు అని బైబిల్‌లో తేల్చి చెప్పారు. వాస్తవముగా భగవద్గీతలో అదే ఉంది. తరువాత ఖురాన్‌లో కూడా 2 సూరా 255 ఆయత్‌లో అదే విషయం చెప్పబడింది. ఇది మా గ్రంథము అని ఎవరు ఏమనుకున్నా గానీ, మీ గ్రంథములో అదే వుంది. ఇంకొకరి ఇతర గ్రంథములోనూ అదే ఉంది. అందరి గ్రంథాలు ఒక్కటే. **అందరి దేవుడు ఒక్కడే.**

ఈ విధముగా మనము లెక్కవేసుకొని చూస్తే, మీ తండ్రి అయిన ఆత్మ మీలో ఉండి మాట్లాడుచున్నాడే గానీ, ఈ మాట్లాడువారు మీరు కాదు అని ఉంది కదా! దీనిప్రకారము ఇప్పుడు నేను మాట్లాడుతున్నాను అంటే ఈ మాటలన్నీ నావి కాదు అని అర్థము. ఈ మాటలను మాట్లాడించువాడు ఒకడు ఉన్నాడు. వాడు నా శరీరములో ఉన్నటువంటి ఆత్మ. ఆయన ఏది చెప్పితే అది బయటికి పలుకబడుతుంది. అంటే జీవుడు అను నేను ఒకడిని వున్నాను. కానీ నాకు ఏమీ చేతకాదు. నాకు ఏమీ తెలియదు, నా పని సుఖము వస్తే అనుభవిస్తాను. అట్లే కష్టము వస్తే అనుభవిస్తాను. అది నా పని, ఒకే ఒక పని. అనుభవాలు అనుభవించడమే జీవుని పని. ఏ పనీ లేకపోతే వాడు శరీరములో ఒక భాగంగా గుర్తించబడడు. దీనికి ఆధ్యాత్మిక శాసనము ఉంది. పని చేసేవాడు ఆత్మే అయినా ఒక ప్రత్యేక

పని చేసే అవయవము శరీరములో ఒక భాగముగా గుర్తించబడుతుంది. ఆ రకంగా మన శరీరములో 24 భాగాలు ఉన్నాయి. 25వ భాగము నువ్వు. నువ్వు కూడా జీవాత్మగా అనుభవించే పనిని నీవు చేస్తున్నావు. కాబట్టి నిన్ను కూడా ఒక భాగంగా గుర్తిస్తున్నాము.

ఆ రకంగా కన్ను చూస్తూ ఉంది, అంటే కన్ను ఒక భాగంగా ఉంది. చెవి వింటూ ఉందంటే చెవి ఒక భాగంగా ఉంది. ఆ విధముగా మన శరీరములో 24 కార్యములు 24 భాగాలు చేస్తూ ఉన్నాయి. కాబట్టి వీటన్నిటిని జీవుని మినహా 24 భాగాలుగా గుర్తిస్తున్నాము. జీవునితో కలిపితే 25 భాగాలు అవుతాయి. ఈ జీవుడు ఆత్మ సంబంధముగా ఉన్నాడు. జీవుడు ప్రకృతితో కూడుకున్నాడు కాబట్టి, మనము శరీరములో ఒక భాగంగా ఈయనను లెక్కిస్తున్నాము. పూర్తి ఆత్మలుగా ఇద్దరు ఉన్నారు. వాళ్ళని శరీరములో గుర్తించే దానికి లెక్కవేయలేదు. వాళ్లను ప్రక్కగా చెప్పుకుంటున్నాము. ఈ శరీరములో మొత్తము 25 భాగాలుగా విభజించి చెప్పితే, అందులో జీవాత్మను కలుపుకొని చెప్పుకోవాల్సిన పని ఉంది. ఈ జీవాత్మకు తండ్రి ఎవరు అని ప్రశ్న వేసుకుంటే, మనకు తెలుసో తెలియదో ఇంతవరకు నిజమైన తండ్రి ఎవరు అంటే, నీ శరీరములో ఉండేటటువంటి ఆత్మే అని చెప్పవచ్చును. నిన్ను పుట్టించినవాడు నీ ఆత్మే అని తెలియవలెను. నేను తండ్రిని అని చెప్పుకొనుటకు బయట ఎవనికీ అవకాశము లేదు. శరీరములో ఉండేటటువంటి ఆత్మే బీజదాతను నేను అన్నాడు. బీజదాత ఎవరైతే వారే మనకు తండ్రి అవును. కాబట్టి శరీరములో ఉన్నటువంటి ఆత్మే తండ్రి. జీవుడు బీజదాతవు కాదు. ఎందుకంటే జీవుడు ఏ కార్యము చేయలేదు. జీవుడు ఏ కార్యము నీ చేతకాదు. కానీ శరీరములో జరిగే కార్యాలన్నిటిని నేనే చేస్తున్నానని మొదటి నుంచి

అనుకుంటున్నావు. అది పూర్తి తప్పు. ఈ రోజే కాదు జ్ఞానము మొదలు పెట్టినప్పటి నుండి అదే విషయమును చెప్పుతున్నాను. కానీ జీవుడు మర్చిపోయి నేనే చేస్తున్నాను అనుకుంటున్నావు. ఒకడు వైద్యం చేస్తే ఒకరికి రోగము బాగా అయితే "చూడు, నా వైద్యం ఎంత బాగా పని చేసింది" అని అనుకుంటాడు. కానీ నీవు వైద్యం చేయలేదు. నీ వైద్యం పని చేయలేదు. లోపల ఉండేటటువంటి ఆత్మ ఆ పనిని చేశాడు.

మా దగ్గరకు బాధపడుతూ ఒక వ్యక్తి వచ్చి నాకు ఈ రోగము వచ్చింది. ఈ బాధ వచ్చింది నేను హాస్పిటల్‌కి పోయినాను. నాకు హాస్పిటల్‌లో ఈ రోగము చాలా పెద్దది అని చెప్పారు. ఆపరేషన్ చేయాలన్నారు. చికిత్స చేయాలన్నారు. నాకు అంత డబ్బు పెట్టే స్థోమత లేదు. స్వామీ! మీ దగ్గరికి వస్తే బాగవుతుంది అని వచ్చాను అంటే, దానికి నేను "నా దగ్గరికి వస్తే ఏదీ బాగా కాదు. నేను దగ్గుతా కూర్చున్నాను. మరి నాకే దగ్గు పోలేదు. నీకు రోగం ఎట్లు పోతుంది. నిన్ను బాగు చేసేవాడు, నన్ను బాగు చేసేవాడు అందరిలో ఒకడు ఉన్నాడు. వాడు లోపల ఉంటాడు, కనపడడు. ఒకవేళ అతను ఉన్నాడని మనము గుర్తు పెట్టుకొంటే, అతను ఉన్నాడని నీవు అనుకొని వస్తే, రా! ఆయన ఉన్నాడు. ఆయన నీ మొర ఆలకిస్తే, నీకు రోగాలు పోగొట్టవచ్చు" అని చెప్పాము. సరే అట్లని వచ్చినవాళ్లు ఉన్నారు. ఆ మాట ప్రకారము విశ్వాసము పెట్టుకొని ఇక్కడికి వచ్చినారు. వాళ్లకి ఆ రోగాలు పోవడము కూడా జరుగుతూవుంది. చాలామందికి జరిగింది. ఈ రకంగా వాళ్ల వాళ్ల కర్మల బట్టి వాళ్ల వాళ్ల రోగాలు క్షమించబడుతుంటాయి. ఆ రోగాలు పోతుంటాయి. దేవుడు ఒక విషయం చెప్పాడు. నీవు ప్రపంచవరంగా ఏ పాపము చేసుకున్నా గానీ అది క్షమించబడుతుంది. దేవుని సంబంధంగా చేసినటువంటి ఏ

పాపము క్షమించబడదు అని చెప్పాడు. బైబిల్‌లో మత్తయి సువార్త (అధ్యాయము 12, వచనము 31) లో ఆ విషయం చెప్పాడు. ప్రపంచ సంబంధముగా చేసుకున్న పాపాలు ఘోరమైనవి, కానీ చాలామందికి ఇక్కడ వచ్చిన కొద్దిసేపటికే పోయినాయి. కొన్ని రోజులకే పోయాయి. కానీ దైవసంబంధముగా పాపము చేసుకొన్న వాళ్లు ఇక్కడికి వచ్చినా కూడా వాళ్ల బాధలు పోవడము లేదు. ఆత్మ తనకు ఇష్టము ఉండేవాళ్లకు బాగు చేస్తుంది. ఇష్టము లేనివాళ్లకు బాగు చేయదు అని చెప్పాము. ఇష్టమైనటు వంటి వాళ్లకే ఆత్మ బాగు చేస్తుంది. పాపాన్ని క్షమిస్తుంది. ఆత్మకు (ఆయనకు) ఇష్టంగా ఉండాలంటే నీకు దేవుని మీద ఎంత ధ్యాస ఉంటుందో నీ మీద ఆయనకు అంత ధ్యాస వస్తుంది. లేదు ఈ కులాలు, మతాలు పెట్టుకొని నీవు దేవున్ని దూరంగా పెట్టుకుంటే, నీవు దూరంగానే ఉంటావు.

దేవుడు నీకు అత్యంత సమీపములో ఉన్నాడని ఖురాన్ గ్రంథములో చెప్పబడింది. **"ఆయన నీకు అత్యంత సమీపములో ఉన్నాడు. నీవు మాట్లాడే ప్రతి మాటను వింటున్నాడు. నీవు మాట్లాడే ప్రతి మాటకు ఆయన జవాబు ఇస్తాడు"** అని 2వ సూరా 186వ ఆయత్‌లో చెప్పబడింది. ఆ లెక్క ప్రకారము లెక్కవేసుకుంటే మనకు దేవుడు అనేవాడు ఎవడు? అని తెలియక హిందువులు చాలా గందరగోళములో ఉన్నాము. క్రైస్థవులు గందరగోళములో ఉన్నారు. అలాగే ముస్లీమ్‌లకు ఒక గందర గోళము ఏర్పడినది. ముస్లీమ్‌లకు అల్లాహ్ ఒక్కడే అనే నమ్మకం ఉంది, కానీ ముస్లీమ్‌లకు ఇద్దరు అల్లాలు ఉన్నారు అని, ఖురాన్ గ్రంథములోనే ఉందని తేల్చి చెప్పాము. అంటే ఒక అల్లాహ్ నీతో చేయిస్తున్నాడు, నీతో మాట్లాడుతున్నాడు అన్ని పనులు చేస్తున్నాడు. అతడు నిన్ను, ప్రపంచమంతా

చూచునట్లు చేస్తున్నాడు. ఇంకొక అల్లా నీతో సంబంధము లేకుండా ఉన్నాడు.

మనము పరమాత్మ ఏ సంబంధము లేకుండా చూస్తున్నాడని ఎట్లయితే అన్నామో, ఆత్మే అన్నీ చేయిస్తుందని ఎట్లయితే అన్నామో, ఆ రకంగా నీ శరీరములో ఉన్నటువంటి ఆత్మే నీకు మొదటి అల్లా. తరువాత పరమాత్మగా ఉండేవాడే నీకు రెండో అల్లా అని చెప్పాము. అంటే ముస్లీమ్‌లకు ఇద్దరు అల్లాహ్‌ల విషయము తెలియకుండా పోయింది. వాళ్లు ఒక అల్లానే అనుకుంటున్నారు. క్రైస్థవులకు **ఇద్దరు కుమారుల** విషయం తెలియకుండా పోయింది. ఒక్క కుమారుడే అనుకుంటున్నారు. ఆయన శాశ్వితమైన కుమారుడు ఆత్మగా ఉన్నాడు. తాత్కాలిక కుమారుడు అప్పుడప్పుడు మానవ రూపంలో వచ్చి పోతాడనే విషయం వారికి తెలియదు. ఇప్పుడు క్రైస్థవులకు కుమారులు ఇద్దరు అనే విషయము తెలియకుండా పోయింది. ఒక్కరే అనుకుంటున్నారు. ఇద్దరు అని చెప్పేసరికి వారికి అర్థము కాని పరిస్థితి ఏర్పడుతూవుంది. అట్లే ముస్లీమ్‌ల నమ్మకము అంతా 'ఒకే అల్లా' అని అనుకుంటున్నారు. కానీ ఇద్దరు అల్లాహ్‌లు ఖుర్‌ఆన్‌లో చెప్పబడ్డారు అనేసరికి గందరగోళము ఏర్పడినది. కానీ గ్రంథములో శాస్త్రబద్ధంగా ఏమి వ్రాయబడిందని వాళ్లూ దానిని చూడడము లేదు. ఖురాన్ గ్రంథములో ఏముంది అని చూస్తే **ఇద్దరు అల్లాహ్‌లు** ఉన్నారనే విషయం వాళ్లకు తెలుస్తుంది. బైబిల్‌లో ఏముందని బాగా చూస్తే **ఇద్దరు కుమారులు** ఉన్నారనే విషయము వాళ్లకు తెలుస్తుంది. ఇంకా భగవద్గీతలోనికి పోతే పరమాత్మ, ఆత్మలు రెండు ఉన్నాయి అని తెలుస్తుంది. మనకు ఇద్దరు దేవుళ్ళుగా ఉన్నారని అందులో ఒక్కనినే మ్రొక్కాలని తెలియదు.

మనకు తెలిసినదంతా సుంకులమ్మను ఒకరు మ్రొక్కితే, మారెమ్మను ఒకరు మ్రొక్కితే, ఇంకొకరు మరొకరికి మ్రొక్కితే, అందరినీ కలుపుకొని మ్రొక్కడం హిందువుల ధర్మము అని అంటారు. మనము ఏమంటామంటే అది శాస్త్రబద్ధము కాదు, భగవద్గీతలో చెప్పలేదు. ఒకే దేవున్ని మ్రొక్కాలిగానీ, ఇతరత్రా దేవుళ్ళను మ్రొక్కితే నీవు మార్గము తప్పి నడిచినటువంటి వాడివి అవుతావని భగవద్గీతలో రాజ విద్యా రాజగుహ్య యోగము, 23వ శ్లోకములో **"యజ్యన్త్య విధి పూర్వకమ్"** అని ఒకమాట దేవుడు చెప్పినాడు. నీవు దారితప్పి నడిచినవాడివి అవుతావు. నీవు దేవున్ని ఆరాధించే వాడివి కాదు అని చెప్పినాడు అని మనము చెప్పితే కూడా అది హిందువులకు అర్థము కాలేదు. వాళ్లకు అర్థముకాక ఏమి చేస్తారంటే అనేకమైన దేవతలను పెట్టుకొని వీడు చిన్న దేవుడు, వాడు పెద్ద దేవుడు, నేను పెద్ద దేవున్ని మ్రొక్కుతున్నాను, నీవు చిన్న దేవున్ని మ్రొక్కుతున్నావు అని రక రకాల తేడాలు పెట్టుకొన్నారు. వారికి 'దేవుడు' అనే విషయము ఏమాత్రము తెలియకుండా పోయినది. అంతో ఇంతో ధ్యాసకల్గినట్టి వాళ్లు ముస్లీమ్‌లు, క్రైస్థవులు తప్ప వాళ్లకంటే హిందువులే చాలా వెనుకబడివున్నారు. ఆ మాట అంటే హిందువులకు కోపం వస్తుందేమో గానీ వాస్తవమైన విషయము ఏమి అంటే ఒక్కనినే మ్రొక్కాలి అనే విషయము వాళ్లకు వుంది. ఒక్కనినే ఆరాధించాలి అనే విషయము మనకు లేదు. అందువలన మనము జ్ఞానమును శాస్త్రబద్ధముగా తెలుసుకుంటే శాసనాలతో కూడుకొన్న జ్ఞానము మనకు తెలుస్తుంది కానీ, మనము ఏదో వాళ్ళు చెప్పినారు, వీళ్లు చెప్పినారు వాళ్లు పెద్దోళ్లు, వీళ్లు పెద్దోళ్లు అంటే దేవుని జ్ఞానములో ఎవరూ పెద్దోళ్లు కాదు. అందరూ చిన్నోళ్లే. వాడు చెప్పినది నీవు వినాల్సిన పని లేదు. నీవు గ్రంథము చదువు. నీకు దేవుడు భగవద్గీతయను దైవగ్రంథాన్ని ఇచ్చాడు.

ముస్లీమ్‌లకు ఖురాన్ ఇచ్చాడు. క్రైస్థవులకు బైబిల్ ఇచ్చాడు. మరి నీవు అది చదువు. దాంట్లో ఉండే విషయము నీవు తెలుసుకో, అట్లుకాకుండా ఎవడో వాడు చెప్పినాడు, వీడు చెప్పినాడు అనుకుంటే ఏమీ ప్రయోజనము లేదు.

అందువలన నీవు తెలుసుకోవాల్సిన విషయం ఏమి అని అంటే నాకంటే పెద్దగా తెలిసినవాడు ఇంకొకడు ఉన్నాడేమో అనుకోవడము పెద్ద పొరపాటు. ఎందుకు అంటే ప్రపంచములో ఐదు (5) శాస్త్రాలలో ఎవడైనా శాస్త్రబద్ధముగా తెలుసుకోవచ్చు, నేర్చుకొనవచ్చు. అందులో ఒక శాస్త్రములో ప్రావీణ్యుడు కావచ్చు. అలాగే (5) శాస్త్రాలలో కూడా ప్రావీణ్యుడు కావచ్చు. కానీ ప్రావీణ్యుడు కాకుండా ఉండేది ఒకే ఒక శాస్త్రము ఉంది. అదే బ్రహ్మవిద్యా శాస్త్రము. బ్రహ్మవిద్యా శాస్త్రములో ఎవడు కూడా ప్రావీణ్యుడు కాలేదు. సంపూర్ణ జ్ఞాని కాలేదు. విత్ అంటే తెలుసుకోవడం. విత్ అనే పదము నుండి పుట్టినటువంటిది విద్య. విద్య అంటే తెలియబడేది. **నీవు ఎంతకాలమైనా విద్యార్థివే**, ఎంతకాలమైనా నీకు ఇది విద్యే అనే ఉద్దేశ్యముతో దాని పేరు **'బ్రహ్మవిద్య'** అని పెట్టారు. భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, ఖగోళశాస్త్రము, గణిత శాస్త్రము, జ్యోతిష్య శాస్త్రము అని వాటిని అన్నారు. కానీ ఒక్క దైవజ్ఞానమునకు మాత్రము 'విద్య' అని పెట్టి తరువాత 'శాస్త్రము' అని పెట్టారు. బాగా జ్ఞాపకము పెట్టుకోండి. బ్రహ్మవిద్యా శాస్త్రము అంటే ఎప్పటికైనా తెలుసుకునేదే, అయిపోయేది కాదు.

అందువలన నేను దీంట్లో పండితున్ని అయినాను అని చెప్పు కోవడానికి అవకాశము లేదు. వీడు సంపూర్ణ జ్ఞాని అని చెప్పేదానికి ఎవనికీ అవకాశము లేదు. ఎందుకంటే అది నేర్చుకోవాల్సిన విద్యయే గానీ,

సంపూర్ణముగా తెలుసుకొనిన వాడు ఎవడూ లేడు. ఎప్పుడు పూర్తిగా తెలుసుకొంటాడు అని అంటే, మనిషి ఎప్పుడైతే తెలుసుకుంటావో ఆ రోజు వాడు దేవునిలోనికి ఐక్యమైపోతాడు. దేవునిలో ఐక్యమైపోతే నీవు ఇక్కడ ఉండాల్సిన అవసరమే లేదు. మరి నీవు ఉన్నావంటే ఏమి అర్థము, నీకు జ్ఞానము పూర్తి తెలియదని అర్థము. ఆ విద్యనే నీవు నేర్చుకోవాల్సింది. నీవు విద్యార్థివే. ఇక్కడ చెప్పేది బ్రహ్మవిద్య. మీరు ఇక్కడకు వచ్చారంటే విద్యార్థులుగా ఇక్కడకు వచ్చారు. తెలుసుకొనే వాళ్లుగా వచ్చారు. నేను ఉన్నాను. నేను తెలుసుకొనే వానిగా ఉన్నాను. నేను కూడా విద్యార్థినే. నేను సంపూర్ణముగా తెలుసుకోగల్గితే మీ ముందర ఉండను. దేవునిలోనికి ఐక్యమైపోతాను. నేనుండి మాట్లాడుతున్నాను అంటే నేను ఇంకా పూర్తి తెలియని వానినే. తెలిసినవాన్ని అని చెప్పుకోవడము పెద్ద పొరపాటు అవుతుంది. ఇదే నాకు తెలుసు, ఇంతకంటే ఎవరికీ తెలియదు, సంపూర్ణముగా నేను నేర్చుకున్నాను అనే దానికి అవకాశము లేకుండా, దాని పేరు వెనుక విద్య అని పేరు పెట్టాము. **అది ఎప్పటికీ బ్రహ్మవిద్యే. నీవు ఎప్పటికీ విద్యార్థివే.** ఎప్పటికైనా నీవు నేర్చుకోవాల్సిన వానివే. నేర్చుకోబడేది విద్య, ఎప్పటికీ నీవు తెలుసుకోవాల్సిన వానివే. కాబట్టి దానినే 'బ్రహ్మవిద్య' అని ప్రత్యేకంగా మనము పేరు పెట్టి పిలుస్తున్నాము. లేకపోతే బ్రహ్మవిద్య అనుకోకుండా ఊరికే బ్రహ్మశాస్త్రము అనిగానీ పెద్ద శాస్త్రము అనిగానీ అనే వాళ్లము. ఇది పెద్ద శాస్త్రము అయినా గానీ ఇది 'విద్య శాస్త్రము' ఇప్పుడు నీవు తెలుసుకోకుండా సంపూర్ణముగా అయిపోయిందనే దానికి అవకాశమే లేదు. అట్లు అయిపోయింది అని అంటే నీవు ఇక్కడ ఉండేదానికి అవకాశము లేదు. నీవు దేవునిలోనికి ఐక్యమై పోతావు. అందువలన ఇది ఎప్పటికైనా తెలుసుకుంటూ ఉండాల్సిందే.

ప్రపంచములో దేవుని గురించిన విద్య ఎవరికైనా తెలుసునా అంటే తెలియదు. అందుకే ఖురాన్ గ్రంథములో 3వ సూరా, 7వ ఆయత్‌లో ఏమి చెప్పుతాడంటే "దేవుని జ్ఞానము దేవుడే చెప్పాలి కానీ మనుషులు ఎవరూ చెప్పేదానికి అవకాశము లేదు. మనుషులకు ఎవరికీ తెలియదు. అది దేవుని జ్ఞానము, దేవునికే తెలుసు. మనుషులకు ఏమాత్రము తెలియదు" కాబట్టి వాడు నేర్చుకోవాల్సిందే. ఒకవేళ ఎక్కడనుండి నేర్చుకుంటాడు. ఎవరు చెప్పుతారు అని అంటే దేవుని జ్ఞానాన్ని దేవుడే చెప్పుతాడు. వేరే వాళ్లు చెప్పేదానికి అవకాశము లేదు. దేవుని జ్ఞానాన్ని దేవుడే చెప్పుతాడు కాబట్టి నీవు తెలుసుకుంటావు. ఎట్లా చెప్పుతాడు అనేది నీకు అనవసరము. ఆయన ఏదో ఒక రకంగా చెప్పుతాడు. బ్రహ్మవిద్యను సంపూర్ణముగా తెలిసినవాడు దేవుడే. ఆయన సంపూర్ణముగా నీకు చెప్పుతాడు. ఆయనకే అది తెలుసు. ఏ మానవునికీ తెలియదు. మనుషులంతా విద్యార్థులే. కాబట్టి ఇది బ్రహ్మవిద్యా శాస్త్రముగా ఉంది. సర్వము తెలిసినవాడు ఎవడు అంటే, ఒకే ఒకడు ఆయనే దేవుడు. ఆయన విషయము ఆయనకే సంపూర్ణముగా తెలుసు. ఆయన చెప్పితే మనకు తెలుస్తుంది. అందువలన ఆయన మనుషులకు మనిషిగానే వచ్చి చెప్పిపోయాడు. జంతువులా ఇంకొక రూపంలో చెప్పితే అర్థము కాదు. కాబట్టి మనుషులకు మనుషుల రూపంలో చెప్పాలన్న ఉద్దేశ్యముతో మనిషిగానే మన మధ్యలోనికి వచ్చి చెప్పాడు. **"ఆయన ఒక బొమ్మను తయారు చేసి, ఆ బొమ్మలోనికి ఆయన ఆత్మను ఊది, అంటే దానిలోనికి ప్రవేశించి ఆ బొమ్మను మనిషిగా చేసి పంపించాడు".** ఆ విధంగా వచ్చినటువంటి వాడే మనకు జ్ఞానము చెప్పును. ఆ రకంగా వచ్చినవాడే భగవద్గీతలో కృష్ణుడుగా చెప్పాడు. బైబిల్‌లో ఏసుప్రభువుగా చెప్పాడు.

ఈ రకంగా వచ్చినటువంటి వాడు తన జ్ఞానాన్ని తానే చెప్పినప్పుడు మనము విద్యార్థులుగా నేర్చుకోగలిగితే దానిని మనము సంపూర్ణముగా తెలుసుకోగలుగుతాము. ఎప్పుడైతే సంపూర్ణముగా తెలుసుకుంటామో అప్పుడు దేవునిలోనికి ఐక్యమయ్యేటటువంటి విధానము కూడా మనకు దొరుకుతుంది. లేకపోతే దొరకదు. ఇంతవరకు మనము విద్యార్థులమే. కాబట్టి సంపూర్ణముగా తెలుసుకొన్నటువంటి వాడు ఎవడూ లేడు. **"దేవుని జ్ఞానాన్ని సంపూర్ణముగా ఏ మానవుని మీద నేను ప్రసరింపజేయలేదు, ఏ మానవునికీ తెలియదు"** అని ఖురాన్ గ్రంథములో సూరా 6, ఆయత్ 91 లో చెప్పడము జరిగింది. "దేవుని జ్ఞానాన్ని ఎవరి మీదా, ఏ మానవుని మీదా ప్రసరింప చేయలేదు" అని చెప్పడము జరిగింది. ఈ రకంగా చెప్పినప్పుడు మనము ఏమి చేస్తామంటే మానవుల మీద ఆధారపడకుండా దేవుడు చెప్పిన జ్ఞానాన్ని మనము ఆధారము చేసుకొని ముందుకు పోవాలి. నీకు గ్రంథాలు ఉన్నాయి కదా అవి చదువుకో. అందులో విషయము తెలుసుకో, ఎవరన్నా వివరము చెప్పేవాళ్ల దగ్గరికి పోయి నేర్చుకో. నేను మూడు మతాలకు సంబంధించిన జ్ఞానాన్ని ఇక్కడ చెప్పుతున్నాము. నాకు తెలిసినంత వరకు నేను వివరము చెప్పుతున్నాను. ఈ జ్ఞానము పూర్తి సంపూర్ణముగా నాకు తెలియదు కాని దేవుడు అందించినటువంటి జ్ఞానము, అంటే దేవుడు ఏ రకంగా చెప్పితే అదే నేను చెప్పుతున్నాను. చెప్పేవాడు లోపల ఉండేటటువంటి ఆత్మ! నేను చెప్పలేదు.

ఈ విషయము మీకు చాలామార్లు చెప్పాను. అందువల్ల ఈ విద్య సంపూర్ణముగా ఎవరికీ తెలియదు అని గ్రహించగల్గితే మీకే కాదు నాకు కూడా తెలియదు అని లెక్క. "దేవుని జ్ఞానము, దేవుడు ఏ మానవుని మీద ప్రసరింపజేయలేదు. ఆయన జ్ఞానము ఆయనే చెప్పితే మనకు

అర్థము అవుతుంది. లేకుంటే అర్థము కాదు. ఏ మానవుడు చెప్పినా అది అసంపూర్ణముగానే ఉండును అని చెప్పాడు. సరే మనిషిగా వచ్చిన భగవంతుడు చెప్పితే అర్థము అవుతుంది? ఆయన జ్ఞానము ఆయనే చెప్పాలి. ఆయన చెప్పిన జ్ఞానమే సక్రమమయినది అని తెలుసుకొనుటకు ఒక శాస్త్రీయత అనే దాన్ని చూపించాడు. **ఎక్కడైతే శాస్త్రబద్ధమైనటువంటి జ్ఞానము ఉందో, అక్కడ నీకు దేవుని జ్ఞానము తెలియబడుతుందని** చెప్పాడు. కానీ ఈనాడు శాస్త్రీయత ఏమాత్రము లేకుండా శాసనాలతో కూడుకొన్నటువంటి జ్ఞానము ఏమాత్రము కాకుండా ఎవరి ఇష్టము వచ్చినట్లు వారు చెప్పు కుంటున్నారు. అదే దేవుని జ్ఞానము అని అనుకుంటున్నాము. తరువాత దైవజ్ఞానమంతా మతాలలో చిక్కుకొని పోయింది.

మతానికి, దేవుని జ్ఞానానికి ఏమాత్రము సంబంధము లేదని చాలామార్లు చెప్పాము. కానీ ఇప్పుడు ఈ మతము అనేది పెద్ద చిక్కు అయిపోయింది. ఇప్పుడు మేము జ్ఞానము చెప్పుతున్నాము. చాలామంది వస్తున్నారు. మేము గ్రంథాలు రచించి మీ మధ్యలోకి పంపించాము. మీరు చదివి వచ్చినారు. మాకు మీకు ఏమాత్రము సంబంధము లేదు. ఒకే ఒక గ్రంథాలు మీకు మాకు మధ్యలో ఉన్నాయి. మా గ్రంథాలు మీరు చదివి ఇంతమంది వచ్చారు. నాకు ఎక్కడా, ఎవరి దగ్గరా, ఎవరితోనూ పరిచయం లేదు. ఎవరికి ప్రత్యక్షముగా నేను జ్ఞానము చెప్పలేదు. మీరు నా గ్రంథాలు చదివి ఎంతో గొప్ప జ్ఞానము అని మీరు మా దగ్గరకు వచ్చారు. కానీ ఇది గొప్పజ్ఞానము కాదని అరిచేవాళ్ళు కొంతమంది ఉన్నారు. అంటే వాళ్లకు ఏమాత్రము శాస్త్రీయత తెలియదు. దేవుడంటే తెలియదు. భగవంతుడు తెలియదు. ఆ రెండు పదములకు అర్థము తెలియదు. కానీ వాళ్లు మేము హిందూ ధర్మాన్ని రక్షించేవాళ్లమని అంటారు.

అసలు ఇందూ ధర్మము అంటే ఏమిటో తెలియదు. ఇందూ ధర్మాలు ఎన్ని ఉన్నాయి అంటే అవి కూడా తెలియదు. మేము హిందూ ధర్మ రక్షకులము అంటారు. మనకు ముఖ్యమైనవి మూడు మతాలు ఉన్నాయి. హిందువులు, క్రైస్థవులు, ముస్లీమ్‌లు. క్రైస్థవులలో మతరక్షణ అనేటువంటి పేరుతో ఎవరూ లేరు. ముస్లీమ్ మతరక్షకులు అని ఎవరైనా ఎక్కడైనా ఉన్నారా అంటే ఎవరూ లేరు. ముస్లీమ్ వాళ్ళు దైవప్రార్థన చేసేవాళ్లు. దేవున్ని విశ్వాసాన్ని పొంది నటువంటి వాళ్లుగానీ, మా మతాన్ని మేము రక్షించుకుంటామని గుంపులు గుంపులు ఎవరూ అక్కడ లేరు. క్రైస్థవులు ఎవరైనా మా మతరక్షణ అని సంఘములుగా ఉన్నారా అని అంటే లేరు.

కేవలము హిందువులలోనే మత రక్షణలు పెట్టుకున్నారు. హిందూ రక్షణ దళ్ అని ఒకటి. ఒకటి కొత్తగా వచ్చింది. వాళ్లు ఏమి చేస్తారంటే మాలాంటి వాళ్లని తప్పుపట్టేది తప్ప రెండోపని ఉండదు. వీళ్ళది సరియైన జ్ఞానము కాదు. వీళ్ళు రామున్ని కాదన్నారు అని ఆరోపణలు చేసి డబ్బులు అడుగుతారు. ఉండేది ఒకటే దేవుడు అయితే ఇంకో దేవున్ని కాదనక ఏమంటాము? కాదనాల్సిందే కదా! ఆ దేవున్ని కాదన్నాడు, ఈ దేవున్ని కాదన్నాడు. మాకు మనోభావాలన్ని దెబ్బతిన్నాయి అని చెప్పుతారు. దొంగకు దొంగతనము చేయాలనే చింత ఉంటుంది. ఒరేయ్ చేయవద్దురా అని పోలీసు చెప్పుతాడు. పోలీస్ వాళ్లు దొంగతనం చేయవద్దన్నారు, మా మనోభావాలు దెబ్బతిన్నాయి, అంటే ఎందుకు దెబ్బతినవు. చేసే పని తప్పుడు పని అయినప్పుడు దెబ్బతినక ఏమౌతది చెప్పు. మంచి పని అయితే మాకు సరిపోతుంది. నీవు చేసేది మంచి పనా, చెడ్డ పనా చూసుకోమని చెప్పాము. నేను రావణబ్రహ్మ గురించి చెప్పాను గానీ, రాముడు దేవుడు కాదు అని నేను ఎక్కడా చెప్పలేదు. అది అవసరము

లేదు. చరిత్రలో రాముడు, వాలిని చంపినప్పుడు అన్యాయం అని అన్నాము కానీ రాముడు దేవుడు అనో, దేవుడు కాదు అనో మేము చెప్పలేదు. దాన్ని ఆధారము తీసుకొని రామున్ని దేవుడు కాదన్నారు. ఈయన హిందువులకు శత్రువు. అది ఇది అని ఏమేమో ప్రగల్భాలు పలుకుతూ డైలీ మెసేజీలు సోషల్ మీడియాలో పెడుతున్నారు. సోషల్ మీడియాలో మెసేజులు పెట్టి, నానా రకాలుగా మాట్లాడడము వారికి ఉద్యోగం అయిపోయింది. మనము చేస్తూ ఉండే పని ఏమిటి అనేది ఏమాత్రము ఆలోచన లేకుండా చేస్తున్నారు. అలా మాట్లాడితే ఏమవుతుంది? ప్రతి దానికి లెక్కాచారము ఉంటుంది. లెక్కాచారము వ్రాసిపెట్టేవాడు నీ లోపల ఒకడు ఉన్నాడు. వాడే చిత్రగుప్తుడు. చాలా గుప్తంగా ఉన్నాడు. చాలా విచిత్రముగా ఉన్నాడు. ప్రతి దానిని వాడు వ్రాసి పెట్టుకొంటాడు. మరల జన్మలో నీవు ఏమి అనుభవించాలో మీకు తీర్పు తీర్చి పంపిస్తాడు.

ప్రపంచ సంబంధముగా చేసే ఏ పాపమైనా క్షమించబడుతుందని దైవగ్రంథములో చెప్పారు. కానీ దైవ సంబంధముగా, ఆత్మ సంబంధముగా చేసే పాపము ఏమాత్రము క్షమించబడదు అని కూడా చెప్పారు. ఒక సినిమా చూస్తావు దానిలో మంచి సీన్లు ఉంటాయి, చెడ్డ సీన్లు ఉంటాయి. మంచిని స్వీకరించి చెడ్డదానిని వదలి పెట్టు. మంచిని స్వీకరించు. నీవు బాగుపడుతావు. నేను ఏమి చెప్పుతున్నాను. ముస్లీమ్‌లు ఒక రకంగా ఫరవాలేదు, ఒక దేవుడు అంటున్నారు. క్రైస్థవులు ఒక దేవుడు అంటున్నారు. మీకు నానా రకాల దేవుళ్లు కాకుండా, రక్షకులు అని పేరు పెట్టుకొన్నారు. హిందూ రక్షకులని ఒకడంటే, ఆ దళ్ ఈ దళ్ అని ఇంకొకడంటే, ఇంకొకరి మీద దాడి చేయడం, కొట్టడం ఇంతే తప్ప రెండోది ఏమీ లేదు. సరే అట్లన్నా ఒకవేళ ఏమన్నా హిందూ ధర్మాన్ని రక్షిస్తారా అంటే వారికి ధర్మములే

తెలియవు. మాలాంటి వాళ్ల మీద పడి ఇది జ్ఞానము కాదు అది కాదు అని పేచీలు పెట్టుకొంటారు. ఒకవేళ ఒక 20 లక్షలో, 30 లక్షలో ఇస్తే ఏమీ విమర్శించరు. ఇదీ వీళ్ల వ్యాపారం అన్నమాట. ఈ దళాల వ్యాపారం అంతా ఇదే. అంటే రక్షణ దళం, ఇదీ రక్షణ. వాళ్లు డబ్బులు సంపాదించు కొనే రక్షణ. ఈ రకంగా కూటికోసము, కూలికోసము పని చేసేవాళ్లు, వీళ్లు మమ్మల్ని విమర్శిస్తూ ఉంటారు.

మేము చెప్పేది శాస్త్రబద్ధమైన జ్ఞానం. శాస్త్రీయత లేని జ్ఞానం వాళ్ళది. ఒకే ఒక హిందూమతంలో సుమారుగా 17, 18 సంస్థలు హిందూ మతాన్ని రక్షించేదానికి ఉన్నాయి. వీళ్ళు రక్షించేదానికి హిందూమతము అంత తేలికయినదా? అది ఏమైనా చాలా బలహీనమయిందా? సనాతనంగా ఎప్పటినుంచోవుంది. ఇప్పటికీ ఉంది. ఎప్పటికీ ఉంటుంది. కానీ ప్రపంచములో ఎవరైతే జ్ఞానం కల్గి ఉన్నారో వారంతా ఇందువులే అని చెప్పినాము. ఇందూ అంటే జ్ఞానం అని అర్థం. ఇందూ అంటే జ్ఞాని అని అర్థము. ఒక మతము అని కాదు. ఇందువు అంటే జ్ఞాని అని మేము చెప్పుచున్నాము. ఈ భారతదేశములో మొట్టమొదట నుండి వుండే హిందువులలో జ్ఞానులు ఉన్నారు. జ్ఞానులు ఇందువులు అని పేరు పెట్టుకున్నారు. మనము క్రైస్తవులలోనికి పోయి లెక్కవేస్తే, వాళ్ళు ఎవరైతే జ్ఞానులు అవుతారో వారంతా ఇందువులే. అదే విధంగా ముస్లీంలలో ఎవరైతే జ్ఞానులు ఉంటారో వాళ్ళంతా ఇందువులే. ఇందువు అంటే ఏమి, జ్ఞాని అని అర్థము. ఎవరి మతంలో వారు జ్ఞానులుగా ఉన్నారు. వాళ్ళ మతంలో వారు జ్ఞానులుగా, నీ మతములో నీవు జ్ఞానిగా, ఇంకోమతంలో వారు జ్ఞానులుగా ఉన్నారు. అలా ఉన్న వాళ్ళంతా ఇందువులే అని చెప్పాము. కానీ ఇందూ మతాన్ని రక్షిస్తామంటే ఏమని అర్థము? జ్ఞానిని రక్షిస్తాము

అని అర్థము. ఇందూ ధర్మాలు అంటే ఏమో హిందూ ధర్మ రక్షకులకు తెలియవు. ధర్మ రక్షాదళ్, హిందూ రక్షణ సంస్థ, మొదలగునవి అని సుమారు 17, 18 సంస్థలు ఉన్నాయి. ఒక హిందూ మతములోనే ఇన్ని సంస్థలు. ఏమి అవసరం వచ్చింది చెప్పండి. నీవు జ్ఞానం చెప్పవయ్యా! హిందువులంతా బాగుపడుతారు. భగవద్గీత గురించి చెప్పు, బాగుపడుతారు.

భగవద్గీతలో ఎక్కడైనా దేవతలకు పూజ చేయమని ఉందా? ఎక్కడా లేదు. భగవద్గీతలో యజ్ఞములు చేయమని ఉందా ? లేదు. యజ్ఞములు చేస్తే దేవుడు తెలియబడడు అని చెప్పినాడు. మళ్ళీ మేము ఆమాట చెప్పితే నీకు ఎందుకు ఉలుకు? యజ్ఞములు, వేదాలు కాదంటారు. ఉపనిషత్తులు కాదంటారు. సనాతన ధర్మము అంతా పాడుచేస్తున్నారు అని నాలాంటి వారిని అంటున్నారు. సనాతన ధర్మము అంటే వానికే తెలియదు. సనాతన ధర్మము, సనాతన ధర్మము అని అంటారు. వారికి ఇందూ ధర్మాలు అంటే తెలియదు, కానీ ఇందూధర్మాన్ని రక్షించే సంస్థలు ఇవన్నీ, ఈ రకంగా పెట్టుకొని మేము అట్లా చేస్తాము. ఇట్లా చేస్తాము. ఆ స్వామితో కలిసాము. ఈ స్వామితో మాట్లాడినాము అని అంటారు. సనాతన స్వామీజీ దగ్గరకు పోయి కలిసాము. ఈ ప్రబోధానంద స్వామి గురించి చెప్పినాము. ఆయనపై తొందరగా ప్రత్యక్ష చర్య మా నుండి ఉంటుంది అని కూడా అన్నారు. ప్రత్యక్ష చర్య అంటే ఏమిటో? ఇన్నాళ్ళు ఇక్కడేవున్నాను కదా! నా దగ్గరికి వచ్చి మాట్లాడవచ్చు కదా. నన్ను మీరేమన్నా చేసేది చేయవచ్చు కదా. మీరు ప్రత్యక్ష చర్య అయితే నేను ఏమాత్రము జంకకుండా ఇక్కడే ఉన్నాను కదా. లేదా మీకు భయపడి జ్ఞానము చెప్పకుండా ఉన్నానా. అట్లంతా ఏమీ లేదు. చెప్పేవాడు చెప్పుతుంటాడు, వినేవాడు వింటుంటాడు. తీసుకొనేవాడు తీసుకుంటుంటాడు. నాకు సంబంధము లేకుండా నేను

చెప్పుతుంటాను. అక్కడికి పోవద్దండి, చాలా మోసము అక్కడ తీర్థము ఇస్తారు. తీర్థంలో మందు పోస్తారు అని కూడా చెప్పారు. అంటే నేను ఎవరికీ తీర్థమే ఇవ్వలేదే! ఇప్పుడు ఎవరికైనా తీర్థము ఇచ్చానా, మీకు నేను కనిపించలేదే! కానీ కొంతమంది కావాలని ఇలాంటివన్నీ ప్రచారం చేస్తుంటారు. అది దుష్టులు, నీచుల యొక్క పనే. మనము వాళ్ళను వదిలి పెట్టేస్తాము. వాళ్ళతో మనకేం సంబంధము లేదు. మనం తెలుసుకోవాలసిన జ్ఞానం మనం తెలుకుందాము.

మనం తెలుసుకొనే జ్ఞానం శాస్త్రబద్ధంగా ఉందా లేదా అనేది తెలుసుకుంటే అది సరిపోతుంది. కానీ మనము శాస్త్రబద్ధతలేని జ్ఞానము ఎప్పుడూ తెలుసుకోకూడదు. ఖురాన్ గ్రంథము కాని, బైబిల్ గ్రంథము కాని, భగవద్గీత గ్రంథము కాని నీవు తెలుసుకుంటే భగవద్గీతలో శ్లోకము ఉంటుంది. బైబిల్‌లో వాక్యము ఉంటుంది. ఖురాన్‌లో కూడా వాక్యము ఉంటుంది. ఖురాన్‌లో ఆయత్ అనేటటువంటి వాక్యము ఉంటుంది. భగవద్గీతలో కూడా వాక్యము ఉంది. తరువాత బైబిల్‌లో కూడా వాక్యము ఉంది. ఆ వాక్యాలు చూసి అందులో వుండేటటువంటి సక్రమమైనటువంటి అర్థాలు నీవు తెలుసుకో. స్వచ్ఛమైన అర్థాన్ని తీసుకో. దేవుడు ఏడవ ఆకాశంలో ఉన్నాడు, ఇక్కడ లేడు, క్రింద లేడు, అల్లాహ్ పైన ఉన్నాడు అని నీవు (ముస్లీమ్) అంటావనుకో. అంటే, మరి నీకు అత్యంత సమీపంలో ఉన్నాడని ఒకచోట అంటాడు. దానికి దీనికి ఎట్లా జవాబు చెప్పుతావు అని ప్రశ్న వస్తుంది.

ఖురాన్ గ్రంథములో 2వ సూరాలో 186వ ఆయత్ యందు "దేవుడు నీకు అత్యంత సమీపంలో ఉన్నాను" అని చెప్పినాడు కదా అని

ఇంకొకడు ప్రశ్న అడిగితే, దానికి మనము జవాబు చెప్పలేము. అందువల్ల ఎక్కడున్నాడు అనే విషయం నీవు స్పష్టంగా తెలుసుకోగలిగితే సులభంగా జవాబు చెప్పగలవు. అదే విధంగా నీవు బైబిల్‌లోగానీ, భగవద్గీతలో గానీ, ఖురాన్‌లో గానీ వాక్యము ఏదైనావుంటే, దానికి సక్రమమైనటువంటి అర్థము తెలుసుకుంటే, నీవు సక్రమమైనటువంటి అర్థాన్ని శాస్త్రబద్ధంగా చెప్ప గల్గుతావుగానీ లేకపోతే చెప్పలేవు. ఈ ధర్మాలు ఏమిటి అనే విషయాలు తెలుసుకుంటే, ధర్మాలన్నీ శాసనాలతో కూడుకొని ఉంటాయి. శాస్త్రబద్ధంగా ఉంటాయి. అవి ఎప్పటికీ మారేటివి కాదు అని చెప్పవచ్చు. హిందూ మతంలో ఒక స్వామీజీ "కాలాన్ని బట్టి ధర్మాలు అప్పుడప్పుడు మారుతుంటాయి" అని చెప్పాడు. కాలాన్ని బట్టి ధర్మాలు మారితే ఏముంది. మనము ఇష్టము వచ్చినట్లు మార్చుకోవచ్చు. భగవద్గీత ఎప్పుడుందయ్యా? 5000 సంవత్సరాల పూర్వము నుండి ఉంది. ఆ రోజుల్లో అంతా పంచలు కట్టుకున్నారు. ఇప్పుడు ట్రౌజర్లు కట్టుకుంటున్నారు. మాకేంటికి ఆ రోజు ధర్మాలు అనవచ్చు. ఆ రోజు ధర్మాలే ఈ రోజు తెలుసుకోవాలని నేను ఎందుకు చెప్తున్నాను? అంటే అవి ఎప్పటికీ ధర్మాలు మారేటివి కాదు. నీవు పంచలు కట్టుకున్నా ట్రౌజర్లు కట్టుకున్నా మొదటి ధర్మాలే ఉంటాయి. అవి ఎప్పటికీ మారవు. దేవుని ధర్మాలు ఎప్పటికీ మారేటివి కాదు. మూడు ఆత్మల స్వరూపంతో ఆయన వున్నాడు. జీవాత్మగా ఒక ఆత్మ, ఆత్మగా ఒక ఆత్మ, పరమాత్మగా ఒక ఆత్మ, ఈ మూడు ఆత్మలు ఉన్నాయి. ఈ మూడు ఆత్మలు మినహా ఏవీ లేవు ప్రపంచములో. మిగతాదంతా ప్రకృతే. కంటికి కనిపించేదంతా ప్రకృతే. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఈ ఐదు వస్తువులు ప్రకృతే. ఈ ఐదు వస్తువులు లేకుండా ఏదైనా ఉందా ప్రపంచములో. ఎక్కడా లేదు, నేనున్నాను కదా! ఈ ఐదు వస్తువులు

కాదు కదా! అని నీవు అనవచ్చు. దానికి నేను ఒరే నాయనా! నీలో మట్టి ఉంది అంటే నీలో భూమివుంది. నీ ముక్కుల్లో గాలివుంది. నీ ముక్కు రంధ్రాలలో శూన్యము ఉంది అంటే ఆకాశము ఉంది. అగ్ని అనే వేడివుంది. థర్మామీటర్ పెట్టుకొని చూసుకో. ఎప్పటికీ వేడి, అనగా అగ్ని వుంది. ఎప్పటికీ తేమ వుంది. తేమ లేకుండా ఉన్నాడా మనిషి. అంటే మూత్రము పోస్తున్నాము అంటే నీలో నీళ్ళు ఉన్నాయి. అగ్ని, గాలి, భూమి ఉంది. ఈ రకంగా ఐదు వస్తువులు కలుపుకొని, నీవు ఒక బొమ్మవయ్యావు. ఈ ప్రకృతి తయారు చేసిన బొమ్మవు నీవు. అందులో 'ఆత్మ' ఊదబడివుంది. అంటే జీవాత్మగా నీవు ఉన్నావు. ఆత్మ నిన్ను బొమ్మలా ఆడిస్తావుంది. దేవుడు చూస్తూ ఉన్నాడు. అర్థమయ్యిందా! కానీ ఆడించేవాడు ఆయన అని తెలియకుంటే, నేనే అనుకుంటావు. నేనే అనుకుంటే జరిగిన పనిలోని పాపముగానీ, పుణ్యము గానీ అది నీకే వస్తుంది. మనము తర్వాత దానిని అనుభవించాల్సి వస్తుంది. కాబట్టి పాపభీతి లేకుండా ఏ పని చెయ్యవద్దండి, పాపంపట్ల భయపడండి. అంటే పాపము నుండి ఎలా రక్షించుకోవాలో మీరు తెలుసుకోండి.

పాపం నుండి రక్షించుకునే దానికి దేవుడు ఏమి చేశాడు అంటే నీకు గ్రంథాలు ఇచ్చాడు. ఖురాన్‌లో ఏమి చెప్పారు. **"దేవుడు క్షమా శీలుడు"** అని అన్నారు. బైబిల్‌లో ఏమి చెప్పారు. **"దేవుడు పాపాన్ని క్షమిస్తాడు"** అని చెప్పినాడు. భగవద్గీతలో ఏమి చెప్పారు **"జ్ఞానం అనే అగ్ని చేత నీ కర్మ కాల్చివేయబడుతుంది"** అని చెప్పారు. నీవు చేసుకున్న కర్మలు పోతాయి అని చెప్పారు. నీవు కర్మ జీవివే. కర్మ చేసుకుంటేనే ఇక్కడ పుట్టావు. కానీ మన కర్మను పోగొట్టుకునే దానికి దేవుడు ఒక ఉపాయం చెప్పాడు. జ్ఞానము తెలుసుకుంటే పాపము పోతుంది. నువ్వు

చదువుకోవయ్యా బైబిలు ఉంది, ఖురాన్ ఉంది, భగవద్గీత ఉంది. దేవుని విషయాలే కదా! అక్కడ చెప్పినది. దాని ప్రకారమే ఫాలోకా! లేదు ఇదివద్దు, దాంట్లోకి పోతే బాగుటుంది అంటే, దీంట్లో ఏముంది దాంట్లో ఏముంది. రెండూ ఒక్కటే కదా! లేదు నేను అక్కడపోయి ఉంటాను అని నీవు అంటే ఇంట్లో ఉండేది భూమియే. బయటవుండేది భూమియే. ఎక్కడ కాలు పెట్టినా భూమి మీదనే కాలుపెడతావు.

బయటికి పోతే నాకు స్వస్థత ఉంది ఈ ఇంట్లో ఉంటే స్వస్థత ఉండదు. అంటే నీవు ఇక్కడ నిలబడి ఉండేది. బయట నిలబడేది కూడా ఒక్క దాని మీదనే. కాబట్టి నీవు నీ మతంలోవున్నా, దేవుని మతంలోనే ఉన్నావు. ఇంకొక మతములో ఉన్నా, దేవుని మతములోనే ఉన్నావు. దేవుడు నిన్ను అలా పుట్టించాడు. అయితే ఆ పుట్టించేదాంట్లో లేడా దేవుడు? అక్కడ లేదా జ్ఞానము? అంటే ఉంది. ఒక మతాన్ని ఒక మతము దూషించవలసిన పని లేదు. దూషిస్తున్నావంటే నీ మతము నీకు మొదట అర్థముకాలేదు అని. అందువల్ల భగవద్గీత, బైబిల్, ఖురాన్ మూడు చదవండి. అలా చదవలేదనుకోండి, నీవు ఏ మత ధర్మములో లేనట్లే. నీవు ఏ దైవ ధర్మములో లేనట్లే అని ఖురాన్ గ్రంథములో చెప్పారు. మూడు గ్రంథాలు చదివితే నీవు ఒక ధర్మములో ఉన్నట్లు. లేకపోతే నీవు ఏ ధర్మములో లేనట్లే, అని చెప్పినారు. అందువల్ల నేను చాలామందికి భగవద్గీత చదవండి, ఖురాన్ చదవండి, బైబిల్ చదవండి అని చెప్పాను. మీకు అన్నీ సులభం అవుతాయి. ఒకే కోణంలో అర్థమవుతాయి. మీరు వేరు, నేను వేరు, నాది వేరు, వాళ్ళది వేరు అనే ఉద్దేశ్యము పెట్టుకోవద్దండి. అన్నీ ఒకటే దేవుడు అని తెలుస్తుంది. ఒకే దేవుడు చెప్పినటువంటి విషయం అంతా చదివితే మీకు తెలుస్తుంది. నాకు ఒక్కడే అను ఉద్దేశ్యము ఉంది కాబట్టి నేను భగవద్గీతను

మొట్టమొదట వ్రాశాను. రెండవసారి చివరి దైవగ్రంథము అంతిమ దైవగ్రంథం వ్రాశాను. తరువాత ఇప్పుడు నేను మధ్య దైవగ్రంథమును కూడా వ్రాశాము. దాంట్లో చాలా అద్భుతాలు ఉన్నాయి.

చాలామందికి తెలియని రహస్యాలు అన్నీ ఇప్పుడు మనం చెప్పు కుంటున్నాము మరియు వ్రాస్తున్నాము. మీరు దానిని చదువుకొని తెలుసుకోవచ్చు. అంటే బైబిల్ చదవినాగానీ ఇంతవరకు మనకు ఎందుకు అర్థము కాలేదు? అని ప్రశ్న వేసుకొని మిమ్మల్ని మీరు అడుక్కోవచ్చు. మనకు సక్రమమైన చూపు లేకుండా ఉన్నప్పుడు, సక్రమమైనటువంటి ధ్యాస లేకుండా ఉన్నప్పుడు మనకు ఆ గ్రంథములో ఉన్నటువంటి దేవుడు మనకు అర్థంకానివ్వకుండా చేసినాడు అని తెలుస్తుంది. కాబట్టి నీవు ఎక్కడైనా ఏ మతములోనైనావుండు. నీవు ఏ కులములోనైనా ఉండు. ఏ మతములోనైనా ఉండు నీవు దేవుని మీద శ్రద్ధ కల్గివుంటే నీకు జ్ఞానం సక్రమంగా అర్థము అవుతుంది. దైవ జ్ఞానము అర్థముకావడమే మహాభాగ్యము. కొద్దిగ అర్థమయిందనుకోండి, తెలుసుకొనే దానికి అవకాశం ఏర్పడుతుంది. దేవుని మీద విశ్వాసము ఏర్పడుతుంది. దేవుడు అనే ధ్యాసే లేకుండా పోతే, నీవు దాని మీద శ్రద్ధ చూపకపోతే దేవుడు ఏమి చేస్తాడంటే నిన్ను తనదగ్గరకు చేర్చుకోకుండా తనదారిలో లేకుండా ప్రక్కకు పంపించేస్తాడు. నీవు గ్రంథము చదివినా నీకు ఇంకొక రకంగా అర్థమయ్యేటట్లు చేస్తాడు. ఆయన తన దగ్గరకు చేర్చుకోడు. వేరే రకంగా అర్థమయ్యేటట్లు చేసి దూరంగా పోయేటట్లు చేస్తాడు. దగ్గరకు వచ్చేటట్లు చేయడు. అందువల్ల నీకు గ్రంథములోని విషయాలు అర్థం కావాలన్నా, దేవుని దయ ఉండాలి. దేవుడు అనుకుంటేనే నీకు అర్థమవుతుంది.

దేవుడు అనుకుంటేనే నీకు అర్థము కాకుండా కూడా పోతుంది. అవి రెండూ దేవుడు అనుకుంటేనే! కాబట్టి దేవున్ని నీవు ఒకటే విషయాన్ని కోరుకో. నాకు గ్రంథములోని విషయం అర్థం అయ్యేటట్లు చెయ్యి అని ప్రార్థన చేసుకో, నీకు అర్థమవుతుంది. నేను మొట్టమొదట మీటింగ్ ప్రారంభం చేసినపుడు కూడా నేను అదే చెప్పాను. మీలో ఉన్నటువంటి ఆత్మపై మీరు శ్రద్ధగా ధ్యాస పెట్టుకొంటే మీకన్నీ అర్థమవుతాయి. లేదంటే ఏదీ అర్థము కాదు అని చెప్పాను. ఇప్పుడు మీకు బ్రహ్మవిద్య అనేటటువంటి ఒక సమాచారాన్ని చెప్పినాను. బ్రహ్మవిద్య సంపూర్ణ జ్ఞానముగా నేర్చుకొనేటటు వంటి విద్యావేత్త ఎవడూ ఉండడు. మిగతా ప్రపంచ విషయాలలో విద్యావేత్తలు ఉంటారు. విద్యావేత్త అంటే విద్యను పూర్తిగా తెలిసినటువంటి వాడు అని అర్థము. బ్రహ్మవిద్యలో మాత్రము ఎవడూ విద్యావేత్త లేడు. బ్రహ్మవిద్యావేత్త అనేదానికి అవకాశమే లేదు. ఎందుకంటే ఇది ఎప్పటికీ విద్యే. విద్య అని పేరు ఉంటే నేర్చుకుండే వాడు ఉన్నాడు అని అర్థము. కాబట్టి దీనిలో సంపూర్ణంగా నేర్చుకొనేవాడు ఎవడూ లేడు అని అర్థము. దీన్ని ఎప్పటికీ విద్యగానే చెప్పాలి. కాబట్టి మనం ఎల్లప్పుడూ విద్యార్థులుగా ఉంటాము. మనము సంపూర్ణముగా తెలుసుకోలేము. తెలుసుకోవాలనే ప్రయత్నం చేయండి అని చెప్పుతూ 'బ్రహ్మవిద్య' అనేదాన్ని మీరు ఒకమారు ఇంటికి పోయి నెమరువేసుకుంటారనే ఉద్దేశ్యంతో ఈ సమాచారాన్ని ఇంతటితో ముగిస్తున్నాము.

# 72. అధర్మ ఆరాధనలు

**(తేది :- 25.02.2013)**

మనము మొట్టమొదట భగవద్గీతలోని ఒక శ్లోకాన్ని తీసుకొని ఉపన్యాసం ప్రారంభిస్తాము. భగవద్గీతలో విజ్ఞాన యోగము అనే అధ్యాయము ఉంది. ఆ విజ్ఞానయోగములో ఒక శ్లోకము అంటే 15వ శ్లోకములో ఈ రకంగా చెప్పబడింది.

శ్లో॥ 15. నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమా ః ।
మాయయా పహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః ॥

"ఈ దుష్కృతితో అంటే పాపాలతో కూడుకున్నటువంటి మూఢాత్ములు, తర్వాత ఈ మానవులలో అధములైనట్టి మానవులు, మాయతో కూడుకున్నటువంటి అజ్ఞానం కలిగి అసుర భావాలు కలిగియుండి, నన్ను ఏ విధముగా ఆరాధించాలో తెలియనటువంటి పరిస్థితిలో ఉన్నారు" అని చెప్పాడు. దాన్ని తెలుగులో చెప్తే...

**పాపకర్ములు, మూఢులు, మానుషాధములు, అజ్ఞాన విభ్రాంతి మెలగువారు అసురభావంబు చెందిన అట్టి జనులు నన్ను ఉపాసించు జ్ఞానంబు గనరు.**

అంటే ఏమి చెప్పాడు ఈయన? ఈ పాపాలు చేసుకున్నటువంటి వాళ్ళు మూఢులు, మానుషాధములు మనుషులు అనకూడదు వీళ్లను. మనుషులలో అధములు అనాలి, వీళ్ళను. అజ్ఞానముతో కూడుకున్నట్టి వాళ్ళు అంటే జ్ఞానము అని అజ్ఞాన భ్రాంతిలో ఉన్నారు. తర్వాత అసుర భావము కలిగినటువంటి వాళ్ళు ఇటువంటి వాళ్ళంతా నన్ను ఆరాధించే విధానము తెలియకుండా ఉన్నారు అని చెప్పారు.

ఇప్పుడు దేవుడు చెప్పిన ఈ శ్లోకాన్ని తీసుకొని కొంత వివరించుకుందాము.

నేను ఒక ఆశ్రమానికి పోయినప్పుడు ఒక గురూజీని చూశాను. అక్కడ ఆశ్రమములో గురూజీ అని పేరుపొందినటువంటి వ్యక్తిని చూసి ఆయన ద్వారా జ్ఞానము తెలుసుకునే దానికి వీలౌతుందేమోనని చూశాము. ఉదయం ఆయన దగ్గరికి పోయినా అద్దమే చూసుకుంటున్నాడు. అరగంట తర్వాత పోయినా అద్దమే చూసుకుంటున్నాడు. తర్వాత ఎన్నిమార్లు పోయినా అద్దమే చూసుకుంటున్నాడు, అద్దం పక్కలోనే పెట్టుకున్నాడు. ఏమిటి ఈయన ఇలా చూసుకుంటున్నాడు? అద్దం చూసుకునేది ఎందుకు అని "స్వామీ! మీరు ఇట్లా అద్దం చూసుకుంటున్నారు. నేను ఐదు ఆరుసార్లు గమనించాను. మీరు ఎక్కువ అద్దమే చూసుకుంటున్నారు. మాకు ఏమన్నా జ్ఞానము చెప్పండి" అని అడిగాము. "నేను అద్దం చూసుకునేదే మీకు జ్ఞానము" అని అన్నాడు. ఆయన అద్దం చూసుకుంటే మనకు ఏమి జ్ఞానము వస్తుంది? నాకు ఏమీ అర్థము కాలేదు. కొంత వివరముగా చెప్పండి అన్నాము. అప్పుడు గురువుగారు **"తన్ను తాను చూసుకోవడమే జ్ఞానము"** అని అన్నాడు. ఎవరిని ఎవరు చూసుకోవాలి? తనను తాను. తనను తాను చూసుకోవడము అనే మాట బాగుంది అంటే, మళ్లీ ఎలా దీనిని అర్థము చేసుకోవాలి స్వామి అంటే ఏముంది? తనను తాను చూసుకోవడము అంటే నువ్వు అద్దంలో చూసుకుంటే కనిపిస్తావు. నిన్ను నువ్వు చూసుకోవడమే జ్ఞానము అన్నాడు ఆయన. అంటే మీరు ఈ పుస్తకాలు చదవవలసిన పని లేదు, భగవద్గీత అవసరము లేదు, ఇంకొకటి ఏది అవసరము లేదు మీరు ఏమి చేయాలి? ఓ పెద్ద అద్దము పెట్టుకొని ప్రతి దినము మీరు చూసుకుంటూ ఉండాలి. అది ఆయన చెప్పిన జ్ఞానము.

అయితే అప్పుడు ఈయన ఏదో పొరపాటు పడినాడు. అందువలన ఈ విధముగా చెప్పుచున్నాడు అని తెలిసింది. ఏమి పొరపాటు పడినాడు అని ఆలోచిస్తే.

'తనను తాను చూసుకోవడము' అంటే 'తను ఎవరు తెలియదు'. 'తనను చూసుకోవడము అంటే ఎలాగో తెలియదు.' భగవద్గీత చాలా సూక్ష్మమైన విషయాలతో కూడుకొని ఉంటుంది. అట్లే బైబిల్, ఖురాన్ ఉంటుంది. కానీ సూక్ష్మముగా చూడకుండా స్థూలముగా చూస్తే దేవుడు కనిపించడు, దేవుడు తెలియబడడు అని చెప్పాము. దేవుడు సూక్ష్మమైనటు వంటి వాడు, కనిపించేవాడు కాదు. ఆయన ధర్మాలు కూడా ఆ విధముగానే సూక్ష్మముగా ఉంటాయి. మీరు స్థూలముగా వాటిని తీసుకోకూడదు.

సరే! ఎవరో ఒక సూత్రము చెప్పారు. తన్ను తాను చూసుకోమని. తన్ను తాను చూసుకొంటే నీ నిజస్థితి తెలుస్తుంది అని చెప్పారు. **'తనను తాను చూసుకోవడము'** అని ఒక పదము ఉంది. పెద్దలు చెప్పిన పదము అది. తనను తాను చూసుకోవడము అంటే తను ఎవరు? తనను చూసే వాడు ఎవరు? తనను తాను అంటే తనను ఒకడు, తాను ఒకడు. ఎవడు తను? ఎవడు తాను? ఇప్పుడు దాని వివరము తెలుసుకుంటే అంటే సూక్ష్మంగా, స్థూలంగా ఆ గురువు ఏమి చేశాడు? ఆయనకు అర్థమైనది స్థూలమే. శరీరమే తాను అనుకున్నాడు. శరీరమే తాను అనుకొని నా బొమ్మను నేను చూసుకుంటే సరిపోతుంది కదా! అనుకున్నాడు ఆయన. తన ముక్కు, ముఖం, కాళ్లు, చేతులు అంతా తానే అనుకున్నాడు అవి తాను కాదు అని ఆయనకు తెలియక, ఆయన ఏమి చేశాడు అంటే శరీరాన్నే తాను అనుకున్న భ్రమలో ఉండేదానివల్ల తనను తాను చూసుకోవడం అంటే అద్దము పెట్టుకొని చూసుకోవడమే సరిపోయింది అనుకొన్నాడు.

ఇప్పుడు మనము మనల్ని లెక్కవేసుకున్నాగానీ శరీరములో జీవుడు నివసిస్తున్నాడు. శరీరములో నివసిస్తున్నాడు కాబట్టి నేను ధరించిన శరీరము అనవచ్చు జీవుడు. ఆయన నేను నివాసము చేసే శరీరము అనవచ్చు. ఇది నా శరీరము అనవచ్చు, నా శరీరాన్ని నేను వదిలి పోయినాను అని కూడా అనవచ్చు, పోయినప్పుడు. అంటే నువ్వు వేరు, నీ శరీరము వేరు. నువ్వు ఇంట్లో నివాసము చేసినప్పుడు ఇల్లు నువ్వు కాదు. ఇంట్లో నువ్వు ఒక భాగంగా ఉన్నావు. ఒక గృహములో నివాసము చేస్తూవుంటే ఆ ఇంట్లో నువ్వు ఒక భాగంగా ఉన్నావు కానీ ఇల్లు మొత్తము నీవు కాదు. ఆ విధానము తెలియక ఆయనకు సూక్ష్మగ్రాహిత శక్తి లేక, శరీరమే తాను అనుకొని అద్దంలో చూసుకోవడము జరుగుతూవుంది. తాను జీవాత్మను అనే విషయము మర్చిపోయాడు. శరీరములో ఎక్కడో ఒకచోట ఒక భాగంగా ఉన్నాను, శరీరము నేను కాదు అనే విధానాన్ని మర్చిపోయి, శరీరమే తాను అను ఉద్దేశ్యముతో ఆయన అద్దము చూసుకుంటున్నాడు. తనను తాను చూసుకోవడమే జ్ఞానము అన్నాడు. అయితే ఆయన చేయు విధానము మంచిది కాదు అని తెలిసింది. వివరణ చేసుకుంటే సరైన జ్ఞానము మీకు కూడా తెలుస్తుంది. 'తనను తాను చూసుకోవడము' అద్దము చూసుకోవడము ఎట్లు సరిపోతుంది? అసలు నువ్వు ఎవరో నీకు కనిపించవు కదా? నీకు కనిపించేది నీ శరీరము కదా!

నీ శరీరాన్ని నువ్వు చూసుకుంటే నిన్ను నువ్వు చూసుకున్నట్లు ఎట్లు అవుతుంది? ఒకవేళ చూసేవాడు ఎవడు? అని మనము ఇంకా లోపలికి పోయి వివరించుకొని చూస్తే, చూసేవాడు కన్ను అయినా చూపించేవాడు ఆత్మ కదా! మొత్తము ఆత్మే నీకు చూపిస్తావుంది. మొత్తముగా లెక్కవేసుకుంటే నీకు చూపించేది ఒకటి ఉంది. జీవునికి చూపించే శక్తి

ఆత్మ కదా! నీ శరీరములో ఆత్మ నీకు చూపిస్తువుంది, నీతో చేయిస్తువుంది, నీతో మాట్లాడిస్తువుంది. నీతో ప్రతీదీ చేయిస్తూవుంది. శరీరానికి అంతా అధిపతిగా ఆత్మ అనేటటువంటి వాడు నీ శరీరములో ఉన్నాడు. వానికంటే నువ్వు చిన్నోడివి. నీ శరీరములో నువ్వు ఉంటూ, ఆయన ఏమి చూపిస్తే అది నీవు చూడగలుగుతున్నావు. ఆయన ఏమి తెలియజేస్తే దానిని తెలుసుకోగలుగుతున్నావు. ఏమి రుచి చూపిస్తే ఆ రుచిని నీవు చూడగల్గు చున్నావు. కానీ స్వయముగా నువ్వు ఏ దానినీ చూడలేవు. తనను తానులో, తాను జీవాత్మ అయితే దానికంటే ప్రక్కన ఉండేటటువంటి తాను ఎవరు అంటే ఆత్మలు రెండు ఉన్నాయి. జీవాత్మ, ఆత్మ అని రెండు ఆత్మలలో ఒకటి జీవాత్మ అయితే, ఒకటి ఆత్మ అవుతుంది. ఈ ఆత్మను తాను చూడగలిగితే, ఆత్మ ఒకటి ఉంది అని దాని మీద ధ్యాస పెట్టుకోగలిగితే రెండు ఆత్మలు తెలిసినట్లగును. నాలో ఒక ఆత్మ ఉంది. అన్నీ అదే చేస్తావుంది. ప్రతీదీ అదే చేస్తావుంది, అదే చూస్తావుంది అని ధ్యాస పెట్టుకుంటే **తనను తాను** చూసినట్టు అవుతుంది. తనకు అన్నీ చూపించేవాడు ఆత్మ, తాను స్వయముగా ఏ దానినీ చూడలేడు. **ఎప్పుడైతే ఆత్మ మీద నువ్వు ధ్యాస పెట్టుకున్నావో తనను తాను చూసుకున్నట్టు అవుతుంది.** అంటే జీవాత్మ ఆత్మను చూసినట్టు అవుతుంది. అహర్నిశలు నువ్వు ధ్యాస పెట్టుకుంటే అన్ని అదే చేస్తావుంది కదా! ఒకటున్నది అనేటటువంటి జ్ఞాపకముతో ఉన్నదానివల్ల నువ్వు దానిని ఎల్లప్పుడు దర్శించినట్టే ఉంటుంది. దాని ఎరుక నుండి ప్రక్కకు నువ్వు పోవు.

ఆ విధముగా 'తనను తాను చూసుకోవడము' అని పెద్దలు చెప్పినారు అయితే అద్దము చూచుకోవడము కాదు అని మనకు అర్థమైపోయింది. ఈ పద్ధతి సరే ఇప్పుడు ఈ పదము ఏమైందంటే పెద్దలు

జ్ఞానదృష్టితో చెప్పితే వీళ్ళకు అది తెలియకపోయి వేరు విధముగా ఆచరిస్తున్నారు కదా! దేవుని విధానము ఎట్లాంటిది అని తెలియక వీళ్ళు ఇది ఒక ప్రత్యేకమైన ఆరాధన అనుకుంటున్నారు. తనను తాను అద్దం పెట్టి చూసుకోవడము వలన ఆత్మ తెలియకుండా పోయింది. ఆత్మను ఏ విధముగా ఆరాధించాలో, ఆత్మను ఏ విధముగా తెలుసుకోవాలో వీళ్ళకు అర్థము కాలేదు. ఎందుకు అర్థము కాలేదు? అంటే వాళ్ళు మూఢులు, మూర్ఖులు, పాపాత్ములు అజ్ఞానముతో కూడుకున్నట్టి వాళ్ళు, మేము జ్ఞానములో ఉన్నామని భ్రమలోవున్నారు. నన్ను ఆరాధించే విధానము అటువంటి వాళ్ళకు అర్థము కాదు అని దేవుడు తెలియజేయడం జరిగింది.

ఇప్పుడు దేశములో ఉన్న ఆరాధనలన్నీ దేవుడు చెప్పినట్లు ఉన్నాయా? దేవుడు చెప్పినట్టు కాకుండా వేరే ఆరాధనలను చేసేటటువంటి వాళ్ళను మనము ఏం అనాలి? ఈ శ్లోకములో దేవుడు ఏమి చెప్పాడు? అని చూస్తే "మూర్ఖులు, మూఢులు, నరాధములు, మనుషుల్లో చాలా అధములు వీళ్లు మనుషులు కాదు" అని చెప్పినాడు. అలాంటి వాళ్ళు వీరు ఎవరిని ఆరాధిస్తున్నారు? అని అంటే వారి ఆరాధన దేవున్నే అనీ ఇదే ఖచ్చితమైన ఆరాధన అని అంటున్నారు. అయితే అది నేను ఎక్కడా అలా చెప్పలేదు. నేను చెప్పిన విధానము తెలియక వీళ్ళు అలా చేస్తున్నారు. నేను చెప్పిన విధానము ఉంది, నేను చెప్పిన విధానము తెలియక వారు ఇష్టమొచ్చినట్టు ఆరాధించుకుంటున్నారు. వారి ఇష్టము వచ్చినట్టు అంటే వారి సొంతము కాదు, వారికి ఎవడో ఒకడు బోధకుడు ఉంటాడు. వాడు నాకు తెలిసింది ఇట్లే, దేవుడు ఈ విధముగానే తెలియబడతాడు, మీరు ఆరాధించండి అంటే, వాడు వంగమంటే వంగుతాడు, లేవమంటే లేస్తాడు. లేదు పడుకోమంటే చాప పరచుకొని పడుకుంటారు. అంతేగదా! టీవీలో

చూస్తున్నాము. అందరూ ఒక రగ్గు తెచ్చుకొని పరచుకొని వాడు కాళ్ళు ఆడిస్తే వీళ్ళు కాళ్ళు ఆడిస్తారు. వాడు చెయ్యి అల్లాడిస్తే వీళ్లు చెయ్యి అల్లాడిస్తారు. అది ఒక ఆరాధనే? యోగాక్లాస్ అంటారు దానిని. తర్వాత దేవుని ఆరాధనలో అది ఎక్కడ ఉందో మనకు తెలియదు. కానీ ఇటువంటి పనులన్నీ చేస్తున్నారు. అయితే బయట జరిగే విధానాలన్నీ మీరు కొలబద్ద చేసుకొని చూడండి. ఎటువంటి ఆరాధనలు ఉన్నాయో తెలుస్తుంది. ఇప్పుడు రకరకాల ఆరాధనలన్నీ దేవుని గురించి అని అంటున్నారు. ఆ ఆరాధానలన్నీ చేస్తే చాలు, మోక్షములో ఉన్నట్టే అంటున్నారు.

నన్ను తెలుసుకునే దానికి మీకు అర్థముకాదు, 'నేను సామాన్యంగా అర్థము కాను' అని ఈయన భగవద్గీతలో చెప్పితే, నా ఆరాధనలు ఎటువంటివో మీకు అర్థము కాలేదు అని చెప్పితే, ఇలాంటి వాళ్ళంతా మాకు తెలుసు అని, ఈ విధముగా మీరు చేస్తే, మీరు మోక్షములో ఉన్నట్లే ఇంక వేరే పనెందుకు మీకు అంటున్నారు. వేరే ఏ ప్రయత్నం చేయకుండా ఇంకా ఏమీ చేయవద్దండి, మీరు ఆల్‌రెడీ మోక్షములో ఉన్నారు. నా వద్దకు వస్తే చాలు మీరు మోక్షానికి పోయినట్టే, టికెట్ వచ్చినట్టే మీరు మోక్షములో ఉన్నారు అంటారు. వారు చెప్పినట్లు ఇప్పుడు ఉండేదే మోక్షం అనుకున్నాడు మనిషి. ఆ రకంగా దేవుడు చెప్పిన విధానము తెలియనటు వంటి ఆరాధనలు ఆరాధిస్తున్నారు. అటువంటి ఆరాధనలన్నీ మీ చుట్టూ ఉన్నాయి. మీరు చేసేటివి అన్ని అవే. మీరేమో మూర్ఖులు, మూఢులు అని మమ్ములను తిడుతున్నారు అని అనుకోవద్దండి మీరు. అంటే ఎవడో మూర్ఖుడు నేర్పిస్తే మీరు అవి నేర్చుకుంటున్నారు. ఒకడు పెద్ద మూర్ఖుడు ఉంటాడు, వాడు నేర్పిస్తే మీరు నేర్చుకుంటున్నారు. గొడుగు క్రింద కూర్చొని

ధ్యానం చేస్తే శక్తి వస్తుంది అంటే, గొడుగు క్రింద కూర్చొని చేస్తారు. నీళ్లలో కూర్చొని ధ్యానం చేస్తే మంచిది అంటే నీళ్ళలో కూర్చొని చేస్తారు. ఇవన్నీ భగవద్గీతలో ఎక్కడైనా ఉన్నాయా? దేవుడు ఎక్కడైనా చెప్పాడా? **"అధర్మాలు చెలరేగినప్పుడు ధర్మాలు ఉద్ధరించేదానికి నేను వస్తాను, వచ్చి నేను జ్ఞానము తెలియజేస్తాను మీకు, నన్ను ఆరాధించేటటువంటి విధానాన్ని తెలియజేస్తాను"** అని చెప్పినాడు. ఎక్కడైనా గానీ గొడుగు క్రింద కూర్చుంటేనో, నీళ్లలో కూర్చుంటేనో లేకపోతే ఒక చెయ్యి పైకి ఎత్తుకొని కూర్చుంటేనో, కాలు క్రిందికి ఎత్తుకొని కూర్చుంటేనో, జ్ఞానము తెలుస్తుందని, దేవుడు తెలుస్తాడు అని చెప్పినాడా? లేదు. అయినా ఇవన్నీ దేశములో ఉన్నాయి. మొత్తము ఒక రకం కాదు, నేను చెప్పింది రెండు మూడు రకాలే. బయటికి పోయి చూస్తే ఎన్ని రకాలు అంటే అన్ని రకాల ఆరాధలు ఉన్నాయి. అక్కడ ఎవరో సాధువులు ఉన్నారంటే వాళ్ళను ముట్టుకొని వస్తే వీళ్ళకు కరెంటు వస్తాదంట. వీళ్ళు అదే పనిగా అక్కడికి పోయి వారిని తాకి వస్తారు. గుడ్డలు లేకుండా బూడిద పూసుకొని తిరిగే వాళ్ళు వారు. వాళ్ళు ఏమి తింటున్నారో, ఏమి తాగుతున్నారో ఎట్లున్నారో, స్నానం చేస్తున్నారో లేదో, వాళ్ళ తిప్పలు వాళ్ళకే తెలుసు. కానీ వాళ్ళను ముట్టుకొని వస్తే వీళ్ళకు ఊరికే జ్ఞానము వస్తాదట. అంటే ఎట్లా వస్తాది, కరంట్ వచ్చినట్టు వస్తాది అది. దానికోసము పోయిన వాళ్ళు ఉన్నారు. దేవుడేమన్నా ఇట్లాంటివన్నీ చెప్పినాడా ఎక్కడైనా గానీ? ఎక్కడా అటువంటి ప్రసక్తే తీసుకరాలేదు. దేవుడు స్వచ్ఛంగా బాగా మనకు అర్థమయ్యేలాగున జ్ఞానము అంతా చెప్పి, ఆరాధించే విధానము ఇట్లుంది అని చెప్పినప్పుడు దీనిని వదిలిపెట్టి ప్రక్కకు పోవలసిన పని ఏమి వచ్చింది మనిషికి? ఇప్పుడు ప్రక్కకు పోయేవాళ్ళను ఏమి అనుకోవాలి?

దేవునికి వ్యతిరేఖమైన మార్గములో నడుచుకున్నటువంటి వాళ్ళు కాదా! చెప్పండి. దేవుడు చెప్పిన విధానాన్ని అతిక్రమించి పోయినటువంటి వాళ్ళు కాదా? కొందరు సనాతన ధర్మము అంటూ ఒకటి చెప్తారు. కానీ సనాతన ధర్మము అంటే అర్థము ఏమిటో వారికే తెలియదు, కానీ దాన్ని ఆచరిస్తారు మీరు. అది జ్ఞానములో ఉండదు. దేవుడు చెప్పిన విధానము కనుక్కోకుండా దేవుడు చెప్పిన మాటకు వ్యతిరేఖంగా వేరే మార్గములో పోవద్దు. ధర్మము ఈ రకంగా ప్రతి మనిషి తాను చేసే పని ఏమిటిదో, తనకు తెలియకుండా ఏదో ఒకటి చేస్తూ, అదే నిజమైనది అనుకొని నిజమైన జ్ఞానము చెప్పినటువంటి వాళ్ళను వ్యతిరేఖించి మాట్లాడుతున్నారు. అట్లు మాట్లాడడము భగవద్గీతను వ్యతిరేఖించి మాట్లాడినట్లే.

ఈ మధ్యన ఒక శివస్వాములు అని శ్రీశైలానికి పోయేవాళ్లు ఉంటారు. వాళ్ళు 40 రోజులు దీక్ష తీసుకుంటారు. మూడు సంవత్సరాల దీక్ష తీసుకొని, మూడు సంవత్సరాలు శ్రీశైలానికి పోయి వచ్చిన వాళ్ళలో ఒక వ్యక్తి, మన గ్రంథాలు చదవడం జరిగింది. చదివి ఆయన తర్వాత తనకున్న 13 ప్రశ్నలకు ఇంతవరకు నాకు జవాబులు తెలియదు. ఈ ప్రశ్నలకు జవాబులు నాకు ఎక్కడా లభించలేదు. నేను మూడు సంవత్సరాలుగా శ్రీశైలమునకు పోయినాను. ఈ **త్రైత సిద్ధాంతము గ్రంథములు** చదివిన తర్వాత నాకు నాలో ఉన్న ప్రశ్నలన్నిటికీ జవాబులు దొరికినాయి. కాబట్టి నాలాంటి వారు ఎందరో ఉన్నారు. ఈ ప్రశ్నలకు అంతా మీరు జవాబు తెలుసుకోవాలి అంటే ఈ గ్రంథాలు చదవండి అని చెప్పినాడు. నేను ఈ రకంగా తెలుసుకోగలిగినాను. మీరు కూడా అంటే ఈ శ్రీశైలానికి పోయేవాళ్ళు, శివమాల ధరించిన వాళ్ళకు ఎవరికైనా ఈ ప్రశ్నలు వస్తే, సమాధానాలు అన్నీ ఈ గ్రంథములో దొరుకుతాయి

చదువుకోండి అని ఆయన ప్రశ్నలు వ్రాసి ఇవి నా ప్రశ్నలు, ఈ ప్రశ్నలకంతా జవాబు దొరికింది అని వ్రాశాడు. మూడు సంవత్సరాలు తాను పోయినట్టు వ్రాసుకున్నాడు. ఒక కాపీ నాకు కూడా చివరకు వచ్చింది. దానిలో చూస్తే మంచి ప్రశ్నలే, బాగానే ఉన్నాయి.

కొంతమంది ఏమి చేశారంటే ఎవరో శివస్వాములు మార్పు చెంది మంచి జ్ఞానము తెలుసుకొని ఈ విధముగా వ్రాసినారు కదా! మన గ్రంథాల గురించి త్రైత సిద్ధాంత గ్రంథాలు గొప్పగా ఉన్నాయని వ్రాసి ఈ విషయం బయటికి కొంతమందికి శివస్వాములకు తెలియజేస్తే బాగుంటుంది అన్న ఉద్దేశ్యముతో దాన్ని జిరాక్స్ చేసి కొంతమంది శివస్వాములకు ఇచ్చారు. మహబూబ్‌నగర్ జిల్లాలో వ్రాసి ఇవ్వడము జరిగింది. ఆయన వ్రాసిన లెటర్లో 13 ప్రశ్నలు ఉన్నాయి ఆ జాబు ఇలావుంది. ముందు నేను మూడుసార్లు మాల వేసుకున్నాను అయినా నాకు ఇన్ని ప్రశ్నలు మిగిలినాయి. ఎవరిని అడిగినా జవాబులు రాలేదు. ఇప్పుడు అన్ని ప్రశ్నలకు జవాబులు దొరికి ఏ ప్రశ్న లేని జ్ఞానము తెలియబడింది, అదే జ్ఞానమే **"త్రైత సిద్ధాంత జ్ఞానము". త్రైత సిద్ధాంత జ్ఞానాన్ని తెలుసుకుందాము, జనన మరణముల నుండి బయటబడి మోక్షానికి అర్హులు అవుదాము"** అన్నాడు. మంచి పనే కదా! సరే దీనిలో ఎవరికి ఏమీ వ్యతిరేఖత లేదు. తనకు తెలిసింది తాను వ్రాశాడు 'ఇట్లు దేవుని బిడ్డ' అని వ్రాశాడు చివరిలో. అంతేగదా, అంతా దేవుని బిడ్డలమే కాబట్టి తనకు తెలిసిన జ్ఞానము ప్రకారము 'ఇట్లు దేవుని బిడ్డ' అన్నాడు. దేవుని బిడ్డ అంటే ఇది క్రైస్థవులదే, 'దేవుడు' అనే పదము వాళ్ళే ఉపయోగించేది, దేవుని బిడ్డ అంటే క్రైస్థవులే అని ఇదెవరో క్రైస్థవుడు వ్రాసింది అని కొందరు అనుకున్నారు. అందులో ఏమి ప్రశ్నలు ఉన్నాయంటే క్రింద చూడండి.

1) "ముక్కు ముఖం లేని ఈశ్వర లింగము ఏ అర్థముతో పూర్వము జ్ఞానులు పెట్టారు". మంచి ప్రశ్నే కదా! ఇది.

2) "ఈశ్వర లింగంపై మూడు విభూది రేఖలు దిద్ది మధ్య దానికి ఏ అర్థముతో బొట్టు పెట్టారు? ఆ రేఖకు అర్థము ఏమి?"

3) "లింగము క్రింద పాణిమట్టము దేని నిమిత్తము పెట్టారు?"

4) "లింగంపైన నీటి పాత్రను ఉంచి ఒక్కొక్క చుక్క లింగముపైన పడునట్లు చేసి పాణిమట్టము ద్వారా కిందికి పడేలా జ్ఞానులు ఎందుకు పెట్టారు? దాని భావము ఏమి?"

5) "ఓం నమ:శివాయ పంచాక్షరి అంటారు. పంచాక్షరి ఎట్లు అయ్యింది? పంచం అంటే ఐదు, వీటిలో ఆరు అక్షరములు ఉన్నాయి. పంచాక్షరి ఎట్లయింది? పూర్వము జ్ఞానుల భావము ఎట్లా ఉండేది?"

6) "లింగం ముందు దీపాన్ని వెలిగిస్తున్నాము కదా! ఏ భావముతో వెలిగిస్తున్నాము? అర్థము ఏమి? జ్ఞానులు ఎవరి ముందు వెలిగించేవారు?"

7) "లింగానికి అభిషేకము చేస్తున్నాము కదా! ఎన్ని పదార్థాలతో చేస్తున్నాము? అసలు అభిషేకము అంటే ఏమిటి? ఎందుకు చేయాలి? పూర్వము ఉన్న జ్ఞానులు ఎవరిని అభిషేకించేవారు?"

8) "ఈశ్వర లింగము ముందు కొబ్బరికాయ కొడతాం కదా! ఏ అర్థముతో కొడుతున్నాము? పూర్వము జ్ఞానులు ఏ భావముతో టెంకాయ కొట్టేవారు? ఎవరి ముందు కొట్టేవారు?"

9) "పూజలో తాంబూలము పెడుతున్నాము. అసలు ఆకులు వక్కలు ఎందుకు పెడుతున్నారు? సున్నము పెట్టడము లేదు. సున్నము లేనిది తాంబూలం అవుతుందా?"

10) "తాంబూలం ఎందుకు పూజలో భాగంగా పెట్టారు?"

11) "మనము ఈశ్వర లింగం ముందు కూర్చొని, చిత్తము శివుని మీద, భక్తి ఎక్కడో అన్నట్టు శంకరుని తలచడం ఏమిటి? నాకు ప్రశ్నగా ఉంది. మొక్కేది శంకరున్ని కదా! లింగము ముందు కూర్చోవడము దేనికి?"

12) "నేరుగా శంకరుని ముందే పూజించవచ్చును కదా! అని మరో ప్రశ్న."

13) "శంకరున్ని దేవుడు అంటున్నాము. మరి ఆయనకు చర్మాసనము, యోగదండముతో పని ఏముంది? ఆయన ఎవరిని చేరాలని యోగాన్ని ఆచరిస్తున్నాడు? మనము ఆయనను ఎందుకు మ్రొక్కుచున్నాము?"

ఇన్ని ప్రశ్నలు వేశాడు అన్నమాట. ఇందులో ఇతర మతాలకు సంబంధించినది ఏదీ లేదు కదా! మనము చేసే పనులకు అర్థము ఏమిటి? ఈ జ్ఞానము తెలుసుకోవడము వల్ల ప్రశ్నలకు జవాబు దొరికింది అని చెప్పుకున్నాడు. ఆయన ఎవరో, అందులో మంచి ప్రశ్నలే. జవాబు తెలుసుకున్నాను అనడము కూడా మంచిదే. కానీ ఈ ప్రశ్నలకు ఇది జ్ఞానమా, అజ్ఞానమా అని తెలియక తాము చేసేదే జ్ఞానము అనుకొని శంకరున్ని మీరు పూజిస్తున్నప్పుడు, లింగాన్ని ఎందుకు, పూజించాలి? డైరెక్టుగా శంకరున్నే పూజించవచ్చు కదా! అని ప్రశ్న ఉంటే మీరు ఇట్లు అడిగితే హిందూమతాన్ని కించపరచినట్టు, మీరు హిందువులు కాదు

క్రైస్థవులు అని కొందరు హిందువులే అంటున్నారు. క్రైస్థవులు అవన్నీ ఎందుకు వ్రాస్తారు? మన జ్ఞానాన్ని మనము అర్థము చేసుకోలేని స్థితిలో ఉన్నాము. అది అడిగినది సాధారణ మనిషికాదు, ఒక దీక్ష తీసుకొని శివమాల వేసుకొని శివుని దగ్గరికి పోతున్నామనేటటువంటి వాళ్లు అడిగిన మాట. అంటే తను శివుని దగ్గరికి పోతున్నా కానీ లింగాన్ని ఎందుకు పూజిస్తున్నాము, శంకరున్ని పూజించకుండా అని ప్రశ్న వేస్తే అది హిందువుల ప్రశ్నగా తీసుకొని దానికి ఆలోచన చేసుకుని జవాబు తెలుసుకోవాలి, అప్పుడు జ్ఞానము తెలుస్తుంది కదా! దానివల్ల పూర్వము నుండి లింగాన్ని పూజించేది అంటే సనాతన ధర్మమే. ఎందుకు సనాతన ధర్మము? అది సనాతన ధర్మము ఎట్లయింది? ఈ విధముగా ప్రశ్నించుకొని తెలుసుకుంటే బాగుంటుంది కదా! అట్లు అనుకోకుండా ఇది మన జ్ఞానమే కాదు, మనం దేవుని బిడ్డలము కాదు, దేవుని బిడ్డలంటే క్రైస్థవులే అని అంటున్నారు. మనము దేవుని బిడ్డలము కాదా? అందరూ దేవుని బిడ్డలే. ప్రపంచములో క్రైస్థవులు ఒక్కరేనా దేవుని బిడ్డలు అని ఈ విధముగా జ్ఞానాన్ని అర్థము చేసుకోకుండా రకరకాలుగా మాట్లాడే వాళ్ళువున్నారు. అందువలన జ్ఞానము ఏదో వీళ్ళకు తెలియడం లేదు. 'నన్ను ఆరాధించే విధానము తెలియలేదు వీళ్ళు మూర్ఖులు' అని దేవుని చేత భగవద్గీతయందు ఒక శ్లోకములో చెప్పబడింది.

ఈ రకంగా ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా ఆరాధనలను గురించి మాట్లాడుతూపోతున్నారు. ఇటువంటి వారు చేసేవి అక్రమ ఆరాధనలు. వీటిని సక్రమ ఆరాధనలు అని మనము అనము. క్రమము లేనట్టి, సరైన ఆరాధనలు కాదు. అధర్మయుక్తమైనట్టి ఆరాధనలు ఆచరిస్తున్నారు. మనకు తెలిసినటువంటి సభ్యులు ఇంతకు ముందు గత కాలములో పిరమిడ్ ధ్యానం

అనేదానికి పోతూ, పిరమిడ్ క్రింద కూర్చోని ధ్యానం చేస్తే గొప్పది అన్న ఉద్దేశ్యముతో, తన ఇంట్లోనే ఒక పిరమిడ్ కట్టించుకున్నాడు పాపము ఆయన. ఇంట్లో కట్టించుకొని, దాని క్రింద కూర్చొని ధ్యానం చేస్తే మంచిది అని చేస్తున్నాడు. దాని క్రింద కూర్చొని ధ్యానం చేసేటప్పుడు శక్తి వస్తుంది అని ఒక నమ్మకము అంతే. అది వస్తుందో లేదోగానీ ఇప్పుడు కొంత జ్ఞానము తెలుసుకున్న తర్వాత నేను ఎంత పొరపాటుపడినాను అని ఆయన అనుకున్నాడు. అది క్రొత్తగా కట్టించాము దాన్ని పగలగొట్టేస్తాము అంటే, ఎందుకు పగల గొట్టాలి దానిని, ఉండనీలే, అది కూర్చుండేదానికి గొడుగు మాదిరి ఉంది కదా! అట్లనుకొని కూర్చో. కట్టించినాక దానిని ఎందుకు వేస్ట్ చేయాలి. నువ్వు దాని క్రింద కూర్చుంటే నీకు శక్తి వస్తుందనుకోవడము పొరపాటు, అట్లనుకోవద్దు అది కూర్చుండే దానికో, పడుకుండేదానికో దేనికో పనికి వస్తుంది కదా! అట్లనుకో, అంతేగానీ దాని క్రింద కూర్చొని ధ్యానం చేస్తేనే జ్ఞానము వస్తుంది అనుకోవడము పొరపాటు. అట్లను కోకుండా ఉండేది ఉండనీలే అని మేము సలహా చెప్పాము.

కానీ ఇప్పుడు ఇటువంటి ఆరాధనలు చేస్తే దేవుడు చెప్పినటువంటి మాటకు వ్యతిరేఖము కాదా? ఇటువంటి ఆరాధనలు చాలా ఉన్నాయి కదా, దేశములో! నేను ఉదాహరణకు చిన్నది ఒకటి చెప్పాను. ఇప్పుడు ఇటువంటి ఆరాధనలు చాలా ఉన్నాయి. దేవుని జ్ఞానము మనకు ఏమాత్రము అర్థము కాలేదు. అర్థము కాకుండా దానికి విభిన్నముగా మనము అర్థము చేసుకొని దేవుడు చెప్పిన మార్గములో కాకుండా ఇతరత్రా మార్గములో మనము ప్రయాణిస్తున్నాము. కాబట్టి దేవున్ని తెలుసుకునే దానికి అవకాశమే లేదు. దేవుడు తెలియబడడు, దేవుని జ్ఞానము మనకు తెలియబడదు. మనము దేవుని జ్ఞానము తెలుసుకునే దానికి అర్హులమే కాకుండా పోతాము. దేవుని

జ్ఞానము చాలా గొప్పది. దేవుని జ్ఞానము తెలియబడితే నీ మనస్సులో ఉండే బాధలన్నీ పోతాయి. నీ మనస్సులో ఉండే కర్మలన్నీ పోతాయి. మానసిక కర్మలు పోతాయి, శారీరక కర్మలు పోతాయి. జ్ఞానము అటువంటిది, అది అగ్ని ఏ కర్మనైనా కాల్చివేస్తుంది. అగ్ని దగ్గరికి పోతే అది కాల్చివేస్తుంది. నువ్వు అగ్ని దగ్గరికి పోకుండా, ఉత్త కట్టెలు పెట్టుకొని ఇదే గొప్పదనుకుంటే ఎట్లా అవుతుంది? నువ్వు కర్మలనే కట్టెల కుప్ప వేసుకున్నావు. జ్ఞానము అను అగ్ని లేదు నీకు. ఈ రకంగా దేవుని జ్ఞానాన్ని ఏమాత్రము రుచి చూడకుండా, ఏమాత్రము తెలియకుండా వాళ్ళ ఇష్టము వచ్చినట్టు ఆరాధనలు చేసేవాళ్ళు చాలామంది ఉన్నారు. ఉండడమే కాకుండా వాళ్ళకు తెలియని విధానము మనము చెప్తే దాన్ని గురించి వారు ఇది అసత్యం, ఇది మాకు తెలియదా అంటున్నారు?

శివస్వామి ఒక ఆయన ప్రశ్నలను చూచి మన వాళ్ళకి ఫోన్ చేసి, "మీరు ఇన్ని ప్రశ్నలు వేసినారు. ఈ ప్రశ్నలన్నిటికీ మాకు జవాబు తెలియదనుకుంటున్నారా? ఎందుకు వ్రాసినారు మీరు?" అని అడిగాడు. దానికి జవాబుగా! "తెలియని వాళ్ళ కోసం శివస్వామి ఎవరో వ్రాశాడు. మేము వ్రాసినది కాదు. అది ఎవరో శివస్వామి మూడు సంవత్సరాలు శ్రీశైలము పోయి చివరకు అలా వ్రాసినాడు. మాకు కూడా ఒక కాపీ వచ్చింది. మేము వ్రాసినది కాదు" అని చెప్పారు. ప్రశ్న పేపర్ పంచేవారు మన సభ్యుని నెంబరు వ్రాసి పంచినారు. వీళ్ళను అడిగితే గ్రంథాలు దొరుకుతాయి చూడు అన్నట్లుగా వ్రాశారు. అయితే వాడేమో కావాలని మాకు వ్రాసి పంపించినారు అనుకొని ఈ ప్రశ్నలకు జవాబు తెలియవు అనుకున్నారా, మాకు అన్నిటికీ తెలుసు. మీరు ఎందుకు వ్రాసినారు, మాకు తెలియదు అని వ్రాసినారా? అని అన్నాడు. మళ్ళీ శంకరున్ని

మ్రొక్కేవాళ్ళు లింగాన్ని ఎందుకు మ్రొక్కాలి మీరు? ముక్కు ముఖం లేని దాన్ని ఎందుకు మ్రొక్కుతున్నారు. ప్రశ్నే కదా అది! దానికి విభూది రేఖలు మూడు ఎందుకు ఉన్నాయి?

ఈ రకంగా అనేక ప్రశ్నలు మిగులుతున్నాయి. అంటే, ప్రశ్నలు లేకుండా పోయే జ్ఞానము కావాలి. ఎవరు అడిగినా సమాధానము చెప్పే జ్ఞానము కావాలి అనే ఉద్దేశ్యముతో అలా వ్రాయడం జరిగింది. వాటికి జవాబులు దొరుకుతాయని చెప్పి వ్రాయడం జరిగింది. తప్పు ఏముంది దాంట్లో! నువ్వు ఇష్టమైతే తెలుసుకో, లేకపోతే లేదు. మమ్ములను మీరు ఈ మతస్థులే కాదు అంటే నీకు మతము తెలియలేదు, జ్ఞానం తెలియలేదు. ఈ జ్ఞానము ఏ మతములో ఉండేది నీకు అర్థము కాలేదు. నువ్వు ఆ మతములో ఉన్నాను అంటున్నావు, కానీ నీ జ్ఞానము ఏదో నీకే తెలియదు. అంటే ఇప్పుడు హిందువులు ఉన్నారు, వాళ్ళ జ్ఞానము వాళ్ళకే తెలియదు. భగవద్గీతలోని వాక్యం చెప్పితే ఇది క్రైస్థవులది కదా! అంటారు. ఒకవేళ క్రైస్థవులు చెప్పితే ఇది ముస్లీమ్‌లది కదా! అంటారు. ఈ రకంగా తన జ్ఞానము తనకే తెలియని పరిస్థితిలో ఉండి, తన ఇష్టం వచ్చినట్టు నడుచుకుంటున్నారు. అనేక రకరకాల ఆరాధనలు చేస్తున్నారు. నేను అవన్నీ చెప్పలేదు. మీకు తెలుసు ప్రపంచములో ఎన్ని ఆరాధనలు ఉన్నాయో! అటువంటి ఆరాధనలన్నీ దేనికి సంబంధించినటువంటివి అని ఏమాత్రము జ్ఞానము తెలియనటువంటి వాళ్ళు అంటున్నారు. తర్వాత వారికి వివరముగా జ్ఞానము చెప్పితే, ఇది జ్ఞానము కాదు అనేటటువంటి వాళ్ళను నరాధములు అనవచ్చు. మనుషుల్లోనే అధములు అని చెప్పవచ్చు.

మన జ్ఞానము మనకే తెలియకుండా పోయింది, అనేదానికి ఇంకొక చిన్న ఉదాహరణ ఈ మధ్యన టీవీలో ఒక చర్చావేదిక జరిగింది. జనవిజ్ఞాన

వేదిక నుండి వచ్చిన రావుగారు, ఇంకొక ఆయన ఒక డాక్టర్ ఉండగా వీళ్ళను టీవీ వాళ్లు ప్రశ్నిస్తున్నారు. 'గత జన్మలున్నాయా? అని ప్రశ్న వేశాడు జన విజ్ఞానవేదిక వాళ్ళను. దానికి జన విజ్ఞాన వేదిక వాళ్ళు లేవు అని చెప్పారు! డాక్టర్‌ను ఎలాంటి వాన్ని పట్టుకొచ్చారు అంటే 'గత జన్మలు ఉన్నాయి' అని చెప్పేవాన్ని పట్టుకొచ్చారు. మా హిందూ ధర్మంలో గత జన్మలు ఉన్నాయని ఉంది. లేవు అంటే హిందూ మతానికి అంతా వ్యతిరేఖంగా మాట్లాడినట్టు అని డాక్టర్ అన్నాడు. అంటే అది వద్దు, వ్యతిరేఖత ఇంకోటి ఇంకోటి కాదు, మీరు డాక్టర్ చేసినారు కదా! మీరు ఏమంటారు? ఇవి ఉన్నాయా అని అడుగుతున్నారు. ఉన్నాయా, లేవా? అంతే! మీరు చెప్పండి, మీకు తెలిసింది చెప్పండి. వాళ్ళు ఏదో లేదు, అంటే కావాలని వాళ్ళకు వ్యతిరేఖంగా ఉన్నాయి అనడము, లేనిదాన్ని ఉన్నాయి అని అనడం, ఇలాంటివి వద్దు, ఉంటే ఉన్నాయి అను, లేకపోతే లేదు అను అని టీ.వీ వారు అడిగితే జవాబు తేల్చకుండా రెండు మూడుమార్లు దాటేసాడు ఆయన. దాటేస్తే వాళ్ళు ఆ ప్రశ్న వదిలిపెట్టలేదు. సరే! మీరు చెప్పేదంతా వాస్తవమే కానీ ఇప్పుడు మాకు కావలసింది సూటి జవాబు, సూటిగా ప్రశ్నకు సూటిగా జవాబు మీరు చెప్పండి. గత జన్మలున్నాయా? వాటిని తెలుసుకోవచ్చునా? అని అడిగితే చివరికి డాక్టర్ ఏమి చెప్పినాడు అంటే గత జన్మలు ఉన్నాయనేది పొరపాటు, గత జన్మలు అనేవి లేనే లేవు. ఎవరూ తెలుసుకునే దానికి అవకాశమే లేదు అని చెప్పినాడు. కానీ ఆ డాక్టరు ముందు ఏమి ప్రచారము చేశాడు? ఒక పుస్తకమే వ్రాశాడు. ఏమని 'పాస్ట్‌లైఫ్ రిగ్రెషన్ థెరపీ' (Past Life Regression Therapy) అని. గత జన్మలు తెలుసుకునే తెరపీ ఒకటి ఉంది అని.

ఆ డాక్టర్ ఏమి చెప్పాడంటే, అది గత జన్మలోకి మిమ్మల్ని పంపిస్తాము. గత జన్మలో ఉండే విషయాలు కూడా మేము తెలుసు కుంటాము. గత జన్మలో ఏదైనా పాపము చేసి ఉంటే ఇప్పుడు ఏమి రోగం వచ్చినదో కూడా గత జన్మను బట్టి తెలుసుకోవచ్చు అని ఇంతకుముందు ప్రచారము చేసిన వ్యక్తి ఆ డాక్టర్. దాని గురించి ఒక పుస్తకము కూడా వ్రాశాడు ఆయన. అటువంటి వ్యక్తి ప్లేట్ ఫిరాయించి ఏమి చెప్పినాడు? అటువంటివి లేనే లేవు. అటువంటివి ఉన్నాయి అనుకోవడము మూర్ఖత్వం, లేనే లేవు అని చెప్పినాడు. ఇంతకుముందు చెప్పింది? అంటే మీరు ఇంతకుముందు ఉన్నాయి అని చెప్పినట్టు ఉంది కదా! చాలాచోట్ల టీవీలలో చెప్పారు, పునర్జన్మలు ఉన్నాయి అని, ఇప్పుడు మళ్ళీ లేవు అంటున్నారే? అంటే ఆయన చిన్న ఉదాహరణ చెప్పినాడు. అది ఏమి ఉదాహరణ అంటే, అర్జునుడుకి కృష్ణుడు జ్ఞానం బోధించేటప్పుడు మొట్ట మొదట జ్ఞానయోగములో **"నేను ఎన్నోమార్లు పుట్టాను, నువ్వు ఎన్నోమార్లు పుట్టావు. నీకు ఎన్నో జన్మలున్నాయి, నాకు ఎన్నో జన్మలున్నాయి. నాకు అన్నీ తెలుసు, నీకు ఏవీ తెలియవు. కావాలంటే నీ వెనుక జన్మ తెలియజేస్తాను"** అని చెప్పినాడంట. ఈయన చెప్పినట్టే "పాస్ట్‌లైఫ్ రిగ్రెషన్ థెరపీ' (Past Life Regression Therapy) నాకు తెలుసు. నీ వెనకటి జన్మలు అన్నీ నాకు తెలుసు. కావాలంటే నీకు తెలియజేస్తాను" అని కృష్ణుడు చెప్పినాడంట. వెనుక జన్మలున్నాయి అని అంత గొప్పోడు చెప్పినప్పుడు నమ్మేసినాడు డాక్టర్ ఉన్నాయి అని మనకు భగవద్గీత ద్వారా తెలిసిపోయిందట!

కృష్ణుడు జన్మలు ఉన్నాయి అని చెప్పి 'చివరకు నాకు జన్మలే లేవు' అన్నాడు కదా! నేను అట్లే చెప్తాను అంటాడు డాక్టర్. మొట్టమొదట

అర్జునునికి కృష్ణుడు ఏమి చెప్పాడు? "నాకు జన్మలు ఉన్నాయి, నీకు జన్మలు ఉన్నాయి. నేను ఎన్నోమార్లు పుట్టాను, నువ్వు ఎన్నోమార్లు పుట్టావు. నాకు అన్నీ తెలుసు, నీకు ఏమీ తెలియదు" అని చెప్పాడు. ఆయన కొంత దూరము పోయిన తర్వాత, మొట్టమొదట వినే దానికి అలా అబద్ధం చెప్పి మళ్ళీ పూర్తి సత్యానికి పోయిన తర్వాత నిజం చెప్పాలంటే 'నాకు జన్మలే లేవు, నేను పుట్టనే పుట్టలేదు' అన్నాడు కృష్ణుడు. అందువలన నేను కూడా కొంతమందికి అర్థమయ్యే దానికి ముందు ఉన్నాయి అని చెప్పినాను. కానీ నిజంగా లేవు అని అంటున్నాను అన్నాడు. భగవద్గీతలో చెప్పినట్లు చెప్పినాడు అంటే కృష్ణుడు ఏ సందర్భములో ఉన్నాయి అని చెప్పినాడు. ఏ సందర్భములో లేవు అని చెప్పినాడు? ఆయనను అడ్డము పెట్టుకొని తప్పించుకునే దానికి ఈయన కృష్ణున్ని ఉపయోగించుకున్నాడు. ఈ రకంగా మాట్లాడేవాళ్ళు కూడా ఉన్నారు.

వాళ్ళ దృష్ఠిలో భగవద్గీత అంటే కూడా విలువ లేదు, ఆ డాక్టర్‌గారు వ్రాసిన ఒక పుస్తకములో 'శ్రీమన్నారాయణుడు వైకుంఠం నుంచి భూమికి దిగి వచ్చాడు, దిగి వచ్చి లక్ష్మికోసం వెతుకులాడుతున్నాడంట. ఆయన భార్య అలిగి భూలోకానికి వచ్చి ఉంటే, ఆమె కోసము నా భార్య ఎక్కడ పోయిందో అని వెతుకులాడి, వెతుకులాడి తిక్కబట్టిన మాదిరి తిరుగు తున్నాడట ఆయన. నేను విష్ణువును అని మరిచిపోయాడంట. నేను శ్రీమన్నారాయణుడు అని మరచిపోయి, భార్య కోసం తిక్క బట్టి తిరిగే సమయంలో, నారదుడు వచ్చి 'నారాయణ నారాయణ' అని అంటే దానిని విష్ణువు విని ఎవరినో అనుకుంటున్నాడు, నన్ను కాదు అనుకున్నాడంట. అప్పుడు నువ్వే నారాయణునివి అన్నాడంట నారదుడు. అప్పుడు విష్ణువు నేనెందుకైతాను అని, పలకలేదంట. పలకలేకపోతే అప్పుడు మతి

చలించిపోయింది, ఈయన తన ధ్యాస తను కోల్పోయినాడు, తన జ్ఞాపకము తనకు లేదు' అని చెప్పి అప్పుడు (పాస్ట్ లైఫ్) తో విష్ణువుకు జ్ఞానము నారదుడు తెలియజేసాడంట. నువ్వు పోయిన జన్మలో నారాయణమూర్తివి, నువ్వు ఇప్పుడు ఈ జన్మలో ఇట్లుండావు అని చెప్తే, అప్పుడు అర్థము చేసుకొని, "ఓ అలాగా! కరెక్టే, నేను గొప్పవాన్నే, నేను పొరపాటుగా ఇక్కడ వచ్చి వెతుకుతూ ఉన్నాను" అని విష్ణువు అనుకొన్నాడట.

ఇది కాదు నా పని, నేను ప్రజలకు అంతా కోర్కెలు నెరవేర్చడమే నా పని అని అప్పుడు ఒక రాయిలో కూర్చున్నాడంట. ఈ విషయము తిరుపతి కొండ మీదికి నారదుడు వచ్చి ఈయనకు నువ్వు నారాయణుడవి అని జ్ఞాపకము చేసినాడంట. నువ్వు ఇక్కడ వెతుకులాడేదానికి కాదు వచ్చింది. ప్రజలను పాలించేదానికి, భక్తుల కోర్కెలు తీర్చేదానికి, అంటే అప్పుడు విష్ణువు భక్తుల కోర్కెలు తీర్చే నిమిత్తము, వెంకటేశ్వరుని మాదిరి నిలిచిపోయాడు. అప్పుడు నారదుడే ఈ థెరపీని కనిపెట్టి చెప్పినాడు. కాబట్టి ఇది ఉంది అని డాక్టర్ ఒక పుస్తకము వ్రాసి, ఈ పొద్దు అలాంటిది కనుగొనడానికి అవకాశమే లేదు అని చెప్పుచున్నాడు టీవీలో. చూడండి ఎట్లుందో! ఒకసారి ఒకమాట, ఇంకోసారి ఇంకోమాట. అక్కడ జనవిజ్ఞాన వేదిక వాళ్ళు కూర్చున్నారు కాబట్టి ఎట్లా సాధ్యమైతుంది అని ప్రశ్న వేస్తారు. ప్రశ్న వేస్తే ఇంక దానికి చెప్పాలంటే కాదు, గుడ్డిగా నమ్మేవాళ్ళకు అయితే చెప్పేదానికి వీలు అవుతుంది. నేను కూడా నా గ్రంథాలలో వ్రాశాము, పునర్జన్మను మీరు తెలుసుకునే దానికి కాదు అని. ఆత్మ తెలియజేస్తేనే తెలియబడుతుంది. కానీ మీరు సొంతంగా ఎవరూ తెలుసుకోలేరు అని చెప్పాము.

ఈ రకంగా దేవుని జ్ఞానము తెలియనటువంటివాళ్ళు, వాళ్ళ ఇష్టం వచ్చినట్టు మాట్లాడుతూ, దేవుడు చెప్పిన పద్ధతి కూడా తప్పుగా భావించి చెప్పేటటువంటి పరిస్థితి ఏర్పడింది. అంటే దేవుడు ఏ సమయంలో నాకు జన్మలు ఉన్నాయి అన్నాడు. ఏ సందర్భములో నాకు జన్మలు లేవు అని చెప్పాడు. దేవునిగా నాకు జన్మలు లేవు. నేను పుట్టేవాన్ని కాదు అని చెప్పాడు. భగవంతునిగా నాకు జన్మలున్నాయి అని చెప్పినాడు. అది అర్థముకాక రెండింటినీ కలిపి ఇక్కడ ఉన్నాయి అన్నాడు, అక్కడ లేవు అన్నాడు. ఇక్కడ నిజం చెప్పి అక్కడ అబద్దము చెప్పినాడు. ఏది నమ్మాలి? దేవుడే అబద్ధాలు చెప్పినాడు, ఇంక మేము చెప్పేది ఏముంది అని డాక్టర్ చెప్తున్నాడు. అజ్ఞాన పరిస్థితి మనుషుల్లో ఉంది. కాబట్టి దేవుడు చెప్పినట్టి జ్ఞానాన్ని వక్రీకరించుకొని అర్థము చేసుకుంటున్నారు. దానినే వక్రీకరించి ప్రజలకు తెలియజేస్తున్నారు. ఇది మంచి పద్ధతి కాదు. నేను చెప్పేది ఒక్క భగవద్గీతే కాదు, ఏ గ్రంథము అయినా కానీ, ఆ గ్రంథములో ఉండే విషయాన్ని సంపూర్ణముగా తెలుసుకుంటే సరిపోతుంది. తెలియకపోతే ఏమవుతుంది? నువ్వు అక్రమంగా ప్రవర్తించినట్టు అవుతుంది. దేవుడు చెప్పిన మార్గము వదిలిపెట్టి నువ్వు ప్రవర్తించినట్టు అవుతుంది. నీది మాయ మార్గము అవుతుంది.

ఈ మధ్యన హైదరాబాద్‌లో బాంబ్‌బ్లాస్ట్ (Bomb Blast) బాంబు పేలుడు జరిగిన తర్వాత ఉస్మానియా హాస్పిటల్ దగ్గరికి మనవాళ్ళు పోయినారు. అక్కడ ఇద్దరు ముస్లీమ్‌లు కలిసారు, ఒక సంస్థకు పెద్దలు వాళ్ళు. వాళ్ళ పేర్లు కూడా ఇంతకుముందు వ్రాశాము, వాళ్లు నాకు పరిచయం మన వాళ్ళతో కలిసి మాట్లాడినప్పుడు వారు “ఏమయ్యా! మీ స్వామివారు మా పేర్లు గ్రంథములో వ్రాశాడు” అని అన్నారు. మనవారు

వ్రాశాడు మంచిదే కదా! అని చెప్పినారు. మేము ఏసుప్రభువు చనిపోలేదు అని చెప్పితే, వీళ్ళకు తెలియదు అని వ్రాశాడు. క్రైస్థవులకు ఇస్తే గ్రంథమే తీసుకోలేదు. ముస్లీమ్‌లకు ఇస్తే గ్రంథము తీసుకున్నారు కానీ చదువలేదు, ప్రక్కన పెట్టేశారు" అని అన్నారు. మేము చదువలేదు అని ఎట్లా తెలుసు. మేము చదివినాము. అందులో మమ్మల్ని మొట్టమొదట చాలా గొప్ప జ్ఞాపకశక్తివరులు, వీళ్ళకు చాలా గొప్పగా జ్ఞాపకము ఉంటుంది అని చెప్పి, మళ్ళీ చివరిలో మాత్రము వీళ్ళకు మరణం ఎన్ని రకాలో తెలియదు, ఏసుప్రభువు చనిపోలేదు అని మీరు భ్రమిస్తున్నారు. చనిపోయేది వాస్తవమే కానీ తాత్కాలిక మరణం అని తెలియదు అంటాడు. మాకు ఎన్ని మరణాలు ఉండేది తెలియదా! మాకు తెలుసు కదా! అని అన్నారు. తెలిసినప్పుడు తప్పేమీ లేదు. ఇప్పుడు అక్కడ ఏమి చెప్పినాము, ఎవరికీ తెలియదు అన్నాము. ఎవరికీ తెలియదు అంటే ఏమి? ఒక సిద్ధాంతము కనుగొన్నప్పుడు అది మొట్టమొదట కనుగొన్నది కాబట్టి ప్రపంచములో ఎవరికీ తెలియదు. అక్కడ నుండి అందరికీ తెలియబడుతుంది. 'తాత్కాలిక మరణము' అనేది సిద్ధాంతపరంగా మనము తెలుసుకున్నట్టిది. అది ఎవరికీ తెలియదు అని చెప్పినప్పుడు ఉన్న సత్యం చెప్పాల్సిందే కదా! 'తాత్కాలిక మరణం' అంటే ఎవరికీ తెలియదు. డాక్టర్లకు కూడా తెలియదు, ఇంకొకరికి తెలియదు.

ఇప్పుడు మీరు ఏమి చెప్తున్నారు. బైబిల్‌లో ఒక వాక్యం తీసుకొని ఏనా అనేటువంటి వ్యక్తి చేప కడుపులో మూడు రోజులు ఉండి తర్వాత తిరిగి లేపబడ్డాడు అన్నారు. అంటే పైకి లేచాడు అని ఉంది, పైకి లేచిపోయాడు అని ఉంది. లేచిపోయినాడు అంటే ఎక్కడ ఆ పైకా? ఈ రకంగానే ఏసుప్రభువు కూడా లేపబడ్డాడు. చేప కడుపు నుండి, ఏనా ఏ విధముగా లేచిపోయాడో, ఆ విధముగానే ఈయన కూడా లేచిపోయాడు.

అంటే ఈయన శిలువ మీద మరణించలేదు, ఈయన పైకి పోయినాడు శరీరముతోనే అని వాళ్ళు అంటున్నారు. మనిషి కాదు, దేవుడు కూడా శరీరముతో పైకి పోలేడు. దేవుడు భూమిమీదికి వచ్చినా కానీ శరీరాన్ని వదిలిపెట్టి ప్రకృతి సిద్ధంగా పోవలసిందే. ఎవరూ ఆ విధముగా పోయే దానికి వీలులేదు. ఇది శాస్త్రబద్ధత అని చెప్తున్నాము. ఆ విధముగా పోయినాడు అంటే మనము చెప్పేటటువంటివి చాలా తప్పు అవుతాయి. ఏ మనిషైనా లేక దేవుడైనా ఆ విధముగా అవతార పురుషునిగా వచ్చి పైకి పోయినాడు అంటే అది అబద్ధము అవుతుంది. శాస్త్రబద్ధము కాదు. ఆధ్యాత్మిక విద్యలో కూడా అది లేదు. ఆత్మ నీ శరీరము నుండి నిన్ను వేరు పరుస్తుంది కానీ, స్వయముగా శరీరమును తీసుకొని పోతుంది అని లేదు. శరీరము అనేది వేరు, నువ్వు వేరు, నీ ఆత్మ వేరు. శరీరములో నీ ఆత్మతో సహా నువ్వు ఉన్నావు. శరీరాన్ని వదలి పోయేటప్పుడు ఆత్మతో సహా నువ్వు వదలిపోతున్నావు. నిన్ను తీసుకొని పోయేది నీ ఆత్మే. నువ్వు అక్కడ నుండి కూడా స్వయముగా పోలేవు. ఆత్మ తీసుకుని పోయేటప్పుడు నీ శరీరములో ఏమి ఉన్నా అవి అన్నీ ఇక్కడే వదలిపెట్టి పోతావు.

శరీరము నుండి బయటపడేది ఏవి అంటే నువ్వు, నువ్వు చేసుకున్న కర్మ, నీ గుణాలు. అవి వేరే శరీరములోకి పోతాయి అంటే, నీ ముఖం మీద ఉన్నటువంటి ఈ 'బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రాలు' ఏవైతే ఉన్నాయో అవి నీ తలలో ఉన్నాయి. ఈ కాల కర్మచక్రాలు మొత్తము చట్రం అనేది అట్లే పోయి ఇంకొక శరీరములో దూరుకుంటుంది అని మనము క్లియర్‌గా చెప్పుకున్నాము. దేవుడు భగవద్గీతలో కూడా అక్షర పరబ్రహ్మ యోగములో అదే సారాంశము తెలియజేశాడు. మరి ఇంత గొప్ప జ్ఞానాన్ని దేవుడు తెలియజేసిన తర్వాత దానిని కాదు అని, శరీరముతో పోతాడు అనేమాట

పూర్తి అసత్యము. మాకు తెలియదా? అంటే మీకు తెలియదనే చెప్పు చున్నాము. తెలియదా అని అందరూ అంటారు, అజ్ఞానులు కూడా మాకు జ్ఞానము తెలియదా అంటారు. జ్ఞానము తెలియదనే చెప్తావుంది. తెలుస్తే ఎందుకు చెప్పాలి? నీకు తెలిసింది దేవుడు ఎందుకు వచ్చి చెప్తాడు? మీరు రకరకాల గొడుగుల కింద కూర్చోండి, కుర్చీల కింద కూర్చోండి, లేకపోతే అక్కడ కూర్చోండి ఇక్కడ కూర్చోండి, ఇంకోటి లేకపోతే ఇట్లే పైకి పోతావు ఈ పుస్తకము చదివితే, లేకపోతే ఇక్కడే మోక్షములో ఉన్నాము, ఉంటే ఆయన రావలసిన పని ఏమి వచ్చింది? మీకు మోక్షము కావాలనే ఈ జన్మల నుండి బయటపడాలనే మీకు జ్ఞానము తెలియజేసే దానికి దేవుడు భగవంతునిగా వచ్చాడు. దేవుడు రూపముతో భగవంతుడు వచ్చాడు. దేవునిలోని భాగమే భగవంతునిగా వచ్చి మీకు జ్ఞానము తెలియజేసింది ఆ పరిస్థితి అంతా దేవునికి ఎందుకు వచ్చింది అంటే ఏ రోజు అయితే పురాణాలు వ్రాయబడినాయో, ఏ రోజైతే వేదాలు వ్రాసి ప్రచారము చేయబడ్డాయో, ఏ రోజైతే యజ్ఞయాగాదులు సంపూర్ణముగా దేశంలో చేస్తున్నారో ఆ రోజు అధర్మాలు చెలరేగినాయి అని వాటి నిర్మూలన కొరకు భూమిమీదికి శ్రీకృష్ణుడుగా వచ్చాడు. అంతకుముందు కూడా దేవుడు భగవంతునిగా వచ్చాడు.

అయితే కృష్ణుడు వచ్చిన పరిస్థితి ఎటువంటిది? అనగా వ్యాసుని చేత వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు అన్నీ వ్రాయబడి, బయటికి పోయి వాటి ప్రచారము ప్రజలలో ఎక్కువ ఉన్నటువంటి సమయంలో, తర్వాత రకరకాల అధర్మ ఆరాధనలు చేసేటటువంటి సమయంలో అధర్మాలు పూర్తి ముదిరిపోయి ధర్మాలకు పూర్తి ముప్పు ఏర్పడినప్పుడు, నేను జ్ఞానము తెలియజేయాలి అన్న ఉద్దేశ్యముతో దేవుడు మనిషి అవతారం ఎత్తి వచ్చాడు.

అయితే ప్రజలు ఆయనను సాధారణ మనిషిగా లెక్కేసుకొని, ఆయన చెప్పేది లెక్క చేయక అజ్ఞానులుగా ప్రవర్తించారు. అదే విషయమునే రాజవిద్యా రాజగుహ్యాయోగమను అధ్యాయము 11వ శ్లోకములో..

శ్లో॥ 11. అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥

"నేను జీవరాసులందరికీ దేవుడననీ, నేను గొప్పవాడననీ, పరంధాముడిని అనీ, మోక్షానికి అధిపతిని అనీ తెలియక, నా యొక్క గొప్ప భావాన్ని తెలియక ఈ మూఢులు అయినవారు మానవ శరీరము ధరించిన నన్ను చూసి, నన్ను అవమానం చేస్తున్నారు." ఆయన వచ్చి జ్ఞానము చెప్పినప్పుడే ఆయనను అవమానం చేసేటటువంటి జనాలు ఉంటే ఆయన చెప్పినది నిజమైన జ్ఞానము అని, ఇదే ఆరాధన అని, దీనికంటే మించినటువంటివి లేవు అని నమ్ముతారా చెప్పండి. అరుదుగా ఎవరో కొంతమంది నమ్ముతారు. అందరూ నమ్మరు. కొంతమంది ఈయన చెప్పేదే నిజమైన జ్ఞానము అని, నిజమైన ఆరాధనలని, నిజమైన దైవజ్ఞానమని తెలిసి ఆ జ్ఞానాన్ని అనుసరించేటి వాళ్ళు ఉంటారు. చాలామంది ఆయనను అవమానం చేసి, మానవుల క్రిందికి లెక్కేసి, మనిషి శరీరము ధరించినటు వంటి వాన్ని దేవుడు అని లెక్కించక, ఈ ప్రపంచానికి అంతా ఈయన పెద్ద అనే భావము లేకుండా, ఆయన గొప్పతనాన్ని తెలుసు కోకుండా, మూర్ఖంగా మాట్లాడి ఆయనను అవమానం చేసేటి వాళ్లు ఉన్నారు. ఆ సమయములో అన్నప్పుడు ఆ మాట కృష్ణుడే స్వయముగా చెప్పినప్పుడు, ఆయన చెప్పినమాట గొప్పది అని కొంతమంది నమ్మరు అని తెలిసిపోయింది కదా! ఇటువంటి వాళ్లు భూమిమీద ఉన్నారు. అదే విషయమే రాజవిద్యా రాజగుహ్య యోగము అనే అధ్యాయములో చెప్పాడు.

"సర్వభూతంబులకు మహేశ్వరుండనైయ్యు, నర శరీరంబు ధరియించు నన్ను చూచి, నాదు (శ్రేష్ఠత్వం ఎరుగని నరులు మూఢులగుచూ నన్నవమానింతురు" అంటే ఈయన (శ్రేష్ఠత్వం తెలియనటువంటి మానవులు ఏమి చేస్తున్నారు? అందువలన ఆయననే అవమానం చేసేవాళ్లు, మనము చెప్పే జ్ఞానాన్ని చూసి వీళ్లు క్రైస్థవులు, వీళ్లు హిందువులే కాదు వీళ్లు అధర్మాలు బోధిస్తున్నారు, వీళ్లు పరమతాన్ని బోధిస్తున్నారు అని మనల్ని అంటున్నారు. ఆయననే అవమానం చేసినారు వీళ్ళు మనల్ని విడిచిపెడతారా? మనము వాళ్లు అవమానం చేసినా లెక్కపెట్టుకోలేదు. అటువంటి వాళ్ళను దేవుడు ఏమి అంటున్నాడు? నేను చెప్పే ఆరాధనలు మీకు తెలియవు నన్ను అవ మానిస్తున్నారు కాబట్టి విజ్ఞాన యోగము, 15వ శ్లోకములో...ఇలా అన్నాడు.

శ్లో॥ 15: నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।
మాయయా పహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః ॥

"పాపకర్ములు, మూఢులు, మానుషాధములు, అజ్ఞాన వి(భ్రాంతి మెలగువారు అసుర భావంబుచెందిన అట్టి జనులు నన్ను ఉపాసించునట్టి జ్ఞానంబు గనరు".

నన్ను ఏ విధముగా తెలుసుకోవాలో అటువంటి జ్ఞానము వీళ్లకు తెలియనే తెలియదు. నన్ను గొప్పగా అనుకుంటే నేను చెప్పేటి మాటలు గొప్పగా అనుకుంటే, నేను చెప్పే పద్ధతి గొప్ప అని మీకు తెలుస్తుంది. అప్పుడు నా జ్ఞానము మీరు తెలుసుకోగలుగుతారు. కానీ నన్నే గొప్పగా అనుకోనప్పుడు నా మాటలు ఎట్లా వింటారు? వినరు, పైగా ఇలా ఎగతాళి చేస్తారు. "ఓ ఇతనే కదా! చిన్నప్పుడు నిక్కరు కట్టుకుంటా ఉండేవాడు" అంటారు. నిక్కరు కట్టుకోకుండా ఎట్లా ఉంటారు? చిన్నప్పుడు అందరూ

నిక్కరు కట్టుకుంటారు కదా! ఇతను నిద్రలో ఒంటికి పోసుకునే వాడు అని అంటారు. అంటే చిన్నప్పుడు ఎవరైనాగానీ ఒంటికి పోసుకుంటారు. అప్పుడు ఒంటికి పోసుకుంటారు, నిక్కరు కట్టుకుంటాడు అంటారు తప్ప ఇప్పుడు చెప్పే జ్ఞానము ఏమిటిది అని ఆలోచించరు. అంటే ఈ విధముగా మనుషులున్నారు. దేవుడు మనిషిగా వచ్చినా ఆయనను మామూలు మనిషిగా లెక్కేసుకొని అప్పుడు నిక్కరు లేకుండే, అప్పుడు పుట్టగోసి పెట్టుకుండే, అప్పుడు బువ్వ తింటుండే, అప్పుడు నీళ్లు తాగుతుండే అని అంటారు. ఇవన్నీ అందరికీ ఉండేటివే కదా! ఆయన చెప్పే జ్ఞానము ఎంతటిది అని ఆలోచన చేయకుండా మాట్లాడుతారు. దేవుడు వచ్చినా, అవమానం చేసేవారు. మూర్ఖులు, మూఢులు, నరాధములు అని చెప్పినాడు ఆయన. అటువంటి వాళ్ళనంతా వీళ్లు అధములలోకెల్లా అధములు ఐనట్టి వాళ్లు, మనుషుల్లోకెల్లా నీచులు అని మనము చెప్పాల్సిన పని వస్తావుంది. అంటే ఎవరిని నీచులు అనాలా? అంటే దేవుడు చెప్పిన జ్ఞానము ప్రకారము కాకుండా, భగవద్గీత ప్రకారము చెప్పినా క్రిష్టియన్సే ఆ విధముగా చెప్పేది అని, పరమతముగా సృష్టించే వారిని నీచులని అనాలి. దేవుడు అనే మాట మాట్లాడతాడు వేరే ఏ పేరు చెప్పలేదు అంటారు. ఏ పేరని చెప్ప మంటావు, దేవునికి పేరుందా చెప్పేదానికి? కాబట్టి పేరు ఏమాత్రము సంబంధము లేనివానిని దేవుడనే మనము చెప్పాలి. దేవున్ని దేవుడు అనక ఇంక ఏం అనేదానికి వీల్లేదు. ఏ పేరు ఆయనకు పెట్టేదానికి అవకాశము లేదు. ఆయన దొరికేవాడు కాదు. తెలియబడేవాడు కాదు. అటువంటి పరిస్థితిలో మనము దేవున్ని దేవుడే అని చెప్పాలి. ఇతర పేరుతో చెప్పకూడదు.

ఇప్పుడు ఆయనెవరో శివస్వామి, ఆయన మూడు సంవత్సరాలు శ్రీశైలము పోయినాడంట. జ్ఞానము తెలుసుకున్న తర్వాత 'దేవుని బిడ్డ' అని వ్రాసుకున్నాడు. దేవుని బిడ్డ అని వ్రాసుకోవడంలో తప్పేమి ఉంది? దేవుని బిడ్డ అంటే తప్పా? మనమంతా దేవుని బిడ్డలము కాదా? వాడు దేవుని బిడ్డ అంటే ఏమి? వీడు మనోడు కాదు అని అంటే, నీ జాతి వేరేనా? నువ్వు దేవుని బిడ్డవు కాదా! దయ్యాల బిడ్డ అయినట్టు. ఈ రకంగా వీరు మాట్లాడుతున్నారు? జ్ఞానాన్ని ఏమి అర్థము చేసుకుంటున్నారు? మనది గొప్ప జ్ఞానము అని మొట్టమొదటనే మేము చెప్పాము. మొట్ట మొదట ఆదిలో ప్రపంచమంతా ఈ జ్ఞానము వ్యాపించి ఉండేది. దాన్ని ఇందూజ్ఞానము అంటారు. ప్రపంచమంతా ఈ జ్ఞానము వ్యాపించి ఉండేది అని చెప్పేదానికి జ్ఞానయోగములో దేవుడు ఏమి చెప్పాడంటే నేను చెప్పిన సమాచారము సూర్యునికి తెలిసింది, సూర్యుని ద్వారా మనువుకు తెలిసింది, మనువు ద్వారా ఇక్ష్వాకుడికి తెలిసింది. ఇక్ష్వాకుడి ద్వారా ఇతరత్రా వాళ్లకు తెలిసింది. జ్ఞానము అంతా సమస్త మనుషులకు ప్రాకిపోయింది అని చెప్పాడు. ఈ జ్ఞానము తర్వాత కొంత కాలానికి దేశములో తెలియకుండా పోయింది. దానినే ఇప్పుడు నేను నీకు జ్ఞాపకం చేస్తున్నా అని చెప్పాడు. అంటే ఈ జ్ఞానం భారతదేశమంతా ముందు వ్యాపించి ఉంది, అని మనకు చరిత్ర ఆధారం దొరికింది.

దేశమంతా వ్యాపించి ఉండేది ఇందూ జ్ఞానము. ఈ రోజు తెలియకుండా పోయింది. అదే జ్ఞానాన్ని నేడు గొప్పది అని చెప్తా ఉంటే, వీరిది వేరే మతము, మనది కాదు అంటే? దేవుని జ్ఞానము చెప్పినా నీకు అర్థము కాలేదు. అందువలన 'చెవిటోని ముందు శంఖు ఊదినట్టు' ఉంది అంటాము. అజ్ఞానము అనే పరిస్థితి నుండి బయటపడే వరకు

మనకు ఏమి అర్థము కాదు. మనమెందుకు అటువంటి పరిస్థితిలోకి పోయినాము అంటే మూర్ఖులం అయినాము, మూఢులం అయినాము, తర్వాత పాపము చేసుకున్నట్టి వ్యక్తులుగా ఉన్నాము. దేవుని మీద ధ్యాస లేనిదానివలన మనకు ఏమాత్రము దేవుని జ్ఞానము తెలియకుండా పోయింది. మన జ్ఞానము ఎటువంటిదంటే మనము దేవుని జ్ఞానము తెలిసిన తర్వాత, ఎటువంటి భయం లేకుండా తెలియజేసేటటు వంటివాడే నిజమైన జ్ఞాని అని భగవద్గీతలో ఒకచోట దేవుడు చెప్పడం జరిగింది. ఎటువంటి భయం లేకుండా తెలియజేస్తాడు. ఎందుకంటే సత్యాన్ని ప్రకటించేవాడు ఎప్పుడూ భయపడడు. ఆ రకంగా మనము ఏమి చేస్తున్నామంటే ఎన్నో గ్రంథాలు వ్రాశాము. మన గ్రంథాల్ని కొంతమంది అర్థము చేసుకోకుండా వివాదం తెచ్చుకుంటున్నారు. ఏ వివాదం తెచ్చుకున్నా మనము ఏమాత్రము భయపడటం లేదు. కానీ మనము ఏమి చెప్పుతున్నా మంటే సందర్భానుసారం అర్థమయ్యే రకంగా చెప్పాలి, అన్న ఉద్దేశ్యముతో సందర్భానుసారంగా జ్ఞానమును చెప్తున్నాము.

చెప్పేది సత్యము, ఎటువంటి జంకూ లేనిది. ఈ విధముగా నేను జ్ఞానము చెప్తున్నాను. మీరు కూడా ఇప్పుడు తెలుసుకున్న జ్ఞానాన్ని బయటకు సందర్భానుసారం చెప్పండి. కొంత ధ్యాస కలిగి వాడు వింటున్నాడా లేదా, ధ్యాస ఉందా లేదా అని చూసి చెప్పండి. లేదు మీ జ్ఞానం బాగుంది అని వాడేమన్నా ఒకమాట ఊరికే చిన్నగా అన్నాడా వానికి టిఫిన్, భోజనం అన్నీ పెట్టించి సకల సౌకర్యాలు కల్పించి చెప్తారన్నమాట. వానికి పరుపు వేయించి నువ్వు కూర్చో, నేను చెప్తాను అని, అంత కష్టపడి చెప్పే వాళ్లున్నారు. అలా జ్ఞానము బయటికి చెప్పాలి అన్న ఆత్రుత కొందరికుంది వాస్తవమే కానీ, వాడు వింటున్నాడా లేదా అని తెలుసుకోండి.

వీనికి ఈ జ్ఞానం చెప్పొచ్చా చెప్పకూడదా, దీనికి యోగ్యుడా కాదా! అని ఆలోచన చేసి వాడు తెలుసుకునేదానికి యోగ్యుడు అయితే చెప్పండి. లేకపోతే వదలివేయండి. అంటే ఈ జ్ఞానము చెప్పడములో ఏమాత్రము జంకు వద్దు. దేవుని జ్ఞానం తెలియజేయడంలో, మీరు చేసే ఆరాధనలు తప్పు అని భగవద్గీతలో ఎక్కడా చెప్పలేదు. మనుషులు చెప్పినవి. మనుషులు సృష్ఠించినటువంటి ఆరాధనలు కొందరు చేస్తున్నారు. మనుషులు సృష్ఠించినవి, ఇట్లాంటివి రకరకాల ఆరాధనలు అన్నీ భగవద్గీతలో లేవు. కాబట్టి ఇవి మనుషులు సృష్ఠించినవి, వాటివల్ల ఏమి ప్రయోజనం లేదు అని మీరు ధైర్యంగా చెప్పొచ్చు. సాక్ష్యాధారం భగవద్గీత ఉంది అట్లే మిగతా రెండు దైవగ్రంథములు ఉన్నాయి. కాబట్టి ఎటువంటి జంకూ లేకుండా ఈ జ్ఞానాన్ని మీరు బయట చెప్పొచ్చు. ఈ రోజు సక్రమమైన మార్గంలో కాకుండా అక్రమమైన మార్గంలో మనము ఆరాధనలు చేస్తున్నాము. కాబట్టి అటువంటి అక్రమ ఆరాధనలు అన్నీ వదిలేసి, సక్రమమైన ఆరాధనలోకి రావాలని కోరుతున్నాను.

## 73. భయం

**(తేది :- 19.09.2013)**

ఈ రోజు ఏమి చెప్పాలనేది కూడా మాకు నిర్ణయం ఉండదు. ఇక్కడకు వచ్చిన తరువాతనే ఏదైనా అప్పటికపుడు చెప్పుతాం అని ఇంతకు ముందూ కూడా మేము చెప్పినాము. కానీ ఏమి చెప్పాలనేది ఇంతవరకు నిర్ణయం కాలేదు. అయినా ప్రతి మాసంలోనూ మీకు క్రొత్త విషయములనే చెప్పుచున్నాము. క్రొత్తగా కన్పించింది, క్రొత్త విషయాలుగా కన్పించాయి.

అది మీకు కూడా ఆ విధంగా కన్పిస్తున్నట్లు ఆ విధంగానే అయింది. ఒకటి ఏమంటే ఇప్పుడు చెప్పే విషయము ఎక్కడా కూడా ఏ గ్రంథాలలో కూడా ప్రస్తావనకు రాలేదు. అంటే మనం వ్రాసిన గ్రంథాలలో కూడా ఎక్కడా ప్రస్తావనకు రాలేదు. తరువాత ఇతర గ్రంథాలలో కూడా, ఏ మతస్తులు కూడా వాటి గురించి చెప్పలేదు.

ఇస్లాం మతంలోని వాళ్ళు ఖురాన్ గ్రంథాన్ని గూర్చి చెప్పినాగానీ, ఇంతలోతుగా చెప్పలేదు. మనం దానిని విడదీసి విడదీసి చెప్పడం జరిగింది. అలాగే బైబిలు గురించి, ప్రతి విషయాన్ని కూడా విడదీసి చెప్పడం జరిగింది. అయినాగానీ కొంతమంది అర్థం చేసుకోలేకుండా పోతున్నారు. కొంత మందికి అర్థమయ్యింది కానీ అసూయతో ఒప్పుకోకుండా, లోపల ఒప్పుకున్నా బయటికి ఒప్పుకోకుండా ఉన్నారు. అట్లాంటి వారు కూడా కొంతమంది ఉన్నారు. మేము ఒప్పుకుంటే తక్కువ అయిపోతాం సమాజంలో అని అనుకొంటున్నారు. బయట సమాజంలో మనం ఒకరికొకరు గొప్పగా కన్పించేది కాదు, దేవుని లెక్కలో మనం గొప్పగా ఉన్నామా లేదా అనేది లెక్కేసుకోవాలన్నమాట. దేవుని లెక్కలో మనం తెలిసినవాళ్ళమా కాదా అని లెక్కేసుకొంటే సరిపోతుంది మనుషుల లెక్కలో ఎంతమంది గొప్పవాడు అనుకున్నా గాని ప్రయోజనం లేదు. దేవుని లెక్కలో గొప్పవాడి వైతే నీవు దేవుని దగ్గరకు పోయేదానికి అవకాశం ఉంది. లేకపోతే దేవుని దగ్గరకు పోయేదానికి అవకాశం ఏమాత్రం ఉండదు.

ఖురాన్ గ్రంథంలో వ్రాసినవి అన్నీ చాలా గొప్ప జ్ఞాన విషయాలే. మేము ఏమి చెప్పుచున్నామంటే, మేము చెప్పినవన్నీ కరెక్టు కాదేమో. కరెక్టు అవును అని అనుకోవద్దండి, మేము కూడా మనుషులమే. మేము చెప్పేటి వన్నీ కరెక్టు అవుతాయని నమ్మకం లేదు అని చెప్పాము. కానీ అయితే

ఇంకొకమాట కూడా చెప్పుతున్నాము. "ఇంతకు మించి చెప్పేవాడు ప్రపంచంలో ఎవరు కూడా ఉండరు" అని అన్నాము. అది కూడా చెప్పుతున్నా ఈ రోజు ప్రత్యేకించి తెలియజేసే విషయమేమంటే మీకు ఆ విషయం చెప్పేదానికంటే ముందు ఒక చిన్న కథ మాదిరి చెపుతాను. ఒక చిన్న కథ మాదిరి అయితే అది మీకు బాగా అర్థమవుతుంది.

ఒక ఊళ్లో ఇద్దరు పెద్దమనుషులున్నారన్న మాట. తన్నేగౌడు అనే వాడు ఒకడున్నాడు. వాడు ఏమన్నా అన్నాగాని తంతాడంట. తన్నేగౌడు ఏమీ మాట్లాడేదేమీ లేదంట. ఇచ్చేదాసు అనేవాడు మరొకరున్నాడట. ఎవడైనాగానీ, వానిని అడిగితే ఇస్తాడంట. ఇలా ఇచ్చేదాసు, తన్నేగౌడు ఉన్నారు. తన్నేగౌడు దగ్గరకు పోతే వాడు తంతాడు కాబట్టి భయం భయంగా పోతారన్నమాట. ఇచ్చేదాసు దగ్గరైతే ఏం భయం లేదు కదా! భయపడకుండా పోతారు. ఆయన దగ్గరకి సులభముగా పోవచ్చు, అడగవచ్చు, మాట్లాడవచ్చు, ఇప్పించుకోవచ్చు. ఈ రకంగా ఉన్నారన్న మాట తన్నేగౌడు, ఇచ్చేదాసు. కొంతకాలం తర్వాత ఏమైందంటే ఊరిలోనివారు పూర్తి తన్నేగౌడుకు భయపడి భయపడి బ్రతుకుతున్నారన్న మాట. వాడు ఎట్లా చెప్పితే అట్లా వినాలి. వాడు చెప్పినట్లు వినకపోతే, వానికి భయపడకపోతే, వీనికి అన్ని ఆటంకాలు కలుగజేస్తాడు. జీవితంలో అన్నీ ఆటంకాలే కాబట్టి వాడు ఆటంకం కలుగజేయకుండా ఉండాలంటే. మనం వాని మాట వినాలన్న మాట. ఎవడన్నాగానీ వాని దగ్గరికి పోయేవాడు, వాడి ఇంటి దగ్గరకు పోయేవాడు, 'తన్నేగౌడుకు జై' అని అంటుండాలి. తన్నేగౌడుకు జై అని పోతే ఫరవాలేదు. అనలేదనుకో వాడు ఏదో ఒకటి ఇబ్బంది పెడతాడన్నమాట.

ఆ రకంగా వాని జీవితమంతా కాలం గడుపుకున్నాడు. చనిపోయే ముందర ఏమి చేశాడంటే, ఒరే! నేను చనిపోతున్నాను. ప్రతి సంవత్సరం

మీరు నాకు దినాలు చేయాలి అని చెప్పాడు. మనం ఏమి చేస్తామంటే చనిపోయినపుడు ఒక్కసారే కదా దినాలు చేసేది, వాడు తన్నేగౌడు కాబట్టి భయం పెట్టి పోయినాడు ప్రతి సంవత్సరం నాకు దినాలు మీరు ఊరంతా కలిసి చేయాలి. మా వాళ్ళే కాదు, ఊరంతా కలిసి మీరు దినాలు చేయాలి. ఆ దినాలు చేసేటపుడు మామూలుగా అచారాలు చేసుకుంటారు కదా! తర్వాత పిండాకూడు ఎక్కడన్నా ఏటిలోనో, వంకలోను పెట్టివస్తారు కదా! అట్లా మళ్ళా ఎక్కడన్నా బయట వేసేసి రాకూడదు. బాగా పారే ఏటి నీళ్ళలో పెట్టి రావాలి అని చెప్పినాడు. అప్పటి నుండి వాడు పోయినా గానీ వీళ్ళు భయపడి భయపడి ఏమి చేసేవారంటే, వాడు చచ్చిపోయినాక కూడా ఏమన్నా ఆటంకాలు కలుగజేస్తాడేమోనని, బతికి వున్నపుడే ఇన్ని ఆటంకాలు కలుగచేశాడు, దయ్యమైవాడు ఇంకెన్ని ఆటంకాలు కలుగజేస్తాడో అని భయపడి వాడు చచ్చిపోయినాగానీ ప్రతి సంవత్సరము పిండాకూడు పెట్టేదానికి అలవాటు పెట్టుకుంటున్నారు. పిండాకూడు తీసుకొనిపోయి ఆ నడి ఏటిలో దానిని పెట్టి రావాలి. కాబట్టి సరే అని నడి ఏటిలో వేసి వచ్చేవారన్నమాట!

ఇచ్చే దాసున్నాడు ఆయన ఏమీ చెప్పలేదన్నమాట. ఇచ్చేదాసు ఏం చెప్పలేదు కాబట్టి, ఆయన మంచోడు, చనిపోయినపుడు మనకేమీ ఇబ్బంది పెట్టలేదు. ఉన్నన్నాళ్ళు మనకు ఇచ్చినాడు, పోయిన తరువాత ఏ కండీషన్ పెట్టలేదు. ఆయన మనకేమీ ఇబ్బంది పెట్టలేదు. ఉన్నపుడు ఇబ్బంది పెట్టలేదు, పోయిన తరువాతా ఇబ్బంది పెట్టడు. మనకు ఇబ్బంది పెట్టేదంతా ఆ తన్నేగౌడే కదా! మళ్ళీ చచ్చిపోయిన తరువాత కూడా దయ్యమై ఏమన్నా పీడిస్తాడేమో, మనకు అన్ని ఆటంకాలు కలుగజేస్తాడేమో అని, వీళ్ళు ఏమి చేస్తారంటే ప్రతి సంవత్సరము పిండాకూడు పెట్టేవాళ్ళు. ఆ

పిండాకూడు తీసుకొని పోయి ఏటి (నది) మధ్యలో పెట్టిరావాలి కదా! ఒకసారి ఎక్కువ వర్షం వచ్చి ఏరు పారుతావుంటే ఈయన నడి ఏటిలో పెట్టమన్నాడు కాబట్టి, దానిలో పెట్టడానికి పోయిన వాళ్ళు 5,6 మంది కొట్టుకపోయినారు. ఒక సంవత్సరం వాడు జిల్లాకంతా శాసనం చేసి పోయినాడు. జిల్లా అంతా ఎక్కడన్నా చూడు ఆ సంవత్సరం వచ్చేసరికి, అతను చచ్చిపోయిన దినం వచ్చేసరికి వీళ్ళు పిండాకూడు ఆ నీళ్ళలో పెట్టి వచ్చేది అలవాటు అయింది.

ఆ నీళ్ళురాని చోట సన్నగా నీళ్ళుపారే చోట ఏం ప్రమాదం లేదనుకో. నీళ్ళు ఎక్కువ పారేచోట, ప్రమాదము ఉంటుంది. తన్నేగౌడు దినాలు కరెక్టుగా వానాకాలమే వస్తాయి. ప్రజలు భయంతో ఆటంకాలు కలుగజేస్తాడని, ఈ రకంగా పెట్టుకుంటూ వచ్చే వాళ్ళు, ఇంకొకాయన ఇచ్చేదాసు వున్నాడు. ఆయన ఏం చెప్పలేదు. ఈ రకంగా తన్నేగౌడు, ఇచ్చేదాసు ఇద్దరున్నారు. వాళ్ళ చరిత్ర చూస్తే ఇచ్చేదాసు చచ్చి పోయిన తర్వాత కూడా మంచి పేరు తెచ్చుకున్నాడు. తన్నేగౌడు చచ్చిపోయిన తరువాత కూడా చెడ్డ పేరే. అయితే ఇచ్చేదాసును గురించి పెద్దగా ఎవరూ అనుకోలేదు గాని, తన్నేగౌడు గురించి ప్రతి సంవత్సరము అందరూ అనుకోవలసిన పరిస్థితి వచ్చింది. కాబట్టి తన్నేగౌడే బాగా పేరు గడించినాడన్నమాట. భయంతో కాబట్టి ఈ భయం అనేది మనుషులకు ఉంది. వాడు చాలా ఇబ్బంది పెడుతున్నాడన్నమాట. వానికి ఎందుకు పిండాకూడు? మన మెందుకు పెట్టాలి అని అనుకోలేదు. వాడు పెట్టాలంటే పెట్టాలి, ఇది మన సాంప్రదాయం. పెట్టకపోతే ఏమన్నా అవుతాదేమోనని భయం. ఏమీ కాదు అయినా ఏమన్నా అవుతాదేమోనని భయపడి ఒకరికొకరు తీసుకొని పోయి పెట్టివస్తారు. బాగా వానకాలమే దినాలు వస్తాయి, అప్పుడే తీసుకొని పోయి పెట్టి రావాలి.

అపుడు ఎవడో ఒకడు ఏటిలోకి పోయినపుడు మునిగి పోవడమో, చచ్చిపోవడమో, కొట్టుకపోవడమో మామూలుగా జరుగుతూనే వుంటుంది. ప్రతి సంవత్సరం చచ్చిపోతున్నారు. ప్రతి సంవత్సరం చచ్చిపోయినాగానీ పిండాకూడు మాత్రం పెట్టేది తప్పలేదు వీళ్ళకు. అది పెట్టకపోతే ఏమైతాదో అనుకుంటున్నారు. చచ్చిపోతున్నాం కదా, అంతకంటే ఏమైతాది. పెట్టకపోతే చచ్చిపోము కదా! మిగులుతాం కదా! అనుకోవడం లేదు. వాళ్ళు చచ్చి పోయినా ఫరవాలేదు, పెట్టాలనుకుంటున్నారు. ఇలా ఉంది భయం అంటే! మనుషులకు, కాబట్టి ఇది ఉదాహరణకు ఒక కథ చెప్పాను. ఏమను కోవద్దండి, మనుషులకు భయం అనేది ఒకటుంది. భయపడేవాడు ఒకడుంటే భయపెట్టే వాడు కూడా ఇంకొకడుంటాడు. భయపడేవాడు ప్రతి మనిషికీ భయపడతాడు. ఎందుకంటే బ్రతకాలి కాబట్టి! ఆ బ్రతుకుతెరువు సక్రమంగా ఉంటుందో లేదో, ఎవడన్నా నా అదృష్టాన్ని దోచుకొని పోతాడేమో! అనేటటువంటి ఉద్దేశ్యంతో భయపడి భయపడి బ్రతుకు తుంటాడు.

ధైర్యంగా బ్రతికే అవకాశము మనిషికి లేదు. ఒక విషయం తెలిస్తే ధైర్యంగా బ్రతకవచ్చు. నేను పుట్టినపుడే నాకు అన్నీ నిర్ణయం చేయబడినాయి. ఏ కష్టాలైతే వ్రాసిపెట్టబడినాయో అవే వస్తాయి. ఏ సుఖాలు అయితే వ్రాసిపెట్టబడినాయో అవే వస్తాయి. దాన్ని ఎవ్వరూ మార్చలేరు. మధ్యలో ఎవ్వరూ కల్పించలేరు, అనే ధైర్యం ఎవరికైతే ఉంటుందో వానికి భయం ఉండదు. కానీ ఆ జ్ఞానం మనకు తెలియదు కాబట్టి, మనం భయపడుతూ బ్రతుకుచున్నాము. ప్రతిదానికి భయమే. ప్రతి దానికి భయమే, ఆ రకంగా భయపడుతూ ఏమి చేస్తారంటే, నన్ను ఏమనొద్దు అని, నన్ను బాగా చూసుకో, నన్ను ఈసారి బాగా బ్రతికేటట్టు చేయి, ఈ సంవత్సరం ఇంత లాభం

వచ్చేటట్లు చెయ్యి, అని మనం ఇతరులను ప్రాధేయపడుతున్నాము. ఇతరులకు భయపడుతున్నాము, ఒకడు భయపడే వాడుంటే ఎవరికో ఒకరికి భయపడాలి కదా! అట్లే భయపడి వాడేమన్నా చేస్తాడేమో నీకు, అని వాడి ద్వారా నీకు మేలు జరగాలని, నీవు నన్ను ఏమీ చేయవద్దు అని ప్రార్థన చేస్తున్నాము, అర్థమయ్యిందా!

ఇపుడు మనం భయపడేవాడు ఎవడు అని చూస్తే ఇతరులు భయపెడుతున్నారో లేదో గాని భయపడేవాడు మనిషే. వీడంతకు వీడు భయపడి, అనవసరమైన భయాలు కల్పించుకొని, వేరే వాళ్ళకు ఇదిగో నీకు పదివేల రూపాయలు లంచం ఇస్తాను. ఈ సంవత్సరం నన్ను ఏమనొద్దు అని ఇచ్చేసి వస్తున్నారు అర్థమయిందా. రౌడీలకు మామూళ్ళు ఇచ్చినట్లు, మనమేమి చేస్తున్నామంటే మాలాంటి స్వాములకో లేక పెద్ద దేవతలకో, ఎవరికో ఒకరికి బాగా చూసుకోమని ఎంతో కొంత ఇచ్చివస్తున్నారు. అంటే మేమేమో చేస్తాము మిమ్మల్ని అనీ, మేమేమో చెడ్డ చేస్తామనీ, చెడ్డ చెయ్యకుండా ఉండే దానికోసం లంచం ఇచ్చి కాపాడుకోవాలని చూస్తూ ఉన్నారన్నమాట. ఇంకా ఏమి చేస్తున్నారు అంటే లంచం ఇచ్చి బాగా జరుగుతాదేమో, మనం వాళ్ళతో మంచిగా ఉంటే వాళ్ళు ఏమన్నా బాగా చూస్తారేమో, మంచి చేస్తారేమో అనే ఉద్దేశ్యంతో కూడా మనం లంచాలు ఇచ్చేదానికి అలవాటుపడ్డాము.

ఇలా బ్రతుకుచున్నాడు మనిషి, నిన్ను ఎవరూ భయపెట్టకున్నాగానీ నీయంతకు నీవు భయపడి, ఆ భయాన్ని నీవు పోల్చుకొని నీవు ఏమి చేస్తున్నావంటే, ఒక దేవతనో లేకపోతే దయ్యాన్నో, లేకపోతే ఇంకో పెద్ద దేవతనో, ఇంకా పెద్ద దేవున్నో, ఎవరినో ఒకరిని అడ్డు పెట్టుకొని, వాళ్ళకు భయపడి నీకు అంతో ఇంతో ఇస్తాను నన్ను ఈ సంవత్సరం అంతా కాపాడు

అని మ్రొక్కడం జరుగుతుంది. వాస్తవంగా ఎవడైనా ఎవర్నైనా కాపాడుతాడా అంటే కాపాడేది ఏమీ లేదు. ముందే నీ తలరాతలో వ్రాసి పెట్టబడినదే నీకు జరుగుతుంది. దానిని మనం తెలుసుకోగల్గితే ఏమాత్రము భయపడ కోకుండా మనం ప్రవర్తిస్తాము. ప్రవర్తించడం అంటే నీవు వాళ్ళకు వ్యతిరేఖంగా చేయమని చెప్పలేదు. నీయంతకు నీవు బ్రతుకు, నీవు జ్ఞానం ఏదో తెలుసుకో, అట్లా లేకుండా నీవు ఏమి చేస్తూన్నావంటే, నీ బ్రతుకు నీవు వదిలి పెట్టేసి, వేరేవాళ్ళకు భయపడుతూ నీవు బ్రతుకుచున్నావు.

వాస్తవంగా నీ గతజన్మ చరిత్రలో ఏమైతే వుందో భవిష్యత్తులో అదే ఉంటుంది అని నీవు అనుకోకుండా వేరే రకంగా ఉంటుందేమో అని భయపడుతూ నీవు అజ్ఞానంలో మెలుగుతున్నావు. కాబట్టి నీవు వేరే వాళ్ళకు మ్రొక్కవలసిన పని వచ్చింది, అర్థమయిందా! ఆ రకంగా భయం అనేది ఒకటి వుంది. భయపెట్టేవాళ్ళు దేవతలు చాలామంది ఉన్నారు అని నీవు భ్రమించుకుంటున్నావు. నిన్ను ఏ దేవతలు భయపెట్ట లేరు. కానీ దేవతలను కల్పించుకొని, వాళ్ళు మాకంటే పెద్దవాళ్ళు, ఏమైనా చేస్తారేమోనని, నీవు ముందే భయపడి, వారు ఎవడూ ఏమీ చేయకుండా, ఎవరినో ఒకనికి పెద్దవానిని మ్రొక్కితే బాగుంటుంది అని మ్రొక్కుచున్నావు. నీవు ఒక్కనివి మ్రొక్కితే అందరూ మ్రొక్కుచున్నారు. ఈ విధంగా దేశంలో రకరకాల దేవతలనంతా మ్రొక్కేదానికి అందరూ అలవాటుపడ్డారు. ఆ దేవతలను మ్రొక్కడమే కాకుండా, తన్నేగౌడు ఒకడున్నాడు కదా మనకు, ఇప్పుడు వాడు ఇంతకు ముందంతా తన్నాడు, మళ్ళీ వాడు పోయినాడు, మళ్ళా వాడు కూడా ఇంకా ఏదైనా చేస్తాడేమోనని, వానికి కూడా ప్రతి సంవత్సరం మనం ఆ దినాలు చేసే దానికి అలవాటు చేసుకున్నాము. ఇట్లా ప్రతీది మీరు భయపడి భయపడి బ్రతుకుచున్నారు.

భయం అనేది మనిషికి ఉండకూడదు. భయం ఉంటే మనకు భగవద్గీతలో **'పరధర్మము'** అని చెప్పినట్లవుతుంది. **ధైర్యం** అనేది **'స్వధర్మము'** అని చెప్పారు. మనకు ఈ ధైర్యం దైవజ్ఞానం తెలుసుకుంటే వస్తుంది. దైవజ్ఞానం తెలుసుకుంటే అది పుట్టినపుడే నీ కర్మ నిర్ణయించపడి వుంటుందని, ఆ కర్మ ప్రకారమే చనిపోయేంతవరకు జరుగుతుందని, దానిని ఏ దేవుడు, ఏ దేవత మార్చలేరని, ఏ మనిషి మార్చలేరని, ఒకరికొకరు మార్చడానికి వీలులేదని నీకు తెలుస్తుంది. అప్పుడు నీవు ధైర్యంగా బ్రతకగల్గుతావు. ఆ రకంగా నీవు తెలుసుకున్నపుడు, ఇంకొకని భయం అనేది లేకుండాపోతుంది. నీవు స్వధర్మంలో బ్రతకగల్గుతావు. స్వధర్మం ఆచరించినపుడు నీకు ఈ జ్ఞానోదయం అవుతుంది. జ్ఞానము కల్గినపుడు దేవుడు నీకు తెలియబడతాడు, అని భగవద్గీతలో దేవుడు చెప్పడం జరిగింది. ఈ రకంగా భయపడే వాడు ఒకడు, భయపెట్టేవాళ్ళు ఎంతమందైనా ఉండవచ్చును. అంతే కదా! నీవు ఒక్కనివి భయపడితే వీళ్ళంతా నిన్ను భయపెట్టవచ్చు. కానీ నీ కర్మప్రకారం ప్రతీదీ జరుగుతాది అనే విషయం తెలియనపుడు, ప్రతిదానికి నీవు భయపడాల్సిన పని వస్తుంది.

జ్ఞానము తెలిస్తే ఏ దానికి నీవు భయపడకుండా ఉండేటటువంటి పరిస్థితి ఏర్పడితే, నీవు జ్ఞానివి అవుతావు దేవుని సాన్నిధ్యం నీకు ఏర్పడుతుంది. దేవుడు ఎటువంటివాడో అటువంటి స్థితి నీకు కల్గుతుంది. అటువంటి లక్షణాలు నీకు వస్తాయి. నీవు ఆయనలోకి ఐక్యము అయ్యేటటువంటి పరిస్థితి వస్తుంది. నీవు ఆయనలోకి ఐక్యం అయిపోతావు. ఐక్యం అయిపోతే, దేవునితోపాటు నీవు సమానమవుతావు, నీవే దేవుడవు, దేవుడే నీవు అయిపోతావు. ఆ స్థితి వరకు చేరగల్గుతావు. అపుడు నీకు భయం అనేది లేదు. ఇప్పుడు మనకు ఒక అనుమానం రావచ్చు. అది

ఏమనగా! మనకంటే భయముంది దేవునికి కూడా భయము ఉందేమో అని రావచ్చు, మన భయం కొద్దీ ఇటువంటి అనుమానం రావచ్చు. కానీ భయం లేనివాడు దేవుడు, దేవునికి ఏ భయము ఉండదు. నీకు భయము ఉంది. నీవు భయంతో బ్రతికితే ఎప్పుడూ పరధర్మంలో బ్రతికినట్లు అవుతుంది. భగవద్గీత కర్మయోగము 35వ శ్లోకములో **"పరధర్మంలో బ్రతికే దానికంటే స్వధర్మంలో మరణమైనా మేలు"** అని కృష్ణుడు చెప్పాడు. కాబట్టి దేవుడు దేనికీ భయపడేవాడు కాదు. ఇప్పుడు నీవు ఉన్నావు కాబట్టి నీవు భయపడుతున్నావు. ఇంకొకడు ఉన్నాడు కాబట్టి వాడు నిన్ను భయపెట్టవచ్చు. అంటే ఒకడు భయపడేవాడుంటే ఇద్దరు, ముగ్గురు, నలుగురు, ఐదు, పది, నూరు ఎంతమందైనా గానీ భయపెట్టేవాళ్ళు ఉండవచ్చు. లేకపోతే నిన్ను ఒకడైనా భయపెట్టేవాడు ఉండవచ్చు.

అజ్ఞానం ఉన్నంతవరకు భయపడేవాడు మాత్రం తప్పనిసరిగా ఉంటాడు. అజ్ఞానం లేకుండాపోతే ఏమీ లేదులే. మనం పూర్తి జ్ఞానులయ్యేంతవరకు భయం అనేది పోదు. భయం అనేది మన శరీరంలో గుణ చక్రంలో, గుణాలతోపాటు గుణంకాని గుణంగా ఉంది అని మనం చెప్పుకున్నాము. ఇంతలోతుగా ఎక్కడా మీకు అధ్యాయనం లేదు. ఇంతలోతుగా ఎక్కడా వివరంగా చెప్పలేదు. శరీరములో గుణచక్రం ఇట్లుందీ అని కూడా చెప్పలేదు. కాబట్టి మీకు ఏమి చెప్పుతున్నామంటే గుణచక్రంలో గుణాల మధ్యలో గుణంకాని గుణం అంటూ ఒకటుంది. దానిని భయం అంటాము. ధైర్యం కూడా ఒకటి వుంటుంది. దానికి వ్యతిరేఖమైన భయంలోనే మనము ఇరుక్కున్నాము. ఎక్కువ భయపడే బ్రతుకుతున్నాము సరే భయపడేవాడు ఒకడుంటే భయపెట్టేవాడు ఇంకొకడు ఉంటాడు. భయపెట్టే వానినే కదా తన్నేగౌడు ఉన్నాడని మీరు అంటుండేది. తన్నేగౌడు

ఉన్నప్పుడు అంతా వానికి భయపడినారు. వాడు చచ్చిపోయినా కూడా భయపడుతున్నారు.

భయపెట్టేవాళ్ళు భయపడేవారు ఉన్నారు. అట్లే దేవుడు భయపడే వాడు కాదు. కావున మూడు రకాలుగా ఉన్నారు చూసుకోండి **భయపడేవాడు, భయపెట్టేవాడు, భయపడని వాడు.** ఇప్పుడు భయపడే వాళ్ళము మనం, భయపెట్టేవాడు ప్రక్కనోడు కావచ్చు, ఇంకొకడు కావచ్చు, చచ్చిపోయిన తన్నేగౌడు కావచ్చు. భయపడే వాళ్ళము మనం, భయపడని వాడు ఎవడో ఒకడుండాలి కదా! ఉంటాడు. వాడు ఎవడు అంటే దేవుడు.

ఎక్కడో ఒకచోట మనము భయపడాల్సిందే కదా! సరే, నేనంటే భయపడతాను. తన్నేగౌడు అంటే భయపెడుతా ఉన్నాడు. తన్నేగౌడ్‌ని కూడా ఇంట్లో పెళ్ళాం పొరకతో కొడుతా ఉన్నదంట. పెళ్ళానికి అతను భయపడేవాడు. అందరినీ భయపెట్టె తన్నేగౌడు కూడా భయపడుతున్నాడు.

ఇప్పుడు ఒకనిని గుడ్డలు లేనివానిని, పుట్టగోసిపెట్టుకున్న వానిని ఏమంటారు అంటే, సన్యాసినో, ఏదో ఒకటి అనవచ్చు. అన్నీ విప్పిన వాడిని ఏమంటారు? వానిని ఏమనేదానికి వీలులేదు. ఆ రకంగా దేవుడు ఎటువంటి వాడు అంటే, ఆయనకు ఇదీ అదీ లేదు కాబట్టి ఆయనకు భయం లేదు అని చెప్పవచ్చు. 'ఆయనకు భయం లేదు' అనేదానిని మనం ఎలా చెప్పుకోవచ్చు అంటే, ఉదాహరణగా, నాశనం లేనివాడు కాబట్టి ఆయనకు భయం లేదు అని చెప్పాము. నాశనం అనేదానికి అర్థము ఇంతకుముందు మనం చాలాసార్లు చెప్పుకున్నాము. 'రం' అంటే నాశనం అనీ, 'రామ' అంటే నాశనం కాని వాడని చెప్పుకున్నాము కదా. 'రామ' అనే పదం చాలా విశేషమైన అర్థంతో కూడుకొన్నటువంటిది అని

చెప్పుకున్నాం కదా! 'రం' అంటే నాశనం కాబట్టి, 'నరం' అనే పదములో 'న' అంటే లేనిదని, 'రం' అంటే నాశనం అనీ, **'నరం'** అంటే నాశనం లేనటువంటి వాడు, లేకపోతే నాశనం లేనిది పరమాత్మ. **'నాశనం లేనటువంటివాడు దేవుడు'** అని స్త్రీలింగముగా చెప్పుకోవచ్చు, పురుష లింగముగా చెప్పుకోవచ్చు. కాబట్టి నాశనం లేనటువంటివాడు ఎక్కడున్నాడు అని అంటే ఎక్కడైనా ఉన్నాడు. ఆయన అంతటా వ్యాపించి ఉన్నాడు. ఎట్లున్నాడంటే 'రం' అంటే నాశనం, 'న' అంటే లేదు. రెండింటిని కలిపి 'రం' లేనటువంటి వాడు, అంటే నాశనం లేనటువంటి వాడు, నాశనం లేనటువంటి వానికి భయమే లేదు. నాశనం లేనటువంటి వానిని నరం, అని అనవచ్చు. నరం అందరిలోనూ ఉంది. నరాలు, నరం అనేది ప్రతి శరీరములోనూ ఉంది.

ఇప్పుడు శరీరములో నరాలు ఉన్నాయి. చనిపోయిన తర్వాత అవి నాశనం అయిపోతాయి కదా అని అడుగవచ్చు. దానికి జవాబు ఏమంటే అవి కనిపించేవి నాశనం అవుతుంటాయి. కానీ వానిలో ఉండే'శక్తి' నాశనం కాదు. నీ శరీరంలో నరాల్లో వ్యాపించిన శక్తి ఒకటుంది. అది నాశనం కాదు. కాబట్టి అది భయము లేనిది. ఎవరికీ భయపడదు. అటువంటి స్థితి నరములోన దేవునికి గలదు. అటువంటిదాని ప్రక్కన చేరితే నీకు కూడా భయం రాదు. కాబట్టి నా సహవాసం చెయ్యి, నీకు భయంలేదు. నన్ను స్మరించుకుంటూవుండు, నీకు భయం రాదు. నన్నే ధ్యాసలో ఉంచుకో, నీవు నా వలె భయపడవు. నా జ్ఞానమంతా నీకు తెలిస్తే, నేను ఇట్లుండానని తెలిస్తే నా ధ్యాస నీకు వస్తుంది. నన్ను నీవు అనుకుంటావు, కాబట్టి నీవు నా ధ్యాసే పెట్టుకోవాలంటే నా విషయమంతా నీకు తెలియాలి. నా విషయమంతా నీవు తెలుసుకో, అపుడు నీవు నా మాదిరి మారిపోయే

దానికి అవకాశం వుంటుంది. కాబట్టి ఈ 'నరం' అనేటటువంటి పేరు ఎక్కడొచ్చింది, అంటే అందరిలోనూ వ్యాపించి ఉన్నటువంటివాడని మనం దేవున్ని అనుకొంటున్నట్లు, ప్రతి శరీరములోనూ నరం అనే పేరు కలిగినవి ఉన్నాయి. ఆ నరం అనేటటువంటి దానిలోనే దేవుని శక్తి వ్యాపించివున్నది. కాబట్టి అందరి శరీరంలోనూ భయం లేనివాడు నరం రూపంలో ఉన్నాడు. దేవుడు ఆ భయం లేనివాడు అని చెప్పవచ్చును.

భయం ఉన్న జీవుడు శరీరములోనే ఉన్నాడు, భయం లేని దేవుడు శరీరములోనే ఉన్నాడు. నీ శరీరము ఉంది, నీ నరాల్లో అంతటా వ్యాపించి నటువంటి వాడు ఒకడున్నాడు. వాడు భయం లేనోడు. నీవు శరీరము అంతటా వ్యాపించి లేవు, నరాల్లో వ్యాపించి లేవు. ఒక్కచోట మాత్రమే ఉన్నావు. నీవు భయపడేవానివి. భయపడేవాడు శరీరములోనే ఉన్నాడు. భయము లేనివాడు శరీరములోనే ఉన్నాడు. భయపడేవాడు, భయం లేనివానిని ఆశ్రయించితే, బయపడే నీకు భయం లేకుండా పోతుంది. అంటే భయపడేవాడు, భయం లేని వానిని ఆశ్రయిస్తేనే భయం లేకుండా పోతుంది. నీ దృష్టి అంతా ఎక్కడ పెట్టుకోవాలి. తిరిగి మళ్ళీ శరీరములోకే వస్తుంది. మొదటినుంచి అదే చెప్పుకుంటున్నాము మనం. నీవు ఎక్కడ ఉన్నా, దృష్టి శరీరములోకి రావాల్సిందే. ఎవడైతే ప్రపంచమంతా వ్యాపించి, భయం లేకుండా దేవుడని అనిపించుకున్నాడో వాడు నీ శరీరములోనే ఉన్నాడు. ఎక్కడో పోవాల్సిన పని ఏమీ లేదు. అంత గొప్పవానిని నీ ప్రక్కలో పెట్టుకొని కూడా, ఆయనను మరచిపోయి, ప్రక్క శరీరంలో జీవునిగా ప్రక్క నుండే వానికోసం నీవు భయపడుతున్నావు. అందువలన నీవు ఎప్పటికైనాగానీ, ఈ జ్ఞానము తెలుసుకొని భయం లేనటువంటివాడు నా శరీరంలో ఉన్నాడు. నేను వానిని ఆశ్రయిస్తే సరిపోతుంది. ఏ దానికి ఏ

విషయానికి నేను భయపడాల్సిన పని లేదు, అని నీవు ఎప్పుడైతే తెలుసు కోగలుగుతావో అపుడు అతని కోసం నీవు ప్రయత్నం చేస్తావు. ఎవరికోసం 'రం' అంటే నాశనం లేని వాడికోసం, అంటే నాశనం లేని వానికోసం నీవు ప్రయత్నం చేస్తావు. నాశనం లేనటువంటి వాడు నీ శరీరంలోనే 'నరం' అనే పేరుతోనే నరంలోనే ఉన్నాడు. మళ్ళీ వానిని తెలియాలంటే ఇప్పుడు నరాన్ని పట్టుకొని చూస్తే సరిపోతుందా? అని అంటే అట్లా కూడా తెలియదు. పైన స్థూలంగా ఉండే నరం కన్పిస్తుంది గానీ సూక్ష్మంగా ఉండే శక్తి కనిపించదు.

నరములోని శక్తిని మనం బుద్ధితో గ్రహించుకోవాలి. చెప్పిన విషయాన్ని బుద్ధితో గ్రహించుకోవాలి. విషయాన్ని బుద్ధితో గ్రహించు కోగల్గితే, నరంలో ఉండే శక్తి మనకు తెలుస్తుంది. నరంలో ఉండే శక్తిని మనం బుద్ధి ద్వారా గ్రహించుకోవాలంటే ఎదుటి మనిషి చెప్పితేనే గ్రహించు కోవాలి ఎదుటి మనిషి సరైన జ్ఞానము చెప్పుతాడు అని ఏమి గ్యారంటీ ఉండదు. ఎందుకంటే ముందు దేవుడే **'ఏ మనుషులకు నా జ్ఞానం తెలియదు'** అని చెప్పినాడు. ఇప్పుడు అది చిక్కు సమస్య వచ్చింది. ఎదుటి మనిషి చెప్పితే అది జ్ఞానము కావచ్చు లేక కాకపోవచ్చు. ఎందుకంటే ఎదుటి మనిషి మనిషి కావచ్చు మనిషి కాకుండా పోవచ్చు, ఎక్కడైనా గానీ ఒకచోట భగవంతుడు చెప్పితే మీరు గ్రహించుకోవాలి. అలా గ్రహించు కున్నపుడు మీకు తెలియబడుతుంది. అంతటా మనుషులే చెప్పుతారని ఏమీ లేదు. కృష్ణుడు మనిషిగా వచ్చినాడు, చెప్పినాడు, పోయినాడు. అపుడు మనం ఆయనను మనిషిగా లెక్కవేసుకొంటే మనం పప్పులో కాలేసినట్టే! ఆయన మనిషిగా చెప్పినాడు కదా మనిషి కాబట్టి ఆయన చెప్పింది కరెక్టు కాదు అనుకొంటే, అది పోయినట్టే మనము అది పోగొట్టుకున్నట్లే!

అవుతుంది. అంతవరకు మనుషులు ఎవరు చెప్పినా, దానిని ప్రక్కన తీసిపెట్టుకో అది కరెక్టుకాదు అనుకోవచ్చు. కానీ కృష్ణుడు చెప్పినది ఆయన మనిషే కదా! అని అనుకుంటే మాత్రము నీవు పోగొట్టుకున్నట్లే అవుతుంది. ఎందుకు అంటే, చెప్పేవాడు కూడా మనిషిగానే చెపుతాడు. మనిషి కానివాడు ఎవడు అయినా కావచ్చు అది ఎవరికి వారు తెలుసుకునే విషయం. దేవుడు తప్ప ఎవరూ దానిని విప్పి చెప్పలేరు. కాబట్టి ఇది కరెక్టయిన జ్ఞానము అగును. దానినే జ్ఞానాన్ని మనము తెలుసుకోవాలి. కానీ ఈ రోజు ఈ ప్రజలు ఏమి చేశారంటే మానవులకు ఈ జ్ఞానము చెప్పుతున్నాను, అని దేవుడు చెప్పితే మేము మానవులము అని అనుకోలేదు. వాళ్ళంతా హిందూ మతస్థులు, మేమంతా క్రైస్తవ మతస్థులం, వాళ్ళంతా ముస్లీమ్‌లు అని అనుకుంటున్నారు. ఇట్లా విభజించుకున్నారు మనుషులు.

దేవుడు మనుషులు అని చెప్పినాడుగానీ క్రైస్తవులకు, ముస్లీమ్‌లకు, హిందువులకు అని ఎక్కడైనా చెప్పాడా, లేదు. భగవద్గీతలో **సమస్త మానవులకని** చెప్పాడు. ఒకరిని అడ్డం పెట్టుకొని అందరికీ అని చెప్పినాడు. ఆయన ఖురాన్ చెప్పేటప్పుడు. "ఇది సమస్త మానవులకు వర్తించే బోధ" అని చెప్పినాడు. ఈ విధంగా అందరికీ పనికి వచ్చే రకంగా చెప్పినారు గానీ, ఇది ప్రత్యేకించి వీళ్ళకు, వాళ్ళకు అని ఎక్కడా చెప్పలేదు. కానీ మనుషులు ఏమి చేశారంటే ఇది మాది అని హద్దు గీసి పెట్టుకున్నారు. మా గుంపులో చెప్పేవాడే కరెక్టు అని అనుకున్నారు. వాళ్ళ గుంపులో ఎంతమందన్నా మనుషులు చెప్పనీ, అదంతా కరెక్టు అనుకుంటారు. ఒకవేళ దేవుడే ఎక్కడన్నా వచ్చి వేరే గుంపులో నుండి చెప్పినాడు అనుకోండి. అపుడు ఏమవుతుంది? అది కానేకాదు అంటారు. నీ గ్రంథములోనిది

వేరే గుంపులో నుండి, వేరే మతంలో ఉండి చెప్పితే, నీవు దానిని కాదు అనుకుంటే నీకే కదా నష్టం. నీవే పొరపాటు పడినట్టు! అపుడు దేవుడు కూడా ఏమి చేస్తాడంటే నీ కర్మ నీవు పో! నీవు ఎట్లయినా పో! అనుభవించు పో! అని చెపుతాడు. నేను చెప్పేది చెప్పినాను, మీరు అర్థం చేసుకోలేదు అంటాడు. దేవుడు అపుడు కూడా నాది కరెక్టురా! వేరే వాళ్ళు ఎవరూ లేరు, నేను తప్ప అని చెప్పడు, కానీ అందరితో పాటు సమానంగా చెప్పుతాడు. అపుడు నీ బుద్ధితో నీవు గ్రహించుకోవాలి. ఖుర్‌ఆన్‌లో **"నా జ్ఞానమును బుద్ధి, జ్ఞానము ఉన్నటువంటి వాడే గ్రహించుకుంటాడు"** అని చెప్పినాడు కదా!

కాబట్టి నీ బుద్ధి కొద్దీ నీవు గ్రహించుకోవాల్సిందే గానీ, వేరే ఏమాత్రం అవకాశంలేదు. ఇప్పుడు నేను కొన్ని బోధలు చెప్పుతున్నాను. అంతకు ముందు పోయిన నెలలో ఏమి చెప్పినాము. మేము చెప్పేదంతా కరెక్టు అని మీరు నమ్మవద్దండి ఎందుకంటే మనుషులు చెప్పేది ఎక్కడైనా గానీ పొరపాటు ఉండవచ్చు. కానీ దేవుడు చెప్పేది వాస్తవం. దేవుడు చెప్పేది దేవునికి తప్ప ఈ జ్ఞానము ఎవరికీ తెలియదు. మన మనుషులు చెప్పినది అంతా కరెక్టు అని నమ్మకం లేదు. కాబట్టి అసత్యం కావచ్చు, సత్యం కావచ్చు. రెండు రకాలుగా ఉంటుంది. అయితే ఒకటి మాత్రం సత్యం, ఎక్కడో ఒకచోట ఆయన తెలియజేస్తాడు. తెలియజేసినపుడు మనం గ్రహించుకోవాలి. అపుడు కూడా గ్రహించుకోలేదనుకోండి, అనవసరంగా నీవు వృథా చేసుకొన్నట్టే. దానిని మరి ఎవరు ఎక్కడ చెప్పుతారు అనేదానికి నీకు ఒక రూఢి ఉందా. లేకపోతే ఒక గుర్తింపు ఉందా అంటే, ఎటువంటి గుర్తింపు ఉండదు. గుర్తింపు నీవు కనుక్కొనే దానికి అవకాశమే లేదు.

కాబట్టి ఇంతకు ముందు నేనేమి చెప్పినాను. నేను చెప్పే మాటలన్నీ పూర్తి నమ్మవద్దు అని చెప్పినాను. ఇంకోమాట కూడా చెప్పినాను, నేను తప్ప ఎవరూ నిజం చెప్పరు అని కూడా చెప్పినాను. రెండు మాటలూ నమ్మకూడదు. ఇపుడు ఏమి వాస్తవం చెప్పుతున్నామంటే, వాస్తవంగా ఏది నమ్మకమో, ఏది నిజమో ఏది అబద్ధమో నాకు కూడా తెలియదు అని చెప్పుతున్నాము.

కాబట్టి మనమేమి చేయాలంటే మీ శ్రద్ధకొద్దీ, మీ జ్ఞానము కొద్దీ మీరు ఆలోచన చేసి ఏది సత్యం, ఏది అసత్యం అని తెలుసుకోవాలి. కొందరు ఒక నాలుగు ఐదు భగవద్గీతలు చదివినారు. చివరకు ఈ **"త్రైతసిద్ధాంత భగవద్గీత"**ను చదివినారు. ఇది గొప్పది అని అన్నారు. ఇంకా కొంతమంది వేరే మతస్థులు కూడా ఉన్నారు. వాళ్ళు ఈ గ్రంథాలు ఆ గ్రంథాలు అన్ని గ్రంథాలు చదివినారు. కానీ ఏ గ్రంథాలు చదివినా తృప్తిగా లేదు. కానీ ఈ గ్రంథాలు చదివితే తృప్తి వచ్చింది. ఇది వాస్తవమైన జ్ఞానమనీ, వాళ్ళు దానిని గొప్పగా చెప్పుకుంటున్నారు. అయినా మనమే మంటున్నామంటే, మీరు అన్నీ చూడండి. చూసిన తరువాత ఒక నిర్ణయానికి రండి. ఆ నిర్ణయం కూడా మీ శ్రద్ధనుబట్టి ఉంటుంది, మీ బుద్ధినిబట్టి ఉంటుంది. ఇంతకుముందు గతంలో కూడా చెప్పాము. జ్ఞానం చివరకు దేవుడు తెలియజేస్తేనే వస్తుంది. దేవుడు తెలియజేసే దానికి నీకు శ్రద్ధ ఉండాలి. శ్రద్ధ బుద్ధిని బట్టి వస్తుంది. బుద్ధి, శ్రద్ధ రెండూ ఉంటేనే జ్ఞానము తెలుస్తుంది. ఈ శ్రద్ధ కూడా ఎట్లుంటుంది అని అంటే, దేవుడు శ్రద్ధ తెప్పించి, శ్రద్ధ ద్వారానే నీకు జ్ఞానము కలిగేటట్లు చేస్తాడు. శ్రద్ధ లేకుండా ఎవరికీ జ్ఞానము కలగదు. కాబట్టి నీకు శ్రద్ధ కలిగేటట్టు నీవు దేవున్ని నమ్ముకో.

దేవుడు నిన్ను ఇబ్బంది పెట్టి, ఎక్కడా దిక్కు తెలియకుండా చేసి, చిట్టచివరి దారి ఇదే అంటే, అపుడు కుదరదు నీకు. అట్లా లేకుండా నీవే ఒక నిర్ణయానికి వచ్చి, దేవున్ని తెలుసుకొనేదానికి ప్రయత్నం చేసుకో, అపుడు బాగుంటుంది. లేకపోతే నీ అవసరాన్ని బట్టి నన్ను అనుకుంటున్నావురా అని అంటాడాయన. చాలాసార్లు మీరు **దేవుని జ్ఞానాన్ని తెలుసుకోండి, దేవుని సేవ చేయండి.** దేవుని విషయాలు బయటకు తెలియజేయండి. అదే పెద్ద సేవ అవుతుంది. అంతకంటే మించిన సేవ లేదు అని చెప్పాను. నా మాట వినకుండా పూజ చేస్తే బాగుంటుందని దేవునికి పూజ చేసినారు అనుకో. దేవుడు ఏమనుకుంటాడంటే వీని అవసరానికి నన్ను పొగుడుతా ఉన్నాడు, వీడు పొగిడి నన్ను ఉబ్బిస్తున్నాడు. నీవు అంతటోనివి ఇంతటోనివి, గొప్పోనివి అని, నేను విని, నీ మాటలకు ఏమీ పొంగి పోను అని అనుకుంటాడట. నిన్న టీవీ చూస్తుంటే ఒక స్వామీజీ ఇంతకు ముందు భగవద్గీత చెప్పినాడట, దేవుడు గొప్పోడు అన్నాడు. అంతా దేవునికంటే చిన్నోళ్ళని చెప్పినాడు అయితే నిన్న వినాయక పండుగకు వినాయకుడు పెద్ద దేవుడు, ఈయనకు మించిన దేవుడు లేడు. ఆది దేవుడంటే ఈయనే మొదట అంతా మ్రొక్కాల్సింది ఈయనకే. ఈయనకు మొట్ట మొదట మ్రొక్కిన తర్వాత, మిగతా దేవుళ్ళకు ఎవరికైనా మ్రొక్కవచ్చు! ఏ దేవుడైనా గానీ ఈయన తర్వాతనే, కాబట్టి ఈయనే ఆది దేవుడని చెప్పుతున్నాడు. ఆయన ముందు చెప్పినమాట ఏమయింది? మళ్ళీ ఇప్పుడు చెప్పినమాట ఏమయింది? అప్పుడు ఒకమాట, ఇపుడు ఒకమాట అవసరాన్నిబట్టి మాట్లాడతారన్న మాట.

ఇది ఎలా ఉందంటే, వెనుకటికి ఒకాయన రామాయణం డ్రామాలో రావణబ్రహ్మ వేషం వేసినాడన్నమాట. తరువాత మళ్ళీ భారతంలో

దుర్యోధనుడి వేషం వేసినాడు, ఏమిరా! అదేదో ఆ రోజు నేను రావణ బ్రహ్మను, అట్లా ఇట్లా నేను గొప్పోన్ని, నేను జ్ఞానిని అంటివి. ఈ రోజు జ్ఞానము లేకుండా మాట్లాడుతున్నావే అని అంటే, ఆ పోర్షన్ వేరు, ఈ పోర్షన్ వేరు అన్నాడంట. అది రావణబ్రహ్మ పోర్షను, ఇదొచ్చి దుర్యోధనుడి పోర్షను. దీనికి జ్ఞానము అవసరం లేదు. దానిలో అపుడు జ్ఞానము అవసరం కాబట్టి జ్ఞానము మాట్లాడాలి. దీనిలో జ్ఞానం అవసరం లేదు. ఈ పోర్షన్ వేరు, ఈ పద్యం వేరు. ఆ పోర్షన్ వేరు, ఆ పద్యం వేరు అని చెప్పాడంట. అట్లాగా! ఇంకొకడు ఏమి చేసినాడంటే, ఇంకా కొంతమందితో కలిసి ఒరే! ఇట్లాంటివన్నీ ఒక్కొక్క డ్రామాలో ఒక్కొక్కటి చెప్పకూడదు. అన్ని డ్రామాలు కలిసి చెప్పాలనుకొన్నాడంట. అప్పుడు మహాభారతం డ్రామా వేసి రావణాసురుని పద్యం చెప్పినాడంట! అట్లెట్లా ఒప్పుకుంటారు ప్రజలు? ఒరే! అది రామాయణం నీవు చెప్పేది భారతం కదా! భారతం పోర్షన్ పెట్టుకొని రామాయణం పద్యం చెప్పితే ఎలాగౌతుంది" అన్నారన్నమాట. ఈ రకంగా హెచ్చు తగ్గులు చేసుకొండేవాళ్ళు ఉన్నారు. అట్లాకాకుండా ఎక్కడ చెప్పినా, ముందు చెప్పినా, వెనకాల చెప్పినా ఒక్కటే మాట, ఒక్కటే పద్ధతి, ఒక్కటే ధ్యాస, ఒక్కటే కరెక్టు ఒకటే ఇది వుండాలి. అట్లా లేకుండా కొంతకాలం ఒకటి చెప్పి, ఇంకా కొంతకాలం మరి ఇంకొకటి చెప్పితే ఏమౌతుంది అంటే హెచ్చుతగ్గులు అయిపోతాది. ఇప్పుడు ఈ కాలంలో స్వామీజీలంతా అదే చెబుతున్నారు. హిందూమతములో స్వామీజీలు ఒక దేవుని దగ్గర ఊరేగింపు గురించి ఆ దేవున్ని గురించి చెబుతారు. మళ్ళీ ఇంకో పండుగకు వచ్చినప్పుడు, ఇంకో దేవుని ఊరేగింపులో దానికంటే మించిన దేవుడు లేనే లేడు అని ఆ దేవున్ని గురించి చెప్పుతారు. ఇంతకు ముందు ఒక దేవున్ని చెప్పినారు. ఇప్పుడు ఈ దేవుని గురించి చెబుతావున్నారు.

ఒకసారి హైదరాబాద్‌లో మిలటరీ గ్రౌండ్ (పెరేడ్‌గ్రౌండ్)లో జరిగిన కార్యక్రమానికి, వెంకటేశ్వర స్వామి కళ్యాణం అని పేరుపెట్టినారు. 3, 4 సంవత్సరముల క్రితం తిరుపతి వెంకటేశ్వర కళ్యాణం ఉత్సవం అని ఆ వెంకటేశ్వరుని పెట్టినట్లు ఇక్కడ పెట్టి గుడి మాదిరికట్టి అక్కడ ఉత్సవం చేసినట్లు చేసినారు. అపుడు ఒకాయన చెప్పుతున్నాడు. ఈ శ్రీనివాసుడంటే ఎంత గొప్పోడు! వెంకటేశ్వరుడు అంటే ఇట్లాంటివాడు, అట్లాంటివాని కొండలు ఇట్లా, ఆయన నామం ఇట్లా అని అంతా చెప్పుతున్నాడు. అంతా మన **"ప్రబోధ"** గ్రంథములో వ్రాసినట్టు మొత్తము చెప్పుతున్నాడన్న మాట. టీవీలో వింటున్నాం మనం, అంతా మన "ప్రబోధ" గ్రంథంలోనిదే కదా! అని అనుకుంటున్నాము. "ప్రబోధ" గ్రంథములోనిదే చెప్పుతున్నాడన్నమాట. అంతా చదివి బాగా నీట్‌గా ఆ మూడు నామాల గురించి, ఎర్రనామాల గురించి, తెల్లనామాల గురించి, ఏడుకొండలు గురించి ఇవన్నీ చెప్పినాడన్న మాట. బాగా చెప్పుతూవున్నాడంటే, మన గ్రంథములోని జ్ఞానమే, ఎలాగైతేనేం, జ్ఞానము బయటకు తెలియజెప్పేది ఒకటేకదా! అని మనం అనుకున్నాము. అపుడు ఆయన టీవీలో చెప్పినపుడు నుదుట పెద్ద నామాలు పెట్టి చెప్పుతున్నాడాయన ఆయనకు శ్రీనివాస రావ్ అనే పేరుంది. మళ్ళీ మనవాళ్ళు ఏమి చేసినారంటే ఇద్దరు భక్తులు మళ్ళా మరుసటి రోజు ఆయన ఎక్కడో వుండేది అడ్రస్ కనుక్కొని ఆయన ఇంటికి పోయినారు. "మీరు నిన్న చెప్పినది చాలా బాగా చెప్పినారు. శ్రీనివాస కళ్యాణంలో చాలా గొప్ప విషయాలు చెప్పినారు. శ్రీనివాసుడి గురించి, కొండలు గురించి, నామాలు గురించి చాలా బాగా చెప్పినారు అవి ఎక్కడ దొరకుతాయి. మాకు ఏమన్నా గ్రంథముంటే ఇస్తారా!" అని అంటే "అవి మీకు దొరికేవి కావు, వేదాలలోనివి ఇవి" అని చెప్పినాడు. ఆ వేదాలే ఇవ్వండి అంటే, అవి మీకు అర్థమయ్యేవి కాదు. అవి సంస్కృతంలో ఉంటాయి అన్నాడు. ఇలా చెప్పి మభ్యపెట్టినాడు.

ఇంకొక విషయం ఏమంటే ఇక్కడ చెప్పినపుడేమో నామాలు పెద్దవి పెట్టినాడాయన. ఇంటి దగ్గరకు పోతే విభూతి పెట్టుకున్నాడు. ఇదేంటి స్వామి అక్కడ నామాలు పెట్టి, ఇక్కడ విభూతి పెట్టినావు అని అడిగితే “సమయానుకూలంగా పోతువుండాలి, పొద్దు మూకులు అవే అనుకుంటే ఎట్లవుతుంది? అని చెప్పినాడు. చూడు! ఇట్లా ఉన్నారన్నమాట! ఒకచోట నామాలు, ఒకచోట విభూది పెట్టి ఒకచోట ఒక దేవున్ని గురించి చెప్పి, ఇంకొక చోట వేరే దేవున్ని గురించి చెప్పితే అది ఏమి బాగుంటుంది? అట్లా ఇప్పుడు ఈ సమాజమంతా తయారైపోయింది. జ్ఞానమంతా ఇట్లా కలుషితము అయిపోయింది. అట్లాకాకుండా ఒకే పద్ధతి, ఒకే నమూనా ఒకే సిద్ధాంతంగా ఉండేటటువంటి జ్ఞానాన్ని మీరు తెలుసుకోండి. ఆ రకంగా తెలుసుకొంటే మీకు అసలైన జ్ఞానము లభ్యమౌతుంది. అసలైన దేవుని జ్ఞానము లభ్యమయినపుడు, నీవు తన్నేగొడుకు భయపడాల్సిన పనే లేదు. సంవత్సరమునకు ఒకసారి దినాలు చేయాల్సిన పని లేదు. దినాలు చేసేటప్పుడు కరెంట్ షాక్ కొట్టి ఇంతమంది చచ్చిపోయారు. నీళ్ళలో పడి ఇంతమంది చచ్చిపోయారు. ఆ పిండాకూడు పెట్టే వీడు కొట్టకపోయారు అనేది లేకుండా, ఇంతమంది చచ్చిపోయేది లేకుండా, మీరు ఒక పని చేసుకోండి దేవుని జ్ఞానాన్ని నమ్ముకోండి. దేవున్ని నమ్ముకోండి.

మనకు భగవద్గీతను దేవుడు అందించాడు కదా! మీరు మళ్ళీ భగవద్గీత చదువుకోండయ్యా! దానిలో ఈ విధముగా లేదు. ఇదే పెట్టు, అదే పెట్టు అని ఏమీ చెప్పలేదు. పుష్పం, ఫలం, తోయం అని ఒక పువ్వుగానీ, ఒక కాయగానీ లేదంటే నీళ్ళు గానీ చివరకు ఏదో ఒకటి ఇవ్వండి నేను ఏమీ అడగను అని చెప్పినాడు. పిండాకూడు పెట్టాల్సిన అవసరం లేదు నాకు, అని చెప్పినాడా లేదా ఆయన. అంతపెద్ద గ్రంథము

ఇచ్చి అంతగొప్ప దేవుడు మీకు చెప్పితే ఇది విడిచిపెట్టి, ప్రక్క విషయాలకు పోతున్నారు. ఇతర దేవుళ్ళను మానుకొని ఇప్పుడు ఈ అసలైన దేవుని గురించి తెలుసుకుంటే సరిపోతుంది. అసలైన దేవుడు గురించి మనం ఎట్లా తెలుసుకోవాలని ప్రయత్నం చేస్తే, ఇప్పుడొక చిన్న సూత్రం చెప్పినాను కదా! నరం అని, 'రం' అంటే నాశనం.'న' అంటే లేదు. నాశనం లేనటువంటి వాడు ఎక్కడున్నాడంటే నీ శరీరంలోనే ఉన్నాడు. నీ శరీరములో అంతటా వ్యాపించి ఉన్నాడు. శరీరం అంతా వ్యాపించి తలమీద స్పర్శ ఉంది అంటే అక్కడ వరకూ ఉన్నాడు. అది గోరు వరకు స్పర్శ ఉంది అంటే అక్కడ వరకు ఉంటాడు. మళ్ళీ అంతటా వ్యాపించినటువంటి దానిని గోరు. నుంచి నఖ శిఖ పర్యంతం అంటారు. శిఖ అంటే జుట్టు, నఖ అంటే గోరు, అంటే జుట్టు నుండి గోరువరకు వ్యాపించినటువంటి వాడు నీ శరీరంలోనే ఉన్నాడు. వానికి భయం లేదు. వానికి నాశనం లేదు. నాశనం ఉంటేనే కదా భయపడేది. నాశనం లేనివాడు భయం లేనివాడు నీ శరీరములో ఉన్నాడు. నీవు ప్రక్కలోనే ఉన్నావు కాబట్టి ఎందుకు భయపడాల్సి వచ్చింది. అందుకే మీరాబాయి ఒక గీతం చెప్పింది. **"ఎందుకు భయపడుతున్నావు నీవు అనవసరంగా, ఏమి పోయింది? నీవు వచ్చేటప్పుడు ఏమి తెచ్చుకొన్నావు. ఇక్కడికి వచ్చి ఏమి పోగొట్టుకున్నావు నీవు"** అని కాబట్టి ఏమీ పోగొట్టుకోలేదు, ఏమీ తెచ్చుకోలేదు. నీకు వుండే దానితో తృప్తిపడు.

కాబట్టి నీవు ధైర్యంగా బ్రతుకు. అదే విషయాన్ని మనకు భగవద్గీతలో కర్మయోగమను అధ్యాయమున 35వ శ్లోకంలో **"స్వధర్మం, పరధర్మం"** అనేటటువంటి శ్లోకాన్ని చెప్పి, ఈ **"పరధర్మంలో ఉండే భయంకన్నా స్వధర్మంలో మరణమైనా మేలు"** అన్నాడన్నమాట. కాబట్టి ఆ

భయపడి బ్రతికే దానికంటే, భయం లేకుండా బ్రతుకు, ఫరవాలేదు అని చెప్పినాడు. భయం లేకుండా బ్రతకాలంటే ఎట్లావస్తుంది? ఆ భయం లేని బ్రతుకు ఎప్పుడొస్తుంది? మామూలుగా జ్ఞానం తెలియనంతవరకూ రాదు. జ్ఞానము తెలిస్తేనే అది వచ్చేది. నీకు జ్ఞానం తెలిసినపుడే ధైర్యం వస్తుంది. ఏది జరగాలో అది జరుగుతుంది. నీవు భయపడాల్సిన పని లేదు. జ్ఞానము తెలియలేదు అనుకో ఇట్లా చేస్తే ఏమో, అట్లా చేస్తే ఏమో, అట్ల వస్తుందేమో ఇట్లా వస్తుందేమో, ఏదన్నా కష్ట మొస్తుందేమో అని ప్రతి నిత్యం భయపడుతూ ఉంటావు. ప్రతి నిత్యం నీవు ఇతరులను ప్రార్థన చేస్తుంటావు.

నన్నేమీ అనవద్దండి, నన్ను బాగా చూసుకోండని ఇతర దేవతలను అడగలేదా చెప్పు? అంతా అనుకొనే వాళ్ళే ఉన్నారు. మేము ఎవ్వరికీ భయపడం. భయము లేనివాడు మా ప్రక్కలోనే ఉన్నాడు. వానిని చూస్తే వాడు ఎట్లున్నాడో మనము అట్లుండవచ్చు. ముందే మనకు కర్మ అనేది ఒకటి నిర్ణయమై ఉంది. అది ఏమి తినాలో, ఏమి తాగాలో ఎక్కడ క్రిందపడాలో, ఎక్కడ మీద పడాలో, ఎక్కడ ఇబ్బందిపడాలో, ఎక్కడ కష్టపడాలో, ఎక్కడ సుఖపడాలో అన్నీ ముందే నిర్ణయం అయివున్నాయి. దానిప్రకారమే జరుగుతాయి అని ఒక నిర్ణయమైనపుడు, ఒక రూఢీగా తెలిసిపోయినపుడు, ఇక రెండోదాని గురించి చింతించవు. ఎవడో ఏమో చేస్తాడు అని అనుకొంటే, నీకుంటే కదా అది జరిగేదది. అదే కర్మయోగం అనే అధ్యాయములో 35 వ శ్లోకంలో మేము వ్రాశాము. ఎవరో ఏమో చేస్తారని మమ్మల్ని కూడా భయపెట్టినారు కొందరు. ఒకవేళ జరిగేది ఉంటే, అట్లేకానీలే అని చెప్పినాము. ఎవరో వచ్చి ఏమో చేస్తారంటే, ఒకవేళ చేసేది ఉంటే, చెయ్యనీలే, దానికేముంది. జరిగేది ఉంటే ఖచ్చితంగా

జరుగుతాది. అని చెప్పినాము, భగవద్గీతలో అదే వ్రాశాము. వేరే వాళ్ళు భయపెట్టినారు, భయపెట్టినా నాకేమీ భయం, ఉంటేనే కదా! జరిగేది. అసలుకు భయము అనేది ఆ రోజే లేదు. అంతకు ముందే లేదు. భయపడాల్సిన పని లేదు. ఒకవేళ అట్లుంటే అట్లే జరుగుతుంది ఎవరేమి చేసేదానికి కాదు. దాని గురించి మనమెందుకు భయపడాలి? కాబట్టి వదిలేశాము. భయమనేది లేదు. కాబట్టి నేను ఎట్లా ధైర్యంగా ఉన్నానో మీరు కూడా అట్లే ఉండమని చెప్తున్నాముగానీ ఇంకొకటి ఏమీకాదు. నేను ధైర్యంగావున్నా, ఎవరికీ భయపడలేదు.

మీరు భయపడాల్సినది దేవునికి ఒక్కనికే. దేవుని జ్ఞానానికి, కర్మకు. భయపడు అంటే జ్ఞానం తెలుసుకో కర్మకు భయపడు. జ్ఞానము తెలుసుకో, దేవున్ని తెలుసుకో. కాబట్టి దీనికి మనం తలొగ్గి పోవాలి గానీ, ఈ తన్నేగౌడుకు ఏమి భయపడాల్సిన పని లేదు. తిట్టేవాళ్ళకు భయపడద్దండి, తన్నేవాడికి భయపడద్దండి. రకరకాలుగా ఉన్నారు. మామూలుగా ప్రపంచంలో వాళ్ళకెవరికీ మీరు భయపడవద్దండి. అట్లా భయపడితే ఇతనికి పావలా ఇవ్వాలి, వానికి అర్ధరూపాయి ఇవ్వాలి. ఇంకొకనికి రూపాయి ఇవ్వాలి. లేకపోతే వాడు భయపడిస్తాడు, వీడు తంతాడు, వాడు ఇంకొకడు తిడతాడు. కాబట్టి ఈ రామాయణాలు ఉంటాయి. మామూలుగా నీవు భయపడకపోతే వీనికి పావలా ఇచ్చేది లేదు. ఇంకొకనికి ఏమీ ఇచ్చేది లేదు కదా! నేడు జ్ఞానము తెలిసినవాడు అందరికీ ఇచ్చేదంతా విడిచి పెట్టినారు. ఇంతకు ముందంతా చాలా ఖర్చుపెట్టుకుంటా ఉన్నారు. నెలకొకసారో, సంవత్సరానికి ఒకసారో ఇచ్చేవారు ఇప్పుడు అన్నీ విడిచి పెట్టినారు ఎవరికీ ఇచ్చేది లేదు అని నిర్ణయించుకొన్నారు.

కాబట్టి మంచి పనైంది ఇప్పుడు. ఆ లెక్కప్రకారం పోతే, మేమంటే మొదట నుంచి ఇచ్చేది లేదు. ఇప్పుడు మీరు దానిలో నుంచి తప్పించు కున్నారు. మీరు చిన్న చిన్నవి ఇచ్చేవాళ్ళు. మొట్టమొదట మా పెద్ద వాళ్ళు ఏమి చేసేవారంటే, సంవత్సరముకు దేవతలకు మ్రొక్కుకొని రెండు మూడు పొట్టేండ్లు, వారికిచ్చి దేవర చేసి బంధువులందరిని పిలిచి, అందరికీ భోజనము పెట్టేవాళ్ళు. మాకు బుద్ధి వచ్చిన తరువాత ఇదంతా పనికిమాలిన పని అని మేము విడిచిపెట్టినాము. అలా విడిచిపెడితే, నీవు ఆ పేరు పెట్టుకున్నావు, ఆ దేవత పేరు పెట్టుకున్నావు. నీవు మ్రొక్కే తీరాలి, బలి ఇచ్చేతీరాలి అని అంటే, ఆ పేరు వద్దని తీసివేసినాము. వీడు అన్నిటినీ విడిచినోడు అని అన్నారు. అన్నిటికీ విడిచినోడు కావాలనే మేము చెప్తా వుండేది. తండ్రి చనిపోయినపుడు నెత్తిగొరిగించుకోవాలి. దేనికి గొరికించు కోవాలి? అయితే నేను గొరికించుకోను అని చెప్పినాము. అంతేకాకుండా దినాలు చేయాలి అంటే నేను చేయము అని చెప్పినాము. దినాలు చేయను నెత్తి గొరికించుకోను ఏమైనా చేసుకోండి మీ ఇష్టం అని చెప్పినాము. అట్లా ఆ రకంగా మేము మొట్టమొదటనే వ్యతిరేఖించినాము. నేను దినాలు చేయలేదు. మా ఇంట్లో చచ్చిపోతే ఎవరికీ దినాలు చేయలేదు, నెత్తిగొరికించు కోలేదు. అప్పటి నుండి బంధువులంతా వ్యతిరేఖము. వీరు దేవుడు లేరంటారు అని అన్నారు. దేవుడు లేడని ఎవరంటున్నారు. దేవుడు వున్నాడనే గొరికించుకోనిది. దేవుడు ఉన్నాడు, ఆయనకు మర్యాద ఇవ్వమని చెప్పినాను.

మేము నాస్థికులమా అట్లనేదానికి? దేవుడున్నాడనే చెప్పుచున్నాను. ఎవరికి మర్యాద ఇవ్వాలో వారికి ఇవ్వు. ఎవరికి చేయాలో వారికి చెయ్యి.

నువ్వు నాకు తెలుసు కాబట్టి నేను చేయలేదు, నాకు భయం లేదు. వీళ్ళు ఏమి చేస్తారు? చచ్చిపోయిన తరువాత కూడా ఏమి చేస్తారు? వాళ్ళ కర్మకొద్దీ వాళ్ళు పోతారు. వాళ్ళు నన్ను ఏమన్నా పీడిస్తారా, అసలుకు ఏం చేయలేరు. మళ్ళీ అంతో ఇంతో అప్పులు చేసి చేసేదానికి? కాబట్టి నేనేం చేయను అని చెప్పినాము. ఈ రకంగా మేమే మంటే భయపడేది లేదు, కాబట్టి మాకు భయం లేదు. పామును తీసుకొని వచ్చి మీద విడిచినా భయము లేదా అంటే అది కరిచేది ఉంటే కరుస్తాది అనుకున్నపుడు ఎందుకుంటాది భయం? చచ్చేది ఉంటే చస్తాము అనుకొంటే ఎందుకుంటాది భయం? అందుకే ఒక ఆయన చెప్పినాడంట. పాములు సైతం భయం లేకుండా పట్టుకోగల్గు తాడని, అంటే నీవు భయపడితే కదా! అంటే విషం సైతం పని చేయదు అని చెప్పినాడు ఆయన. చచ్చిపోయేది వుంటేనే విషం పని చేసేది, చచ్చిపోనపుడు విషం కూడా పనిచేయదు నీకు అని చెప్పినాడు. ఆ రకంగా జరిగినాయి చాలా, ఇంతకు ముందు కూడా శరీరంలో విషం కూడ పనిచేయలేదు కొంతమందికి. పాముకాటు వేసినా విషం పని చేయలేదు. భయం ఉంటే పాము కాటేయ్యకున్నా, బుసకొట్టినా చచ్చిపోతాడు వాడు, అట్లా కూడా ఉంది. కాటు వేయకున్నా కూడా బుసకొట్టినా చచ్చిపోతారు చాలామంది. కొంతమందికి యాక్సిడెంట్ అవుతాయి. అక్కడ ఏమీ తగిలివుండదు, ఎక్కడా గాయమైవుండదు, ఏమీ యుండదు. అయినా చనిపోతారు. అలాంటి భయస్థులు వున్నారు కొంతమంది. ఏమీ తగలకున్నా చచ్చిపోయిన వాళ్ళు ఉన్నారు. అంటే భయం అనేది అంతపని చేస్తుంది అని చెప్పుతున్నాము. కాబట్టి ఇంతకుముందు కూడా చాలామార్లు చెప్పాను, భయం అనేది చాలా పెద్ద పీడలాంటిది, దానిని మీరు పెట్టుకోవద్దండి. ధైర్యంగా ఉండండి. భయం అనే గుణాన్ని అణచి వేసుకోండని చెప్పాను.

నేను ఇపుడు కూడా భయం అనే దాని గురించే ఎక్కువగా చెప్పినాను. భయపెట్టేవాళ్ళు ఉన్నారు, మీరు భయపడద్దండి. భయం లేనోడు ఒకడున్నాడు. వాని పక్షాన మీరు చేరండి, ఏమీ భయం ఉండదు. భయం లేనోడు నీ శరీరంలోనే ఉన్నాడు. కాబట్టి నీవు ఏమీ భయం లేకుండా ఉండవచ్చు. అంత ధైర్యంగా ఉండవచ్చు నీవు. వాని జ్ఞానము ఏదో తెలుసుకో, వాని పద్ధతి ఏదో తెలుసుకో, వాని అలవాట్లు ఏమిటో తెలుసుకో. నీవు కూడా వాని అలవాట్లు అలవాటు చేసుకో. నీవు ఆ రకంగా భయం లేనివాడుగా తయారైపోతావు, ఎక్కడ భయపడాలో అక్కడ భయపడండి. తరువాత నా మాటంతా నిజం అనుకోవద్దండి ఇప్పుడు కూడా అదే చెప్పుతున్నా నేను చెప్పేదంతా కరెక్టు అనుకోవద్దండి, మళ్ళీ అబద్దం అని కూడా అనుకోవద్దండి. అట్టనుకున్నా ఇబ్బందే, ఇట్లా అనుకున్నా ఇబ్బందే. కానీ మీరు బుద్ధితో యోచన చేసి, ప్రతిదాని గురించి ఆలోచన చేసి తెలుసుకోండి. అపుడు ఏది సత్యమో, ఏది అసత్యమో అని మనకు తెలుస్తుంది. సరే నేను చెప్పినది అంతా సత్యము అని కాదు, నేను చెప్పినది అంతా అసత్యము అని కాదు. మరి మీరు మీ బుద్ధితో యోచన చేసుకోండి, మీ శ్రద్ధతో మీరు గ్రహించుకోండి అని చెప్పుచూ, ఈ భయం అనే దానిని గురించి తరువాత మీరు ఆలోచన చేసుకోండి. అది ఎక్కడుంది అని ఆలోచన చేసుకోండి. ఊరికే భయం అనే పేరు అనుకుంటాము గానీ అది మనలో ఉందా లేదా అని చూసుకోండి. భయము దండిగా ఉంటుంది. అది మళ్ళీ లేదనుకొని ఒకవేళ అంత ధైర్యస్థుడిని, ఇంత ధైర్యస్థుడని అనుకుంటావుంటారు. పైకి కానీ లోపల చూస్తే చాలా ఉంటుంది.

మనం మామూలుగా సింహాలు అంటుంటాము. చాలా ధైర్యమైనవి అవి అనుకుంటుంటాం. జంతువులలో మృగరాజు, మృగాల్లోకెల్లా రాజు అనుకుంటా ఉంటాము. కానీ ఒకరోజు జూపార్కులో ఒక అతను గట్టిగా తుమ్మితేనే, దిక్కు తెలియక వెనక్కి తిరక్కుండా భయపడి అవి పరుగెత్తాయి. వాటికి ధైర్యము ఎంతమటుకు ఉన్నాదో చూడండి. సింహాలు నిలబడుకొని చూసేవి, తుమ్ముతూనే భయపడి ఉరికినాయి అంటే వాటి ధైర్యం ఎంతమటు కుందో చూసుకోండి. అట్లాగా మన పరిస్థితి కూడా అట్లే ఉంటుంది. కాబట్టి మీరు మనమెంతవరకు ధైర్యంగా ఉన్నామో మీరు చూసుకోండి. భయం అనేది దండిగా ఉందేమో చూసుకొని, ఇప్పటి నుంచి ఆ భయమనే దానిని విడిచిపెట్టి బ్రతకండి.

## 74. నటించే ఆత్మ

**(తేది :-25.05.2013)**

సర్వ శరీరాలలో ఉన్న ఆత్మ స్వరూపుడు, శరీరములకంతా ఆదికర్తగా, అధిపతిగా ఉన్నట్టి ఆత్మ అనేటటువంటివాడు, మీకు ఇప్పుడు చెప్పబోయే విషయాన్ని మీ బుద్ధికి అందిస్తాడని, మేము కోరుతూ ఈ ఉపన్యాసాన్ని ప్రారంభిస్తున్నాము.

ప్రతి మనిషి శరీరములోనూ మూడు ఆత్మలుంటాయి. అని చాలామందికి ఇక్కడికొచ్చే వాళ్ళకందరికీ తెలుసు. బయట వాళ్లకు చాలామందికి తెలియదు. కానీ ప్రతి శరీరములోనూ మూడు ఆత్మలు ఉంటాయని తెలుసు. ఒకటి జీవాత్మ, రెండు ఆత్మ, మూడు పరమాత్మ. ఈ మూడు మనము **త్రైత సిద్ధాంతము** ప్రకారము సిద్ధీకరించి చెప్పుకున్నాము.

శాస్త్రబద్ధముగా చెప్పుకున్నట్టి ఆత్మలు ఈ మూడు. ఈ మూడిట్లో ఒకటి ఏమి చేస్తుంది అంటే తాను ఏమీ చేయకుండా ఉండేది ఒకటుంది, అంటే పని ఏమీ చేయదు. కేవలము అనుభవాలు మాత్రము అనుభవిస్తూ ఉంటుంది. అది జీవాత్మని మీ అందరికీ తెలుసు. తర్వాత ఇంకొకటి ఉంటుంది. మూడవది పరమాత్మ అనేది అంటే, ఆత్మకంటే వేరుగా యుంటుంది. కాబట్టి దానిని పరమాత్మ అంటాము. అది ఏమి చేస్తుంటుంది అంటే, అది ఏమీ చేయదు. అనుభవించేది కూడా లేదు, కేవలము సాక్షీభూతునిగా ఉంటుంది. అది ఏమీ చేయకుండా, ఏ కార్యక్రమంతో సంబంధం లేకుండా ఉండేటటువంటిది, మూడవ ఆత్మ. ఇది తాను ఏ రకంగా ఉంటుందో ఆ రకంగానే ఉంటుంది. కానీ ఇంకొక రకంగా అనుకోదు అది, ఏది? అదే మూడవ ఆత్మ అయినట్టి పరమాత్మ. అది ఎట్లుండేది అట్లే ఉంటుంది. వేరే రకంగా తన్ను తాను పోల్చుకోదు. అది ఎట్లుంది అంటే మనము ఏమి చెప్పకున్నాము? దానికి పేరు లేదు, ఆకారము అంతకూ లేదు. తర్వాత క్రియ లేదు. అంటే పని లేదు రూప, నామ, క్రియ రహితంగా ఉండేది పరమాత్మ. అంటే రూపము లేదు, పేరు లేదు, క్రియ అంతకూ లేదు. ఈ రకంగా ఉండేటటువంటిది పరమాత్మ. అది నీ శరీరములోనూ ఉంది. తర్వాత నువ్వు జీవాత్మగా ఉంటూ, ఏమీ చేయనివానిగా ఉంటూ, అన్నీ చేసినాను అనుకుంటూ నువ్వు ఉన్నావు ఎవరు? జీవునివి. కానీ నువ్వు చేసేది ఏమిటి అంటే ఒకే ఒక్క కార్యం. ఏ కార్యం అది? నీ వరకు వచ్చినట్టి విషయాలు, అది నీకు బుద్ధి అందిస్తే, ఎందుకంటే, నీవు బుద్ధి ప్రక్కన ఉన్నావు, బుద్ధి నీ ప్రక్కన ఉంది. అది నీకు అందిస్తే ఆ అందించిన విషయాలు, మాత్రము అనుభవిస్తావు తప్ప, ఇంకోటి ఏమీ లేదు. అవి ఎట్లున్నాయి అంటే కష్ట సుఖాలరూపంలో సుఖదుఃఖాల రూపములో ఉంటాయి.

ఇది జీవుని యొక్క పని. తాను ఏమీ చేయకున్నా అన్నీ చేస్తున్నాను అని అనుకోవడం జీవుని పొరపాటు. అది అతని తప్పు. ప్రతి జీవాత్మ ఏమి చేస్తున్నాడు? ఏమి చేయకున్నా, తాను అన్నీ చేస్తున్నాను అనుకోవడము చాలా పొరపాటు. తాను ఏమీ చేయకున్నా ఈ పనులన్ని ఎట్లు జరుగుతున్నాయి, అంటే ఇప్పుడు మనము అనుకున్నాము. మొదటి ఆత్మ ఒకటి, చివరి ఆత్మ ఒకటి, మధ్యలో ఇంకో **ఆత్మ** ఉంది. ఈ ప్రపంచములో ప్రతి కార్యము చేసేది అదే. ఎవరికీ తెలియక గుప్తంగా ఉండి అది అన్ని పనులు చేస్తూ ఉంది. మనము మాట్లాడాలి అంటే నోరు కదలాలన్నా అదే కారణం, చేయి మెదలాలన్నా అదే కారణం. ప్రతి కార్యానికి అదే కారణంగా ఉంది. మీ మెదడులో ఒక ఆలోచన మెదిలి రావాలన్నా కానీ ఆ యోచన రేకెత్తించేది నీ శరీరంలో ఉండే రెండో ఆత్మ అని చెప్పవచ్చు. ఆలోచన రేకెత్తిస్తే నీకు తెలుస్తుంది, లేకపోతే నీకు తెలియదు. ఒక సైంటిస్ట్ ఒక సిద్ధాంతాన్ని కనుగొన్నాడు అంటే ఆ సిద్ధాంతము అది అతని మెదడులోనే ఆ ఊహకు రావాలి. ఆ ఊహకు వస్తేనే అతను నేను కనుగొన్నాను అన్నాడు. కనుగొన్నాను అంటే అంతకు ముందు ఉండేది నేను చూసినాను అంటాడు, అని బయటికి చెప్తున్నాడు. అతను చెప్పిన తర్వాత మనము అంతా దానిని చూడగలుగుతున్నాము, ఒక విషయము ఒక వ్యక్తి ద్వారా వస్తుంది. ఆ వ్యక్తిలో ఎవరు తెలియజేస్తున్నారు? అంటే రెండవ ఆత్మగా ఉన్న దేవుడే తెలియజేస్తున్నాడు.

ఈ రకంగా చిన్నకార్యం సైతం మొదలుకొని, పెద్ద కార్యం వరకు ప్రతి కార్యాన్ని చేసేవాడు ఎవరున్నారంటే, రెండవ ఆత్మ అయినట్టి 'ఆత్మ'. తాను ఎలా చేస్తావుంది అంటే? తాను అందరిలోనూ ఒకటే పని చేయకుండా, ఒక్కొక్కరిలో ఒక్కో పని ఎందుకు చేస్తా ఉంది? వాళ్ళకు

కూడా అసూయలు ఇట్లా ఏమన్నా ఉన్నాయా అంటే, అట్లంతా ఏమీ లేదు. ఏ జీవుడు ఏ కర్మ చేసుకున్నాడో వాని కర్మానుసారం వాడిని ఆడించేటటు వంటిది ఆత్మ. వాని కర్మానుసారమే వానిని ఆడిస్తుంది, నీ కర్మ ఎట్లుందో నిన్ను అదే రకంగా తీర్చిదిద్దుతుంది. ఈ ప్రపంచములో నువ్వు కూలివానిగా బ్రతకాలి అని ఉంటే ఏమి చేస్తుంది? నిన్ను కూలివానిగానే తీర్చిదిద్దుతుంది, చివరకు కూలి పనే చేయిస్తుంది. లేదు ఈ ప్రపంచములో నువ్వు గొప్పగా బ్రతకాలనుంటే ఆ రకంగానే తీర్చిదిద్దుతుంది. ఎవరు ఎలా బ్రతకాలి అనేది ముందే కర్మ నిర్ణయం ఉంటుంది. కాబట్టి ఆ నిర్ణయం ప్రకారమే ఆత్మ మనిషిని నడిపించి అదే పని చేయిస్తుంది. అందులో ఉండే సుఖాలను దుఃఖాలను అనుభవింపజేస్తుంది.

ఒక గొప్ప ధనికుడు చాలా ఆస్తులు సంపాదించినాడు. నేను సుఖంగా ఉండాలి, నాకు అన్నీ సుఖంగా ఉండాలి అని, అన్ని సౌకర్యాలు గల మంచి ఇల్లు కట్టుకొన్నాడు. అన్ని సౌకర్యాలు చేసుకున్న తర్వాత ఒక సంవత్సరములో చనిపోయినాడు. చనిపోతే ఏమైంది? ఆస్తి అక్కడే ఉంది. నువ్వు దానికి దూరమైపోయినావు. పోయి ఇంకొకచోట పుట్టినావు అనుకో! ఏమీ లేని బీదవాని ఇంట్లో పుట్టినావు, అప్పుడు ఏమైంది? అక్కడ ఏమీ లేదు కాబట్టి నీకు ఏ సౌకర్యము లేదు. ఇక్కడ నీ పేరుతో రిజిష్టర్ చేసినవన్నీ ఏమైనవి? ఆ పేరు మీదనే ఉన్నాయి. నువ్వు ఉంటే కదా! నువ్వు దూరమై పోయినావు దానికి. ఒక్కోసారి నువ్వు ఇక్కడే ఉన్నా కానీ, కొన్ని కారణముల వల్ల నీకు ఆస్తులు దూరమైపోతాయి. ఎలాగంటే అప్పులపాలై, ఉన్న ఆస్తులు అమ్ముకొని, అవి నీకు దూరమైతాయి. కొన్ని నీకు దూరం కాకున్నా, నువ్వు అయినా వానికి దూరమైపోతావు. ఈ రకంగా చివరకు ఏమవుతుందంటే నువ్వు దాన్ని అనుభవిస్తావని ఏమీ నమ్మకము లేదు.

ఈ రకంగా జరుగుతూవుంటుంది. ఇదంతా చేసేది చేయించేది ఎవరు? అంటే మూలకర్త ఆత్మ అని గుర్తు పెట్టుకోవాలి. నిన్ను బీదవానిగా చేసినా కానీ, ధనికునిగా చేసినా కానీ, ఉన్నవాడిని లేనివాడిగా, లేని వాడిని ఉన్నవానిగా చేసినా కానీ, శరీరములో ఒకే జీవితములోనే బీదవాన్ని గొప్పవానిగా చేసినా కానీ, గొప్పవాన్ని బీదవానిని చేసినా కానీ, ఏ రకంగానైనా కానీ శరీరములో ఉండేటి ఆత్మ మాత్రమే చేస్తూవుంది. నీ కర్మానుసారము. ఏమాత్రము క్రమం తప్పకుండా కరెక్టుగా చేస్తుంది. కానీ మూడవ ఆత్మ ఏమాత్రము సంబంధము లేకుండా ఉంది అదే పరమాత్మ. అది ఏమాత్రము అంటీముట్టకుండా ఉంటుంది. పరమాత్మ నీ లోపలే ఉంది, శరీరము లోపల ఉంది, శరీరం బయట ఉంది. దానికి ఆకారము లేదు. పరమాత్మ నీకు నాకు మధ్యలో ఉంది. నీలో ఉంది, అవతల వానిలో ఉంది. మొత్తం ఆకాశమంతా వ్యాపించుకొని ఉంది. గాలిలో ఉంది. నీటిలో ఉంది. భూమిలో ఉంది. అగ్నిలో ఉంది. మొత్తం అంతా ఆవహించి ఉంది పరమాత్మ. ఈ ఆత్మకంటే వేరుగా ఉన్నట్టిది. దానికి పేరు లేదు అని మొదటనే చెప్పాము, పరమాత్మ అంటాము. ఆత్మకంటే వేరుగా ఉందని పరంగా ఉందని అర్థము. అంతేగానీ అది పేరుకాదు. దానిని దేవుడు అంటున్నాము. అది పేరు కాదు, అది ఓ గుర్తింపు. దేవుడంటే ఏమని? వెతకబడేవాడు, దేవులాడబడేవాడు అని అర్థము. ఇప్పటి వరకు ఏ మానవునికీ కనిపించలేదు. దేవుడు ఎవరికీ కనిపించడు. ఆయనకు ఆకారమే లేదు, ఎట్లా కనిపిస్తాడు? నేను చూసినాను అని ఎవరన్నా అన్నారంటే అది శుద్ధ అబద్ధం. అది అసత్యం. వాళ్ళు ఊరకనే తమ గొప్పతనం గురించి చెప్పుకోవచ్చు, కానీ ఎవరూ ఇంతవరకు దేవున్ని చూచి యుండలేదు. పరమాత్మ క్రమం తప్పకుండా ఆయన

సిద్ధాంతం ప్రకారము ఆయన ఉన్నాడు. అంతటా ఆవహించి ఉన్నాడు, నీ లోపల కూడా ఉన్నాడు, సాక్షిభూతుడై ఉన్నాడు. పరమాత్మను ఏమంటున్నా మంటే సిద్ధాంతము ప్రకారము ఏమి చేయడు కాబట్టి "రైట్ ఆత్మ" అంటున్నాము. ఈ జీవాత్మ విషయానికి వస్తే వీడు పని చేయడు. చేయకున్నా 'నేను చేసినాను' అనుకుంటున్నాడు. అంటే తప్పుగా రాంగ్‌స్టెప్ వేస్తున్నాడు. కావున పరమాత్మ రైట్ ఆత్మ అయితే జీవాత్మను 'రాంగ్ ఆత్మ' అంటాము. అదీ ఆత్మే, ఇది ఆత్మే. అది పరమాత్మ, ఇది జీవాత్మ. ఏదీ కానీ ఉత్త ఆత్మ ఒకటి ఉంది మధ్యలో. అది ఏమాత్రము బయటికి తెలియకుండా శరీరములో ఉండి అన్ని పనులకు కారణమవుతా ఉంది. మనిషి చిన్నప్పటి నుండి చనిపోయేంతవరకు. అంటే చిన్నతనం నుంచి, అంటే మొట్టమొదట శ్వాస శరీరములోకి చేరినప్పటి నుండి, అంతిమ శ్వాస వదిలేంతవరకు, అది నీ శరీరములో అన్ని పనులు చేయిస్తూవుంది. చనిపోయినప్పుడు కూడా నీ శరీరములో ఉండేటటువంటి గుణాలు, కర్మలు, నిన్ను అన్నింటినీ తీసుకొని ఇంకొక శరీరము వరకు ప్రయాణం చేసిపోతూ ఉంది. ఆత్మే అదే తీసుకుపోయి వేరే శరీరములో కూడా ప్రవేశింప చేస్తూవుంది. ఈ రకంగా మళ్లీ ఇంకొక శరీరములో పుట్టించి అక్కడ కర్మానుసారము కొనసాగిస్తుంది ఆత్మ. దాని పని అది తప్పకుండా చేస్తూవుంది. అది కేవలం పని చేసేది మాత్రమే, అంటే నిమిత్త మాత్రముగా పని చేసేది. అది తనకు సంబంధము లేకున్నా కానీ అక్కడ ఏముంటే అట్లే ఆడాలి. అంటే యాక్టర్ మాదిరి పని చేస్తావుంది. ఈ రకంగా మూడు ఆత్మలు మన శరీరములో ఉన్నాయి కాబట్టి మనము వాటిని ఇలా చెప్పవచ్చు ఒకటేమో **రైట్ ఆత్మ**, ఒకటేమో **రాంగ్ ఆత్మ**, మధ్యలోనిది ఉత్త ఆత్మనే, అంటే **యాక్షన్ చేసే ఆత్మ** ఒకటి ఉంది. ఈ రకంగా దాని పేరే ఆత్మ, దానికి ఇంకో పేరు ఏమీ లేదు.

ఈ రకంగా మూడు ఆత్మలున్నాయి. ఈ మూడు ఆత్మలు ఎప్పుడో ఒకసారి కలిసిపోతే నువ్వు మోక్షము పొందుతావు. ఈ జన్మలు లేకుండా పోతాయి. అంతవరకు కొనసాగుతూనే ఉంటాయి. ఈ విషయము ఇంతకు ముందు కూడా చెప్పుకున్నాము. ఇది వరకు చెప్పిన పాటమే జ్ఞాపకము చేస్తావున్నాను. ఇంతవరకు చెప్పాను కదా! ఇప్పుడు ఒక టీవీ ఛానల్‌లోకి పోదాము. అందులో మామూలుగా గురువారం, శుక్రవారం ఒక ప్రోగ్రామ్ వస్తుంది. ఇంతకుమందు సోమవారం, మంగళవారం వచ్చేది, ఇప్పుడు మార్చారు. దాంట్లో RAW అని ఒకటి వస్తుంది. రెజ్లింగ్ ఆట అంటే కుస్తీ పోటీలు. దాని పేరు RAW అంటారు. అంటే RAW is WAR అంటారు. మల్లయుద్ధం అని అర్థము అంతే గదా? అక్కడ చూస్తుంటే ఇది RAW అన్నా ఒకటే, దానిని తిప్పేసి WAR అనినా ఒకటే అవుతుంది. RAW is WAR అన్నా WAR is RAW అన్నా రెండూ ఒకటే అవుతుంది కదా! ఈ రకంగా లెక్కేసుకుంటే దానిలో ఈ మూడు అక్షరాలు ఉన్నాయి కదా! RAW అంటే R రైట్ ఆత్మగా వేసుకో, A ను యాక్టర్ గా వేసుకో, W రాంగ్ ఆత్మగా వేసుకో.

ఇక్కడి నుండి అంకెల పరంగా చెప్పుకుంటే, 963 పరమాత్మకు గుర్తు 9, ఆత్మకు 6 నంబరు, జీవాత్మకు 3 నంబరు అని 963 అంటాము మనము. ఇట్లు జ్ఞానము ప్రకారమైతే చెబుతాము. అదే ఈ లెక్కప్రకారము, అజ్ఞానము ప్రకారమైతే 369 అంటాము. జీవాత్మను మొదట చెప్పి మధ్యలో ఆత్మను చెప్పి చివరిలో పరమాత్మను చెప్తాము. కానీ ఇట్లు చెప్పినా, అట్లు చెప్పినా మధ్యలో ఉండేది మాత్రము ఆత్మనే ఉంటుంది, చూడండి. ఎటూ అది మారదు, దాని సీటు మారదు. జీవాత్మ పరమాత్మ మారతాయి కానీ దాని సీటు మాత్రము మారేది కాదు. కాబట్టి మన శరీరములో మూడు

ఆత్మలున్నాయి కదా! ఒకటేమో రైట్ ఆత్మ, ఒకటేమో రాంగ్ ఆత్మ, మరొకటేమో ఏదీ కాని ఆత్మ అనగా నటించే యాక్టర్. అందువలన వాళ్లు ఏమి చేసినారంటే RAW అని పెట్టినారు. దానినే WAR అని పెట్టారు. రెండు రకాలుగా పెట్టుకొన్నారన్నమాట. అంటే ఆ విధముగా జ్ఞానము అర్థమవుతుంది అని పెట్టినారో ఏమో కానీ మూడు ఆత్మలు ఉన్నాయని దీని ద్వారా తెలుస్తుంది.

ఈ రకంగా చూసుకుంటే నీ శరీరములో మూడు ఆత్మలున్నాయి అని చెప్పుకున్నాము కదా! మూడు ఆత్మలు ప్రతీ జీవరాసి శరీరములో ఉన్నాయి కదా! ఇప్పుడు మనిషి శరీరములోనే కాదు ఒక ఈగ, దోమ, కుక్క, నక్క ఏ జంతువు శరీరములోనైనా కానీ, పక్షి శరీరములోనైనా కానీ, మనిషి శరీరములోనైనా కానీ మూడు ఆత్మలే ఉండాలి. ఇది శాసనం. ఈ మూడు ఆత్మల్లో నువ్వు ఎవరు? అంటే నీకు తెలియదు. ఈ మూడు ఆత్మల్ని విభజించుకొని చూస్తే నేను ఏ ఆత్మను అని నీకే తెలియదు. మనకు ఇప్పుడు జ్ఞానము తెలుసు కాబట్టి నేను జీవాత్మను, నా వెనుక ఇంకోటి ఆడించే ఆత్మ ఉంది. అది అసలు ఎవరికీ తెలియదు. ఇంక పరమాత్మ అనేది ఉంది. అది ఎట్లుందో అసలుకే తెలియదు. ఈ రకంగా ఈ మూడు ఆత్మలు మన శరీరాల్లో ఉన్నాయి. ఒక మనిషి శరీరములోనే కాకుండా సకల జీవరాసుల శరీరములోనూ ఉన్నాయి. ఈ రకంగా ఉండే దానివలన మనము జ్ఞానము తెలుసుకోవాలి అంటే ఈ రకంగా ఆత్మలను తెలుసు కుంటేనే జ్ఞానము అర్థమవుతుంది. తర్వాత శాస్త్రబద్ధముగా నువ్వు ముందుకు పోవచ్చు. లేకపోతే ఈ జ్ఞానమంతా అశాస్త్రీయమై పోతుంది.

ఒకచోట ఒకరకంగా ఇంకోచోట ఇంకోరకంగా చెప్పుకోవాల్సిన పని వస్తుంది. నువ్వు ఏమి చేయకున్నా నేను చేసినాను అని చెప్పుకోవాల్సిన

పని వస్తుంది. ఆత్మ చేసినా చేయలేదు అని చెప్పాల్సిన పని వస్తుంది. ఈ రకంగా ఒకదానికి ఒకటి అబద్ధము చెప్పాల్సిన పని వస్తుంది. అసలు నీకు మూడు ఆత్మలున్నాయన్న లెక్కాచారము లేకుండా పోయింది. జీవుడు, దేవుడు అనేంతవరకే వీళ్లు చెప్పుకున్నారు. జ్ఞానము తెలిసినోళ్లు, జ్ఞానము తెలియనోళ్లు వారిద్దరూ తప్ప ఎవరూ లేరు అనుకున్నారు. ఈ రకంగా అజ్ఞాన పరిస్థితి ఏర్పడింది. ఇప్పుడు జ్ఞానం కావాలి అంటే ఏమి చేయాలి అంటే ఈ పద్ధతి ప్రకారము నువ్వు రైట్ ఆత్మవో, రాంగ్ ఆత్మవో చూచుకో! నిన్ను నడిపించే యాక్టర్ ఎవరో చూసుకో. యాక్షన్ చేసేవాడు నీ శరీరములో ఒకడున్నాడు. నువ్వు కాదు, అంతా అతనిదే. అందుకే ఆయనను A మార్కు పెట్టినారు. ఈ రకంగా నీ శరీరములో A మార్కులో ఎవరున్నారు? R మార్కులో ఎవరున్నారు? W మార్కులో ఎవరున్నారు? అని చూచుకోండి.

ఈ రకంగా చూసుకొంటే, జ్ఞానము వరుసక్రమంగా తెలుస్తుంది అని మనము చెప్పుకున్నాము. ఇది మనిషి తత్త్వము, మనిషిలో ఉండేటటు వంటి విధానము. మనిషిలో ఉండే ఈ విధానము ఎప్పటికీ మారదు. మనిషి శరీరము ఎన్ని భాగాలు అంటే 25 భాగాలు అని చెప్పుకున్నాము కదా! మీకు అందరికీ తెలుసు 10 భాగాలు స్థూల శరీరము, 15 భాగాలు సూక్ష్మశరీరము అని. అంతవరకు తెలుసుకుండేదే పెద్ద కష్టమైపోయి, అదే పెద్ద ఇబ్బందిగా అయిపోయింది. ఇంకొకరు ఇంకొకరకంగా చెప్పుకున్నారు. నీ శరీరము గురించి పరిశోధన చేసుకుంటే భాగాలు ఎన్ని ఉన్నాయనీ, తర్వాత దాంట్లో ఉండే ఆత్మలు ఎన్ని ఉన్నాయని చూసుకుంటే, ఆ భాగాలు వదిలిపెట్టి, మూడు ఆత్మలున్నాయని తెలిసి పోయిందన్నమాట. శరీరములో ఎన్ని ఆత్మలు ఉన్నాయి? మూడు ఆత్మలు ఉన్నాయి. ఆరు చెడు గుణాలున్నాయి, ఆరు మంచి గుణాలున్నాయి.

అవి కూడా కనిపించవు. ఇంకా ఒకటి ధైర్యం ఉంది, మరొకటి అధైర్యం ఉంది. ఇంకా ఒకటి శ్రద్ధ ఉంది, ఇంకొకటి సిగ్గు ఉంది. ఇవన్నీ సూక్ష్మంగా ఉండేవి, ఇవన్నీ లెక్క చెప్పలేదు మీకు. కొన్ని మాత్రము చెప్పుకున్నాము. అంతఃకరణాలు నాలుగున్నాయి. సూక్ష్మంగా ఉండేవి. మొత్తము జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, స్థూలముగా ఉండేటివి పది ఉన్నాయి. దానిలో కొన్ని శక్తులు ఉన్నాయి. తర్వాత వాయువులు ఐదున్నాయి. ఇవన్నీ మొత్తము లెక్కేస్తే 43 అవుతాయి. ఇప్పుడు మీకు మళ్లీ క్రొత్త చదువు నేర్పుతున్నాను. అంటే ఈ క్రొత్త చదువు నేర్వాలంటే ఒక్కసారి నేర్పితే వచ్చేది కాదు. కాబట్టి నిదానంగా నేర్వాలి. ఇంతకు ముందు 25 అని చెప్పాము. 25 భాగాలు వాస్తవమే! అంతవరకు చదువు నేర్చుకుంటే ఫరవాలేదు. 43 అనేది ఎందుకు వస్తుంది అంటే, ఇది ఇంకా ముందుకు పోవాలంటే 43 నేర్చుకోవాల్సిందే. ఉండేటివే కదా! లేనివి ఏమీ మేము చెప్పలేదు కదా? ఇవన్నీ ఉండేటివే శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ కలుపుకుంటే 43 అవుతాయి. 40 భాగాలు పోయినాగానీ, నీ శరీరంలో ఉండే ఆత్మలు ఎన్ని అంటే నువ్వు ఏమి చెప్పగలవు? మూడు ఆత్మలు అని మనము ఈజీగా చెప్పవచ్చు. ఇంతవరకు మీకందరికి రూఢీగా తెలిసిపోయింది.

ఇప్పుడు ఒక మనిషిలో మూడు ఆత్మలు లేవు అని అంటున్నాడు ఒకాయన. మనం ఎంత పరిశోధన చేసినా మూడు ఆత్మలు లేవు. వానికి రెండే ఆత్మలు ఉన్నాయి అంటున్నాడు. ఇప్పుడు ఏమి అనాలి అతన్ని? మనిషైతే మూడు ఆత్మలుండాలి. మరి ఇప్పుడు వానిని ఏమనాలి? మనిషి కాదు అనాలి. మనిషి కాదనేదానికి ముక్కు, ముఖం, కాళ్లు, చేతులు అన్నీ మనకెట్లున్నాయో అట్లే ఉన్నాయి. వాడు మన మాదిరే మాట్లాడుతున్నాడు,

మన మాదిరే పని చేస్తున్నాడు. మన మాదిరే అన్ని రకాలుగా కార్యక్రమాలు చేస్తున్నాడు. మన మాదిరే జీవితము సాగిస్తున్నాడు, సంసారము సాగిస్తున్నాడు. అన్నీ సర్వసాధారణంగా ఉండి వానిలో ఒక ఆత్మ ఆబ్సెంటు (Absent) అయిపోయింది. ఇలా ఎక్కడన్నా జరుగుతుందా? ఇప్పుడు ఏది కరెక్టు, ఏది కరెక్టు కాదు? మూడు ఆత్మలు అనేది కరెక్టా? జీవుడు దేవుడు రెండు ఆత్మలు అనేది కరెక్టా? మనకు తెలిసినంత వరకు మూడు ఆత్మలు అనేది కరక్టు. రెండు ఆత్మలనేది తప్పు... మూడు ఆత్మలనేది కరెక్టు... మనవరకు బాగా కరెక్టే. మనవరకు మనము గట్టిగా చెప్పుకునే దానికి, మనమంతా మూడు ఆత్మలతో ఉన్నాము కాబట్టి. "నేను మూడు ఆత్మలతో ఉన్నాను. నా మాదిరే ఇంకో మనిషి ఉంటే వాడు మూడు ఆత్మలతో ఉండాల్సిందే. ఇది శాసనము. ఇది దేవుడు పెట్టిన శాసనము" అని మనము చెప్పి తీరాల్సిందే. దాంట్లో ఏమాత్రము అనుమానం లేదు. ప్రతి మనిషి శరీరములో మామూలుగా ప్రతి హస్తంలోనూ మూడు రేఖలుంటాయి. ఈ మూడు రేఖలను గురించి పెద్దలు ఏమి చెప్పేవారంటే, ఎవరి ముఖం చూడకనే హస్తం చూసుకుండే వాళ్లు. ఈ మూడు రేఖలను చూసే వాళ్లు పెద్దలు, ఆ రకంగా అలవాటు చేసేవాళ్లు పూర్వం. పూర్వం అందరికీ ఉండేది ఈ అలవాటు. కానీ క్రమేపీ అది పోయి నేడు హస్తము చూసుకునే అలవాటు లేదు. ఈ హస్తంలో మూడు రేఖలు ఎందుకు ఉన్నాయన్న విషయం కూడా ఎవరికీ తెలియకుండా పోయినది.

కానీ మనము ఏమి చెప్పుచున్నాము అంటే రెండు రేఖలు ఒకదానికొకటి కలిసి ఉన్నాయి. అది జీవాత్మ ఆత్మ, రెండు జోడు ఆత్మలు. ఒకటి ప్రత్యేకమైన ఆత్మ. అది పరమాత్మ అని మనము చెప్పాము. ఈ రెండిటికంటే పైన ఉంటుంది అది పరమాత్మ రేఖ. ఈ రెండు క్రిందుంటాయి

ఒకదానికొకటి కలిసి ఉంటాయి. ఈ రెండు ఒకదానికొకటి కలిసి ఉండే వాటిని జోడు ఆత్మలు అంటాము. అవే జీవాత్మ, ఆత్మ అంటున్నాము. శరీరములో మూడు ఆత్మలున్నాయి అని మనము ఇంతకుముందు చెప్పుకున్నాము. వాటికి అర్థము కూడా చెప్పుకున్నాము, హస్తానికి కూడా. కానీ ఎక్కడైనా అరుదుగా ఎవరి శరీరములోనైనా ఎవరి హస్తములోనైనా, రెండు రేఖలే ఉంటాయి. ఒక రేఖ ఎగిరిపోయి ఉంటుంది. అందరిలో ఉన్నదే చూడాలి. ఎక్కడన్నా రెండు ఆత్మలు ఉండొచ్చు అని గుర్తుగా దేవుడు ఆ రకంగా పెట్టివుంటాడులే అని చెప్పినాము. అంటే రెండు ఆత్మలు ఉండొచ్చునా? అంటే ఉండొచ్చు. ఇప్పుడు మీరు చెప్పినారు తప్పని? అంటే నేను చెప్పినది తప్పనే చెప్పినాము. ఉండకూడదు రూల్ ప్రకారము, అయితే కానీ ఉండొచ్చు. అదెట్లా, ఇట్లా అట్లా రెండు ప్రక్కల చెప్తే ఎట్లా జ్ఞానమవుతుంది మనకు? శాస్త్రబద్దత ఉండాలి కదా? మళ్లీ శాస్త్రబద్దత లేని జ్ఞానము అది జ్ఞానము కాదు కదా! ఇప్పుడు శాసనమేమి? ఏ శరీరములోనైనా మూడు ఆత్మలుండాలి అనేది శాసనం. కానీ ఇప్పుడు మూడు రేఖలు ఉన్నాయని మీరు చూపించేది కరక్టే. ఎక్కడన్నా రెండు రేఖలు పుట్టినాయి అంటే దానిని సరిచేసి ఎక్కడన్నా రెండు ఆత్మలు, ఒక ఆత్మ లేకుండా, రెండు ఆత్మలుండొచ్చు అని మీకు సరి చేసి చెప్తితే అది వాస్తవమేనా, అంటే అది కూడా వాస్తవమే! అది కూడా శాస్త్రబద్దమే! ఇప్పుడెట్ల శాస్త్రబద్దమవుంది అంటే? మనము దాన్ని వెతుక్కోవాలి. అంటే క్రొత్త విధానమవుతుంది.

ఇంతకుముందు తెలియని శాస్త్రబద్దత ఇప్పుడు మనము తెలుసుకోవాలి. ఏమిటి, ఒక శరీరములో కేవలము రెండు ఆత్మలే ఉండి, ఒక ఆత్మ లేకుండా ఆబ్సెంటు (Absent) అయ్యింది. వాన్ని మనము

మనిషి అనకూడదు. మనిషి అని ఎవరిని అనాలి? మూడు ఆత్మలుండే వాళ్లనే అనాలి? అయితే వానిని ఏమి అనాలి? **"భగవంతుడు"** అని అనాలి. దేవుడు అనకూడదు భగవంతుడు అనాలి. అటువంటి వాడిని భగవంతుడని ఎందుకు అనాలి? వాడు భగము నుంచి సజీవముగా వచ్చినట్టివాడు. అంటే తల్లిగర్భము నుంచి జీవముతో వచ్చినటువంటివాడు. ఎరుకగా వచ్చినటువంటి వాడు. అంటే తల్లిగర్భములోనే జీవము ఉండి పుట్టినటు వంటి వానిని భగవంతుడు అంటాము. అంటే, ఒకరు ఇంతకుముందు ఒక ప్రశ్న వేశారు. క్రొత్తగా అనంతపురం నుంచి జ్ఞానము తెలుసుకొని వచ్చినారు. వాళ్లేమన్నారంటే మనమంతా తల్లిగర్భము నుంచే పుట్టినవాళ్ళము కాదా! అని చెప్పినారు. అంటే నువ్వు అనుకుంటున్నావు ఆ రకంగా, తల్లిగర్భము నుంచి పుట్టినానని. చాలామంది పొరపాటు ఈ రకంగానే అనుకుంటున్నారు. చాలామందికి తెలియని రహస్యం కూడా ఇదే. తల్లిగర్భము నుంచి ఎవరూ పుట్టలేదు. ఎవరో పురాణాలు కథ వ్రాశారు. ప్రహ్లాదుడు వాళ్ల అమ్మ కడుపులోనే నారాయణ మంత్రాన్ని విన్నాడని, అభిమన్యుడు యుద్ధ రహస్యాన్ని తల్లి కడుపులోనే విన్నాడని వాళ్లు చెప్పారు కదా! అని మళ్లీ ప్రశ్న వేశారు వాళ్లు. వాళ్లు ఎట్ల విన్నారో ఏమో కానీ ఎవరో ఏమో చెప్పితే మనము ఎందుకు వినాలి? మీరేమన్నా ఒకటన్నా విన్నారా? మీ అమ్మ నాయన మాట్లాడేది అని అడిగినాము. మీరు కూడా కడుపులో ఉన్నవారే కదా! ఎక్కడ, వాళ్లకు ఒకటి జ్ఞప్తికి వుంటే ఇన్ని దాంట్లో ఏదో ఒకటి జ్ఞప్తికి ఉండాలి కదా! మీరు ఒకటి వినలేదు కదా! వాళ్లెవరో అబద్ధము చెప్పితే మళ్లీ దానిని ఎందుకు సత్యం అని నమ్మాలి. ఎవరన్నా వాళ్లు చెప్పిన దానిని శాస్త్రమా కాదా! అది అసలైనదా? కాదా? మీరు చూడండి. ఎట్లంటే అట్ల చెప్పితే నమ్మవద్దండి. ఆ రెండు కథలుగా మాత్రము వ్రాసినారు.

కానీ ఇంతవరకు ఎవరూ అట్లా పుట్టలేదు మనలాగా. మనిషి అనేవాడు ఎవడూ సజీవంగా పుట్టలేదు. కానీ ద్వాపర యుగములో ఒకాయన, అంటే కృష్ణుడు పుట్టాడంట. అతను ఏమి చేశాడంటే సజీవముగా పుట్టాడు. అతన్ని ఏమి అనాలి మనము? "భగవంతుడు" అనాలి. భగము నుండి సజీవంగా వచ్చినట్టివాడు, కాబట్టి భగవంతుడు అని చెప్తున్నాము. ఇప్పుడు ఆయనను భగవంతుడు అని అంటే, ఆయన సజీవంగా వచ్చినాడో లేకపోతే బయటకొచ్చిన తరువాత వచ్చినాడో మనకు ఎట్లా తెలుస్తుంది? అని ప్రశ్న రావచ్చు. మీరు చెప్పిన రూల్ ప్రకారము ఇక్కడ మనము ఏమి చెప్పుచున్నాము అంటే, తల్లిగర్భములోంచి ముక్కు రంధ్రాలు బయటికొచ్చి నంతమాత్రమున మొదటి శ్వాసతోనే జీవుడొచ్చి చేరుతున్నాడు అని చెప్పాము కదా! అలా మొట్టమొదటి శ్వాసలోనే చేరినప్పుడు లోపల నుంచి బయట కొచ్చినట్టే కదా! అంటే అట్ల కుదరదు. తల కొద్దిగా వచ్చినంత మాత్రము మొదటి శ్వాస బయటి నుంచి చేరినట్టే. లోపల నుంచి చేరినట్టు కాదు. తల్లిగర్భములో ప్రాణం వాస్తవంగా లేదు. దాని కదలికలు మెదలికలు గర్భములో ఉంటాయి. దానికంతా కారణాలు వేరున్నాయి. కానీ వాస్తవముగా గర్భములో ఎవరూ సజీవంగా లేరు. సజీవంగా వచ్చినటు వంటివాడు ఒకడున్నాడు. ఎవరు, కృష్ణుడు. ఆయన తల మామూలుగా వస్తే వీళ్లు తప్పుపడతారు. నిజమో కాదో అని అబద్ధము అనుకుంటారని, ఆయన ఏమి చేసినాడంటే కాళ్ళతో పుట్టినాడన్నమాట. ఇట్లు పుట్టకుండా సపరేట్‌గా కాళ్ళతో పుడితే ఏమి? అటైనాకానీ బయటికొచ్చిన తర్వాత ప్రాణం వచ్చింది అనుకుంటాము కదా! అలా లేకుండా కాళ్లు రెండు బయటకొస్తూనే ఆయన కదిలించినాడు. ఒక కాలు ఒకమారు, ఇంకొక కాలు రెండమార్లు కదిలిస్తే ఏమవుతుంది? లోపల ప్రాణం ఉంది అనేగా

అర్థము. అది గుర్తు మనకు. ఆ రకంగా కదిలించి పుట్టినటువంటి వాడు, ఎదురు కాళ్లతో పుట్టినటువంటి వాడు ఎవరు? కృష్ణుడు. కాబట్టి ఆయనను 'భగవంతుడు' అన్నాము.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. ఆయన మనిషే కదా! మన మాదిరి ఉన్నాడు కదా! అన్ని పనులు చేస్తున్నాడు బువ్వ తింటున్నాడు కదా! కాబట్టి ఆయనను మనిషి అనాలా? కాదని అనాలా? అంటే ఆయన మనిషి అంటే మళ్లీ రూల్ ప్రకారము మూడు ఆత్మలుండాలి. ఆయన శరీరములో ఎన్ని ఆత్మలున్నాయి? రెండే ఉన్నాయి. ఒకటి అన్ని జీవరాసులలో అణువణువునా వ్యాపించి ఉంది. కాబట్టి అన్ని పదార్థాలలో ఉంది. కాబట్టి అది అణువణువునా ఉంది. కాబట్టి మామూలుగా అది నీ శరీరములో ఉంది ఆయన శరీరములో కూడా ఉంది. ఇంక రెండవ ఆత్మ మధ్యలో ఉండే ఆత్మ ఒకటుందే అది కూడా ఉంది. దానితో పాటు మామూలుగా జీవునిగా కర్మ చేసుకొని పుడుతున్నాము కదా! జీవుడనే వాడు కృష్ణునిలో లేడు. జీవుడనే వాడు ఆయనలో ఏమాత్రమూ లేడు. కేవలము ఆత్మ మాత్రమే ఉంది. కేవలము అంటే కృష్ణుని శరీరములో జీవుడనేవాడు ఏమాత్రమూ లేడు. కేవలము ఆత్మ మాత్రమే ఉంది. జీవాత్మ లేదు. జీవాత్మ ఆబ్సెంట్ (Absent). ఉండేది రెండు ఆత్మలే. ఆ రెండు ఆత్మలు ఉన్నవాడే ప్రత్యేకమైనవాడు, వాడే భగవంతుడు. సరే! ఇప్పుడు యాక్టర్ ఎవరు? ఆత్మే కదా! అంత కదిలించేది, మెదిలించేది బయటికి కదిలేదంతా, యాక్షన్ అంతా ఆత్మదే గదా! కాబట్టి మనిషిలో కూడా ఆత్మదే కదా! ఇక్కడా అదే యాక్షన్, అక్కడా అదే యాక్షన్. కాబట్టి సర్వసాధారణంగా అందరూ మనుషులు కదిలినట్టు కదులుతున్నాడు. అందరూ చేసినట్టు సర్వసాధారణంగా ఉంది. ఏమాత్రము తేడా లేదు. కాబట్టి అందరూ

భగవంతుడిని కనుక్కునే దానికి అవకాశము లేదు. అతనిలో జీవాత్మ ఉన్నాడా ఎలా తెలుస్తుందని అడుగవచ్చు. లేడా అని? దానికి సమాధానము ఇలా గలదు. జీవాత్మ అనే వానికి గుణాలుంటాయి, జీవుడు గుణాల్లో ఉంటాడు. గుణాల్లో ఉంటే మామూలుగా మంచి చెడు కోరికలు కలుగుతాయి.

జీవునికి సుఖదుఃఖాలున్నాయి, భయం ఉంది. ఇంతకు ముందు చెప్పినాము, భయం ధైర్యం రెండున్నాయి అని. ధైర్యం అధైర్యం రెండు వున్నాయి కదా! ఇవీ ఉన్నాయి, అవీ ఉన్నాయి అని చెప్పుకున్నాము కదా! సరే కృష్ణుడు జీవుడా? కాదా? అని చూసేదానికి ఒక రోజు ఏమి చేసినాడంటే జరాసంధుడు వచ్చి అతన్ని ఓడించినప్పుడు ప్రాణభయంతో పరుగెత్తి పోయినాడు 'మధుర'ను వదిలిపెట్టి దాదాపు 1800 కిలోమీటర్ల దూరంగా పోయి దాక్కున్నాడు. అక్కడికి పోయి ద్వారకలో ఇల్లు కట్టుకొని అక్కడే ఉన్నాడు అనుకుందాము. ప్రాణభయముతో పారిపోయినాడు. ఆయనకు కూడా భయం ఉంది కదా! ఆయన కూడా జీవుడే కదా! జీవుడే! ఇబ్బందుల్లో బాధపడినాడు. సుఖాల్లో సంతోషపడ్డాడు. ఆయన కూడా సుఖాలు అనుభవించాడు. సుఖాలు, కష్టాలు అనుభవించేది జీవాత్మే కదా! అని అడుగవచ్చు. దానికి జవాబు ఇలా కలదు. అందరిలో ఉన్న ఆత్మ ఒక్కటే. ఆత్మ ఏమి చేస్తుందంటే అది జీవునిగా నటిస్తుంది. అది జీవుడు కాదు కానీ జీవుడు ఏ పోర్షన్‌లో ఉంటాడో, ఏ భాగములో ఉంటాడో, అట్లే అక్కడ ఉండి జీవుడు ఎట్లు శరీరములో మెదులుతున్నాడో, కదులుతున్నాడో, ఏ రకంగా బాధపడుతున్నాడో అదే రకంగా ఆత్మ నటిస్తుంది. జీవునివలె చేయుట వలన ఆయనను భగవంతుడు అనేదానికి అవకాశమే లేకుండా పోయింది. జీవునివలె అతను పని చేస్తున్నాడు కాబట్టి, జీవునివలె

నటిస్తున్నాడు కాబట్టి, వానిని భగవంతుడు అంటున్నాము. భగవంతుడే అట్లు నటించేది, భగవంతునిలో ఉండే ఆత్మ ఒక్కటే అట్లా నటించేది. అక్కడ జీవాత్మ భగవంతుని శరీరములో లేదు కాబట్టి, జీవాత్మ భాగాన్ని ఆత్మ భర్తీ చేస్తావుంది. జీవాత్మగా ఉంటూ నటిస్తూ ఉంది. అప్పుడు మూడు ఆత్మలున్నట్లుగా మనము భ్రమిస్తున్నాము.

ఇప్పుడు జ్ఞానము తెలిసి శరీరములో మూడు ఆత్మలు ఉంటాయని మనము కనుక్కున్నా కానీ భగవంతుని శరీరములో కూడా మూడు ఆత్మలున్నట్టే ఆత్మ నటిస్తావుంది. కాబట్టి, ఆ విధముగా కూడా ఆయన భగవంతుడు అని కనుక్కునే దానికి అవకాశమే లేదు. శరీరము ధరించి భూమిమీదకి భగవంతుడు వస్తే అతన్ని కనుక్కునేదానికి ఏమైనా వీలైతుందా అంటే, జీవాత్మ లేదు కాబట్టి కనుక్కోవచ్చు అంటే, జీవాత్మగా నటిస్తాడు ఆత్మ. అందువలన కనుక్కునే దానికి లేదు. ఆత్మకు భయము లేదు కదా! ఆయన భయపడడు అంటే, జీవాత్మగా భయపడతాడు, అందుకే పారి పోయినాడు. కాబట్టి నువ్వు ఆయనను ఏమంటావు, మామూలు మనిషి క్రిందికే లెక్కేస్తావు. ఎవరూ కనుక్కోకుండే దానికి ఏమి చేస్తాడంటే, తర్వాత సర్వసాధారణంగా ఉండేదానికి, ఆయన జీవాత్మగా నటిస్తాడు. కాబట్టి ఆయనను ఎవరూ గుర్తించే దానికి అవకాశము లేదు. మళ్లీ అతను జీవాత్మగానే నటిస్తాడా? ఇంకా ఏమన్నా చేస్తాడా అంటే, ఇంకా కూడా చేస్తాడు. ఇంకా ఎవరూ చేయలేని పనులు చేస్తాడు. చూడండి! ఎట్లుందో! అంటే ఇప్పుడు మామూలుగా జీవుడు ఏమి చేస్తాడు? కష్టసుఖాలు అనుభవిస్తాడు కదా! అదే మామూలుగా పనులు చేయించేది ఆత్మ కదా! పనులు ఆత్మ చేయిస్తే అనుభవించేది జీవుడు కదా! కానీ ఇక్కడ కూడా మామూలుగా పనులు చేసేది ఆత్మే. అనుభవించినట్టు నటించేది కూడా

ఆత్మే. అంటే జీవాత్మగా నటించేది కూడా ఆత్మే! ఈ రెండూ అయిపోయాయి కదా! ఇప్పుడు మనకు బయటి లెక్కకు జీవాత్మ, ఆత్మ రెండూ ఉన్నట్టే. అందువలన వాడు బయటి లెక్కకు సర్వసాధారణ మనిషిగానే కనిపిస్తాడు.

ఇంకొకటి ఏమంటే ఇప్పుడు పరమాత్మ ఏమీ చేయడు కదా! అతను ఏమీ మాట్లాడడు, ఏమీ చేయడు. అట్లా తటస్థునిగా, సాక్షిభూతునిగా ఉంటాడు కదా! కానీ ఆయనవలె కూడా నటిస్తాడు ఈయన, ఎవరు? ఇది క్రొత్త రహస్యం, ఏమని? ఆయనవలె కూడా ఈయన నటిస్తాడు. ఎవరు? మధ్యలో ఉన్న ఆత్మ. అంటే భగవంతునిగా వచ్చినట్టి ఆత్మ. ఆయనవలె కూడా ఈయన నటిస్తాడు. ఆయనవలె కూడా అధికార పూర్వకంగా మాట్లాడతాడు. దేవుడు ప్రపంచానికికంతా అధికారి కదా! ఈశ్వరుడు ఆయన. అధికారి, అధిపతి. ఈశ్వరుడు అంటే అధిపతి. ఆయన అధిపతి కాబట్టి ఆయన హక్కుగా, అధిపతిగా ఏ రకంగా మాట్లాడతాడో ఆ రకంగానే ఈయన మాట్లాడతాడు, ఎవరు? భగవంతునిగా ఉన్న వ్యక్తిలో ఉన్నట్టి ఆత్మ, ఆ రకంగానే మాట్లాడుతుంది. అంటే దేవునిగా కూడా నటిస్తుంది. దేవుడు కాదు, జీవుడూ కాదు, జీవునిగా నటిస్తూ ఏ రకంగా నిన్ను నమ్మించిందో, ఆ రకంగానే దేవునిగా నటించి కూడా నమ్మిస్తుంది. మళ్లీ ఇదెట్లా సాధ్యము? దేవుడు దేవుడే, జీవుడు జీవుడే, ఆత్మ ఆత్మే. ముగ్గురివి మూడు పనులైనప్పుడు శరీరాలలో కలగలిపి ఎవరు చేసే పని వాళ్లు చేస్తుంటారు. ఇవన్నీ మనకు జరుగుతున్నాయి, కానీ ఎవరికీ తెలియదు. అంటే పబ్లిక్‌గా జరుగుతున్నాయి. ప్రతి నిత్యం జరిగే పనులే కానీ మనము ఆలోచన చేయడం లేదు. నేను ఒక్కడినే ఉన్నాను శరీరములో అని అనుకుంటున్నారు మీరు. మీకు తెలిసిందంతా నీకే తెలిసింది అనుకుంటున్నావు. ప్రక్కన ఇంకోడు తెలియజేస్తే నీకు తెలిసింది అని

నువ్వు అనుకోలేదు. అంటే మామూలుగా మనిషిగా ఉండేటటువంటి వాళ్ళం మనము. కానీ మనిషిగా లేకుండా ఉండేవాడు ఒకడున్నాడు అని మనము చెప్పుకున్నాము కదా! వాడు ఏ రకంగా ఉన్నాడంటే వాడు మన మాదిరే ఉన్నాడు. అంటే మనకు విశదీకరించి చూస్తే, విడదీసి చూస్తే కేవలం ఆత్మ మాత్రము పని చేస్తూవుంది.

మనిషిలో ఆత్మ పని చేస్తుంది, అనుభవించేది జీవాత్మ. పరమాత్మ ఏ పనీ చేయడు. ఇప్పుడు పరమాత్మ ఏమీ పని చేయకుండా దాంట్లో ఉన్నాడు. దాంట్లో ఒకే ఆత్మ ఉంది. ఆ ఒకే ఆత్మే జీవాత్మగా కూడా నటిస్తావుంది. జీవాత్మ పాత్ర కూడా పోషిస్తావుంది. ఎట్లా పోషిస్తుంది? ఎంతకాలము పోషిస్తుంది? అంటే తనకు అవసరము ఉన్నంతకాలము జీవాత్మగా పోషిస్తుంది. జీవితంలో ఎక్కువ కాలము కూడా జీవాత్మగా పోషించవచ్చు. ఒకరోజులో కొన్ని గంటలు పోషించవచ్చు. తర్వాత లేకుండా చేయవచ్చు. ఈ రకంగా ఈ ఆత్మ అనేది ఎవరికీ అర్థము కాని రకంగా శరీరములో ఉండి, తాను అంటే భగవంతుని శరీరములో ఉండి జీవునిగా కూడా నటిస్తావుంది. ఇది బాగా జ్ఞాపకం పెట్టుకోండి. ఈ రకంగా ఆత్మ ఒక జీవునిగా నటించడమే కాకుండా, దేవుడెక్కడా ఏ నటనా చేయలేదు, ఏమీ సంబంధము లేదు. ఎవ్వరితో సంబంధము లేదు, ఏ ప్రపంచ సంబంధమూ లేదు. కానీ ఈ ఆత్మ ఏమి చేస్తుందంటే, ఆయనలా కూడా నటించి మాట్లాడతావుంది. ఆయనలా నటించి కూడా కొన్ని పనులు చేస్తావుంది. దేవుడు చేస్తాడా? చేయడు. ఏ పనీ చేయడు, ఎవరితోనూ మాట్లాడడు. ఏమన్నా చేసినాడంటే దేవుడు క్రియసహితుడౌతాడు. అంటే పని చేసినట్టవుతాడు. ఏమన్నా మాట్లాడాడు అంటే పని చేసినట్టు అయితాది. అందువలన ఏ సంబంధమూ పెట్టుకోడు. కానీ ఆయన పద్ధతి ప్రకారము

ఆయన ఉంటాడు. దేవునికి ఒక రూల్ ఉంది, దానిని మొట్టమొదట చెప్పుకున్నాము. దానిని మర్చిపోకూడదు. "రూప, నామ, క్రియా రహితుడు" అన్న పదాన్ని మర్చిపోకూడదు. పేరు కానీ, రూపం కానీ, క్రియ అనగా పని లేనటువంటివాడు. దేవుడు లేక పరమాత్మ.

కాబట్టి ఆయన ఎవరితోనూ మాట్లాడడు. ఏ పనీ చేయడు. ఈయనేం చేస్తాడంటే దేవునిగా మాట్లాడతాడు. ఇప్పుడు దేవునిగా మాట్లాడితే ఏమవుతుంది? దేవుడనుకోవాల్సిందే మనము. జీవునిగా యాక్షన్ చేసినప్పుడు జీవడనుకున్నాము కదా! యాక్షనా నిజమా అని తెలియదు కదా! అనుభవిస్తున్నట్టు కనిపిస్తుంది. ఉదాహరణకు ఒక పురుషుడు మామూలుగా రవిక తొడుక్కొని, చీర కట్టుకొని బయటికి పోయి నపుంసకుని మాదిరి కనిపించాడు. మనము ఏమి చేస్తామంటే ఆడంగివాడులే అనుకుంటాము. చూస్తానే నపుంసకుడు అనుకుంటాము అంటే వాడు నపుంసకుడా? కాదు. నటించినాడు అంతే. కానీ వాడు పురుషుడే. నీకు అలా నపుంసకుని మాదిరి కనిపిస్తున్నాడు. ఇప్పుడు అడుక్కునే దాంట్లో కూడా ఒక కొత్త ఫ్యాషన్ వచ్చింది. డబ్బులిస్తారని మగాళ్ళు కూడా అదే వేషం వేసుకొని పోతున్నారు. హైదరాబాదులో ఇట్లాంటివన్ని చాలా గ్రూప్‌లు ఉన్నాయి. ఒక ఐదారుమంది కలుసుకుని చీర, రవిక కట్టుకుండేది. బాగా నున్నగా షేవింగ్ చేసుకొని పోతారన్నమాట. పోయి అక్కడికి పోయి రెండు చప్పట్లు కొడితే వాడు డబ్బులిస్తాడు. వానితో ఎందుకు రామాయణం అని, లేకపోతే వారు ఏమేమో చేస్తారు అని వాడు భయపడి వీళ్లకు డబ్బులిస్తాడు. మామూలుగా ఊరికే అడిగితే ఇవ్వరు కదా! ఈ రకంగా వీళ్లేం చేస్తారంటే, నటించి మభ్యపెడుతున్నారు. అంటే ఒక పురుషుడు మామూలుగా స్త్రీలు ధరించేటి గుడ్డలు ధరించుకొని నపుంసకునిగా

నటించేటప్పుడు అందరు నపుంసకుడు అనుకుంటారు. ఆ రకంగానే ఆత్మ జీవాత్మగా కూడా కనపడవచ్చు. బయటికి బాధపడో, సంతోషపడో తర్వాత ఇంకొక రకంగా దేవునిగా కూడా కనపడవచ్చు. ఈ రకంగా రెండు రకాలుగా యాక్షన్ చేస్తావుంది, మధ్యలోవున్న ఆత్మ!

ఒక పురుషుడు స్త్రీగాను, నపుంసకునిగానూ ఏ రకంగా మోసము చేస్తున్నాడో ఆ రకంగా నిన్ను, ఎదుటివాళ్లను ఆత్మ మభ్యపెడుతావుంది. ఎదుటివాళ్లు పొరపాటు పడిపోతున్నారు. ఆత్మే! ఈ రకంగా చేస్తావుంది అని తెలియకుండా పోతూవుంది. ఇటు జీవునిగాను అటు దేవునిగాను, అంటే జీవునిగా నటించొచ్చు, ఏదో బాధపడినట్టు ఏడ్వవచ్చు, సంతోష పడినట్టు నవ్వొచ్చు, ఒకవేళ సుఖదుఃఖాలు అనుభవించినట్టు ఏమి చేసినా, మనము ఒకవేళ జీవుడేలే అనుకుంటాము. కానీ దేవునిగా ఎట్లు చేసేదానికి అవుతుంది? అని మనకు ప్రశ్న రావచ్చు. ఆ రకంగా చేసిన చరిత్రలున్నాయి. కృష్ణుడు మనిషే కదా! ఆయన సజీవంగా పుట్టినాడు కాబట్టి భగవంతుడు అంటాము. భగవంతుడంటే ఆత్మకు గుర్తు. ఆత్మే అని అర్థము, కానీ ఆయన ఏమి చేసినాడంటే ఒకసారి సుఖాలు అనుభవించాడు, ఒకసారి దుఃఖాలనుభవించాడు. ఒకసారి యుద్ధము చేసినాడు, ఇంకొక చోటికి పారిపోయినాడు. ఈ రకంగా ఇవన్నీ లెక్కేస్తే ఆయనను జీవాత్మ అనుకుంటున్నాము. సరే! ఆయనను జీవాత్మ అనుకుంటాము. కానీ ఈ ఆత్మ ఆ రకంగా కనిపించేటట్టు చేసింది. మనకు భగవంతుడు అనుకునే దానికి అవకాశము లేకుండా చేసింది. తర్వాత ఏమైంది? ఆత్మగా భగవద్గీతను చెప్పింది. ఆత్మగా ఆత్మజ్ఞానము చెప్పింది. ఆత్మనే కదా! ఆత్మకు తన జ్ఞానము తనకు తెలుసు. జీవాత్మ ఏంటో తెలుసు, ఆత్మ ఏమిటో తెలుసు. కాబట్టి మూడు ఆత్మల జ్ఞానము కూడా చెప్పింది. నీకు జ్ఞానము చెప్పాలంటే ఆత్మే

చెప్పాలి. జీవాత్మకు జ్ఞానము తెలియదు. ఇంక పరమాత్మ అనేవాడు మాట్లాడడు. ఆత్మజ్ఞానం ఆత్మకు మాత్రమే తెలుసు కాబట్టి తన ఆత్మజ్ఞానము ఆత్మే చెప్పాలి. మధ్యలో ఉండే ఆత్మే చెప్పాలి. ఈ మధ్యలో ఉండే ఆత్మే దేవుని జ్ఞానము చెప్తుంది. ఇంకెవరూ చెప్పరు. జీవాత్మగా నటించి బాధపడేది, సుఖపడేది రెండూ అదే, మళ్ళీ జ్ఞానము చెప్పేది కూడా అదే. కృష్ణుడుగా పుట్టినప్పుడు ఏమి చేసింది? 90 యేళ్ళు గడచి పోయిన తరువాత ఒక సమయం చూసుకొని ఒకరోజు ఆత్మ తన జ్ఞానమును చెప్పింది. అంటే భగవంతుని శరీరములో ఉండే ఆత్మ. మధ్యలో ఉండి ఆత్మజ్ఞానము కూడా చెప్పింది. జ్ఞానము చెప్పేది ఒకే ఒక ఆత్మ, మూడవవాడు ఎట్లాగూ చెప్పడు. వీనికి (జీవునికి) అసలుకే తెలియదు. ముందు తనెవరో జీవునికి తెలియదు. ఓ! నేను ఫలానావాడినని అనుకుంటున్నాడు. అన్నీ చేస్తావున్నాను అనుకుంటున్నాడు. వానిది వానికే తెలియదు. కాబట్టి జ్ఞానము ఏమాత్రము తెలియదు. ఆత్మ భగవద్గీత చెప్పింది. ఆ భగవద్గీత చెప్పినప్పుడు ఏమైంది అంటే బాగా గమనించండి! మామూలుగా రెండవ ఆత్మగా జ్ఞానం చెప్పవచ్చు కదా! మూడవ ఆత్మగా **“నేనే దేవున్ని నన్నే పూజించి, నన్నే నమస్కరించు. నాలోనికే ఐక్యమైతావు నువ్వు”** అని చెప్పలేదా? చెప్పింది.

నేనే దేవున్ని అని చెప్పింది దేవుడు ఎప్పుడూ చెప్పడు కదా! మాట్లాడడు కదా! కానీ అక్కడ ఏమైంది? నేనే దేవున్ని, నన్నే నమస్కరించు. నేను మూడవవానినని మళ్ళీ ఆయన చెప్పినట్టే చెప్పింది. మళ్ళీ నేను రెండవ వాన్ని అని చెప్పలేదు. మూడవ వాడు చెప్పినట్టు యాక్షన్ చేసింది. ఒకటవ వానిగా ఎట్లా నటించిందో, మూడవ వానిగా అట్లే నటించింది. ఆ దేవుడు చెప్పినట్లే చెప్పింది. అప్పుడు మూడవవాడు చెప్పినాడు అనుకోవాలి. అంతే కదా! “యాంతి దేవవ్రతాన్ దేవాన్” అనేటప్పుడు దేవతలను పూజిస్తే

దేవతల్లోకే పోతావు. "పితౄన్ యాన్తి పితృవ్రతాః" అంటే పితృ దేవతలను పూజిస్తే పితృదేవతలలోకే పోతావు. "భూతాని యాన్తి భూతేజ్యాః" అంటే జీవరాసులను పూజిస్తే కుక్కలు, నక్కలు, చెట్లు, చేమలు వాటిని పూజిస్తే వాటిలోకే పోతావు. నన్ను పూజిస్తే నాలోకే వస్తావు అన్నాడు. ఎవరిని? "మూడవ వాడైన దేవుడిని, సర్వలోకాలకు ఈశ్వరుడనైనట్టి నన్ను పూజిస్తే నాలోకే వస్తావు. ఈ ప్రపంచానికంతా ఆదికర్తను, సృష్టికర్తను నేనే" అని ఎవరు చెప్పారు, సృష్టికర్తను నేనే అని? చెప్పాల్సింది ఎవరు? మూడవ వాడైన పరమాత్మ కానీ చెప్పినది ఎవరు? రెండవ ఆత్మ. మూడవ వాడు చెప్పినట్టు చెప్తున్నాడు. సృష్ఠికర్త పరమాత్మయిన దేవుడే కాబట్టి నేను సృష్ఠించినాను అన్నాడు.

పరమాత్మ బదులు ఆత్మ మాట్లాడినాడు. ఆయన ఎలాగూ మాట్లాడడు కదా! ఆయన యాక్షన్ ఈయన చేసినాడు. నేనే ప్రపంచానికంతా అధిపతి మూడవ వాడు. కాబట్టి ఆయన మాట్లాడినట్లే ఆత్మ దేవుడు మాట్లాడినాడు. ఇప్పుడు అర్థమైందా ఆత్మ జీవునిగా యాక్షన్ చేస్తాడు. దేవునిగా యాక్షన్ చేస్తాడు. తను మాత్రము బయటపడడు, నేను ఫలానా అని ఎక్కడా తెలియనివ్వడు. తాను జీవునిగా మాట్లాడినాడు, పరమాత్మగా మాట్లాడినాడు. భగవద్గీతలో అదే ఉంది. ఇంకోచోటా అదే ఉంది. ఈ రకంగా ఎవరు చెప్తున్నారని ఎవరికీ తెలియకుండా తాను మాత్రము ఎక్కడా బయటపడకుండా జాగ్రత్తపడినాడు. ఆత్మయిన తాను ఎవరికీ తెలియబడ లేదు. ఇంతవరకు స్వామీజీలు అని పేరు పెట్టుకున్న వాళ్లకు ఎవరికీ తెలియబడలేదు. గురువులు అని పేరు పెట్టుకున్న వాళ్ళకెవరికీ ఈ మధ్యలోనున్న ఆత్మ తెలియబడలేదు. ఎలా ఉందో గమనించండి. అందుకే గుప్తంగా ఉండేటటువంటి వాడు చిత్రగుప్తుడన్నాము. ఆయన పేర్లలో

అది ఒకటి. గుప్తంగా ఉండేవాడు ఎవరికీ తెలియకుండా ఉండేవాడు ఆత్మ! కానీ దేవుడెక్కడైనా చెప్తాడా? ఒకచోట ఖురాన్‌లో 3వ సూరాలో 7వ ఆయత్‌లో ఏమని ఉందంటే **"దేవుని జ్ఞానము దేవునికే తెలుసు. ఏ మనిషికీ తెలియదు. కానీ శ్రద్ధ బుద్ధి ఉండేటటువంటివాళ్లు తెలుసుకోగలుగుతారు."** శ్రద్ధ బుద్ధి ఉన్నవాళ్లు గ్రహించగలుగుతారు. అంటే చెప్తే కదా! నువ్వు గ్రహించేది? నేను చెప్తే నువ్వు గ్రహిస్తావు, లేకపోతే గ్రహించే దానికి లేదు. కాబట్టి బుద్ధి శ్రద్ధ ఉన్నట్టివాళ్లు ఆత్మ ఇటువంటిదని గ్రహించగలగుతారు. కానీ నేను ఎటువంటి వాన్నో ఎవరికి తెలుసు? నాకే తెలుసు. ఎవరికీ తెలియదు. ఏ మనిషీ చెప్పేదానికి అవకాశము లేదు. ఏ మనిషికీ తెలియదు అని ఆత్మ అన్నాడు.

ఏ మనిషికీ తెలియనప్పుడు ఎట్లు చెప్తాడు? ఎవరైనా చెప్తే కదా! తెలిసేది? కానీ అక్కడ ఏమి చెప్పాడు? నేను చెప్పను అని పరమాత్మ చెప్పాడు కదా! ఆయన మాట్లాడేవాడు కాదు కదా! ఇంకోచోటికి పోతే ఆయన ఏమీ మాట్లాడనట్టి, ఏమీ చేయనటువంటి వాడు. నామ, రూప, క్రియారహితుడు అని వుంది. కాబట్టి ఆయన ఏమీ మాట్లాడడు. ఏ పని చేయడు. పని చేయనటువంటి వాడు మళ్లీ ఏమీ చేయకపోతే మనకెట్లా తెలుస్తుంది? అక్కడేదో లిటిగేషన్ ఉంది. ఏమి లిటిగేషన్ అది, మనకు అర్థముకాని సమస్య ఏమిటిది? మధ్యలో వచ్చి ఎవడో ఒకడు చెప్తాడు నీకు అని చెప్పాడు. అంతేగదా! ఏ మనిషికీ తెలియదు. కానీ ఎవరికి తెలుసు? ఆ రెండవ ఆత్మకు తెలుసు, భగవంతునికి తెలుసు. నేను "మనుషులకు నా విషయం తెలుసు" అని చెప్పినానా? చెప్పలేదు. నా విషయం బుద్ధి ఉన్నవాళ్లు, శ్రద్ధ ఉన్నవాళ్లు గ్రహించుకుంటారు అని చెప్పినాడు. మళ్లీ ఎవరు గ్రహించుకుంటారు? ఎవరు చెప్పితే గ్రహించు

కుంటారు? నేను చెప్పను, కానీ నా మాదిరి నా పాత్రలో ఇంకొకడు చెప్తాడు. నా స్థానంలో ఇంకొకరు చెప్తారు. కాబట్టి అప్పుడు మీకు తెలుస్తుంది? ఆ స్థానంలో ఇంకొకరు చెప్తారన్న విషయం ఎవరికీ తెలియదు.

ఇప్పుడేమంటున్నాను, దేవుడు మనిషిగా పుట్టడు అంటున్నాను. దేవుడు పుడతాడు అని చెప్పినామా? **"అజోపి సన్నవ్యయాత్మా"** అంటాడు. నేను పుట్టేవాన్ని కానే కాదు అని భగవద్గీతలో చెప్పినాడు. పుట్టేవాన్ని కాదు అని మూడవ ఆత్మ కదా! చెప్పినది. మూడవ ఆత్మే కదా! పరమాత్మే కదా! దేవుడు పుట్టడు కదా! 'అజోపి' అంటే నేను పుట్టను అన్నాడు. పుట్టను అని మూడవ ఆత్మే కదా చెప్పేది. మూడవ ఆత్మ ఏమన్నా మనతో మాట్లాడుతుందా? చెప్పేది రెండవ ఆత్మ కదా! ఇది ఎట్లుందో చూడండి. రెండవ ఆత్మ, మూడవ ఆత్మవలె చెప్పింది. అప్పుడు నీకు ఈ విషయం తెలుస్తావుంది. దేవుడెక్కడా నేరుగా నీతో మాట్లాడడు. ఆత్మతో మాట్లాడింప చేస్తాడు, ఆ ఆత్మ ఎలా మాట్లాడతాది? దేవుడు మాట్లాడినట్లే మాట్లాడతాది. ఒకచోట చెప్పారు **"నేను, ఆయనే అని తెలియకపోతే మీరు మీ పాపంలోనే ఉండి చచ్చిపోతారు"** అన్నాడు ఆయన. నేను ఆయనేనని (దేవుడినే అని). వాస్తవానికి కనిపించేవాడు మనిషి, మనిషిని మనిషే అనాలి, మనము. కనిపించే మనిషి దేవుడు కాదు అంటాము కదా! కానీ మళ్లీ ఈయన ఏమంటున్నాడు? **"నేను ఆయననే అని తెలియకపోతే అంటే దేవున్నే అని తెలియకపోతే మీరు పాపాలతో మీరుండి చచ్చిపోతారు"** అన్నాడాయన. ఇప్పుడేమనాలి? చెప్పేది ఎవరు? ఆ ఆత్మనా, పరమాత్మనా? ఎవరు చెప్పినట్టు చెప్తున్నాడు? మూడవ ఆత్మ చెప్పినట్టు చెప్తున్నాడు కదా! ఇక్కడ రెండవ ఆత్మ అని గుర్తించే దానికి వీలుందా? ఏమాత్రము వీలులేదు చూడండి. ఈ రకంగా రెండవ ఆత్మ మూడవ ఆత్మగా యాక్షన్ చేస్తా

నటిస్తావుంది. ఈ నటన ఎప్పుడన్నా తెలుసునా మీకు? ఒక దినము జ్ఞానమంతా బాగా తెలుసు ఇంక అంతా అయిపోయింది అనుకుంటే, ఇంకా రవ్వంత ఉంది చూడండి, మనకు!

ఈ రకంగా మూడవ ఆత్మవలె నటించేది ఒకటి ఉందనీ. అది ఆత్మయనీ అది ఎక్కడా బయటపడదనీ, ఎవరికీ తెలియబడదు. దాన్ని తెలుసుకోవడమే ఆత్మజ్ఞానము. ఈ రెండవ ఆత్మను గురించి తెలుసుకుంటే అది వాస్తవమైన ఆత్మజ్ఞానము. దానిని తెలియాలంటే జడలు ముడేసినా, గడ్డాలు పెంచినా, కాషాయ వస్త్రాలు ధరించినా ఏమేమో తిప్పలు పడినా ఇంతవరకు ఆత్మజ్ఞానం తెలియలేదు. రెండవ ఆత్మనే తెలియలేదు, ఇంకా మూడవ ఆత్మ ఎట్లా తెలుస్తుంది? చాలాకష్టం అన్నమాట. కానీ ఎంత బాగా చెప్తాడంటే కనిపించే మనిషి దేవుడు అంటే ఎవ్వరూ నమ్మరు. కనిపించే మనిషి భగవంతుడన్నా కూడా నమ్మేదానికి వీలులేదు. ఎందుకంటే వాడు సర్వసాధారణంగా ఉన్నాడు, అన్నిటికీ తిప్పలు పడుతున్నాడు. మొన్న బువ్వ లేకుండా ఉంటే నేనే 2 రూపాయలు నా దగ్గరుంటే ఇచ్చొచ్చా. వాన్ని నువ్వు భగవంతుడంటే ఎట్లా ఒప్పుకుంటున్నాను నేను? అని అంటాడు వాడు. అట్లనే ఆయన నిన్ను నమ్మించేది. నీకెట్లా అర్థమైయ్యేటట్టు చేస్తాడు? అట్లే ఉంటుంది ఆయన పనంతా. కానీ అతనే నువ్వు 2 రూపాయలిచ్చి బువ్వ తినుపో! అని తినిపించినావు, కాబట్టి నేను దేవున్నే కాదు చూడుపో అంటాడు. మళ్లీ దేవున్ని కాకపోతే చూసుకో అంటాడు. మళ్లీ ఇలా ఏమిటి? దేవుడేమిటి? అని నీకు అనుమానము వస్తుంది. కాబట్టి దీంట్లో ఎంత శ్రద్ధయుంటే కానీ, బుద్ధి ఉంటే కానీ, జ్ఞానము తెలియదని చెప్పినారక్కడ.

నా జ్ఞానము గ్రహించాలంటే శ్రద్ధ బుద్ధి రెండూ ఉండాల్సిందే. లేకపోతే అంత సులభముగా అర్థము కాదని చెప్పినారక్కడ, మనిషిగా

ఉన్నట్టి వ్యక్తి ఏమి చెప్తాడు తెలుసునా? ఈ భగవద్గీతలో కొన్ని వాక్యాలు చెప్తాడు. ఇంకోచోటికి పోతే "మీరు క్రింది లోకవాసులు క్రిందిలోక సంబంధులు అంటే క్రిందలోకంలో ఉండేవాళ్లు. నేను పై లోకం వాడిని" అంటాడు. ఆయన చూస్తే కిందే ఉన్నాడు, ఆయనతోపాటు కూర్చొని ఇద్దరు సమానంగా ఉన్నారు. ఒకచోట మీరు క్రిందివాళ్లు నేను పైనవాడిని అంటాడు ఆయన. **"మీరు ఈ లోక సంబంధులు, నేను పైలోక సంబంధుడిని నాతో మీరు సమానులు కారు"** అని భగవంతుడు చెప్తున్నారు? కనిపించేది మనిషి, మరి ఈయన దేవుడా? కాదా? అని చూస్తే మనిషి, గిచ్చితే అబ్బా అంటాడు. అయినా మనిషే చెప్పేది చూస్తే దేవుని వాక్యం.

వాస్తవంగా సత్యమే కదా! అది సత్యమే. ఈ రకంగా మనము ఒక మనిషిలో మూడు ఆత్మలున్నాయి, కానీ రెండు ఆత్మలున్న మనిషి కూడా ఉంటాడు, అది మనకు అర్థము కాదు. రెండు ఆత్మలున్న మనిషి ఒకడు ఉన్నాడు. ఒక ఆత్మ అబ్సెంట్‌గా ఉంటుంది. అయినా ఈ మధ్యలో ఉండే ఈ ఆత్మ, అబ్సెంట్‌లో ఉండే ఆత్మ, ఏమి చేస్తాడంటే అది జీవాత్మగా కూడా నటించి మూడు ఆత్మలున్నట్టు శరీరాన్ని నడుపుతుంది. కానీ అట్ల నడపడంలో మొదటి ఆత్మగా ఉండి నడిపితే ఫరవాలేదు. మామూలు మనిషి అనుకుంటాము మనము, కానీ అక్కడేమవుతుందంటే మనిషివలె నటిస్తూ, మనిషివలె బాధపడుతూ, మనిషివలె సుఖపడుతూ మనిషి మాదిరి ఉన్నటువంటి ఈ రెండవ ఆత్మ, మూడవ ఆత్మగా కూడా నటిస్తూ మాట్లాడు తుంది. రూల్ ప్రకారము దేవుడని చెప్పేదానికి అవకాశము లేదు ఎందుకంటే దేవుడు మాట్లాడడు, మళ్లీ ఎవరు మాట్లాడేది? బాగా వివరంగా తెలుసుకుంటే రెండవవాడు. మళ్లీ రెండవవాడు మాట్లాడితే ఇప్పుడు రెండవవాడు కదా మాట్లాడేది, నేను దేవుడంటాడేంటి అంటే మళ్ళీ దేవుని గురించే చెప్పినాడు.

వాని మాదిరే చెప్పినాడు. నువ్వు చీరకట్టుకుంటే ఆడవారని అనుకోవాల్సిందే నువ్వు. అంతేగదా! అట్లే మాట్లాడినాడు ఆడవాళ్ళు మాట్లాడినట్టు మాట్లాడితే నమ్మాల్సిందే నువ్వు. నీకెట్ల తెలుస్తుంది? ఆ రకంగానే ఇప్పుడు ఒక శరీరములో ఉండే ఆత్మ రెండు రకాలుగా నటిస్తావుందంటే అది ఎవరి శరీరములో నటిస్తుంది? ఒకే ఒక భగవంతుని శరీరములో నటిస్తుంది. మరి ఆ భగవంతుడెవరని ఎట్లు తెలుస్తుంది నీకు? తెలుసుకునే దానికి అవకాశమే లేదు. ఎందుకంటే ఇన్ని మాటలు మాట్లాడినాడు వీడు నిజమా కాదా! దేవుడా కాదా? చూస్తామని హింసిస్తే వాడు హింస పాలైనాడు, చచ్చిపోయినాడు, అప్పుడేమంటాము? మనము ఏమనుకొంటామో? ఏదో పొరపాటుగా తిక్కబట్టి మాట్లాడినాడులే అనుకుంటాము, కానీ చెప్పినదంతా సత్యమే.

ఈ రకంగా భగవంతుడినే గుర్తించే దానికి వీలైతుందా? అంటే ఎవడూ గుర్తించేదానికి వీలుకాదు. ఎంత తెలివైనవానిగా ఉన్నట్టివాడు కూడా గుర్తించే దానికి వీలుకాదు. అది మొదటి ఆత్మగా కూడా నటించొచ్చు. మూడవ ఆత్మగా కూడా నటించోచ్చు. భగవద్గీతలో మూడో ఆత్మగా చాలామార్లు మాట్లాడింది. అంతే గదా! రెండవ ఆత్మగా కూడా జ్ఞానము చెప్పింది. కృష్ణుడిగా వచ్చినప్పుడు మొదటి ఆత్మగా కూడా చాలాసార్లు బాధలు పడింది. సరే ఇంకో రూపంలో వచ్చినప్పుడు అక్కడ కూడా ఇట్లే జ్ఞానము బాగా చెప్పింది. జీవాత్మగా బాధపడడం జరిగింది. ఆత్మగా జ్ఞానము చెప్పడం జరిగింది. మూడవ ఆత్మగా చెప్పడం మాట్లాడడం జరిగింది. ఆ మాట అధికార పూర్వకంగా ఉంటుంది. శాసనబద్ధంగా ఉంటుంది. ఆ మాట ఏది చెప్పినా కానీ, స్వచ్ఛమైన జ్ఞానంగా ఉంటుంది. ఒకసారి ఒకానొక సమయంలో సముద్రమంతా చెలరేగిపోయి, గందరగోళమై పోయినప్పుడు, వాళ్లు ప్రయాణించే పడవ మునిగి పోతున్నప్పుడు ప్రకృతిని

**"ఆగిపో"** అంటే సముద్రం అణిగిపోయింది. ఎప్పుడు ఆత్మ ఏది మాట్లాడు తుందో తెలియదు కదా! అట్లే మనకు ఎప్పుడు ఏ ఆత్మగా మాట్లాడుతుందో తెలియదు.

ఇక్కడ చెప్పినది రెండవ ఆత్మను గురించి మూడవ ఆత్మ పలుకదు మాట్లాడదు. చెప్పినది రెండవ ఆత్మ మాత్రమే ప్రాక్టికల్‌గా ఏమి జరిగిందక్కడ? ప్రకృతిని శాసిస్తే శాసించబడింది. ప్రకృతి మాట వినింది. అక్కడ చెప్పినట్టి మాటవిని ఆచరించింది. భగవంతుడు ఎట్లుంటాడు అనే విషయాన్ని మనము కొంత వరకు తెలుసుకున్నాము. అంటే కొంత వరకు ఏమిటి? పూర్తిగా తెలుసుకున్నాము అనుకుందాము. ఎప్పుడూ తెలియని రహస్యం మీకు తెలిసిపోయింది. అంటే ఎప్పుడు మేం చెప్పినా ఒక క్రొత్త విధానాన్ని చెప్తూ వస్తున్నాము. ఆ రకంగానే ఈ రోజు కూడా భగవంతుని శరీరములో ఆత్మ ఏమి చేస్తూవుంది? దాని పాత్ర ఏమి? అని మేము చెప్పగలిగినాము. దీనిని బాగా జ్ఞాపకము పెట్టుకొండి. భగవంతు డెక్కడుంటాడో ఏమో మనకేం తెలియదు కానీ, ఆయన జ్ఞానము చెప్పగలుగు తాడు, తర్వాత మనిషివలె కష్టాలు అనుభవిస్తాడు. తర్వాత "దేవునివలె తను స్వయంగా కూడ మాట్లాడతాడు" అనే విధానాన్ని మనము ఈ రోజు చెప్పుకున్నాము. దీనినే జ్ఞాపకము పెట్టుకుని మనము జీవాత్మలము, మనకంటే మించినట్టి ఆత్మ ఒకడున్నాడు. అతనికంటే మించినట్టి పరమాత్మ ఒకడు ఉన్నాడు అని మనము తెలుసు కున్నామని, అది తెలుసుకునే దానికి మీరు ప్రయత్నం చేస్తారని కోరుతూ ఇంతటితో ఈ సమావేశాన్ని ముగిస్తున్నాము.

# 75. పుట్టిన రోజు ఎవ్వరికీ రాదు

**(తేది :- 05.04.2013)**

సర్వ శరీరములలో వ్యాపించి ఉన్న ఆత్మ అందరి బుద్ధికి స్వచ్ఛమైన జ్ఞానాన్ని, మంచి భావాన్ని అందివ్వాలని కోరుతూ ఈ సమావేశాన్ని ప్రారంభిస్తున్నాము.

ఈ దినము పుట్టిన రోజు పండుగ సందర్భంగా ఈ సమావేశాన్ని నిర్వహిస్తున్నాము. కానీ మనం ఉదయం కూడా చెప్పుకున్నాము. ప్రతి మనిషికి ఒకే పుట్టినరోజు ఉంది. అది సృష్ఠి ఆదిలో. తర్వాత పుట్టుకంటూ ఉండదు. మరణాలు సంభవిస్తున్నాయి కాబట్టి శరీరాలు మారిపోతున్నాయి అంతే! శరీరాలు మారుతున్నాయి, దానిని మరణం అంటున్నాము. కానీ శరీరం మారినప్పుడంతా అది ఒక జన్మ కిందికి లెక్కేసుకుంటున్నాము. కానీ మొట్టమొదటనే మనకు జన్మ వచ్చింది. ఆ జన్మను మర్చిపోతున్నాం. ఇప్పుడు ఈ జన్మను జ్ఞాపకం పెట్టుకొనేదాని వలన, అంటే ఇప్పుడు నేను పుట్టాను అని అనుకునేదాని వలన, ఇంతకు ముందు నేను లేను అనుకోవడం జరుగుతావుంది. కానీ ఇది పుట్టిన దినం కాదు అని మీరు ఎప్పుడైతే గ్రహించుకోగలుగుతారో నిజంగా అప్పుడు ప్రతి ఒక్కరు “పుట్టిన దినం మనకు లేదు. పుట్టిన దినం మనకు తెలియదు. ఎప్పుడో సృష్ఠి ఆదిలో పుట్టాము. మొదటినుంటి మనం ఉన్నాము” అనే జ్ఞాపకము ఉంటుంది. అప్పుడు వాస్తవమైన జ్ఞానం మనకు అందే అవకాశం ఉంది.

కాబట్టి మనం ఎవ్వరు కూడా ఇప్పుడు ఈ మధ్య కాలంలో పుట్టలేదు. మనం సృష్ఠి ఆదిలోనే పుట్టాము, శరీరాలు మారుతూ వచ్చాయి. జన్మలు జరుగుతూ వచ్చాయి. శరీరం మారినపుడల్లా ఒక జన్మ

అంటున్నాము. కానీ ఈ జన్మలనుబట్టి నువ్వు అంటే నేను ఇంతటోన్ని అనుకోవద్దు. అంటే నీ వయస్సు ఇంత అనుకోవద్దు నీ వయస్సు చాలా ఉంది. నువ్వు చాలా సంవత్సరాల నుంచి ఉన్నావు, కానీ మనకు ఈ జన్మలు మారినప్పుడల్లా నువ్వు అట్లే ఉన్నావు, కానీ నీతో పుట్టినవి వేరే ఉన్నాయి. నువ్వు పుట్టలేదు కానీ నీతో కలిసి పుట్టేటివి 24 ఉన్నాయి. అవి మనస్సు, బుద్ధి, చిత్తము ఇటువంటి ముఖ్యమైనటువంటివి కాకుండా శరీరం కూడ ముఖ్యముగా వస్తున్నది. శరీరం కొత్తదో, పాతదో కానీ పెద్ద సాధించేది ఏమీ లేదు. కానీ లోపలుండేటటువంటి అంతఃకరణాలు అనేటటువంటివి ఉన్నాయి కదా! మనస్సు, బుద్ధి, చిత్తము అనేవి, ఇవన్నీ చాలా ముఖ్యమైనటు వంటివి. కాబట్టి ఇవన్నీ మారుతూవస్తున్నాయి కాబట్టి, నీకు వెనకటి విషయాలు ఏవీ తెలియవు. అందువలన నేను ఇప్పుడు పుట్టాను అనుకుంటున్నావు. నువ్వు ఇప్పుడు కొత్తవాటితో సంబంధం పెట్టుకొన్నావు, కానీ నువ్వు మొదటనుంచి ఉన్నావు, నువ్వు పుట్టలేదు. పుట్టినవి, 24 శరీర భాగాలు ఎవరో నీ పక్కోళ్ళు పుడితే, నేను పుట్టాను అనుకోవడం పొరపాటు కదా! కాబట్టి పుట్టుక, జన్మ నీది కాదు. కానీ పుట్టుక, జన్మ ఎవరివి? నీ బుద్ధిది, నీ మనస్సుది, నీ చిత్తముది, నీ అహముది వాటితో నువ్వు కలిసి వస్తున్నావు. పాత వాటిని వదిలి పెట్టేస్తున్నావు. కొత్త వాటిని అతికించు కుంటున్నావు. ఒకే ఇంజినే బోగీలు మార్చుకుంటూ వస్తూ ఉంది. కానీ ఇంజను కొత్తదా? కాదు ఇంజను పాతదే. స్టేషన్ స్టేషన్‌లోనూ బోగీలు మారుతూ వస్తూవుంది.

ఆ రకంగా నువ్వు ఇంజనులాంటివాడివి, జీవుడివి. నువ్వు బోగీలు మార్చుకున్నట్టు నీ శరీరంలోని అంతఃకరణాలను, నీ శరీరాన్ని మార్చు కుంటూ వస్తున్నావు. శరీర భాగములు అనే బోగీలు కొత్తవి కానీ, జీవుడు

అను ఇంజను కొత్తది కాదు. దాని నడిపే డ్రైవర్ కూడా క్రొతవాడు కాదు. ఆత్మ అనే డ్రైవర్ ఇంజన్‌ను నడుపుతున్నాడు. నీ ఇంజను నడుస్తూనే ఉంది. నువ్వు నడుస్తూనే ఉన్నావు. ఆ లెక్కప్రకారంగా చూసుకుంటే నువ్వు ఎప్పుడూ పుట్టలేదు. నీకు ఇప్పుడు ప్రస్తుతం నీతో పాటు, నీ శరీరంలో ఉండి బయటి విషయాలన్నీ నీకు అందిస్తూ ఉండేవి ఏవైతే ఉన్నాయో, బయట జ్ఞానమంతా నీకు తెలియజేసేవి ఏవైతే ఉన్నాయో, అవి నీకు పుట్టుకొచ్చాయి. కాబట్టి అది నీ పుట్టుక కాదు, నీతో పాటు ఉండేటి వాటి పుట్టుక అని నువ్వు జ్ఞాపకం పెట్టుకో. ఇప్పుడు నేను అట్లే అనుకుంటాను. నాకు ఇప్పుడు పుట్టినరోజు అంటున్నారు. పుట్టినరోజు అంటే నేను ఎప్పుడో పుట్టాను, మధ్యలో పుట్టేది ఏమిటి అని అనుకున్నాము. మళ్ళీ అందరూ పుట్టినరోజు ఎందుకు చేసుకుంటున్నారు అంటే తెలియనితనంతో చేసు కుంటున్నారు. కానీ వాస్తవంగా నీవు పుట్టలేదు, నీ అవయవములు పుట్టాయి. ఆ పుట్టినవి కొన్ని ఒక జన్మలో మంచిగా ఉంటాయి. కొన్ని ఒక జన్మలో మంచిగా లేవు. ఒక జన్మలో బుద్ధి మంచిది ఉంటుంది. బాగా గ్రాహితశక్తి బాగుంటుంది. కానీ ఒక్కొక్క జన్మలో సరిగా ఉండవు. అవి ఇప్పుడు ఈ జన్మలో మాకు ఉన్నాయి.

మాకు ముఖ్యమైనటువంటివి ఏమిటి? మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అనేటటువంటివి. ఇక్కడ ఇంతకుముందు జన్మలో ఎట్లున్నాయో కానీ ఈ జన్మలో మాత్రము ఈ మనస్సు అనేది ఉంది కదా! అది చాలు మాకు. అంటే జ్ఞాపకం ఏమీ ఉండదు. మీ మనస్సులు చాలా బాగుంటాయి. ఎందుకంటే అన్నీ జ్ఞాపకముగా చెప్తారు. ఫోన్ నంబర్లు పది అయినా వరుసగా చెప్తారు. నా ఫోన్ నంబరు నాకు తెలియదు, పక్క ఫోన్ నంబరు కూడా నాకు తెలియదు. నా భార్య ఫోన్ నంబరు కూడా నాకు తెలియదు,

అంటే నా మనస్సుకు జ్ఞాపకం ఉండదు. అంటే మా మనస్సు అంత గట్టిదనుకో, లేకపోతే బలహీనమైనది అనుకో అంటే ఈ జన్మలో అంత బలహీనమైంది. ఇంతకు ముందు జన్మలో మంచిగా ఉండవచ్చు. ఒకవేళ జన్మంటూ ఇంకోటి ఉంటే మళ్ళీ ఆ రోజులలో కూడ మంచిదిగానీ, చెడ్డది గానీ రావచ్చు చెప్పలేము. అంటే ఈ రకంగా మనకు ఉండేటటువంటి అంత:కరణాలలో కొన్ని గొప్పవి ఉంటాయి. బలములేనివి ఉంటాయి, బలహీనమైనవి ఉంటాయి. ఈ రకంగా నీలో ఉండేటటువంటి అంతఃకరణాల పుట్టుకే కానీ, నీ పుట్టుక కాదు. నువ్వు సహజంగా ఎప్పుడో పుట్టి పోయావు కానీ నువ్వు ఫలానప్పుడు పుట్టావని నువ్వు మరిచిపోయినదాని వలన అంటే నీ జ్ఞానం నీకే తెలియని దానివలన, నేను ఇప్పుడు పుట్టాను అనుకుంటున్నావు. నేను పుట్టి 70 సంవత్సరాలు అయిపోయినాయి అని అనుకొంటున్నాను. ఇప్పుడు 70వ సంవత్సరానికి ఎంటర్ అయినాను అనుకున్నాను. నేను ఎంటర్ కాలేదు, నా శరీరంలో ఉన్నట్టి మనస్సు, బుద్ధి ఇవి ఎంటర్ అయినాయి. ఇవి ప్రవేశించినవి 70 వ సంవత్సరంలోకి. కాబట్టి వాటి పుట్టుకే కానీ నా పుట్టుక కానే కాదు అని చెప్పవచ్చు.

నేను సనాతనున్ని, అంటే ఎల్లప్పుడూ ఉండేటటువంటి వాన్ని, ఎల్లప్పుడూ ఉండేవానివే కానీ, ఒక్కొక్కప్పుడు బాధపడుతూ ఉంటావు. ఒక్కొక్కప్పుడు సంతోషపడుతూ ఉంటావు. ఒక్కొక్కప్పుడు ఇంకోటి ఇంకోటి రకరకాల అనుభూతులు పొందుతూ ఉన్నావు. ఆ అనుభూతులకులోనై నేను మంచివాన్ని అనో, చెడ్డవాన్ని అనో, లేకపోతే ఇంకోటి అనో, ఇంకోటి అనో నువ్వు భావించుకుంటున్నావు. కానీ నువ్వు ఏమీ కాదు నీకు తగులుకొని ఉండేటివి ఉన్నాయి కదా! వాటివల్ల నీకు ఆ పేరు వస్తూవుంది. నువ్వు అలా అనుకుంటున్నావు కానీ వాస్తవంగా నువ్వు ఏది కాదు, ఇంజను

ఒకటే అన్ని పచ్చబోగీలు తగిలించుకొని పోతే అది పూర్తి ఎక్స్‌ప్రెస్ అంటున్నాము. ఎర్రబోగీలు తగిలించుకొని పోతే దానిని లోకల్ (ప్యాసింజర్) అంటున్నాము. ఇంకా కొన్ని అన్ని సామాన్లు తీసుకొని తగిలించుకొని పోయే దానిని గూడ్సు రైలు అంటున్నాము. అట్లాగానే మనలో కూడా రకరకాల పేర్లు పెట్టుకున్నాము. కానీ ఇంజను మాత్రము ఒకటే ఆ రకంగా నువ్వు లెక్కవేసుకుంటే పుట్టినరోజు నాది కానే కాదు, కాబట్టి నా పుట్టినరోజు నాకు తెలియదు. అది ఎప్పుడు పుట్టామో ఏమో మనకు తెలియదు. అంటే సనాతనమైనది ఎప్పుడో సృష్టి ఆదిలో పుట్టాము. మళ్ళీ దాని విషయాన్ని జ్ఞాపకం చేసుకోలేము. మన పుట్టినరోజు మనకు తెలియదు. కానీ మనకు ఇంకోటి ఉంది, ఆ ఒకటి ఎప్పుడో ఒకసారి వస్తుంది, అది నాశనం అయ్యేరోజు. ప్రతి జీవునికి. సృష్టింపబడిన రోజు ఒకటి ఉంది, అంటే నీకు వాస్తవంగా పుట్టిన రోజు ఒకటి ఉంది, తర్వాత నాశనమయ్యే రోజు కూడా ఒకటి ఉంది. కానీ పుట్టుక లేనటువంటివాడు, నాశనము లేనటువంటివాడు అంటే పుట్టుక, నాశనం లేనటువంటివాడు ఒకడున్నాడు. ప్రపంచంలో ఒకడే ఒకడు, ఎవరు అతను అంటే, అతనే ఆత్మ అనే దేవుడు. అతనికి ఏమాత్రము నాశనము లేదు.

పరమాత్మ అనే దేవునికి పుట్టుక లేదు, ఎల్లప్పుడూ ఒకే స్థిరస్థాయిగా ఉన్నాడు. ఆయన ఎక్కడా సృష్టింపబడలేదు, ఆయనకు ఆకారము లేదు, పేరంతకూ లేదు. ఇంతకుముందు చెప్పుకున్నాము, పని ఏమాత్రము లేదు అని. ఈ రకంగా చెప్పుకుంటూ పోతే అన్నీ నాకే ఉన్నాయి అనుకుంటున్నాము. కానీ నీవు కూడా ఏమీ చేయలేదు. పక్కవాళ్ళు చేస్తుంటే నేను చేస్తున్నా అనుకున్నావు. మనం ఒక గ్రంథంలో ఇలా ఉండడము చూచాము. నీకు తీర్పు తీర్చనొచ్చాను **"చూచేవాళ్ళంతా గ్రుడ్డివాళ్ళు కావాలని**

**గ్రుడ్డివాళ్ళంతా చూచేవాళ్ళు కావాలని".** అంతా ఉల్టా సీదా భావించు కున్నాము. ఎందుకంటే వాస్తవంగా నువ్వు చూచేవానివి కాదు. కానీ నువ్వు ఏమనుకుంటున్నావు? నేను అన్నీ చేస్తున్నాను, అన్నీ చూస్తున్నాను అనుకుంటున్నావు. ఆ రకంగా అనుకోవడం వలననే నీకు పాపం వస్తావుంది. నువ్వు చూస్తున్నాను అని అనుకుంటున్నావు కాబట్టి నీకు పాపం వస్తా ఉంది అని వాక్యములో చెప్పారు. అక్కడ నేను ఫలానావాడిని అని అనుకుంటున్నావు కాబట్టి నీకు పాపం వస్తుంది. వాస్తవంగా నువ్వు అది కాదు. నువ్వు ప్రత్యేకమైనటువంటి వాడివి, పరమాత్మ ఏ విధంగా పని చేయలేదో ఆ విధముగా నీకు పని లేదు, కానీ కేవలం ఒకే ఒక అనుభవం ఉంది. అంతే ఇంకేమీ లేదు, అనుభవిస్తున్నావు. అంటే పక్కన వాళ్ళు ఏదయితే నీకు అందిస్తున్నారో అవన్నీ నువ్వు అనుభవించాల్సిన పని వస్తావుంది. ఆ విధముగా శరీరంలో జీవాత్మ అనేవాడు ఒకడున్నాడు. ఆ జీవాత్మ పుట్టినప్పుడు నుండి ఏం చేస్తున్నాడు అంటే, శరీరాలు మారినా కానీ, తాను ఒక్కడిగా వున్నా కానీ, కష్టాల్లో సుఖాల్లో అనుభవించాల్సిన పని వచ్చింది.

ఈ జన్మలో ఒక రోగం వచ్చింది. ఆ రోగం భయంకరమైనది. భయంకరమైన రోగాన్ని నువ్వు అనుభవిస్తున్నావు. అంతే, ఆ రోగాన్ని ఎవరు అందించారు? పక్కన వాళ్ళు అందిస్తే నువ్వు అనుభవించినావు. శరీరాల్లో ఉండేవాళ్ళు అందిస్తే నువ్వు అనుభవిస్తున్నావు. కానీ నువ్వు వేరు, నీ శరీరం వేరు. ఈ శరీరం పనికి రానప్పుడు నువ్వు ఈ శరీరాన్ని వదిలి పెట్టిపోతావు. కానీ శరీరం నువ్వు కాదు, శరీరంలో ఉండే భాగాలు నువ్వు కాదు. నువ్వు ప్రత్యేకమైనటువంటి వాడివి. ఆ విషయం మనకు తెలియక శరీరాన్నే నేను అనుకుంటున్నాము. మనిషి అద్దం చూసుకొని నేను

అందంగా ఉన్నాను, అందహీనంగా ఉన్నాను అని రెండూ రకాలుగా అనుకుంటున్నాడు. మనిషి వానిని వాడెప్పుడూ చూసుకునే దానికి అవకాశం లేదు. వాడెప్పుడు ఎవరికీ, తనకు తానే కనిపించడు, నువ్వు అజ్ఞానంలో ఉన్నావు. నీకు చాలా ఉన్నాయి అడ్డంకులు, కాబట్టి కనిపించే దానికి అవకాశం లేదు. కాబట్టి నిన్ను నువ్వు తెలుసుకోవాలంటే, నిన్ను నువ్వు చూసుకోవాలంటే, ఏమి చేయాలి? జ్ఞానం అనేటటువంటి అద్దం నీకు కావాలి. జ్ఞానం ఎప్పుడు నీకు తెలియబడిందో అప్పుడు నీ ఆకారం ఏమిటో నీకు తెలియబడుతుంది. ఒకవేళ నీకు తెలియకపోయినా కానీ, నీ ఆకారం ఇట్లుంటుంది అని మేము బొమ్మలు వేసి గీసి చూపించాము. నీ ఆకారమే కాదు, మా ఆకారము, మా ఆకారమే కాదు, అందరి ఆకారం ఇలాగనే ఉంది అని మేం గీసి చూపించాము. ఒక్క దేవున్ని మాత్రం చూపించలేదు, నీ మనస్సు అది కూడా చూపించాము. అంతవరకు అంతస్థితి వరకు తీసుకుపోయి చూపించిన గ్రంథాలు ఎక్కడా లేవు. జీవాత్మ ఆకారం ఇలా ఉంది అని చూపించిన గ్రంథాలు లేవు. కానీ ఎప్పుడో 40 సంవత్సరాల క్రితం ఒక ఆకారాన్ని చూపించాము. అందులో ఇప్పుడు కూడా బొమ్మల రూపంలో, గ్రంథాలలో అక్కడక్కడా చూడొచ్చు.

ఈ రకంగా జీవాత్మ అనేవాడు పుట్టేవాడు కాదు, మధ్యలో చచ్చేవాడు కాదు. మధ్యలో పుట్టేటివి చచ్చేటివి నీ శరీరంలో ఉండేటివే. నీ శరీరమూ, నువ్వు అట్లే ఉన్నావు. నీ శరీరములో ఇక్కడినుంచి ఇంకోచోటికి నువ్వు ట్రాన్స్‌ఫర్ అవుతున్నావు. నువ్వు మార్పిడి చెందుతున్నావు. కానీ నువ్వు ఏమాత్రం పుట్టలేదు, నువ్వు ఏమాత్రము చావలేదు. నీ శరీరానికి మరణం వస్తుంది. నీ శరీరానికి పుట్టుక వస్తుంది. సరే ఈ రకంగా చావు పుట్టుకలున్నాయి. చావుపుట్టుకల మధ్యలో నువ్వు ఉన్నావు. నువ్వు జీవితాన్ని

అనుభవిస్తున్నావు. ఈ జీవితంలో పుట్టినప్పుడు నుండి ఏదో ఒకటి తింటున్నాము. ఏదో పని చేస్తున్నాము. ఏదో ఒకటి సంపాదిస్తున్నాము. పరుగు పందెం మాదిరి నేను ఎంత సంపాదించినాను, నువ్వు ఎంత సంపాదించినావు అని పరుగెత్తుకుంటూ పోతున్నాము. ఒకరిని మించి ఒకరు సంపాదించాలని అనుకుంటున్నారు. అట్లా సంపాదించుకుంటూ పోతూ, ఒకవేళ దండిగా సంపాదించాను అనే తృప్తి వచ్చినా కానీ అంతలోనే చచ్చిపోతాడు. చచ్చిపోతే ఏమైతాది? నువ్వు సంపాదించినదంతా, శ్రమ పడిందంతా ఇక్కడే ఉండి పోతుంది. నీ వెంట ఏమీ రాదు. బయట సంపాదించినది రాదు, నువ్వు చిన్నప్పటి నీ శరీరంలో ఉన్నటువంటి బుద్ధి రాదు, నీ మనస్సు రాదు, నీ చిత్తము రాదు, నీ శరీరంలో ఏ భాగం రాదు. శరీరాన్ని అంటిపెట్టుకొని ఉండేటివి ఇంకేమొస్తాయి? ఏమీ రావు. మీరు ఇన్ని ఎకరాల ఆస్తిపరులు కావాలనీ, ఇన్ని రూపాయల ధనవంతులు కావాలనీ అనుకున్నా ఒకవేళ నువ్వు కష్టపడినా కానీ, ఏమీ చేసుకున్నా కానీ, ఒకవేళ అంత సంపాదించగలిగినా కానీ నేను సంపాదించినాను అని జీవితంలో తృప్తిపడినా కానీ, ఆ తృప్తి ఎంతవరకు ఉంటుంది. అది కొంతకాలమే మరుక్షణమే. చనిపోయేదానికి అవకాశం వచ్చిందనుకో, అప్పుడు ఏమీ చేయలేవు. అప్పుడు అన్ని వదిలిపెట్టి పోవలసిందే.

ఎవడన్నా ఇంతవరకు సంపాదించిన వస్తువులు కానీ, సంపాదించిన ఆస్తులు కానీ, తీసుకుపోగలిగినాడా? ఇంతవరకు ఎవడూ తీసుకుపోలేదు. అది అందరికీ తెలిసిన సత్యం. అందరూ ఏమి చేస్తున్నారు, దాని కోసమే ప్రాకులాడుతున్నారు. కానీ మన వెంట వచ్చే ఆస్తి ఒకటి ఉంది, మీ వెంట వచ్చే ఆస్తి జీవుని వెంట వచ్చే ఆస్తి అది ఒకే ఒక జ్ఞానము. దైవ జ్ఞానం ఎప్పటికీ తరిగిపోదు. ఒకవేళ పాపపుణ్యాలు కూడా మన వెంట వస్తాయా?

అంటే వస్తాయి. పాపపుణ్యములు కంటికి కనిపించేటివి కావు. నువ్వు తెలుసుకుంటే నాకు ఇంత జ్ఞానం తెలిసింది అని ఒక తృప్తి అన్నా ఉంటుంది కానీ, ఎంత పాపం సంపాదించుకొన్నది, ఎంత పుణ్యం సంపాదించుకున్నది నీకు ఏమీ తెలియదు అది నీకు తెలియకుండా జరుగుతూ ఉంటుంది. ఒకవేళ అవి నీ వెంట వచ్చినా కానీ అవి మళ్ళీ జన్మలో ఖర్చు అయిపోతాయి. అనుభవించడంలో తరిగిపోతాయి. ఈ రకంగా చేసుకున్న పాపం, చేసుకున్న పుణ్యం మళ్ళీ జన్మలలో అయి పోతుంది. సంపాదించుకున్న ధనము ఏ జన్మలో లేకుండా ఇక్కడే నిలిచిపోతుంది. నీ వెంట ఏమీ ఉండదు. కానీ ఒకే ఒకటి నువ్వు సంపాదించుకున్న జ్ఞానం మాత్రం జన్మ జన్మకు నీ వెంట వస్తుంది. అది ఎప్పటికీ తరిగిపోయేది కాదు, నష్టపోయేది కాదు. నువ్వు ఎంత సంపాదించుకుంటే అది నీ వెంట వచ్చేస్తుంది. అటువంటిది జ్ఞానము. సరే మనిషికి జ్ఞానం లేనిదానివలన ఓహో! నేను బీదవానిని, నేను షావుకారిని, నేను కష్టపడుతున్నాను, నేను సుఖపడుతున్నాను అని రకరకాల అనుభూతులు పొందుతూ, గందరగోళ పరిస్థితులు ఏర్పరచుకుంటున్నాడు.

మనిషి అంటే జీవాత్మ. ఆ రకంగా వాడు అనేక బాధలు అనుభవిస్తూ, ఏ దరిదాపు లేకుండా గందరగోళమైపోయి, ఒక కష్టం వస్తే క్రుంగిపోతున్నాడు, సుఖం వస్తే సంతోషపడుతున్నాడు. ఇంకా కొంతమంది సుఖం వస్తే ఎట్లయినా భరించొచ్చు. కానీ కష్టం వస్తే భరించలేం అని, అది రాకముందే చచ్చి పోతున్నారు. రైలు కింద పడో, బస్సు కింద పడో, ఉరి వేసుకొనో, విషము త్రాగో ఏదో ఒక రకంగా చనిపోతున్నారు. అంటే ఆ రకంగా చనిపోయేది కూడా కర్మ వలననే. ఆ రకంగా ఏమీ కాదు. నువ్వు ఎట్లుండేవాడివి అట్లే ఉంటావు. చనిపోతే ఏమైతుంది అంటే, శరీరంలో

ఉండేటివి అన్నీ పోతాయి అని అనుకున్నా కానీ, శరీరంలో ఉండేటివి కొన్ని మాత్రము పోతాయి. నువ్వు ఒక్కనివే మిగిలిపోతావు అని మనం చెప్పాము. కానీ అది చావులో ఈ మామూలుగా మందు తాగి చనిపోయి నోళ్ళు కానీ లేకపోతే రైలు కింద చనిపోయినోళ్ళు కానీ ఆక్సిడెంట్‌లో చనిపోయినోళ్ళు కానీ లేకపోతే ఇంకోరకంగా తాను చనిపోవాలని ఉద్దేశ్యముతో చనిపోయిన వాళ్ళు కానీ వీళ్ళంతా అందరికీ కొన్ని మాత్రము పోతాయి, కొన్ని పోవు. కొన్ని పది భాగాలు మాత్రము నీ శరీరంలో నుండి పోతాయి. 24 భాగాల్లో పది భాగాలు మాత్రం పోతాయి కానీ 14 భాగాలు అట్లే అంటుకొని వెంటబడి ఉంటాయి. నీ వెంట అవి ఉన్నంతవరకు  నీకు మరణం రాదు. ఇప్పుడు దాన్ని ఏమంటాం? అంటే 'అకాల మరణం' అంటాము. అది మరణం కాదు. **"మరణ రహస్యము"** అనే గ్రంథంలో మరణాలు కొన్ని రకాలున్నాయి అని చెప్పాము.

ఒకటి, మరణం అయితే శరీర మార్పిడి జరుగుతుంది, నువ్వు మారవు. శరీర మార్పిడి జరిగితే, అకాల మరణంలో 10 భాగాలు మాత్రం పోతాయి, మిగతా భాగాలు మాత్రము అట్లే ఉంటాయి అని చెప్పాము. అవి సూక్ష్మం, కనిపించవు. కనిపించే స్థూలశరీరం పోతుంది. కాబట్టి వీడు చచ్చిపోయినాడు అనుకుంటాము, కానీ వాడు చచ్చిపోలేదు. వాని మనస్సు, వాని బుద్ధి, వాని చిత్తం వాడు మొత్తం టోటల్‌గా అన్నీ మనల్ని చూస్తున్నాడు. మన మధ్యలో ఉంటున్నాడు. అన్ని అనుభవాలు అనుభవిస్తున్నాడు. దానిని అకాల మరణము అంటాము. కాలమరణం ఒకటి ఉంది. ఇంకొకటి తాత్కాలిక మరణం అనేది చనిపోయినట్లు కనిపిస్తా ఉంటాడు కానీ వాడు చనిపోడు. అంటే ఈ శరీరంలో ఏ భాగము వానికి పోదు. అన్ని భాగాలు అట్లే ఉంటాయి. అది మరణమే కాదు, కానీ బయటికి

చూసేదానికి మాత్రం పూర్తి మరణంలాగా కనిపిస్తావుంటుంది. అది వాస్తవంగా మరణం కాదు. అటువంటి వాళ్ళు 10,15 రోజులు తరువాత కానీ, నెల రోజుల తర్వాత కానీ, సంవత్సరం తర్వాత కానీ లేకపోతే ఉదయం చనిపోయి సాయంకాలం లేచి వచ్చిన వాళ్లు చాలామంది ఉన్నారు. అది ప్రాక్టికల్‌గా జరిగే విషయాలు మీకు తెలుసు. దానిని ఏమంటున్నాము, "తాత్కాలిక మరణం" అంటున్నాము. ఏసుప్రభువు అనే అతను మూడో రోజు లేచాడు, ఈ విషయము అందరికీ తెలుసు. అంతేకాక ఏసుప్రభువు, బ్రతికున్నప్పుడే, ఒక నాలుగు రోజులు సమాధిలో పెట్టినటు వంటి ఇంకో మనిషిని అంటే అతను చనిపోక ముందే సమాధిలో పెట్టారు. వాడు బ్రతికే ఉన్నాడు అని చెప్పి, మళ్ళీ సమాధి నుంచి బయటికి తీసి లేపినట్టి సందర్భం ఉంది.

చనిపోయిన తర్వాత నాలుగు రోజులకు సమాధి నుంచి బయటికి తీసిన సందర్భం కూడా ఉంది. ఆయనే లేపాడు. చనిపోకముందు పాడె గట్టి, డప్పు కొడుతూ ఊరేగించి యువతి శరీరాన్ని తీసుకొనిపోవాలని ప్రయత్నం చేస్తావుంటే "ఈమె నిద్రపోతూ ఉంది, ఈమె చనిపోలేదు. మీరు పొరపాటు పడినారు" అని ఆమె చెయ్యి పట్టుకొని లేపిన సందర్భం కూడా ఉంది. అంటే ఈమె బ్రతికున్నప్పుడే చనిపోలేదు అని చెప్పారు. "చనిపోయారని మీకు అనిపించినా కానీ చనిపోలేదు" అని చెప్పి లేపిన సందర్భములు కూడా ఉన్నాయి. అంతెందుకు దాదాపు 3 లేక 4 నెలలు కిందట తమిళనాడులో ముత్తుస్వామి అని కరూర్ జిల్లాలో హాస్పిటల్‌లో చనిపోయినాడు. ఆ రాత్రంతా అక్కడే పెట్టుకొని వాళ్ళు ఉదయం ఊరికి తీసుకువచ్చి, స్మశానానికి తీసుకుపోయి, స్మశానంలో చితి మీద పెట్టి కాల్చివేయాలని ప్రయత్నం చేసారు. సాయంకాలమైంది అప్పటికే, దాదాపు

5 గంటలు, అప్పుడు దూరంగా కోయంబత్తూరులో ఉన్నట్టి తన చెల్లెలు వచ్చి, అన్న శవాన్ని చూసి గట్టిగా ఏడ్చింది చితి మీదనే, ఆమె ఏడ్చినప్పుడు ఇతను కదిలి బ్రతికి లేచాడు. ఈయన అంటే ఎప్పుడో రాత్రి చనిపోయి నటువంటి వాడు రాత్రంతా ఉండి, పగలు అంతా ఉండి సాయంకాలం లేచాడు. దీనిని ఏమంటున్నాము అంటే ప్రాక్టికల్‌గా ఇది 'తాత్కాలిక మరణం' అంటున్నాము. ఇటువంటివన్నీ చాలా తెలియవు. ఇటువంటి మరణాలను నువ్వు పొందుతున్నావు అంటే నువ్వు కాదు, నీ శరీరం పొందుతుంది. నేను పొందుతున్నాను అని నువ్వు అనుకుంటున్నావు. ఈ రకంగా మరణాలు నాలుగు రకాలు ఉన్నాయి.

ఈ మరణాల మధ్యలో నువ్వు చిక్కుకొని ఓహో, నేను ఫలానా వ్యక్తిని, ఆడ శరీరం వస్తే ఆడ మనిషి అనుకుంటున్నాము. మగ శరీరం వస్తే మగ మనిషిని అనుకుంటున్నావు. లేదు నువ్వు అనిల్ అంబాని ఇంట్లో పుడితే పెద్ద కోటీశ్వరున్ని అనుకుంటున్నావు. లేకపోతే బీదవాళ్ళ ఇంట్లో పుడితే నేను చిన్న బీదవాన్ని అనుకుంటున్నావు. నువ్వు బీదవానివి కాదు, కోటీశ్వరునివీ కాదు. ఇవన్నీ మధ్యలో వచ్చేటటువంటి హంగులే. నీ స్థోమత నీకు ఉంది జ్ఞానం సంపాదించుకుంటూ ఎప్పటికీ శాశ్వతంగా ఉండేటటువంటి ధనికునివి నువ్వు. ఎంత పెద్ద ధనికునివైనా మానసిక బాధలు ఉన్నాయి కదా. శరీరంలో ఇటువంటివన్నీ ఉన్నాయి. అందువలన మీకు ఏమి చెప్పుతున్నా మంటే ఇటువంటి జనన మరణాల్లో మీరు ఇరుక్కున్నారు. కానీ వాస్తవంగా జనన మరణాలు నీకు లేవు. ఈ జనన మరణాల మధ్యలో నీ శరీరాన్ని తప్పించి, నువ్వు శాశ్వతమైన ఒకే ఒక ఆనందాన్ని పొందాలంటే ఏమీ చేయాలి? దానికోసమే ఈ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని తెలుసుకోవాలి. ఆత్మ జ్ఞానాన్ని తెలుసుకోవాలి. ఆ ప్రయత్నం

కోసం మనమంతా ప్రాకులాడుతున్నాం. ఇటువంటి సభలు పెట్టుకొని, ఒక గురువు అంటూ ఏమేమో చెప్పుకుంటున్నాం మనమంతా. ఇదంతా ప్రయత్నమే, అందులోని ప్రయత్నమే ఇప్పుడు మనం చేస్తున్నాము గానీ మనం చేసే ప్రయత్నం ఎంతమటుకు సరైనది? అంటే అది ఎంతమటుకైనా కానీ ఇదే పని చేయాల్సిందే. నీకు ఎంత జ్ఞానం తెలిసినా కానీ ఎక్కడో ఒకచోట పోయి వినాల్సిందే. అంతే గదా! వినేది ఎంతమటుకు అని నువ్వు ఆలోచన చేసుకోవాలి. నేను చెప్పేది ఎంతమటుకు చెప్పుతున్నానని నేను ఆలోచన చేసుకోవాలి. అట్లు కాకుండా నేను వెనుతిరిగి ఆలోచన చేయకుండా, నాకు నోటికొచ్చిందంతా నేను చెప్తూ, నాకు తెలిసిందే జ్ఞానం అని నేను అనుకుంటే, పెద్ద చిక్కు నాకు వస్తుంది. విన్నదే జ్ఞానం అని నువ్వు అనుకుంటే నీకు కూడా చిక్కు వస్తుంది.

దేవుడు నిన్ను అడుగుతాడు నీవు చెప్పే మాటలు "నేను ఒక మాటన్నా చెప్పానా? ఇలాంటివి" నేను చెప్పని మాటలన్నీ చెప్పితే, అది నీ తప్పే. నేను భగవద్గీత చెప్పినాను, బైబిల్ చెప్పినాను, ఖురాన్ చెప్పినాను. అక్కడ ఎక్కడన్నా ఏ గ్రంథంలోనైనా ఒక మాటైనా నీవు చెప్పినట్లు చెప్పినానా? చెప్పలేదు, నీ ఇష్టం వచ్చినట్టు నువ్వు వ్రాసుకుంటావు, చెప్పుకుంటావు అని దేవుడు అడగడా? అడుగుతాడు, అప్పుడు చిక్కు సమస్య వస్తుంది మనకు. కాబట్టి అటువంటిది అజ్ఞానము లేకుండా మనం స్వచ్ఛమైన జ్ఞానం సంపాదించుకోవాలి అని మీరు ప్రయత్నం చేయండి, అదే జ్ఞానాన్ని మేము తెలుసుకొని మీకు అందివ్వాలని మేము కూడా ప్రయత్నం చేస్తాము. మనం దేవుని సేవ చేయాలి అని అనుకుంటే నీకు తెలిసిన దేవుని జ్ఞానాన్ని బయటికి చెప్పు. నీకు తెలిసిన జ్ఞానము అంటే వాస్తవ జ్ఞానాన్ని చెప్పి దేవుని సేవ చేయాలి దేవుని సేవ ఏది? అంటే పూజలు పునస్కారాలు దేవుని సేవ

కాదు. దేవుడు వాటికి సంతోషించడు, వీడు నన్ను పొగుడ్తున్నాడు. నాతో లాభం పొందాలని వీడు నన్ను పొగుడ్తున్నాడు అని అనుకుంటాడు. పూజలు చేసినా కానీ ఆయన సంతోషించడు. మనం వ్యక్తిని పొగుడ్తున్నామంటే తెలివైనవాడు వీడు నన్ను కాకా పడ్తున్నాడు ఏదో లాభం పొందాలని అని అనుకున్నట్లు, దేవుడు కూడా అట్లే అనుకుంటాడు.

దేవుడు ఏమి చెప్పాడు అంటే మీకు దైవజ్ఞానం తెలియకుండా పోయినప్పుడు, నా జ్ఞానాన్ని నేను ప్రజలకు తెలియజెప్పాను. ఆ పని మీరు కూడా చేయండి, నా పని మీరు చేసినట్టు అవుతుంది. నా సహాయకారులుగా మీరు ఉంటారు కాబట్టి, నా పని అది నా సేవ అవుతుంది. నా సేవ అయిన దానివలన మీరు నా దగ్గరికి రావచ్చు అని చెప్పాడు. అటువంటి ఉద్దేశ్యముతో మేము ఏమి చెప్పుచున్నాము అంటే దేవుని సేవ చేసే నిమిత్తము మేము ఈ జ్ఞానాన్ని చెప్పాలి అనుకున్నాము తప్ప ఇంకోటి కాదు. దేవుని సేవ చేసే నిమిత్తం అని అన్నప్పుడు నాకు ఆర్భాటాలు అవసరం లేదు కదా. ప్రచారాలు అవసరం లేదు. ఎవ్వరికైతే అవసరమో వాళ్ళు నా దగ్గరికి రండి, నేను చెప్పానంతే, నాకు అవసరం లేదు, నేను జ్ఞానాన్ని బయటికి అందించాలని అనుకుంటా కానీ, నేను బయటికి పోవాలనుకోలేదు. కాబట్టి ఆ రకంగానే మేము ఈ జ్ఞానాన్ని అందించాలని అనుకున్నాము. ఇంక వేరే విధానం ఏమీ కాదు. ఆ విధానంలో ఏమి చెప్తున్నాము అంటే, మీరు మీ శరీరాల్లో ఇబ్బంది పడుకోకుండా తప్పించుకోవాలంటే మీరు మీ శరీరాల్లో నానా రకాల బాధలు పడుతూవుంటే ఆ యాతన నుండి నాకు ఏ మార్గం దొరుకుతుంది. ఏ దేవుడు రక్షిస్తాడు అని మీరు ఆ దేవుని దగ్గరకు ఈ దేవుని దగ్గరకు పరిగెత్తే దానికంటే సులభమైన ఉపాయం చెప్పాను. మీరు అనుకొన్నట్లు ఏ దేవునికి పరిగెత్తినా కర్మ అనేది పోదు. లోపల

ఉండేవాడు నిన్ను వదిలి పెట్టడు. నిన్ను వాడు ఏ రకంగా బాధించాలో ఆ రకంగా బాధిస్తాడు. ఎక్కడా ఎవరూ తప్పించేదానికి అవకాశమే లేదు. మీరు ఏ దేవున్నైతే మ్రొక్కుతున్నారో ఆ దేవుడు రక్షిస్తాడనుకుంటే, ఆ దేవున్ని కూడా శిక్షించేవాడు ఒకడున్నాడు. వాడే నీలో ఉండే ఆత్మ (దేవుడు). నీలో ఉండేవాడే బయటి దేవుల్లలో కూడా ఉండాడు. వాళ్ళు తప్పు చేస్తే వాళ్ళకు కూడా శిక్షలు తప్పవు. దేవతలు కూడా తప్పులు చేస్తున్నారు. మనుషులు నాకు మ్రొక్కుతున్నారు. వీళ్ళందరికీ నేను సహాయం చేస్తాను. వీళ్ళందరినీ నేను కాపాడతాను అని దేవతలు అంటే "నువ్వు ఎక్కడ కాపాడుతావు? నేనే నిన్ను కాపాడేది, నేను కాపాడాను కాబట్టి నువ్వు ఉన్నావు. లేకపోతే నువ్వు లేవు" అని ఆత్మ అంటాడు. ఈ రకంగా లెక్కవేసుకుంటే అందరినీ సృష్టించినటువంటివాడు ఒకడు ఉన్నాడు. అందరి బాధలు తీర్చేటటువంటివాడు ఒకడున్నాడు ఆయనే నీకు ఒక మార్గాన్ని చెప్పాడు. నువ్వు నా జ్ఞానాన్ని తెలుసుకో, నా జ్ఞానం అగ్నిలాంటిది. నా అగ్ని కర్మలను కాల్చివేస్తుంది. దానిని మీరు తప్పించుకోవచ్చు. ఆ రకంగా నీ కర్మలన్నీ మీరు తప్పించుకోవచ్చు.

మనం జ్ఞానము తెలుసుకునే దానికి ఎన్నో అవకాశాలు ఉన్నాయి. కాబట్టి మనం పూర్తి జ్ఞానాన్ని తెలుసుకునేదానికి అవకాశం ఉంది. జ్ఞానాన్ని తెలుసుకునే దానివల్ల మనము మోక్షాన్ని పొందవచ్చు, అంటే దేవునిలోనికి ఐక్యమైపోతావు. నువ్వు జీవునిగా ఉన్నావు, నీవు ఎప్పుడో ఈ భూమి మీద కొచ్చి జీవునివైనావు. ఈ జీవుడు అనేవాడు ఎవడైనా, ఒక్కసారి పుట్టాడు. ఒక్కసారి నాశనమైపోతాడు. ఒక్కసారి లేకుండా పోతాడు. ఆ లేకుండా పోవడమే ముక్తి లేక మోక్షం, దేవునిలోకి ఐక్యం కావడం, జన్మరాహిత్యము అంటాము. ఎందుకంటే జన్మలు పొందవలసిన అవసరం లేదు. అంటే ఆ

శరీరం తగిలించుకోవాల్సిన పని లేదు. అటువంటిది ముక్తి అనేది దానికోసం మనం ప్రయత్నం చేయాలి. ఆ ప్రయత్నాన్ని మనం 'ముక్తి' అంటున్నాము. ఇంకా అనేక భాషలలో దీన్ని ఏమంటున్నాము అంటే, ముక్తి అని తెలుగులో అంటున్నాము, ఇంకో రకముగా 'మోక్షం' అంటున్నాము. ఇంకా కొంతమంది పరలోకం అంటున్నారు. సరే ఇప్పుడు అది ఎట్లుంటుంది అని అంటే దాని గురించి మనం కొద్దిగా చెప్పుకుంటే **లోకము** అంటే కంటికి కనిపించునది అని అర్థం. ఎందుకంటే **లోచన** అనేటటువంటి పదం నుంచి పుట్టినది లోకం అనే పదం. ఆలోచన అంటే మనస్సుతో చూసేటటువంటిది. ఆ రకంగానే శరీరంలో ఉండేటటువంటి ఐదు ఇంద్రియాల ద్వారా తెలియబడేటటువంటి దానిని లోకము అంటాము.

ఈ రకంగా ఈ లోకము అనేటటువంటిది ఏదైతే ఉందో, అది నువ్వు అనుభవిస్తూ ఉండేది, నీకు కనిపిస్తూ ఉండేది, నీకు తెలుస్తూ ఉండేది అని మనం చెప్పుకుంటాం. తర్వాత ఇంకొక లోకాన్ని ఏమంటున్నాం అంటే అది లోకం కానేకాదు. ఎందుకంటే నువ్వు అనుభవించేది కాదు, నువ్వు చూసేది కాదు, నువ్వు ఏ రకంగానైనా దాన్ని తెలుసుకునేదానికి అవకాశం లేదు. అటువంటి దానిని అలోకము అంటాం. అలోకము అంటే 'లోకము కాదు' అని అర్థము. దానిని ఇంకా ఏమంటాము అంటే లోకానికంటే వేరుగా ఉండేది అంటాము, పరలోకము అంటాము. లోకంకంటే పరంగా, వేరుగా ఉండేది కాబట్టి 'పరలోకము' అంటాము. పరలోకము అనేది ఎక్కడుంది అని అంటే, కనిపించేది కాదు కాబట్టి ఫలానా చోట ఉంది అని చెప్పేదానికి అవకాశమే లేదు. ఒక గ్రంథములో **"నేను పరలోకానికి పోతున్నాను, నేను పోనిదే ఇంకొకరు రారు. నేను పోయిన తర్వాత ఇంకొక వ్యక్తి మీ దగ్గరికి వస్తాడు"** అని ఒక గ్రంథములో ఉంది.

నేను పోయిన తర్వాత అతన్ని మీ వద్దకు నేను పంపుతాను అని ఒక గ్రంథములో ఈయన పోతాడు పోయి ఇంకొకరిని పంపిస్తాడు అని అక్కడ చెప్పినారు కదా! కాబట్టి పరలోకం ఎక్కడనో ఉంది అంటున్నారు. సరే పోతాడు, వస్తాడు అన్నప్పుడు ఎంతదూరం ఉంది అని ప్రశ్న వేస్తాము. పరలోకమనేది ఎంత దూరం ఉంది? అని ప్రశ్న వేస్తే ఎంత దూరముందో ఎవ్వరూ చెప్పలేరు. ఇంత దూరం అని ఇంత వరకు ఎవ్వరూ కొలత కొలచి చెప్పలేరు. ఎక్కడో పైన ఉంది అంటారు. ఎక్కడో పైన ఆ పైన ఎంత అని తెలియదు. సరేలే ఎంతో కొంత పైన ఎంతసేపు పోతాడు అంటే టైమ్ కూడా లేదు. ఒకవేళ మైళ్ళు దూరం ఎంత అని తెలియక పోయినా, కాలమన్నా తెలుస్తుందా అంటే అది కూడా తెలియదు.

దాన్ని ఊహించుకొని పరలోకం ఉంది అని చెప్తున్నారు తప్ప ఇంకొకటి ఏమీ కాదు. కానీ పరలోకం అనేది కనిపించేది కాదు. అది ఉంది అని చెప్పేదానికి ఏమాత్రము అవకాశం లేదు. కానీ ఉంది, అది దేవుడు చెప్పితే తెలియబడింది. నువ్వు దానిని చూడలేదు. నువ్వు దానిని చూసేదానికి అవకాశమే లేదు. నువ్వు ఎప్పుడు చూడగలుగుతావు? అంటే జ్ఞానాన్ని సంపూర్ణంగా తెలుసుకొని ఎప్పుడైతే నువ్వు జీవునిగా లేకుండా పోతావో అప్పుడు తెలిసే అవకాశముంది. భగవద్గీతలో అక్షర పర బ్రహ్మ యోగం అనేటటువంటి అధ్యాయం కలదు. ఇక్కడ ఏ పరబ్రహ్మ? అక్షర పరబ్రహ్మ అంటే నాశనం కాని పరబ్రహ్మ, మళ్ళీ బ్రహ్మ అనుకోవద్దండి. బ్రహ్మకంటే వేరుగా ఉండేటటువంటి ఒకాయన ఉన్నాడు, బ్రహ్మ అంటే పెద్ద అని ఏదైతే పెద్దగా కనిపిస్తావుందో నీకు ఆ పెద్ద కూడా కాదు. ఇంకా దానికంటే పెద్దగా కనిపించేటటువంటిది, అది నాశనం కానటు వంటిది, ఆ నాశనం కానట్టి బ్రహ్మ ఏదైతే ఉందో, ఆ పరబ్రహ్మను

గురించి చెప్పినటువంటి ఆధ్యాయంలో, 20వ శ్లోకంలో ఈ విధంగా ఉంది.

శ్లో॥ 20. పరస్తస్మాత్తు భావోన్యో వ్యక్తో వ్యక్తాత్సనాతనః ।
యస్ససర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥

**భావము :** "నాశనము లేని, మార్పుచెందని, ప్రకృతికంటే వేరైన, శ్రేష్ఠమైన, జగతి నాశనమైనను తాను నాశనము కాని అన్యమగుస్థితి ఒకటి కనిపించక ఉన్నది."

ఈ ప్రపంచమంతా పోయినా కానీ, నాశనం కాకుండా ఉండేటటువంటి కనిపించుకోకుండా, అవ్యక్తంగా ఉండేది ఒకటుంది అని చెప్తున్నాడు. అది మీకు కనిపించనటువంటిది. ప్రపంచమంతా నాశనమై పోయినా నాశనంకానటువంటిది. అటువంటిది ఒకటుంది, దానినే పరలోకం అంటున్నాము, దానినే మోక్షము అంటున్నాము. అది నాశనం లేనట్టిది, అచేతనమైనటువంటిది. ప్రకృతికంటే వేరుగా ఉంది. అది ఇప్పుడు నువ్వు ప్రకృతిలో ఉన్నావు. అది ప్రకృతికన్నా వేరుగా ఉన్నటువంటిది. ఇంకా ఏమి చెప్తున్నాడంటే, దాని గురించి అక్షర పరబ్రహ్మ యోగము, 21వ శ్లోకములో...

శ్లో॥ 21. అవ్యక్తోక్షర ఇత్యుక్తస్త మాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్యన నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥

**భావము :-** "దానినే కనిపించని నాశనము లేని స్థితి యనుచున్నాము. పరమగతి కావున దానిని తెలియవలయును, పొందవలెను. అది లభించినచో జన్మములు లేకుండా పోవును. దానినే నాదగు నియమ స్థానమని, పరంధామ మని చెప్పవచ్చును." దానినే అవ్యక్తం అంటారు.

అంటే కనపడనిది అంటారు. అక్షరం అంటారు. అది లభిస్తే ఇక జన్మలు ఉండవు. అది ప్రకృతికంటే వేరుగా ఉంది, అవ్యక్తంగా ఉంది అక్షరంగా ఉంది.

ప్రకృతికంటే వేరుగా ఉండేది ఏదైతే తెలియబడిందో, అది లభించిన తర్వాత జన్మ అనేది నీకు ఉండదు. దానినే ఇక్కడ పరమగతి అని అంటాము. దానినే నా నియమ స్థానం, అదే నేను ఉండేటటువంటిది అని దేవుడు అంటున్నాడు. ఇప్పుడు అది ఎక్కడ ఉంది అని అంటే అణువణువునా వ్యాపించి ఉంది అని చెప్పవచ్చును. ఫలానా ఇంత దూరం అని చెప్పలేము. ప్రకృతికంటే వేరుగా ఉంది, ప్రకృతికి తెలియకుండా ఉంది. నువ్వు ప్రకృతిని తెలుసుకుంటున్నావు కానీ, అది ప్రకృతికి తెలియకుండా, నీకు తెలియకుండా ఉంది. అది అంతటా ఉంది. నువ్వు ఎక్కడైతే ఉన్నావో అది అక్కడ కూడా ఉంది. నీ శరీరం లోపల ఉంది, నీ శరీరం బయట ఉంది. అదే మోక్షము, అదే పరంధామము, అది నాశనం లేనిది, అవ్యక్తమైనటు వంటిది, కనపించేటటువంటిది కానే కాదు. అదే దేవుని నియమస్థానం అదే మోక్షం అంటారు. దానిలోనికి నువ్వు రావాలంటే ఏమి చేయాలి? జ్ఞానాన్ని సంపూర్ణంగా తెలుసుకోవాలి. జ్ఞానాన్ని తెలుసుకోవాలంటే ఏమి చేయాలి? వాస్తవమైనట్టి జ్ఞానం ఏమిటని మనం పరిశోధనగా చూడాలి. ఇప్పుడు నీ పరిస్థితి నీకే తెలియకపోతే నువ్వెక్కడ ప్రయాణం చేయాలనుకుంటావు? అసలు ఎక్కడ పోవాలని ప్రశ్నే రాదు. నువ్వు ఏమి చేస్తున్నావు. తింటున్నావు, బ్రతుకుతున్నావు కాలం గడుస్తా ఉంది. కాలం గడిచే కొద్దీ వయస్సు పెరుగుతూ ఉంది. వయస్సు పెరిగే కొద్దీ ముసలివాడివి అవుతున్నావు. చివరకు శరీర మార్పిడి జరుగుతుంది. నువ్వు అట్లే ఉంటావు, మరణము నీ శరీరమునకు కల్గుతుంది.

ఒకవేళ మధ్యలో ప్రమాదము జరిగి అకాల మరణం అయినా కానీ, తిరిగి ఆయుష్షు ఎంతకాలం ఉంటుందో, అంతకాలం నువ్వు భూమి మీద ఉండాల్సిందే. ఒకడు మధ్యలో చనిపోయినా కానీ భూమిమీదే ఉంటాడు. అకాలములో చనిపోతే ఇల్లు విడిచిపెట్టి పోయేదానికి లేదు. వేరే ఎక్కడికి పోతాడు వాడు. ఇంతకుముందు ఎక్కడ ఉన్నాడో అక్కడే బంధువులు మధ్యలోనే ఉండాలి. నీ బంధువులను నువ్వు అడిగినా వాళ్ళు పలుకరు, నీ శబ్దము వాళ్ళకు వినిపించదు. అప్పుడు, నీ అంతకు నువ్వు అన్నము పెట్టుకొని తినాలి. నీ అంతకు నువ్వు పని చేసుకొని బ్రతకాలి. అప్పుడు ఈ రకంగా తయారైతుంది. అప్పుడు ఇంకా ఘోరంగా ఉంటుంది ఆ జీవితము. ఈ రకంగా ఎన్ని రకాలుగా నువ్వు జీవితం పొందినా కానీ, కాలమరణం పొందినా, అకాలమరణం పొందినా, తాత్కాలిక మరణం పొందినా, నీకుమాత్రం ఈ కష్టసుఖాలు తప్పవు. ఈ శరీర మార్పిడి ఎన్ని జరిగినా కానీ కష్ట సుఖాలు తప్పవు. తర్వాత దీనికి ఏమి చేయాలి? దీనికి ఏమి పరిష్కారం? అంటే ఒకటే ఒకటి కలదు. అదే మోక్షం కావాలి అనడం, దేవునిలోకి ఐక్యం కావాలనడం. దేవునిలోకి ఐక్యం కావాలంటే ఏమి చేయాలి? మనం జ్ఞానాన్ని జాగ్రత్తగా తెలుసుకోవాలి. జ్ఞానాన్ని తెలుసుకుంటే కానీ దేవుడు అనే విషయం, జీవుడనే విషయం మనకు అర్థంకాదు. దేవునికి మనకు మధ్యలో ఎన్ని అడ్డుగా ఉన్నాయి, అనే విషయం కూడా మనకు తెలియదు.

అందువలన దేవుని జ్ఞానాన్ని తెలుసుకునేదాని కోసం మనము ఏమి ప్రయత్నం చేయాలి అంటే, మనకు భగవద్గీత ఉంది. భగవద్గీత తెలుసుకోవచ్చు, లేకపోతే ఇంకోటి ఇంకోటి వేరే రెండు మూల గ్రంథాలు ఉన్నాయి. దేవుడు ఇచ్చిన దానిని ఏదైనా మనం తెలుసుకోవచ్చు. దానివల్ల

మనం ముందుకు పోవచ్చు. కానీ ఈ పరలోకము అనేటటువంటిది నీకు తెలియకపోతే, అసలు నువ్వు ఎవరివో నీకు తెలియకపోతే, నువ్వు చేరవలసిన గమ్యస్థానం ఏదో నీకు తెలియకపోతే ఏమి ప్రయత్నం చేస్తావు నువ్వు? చేసే దానికి అవకాశం లేదు. దేవుడు నీకు చెప్పాడు. ముస్లీమ్‌ల గ్రంథం అనే ఖురాన్ గ్రంథములో కూడా 6వ సూరాలో 98వ వాక్యంలో **"నీకు రెండు నివాస స్థలాలు ఏర్పర్చి పెట్టాను"** అని చెప్పాడు. ఒకటేమో ఆ ప్రపంచం, రెండవది జ్ఞానం. ఆత్మను చేరగలిగితే అక్కడ ఆత్మకు అప్పగింప బడతావు. అంటే జ్ఞానం తెలుసుకుంటే ఆత్మకు అప్పగింపబడతావు. ఆత్మ నిన్ను తీసుకుపోయి దేవుని రాజ్యంలోకి చేరుస్తుంది. అంటే దేవునిలోకి చేరుస్తుంది. ఈ రకంగా దేవునిలోనికి ఐక్యం చేసేటటువంటి పని ఆత్మది. మధ్యవర్తిగా ఉంది ఆత్మ, జీవునికి దేవునికి మధ్యలో మధ్యవర్తిగా ఆత్మ ఉంది. కాబట్టి నువ్వు ప్రపంచంలో బ్రతుకుతావా, నీలో ఉండే ఆత్మను తెలుసుకుంటావా? రెండే నిర్ణయాలు. మనం బ్రతికేదంతా ప్రపంచంలో బ్రతుకుతున్నాము. రెండవ ఆత్మను గురించి తెలుసుకోవాలి అనుకోవడం లేదు.

రెండవ ఆత్మ ఒకటుంది అని తెలియలేదు. అసలుకు పరమాత్మ అనే దేవుడు ఉన్నాడు అని చాలామంది అంటారు. దేవుడు అన్నీ చూస్తున్నాడు, దేవుడు అన్నీ చేస్తున్నాడు అంటే, ఆయన ఏమీ చేయడు కానీ అన్నీ చేస్తున్నాడు. నాకు కష్టం తెచ్చే, నష్టం తెచ్చే, దేవుని దగ్గర చాలా అన్యాయం ఉంది. నేను ప్రొద్దున లేచి ఉదయం, సాయంకాలం రెండు పూటల పూజ చేసేవాడిని. దేవునికి ఆ రెండు పూటల పూజ చేసినా కానీ దేవుడు నాకు అన్యాయం చేసినాడు. నాకు వ్యాపారంలో నష్టం వచ్చేటట్టుగా చేసాడు. లేకపోతే ఇంకోటి ఇంకోటి అని మనం దేవున్ని నిందిస్తుంటాము.

పరమాత్మ ఏమీ చేయడు, ఏ పని చేసేవాడు కాదు. కాబట్టి ఆయనను ఏమీ అనవలసిన పనే లేదు. అంటే మనకే పాపం వస్తుంది. ఆ విధంగా ఆత్మ దేవున్ని పరమాత్మ దేవున్ని గుర్తించగలిగినాము. అన్నీ చేసేది ఆత్మ, చేయకుండా ఉండేది పరమాత్మ నిన్ను నువ్వు గుర్తించగలిగితే, ఒకడిని ఉన్నాను అని నిన్ను నువ్వు గుర్తించగలిగితే, నీకు పరమాత్మకు మధ్యలో ఆత్మ ఉన్నది అని గుర్తించినటువంటి విధానము ఎక్కడా లేదు. అంటే మిమ్మల్ని మీరు గుర్తించకపోయినా, ఈ ఆధ్యాత్మికవేత్తలు అనేటటువంటి పేరు పెట్టుకున్న గురూజీలు, స్వామీజీలు ఏమి చేశారంటే జీవుడు, దేవుడు అని చాలా మంది చెప్పుకుంటూ వచ్చారు. జీవున్ని, దేవున్ని ఆధారం చేసుకొని చాలా బోధలు చెప్పారు. ఇప్పుడు జీవుడు, దేవుడు అని ఎంత చెప్పినా కానీ మధ్యలో ఉండే ఆత్మను పూర్తి మరిచిపోయినారు.

ఈ మధ్యలో ఉండే ఆత్మను మరచిపోయిన దానివలన ఆధ్యాత్మికము అనేటటువంటిది తెలియకుండా పోయింది. **"ఆత్మను అధ్యయనం చేయడమే ఆధ్యాత్మికము"** కాబట్టి ఆత్మే లేకపోతే ఇక ఆధ్యాత్మికము ఎక్కడ ఉంది? పేరుకే ఆధ్యాత్మికము కానీ ఏమాత్రం లేదు. ఆత్మను నువ్వు తెలుసుకో గలిగితే, అంటే మధ్యవర్తిగా ఉండేటటువంటి ఆత్మను నువ్వు తెలుసుకో గలిగితే, ఆ ఆత్మ దయదలిచి నిన్ను తీసుకుపోయి పరమాత్మకు అప్పచెప్తుంది. అంతవరకు ఏమాత్రం దేవునికి అప్పజెప్పేదానికి అవకాశమే లేదు. అంటే నువ్వు ఈ భూమి మీదనే దేవునిగా ఉండాల్సిందే. ఇప్పుడు మనం ఈ మధ్యకాలంలో ఇక్కడికి కొంతమంది వచ్చారు. ఈ జ్ఞానం తెలుసుకొని ఏమి ప్రయోజనం ఉంది? 2012 లో డిసెంబర్ 21 వ తేదీన మొత్తం ప్రళయమై పోతాదంట. జ్ఞానము తెలుసుకొని ఏమి ప్రయోజనం? తెలుసుకున్నా ఒకటే, తెలియకున్నా ఒకటే అని చెప్పారు. అదే విధముగా

చాలామంది ప్రచారం చేశారు. అక్కడ పెద్ద పెద్ద తెలిసిన వాళ్ళందరూ అట్లే ప్రచారం చేశారు. మేము అంతకుముందు సంవత్సరం ముందు ఒక గ్రంథము వ్రాశాము. **"కలియుగము ఎప్పటికీ యుగాంతము కాదు"** అని, కలియుగము ఎప్పటికీ అంతం కాదు అని దాంట్లో చెప్పాము. ఈ జీవుడు మామూలుగా కంటిన్యూగా బ్రతికేదుంది, కర్మలు లేకపోతే కదా! వీడు (జీవుడు) నాశనమయ్యేది, ఈ ప్రపంచం లేకుండా పోయేది. అప్పటి వరకు అటువంటి పరిస్థితి ఏర్పడదు అని చెప్పాము.

కాబట్టి ఇప్పుడు మేము చెప్తున్నాము. మనం ప్రపంచ జీవరాసులలో 95 శాతం రెండు యుగాలకు రిజర్వేషన్ చేసుకున్నాము. మనం జన్మలు ఎత్తేదానికి రెండు యుగాల జన్మలు రిజర్వేషన్ చేసుకొని పెట్టుకొన్నాము. ప్రతి ఒక్కరు రెండు యుగాల జన్మలు రిజర్వేషన్ చేసుకొని పెట్టుకుంటే మనం తప్పనిసరిగా పుట్టాలని. మనమే నమోదు చేసుకొని పెట్టుకున్నాము. అటువంటప్పుడు కలియుగం అయిపోతాది అని ఎట్లా చెప్పగలము పోయేదానికి అవకాశమే లేదు. ప్రళయము వస్తుంది అని అంటే ఏమి వచ్చినా, ఏమీ పోదు పోయేదానికి అవకాశం లేదు. ఎప్పటికీ పోదు, అని వ్రాశాము. సరే 95 శాతం ఉందనుకోండి. ఇంకొన్నాళ్ళ తరువాత 96 శాతం అయితాది. ఒకవేళ ఎట్లోకట్లా తగ్గించినాడు అనుకోండి దేవుడు, జ్ఞానం తెలుసుకొని కొద్దిగా తగ్గిపోతే, ఒకవేళ 5 శాతం తగ్గిపోయినా మళ్ళీ కొన్నాళ్ళకు 5, 10 శాతం మళ్ళీ ఎక్కుతుంది. మనకు ఈ ప్రపంచం ఇలా కొనసాగుతూ ఉండాల్సిందే. కానీ దీనికి ఇంక అంత్యం అంటూ లేనే లేదు. మళ్ళీ ఈ రకంగా 95 శాతం మనషులం మనం రెండు యుగాల పర్యంతం జన్మలు ఖాయం చేసుకున్నాము. మనం పట్టా తీసుకొచ్చాము. ఎక్కడికీ పక్కకు పోకుండా జన్మల స్థితిలో ఉన్నాము. ఈ జన్మ నుండి

తప్పించుకోవాలంటే ఎంత భయంకరంగా ఉంటుందో చూడండి 95 శాతం ఉంటే తప్పించుకునే అవకాశం లేదా? జ్ఞానం వల్ల తప్పించుకోవచ్చు కదా, అని మీరు ప్రశ్న వేస్తే, జ్ఞానం వల్ల కూడా తప్పించుకునేదానికి వీలు లేదు. ఎందుకు వీలులేదు అంటే ఈ 95 శాతం అందరికీ ముందే తీర్పు తీర్చబడింది. వాళ్ళకు జ్ఞానం తెలియకుండా పోతుంది. ఏమన్నా 5 శాతం మందికి జ్ఞానం తెలియవలసిందే కానీ 95 శాతం మందికి అవకాశమే లేదు. ప్రపంచంలో ఇప్పుడు మీకు తెలిసిన జ్ఞానం ఎంతమందికి తెలుసు, లెక్కవేసుకోండి 5 శాతం కూడా లేదు.

ఒకవేళ తెలుసుకునేదానికి అవకాశమున్నా కానీ తెలియబడదు. భవిష్యత్తులో తెలియబడుతుందేమో కానీ ఇప్పుడు మాత్రం తెలియబడదు. వాళ్ళకు ఈ జ్ఞానం తెలుసుకునేదానికి 95 శాతంమందికి అవకాశమే లేదు. అటువంటి అవకాశం లేనివాళ్ళ దగ్గరికి మీరు గ్రంథం తీసుకొని పోయి, ఇది చాలా గొప్ప గ్రంథం అని నువ్వు ఎంత పొగిడి, ఈ జ్ఞానాన్ని గురించి చెప్పినా చూచేదానికి నాకు తీరికే లేదు అంటాడు. వాడు మూత్ర విసర్జనకు పోయే దానికి తీరిక ఉంది, మలవిసర్జనకు పోయేదానికి తీరిక ఉంది. ఒక వారం రోజులైనా బాత్‌రూమ్‌లోనే కూర్చునే తీరిక ఉంది. కానీ దేవుని జ్ఞానం తెలుసుకునేదానికి తీరిక లేదంట. తీరిక ఉండదు, ఉండకూడదు. ఒకవేళ ఉన్నా కానీ మాయ ఏమి చేస్తుంది అంటే, ఇది పనికిమాలిన జ్ఞానము, దీనిని ఎందుకు నేర్చుకుంటావు అని నేర్పిస్తుంది వాడికి. వాడు వినకూడదు, ఈ జ్ఞానంలోకి రాకూడదు. ఈ రకంగా మాయ ఈ విధంగా నేర్పించే దానికి మొదలుపెడుతుంది. మాయ అలా నేర్పించిన దానివలన వాడు ఏమాత్రం ఈ జ్ఞానంలోకి ప్రవేశించకుండా పోతాడు. ఎందుకంటే దేవుడు ముందే తీర్పు తీర్చి పెట్టాడు, వాళ్ళకి

జ్ఞానం గట్టు దొరకకుండా చేస్తాను అని, నా జ్ఞానం గట్టు ఏమాత్రం దొరకదు అని చెప్పాడు.  అటువంటి తీర్పు తీర్చాడు కాబట్టి, వాళ్ళకు ఏమాత్రం ఈ జ్ఞానం అర్థమే కాదు.  నువ్వు ఎంతన్నా చెప్పు అర్థం కాదు. ఒకవేళ అంత చెప్తూ ఉంటే, వాడు ఏమి చేస్తాడంటే ఏదైనా పనికి, నిన్ను ఉపయోగించు కుంటాడు కానీ జ్ఞానం మాత్రం వినడు.  ఈ రకంగా మీరు ప్రత్యక్షంగా చూసివుంటారు.  ఎంతన్నా చెప్పు జ్ఞానం, విననివాళ్ళంతా, ముందే శాప గ్రస్తులైనట్టి వాళ్ళు, అంటే తీర్పు తీర్చబడినట్టివాళ్ళు, వాళ్ళకు ఏమాత్రం జ్ఞానం తెలియబడేదానికి అవకాశమే లేదు.  అందువలన వారు ఎవరైతే వినరో, వారు తెలుసుకునే దానికి అవకాశమే లేదు.

అందువలన మీరు ఎవరైతే తెలుసుకునే దానికి అవకాశం ఉందో, వాళ్ళకి తెలియజేప్పే ప్రయత్నం చేయండి.  కానీ ఒక్కసారి చూస్తేనే మీకు అర్థమైపోతుంది.  కొన్ని మాటలలోనే వీనికి దేవుడు గట్టు దొరకకుండా ముందే చేశాడు అని తెలుస్తుంది.  మాయ అనేది నీ శరీరంలో ఉంది, నువ్వు దాని మధ్యలోనే ఉన్నావు కాబట్టి అది నీకు ఏమాత్రం జ్ఞానం అర్థం కాకుండా చేస్తుంది.  మనిషికి ఎంతన్నా జ్ఞానము చెప్పు, మాయ ఏమాత్రం వినేటట్టు చేయదు. ఈ రోజు పెద్ద పెద్ద పండితులున్నారు, జ్ఞానంలో ఉపన్యాసాలు చెప్పే వాళ్ళున్నారు. వాళ్ళు వాళ్ళ మతాల్లో పండితులు అని పేరుగాంచినవాళ్ళు ఉన్నారు.  వాళ్ళ గ్రంథాలను ఏ విధంగా తీర్చి వ్రాసు కున్నారో చూడండి.  దేవుడు చెప్పిన జ్ఞానాన్ని తప్పు భావంతో వ్రాసుకోలేదా? అంత పెద్ద పండితులు ఎందుకు అలా వ్రాసుకున్నారు. అంటే వాళ్ళకి అర్థం కాలేదు.  తర్వాత వారిని అనుసరించిన వాళ్ళకు కూడా ఏమాత్రం అర్థం కాకూడదని, దేవుడు ముందే అలా వ్రాయించి పెట్టాడు.  అటువంటి పండితులకి తప్పు భావాలు ఎందుకు అందించాడు. తన జ్ఞానం ప్రజలకి

తెలియాలి అని ఆయనకు కోరిక లేదా? ఉంది, ఎవరికి తెలియాలి? నన్ను కోరుకున్నట్టి వాళ్ళకి తెలియాలి, తన మీద శ్రద్ధ ఉన్నట్టి వాళ్ళకి తెలియాలి. అటువంటి వాళ్ళకి తెలిసేదానికోసమే ఆయన జ్ఞానం చెప్పాడు. బుద్ధి గ్రాహితశక్తి ఉన్నటువంటి వాళ్ళకి మాత్రమే నేను జ్ఞానం చెప్తాను. ఆ విధంగా గ్రాహితశక్తి లేనివాళ్ళు చాలామంది ఉన్నారు. 95 శాతం ఉన్నారు. వాళ్ళకు కాదు వాళ్ళకోసం ఇటువంటివి వ్రాసిపెట్టాము, అవన్నీ తప్పు జ్ఞానాలే, అన్నీ తప్పు భావాలతో నిండుకున్న జ్ఞానాన్ని వ్రాయడం జరిగింది. ఎవరు వ్రాసారు? జీవునికి (మనిషికి) ఏ పని చేసే అధికారం లేదు. దేవునికి తెలియకుండా ఏ పని జరగదు.

దేవుని ఆజ్ఞతో ప్రకృతి ఆ పని చేసి పెట్టింది. మనిషి తలలో ప్రేరేపణ చేసి, ఆ విధంగా తప్పు భావాలు అందించి ఆ రకంగా చేసింది. ఇప్పుడు వాస్తవమైన భావాలు నువ్వు చెప్పినా కానీ, వాడు వినడు తప్పు భావమే కరెక్టు అంటాడు. అది కరెక్టు కాదు అని నూటికి నూరుపాళ్ళు తెలిసినా కానీ, దేవుడే దిగి వచ్చి ఇది కాదు అని చెప్పినా కానీ వాడు వినడు. వీడు ఎలాగూ పక్కదారిలో పోవాలని ముందే అనుకున్నాడు. కాబట్టి దేవుడు చెప్పడు. ఒకవేళ దేవుడు భగవంతునిగా వచ్చి, తన జ్ఞానాన్ని చెప్పినా అది 5 శాతం మందికే ఉపయోగపడుతుంది, కానీ 95 శాతం మందికి ఉపయోగపడే అవకాశమే లేదు. ఆ 95 శాతంలో మనం ఉన్నామా? అని మీరు అనుకుంటే, అంటే ఒకవేళ లేకపోయినా మనం అలా ఉండకూడదు అనే భయంతో మీరు దేవుని జ్ఞానాన్ని తెలుసుకోవాలనే ప్రయత్నం చేయండి. ఒక్కసారి శాపగ్రస్తులైన తర్వాత దేవుడు కూడా వాళ్ళను మార్చలేడు.

బైబిల్‌లో తీసుకోండి, భగవద్గీతలో తీసుకోండి, ఖురాన్‌లో తీసుకోండి దానిలో కూడా కొంత మిశ్రిత జ్ఞానం ఉంది. అంటే అజ్ఞానంతో కూడుకున్న జ్ఞానం ఉంది, జ్ఞానంతో కూడుకున్న అజ్ఞానం ఉంది, రెండు ఉన్నాయి. మనం ఏమి చెప్తుంటాము అంటే ఒకసారి ఇందూ సాంప్రదాయాల్లో తలంబ్రాలు పోసేదానికి ఒక అర్థము చెప్పాము. భార్యకు అయితే భర్త పోస్తాడు. భర్తకు అయితే భార్య పోస్తుంది. ఒకరికొకరు పరస్పరం పోసుకుంటారు. ఈ పోసుకునేటి గింజలు బియ్యం కాబట్టి, బియ్యం చంద్రుని దాన్యమైన జ్ఞాన చిహ్నాలు. తన భర్తకు జ్ఞానం తెలియకపోతే నా భర్తకు నేను జ్ఞానము అందిస్తాను అను భావముతో భార్య పోస్తుంది. ఒకవేళ భార్యకు జ్ఞానము తెలియకపోతే నేను తెలియజేస్తాను అని భర్త పోస్తాడు అది ఆనాటి ప్రమాణము.

ఆ రోజు ప్రమాణం చేసి ఒకరికొకరు మేము జ్ఞానం తెలియ జేసుకుంటాము ఇప్పటినుంచి అనే ఉద్దేశ్యంతో వాళ్ళు ఆ రకంగా చేస్తారు. అని చెప్పినాము కానీ ఆ రకంగా చేయడంలో కూడా ఒకటి ఉంది. దానిలో ఒక కొబ్బరి చిప్ప పెట్టి, దానిలో ఒక బెల్లం ఉండ పెట్టి మధ్యలో పోయిస్తారు. మధ్యలో కాకపోయినా కానీ చివరిలోనైనా పోయిస్తారు. బియ్యం జ్ఞానానికి గుర్తు కదా, మళ్ళీ జ్ఞానచిహ్నాలు కదా! నేను ఆ రకంగా జ్ఞానాన్ని అందిస్తాను అని పోసినప్పుడు, ఈ కొబ్బరి చిప్ప బెల్లం ఉండ ఇవి ఎందుకు పెట్టారు అంటే, కొబ్బరి కూడా జ్ఞానానికి సంబంధించినటువంటిదే. ఈ కొబ్బరి కూడా జ్ఞానచిహ్నామే అని చెప్పుకున్నాము. మళ్ళీ బెల్లం పెట్టారు బాగా తియ్యగా ఉంటాది, ఈ జ్ఞానంలోకి ఈ మాయ జ్ఞానం కూడా కలిసి బాగా ఈ రెండు కలుపుకొని తింటే చాలా రుచిగా ఉంటుంది చూడండి. కొబ్బెర బెల్లం ఆ రకంగా ఉంటుంది. ఈ జ్ఞానం ఉత్త కొబ్బెర తింటే ఒక రకంగా

ఉంటుంది. కొబ్బెర బెల్లం తింటే ఒక రకంగా ఉంటుంది. అటువంటి రెండు కలిసిన ఉత్త జ్ఞానమే కాదు నీకు అందించేది. నీకు ఈ జ్ఞానం కూడా ఉంటుంది. దీనిలో మిక్స్ అయిన జ్ఞానం కూడా ఉంటుంది. దీనిలో అంటే అది కూడా అందించబడుతుంది కొంత. కానీ ఏ దానిని తీసుకోవాలి అంటే 'అది పక్కకేసి ఉత్త బియాన్నే తీసుకోవాలి మనం' అనే ఉద్దేశ్యంతో అక్కడ ఇందూ సాంప్రదాయాలు అనేదానిలో ఈ రకంగా పోయిస్తారన్న మాట. బెల్లం కొబ్బెర కథ మీకు చెప్పలేదు. కానీ మళ్ళీ ముందే చెప్పినారు కదా, మాకు అజ్ఞానం కూడా ఉంటాది అని మేం దానిలోకి పోయినాము అని అంటారు. అట్లా లేకుండా బియ్యం కథ చెప్పినాము.

మనం ఇప్పుడు లెక్కవేసుకొని చెప్పితే జ్ఞానములో మాయ జ్ఞానం ఉంది, పరమాత్మ జ్ఞానం ఉంది. రెండూ మిక్స్ అయివుంది. అంటే పక్క దారిలో పంపించే జ్ఞానము ఉంది, సరైన మార్గంలో పంపించే జ్ఞానము ఉంది. **దేవుడనుకుంటే నిన్ను సరైన మార్గంలో పంపిస్తాడు. దేవుడు అనుకుంటే నిన్ను సరైన మార్గంలో పంపించడు.** నేను అనుకుంటే నువ్వు నువ్వుగానే ఉంటావు. నేను అనుకుంటే నువ్వు ఇంకొకనిగా ఉంటావు. జ్ఞానిగా అయినా అజ్ఞానిగా అయినా ఏ రకంగా అయినా ఉంటావు. ఈ విధముగా లెక్కవేసుకుంటే మనము మన ఉద్దేశ్యమును బట్టి మనకు మార్గము అభిస్తుంది అదే దైవమార్గము. ఆ మార్గాన్ని బట్టి నువ్వు పోయేది ఉంటుంది. కాబట్టి నీ ఉద్దేశ్యం మంచిదైతే మంచి జ్ఞానము లభిస్తుంది. నీ ఉద్దేశ్యం చెడ్డదైతే, ఈ చెప్పే జ్ఞానము కూడా అటువంటి మార్గం తప్పి పోకుండా మంచి ఉద్దేశ్యం పెట్టుకొని, మంచి జ్ఞానం కావాలని దేవున్ని కోరుకుని దేవుని మీద ఇష్టం కలిగి ఉండండి. దేవుని మీద శ్రద్ధ కలిగి ఉండండి. ఆ రకంగా ఉండేవాళ్ళకి మీకు జ్ఞానం కలిగే అవకాశం ఉంది.

కానీ అట్లా లేకపోతే ఏమాత్రం ఎంతమంది చెప్పినా కానీ ఒక రవ్వ కూడా వాని చెవికి ఎక్కదు. ఇది వాస్తవమైన జ్ఞానం. ఈ జ్ఞానం ఇటువంటిది అని మీరు తెలుసుకొనే దానికోసము మనకు ఇటువంటి సమావేశాలు ఏర్పర్చుకుంటాము. ఎదుటివాళ్ళను మనం కించపరిచే ఉద్దేశ్యముతో, లేకపోతే మనం గొప్ప వాళ్ళమన్న ఉదేశ్యముతోనో, మనం ఈ మీటింగ్‌లు చెప్పుకోలేదు. అంటే దేవుని జ్ఞానం ఈ విధంగా ఉంది. ఈ విధంగా ఉంటేనే మనం జ్ఞానము తెలుసుకోగలుగుతాము అని చెప్పుతూ జన్మదినం అనేది వాస్తవంగా జీవునికి కాదు. అది శరీరానికి శరీరములో ఉండేటటువంటి యంత్రాంగానికి జన్మదినం వస్తుంది గానీ మనకు కాదు. వాస్తవంగా నా జన్మదినం ఈ రోజు కానే కాదు. నేను ఎప్పుడో పుట్టినవాడిని, ఎంత ఆయుష్షు అనేది తెలియదు. ఒక ఆయన చెప్పాడు ఏసుప్రభువును "అబ్రహామ్‌కంటే నువ్వు ముందు పుట్టినోడివా అబ్రహామ్ 42వ తరమువాడు 42 తరాల ముందు నువ్వు పుట్టినావా" అని అడిగితే, ఆయనకంటే ముందు నుండి ఉన్నాను అని చెప్పాడు. ఆ రకంగా మనం ఎంతో కాలము నుంచి మనం ఉన్నాము. ఆ విషయం మనం మర్చిపోయినాము. ఇప్పుడే మనం ఉన్నాం అని అనుకోకూడదు. ఆ విధంగా అనుకునేదానివల్ల మనకే నష్టం వస్తుంది. మనం ఏ జ్ఞానం తెలుసుకోకుండా పోతాము. అందువలన మీరు ఇప్పటి నుంచి ఉండేవాళ్ళు కాదు. మన శరీరం పుడుతుంది మనకు పుట్టినరోజు లేనే లేదు.

# 76. గుర్తింపబడని వాడు గురువు

**(తేది : 12.07.2014)**

ఇక్కడికి వచ్చిన వారందరికీ ఈ రోజు గురుపౌర్ణమి అని తెలుసు. ఇటువంటి గురుపౌర్ణమిలు చాలా మనము జరుపుకున్నాము. జరుపుకున్న ఆ సందర్భములో అంతా గురువును గురించి మనము చెప్పుకున్నాము. గురువును గురించి ఐదు ఆరు సంవత్సరాలు బాగా వివరముగా చెప్పుకుంటూ వచ్చాము. ఆ రకంగా చెప్పితే ఇక చెప్పేది ఏమీ లేదు అనేటట్లు ఉంటుంది. అయినా గురువును గురించి మనము చెప్పాల్సింది ఎంతో ఉంది. ఎందుకంటే ఆయన గురించి చెప్పేదానికి అంతం లేదన్నమాట. అతను గురువు అనేవాడు ఒక వ్యక్తి కాదు, ఒక వ్యక్తి అయితే ఇంత అని తెగేసి చెప్పవచ్చు. ఆయన ఒక వ్యక్తి కాదు కాబట్టి, అతను గురించి ఎంతైనా చెప్పుకోవచ్చును, ఎన్ని రకాలుగా అయినా చెప్పుకోవచ్చు. నేను కొంత వయస్సు వచ్చిన తరువాత 'గురువు' అనే పదాన్ని విన్నాను. గురువు అనే పదాన్ని విన్నప్పుడు అతను కొంతమందికి ఏదో జ్ఞానాన్ని ఉపదేశమిస్తుంటాడు అనుకొన్నాను. అటువంటివాల్లు గురువులుగా చెలామణి అవుతున్నారు అని అనుకున్నాము. అంటే గురువుగా ఉండేవాళ్ళు కొంతమంది ఉన్నారు అని ఆ రోజు తెలిసింది. ఈ విధముగా, కొంతకాలము గడచిన తరువాత, చాలామంది గురువులు ఉన్నారని తెలిసింది. ఇంకా కొంతకాలము తరువాత గురువులలో చాలా పెద్ద గురువులు కూడా ఉన్నారు అని తెలిసింది. అంటే ఇంకా కొంతకాలము గడచిన తరువాత 'గురువులు ఎవరూ లేరు' అని తెలిసింది. ఈ రకంగా లెక్కవేసుకుంటూ పోతే మొదట ఉన్నారని, తర్వాత చిన్నవారు, పెద్దవారున్నా

రనీ, ఆ తరువాత ఇంకా పెద్దవారు ఉన్నారని, చివరకు ఎవరూ లేరని అనుకోవడము జరిగింది. ఇది సహజంగా జ్ఞానము తెలిసేకొద్దీ అర్థమైన విషయము. ఇప్పుడు మనము లేరు అని అనుకొంటే ఎట్లవుతుంది. చాలామంది ఉన్నారు కదా! గురువులు అని మనము అనుకోవచ్చు కానీ ఇప్పుడు ప్రత్యేకంగా నేటి సమాజములో గురుపౌర్ణమికి షిరిడి సాయిబాబా దేవాలయాలన్నీ కిక్కిరిసిపోతున్నాయి. ఎక్కువ షిరిడి సాయిబాబాను గురువుగా అందరూ గుర్తిస్తారు. అంటే మామూలుగా చాలామందికి తెలియనటువంటి చిన్నవయస్సు వాళ్ళు అందరికంటే షిరిడి సాయిబాబా ఒక్కడే గురువు అనేటటువంటి భావము వచ్చేస్తావుంది. చిన్నవయస్సు ఉండేవాళ్ళకు పెద్ద వయస్సు వచ్చిన తరువాత, చాలామంది గురువులు ఉన్నారని, తెలుస్తుంది.

ఆ రకంగా ఎవరు ఏ రకంగా అనుకున్నాగానీ, గురువు ఫలానా వాడు అని వేలెత్తి చూపగలమా? అంటే ఎటువంటి సందర్భములోనూ చూపేదానికి అవకాశము లేదు. గురువు ఒక వ్యక్తి కాదు. మనుషులు అనేటటువంటి వాళ్ళనే మనము గురువుగా లెక్కేస్తే, గురువు అనేటటువంటి వాడు జ్ఞానము చెప్పేవాడు అనేకదా! మనము అనుకునేది. ఏ జ్ఞానము చెప్పేవాడు గురువు, దేవుని జ్ఞానము చెప్పేవానిని గురువు అంటే మనుషులలో గురువులుగా యున్నవారు చాలామంది యున్నారు. అట్లు చివరకు ఒకన్ని పెద్ద గురువును ఎన్నుకున్నాగానీ. చివరకు దేవుని విషయములోకి వస్తే **"దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియదు"** అనే శాసనము ఒకటుంది. దేవుని జ్ఞానము దేవుని వలననే తెలియబడుతుంది. లేకపోతే తెలియబడదు. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మనిషికి తెలియదు అన్నప్పుడు జ్ఞానము చెప్పేవాడు గురువు అయితే అటు ఏ మనిషీ చెప్పలేడు

కదా! కాబట్టి ఏ మనిషీ గురువు కాడు. ఎందుకు అని అంటే మనిషి అయినటువంటి వానికి దేవుని జ్ఞానము తెలియదు. దేవుని జ్ఞానము దేవునికే తప్ప ఏ మనిషికీ తెలియనప్పుడు గురువు ఎవరుగా ఉండాలి అంటే దేవుడే గురువుగా ఉండాలి. దేవుడు ఎటువంటి వాడు ఎవరికీ కనిపించడు రూప, నామ, క్రియారహితుడు అంటే పని చేయడు, పేరు లేదు తరువాత ఆకారము లేదు. ఎవరికి, దేవునికి. ఆయన గురువు కావున ఆయనకు మాత్రమే జ్ఞానము తెలుసు. ఎవరి జ్ఞానము, ఆయన జ్ఞానము. 'ఆయన జ్ఞానము ఆయనకు మాత్రమే తెలుసు ఏ మానవునికీ తెలియదు' అని ఈ వాక్యం ఎక్కడ చెప్పారు. మీరే చెప్పుచున్నారా అని అంటే లేదు దైవగ్రంథమైనటువంటి ఒక గ్రంథములో ఉంది.

మనకు దైవ గ్రంథాలు మూడు ఉన్నాయి. మొదటిది ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత, ద్వితీయ దైవగ్రంథము బైబిల్, అంతిమ దైవగ్రంథము, మూడవ దైవగ్రంథము ఖురాన్ గ్రంథము. ఖురాన్ గ్రంథములో 3వ సూరాలో 7వ ఆయత్‌నందు **"దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియదు"** అనే వాక్యము ఉంది. దేవుని జ్ఞానము ఏ గ్రంథమునుంచైనా మనము తీసుకోవచ్చు. మొట్టమొదట సూర్యగ్రహము ఏ విధముగా మనువుకు భగవద్గీత జ్ఞానము చెప్పిందో, ఆ రకంగానే ఇంకొక గ్రహం, ఇంకొకచోట చెప్పినటువంటి జ్ఞానాన్నే మనము వ్రాసుకుని దానిని 'ఖుర్ఆన్ గ్రంథము' అంటున్నాము. అక్కడ చెప్పిన 3వ సూరాలో 7వ ఆయత్‌లో ఒక వాక్యం ఉంది 'దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియదు'. అప్పుడు ఏ మానవుడూ గురువు కాదు, మళ్లీ ఏ మానవుడు గురువు కానప్పుడు ఎవరిని గుర్తిస్తావు గురువుగా అంటే ఎవరిని గుర్తించే దానికి వీల్లేదు. మరి మానవుడు గురువు కాకపోతే నీకు జ్ఞానము ఎలా

తెలుస్తుంది. ఒక మనిషికి ఇంకొక మనిషి జ్ఞానము చెప్పితేనే తెలిసేది. నీకు జ్ఞానము తెలియాలి అంటే మూడు రకాల మార్గాలు ఉన్నాయి. మూడు రకాల మార్గాల ద్వారానే తెలిసేది. ఈ మూడు రకాల మార్గాలు తప్ప ఇంకా వేరే రకంగా తెలిసే దానికి అవకాశమే లేదు. ఆ మూడు మార్గాలు కూడా దేవుడే తెలియజేశాడన్న మాట. ఆ దేవుడే మూడు మార్గాలున్నాయి అని తెలియజెప్పాడు. అది కూడా మనకు పవిత్ర ఖురాన్ గ్రంథములోనే ఉంది.

42వ సూరా 51వ ఆయత్‌లో **"దేవుడు ప్రత్యక్షంగా ఎవరితోనూ మాట్లాడడు"**. దేవుని జ్ఞానము దేవునికి తెలిసినాగానీ, ఆయన కనిపించి ఎవరికీ చెప్పడు. ప్రత్యక్షంగా నీకు జ్ఞానము చెప్తాడా అంటే ఆయన! చెప్పడు. మరి ఆయన జ్ఞానము నీకు ఎట్లా తెలుస్తుంది? అంటే మళ్ళీ ఇంకో అవకాశము ఇచ్చాడు ఆయన. ఆయన జ్ఞానము ఆయనకే తెలిసినప్పుడు, ఆయన ఎవరితోనూ మాట్లాడనప్పుడు, ఆయన జ్ఞానము మనకెలా తెలుస్తుంది? అని ప్రశ్న వేసుకుంటే మనకు ఒక అవకాశము ఉంది. అది ఏమంటే నా జ్ఞానము మూడు రకాలుగా, మూడు విధాలుగా తెలియబడేటట్టుగా మీకు అమర్చిపెట్టాను అని దేవుడే చెప్పినాడు. మూడు రకాలుగా అంటే మూడు విధాలుగా మనకు తెలియజేసే అవకాశము ఉంది. ఒకటి **వాణి** ద్వారా శబ్దము ద్వారా, రెండవది **తెరవెనుక** నుండి కనిపించుకోకుండా అన్నాడు. వాణి అంటే శబ్దము ఆకాశము నుంచి వచ్చేటటువంటి శబ్దము ద్వారా ఒకటి వస్తుంది. రెండవది తెరవెనుక నుంచి మాట్లాడి చెప్తూతాను అన్నాడు. తెరవెనుక నుంచి మాట్లాడి చెప్పే విధానమొకటుంది. మూడోది ఒకటుంది **"నా దూతను పంపించి నేను చెప్పిస్తాను"** అని అన్నాడు. అంటే ఆయన ఒక వ్యక్తిని పంపించి చెప్పిస్తాడు.

ఈ మూడు మార్గాల ద్వారా మనకు జ్ఞానము తెలియ బడుతుంది అర్థమయిందా! ఏ రకంగా తెలిసినాగానీ మనకు జ్ఞానము తెలుస్తుంది. దేవుని నుండి మూడు విధాలుగా మనకు జ్ఞానము చేరింది. ఆ మూడు విధాలుగా ఏ విధముగా చేరినాగానీ చివరకు దేవుని దగ్గరి నుంచే వచ్చింది అది. కాబట్టి గురువు నుంచి వచ్చింది అని మనము లెక్కించుకోవాలి. మళ్లీ ఆ విధముగా ఆయన కనిపించుకోకుండా మూడు మార్గాల ద్వారా మనకు జ్ఞానము తెలియజేస్తాడు. కాబట్టి ఫలానా ఆయన గురువు అని చెప్పేదానికి అవకాశము లేదు.

మీరు ఎవరితోనైనా ప్రత్యేకంగా జ్ఞానము తెలుసుకొనివుంటే ఆ జ్ఞానము నాకు గురువు ద్వారా తెలిసింది అంటే అది అసత్యం. ఇప్పుడు నా ద్వారా మీరు తెలుసుకొని ఉంటే నా ద్వారా మీరు జ్ఞానము తెలుసు కున్నాము అని మీరు అనుకుంటే అది పూర్తి అసత్యం అవుతుంది. నేను చాలామార్లు చెప్పా మీకు చెప్పేది నేను కాదు. ఈ విషయాలు నాకు తెలియవు. వ్రాసేది నేను కాదు. వాస్తవముగా నాకు ఈ విషయాలు తెలియవు. ఎవరికీ తెలియని విషయాలు నేనెలా వ్రాస్తాను. నాకు తెలిస్తే కదా నేను వ్రాసేది, నేను కాదు. వాస్తవముగా నాకు ఈ విషయాలు తెలియవు. వాస్తవముగా నేను ఎక్కడయినా విన్నానా, నేను ఎక్కడయినా పోయి అడిగానా, ఎవరూ సమాధానము చెప్పలేని విషయాలు అవి.

ఎవరికీ తెలియని విషయాలు అవన్నీ ఎలా చెప్పగల్గుతున్నాము. ఎలా వ్రాయగలుగుచున్నాము అంటే నేను చేతులు ఎత్తేసి నాకు పూర్తి తెలియవు అని చెప్పేశాము. మరి ఎలా వ్రాయగల్గినారు మీరు అని అంటే, నాకు ఇంకొకరు చెప్పితే నేను వ్రాశాను. చెప్పేవాడు ఎవడు అంటే ఒక్కడే

ఉన్నాడు. (ప్రపంచానికంతా ఒక్కడే. వాడు మూడు రకాలుగా తెలియజేస్తాడు. ఏదో రకంగా నాకు తెలియజేశాడు. ఆ విషయము నేను చెప్పుచున్నాము. అది వాస్తవముగా నా జ్ఞానము కాదు. మీరు ఈ జ్ఞానము విన్న తర్వాత ఏమి అనుకోవాలి అంటే నాలో నుండి చెప్పేవాడు గురువు అనుకోండి గానీ నన్ను గురువు అనుకోకూడదు మీరు. నేను ముందే చెప్పాను. ఈ విషయము నాలో నుంచి చెప్పేవాడు మీకు గురువు కానీ, నేను గురువు కాదు. నేను సాధారణ మనిషినే. మీకు ఏమి అందినాగానీ దేవుని నుండి అందవలసిందే. అది మీ యొక్క (శ్రద్ధను బట్టి ఉంటుంది. మీకు జ్ఞానము కావాలనే (శ్రద్ధ మీకుంటే ఇక్కడ నుండి వస్తుంది. లేకపోతే రాదు. ఒక (ప్రశ్న వేసుకుంటాము మనము. 'దేవుని విషయము దేవునికి తప్ప ఎవరికీ తెలియదు' అని అన్నప్పుడు 'దేవుడు (ప్రత్యక్షంగా ఎవ్వరితోనూ మాట్లాడడు' అని అన్నప్పుడు, మనకు ఆయన జ్ఞానము ఎలా చెప్పగలుగుతాడు అంటే ఎలా అయినా గానీ జ్ఞానము మీద నీకు (శ్రద్ధవుంటే నీకు తెలియజేస్తాడు. మూడు విధాలుగా ఉంది, ఆ మూడు విధాలతో ఏదో ఒకటి నీకు వర్తిస్తుంది. ఫలానా విధానము అని ఏమీ లేదు. అక్కడ నీవు కనిపించే వ్యక్తిని (మనిషిని) గురువు అని అనుకొంటే అది పెద్ద పొరపాటు. కనిపించే వ్యక్తి ఎవ్వరూ గురువు కాదు అర్థమయ్యిందా. ఇప్పుడు పెద్ద తిరకాసు ఇక్కడ ఉంది. ఇది వినేదానికి చాలా సులభంగా ఉంది కానీ అర్థము చేసుకోవడము చాలాకష్టమే. ఎందుకంటే చెప్పే మనిషి, గురువు కాదు అన్నప్పుడు మరి ఎవరు చెప్తున్నారు అనే (ప్రశ్న వస్తుంది.

నేను మొదటి నుండి చెప్పుచున్నాను. ఎవరైనా జ్ఞానము తెలియజేయనీ, ఆ జ్ఞానం ఎక్కడ నుండి వస్తుంది. అది దేవుని వద్ద నుండి రావాలి. మీకు తెలియబడిన (ప్రపంచములో తెలియబడని రహస్యాలు

అన్నీ ఎక్కడైనా తెలియబడుతున్నాయి అంటే అవి ఎక్కడ నుంచి రావాలి, దేవుని వద్ద నుంచే రావాలి. అంటే మనుషులకు ఎవరికీ తెలియని విషయములు తెలియబడుతున్నా అవి ఎక్కడ నుంచి రావాలి దేవుని వద్ద నుంచి తప్ప ఎక్కడి నుంచి వచ్చే దానికి అవకాశము లేదు. దేవునికి తప్ప దేవుని జ్ఞానము ఎవరికీ తెలియదు. ప్రపంచ జ్ఞానము మనిషి చెప్పగలడు అర్థమయిందా? కానీ దేవుని జ్ఞానాన్ని మనిషి ఎప్పుడూ చెప్పలేదు. దేవుని జ్ఞానాన్ని ఎవరు చెప్పాలి? దేవుడే చెప్పాలి. దేవునికే తెలుసు అది దేవుడే చెప్పాలి. ఇంక నేను చెప్పాను కదా! పవిత్ర ఖురాన్ గ్రంథములో 3వ సూరాలో, 7వ ఆయత్‌లో ఏముంది **"దేవుని జ్ఞానం దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియదు"** అని ఉంది కదా! ఇప్పుడు మనము అక్కడికి వచ్చి మాట్లాడుకుందాము. దేవుని జ్ఞానము దేవునికి తప్ప తెలియనప్పుడు క్రిందనే ఏమి వ్రాసిపెట్టారంటే దానిలో భక్తి, శ్రద్ధ ఉన్నటువంటి వాళ్ళకు, బుద్ధి శ్రద్ధవున్న వాళ్ళకు దేవుని జ్ఞానము తెలియబడుతుంది. తెలియబడుతుంది అంటే గ్రహించగల్గుతారు అని అర్థము. అంటే తెలుసుకోగల్గుతారు. శ్రద్ధ ఉన్నటువంటి వాళ్ళు తెలుసుకోగల్గుతారు. శ్రద్ధ ఉన్నటువంటి వాళ్ళు తెలుసుకోగలుతారు అని అంటే, ఇక్కడ చెప్పేవాడు ఎవరో ఒకరు ఉండాలి కదా! ఏదో రకంగా చెప్పాలి కదా! అప్పుడే అక్కడి నుంచి వాళ్ళు గ్రహించ గల్గుతారు. అక్కడ చెప్పేవాడు ఎవరు? అని అంటే దేవుడే చెప్పాలి.

దేవుడి జ్ఞానము దేవునికి తప్ప ఎవరికీ తెలియడానికి అవకాశము లేదు. చెప్పే మనిషి దేవుడౌవుతాడా? ఇప్పుడు మేము చెప్పుచున్నాము, దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఎవరికీ తెలియదు అన్నప్పుడు నేను అంతా అసలైన జ్ఞానము చెప్పుతున్నా అయినా నన్ను దేవుడు అనుకొనేదానికి వీలవుతుందా అంటే మనిషికి సంబంధము లేదు. చెప్పేవాడు, మాట్లాడేది

నేనే అనుకోవడము పొరపాటు. ఇంజీలు గ్రంథములో (బైబిలులో) మత్తయి సువార్త 10వ అధ్యాయములో 20 వాక్యమునందు ఇలా గలదు. **"మీ తండ్రి ఆత్మ మీలో ఉండి మాట్లాడుచున్నాడేగానీ మాట్లాడువారు మీరు కాదు"** అని అన్నాడు. దేవుడు ప్రతి మనిషిని బొమ్మల్ని ఆడించినట్లు ఆడిస్తున్నాడు. ఆ విధముగానే లోపలి నుంచి పలికిస్తున్నాడు. మూడు రకాలుగా తెలియజేస్తానని చెప్పాడు కదా! కాబట్టి ఈ మూడు విధాలలో మనకు తెలిసినటువంటి విధానము ఏదైతేవుందో అంటే దేవుని జ్ఞానము ఎక్కడైతే తెలియబడుతుందో అక్కడ చేసే వ్యక్తిని మనము గురువుగా గుర్తించ వచ్చును. అంటే అతను వ్యక్తిగా వుండడు కాబట్టి ప్రపంచములో గురువు అనేవాడు సాకారంగా ఎక్కడా కన్పించడు, మీకు ఒకవేళ ఎక్కడైనా కన్పించినా కానీ అతను గురువు కాదు. ఇంతమంది ప్రపంచములో గురువులని పేర్లు పెట్టుకొని జ్ఞానమును చెప్పుచున్నప్పుడు వారు గురువు కాదు అని అంటే మనము వాళ్ళని నిందించినట్లా అంటే వానిని నిందించినట్లు కాదు. ఇక్కడ దేవుని చట్టాన్ని చెప్పుచున్నాము. ఒకన్ని ప్రత్యేకించి అతనిని గురువు కాదు అని పేర్లు పెట్టి మనము చెప్ప లేదు. కానీ ఉన్న దేవుని చట్టాన్ని చెప్పుచున్నాము ఇక్కడ. ఈ మధ్యన ఒక విషయము వచ్చింది. మేము టీవీలో చూశాము, ఒక వ్యక్తిని దేవుడు కాదు అంటే మేము దేవుడిగా నమ్ముకొంటే నీవెందుకు కాదు అంటున్నావు అని కొట్లాడతారు. దేవుని చట్టాన్ని చెప్పినాము. దానిప్రకారము మనిషి దేవుడు కాదు. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము మనిషి దేవుడు కాదు అనేది వాస్తవము.

దేవుని జ్ఞానము ప్రకారము నేను తెలుసుకున్న జ్ఞానము ప్రకారము సత్యము చెప్పాను. నాకు తెలిసిన జ్ఞానము ప్రకారము కూడా నేను చెప్పుచున్నాను. నేను ఆషామాషీగా నా ఇష్టముమొచ్చినట్టు నేను చెప్పలేదు.

మూడు దైవ గ్రంథాలను ఆధారము చేసుకొని నేను చెప్పుచున్నాను. దైవ గ్రంథాలను ఆధారము చేసుకొని నేను చెప్పినప్పుడు మీకు దైవగ్రంథాలు ఏవి? అని తెలియనప్పుడు, ఆ దైవ గ్రంథాలను మీరు అనుసరించనప్పుడు మేము చెప్పేమాట మీకు అసత్యం అవుతుంది, అంటే ఒక వ్యక్తి చెప్పేటటు వంటి మాటను సత్యమా అసత్యమా అని గుర్తించాలి అంటే, నీకు కొంతైనా జ్ఞానము తెలిసియుండాలి. ఏమాత్రం జ్ఞానం తెలియని మనిషి నేను ఇట్లనుకున్నాను. నేను అనుకున్న దానికి విరుద్ధముగా మాట్లాడుతున్నారు. మా మనోభావాలు దెబ్బతిన్నాయి అంటే ప్రపంచములో అన్నిటికీ మనో భావాలు వుంటాయి. దొంగకు మనోభావాలు ఏంటి! దొంగతనం చేయాలనే మనోభావము. దొంగతనము మంచిది కాదు అంటే నా మనోభావాలు దెబ్బతిన్నాయి అంటే ఏమి చేస్తాము. దొంగవృత్తి మంచిది కాదు అని చెప్పితే పోలీస్‌వారు మా మనోభావాలు దెబ్బతీశారు అంటే ఎలా ఈ రకంగా ఇప్పుడు మనో భావాలు అనేటివి ప్రపంచ విషయానికి సంబంధించినవి ఇవి. నీ ఇష్టం వచ్చినట్టు నీవు అనుకొంటే సరిపోదు అది దానికి ఒక చట్టం అనేది ఒకటుంటుంది. ఆ చట్టం ప్రకారము నడుచుకోకపోతే శిక్షలుంటాయి.

ఆ రకంగానే దేవుని చట్టము కూడా ఒకటుంది. దేవుని చట్టము ప్రకారము మనము చెప్పేటటువంటి విధానము ఏమి అంటే ఏ రకంగా పోల్చుకున్నాగానీ ఒక మనిషిని దేవునిగా పోల్చకూడదు. ఇప్పుడు నేను ఉన్నాను మీరేమి చేస్తున్నారు. టకటకవచ్చి కాళ్లు మొక్కుతున్నారు. నేను వద్దయ్యా మొక్కకూడదు, దేవుడు ఉన్నాడు. మీరు దేవునికి మొక్కండి మాకు మొక్కకూడదని ప్రతి నిత్యం చెప్పుచునే ఉన్నాను. అయినా దేశమంతా అలవాటైనప్పుడు అదే అలవాటు తీసుకొచ్చి ఇక్కడ కూడా ప్రదర్శిస్తారు.

కానీ మేము చెప్పడము మాత్రము మర్చిపోలేదు. గురుపౌర్ణమి అనేటటువంటి ఈ రోజు మనము గురువును గురించి ప్రత్యేకించి చెప్పుకోవాలంటే గురువు అనేవాడు ఒక మనిషికాదు. అయితే మనము కొంతమంది గురువులు మనుషులే అనే నమ్మకముతో గురువు ఫలానాచోట ఉన్నారని పోతున్నారు. ఇంకా కొంతమంది ఏమి చేస్తున్నారంటే ఊర్లో లేదు గురువు, ఊర్లలో ఉండేవారు గురువు కాదు. ఎక్కడో రహస్యంగా మానవులకు కనపడకుండా ఎక్కడన్నా గుహల్లో ఉంటారు గురువులు అని కొంతమంది అంటుంటారు. అంటే వాళ్ళ ఇష్టప్రకారము వాళ్ళు అనుకుంటున్నారు. ఎట్లనుకున్నాగానీ ఇక్కడ గురువును ఒక మనిషిగా పోల్చుకొన్నారు. కానీ మనిషిగా పోల్చుకోవడం పూర్తి తప్పు. వేమన యోగి చాలా జ్ఞానము తెలిసినటువంటి మనిషి. ఆయన ఏమి చెప్పినాడంటే "ఊర్లో ఉండేవాళ్ళను గురువులు కాదని ఊరి బయట ఉండేవాళ్ళను, అడవుల్లో ఉండేవారినో, గుహల్లో ఉండేవాళ్ళనో గురువులు అనుకొని అక్కడికి పోయినా ఏమి ప్రయోజనము లేదు. గురువు అనేవాడు అక్కడ కూడా వుండడు" అని ఒకమాట చెప్పినాడన్న మాట. అక్కడ పోయి వెతుకులాడతావుంటే మీకు ముక్తి ఏమి రాదు అని చెప్పాడు ఆయన చిన్న పద్యంలో ఏమి చెప్పినాడంటే "గుహలలోనజొచ్చి గురువులను వెదకంగ, క్రూరమృగమొకండు తారసిల్లిన ముందుగ ముక్తి మదియె చూపు.

ఆ రకంగా గురువులు అనేవారు అడవిలో వుండరు. ఊర్లో ఉండరు, అది వీళ్ల భ్రమ తప్ప ఇంకొకటి ఏమీ లేదు. ఇంకా కొంతమంది ఏమంటున్నారంటే నియమాలను బట్టి గురువును కనిపెట్టవచ్చు, ఎక్కడున్నా కనిపెడతాము అంటారు. సరే వాళ్ళకు ఏమి సూత్రాలున్నాయో కనుక్కొనే దానికి మనకు తెలియదు కానీ, ఒకసారి ఒక ఇంటికి వెళ్ళితే అక్కడ అన్నము

పెట్టినారు. సరే ఎక్కడో ఒకచోట ట్రైంకి భోజనం చేయాలి కదా! భోజనం చేసేటప్పుడు ఆ ఇంటి అతను నన్నే గమనిస్తున్నాడు అక్కడ. అంటే ఈయన గురువా? కాదా? అని నేను తినే భోజనాన్ని బట్టి గమనిస్తున్నాడు. ఆయనకేం లెక్కచారమంటే ఒక బుక్‌లో వ్రాశారంట అన్నము తినేటప్పుడు కరివేపాకు, మిరపకాయలు ఏమన్నా వస్తే ప్రక్కన పడేస్తే గురువు కాదంట. అన్నీ సమానముగా కలుపుకొని తింటే గురువంట, ఆ లెక్కాచారము ప్రకారము అన్నీ సమానంగా తినాలంట. మిరపకాయని, కరివేపాకుని ప్రక్కన పెడితే గురువు కాదని ఆయనకు లెక్కంట. సరే మామూలుగా నా అలవాటు ప్రకారం తీసి ప్రక్కన పెట్టినాను. అది చూసి ఈయన గురువే కాదను కొన్నాడు. ఆయన మళ్లీ కొంతసేపు ఉన్నాక మాటల్లో మీరు గురువు కాదని నాకు తెలిసిపోయింది అన్నాడు.

దేశంలో గురువు అనేవాడు ఒక్కడే కదా! ఏకవచనమే అది ఎప్పటికీ బహువచనముగా ఉండదు. అయితే మనము ఇప్పుడు గురుపౌర్ణమి సందర్భముగా గురువును మనము లెక్కించి చూస్తే, గురువు అనే వ్యక్తి ద్వారానే మనకు జ్ఞానము తెలియాలంటే గురువు ఒక వ్యక్తా అని అంటే వ్యక్తి కాదు అని చెప్పాలి. వ్యక్తి కాకపోతే ఈ జ్ఞానము ఎలా తెలుస్తుంది. అంటే ఇప్పుడు ఒక తతంగంవుంది. మూడు విధానాలలో ఆకాశవాణి ద్వారా తెలిసేటటువంటిది ఒకటుంది. ఇది దేవుడు చెప్పిన విధానము, ఆకాశము ద్వారా తెలిసింది. సృష్టి ఆదిలోనే తెలిసిపోయింది అది. ఆకాశము నుంచి ఒక శబ్ధము పుట్టింది. శూన్యములో ఉండే ఆకాశములో ఉన్నటు వంటి సూర్యుడు వినగల్గినాడు. ఆ సూర్యునికి మొట్టమొదట సృష్టి ఆదిలోనే ఈ జ్ఞానము చెప్పినాను అని దేవుడు ఒక గ్రంథములో తెలియజేసినాడన్న మాట. ఆ రకంగా తెలియ జేసినప్పుడు ఆ సూర్యుడు మళ్ళా ఏమి చేసినాడంటే

ఇక్కడ భూమి మీద ఒక వ్యక్తికి చెప్పాడు. ఆ వ్యక్తి ఇంకొక వ్యక్తికి చెప్పాడు. ఈ రకంగా ప్రపంచమంతా వ్యాప్తి చెందింది. తరువాత కొంతకాలం గడవగా, గడవగా జ్ఞానము తెలియకుండా పోయింది. అదే జ్ఞానాన్ని తిరిగి ఇపుడు నేను నీకు చెప్తున్నాను విను అన్నాడు. మొట్టమొదటి సృష్టి ఆదిలో ఆకాశవాణి ద్వారా వచ్చినటువంటి జ్ఞానాన్ని ఇపుడు తిరిగి చెప్తున్నా విను అనిన ఆ వ్యక్తి ఎవరు? అని అంటే తిరిగి దేవుని జ్ఞానాన్ని దేవుడే చెప్పాలి, దేవుడు మూడు రకాలుగా చెప్పాడు అందులో మూడో విధానం ఒకటుంది.

'దూత' ద్వారా అని మూడవ విధానము కలదు. నేను ఒక దూతను పంపిస్తాను అంటే నా గుమస్తాను పంపిస్తాను. నా గుమస్తా వచ్చి నా జ్ఞానం చెపుతాడు అని అన్నాడు. ఆయన చెప్పడు ఇపుడు ఆయన గుమస్తా వచ్చి జ్ఞానం చెప్పినాడు, సృష్టి ఆదిలో ఆకాశవాణి ద్వారా చెప్పినటువంటి (వహి ద్వారా చెప్పినటువంటి) జ్ఞానాన్ని తిరిగి దూత చెప్పినాడు. దూత అంటే దేవుడు పంపిన వ్యక్తి దూత ఎట్లుంటాడు మనిషి మాదిరే వుండాలి. మనుషులతో మాట్లాడాలంటే దూత కూడా మనిషిగానే ఉండి మాట్లాడాలి. మనిషి మాట్లాడితేనే ఇంకొక మనిషి వినగలడు లేకపోతే వాడు వినడు. ఇపుడు నేను మాట్లాడుతున్నాను నీవు విను అన్నపుడు ఎదుటిగా వున్నటు వంటి వ్యక్తి ఇంకొక వ్యక్తితో మాట్లాడుతున్నాడు అనే కదా! అర్థము. అదే విధంగానే కృష్ణుడు అర్జునుడికి చెప్పింది ఏది? ఈ విషయాన్ని చెప్పినప్పుడు కృష్ణున్ని మనం ఏ విధంగా లెక్కేవేసుకోవాలి?

ఇపుడు కృష్ణున్ని దేవునిగా లెక్కేసుకోవాలా? దేవుని దూతగా లెక్కించుకోవాలా? దేవుని దూతగా లెక్కించుకున్నపుడు, దేవుని జ్ఞానము దేవుని దూత ద్వారా చెప్పినట్లవుతుంది. మళ్ళీ ఇపుడు చెప్పే కృష్ణుడు వ్యక్తే కదా! ఇపుడు దేవుని దూత వచ్చాడు. జ్ఞానం చెబుతున్నాడు, ఆ జ్ఞానం

చెప్పే వ్యక్తిని మనం గురువు అనుకోవాలా, లేకపోతే జ్ఞానం చెప్పేదానికి పంపించినటువంటి దేవున్ని గురువు అనుకోవాలా అని అంటే కన్పించనోడే కదా! గురువు కన్పించనటువంటి వాడు, కాబట్టి పంపించిన వాన్ని గురువు అనుకోవాలిగాని వచ్చిన వ్యక్తిని కూడా గురువు అనుకోవడానికి అవకాశం లేదు. ఇపుడు కృష్ణుడు మనకు జ్ఞానం చెప్పినాడు అంటే ఆయనను మనం గురువు అని ఒప్పుకోవడానికి అవకాశమే లేదు. అర్థమయిందా! మరి ప్రత్యక్షంగా ఆయనను దేవుడు అనేదానికి అవకాశం ఉందా? లేదు అంటే ఆధ్యాత్మిక చట్టం ప్రకారం కృష్ణుడుని దేవుడు కాదనే అనాలి. ఆయన దేవుడే అని మనం ఒకచోట వ్రాశాము. **"శ్రీకృష్ణుడు దేవుడా? భగవంతుడా?"** అనే ఒక గ్రంథము వ్రాశాము. అది వ్రాసినపుడు కృష్ణుడు దేవుడు కాదు, భగవంతుడని వ్రాశాము. కన్పించే వ్యక్తిని భగవంతుడు అంటాము. దేవున్ని భగవంతుడు అని అనకూడదు. దేవుడు అంటే తెలియబడనటువంటి వాడు వెతకబడేటటువంటి వాడు, దేవులాడబడేవాడు. దేవులాడబడేవాడు దేవుడు అంటే నీవు ఎప్పటికీ వెతుకుతూ ఉండాల్సిందే. నీవు ఎంతకాలమన్నా వెతుకుతూ ఉండాల్సిందే ఆయన కనిపించేవాడు కాదు.

కాబట్టి 'దేవులాడబడేవాడు దేవుడు' అని అర్థం. భగవంతుడు అంటే భగము నుంచి పుట్టినటువంటి వాడు. తల్లిగర్భం నుంచి పుట్టినటువంటి వాడు భగవంతుడు అని అర్థము. గర్భం నుంచి పుట్టినటువంటి వాడు, శరీరం ధరించి పుడతాడు కాబట్టి వాన్ని భగవంతుడు అనాలి. దేవుడు వేరు, భగవంతుడు వేరు. మన సమాజంలో చాలామంది అనుకుంటున్నారు. దేవుడు అనే పదాన్ని చెప్పేచోట భగవంతుడంటారు. భగవంతుడనే పదం చెప్పేచోట దేవుడు అంటారు, అంటే రెండూ ఒక్కటే అనే భావం ప్రజల్లో ఉంది అంటే మొత్తం ఈ జాడ్యం అందరిలో అంటుకొని పోయింది. ఇది

పెద్ద పెద్ద స్వామిజీలు గురువులు, పీఠాధిపతులు అనే వాళ్ళుకూడా భగవంతుడు అనే దానికి మీనింగ్ తెలియకుండా పోయింది. అంటే దేవున్ని భగవంతుడంటారు భగవంతున్ని దేవుడని చెప్తారు కానీ భగవంతుడు వేరు, దేవుడు వేరు భగవంతుడు నీకు జ్ఞానం చెప్పొచ్చు, కానీ దేవుడు చెప్పడు, దేవుడు ప్రత్యక్షంగా ఎవరితోనూ మాట్లాడడు ఆ శాసనానికి మించి ఏమీ జరగదు ఇంక ఎవరు మాట్లాడతారు నీతో అంటే దూత భగవంతుడు మాట్లాడొచ్చు. ఇపుడు 3వ సురా 7వ ఆయత్‌లోకి పోతే "దేవుని జ్ఞానం దేవునికి తప్ప ఎవరికి తెలియదు" అని చెప్పినపుడు "నా జ్ఞానాన్ని బుద్ధి కల్గినటువంటివాళ్ళు, శ్రద్ధ కల్గినటువంటి వాళ్ళు గ్రహించుకుంటారు". అని చెప్పినపుడు గ్రహించుకుంటారు అంటే అవగాహన చేసుకుంటారు. అవగాహన చేసుకోవాలంటే, ఏదయినా ఎదుటివాడు చెప్పితే కదా! అవగాహనకు వచ్చేది. కాబట్టి అక్కడ ఏమవుతుంది. అంటే, దేవుని జ్ఞానం ఇంకొక రకంగా చెప్పించబడింది అనుకోండి. అపుడు ఆ దూత ద్వారా చెప్పినపుడు నీవు వినగలుగుతావు, వినగల్గినపుడు నీవు గ్రహించకలుగుతావు. శ్రద్ధ ఉండేటటువంటి వాడు గ్రహించగల్గుతాడు అంటే, శ్రద్ధవున్న వాడు ఎక్కడ గ్రహించగల్గుతాడు.

ఆ చెప్పే వ్యక్తి భగవంతుడు అయితే, ఆయనలో పలికించే వాడు దేవుడు. ఆయన ప్రత్యక్షంగా ఎవరితోనూ మాట్లాడడు. కనిపించినపుడు ఆయన గురువు అవుతాడు, చెప్పే వ్యక్తిలో వుండేవాడు గురువు అయితాడు. అందువలన చెప్పే వ్యక్తి గురువు కాదు. అర్థమయిందా! ఇపుడు చాలామంది చెపుతున్నారు, ఎవరో తెలియకుండా మూర్ఖముగా ప్రబోధానంద స్వామిని గురువుగా పోల్చుకుంటున్నారు. ప్రబోధానంద స్వామి చాలా గొప్ప గొప్ప రహస్యాలు చెప్పాడు, చాలా గ్రంథాలు వ్రాశాడు. ప్రతి గ్రంథము ఒక

విప్లవాత్మకంగా ఉంటుంది. ఆయన నిజంగా దేవుడు అని అంటే అది పూర్తి తప్పు. అంటే ఎంత పెద్ద గొప్ప జ్ఞాన విషయాలు చెప్పినాకానీ, మనిషి తాను స్వయంగా చెప్పలేడు, లోపలి ఆత్మ చెప్పిస్తే చెప్పగలడు మనుషులు అందరూ అంతే! ఆత్మ ఆడిస్తే ఆడుతున్నాడుగానీ నీవు స్వయంగా ఆడలేదు, నీకు తెలిసి పనులు జరుగుతున్నాయి కాబట్టి నేను నా ఇష్ట ప్రకారం చేస్తున్నాను అని అనుకుంటున్నావు. నీకు తెలిసినా గానీ కొన్ని పనులు జరుగవు ఒకప్పుడు నేను బాగా పరిగెత్తేవానిని ఇపుడు పరిగెత్తలేను, నడువలేను. ఎందుకు? నన్ను నడిపించేవాడు, పరిగెత్తించేవాడు ఇంకొకడు ఉన్నాడు. ఆయన జరిపిస్తేనే జరుగుతాయి. ఆత్మ చెప్పించేవాడుగా యున్నాడు. ఏ రహస్యాన్ని అయినా చెప్పించగలడు. మేము మేఘాల గురించి ఇంతకు ముందు చెప్పాము. మేఘం అనేది భూతం దానిలో చాలా అద్భుతమైన విషయాలు ఉన్నాయి. ఇంతవరకు మేఘాల గురించి ప్రపంచంలో ఎవ్వరికీ తెలియదు అని చెప్పాము. ఏ శాస్త్రవేత్తకు తెలియదు అని చెప్పాము. అన్ని విషయములు ఆత్మ దేవునికి తెలుసు. అందువలన ఏ విషయమునయినా చెప్పగలడు.

ఈ మధ్యన కొత్తగా ఒక సైన్సు వచ్చింది. ఇపుడు మేఘాలను గురించి కనుక్కొనేది. మేఘాల గురించి ఎవరికీ తెలియదు. చాలా పరిశోధన చేయాలి దాని గురించి చాలా అద్భుతమైన విషయాలు వున్నాయి. మేము చెప్పిన విషయములను శాస్త్రవేత్తలు తరువాత చెప్తారు. అంటే కొన్ని రోజులకు మనం చెప్పిన విషయాలే మళ్ళీ శాస్త్రబద్ధంగా శాస్త్రవేత్తలు ఎలా చెప్తున్నారు అని అంటే ముందే ఆ విషయాన్ని మనం ఎట్లు చెప్పగల్గుతున్నాము అని అంటే, శాస్త్రవేత్తలకు తెలియని విషయం నాకు తెలుసునా! తెలియదు, తెలిసినోడు శరీరములోపల ఆత్మగా ఒకడున్నాడు, వానికి తెలుసు అతనే

చెప్తాడు, అతడు ఏమైనా చెప్పగలడు. కాబట్టి నన్ను చూసి అతనేనని భ్రమించకండి అతను అతనే, నేను నేనే అర్థముయిందా! దేవుడు దేవుడే, మనిషి మనిషే దేవుడు మనిషిగా రావచ్చు. మనిషి దేవుడు కాడు అర్థము అయిందా! అయితే కూడా మనం కనుక్కోలేని గ్రుడ్డివాళ్ళము. దేవుడు మనిషికావచ్చు, మనిషి దేవుడు కాలేడు. మనకు తెలియనపుడు తెలియదు అని ఒప్పుకోవాలి. గురువు అనేటటువంటి శబ్ధాన్ని గురించి చెప్పుటకంటే గురువు అనేవాడు మనకు తెలియదు అని ఒప్పుకోవడం మంచిది. తెలుసు అని ఒప్పుకుంటే పెద్ద చిక్కులు వస్తాయి, అసత్యమైతుంది.

మనము ఎన్నో ప్రశ్నలకు జవాబు చెప్పలేము కాబట్టి ఏ ప్రశ్నకైనా జవాబు నీవు చెప్పాలి అంటే మొట్టమొదటనే తెలియదు అని చెప్పు. గురువు అంటే ఎవరో తెలియదు అని చెప్పు అపుడు సరిపోతుంది. నేను గురువును అని అన్నాగానీ, లేదా ఫలానావాడు గురువు అని అన్నాగానీ అది ఎప్పటికైనా ఖండించబడేటటువంటి వాక్యమే! ఏ మనిషీ గురువు కాదు. గురువు ఏ మనిషీకాదు. ఇట్లా చెప్పినా, అట్లా చెప్పినా రెండు ప్రక్కలా ఒకటే మీనింగ్ వస్తుంది. అర్థమయిందా! ఇపుడు మనకు మళ్ళా ఈ గురువు అనేటటువంటి వాడు ఏ మనిషీ కానపుడు మనం అనుకోవలసిన పని ఏ మొచ్చింది? గురుపౌర్ణమి అని ఎందుకు అనుకోవాలి మనమెందుకు గుర్తు పెట్టుకోవాలి దీనిని అనే ప్రశ్న వస్తుంది. ఇపుడు దేవుడు మూడు విధాలుగా మనకు జ్ఞానం తెలియజేస్తానన్నాడు కదా! ఒకటి **శబ్ధం** ద్వారా, రెండు **తెరవెనక** నుంచి, మూడు ప్రత్యక్షంగా **నా దూతను** పంపించి అన్నాడు. తెరవెనక నుంచి సూర్యుడు మాట్లాడినాడు కానీ విన్నటువంటి మనకు తెలియదు. మాట్లాడినోడు ఎవడైనది తెలియదు అర్థమయిందా! తెరవెనుక నుంచి జిబ్రయేల్ చెప్పినాడుకానీ, విన్నటువంటి మహమ్మద్ ప్రవక్తకు ఎవరు

చెప్పినది తెలియదు. ప్రవక్తగారు వహిద్వారా తెలుసుకున్నానన్నాడు. ఆయన మాటలద్వారా తెలుసుకున్నాను, మనిషిని చూడలేదు. ఆ రకంగా రెండు జ్ఞానాలు ఉన్నాయి. ఇంకొక జ్ఞానముంది, ఒకటి ప్రత్యక్షమైన దూత ద్వారా వ్యక్తి వచ్చి చెప్తున్నాడు అర్థమయిందా!

ఒక వ్యక్తి దేవుడు పంపించిన దూత. కన్పించే వ్యక్తిగా చెప్పినటు వంటి సందర్భాలు ప్రపంచంలో ఎక్కడ జరిగినాయి? అంటే 5000 సంవంత్సరాల పూర్వం ద్వాపరయుగం అంత్యంలో, కలియుగం మొదట్లో భగవద్గీత చెప్పబడినపుడు కృష్ణుడు అర్జునుడికి చెప్పినాడు. ఆయన భగవంతుని స్థానములో ఉండి, భగవంతునిగా చెప్పడం జరిగింది. కృష్ణుడు భగవంతునిగా వుండి అర్జునుడికి, జ్ఞానం చెప్పినాడు **'ఇది సృష్టి ఆదిలో చెప్పినటువంటి జ్ఞానం, ఈ జ్ఞానాన్నే నీకు తెలియజేస్తున్నాను విను'** అని చెప్పినాడు అంటే మొట్టమొదట చెప్పిన దేవుని జ్ఞానము ఇదే అని మనకు అర్థమైపోతుంది. ఆ దేవుని జ్ఞానం మనకు భగవద్గీత రూపంలో మనకు ఈ రోజు అందించబడింది అర్థమయిందా! ఈ ఇదే విషయాన్నే పవిత్ర ఖురాన్ గ్రంథములో 5వ సురాలో, 44 వ వాక్యంలో ఏమనివుంది మీకు ఇంతకుముందే బైబిలు అను గ్రంథాన్ని అందించాను. ఇపుడు ఖురాన్ గ్రంథాన్ని అందిస్తున్నాను. మీకు ఇది కాకుండా ఇంతకుముందే గ్రంథాన్ని అందించాను దాని పేరు 'తౌరాత్' (భగవద్గీత) అర్థమయిందా! ఆ తౌరాత్ గ్రంథములో జ్యోతివుంది, మార్గదర్శకత ఉంది. నీవు ఏ రకంగా నడుచుకోవాలో తెలుపు జ్ఞాన మార్గం ఉంది. అందులో జ్ఞాన జ్యోతి ఉంది దానిని బట్టి మీరు అనుసరించండి అని చెప్పాడు. దానిని బట్టి ఎంతోమంది అనుసరించారు అని చెప్పాడు అదే జ్ఞానమే ఖురాన్ గ్రంథములో కూడా ఉంది. మీకు ఇచ్చేటటువంటి ఈ ఖురాన్ గ్రంథము, ఒక్క దానిని మీరు

అనుసరించినాము అనుకోండి, ముందు ఇచ్చినటువంటి తౌరాత్ గానీ, ఇంజీల్ గ్రంథాన్ని గానీ అనుసరించుకోకుండా, వాటి విషయం తెలియ కుండా వాటిలో వుండేటటువంటి జ్ఞానము తెలియకుండా, ఈ ఒక్క గ్రంథములో ఉండే విషయాన్ని తెలుసుకొని, నీవు అనుసరిస్తే నీవు ఏ ధర్మంలో లేనట్లే! దీంట్లో ఉన్నా, దీనిని సంపూర్ణంగా తెలుసుకున్నా వాస్తవ ధర్మము నీకు తెలియనట్లే అని చెప్పినాడు.

ఖురాన్ గ్రంథములో విషయాలు నీకు తెలిసినాగానీ ఈ రెండు గ్రంథాల్లో ఉండే విషయాలు నీకు తెలిసివుంటే సంపూర్ణంగా ధర్మంలో నడుచుకొన్నట్లు అవుతుంది. లేకపోతే నీవు ఏ ధర్మంలో లేనట్లే అని 5వ సూరా, 68వ ఆయత్‌లో చెప్పినాడు. అంటే నీవు ఒక మతస్థుడు అయినా, ఏ ధర్మము కాదు, నీది దేవుని జ్ఞానమూ కాదు, కాబట్టి పద్ధతి ప్రకారం ఖురాన్ గ్రంథాన్ని అనుసరించినా గానీ, దానికంటే ముందు వచ్చిన గ్రంథాలను గౌరవించి, వాటి విషయం కూడా నీవు తెలుసుకో అని చెప్పడం జరిగింది. ఇపుడు ఖురాన్ మేము చూడలేదు అనే వాళ్ళు చాలామంది ఉన్నారు. కానీ అదే మనకు ఈ ఖురాన్ గ్రంథములోనే 5వ సురాలోనే 48 ఆయత్‌లో ఒకమాట చెప్పినారు. మీకు ఈ ఇంజిల్ గ్రంథము, తౌరాత్ గ్రంథము రెండూ ముందే మీకు అందివ్వబడినాయి అని చెప్పి ఉంది. ఈ ఇంజీల్ గ్రంథములో కూడా జ్ఞానముంది. అది తౌరాత్ గ్రంథాన్ని ధృవీకరించే దానికి వచ్చింది ఆ రెండింటిని ధృవీకరించడానికి ఈ ఖుర్ఆన్ గ్రంథము వస్తూవుంది అని చెప్పారు అంటే మూడు గ్రంథాలలోనూ దేవుని జ్ఞానం వుంది కాబట్టి మనం ఈ రోజు గురువు అనేటటువంటి విషయాన్ని తీసుకొని, ఖురాన్ గ్రంథములో ఉన్నది కూడా చెప్పుకుంటున్నాం. భగవద్గీత నుండి చెప్పుకోవడం లేదు మనం ఖురాన్ గ్రంథములో నుండి కూడా చెప్పు

కుంటున్నాము. అంటే ఎందుకంటే ఈ మూడు గ్రంథాలలోనూ ఒకే దేవుని విషయాలు వున్నాయి. మూడు గ్రంథాలు దేవునికి సంబంధించినటువంటివే. కాబట్టి ఎక్కడైనా నీవు ఉదాహరణ తీసుకొని చెప్పవచ్చు. నీవు బైబిల్ నుంచి ఉదాహరణ తీసుకోవచ్చు. భగవద్గీత నుంచి ఉదాహరణ తీసుకోవచ్చు. ఆ రకంగానే ఖురాన్ గ్రంథము నుంచి కూడా ఉదాహరణ తీసుకోవచ్చు. మనం ఇపుడు క్రొత్తగా ఒక గ్రంథాన్ని వ్రాసి విడుదల చేశాము. **"మత మార్పిడి దైవద్రోహం మహా పాపము"** 'దైవద్రోహమే' కాకుండా క్రింద 'మహాపాపం' అని కూడా వ్రాశాము. దైవద్రోహం అంటే ఈ మతమార్పిడి దైవద్రోహం మహపాపం. రెండు విధానాలు ఉన్నాయి. దైవద్రోహం వేరు, మహపాపం వేరు, పాపం అనేది మనుషులు అనుభవిస్తే అయిపోతుంది. దైవద్రోహం అనేది అలా అయిపోదు. దేవునికి చాలా దూరంగా నెట్టివేయబడతారు. నీవు దైవద్రోహం చేసేటటువంటివాడనైతే దైవద్రోహం చేస్తే దేవునికి దూరంగా నెట్టి వేయబడతావు. పాపం చేస్తే కష్టాలు అనుభవిస్తావుగానీ దేవునికి దూరంగా నెట్టివేయబడవు, నీవు కష్టాలు అనుభవిస్తావు కాబట్టి ఈ రెండు విధానాలున్నాయి.

పనులలో పాపం వచ్చేది వుంది, దైవద్రోహం చేసేది ఉంది. అంటే రెండిటిలో ఏది ఏమి చేస్తున్నాం. ఏ దానిని అర్థం చేసుకున్నాము అని మనం తెలుసుకోవాలంటే ఈ మూడు గ్రంథాలు మనం తెలుసుకొంటే మరీ బాగుంటుంది అని చెప్పాము. ఇక్కడ ఇప్పుడు ఈ గ్రంథము ఈ రోజు మీకు అందివ్వబడుతావుంది. ఈ గ్రంథము చదివితే మీకు అన్ని మతాలు సమానమే అని ఉంది. మతమార్పిడి మంచిదికాదు అంటే ఈ మతంలో నుండి ఆ మతంలోకి పోతే అది తగ్గుమతం, ఇది మిట్టమతం, ఇది ఎక్కువ మతం, అది తక్కువ మతం దానిలోకి ఎందుకు పోయినాము

అనే ప్రశ్నలేదు. ఇందులో అన్నీ సమానమే. మూడు మతాలలో వున్న జ్ఞానము సమానమే అది దేవుని జ్ఞానమే కానీ మతం మారకూడదు, నీవు ఎందుకు మారకూడదు అంటే నిన్ను దేవుడు పుట్టించినాడు కదా! ఒక మతంలో ముందే పుట్టించినాడు కదా! నిర్ణయం చేసి ఈ మతములో సరిపోతావు అని కరెక్ట్‌గా ఆ మతంలో పుట్టించినాడు. ఆ మతములో జ్ఞానం లేదా? ఆ మతంలో దేవుడు లేడా? ఆ మతంలో జ్ఞానం చెప్పలేదా? నీకు సంపూర్ణంగా చెప్పబడింది, ఏ మతంలోనైనాగానీ మళ్ళీ ఆ మతంలో తెలుసుకోకుండా ఇంకొక మతంలోకి పోతే దేవున్ని అవమానం చేసినట్టే కదా! నీవు దేవున్ని అవమానపరచి, దేవుని మాటను ధిక్కరించి ఇంకొక మతంలోకి పోతే జ్ఞానం బాగా తెలుస్తుంది అని అంటే ఈ మతంలో జ్ఞానం చెప్పలేదనా? ఒక ముస్లీమ్ హిందువుగా మారినాడనుకోండి. అంటే ఖురాన్ గ్రంథములో జ్ఞానం లేదనా! దేవుడు అక్కడ జ్ఞానం చెప్పలేదనా ఒక హిందువు క్రైస్తవుడిగా మారాడు అనుకోండి అంటే భగవద్గీతలో జ్ఞానం లేదనా అట్లు మీరు పొరపాటుపడతారేమోనని ఖురాన్ గ్రంథములో ఇక్కడ 5-48లో బాగా చెప్పారన్నమాట.

మీకు ముందే రెండు గ్రంథాలు అందివ్వబడినాయి. ఒక గ్రంథము తౌరాత్ గ్రంథమనేది అందివ్వబడింది. దానికి ఇంజీల్ అనే గ్రంథముతో తౌరాత్ గ్రంథాన్ని ధృవీకరించే దానికోనం ఇది సత్యమే అని నిరూపించే దానికోసమే ఈ ఇంజీలు గ్రంథము ఇచ్చాము. ఆ ఇంజీలు గ్రంథము, తౌరాత్ గ్రంథము రెండూ దేవున్ని అనుసరిస్తున్నాయి. దేవుని మార్గాన్ని చూపుతున్నాయి అని చెప్పే దానికోసమే ఈ ఖురాన్ గ్రంథమును ఇస్తున్నాము అని చెప్పాడాయన. ఏదీ ఇదే ఖురాన్ గ్రంథములో మనకు 5వ సూరా, 68వ ఆయత్‌లో ఏమని ఉంది. ఇపుడు నీకు అందించినటువంటి ఈ

పవిత్రమైన విషయాలు, ఈ గ్రంథము ఏదైతే ఉందో దీన్ని నీవు అనుసరిస్తే ఈ ఒక్క దాన్ని నీవు అనుసరిస్తే ముందు ఇచ్చినటువంటి గ్రంథాలు అనుసరించుకోకుండా ముందు మీకిచ్చినటువంటి తౌరాత్, ఇంజీల్ గ్రంథాలను అనుసరించుకోకుండా ఇపుడు నీకిచ్చినటువంటి ఈ ఖుర్ఆన్‌ను మాత్రము అనుసరిస్తే నీవు ఏ ధర్మములో లేనట్లే, నీవు ఒక ధర్మంలో నేను ఉన్నాను అని అని నిరూపించుకోవాలంటే మూడు గ్రంథాలలోని విషయాలు నీకు తెలిసివుండాలి, అప్పుడైతేనే నీవు ఒక ధర్మంలో ఉన్నట్లు, ఎందుకంటే మూడింటిలోనిది కలిపి ఒక ధర్మం అవుతుంది. మూడింటిలోనూ ఉండేది ఒకటే ధర్మమే కాబట్టి నీవు ఒక ధర్మంలో ఉన్నట్లు లేకపోతే నీవు దేవున్నే వ్యతిరేఖించినట్లే, **"మత మార్పిడి దైవద్రోహం-మహాపాపము"** అనేటటు వంటి గ్రంథాన్ని మనం ఇప్పుడు విప్పుకొని చెప్పుకుంటున్నాం దానిలో దేవుడు అనేటటువంటి వాళ్ళు ఎవరైతే ఉన్నారో అతనే గురువు అని ఈ గురుపౌర్ణమి రోజు సందర్భంగా మనం చెప్పడం జరుగుతావుంది. మళ్ళా అతను గురువు అయితే నీవు ఫలాన వ్యక్తి గురువు కాదు అని చెప్పినపుడు మనం తెలుసుకోనపుడు అతనితో మనకేం పని ఉంది. ఈ గురుపౌర్ణమి అని ఎందుకు పెట్టుకోవాల్సిన పని వచ్చింది. అని మనం ప్రశ్న వేసుకోవచ్చు.

ఈ గురుపౌర్ణమి అని ఎందుకు గుర్తించుకోవాలి మనం అని ప్రశ్న వేసుకోవచ్చు. గురుపౌర్ణమి గుర్తు పెట్టుకోవాల్సిన అవసరం ఏమొచ్చింది మనకు అన్ని రోజుల మాదిరి దీనిని వదిలేస్తే సరిపోదా అసలుకు ఆ పేరే పెట్టుకోకుండా ఉంటే సరిపోతుంది కదా! దేవుడు అనే మాట మేము ఒప్పుకోం సరే, మంచిదే దేవుడు తెలియజేస్తాడని ఒప్పుకో ఇవన్నీ కరెక్టే మళ్ళీ గురుపౌర్ణమి అని ప్రత్యేకించి ఎందుకు చేస్తున్నావు. ఒకరిని నీవు గుర్తుగా పెట్టి ఎందుకు ఆరాధిస్తున్నావు. ఇప్పుడు చాలామంది ఒకరిని

గుర్తుగా పెట్టి ఆరాధిస్తున్నారు. చాలామంది గురువు మన సాయిబాబా అని ఆరాధిస్తున్నారు. ఇంకొకరు ఈయన గురువని ఆరాధిస్తున్నారు కానీ వీళ్ళంతా ఎందుకు ఆరాధిస్తున్నారు అని అంటే ఒక లెక్కకుపోతే తప్పే ఇది అని చెప్పుకోవాలి, మాది తప్పా అంటారు కాబట్టి మీది రైటే అనాలి మనం వాళ్ళని, ఎందుకంటే తప్పే అన్నాకూడా బాగుండదు. ఒకరిని పూజించడం మంచిదే, గురువు అనే వాడు ఎవడో ఒకడుంటాడు ఎవడో మీరు తెలిసి పూజించండి, గుడ్డిగా పూజించొద్దండి తెలిసి పూజించు, గురువు అనేవాడు పలానోడు అవునా! కాదా! అని చూసుకో ఇప్పుడేమి చెప్తున్నాను, నేను జ్ఞానం చెప్పి, 100కి పైన గ్రంథాలను వ్రాసి మీకిచ్చినాను, ఎన్నో ఉపన్యాసాలను చెప్పినాను, ఎంతో జ్ఞానాన్ని చెప్పినాను కాబట్టి మీరు నన్ను గురువు అనుకొంటారేమో పొరపాటు అని చెప్పుతున్నాను. నన్ను గురువు అనుకోవద్దండి అని చెప్తున్నాను. ఒకవేళ మీరు అనుకోవాలంటే నీవు నన్ను చూసి అనుకోండి, మీకు ఎట్లా ఏ పాయింటూ దొరకదు, ఎందుకంటే అవకాశం లేదు. గురువు అనే వానికి శిష్యులే ఉండరని వ్రాశాము. **'గురువు'** అనే గ్రంథములో గురువు అనే వాడు ఎక్కడా తెలియబడడు అని వ్రాశాము. గురువు అనే వానికి శిష్యులు. అతన్ని కనుక్కొనేదానికి అవకాశం లేదు, శిష్యులున్నారంటే ఒక గురువులున్నారంటే వాడు గురువేకాదు, శిష్యులుండా రంటే అసలు వీళ్ళు గురువును కనుక్కోలేదు అని చెప్పాము.

వాస్తవంగా ఒకరికొకరు సంబంధం లేదని ఫలానవాడు గురువు అని చెప్పలేనపుడు శిష్యులు ఎట్లుంటారు, ఒకవేళ కొంతమందో, వంద మందో, 200 మందో 1000, 10000 మంది శిష్యులున్నారనుకోండి. ఒకవేళ గురువుగా నమ్ముకొన్నా, అతను గురువని నీకు నమ్మికేమి? ఎట్లా ఏ ఆధారముగా గురువు అని చెప్తావు. దైవగ్రంథాల ప్రకారం, దైవ శాసనాల

ప్రకారం ఏ రకంగా చెప్పలేవు, మేము గ్రుడ్డిగా అనుకున్నాము మా మనోభావాలు దెబ్బతింటాయంటే, గ్రుడ్డిగా అనుకో ఎవరు వద్దంటారు. అట్లనుకుంటే ఎవరనే దానికి శాసనం ఏమీ లేదు, ఇబ్బంది ఏమీ లేదు ఎవరిని అయినా గురువు అనుకోవచ్చు. కానీ దేవుని శాసనం ప్రకారం అనుకొనేదానికి అవకాశం ఉందా! అంటే లేదు, దేవుడు మనకు ఒక విద్య నిచ్చినాడు. ఆ విధానం అనుసరిస్తే మనిషి అవుతాము, మనం దేవుని దగ్గరకు పోగలము. దేవుని దగ్గరకు మనల్ని రప్పించుకొనేదానికే మనకి జ్ఞానాన్ని ఇచ్చాడు. ఆయన దగ్గరకు మనం ఎలా పోగలం అని అంటే మార్గదర్శకత చూపించాడు. మార్గదర్శకత ఎక్కడుంది అంటే మూడు దైవ గ్రంథాలలో ఉంది. మార్గదర్శకత్వం అంటే మార్గం చూపించాడు మరి మార్గం కావాలంటే ఈ గ్రంథాల ద్వారానే మీకు మార్గం దొరకుతుంది, లేదు నాకు ఫలానా వ్యక్తి ద్వారా దొరకుతుంది అని అంటే దొరుకుతుంది. ఎవరు వద్దన్నారు దొరికేది ఏ మార్గమో మాకు తెలియదు దొరికేది ఏది దొరకుతుందో మాకు తెలియదు.

నీ నమ్మకం నీది, అది గుంతలో పడతారో, చెరువులో పడతారో ఎట్లు పడతారో మాకు తెలియదు. కానీ ఇక్కడ ఒక శాసనం వుంది శాసనాల ప్రకారం నడుచుకోమని చెప్తున్నాము. అంతే కానీ ఇంకొకరిని కించపరిచే రకంగా ఎవ్వరూ గురువులు కాదు అని మేము చెప్పడము లేదు ఇప్పుడు చెప్పేదంతా దేవుని శాసనాన్ని అనుసరించి చెప్పడమే కానీ, మనుషులను కించపరిచేదానికి ఎవ్వడూ గురువుకాదని చెప్పడం లేదు దేశంలో రకరకాల పేర్లు పెట్టుకొని గురువులు ఉన్నారు. మీ ఇష్టం మీరు పెట్టుకోండి. మీ ఓపిక అది. మ్రొక్కించుకుంటామంటే మ్రొక్కించుకోండి. మాకు మ్రొక్కించుకొనే ఓపిక లేదు. ఎందుకంటే మాకు ఆ అర్హత లేదు

అని చెప్పుకున్నాము. దేవునికి ఒక్కనికే ఆ అర్హత ఉంది. మేము సమానమైన మనుషులమే, సమానమైన మనిషి ఇంకొక మనిషితో మ్రొక్కించుకోవడం ఎట్లా, నా దగ్గర గొప్పదనం ఉంటేనే కదా! సరే, ఇపుడు మనమేమను కుంటాము. "సరే, నీకు అంత గొప్పతనం లేదు అని మీరు అంటున్నారు. మాకు మీ గొప్పతనం కనిపించింది. మాకు గురువు అనిపించింది కాబట్టి మేము మ్రొక్కుతున్నాము" అని మీరు అనవచ్చు. అంటే, ఎవరికి మ్రొక్కాలో వారికి మ్రొక్కండి అని మేమంటున్నాము. అంటే ప్రతి మనిషిలోనూ ఒకవేళ మహత్యం వుండవచ్చు. అది ఎవరి మహత్యం. మనిషి మహత్యమా, లోపల ఉండేవాని మహత్యమా చూసుకోండి. ప్రతి మనిషిలోనూ ఇద్దరుంటారు మీకు బాగా కనపడేవాళ్ళు, మాకు బాగా తెలియబడే వాళ్ళు ఇద్దరుంటారు. అంటే బయటకు తెలిసే వాళ్ళు అంటే, బాగా ఫ్రీగా తెలిసేవాడు ఒకడున్నాడు. ఫ్రీగా తెలియకుండా కష్టంగా తెలియబడేవాడు శరీరము లోపల ఒకడున్నాడు, అర్థమయిందా! అదే మన ఖురాన్ గ్రంథములో రెండు పేర్లు పెట్టినాము ముహ్కామాత్, ముతషాబిహాత్ అని అర్థమయిందా! ముహ్కామాత్ అంటే ప్రత్యక్షంగా ఉండే విషయమని, ముతషాబిహాత్ అంటే సూక్ష్మంగా ఉండేదని, సూక్ష్మంగా ఉండేది బయటకు కన్పించదు. అది తెలియకుండా ఉండే విషయం. జ్ఞానంలో కూడా అటువంటి విషయాలు ఉన్నాయి. దీనిలో మనకు కనిపించే స్థూలమేది, అంటే బయటికి కనిపించేది స్థూలం, మీకు కనిపించినా గానీ అది వాస్తవం కాదు, ఖురాన్‌లో అక్కడక్కడ వజ్రాలు వైఢుర్యాలకంటే విలువైన వాక్యాలు దొరకుతాయి.

మేము చెప్పేది మీకు ఇష్టం ఉన్నా లేకపోయినా వాస్తవమది. కానీ ఈ 3వ సూరా7వ ఆయత్ అది చాలామందికి అర్థం కాలేదని చెప్పవచ్చు. ముస్లీమ్‌లకే అర్థంకాలేదు. ఇతర మతస్థులకు ఏమి అర్థమవుతుంది. అక్కడ

ఏమి చెప్పినారంటే **"నా జ్ఞానాన్ని మీరు గ్రహించుకుంటారని"** చెప్పాడు కదా! తరువాత 42వ సూరాలో 51 వ ఆయత్‌లో ఏమి చెప్పారంటే **"నేను నా దూతను పంపించి, నా దూత ద్వారా తెలియజేస్తాను"** అన్నాడు. అతను మహోన్నతుడు, మహాజ్ఞాని. ఎవరు మహోన్నతుడు, ఎవరు మహాజ్ఞాని తెలియదు. ఈ విషయములో చాలామంది పొరపాటుపడినారు. ఎవరు దేవుడు అని అనుకుంటారు. ఆయన మూడు రకాలుగా జ్ఞానము తెలియజేస్తాను అని చెప్పినపుడు ఒకటి ఆకాశవాణి ద్వారా, రెండు తెరవెనుక నుంచి, మూడు దూత ద్వారా అని అన్నపుడు అతను మహోన్నతుడు అని అన్నారు. ఆయన, తనను తాను మహోన్నతుడు అని చెప్పుకోవాల్సిన అవసరం లేదు. ఎలాగూ మహోన్నతుడు. మరి ఆ దూత ఎవరనేది కనుక్కొనే దానికి ఎలా చేతనవుతుంది. ఆ దూతను కనుక్కొండేదానికి కూడా మనకు విశేషమైన జ్ఞానం కావాలి. కాబట్టి దూతను పంపిస్తాను అని చెప్పినాడు కదా! ఇంతకుముందు ఈ దూత విషయం మనం మాట్లాడుకున్నాము కొన్ని సందర్భాల్లో. దేవుని దగ్గర ఎంతమంది ఉన్నారు అని అంటే, దేవుడు తప్ప ఎవరూ లేరు అని చెప్పుకున్నాము మనం. ఇటు మనం మనుషులం, జీవరాసులం, అటు దేవుడు. ఆయనకు మనకు మధ్యలో ఇంకెవ్వరూ లేరు ఆయన పరిపాలన ఉంది కానీ ఆయన దగ్గర దూతగా ఉండేవాడు ఉండేదానికి అవకాశమే లేదు. అర్థమయిందా! కానీ ఆయన దూతను పంపిస్తానన్నాడు.

నేను ఒక వ్యక్తిని పంపిస్తానన్నాడు. ఆ వ్యక్తి ఎవరు అనేది పెద్ద ప్రశ్న అయింది. అక్కడ తన వద్ద ఎవ్వరూ లేనపుడు, ఆయన దగ్గర ఎవరు ఉంటారు? ఆయన తప్ప ఇంక ఎవ్వరూ లేరు. అట్లాంటపుడు అక్కడ నుండి ఎవరు వస్తారు? అక్కడ నుంచి ఇంకొకరు వచ్చేదానికి

అవకాశమే లేదు. అక్కడ కూడా పెద్ద చిక్కు సమస్య వస్తుంది. ఈ రకంగా లెక్కేసుకొంటూ పోతే, ఇప్పుడు మనకు ఈ మహోన్నతుడు ఎవరు? అనేదానికి 42 వ సురా 51 ఆయత్‌లో గల దానికి మనము వివరం తెలుసుకోవాలంటే చాలా మునుపటి జ్ఞానం ఉండాలి. తర్వాత అట్లే 3 వ సూరా 7 వ ఆయత్ లో వివరము తెలియాలంటే, గ్రహించగలుగుతున్నాడు అంటే, ఎలాగ్రహించగల్గుతున్నాడు? అని ప్రశ్న వేసుకుంటే, చెప్పేవాడు ఎవడో ఒకడు ఉండాలి కదా! గ్రహించాలంటే అపుడు చెప్పేవాడు ఎవడు? అని మనం తెలుసుకోవాలంటే కూడా అక్కడ కూడా మనకు గొప్ప జ్ఞానం వుండాలి. ఈ రెండు ఆయత్‌లను మనం తెలుసుకోగల్గితే పెద్ద జ్ఞాని అవుతాడు. ఖురాన్ గ్రంథము అంతా అవసరం లేదు. నేనేం చెప్తున్నానంటే ముగ్గురు మనుషులున్నారని చెప్పున్నాను. అంటే ఇద్దరు ప్రత్యేకముగా ఉన్నారు అని చెప్పాము. ఒకడు స్థూలంగా ఒకడు సూక్ష్మంగా. ఇంకో ఆయన అంతటా ఉంటాడులే, ఆయన అణువు అణువునా వ్యాపించి నాడు. నీ లోపలే కాదు బయట కూడా ఉన్నాడు. ఇపుడు నేను చెప్పేది నీ లోపల ఇద్దరున్నారు. ఒకరు నీవు, ఒకరు నిన్ను నడిపించేవాడు అర్థమయిందా! ఈ ఇద్దరినీ చూసుకొంటూ సాక్ష్యముగా ఉండేవాడు ఇంకొకడు, నిన్ను నడిపించేవాడు, అర్థమయిందా!

ఈ ఇద్దరినీ చూసుకొంటూ సాక్ష్యముగా ఉండేవాడు ఒకడున్నాడు. చూసేవాడు, వాడు దేవుడు. అతను దేవుడు. వీళ్ళతో సంబంధం లేదు. ఆయన పరమాత్మయిన దేవుడు, ఈ ఇద్దరికీ సాక్షిగా ఉన్నాడు. ఆయన లోపలా, బయటా అంతటా ఉన్నాడు. అందరినీ చూస్తున్నాడు. అందరికీ సాక్షిగా ఉన్నాడు. కానీ నీవు ఎట్లున్నావు అంటే, నీవు ఉన్నావు, నిన్ను నడిపించేటటువంటి వాడు ఒకడున్నాడు. నీ లోపల బయట ఉండేటటువంటి

వాడు సాక్షిగా ఒకడు ఉన్నాడు. మొత్తం ముగ్గురు, ఇది 50వ సూరా 21వ ఆయత్ లో ఈ విషయముంది. ఏమని వుంది. **"నిన్ను తోలేవాడు ఒకడు, నీకు సాక్ష్యముగా ఉండేవాడు ఒకడు, నీవు ఒకడివి"** మొత్తం ముగ్గురు అయినారు చూడండి అదే త్రైత సిద్ధాంతము. క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అని చెప్పాము కదా! అర్థమయిందా! అక్షరుడు, పురుషోత్తముడు అనే వాని విషయాలు తెలుసుకోవాలంటే అది ఎప్పుడో భగవద్గీతలో చెప్పబడి 15వ అధ్యాయంలో పురుషోత్తమ ప్రాప్తియోగము 16, 17 శ్లోకాలలో క్షరుడు , అక్షరుడు పురుషోత్తముడు అనే మాటలు చెప్పబడినాయి. ఈ క్షరుడు, అక్షరుడు పురుషోత్తముడు అనే విషయం తెలిస్తే, ఈ 50వ సూరా 21 వ ఆయత్ అర్థమవుతుంది. లేకపోతే ఎవరికీ అర్థంకాదు 'వాసాంసి జీర్ణాని' అనే శ్లోకం అర్థమయితే ఇక్కడ 'సజీవము నుండి నిర్జీవమైనది, నిర్జీవము నుండి సజీవమైనది వస్తుంది' అనే విషయం తెలుస్తుంది లేకపోతే అది కూడా అర్థం కాదు. కొన్ని వేల సంవత్సరములు పరిశోధన చేసినా సైంటిస్టులకి ఎవ్వరికీ ఈ వాక్యం అర్థం కాదు.

6వ సూరా 95వ ఆయత్ లో "సజీవమునుండి నిర్జీవమైనది" అను విషయము కలదు. ఇన్ని విషయాలు మనకు స్వచ్ఛంగా బహిర్గతంగా, సులభంగా అర్థమయ్యే రకంగా చెప్పేవాళ్ళు దేవుడు తప్ప ఎవరూ లేరు. దేవుడు ఎలా చెప్పిస్తాడు. ఆయన ప్రత్యక్షంగా మాట్లాడడు, చెప్పిస్తాడు. చెప్పిస్తాడంటే పూర్వము తోలుబొమ్మలాట ఉండేది. మీరు చూసినారో లేదో కానీ దానిని మేము ఎప్పుడో పిల్లప్పుడు చూశాము. ఆ తోలు బొమ్మలాటలో ఒకడు ఆడిస్తా వుంటాడు. మనకు బొమ్మ కన్పిస్తావుంటుంది. మాటలు ఇంకొకడు మాట్లాడతా ఉంటాడు, ఆడేది ఆట. ఒకటి బొమ్మ, అది మాట్లాడదు కదా! అది తోలు బొమ్మ. కానీ దానికి తగినట్టు ఇంకొకడు

మాట్లాడుతూ ఉంటాడు. ఆ రకంగా మనం బొమ్మలము. మనల్ని కదిలించేవాడు, నోరు మెదిలించే వాడు, చేయి కదిలించే వాడు లోపల గలడు. కానీ బొమ్మను మెదిలించేవాడే మాట్లాడుతుంటాడు. ఇపుడు మా శరీరంలో మమ్ములను కదిలించి, మెదిలించి నడిపించేవాడు ఎవడైతే వున్నాడో! వాడే మాట్లాడతాడు. వాడు ఏమి మాట్లాడతాడో అది సత్యం, అదే జ్ఞానం అది స్వచ్ఛమైన జ్ఞానం. దానిని నమ్ముకొని చెప్పేదంతా నిజమైన జ్ఞానం అనుకుంటున్నాము మనం నూటికి నూరుపాళ్ళు. వాస్తవమే ఎందుకంటే నేను చెప్తే అది అజ్ఞానం కావచ్చు గానీ, నా వెనక ఉండేవాడు చెప్తే అది ఎప్పటికీ జ్ఞానమే. అది అజ్ఞానం కాదు. ఎందుకంటే అసలైన దేవుని విషయం దేవుడైన ఆత్మకే తెలుసు. కాబట్టి అదే చెప్పాడు. ఎక్కడా పొరపాటు పడేదానికి అవకాశం లేదు. ఎక్కడా జవాబు లేని ప్రశ్న వుండదు. ఇక్కడ ఏ ప్రశ్నకైనా జవాబు వుంటుంది. పది వేలమంది అడిగినాగానీ దానికి టక్కున జవాబు చెప్పవచ్చు. కానీ మిగతావాళ్ళు ఒక్కమాట మాట్లాడినా, దానికి జవాబు ఉండదు.

దేవుడు భగవద్గీతలో ఏమని చెప్పాడు “దేవతలను పూజించే వాళ్ళు అంతా దేవతల్లోకి పోతారు” అని చెప్పాడు. భూతాలు అంటే జీవరాసులను పూజించే వాళ్ళంతా జీవరాసుల్లోకే పోతారు అని చెప్పాడు. పితృదేవతలను పూజించే వాళ్ళంతా పితృదేవతల్లోకి పోతారు అని చెప్పాడు. నన్ను పూజించేవాడు మాత్రం నాలోకి వస్తాడు అని చెప్పాడాయన. కాబట్టి ఎవరినీ మీరు పూజించవద్దండి. అసలైన దేవున్ని పూజించండి అని చెప్పాము. అర్థమయిందా! ఇక్కడేం చెప్పాడంటే కృష్ణుడు భగవంతునిగా వచ్చి తన విషయం తను చెప్పితే, అంటే జ్ఞానాన్ని తెలియజేస్తే, ఇపుడు అదే కృష్ణుడుని గురించి కొందరు విచిత్రముగా వ్రాశారు. కృష్ణుడు శివ భక్తుడంట. కృష్ణుడు

జన్మ జన్మకు శివభక్తుడు, మహాశివ భక్తుడంట అని వ్రాశారు. దేవుడు అయిన ఆయన, ఎవరినీ పూజించవద్దు అని ఆయన చెప్పితే, మనుషులు శివభక్తుడని పేరు పెట్టినారు. అంటే వీళ్ళకేమి జ్ఞానం అర్థమయిందో పెద్ద గురువులుగా ఉండేటువంటి వాళ్ళు అలా అన్నారంటే వారిని ఏమనాలో వారు వ్రాసిన 450 పేజీల పుస్తకంలో చూస్తే ప్రతిమాట ప్రశ్నతో కూడుకొన్నటువంటిదే. ప్రతి పేజీలోను పది ప్రశ్నలు ఉన్నాయి. ఒక్క ప్రశ్నకు కూడా తలక్రిందులు తపస్సు చేసినా గానీ జవాబు ఉండదు. అవి అన్నీ అసత్యాలతో కూడుకొని వున్నటువంటి మాటలు.

వాస్తవ జ్ఞానం తెలియనోళ్ళు ఏమి చేస్తారంటే అదే నిజమని నమ్ముకుంటారు. వారి దారి తప్పుదారి పడిపోతుంది. ముస్లీమ్‌లు ఖురాన్ గ్రంథము మాది అని చెప్పుకున్నపుడు, క్రైస్తవులు బైబిల్ గ్రంథం మాది అని చెప్పుకున్నపుడు, హిందువులు భగవద్గీత మాది అని ఎందుకు చెప్పుకోలేక పోతున్నారు. భగవద్గీతను వదిలిపెట్టి ఇష్టమొచ్చిన వేదాలు పట్టుకొని ఊగులాడుతున్నారు. గురువులుగా యున్న కొందరు ఉపనిషత్తులూ, వేదాలు, పురాణాలను చెప్పుట వలన అవే సత్యం అని కొందరు నమ్మినపుడు దాని వెంటపోతున్నారు. భగవద్గీతను ప్రక్కన పారవేస్తున్నారు. భగవద్గీతలో ఏమి వుంది? "యాంతి దేవ వ్రతాన్ దేవాన్" అని ఉంది కదా! దేవతలను పూజించే వాళ్ళు దేవతల్లోకే పోతారు అని ఉంది. అట్లాంటపుడు మళ్ళీ మీరు కృష్ణున్నే దేవుని భక్తున్ని చేసేస్తే ఎట్లా చెప్పు? కృష్ణున్ని శివభక్తున్ని చేసేస్తే అది పూర్తి తప్పుకాదా! మన భగవద్గీతలో ఈ రకంగా ఉంది కదా! ఇతర దేవతలను ఎవరినీ మ్రొక్కొద్దండి అని కృష్ణుడే చెప్పినపుడు, మరి ఆయనెట్లా ఇతర దేవతలను మ్రొక్కమని, మ్రొక్కినాడని చెప్పుతాడు ప్రశ్న వేస్తే ఏమి జవాబు చెప్తారు? వీళ్ళు ఈ పురాణంలో ఇట్లుంది, ఆ వేదంలో

ఇట్లుంది అంటారు. ఆ వేదాలు మనకు ప్రమాణమా! అవి చూస్తే కాదు అని తెలియుచున్నది. దేవుడు చెప్పిన మూడు గ్రంథాలే మనకు ప్రమాణం కాబట్టి ఈ లెక్క ప్రకారం పోతే మనకు ఎక్కడైతే పవిత్ర ఖురాన్ గ్రంథంలోని వాక్యాలు తెలియబడుతున్నాయో, తెలియబడతా ఉందో, ఎక్కడైతే ఇంజీల్ అంటే దేవుడు చెప్పిన భాషలో 'ఇంజీల్' అంటాము. మన భాషలో బైబిల్ అంటాము. బైబిల్‌లో ఉండే వాక్యాలకు అసలైన అర్థాలు ఎక్కడయితే తెలియబడుతున్నాయో, అక్కడ భగవద్గీత ప్రథమ దైవ గ్రంథం చెప్పుచున్నారు. భగవద్గీతనే తౌరాత్ అని దేవుడు చెప్పాడు.

తౌరాత్ గ్రంథంలో వుండే విషయాలు, ఎక్కడైతే స్పష్టంగా తెలియబడుతున్నాయో, అక్కడ గురువు వుండి మనకు చెప్తున్నాడు అని అనుకోండి. కానీ గురువు ప్రత్యక్షంగా ఉండడు అనుకోవద్దండి. కానీ చెప్పేవాడు గురువు అనుకోవద్దండి. కాబట్టి మీరు ఎటువంటి పొరపాటు పడకుండా, ఇప్పటి నుండి గురువు అనేవాడు కన్పించడు అనే ధ్యాసతో, గురువు అనేవాడు దేవుడు అనే ధ్యాసతో ఉంటూ, ఒకవేళ మాలాంటి వాళ్లను ఎవరినయినా గురువు అనుకున్నాగానీ మంచిదికాదు. నన్ను గురించి నేను ఏమి చెప్తున్నానంటే, మీరు ఒకవేళ పొరపాటుగా నన్ను గురువు అనుకున్నా గానీ, ఇంతకు ముందే నా దోషం లేకుండా నేను చాలామార్లు చెప్పాను. ఇప్పటికీ కూడా గురువు అనేటటువంటి పదానికి ఏమాత్రం మాకు సంబంధం లేదు. అటువంటి అర్హత మాకు లేదు. అందువల్ల నేను గురువును కాదు, కానీ గురువు అనేవాడు కనిపించడు అనే ధ్యాస పెట్టుకొని మీరు ఈ గురుపౌర్ణమి రోజు, గురువు అనేటటువంటివాడు వ్యక్తి కాదు, అయన ఒక శక్తి, ప్రపంచమంతా ఆవహించినటువంటివాడు అని జ్ఞప్తి పెట్టుకొని, అటువంటి గురువును మీరు అన్వేషించండి. ఎలా, మనుషుల్లో, అంటే

ఎక్కడైతే జ్ఞానం తెలుస్తుందో ఆ జ్ఞానం అన్వేషించి తెలుసుకోండి. ఆ రకంగా తెలుసుకుంటారని ఆశిస్తూ ఈ సమావేశాన్ని ఇంతటితో ముగిస్తున్నాము.

## 77. తల్లి తండ్రి - గురువు దైవము

**(తేది : 10.11.2011)**

బహుశా పోయిన పౌర్ణమికి అనుకొంటాను. మనము తల్లి తండ్రులను గురించి చెప్పుకున్నాము. ఈ పౌర్ణమికి మీకు దాని వివరాన్ని గ్రంథముగా అందివ్వాలని అనుకున్నాము కానీ అది వీలు కాలేదు. మనము అనుకున్నట్లు ఏమీ జరుగవు. మొదట మీకు **"శిలువ దేవుడా?"** అనేటువంటి గ్రంథాన్ని ఇచ్చాము. అందులో సారాంశము ఏమిటి అంటే మీరు చదువుకున్నా బాగా అర్థమయ్యేదానికి, మీకు బాగా గుర్తింపు ఉండే దానికోసము, నేను ఆ గ్రంథాన్ని గురించి ఏమి చెప్పుచున్నాను అంటే, ప్రతీదీ శాస్త్రబద్ధముగా ఉండాలి అనేది మా ఉద్దేశ్యము. శాస్త్రబద్ధత లేనిది అది సత్యము కాదు. సత్యం కావాలంటే శాస్త్రబద్ధత ఉండితీరాలి. శాస్త్రబద్ధత ప్రకారము అనగా! బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము **"దేవుడు రూప, నామ, క్రియా రహితుడు"** అని చాలామార్లు మనము చెప్పుకున్నాము. అలా చెప్పుకున్నప్పుడు దేవుడు పుట్టడు, పని చేయడు, ఆయనకు ఆకారము లేదు అనేటటువంటి మాటలు కరెక్టుగా సరిపోతాయి. అదే శాస్త్రబద్ధత.

భగవద్గీత బ్రహ్మవిద్యా శాస్త్రము. ఆ బ్రహ్మవిద్యా శాస్త్రములో ఒక శ్లోకము "అజోపి సన్నవ్యయాత్మ" అని ఉంది. **"నేను పుట్టేవాన్ని కాదు, నాశనము అయ్యే వానిని కాదు."** "వ్యయాత్మ" అంటే నాశనము అయ్యేటటువంటిది. వ్యయం కాదు, నేను నాశనము కాను, "అజోపి"

అంటే నాకు పుట్టుక లేదు. అటువంటి వానిని అన్నాడు. దేవుడు పుట్టడు అనే మాటకు ఇది కరెక్టుగా సరిపోతుంది. తరువాత దానికి ఆకారము లేదు, వ్యయము లేదు, పని లేదు అనే దానికి కూడా ఆ అర్థము సరిపోతుంది. అదే శ్లోకములోనే **"అజోపి సన్నవ్యయాత్మ భూతానామీశ్వరోపి సన్"** అంటే సర్వ జీవరాసులకు నేను దేవున్ని అని చెప్పినప్పుడు, ఆ శ్లోకము క్రింద ఏమి చెప్పుతున్నాడంటే, **"ప్రకృతిం స్వామధిష్టాయ సంభవా ఆత్మ మాయయా."** నా ప్రకృతిని నేనే ఆవహించి నేను పుడుతున్నాను. "ఆత్మ మాయయా" ఆత్మతో కూడి, మాయతో కూడి 'సంభవ' సంభవిస్తున్నాను, పుడుతున్నాను అని అంటున్నాడు. పుడుతున్నాను అని అక్కడే చెప్పాడు. ఎక్కడ చెప్పాడు? అదే శ్లోకములోనే! ఒకే శ్లోకములోనే భగవద్గీత శాస్త్రబద్ధత అయింది. బ్రహ్మవిద్యా శాస్త్రానికి సంబంధించి 'దేవుడు పుట్టడు' అనే మాట శాస్త్రబద్ధం అయితే "అజోపి సన్నవ్యయాత్మా భూతానాం మీశ్వరో పిసన్'. నేను దేవున్ని, సర్వజీవరాసులకు దేవున్ని! ఒకరికి కాదు, 'భూతానా' సర్వ భూతములకు ఈశ్వరుణ్ణి, అధిపతిని. అటువంటి నాకు 'అజోపి' అంటే పుట్టుక లేదు. 'వ్యయాత్మ' నాశనం కూడా లేదు. నేను నాశనం అయ్యేటటు వంటి వానిని కాదు, నాకు పుట్టుక అసలు లేదు. అందరికీ దేవున్ని అయితే "ప్రకృతిం స్వామధిష్టాయ సంభవా" అని అంటాడు. నేను తయారు చేసిన ప్రకృతిని నేనే ఆవహించి ఒక శరీరాన్ని తయారు చేసుకొని పుడుతున్నాను. సంభవా అంటే పుడుతున్నాను.

ఇప్పుడు ఇక్కడేమో పైన ఏముంది? నాకు పుట్టుక లేదు అని అన్నాను. క్రింద ఏముంది? ఒకే శ్లోకములోనే రెండు మాటలు ఉన్నాయి. ఇప్పుడు రెండూ శాస్త్రబద్ధత ఎట్లు అవుతాయి? పరస్పర విరుద్ధమైనటువంటి వాక్యాలు శాస్త్రబద్ధత ఎట్లు అవుతాయి? అనేటటువంటి ప్రశ్న ఎక్కడైనా

ఎవరికైనా వస్తుంది. కానీ మనము ఏమి చెప్పుతున్నామంటే, దేవుడు చెప్పిన ప్రతి వాక్యము, శాస్త్రముతో కూడుకొని ఉంటుంది అని చెప్పాము. మరి దేవుడు ఏమి చెప్పినాడు అంటే ప్రతి వాక్యము శాస్త్రముతో కూడుకొని ఉంటే ఇక్కడ రెండు మాటలు అనగా, పుడుతాను అనేది శాస్త్రబద్ధమే! పుట్టను అనేది కూడా శాస్త్రబద్ధమే. రెండూ శాస్త్రబద్ధమే ఎట్లు అవుతాయి, అనే దానికోసము అది మీకు తెలిసే దానికోసము, మేము ఈ "శిలువ దేవుడా" అనే గ్రంథములో వివరించి చెప్పడము జరిగింది. ఆ గ్రంథములో ఒక గొప్ప రహస్యం మీకు అర్థము అవుతుంది. అంటే దాంట్లో ఒక గొప్ప సూత్రము ఇమిడి ఉంది. మీరు ఆ సూత్రము తెలుసుకోవాలి. అంటే పుట్టడు అనేది ఉంది, పుడతాడు అనేది ఉంది. రెండూ శాస్త్రబద్ధమైన విషయాలే అని తెలియజెప్పడం ఉంది. అంటే ఏదో ఒకటి చెప్పినప్పుడు ఒకటి దాట వేస్తారు, కానీ మేము దాటవేయలేదు. ఇది అది రెండూ చెప్పి, రెండింటినీ మేము కనిపించే విధముగా చేసి, ఆ రెండూ ఎట్లు శాస్త్రబద్ధమైనాయి, ఎట్లు సత్యమైనాయి అనేటటువంటిది, ఈ గ్రంథములో అంటే **"శిలువ దేవుడా"** అనే చిన్న గ్రంథములో మీకు అందించాము. దానిలో చదువుకొని మీరు తెలుసుకోవచ్చు.

హిందూ మతములో దేవుడు పుడతాడు అనే నమ్మకము ఉంది. కానీ మిగతా మతాలలో, క్రైస్థవ మతములోగానీ, ఇస్లామ్ మతములోగానీ దేవుడు పుట్టడు అనేటటువంటిది పూర్తి రూఢీగా నమ్మినటువంటి విషయం. దేవుడు పుడతాడు అంటే ఎట్టి సందర్భములోనూ వాళ్లు ఒప్పుకోరు. పుట్టడు అనే మాట వాస్తవమే. మేము కాదని అనలేదు. మేము కూడా పుట్టుతాడు అని ఒప్పుకునే ప్రసక్తే లేదు. కానీ మనము ఏమి అంటున్నామంటే 'పుట్టడు' అని అంటున్నాము. కానీ ఆయన 'పుడతాడు' అని అన్నాడు. కాబట్టి

శాస్త్రబద్ధముగా పుడుతాడు అని మేము కూడా చెప్పుతున్నాము. ఆయన ఎందుకు చెప్పినాడు అనేదానికి మేము వివరము చెప్పాము. ఇప్పుడు ఆయన చెప్పలేదు. అప్పుడు ఆయన చెప్పినాడు, పోయినాడు. దానికి జవాబు చెప్పవలసింది మేమే, కాబట్టి ఇక్కడ ఇరుక్కున్నాము. ఆయన ఆ శ్లోకము చెప్పినాడు, పోయినాడు. ఆ రోజు ఎవరూ అడగలేదు. ఈ రోజు కూడా ఎవరూ అడగలేదు. మేమే అడుగుతున్నాము. ప్రశ్న మేమే వేసి జవాబు మేమే చెప్పుకొంటున్నాము. మేమే అడుగుతున్నాము. దానికి వివరము ఈ గ్రంథములో వచ్చింది చూడండి అని చెప్పుతున్నాము.

పుడతాడు అనేమాట ఎట్లావచ్చింది? పుట్టడు అనేదానికి ఒకచోట ఏమి చెప్పుతాడంటే, నేను మనిషిగా పుట్టినప్పుడు, నన్ను సామాన్య మానవుడుగా లెక్కించుకొని, నన్ను అవమానములపాలు చేస్తున్నారని కూడా చెప్పాడు. భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్యా యోగములో పదకొండవ శ్లోకమందు **"అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం"** అంటాడు. అంటే ఒక శరీరాన్ని ఆశ్రయించినటువంటి నన్ను చూచి మూఢులు 'అవజా' అంటే నన్ను అవమానిస్తున్నారు. **"పరంభావ మజానంతో మమభూత మహేశ్వరం" "నేను సర్వజీవరాసులకు ఈశ్వరుడని, సర్వ జీవరాసులకు దేవుడనని, నా యొక్క విలువ తెలియనటువంటి మూర్ఖులు నన్ను అవమానం చేస్తున్నారు"** అన్నాడు. నర శరీరము ధరించినటువంటి నన్ను చూచి అని చెప్పినాడు కదా! ఆయన. అంటే దేవుడు పుడుతున్నాడు అనే కదా, ఈ శ్లోకములోని అర్థము. కాబట్టి ఈ శ్లోకములో దేవుడు పుడుతున్నాడు, మనిషిగా పుడుతున్నాడు అనే దానికి బలమైన నిరూపణ వచ్చింది. ఒక శరీరము ధరించి పుడుతున్నాడు అనేదానికి బలమైన నిరూపణ వచ్చింది. ఈ మూఢులు అవమానిస్తున్నారు అనే విషయం

కూడా మనకు ఇక్కడ అర్థమయింది. కానీ ఎటువంటి వానిని అవమానిస్తున్నారు? "పరంభావ మజానంతో" అంటాడు. నన్ను గురించి ఏమాత్రము తెలియలేరు. నా యొక్క పరమైన జీవనమైనటువంటి గొప్పతనాన్ని వాళ్లు తెలుసుకోకుండా "మమ భూత మహేశ్వరం" నేను సర్వజీవరాసులకు దేవున్ని అనేటటువంటి విషయం వాళ్ళకు తెలియకుండా నన్ను అవమానం పాలు చేస్తున్నారు అని అన్నాడు. ఇక్కడ పుడతాను అనే దానికి ఇక్కడ సాక్ష్యం వచ్చింది కదా?. ఇంకోచోట జ్ఞానయోగములోనే ఏమి చెప్తుతాడంటే "బహూని మే వ్యతీతాని జన్మాని" నాకు ఎన్నో జన్మలు కల్గినాయి అని చెప్పినాడు. **"బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జునా"** అంటాడు. నాకు ఎన్నో జన్మలు కల్గినాయి, నీకు అట్లే కల్గినాయి. **"తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థపరంతప".** నాకు అన్నీ తెలుసు, నీకు ఏమీ తెలియవు అని చెప్పాడు. నీవు ఎన్నోసార్లు పుట్టావు, నేను కూడా ఎన్నోసార్లు పుట్టాను. నాకు జ్ఞాపకము ఉన్నాయి, నీకు జ్ఞాపకం లేవు అని ఇంతకుముందు చెప్పినట్లు మనము చెప్పుకున్నాము. మరి ఆయనకు ఎందుకు జ్ఞాపకము ఉన్నాయి. మనకి ఎందుకు జ్ఞాపకం లేదు. అంటే మన అజ్ఞానం వల్ల మనకు జ్ఞాపకం లేవు. ఆయనకు ఎందుకు జ్ఞాపకం ఉన్నది అనేది మనకు తెలియదు. ఆయనకు ఎందుకు జ్ఞాపకం వుండేది. మనకు జ్ఞానం వుంటే మనకు తెలుస్తుంది. సరే, ఇప్పుడు మనము ఇక్కడ చెప్పుకోవాల్సిన విషయం ఏమిటంటే, 'దేవుడు పుడతాడు' అనేది ఎంత సత్యమో, 'పుట్టడు' అనేది కూడా అంతే సత్యము.

దేవుడు పుట్టడు అనేది ఎంత సత్యమో, పుడుతాడు అనేది కూడా అంతే సత్యము అర్థమయిందా! అంటే ఇది ఏమిటి? ఉల్టా సీదా మాటలు అని అనుకోవద్దండి. ఇది చాలా గొప్ప జ్ఞానము. అర్థము చేసుకోవాలంటే

ఒక తలకాయ పనికిరాదు, అర్థమయిందా! ఒక ఆయనకు పది తలకాయలు ఉన్నాయట. దశకంఠుడు అని, పది తలలున్న వానికి జ్ఞానము బాగుండేది అన్నమాట. కానీ ఆయనను మనము చెడ్డగా భావించుకొన్నాము కానీ మంచిగా భావించుకోలేదు. అంటే ఒక మనిషికి పది తలలు ఉన్నంత శక్తి ఉంటే, దేవుని జ్ఞానము సులభముగా అర్థమవుతుందంట. అందువలన మనము అర్థము చేసుకునేదానికి దేవుడు చాలా విధాలు మనకు తెలియ జేశాడు. అవన్నీ వాస్తవమే!

ఇప్పుడు **"తల్లి తండ్రి"** అనే గ్రంథములో వ్రాయబోయే విషయము ఏమిటి అంటే, మీకు తెలియజెప్పేది, ఇంతకు ముందు కూడా గత నెలలో కూడా చెప్పాము. ఇప్పుడు ఇంకా కొంత విశ్లేషించి చెప్పాలంటే, తల్లితండ్రి అందరికీ ఉన్నారు. వాస్తవమే కానీ ఇప్పుడు జ్ఞానము తెలుసుకున్న తరువాత మీ తల్లితండ్రి ఎవరు అని అంటే జ్ఞానము తెలియకముందు అయితే శరీరానికి తల్లితండ్రులుగా ఉన్నటువంటి వాళ్ళను, తల్లితండ్రులు అనే వాళ్ళము. వాళ్ళు శరీరానికి తల్లితండ్రులే, కానీ మాకు తల్లి తండ్రులు కాదు. నేను వేరు, నా శరీరము వేరు. అంటే మనిషిని రెండు భాగాలుగా విభజించి చూడవచ్చును. ఏ విధముగా అంటే శరీరాన్ని ప్రక్కన పెట్టి చూస్తే జీవుడు వేరు, శరీరము వేరు పుట్టినప్పుడు శరీరము పుడుతావుంది. పుట్టిన తర్వాత దానిలోనికి జీవుడు వచ్చి చేరుతావున్నాడు. రెండూ కలుసుకున్నప్పుడు సంపూర్ణము అయిపోయింది. అంటే ఒక మనిషి అయినాడు. అంతవరకు అది మనిషి కాదు. జీవుడు శరీరాన్ని వదిలిపోతే మనిషికాదు శవము అవుతుంది. శవము కాదు 'శివము' అనాలి దానిని, కానీ శవము అని అంటున్నాము. ఆ రకంగా జీవుడు+ శరీరము = ఒక మనిషి. మనిషిని విభజిస్తే శరీరము వేరు, జీవుడు వేరు. శరీరానికి

తల్లితండ్రులు వేరు, జీవుని తల్లితండ్రులు వేరు అర్థమయిందా! శరీరము పుట్టేదానికి తల్లితండ్రులు వేరు, జీవుడు ఉద్భవించే దానికి తల్లితండ్రులు వేరు. అంటే రెండు రకాల తల్లితండ్రులు వచ్చారు. ఇప్పుడు మనము రెండు భాగాలుగా ఉన్నాము. అందరికీ వర్తించే విషయం ఇది. సర్వ జీవరాశులకు వర్తించే విషయం మనుష్యులకే కాదు, అందరికీ వర్తించే విషయం. శరీరానికి తల్లితండ్రులు వేరు, నీకు తల్లి తండ్రులు వేరు. నీకు తల్లి తండ్రులు ఎవరు అని అంటే శరీరానికి ఉండే తల్లితండ్రుల గురించి చెప్పు తున్నావు. నీకు తల్లి తండ్రులు ఎవరు అని అడిగితే నీకు ఏమి తెలిసింది? నీ శరీరానికి ఉండే తల్లితండ్రులు మాత్రము నీకు తెలుసు, వాళ్లనే చూస్తున్నావు. వాళ్ల గురించే నీవు చెప్పుతున్నావు. అది మనకు అందరికీ తెలిసిన విషయమే. మనకు ఇప్పుడు తెలియని విషయము ఏమంటే, శరీరానికి తెలిసిన తల్లి తండ్రులు అందరికీ తెలుసుకానీ, జీవాత్మకు సంబంధించిన తల్లితండ్రులు ఎవరికీ తెలియడము లేదు. సరే అంతో ఇంతో జ్ఞానము తెలుసుకున్నాము. భగవద్గీతలో గుణత్రయ విభాగ యోగములో 3, 4 శ్లోకములు చదివితే అక్కడ ఏముంది. **"ఏ గర్భములో నుంచి పుట్టినటువంటి జీవరాశి అయినా కానీ, వానికి తండ్రిని నేను, తల్లి ప్రకృతి"** అని ఆయన చెప్పాడు. ఎవరు? దేవుడు! అప్పుడు, సరే ఈ విషయము తెలుసుకున్న తరువాత మనము భగవద్గీత చదువుకున్నాము లేకపోతే ఇంకొకరి ద్వారా తెలుసుకున్నాము.

ఆ విషయము తెలుసుకున్న తరువాత మనకు ఏమని అర్థమయింది. **తల్లి ప్రకృతి, తండ్రి దేవుడు.** నీ తల్లితండ్రులు ఎవరు అంటే ఆత్మ ప్రకృతులే అని ధైర్యంగా చెప్పుతాము. ధైర్యముగా చెప్పవచ్చు, ఏమీ అనుమానం లేదు. దానిలో ఏ అనుమానమూ లేదు, అనుమానము పెట్టుకోవలసిన

పనీ లేదు. దేవుడే చెప్పినాడు. దేవుడు చెప్పిన తరువాతనే తెలుసుకోవాలి కదా! సరే, ఇప్పుడు ప్రకృతి, పరమాత్మ అనేటటువంటి తల్లితండ్రులు మనకు తెలిసిపోయినారు. తరువాత ఈ శరీరానికి ఉండేటటువంటి తల్లితండ్రులను కూడా మనము ప్రత్యక్షంగా రోజూ చూస్తూ ఉన్నాము. కానీ నీకు ఉండే తల్లిదండ్రులు, మనకు ఈ విధముగా తొందరగా కనపడరు. నీ శరీరానికి ఉండే తల్లితండ్రులు మాత్రము ఎక్కడన్నా కనిపిస్తుంటారు. నీవు వేరు, నీ శరీరము వేరు. సరే వాళ్ళను కాకుండా వీళ్లని తెలుసుకోవాలంటే మనము ఏమంటున్నాము అంటే, ఇప్పుడు నీవు తెలుసుకున్నావా అంటే, చాలామంది ఏమంటారు అంటే, పేర్లు మాత్రము చెప్పగలుతున్నారు కానీ వాళ్ళ వివరము తెలియదు. అనగా, ప్రకృతి ఆత్మ వివరము తెలియదు. ప్రకృతి, ఆత్మ నా తల్లితండ్రులు అనే వరకు తెలుసు. ఇది క్రొత్త రహస్యమే మీకు. మీరు ఏమన్నా అనుకోండిగానీ, మీకు మాత్రము క్రొత్త రహస్యమే. మాకు తల్లితండ్రులు ఉన్నారు అంటే ఉన్నారు, లేదని చెప్పలేదు. ఈ శరీరానికి సంబంధించినటువంటి తల్లితండ్రులు ఉన్నారు. కానీ జీవునికి స్వంతంగా తల్లితండ్రులు ఎవరు? అంటే **ప్రకృతి, ఆత్మ** అని ధైర్యంగా చెప్పుకోవచ్చు. అది నూటికి నూరుపాళ్లు వాస్తవము, దేవుడు కూడా అదే చెప్పాడు.

జ్ఞానము తెలుసుకున్న తరువాత వాళ్ళ పేర్లు మనము చెప్పగల్గు తున్నాము. కానీ వాళ్ళని వివరముగా మనము తెలుసుకోగల్గు తున్నామా? లేదు. ఉదయము ఒక మనిషిని అడిగాను, ఇదే ప్రశ్నే! జ్ఞానము ప్రకారము నీ తల్లి తండ్రులు ఎవరు? అని అయితే నాకు తల్లితండ్రులు ప్రకృతి, ఆత్మ. మీ తల్లితండ్రులు మామూలుగా బయటి తల్లితండ్రులుగా ఉన్నారు. వాళ్ళ పోలికలు వీళ్ళకి ఉన్నాయి. ఒకసారి నేను పొలం దగ్గర కూర్చొని లక్ష్మీనారాయణకు ఫోను చేశాను. ఏమయ్యా మీ అమ్మ వాళ్ళంతా వచ్చారా

అంటే వచ్చారు అన్నాడు. ఏ అమ్మ వచ్చింది? ఏమి కథ? అంటే, ధర్మవరం నుంచి అమ్మ వచ్చింది అన్నాడు. ధర్మవరం అమ్మ అంతే కదా! మీ అమ్మ, మీ నాయన పేర్లు తెలుసు కదా నీకు అనగానే, ఈయనకు ఏమి చెప్పాలా అని అనుమానం వచ్చింది. సరేలే! జ్ఞానము ప్రకారము చెప్పు అంటే ప్రకృతి, ఆత్మ అన్నాడు. శరీరానికి ఫలానా వాళ్ళు తల్లితండ్రి అని చెప్పవచ్చును. ఒకవేళ గుర్తు పట్టేదానికి ఈ లక్ష్మీనారాయణ ఉన్నట్లే, లక్ష్మీనారాయణ తల్లి ఉంది. ఆమె ఉన్నట్లే ఈయన ఉన్నాడు. కాబట్టి తల్లి పోలికలు ఈయనకు ఉన్నాయి. కావున ఈమె కొడుకు అని గుర్తించగల్గు తున్నాము. సులభముగా తల్లి పోలికలు ఉన్నాయి కాబట్టి చెప్పవచ్చు. తండ్రి పోలికలు కూడా అన్నో ఇన్నో ఉన్నాయి. ఒక సంతతికి అంటే శరీరానికి తల్లి తండ్రుల పోలికలు ఉండడము సహజము. అయితే ప్రకృతి, ఆత్మ పోలికలు ఉండడము కూడా సహజమే కదా? సహజమే! ఏ పోలికలు ఉన్నాయని అంటే ఎంత చూసుకున్నా అవి కనపడవు. ఏమన్నా కనిపిస్తున్నాయా! కనపడవు.

సరే, ఇంకొక స్త్రీని అడిగాను. మీ అమ్మ అంటే శరీరానికి అమ్మ కదా! శరీరానికి వున్న ఆ తల్లి తండ్రులను మనము గౌరవించవలసిందే. వాళ్ళు ఏదో పెంచి పెద్ద చేసి పెళ్ళి చేశారు, బంగారు ఎంత ఇచ్చారు అని అడిగాను. 10 తులాలు బంగారు ఇచ్చారు నాకు అన్నది. సరే! ఈ అమ్మ 10 తులాలు ఇచ్చింది. ఆ అమ్మ ఎంత ఇచ్చింది అని అడిగాను. ఏ అమ్మ? ఆ అమ్మ పైసా కూడా ఇవ్వలేదు అన్నది. వీళ్ళు కనిపించే సొమ్ము ఇచ్చారు. కనిపించే అన్నీ ఉన్నాయి, కానీ వీళ్ళు ప్రకృతి ఆత్మ మాత్రము ఏమీ ఇవ్వలేదు. ఇవ్వలేదంటే కన్పించలేదు. ఇవ్వలేదు అంటే నీకు కన్పించలేదు, నీకు తెలియలేదు అని అర్థము. వాళ్ళు చాలా ఇచ్చారు.

10 తులాలు అమ్మితే ఏమి అవుతుంది అంటే ఇప్పుడు రేటు ప్రకారము 3 లక్షలు వస్తుంది. అంతే కదా! మూడు లక్షలు. నీకు ఉండేది ఒక కిడ్నీ విలువ కూడా చేయదు. ఆ రకంగా పోతే రెండు కిడ్నీలు అయితే 50 తులాలు బంగారు విలువ అవుతాయి. అట్లా కనిపించని వాల్లు చాలా ఇచ్చినారు. ఆ విధముగా లెక్కవేసుకొనిపోతే, కనిపించని వాళ్ళు ఇచ్చినదే పెద్దది అవుతుంది.

ఇక్కడ మనము ఏమి చెప్పుకొంటున్నామంటే తల్లితండ్రుల విషయములో ఒక విధంగా పొరపాటు పడినాము. వాస్తవము తెలుసుకుంటే ఎవరు శరీరానికి తల్లితండ్రులో, ఎవరు జీవునికి తల్లితండ్రులో తెలిసి పోతుంది. తెలిసిపోయిన తరువాత ఇప్పుడు మనము బాహ్యంగా ఉండే తల్లి, తండ్రిని గుర్తించవచ్చు. అంటే ఆ గుర్తించడంలో కూడా పెద్దలు ఏమి చేశారు అంటే, తండ్రి ఎవరో నీకు తెలియదు గానీ, పూర్తి తల్లి ద్వారానే తండ్రి విషయము తెలియాలి. తల్లి ద్వారానే తండ్రి ఫలానా అని తెలియాలి. నీకు తండ్రి ఎవరు అనేటటువంటి రహస్యం ఎవరికి తెలుసు! తల్లికి మాత్రమే తెలుసు. ఈ రకంగా తల్లి తండ్రిని గురించి ఏ విధముగా తెలియజెప్పగల్గుతుందో, అట్లే ఇప్పుడు దేవుని (ఆత్మను) గురించి తెలుసుకోవాలంటే ఏమి చేయాలి. బాహ్యంగా ఉండే ప్రకృతి తల్లి మనకు ప్రత్యక్షంగా ఉంది కాబట్టి మనము అడిగి తెలుసుకోవచ్చు. సరే ఈమె మనకు చెప్పవచ్చు.

ఇప్పుడు నీకు తల్లితండ్రులైన ప్రకృతి, ఆత్మల విషయానికి వస్తాము. ఈ ప్రకృతి అనేది మనతో మాట్లాడేది కాదు, పాలు ఇవ్వలేదు, పెంచలేదు, ఏమీ చేయలేదు. ఎట్లు చేస్తావుందో మనకు తెలియదు కానీ, వాళ్ళు

చెప్పుతావుంటే మనము 'ఊ' అని అంటున్నాము. అంతేకదా! మనకు తండ్రి ఎవరనే విషయము అంటే, బాహ్యంగా ఉండే తండ్రి ఎవరు అనే విషయము, నీ శరీరానికి తండ్రి ఎవరు అనే విషయము, చిన్న వయస్సులోనే తల్లి ఏ విధముగా తెలియజేస్తుందో ఆ రకంగా నీకు తండ్రి ఎవరు అనే విషయము ఈ తల్లి తెలియజేయాలి. ప్రకృతి తెలియజేయాలి. ఎందుకంటే మీ తండ్రి దేవుడు కదా? తల్లి ప్రకృతి కదా! చూడండి. మనము ఎంత గొప్ప సంతతో! అంటే నీవు మామూలు వ్యక్తివి కాదు. ప్రత్యక్షంగా సాక్ష్యాత్తూ ప్రకృతి ఆత్మలే నీ తల్లితండ్రులుగా ఉన్నారు. నీవు ఎంత గొప్పవానివో చూసుకో! అంటే ఆ గొప్పతనం మనము అసలుకు లెక్క పెట్టుకోలేదు. అసలుకు మనము వాళ్ళ కొడుకులే అనుకోలేదు. మన గొప్పతనము ఏమి ఏడ్చింది? అనుకుంటే కదా గొప్పతనం వచ్చేది మనకు. సరే! అంత గొప్పవాళ్ళ కొడుకులుగా పుట్టినాగానీ, దానిని మరచిపోయి నీచాతి నీచంగా మనము బ్రతుకుతున్నాము.

సరే, ఇప్పుడు మనము కొంత జ్ఞానము తెలుసుకొని, అంత పెద్దవాళ్ళకు మనము పుట్టాము అనుకొన్నాము. తల్లి తండ్రిని వర్ణించేదానికి మనకు చేతకాదు. ఎంత పెద్దవాళ్ళో మనకు తెలియదు. ఇట్ల ప్రకృతిని వర్ణించలేము, ఆత్మనూ వర్ణించలేము. అంత పెద్దవాళ్ళకు మనము బిడ్డలుగా పుట్టాము. అంత పెద్దవాళ్ళకు పుట్టివుంటే, తండ్రి విషయము తల్లి మనకు తెలియజెప్పాలి కదా! మనకు తెలియదు. తండ్రి పేరు వింటున్నాము దేవుడు అని, ఆయన ఎట్లు ఉన్నాడు? ఎంత పెద్దగా ఉన్నాడు? ఎంత చిన్నగా ఉన్నాడు? అనే విషయం మనకు తెలియదు కాబట్టి ఎవరి ద్వారా మనము తెలుసుకోవాలి? తల్లి ద్వారా తెలుసుకోవాలి. అంటే ప్రకృతి ద్వారా తెలుసుకోవాలి. ఇప్పుడు నీకు ప్రకృతి ద్వారా తెలుసుకొనే దానికి

సాధ్యమవుతుందా! ఎవరికీ సాధ్యము కాదు. ప్రకృతి కనిపించేది అయినా వినిపించేది కాదు. ఏమన్నా మనతో మాట్లాడుతుందా అంటే, మనతో మాట్లాడేదానికి అసలుకు ప్రకృతికి సంబంధమే లేదు. ఏమాత్రము కనెక్షన్ లేదు. మనకు తెలియజెప్పే విధానమే లేదు. అయితే ఎట్లా? అంటే ప్రకృతి ఆత్మను ఏ విధముగా చూపగల్గుతుంది మనకు? ఆత్మే నీకు తండ్రి అని ఎట్లా నిరూపణ చేయగల్గుతుంది? మరి నువ్వే నన్ను ఈ ప్రశ్న అడుగుతావు ఏమని? తల్లి, 'తండ్రి' ని చూపగల్గింది కదా! బాహ్యంగా ఉండే తల్లి, 'తండ్రి' ని చూపగల్గింది కదా! ఆ రకంగా దేవుడు అంటే నిజమైన తండ్రిని చూశాము. అంటే ప్రకృతే చూపాలి కదా! ఎట్లా చూపుతుంది. ఎట్లా అడగాలి మనము? ఆమె ఎక్కడ ఉంది? తండ్రి కథ అట్లావుండనీ. ముందు ప్రకృతి తల్లే తెలియదు. తల్లి అడ్రస్సే మనకు తెలియదు తండ్రియైన దేవున్ని ఎలా చూపుతుంది అని మీరు ప్రశ్న వేయవచ్చు కదా! అడిగేదానికి అవకాశము ఉంది. కాబట్టి దేవుడు ఏమి చేశాడు అంటే, ఇదంతా తప్పించుకొనే దానికి ముందే ఒక పదము పెట్టాడు. ఏమని పెట్టాడు. **"తల్లి తండ్రి, గురువు దైవము"** అంటే. గురువు ద్వారా దేవుడు తెలుస్తాడట.

తల్లి ద్వారా తండ్రి తెలిసినట్టు గురువు ద్వారా దేవుడు తెలుస్తాడు అని చెప్పారు. తెలియచెప్పేవాడు ఒకరిని పెట్టాడు. తరువాత ఈ ప్రకృతి నీకు తెలియజెప్పాలి కాబట్టి ప్రకృతి ఎలా తెలియచెప్పుతుంది? నీకు అర్థము కాదు. కాబట్టి నీకు తెలియజెప్పే రకంగా, పంచేంద్రియాల ద్వారా నీకు అర్థమయ్యే రకంగా, నీకు తెలియజెప్పాలి అంటే తరువాత ఒక మనిషే వచ్చి చెప్పితేకానీ అర్థము కాదు. ప్రకృతి ప్రత్యక్షంగా నీకు చెప్పలేదు. చెప్పే మనిషిని ఏమని అంటున్నాము అంటే, **'గురువు'** అని అంటున్నాము. అంటే తల్లి ఏ విధముగా తండ్రిని చూపగల్గుతుందో, అలాగే దేవున్ని

చూపగల్గేది గురువు. తల్లి తండ్రి అంటే తల్లి **'తండ్రి' ని చూపితే, 'గురువు' దైవాన్ని చూపుతాడు** అని పెద్దలు చెప్పారు. అది ఈ రోజు ఏమైపోయింది అంటే ముందు తల్లిని మ్రొక్కాలి, తల్లి తండ్రి గురువు దైవము వరుసగా ఉంది. 1,2,3,4 అని ముందు ఎవరిని మ్రొక్కాలి అంటే తల్లిని మ్రొక్కాలి, తర్వాత తండ్రిని మ్రొక్కాలి, ఆ తర్వాత గురువును మ్రొక్కాలి, చివరిలో దేవున్ని మ్రొక్కాలి అని చెప్పారు. దేవున్ని విలువలేనివాడుగా చివరికి వేసినాము. చివరికి మ్రొక్కాలి దేవున్ని తల్లితండ్రి, గురువు దైవము ఇది వరుస అయింది. వాళ్ళు చెప్పేది ఏమిటి? మనము చేసేది ఏమిటి? అన్నీ ఇట్లా పనికిమాలిన పనులే చేసేది. ఒక్కటి కూడా మంచిపని వుండదు మనకు. తరువాత చెప్పే వాళ్లు గొప్పగా చెప్పుతుంటారు. ఎంతో మంచి నీతి వాక్యము! "తల్లి తండ్రి గురువు దైవము" అనేది.

తల్లి తండ్రి అనేది వాక్యం మంచిదే. దానిలో ఏ విధముగా అర్థం ఉంది మనకు. అంటే సవ్యంగా అర్థము చేసుకొనేది ఉంది. అపసవ్యంగా కూడా అర్థము చేసుకొనేది ఉంది. సవ్యంగా అర్థము చేసుకొంటే "తల్లి 'తండ్రి'ని ఏ విధముగా చూపగల్గుతుందో, గురువు దైవాన్ని ఆ విధముగా చూపగల్గుతాడు" అనేది వాస్తవంగా చెప్పబడిన అర్థము. కానీ అపసవ్యముగా అర్థము చేసుకుంటే మొదట తల్లిని మ్రొక్కాలి, ఆ తరువాత తండ్రిని మ్రొక్కాలి తరువాత గురువును మ్రొక్కాలి ఆ తరువాత ఓపిక ఉంటే చేతనయితే దేవునికి మ్రొక్కు. గురువు వరకు చేతనయితే ఫరవాలేదు. గురువు వరకు చాలించుకో! లేదు అనుకో, గురువు ఎక్కడ ఉండేది తెలియదు అనుకో, అంత దూరము ఎక్కడకు పోతావు? అంటే తల్లి తండ్రులకు మ్రొక్కు చాలు. ఇంట్లో తండ్రి కూడా ఏదైనా ఊర్లో ఉద్యోగం చేస్తూ ఉంటే, తల్లికి మ్రొక్కు చాలు సరిపోతుంది" అని అంటారు. "అబ్బా! ఈ గురువు చూడు ఎంత

బాగా చెప్పుతున్నాడు. ఇలా ఉండాలి జ్ఞానము అంటే” అని అనుకుంటారు. కానీ ఇది వాస్తవముగా జ్ఞానము కాదు. మనము జ్ఞానము అనుకుంటాము కానీ అది సక్రమమైన పద్ధతి కాదు, అర్థమయిందా!

పద్ధతి అంటే ఏమి! మనము ముందు చెప్పుకున్నది. తల్లి తండ్రి గురువు దైవము అనేది పద్ధతే. తల్లి ఏ విధముగా తండ్రిని చూపగల్గు తుందో, గురువు ఆ విధముగా దైవాన్ని చూపగల్గుతాడు అని చెప్పాము. సరే, ఇక్కడ ఒక చిక్కు వచ్చింది మనకు. ఏమి చిక్కు అంటే, తల్లి ఏమి చేస్తుంది అంటే, కుమారుడు ప్రయోజకుడు అయినప్పుడు, తండ్రికి పేరు తెస్తాడు అనేటటువంటిది ఒకటి ఉంటుంది లేదా అప్రయోజకుడు అయితే ఏమవుతుంది? తండ్రికి చెడ్డపేరు వస్తుంది అన్నమాట. కానీ ఇక్కడ ఈ బయటి తల్లి తండ్రుల విషయం వదిలేస్తాము. కానీ మనకు అది బాహ్య ప్రపంచ సంబంధముగా అంతవరకు అది అర్థము చేసుకోండి. జ్ఞానములోకి వచ్చేసరికే ఏమౌతుంది అంటే, ఈ తండ్రి తెలియాలి అంటే, వాస్తవమైన నిజమైన తండ్రి నీకు తెలియాలంటే, మనకు ప్రకృతి తెలియజేయాలని అనుకుంటున్నాము కదా! కానీ ప్రకృతి స్థానములో గురువు ఉన్నాడని చెప్పాము. ఆ విధముగా దేవుడు ఏర్పాటు చేసి పెట్టాడు.

ఇంతకీ ఈ తండ్రి అనేటటువంటిది మనమే చెప్పుకుంటున్నామా? ఒక భగవద్గీతలోనేనా? మిగతా చోట్ల ఉందా, అంటే బైబిలులో కూడా ఒక వాక్యము ఉంది. మత్తయి సువార్త 23వ అధ్యాయము, 9వ వచనము అనుకుంటాను. **మత్తయి (23-9) భూమిమీద ఎవనికైననూ తండ్రి అని పేరు పెట్టి పిలువవద్దు, ఒక్కడే మీ తండ్రి. మీ తండ్రి పరలోకమునందు ఉన్నాడు”** అని చెప్పారు. అర్థమయిందా! ఇంతకు ముందు కూడా మనము

చెప్పుకున్నాము ఈ మాటను. సరే, దేవుడు 'తండ్రి' అనే విషయము ఇంతటితో రూఢి అయిపోయింది. ఇప్పుడు మనకు దేవుడు తెలియాలంటే మనకు గురువే ఆధారము. ఇప్పుడు గురువు మనకు దైవాన్ని తెలియ జేయగల్గుతాడు. కానీ గురువు ఏమి చేస్తాడు అంటే, గురువు స్థానము ఎవరిదనేది బాగా జ్ఞాపకము పెట్టుకోండి. ఏ స్థానములో ఉన్నాడు ఆయన? ప్రకృతి అంటే ఏమిటి? మాయ స్థానములో ఉన్నాడు ఆయన. ఆయన ఎవరికీ తెలియబడడు. ఒకవేళ ఆయన మనకు దైవం గురించి చెప్పుతాడు. ఆయన ద్వారా మనము వినగల్గుతాము. ఆయన ద్వారా తెలుసుకోగలుగు తాము. కానీ ఇది ఎలా ఉంటుందంటే, ప్రకృతి ఎలా ఉంటుందో మనకు తెలుసుకానీ, అది ఎట్లా మనకు చెప్పుతుందో, అది ఏమిటో అర్థము కానట్టు గురువు కూడా చెప్పుతాడు కానీ, గురువే అంటాము గానీ, ఆయన ఎట్లా ఉంటాడో మనకు అర్థము కాడు. ప్రకృతి వలెనే గురువు కూడా అర్థము కాడు. అందువలన గురువును ఎవరూ చూడలేదు అని చెప్పాము. వ్యక్తిగా ఉన్నటువంటివాడు గురువే. కానీ ఫలానా వ్యక్తి గురువు అని మనము గుర్తించలేము. ఏ మనిషీ గురువును గుర్తించలేడు. బాగా జ్ఞాపకము పెట్టుకోండి! అందుకే **"గురువు"** అనే గ్రంథములో గురువు అనే వానికి శిష్యులే ఉండరు అని మేము వ్రాశాము, గురువు అనేవానికి శిష్యులు ఉండాలి అంటే వాడు గురువు అని గుర్తించగల్గితే కదా! శిష్యులు ఉండేది. గురువు అని తెలియబడితే కదా! శిష్యులు ఉండేది. గురువుకు శిష్యులు ఉండరు అని ఆ గ్రంథములో బాగా వ్రాశాము చూసుకోండి. చాలా రోజుల క్రితం వ్రాశాము, గురువు ఉండేది వాస్తవమే! కానీ ఫలానా వ్యక్తి గురువు అని ఎవరికీ తెలియదు. వివరంగా చెబితే గురువు ద్వారా దేవుడు తెలియబడేది వాస్తవమే, కానీ నీకు ఫలానావారు 'గురువు' అని తెలియదు.

ఆయన నీకు జ్ఞానం తెలియజేస్తాడు. గురువు దైవజ్ఞానమును తెలియజేస్తాడు. ఏదో విధముగా తెలియజేస్తాడు. నీకెందుకు ఆయన గురువు అని నీవు అర్థము చేసుకోవాల్సిన పని లేదు. నీవు ఇంకొకరిని గురువుగా నమ్ముకున్నా గానీ, ఈయన ప్రక్క నుండి తెలియజేస్తాడు నీకు. నీవు గురువుగా ఎవరిని నమ్ముకున్నా ఫరవాలేదు. నీవు ఎవరిని గురువు అనుకున్నా ఫరవాలేదు. వాస్తవముగా ఫలానావాడు దేవుడు అని తెలియ జేసేది ఒక్కడే! వాడే గురువు. వాడు ఎవరికీ తెలియబడడు. ఈ ప్రకృతి ఎంతో, గురువు అంతే! గురువు మాయ స్థానములో మాయగా వున్నాడు. దేవుడూ అంతే, గురువు అంతే! దేవుడు ఎట్లా తెలియబడడో గురువు కూడా అట్లే తెలియబడడు. గురువు విధానం రెండు రకాలుగా ఉంది. ఎందుకంటే ప్రకృతి స్థానములో నుంచి, ప్రకృతి చేయాల్సిన పని గురువు చేస్తున్నాడు కదా! నీకు ప్రకృతి తెలియజేయవలసినటువంటి దైవజ్ఞాన సమాచారాన్ని గురువు తెలియ చేస్తున్నాడు. కాబట్టి గురువు ఎట్లా ఉంటాడు అంటే, దేవుని మీద ఎవరికైతే పూర్తి విశ్వాసము ఉందో, అటువంటివానికి దేవుని ఇష్టము ప్రకారము ఎవరైతే సంపూర్ణముగా నడుచుకుంటున్నాడో, అటువంటి వానికి ఫలానావాడు దేవుడు అని దేవుని జ్ఞానమును సంపూర్ణముగా తెలియజేస్తాడు. ఫలానావాడు దేవుడు అని తెలియబడేటట్లు చేస్తాడు. దేవుని మీద విశ్వాసము లేదు అనుకో! అటువంటి వానికి గురువే మాయగా తయారు అవుతాడు. దేవున్ని నీకు తెలియనీయడు. తెలియజెప్పేవాడు వాడే అయినాగానీ, "దేవుడు ఎవరు" అనేది నీకు తెలియకుండా చేస్తాడు.

దేవుడు ఎవరో తెలియజేసేవాడు కూడా గురువే. నీ ప్రవర్తనను బట్టి, నీ పద్ధతినిబట్టి, నీవు సక్రమంగా ఉంటే సంపూర్ణముగా 'దేవుడు ఎవరు' అనేది తెలియబడుతుంది. ఒకే వ్యక్తి ఒక గురువు అనుకొందాము.

ఒక వ్యక్తి గురువుగా ఉండి వంద మందికి ఒకే జ్ఞానాన్ని బోధించాడు. బోధిస్తే వందమందిలో 10 మందికి మాత్రమే అది ఈయన బోధించిన బోధ సంపూర్ణముగా అర్థమయింది. మిగతా 90 మందికి అర్థము కాలేదు. అర్థము కాలేదంటే వాళ్ళకు ఇంకొక విధంగా అర్థమయింది. ఇంతకు ముందు వీళ్లు తల్లి, తండ్రి, గురువు, దైవము అంటే వరుసబెట్టి మ్రొక్కేది అని చెప్పుకొన్నాము. ఆ విధముగా అర్థమయింది వాళ్ళకు. ఆ రకంగా వాళ్ళకు అర్థమయ్యేటట్లు చేశాడు వాళ్ళకు. ఇంకొక రకంగా అర్థమయ్యే టట్లు చేశాడు వీళ్లకు. వాళ్ళ భావాన్ని బట్టి వాళ్ళకి అర్థమయ్యేటట్లు చేశాడు.

ఈ విధముగా ఒకే బోధ కొంతమందిని దేవునికి దూరంగా పంపించింది. అదే బోధ కొంతమందిని దేవునికి దగ్గరగా పంపించింది. ఇది ఇంకా పెద్ద విచిత్రముగా ఉంటుంది. దేవుడు పనిగట్టుకొని, గురువును మాయగా పెట్టి, కొంతమందిని కావాలని అజ్ఞానంలోకి పంపించి, కొంతమందిని అదే పనిగా జ్ఞానములోకి పంపిస్తాడు. ఆయన చెప్పేది మాత్రము అందరికీ ఒకటే. కనిపించేది, వినిపించేది అందరికీ ఒకే విధముగా ఉంటాడు కానీ, కొంతమందికి మాత్రమే ఆ జ్ఞానము ద్వారా దేవుడు ఫలానా అని తెలియబడుతుంది. అందరికీ తెలియబడదు. దేవుడు ఫలానా అని తెలియకుండా చేస్తాడు. ఇది పెద్ద విచిత్రమైనటువంటి విషయము. అందువలన గురువు అనేవాడే మనకు తెలియడు. తరువాత అటువంటి వాడు ఎట్లా ఉంటాడు అంటే ఎక్కడైనాగానీ, ఏమన్నా మోసము, దగా చేసి వానికి ఒక రకంగా చెప్పి, వీనికి ఇంకొక రకంగా చెప్పుతూ ఉన్నాడా అంటే అలా చెప్పడు. చెప్పేది ఒకటే బోధే, చేసేది ఒకటే పనే. కానీ అర్థము అయ్యేదానికి వాళ్ళకు 'అవగాహన' అనేదానిలో తేడా వస్తుంది. ఎందుకంటే వాని భావములో తేడా వుంది, కాబట్టి ఈ జ్ఞానము కూడా

తేడా అవుతుంది. అక్కడికి పోయే సరికి మారిపోతుంది. మారిపోయి వేరే విధముగా అర్థమవుతుంది. వాళ్ళు దేవునికి దూరంగా పోయే అవకాశము ఉంది.

సరే దేవుడు ఒక విషయాన్ని చెప్పాడు. చిన్న ఉదాహరణ చెప్పుతాను నేను. దేవుడు ఒక విషయాన్ని ఏమని చెప్పాడు అంటే, మనము ఒక మూల గ్రంథములో నుంచి ఒక విషయాన్ని తీసుకుందాము. అదేమిటంటే **"సజీవమైన దాని నుండి నిర్జీవమైనది విసర్జింపబడును"** అని ఉంది ఒకచోట. హిందూ మతములో కాకుండా ఇస్లామ్ మతంలో పై వాక్యం ఉంది. ఇది భగవద్గీతలో ఉండేది కాదు. హిందూ మతములో ఎక్కడా లేదు. ఈ విషయాన్ని మేము ఏమని చెప్పుతున్నాము అంటే ఇతర మత గ్రంథములో ఉంది. అందువలన ఆ మతములో ఉన్న వ్యక్తులను, బాగా జ్ఞానము తెలిసిన వ్యక్తులను ఈ విషయ వివరము అడిగితే, వాళ్ళు దానిని సక్రమంగా చెప్పలేక పోతున్నారు. "సజీవంగా ఉండేదానిని నుంచి నిర్జీవంగా ఉండేది ఏది బయటకు వస్తావుంది" అని వాళ్ళకు అర్థము కాకుండా పోయినది. ఇది దేవుడు చెప్పిన వాక్యమే. ఎవరో ఒక గురువు చెప్పిన వాక్యమే. వ్రాయబడిన వాక్యమే, మూలగ్రంథములో ఉండే వాక్యమే. ఈ వాక్యం మీకు ఎందుకు అర్థము కాకుండా పోయింది? ఇదే వాక్యం మాకెందుకు అర్థమయింది? ఇదే వాక్యమే ఒకరికి అర్థము కాకుండా పోవడము, ఒకరికి అర్థము కావడములో తేడా ఏమిటి? ఇప్పుడు మనము చెప్పుకున్నాము కదా! భావంలో తేడా ఉంటే భక్తిలో తేడా అయిపోతుంది. ముక్తిలో కూడా సీటు దొరకదు. అర్థమయ్యిందా! కాబట్టి మనకు మంచి ఉద్దేశ్యము ఉంటే, అనగా మనలో దేవున్ని తెలుసుకోవాలి, దేవుని సేవ చేయాలి అని అనుకుంటే ఫరవాలేదు. అంతేగానీ ఇక్కడికి వచ్చినా

ప్రపంచములో లాభము ఏమి వస్తుందో అని చూసుకుంటే జ్ఞానము తెలియదు. ఇది జ్ఞానము! ఇక్కడ ప్రపంచ లాభాలు ఉండవు. ప్రపంచ లాభాలపై ఏమాత్రము ఆకాంక్ష పెట్టుకోకూడదు. అది ఏమీ ప్రయోజనము లేదు.

ఇక్కడ నేనొక విషయం చెప్పుతున్నాను, ఉదయం 6 గం॥లకే బయటకు వచ్చి నేను పని చేయించే దానికి బయటవున్నాను. రాత్రి 11.30 కి పండుకొన్నాను, అర్ధరాత్రి 1.30 కి లేచాను. రెండు (2.00) గంటల సేపు పడుకొన్నాను అంటే అది నాకు చాలా గొప్ప నిద్ర. 1.30 నుంచి కొంతసేపు ఇంట్లో చూచుకొన్నాము, 3.30 కు బయటకు వచ్చాము. ఉదయం 3.30 నుంచి బయట ఉండగా 6.00 గ॥లోపు ఒక వ్యక్తి వచ్చాడు, అంటే నేను అప్పుడు నిద్ర లేచి బయటకు వచ్చాను కదా! నేను రావడము కొంతమందికి తెలుస్తుంది, కొంతమందికి తెలియదు. సాధారణంగా మేము మామూలుగా ఉంటాము. అంటే బనీనుతోను, అడ్డపంచతోను మామూలుగా ఉంటాము. ఏ ఆర్భాటాలు ఏమీ ఉండవు కదా! అప్పుడు ఒకాయన వచ్చి స్వామీ! మాకు మూడు నెలల నుండి ఎక్కిళ్ళు, త్రేనుపులు వస్తావున్నాయి ఏమి చేయాలి అని అడిగాడు. అప్పుడు మేము 3 నెలల నుండి వస్తున్నాయా ఆరు నెలలు నుండి వస్తున్నాయా అన్నది ప్రక్కన పెట్టి, అయ్యా! నాకు తెలిసినది జ్ఞానము, నేను జ్ఞానము చెప్పుతాను. నేను డాక్టర్‌ని కాదు. ఎక్కిళ్ళు, త్రేనుపులు ఏవైనా వస్తావుంటే డాక్టర్ దగ్గరికి పోయి చూపించు కోండి. హాస్పిటల్‌కి పోండి అని చెప్పినాము. ఆ విధంగా ఈ ప్రపంచ విషయాలు పెట్టుకొని ఆ ఉద్దేశ్యముతో ప్రపంచ లాభాల కోసం మీరు రావద్దండి. ఒకవేళ నేను ఏవైనా చెప్పుతున్నాను అంటే మీరు జ్ఞానముకోసం రండి, ఒకవేళ మీ కర్మ తెగిపోతే పోవచ్చు. దేవుడు తెంచెస్తే తెంచివేయవచ్చు.

నేను ఏమాత్రము తెంచే అవకాశము లేదు. నేను పెద్దను కాదు, నాకు అటువంటి శక్తి లేదు. ఫలానా శక్తి నాకు ఉందని నేను ఎప్పుడూ చెప్పలేదు. మీ రోగమును లేకుండా చేయు శక్తి ఏమీ లేదు. అది మాకు సంబంధము లేదు.

నేను జ్ఞానము చెప్పే దానిలో నా అంతకు నేను పెద్దనే. నాకు తెలిసినంతవరకు నేను పెద్దనే. మిగతా విషయములు, ప్రపంచ విషయాలతో మాకు సంబంధము లేదు. కానీ ప్రపంచ విషయాలు మీరు దృష్టిలో పెట్టుకొని రావద్దండి. ప్రపంచ కోరికలు కోసం రావద్దండి, అర్థమయ్యిందా! ఏదో స్వామికార్యము, స్వకార్యము రెండూ అయిపోతాయిలే అనుకుంటే మాత్రము స్వకార్యము మీద పని పెట్టుకొని రావద్దండి. స్వామి కార్యం మీదనే రండి. రెండిటినీ పెట్టుకొని వస్తే రెండూ ఇక్కడ ఉంటాయి. అర్థమయినది కొంత, అర్థము కానిది కొంత ఉంటుంది. చెప్పేది ఒకటే కానీ సగం అర్థమవుతుంది, సగం అర్థము కాదు. అక్కడికి పోతే ఇంకా మనకు ఏమైనా లాభము వస్తుంది అనుకుంటే మాత్రము ప్రపంచ లాభము వస్తుంది అనుకుంటే అసలుకే అర్థము కాదు ఇది. పైగా వ్యతిరేఖంగా అర్థమవుతూ ఉంటుంది. ఇది జ్ఞానమే కాదు అన్పిస్తా ఉంటుంది. ఆ రకంగా కూడా అర్థమవుతుంది. చెప్పేదంతా జ్ఞానమే, మళ్లీ ఇంకొకరికి గొప్పగా, జ్ఞానంగా అర్థమవుతుంటుంది. కానీ కొంతమందికి మాత్రము ఇది జ్ఞానము కాదు అనేది అర్థమవుతూ వుంటుంది.

మనము ముఖ్యముగా చెప్పుకుండేది ఏమిటంటే, గురువు అనేటటువంటి వాడు మాయతో కూడుకొని ఉంటాడు. ఎందుకంటే ప్రకృతికి సంబంధించి ప్రకృతి స్థానములో వచ్చివున్నాడు కావున మాయగా ఉంటాడు.

ప్రకృతి తెలియజేయవలసిన విషయాన్ని ఈయన తెలియజేస్తున్నాడు. ప్రకృతి ఏమి చేస్తుంది అంటే ఇంతకుముందు కూడా చెప్పుకున్నాము. నా భర్తకు ఎవరైతే ఇష్టముగా ఉంటాడో, నా భర్తకు ఎవని మీద ఇష్టం కలుగుతుందో, వానికి మాత్రము గేటు తీసి నా భర్త దగ్గరకు పంపిస్తాను. లేకపోతే గేటు అవతలే నిలబెడుతాను అంటుంది ప్రకృతి. ఇంతకుముందే వేమన యోగి ఒకమాట చెప్పాడు **"పతి యెప్పిన సతి ఒప్పును"** అని. పతి ఒప్పుకోకపోతే సతి ఒప్పదు. అంటే పతి, సతులు ఎవరు? వాళ్లిద్దరు ప్రకృతి, ఆత్మలే! మళ్లీ ఆయన ఒప్పుకుంటేనే ముక్తికి పంపించేది. లేకపోతే మాత్రము, ఈమె పంపనివ్వదు అంటే దేవుని దగ్గరకు పంపించదు. కాబట్టి ఇప్పుడు ఆ వ్యక్తిలో ఏ ఉద్దేశ్యం ఉంది, ఏ భావముతో ఉన్నాడు అనేది ఎవరికి తెలుసు? ఇక్కడ కూర్చొని జ్ఞానము చెప్పే గురువుకి ఏమీ తెలియదు అనుకోండి. వాని శరీరములో కూడా ప్రకృతి ఉంది కదా! ఆమెకు తెలుసు. కాబట్టి వాడు ఎంతవరకు శ్రద్ధతో ఉన్నాడో, లోపల వానికి అంతే అర్థము అయ్యేటట్లు చేస్తుంది. ఇక్కడ చెప్పేది ఒకటే అయినాగానీ, వానికి ఎక్కేది కొంతే కాబట్టి నీకు ఎంత శాతము శ్రద్ధ ఉంటే అంత శాతము జ్ఞానము ఎక్కుతుంది. ఈ విషయం ఇంతకు ముందు చాలాసార్లు చెప్పాము.

ఒకే జ్ఞానము ఒకరికి వందశాతము అర్థమవుతుంది. ఒకరికి అరవై శాతము అర్థమవుతుంది. ఒకరికి నలభై శాతము అర్థమవుతుంది. ఇంకొకరికి 20 శాతమే అర్థమవుతుంది. చెప్పినది మాత్రము ఒకటే జ్ఞానమే వుంటుంది. భావము అర్థము కావడంలో తేడా వస్తుంది అని మనము చెప్పాము కదా! అందువలన గురువు చెప్పేటటువంటి జ్ఞానము మనకు ఎన్ని రకాలైనా అర్థము కావచ్చు. ఎన్ని రకాలైనా అర్థమవుతుందని చెప్పడానికి ఆధారము మనము తల్లి తండ్రి, గురువు దైవము అని చెప్పితే, ఆ తల్లి తండ్రి గురువు

దైవము, అనేటటువంటి వాక్యాన్ని తీసుకొని, మనము మ్రొక్కే వరుస క్రమములో వేసుకొని చెప్పుకుంటున్నాము. అది మ్రొక్కే వరుస క్రమమా? లేదు, తెలియజేసే వరుస క్రమము. **"తల్లి తండ్రిని ఏ విధముగా చూపు తుందో, గురువు ఆ విధముగా దేవున్ని చూపుతాడు"** అని పెద్దలు చెప్పితే చివరకు ఇలా అర్థమయింది.

దేవుడు 'నేను పుడతాను' అని ఇస్లామ్ మతములో చెప్పితే 'పుట్టను' అని వాళ్ళకు అర్థమయింది. పుట్టనని చెప్పాడా! పుడతాను అని చెప్పినాడా, **"ధర్మయుక్తున్ని! నన్ను చేరాలంటే మీకు ధర్మాలు తెలిసి ఉండాలి. ధర్మము ప్రకారము అయితేనే మీకు తెలియబడుతాను"** అని భగవద్గీతలో చెప్పినాడు. నా ధర్మాలు నీకు ఎప్పుడైతే తెలియకుండా పోతాయో అప్పుడు నేనే వచ్చి తెలియజేస్తాను అన్నాడు. ఎందుకంటే "నా ధర్మాలు తెలిస్తేనే మీరు నన్ను తెలుసుకోగల్గుతారు" అని భగవద్గీతలో చెప్పాడు. భగవద్గీతలో ఉన్నవన్నీ ధర్మాలే. 17 అధ్యాయాలలో ధర్మాలే ఉన్నాయి. 18వ అధ్యాయము కూడా ధర్మాలతోనే కూడుకొని ఉంది. 18వ అధ్యాయము చివరిలో అంటే మోక్ష సన్న్యాస యోగము చివరిలో 66వ శ్లోకము చెప్పాడు, అందులో **"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"** అన్నాడు. ఇంతవరకు చెప్పినవి ధర్మాలే, అవన్నీ విడిచిపెట్టినావు అనుకో, నా దగ్గరికి తొందరగా వస్తావు. అవన్నీ ఎంచుకుంటూ ఎంచుకుంటూ వచ్చినావు అనుకో! చాలా ఆలస్యము అవుతుంది. ఆ విధముగా వస్తావు నిజమే. అవన్నీ 1, 2, 3, 4 ధర్మాలన్నీ వరుసగా ఎంచుకుంటూ వస్తే, ఎప్పుడు వస్తావు? అన్నీ అయిపోయినాక ధర్మాల ప్రకారము వస్తావు. ధర్మాల ప్రకారమే రావాలి. అది సూత్రము, కానీ అన్ని విడిచిపెట్టినావు అనుకో, తొందరగా క్రాస్‌కట్‌లో వస్తావు? ఆ

విధముగా కూడా చెప్పాడు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అని, అర్థమయిందా!

'అపరిచితుడు' సినిమాలో ఈ శ్లోకం చెప్పి మనుషులను చంపుతుంటాడు ఒకడు. మీకు జ్ఞాపకం ఉందో లేదో మరి ఇదే శ్లోకము చెప్పుతుంటాడు. భగవద్గీతలో ఇది ముఖ్యమైన శ్లోకము అనుకోండి. అంటే, దేవుడు ధర్మయుక్తుడు, ధర్మములతో కూడుకున్నట్టి వాడు, ధర్మాలకు అతీతుడు అర్థమయిందా! దేవుడు ధర్మబద్ధుడు, ధర్మాలకు అబద్ధుడు. ఆయనను రెండు రకాలుగా చెప్పవచ్చు. పరమాత్మయిన దేవుడు పురుషుడు అంటే పురుషుడు అనేది ఆ విధముగా కూడా చెప్పలేము. స్త్రీ అంటే స్త్రీ అని కూడా చెప్పవచ్చు. స్త్రీ ఆయనే, పురుషుడు ఆయనే, అన్నీ ఆయనే. ఇది అది అని తేల్చి చెప్పేదానికి ఎవరితోనూ కాదు. దేవున్ని ఇట్లే ఉన్నాడు, ఇదే దేవుడు అని చెప్పేదానికి ఎవరికీ సాధ్యం కాదు. దేవున్ని ఎవరూ ఇంతవరకు చూడలేదు. ఎవరూ భూమిమీద ఇంతవరకు దేవున్ని చూడలేదు అర్థమయిందా! అది నూటికి నూరుపాళ్ళు వాస్తవం. మరి దేవున్ని చూడనిది, దేవుని విషయాలు మనము ఎందుకు చెప్పుకోవాలి? అంటే చూడలేదు కాబట్టి చూడాలి అని చెప్పుకుంటున్నాము. ఇప్పుడు చెప్పుతున్నావు కదా! ఎవరికీ కనపడదు, ఎవరికీ వినపడదు అసలుకు బ్రతికివున్నవారు ఎవరూ చూడలేరు అని చెప్పుతున్నారు మీరు. మరి బ్రతికి ఉన్నవాడు చూడకపోతే మనము అసలుకు ఏమి చేయాలి, ఆ ప్రయత్నము ఎందుకు? అని మీరు ప్రశ్న వేసుకోవచ్చు. కానీ బ్రతికినవాళ్ళు ఎవరూ చూడలేరు, చివరకు చనిపోతే నీవు దేవుని దగ్గరకు పోయి చూడవచ్చు. మరలా ఇక్కడకి రాకుండా, ఆ దేవుని దగ్గరకు పోయేదాని కోసము మనము దేవునికి సంబంధించిన జ్ఞానము తెలుసుకోవాలి. ఈ రకంగా మనము లెక్క వేసుకుంటూ పోతే

ఈ తల్లి తండ్రి అనేటటువంటి విషయంలో మనము పెద్ద పొరపాటు పడిపోయినాము. ఆత్మయిన దేవుడు తండ్రి అనే విషయాన్ని మనము మర్చిపోయినాము. అంటే మర్చిపోయేదానికి ముఖ్యమైన కారణం ఏమిటి? అని మరలా ప్రశ్న వేసుకుంటున్నాము.

సరే! మీరు ఇంతగా చెప్పారు ఇప్పుడు ఏదో జ్ఞాపకము చేశారు. ఫలానావాళ్లు తల్లి తండ్రి అని ఇప్పుడు గుర్తు పెట్టుకుంటాము. ఈ రోజు నుంచి. మరి ఇన్ని రోజులు మనము ఏ విధముగా మరచిపోయాము? ఎందుకు మరచిపోయాము? ఇప్పుడు చెప్పితే అది గుర్తుకు ఉంటుందా! అది ఏదో విన్నాడు, ఏదో చెప్పినాడు. మనకు ఎవరితో ఏమి అవసరము, ఇప్పుడు కనిపించే వాళ్లను విడిచిపెట్టి, కనపడనివాళ్ళని, మనము ఎందుకు పట్టుకోవాలని అనుకుంటున్నాము? ముఖ్యముగా మనము ఆ విధముగా నిజమైన మన తల్లితండ్రులను మరచిపోవడానికి కారణం ఏమిటి? శరీర తల్లి తండ్రులను జ్ఞాపకం పెట్టుకోవడానికి కారణం ఏమిటి? అని ప్రశ్న వేసుకుంటే భగవద్గీత ఒక గుణము దగ్గర పుట్టింది అని చెప్పవచ్చును. అంటే మోహ గుణము దగ్గర పుట్టింది. అర్జునుడిని ఎప్పుడైతే యుద్ధము చేయమని కృష్ణుడు చెప్పినాడో, అప్పుడు మోహగుణము పని చేసింది. అర్జునుడు అందరినీ చూసి వీడు మా పెద్దనాయన, వీడు మా చిన్నాయన, మామ, అల్లుడు, వీడు కొడుకు వరుస అవుతారని, వాళ్ళందరినీ చూసి, 'అంతా నా వాళ్ళే' అని అర్జునుడు అనుకున్నాడు. నా వాళ్ళని నేను ఎట్లా చంపేది, ఈ రాజ్యం కోసము నేను చంపను. నాకు ఈ రాజ్యము లేకున్నా ఫరవాలేదు అని అనుకున్నాడు.

ఇప్పుడు వాస్తవముగా మనము తెలుసుకున్న జ్ఞానము ప్రకారము అక్కడ ఉండే వాళ్ళంతా అర్జునుడికి సంబంధించిన వాళ్ళేనా! అని

ప్రశ్నించుకొంటే వారు అర్జునుడి శరీరానికి సంబంధించినవాళ్లు, అర్జునుడికి సంబంధించినవారు కాదు అని తెలియుచున్నది. అంటే వారు అర్జునుడి శరీరానికి సంబంధించిన బంధువులు శరీరాన్ని బట్టి కదా! వరుసలు వచ్చివుండేది? కాబట్టి తన శరీరానికి సంబంధించిన వాళ్ళందరినీ, తనకు సంబంధించిన వాళ్ళుగా అనుకోవడము పొరపాటు. అట్లు పొరపడడానికి కారణము ఏమిటి అంటే మన శరీరములో 12 గుణాలు ఉన్నాయి. ఆ 12 గుణాలలో మోహగుణము అనేది ఉంది. ఆ మోహగుణము నాది, నా వాళ్లు అనేటటువంటిది భావమును కల్గించుచున్నది. 'నా' అనే భావము పుట్టించేదంతా మోహగుణము. ఇప్పుడు వీళ్ళు నా వాళ్లు అని మనిషికి భ్రమ కల్గించేది మోహగుణము, అంటే మోహగుణము మనిషిని భ్రమింపజేసి వీళ్ళంతా నా వాళ్లు అనిపించింది, బాధపడేటట్లు చేస్తుంది. భగవద్గీత పుట్టుకకు కారణము ఏమిటి అంటే, ఎక్కడ నుంచి ప్రారంభమైనది అంటే, అర్జునునకు మోహగుణము ఎప్పుడైతే చెలరేగిందో అప్పుడు భగవద్గీతను కృష్ణుడు చెప్పాడు.

ఇప్పుడు మనకు ముఖ్యమైనది ఆశ అనేది పెద్ద గుణము అని అనుకున్నా, క్రోధము అనేది రెండోది అనుకున్నా, తల్లితండ్రుల విషయములోనే కాక మిగతా అన్ని విషయాలు నిన్ను నాది, నా వారు అని భ్రమ పెట్టునది మోహగుణమే. మనకు గుణాలు మొత్తము 12 ఉన్నాయి. ఆ లిస్టు తెలుసునో లేదో మీకు. ముందు ఒకపాట నేర్చుకోవచ్చు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర అని, తరువాత ఇంకొక పాట నేర్చుకోవచ్చు, ఈ ఆరు గుణాలు చెప్పవచ్చు. తరువాత ఆరు గుణాలు చెప్పవచ్చు. కాని దానిలో కామ, క్రోధ, లోభ, మోహ అని చెప్పినాను కదా! అందులో అప్పుడు నాల్గవ గుణం మనలో ఉండే మోహ గుణము.

ఈ గుణమే తల్లితండ్రులను మరచి పోయేటట్లు చేసినది. అర్జునుడు నా బంధువులు అనుకున్నాడు. అర్జునుడు వేరు, అర్జునుడి శరీరము వేరు. శరీరములో అర్జునుడు నివాసము చేస్తున్నాడు. చేస్తున్నంతసేపు ఆ విధముగా అనుకున్నాడు.

ఆ విధముగా అనుకోకముందు ఏమి జరిగిందంటే, అర్జునుడు నా వాళ్లు అనుకున్నాడు. ఇప్పుడు ఇక్కడ నిన్ను ఉదాహరణగా తీసుకొంటే మొదట నీవు ఒక అద్దములో చూసుకొన్నప్పుడు నేను అనుకుంటున్నావు. ఇది నా ముక్కు, ఇది నా చెవి అనుకుంటున్నావు. ఇది నా నా అని వచ్చింది కదా! అట్లే నా వాళ్లు అనేది ఒకటి ఉంది. ముందు నీ శరీరము వరకు చూసుకుందాము. నా అని వచ్చింది కదా! నేను వేరు, నా శరీరము వేరు అనుకోలేదు. ఈ శరీరాన్ని నేనే అనుకుంటున్నావు. శరీరాన్ని చూసి భ్రమిస్తున్నావు. నీవు వేరు, నీ శరీరము వేరు, నీ శరీరానికి ఉండే ఆకారము వేరు, నీవు ఈ రోజు ఇక్కడ కూర్చొన్నావు. ఇంకా కొంత సేపు ఇంకొకచోట కూర్చొంటావు. ఇంకా కొంతసేపటికి ఇంకొక ఊరిలో ఉంటావు. ఏది? నీ శరీరము! కానీ నీవు మాత్రము ఒకటే స్థానములో ఉన్నావు. నీ శరీరము లోపల ఒకే ఒకేచోట నీవు స్థానము మారకుండా ఉన్నావు. అటువంటి నీవు ఏమాత్రము నీ మీద నీవు ధ్యాస పెట్టుకోకుండా, నిన్ను నీవు మరచిపోయి, నీ శరీరాన్నే నేను అనుకుంటున్నావు. అక్కడే నీకు మోహ గుణం పుట్టింది అర్థమయిందా! నీకు మోహగుణము ఎక్కడ నుంచి ప్రారంభమైనది? నీది కాని శరీరాన్ని నీ చేత నాది అనిపిస్తావుంది. అక్కడే మోహగుణం పుట్టింది. కాబట్టి ఇతనికి ఎక్కడ నుంచి ప్రారంభము కావాలి జ్ఞానము? అక్కడ నుంచే ప్రారంభము కావాలి. కాబట్టి భగవద్గీతను అక్కడ నుంచే ప్రారంభించాడు భగవంతుడు. మీరు జ్ఞాపకం పెట్టుకోండి! కరెక్టుగా

మోహ గుణము దగ్గరనే ప్రారంభించాడు. ఇప్పుడు తల్లితండ్రులు ఎవరు అని తెలుసుకోగల్గితే, తెలుసుకోవాలి అంటే ఏమి చేయాలి? ముందు ఇక్కడి నుంచి ప్రారంభం కావాలి. నేను ఎవరు అని ప్రారంభిస్తే, నీవు విభజించు కోవాలి. నీవు మనిషివి. మనిషి రెండు భాగాలుగా ఉన్నాడు. శరీరము వేరు, నీవు వేరు అని తెలుస్తుంది కదా! ఆ విధముగా విభజించు కొన్నప్పుడు నీ శరీరపు తల్లి తండ్రులు వేరనీ, నీ తల్లి తండ్రులు వేరని తెలుస్తుంది. అప్పుడు నీవు నీ తల్లితండ్రులను గురించి నీవు తెలుసుకోకపోతే అజ్ఞానమవు తుంది. జ్ఞానము ప్రకారము ఇప్పుడైనా మనము చిన్నచిన్నగా తెలుసుకునే దానికి ప్రయత్నం చేస్తాము. ఒకనికి 60 సం॥ వయస్సు వచ్చింది, ఏమయ్యా! నీ తల్లితండ్రుల గురించి ఇంకా నీకు తెలియదా! అంటే తెలియదనేగా అర్థము. 70 సం॥ల వయస్సు వచ్చినా తెలియదు. 80 సం॥ వయస్సు వచ్చినా తెలియదు ఏం చేస్తాం! వాస్తవముగా బయటికి చెప్పుకోవాలంటే చిన్నతనమే. మనకున్న అజ్ఞానమే.

మన తల్లితండ్రుల గురించి మనకే తెలియకపోతే చాలా తెలివి తక్కువ పని అవుతుంది. కాబట్టి మనము తెలుసుకోవాలంటే శరీరము నుండి ప్రారంభం కావాలి. అందువలన మొట్టమొదట మోహ గుణము అనేదానిని మనము తెలుసుకోగల్గితే, అక్కడ నుంచి జ్ఞానమార్గము ప్రారంభమవుతుంది. మనము ఎవరని, మన తల్లితండ్రులు ఎవరని, మనము నిఘా పెట్టుకొని అక్కడ నుంచి వెతకడం ప్రారంభించవచ్చు. మనిషి అన్నాక శరీరము ఒకటి వుంది. శరీరములో ఒక జీవుడు వున్నాడు. 'ఆ జీవునికి శరీరములోని గుణాలు కరుచుకొని వానిని మభ్యపెడుతున్నాయి' అనే విషయము తెలియకపోతే మనకు ఏ జ్ఞానమూ తెలియదు. కాబట్టి మొట్టమొదట దేవుని జ్ఞానము తెలుసుకోవాలంటే, బయట ఎక్కడికో పోయి

ఏమి నేర్చుకున్నా ఏమీ ప్రయోజనము లేదు. మొత్తము శరీరములో ఉండేటటు వంటి భాగాలు మనము తెలుసుకొని, శరీరములోని తతంగాన్ని తెలుసుకోగల్గితే, అప్పుడు నిన్ను నీవు తెలుసుకుంటావు. తరువాత నీ తల్లి తండ్రులను కూడా తెలుసుకుంటావు.

ఇప్పుడు నీవు ఇంతగా చెప్పుతున్నావే. నీ తల్లి తండ్రులు నీకు తెలుసునా అని నన్ను నీవు ప్రశ్నించవచ్చు. అప్పుడు నేను ఏమి చెప్పాలి? నేను ఏమి చెప్పినా మీకు అబద్దము కావచ్చు, నిజము కావచ్చు. అసలుకు నీకు తెలిస్తే కదా! నీ తల్లి తండ్రులు నీకు తెలియదు. నా తల్లి తండ్రులు ఎవరైతేనేమి ఒకవేళ నేను ఫలానావారని చెప్పినాను అనుకో 'ఊ' అని 'ఊ' కొట్టాలి మీరు. కాబట్టి ఇంకొకరిని ప్రశ్నించే దానికైనాగానీ, వానికి కొంత తెలిసి ఉండాలి. వాళ్ళు చెప్పితే అన్ని విధముల మనకు తెలియాలి కదా! నిజమే, తెలియకున్నాగానీ తెలిసిన విధముగా చెప్పితే, నీవు 'ఊ' అనాల్సిందే. ఎట్ల తెలుసు అని ప్రశ్న వేయలేవు. దాని దారి తెలియదు కదా! కాబట్టి మనము దీనికి సంబంధించిన జ్ఞానమంతా తెలుసుకోగల్గితే మన తల్లితండ్రిని తెలుసుకోవచ్చు. ఇంకొక వ్యక్తి తెలుసుకున్నాడా లేదా అని మనము వానిని గమనించవచ్చు. ఇప్పుడు నేను తెలుసుకున్నాను అనే విషయము నేను చెప్పినాగానీ నిజము చెప్పుతున్నాడా అబద్దము చెప్పుతున్నాడా అనేది నీవు తెలియాలి.

ఒకసారి ఒక శిష్యుడు ఏమి చేశాడంటే గురువును వెదుకుతూ పోయినాడట, నాకు నిజముగా ఎవడన్నా గానీ దేవున్ని చూసినోడు ఉంటే, నాకు చూపించేవాడుంటే నేను ఆయనకు శిష్యత్వం చేస్తాను అని అన్నాడంట. గురువు దగ్గరికి పోయి నీవు దేవున్ని చూశావా, నాకు చూపిస్తావా? నీవు

చూసివుంటే చూపిస్తావు. నీవు చూపించేటట్లు వుంటే చెప్పు, నేను శిష్యత్వాన్ని చేస్తాను, నేను శిష్యునిగా ఉంటాను. అంటే ఆ గురువు ఎందుకు వీనితో తలనొప్పి అనుకొని, గట్టిగా అడుగుతున్నాడు, ఎందుకులే! అని, నేను చూడలేదు అని చెప్పినాడు. మరొక గురువు ఏమి చేసినాడంటే ఏమి చెప్పితే ఏమవుతుంది? వానికేం తెలుసులే అని నేను చూసినాను, నీకు చూపిస్తా అని అన్నాడు. ఈయన చూసినాడంట, ఎవరూ ఇంతవరకు అలా ఒప్పుకోలేదు. ఈయన చూసినాడంట. నాకు చూపిస్తాడంట అని అతనిని నమ్మి ఆయనకు శిష్యత్వము చేయనారంభించాడు. ఒక రోజు పోయింది, రెండు రోజులు పోయాయి. నెలపోయింది, రెండు నెలలు పోయాయి. సంవత్సరము పోయింది. 2, 3 సం॥లు పోయినాయి. చివరకు గురువుకు ఏదో రోగం వచ్చి చనిపోయాడు. చూపిస్తానని చెప్పినాయన చనిపోతే ఎవరు చూపిస్తారు. ఆయన చూసివుంటే కదా! ఈయనకు చూపించేది?

ఈ రకంగా మనము మభ్యపడి పోకుండా ఉండాలంటే, మనకు ముందే దేవుని జ్ఞానము కొంత తెలిసివుంటే మంచిది. కాబట్టి ఇప్పుడు మనము ఈ జ్ఞానము తెలియాలంటే, మోహగుణాన్ని మీరు ముఖ్యముగా తెలుసుకోవాలి. ఈ మోహగుణాన్ని తెలుసుకోగల్గితే తల్లి తండ్రిని ఏ విధముగా చూపగల్గుతుందో, గురువు దైవాన్ని ఆ విధముగా చూపగల్గుతాడు అనే విషయాన్ని పూర్తి తెలియగలరు. మీ అమ్మ, మీ నాయన గురించి తెలుసుకోకపోతే ఏమి ప్రయోజనము? పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా అన్నట్లు కాదా! వేమన యోగి చెప్పినాడు. తల్లితండ్రుల మీద దయలేని పుత్రుడు పుట్టనేమి గిట్టనేమి, పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా అన్నాడు. ఆయన చెప్పిన మాట వాస్తవమే కదా! ఎవరు నీ తల్లి తండ్రులు తెలుసుకో.

పొరపాటుగా ఇంకొకరిని తల్లితండ్రియని అనుకోవద్దండి. వేమన జ్ఞానము చెప్పినది, ఒకవేళ బయటి తల్లితండ్రులు అనుకునే దానికి ఈ విధముగా చెప్పాడు.

*వేయి విధములమరు వేమన పద్యంబు*
*లర్థమిచ్చు వాని నరసి చూడ*
*జూడ జూడ గల్గు జోద్యమౌ జ్ఞానంబు*
*విశ్వదాభిరామ వినురవేమా.*

నేను చెప్పేదంతా స్వచ్ఛమైన జ్ఞానాన్నే, ప్రపంచ విషయాలు చెప్పను. నా పద్యం నీకు వెయ్యి రకాల అర్థము వస్తుంది. అయినా కానీ నా పద్యములో విశేషమైన జ్ఞానము ఉంటుంది అని వేమన చెప్పాడు. కాబట్టి "తల్లి తండ్రుల మీద దయలేని పుత్రుడు పుట్టనేమి, గిట్టనేమి" అంటే ఏమిటి? తల్లితండ్రుల గురించి ధ్యాస లేనటువంటివాడు పుట్టినా ఒకటే, పుట్టకున్నా ఒకటే. వానివలన ఉపయోగం లేదు. పుట్టలోని చెదలు పుట్టుతుంది, చస్తుంది. అది ఎప్పుడు పుడుతుంది, ఎప్పుడు చనిపోతుంది మనకు తెలియదు, అంతే మన బ్రతుకులు కూడా అని చెప్పాడు. ఎంత బాగా చెప్పాడు వేమనయోగి? ఆయన చెప్పినది జ్ఞానవరంగా నీవు అడుగడం లేదు. ఇది రెండో తరగతి చదువులోనే వచ్చింది. మీరందరూ చదివుంటారు ఈ పద్యాన్ని. కానీ అప్పుడు ఏ తల్లితండ్రులను అనుకున్నారో మాకు తెలియదు కానీ, ఇప్పుడు మీ తల్లితండ్రుల గురించి అనుకోండి ఇంతటితో ఈ సమావేశాన్ని ముగిస్తున్నాము.

## 78. తోలేవాడు

***(తేది : 02.07.2015)***

ఇక్కడ సమావేశమై ఉన్నటువంటి ప్రజలందరికీ, మేము చెప్పే విషయం సంపూర్ణంగా అర్థంకావాలని కోరుకుంటూ ఈ సభను ప్రారంభిస్తున్నాము. ఇంతవరకు మాకు పుత్రులుగా ఉన్నటువంటి భక్తులే ఉన్నారు అనుకొన్నాము. కానీ కుమార్తెలుగా స్త్రీలు కూడా, ఈ రోజు జ్ఞానములో చాలామంది ఉన్నారు. దానికి చాలా సంతోషము. ఇంకా ఏమి చెప్పుచున్నాను అంటే పురుషులకంటే స్త్రీలు ఒక అడుగు ముందుకు పోయారు అని కూడా చెప్పవచ్చు. ఈ రోజంతా మనం ముస్లీం సమాజాన్ని గురించే ఎక్కువగా మాట్లాడుకొంటాము. రాబోయే పౌర్ణమి 'గురుపౌర్ణమి' కాబట్టి ఆ రోజు హిందూ సమాజాన్ని గురించి బాగా విపులంగా మాట్లాడుకోవచ్చు. మొట్ట మొదట మేము చెప్పేదేమంటే ఈ ఖురాన్ గ్రంథం అంటే **'అంతిమ దైవగ్రంథంలో జ్ఞానవాక్యాలు'** అనే గ్రంథం నేను వ్రాయకముందు, కొంతమంది నమస్కారము చేసే వాళ్ళు. మాకు రెండు చేతులతో నమస్కారము చేసే వాళ్ళు. కానీ, పడుకొని నమస్కారము చేసేవాళ్ళు ఎవ్వరూ లేరు, అంటే సాష్టాంగదండ ప్రమాణం చేసేవాళ్ళు ఎవ్వరూ లేరు. ఇంతవరకూ చూడలేదు. కానీ ఆ గ్రంథం వ్రాసిన తర్వాత, అందరూ మొత్తం బోర్లా పడుకొని, దండ ప్రమాణం చేసేవాళ్ళుగా తయారైనారు. ఎందుకు అని అంటే, అది సాష్టాంగ దండప్రమాణం అంటున్నారు. సాష్టాంగ నమస్కారము అనేది ఖురాన్ గ్రంథంలోనే చెప్పబడి ఉంటే తెలిసింది కానీ, హిందువుల గ్రంథాల్లో అది లేదని చెప్పవచ్చును.

ఇంకొకరికి నమస్కారము చెయ్యకూడదు, ఇది షరియత్ అని చెప్పినటువంటి ముస్లీమ్ సమాజంలో, ఎవరూ నమస్కారము చేయనటువంటి

ఇస్లామ్ సమాజంలో ఖురాన్ గ్రంథం చదివి, ఆ సమాజం నుంచి ఈ రోజు చాలామంది హిందువులు నేర్చుకొని క్రిందపడి మ్రొక్కుతున్నారు. అంటే ఇంతకు ముందు, సాష్టాంగ నమస్కారము చేయని వాళ్ళు, ఈ అంతిమ దైవగ్రంథం చదివిన తర్వాత నమస్కారము చేయడానికి మొదలు పెట్టారు. ఖుర్ఆన్‌యందు ఒక ఆయత్‌లో ఇలా చెప్పబడి వుంది. **"దేవుడు వస్తాడు మీరు నమస్కారం చేయండి, సాష్టాంగ నమస్కారం చేయండి"** అని చెప్పారు. దేవదూతలంతా ఆ రకంగా చేస్తున్నారు. మీరు మనుషులు కూడా సాష్టాంగ నమస్కారం చేయండి అని అంటే, మీకు దేవుడు ఎవరైవుండేది తెలియదు. కానీ దేవుడు ఎవరైవుండేది దేవదూతలకు తెలుసు. పరమాత్మయిన దేవుని పరిపాలనలో ఉండేటటువంటి వాళ్ళకు తెలుసు కాబట్టి వాళ్ళు ఆ రకంగా సాష్టాంగ దండ నమస్కారం చేస్తున్నారు. మీరు కూడా అలానే చేయండి అన్నారు. దేవుడు మనిషిగా వచ్చినది దేవదూతలుగా ఉన్నవాళ్ళకు తెలుసు, మనకు తెలియదు. ఇపుడు మనం తెలియని వాళ్ళం దేవుడు వచ్చినాడని ఎక్కడా మనకు గుర్తు లేదు కదా!

కాబట్టి మనిషిగా ఉండే వాళ్ళకు ఎక్కడా నమస్కారం చేసేదానికి అవకాశం లేదు. ఇంతకు ముందు వచ్చిపోయిన వాళ్ళకు నమస్కారము చేస్తున్నాము. ఇంతకుముందు వచ్చి పోయిన వాళ్ళు, ఒకరు (లేక) ఇద్దరు ఉన్నట్టు మనకు తెలిసింది. చాలామంది ఉన్నారు. కానీ ఈయన దేవుడు ఈ రకంగా మానవ ఆకారంలోకి వచ్చి పోయినాడు అని మనకు కొద్దిగా గుర్తు తెలిసింది. తెలిసినదానివల్ల వాళ్ళ ఆకారాలకు మనం ఈ రోజు సాష్టాంగ దండ నమస్కారము చేస్తున్నాము. అంటే ఇది ఎక్కడ నుండి చూసి నేర్చుకున్నాము, అంతిమ దైవగ్రంథము ఖురాన్‌యందు 15వ సూరా, 30వ ఆయత్ చూసి నేర్చుకున్నాము? ఖురాన్ గ్రంథంలో దాన్ని అనుసరించే

ముస్లీమ్‌లంతా ఎవ్వరికీ మ్రొక్కవద్దండి అని చెప్పుచున్నారు. ముస్లీమ్‌లు మ్రొక్కకూడదు అని చెప్తున్నారు. మ్రొక్కకపోతే మీరు 'సైతాన్‌లు' అయ్యే వాళ్ళుగా ఉన్నారని అదే గ్రంథంలోనే 15వ సూరా, 31 ఆయత్‌లో చెప్పారు. మ్రొక్కనివాడు 'ఇబ్లీసే' అని చెప్పారు. కాబట్టి మ్రొక్కండి అని ఖుర్‌ఆన్‌లో చెప్పితే మ్రొక్కకూడదు అని వీళ్ళు ఇక్కడ ఒక నియమం పెట్టుకున్నారు. అంటే, వీళ్ళు పెట్టుకొనే నియమానికి కొద్దిగా న్యాయం ఉంది అనుకోండి. ఎందుకంటే వీరు ఎవరికి మ్రొక్కాలి? అంటే తెలియదు కాబట్టి, ఎవరికీ మ్రొక్కవద్దండి చెప్పినారు.

దేవుడు ఎవరైనది తెలియదు కాబట్టి మ్రొక్కవద్దండి అని చెప్పినారు. అసలు దేవుడు పుట్టనే పుట్టడు కాబట్టి మ్రొక్కవద్దండి అని చెప్పినారన్నమాట. దేవుడు పుట్టడు అని గ్రంథములో ఎక్కడైనా చెప్పాడా? అని అంటే, అది కూడా మనమే నిర్ణయం చేసుకున్నాము. ఏదైనాగానీ గ్రంథములో చెప్పిన విషయం మనకు అర్థం కాకుండా పోయినపుడు, అది అపార్థం అయిపోతుంది అని చెప్పాము. ఇపుడు షమీరా అను ముస్లీమ్ భక్తురాలు ఒక గ్రంథం వ్రాశారు, ఆమె దానికి పేరు పెట్టలేదు. ఆమె అలా వ్రాసు కుంటూ, వ్రాసుకొంటూ పోయారు కానీ ఏమి పేరు పెట్టాలో ఆమెకు తెలియలేదు. ఆ గ్రంథమునకు పేరు పెట్టావలసిన బాధ్యత మాకు వచ్చింది. ఎందుకంటే మీరు అడుగుతుంటారు. మా ఇంట్లో పిల్లోడు పుట్టాడు ఏమి పేరు పెట్టాలి? అని. పుట్టింది మీకు అయినా పేరు మమ్మల్నే అడుగుతారు. నేను ఆ రకంగా చాలామందికి పేర్లు చెప్పాను. అలాగే ఇపుడు ఆమె ఒక గ్రంథం వ్రాసింది. ఆమె పేరు పెట్టలేదు. ఇక ఏదో ఒక పేరుతో పిలవాలి కదా! కాబట్టి దానికి ఒక పేరు కూర్చేదానికి ఏం చేశామంటే ఆ గ్రంథములో 63వ పేజి నుండి 73వ పేజీ వరకు అంటే పది పేజీలు, మేము జోక్యం

చేసుకొని వ్రాసి 'అర్థాలు-అపార్థాలు' అనే పదం అక్కడ చేర్చాము. చేర్చి ఆ పదాన్నే 'అర్థాలు-అపార్థాలు' అని ఈ గ్రంథానికి పెట్టవలసి వచ్చింది. ఎందుకు అట్లా జరిగింది? అంటే, దేవుడు చెప్పినది ఒక విధానం అయితే, మనం అర్థము చేసుకొనేదంతా ఇంకొక విధానం. దేవుడు చెప్పినది ఒక అర్థమయితే, మనం ఇంకొక అర్థాన్ని చేసుకొంటున్నాము. అందువలన "అర్థాలు-అపార్థాలు" అన్నాము.

ఆ రకంగా ఉండే దానివల్ల మనకు దేవుడు చెప్పిన జ్ఞానం ఏమాత్రం అర్థం కాకుండా పోయింది. అంటే దీనికి చిన్న ఉదాహరణ ఖురాన్ గ్రంథంలోనే 6వ సూరా 101 వ ఆయత్‌లో ఏమి చెప్పారంటే, అంటే అది కూడా కాదు 2వ సూరా 146 వ ఆయత్‌లో ఏమి చెప్పారు అంటే, దేవుని గ్రంథం మనకు ఇచ్చాడు. అది చదివితే మనకు ఎట్లుంటుంది అంటే, ఆ గ్రంథాన్ని మన కన్నకొడుకుని గుర్తించినట్లు, దేవున్ని గుర్తించవచ్చు అని అక్కడ చెప్పారన్నమాట. అంటే దేవుడు మనకు ఒక గ్రంథాన్ని ఇచ్చాడు. ఆ గ్రంథాన్ని మనం చదివితే మన కన్నకొడుకుని ఏ రకంగా గుర్తించగల్గుతామో ఆ రకంగానే ఆయన్ను గుర్తించవచ్చు, గ్రంథములో ఎవరిని గురించి అక్కడ చెప్పారో! ఆయనను మనం గుర్తించవచ్చు. గ్రంథములో దేవుని గురించి చెప్పారు గ్రంథంలో అది వాస్తవంగా ఉండేటటువంటి సమాచారం. కానీ ఈ ఖురాన్ గ్రంథంలో ఈ విధముగా వ్రాసుకున్నాము? అని నేను నోటితో చెప్తే మీరేమన్నా కల్పితం చేసి చెప్తారనుకుంటారేమో కానీ గ్రంథాన్నే చూసి చెప్తాము. ఏమి వ్రాసినది మనకు పూర్తి అర్థమవుతుంది. 2వ సురా 146వ ఆయత్ బాగా గుర్తు పెట్టుకోండి. అందులో ఇలా ఉంది **"మేము ఎవరికి ఈ గ్రంథాన్ని ప్రసాదించామో వారు తమ కుమారున్ని ఏ విధంగా గుర్తిస్తారో, అతనిని**

**కూడా అదే విధంగా గుర్తిస్తారు. మరియు వాస్తవానికి వారిలోని ఒక వర్గము వారు తెలిసి కూడా సత్యాన్ని దాస్తున్నారు.”**

ఈ గ్రంథాన్ని ప్రసాదించాము కదా! ఇందులో దేవుని గురించి చెప్పాము కదా! మరల “ఆ దేవున్ని మీరు ఎంత సులభంగా గుర్తిస్తారంటే, ఇంతవరకు చెప్పిన జ్ఞానాన్నిబట్టి, మీ కుమారున్ని ఏ విధంగా గుర్తించగల్గుతారో ఆ విధంగా గుర్తించగల్గుతారు” అని ఎవరు ఎవరికి చెప్పారు? జిబ్రయేల్‌గారు మహ్మద్ ప్రవక్త గారికి చెప్పారు, అంతేకదా! కానీ ఇక్కడ మనం ఏమి వ్రాసుకున్నాం అని అంటే, ఇది చాలా పొరపాటు. ఈ పొరపాటును మనం గుర్తించి ఏమి చెప్పుతున్నాం అంటే, ఇది మహ్మద్ ప్రవక్త గారిని మనం కుమారున్ని గుర్తించినట్లు గుర్తిస్తాము అని అన్నారు. అంటే చెప్పేదెవరికి? ఎవరిని గూర్చి చెప్తున్నారు? అక్కడ ప్రవక్తను గురించి చెపుతున్నారా? దేవున్ని గురించి చెప్తున్నారా? కానీ అక్కడ దేవున్ని గురించి చెపుతున్నపుడు, దేవున్ని మీరు ఈ విధముగా గుర్తించగల్గుతారు అని వుంది. అది అర్థం చేసుకోవాలి. దేవుని జ్ఞానానికి సంబంధించిన గ్రంథం మనకు దేవుడు ఇస్తే, జ్ఞానాన్ని తెలుసుకొని ఆ దేవున్ని మనం గుర్తించగల్గుతాము. ఎంత సులభంగా నీవు గుర్తించగలవు అని అంటే, నీ కన్న కుమారున్ని నీవు ఏ విధంగా గుర్తించగలవో, ఆ విధంగా గుర్తించగలవు అని అక్కడ వ్రాసివుంటే, మనము ఏమి చేశామంటే, బ్రాకెట్లో ఏమి చేర్చాము? ముహమ్మద్ ప్రవక్తగారిని మనం గుర్తించగలము అని వ్రాసుకున్నారు. అంటే అది వాక్యంలో లేదు. బ్రాకెట్ వేసి అందులో వ్రాసుకున్నారు. కానీ అది వ్రాయాల్సిన మాటేనా? ఎవరిని వ్రాయాలక్కడ? **“దేవున్ని మనం గుర్తించగలము”** అని వ్రాసుకోవడం సరైనది. కానీ ప్రవక్త గారిని గుర్తించగలం అని అంటే, అది చెప్పేదెవరికి? ప్రవక్తగారికే కదా! ‘ప్రవక్తగా

నీవు ఈ జ్ఞానాన్ని విని చూసి, దేవున్ని సులభంగా గుర్తించగలవు' అని ప్రవక్తకు చెప్పితే మనం ప్రవక్తనే గుర్తిస్తాము అని మనం వ్రాసుకున్నాము. ఎట్లుందో చూడండి? ఇది 146 వ ఆయత్‌లో 2వ సూరాలో ఉండేటటు వంటి విషయం. అక్కడ బ్రాకెట్లో మహ్మద్ ప్రవక్తగారని ఒక వర్గం వారు వ్రాసుకున్నారు. మరియు వాస్తవానికి వారిలోని ఒక వర్గం వారికి (ఇది వాస్తవంగా కొంతమందికి తెలుసు) ఇది ప్రవక్తగారిని గురించి వ్రాసినది కాదు, దేవున్ని గురించే వ్రాసినది అనే సత్యం తెలుసు.

వాస్తవానికి ఒక వర్గం వారికి సత్యం తెలిసి కూడా సత్యాన్ని దాస్తున్నారు. సత్యాన్ని దాచి ప్రవక్తనే అని చెప్తున్నారు. చూడండి ఎలావున్నది సత్యాన్ని దాచి ఈ మాటను చెప్పేస్తున్నారు. అంటే ఇది వాస్తవం అని తెలుసు. అయినా గానీ, ఒక వర్గం వారు ఏమి చేశారంటే సత్యాన్ని దాచిపెట్టి ఇంకొక రకంగా చెప్పుతున్నారు. అయితే 147 వ వాక్యంలో ఇదే విషయాన్నే ఏం చెప్తున్నారో చూడండి. **"ఇది నీ ప్రభువు తరపున వచ్చిన సత్యం. ఇది దేవుడిచ్చినటువంటి సత్యం"** ఏది? ఈ గ్రంథం! కావున నీవు సందేహించే వారిలో ఏమాత్రము చేరవద్దు. పొరపాటుగా అనుమానాలు కలిగించే వాళ్ళలోకి నీవు ఏమాత్రం చేరవద్దు. నీకు పబ్లిక్‌గా ఇక్కడ గ్రంథంలో చెప్పాము! ఈ గ్రంథంలో మేము సత్యాన్ని మీకు అందించాము. ఈ సత్యాన్ని చూసిన తర్వాత 'నీవు కన్న కుమారున్ని గుర్తించినట్లు దేవున్ని గుర్తించవచ్చు.' భగవంతుడయిన దేవున్ని గుర్తించవచ్చు. ఎవరిని? ఎవరి గూర్చి చెప్పివుంటే ఆయనను. అంటే ఎవరిని గురించి చెప్పాడు. ఈ గ్రంథంలో? అల్లాహ్‌ను గురించి చెప్పారు. **"అల్లాహ్‌ను నీవు సులభంగా గుర్తించవచ్చు"** అని అక్కడ వ్రాసి ఉంటే, కొంతమందికి సత్యం తెలుసు

అయినాగానీ, వాళ్ళు అసత్యాన్ని ప్రకటిస్తున్నారు. సత్యాన్ని కప్పి పుచ్చుతున్నారు.

అటువంటి వాళ్ళలో నీవు చేరవద్దు. అనుమానం కల్గించే వారిలో నీవు చేరవద్దు. అంటే ఇట్లా నిన్ను తప్పుదారి పట్టించే వాళ్ళు కూడా ఉన్నారు. అటువంటి వారివద్ద నీవు చేరవద్దు అని ఇక్కడవుంది. ఇక్కడ దీనిని మేము ఏమి చెప్పుచున్నామంటే ఇపుడు 'అర్థాలు–అపార్థాలు' అనే విషయం మనం తీసుకొంటే అక్కడ అర్థం ఏముంది? దేవున్ని తెలుసుకోవచ్చు అని అర్థం ఉంది. కానీ మనం దాంట్లో ఏమి వ్రాసుకున్నాము? అపార్థం. అంటే అర్థం వదిలేసి వ్రాసుకున్నాము ఇంకొకరిని తెలుసుకోవచ్చు అని అనుకున్నాము. అది చెప్పేదెవరికి? వాళ్ళకే! ఉదాహరణకు ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తికి ఒక కథ చెప్పుచున్నారు అనుకోండి. ఈ కథ చదివినా ఈ కథ వినినా దాంట్లో ఉండేటటువంటి వానిని సులభంగా తెలుసుకోవచ్చు అని వుంది. ఆ కథ పేరు అపూర్వ చింతామణి. దానిలో ఒక మహర్షిని గురించి వ్రాశారు. ఈ కథంతా చదివితే మహర్షి దాచిపెట్టుకొని ఉంటాడు. ఆ దాచిపెట్టుకున్నవాన్ని సులభంగా తెలుసుకోవచ్చు అని ఉంది. అంటే దానిలో ఒక మహర్షి దాచిపెట్టుకొని ఎవరికీ తెలియకుండా ఉంటాడు. అతనిని కనుక్కోవడానికి కొన్ని ప్రశ్నలు వేస్తుంటారు. అంటే ఈ గ్రంథమంతా చదివిన తర్వాత మహర్షిని సులభంగా తెలుసుకోవచ్చు అని అక్కడవుంది అనుకోండి! కానీ ఇప్పుడు చదివేవానిని తెలుసుకోవచ్చు అంటే, వానిని తెలుసుకొని ఏమి ప్రయోజనం?

ఆ రకంగా ఇక్కడ ఈ గ్రంథాన్ని తెలుసుకొంటే (చదివితే), దేవుని గురించి చెప్పినటువంటి గ్రంథం అనుట ఇది సత్యం. ఇది దైవ గ్రంథం.

దేవునికి సంబంధించిన గ్రంథం. దేవునికి సంబంధించిన గ్రంథాన్ని, దేవుని విషయం తెలిసినటువంటి జిబ్రయేల్ అనే ఒక గ్రహం వచ్చి దేవున్ని గురించి చెప్పింది. పూర్వం సూర్యగ్రహం ఎప్పుడైతే సృష్టి ఆదిలో భూమి మీదకి వచ్చి 'మనువు' అనే వ్యక్తికి చెప్పిందో, ఆ రకంగానే జిబ్రయేల్ అనే ఒక గ్రహం వచ్చి చెప్పింది. చాలామంది ముస్లీమ్ సమాజంలో 'జిబ్రయేల్‌ను దూత' అంటున్నారు. జిబ్రయేల్ దూత కాదు. **'నమ్మదగిన ఆత్మ'** అని ఖురాన్‌లో ఉంది. అంటే జిబ్రయేల్ దూత కాదు, ఆత్మ అని చెప్పబడివుంది. కానీ ఆ విషయాన్ని కూడా మర్చిపోయి జిబ్రయేల్ దూత అంటున్నారు. కానీ మనం ఎప్పుడూ జిబ్రయేల్‌ను దూత అని అనకూడదు. జిబ్రయేల్ దూత కాదు. ఆత్మ 'నమ్మదగినటువంటి ఆత్మ!' అని ఖురాన్‌లో కనీసమంటే వరుసగా పది ఆయత్‌లున్నాయి. మనం ఈ దైవ గ్రంథంలో ఉన్నటువంటి విషయాన్ని అర్థం చేసుకోకపోతే, ఇంకొక రకంగా అర్థం చేసుకొంటే, మనం ఇట్లా ఈ విధంగా గందరగోళంలో పడిపోయి తప్పుదారి పట్టిపోయి, అర్థాన్ని అపార్థం చేసుకుంటాము. ఇది ఎలా ఉంటుందంటే మనము మీసాలు ఉండే వాన్ని పిలుచుకురమ్మంటే మీసాలు చాలామందికి ఉంటాయి కాబట్టి పిలుచుకు వచ్చేవాడు "ఏ మీసాలు? ఎంత పొడుగు మీసాలు? ఎట్లాంటి మీసాలు" అని అడిగి కనుక్కొనిపోవాలి కదా! మీసాలు అందరికీ ఉంటాయి. ఎవరినో ఒకరిని మీసాలు ఉన్నాయి అని పట్టుకొని వస్తే ఎలా అవుతుంది? పాపం వాడు పిలుచుకురమ్మన్న వాడా, కాదా అని చూడాలి. ఈ రకంగా మనం ఏమి చేశాము అంటే, ఆ వివరము తెలియకుండా మనం ఇష్టం వచ్చినట్లు ఎవరంతకు వాళ్ళం అర్థం చేసుకొంటే అవి అపార్థాలు అయిపోతాయి. అందులో సత్యం తెలియకుండా పోతుంది.

ఈ రోజు ఆమె ఏదో వ్రాసింది ఆమె ఇష్టమొచ్చినట్లు వ్రాసేసింది. మనం చదువుకోవాల్సిన అవసరం ఏమొచ్చింది? అనుకుంటే ఎలా? అన్నీ అర్థాలే ఉన్నాయి. అపార్థాలు ఎక్కడా లేవు అని ఎవరైనా అంటే, ఇది చూపండి. 2వ సురా 146వ ఆయత్ చూపండి మీరు. మీరు బ్రాకెట్లో వ్రాసుకున్నారు ఇది చూపండి. ఇది అర్థాలో, అపార్థాలో మీరు చెప్పండి. ఇదే ప్రత్యక్ష సాక్ష్యం అని చెప్పండి. ఈ రకంగా వాస్తవంగా అర్థాలు, అపార్థాలుగా మారిపోయినవి. కానీ ఇపుడు మనం ఈ ఒక్క గ్రంథాన్ని గురించి వేలుపెట్టి చూపాల్సిన అవసరం లేదు. ప్రతి గ్రంథంలోనూ ఆ విధంగానే ఉంది. భగవద్గీతా ఆ రకంగానే ఉంది. బైబిల్ ఆ రకంగానే ఉంది. మనకు మూడు దైవ గ్రంథాలున్నాయి. ఆ మూడు దైవగ్రంథాల్లో ప్రథమ దైవగ్రంథం భగవద్గీత, తర్వాత మిగతావి రెండూ కూడా మనకు దైవగ్రంథాలే! ఈ మూడు దైవ గ్రంథాల్లోనూ, అర్థాలు అపార్థాలుగా మారి పోయినాయి. ఉదాహరణకు భగవద్గీతను తీసుకొందాము. **"చాతుర్వర్ణం మయాసృష్ఠం గుణకర్మ విభాగశహః"** అనే శ్లోకం ఏదైతే చెప్పబడింది. అక్కడ నాలుగు వర్ణములు అనే మాటకు 'నాలుగు కులాలు' అని వ్రాసుకున్నారు. కానీ నాలుగు కులాలు వాస్తవంగా ఉన్నాయా? అంటే, ఆ నాలుగు కులాలకు సంబంధించిన విషయం అక్కడ లేనే లేదు. అక్కడ పబ్లిక్‌గా **'గుణ-కర్మ-విభాగ'** అని ఉంది అది చెప్పితే, దానిని విడిచిపెట్టేసి కులాల్లోకి వెళ్ళిపోయినారు. అది అపార్థం కాదా?

ఈ రకంగా ఒకటా, రెండా, మూడా? ఎన్నో రకాలుగా ఉన్నాయి, ఇది భగవద్గీత విషయం. బైబిల్లోకి వెళ్ళామనుకోండి ఒక చోటేమో ఏసును 'మనుష్య కుమారుడు' అంటారు. ఒక చోటేమో 'దైవ కుమారుడు' అంటారు. దైవకుమారుడా? మనుష్య కుమారుడా? అని అడిగితే దానిని అపార్థముగానే

చెప్పుచున్నాను. అంటే ఇష్టమొచ్చినచోట దైవకుమారుడు అనేది, ఇష్టమొచ్చిన చోట మనుష్యకుమారుడు అనేది చూడండి. ఇపుడు ఇంకొక సమస్యలోకి పోతే ఈ అర్థాలు అపార్థాలు ఏ రకంగా అయిపోయినవి చూడవచ్చు. 'తండ్రి – కుమారుడు' అని ఉంది. తండ్రి–కుమారుడు అంటే వీడు తండ్రి, వాడు కుమారుడు అని చెప్పేస్తారు. (ఈయన తండ్రి, దేవుడు కుమారుడు) దేవుడు తండ్రి–ఏసు కుమారుడు అంటారు. మరి కాసేపు అయ్యాక పరిశుద్ధాత్మ దేవుడు అని చెప్తారు. మరి ఈయన ఎవరు? అంటే ఇంకొక రకంగా చెప్తారు. ఈ రకంగా మరల ఇంకొక చోటికిపోతే "తండ్రి–కుమారుడు ఏకమైవున్నారు" అంటే ఆ ఏకమేమిటో తెలియదు. ఇద్దరు ఒకటై ఉన్నారు అంటే అసలు దాని అర్థమే తెలియదు. ఈ రకంగా మనకు అర్థాలన్నీ అపార్థాలుగా అయిపోయి ఏమాత్రము అందులో వున్నటువంటి జ్ఞానం తెలియకుండా పోయింది. ఇది ఒక గ్రంథము సమస్యకాదు. అన్ని గ్రంథాలకు సంబంధించిన సమస్య.

ఇంకొక విషయం ఏమిటంటే దేవుడు తన సృష్టిని సృష్టించాడు. అంటే మనల్ని పుట్టించాడు. మనమంతా సృష్టించబడినటువంటి వాళ్ళము, దేవుడు కర్త. దేవున్ని మనం ఏమంటున్నామంటే, ఒక రకంగా చాలామంది అంటే ముస్లీమ్ సమాజంలో అనుకుందాము ఇపుడు. దానిని గురించే ఎక్కువ చెప్పుకొందాం. 'సృష్టికర్తను ఆరాధిస్తున్నాము' అని అంటున్నారు అన్నమాట. ఇపుడు మేము ఏమి చెప్తున్నామంటే ఈ మధ్యన ఒక వాక్యం వ్రాశాము. ఆ వాక్యం మీకు చదివి చెప్పితే ఇట్లుంటుంది **"సృష్టికర్త అందరికీ ఒక్కడే దేవుడు"** అని అనకూడదు. **"అందరికీ సృష్టికర్త ఒక్కరే"** అని అందరూ అంటున్నారు కదా మీరు అట్లనకూడదు అంటున్నారు. ఇదేమిటయ్యా! దేశమంతా అంటున్నారు. గ్రంథాలలో కూడా అట్లే ఉంది. ఇది వాస్తవం

కదా! మళ్ళీ మీరు అడ్డం తిరిగి ఇట్లా మాట్లాడుతున్నారే అని అడుగవచ్చు. ఇక్కడనే ఉంటుంది కొద్దిగా తిరకాసు ఏమిటంటే మేము చెప్పేవన్నీ ఇట్లాంటివే కదా! చూడండి! **"సృష్టికర్త అందరికీ ఒక్కరే"** అని అనవలెను. 'ఒక్కడే' అని అనకూడదు 'డే' అంటే ఒక అర్థము. 'రే' అంటే ఇంకొక అర్థము ఇది ఎట్లుందంటే, మా అమ్మ-నాన్న తల్లి-తండ్రి. సృష్టించినది తల్లి-తండ్రి ఒక్కడే! అంటే ఏమవుతుంది? సృష్టించినవాడు తల్లి-తండ్రి ఒక్కడే అంటే ఎలా అవుతుంది? ఇద్దరున్నారక్కడ. తల్లి-తండ్రి సృష్టించిన వాళ్ళు తల్లి-తండ్రులు ఇద్దరు అంటే సరిపోతుంది. అంటే ఒక్కరే అంటే ఒకమాట. ఒక్కడే అంటే ఒకమాట. అంటే వివరంగా చెబితే ఒక్కరే అంటే బహువచనం అవుతుంది. ఒక్కడే అంటే ఏకవచనం అవుతుంది. కాబట్టి బహువచనమా? ఏకవచనమా? ఏమి పలుకుతున్నాం మనం అనుకుంటే, అక్కడ చూసి మనం పలకాల్సిన పని వస్తుంది.

ఇపుడు సృష్టి, తర్వాత కర్త. ఇద్దరు కలిసి ఉంటే నీవు పుట్టావు. అంటే "మా లెక్కలో అట్లకాదు, సృష్టికర్త అంటే సృష్టికంతా కర్త అయినవాడు ఒక్కడే అని మేమంటున్నాము. సృష్టికి సంబంధమే లేదు. సృష్టిని మనం లెక్కలోకి పెట్టుకోకూడదు. కర్త ఒక్కడే మనకు ముఖ్యం. పురుషుడు ఒక్కడే, స్త్రీకి సంబంధం లేదు. మనం స్త్రీని గురించి చెప్పుకోకూడదు" అని అంటారు. అంటే మనం ఈ 'అర్థాలు-అపార్థాలు' అనే గ్రంథంలో చివరిమాట ఒకటి వ్రాశాము అన్నమాట. మా ఉద్దేశ్యాన్ని అక్కడ ఏం చెప్పినామంటే మా అమ్మతో సంబంధం లేదు. నీతోనే సంబంధం అని అంటే, నిన్ను మీ నాయన కూడా ఒప్పుకోడు. మీ అమ్మకే నీవు మొదట పుట్టినది నాకు కాదు అని చెపుతాడు. మీ అమ్మ ముందు తర్వాత నేను అని చెపుతాడు. తర్వాత ఇపుడు మనం అవన్నీ వదిలేసి గ్రంథంలోకి వచ్చి చూస్తే, అంటే

ఈ అంతిమ దైవ గ్రంథంలో దేవుడు ఏం చెప్పినాడంటే 6వ సూరా 101వ ఆయత్‌లో **"దేవుడు సర్వమునూ సృష్టించాడు. నిన్ను కూడా సృష్టించాడు"** అర్థమైందా? అది నేను చెప్పితే బాగుండదుగానీ ఈ ఆయత్ చదివి చెప్పితే బాగుంటుంది.

6వ సూరా 101వ ఆయత్ జ్ఞాపకం పెట్టుకోండి మీరు. **"ఆయనే ఆకాశమునూ మరియు భూమిని నమూనా లేకుండా ఆరంభించినవాడు."** ఆకాశమును భూమిని మొత్తం అంతటినీ సృష్టించాడు ఎవరు? ఆయన. ఆయనంటే ఎవరు? ఆయనంటే దేవుడు. దేవుడు! 'ఆయనే భూమిని, ఆకాశాన్ని సమస్తమును సృష్టించాడు. ఆయనకు జీవన సహవాసి అయిన భార్య–భార్యయే లేనపుడు, భార్య లేకుండా ఉంటే, ఆయనకు కొడుకు ఎలా ఉండగలడు? ఉండడు కదా! ఆయనకు పుట్టినది, సమస్తము పుట్టింది. అంటే ఇదంతా పుట్టింది. కొడుకు–బిడ్డలే కదా! నీవు కూడా పుట్టినావు మరియు ప్రతి దానినీ ఆయనే సృష్టించాడు. ప్రతి విషయం ఆయనకు బాగా తెలుసు. ప్రతి దానినీ సృష్టించాడు. సమస్తమునూ సృష్టించాడు. భార్యే లేనపుడు ఆయనకు కొడుకులు ఎలా ఉంటారు?" అంటాడు. ఇది ఆయత్, ఇది వాక్యం. భార్యయే లేనపుడు ఇది ఎట్లా పుట్టినారు ఆయనకు అని అడుగుతున్నారు. కొడుకులు ఎట్లుండారు అంటే, కొడుకులు అనేకాదు ఇక్కడ, అంటే సృష్టి అంతా ఆయన కొడుకులే కదా! పుట్టినదంతా ఆయన సంతానమే కదా! భార్య లేకపోతే ఆయనకు సంతానం ఎలా కలుగుతుంది అని అనుకోవచ్చు.

కానీ ఈ గ్రంథంలో ఏమి వ్రాసుకున్నాం? ఆయనకు భార్యలేదు అని వ్రాసుకున్నాం. భార్య లేదని చెప్పాడా? ఉందని చెప్పాడా? ఉందనే చెప్పారు. భార్య లేకపోతే ఇదంతా ఎలా కలుగుతుంది అని అన్నాడాయన.

ఆయన సహవాసి అయిన భార్య లేనపుడు ఈ సృష్ఠి అంతా ఎలా జరుగుతుంది? అని ప్రశ్న వేశారన్నమాట. 101వ ఆయత్‌లో 6వ సురాలో ఈ విధంగా అడగడం జరిగింది. అంటే అక్కడ భార్య ఉంది. కానీ ఎవరై వుండేది నీకు తెలియదు. నీవు గ్రుడ్డి వానివి. నీకు తండ్రి వున్నాడు, తల్లి ఉంది. తల్లికి పుట్టావు. తండ్రి బీజదాతగా ఉన్నాడు. కానీ గ్రుడ్డి వానివి కాబట్టి నీ తల్లిని నీవు గుర్తించలేకపోతున్నావు. నీవు గ్రుడ్డివానివి అయినంత మాత్రాన నీకు తల్లి లేదా? ఉంది. కానీ మా సమాజంలో స్త్రీలకు తావే లేదు. స్త్రీ అంటే సైతాన్ అని అనుకుంటే పెద్ద పొరపాటు. స్త్రీకి అందరితో పాటు సమానమైన హక్కు ఉంది అని దేవుడు చెప్పినాడు. ఈ రకంగా మనం ఏమి చేశామంటే, స్త్రీలను అణిచివేతకు సంబంధించిన మాటలే మనం చాలామంది వ్రాసిపెట్టుకున్నారు. కానీ వివరంలో అలా ఎక్కడా లేదు. ఈ అర్థాలను అపార్థం చేసుకుండేదానికి ఇది కూడా మనకు ఒక గుర్తింపుగా ఉండేటటువంటి ఆయత్ ఇది. ఖురాన్‌లో ఈ రకంగా చాలాచోట్ల మనం చూస్తే, దేవుడు ఒకటి చెప్పివుంటే మనకు వేరొకటి అర్థమయింది. వాస్తవానికి ఇద్దరు దేవుళ్ళలో ఏ దేవుడు ఏ మాట చెప్పాడని గ్రహించ లేకపోవుతున్నాము.

దేవుడు చెప్పినటువంటి మాటలన్నీ మనం ఇష్టం వచ్చినట్లు మనం మాట్లాడుకుంటున్నాము. మనం అట్లా మాట్లాడుకునే దానివలన దేవుని విషయము మనకు తెలియకుండా పోయింది. దేవుని విషయం దేవుడే మనకు చెప్పితే తెలుస్తుంది. మనకు స్వయంగా తెలియదు. మరలా దేవుని విషయం దేవుడే చెప్పాలి. అంటే దేవుడు ఏదో రకంగా వచ్చి చెప్పాలి కదా! దేవుడు మనిషిగా రాకపోతే ఎలా చెప్తాడు? ఒకాయన ఈ ప్రశ్న వేశాడన్నమాట. **“దేవుడు పుట్టడు అని అంటే పుట్టడు సరేలే, దేవుని**

**విషయం దేవునికే తెలుసు. నేను మీకు జ్ఞానం తెలియజేస్తాను అని చెప్పినాడు కదా! బుద్ధి, శ్రద్ధ ఉన్నటువంటి వాళ్ళు కూడా నా జ్ఞానాన్ని తెలుసు కోగల్గుతారని చెప్పినాడు కదా! మరి దేవుడు ఎలా తెలియజేస్తాడు."** ఏదో ఒకలా తెలియజేస్తాడు. అవన్నీ మీకెందుకు? అంటే మనకు వివరము కావాలి కదా! ఒక శాస్త్రబద్ధత అనేది ఉండాలి కదా! ఎలాగో ఒకలా తెలియజేస్తాడు అంటే అదెట్లా సాధ్యమవుతుంది? అది కాని పని. దేవుడు ఏ విధంగా మనకు తెలియజేస్తాడు అనే వివరం తెలుసుకోగల్గితే అపుడు మనకు సంపూర్ణ జ్ఞానం అర్థమవుతుంది. లేకపోతే సంపూర్ణమైన జ్ఞానం అర్థంకానట్లే ఉంటుందన్నమాట. సంపూర్ణ జ్ఞానం అర్థం అయితే మనకు అన్నీ అర్థము అవుతాయి. ఇపుడు మనకు అజ్ఞానము వలన చాలా గ్రంథాల్లో వుండే అర్థాలన్నీ అపార్థాలుగా మారిపోయినాయి. మాకు అవి అర్థం కాలేదు. అవి సక్రమంగా ఎపుడైతే అర్థం చేసుకోగల్గుతామో అపుడు దేవుని విషయం మనకు బాగా తెలుస్తుంది. ఇది ఒక ఖురాన్ సమస్యే కాదు, ప్రతి గ్రంథం సమస్య కూడ అట్లే ఉందన్నమాట. ఈ రోజు మనం **'త్రైత సిద్ధాంత భగవద్గీత'** అనే ఒక గ్రంథాన్ని వ్రాసుకున్నాము. దాంట్లో అన్నీ అంటే ఇంతకు ముందు వ్రాసినటువంటి వ్యక్తులకన్నా మనం వేరువేరుగా వ్రాసుకొంటూ వచ్చాము. అంటే వాళ్ళు వ్రాసిన వ్రాతలకు ఇదంతా వేరుగా ఉంటుంది.

**"అంతిమ దైవ గ్రంథంలో జ్ఞానవాక్యాలు" "అంతిమ దైవ గ్రంథములో వజ్ర వాక్యములు"** అని ఖురాన్ గురించి వ్రాశాము. ఇదీ అట్లే ఉంటుంది. ఇంక వ్రాయబోయే గ్రంథం ఒకటుంది. అది బైబిల్ అది కూడా అట్లే ఉంటుంది. ఇపుడు ఒకరు ప్రశ్న వేశారన్నమాట. ఏమని అంటే ఒక మతంలో ఒక గ్రంథమును గురించి తెలుసుకునే దానికే అర్థాలన్నీ అపార్థాలు అయిపోయాయి అని మీరు అంటున్నారే! అన్ని గ్రంథాల్లో వుండే

అర్థాలు మీరెట్లా చెప్తారు? అని అడిగారు. అంటే మంచి ప్రశ్నే అది. దానికి జవాబు ఏమనగా! ముందే నాకు ఏవైతే తెలియబడినాయో, ఏవైతే గుర్తున్నాయో, గ్రంథాల్లో అన్నీ అవే ఉన్నాయి. ఇంక నేను వెతికేది ఏముంది? అపార్థాలు అయ్యేదేముంది? నాకుండే అర్థాలే దాంట్లో వ్రాశారు. ఇంక నేను మళ్ళీ అపార్థాల్లోకి పోయే అవసరమే లేదు కదా! కాబట్టి నాకు ఏవైతే తెలుసో, అన్నీ మూడు దైవగ్రంథాలలో ఉన్నాయి. కాబట్టి నేను సులభంగా వ్రాయగలను. బైబిల్ అయినా వ్రాయగలను, భగవద్గీతనైనా వ్రాయగలను. ఖురాన్ కూడా వ్రాయగలను. అంటే అదెలా సాధ్యం? అది దేవునికే కదా సాధ్యం అని అడిగితే దేవునికే సాధ్యం అవుతుంది. కాదని మేమెపుడు చెప్పాం? దేవునికే సాధ్యం. అయితే మళ్ళీ మీరెలా వ్రాయగలరు? అంటే దేవుడు వ్రాయిస్తే నేను వ్రాయగలను, ఆయనెట్లా వ్రాయగలడు? వెనక తోలేవాడిని నేనున్నాను. పరిగెత్తేవాడివి నీవు ఉన్నావు అని దైవ గ్రంథములో చెప్పాడు కదా? ఆయన వెనకాల కర్ర తీసుకొని కొడతావుంటే, నీ ఇష్టం లేకున్నా పరుగెత్తుతావు. ఈ రకంగా నిన్ను పరుగెత్తించేవాడు ఒకడున్నాడు. నీవు పరుగెత్తుతావు. పరిగెత్తించేవాడు ఆత్మ దేవుడు, చూస్తు ఉండేవాడు పరమాత్మ దేవుడు.

కాబట్టి నన్ను తోలేవాడు ఒకడున్నాడు. ఆయన ఎట్లు తోలితే, అట్లు నేను తోలబడతాను. అంటే, తోలితే పోయేవానివే నీవు (జీవాత్మవు) తోలేవాడివి నీవు కాదు (ఆత్మ). అందువలన జ్ఞానాన్ని సంపూర్ణంగా తెలుసుకో! నీవు ఎవరో తెలుస్తుంది. నిన్ను తోలే ఆత్మ ఎవరో తెలుస్తుంది. దానిని ఆమె కాదు అనేదానికి అవకాశము లేదు కదా! ముందు నీకు తెలిసింటే కదా! అది అబద్దము నీవు ఉన్నావా?లేదా అనేదానికి ఏమాత్రం లేదు. నేను చెప్పినది నాకు చెప్పేదానికి పోయిన జన్మలో ఆమె ఎవరో! నాకేం తెలుసు?

ఇపుడు మనం జీవులం అనేది వాస్తవమే! కొంతవరకు నమ్ముతున్నాం. ఎందుకంటే మనల్ని ఆడించేవాడు ఎట్లా ఆడిస్తే అట్లా ఆడుతున్నాము. కానీ ఆడించేవాడు ఎవడు? మనం ఆడేవాళ్ళం, ఎవరు? మనము ఎక్కడున్నాము? అంటే మన శరీరంలోనే ఉన్నాము అని చెప్పవచ్చును. శరీరంలో ఎక్కడున్నాం? తోలేవాడు ఎట్లా తోలుతున్నాడు? కట్టెతో తోలుతున్నాడా? లేకపోతే ఏమన్నా ఆయుధంతో తోలుతున్నాడా? లేదా ఎట్లా భయపెట్టి తోలుతున్నాడా? మాటలతో తోలుతున్నాడా? ఏమన్నా కొంతన్నా వివరం తెలుసునా? అంటే లేదు అని చెప్పవచ్చును. దానికి వివరం తెలుసుకోవాలి. ఆ వివరం తెలుసుకొంటే అపుడు ఏమవుతుంది? అంటే, తోలేవాడు ఎవడో, నీకు తోలబడేవాడు ఎవడో సంపూర్ణంగా తెలుస్తుంది. కానీ అది కూడా మనకు జ్ఞానమే! దేవుడు చెప్పిన జ్ఞానమే! అంతటితో ఆగకుండా నీవేం చేయాలంటే ఇంకా సంపూర్ణంగా తెలుసు కోవాలి. అంతేకదా! ఇపుడు మనం ఒకచోట చెప్పుకున్నాం. దేవుడు మనిషిగా వచ్చి పుడతాడని. ఎట్లా పుడతాడయ్యా? అసలు పుట్టడే పుట్టడు అని మేము అంటుంటే, పుడతారని మీరు అంటున్నారు. దీనికి ఆధారమేమి? అని అడుగవచ్చు. ఎక్కడైతే ప్రకృతిని శాసించిన వాడున్నాడో వాడే దేవుడు అని ఒక కోణంలో చెప్పుకున్నాము.

ఆ గ్రంథంలో ఎక్కడో ఒకచోట ప్రకృతిని శాసించినాడు. కాబట్టి ఆయన మనకు దేవుడని అన్నాము. అంటే, వాస్తవమే! అపుడు మనకు ఒక ఆధారం దొరికింది. శాస్త్రబద్ధత దొరికింది. దాన్ని బట్టి కనుక్కోవచ్చు. అట్లా ఎక్కడైనా ఉంటే, ఒకవేళ దేవుడొచ్చినాడని మనం గుర్తుపట్టవచ్చు, గుర్తుపట్టకపోవచ్చు. కానీ అక్కడ అటువంటివాడు ఎవడూ లేడు కాబట్టి, మనం ఫలానా వాడు దేవుడు అని చెప్పేదానికి వీలులేదు. ఫలానా వాడు

ఖచ్చితమైన జ్ఞానం చెప్పుతాడు అనేదానికి కూడా లేదు. ఒకవేళ అట్లా లేకపోతే నీవు ఎట్లా నమ్మాలి? ఎవ్వరు చెప్పినా జ్ఞానాన్ని ఊ అని ఊ కొట్టాల్సిందే కదా. వాస్తవమైన జ్ఞానం అని మనకెట్లా తెలుస్తుంది అని మరల ప్రశ్నవస్తుంది మనకు. ప్రశ్నవస్తే, ఇంతకుముందు ఆ ప్రశ్నల కంతా ఎట్లా జవాబు దొరికిందో? ఎట్లా? ఎక్కడైతే ప్రకృతి శాసించబడుతుందో అక్కడ అసలైన యజమాని ఉన్నాడని నీవు గ్రహించవచ్చు.

ఆ మాట్లాడేది ఒకరైతే, లోపల మాట్లాడించేవాడు మరొకడు. స్వయంగా ఎవరూ మాట్లాడలేరన్న మాట. నేను ఏమి చెప్తున్నామంటే వ్రాసేది నేను కాదు, వ్రాసేవాళ్ళు వేరేవాళ్ళు వ్రాయించారు అనే సత్యం మనం చెప్పవచ్చు. నేను కూడా చాలా గ్రంథాల్లో ఇదే మాటను వ్రాసానన్న మాట. ఇది అసలు నాకేమీ తెలియదయ్యా! నేను చదువుకొన్నది పదకొండో తరగతే! అపుడు పూర్వకాలం. అపుడు అంతకంటే ఏమీ లేదు. నేను ఏ గురువుల దగ్గరకు పోలేదు. ఏ ఆశ్రమాల దగ్గరకు పోలేదు. తర్వాత ఏదీ లేకుండా మామూలుగా బ్రతుకుతెరువులో పడిపోయి మాకు కాలం గడుపుకొంటూ వచ్చాము. కానీ ఈ రోజు జ్ఞానం వ్రాస్తున్నా అంటే, నేను వ్రాసిందేమీ కాదు, ఎవడో వ్రాయిస్తే నేను వ్రాస్తున్నాను అని చాలాసార్లు చెప్పాను. మీరు కూడా విన్నారు. కానీ, ఇపుడు నేను ఏమన్నా అబద్ధం చెప్పినామేమో మీకెట్లా తెలుస్తుంది? అంటే అబద్ధం చెప్పామా? నిజమే చెప్పామా? అని మీకు ఎట్లా రూఢి. అంటే మీకు రూఢి ఉన్నదో లేదోగానీ, నాకు మాత్రం, నాకు తెలియదు కాబట్టి నాకు రూఢి. ఎందుకంటే తెలియని జ్ఞానం నేను చెప్పినాను కాబట్టి, వేరేవాడు నా ద్వారా చెప్పించాడు, వేరేవాడు వ్రాయించాడు అని అదే నాకు రూఢి అన్నమాట.

అట్లాగనే ఒక స్వప్నంలో మా దగ్గరకు ఒకామె వచ్చింది. ఒక ఆడకూతురు వచ్చి, నమస్కారము చేసుకుంటాను అని అనింది. ఎందుకు? అని అన్నాం. “పాదనమస్కారం చేసుకొంటే మీ జ్ఞానం మాకు కొంతన్నా వస్తుంది” అని అన్నది. జ్ఞానం పాదాల్లో కాదు, తలలో ఉండేది, పాదాలలో లేదు. తలలో ఉన్నది. నీకు జ్ఞానం కావాల్సింటే తలను పట్టుకో! అని చెప్పినాము. అప్పుడు ఆమె కొంతసేపు తలను పట్టుకొంది. తలలోనే కదా ఉండేది అందుచేత వస్తుంది అన్నది. అట్లే కొంతసేపు ఉండి వెళ్ళిపోయిన తర్వాత ఆమెకు జ్ఞానం వచ్చింది. బాగా చెప్పేసింది. చెప్పేసిందో, వ్రాసేసివచ్చిందో, ఎట్లో ఒకలాగ అనుకోండి. అంటే ఇపుడు అక్కడేం జరిగింది? అంటే జ్ఞానం కాళ్ళలో లేదు, తలలో ఉంది అని చెప్పాము కదా! ఆ తలలో ఉండే జ్ఞానం ఆమెకు ప్రాకింది అనుకోండి. పూర్వం కూడా ఇట్లాంటివి కొన్ని పనులు ఉన్నాయి. ఒక పెద్ద మహర్షి వస్తే ఆయన పెద్ద జ్ఞాని అని, రాజులు సైతం పెద్ద పళ్ళెము తీసుకొని కాళ్ళ క్రింద పెట్టి ఆయన కాళ్ళు కడుక్కొని జ్ఞానం వస్తుందని ఆ నీళ్ళు నెత్తిన చల్లుకొని త్రాగేవాళ్ళంట. అంటే అపుడు వాళ్ళు అది నేర్పించినారు. సాధువులో, సన్యాసులో, మహర్షులో, వీళ్ళు మన జ్ఞానమంతా కొట్టేయాలని ప్లాన్ వేస్తావున్నారని వూరికే కాళ్ళు కడుక్కోండి మీకు వస్తాది అని చెప్పినారు. కాళ్ళు కడుక్కుంటే దుమ్మే వచ్చేది. ఏదీ రాదు. జ్ఞానం రాదు అన్నమాట. ఒకవేళ తలకాయ పట్టుకుంటే జ్ఞానం వస్తుందని, పూర్వం ఆ కాలంలో తలకాయ పట్టుకోకుండా కాళ్ళు పట్టుకొనేటట్టు చేశారు.

అందువల్ల మీకంతా అలవాటైపోయింది కాళ్ళు పట్టుకొనేది. కాళ్ళు పట్టుకోవద్దండి. మేము అదే చెప్తా ఉండేది. మీరు కాళ్ళకు మ్రొక్కవద్దండి, కాళ్ళు పట్టుకోవద్దండి. మీకు ఏమీ రాదు. మీకు ఐదు

పైసలు లాభం రాదు. మీకు వచ్చేది తల ద్వారానే వస్తుంది అని చెప్పాం. తల ద్వారా అంటే, ఎట్లు వస్తుంది అంటే, ఇపుడు మాట్లాడేది తల ద్వారానే కదా! ఇపుడు మాట్లాడేది తలే కదా! ఇట్లా తల ద్వారా మాట్లాడితే మీకు కొంత జ్ఞానం తెలుస్తుంది. కాళ్ళు పట్టుకుంటే ఏమీ రాదు. అదే స్వప్నంలో ఒకామె చెప్తావుంది, తలపట్టుకొంటే జ్ఞానం వచ్చింది. ఆమె పెద్దగా ఒక పుస్తకం వ్రాసింది. మన షమీరా వ్రాసినట్టు. అపుడు జ్ఞానం వచ్చినట్టే కదా! మనకు. అట్లా లాభం ఎట్లా చేకూరుతుంది అని అంటే, అంటే పెద్దలు ఏమి చెప్తారంటే. ఇది పద్ధతి కాదు అని మేము చాలాసార్లు చెప్తుంటాము. మీరు మాకు పాదనమస్కారం చేసుకొనే దానికి వస్తే, పాదనమస్కారం చేసుకోవద్దండి, మీరు పైన తలవుంది చేతులు ఉన్నాయి. వేటికైనా మ్రొక్కుకోండి అని చెప్పాము.

ఈ రకంగా లెక్కేసుకొంటే, మనకు తెలియని విషయాలు చాలా ఉన్నాయి. కానీ కొన్ని చోట్ల మనం మోసపోతున్నాం. పూర్వం కూడా ఈ రకంగా మహర్షులంతా మోసం చేసేవాళ్ళు. కాళ్ళు కడుక్కొని నీళ్ళు త్రాగడము రాజులు చేస్తావున్నారా, లేదా? వాస్తవంగా ఇదంతా జరిగిన విషయం. అంటే మా జ్ఞానం ఎక్కడ పోతుందో! మేమేదో అక్కడ కూర్చొని ఇక్కడ కూర్చొని, తిప్పలుపడి సంపాదించుకొన్నాము. మేము సంపాదించు కొన్న దానిని వీళ్ళు ఈ విధంగా సులభంగా కొట్టేయాలని చూస్తావున్నారు. కాబట్టి తలలు మాత్రం ముట్టుకోనీయకుండ వీళ్ళేమి చేశారంటే ఏమీ కనపరాకుండా తలపై అన్ని వెంట్రుకలు పెంచుకున్నారు. వాళ్ళు పూర్వం దానికే పెంచుకొండేది. కట్టలు-కట్టలు అన్నీ ముడేసుకున్నారన్నమాట, ఎవరూ ముట్టుకోకుండా. అది కనపడకూడదు తల కన్పిస్తే ఏమన్నా దానిగుండా పోతాదని. అట్లా వాళ్ళు అన్ని వెంట్రుకలన్ని పెంచుకొని,

కాళ్ళు మాత్రం కడిగించుకొనేవారు. అది మనకు అలవాటు అయిపోయింది. ఆ రకంగా అంటే అది నమ్మిన నిజమని. నమ్మినామా, లేదా? నమ్మి ఈ రోజుకి కూడా అదే పాదనమస్కారం చేస్తున్నాము. ఇంకా కొన్నిచోట్ల కొంతమంది కాళ్ళు కడుక్కొని తాగేది వుంది. కాళ్ళు కడుక్కోని నెత్తిన చల్లుకొనేది కూడా ఉంది. కానీ దానివల్ల ఏమీ ప్రయోజనం లేదు. అందువల్ల చెప్పిందంతా వాస్తవం అని నమ్మకూడదు. అంటే నాతో కూడా. నా మాట కూడా అంతే! అందరిదీ కాదు. నేను కూడా కొన్నిచోట్ల అబద్ధాలు చెప్తుంటాను. నా మాట కూడా నమ్మవద్దు అని చాలాసార్లు నేను చెప్పాను. ఎందుకంటే నేను చెప్పేదంతా చెప్పినా అన్నీ అబద్ధాలు చెప్తావుంటా. అన్నీ అబద్ధాలా అంటే, అన్నీ అబద్దాలు ఉండవు. నిజం కూడా ఉంటుంది. అబద్ధాలు అని అంటే ఏమని అర్థం? బద్ధం కానిది అని. అంటే, కట్టివేయ బడనిది అని. అర్థం? కాబట్టి నిజమేది, అబద్ధం ఏది అని తెలియాలంటే మీకు జ్ఞానం కావాలి.

ఇపుడు ఏమి చెప్పినా మీరు నమ్ముతారు కదా! జ్ఞానం ఉంది అనుకోండి. ఇక నమ్మరు కదా! నిజం తెలిసి పోతుందికదా! అపుడు నిజమైన సత్యమైన మార్గం మీకు తెలిసిపోతుంది. ఇపుడు మిమ్మల్ని దేవుడు ఏమి చేశాడంటే, ఒకమాట చెప్పి రెండు రకాలుగా అర్థమయ్యేటట్లు చేశాడు. మిమ్మల్ని ఒక రకంగా అర్థం చేస్తే ప్రక్కకు పంపిస్తాడు, ఒక రకంగా అర్థం అయితే తనవైపుకు రప్పించుకొంటాడు. ఏ జ్ఞానాన్నయినా గానీ, దేవుడు అర్థాలు-అపార్థాలు కూర్చి పెట్టాడు. అర్థం అయితే దేవుని వైపు పోతావు. అపార్థం అయితే ప్రపంచం వైపు పోతావు. దేవుని మార్గం వైపు పోవు, అపమార్గం పట్టిపోతావు. ఖురాన్ గ్రంథంలో ఇదే మాట చాలాచోట్ల వ్రాయబడి ఉంది. "ఒక్కొక్కచోట ఒక వాక్యం వ్రాసినపుడు నీవు

ఎటుపోతున్నావు చూసుకో! నీకు జ్ఞానం అర్థమయిందా? నీకు సత్యం తెలిసిందా?" అని వాక్యాల చివర్లో ఉంది. కానీ అది గమనించుకోకుండా మనం చదివేస్తున్నాం. అక్కడేదో పెద్ద రహస్యం ఉంది. ఇందులో నిక్షిప్తం ఇమిడివుంది. అని వాక్యాల చివర్లో చాలాచోట్ల చెప్పినాడు కదా (ఖురాన్ వాక్యాల్లో). ఆ రకంగా చాలా వాక్యాల్లో మనకు హెచ్చరిక చేసి చెప్పాడు. నీవు గుడ్డిగా నమ్మవద్దు. నీవు బాగా ఆలోచించు అని. కానీ మనం అలా చేయడం లేదు. ప్రతి విషయాన్ని కూడా క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలి.

ఇపుడు మీరు మా మీద నమ్మకంతో ఏమంటారు అంటే ఓహో! ఈ స్వామీజీ చెప్పేదంతా నిజం చెప్తున్నాడు మాకు. కాబట్టి ఈయన మాటలు అన్నీ నమ్మవచ్చు. అని మీరు అనుకున్నారనుకోండి. నేనేమి చెప్తాను అంటే తోలేవాడు ఒకడున్నాడు. తోలబడేవాడు ఒకడున్నాడు. సాక్షిగా చూచే ఒకడున్నాడని అంటే, నేనే ఇది చెప్పలేదు. గ్రంథంలో ఇలా చెప్పారు. ఇదే విషయమే భగవద్గీతలో ఉంది, బైబిల్‌లో ఉంది, ఖురాన్‌లో ఉంది, మూడుచోట్ల ఉంది అని చెప్పాము. నేను కూడా అదే చదువుకున్నాను. చదువుకున్న తర్వాత నాకు ఒక విషయము తెలిసింది. నేను తోలబడేవాన్ని, అది మాత్రం గ్యారంటీ. ఇపుడు తోలేవాడు ఎవడు? వాడు తెలియాలి కదా మనకు. ఊరికే మనం పరుగెత్తుకొని పోతూవుంటే వెనక ఎవరు తోలుతున్నాడు. వాన్ని తెలుసుకోమనే మీ కోసం ఈ గ్రంథం అంతా వ్రాసినది. ఈ గ్రంథం అంతా వ్రాసినది వానిని తెలుసుకోమనే కదా! ఈ గ్రంథంలో ఉండేది అంతా జ్ఞానమే కదా? వెనుక వానిని చూడకుండా నీవు ముందుకు ముందుకు పరుగెత్తి పోతున్నావు అనుకో! ఎన్ని రోజులు పరుగెత్తినా తోలబడతానే వుంటావు నీవు. వాస్తవమా? కాదా? మీరే చెప్పండి. మీరు పరుగెత్తుతూనే ఉంటారు, ఆయన తోలుతూనే ఉంటాడు. ఆ తోలేవాడు

ఎవరో కొంత వెనక్కి తిరిగి చూసుకోండి అని మేము చెప్తున్నాము. అప్పుడు మీకు సంపూర్ణమైన జ్ఞానం అర్థం అవుతుంది. తోలేవాడు ఫలానావాడు అని తెలిస్తే, చూసేవాడు ఫలానావాడు అని కూడా తెలుస్తుంది. ఇపుడు ఎవడు తోలుతూవున్నాడో, ఎవడు చూస్తా ఉన్నాడో అసలుకు మనకేం తెలియదు. కానీ నీవు మాత్రం పరుగెత్తేవానివే! అది మాత్రం వాస్తవమే! ఇపుడు నాకు తెలుసు. నేను పరుగెత్తేవాన్నే అని, కానీ తోలేవాడు ఎవడు? అని నేను ఒక చూపు పెట్టి గమనిస్తున్నాను. మీరు అట్లా గమనిస్తున్నారా? లేదు. గమనించలేదు.

తోలేవాడు ఎవడో ముస్లీంలకు అర్థం కాలేదు. హిందువులకు అర్థంకాలేదు, క్రైస్తవులకు అర్థం కాలేదు. కానీ గమనించండి. **"తోలేవాడు, తోలబడేవాడు, సాక్షి"** అని ఖురాన్‌లో ఉంది. **'తండ్రి-కుమారుడు-పరిశుద్ధాత్మ'** అని బైబిల్‌లో ఉంది. **'క్షరుడు- అక్షరుడు- పురుషోత్తముడని'** భగవద్గీతలో ఉంది. ఈ మూడు ఒకటే అని మనకు తెలిసిపోయింది. సత్యం తెలిసిపోయింది. మూడు గ్రంథాల్లో ఒకటే జ్ఞానం ఉంది అని చెప్పుకుంటున్నాం. ఖచ్చితంగా ఒకటే జ్ఞానం ఉంది అయినా అందరికీ తెలియని జ్ఞానంగా ఉంది. అది ఎవ్వరికీ తెలియదు. ఆ తెలియని జ్ఞానం నీకు తెలిసింది. తెలిస్తే ఇప్పుడు ఏమి ప్రయోజనం? అంటే, వినే వరకు ప్రయోజనం, తర్వాత ఏమి ప్రయోజనం లేదు. సరే! నీవు తోలబడేవాడవు అనేది మాత్రం గ్యారంటీ. నేను తోలబడేవాన్ని అనీ. ఎవడు తోలుతున్నాడని చూడకుండా ఎన్ని రోజులు పరుగెత్తుతావు నీవు, చెప్పు? ప్రపంచం పుట్టినప్పటి నుండి పరుగెత్తుకుంటూ వస్తూనే ఉన్నావు. ఇంతవరకు పరుగెత్తి, పరుగెత్తి ఇపుడు ఇక్కడ కూర్చున్నాము. ఇంకా ఇక్కడి నుండి మళ్ళా పరుగెత్తుతాము. ఇది కొంత విడిచిపెట్టిన తర్వాత మరలా బయటకు

పరుగెత్తుతాము. ఇంకో కొంత, ఇంకో కొంత మళ్ళీ సాయంకాలం! మళ్ళీ ప్రొద్దున!! మళ్ళీ తెల్లారిన తరువాత!!! ఇలా, చచ్చిపోయేంతవరకు పరుగెత్తుతాము. మళ్ళీ పుడతాము. మళ్ళీ అదే! పరుగెత్తేదే. కానీ ఎవడు తోలుతున్నాడు? అన్నదే ముఖ్యమైన ప్రశ్న.

వెనుక తోలేవాడు ఎవడు అన్నది మనకు పెద్ద ప్రశ్నే! ఇంతవరకు ఆ ప్రశ్న రాలేదు కదా? ఇన్ని రోజులు మనం జ్ఞానం చెప్పుకున్నా, ప్రశ్నరాలేదు. ఇపుడు ఆ ప్రశ్న వచ్చింది. మీరు ఇంతవరకే జ్ఞానం అనుకున్నారు. ఇదే మనకు గొప్ప జ్ఞానం అనుకున్నారు. దీనికంటే ఇంకా కొంత ముందుకు పోండి. దీనికంటే గొప్ప జ్ఞానం ఉంది. ఇంతకు ముందు ఎవరన్నా తోలేవాన్ని తోలబడేవాడు ఎవడన్నా కనుక్కొన్నాడా? అని ప్రశ్న వస్తుందన్నమాట. తోలబడేవాడు ఒకడున్నాడు కదా! అంటే, మనమే తోలబడతా ఉన్నాము. అట్లావాడు ఎవడన్నాగాని వెనక్కి తిరిగి చూసి కనుక్కొన్నాడా? అని ప్రశ్న వస్తుంది మనకు. ప్రశ్నవస్తే, అటువంటివాడు ఎవడున్నాడా అని మనం వెనక్కి తిరిగి చరిత్రలోకి పోతాం అనుకోండి, చూసినోళ్ళు ఉన్నారు. కనుక్కొనేవాళ్ళు ఉన్నారు. అటువంటి వాన్ని వెనుకవాడు తోలడు. జీవుడు దేవున్ని గట్టిగా పట్టుకుంటాడు. ఎవరిని? ఆ తోలేవాన్ని. తోలేవాన్ని చూసాకా, ఓరినీ ఇన్నాళ్లు ఎవరో అనుకొన్నానే! ఇక్కడే ప్రక్కలోనే వుండి తోలుతున్నావే అని అనుకొంటాడు. ప్రక్కన అంటే చాలా దూరంలో లేడు. ప్రక్కలోనే వున్నాడు. వాడు చాలా దూరం వుంటే కదా వానికి భయపడేది! ఇన్నాళ్ళు వెనక్కి తిరిగి చూసుకోలేదు, అంటే ఇదంతా పట్టుకొనేవాళ్ళ కథ. మనకథ కాదు. మనం పరుగెత్తుతూ ఉన్నాములెండి. మన కథ కాదు. వెనక్కి తిరిగి చూసినోడు ఏమి చేసినాడంటే, నీవు ఎవరో అనుకొన్నాను ఇన్నాళ్ళు, నీవు ఇక్కడే ప్రక్కలోనే ఉన్నావా అని

చెప్పి, వానిని గట్టిగా పట్టుకొంటాడు. అలా పట్టుకుంటే వాడు తోలేది లేదు, వీడు తోలిచ్చుకొనేది లేదు. అపుడు ఏమవుతుంది? ఇంక వాడు పుట్టడు.

ఒకసారి ఒకాయన అడిగినాడు, నాకు ఆఖరీ జన్మ కావాలని. అపుడు మేము చెప్పాము "నీవు వెనక్కి తిరిగి తోలేవాన్ని పట్టుకో ఆఖరీ జన్మ అవుతుంది. చివరి జన్మకావాలి. ఇంక జన్మలొద్దు. ఆఖరీ జన్మ కావాల అంటే ఆ పని చెయ్యి." నేనేమంటున్నా అంటే, ఒకడు వెనక్కి తిరిగి చూసినాడు. జీవుని [ప్రక్కలోనే ఆయన ఆనుకొని ఉన్నాడు. చాలా దూరంలో ఉన్నాడనుకొన్నా! వీడు తొందరగా దొరుకుతాడే అని వెంటనే పట్టుకున్నాడు. పట్టుకొంటే, ఏమయింది? వాడు తోలేదానికి లేదు. వీడు పట్టుకున్నాడు కదా! ఇంక వాడు తోలేది లేదు, వీడు తోలించుకునేది లేదు. ఇంక మధ్యలో సాక్షిగా ఉన్నాయన ఏమి చేసినాడంటే, ఆయన చూసేవాడుగా ఉండి ఇంక వద్దులే, ఇద్దరూ కూర్చోండి అని చెప్పినాడు. నీవు తోలేది వద్దు, నీవు తోలించుకుండేది వద్దు, ఇద్దరూ కూర్చోండి అని చెప్పినాడు. చూసే ఆయన చెప్పాడు కాబట్టి ఫుల్‌స్టాప్. అంటే ఇక జన్మలు లేవు వానికి. ఎవరికి? తోలించుకునే వానికి! ఇదంతా కథ మాదిరి ఉంది కదా! ఇదేం మన జీవిత రహస్యం మాదిరి లేదు కదా! కానీ జీవిత రహస్యమే! చెప్పుకుండేదానికి ఏదో తమాషాగా చెప్పుకున్నట్లుంది. కానీ వాస్తవం అది. అంటే, నీ శరీరంలో నిన్ను నడిపేవాడు ఒకడున్నాడు. నిన్ను నడిపేవాడు ఎంతదూరంలో ఉండి నడుపుతున్నాడో నీకు తెలియదు. నీ [ప్రక్కనే ఉండి నడుపుతున్నాడు. [గంథాల్లో కూడా ఉంది. నీ [ప్రక్కనే వున్నాడని. అలా [వాసివుంది కదా! నీ [ప్రక్కనే ఉన్నాడని ఖుర్‌ఆన్‌లో 2వ సూరా, 186 ఆయత్‌లో ఉంది. మిగతా దైవ [గంథాల్లో కూడా [వాశారు. నీ [ప్రక్కనే ఉన్నాడు. నీ సహవాసిగా, నీ

ప్రక్కనే ఉన్నాడు. వాన్ని నీవు కొద్దిగా వెనక్కి తిరిగి చూసుకో, తెలుస్తుంది. పెద్ద ప్రయత్నం ఏమీ వద్దు. కొద్దిగా కానీ ఆ ప్రయత్నమే మనం చేయలేదు. ఎవరైనా చేసినారా? ఎవరూ చేయలేదు. మనల్ని ఒకడు నడిపేవాడు ఉన్నాడు. మనల్ని నడుపుతున్నాడు, ప్రొద్దున లేచినప్పటి నుండి సాయంకాలం వరకు నీవు అనుకొన్నట్టు ఏమీ జరుగకుండా, వాడు ఇష్టం వచ్చినట్టు నడుపుతున్నాడు. నీ ఇష్టప్రకారము నడుపడు వాని ఇష్టం వచ్చినట్టు నడుపుతాడు. అదే జరుగుతుంది, ఆ సత్యం మనకు ఇపుడు తెలిసింది.

భగవద్గీతలోనూ, బైబిల్‌లోనూ ఖురాన్‌లోనూ సత్యం తెలిసినంత మాత్రాన మనం తెలిసి ఊరకనే ఉంటే అవుతుందా? ఊరికే ఉండవద్దండి. ఆలోచన చేయండి. అపుడు మనం వెనక్కి తిరిగి చూడాలి అంటే ఎట్లా తిరుగుతావు? మనము ఇక్కడ ముందరకే ఉన్నాము కదా! అని సందేహం వస్తుంది. వెనక్కు ఎటు తిరిగినా కనపడడే అని అనుకోవద్దు. ఇట్లా బయట తిరిగేది కాదు. లోపల మీరు ధ్యాసను మళ్ళించుకొని చూడండి. ఆలోచన చేసి చూడండి. లోచన అంటే చూడడం. 'ఆలోచన' అంటే బాగా చూడడం. అంతే కదా? లోచన అంటే చూడడమే కదా. నీవు చూడు, నీ ప్రక్కనే వున్నాడు ఒకడు. ఎవడు? నీ సహవాసి. నీ ప్రక్కనే వుండేటటువంటివాడు. నీకు చాలా దగ్గరగనే ఉన్నానని ఖురాన్‌లో చెప్పాడు. చెప్పలేదా? మళ్లీ మనం అంత దగ్గర ఉన్నామని మనం ఏమన్నా ఆలోచన చేయగల్గినామా? చేయలేదు. మీరు చేయలేదు. కానీ నేను చేశాను. మరి చేసి ఏమి చేసినాను? అంటే ఊరికే పట్టుకొని విడిచిపెట్టాను. ఇపుడు వద్దులే అని, ఎందుకంటే పట్టుకుంటే అక్కడికి జీవితము అయిపోతుంది. దొరికినపుడు పట్టుకొంటే అక్కడికి అయిపోతుంది. అప్పుడు నీకెవరు చెప్తారు జ్ఞానం? నీకు నేను జ్ఞానం చెప్పేది లేకుండా పోతుంది. కాబట్టి, నేను మళ్లీ మీకు జ్ఞానం

చెప్పాలి కదా! కాబట్టి వానిని చూసి, ఓహో! నీవు ఫలానావాడివనీ, ఇంక నీ కథ నాకు తెలిసి పోయింది. కాబట్టి నీ కథ వాళ్ళకు కూడా చెప్తాను అని, ఆయన కథ మీకు కూడా చెప్తున్నాము. ఇట్లా ఫలానావాడు నేను చూసినాను, మీరు చూడండి అంటే మీరు చూస్తే అక్కడికి అయిపోతుంది. నేను చూసాను గానీ, అయిపోకుండా మళ్ళీ మీకు అంతో, ఇంతో జ్ఞానం చెప్పాలి కాబట్టి నేను మళ్ళీ అట్లా ఆయనను విడిచిపెట్టి ఆఫర్‌లో పెట్టుకున్నాను. ఇపుడు కొద్దిగా జ్ఞానం అర్థమయిందా అంటే ఇదంతా కథ మాదిరిగా ఉంది కదా! ఇట్లే ఉంటుంది జ్ఞానం. అర్థమైతే సులభంగా అర్థమవుతుంది, అర్థం కాకపోతే ఎప్పటికీ అర్థం కాదు. చాలా కష్టమైనది జ్ఞానం. చాలా సులభమైనది కూడా జ్ఞానమే! చాలా దగ్గరవాడు ఆత్మ దేవుడు. చాలా దూరంగా ఉండేవాడూ పరమాత్మ దేవుడే! **జ్ఞానికి అత్యంత సమీపంగా వుండేవాన్ని. అజ్ఞానికి చాలా దూరంగా ఉండేవాన్ని** అన్నాడు. అంతేకదా! **'జ్ఞానికి దాపు – అజ్ఞానికి దవ్వు'** అని చెప్పాడు భగవద్గీతలో. దవ్వు అంటే దూరం. దేవుడు మనకు ఈ రకంగా వున్నాడు.

ఆ దేవున్ని మనం తెలుసుకోవాలంటే గ్రంథాల్లో వుండే జ్ఞానాన్ని మనం ఆసరా చేసుకోవాలి. గ్రంథాల్లో ఉండే జ్ఞానాన్ని ఆసరాగా చేసుకొని, దాన్ని అంతటితోనే ఆపి వేయకుండా, దాన్ని మనం ప్రాక్టికల్‌గా చేసుకొంటే, అనగా ఆ జ్ఞానాన్ని అనుభవిస్తూ వస్తే మనల్ని నడిపేవాడు తెలుస్తాడు. నడిపేవాడు తెలిసిన తర్వాత మనం వాన్ని పట్టుకోగల్గుతాము అనుకోండి, అపుడు అంతవరకు కనపడనివాడు కన్పిస్తాడు. సాక్షిగా చూసేవాడు. అంతవరకు ఆయన ఎవరికీ కనపడడు. వీళ్ళు అంటే నడుపుకుండేవాడు, నడిచేవాడు వీళ్ళే ఉన్నారు గానీ ఆయన కనపడడు. అంతా తెలిసిన తర్వాత ఆయన వచ్చి ఇంక చాల్లేండి మీకు అని కూర్చోపెడతాడు. అపుడు

మనం అందరం కలిసి ఆయన్ను చూడొచ్చు. అక్కడికి అయిపోయింది ఇంక లేదు అదే మోక్షము. ఇంక వాడు పుట్టేది లేదు. చచ్చేది లేదు. ఆ జన్మలు అక్కడితో అయిపోతాయి. అదే ఆఖరి మరణం అయిపోతుంది. అదే ఆఖరి జన్మ అయిపోతుంది. కాబట్టి ఆఖరీ మరణం కావాలంటే, ఏమి చేయాలి? ఇంత పని చేయాలి. సులభమైన పనే! వెనక్కు తిరిగి చూసు కుండేదే! నీవు ఎక్కడికి పోవాలి? ఏ దేశానికి పోవాలి? అంటే ఏమీ లేదు. మనమంతా ఉండేది ఈ జాగాలోనే మూరెడు శరీరంలోనే, మీరు చాలా దూరం పోవాల్సిన పనిలేదు. మూరెడు కూడా అవసరం లేదు. అంతా జానెడే! ఈ జానెడులో చూసుకుంటే సరిపోతాది. జానెడు కూడా అవసరం లేదు. బెత్తెడం మాత్రమే బెత్తెడు కూడా అవసరం లేదు. ఒక్క పాయింటే! ఇంత సులభంగా జ్ఞానం ఉంటే, అర్థంకాక, గడ్డాలు పెంచుకొని, మీసాలు పెంచుకొని, గోచీలు పెట్టుకొని, ఏమేమో చేసి, అడవులు తిరిగి ఏమేమో తిప్పలుపడుతూ ఉన్నారు. అంత అవసరం ఏమొచ్చింది? ఇపుడు ఇది చాలా సులభంగా ఉంది కదా! దేవుడు గ్రంథాల్లో చెప్పినాడు చాలా సులభమైన జ్ఞానాన్ని. మరి ఈ రకంగా తెలుసుకోవచ్చు కదా! మళ్ళీ ఇంత సులభంగా ఉండే జ్ఞానం ఉంటే మతాలు ఎందుకు? తర్వాత ఇంకొకటి ఎందుకు? ఇపుడు మనం చెప్పిన సారాంశం అన్ని మతాలకు సంబంధించినది. మనిషి అన్నాక అన్ని మతాలకు సంబంధించినవాడు. కాబట్టి ఏ మతంలో వున్నా అది వానికి వర్తిస్తుంది. దేవుడు తన జ్ఞానాన్ని అందించినపుడు **'సమస్త మానవులకు'** అని చెప్పినపుడు, అది అన్ని సమాజాలకు వర్తిస్తుంది. నీవు ఏ రకంగా అన్నా పేరు పెట్టుకో, ఏ రకంగా అయినా మతాన్ని చీల్చుకో, నీకు అది వర్తిస్తుంది గానీ వేరే రకంగా ఉండదు. ఇపుడు నేను మీకు అంటే నవ్వుతూ, నవ్వుతూ ఒక కథ మాదిరి చెప్పాను. ఆ లోపల ఉండే

వాని కథ. తోలేవాడు, తోలబడేవాడు అని మనము గ్రంథాల్లో చదువుకున్నాం. ఆ తోలేవాడు ఎట్లున్నాడు? మీరు చూసుకోండి. చాలా ఈజీగా తెలుస్తుంది. లేకపోతే కష్టంగానే తెలుస్తుంది. లేకపోతే మరీ కష్టంగానో ఉంటుంది. ఏదో ఒక రకంగా మీరు దానిని గురించి ప్రయత్నం చేయండి, అని చెప్తూతూ ఇంతటితో ఈ సమావేశాన్ని ముగిస్తున్నాము.

# 79. పురుషోత్తమ

**తేది 27.10.2015**

ఈ సమావేశములో కలిసిన ప్రజలందరికి ఇక్కడ చెప్పే జ్ఞానము సక్రమముగా అర్థమయ్యే విధముగా దీవించవలెనని ఆత్మ దేవున్ని కోరుతూ ఈ సభను ప్రారంభిస్తున్నాను. మీకు ఈ నెలలో ఒక గ్రంథము వచ్చినది. అది **"ప్రతిమ × విగ్రహ"** అనేటటువంటి గ్రంథము. బహుశ చాలామంది చదివి యుంటారు, కొంతమంది దానిని ఇప్పుడిప్పుడు తీసుకున్నట్లున్నారు, దానిని శ్రద్ధగా చదువుకోండి. దానిలో ప్రత్యేకమైన విషయమేమిటంటే ఇంతకు ముందు గ్రంథాలలో ఎక్కడా ప్రకటించబడనటువంటి విషయము ప్రకటించబడినది. అదే **"త్రిమత ఏకైక గురువు"** అని. గ్రంథములో పైన 'త్రిమత ఏకైక గురువు' అని వచ్చింది, తరువాత క్రింద ప్రబోధానంద అను పేరు వచ్చింది. అంటే ఇక్కడ మేము ఏమి చెప్పుచున్నామంటే, ఇప్పుడు మేము ఏమైనా చెప్పగలము. ఇప్పుడు గురువులమే కానీ మిగతా సమయములలో మేము గురువును కాదు అని చెప్పాము. ఎవరూ మాకు నమస్కారము చేయవద్దండి. నేను ఏమాత్రము గురువును కాదు, నేను

సామాన్యమైన వ్యక్తినే అని చెప్తున్నాను. నేను జ్ఞానము ఎక్కడా తెలుసుకోలేదు కానీ ఆత్మజ్ఞానము చెప్తున్నాను. బ్రహ్మవిద్య అంటే ఏమో తెలియదు కానీ బ్రహ్మవిద్యను చెప్పుచున్నాము.

వాస్తవముగా మూడు మతాల విషయాలు వారి వారి మతాల వాళ్ళకే సరిగా తెలియదు కానీ క్షుణ్ణముగా, విపులముగా ఆ మూడు గ్రంథాల విషయాలు ఇక్కడ చెప్పడము జరుగుచున్నది. ఇది ఎవరికి సాధ్యమవు తుందంటే ఒకే ఒక గురువుకి సాధ్యమవుతుంది. ఆ గురువు ప్రపంచానికంతా ఒక్కడే ఉంటాడు. ఆ ఒక్కడు, ప్రపంచములో ఉండే అన్ని మతాలకూ గురువే. అన్ని గ్రంథాలకు గురువే, అందరికీ గురువుగా ఉంటాడు. అతనే ప్రపంచములో 'ఏకైక గురువు' కాబట్టి అతను ఏ దైవగ్రంథమైనా చెప్పగలడు. కాబట్టి అన్ని మతాలకు సంబంధించిన బోధ చెప్పగలడని మేము ఏమి చేశామంటే, ఆ గ్రంథము పైన "త్రిమత ఏకైక గురువు" అని ప్రకటించడము జరిగింది. లోపల జ్ఞానము చెప్పేవానికి ఆ పేరు వర్తిస్తుంది, పైన కనిపించే వ్యక్తికి వర్తించదు. పొరపాటుగ ఈ వ్యక్తి అని అనుకోవడము చాలా పొరపాటని నేను ముందు నుండి చెప్పుతున్నాను. జ్ఞానము చెప్పేవాళ్ళకు వర్తిస్తుంది. జ్ఞానము చెప్పేవాళ్ళు ప్రతి మనిషిలోనూ ఇద్దరు ఉన్నారు అని చెప్పాను. ఒకడు మాట్లాడేవాడు, ఒకడు మాట్లాడకుండా ఉండేవాడు. జీవుడు అనేవాడు, అంటే నీవు ఎవరైతే ఉన్నావో నీకు ఏమీ చేతకాదు నీవు మాట్లాడలేవు, మూగవానివి, గ్రుడ్డివానివి, చెవిటివానివి, అవిటివానివి అని చెప్పాము. అంటే ఏమీ చేతకానివాడు జీవుడు. కన్ను చూపిస్తూ ఉంది అంటే నీవు ఫలానా దృశ్యము చూడగల్గుచున్నావు. కన్ను చూపించలేదనుకో, చూపు పోయిందనుకో నీవు చూడలేవు, శరీరములో ఉండే జీవునివి మాత్రమే ఇంకొకరి సహాయముతో చూస్తున్నావు. నీ శరీరములో వేరేవాళ్ళు ఫలానా

దృశ్యము ఫలానిది బయట ఉంది అని చెప్తూవుంటే ఆ దృశ్యము నీకు తెలుస్తుంది కానీ స్వయముగా నీకు (జీవునికి) తెలియదు. జీవుడు ఏమీ తెలియనటువంటివాడు.

ఐదు జ్ఞానేంద్రియాల ద్వారా అంటే కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము అనే ఈ ఐదు జ్ఞానేంద్రియాల ద్వారా నీవు ప్రపంచ విషయములు తెలుసుకోగల్గుతున్నావు. మరి ఈ ఐదు జ్ఞానేంద్రియాలు లేకపోతే జీవునికి ఏమీ తెలియదు. జీవుడు చెప్పేవాడు కాదు, చేసేవాడు కాదు. ఏమీ తెలియనటువంటివాడు, కేవలము తెలుసుకునే వాడే, అనుభవించేవాడే కానీ చేసేవాడు కాదు. చేసేవాడు వేరొకడు ఉన్నాడు అని చెప్పాను. చేసేవాడు శరీరములో ఒకడు ఉన్నాడు. వాడే నీకు మొదటి దేవుడు. (రెండవ ఆత్మ) అర్థమయిందా! ప్రపంచానికంతా ఇంకో దేవుడున్నాడు. ఆ దేవుడు వేరు. నీకు మాత్రము పరమాత్మయిన రెండవ దేవుడు ఎవరో తెలియదు. నీ శరీరములో ఉండే వాడే నీకు దేవుడు! నీ శరీరములో ఉండి నిన్ను నడిపించే ఆత్మే నీ దేవుడు! నీ శరీరములో ఉండి నిన్ను మాట్లాడించే వాడే నీకు దేవుడు! నీ శరీరములో ఉండి ప్రతి పని చేయించేవాడే నీకు దేవుడు. నీ శరీరములో ఉండి, శ్వాస ఆడించి, నిన్ను బ్రతికించేవాడే నీ దేవుడు. అంటే దేవుడు ఒకడే ఉన్నాడు, ప్రపంచానికంతా దేవుడు ఒకడే ఉన్నాడు. ఇది చెప్పడము అందరికీ సులభము. ఒకడే ఉన్నాడని అందరూ చెప్తారు. చిన్నపిల్లవాడు చెప్తాడు, పెద్దపిల్లవాడు చెప్తాడు, ఈ మతస్థుడు చెప్తాడు, ఆ మతస్థుడు చెప్తాడు, అందరూ చెప్తారు దేవుడు ఒకడే అని, కానీ అనుభవరీత్యా ఎవరికీ తెలియదు. దేవుడు ఎటువంటి వాడు? అనే విషయము అనుభవ రీత్యా ఎవరికీ తెలియదు. ఎందుకంటే ఆ దేవుడు ఏదీ కానివాడు. ఎట్లా తెలుసుకుంటావు నీవు? నేను మొదటి నుంచి చెప్పుతున్నాను ఆ దేవున్ని

మీరు తెలుసుకోవాలంటే సాధ్యము కాదు. మీరు ఆ ప్రయత్నము చేయడము మానుకోండి.

పరమాత్మయిన దేవునికి అసలుకు పేరు లేదు. నీవు ఏమి తెలుసుకుంటావు? ఏ పేరు అని వెతుకుతావు? ఏ జాగానో తెలియదు, ఊరు లేదు, జాగా లేదు, ఏమీ లేదు. స్థిరుడు కాడు, అస్థిరుడు కాడు, స్థిరాస్థిరుడు ఉండేవాడు కాడు, లేనివాడు కాడు. ఉంటాడని చెప్పలేము, లేడని చెప్పలేము అటువంటి వాడు. మరి వానిని ఏదీ కానివాడు అని చెప్పేశాము ఒకటేమారు. అట్లా ఏదీ కానివానిని, ఏమీ తెలియనివానిని నీవు ఎట్లా తెలుసుకుంటావు? చాలా కష్టము. మరి నీవు ఏమి చేయాలి? ఇపుడు దేవుని విషయములోకి వచ్చి ఏదో భక్తి, జ్ఞానము అదీ ఇదీ అనుకుంటున్నాము కదా! దేవున్ని తెలియుటకు ఏమి చేయాలి? అంటే, దేవుడు అంటే ప్రపంచమంతా వ్యాపించినటువంటివాడు, ఎవరికీ తెలియని దేవుడు అని తెలియాలి. ఆ దేవునిలోనికి ఐక్యమైతే కానీ, ఆ దేవున్ని తెలుసుకుంటే గాని నీకు జన్మలు లేకుండా పోవు. ఆ దేవున్ని తెలుసుకునేంత వరకు ఇక్కడ మనిషిగా ఉండవలసిందే! మనిషిగానీ, జంతువుగానీ అంతకు శరీరముతో ఉండవలసిందే. కాబట్టి నీవు ఆ దేవున్ని తెలుసుకోవాలి అంటే డైరెక్ట్‌గా నీవు ఏమాత్రము తెలుసుకోవడానికి దారి లేదు. దానికి ఒక మార్గము కావాలి. మరి ఆ మార్గము ఎవరు? అంటే నీ శరీరములో ఉండే దేవుడే (ఆత్మే) నీకు మార్గము.

నీవు ఎవరిని నమ్ముకోవాలి? అంత పెద్ద దేవున్ని, ప్రపంచమంతా అణువణువున వ్యాపించినటువంటి దేవున్ని తెలుసుకోవాలంటే, ఈ ప్రపంచాన్నంతా సృష్టించిన ఆ దేవున్ని తెలుసుకోవాలంటే నీవు ఏమి

చేయాలి? మొట్టమొదట నీ శరీరములో ఉండే దేవున్ని తెలుసుకోవాలి. శరీరములో ఒక దేవుడున్నాడా? అంటే ఇంతకుముందు ఒక ప్రసంగములో మేము **"దేవుడు ఒక్కరా! ఇద్దరా!!"** అని చెప్పాము. అంటే దేవుడు ఒకడేగానీ నీవు ఆ ఒకనివి ఎట్లాగూ తెలుసుకోలేవు. నీవు ముందు తెలుసుకోవాల్సిన వాడు ఇంకొకడు ఉన్నాడు. ప్రస్తుతము నీకు దేవుడు అతనే. అతన్ని తెలుసుకున్న తరువాత ఇంకొక ఆయనను తెలుసుకోవచ్చు. నా మాటవిన్న తర్వాత ఇది ఎక్కడా గ్రంథాలలో చెప్పలేదు. నీవు క్రొత్తగా చెప్పుతున్నావే అని మీరు అడగవచ్చును. ఎందుకంటే ప్రతి ప్రశ్నకు ఒక జవాబు ఉంటుంది. మనకు జవాబు అవసరమిక్కడ, ఈ ప్రశ్న కూడా అవసరమే.

ఈ విషయము ఇంతకుముందు గ్రంథాలలో ఎక్కడా మీరు చెప్పలేదు, వేరేవాళ్ళు చెప్పలేదు, మరి ఇప్పుడు క్రొత్త పదము మాట్లాడు తున్నారే అని అడగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! ఆధ్యాత్మికములో అహర్నిశలు కొత్తకొత్త రూట్లు చూపిస్తాపోవడమే మా పని' అని ఇంతకుముందే నేను మీకు చెప్పాను. ఒకేదారిలో రామాయణము చెప్పుకున్నట్లు, సీతారాముడు పోయె కొట్టె, తెచ్చే, అందరూ చెప్పేదే అని చెప్పము. జ్ఞానమార్గములో మేము క్రొత్త క్రొత్త విషయాలు మీకు అందిస్తూ వుంటాము అని చెప్పాము. మళ్ళీ ఇవన్నీ ఎక్కడివి? అంటే దైవగ్రంథాలలోని విషయాలే చెప్తాము. దైవగ్రంథాలలోని విషయాలు ఇంతకుముందు చెప్పలేదే? అంటే నీకు అర్థము కాదని అప్పుడు చెప్పలేదు. మళ్ళీ ఇప్పుడు ఎందుకు చెప్పుతున్నారు? అంటే అప్పుడు ఏదో చిన్న పిల్లవానికి ఐస్‌క్రీమ్ తీసియిస్తే, ఒకటే సారి చీకు అంటే చీకుతాడా? కొంచెము కొంచెము నాకిస్తాము. నాకించిన తరువాత, కొంచెము రుచి చూసిన తరువాత ఒరేయ్!

ఇట్లా గాదురా తినేది ఇట్లా అని నాకిస్తాము. ఇంకా కొంచెము పెద్ద అయిన తరువాత పట్టుకొని బాగా నువ్వే తిను అని చెప్పుతాము. ఆ రకంగా మనము ఎట్లయితే చిన్నపిల్లలకి చిన్న చిన్న విషయాలు నేర్పిస్తున్నామో ఆ రకంగానే దేవుని విషయము కూడా మనము నేర్పించవలసిన పని వచ్చింది. ఇప్పుడు నువ్వు చెప్పేదానికి ఆధారము ఏమి? అంటే లోకములో ఉండే వాళ్ళము మనము. లోకములో ఉండే వాళ్ళనే మనము చూడాలి, లోకములో లేనివానితో మనకు ఏమి పని? మనకు అదే కదా కావల్సింది. లోకములో ఉండేవానివి నీవు. ఈ లోకములో ఉండే దేవుడే నీకు కావాలి. ఈ లోకములో ఉండే దేవున్ని తెలుసుకుంటే మళ్ళ తరువాత ఎవడో తెలుస్తాడు నీకు.

కాబట్టి లోకములో లేని దేవుడు నీకు అవసరము లేదు. లోకములో ఎంతమంది ఉన్నారు? నీవు ఉన్నావు, నీ ప్రక్కలో ఇంకో దేవుడు ఉన్నాడు, వాడే నీకు పెద్ద. కాబట్టి వాన్ని నీవు దేవుడు అనుకో, నీకు పెద్ద అనుకో, గురువు అనుకో, నీ ఇష్టము ఏమన్నా అనుకో వాడు నీకంటే పెద్దవాడు. నీ ప్రక్కలో ఉండేవాడు. ఇది నేను స్వంతముగా చెప్పేమాట కాదు, ఓ దైవ గ్రంథములో చెప్తారు ఆయన గురించి. **"నీవలె నీ పొరుగు వానిని ప్రేమించుము"** నీవలె నీ పొరుగు వానిని నీవు ప్రేమించు. ఎంత బాగా చెప్పినాడు. నీవలె వాడు ఎట్లు ఉన్నాడు అంటే వాడు ప్రక్కన ఉన్నా కనుక్కోవచ్చు. నీవు చెప్పేది పెద్ద పనేమి కాదు కదా! ప్రక్కన ఉండే వాన్ని ఎవరన్నా కనుగొనవచ్చు అంటే వాడు నీ మాదిరే ఉంటాడు, నీవు ఎట్లా కనుగొంటావు? ఇంతకు ముందు నేను చెప్పాను. ఇంతకు ముందు ఒక మీటింగులో చెప్పినాను, ఏమని? వాడు సేమ్ నీ మాదిరే ఉంటాడు కనుక్కోలేవు. ఒకవేళ కనుగొనే దానికి వీలవుతుందా? అంటే సేమ్ నీ మాదిరే ఉంటాడు. నీవలె ఉంటాడు. ఈ మాట అక్కడ ఒక గ్రంథములో

వచ్చేసింది. నీ మాదిరే ఇంకొకడున్నాడంటే వానిని నేను సులభముగా తెలుసుకోగల్గుతాను అని ఎవడైనా అనగల్గితే వానిని తెలుసుకోవాలని ప్రయత్నము చేసినాగానీ, వాడు నీవలె ఉన్నాడు కాబట్టి నీవు వానిని తెలుసుకోలేవు. ఎందుకంటే వాడు ఆ పని చేస్తాడు, నువ్వేమనుకుంటావు అంటే 'నేనే చేసినాను' అనుకుంటావు. ఎందుకంటే నీవలె ఉన్నాడు కదా వాడు, అట్లే అనుకుంటావు నువ్వు, అట్లే మోసపోవడము కూడా జరుగుతావుంది మనము.

ప్రతి వ్యక్తి ఏమి చేయనివాడని ఇంతకుముందు చెప్పాను. కానీ పనులు జరుగుతున్నాయి. ఆ పనిని రెండోవాడు చేస్తూ ఉన్నాడు. నీ శరీరములో ఉండే శరీర అధిపతి చేస్తున్నాడు. నీ శరీరములో ఉండే పెద్ద చేస్తూ ఉన్నాడు. నీ శరీరములో ఉండేవాడు గురువనుకో, దేవుడనుకో, ఎవడో వాడు చేస్తూ ఉన్నాడు. వాడు చేసేదానికి స్థోమత కల్గియున్నాడు. వాడు ఏమైనా చేయగలడు. శరీర అధిపతి చేసినపుడు నీవు ఏమను కుంటున్నావు నేనే చేసినాను అనుకుంటున్నావు. మరి నేను ఏమీ చేయనివాన్ని, వాడు చేస్తూ ఉన్నాడని నీవు అనుకుంటున్నావా! లేదు. మేము ఒక రహస్యము చెప్పుతున్నాము. ప్రతీదీ చేసేది వాడే నీవు చేయలేదు అని ప్రక్కన గిచ్చి చెప్పినా కాని అప్పుడేమో 'ఊ' అంటాడు, బయటికి పోయి 'నేనే కదా చేసినది' అంటాడు. ఆ రకంగా మనిషి అనుకోవడము జరుగుతోంది. ఎందుకంటే వాడు అన్నీ ఆలోచన చేస్తాడు. ఆలోచన ఇట్లా వచ్చింది అట్లా వచ్చింది ఇవన్నీ నేనే కదా! చేసినది. ఆలోచన చేసినది నేనే కదా! చేయాలనుకుండేది నేనే అన్నీ నేనే అనుకుంటాడు. ఎందుకంటే లోపల జరిగే విధానాలన్నీ జీవుడు చేసినట్లే ఉన్నాయి. వీడు చేసినట్లే ఉన్నాయి కాబట్టి వీడు నేనే అనుకుంటాడు. పొరపాటుపడతాడు. అందుకే

వాడు ఎట్లా ఉన్నాడు అంటే పూర్తి నీ మాదిరే ఉన్నాడు, నీవు కనుక్కోలేవు అని చెప్పినాము.

వాడు ఏం పని చేసినా గాని “నేనే చేసినాను” అని, ప్రతి మనిషీ అనుకుంటున్నాడుగాని వాడి ప్రక్కలో వుండేవాడు చేసినాడు అని అనుకోలేదు. దైవగ్రంథములో ధర్మశాస్త్రము ప్రకారము రెండు ఆజ్ఞలు ఉన్నాయి అని చెప్పారు, అది ఏ గ్రంథమైనా దైవగ్రంథమే మనకు. ఆ దైవగ్రంథములో ఏముంది? ‘నీ వలె నీ పొరుగువారిని నీవు ప్రేమించుము’ అని అన్నారు, అంటే నీవలె ఒకడు ఉన్నాడు. వానిని నీ పొరుగువాడు అన్నాడు. పొరుగు వాడు ప్రక్కన ఉండేవాడు అన్నాడు. ప్రక్కన ఉండే వాన్ని మనము తెలుసుకోవడానికి వీలవుతుందా? అని ప్రశ్న వేసుకుంటే తెలుసుకోవచ్చు. వాడు ప్రక్కనే ఉన్నాడు కాబట్టి వాడు అన్నీ చేస్తూ ఉన్నాడు కాబట్టి తెలుసుకోవచ్చు ప్రక్కన ఉండి నీవు ఏమీ చేయలేదు కాబట్టి నీవు తెలుసుకోవచ్చు నేను వేరు అతను వేరు అని. కానీ వాడు అన్ని విధముల నీ వలె ఉన్నాడు కాబట్టి నీవు ఏమను కుంటున్నావు ‘నేనే’ అనుకుంటున్నావు. మనము ఎన్నోసార్లు ఈ మాట విన్నాము. మీరు బయటికి పోయి పనులు చేస్తున్నారు. నేను చేయలేదు వాడు చేస్తున్నాడు అని ఎప్పుడైనా జ్ఞాపకము వచ్చిందా మీకు? రాలేదు. ఎందుకు రాలేదు? మీరు అట్లా కూడా ఆలోచన చేశారు. ఏమని ఆలోచన చేశారు? నాకు ఈ ఆలోచన వచ్చింది, చూడు ఎట్లుందో. మొట్టమొదట పునాదిలోనే నాకు ఈ ఆలోచన వచ్చింది, నేను వద్దనుకున్నాను మళ్ళీ నేను చేయాలనుకున్నాను, చివరికి నిర్ణయించుకున్నాను ఇట్లా చేయాలని, ఆ పని చేసినాను. ప్రొద్దున తెల్లవారు జామున లేచినప్పటి నుండి నేనే చేయుచున్నాను అంటాడు.

ఆ రకంగా పని ముగించేసి చేసినాను అంటావు. ఇవన్నీ నేనే చేసినాను అనే రూఢీ నీకుంది కాబట్టి ఆ రెండోవాడు చేసాడనే నమ్మకము ఏమాత్రము లేదు. ఆ రెండోవాడు చేసినవాడు. రెండవవాడు ఎవడు చేసినాడో వాడే నీకు దేవుడు. వాడే నీ శరీరములో నీకు గురువుగా ఉన్నాడు. అంటే నేను తెలుసుకున్న సత్యము ఇంతే. మీరు తెలుసుకోబోయే సత్యము కూడా అంతే. నేను తెలుసుకున్న సత్యము మీకు చెప్పుతున్నాను. ఏమని చెప్పుతున్నాను, నేను ఉన్నాను, అర్థమయిందా! కానీ నేను చెవిటివాన్ని మూగవాన్ని కన్ను మూసుకుంటాను. మీరు ఎవరో తెలియదు నా ముందర ఏమీ తెలియదు. చెవులలో గుడ్డ పెట్టేస్తాము. మీరు ఏమి మాట్లాడుతారో నాకు తెలియదు. ఏమి చేస్తూవున్నారో నాకు తెలియదు.

ఈ చెవులు, కన్నులు రెండు మూసేస్తే చాలు ఇంకొక దానితో అవసరమే లేదు. ప్రపంచములో సంబంధము తెగిపోతుంది. నేను ఒంటరి వానిని అయిపోతాను. అప్పుడు నేను ఏమి చేయగలను? ఎవరిని ఏమి చేయగలను? ఎవరినైనా కొట్టాలనుకుంటే కొట్టేదానికి అవుతుందా. ఎదుటివాడు కనిపిస్తేనే కదా! నేను కొట్టేది. కన్నులు లేనప్పుడు కొడతానా? కన్నులు, చెవులు రెండు లేనప్పుడు ఏమన్నా చేతనయితుందా? కాదు. అయినా శరీరములో కన్ను, చెవి లేకుండా ఉన్నా గాని శరీరములో శక్తిగా ఉండి, ఏ పనినైనా చేయగల్గినటువంటివాడు లోపల ఉండేటటువంటి రెండవవాడు. వాడు దేవుడు అతనినే ఆత్మ అని అంటున్నాము. వానినే గురువు అని అంటున్నాము. మళ్ళీ ఇపుడు వాడు దేవుడా? వీడు దేవుడా? అంటే లెక్కప్రకారము ఇద్దరు దేవుళ్ళయ్యారు ఇంతకుముందు కూడా అదే చెప్పాను. శరీరములోపల ఒక దేవుడు ఉన్నాడు, బయట ఇంకో దేవుడు ఉన్నాడు. కాని ఆయనను తెలుసుకోవాలంటే ముందు లోపల వుండే

దేవున్ని తెలుసుకోవాలి. ఆయనను తెలుసుకునేదానికి చేసే ప్రయత్నములో భాగమే ఆధ్యాత్మికము. ఆత్మను ఆధ్యాయణము చేయడమే ఆధ్యాత్మికము.

బయటవున్న పరమాత్మ దేవున్ని తెలుసుకోవాలంటే ఏమి చేయాలి? లోపల ఉండే ఆత్మ దేవున్ని తెలుసుకోవాలి. మళ్ళీ ఈయనా దేవుడు? ఆయనా? ఖచ్చితముగా చెప్పండి? అని మీరు ప్రశ్న వేసినారనుకోండి. మీరు నిక్కచ్చిగా చెప్పండి బయట ఉండేవాడు దేవుడా? లోపల ఉండేవాడు దేవుడా? ఏది తేల్చి చెప్పండి? అని మీరడిగినారనుకోండి. నేను ఏమి చెప్తానంటే బయట ఉండేవాడెవడో నాకు తెలియదు, లోపల ఉండేవాడు మాత్రము దేవుడే అని ఖచ్చితముగా చెప్పేస్తాము. ఎందుకంటే బయట ఉండేవానికి పేరులేదు, వానికి ఏదీ లేదు. ఏమీ కానివాడు అయినా వానికి అన్నీ తెలుసు అందుకే ఆయనను సాక్షి అంటున్నాము. ఖుర్ఆన్ దైవ గ్రంథములో ఆయనను సాక్షి అంటున్నాము. ఏమాత్రము చేసేవాడు కాదు. చూసేవాడు మాత్రమే నీలో ఉండే రెండోవాడు చేసేవాడు. మూడు దైవ గ్రంథాలు కూడా ఈ ముగ్గురి గురించి చెప్పేదానికోసమే ముఖ్యముగా తయారైనాయి గాని ఇంకొక దానికి తయారు కాలేదు. కాని ఈ విషయమును చిన్నగ పెట్టేసి చిన్నవన్నీ గొప్పగా చెప్పుకున్నారు. ఇప్పుడు మనము ఏమి చెప్తామంటే మిగతా విషయాలన్నీ చిన్నగా పెట్టేసి బాగా అర్థము కావాలని ఈ విషయాలనే అనేకమార్లు సిద్ధాంతముగా చెప్పుతూ వస్తున్నాము ఈ సిద్ధాంతము పేరే **"త్రైత సిద్ధాంతము"** మరి ఈ మూడింటిలో దేవుడు ఎవరూ? అంటే స్థిరాస్థిరుడు అని చెప్తామా! లేదా ఏమీలేనివాడని చెప్తామా! ఏమీ కాని వాడని చెప్తామా! ఏమీ కాని వాడు మీకేమీ అర్థము కాదు.

శరీరము ధరించి ఉన్నటువంటి ఏ మానవునికీ కూడా తెలియదు. ఒకవేళ నేను గొప్పలు చెప్పుకునేదానికి వీలవుతుందా? ఆ దేవుడు నాకు

తెలుసని, ఆ దేవుడు ఫలానా చోట ఉన్నాడు, ఫలానా రకముగా ఉన్నాడు మరి ఆయనను పోయి పట్టుకోండి అని చెప్పేదానికి నేనేమైనా చూసినానా ఆయనను? చూడకోకున్నప్పుడు నేను ఎట్లా చెప్పాలి? నేను చెప్పేదానికి కాదు, ఆయన గురించి ప్రపంచములో ఎవరూ చెప్పలేరు. కాబట్టి శరీరముతో ఉన్న ఏ వ్యక్తి కానీ దేవున్ని చూడలేదు. కాబట్టి నేను దాని గురించి ఇప్పుడు చెప్పినామనుకోండి అది చట్టానికి విరుద్ధమౌతుంది. మళ్ళీ మీకు బయట దేవుని గురించి తెలియజేయాలంటే ఏమి చేయాలి. ఇక్కడ ఆత్మ నుంచే పోవాలి. రెండో వాని దగ్గర నుంచి పోతే మూడవ వాడు మీకు తెలుస్తాడు. అందువలన భగవద్గీతలో ఏమి చెప్పినాడంటే, ఈ విషయమంతా మేమే స్వంతముగా చెప్తున్నాము అని మీరు అనుకోకుండా నేను భగవద్గీతను అడ్డము పెట్టుకుంటున్నాను. ఎందుకంటే నేను తప్పించుకునే దానికి. నేను తప్పించుకునే దానికి దేవుడు ముందే చెప్పినాడు. ఒరేయ్! మీరు ఇరుక్కోవద్దండి, నేనే ఆ మాటలు చెప్పుతున్నాను. ఏమి చెప్పినాడు 'ద్వావిమౌ పురుషౌ లోకే క్షరఅక్షర ఏవచ' అని చెప్పినాడు. అంటే ఈ లోకములో ఇద్దరు పురుషులు ఉన్నారు అని చెప్పాడు. ఎక్కడ చెప్పినాడు? ఈ లోకములో. ఈ లోకములో ఎంతమంది ఉన్నారు? ఇద్దరు పురుషులు ఉన్నారు. ముగ్గురు అని చెప్పలేదు, పొరపాటుగా కూడా చెప్పలేదు ఆయన, జాగ్రత్తగా వినండి. అంటే ఆధ్యాత్మిక జ్ఞానము కొలతలతో, తూనికలతో, లెక్కాచారాలతో కూడా కరెక్ట్‌గా తూకము వేయబడి ఉంటుంది కాబట్టి ఎక్కడా పొరపాటు పడకుండా చెప్పబడి ఉంటుంది. కాబట్టి అక్కడ భగవద్గీతలో బహుశ పురుషోత్తమ ప్రాప్తి యోగము 15వ అధ్యాయములో 16వ శ్లోకములో ఏమి చెప్పినారంటే...

16 శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరాక్షర ఏవచ ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే ॥

ఇక్కడ దీని వివరము ఏమంటే సంస్కృతములో ఈ శ్లోకము చెప్పినారు. తెలుగులోకి మనము వివరముగా చెప్పుకుంటే "లోకమందలి పురుషులలోన గలవు రెండు తెఱంగులు క్షరుడక్షరుడటంచు సర్వభూతంబు లందును క్షరుడు గలడు, అక్షరుని పేరు కూటస్థుడండ్రు బుధులు". అంటే జ్ఞానము ఉన్నటువంటివాళ్ళు ఏమంటున్నారు అంటే ఈ ప్రపంచములో (ఈ లోకములో) ఇద్దరే ఇద్దరు పురుషులు ఉన్నారు. ఒకడు క్షరుడు, ఇంకొకడు అక్షరుడు. ఒకడు నాశనమైపోయేవాడు, ఒకడు నాశనము కానివాడు. నాశనము కానివాడు అవ్యయుడు, దేవుడు. దేవుడు ఎప్పటికీ నాశనము కాడు. కాబట్టి నాశనము కానివాడు అని ఎప్పుడైతే అన్నామో వాన్ని దేవుడే అనాలి. నాశనము కానటువంటివాడు అక్షరుడు అంటే నాశనము కానివాడు. క్షరుడు అంటే నాశనము అయ్యేవాడు. వీళ్ళు ఇద్దరు ఉన్నారు. మనము ఎక్కడ ఉన్నాము? అక్కడే ఈ లోకములోనే ఉన్నాము. కాబట్టి మనము ఈ లోకములో ఉండే వాళ్లను చూసుకోవాలా, ఈ లోకములో లేని వాళ్లను చూసుకోవాలా? ఈ లోకములో ఉండేవాళ్లనే చూసుకోవాలి.

ఈ లోకములో ఎవరున్నారు? ఇద్దరే ఉన్నారు. నీవు ఉన్నావు అంటే క్షరుడు నాశనము అయ్యేవాడు, నీవు ఎప్పటికైనా నాశనము అయి పోవాల్సిందే. జీవుడు అనేవాడు నాశనము అయిపోయి దేవునిలోకి ఐక్యమయ్యే అవసరము ఉంది. కాబట్టి జీవుడు అనే పేరు ఎప్పటికైనా పోవాల్సిందే, కాబట్టి వాడు నాశనము అయిపోయేవాడే. శరీరము మారినపుడు నాశనము కాడు. శరీరము మారితే జీవుడు ఏమవుతాడు?

అంటే ఇంకొక జన్మకు పోతాడు, ఈ జన్మవలె ఇంకొక జన్మ. ఆ జన్మవలె ఇంకొక జన్మ కల్గుతూ ఉంటుంది. దైవగ్రంథాలు చెప్పినట్లు వాడు నాశనము అయ్యేవాడు కాదు. శరీరము నాశనము అవుతుంది కాని జీవుడు అనేవాడు ఎప్పుడో ఒకసారి నాశనము అవుతాడు. సంపూర్ణమైన జ్ఞానాన్ని తెలిసిన తరువాత అపుడు వాడు నాశనమైపోతాడు. అపుడు అక్షరుడిగా నిలిచి పోతాడు. క్షరుడు అక్షరుడైపోతాడు, నాశనము కానివాడు అవుతాడు. వానిలోకి వీడు (జీవుడు) ఐక్యమైపోవాలి. వీడు నాశనము అయిపోయి, క్షరుడు అను పేరు పోయి అక్షరుడు అను పేరు వచ్చేస్తుంది. అంటే ఈ రెండు రకాల వాళ్లు ఒకటైపోయారు. ఎవడైతే నాశనము కాని వాడున్నాడో వాన్ని నీవు తెలుసుకోగల్గితే తర్వాత ఇంకొకడున్నాడు వాడే పరమాత్మ అనియు, ఏదీ కానివాడనియు చెప్పియున్నాము.

వానిని ఎట్లా చెప్పలేము వానికి ఏ పేరూ లేదు. వాడిని ఉండేవాడు అంటాము, లేనివాడు అంటాము. వానిని ఇంకా స్థిరుడు అంటాము అస్థిరుడు అంటాము. అర్థమయిందా! తరువాత వచ్చి ఏ రకంగా అయినా వాన్ని మనము కరెక్ట్‌గా నిర్ధారణ చేసి చెప్పలేము. అసలైన మూడవ దేవుడు ఉన్నాడే, అంటే మూడవ పరమాత్మగా చెప్పుకుంటున్నామే, ఆయన ప్రపంచమంతా ఆవహించి ఉన్నాడు. ఎట్లు ఉన్నాడో ఎవరికీ తెలియదు. అతన్ని మాత్రము ఫలానా అని సూచించేదానికి వీలులేదు. మరి దేవుడు అని అనవచ్చు కదా! అంటే అట్లా అనేదానికి వీలులేదు. దేవుడు అనేదానికి వీడు (ఆత్మ) సరిపోతాడు. వీనికి ఆ పేరు సరిపోతుంది. ఇప్పుడు పరమాత్మ కూడా నీకు తెలియదు కదా! తెలియబడనటువంటి వాడంటే వీడు తెలియలేదు కదా! కావున దేవుడు చెప్పుట సరిపోతుంది. దేవుడు అంటే వెతకబడేవాడు. నువ్వు వెతకవలసినది, చేరవలసింది పరమాత్మనే కాబట్టి

నీవు ఎవరిని అయితే వెతకాలో వాడే నీకు దేవుడు. అయితే మూడవ దేవున్ని వెతకవలసిన అవసరము లేదు. వాన్ని వెతకమని ఎక్కడా చెప్పలేదు. ఏ గ్రంథములో కూడా నన్ను నువ్వు వెతకమని పరమాత్మ ఎక్కడా చెప్పలేదు. ఏం చెప్పినాడు? మరి గ్రంథాలలో అంతా ఏముంది? మనము ఏమి తెలుసుకోవాలి? ఆయన జ్ఞానాన్ని తెలుసుకోవాలి? దేవుని జ్ఞానాన్ని తెలుసుకోవాలంటే ఏమి చేయాలి? మొదట ఆత్మజ్ఞానాన్ని తెలుసుకోవాలి. ఈ రెండో ఆయన జ్ఞానాన్ని తెలుసుకొంటే గానీ మూడవ ఆయన జ్ఞానము తెలియదు మనకు. జ్ఞానమంతా ఎవరిది? రెండోవానిదే. పేరు ఆయనది (ఆత్మ) కానీ, జ్ఞానమంతా ఈయనిది (పరమాత్మది). కానీ ఇప్పుడు ఎవరిని తెలుసుకోవాలి మనము? రెండోవానిని గురించే తెలుసుకోవాలి. ఎందుకంటే ఆత్మ దేవుని జ్ఞానము తెలియబడితే పరమాత్మ దేవుడు తెలియబడుతాడు, అర్థమయిందా! దేవుని జ్ఞానము అంటే ఏమిటి? అంటే ఇది నీకు రెండోవాడు, నీ పొరుగు వాడు ఎవడైతే ఉన్నాడో ఆ జ్ఞానమే దేవుని జ్ఞానమని తేల్చి చెబుతున్నాము.

మూడవ పరమాత్మ జ్ఞానము అంటే అసలుకు ఆయనకు జ్ఞానమంటూ ఒకటి లేదు. ఆయనకు జ్ఞానమంటూ ఉంటే ఆయనను నిర్ధారణ చేయవచ్చు ఫలానావాడు అని చెప్పితే ఇంక ఆయన దేవుడు కాదు, అయితే పరమాత్మ నిర్ధారింపబడేవాడు కాదు. ఇప్పుడు ఏ దేవున్నైతే సృష్టికర్త అని అంటున్నామో, ఎవడైతే ప్రపంచానికంతా పెద్ద అనుకుంటున్నామో, ఆ దేవుడు అనేటువంటివానిని (పరమాత్మను) ఎవరూ కూడా నిర్ధారణ చేసి చెప్పలేరు, పోలిక లేదు, ఫలానా అని గుర్తించేదానికి అవకాశమే లేదు. అటువంటివానిని గురించి తెలుసుకోవాలంటే ఆయన (పరమాత్మ) జ్ఞానాన్ని గురించి తెలుసుకోవాలి. ఆయన (పరమాత్మ) జ్ఞానము గురించి మరి మనము తెలుసుకోగలమా? ఆయన జ్ఞానము తెలుసుకోవడానికి ప్రయత్నము

చేయాలంటే ఏం చేయాలి? అంటే ఆయన జ్ఞానమే రెండోవాని (ఆత్మ) జ్ఞానముగా ఉంది. కాబట్టి ఎవరి జ్ఞానము తెలుసుకుంటే మూడవపురుషుడు తెలియబడతాడంటే రెండవపురుషుని జ్ఞానము తెలుసుకుంటే మూడవ పురుషుడు తెలుస్తాడు. మరి అదేమి కనెక్షన్ నేరుగా ఆయన జ్ఞానము లేకుండా ఈయన జ్ఞానము ఎందుకు ఉంది? అంటే **"నేను ఆయన ఇద్దరము ఏకమై ఉన్నాము"** అని అన్నాడు ఒక గ్రంథములో, మీకు జ్ఞాపకము ఉందో లేదో! కాబట్టి ఈయన (ఆత్మ) జ్ఞానము తెలుసుకుంటే ఆయన (పరమాత్మ) జ్ఞానము తెలుసుకున్నట్లే. అందుకనే దేవుడు నేను పెద్దగా ఉన్నాను, నన్ను తెలుసుకోమని చెప్పలేదు. నీవలె నున్న నీ పొరుగువాన్ని తెలుసుకో లేదా ప్రేమించు లేదా గుర్తుపట్టు అని చెప్పాడాయన. దైవ గ్రంథములో చెప్పిన మాట ఇది. ఇప్పుడు భగవద్గీతలో కూడా ఇక్కడ ఏమి చెప్పుచున్నాము? ఇద్దరు పురుషులు ఉన్నారని చెబుతున్నాము. ఇద్దరు పురుషులు ఈ లోకములోనే ఉన్నారు.

నీకు ఈ లోకములో ఉండే పురుషులు కావాలి కాని ఇతరత్రా పురుషులతో నీకు అవసరము లేదు. కాబట్టి ఆ దేవున్ని (పరమాత్మను) గురించి తెలుసుకోమని నేరుగా ఎక్కడా చెప్పలేదు. ఇప్పుడు మనకు పెద్ద సమస్య ఏమి? అంటే మూడవ దేవున్ని గురించి తెలుసుకోవాలంటే వృథా ప్రయాస. రెండోవాని గురించి తెలుసుకో అని మీరు అంటున్నారు కదా! మూడవ వాని గురించి ఎందుకు తెలుసుకోకూడదు? ఆయన గురించి నేరుగా తెలుసుకునే అవకాశమే లేదా అంటే, ఆయనకు అంటే మూడవవాని గురించిన జ్ఞానము ఏమాత్రము ప్రపంచములో లేదు, అర్థమయిందా! ఇపుడు దేవుని జ్ఞానము అని మనము దేనినైతే అంటున్నామో ఆ దేవుని గురించి, పురుషోత్తముని గురించి తెలుసుకునేటువంటి జ్ఞానము ఆయన

గురించి చెప్పేటటువంటి జ్ఞానము ఎక్కడా లేదు. మరి దేవుడు తన జ్ఞానాన్ని తానే చెబుతానని ఇంకొక చోట అన్నాడు. జ్ఞాపకము పెట్టుకోండి. నా జ్ఞానాన్ని నేనే చెప్పుతాను అన్నాడు. ఆయన జ్ఞానాన్ని ఆయన చెప్పినప్పుడు ఆయన జ్ఞానాన్నే కదా మనము చెప్పినది. అపుడు ఆయనకు ఒక జ్ఞానమంటూ ఉంది కదా! అని ప్రశ్న వేయవచ్చు, అర్థమయిందా! అది ప్రశ్నే కదా అప్పుడు మన మాట తప్పు అవుతుంది. కాని మనమాట ఎప్పుడూ తప్పు కాదు ఎందుకంటే దేవుడు చెప్పే జ్ఞానము ఏదైతే ఉందో అది ఈ రెండవ వానికి సంబంధించి నదే. నీ శరీరములో ఉండే వానికి సంబంధించి నదే. అంతా అదే జ్ఞానమే అందుకే నేను మొట్టమొదటనే చెప్పాను. భగవద్గీత శ్లోకాలేవైతే ఉన్నాయో అవి మొత్తము నీ శరీరము లోపలికి చెప్పబడినాయి బయటకి చెప్పలేదు అని చెప్పాము, ఏ శ్లోకమైనా కానీ అపుడు శరీరము బయట ఉండే దేవుని గురించి చెప్పినాడా? అని ఆలోచిస్తే శరీరము లోపల ఉండే దేవుని గురించి చెప్పినాడా? శరీరము లోపల ఉండే దేవుని గురించి చెప్పినాడు. ఇపుడు శరీరము బయట ఉండే దేవుడు తన జ్ఞానాన్ని ఏమి చెప్పినాడు. నా జ్ఞానాన్ని చెప్పుతానని ఏమి చెప్పినాడు?

ప్రతి శ్లోకాన్ని తీసుకొని శరీరములోపలే చెప్పినాడు కాని శరీరము బయట లేదు. ఏ శ్లోకమైనా శరీరము బయట సంబంధించి ఉందా! ఏ మాత్రము లేదు. శరీరము లోపలే అన్వయిస్తుందన్న మాట. సరే ఈ భగవద్గీత శ్లోకమొక్కటే కాదు. మిగతా దైవగ్రంథాలున్నాయి. దాంట్లో కూడా ముఖ్యమైన వాక్యాలన్నీ శరీరము లోపలే చెప్పినాడు. శరీరము బయటికి ఏ మాత్రము చెప్పలేదు. కాని వాళ్లకు అవి అర్థము కాలేదు. ఇది మా దైవగ్రంథము అని పేరు పెట్టుకొని చెప్పుకొంటున్నారు కదా కొంతమంది, వాళ్లకు అది ఏమో అర్థము కాలేదు. ఒకచోట ఒక వాక్యము ఉంది. మీకు రెండో గ్రంథము

వ్రాయబోతున్నాము. అంటే అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు అని ఒక గ్రంథము వచ్చింది అది మీకు ఒకటో భాగము. రెండో భాగము వ్రాసాము. అందులో ఒక విషయము వచ్చింది. దాంట్లో ఒక గుహ ఉంది. గుహలో ఇద్దరున్నారు. వారితో పాటు ఒక కుక్క ఒకటి ఉంది అన్నాడంట ఒకడు. అంటే లేదు లేదు గుహలో నలుగురు ఉన్నారు, వారితో పాటు కుక్క ఒకటి ఉన్నది అని ఇంకొకడు అన్నాడంట. ఈ కుక్క గురించి ఎందుకు చెప్పుకుంటున్నాము అంటే ఎల్లప్పుడు కుక్క మొదటనే రంధ్రము దగ్గరే కనిపిస్తుందట, గుహ మొదటిలోనే కనిపిస్తా ఉంది కుక్క. కానీ ఆ లోపల ఉండే వాళ్లు కనపడలేదు. మనుషులు ఉన్నారు లోపల. ఈ కుక్క మొదట ఉంది. బయట ఈ కుక్కను, లోపల ఇంకా ఇద్దరున్నారని ఒకడంటే, ఇంకొకడు లేదు లేదు నలుగురు ఉన్నారు, కుక్క ఒకటి మొత్తము ఐదుమంది ఉండేది అన్నాడంట ఒకడు. ఇంకొకడు ఏమన్నాడంటే తొమ్మిదిమంది ఉన్నారు లోపల, ఈ కుక్క ఒకటి మొత్తము పదిమంది అన్నాడంట.

కానీ లోపల ఎంతమంది ఉండేది నాకు మాత్రము తెలుసు అంటాడు. ఈ జ్ఞానము చెప్పే దేవుడు. లోపల ఎంతమంది ఉండేది నాకు తెలుసు. వాళ్లు ఎప్పుడు నిద్ర పోతుండేది తెలుసు. ఎప్పుడు మేల్కొండేదీ తెలుసు. మీకు కుక్క ఒకటే కనిపిస్తుంది. నాకు లోపల ఉండేవాడు కూడా కనిపిస్తున్నాడు అని చెప్పాడాయన. ఈ గుహ ఏమిటిది? కుక్కేమిటిది? ఆ లోపల వుండే వాళ్ళు ఎవరు? ఇదంతా శరీరము లోపల వుండే విషయమే. శరీరములో ఎంతమంది ఉన్నారో ఆయనకు తెలుసు, మనకు తెలియదు సరిగా. ఒకడు నల్గురంటే ఒకడు ఐదు అంటే, ఒకడు 10 అంటే, ఒకడు 11 మంది, 20 మంది అంటున్నారు ఇష్టం వచ్చినట్టు. సరేలే మనుషులము ఉన్నామని పోలిక చేసి చెప్పినామనుకో కుక్క ఏమిటిది? అంటే ఎల్లప్పుడు

మొరుగుతావుంటది కదా! కాబట్టి దాన్ని కుక్క అని అంటాము. ఎక్కడ మొరుగుతుంది అంటే ముక్కు రంధ్రాల దగ్గరే! కాబట్టి ముక్కు దగ్గర కనిపిస్తావుంది. అందుకే దానిని కుక్క అన్నాము. రాత్రింపగళ్లు, రాత్రి అయినా మొరుగుతుంది. పగలు అయినా మొరుగుతుందది. మొరుగుతున్న కుక్కను శ్వాస అని చెప్పి, లోపల ఉండే అన్ని భాగాలను కలిపి మనుషులు అని చెప్పాడు.

ఈ శరీరాన్ని అంతా కలిపి గుహ అని చెప్పారు. కాని ఇది అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో ఉంది. ఇది శరీరము గురించి చెప్పినారని ఎవరికైనా అర్థమౌతుందా లేదా చెప్పండి. ముస్లీములను అడగండి? ఇదేదో మనకు సంబంధము లేదు అంటారు, ఇట్లాంటివి మా దాంట్లో ఉండవు అంటారు. మేము ఏమి చెప్పుతున్నామంటే ఏ దైవగ్రంథములోనైనా గాని దేవుని జ్ఞానమంతా శరీరాంతర్గతముగానే ఉంది కాని బాహ్యముగా లేదు. మీరు ఏమి తెలుసుకున్నా శరీరములోనే తెలుసుకోవాలి. సరే మీరు ఒక ప్రశ్న వేయొచ్చు. శరీరాంతర్గతముగా ఉంటే బయట దేవాలయాలు అన్నీ పెట్టి వాటికంతా నమస్కారము చేయండి, వాటికంతా పూజచేయండి అని మన పెద్దలు ఎందుకు చెప్పినారు అని అడగవచ్చు. అంటే శరీరములో ఈ విధానము ఉన్నది, అది బయట పోల్చి చెప్పారు. బయట చూసి, లోపల ఇట్లుంది నేర్చుకోమని చెప్పారు. అర్థమయిందా! వెంకటేశ్వర స్వామి గుడి ఉంది. దానిని 7 ద్వారాలు లేదా 7 గోపురాలు లేదా 7 పర్వతాలు లేదా 7 కొండలు అంటాము. ఇవన్నీ ఎక్కడ ఉన్నాయి? మన శరీరములో ఉన్నాయి అర్థమయిందా! మన శరీరములో ఉండేదాన్ని పోల్చి బయట చూపించి, ఇక్కడికి వచ్చి మొక్కుతున్నావు కదా! ఇక్కడ కాదురా నీవు మ్రొక్కాల్సింది, లోపల అని తెలియజేసే దానికోసము ఆ గుడి కట్టడము,

అక్కడ చూపడము జరిగింది. 7 ద్వారాలు దాటి లోపలికి పోతున్నాము, వెంకటేశ్వర స్వామి దగ్గరికి దర్శనానికి. అర్థమయిందా! ఏడు కొండలు దాటి పోతున్నాము, లేకుంటే ఏడు గోపురాలు దాటిపోతున్నామనుకో అక్కడికి పోతే దేవుడు కనిపిస్తాడు నీకు. అదే విషయమే శరీరము లోపల చూపిస్తూ, ఈ ఏడు నీ లోపల ఉన్నాయి.

ఈ ఏడును దాటి వస్తే లోపల నీకు దేవుడు తెలియబడుతాడు అదే నిజమైన జ్ఞానము అని చెప్పినారు. ఇట్లా ప్రతి గ్రంథములో ఏ గ్రంథములోనైనా గాని మీరు జ్ఞాపకము పెట్టుకోవలసింది ఏమంటే శరీరము లోపల ఉండే విషయాలే దేవుని జ్ఞానముగా చెప్పబడినాయి గాని శరీరము బయట ఉండే విషయాలు చెప్పలేదు. ఇపుడు దేవుడు ఎక్కడున్నాడు? మన శరీరము లోపలే జ్ఞానమంతా ఉండేది! చెప్పిన దేవుడు ఎవరు? బయట ఉండే దేవుడు, ప్రపంచమంతా అణువణువునా వ్యాపించినటువంటి దేవుడు, ఆ దేవుడు ఎవరు? అని అంటే ఇప్పుడు మరలా భగవద్గీతలోనికి పోయి చెప్తాము. ఇప్పుడు ఇద్దరు పురుషులు గురించి చెప్పుకున్నాము కదా మనము! ఇక్కడ మూడో పురుషుని గురించి ఏమి చెప్పుతున్నాడు అంటే పురుషోత్తమ ప్రాప్తి యోగము 17 వ శ్లోకము...

17 శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

ఉత్తముండగు పురుషుడన్యుండు గలడు. ఈ ఇద్దరికంటే ఉత్తమమైన వాడు వేరే వాడు ఒకడు ఉన్నాడు. వాడే పరమాత్మ అని చెప్పారు. అంటే పరమాత్మ పేరు కాదు కానీ ఒక బిరుదది. పరమాత్మ అంటే ఆత్మకంటే వేరయినవాడు. మన శరీరములో రెండు ఆత్మలు ఉంటే ఆత్మకంటే

వేరయినవాడని మనము అంటున్నాము. వాడు ఎక్కడ ఉన్నాడంటే అతడు "లోకత్రయంబు నందావహించి" అంటే ఈ ముల్లోకాలు ఆవహించి, "అవ్యయుండైన ఈశ్వరుడై భరించు" అంటే అవ్యయుడై అంటే నాశనము లేనటువంటివాడై, ఈశ్వరుడు అంటే అధిపతియై ఉన్నాడు. ప్రపంచానికంతా అధిపతియై ఉన్నాడు. అంటే మొత్తము అణువణువునా వ్యాపించి ఉన్నాడని చెప్పినాము. అంటే ఈ ప్రపంచానికంతా సృష్ఠికర్త ఎవడైతే ఉన్నాడో, ఈ ప్రపంచానికి పెద్ద ఎవరైతే ఉన్నాడో, ప్రపంచాన్ని పుట్టించిన దేవుడెవడైతే ఉన్నాడో అతడు మూడవ పురుషుడిగా ఉన్నాడు అంటే ఇద్దరి పురుషులకంటే వేరుగా ఉన్నాడు. వేరుగా ఉంటూ నాశనము లేనటువంటివాడై, ప్రపంచ మంతా వ్యాపించి ఉన్నాడు వాడు అన్నిటికి అధిపతి. అందరికీ మొత్తము ప్రపంచానికంతా అధిపతి. అతను దేవుడైతే మరి ఆ దేవుడు ఏమి చెప్పుతున్నాడు మనకు?

మనకు జ్ఞానము అందివ్వాలి కదా! ఆయన నా జ్ఞానాన్ని నేను అందిస్తాను అని చెప్పాడు. ఆయన జ్ఞానాన్ని మనకు అందించినపుడు దేవుని జ్ఞానము దేవుడే చెప్పాలి మనకు. దేవుడు చెప్పినటువంటి జ్ఞానము ఏది? భగవద్గీత జ్ఞానమంతా తెలుసుకుంటే క్షరుడు, అక్షరుడు గురించి చెప్పినటువంటి జ్ఞానమే ఉంది. తనను గురించి చెప్పుకోలేదు. ఈ ఇద్దరిని గురించి తెలుసుకుంటే మూడవవాడు తెలియబడతాడు. నీవు మరణావస్థలో మరణించినపుడు, దేవునిలోకి ఐక్యమైనపుడు, ఐక్యము కాని వానిని విడిచిపెట్టు, మరలా పుట్టేవాని కథ విడిచిపెట్టు. దేవునిలోకి ఐక్యమైనవాడు ఏ స్థితిని పొందుతాడు అని చెప్పితే 1980 లో వ్రాసిన గ్రంథము **"జనన మరణ సిద్ధాంతము"** లోనే జీవుడు ఎంతో శ్రద్ధ కలవాడై, ఈ రెండో పురుషుని జ్ఞానము పూర్తి తెలుసుకోగల్గితే అపుడు జీవుడు రెండో పురుషునిగా

మారిపోతాడు. నీవు నేరుగా దేవునిగా మారేదానికి అవకాశము లేదు. ప్రపంచములో వాడు ఎవడో తెలియదు. ఎవరికీ అందుబాటులో లేడు ఆయన. మరి నీవు ఆ రకముగా రెండో పురుషునిగా మారిపోతే, మరణావస్థలో జీవాత్మ అనేవాడు ఆత్మలోనికి ఐక్యమైపోయి, ఆ ఆత్మ అనేది ప్రత్యేకమైన ఆత్మగా మారిపోతుంది అని చెప్పాము. అది లోపలనే శరీరములో ఉండే పరమాత్మలోనికి ఐక్యమైపోతుంది అని చెప్పాము. అంటే ఈ ఇద్దరి పురుషులకంటే ఉత్తమమైన పురుషునిలోనికి జీవాత్మ ఐక్యమైపోతే జీవాత్మ అపుడు మోక్షము పొందుతాడు. వాడు దేవునిలోనికి ఐక్యమైనట్లే. దేవుని లోనికి ఐక్యమైతే మళ్ళీ జన్మలు లేవు అని చెప్పాము. జన్మలు లేనటువంటి వాడు ఆత్మలోనికి ఐక్యమైతేనే పరమాత్మలోనికి ఐక్యమయ్యేదానికి అవకాశము ఉంటుంది.

కాబట్టి ఒక గ్రంథములో ఏమి చెప్పారు **"నేనే మార్గము"** అని అన్నాడు. నా ద్వారానే మీరు పోవాలి లేకపోతే ప్రక్కకు పోయేదానికి వీలులేదు అని ఆత్మ అన్నాడు. నేనే మార్గము, గమ్యము కూడా నేనే, నాలోకి చేరితే తరువాత నేను ఆయనలోనికి చేర్చుతాను. అప్పుడు మీరు దేవుని లోనికి చేరినట్లు అవుతుంది అని ఆత్మ చెప్పింది. ఇది 1980 లోనే **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథములో చెప్పినటువంటి జ్ఞానము. ఈ రోజు అదే చెబుతున్నాము, మార్పు లేదు. కాబట్టి ఏమి చెబుతున్నామంటే నీవు రెండో పురుషున్ని తెలుసుకోగల్గితే, నీవు ఆయనలోకి ఐక్యమవగల్గితే తరువాత నీవు మూడవ పురుషునిలోనికి చేరేదానికి అవకాశము ఉంది. నీవు ఆత్మ (దేవుని) లోనికి ఐక్యము కావాలంటే ఏమి చేయాలి? నీకు ఎవడైతే ఇప్పుడు దేవుడుగా ఉన్నాడో వాన్ని నీవు తెలుసుకోవాలి. నీ శరీరములో నిన్ను నడిపించేవాడే నీకు దేవుడుగా ఉన్నాడనే విషయము తెలియదు. ముఖ్యముగా ఆత్మయిన దేవున్ని తెలియాలి.

దేవుని మార్గములో పోకుండ దేవుని దారి తప్పి నడుస్తున్నారు. సరియైన దారి తెలియకుండా ఉంది. సరే కొంతమంది ఏమంటారంటే దేవుని జ్ఞానము తెలుసుకుంటాము. మనుషులు చెప్పిన జ్ఞానము మాకు మూడు దైవగ్రంథాలలో ఉండేదే అసలైన జ్ఞానము అని మనము అంటున్నాము. లేదు కొంతమంది మాది ఖురాన్ గ్రంథము, అంతిమ దైవగ్రంథము ఇది వచ్చిన తరువాత ముందు వచ్చిన గ్రంథాలతో పనేలేదు అని అంటున్నారు.

ముందు వచ్చిన రెండు గ్రంథాలు కూడా మంచి జ్ఞానమే, మేము కాదని చెప్పలేదు. ఖుర్ఆన్ వచ్చిన తరువాత రెండు గ్రంథాలను వదలి వేయాలను అవసరము లేదు, మూడు గ్రంథాలు దైవ గ్రంథాలే. వాటిలోని జ్ఞానము మానవులందరికీ అవసరము. ఈ గ్రంథము తర్వాత వేరే గ్రంథము అవసరము లేదు అని దేవుడు చెప్పినాడా? అట్లా ఏమీ చెప్పలేదు. మూడు గ్రంథాలలోని విషయాలు తెలియగల్గితేనే నీవు సరియైన మార్గములో ఉన్నట్లు లేకుంటే, సరియైన మార్గములో లేనట్లు అని చెప్పినాడు. అంత గొప్పగా చెప్పినా గానీ, ఆ గ్రంథములో ఉండే విషయము వీళ్లకు అర్థము కాలేదు. అంటే దేవుడు చెప్పిన జ్ఞానము వీళ్ళకు అర్థము కాలేదు. దేవుడు తన జ్ఞానాన్ని శరీరము లోపల చెప్పినాడు. ఇప్పుడు మనము శరీరము లోపలే తెలుసుకోవాలి.

మళ్ళీ ఇప్పుడు ఆయన చెప్పిన జ్ఞానము ఏది? దేవుడు, అంటే ముగ్గురు పురుషులలో మూడవవాడు గొప్పవాడు, ఉత్తమపురుషుడు అని మనము చెప్పుకున్నాము కదా. ఆయన తన జ్ఞానాన్ని ఆయనే చెప్పినాడు మనకు ఆయన ఒకటే రూపములో ఎప్పుడూ చెప్పలేదు, మూడు రూపాలలో చెప్పినాడు. మూడు రూపాలలో చెప్పుతాను అని అన్నప్పుడు, ఆ మూడు

రూపాలు ఏవేవో మనకు సరిగా అర్థము కాలేదు. ఈ లెక్కప్రకారము పోతే అసలుకు ఆయన విషయము ఏమాత్రము అర్థము కాలేదు మనకు, అని మనము అంటే ఇప్పుడు కొందరు ఏమంటున్నారంటే? అంతెందుకయ్యా! మాకు అర్థమయింది, మీకెందుకర్థము కాలేదో మాకు తెలియదు కాని మాకర్థమయిందని, శరీరములో ఉండేవానికంటే శరీరములో లేనివాడు గొప్పవాడని అర్థమయిందని, నీవు తికమక పడి మళ్ళీ అది కాదు ఇది కాదు అని వెనక్కి వస్తున్నావు నీవు, మూడవవాడు దేవుడు అనేది నిజమే, కాని వెనక్కి వచ్చి రెండోవాన్ని పట్టుకుంటున్నావు, మేము మాత్రము మూడోవాన్నే పట్టుకుంటాము అని కొంతమంది అంటున్నారు. అంటే పురుషోత్తమున్నే మేము పట్టుకుంటాము అని అంటున్నారు.

ఈ ఇద్దరు పురుషులకంటే ఉత్తమపురుషున్ని పట్టుకుంటాము మేము, మామూలు పురుషున్ని ఎందుకు పట్టుకోవాలి? ఉత్తముడే కదా కావలిసినది ఎవరికైనా గాని? అని అడుగుతున్నారు. ఉత్తముడే కావలిసినది ఎవరికైనా గాని. ఆ ఉత్తముడు ఎవరు? అని మనము ప్రశ్న వేస్తున్నాము. నీకు తెలుసునా? ఆ తెలియని స్థితియే దేవుడని మనము చెప్పుకుంటుండేది. తెలియని స్థితియే దేవుడు కాబట్టి వాన్ని ఫలానాయని ఎక్కడా అని చెప్పేదానికి లేదు. ఇంకా ఏమి చెప్పుతున్నామంటే ఈ ముగ్గురు, పురుషులని అసలు రూఢి ఏమి మీకు ఆ గ్రంథములో తెలిసినది చెప్తున్నారు, మీరు చెప్పినట్లే ఉన్నారా లేకపోతే ఇంకొక విధముగా ఉన్నారా? ఒకవేళ అట్లా ఏమన్నా తికమక పడి వేరే రూట్‌లోకి పోతారేమో అని, ఆయన ఏమి చెప్పినాడంటే ముగ్గురు ఉన్నారు అని తెలియజెప్పేదానికి ఆయన మనకు కొన్ని నిదర్శనాలు చూపించాడు. అంటే కనపడని విషయాన్ని కనిపించే విధముగా చూపించాడనుకోండి మనకు. జీవుడు అనేవాడు ఉన్నాడు వాడు ప్రకృతితోను,

ఆత్మతోను ఇద్దరితో కూడుకొని ఉన్నాడు కాబట్టి వాడు నాశనమయ్యేవాడు ఎప్పటికైనాగాని. ఆత్మ అనేవాడు ఉన్నాడు ఆయన ప్రకృతితో కూడుకోలేదు, దేవునితో కూడుకొని ఉన్నాడు. కాబట్టి నాశనము కానివాడు ఆత్మ, పరమాత్మ కూడా నాశనము కానివాడే అని చెప్పినారు కదా! మొదట జీవాత్మ, ఆత్మ ఇద్దరు పురుషులు అని చెప్పినారు కదా! ఇద్దరు పురుషులలో ఒక పురుషుడు స్త్రీతత్వము కొంత కల్గివున్నాడు కాబట్టి పూర్తి పురుషుడు కాడు. కావున నపుంసకుడు అను పేరు వచ్చింది వానికి. జీవున్ని నపుంసకునిగా వర్ణించినాము కొన్నిచోట్ల. అంటే ఆకారమంతా పురుషునిదే కాని పురుషతత్వం లేదు వీని దగ్గర, ఏముంది? కొంత ప్రకృతితత్వం ఉంది కాబట్టి జీవున్ని నపుంసకునిగా చెప్పినాము.

ప్రపంచములో మామూలు జన్మలు ఉన్నాయి. స్త్రీ స్వరూపముగా ఉన్నటువంటి వాళ్లను ప్రకృతి అంటున్నాము. ఇపుడు భూమిమీద ఆడ వాళ్లు పుట్టినారంటే వాళ్లను ప్రకృతిగా వర్ణించి చూపాలి జ్ఞానము ప్రకారము, అందులో జీవున్ని ఏమి చేయాలంటే ప్రకృతితో అంటే గుణాలతో కలిసి ఉన్నాడు కాబట్టి వాన్ని నపుంసకుడు అని అంటున్నాము. ప్రకృతి జనిత గుణాలతో కలిసి నివశిస్తున్నాడు కాబట్టి గుణచక్రములో వాన్ని మనము నపుంసకుడు అని అంటున్నాము. ప్రకృతి గుణాలతో సంబంధం లేకుండా శరీరములోనే గుణాలకు అతీతముగా వున్నటువంటివానిని మనము పురుషుడు అని అంటున్నాము. స్వచ్ఛమైన పురుషుడు అని అంటున్నాము కాబట్టి పురుషుని గుర్తుగా మగవాళ్ల పుట్టారు.

భూమి మీద స్త్రీ శరీరము, పురుష శరీరము ఉంది అంటే **పురుష ఆకారము ఆత్మకు, స్త్రీ ఆకారము ప్రకృతి** అని మనము గుర్తించవచ్చు.

దేవుని ఆకారము పురుషత్వ ఆకారముగా ఉంది. ఇపుడు ఒక స్త్రీ, ఒక పురుషుడు ఇద్దరు కలిస్తే సంతతి కల్గుతుంది కదా అది సృష్టి విధానము. సృష్ఠి విధానము చూపించాడు మనకు భూమి మీద కానీ స్త్రీ, పురుషుడు లేకుండా సృష్టి జరిగే విధానము కూడా ఉంది. అంటే ఇప్పుడు మనుషులను చూపించాను కదా స్త్రీని, పురుషుడిని ఇద్దరిని ప్రకృతి, పురుషుడు అని చెప్పినాము కదా, ఇద్దరిని ప్రకృతి, పురుషుడు అని పోల్చి చెప్పినాము కదా! అట్లాగానే దేవున్ని కూడా పోల్చి చెప్పేదానికి ఒకటి ఉంది గుర్తు. ఉదాహరణకు ఒక రకము బల్లి ఉంది అది ఆడది కాదు, మగది కాదు. దానిలోనే స్త్రీ కణాలున్నాయి. దానిలోనే పురుష కణాలున్నాయి. అది మళ్ళీ ఇంకొక బల్లిని ఉత్పత్తి చేస్తుంది, అర్థమయిందా! ఇది దేవుని గుర్తు. అంతెందుకయ్యా! చెట్లు ఉన్నాయా లేదా? మీకు తెలుసు కదా! వృక్షాలున్నాయి కదా! అది ఆడ చెట్టు మగ చెట్టు అని ఏమన్నా గుర్తుపడతారా? ఆడ చెట్లు మగ చెట్లు లేనే లేవు! అన్నీ ఒకటే చెట్లే, దేవునితో సమానముగా చెప్పవచ్చు. ఇది ఆడ అది మగ అని గుర్తు పట్టేదానికి అవకాశమే లేదు. ఏ చెట్టును ఆడ చెట్టని, మగ చెట్టని చెప్పేదానికి అవకాశమే లేదు అట్లే దేవుడున్నాడు.

సృష్ఠి అంతా చెట్టులోనే మొదలౌతోంది. ఇది దేవుడు అంటే సృష్ఠి పూర్వము అంటే తనే ప్రకృతి అయి తనే పురుషుడై తనే ప్రపంచమును సృష్ఠించాడని గుర్తుగా చెట్టును పెట్టాడన్నమాట. చెట్టును పెట్టి దాంట్లోనే రెండు రకాలూ వుండేటట్లు చేశాడు. కాబట్టి చెట్లు దేనికి గుర్తు పరమాత్మకి గుర్తు.అంటే మూడవ పురుషునికి గుర్తు? ఇట్లా ప్రకృతి స్త్రీలకు గుర్తుగా ప్రపంచములో ఒక గుర్తు ఉంది. పురుషులకు ఒక గుర్తు ఉంది. లోపల ఉండే ఒక జీవునికి ఒక గుర్తు ఉంది. ఈ చెట్టుకు కూడా ఒక గుర్తు. ఇప్పుడు జీవుడు గుర్తు వచ్చేసింది, ఆత్మకు గుర్తు వచ్చేసింది, ప్రకృతికి

గుర్తు వచ్చేసింది, పరమాత్మ గుర్తు కూడా వచ్చేసింది. ఇప్పుడు పురుషోత్తముడు అనేవాడు ఒకడు ఉన్నాడని మనకు తెలిసిపోయింది కదా!

మన శరీరములో ఉండే ఆత్మజ్ఞానము తెలియగల్గితే దేవుని జ్ఞానము తెలుస్తుంది. ఇప్పుడు దేవుని జ్ఞానము నేను తెలియజేస్తాను అని అన్నప్పుడు దేవుడు తెలియజేసిన జ్ఞానమునే అంటే గ్రంథాలలో ఉండే జ్ఞానమునే తెలియజేస్తాము. గ్రంథాలలో ఉండే జ్ఞానము ఏది? దేవుని జ్ఞానమే. ఆ దేవుని జ్ఞానమంతా శరీరము లోపలిదే. శరీరము లోపలిదంతా ఆత్మజ్ఞానమే. అందువలన ఒక గ్రంథములో నీవు ఏమి చేయాలంటే నీవలె వున్న నీ పొరుగు వానిని ప్రేమించుము అని ఉంది. **"నీ వలెనున్న నీ ఆత్మని నీవు చూసుకో"** అని అర్థము. మళ్ళీ ముగ్గురు వున్నారు. ముగ్గురు ఉన్నారని గుర్తుగా ఒక ఆజ్ఞ చెప్పి, రెండో ఆజ్ఞ చెప్పినాడు. మొదట వాక్యము చెప్పి, రెండో వాక్యము చివరి వాక్యము చెప్పినారు ఇదే నీకు గట్టు **పూర్ణ హృదయముతో, పూర్ణ ఆత్మతో, పూర్ణ మనస్సుతో** అని ఉంది కదా! ఈ పూర్ణ ఆత్మ, పూర్ణ హృదయము, పూర్ణ మనస్సు అనేది దేన్ని గురించి చెప్పినాడు? ఈ మూడింటిలో ఏదో లిటిగేషన్ ఉంది. సరే నీ వలెనున్న నీ పొరుగు వానిని ప్రేమించుము అని చెప్పాడు. మొత్తము గ్రంథములో పైకి రెండే రెండు ఆజ్ఞలు ఉన్నాయి. రెండే మాటలు! మొదటి మాట ఇది.

ఆ పురుషోత్తమున్ని తెలుసుకోవాలంటే ముందు నీలో ఉండే వాన్ని తెలుసుకో. నేనేం చేయాలి దేవున్ని గురించి తెలుసుకోవాలంటే మన శరీరములో ఉండే జ్ఞానము తెలుసుకోవాలి. శరీరములోని జ్ఞానము భగవద్గీతలో ఉంది, బైబిల్‌లో ఉంది, ఖురాన్‌లో ఉంది. మా ఖురాన్‌లో ఎక్కడ ఉంది ఈ జ్ఞానము? అంటే ఉంది నీకు తెలియలేదు. భగవద్గీతలో ఉందా? అంటే ప్రతి శ్లోకము అదే కాని నీకు తెలియలేదు. కాబట్టి ఇప్పటి

నుంచి మనము దృష్టినంతా ఎక్కడ సారించాలి? నీ శరీరములో సారిస్తూ ఇక్కడ ఏదో పెద్ద రహస్యము ఉందని తెలుసుకోండి. యోగులు కూడా ఈ శరీరములో ఉండేటువంటి దానిని తెలుసుకోవాలనే ప్రయత్నము చేశారు. మనము కూడా అదే ప్రయత్నము చేయాలని కోరుకుంటూ, ఇప్పటినుండి జాగ్రత్తగా శరీరములో ఉండేవానిని తెలుసుకోవాలని, అందరూ ప్రయత్నము చేయాలని కోరుకుంటూ ఈ సమావేశాన్ని ఇంతటితో ముగిస్తున్నాను.

## 80. తెలుగులో మూడు ఆరు తొమ్మిది

**తేది :- 14.05.2014**

మనకు జీవితములో ప్రతి ఒక్కరికీ ఏదో సారము కనిపించి ఉంటుంది. జీవితములో ఎక్కువ సారము కనిపించేది ఏది అంటే సుఖాలలోనే సారము కనిపిస్తూవుంటుంది. ఆ సుఖాలు కావాలంటే ధనము కావాలి. ఆ ధనము కావాలంటే దానికోసము ప్రాకులాడాలి. ఆ విధముగానే ప్రాకులాడుతూ చేసేదే సంసారము. 'సం' అంటే మంచిది. మంచిసారము కలిగినటువంటిది. సంసారము జ్ఞానులకు మంచిసారము జ్ఞానములో ఉంటుంది. అజ్ఞానులకు మంచి సారము అజ్ఞానములో ఉంటుంది. అందరికీ ఒకటే దానిలో ఉండదు. కొంతమంది జ్ఞానులైనటువంటి వాళ్ళు జ్ఞానములో ఆసక్తి కలిగి ఉంటారు. కొంతమంది అజ్ఞానులైనటువంటి వాళ్ళు అజ్ఞానము లోనే ఆసక్తి కలిగి ఉంటారు. వాళ్లకు జ్ఞానము చెప్పితే వినరు, ఎవరు? అజ్ఞానులకు జ్ఞానం చెబితే రుచించదు, సారము కనిపించదు. ఆ విధముగానే జ్ఞానులకు అజ్ఞానము చెప్పినా వారికి సారము కనిపించదు, రుచించదు.

కాబట్టి ఎవరికి ఏదైతే ఇష్టమో అదే సారముగా ఉంటుంది. ఆ సారాన్నే అనుసరిస్తుంటారని మేము తెలియజేస్తున్నాము. కానీ ఎవరు ఏ దానిని సారముగా గ్రహిస్తున్నారు అని అంటే బుద్ధి ఉన్నటువంటి వాళ్లు చాలామంది ఉన్నారు. ఈ చాలామందిలో ఒక్కొక్కరికి ఒక్కొక్కటి ఒక్కో సారంగా ఉంటుంది. ఒకరికి ఉన్న సారము ఇంకొకరికి సారముగా ఉండదు. అలా ప్రతి విషయములోను చూసుకోండి. ఒక విషయములో ఒకరు ఇష్టంగా ఉంటే, ఇంకొకరు అదే విషయం మీద ఇష్టంగా ఉంటాడనే నమ్మకము లేదు. వాళ్లు ఇంకో విషయము మీద ఇష్టంగా ఉంటారు. ఎవరికి దేనిమీద ఇష్టమో వాళ్లకు అదే మంచి సారముగా కనిపిస్తుంటుంది అని చెప్తున్నాము. దానిని కలిపి ఏం చెప్పుచున్నాము 'సంసారము' అంటున్నాము. సంసారము అంటే మంచి సారము అంటున్నాము. సంసారము అంటే సారము కలిగినటువంటిది. ఈ ప్రజలకంతా మంచి సారము కలిగినటువంటిది ఏదైనా ఉంది అంటే ఈ ప్రపంచ విషయాలే మంచి సారముగా ఉన్నాయి. మీకు ఈ ప్రపంచ విషయాలు ఎట్లున్నాయి అంటే హాలాహలము అంటే విషముతో సమానంగా ఉన్నాయి మీకు. అంటే ఈ ప్రపంచ విషయాల్లో మీకు ఇష్టము కలిగి ఉన్నా, ఇదే సంసారముగా మీకు ఉన్నా (సంసారము అంటే భార్య పిల్లలు అనుకోవద్దండి. ఏదైతే రుచిస్తావుందో అదంతా సారమే, అదంతా సంసారమే. దానిని భార్యా పిల్లలు అని అనుకోవడము పొరపాటు.) మీరు సహజముగా ఏమనుకుంటారు? సంసారము అంటే పెళ్ళి చేసుకొని భార్య పిల్లలతో ఉండడమే సంసారము అనుకుంటున్నారు. కాదు అట్లా కాదు ఏ విషయము మీద మీరు ఆసక్తి కలిగియుంటారో అంతా సంసారమే. పెళ్ళికానటువంటి వాడైనా కానీ విషయాల మీద ఆసక్తి ఉంటే సంసారములో ఉన్నట్టే అంటే వానికి అది సంసారము.

ఈ లెక్కప్రకారము పోతే ఒక్కొక్కరికి ఒక్కో సంసారము ఉంది. అది మంచి సంసారము కావచ్చు, చెడు సంసారము కావచ్చు. అంటే దాని పేరే మంచి సారము. ఆ మంచిసారము ఏదైతే ఉందో దానిని ఆశ్రయిస్తుంటాడు మనిషి. కానీ మంచిసారము ఏది అని మనము లెక్కేస్తే మనుషుల దృష్టిలో ఉండేది అంతా మంచి సారముగానే కనిపించినా కానీ, అది మంచి సారముగా ఉండదు. ఎందుకు అంటే అది విషము. విషము ఏమి చేస్తుంది? బాధిస్తుంది. నీకు రుచిగా కనిపించినా కానీ అది నిన్ను తర్వాత బాధిస్తుంది. అటువంటి బాధలు నువ్వుపడకుండా ఉండాలంటే ఏమి చేయాలి? అంటే ఆ విషానికి విరుగుడైనటువంటి మందును మనము కనుక్కోవాలి. ఏది విషంగా ఉంది మనకు? ఇప్పుడు నువ్వు ఏదైతే మంచిది అనుకుంటున్నావో, నువ్వు దేనికైతే ప్రాకులాడు తున్నావో, అదే నీకు విషంగా పరిణమిస్తావుంది. నిన్ను ముంచేస్తుంది. నిన్ను జీవితము అనేటటువంటి జన్మలలో తీసుకుపోయి జన్మ జన్మకు తీసుకొనిపోయి, ఈ కష్ట సుఖాల్లో నిన్ను అంటి పెట్టుకొని ఉండేటట్టు చేసి, దేవున్ని తెలియకుండా చేసి, ఆ విషయాలలో నిన్ను బాధపడేటట్టు ఈ సంసారము అనేది చేస్తూ ఉంది. అందువలన పెద్దలు ఏమి చెప్పారంటే ఇంతకుముందు మనము ఒక గురు శ్లోకము చెప్పుకున్నాము కదా! ఆ గురు శ్లోకములో "సంసార హాలాహల మోహ శాంతయే". సంసారము అనేటటువంటిది పెద్ద మోహంగా ఉంది, మనకందరికీ ఇది పెద్ద హాలాహల విషంగా ఉంది. దీనినుండి మనము రక్షించబడాలని కోరుతున్నాము. **'జనస్యయే జాంగలి కాయమానే సంసార హాలాహల మోహ శాంతయే'** ఈ హాలాహలము అనేటటువంటి విషానికి ఎవరైతే వైద్యుడుగా ఉన్నాడో అతనిని మేము కోరుకుంటున్నాము. ఏ గురువైతే ఉన్నాడో ఈ సంసారము అనేటటువంటి విషానికి విరుగుడుగా

వైద్యుడుగా ఎవడైతే ఉన్నాడో అతడు, అతను ఆత్మను దర్శించినటువంటివాడై ఆత్మనే బోధగా చెప్పేటటువంటివాడై ఉంటాడు.

అటువంటి వానిని మీరు ఆశ్రయిస్తే అతను మీకు వైద్యుడౌతాడు మీ హాలాహలానికి విరుగుడు దొరుకుతుంది. విషమునకు మందు దొరుకుతుంది. సందర్శిత ఆత్మ సుఖావబోధే, అంటే ఆత్మను దర్శించినటు వంటివాడు, ఆత్మను నీకు సులభముగా అర్థమయ్యేటట్టు చెప్పేటటువంటి వాడు ఎవడైతే ఉన్నాడో, అతడు నీకు వైద్యుడుగా ఉంటాడు. అటువంటి వానిని **'చరణారవిందే సందర్శిత'** అంటే వాని పాదపద్మములకు నేను నమస్కరిస్తూ ఏమి కోరుకుంటున్నాను? నా యొక్క సంసారమును అంటే ఏది సారమో నాకు తెలియకుండా ఈ ప్రపంచ విషయాలలో పడిపోయినాను. ఆ ప్రపంచ విషయాల నుండి బయటికి వేయమని నిన్ను కోరుతున్నాను అని ఒకాయన ఈ శ్లోకము చెప్పినాడట. మనము సంస్కృతములో చెప్పిన ఈ శ్లోకములో అర్థము అది. ఇప్పుడు మనము ఇక్కడికి ఎందుకు వచ్చాము? ప్రతి పౌర్ణమికి ఇక్కడికి వస్తున్నాము అంటే ఎందుకు వస్తున్నాము? అంటే మనము కూడా ఇటువంటి విషము అనే వలయములో చిక్కుకున్నాము. దానిలో నుండి బయటపడాలి అన్న ఉద్దేశ్యముతో ఇక్కడికి వస్తున్నాము. సరే ఇక్కడ బయటపడాలి అన్న ఉద్దేశ్యముతో వస్తున్నాము, వచ్చిన తర్వాత ఏమి చేస్తున్నాము? ఇక్కడ చెప్పేటటువంటి జ్ఞాన విషయాలు తెలుసుకునే దానికి ప్రయత్నము చేస్తున్నాము. సరే అంతవరకు బాగానే ఉంది కానీ, చెప్పే విషయాలు అవగాహనకు వస్తున్నాయా అని అంటే, మేము వినగలుగు తున్నాము, అర్థము చేసుకోగలుగుతున్నాము అని అనుకుంటున్నారు.

కానీ మాకెట్లా కనిపిస్తున్నాయంటే కొంతమందికి అర్థమవు తున్నాయి, కొంతమందికి సగమే అర్థము అవుతున్నాయి. కొంతమందికి పావు భాగమే అర్థం అవుతున్నాయి. మరి కొంతమందికి సగము కూడా ఎక్కలేదు. కొంతమందికి అంటీ అంటక ఈ జ్ఞానము తెలుస్తావుంది. పూర్తి అందుకోలేకున్నారు. పూర్తి అందుకున్నట్టి వాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళు దీని యొక్క సుఖాన్ని అంటే దీనియొక్క సంతోషాన్ని, ఆనందాన్ని అనుభవిస్తున్నారు కానీ అర్థముకాని వాళ్ళు దీనిలో ఉండేటటువంటి రుచిని తెలుసుకో లేకున్నారు. మీకు ప్రతి మాసములోనూ ఇక్కడ చెప్పేటటువంటి విషయాలు అన్నీ క్రొత్త క్రొత్త విషయాలే చెప్పుచున్నాము. ఆ విషయాలు అన్నీ మీకు మంచి అవగాహనకు వస్తున్నాయని మేము అనుకుంటున్నాము. కానీ కొంతమందికి అవగాహన కాలేదేమో అనిపిస్తా ఉంది. అంటే వాళ్ల ప్రవర్తన, వాళ్ల మాటలు పద్ధతులు చూస్తే అట్లా అనిపిస్తావుంది. కానీ అట్లాకాకుండా మీరందరూ బాగా అర్థము చేసుకోవాలని కోరుకుంటూ మళ్లీ ఇప్పుడు ఈ సమావేశంలో మీకు ఒక క్రొత్త విషయాన్ని చెప్పదలచు కున్నాము. ఇప్పుడు ఈ మాసములో మీకు ఈ దినము మీ చేతికి ఒక క్రొత్త గ్రంథము అందింది. అది **'ద్రావిడ బ్రాహ్మణ'** అనే పేరుతో వచ్చింది మీకు. ఆ ద్రావిడ బ్రాహ్మణ అనేటటువంటి పేరుతో వచ్చిన గ్రంథము, మేము వ్రాసినటువంటి 50వ గ్రంథము. అంటే మా ద్వారా 50 గ్రంథాలు ఇక్కడినుండి వెలువవడినాయి. మేము ఇంతకుముందు కూడా చెప్పాము, ఒక గ్రంథము బయటికి వస్తే నాకు ఒక పుత్రుడు పుట్టినట్టు సమానము అని చెప్పాము. నాకిప్పుడు 55 మంది కుమారులు. 55 మంది కొడుకులు అంటే చాలామంది ఉన్నారు. మీకెవరికీ లేరు అంతమంది. నాకుండేది 55 మంది మొత్తం అంటే 5 మంది బిందుపుత్రులు, 50 మంది

జ్ఞానపుత్రులు. జ్ఞానము చేత పుట్టినట్టివారు 50 మంది, శరీరము చేత పుట్టినట్టి వారు, వీర్యబిందువు చేత పుట్టినట్టి వారు 5 మంది. వీళ్ళని బిందుపుత్రులు అంటారు, గ్రంథాలను జ్ఞానపుత్రులు అంటారు. అంతే తేడా. నాకు 5 మంది కొడుకులున్నారు వాస్తవమే. 5 మంది కొడుకులు కాక మళ్ళీ 50 మంది జ్ఞానపుత్రులు పుట్టారు అంటే ఈ 50 గ్రంథములు నాకు కుమారులతో సమానమే. కానీ ప్రపంచములో మాకు బిందుపుత్రులైనట్టి వారు, పేరు ప్రఖ్యాతులు సంపాదించి తెస్తారో లేదో కానీ, వీళ్ళు పుట్టీ పుట్టకనే మంచి పేరు తెచ్చుకున్నారు. ఈ గ్రంథాల రూపములో ఉండేటటువంటి వాళ్ళు చాలా గొప్పవాళ్ళు. ఆ రకంగానే మాకు అది సంతోషము ఇస్తావుంది. ఎందుకంటే ఏ తండ్రికైనా కానీ కుమారుడు బయట పొగడబడితే సంతోషమే కదా! ఆ రకంగానే ఇప్పుడు మేము వ్రాసే గ్రంథాలు ఉన్నాయి.

ఈ రకంగా 50 గ్రంథాలు ఇప్పటికి తయారైనవి. ఇంకా కూడా 50కి పైగా తయారు కాబోయేవి ఉన్నాయి. ఇప్పుడు యుద్ధరంగములో పనిచేసే వాళ్ళకు అర్ధరథుడు, రథుడు, మహారథుడు అని వాళ్ళు డిగ్రీలు ఇచ్చి ఉంటారన్నమాట. మామూలుగా సైన్యములో ఒక్కొక్కరికి ఒక్కొకటి డిగ్రీలుంటాయి. వీడు కమాండర్, వీడు కెప్టన్, మేజర్ అని పేర్లు పెట్టి ఉంటారన్నమాట. ఆ రకంగా ఒక్కొక్కరికి ఒక్కో హోదా కల్పించి ఉంటారు. ఆ రకంగానే పూర్వము ఏమున్నాయి అంటే యుద్ధములో బాగా యుద్ధము చేసేవాళ్ళను రథుడు అనేవాళ్ళు, అంతకంటే తక్కువుంటే అర్ధరథుడు అంటాము. మహారథులు, అతిరథులు ఈ రకంగా పేర్లుంటాయి. అలాగే మా గ్రంథాలలో కూడా రథులు, అర్ధరథులు, మహారథులు, అతిరథులు అని ఒక్కొక్క గ్రంథము ఒక్కో రకంగా కనిపిస్తావుంది. మా లెక్కలో అన్నీ

పూర్తి అతిరథులే. కానీ కనిపించే వాళ్ళకు అంటే కొంత ఎక్కువ తక్కువ ఉండవచ్చు. ఏ రకంగానైనా కానీ మంచి జ్ఞానాన్ని అవి బయటికి అందించాయని మేము అనుకుంటున్నాము. ప్రతి గ్రంథములోనూ సరికొత్త జ్ఞానము మీకు అందివ్వబడుతావుంది. ఇప్పుడు ఈ గ్రంథములో మీకు చెప్పుకుంటే 'తెలుగు భాష'ను కొంత విశిష్టంగా చెప్పడమైనది. అంటే ఇది చరిత్ర, దానిలో జ్ఞానము చాలా ఉంది. అంటే మీకు బాగా ఎత్తి చూపడము కోసము నేను ఏమి చెప్పుచున్నాను అంటే, ఈ తెలుగు భాష అన్ని భాషలలో చాలా ప్రాముఖ్యముగా కనిపించింది. మనము మాట్లాడే తెలుగు భాష, మొత్తము దేశ వ్యాప్తముగా ఉండేది అన్నది గొప్ప విషయము. ఇది ఇప్పుడు ఎట్లుందంటే, ఎంతో విస్తీర్ణమైన దేశములో కుంచించబడి కొద్ది విస్తీర్ణము వరకూ వచ్చేసింది. ఆ కొద్ది ప్రాంతములోనే ఇప్పుడు తెలుగు భాష ఉంది. పూర్వము అట్లా లేదన్నమాట. మేము చిన్నగా ఉన్నప్పుడు అటు తమిళనాడులో, ఇటు కర్ణాటకలో తెలుగు ఉండేది. హంపి తెలుగు భాషకు కేంద్రముగా ఉండేది. ఇప్పుడు అది కర్ణాటక. అప్పుడు శ్రీకృష్ణదేవరాయల కాలములోనే 1500 సంవత్సరాల క్రితమే అష్టదిగ్గజాలని తెలుగుపండితులను పెట్టుకొని వాళ్ళ చేత తెలుగులో కవిత్వము చెప్పించినారు. అంత పెద్దగా ఉండేది ఇప్పుడు అటువంటి చోట కూడా ఈ రోజు తెలుగు లేకుండా పోయి కన్నడ భాష వచ్చేసింది. ఈ రకంగా అది కుంచించుకుంటూ పోతూ చివరకు తెలుగు భాష తక్కువ విస్తీర్ణములో నిలిచిపోయింది. ఇది ఈ రోజు కలియుగము పరిస్థితి. ఒకానొక రోజు కృతయుగములో తెలుగు భాష మొత్తము దేశమంతా ఉండేది. తెలుగు భాష తప్ప వేరే భాష లేదు. తర్వాత వచ్చింది మాట్లాడే సంస్కృతము భాష. సంస్కృతము నేర్చినట్టి వాళ్ళు ఇక్కడికి వచ్చి, ఈ తెలుగును అణిచివేయాలనే ప్రయత్నము చేసి,

వాళ్ళు ఎంతోకాలము ఎన్నో రకాలుగా తెలుగును అణిచివేయాలని ప్రయత్నము చేసి అణిచివేస్తూ వచ్చారు. సంస్కృతాన్ని బయటికి తేవాలని ప్రయత్నము చేశారు. ఆ సంస్కృతము బయటికి రాలేకపోయింది కారణం అది లిపి లేని భాష అయినదానివలన రాలేకపోయింది. దానికోసము ఒక లిపిని కనిపెట్టారు, దేవనాగర లిపి అని దానికొక పేరు పెట్టారు. దానినే హిందీ భాష అంటాము. అది లిపి ఉండేదానివలన దేశమంతా వ్యాపించింది. తర్వాత ఇది అట్లే నిలిచి పోయింది. సంస్కృతము కూడా పెద్దగా ప్రాబల్యము లేకుండా పోయింది. దేశమంతా వ్యాపించలేక పోయింది. కానీ తెలుగు భాష కుంచించుకొని పోయింది. కానీ పూర్వము ఆ రకంగా ఉండే భాష ఈ రకంగా మారింది. అంటే మనము తెలుగు వాళ్ళమే కాబట్టి మనము గర్వించదగేలా ఉండేటట్టుగా అంటే మన భాష చాలా గొప్పది అని గొప్పగా చెప్పుకునేలాగా పూర్వము తెలియకుండా ఉన్నటువంటి కాలములో ఈ భాష చాలా గొప్పగా ఉండేది అని చెప్పాము.

మీరు చెప్పుచున్నారు మేము వింటున్నాము. మీరు ఏమి చెప్పినా మేము వినాల్సిన పరిస్థితి వచ్చింది. క్రింద కూర్చొన్నాము కాబట్టి అది నిజమో అబద్ధమో మీమాట ఎంత సత్యము? అను ప్రశ్న మీకు రావచ్చు. అటువంటి అనుమానము లేకుండా మేము చెప్పేది సత్యము అనే రకంగా తెలుగు భాష భారతదేశములో మొట్టమొదటి భాష అనేదానికి ఒక తార్కాణముగా ఒక ఉదాహరణగా, ఒక సాక్ష్యంగా కొన్ని గుర్తులు మనకు మిగిలిపోయినాయి. ఎలాగా అంటే, ఎప్పుడైతే మనము ఈ తెలుగు భాషను కనిపెట్టినామో గణితము కూడా తెలుగు భాషలో వచ్చింది అంకెలు కూడా వచ్చాయి. తెలుగు భాషలో అక్షరాలు ఏ విధముగా ఉన్నాయో గుణించే అంకెలు సంఖ్యలు కూడా వచ్చాయి మనకు. అంటే 1, 2, 3, 4, 5, 6,

7, 8, 9, 0 అని మొత్తము సున్నా నుంచి మొదలు పెట్టుకొని తొమ్మిది వరకు మనకు పూర్వము ఉండేవి. ఈ తొమ్మిది సంఖ్యలు మొట్టమొదటి తెలుగు సంఖ్యలు. మొట్టమొదట తెలుగు భాష వ్రాసుకున్నప్పుడే ఆ తెలుగు భాషను అనుసరించే ఈ మొత్తము సున్నా దగ్గరి నుంచి తొమ్మిది వరకు మొత్తము పది సంఖ్యలను గుర్తించుకున్నాము. తెలుగు భాషకు అనుకూలంగా పెట్టుకున్నాము. బాగా జ్ఞప్తికి పెట్టుకోండి మీకు ఇది పెద్ద సాక్ష్యము! తెలుగు భాషకు అనుకూలంగా తెలుగు భాషతో సంబంధము ఉండే రకంగా ఈ గణిత శాస్త్రములో ఉండే అంకెలను మనము మొట్టమొదట గుర్తించుకున్నాము. తెలుగు భాష మొట్టమొదట ఉండే భాష భారతదేశములో ఇదొక్కటే. ఇది ఉన్నప్పుడే ఈ తెలుగు అంకెలు తయారైనాయి. ఈ తెలుగు అంకెలు తయారైనప్పుడు, ఎట్లయినాయి అంటే దేవుని జ్ఞానానికి దగ్గరగా తెలుగు భాష ఉంది అని మొట్ట మొదటనే చెప్పాను నేను. దేవుని జ్ఞానానికి అత్యంత దగ్గరగా ఉండేటటువంటి భాష ఏది? అని అంటే ప్రపంచములో ఉండే భాషలలోకెల్లా గొప్పది ఏది? అని అంటే వ్రాయదగిన భాషలు ఈ రోజు 1400 భాషలున్నాయి. 1400 భాషలు ఈ రోజు భూమిమీద ఉన్నాయి. 1400 భాషలలోనూ దేవునికి అతి సమీపముగా, అతి దగ్గరగా ఉన్న భాష? ఒకే ఒక తెలుగు భాష! మనము ఈ రోజు ఆ భాషలో, ఆ ప్రాంతములో ఉండే భాష మాట్లాడుతున్నాము, అంటే ఒక రకంగా చాలా పుణ్యము చేసినటువంటి వాళ్ళము. మళ్ళీ ఆ తెలుగు భాష జ్ఞానానికి దగ్గరగా ఉంది అనే సాక్ష్యముగా ఏమి చేసినారంటే ఈ ఆత్మ, జీవాత్మ, పరమాత్మ మూడు ఆత్మల జ్ఞానము పూర్వము ఉండింది.

పూర్వము తెలుగు భాషనే బయటికి తెలిసింది. అది దేవుడు చెప్పిన భాష దేవుడు చెప్పిన జ్ఞానమే సూర్యుని ద్వారా భూమిమీదికి వచ్చింది. ఈ

భూమిమీదికి వచ్చినటువంటి జ్ఞానము మనకు అంతటా ప్రాకింది. ఆ జ్ఞానమే తెలుగు భాషగా రూపొందింది. ఆ తెలుగు భాషను రూపొందించిన జ్ఞానములోనే 'ఎ' అనే అక్షరము ఆత్మకు గుర్తుగా ఉంది అని చెప్పినాము. ఇప్పుడు ఈ క్రొత్త గ్రంథము ఉంది కదా! **'ద్రావిడ బ్రాహ్మణ'** అనే గ్రంథములో మనము 'ఎ' అనే అక్షరాన్ని గుర్తించి చూస్తే 'ఎ'కి పైన ఒక సున్నా ఉంటుంది కదా! పైన గుడి పై నుండే సున్నాను పరమాత్మ గుర్తుగా, క్రిందుండే సున్నాను జీవాత్మగా పెట్టి మధ్యలో కనెక్షన్‌గా ఆత్మను పెట్టారు. దానిని 'ఎ' అన్నారు.

ఈ రకంగా మన శరీములో ఇట్లే ఉంది. ఇటు జీవాత్మతోనూ, అటు పరమాత్మతోనూ సంబంధము పడి ఉండేది ఒకే ఒక ఆత్మ. అది మధ్యవర్తిగా ఉండేటి ఆత్మ. అది జీవాత్మగా నటించగలదు. పరమాత్మగా నటించగలదు. మనకు అది కనిపించేది ఒకటే, ఉండేది ఒకటే ఆత్మ, దానినే మనము రెండిటితో సంబంధము ఉంది అని అర్థము వచ్చేటట్టుగా వ్రాయను కూడా వ్రాసుకున్నాము. అది 'ఎ' ఆకారము. 'ఎ' ఆకారము ఉండే దానిని మనము ఏమి చేసినాము అంటే మధ్యలో పెట్టి ఇటు జీవాత్మకు ఒక అక్షరము పెట్టి, ఇటు పరమాత్మకు ఒక అక్షరము పెట్టి "ద్రావిడ" అని మూడు ఆత్మల జ్ఞానాన్ని మనము చెప్పుకున్నాము. మూడాత్మల జ్ఞానము ఏదైతే ఉందో అది ద్రావిడ జ్ఞానము అని గుర్తుగా పేరు పెట్టుకొని చెప్పుకున్నాము. ఇది పూర్వము జరిగింది. ఈ ద్రావిడ జ్ఞానము అని పెట్టుకోవడములో ఈ తెలుగు భాష దేవునికి దగ్గరగా ఉంది అని చెప్పుకునే దానికోసమే ఆ రకంగా పెట్టాము. సరే, తెలుగు భాష దేవునికి దగ్గరగా ఉంది అని చెప్పుకున్నాము కదా! దానికి ఇంకొక సాక్ష్యము కూడా ఉంది. ఆ రోజే తెలుగులో సంఖ్యలు తయారైనాయి. అంకెలు కూడా తయారైనాయి.

ఈ అంకెలు తయారు కావడములో ద్రావిడ జ్ఞానమంతా మూడు ఆత్మల జ్ఞానమే కదా! అని తెలియుచున్నది. ద్రావిడ జ్ఞానమంతా మూడు ఆత్మల జ్ఞానమే.

ప్రపంచములో మొట్టమొదట భూమిమీదికి వచ్చినటువంటిది మూడు ఆత్మల జ్ఞానమే. జ్ఞానము అంటే నువ్వు జీవాత్మ అని తెలుసుకోవడమే జ్ఞానము. నువ్వు ఒక ఆత్మవైతే నీ వెనుక ఏది ఉంది, నీ ముందు ఏది ఉంది అని తెలుసుకోవడమే పూర్తి జ్ఞానము. దానిని ఆత్మజ్ఞానము అంటాము. మనము మనుషులము, మనిషిగా మనంతకు మనము కదలలేము మెదల లేము మనల్ని కదిలించే ఒక ఆత్మ ఉంది. మన శరీరములో ఎంతో పెద్ద విధానముంది. దాన్నంతా నడిపేటటువంటి ఆత్మవుంది. అదంతా ఆత్మ వల్లే జరుగుతుందనేటువంటి ఉద్దేశ్యాన్ని తెలియజేస్తూ ఈ మూడు ఆత్మల జ్ఞానము ప్రపంచము మొట్టమొదటిలోనే మనకు బయటికి తెలియబడింది. జ్ఞానము మొట్టమొదట ఆకాశము ద్వారా వచ్చింది. అదే సూర్యుని ద్వారా భూమి మీదికి వచ్చింది. కొంతకాలానికి దానినే మరిచి పోయినాము, కాబట్టి మళ్ళీ కృష్ణుడు దానినే చెప్పాడు అని చెప్పుకున్నాము. ఈ రోజు మనము ఇప్పుడు చెప్పుకునేది కూడా అదే జ్ఞానమే. ఇది ఎక్కడా లేదు కానీ తిరిగి ఇక్కడ మాత్రము చెప్పుచున్నాము. మొట్టమొదట వచ్చిన జ్ఞానము, ఆత్మల జ్ఞానము. మూడు ఆత్మల జ్ఞానము దానినే త్రైత సిద్ధాంత జ్ఞానము అంటున్నాము. భగవద్గీతలో కూడా అదే ముఖ్యముగా చెప్పబడిన జ్ఞానము. సరే! ఇటువంటి జ్ఞానము అంటే మీ అందరికీ సంబంధించిన జ్ఞానము, ఇది తెలుగు భాషకు దగ్గరగా ఉంది అని చెప్పేదానికి మనము ఒక గుర్తు తెలుగు భాషలో 'వి' అనేటి అక్షరాన్ని వ్రాసుకున్నాము. తెలుగులో ద్రావిడ అని పేరు పెట్టుకున్నాము. తర్వాత ఈ తెలుగు భాషను దేవునికి

దగ్గరగా ఉన్న జ్ఞానము అని గుర్తింపుగా పెట్టుకున్నాము అని చెప్పుకున్నాము కదా! సరే ఇప్పుడు మళ్ళీ ఇంకా చూద్దాం. ఈ సంఖ్యా శాస్త్రము అప్పుడే తయారైంది కదా! సంఖ్యలు కూడా అప్పుడే తయారైనాయి అని చెప్పుకున్నాము మనము.

ఎప్పుడైతే ఈ తెలుగులో తయారైన సంఖ్యలు ఏవైతే ఉన్నాయో ఇవి తయారైన తర్వాతనే ప్రపంచములో మిగతా భాషలన్నీ ఏర్పడినాయి. ప్రపంచములో మిగతా భాషలన్నీ గణితశాస్త్రాన్ని నేర్చుకున్నాయి. నేర్చుకున్న తర్వాత వాళ్ళకు సంఖ్యలు కావాలి కదా! ఆ సంఖ్యలు ఏవైతే తెలుగులో ఉన్నాయో ఆ తెలుగు సంఖ్యల ఆధారము చేసుకొని వాళ్ళు తయారు చేసుకున్నారు. ఈ రోజుకు కూడా సాక్ష్యంగా నిలబడినాయి అవి. తెలుగు సంఖ్యల ప్రకారమే అవి ఉంటాయి. కాబట్టి మొట్టమొదటి భాష ఇది. దీని తర్వాత వచ్చిన భాషలు అవి, అని చెప్పుకునేదానికి పెద్ద నిదర్శనము మనకు కనిపిస్తా ఉంది. అంటే పెద్ద సాక్ష్యం కనిపిస్తావుంది. తెలుగు భాష తర్వాత తెలుగు భాష నుంచే మిగతా భాషలన్నీ తయారైనాయి. గణిత శాస్త్రములో సంఖ్యలు కూడా దీని నుండి తయారైనాయి. ఇది మొదటిది అని చెప్పే దానికి అది ఒక సాక్ష్యంగా నిలవడమే కాకుండా ఇది దేవునికి దగ్గరగా ఉంది. ఉన్నది అనేదానికి కూడా చాలా సాక్ష్యం ఉంది. అంటే మీరు గమనించి ఉండరు. ఎందుకంటే కొన్ని విషయాలలో వినేంత వరకు ధ్యాస రాదు.

ప్రపంచ పటములో చూస్తే మొత్తము అన్ని దేశాలు మరియు సముద్రము కనిపిస్తుంది. అన్ని దేశాల్ని గమనిస్తే మానవాకారములో ఉండే దేశము ఒకటి గలదు. అదే భారతదేశము! మిగతా దేశము ఏదీ

కూడా మానవాకారములో లేదు. ఈ రోజు చూసిన తర్వాత ఓ భారతదేశము మానవాకారములో ఉందే, మనకు తెలియదే? ఇంతకు ముందు చూచినాము, మనము గమనించలేదే అనుకుంటాము. కొంతమందికి తిరిగి చెప్పే వరకు కొన్ని విషయములు ధ్యాసకు రావు, ఆ రకంగానే ఇప్పుడు మనము చెప్పేంత వరకు తెలుగు భాషలో ఉండే ప్రావీణ్యత మనకు తెలియకుండా పోయింది. ప్రతి నిత్యము మనము చూస్తున్నాము కానీ 'వి' ని మనము గుర్తించగలిగామా? గుర్తించలేదు. ఈ రోజు గ్రంథములో చూస్తే చాలా గొప్ప సారాంశముగా అర్థమవుతూవుంది. తర్వాత ఇప్పుడు ఈ తెలుగు గణితములో ఉండే సంఖ్యలను గుర్తించుకుందాము, అంటే ఇప్పుడు మనము ఇంగ్లీషులో సంఖ్యలను వ్రాసుకుంటాము. మీరు వ్రాసినది ఆంగ్ల లిపిలో గలవు. 1, 2, 3, 4 అనునవి అవి తెలుగు భాషకు సంబంధించినవి కాదు. ఇప్పుడు మనము తెలుగు భాష లిపిని వ్రాసుకున్నా కానీ తెలుగు భాషను, గణితములో వేరే భాష సంఖ్యలు వ్రాసుకుంటాము. కానీ తెలుగు భాష సంఖ్యలు వ్రాయటము లేదు. చాలామందికి తెలుగు భాష సంఖ్యలు తెలియవు. అంటే మొట్టమొదట మనకుండే సంఖ్యలే దానిప్రకారము మిగతా భాష సంఖ్యలు పుట్టినాయి. మొదట వాటిని విడిచిపెట్టి పుట్టినవాటిని పట్టుకున్నాము మనము. పుట్టించిన వానిని విడిచిపెట్టి, పుట్టిన వాటిని పట్టుకున్నాము, చూడండి! మన పరిస్థితి ఎట్లుందో? అంటే తెలుగు లిపి ఎంత గొప్పదో తెలియకపోయి మిగతా వాటిని ఆధారము చేసుకున్నాము.

మనము ముఖ్యముగా ఇప్పుడు ఏమి చెప్పుకుంటున్నాము అంటే తెలుగు భాషలోని తెలుగు దేవుని జ్ఞానానికి దగ్గరగా ఉంది అని చెప్పుకోవడమే కాకుండా తెలుగు భాషలో గణిత శాస్త్ర సంఖ్యలు కూడా దగ్గరగా ఉన్నాయి అని చెప్పుకున్నాము కదా! అవి ఎట్లా దగ్గరగా ఉన్నాయి

అంటే దైవజ్ఞానము అంతా మూడు ఆత్మల మీద ఆధారపడింది కదా! మూడు ఆత్మలను గణిత శాస్త్రములో మనము ఒక గుర్తు చెప్పుకున్నాము, మూడు ఆత్మల గుర్తులు ఇలా చెప్పుకున్నాము. గణితములో 3, 6, 9 సంఖ్యలు. మీరు ఒకవేళ జ్ఞాపకము లేకున్నా బాగా జ్ఞాపకము తెచ్చుకోండి. 3, 6, 9 ఆ రోజు 5, 6 సంవత్సరాల ముందు చెప్పినాము అనుకుంటాను. కానీ ఆ రోజు చెప్పినేది ఈ రోజు లింక్ అవుతావుంది. 3, 6, 9 ఎందుకు చెప్పినారు? 3, 6, 9 ఏ శాస్త్రములో వ్రాసుంది? ఏ బుక్కులో వ్రాసుంది అంటే? బుక్కులో వ్రాస్తే మనుషులు వ్రాసుకోవాలి మనుషులు వ్రాసినది గొప్ప జ్ఞానము కాదు. దేవుడు చెప్పినది గొప్ప జ్ఞానము అవుతుంది. ఎప్పుడైతే క్షర, అక్షర, పురుషోత్తమ అనే భగవద్గీతలో చెప్పినాడో అది జ్ఞానము, అది శాస్త్రము. దేవుడు చెప్పిన తర్వాత శాస్త్రము అవుతుంది. ఆ శాస్త్రాన్ని ఆధారము చేసుకుంటారు మనుషులు. దేవుడు చెప్పింది శాస్త్రము అని గుర్తుంచుకొండి.

కాబట్టి ఇంతకుముందు మనము ఏమి చెప్పుకున్నాము, అంటే భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగములో 16, 17 శ్లోకాలలో క్షరాక్షర పురుషోత్తముడు అనేటువంటి మూడు ఆత్మలను మనము ఆధారము చేసుకొని, ఆ మూడు ఆత్మలను సంఖ్యగా ఒక గుర్తు పెట్టుకున్నాము. 3, 6, 9 లో '3' అనే దానిని జీవాత్మకు గుర్తుగా చెప్పుకున్నాము. '6' అనే దానిని ఆత్మకు గుర్తుగా చెప్పుకున్నాము. 9 అనే దానిని పరమాత్మకు గుర్తుగా చెప్పుకున్నాము. ఇది '3' అనేది ఇంగ్లీషులో వ్రాస్తే ఇట్లే కదా! ఉండేది. అది ఇంగ్లీష్‌లో వ్రాయకముందు అది అట్లే ఉంది చూసుకోండి. మొట్ట మొదట ఎక్కడినుండి వచ్చింది. తెలుగు నుంచే పుట్టిందనే దానికి దీనిని ఆధారము చేసుకొని, ఇంగ్లీషు అక్షరాలు తయారు చేసుకున్నారు అని

చెప్పేదానికి, ఇది ఇంగ్లీషులో వ్రాయకముందు, తెలుగులో పుట్టినప్పుడే 3 ఎట్లుందో ఈ రోజు ఇంగ్లీషులో అట్లే ఉంది. దీనిని ఆధారము చేసుకొని వ్రాసుకున్నారు. అట్లనే ప్రపంచములో ఎక్కడన్నా ఏ భాషలోనన్నా సున్నాను మాత్రము మార్చుకోలేకపోయారు వాళ్ళు. మనము సున్నాను ఏకాగ్రత అని చెప్పినాము.

ఏకాగ్రత అంటే ఒకటికంటే ఒకటిపైన ఉండేది అని అర్థము. సున్నా అంటే శూన్యము అని పెట్టేసినాము. ఆ సున్నాని కనిపెట్టినది ఎవరు? సున్నా అంటే శూన్యము, ఏమీ లేనిది అని రౌండ్‌గా గీసి పెట్టినది తెలుగు భాషకు దగ్గరగా ఉండేటటువంటి పదమే అది. శూన్యానికి సున్నాకి దగ్గర సంబంధముంది. శూన్యము నుండే సున్నా పుట్టింది. శూన్యం అనేది పూర్తి తెలుగు భాష, ఆ శూన్యము అనే దానిలో నుండి సున్నా పుట్టింది. ఈ సున్నాని గుండ్రంగా గీసుకున్నాము. ఏ భాషలో అంకెలు తయారు చేసుకున్నా సున్నా లేనిది తయారు చేసుకోలేదు వాళ్ళు. ఎట్లా పోయినా అక్కడికి పోయేసరికి సున్నా కావలసిందే వాళ్ళకు. కాబట్టి సున్నాని విడిచిపెట్టి ఏ భాష కూడా తయారు కాలేదు. కాబట్టి, ప్రతి భాష తెలుగు భాష నుంచే పుట్టినది. అన్నిటికంటే తెలుగు భాష ముందు ఉంది అని చెప్పుకోవచ్చు. ఇంకో విచిత్రమేమి అంటే మూడు, ఆరు, తొమ్మిది అను సంఖ్యలు జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను ఈ మూడు ఆత్మలకు గుర్తుగా ఉన్నాయి. ఇది మీకు ముందే తెలుసు ఈ 3,6,9 ఎలా ఉన్నాయి అంటే జ్ఞానములో మనము ఏ విధముగా చెప్పుకుంటున్నామో, జ్ఞానములో మనము ఏ స్థాయిలో చెప్పుకుంటున్నామో, అదే స్థాయిలో వ్రాయబడి ఉన్నాయి. అట్లకాకుండా మీకు బాగా అర్థంకావడానికి ఏమి చెప్పుతున్నామంటే ఇప్పుడు మీకొక బొమ్మ చూపిస్తాను చూడండి.

ఆరు బొమ్మ



దీనిని తెలుగులో ఆరు అంటారు. దీనిని ఇట్లా గీస్తే ఆరు అంటారు. దీనినే తలక్రిందులు చేస్తే తొమ్మిది అవుతుంది. అంటే దీనిని ఇట్లా క్రిందికి వెడల్పు గీచినాము కదా! మనము

తొమ్మిది బొమ్మ



ఇట్లా గీస్తే ఏమవుతుంది తొమ్మిది అవుతుంది. ఇది పరమాత్మ గుర్తు. ఆరు అయితే ఆత్మకు సంబంధించినటువంటిది. ఆత్మకు, పరమాత్మకు ఏమి తేడా ఉందంటే తిప్పించి మళ్ళించి ఉన్నాయి చూడండి. కొద్దిగా తేడా పెట్టినారు. ఆత్మకు పరమాత్మకు అంతే తేడా. ఇదే విధానమును అనుసరించి ఆరు (6) వ్రాసుకున్నారు, ఇంగ్లీషులో దానిని తిప్పుకొని (9) తొమ్మిది చేసుకున్నారు. మనము అనుసరించిన పద్ధతే వాళ్ళు

అనుసరించారు. అంటే దీనిని చూసి వాళ్ళు నేర్చుకున్నారు. ఒకే గుర్తులో క్రిందికి ఆరు, పైకి తొమ్మిది రెండు ఉన్నాయి కదా! ఇప్పుడు ఏమి చేశారంటే దీనికి ఈ ఆరు, తొమ్మిది కాకుండా మనకు మూడు గుర్తు కూడా ఒకటుంది. ఇది వచ్చి ఇట్లా కొమ్ము పైకి ఉంటే తొమ్మిది (9) క్రిందికి ఉంటే (6) ఆరు. ఇది ఆత్మ (6), ఇది పరమాత్మ (9) మూడు ఎట్లుంటుంది అంటే (3) అది కూడా అట్లే ఉంటుంది. ఏమంటే దానికి పొడవు కొమ్ము ఉండదు. ఇట్లా కట్ చేస్తే ఇది దేవుని గుర్తు కదా! అట్లా లేకుండా దానిని తిప్పి పెట్టాలి. చాలా సింపుల్‌గా ఉంటుంది. మీకు ఇప్పుడు మూడు సంఖ్యను వ్రాసి చూపిస్తాము చూడండి. అది అందరికీ తెలుసు.

మూడు బొమ్మ

3

ఇట్లుంటుంది మూడు. అంటే ఇప్పుడు ఈ కొమ్ము అటాచ్ అయినా కానీ కుడి ప్రక్కకు లేదు కాబట్టి ఇది మూడు (3) అవుతుంది. కొమ్ము క్రింది ప్రక్కన ఉండేది ఆరు (6) అవుతుంది. ఎడమ ప్రక్కకు పైన కొమ్ము ఉంటే ఏమవుతుంది తొమ్మిది (9) అవుతుంది. చూడండి ఇక్కడే రవ్వంతలోనే తేడా ఉంది. ఒకే సంఖ్య (ఆరు) గా, (తొమ్మిది) గా, ఉంది. తుడిచేసి తిప్పితే 3 అవుతుంది. అంటే ఇది దేవుని గుర్తు ఇది (తొమ్మిది) గుర్తు. తొమ్మిదిని తుడిచేసి ఇట్లా తిప్పితే 3 అవుతుంది. ఇప్పుడు మనము దీనిని

ఏమి అర్థము చేసుకోవాలంటే దేవునికి, జీవునికి దగ్గర సంబంధము ఉంది. జీవుడు దేవునిలోకి కలవాలని చెప్తాము. దేవుడు పని చేయడు. దేవునికి ఆకారము లేదు అని చెప్పుకున్నాము కదా! మనము. దేవునికి కొన్ని ధర్మాలు ఉన్నాయి. ఆ రకంగానే జీవాత్మ కూడా కనిపించడు, ఆత్మ తెలియబడుతుంది కానీ జీవుడు మాత్రము తెలియబడడు. లోపల ఎక్కడో ఉంటాడు. ఈయన కూడా బయట పని ఏమీ చేయడు. తన స్వంత పని ఉంది కానీ, దేవుని మాదిరి పని చేయడన్నమాట. అందువలన దేవునికి దగ్గరి దగ్గరి పోలికలు ఇట్లున్నాయి కాబట్టి తోక లేకుండా చేసి తిప్పి పెట్టినారన్నమాట. ఆ జ్ఞానము కూడా మీకు దగ్గరగా అర్థము కావాలి అను ఉద్దేశ్యములో పరమాత్మ తిప్పి, పొడవుగా తోక లేకుండా చేసి తిప్పి పెట్టినారు. అది మూడు (3) అయింది. ఇది జీవాత్మకు గుర్తయితే, ఇది ఆత్మకు (6) గుర్తయితే, ఇది (9) పరమాత్మకు గుర్తు. ఈ మూడు దైవజ్ఞానానికి దగ్గర సంబంధముగా ఉన్నాయా లేదా చెప్పండి. ఉన్నాయా? మనము దేవుని జ్ఞానాన్ని ఆత్మ రూపముగా ఎట్లా చెప్పుకున్నామో అట్లున్నాయి. ఆత్మలు ఏఏ స్వభావములు కలిగి ఉన్నాయో అంటే ఆయా స్వభావములు కలిగియున్నాయి.

ఇప్పుడు ఈ ఆరు (6) అనేది ఉంది చూడండి. ఈ గుర్తును మనము ఆత్మ అని చెప్పుచున్నాము. మరి ఈ ఆత్మను గురించి చెప్పుకునేటప్పుడు ఈ ఆత్మ అనేది అన్నిటిగా నటిస్తుంది. జీవునిగా నటిస్తుంది. దేవునిగా నటిస్తుంది అని చెప్పుకున్నాము. అది ఆత్మగా బయటికి ఎక్కడా కనపడదు. సరే ఇప్పుడు ఈ ఆత్మను (6) ఏమి చేసినారంటే తిరిగి తిప్పేస్తే ఏమవుతుంది ఇక్కడ (9) పరమాత్మ కనిపిస్తూ ఉంది. తోక కట్ చేసి తిప్పి చూస్తే ఏమవుతుంది? జీవాత్మగా (3) కనిపిస్తాది. ఒకే

ఆత్మే జీవాత్మగా నటిస్తుంది పరమాత్మగా కూడా నటిస్తాదన్నమాట. మళ్ళీ ఈ జీవాత్మ దేవునిలోనికి ఐక్యము కావాలి కాబట్టి రెండూ ఇట్లే ఉంటాయి. తోక రవ్వంత పొడవు అయితే దేవునిలోనికి ఐక్యమవుతుంది. కొన పొడవు అయితే అది తొమ్మిదైపోతుంది. దేవుడై పోతుంది. ఈ రకంగా నువ్వు జీవునివే! నువ్వు జ్ఞానాన్ని ఇంకా కొంత పెంచుకుంటే దేవునివవుతావు. దేవునితో సమానమవుతావు. దేవునిలోకి ఐక్యము అవుతావు. నీకు దానికి ఏమీ తేడా ఉండదు. కొమ్ము పొడవు చేసి పెడితే తొమ్మిది మాదిరే ఉంటావు. తొమ్మిదే అయిపోతావు. తొమ్మిదే అనాలి వాడిని ఇంక ఏమీ అనకూడదు. కాబట్టి నువ్వు జ్ఞానాన్ని పెంచుకో. పెంచుకుంటే నువ్వు దేవునివి అయిపోతావు.

ఏమాత్రము తేడా లేకుండా ఆత్మ స్వరూపము ఎట్లుందో గమనించండి. ఇట్లా తిప్పితే ఆత్మ, అట్లా తిప్పితే జీవాత్మ, క్రిందికి తిప్పితే పరమాత్మ. దానినే పొట్టిగా చేస్తే జీవాత్మ, పొడుగు చేస్తే పరమాత్మ. ఈ రకంగా ఈ తెలుగులో మూడు సంఖ్యలను మనము దేవుని గుర్తుగా ఈ పెట్టడము జరిగింది. మరి ఇంగ్లీషులో కూడా అవే ఉన్నాయి కదా! 9 ఇట్లా తిప్పితే 6 అవుతుంది. ఏమంటే 3 ఒకటి ప్రత్యేకంగా ఉంటుంది. ఇది ఎట్లుందో అట్లే ఉంటుంది అది. ఈ రకంగా మీకు దేవునికి దగ్గరగా ఉండేటటువంటిది అని మీకు అర్థమయ్యే రకంగా పెద్దలు ఏమి చేసారంటే తెలుగు భాష అంకెలు కనిపెట్టినప్పుడే, ఈ రకంగా మూడు గుర్తులు పెట్టి చూపించారన్నమాట. ఇది తెలుగు భాషలో ఉండే ప్రత్యేకత. ఈ మూడు గుర్తులుగా పెట్టి చూపించినట్టి ఈ సంఖ్యలను మనము ఈ రోజు సృష్ఠికర్త గుర్తుగా చెప్పుకుంటున్నాము. 3 6 9 యొక్క జ్ఞానము తెలియనివాళ్ళు, దేవునికి గుర్తు ఉంటుందా? సృష్ఠికర్తకు గుర్తు ఉంటుందా? అని

అనుకుంటారు. అంటే దేవుని దగ్గరగా ఉంటే భాషలోని సంఖ్యలను తీసి జీవాత్మ, ఆత్మ, పరమాత్మగా గుర్తించుకున్నాము. జీవాత్మ, ఆత్మ, పరమాత్మగా చీలి ఉండేటటువంటిదంతా కలిపితే దేవుడు. ఆ దేవున్ని విభజించి చూస్తే మూడు రకాలుగా ఉంటాడు. కలుపుకొని చూస్తే ఒకటే రకంగా ఉంటాడు. కాబట్టి మీరు 3 6 9 అని పవిత్రముగా చూసుకోండి. దానిని ఆత్మల స్వరూపముగా చూసుకోండి అని చెప్పి మనము వ్రాసుకున్నాము. అది భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగములో ఈ శ్లోకానికి సంబంధించిన అక్షరాలను కూడా మనము చెప్పుకున్నాము.

ఈ రకంగా తెలుగు భాషలో మనకు విశిష్టమైనట్టి సంఖ్యలను చూపించడమే కాకుండా, అక్షరాలలో కూడా విశిష్టమైనట్టి అక్షరాలను చూపించడము జరిగింది. అంటే తెలుగు భాషలో ఇంత గొప్పతనము ఉంది. తెలుగు భాషలో తప్ప మిగతా భాషలలో జ్ఞానము పూర్తి బయటికి రాదు. తెలుగు భాషలో ఆధ్యాత్మిక భావము సంపూర్ణముగా బయటికి వస్తుంది. ఒకవేళ ఎంత చెప్పుకోవాలన్నా కానీ పూర్తి భావము వేరే భాషలో బయటపడదు. పూర్తి భావము బయటపడేది ఒక్క తెలుగు భాషలోనే కాబట్టి మీరు ఈ భాషలో ఉన్నారు. ఈ భాషలో వినగలుగుతున్నాము కాబట్టి మనము గొప్ప అదృష్టం చేసినటువంటి వాళ్ళము. ఈ భాషలో మనకు జ్ఞానము అర్థమవుతుంది కాబట్టి, ఈ భాషలో అర్థమైనట్లు వేరే భాషలో ఎక్కడా అర్థము కాదు. కాబట్టి ఈ భాషలో ఉన్నందుకు మనము ఈ పరమాత్మను చేరుకుండేదానికి ప్రయత్నము చేయాలి. మనము జీవాత్మలము జీవాత్మలుగా ఉన్నట్టి (3) గా ఉన్నాము. క్రింది కొమ్మును రవ్వంత పొడవుగా చేసుకొని తిప్పి పెట్టుకుంటే దేవుళ్ళము అవుతాము. అంటే జ్ఞానాన్ని పెంచుకుంటే ఏమవుతుంది? అంటే నువ్వు దేవునిగా

మారేదానికి అవకాశము ఉంది. నువ్వు జ్ఞానాన్ని పెంచుకోవడము వలన ఈ ఆత్మతో కలువడము అవుతుంది. ఆత్మతో కలిస్తే యోగము అని పేరు వస్తుంది. యోగము అంటే కలయిక అని, వియోగము అంటే విడిపోవడము అని అర్థం. యోగము ఆ యోగము అయిన తర్వాత, కర్మలు లేకుండా పోయిన తర్వాత, అనుభవించేది లేకుండా పోతుంది, కాబట్టి అప్పుడు నువ్వు దేవునిగా మారిపోవచ్చు. దేవునిలోనికి ఐక్యము కావచ్చు అని పెద్దలు చెప్పారు. జీవితము అంతవరకు సాగుతుందన్న మాట, అంటే జ్ఞానమనేది మనము తెలుసుకుంటే ఈ కర్మలు అనే జన్మల నుంచి బయటపడి దేవునిలోనికి ఐక్యము కావడానికి అవకాశము ఉంటుంది. అటువంటి అవకాశము కోసము ఏమి చేయాలంటే ప్రతి ఒక్కరు ఉద్యోగము చేయాలి. ఉద్యోగము లేనివాళ్ళకు మోక్షము రాదు అని పెద్దలు చెప్పారు. అంటే ఉద్యోగము అంటే కొంతమందికి ఉంది, మాకు ఎక్కడుంది అని మీరు అడగవచ్చు. ఉద్యోగము చేసినవాళ్ళకు మోక్షము వస్తుందంట, ఉద్యోగము చేయనివాళ్ళకి మోక్షము రాదంట. ఇదెట్లా స్వామి అని అడగవచ్చు.

ఒకవేళ అక్కడ వెతికి, ఇక్కడ వెతికి, ఎన్నో కష్టాలు పడి మొన్న ఉద్యోగము సంపాదించుకున్నాము. ఈ మాట ముందే చెప్పితే విడిచి పెట్టకుండా ఉండేవాళ్ళము. ఎందుకంటే మొన్ననే ఉద్యోగము విడిచి పెట్టాము. విడిచిపెట్టి మూడు రోజులు అయ్యింది అని కొంతమంది అంటారు. అట్ల కూడా విడిచిపెట్టిన వాళ్ళు కొంతమంది ఉన్నారు. అంటే ఇప్పుడు మనము వాళ్ళకు ఇలా చెప్పాలి. మీకు ఇష్టము వచ్చినట్టు మీరు అనుకోవద్దండి. ఉద్యోగము అనేది వాస్తవమే ఉద్యోగము చేస్తేనే మోక్షము వచ్చేది. ఉద్యోగము చేయకపోతే మోక్షము రాదు. అయితే మీరు ఏ ఉద్యోగము అనుకున్నారు? అని మేము ప్రశ్న వేస్తున్నాము. మీరు చేసేవి

ఉద్యోగాలు కాదు. మేము చెప్పేది యోగము. యోగములో ఉద్ యోగము. యోగము చేస్తే దేవునిలోకి ఐక్యము అవుతాము అని చెప్పుచున్నారు. ఇది ప్రత్యేకమైన ఉద్యోగము. నేను చెప్పేది 'ఉద్' యోగము ఉద్ అంటే పైది అని ఊర్ధము అంటే పైనుండేది. పైనుండే దానిలోకి నువ్వు ఎప్పుడైతే కలిసిపోతావో అప్పుడు అది ఉద్ యోగము అవుతుంది. పైన పరమాత్మ ఉంది నువ్వు కింద జీవాత్మవు ఉన్నావు. క్రొత్తగా వచ్చిన గ్రంథములో చూపించాము. కింద జీవాత్మ, పైన పరమాత్మ అని ఇక్కడ నుంచి అక్కడికి కనెక్షన్ పెట్టినాము, 'వి' ఆకారము ఇట్లే ఉంటుంది. ఇక్కడి నుంచి అక్కడికి నువ్వు చేరగలిగితే, అంటే నువ్వు కలిసిపోగలితే అది ఉద్యోగము అవుతుంది. అంటే పై నుండే దానితో నువ్వు కలిసిపోవడము. పై నుండే ఆత్మతో కలిసిపోవడానికి మనము ఉద్యోగము అంటాము. కాబట్టి ఉద్యోగము కావాలంటే జ్ఞానము కావాలి. జ్ఞానము లేకపోతే ఉద్యోగము చేసేదానికి కాదు. అంటే మీరు చేసే ఉద్యోగాలు బయట చేసేవి. అవి జ్ఞానము లేకపోయినా చేయవచ్చు. కానీ ఇక్కడ చేసే ఉద్యోగము జ్ఞానము ఉంటేనే చేసేదానికి అవుతుంది. అంటే ఉద్యోగము అంటే పై నుండే యోగము. పై నుండే ఆత్మతో మనము కలిసిపోవడము అని అర్థము. అంటే మనము ఉద్యోగము చేయాలి అంటే జ్ఞానము కావాలి. జ్ఞానము కావాలంటే, జ్ఞానము తెలుసుకున్నంత మాత్రమున సరిపోతుందా? ఆ తెలుసుకున్న దానిని తలలో పెట్టుకుంటే సరిపోదు. దానిని ఆచరణ చేయాలి. ఆచరణ ఎప్పుడైతే చేసుకోగలుతావో జ్ఞానము ప్రకారము నడుచుకోగల్గుగుతావో, అప్పుడే నువ్వు పై నుండే ఆత్మతో కలిసిపోయే అవకాశము ఏర్పడుతుంది. అప్పుడు ఏమవుతుంది? నువ్వు 3 పోయి 6 అవుతావు. ఆరు అయితే ఏమవుతాది నువ్వు అంటే జీవునిగా ఉండేవాడు ఆత్మగా మారిపోయినట్టే కదా! అంటే

పై నుండే స్థాయి చేరినట్లేకదా! పైన ఆత్మ ఉంది ఆయనను చేరిపోతే ఏమవుతుంది. ఉద్యోగము చేస్తే కొన్నాళ్ళకు ప్రమోషన్ వస్తుంది. నువ్వు కూడా కొన్నేళ్ళు ఉద్యోగము చేస్తే ఆత్మతో సంబంధము పడి ఉంటే ముక్తి అను ప్రమోషన్ వస్తుంది నీకు కూడా. ఆ ప్రమోషన్‌ను తప్పించేదానికి ఎవరితోనూ కాదు, అప్పుడు ఆ ప్రమోషన్ వస్తే నువ్వు ఆత్మనుండి పరమాత్మ దేవునిగా మారిపోతావు. పరమాత్మగా మారిపోయేదానికి అవకాశము వస్తుంది. అంటే కొన్నాళ్ళు ఉద్యోగము చేసిన తర్వాత ప్రమోషన్ వస్తే అప్పుడు కంప్లీట్‌గా ఒకటేసారి పరమాత్మలోకి చేరి పోవచ్చు. ఆ రకంగా మన స్థాయిని పెంచుకోవచ్చు. మనము ఇప్పుడు జీవాత్మ అనే స్థాయి నుంచి దేవుడు అనే స్థాయి వరకు పోవాలంటే మొట్టమొదట జ్ఞానము కావాలి. జ్ఞానము కావాలంటే మనము ఎక్కడి నుంచి మొదలు పెడుతున్నాము. మన భాష పరిజ్ఞానము అంతా జ్ఞానముతోనే కూడుకొని ఉంది. తెలుగు భాషంతా దేవునికి దగ్గరగా ఉంది. భాషలో ప్రతి అక్షరాన్ని చూసుకోండి, ప్రతి పదాన్ని చూసుకోండి ప్రతి అర్థము జ్ఞానానికి దగ్గరగా ఉంటుంది కాబట్టి ఈ రకంగా మీరు చూసుకుంటే సరిపోతుంది. అంటే మీలో చాలామంది తెలుగు పండిట్‌లు, తెలుగు టీచర్లు ఉంటారన్నమాట. మాకు తెలుగు రాదు కానీ దానిలో ఉండే సారాంశము చెప్తుతున్నాము. అది అట్లే ఉంటుంది. జ్ఞానానికి దగ్గరగా ఉంటుంది. ఆ రకంగా చూసుకోగలిగితే మీరు జ్ఞానాన్ని తొందరగా అర్థము చేసుకోగలుగుతారు. అర్థము చేసుకోగలిగితే దేవుని దగ్గరికి తొందరగాపోవచ్చు. ఇప్పుడు శ్రమంతా ఏమి? ఈ జ్ఞానము తెలుసుకోవాలనే కదా! మనము శ్రమపడుతుంది. ఈ జ్ఞానము తెలుసుకోవాలంటే ప్రతి చిన్న విషయము గురించి పరిశోధన చేయాలి. అట్లు చేస్తే కానీ మనకు అర్థము కాదు.

ఇప్పుడు మీకు క్రొత్త గ్రంథము వచ్చింది ఆ గ్రంథములో ఏమి చెప్పాము? ఇదంతా ఎందుకు, సాధారణంగా బతికుంటే సరిపోదా! ఇదంతా రామాయణం ఎందుకు అని అడిగినాడు ఒకాయన. అంటే అట్లా బ్రతికుంటే ఏమవుతుంది? జంతువులకు మనకు తేడా లేదు అని చెప్పినాము. అన్నిటితో సమానమైపోతాము, అవేవో తింటున్నాయి, బ్రతుకుతున్నాయి. మనమేదో తింటున్నాము, బ్రతుకుతున్నాము. అంతేగానీ ఇంకోటి ఏమీ లేదు. మనిషి అయినందుకు మనము మన వెనుక ఏమి జరిగిందని చూసుకోవాలి. అంటే మన చరిత్ర ఏమిటిదని చూసుకోవాలి. మన చరిత్ర ఏమి అని చూసుకుంటే మంచి చరిత్ర, చెడ్డ చరిత్ర రెండు చరిత్రలు తెలుస్తాయి. మంచి చరిత్రను ఆధారము చేసుకొని చెడ్డ చరిత్రను వదలివేసి నువ్వు ముందుకు పోతే నీ జీవితానికి ఒక ధ్యేయము ఏర్పడుతుంది. నువ్వు మనిషివి అనిపించు కుంటావు. ఊరకనే ఎట్లంటే అట్లా బ్రతికితే ఏమీ ప్రయోజనము లేదు. ఎలాగోలా బ్రతకొచ్చు ఏముంది ఏదో ఒకటి తినవచ్చు, ఏదో ఒకటి డబ్బులొస్తుంటాయి, ఆదాయము వస్తుంటుంది కాలము గడిచిపోతుంది. కానీ ఒక జంతువుకు మనకు ఏమాత్రము తేడా లేదు అనిపిస్తుంది. అట్లా లేకుండా మనిషిగా బ్రతకాలంటే మన చరిత్ర మనము తెలుసుకోవాలి. మన చరిత్ర మనము తెలుసుకోవాలంటే అసలు మనము దేశములో ఎప్పుడు నుంచి మొదలైనాము, అసలు మనము ఎవరు? మన జాతి ఏమిటి? మన జ్ఞానము ఏమిటి? అని మనము తెలుసుకోవాలి కదా! మన జ్ఞానమంతా ద్రావిడ జ్ఞానము. అసలు మనము వాస్తవముగా ద్రావిడులము. కానీ ఈ రోజు ద్రావిడ జ్ఞానము అనేది భూమిమీద ఉందా? ఎవరు ద్రావిడులో? ఎవరు ఆర్యులో? తెలియకుండా పోయింది. ఈ రోజు ఆర్య సమాజాలు ఎక్కడ చూసినా ఉన్నాయి. ఆర్యసమాజము అంతా బయటికి చెప్పబడుతా

వుంది. ఆర్య సమాజములో ఉండేదంతా వేదాలు, ఉపనిషత్తులు, యజ్ఞాలు, తపస్సులు. ఈ ఆర్యసమాజములో ఉండేటి సాంప్రదాయములు అన్నీ మనకు అంటుకొని పోయినాయి. ఎక్కడన్నా ఏ దేవాలయానికి వెళ్ళినా వేదాధ్యయనము ఉంటుంది. ఏ దేవాలయానికి వెళ్ళినా అక్కడ యజ్ఞాలు ఉంటాయి. ఏ భక్తి దగ్గరికి వెళ్ళినా అక్కడ యాగాలుంటాయి. అది తప్ప ఇంకోటి లేదు. చాలా భక్తిగలవారు తపస్సు చేస్తావుంటారు. ముక్కు మూసుకొని ఉంటారు అది కూడా ఆర్య సాంప్రదాయమే! కానీ వాస్తవముగా ఇది మన సాంప్రదాయము కాదు. అంటే ఇంతమంది ఆచరణ చేసేది తప్పా అంటే ఒకసారి కాదు మూడుమార్లు తప్పు అని చెప్పవచ్చు. ఇదంతా పెద్దోళ్ళంతా చేస్తున్నారు. జ్ఞానులయిన వాళ్ళకు తెలియదా అంటే, తెలియదు. తెలిస్తే ఏమవుతుంది? మనము చేసేది తప్పు అని వారికి తెలుస్తుంది. కొందరికి మనము చేసేది తప్పు అని తెలియదు. తెలియక అదే కరెక్టు అనుకుంటున్నారు. మొట్టమొదటనే చెప్పినాము సంసారము అంటే బాగా రుచిగా ఉండేదంట, బాగా సారముగా ఉండేదంట. కానీ అది హాలాహలంగా ఉంది మీకు అని చెప్పినాము. మంచిదని మీరేమనుకుంటున్నారో అదే మీకు చెడ్డది అని చెప్పుకున్నాము.

అలాగే ఇప్పుడు ఏ సాంప్రదాయాలైతే నీకు మంచివి అనుకుంటున్నావో, ఆ సాంప్రదాయాలు నీకు పూర్తి మంచిది కాదు అని చెప్పుచున్నాము. అంటే ప్రపంచములో ఎవ్వరూ ఈ సాంప్రదాయాల గురించి చెడ్డగా చెప్పలేదంటే, ప్రపంచము ఎందుకు చెప్పుతుంది? ప్రపంచమునకు దానిలో బాగా రుచి దొరికింది. అవే మీకు నేర్పించినాయి. మీరంతా అవే నేర్చుకున్నారు, ప్రపంచమంతా. ఈ రోజు ఆర్యసాంప్రదాయాలు ఉన్నాయి. అట్లకాకుండా ఇది మంచిది కాదు అని మేము చెప్పుచున్నాము. మన

చరిత్ర ఇది అని చెప్పుచున్నాము. పూర్వము అంతా ఇట్లున్నాము అని చెప్పుచున్నాము. మనము చివరకు ఎట్లున్నాము అంటే, చివరకు కోతులు, కుక్కలు, నక్కలు అన్నా కానీ సిగ్గు లేకుండా బ్రతుకున్నాము. వాస్తవముగా ఆంజనేయస్వామికి పొడవు తోక ఉందా? సొట్టమూతి ఉందా? అంటే సొట్టమూతి లేదు, పొడవు తోక లేదు. కానీ ఆయనను కోతిని చేసినారు. మళ్ళీ మేము భక్తులము అంటారు. ఆ సొట్ట మూతి కోతి ఆకారమును పెట్టుకొని ఆంజనేయున్ని మ్రొక్కుతున్నారు. రాక్షసులకు కొమ్ములు, కోరలున్నాయంటే మనుషులనే రాక్షసులను చేసినారు ఆ రోజు. ఎవరైతే ఇష్టము లేదో వాళ్ళందరినీ రాక్షసులను చేసినారు, ఎవరైతే వారికి (ఆర్యులకు) అనుకూలము లేదో వాళ్ళందరినీ జంతువులను చేసినారు. అడవిలో ఉండే గిరిజనులను అందరినీ అనేక జంతువులుగా చెప్పినారు. ఊరిలో ఉండే మనుషులందరిని రాక్షసులను చేసినారు. కొంతమంది ఆర్యులు మేము మాత్రము దేవతలము అనిపించుకున్నారు. వాళ్ళు చేసిన పన్నాగంలో మనము ఇరుక్కొని పోయినాము. మనమంతా వాస్తవముగా ద్రావిడులమే అయినా, ద్రావిడులము అని తెలియకుండా పోయి, ఈ రోజు ఆర్యులము అనేటటువంటి ధ్యాసలో ఉండిపోయినాము. ఆర్యసాంప్రదాయాలు మనలోకి వచ్చినాయి. కానీ ఈ రోజు ఆర్యులమో, ద్రావిడులమో అది కూడా తెలియకుండా పోయి చివరకు శూద్రులు అని పేరు వచ్చేసింది.

ఒకే జాతి ప్రజలు వేరువేరుగా చీల్చివేయబడి వేరువేరుగా లెక్కించబడి నీచాతి నీచులుగా కూడా లెక్కించబడుతున్నారు. వాళ్ళలోనే కొంతమంది మంచివాళ్ళుగా లెక్కించబడుతున్నారు. దేవుడు ఎవరినయినా నీచులుగా పుట్టించినాడా? ఎవరినయినా గొప్పగా పుట్టించి నాడా? దేవునికి అందరూ సమానమైనప్పుడు ఒకడినేమో నీచుడుగా, ఒకడిని గొప్పవాడుగా

ఎందుకు చేస్తారు? చేయడు కదా! అందరినీ సమానముగా పుట్టించినాడు కదా! మరి అట్లాంటప్పుడు కొంతమంది, గొప్పవాళ్ళు కొంతమంది చిన్న వాళ్ళు అని? ఈ కులాలుగా ఎందుకు చెప్పుచున్నారు. దేవుని ముందర ఈ తారతమ్యాలు ఏవీ లేవు. ఆ తారతమ్యాలు లేకుండా దేవుడు మనల్ని పుట్టించినాడు. అది తెలియకుండా చాలా తారతమ్యాలు మనము పెట్టుకున్నాము, మన మధ్యలో బేధాలు పెట్టుకున్నాము. భేదాలు పెట్టుకొని మనము ఒకరిని ఒకరు హెచ్చుతగ్గులుగా చెప్పుకుంటూ నువ్వు వేరు, నేను వేరు అనే భావాలతో మనము ఉండిపోయినాము. చివరకు మనల్ని ఎవరైతే మోసము చేయాలో వాళ్ళంతా మోసము చేశారు. పూర్తి మోసపోయినాము. కానీ ఇప్పటికి కూడా మనము మోసపోయినాము అని తెలియకుండా మోసపోతూనే ఉన్నాము. అటువంటి పద్ధతి లేకుండా పోవాలంటే మొట్టమొదట అందరూ సమానమే అని మొదట అనుకోవాలి. ఇప్పటికి దగ్గర దగ్గర 100 పెళ్ళిళ్ళకు పైన చేసి ఉంటాము. కులము లేకుండా వేరువేరు కులాలను కలిపివేసి చేశాము. ఈ రోజు కూడా కులాంతర వివాహము జరిగింది. మనము ఈ కులాలు ఎప్పుడైతే లేకుండా చేసుకుంటామో అప్పుడు సమానత్వము వస్తుంది. ఎప్పుడైతే సమానము అని తెలుస్తుందో, అప్పుడు జ్ఞానము కూడా అందరికీ సమానము అని తెలుస్తుంది. అప్పుడు అందరూ సమానముగా జ్ఞానము తెలుసుకోవచ్చు. అందరూ సమానముగా జ్ఞానము తెలుసుకున్నప్పుడు ఏమౌతుందంటే ఒకే సమాజము ఏర్పడుతుంది. నేను వేరు, నువ్వు వేరు, నువ్వు పెద్ద నేను చిన్న అనేది లేకుండా పోతుంది. అంతా జ్ఞానులమే అవుతాము.

పూర్వము మొట్టమొదట ఈ భారతదేశము ఇందూ దేశముగా, జ్ఞానుల దేశముగా ఉండేది. ఆ రోజు అందరికీ జ్ఞానము తెలిసి ఉండేది.

కానీ ఈ రోజు జ్ఞానము తెలియకుండా పోయింది మనకు. కానీ ఈ రోజుండే దానికి ఆ రోజుండేదానికి చాలా తేడా ఉంది. ఆ రోజు అందరూ తెలిసినవాళ్ళు, ఈ రోజు అందరము తెలియనివాళ్ళమే. అందరూ తెలిసినవాళ్ళు కాబట్టి వాళ్ళ జీవితమే చాలా గొప్పగా ఉండేది. మళ్ళీ మధ్యలో ఈ ఆర్యులు వచ్చి, అంటే మన దేశము వాళ్ళు కాకుండా వేరే దేశస్తులు, ఆసియా ఖండము నుంచి ఇక్కడికి వచ్చి, లేనిపోని గందరగోళము చేసి చివరకు మూడు యుగాల పర్యంతము మారుస్తూ మారుస్తూ వచ్చారు. ఈ కలియుగములో ఈ స్థితిలో మనము ఉన్నాము. పూర్తి మన ధ్యాస మనకు లేకుండా పోయింది మన జ్ఞానమేమిటి? మన చరిత్ర ఏమిటి? అని మరిచిపోయి ఈ రోజు అజ్ఞానులుగా ఉన్నాము. మన చరిత్ర ఏమిటో తెలుసుకొని మన చరిత్రలో ఎటువంటి వాళ్ళుగా మన పెద్దలు ఉన్నారో తెలుసుకోవాలి. వెనుక మన పెద్దలు ఎంతో గొప్పగా బ్రతికితే, వాళ్ళ వంశములో మనము పుట్టి, మనము ఇంత అజ్ఞానులు ఉంటే ఏమి బాగుంటుంది? అనే ధ్యాస పెట్టుకొని మనము ఉండే నీచత్వము ఏమిటో మనము తెలుసుకుంటే దానిని వదిలిపెడతాము. అజ్ఞానమును వదిలిపెట్టి వాళ్ళు పూర్వము ఎట్లున్నారో, ఆ రకంగా మనము తయారైతే అప్పుడు మనము జ్ఞానులుగా లెక్కించబడుతాము. లెక్కించబడడము కాకుండా ఆ రోజు వాళ్ళలో ఏ శక్తి అయితే ఉన్నదో ఆ శక్తి మనలోకి వస్తుంది. ఈ రోజు మనము శక్తి హీనులము. మనదగ్గర ఏమాత్రము శక్తిలేదు. కానీ ఆ రోజు వాళ్ళు శక్తిమంతులు. వాళ్ళలో జ్ఞానశక్తి సంపూర్ణముగా ఉండేది. అటువంటి జ్ఞానశక్తి మనకు కూడా ఈ రోజు లభ్యమయ్యేదానికి అవకాశము ఉంటుంది. అట్లా ఆ రకంగా మనము జ్ఞానశక్తి సంపాదించుకోగలిగితే ఏమవుతుంది? మన కర్మలు లేకుండా చేసుకోగలుగుతాము. సంపూర్ణ

జ్ఞానము తెలుసుకోగలుగుతాము. మనుషులందరము ఒకటే అనుకుంటాము. మనందరికీ దేవుడు ఒకడే అనుకుంటాము. అప్పుడు సమాజమంతా ఏకత్వములోకి వస్తుంది. ఇప్పుడు అలా లేదు. సమాజము ఏకత్వములో లేదు, చాలా భిన్నత్వములో ఉంది.

ఒకానొకరోజు ఈ సమానత్వము ఉండాలనే ఉద్దేశ్యముతో గౌతముడు, (గౌతమబుద్ధుడు) ఆయన వచ్చి సమానత్వము కావాలని ఉద్దేశ్యముతో ఈ హెచ్చుతగ్గులు లేకుండా చేయాలని చూశాడు. అందరినీ సమానముగా చూసుకోవాలి అని చెప్పినాడు. ఆయన ఆత్మజ్ఞానము చెప్పకున్నా ఆయనకు తెలిసిన జ్ఞానము ప్రకారము అందరూ సమానముగా ఉండాలి అనేటటువంటి నీతిని బోధించినాడు ఆయన. అప్పటికే ఈ కులాలన్నీ ఏర్పడి, హెచ్చుతగ్గులుగా ఉండేటి సమాజమంతా, ఆయన చెప్పిన బోధ బాగుందని ఆయనపట్ల ఆకర్షితులైతే, ఈ దేశములోనే పుట్టినటువంటి వ్యక్తిని, సన్యాసము తీసుకున్నట్టి వ్యక్తిని, సన్న్యాసము తీసుకొని భార్య పిల్లలను విడిచిపెట్టి, తలగొరిగించుకొని సన్యాసములో కలిసిపోయిన వ్యక్తిని ఈయన మాకంటే వేరుగా బోధిస్తున్నాడు, పరాయి మతము అని చెప్పి బౌద్ధ మతమును, ఇతర మతము క్రిందకి లెక్కేసినారు. ఈ రోజు అది హిందూ మతము కాదు కానీ ఆయన హిందువే. ఆయన హిందూ దేశములో పుట్టినాడు, ఆయన ఇందువే. ఇందూ సాంప్రదాయాలు ఆచరించినాడు కాషాయగుడ్డలు వేసుకున్నా కానీ, ఈ ఆర్యులు ఏమి చేసినారంటే అతను మనకంటే గొప్పవాడిగా కనిపిస్తాడు అని అసూయతో ఏ మతాలు లేని రోజే దానిని ఒక మతముగా చీల్చేసినారు. చీల్చేసిన ఆ మతమే బౌద్ధమతము. ఐరోపా ఖండము నుంచి ఆసియా ఖండము వరకు విస్తీర్ణముగా ఉంది. అది ఈ రోజు ఎంతో పెద్ద మతముగా ఉంది. కానీ

మన మతము దానిముందర చిన్నగా ఉంది. అదే మన మతముగా ఈ రోజు చెప్పుకుంటే హిందూమతము ఎంత పెద్దగా ఉండేది. ఈ రోజు అన్ని దేశాలలో ఈ హిందూమతము ఉండేది. ఈ రోజు హిందూ మతాన్ని కాపాడాలి, దేశ రక్షకులము, హిందూ ధర్మ సంస్థాపకులము అని పేరు పెట్టుకుంటూ ఉన్నారు. అలా పేరు పెట్టుకొన్న వాళ్ళంతా ఏమి చేసినారు. హిందూ ధర్మాన్ని పూర్తి నాశనము చేసేసి, హిందూ మతాన్ని చీల్చి, వేరే ప్రక్కన పారేసినారు వీళ్ళు. ఇప్పుడు ఎవరన్నా జ్ఞానము మాట్లాడితే వాళ్ళు ఇందువు కాదంటారు. వాళ్ళు క్రైస్థవుడని పేరు పెట్టి వేధిస్తారు.

ఈ రకంగా మన సమాజము తయారైంది. ఇదంతా ఆర్యులవల్ల వచ్చిన సాంప్రదాయాలు. ఆర్యులంటే మీకు అసలుకే తెలియదు. ఇప్పుడు వచ్చిన గ్రంథము చదివితే ఆర్యులంటే ఎవరు? ద్రావిడులంటే ఎవరు? అనేది తెలుస్తుంది. ఆర్యుల చేతిలో ద్రావిడులు ఎంతగా మోసపోయారో తెలుస్తుంది. ద్రావిడులెవరు అంటే నువ్వే అని తెలుస్తుంది. మీరెంత మోస పోయినారో తెలుస్తుంది. అటువంటి మోసాలు జరుగకుండా ఉండేదానికి మనము ఏమి చేస్తామంటే ఇప్పుడు నుంచి ఈ గ్రంథము చదివితే ఇటు చరిత్ర తెలుస్తుంది, ఆర్యులు చేసిన మోసము తెలుస్తుంది, తర్వాత జ్ఞానము తెలుస్తుంది. ఇంకా ముఖ్యమైన అంశము ఏమంటే ఆంజనేయ స్వామికి సొట్టమూతి లేదు, తోక లేదని తెలుస్తుంది. చాలా పెద్ద రహస్యము ఇది. ఇంతవరకు ఎక్కడా తెలియదు. ఈ ఒక్క గ్రంథములో మళ్ళీ ఇన్ని రహస్యాలు తెలుస్తాయి. ఇంకా చాలా రహస్యాలున్నాయి. ఒకటి కాదు, చాలా ఉన్నాయి. ప్రతి పేజీలోనూ ఒక రహస్యముంది. మీకు 160 పేజీల గ్రంథములో చాలా క్రొత్త క్రొత్త విషయాలు తెలుస్తాయి. ఈ విషయాలు తెలిసిన దానివలన మీకు పరిజ్ఞానము అనేది బాగా ఎక్కుతుంది. దానివలన

మీరు జ్ఞానము తెలుసుకోగలుగుతారు. ఇంకా ముందుకు పోయేదానికి అవకాశము ఉంటుంది. కాబట్టి ఈ గ్రంథాన్ని అందరూ మీరు చదివిన తర్వాత మీరు తెలుసుకున్న విషయాలు బయటికి చెప్పండి. అవకాశముంటే ఇంకొకరితో కూడా చదివించండి. మనము ఈ ప్రాంతములో ఉండే వాళ్ళమంతా ద్రావిడములము అని చెప్పుకోండి. ఎక్కడినుంచి? ఈ వింధ్య పర్వతాల ఇవతల మహరాష్ట్ర నుంచి, కర్ణాటక, ఆంధ్ర, తమిళనాడు, కేరళ, తర్వాత శ్రీలంక ఈ దక్షిణ దేశమంతా ద్రావిడులము. కానీ ఉత్తర దేశములో కూడా ద్రావిడులు ఉండేవాళ్ళు మొదట, అంటే వాళ్ళు తరిమివేయబడి ఇక్కడి వరకు దక్షిణం వరకు వచ్చారు. కానీ ఇక్కడ కూడా ద్రావిడులము అని పేరు మర్చిపోయినాము. తమిళనాడులో ఒకచోట మాత్రము ద్రావిడ అనే పేరుంది, ఇప్పుడికీ ఉంది. అది చరిత్రకు సాక్ష్యానికి మిగిలి ఉంది. కాబట్టి అక్కడే కాకుండా ఇక్కడ కూడా ద్రావిడులమే అని తెలుసుకోండి. ఈ గ్రంథము చదివితే మన చరిత్ర తెలుస్తుంది. ఈ చరిత్ర తెలుసుకున్నాక దానివలన మీరు చాలా లాభము పొందుతారని మేము అనుకుంటున్నాము. అందువలన మీరు తెలుసుకోవడము కాకుండా ఇతరులతో కూడా చదివించండి. దానివలన మీరు లాభము పొందాలని కోరుతూ ఈ సమావేశాన్ని ఇంతటితో ముగిస్తున్నాము.

# 81. ఆస్తి - దోస్తి

**(తేది :- 22.04.2016)**

ఈ నెల మీకు ఒక గ్రంథము వచ్చింది. ప్రతి నెల మీకు గ్రంథము రావాలని కోరుకుంటున్నాము. అలాగే **"ఒకడే-ఇద్దరు"** అనే గ్రంథము వచ్చింది. మీకు ప్రతి గ్రంథములోనూ ఒక క్రొత్త సమాచారాన్ని అందించినట్లు ఈ గ్రంథములో కూడా మీకు ఒక క్రొత్త సమాచారాన్ని అందించడం జరిగింది. మీకు గడిచే ప్రతి మాసానికి, ఒక క్రొత్త జ్ఞానాన్ని అందిస్తూ పోతున్నాము. కానీ మీరు దానిని అంత వేగంగా అందుకోలేక వున్నారు. అంటే జ్ఞానాన్ని తెలుసుకొని మీరు ఇంకా ముందుకు పోవాలని మేము కోరుకుంటున్నాము. కానీ మీరు అంత వేగం పోకుండా ఇంకా నిదానము అవుతున్నారు. వ్రాసిన పుస్తకాలు వెంట వెంటనే చదవడం లేదు. మీరు చదివితే క్రొత్త క్రొత్త జ్ఞానం తెలుస్తుంది. మీరు వెనుకబడి పోతున్నారు. తరువాత చెప్పిన మీటింగుల ఆ సిడిలు తీసుకొనిపోయి మీరు ఒక ఆస్థి మాదిరి సేకరించి దానిని పెట్టుకోవడంలేదు. కొంతమంది తీసుకొని పోతున్నారు. కొంతమంది వదిలి వేస్తున్నారు. ఇక్కడ వింటే చాలులే అనుకుంటున్నారు. విన్న జ్ఞానం అంతా తిరిగి నెమరువేసుకోవడానికి మీరు దీనిని తీసుకొని పోయి ఇంట్లో మరలా తిరిగి చూడడం చేసుకొంటే మరీ బాగుంటుందని చెప్పుతున్నాను.

సరే! ఇప్పుడు మీకు చెప్పబోయే జ్ఞానంకంటే ముందు కొంతమంది మాట్లాడిన మాటలు నేను విన్నాను. ఆ మాటలు మీకు ఏమి అర్థము అయినాయో ఏమో నాకు తెలియదుగాని, ఇంతకు ముందు ఒక ఆమె మాట్లాడింది. అక్కడున్న వ్యాఖ్యాత ఏమి చెప్పాడంటే, రాజ్యలక్ష్మిగారు

అనంతపురం నుంచి వచ్చారు. వచ్చి ఆమె మాట్లాడుతున్నారు అని చెప్పాడు. అంటే అక్కడికి వచ్చింది పైకి రాజ్యలక్ష్మి, కనిపించేది ఒకరు, మాట్లాడింది ఇంకొకరు. ఆమె నేను సుంకలమ్మ అని చెప్పింది కాబట్టి. ఆమె కర్నూలు జిల్లాలో కర్నూలు దాటిన తరువాత నందికొట్కూరు దగ్గర, నంది కొట్కూరు దాటిన తరువాత 20 కిలోమీటర్ల దూరంలో జూపాడుబంగ్లా అని ఒక గ్రామము ఉందంట. ఆ జూపాడు బంగ్లా దగ్గర రోడ్డులోనే ఒక దేవాలయం ఉంది. ఈ మధ్యనే క్రొత్తగా కట్టినారంట. ఆ గుడిలోని దేవత వచ్చి మాట్లాడింది. గుడిలోని దేవత మాట్లాడతుందని మీరు ఎవరూ గమనించ లేదు. ఆమె చెప్పుతుంటే ఏదో చెప్పుతుందిలే, ఎవరో చెప్పుతున్నారు అనుకున్నారుగానీ సాక్ష్యాత్తూ మీదగ్గరికి వచ్చి ఒక దేవత, అంటే అంత మందితో పూజలు అందుకొనే దేవత మీ దగ్గర మాట్లాడిందని మీరు అనుకోలేదు. కాని ఆమె వచ్చి ఇక్కడ మాట్లాడుతుందని మేము కూడా అనుకోలేదు గాని, ఎట్లో మాట్లాడింది ఆమె.

మేము ఆమెకు చెప్పడం ఏమంటే ఆమె ఒక తప్పుచేసింది. ఒక ఆస్తమా రోగంతో ఉన్న వ్యక్తి ఎందుకు తనను మ్రొక్కలేదని పీడించేది. గుడి దగ్గరకు పోయి తనను మ్రొక్కలేదని కక్షతో వాళ్ళను దగ్గర దగ్గర ఒక సంవత్సరంపై నుంచి పీడించేది అన్నమాట. అది ఈ మధ్య తెలిసి సుంకలమ్మకు ఇది మంచి పద్ధతికాదు అని చెప్పాము. అప్పుడు మేము దేవతలము కదా! మాకు మ్రొక్కకపోతే మేము ఎందుకు విడిచిపెడుతాము అని చెప్పింది. అప్పుడు మేము "మీకంటే మేము పెద్దోళ్ళుగా ఉన్నాము. ఎంతోమంది మాకు మ్రొక్కాలని వస్తున్నారు, వద్దని చెప్పుతున్నాము. నేనే వద్దని చెప్పినపుడు నీవు మ్రొక్కించుకొనేదానికి నీవెంత దానివి?" అని అడిగాము. ఈ రకంగా ప్రశ్నించి అడిగినపుడు ఆమెకు కొంత కొంత

జ్ఞానం తెలిసింది. నీకు పాపము వస్తుంది అని చెప్పినాము. ఇంకా ఏమన్నాము అంటే ఇప్పటికే కొన్ని కర్మలు అనుభవిస్తున్నావు చూడు అని చెప్పాము.

మా దేవతలు కూడా అనుభవించాల్సిందేనా అంటే, తప్పనిసరిగా ఇప్పుడు అనుభవిస్తున్నావా లేదా అని అడిగినాము. అనుభవిస్తున్నాను వాస్తవమే అని చెప్పింది. ఆమెకు వళ్ళంతా నొప్పులు, మోకాళ్ళ నొప్పులు ఉన్నాయంట. అంటే ఆమెకి దగ్గర దగ్గర 80 సంవత్సరములు వయస్సు ఉంది. ఇప్పుడు 80 సంవత్సరముల వయస్సులో మీ ముందరకు వచ్చి మాట్లాడింది. సహజంగా 80 సంవత్సరముల వయస్సులో మనుషులకు ఉన్నట్లే నొప్పులు ఉంటాయి, ఇవన్నీ కర్మలు కాదా? ఈ కర్మలు పోయిన జన్మలో చేసుకున్న కర్మలు దేవతగా వున్నా కూడా అనుభవించవలసిన పని వచ్చింది. ఇప్పుడు కోళ్ళను కోయించుకొని పొట్టేండ్లను నరికించుకొని ఎన్ని చేశావు? ఎన్ని పొట్టేండ్లు నీముందర కోసారు. ఎన్ని కోళ్ళు కోసారు? అవన్నీ నా కోసమే కోసారు నేను అడిగితేనే కోసారు. నా మొక్కుబడికి కోసారు అని నీవు అనుకున్నావు కదా! ఆ పాపము ఎంత వచ్చి ఉంటుంది చూసుకో నీకు. నీ పాపము కొండలు కొండలు పెరిగింది దానిని అనుభవించినపుడు నీకు తెలుస్తుంది అనగానే, అపుడు ఆమెకు భయం పుట్టింది, ఎట్లా నేను తప్పించుకొనేది అని. ఇంతవరకు, "నేను దేవతను కదా! మాకు చావుపుట్టుకలు లేవు. పాప పుణ్యాలు లేవు అని మేము అనుకొంటిమి" అంటే అదంతా ఏమీ లేదు మీరు కూడా జీవుళ్ళే. గుడిలో దేవతలుగా పుట్టినా మీరు కూడా జీవుళ్ళే. మీకు కూడా పాప పుణ్యాలు ఉంటాయి. మీరు కూడా అనుభవించవలసిందే. మీకు జన్మలు ఉన్నాయి అని చెప్పాము. అంత వరకు ఆమె తెలియదని ఒప్పుకుంది. పాపము

గురించి ఇప్పుడు తెలిసిన తరువాత ఏమి చేయాలి అనేటువంటి దిగులు పడినపుడు మీకుగానీ, మనుషులకుగానీ, ఎవరికైనా గానీ ఒకటే ఒకటి ఆధారము భగవద్గీత ఉంది. భగవద్గీతలో దేవుడు నీవు చేసుకున్న కర్మలు ఎంత పెద్దవి అయినాగాని అనుభవించకుండా తప్పించుకొనేదానికి నా జ్ఞానం తెలుసుకోమని చెప్పినాడు.

కాబట్టి మీరు జ్ఞానం తెలుసుకోవడానికి ప్రయత్నం చేయండి అని చెప్పాము. అప్పటి నుండి కొంత ఆసక్తి కల్గి జ్ఞానం తెలుసుకోవడానికి ప్రయత్నం చేసింది ఆమె. ఇప్పటికి ఆమె జ్ఞానంలోకి వచ్చి కొంత జ్ఞానం తెలుసుకోబట్టి ఒక నెల అవుతుంది. అంతకంటే ఎక్కువలేదు. కానీ వచ్చి మీకంటే బాగా మాట్లాడింది. మీకంటే ఎక్కువ తెలుసుకున్న దానివలె మాట్లాడింది సంతోషమే. కానీ మాట్లాడింది దేవత అని మీరు గుర్తించలేదు. ఓ గుడిలో పెద్దగా ఉండే దేవత మాట్లాడిందని మీకు తెలియదు. మీరు ఎప్పుడన్నా కర్నూలు జిల్లాలోకి పోతే నందికొట్కూరు దాటిన తరువాత ఆత్మకూరు రోడ్డుకి పోతే అక్కడ ఒక గుడి వుందంట. నాకు తెలియదు ఆమెను అడిగాము అంత దూరము నుండి ఎట్లా వచ్చినావు నీవు అని. ఆమె బస్సులో కూడా రాదంట. ఏవన్నా మంచి మంచి కార్లు, మంచి మంచి జీపులు వస్తూ ఉంటే దాంట్లో వస్తాదంట. వచ్చి ఇక్కడికి రావడము, ఇక్కడ చూసుకొని పోవడము. పోయిన సారి చెప్పాము ఇంక రావద్దు ఇది మంచి పని కాదు పాపము వస్తుంది అని చెప్పితే, సరే జ్ఞానము ఎట్లా తెలుసుకుండేది అంటే, పౌర్ణానికి రండి అప్పుడు మీటింగ్ వినండి అని చెప్పాము. సరే పౌర్ణానికి వచ్చింది మీ ముందర మాట్లాడింది ఆమె. ఈ ఉపన్యాసము వింటుంది. మరలా వాహనము ఏదన్నా మంచిది ఉంటే చూసుకొని పోతుంది అక్కడికి. మీకంటే బాగా ప్రయాణం చేస్తారు వాళ్ళు.

ఈ రకంగా ఒక దేవతకే ఆసక్తి కల్గి నాకు కూడా కర్మలు తప్పవని భయపడి నెల రోజుల నుండి జ్ఞానం తెలుసుకోవడానికి మొదలు పెట్టింది మీరు ఇంకా మనుషులుగా ఉండేవాళ్ళు మీకెంత భయము ఉండాలి చూసుకోండి. కాబట్టి మీరు జాగ్రత్తగా జ్ఞానం తెలుసుకోండి. కర్మలు నుంచి బయటపడండి అని మేము చెప్పుచున్నాము. ఆమె ఒక దేవతగా వున్నప్పుడు మనుషులు వచ్చి నన్ను మ్రొక్కలేదు అనేటటువంటి కక్షతో మ్రొక్కలేదని ఆ రోజే ఆమెను (రాజేశ్వరిని) చంపేయాలి అని చూసింది. మీ ముందరకు వచ్చి మాట్లాడింది రాజేశ్వరి పుట్టిన ఇల్లు ఆ ఊరిలో ఉంది. పుట్టింటి వాళ్ళంతా గుడికి పోతుంటే ఆమె పోయింది. దేవునికి తప్ప ఎవరికీ మ్రొక్కవద్దండి అని చెప్పినాము కదా! అచట్టము ప్రకారము ఆమె ఏమి చేసిందంటే అక్కడ పోయి నిల్చుంది కాని మ్రొక్కలేదు. ఆ దేవత చూసి నాకు మ్రొక్కలేదు. ఇంతమంది మ్రొక్కుతున్నారు నువ్వు మ్రొక్కలేదని, కోపం వచ్చింది. ఆమె చెప్పింది, ముందర కూడ నాకు మ్రొక్కలేదని కోపం వచ్చింది అని. అపుడు ఆమె ఈ రాజేశ్వరిని చంపాలని చూసింది కాని నుదుటి మీద ఉన్నటివంటి ఆ దేవుని చిహ్నం ఉంది కదా! మీరు పెట్టుకున్నటివంటి కాలకర్మ చక్రాల చిహ్నం, దానివల్లే ఆమెను చంపలేక పోయిందంట ఆ కోపం తట్టుకోలేక అప్పుడే 10 నిమిషములు ముందర, అంటే ఆమె మ్రొక్కకుండా వుండిన తరువాత 10 నిమిషములకే ఆ రోడ్డులో ట్రాక్టర్ పోతా వుంటే గుడిముందర ఒక పిల్లవాన్ని ట్రాక్టర్ క్రింద వేసిందంట. 6 సంవత్సరముల పిల్లవాన్ని ట్రాక్టర్ క్రిందికి వేస్తే, ఆ పిల్లవాడు నలిగి చచ్చిపోయినాడు. అంత కోపంతో ఆ పనిచేయడం జరిగింది. నిజమే ఆ రోజు చనిపోయిండేది నిజమే అని ట్రాక్టర్ క్రింద పడి ఉండేది నిజమే అని అక్కడి వారు చెప్పుతున్నారు. అయినా ఈ సుంకలమ్మ చేసిందని ఎవరికీ

తెలియదు. ఆమె నోటి నుండి స్వయంగా ఆమె చెప్పిన దానివలన ఇప్పుడు తెలిసింది.

ఇట్లా వాళ్ళు చాలా పనులు చేస్తున్నారు. ఈ పనుల వల్ల కనిపించని ఫలితం ఏమొస్తుంది అంటే భయంకరమైన పాపము. ఆ పాపము అనుభవించినపుడు తెలుస్తుంది అన్నమాట. ఇంతకు ముందు చెప్పాను. ఒక బాధ వస్తే ఎంతవరకు పీడిస్తుంది అంటే, ఒక తేలు కుడితే బ్రహ్మాండమైన నొప్పి ఉంటుంది. తేలు కుడితే ఎంత బాధ ఉంటుందో అంతనొప్పి ఎవరకైనా బాధించవచ్చు మీకు ఆ కర్మ అని చెప్పాము. అటువంటి కర్మలను తప్పించుకోవాలంటే ఏమి చేయాలి అంటే దేవుని చిహ్నం ధరించి, దేవుని జ్ఞానాన్ని తెలుసుకోవాలని చెప్పడం జరిగింది. మేము ఇంత జ్ఞానం చెప్పుతున్నాగాని జ్ఞానాన్ని లెక్క చేయకుండా వాళ్ళకి తెలిసిందే గొప్ప జ్ఞానమనుకొని మాకు వ్యతిరేఖంగా మాట్లాడుతూ ఈ జ్ఞానాన్ని వ్యతిరేఖంగా మాట్లాడుతున్నారు చాలామంది. మేము ఏమి చెప్పుతున్నాము అంటే ఇంతవరకు తెలియని రహస్యాలు ఏమి తెలిసినా ఇక్కడ నుంచే మీకు తెలియాలి. ఇక్కడ నుంచి కాకపోతే మీకు తెలిసే దానికి అవకాశం లేదు.

సరే, ఈ మధ్య స్వామిజీలు ఎంతోమంది ఈ టీవీ ఛానల్ వాళ్ళు, డిబేట్ (చర్చ) చేసిన విషయాలన్నీ చూశాను. ప్రశ్నలు అడిగిన వాళ్ళను చూశాను. వాళ్ళు అడిగిన ప్రశ్నలు, వీళ్ళు చెప్పిన జవాబులు చూశాము. అవన్నీ లెక్కవేసి చూస్తే, మొత్తం స్వామీజీలందరిని 5, 6 మంది స్వామిజీలను, ఈ రకంగా వారు చర్చలలో పాల్గొని మాట్లాడేదాన్ని చూసిన తరువాత, కనీసం ఇక్కడ మనము తెలుసుకొనే జ్ఞానంలో ఐదు పైసలు జ్ఞానము కూడా పెద్ద పెద్ద స్వామీజీలకు లేదని తెలిసిపోయింది. వాళ్ళు

ఐదు పైసల జ్ఞానం లేని పరిస్థితులలో వున్నారు. వాళ్ళు మీకు ఏమి జ్ఞానం చెప్పుతారు? ఇప్పుడు చెప్పే జ్ఞానం మీరు తెలుసుకోకుండా పోతే మీ జన్మలే వృథా అయిపోతాయి. కానీ ఇక్కడికి వచ్చినటువంటి వాళ్ళు తెలుసు కుంటున్నారు. రాని వాళ్ళకథ ఏమయింది. అంతే, వాళ్ళవి పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా అన్నట్లు ఉంటుంది. వాళ్ళు పుట్టి ప్రయోజనం లేదు. జన్మతీసుకొని ప్రయోజనం లేదు.

అంటే ఏమయ్యా! మేము పుట్టి ప్రయోజనం లేదు అంటావు. నీవు సంపాదించుకొన్నది 10 పైసల ఆస్తి. మేము సంపాదించుకొన్నది కోట్ల రూపాయల ఆస్తి! చూడు మేము ఎంత సంపాదించినామో? మా తెలివితో సంపాదించుకున్నాము! నీవు జ్ఞానము, భజన అదీ ఇదీ అనుకుంటుంటే ఎట్లా అవుతుంది. మేము పని చేసినాము. వ్యాపారం చేసినాము. ఇంకొక పని చేసినాము. ఏదో ఒకటి చేసినాము. మేము దండిగా (చాలా) ఆస్తులు సంపాదించుకొన్నాము. మేము పోయినా మా పిల్లలు తినేంత వుంటాది తర్వాత మా వాళ్ళు కూడా సంపాదించుకుంటారు. మేము ఏమన్నా సోమరి పోతులు మాదిరి వున్నామా! అని అడుగుతున్నారు కొంతమంది. సరే! మీరు సోమరిపోతులుగా లేరు. కాలము వృథా చేసుకోలేదు. మీరు సంపాదన కోసమే కాలము అంతా వినియోగించుకున్నారు. డబ్బులు సంపాదించుకున్నారు. సరే, మీరు చేసిన పనులలో పైకి కనిపించేది డబ్బు. అంటే అది ఏ రూపంలో వచ్చినా, దాన్ని మనము ఏమి చేస్తామంటే ఆస్తి అంటున్నారు. అది చరాస్తి కావచ్చు. స్థిరాస్తి కావచ్చు. నీవు ఆస్తి సంపాదించుకొన్నావు. స్థిరాస్థి, చరాస్థి రెండు ఆస్తులు సంపాదించు కుంటున్నారు. వెనుక కూడ బెట్టుకొని, దానిని జాగ్రత్తగా కాపాడుకోవాలని అనుకొంటారు. ఉన్నట్లుండి (అనుకోకుండా) ఒక రోజు చచ్చిపోతాడు,

అంతా పోతాది అక్కడికి. వెనుక తినేవాడు ఎవడు తింటాడో ఏమో కానీ నేను పోయినా మావాడు తింటాడు కదా! అంటాడు. మీ వాడు తింటాడో, ఇంకోడు తింటాడో, ఇంకోడు తింటాడో మనకు తెలియదు. అయినా నీవు ఆస్తిని సంపాదించుకుంటున్నావు. **అస్తి** అను పదము కాలక్రమమున ఆస్తిగా మారినది. **స్తి** అంటే స్థిరంగా ఉండేదని అర్థము. 'అస్తి' అంటే దానికి ఆస్థి అని పేరు వచ్చిందని చెప్పాము కదా! 'స్తి' అంటే స్థిరంగా ఉండేది. దాని ప్రక్క 'అ' పెడితే ఏమయితాది. అస్థి, స్థిరంగా లేనిది అని అర్థము. నీ దగ్గర ఎప్పటికన్నా లేకుండా పోతుంది. అస్తి ఇంకోడు ఎత్తుకొని పోవచ్చు. దొంగలు ఎత్తుకొని పోవచ్చు. ఇంకొకరు ఏమైనా చేయవచ్చు. ఇంకొకడు మోసం చేసి మొత్తాన్ని లాక్కోవచ్చు. లేదా ఇంకొకడు నీకు మత్తు త్రాగించి సంతకము పెట్టించుకొని అంతా వాని పేరు చేయించు కోవచ్చు. ఏ రకంగా అయినా నీ ఆస్తి పోతుంది. అందువలన దాని పేరు ఆస్థి అంటాము. పోయిన తరువాత ఏమవుతావు నీవు? నాస్తి అవుతావు. ఏమి లేని వాడు అవుతావు.

కాబట్టి నీవు ఆ ఆస్తి కొరకు జీవితమంతా శ్రమపడేది ఎందుకు? నేను కూడా ఏదో సంపాదించుకున్నాను. కానీ నా కాలము అంతా వృథా చేయలేదు. మీకంటే నేను మేలు, "మీరు కూడా డబ్బులు కొరకే కదా! పని చేసేది" అని మీరు అనుకుంటుండొచ్చు. మేము మా తెలివి కొద్ది మేము సంపాదించుకుంటున్నాము. ఈ కోటి విద్యలు కూటి కొరకే కదా! అని మీరు అనవచ్చు. మమ్ములని కూడా వ్రేలు ఎత్తి చూపవచ్చు, మీరు అంతా జ్ఞానం పెట్టుకొని, ఈ జ్ఞానము అంతా చెప్పుకుంటూ, ఇంత ఉపన్యాసాలు ఇచ్చేది డబ్బులు కోసమే కదా! అని అనవచ్చు. అంటే మీకు అదే కనిపిస్తుంది కానీ మేము ఏమి చెప్పుతున్నాము అంటే మీకు తెలియని

రహస్యం మాకు ఒకటి తెలుసు. అది ఏమిటిది అంటే మనము సంపాదించు కొంటే వచ్చేది డబ్బు కాదు. ఆస్థులు ఏమిటివి మనం సంపాదించుకొంటే వచ్చేటివికాదు. ముందే కర్మలో లిఖించబడివుండాలి. ఆ కర్మ ప్రకారమే మనకు ఏదైనా వస్తుంది. అది మాకు తెలుసు కాబట్టి మేము ఆస్తులు కోసము ఎప్పుడూ ప్రయత్నము చేయలేదు. చాలామంది స్వామీజీలు చాలా రకాల కార్యక్రమాలు పెట్టి ఈ కార్యక్రమానికి ఇంత, ఆ కార్యక్రమానికి ఇంత అని డబ్బులు కోసమే ప్రాకులాడుతుంటారుగాని, మేము అటువంటి కార్యక్రమాలు పెట్టలేదు. ఎవరితోనూ సంబంధము పెట్టుకోలేదు. ఎవరినైనా డబ్బులు అడిగినామా మేము? ఎవరినీ అడగలేదు. మా పని మేము చేస్తున్నాము. దేవుని సేవే మేము చేయాలని ఉద్ధేశ్యంతో చేస్తున్నాము. కానీ డబ్బులు ఎట్లా వచ్చినాయి మీకు? అంటే నేను చెప్పుతున్నాను. ఇవ్వాల్సినవాడు ఇస్తే ఎట్లయినా వస్తాయి. ఎవడు ఇచ్చేది? దేవుడు! నీ కర్మ లిస్టులో ఉంటే ఎట్లా అయినా వస్తుంది. లేకపోతే నీవు శరీరమంతా మన్ను పూసుకో, నీకు రాదు. ఎంత శ్రమ పడినా రాదు. అది ముందు నీ జీవితంలో లిఖితము వుంటే వస్తుంది. లేకపోతే రాదు.

నేను ముందే చెప్పుతున్నాను నేను ఏమి ఆస్తి లేని '0' (జీరో) పాయింట్ నుంచి వచ్చాను. కొంతమంది బాగా జరిగే దినాల గురించి చెప్పుతుంటారు. తన గొప్పతనం చెప్పుకుంటారుగాని, తనకు జరగని దినాలు గురించి, తనుపడిన కష్టాలను గురించి ఎవరూ చెప్పుకోరు. తన వెనుక (గతాన్ని) మర్చిపోయినటువంటివాడు గొప్పవాడు కాదని మేము చెప్పుతున్నాము. మేము కష్టపడినాము. సుఖాలు పొందినాము. కానీ దేనినీ ఆశించలేదు. అన్నీ కర్మ ప్రకారమే జరుగుతాయి అని చెప్పాము. ఆ కర్మ ప్రకారమే మీకు కూడా డబ్బులు రావచ్చు. ఆస్తులు రావచ్చు. ఏమి అయినా

రావచ్చు. కానీ ఏమి అంటున్నామంటే నాకు పిల్లలు ఉన్నారు మీ మాదిరి భార్య ఉంది. నేను సన్యాసిని కాదు. అందరూ ఏ ధర్మము ప్రకారం నడుచుకుంటున్నారో, ఆ ధర్మము ప్రకారంగానే నడుచుకుంటున్నాను. నాకు ఒకటే పద్ధతి ఏమి అంటే, అడిగినా, అడగకున్నా పెట్టేవాడు ఎట్లాగూ పెడతాడు, భగవద్గీతలో దేవుడు ఏమి చెప్పాడు అంటే, నీ కర్మ ఫలితం ఏమి వుందో ముందే నేను లిఖించివున్నాను. నీ జీవితంలో ప్రతీది దానిప్రకారమే జరుగుతుంది. దానికంటే మినహా ఏమీ జరగదు అని చెప్పాడు. అట్లు మొట్ట మొదట పుట్టినప్పుడే మనకు నిర్ణయము అయినపుడు మధ్యలో మనము కల్పించుకొంటే వస్తాయా? రావు. నేను శ్రమ పడింటే, నేను సంపాదించుకొంటే వచ్చినాయి అంటుంటే అందరూ సంపాదించు కోవాలి అని చూస్తున్నారు గానీ ఎవరయినా పోగొట్టుకోవాలని చూస్తున్నారా! బీదవాళ్ళు ఎంతమంది ఉన్నారు? చాలామంది. ఎందుకు వున్నారు? డబ్బులు లేని వాళ్ళు ఎంతమంది ఉన్నారు? కాని వారికి లేదు, ఇంకొకనికి ఉంది. తెలివితక్కువవానికి ఆస్తులు ఉన్నాయి. తెలివి ఉండేవానికి ఆస్తులు లేవు. అది ప్రపంచ నియమము.

నేను ఏమి చెప్పుతున్నాను అంటే నేను ప్రపంచ ఆస్తి వున్నరోజు కాని, ప్రపంచ ఆస్తి లేని రోజు కానీ నేను పూర్తి ధనికుడిని. ధనము లేనివాడు ఎట్లా ధనికుడు అవుతాడు అంటే, నేను పెద్ద ధనము ఉన్నవానిని. మీ ధనము ఒకవేళ పోవచ్చు. పురుగులు పట్టి పుచ్చుపట్టి పోవచ్చు, దొంగలు ఎత్తుకు పోవచ్చు, ఇంకొకడు మోసము చేసి లాక్కొని (గుంజుకొని) పోవచ్చు. నా ధనాన్ని ఎవడూ గుంజుకొనేదానికి అవకాశం లేదు. అదే జ్ఞానధనము. జ్ఞానమనే ధనము ఒకటి ఉంది. దేవుని జ్ఞానము నీవు తెలుసుకోగలిగితే అది ధనము అవుతుంది అని చెప్పినాడు. అంటే నీకు వచ్చేది ఉంటే,

మట్టిలో కూడా నీకు బంగారు దొరకవచ్చు. ఆ రకంగా నీకు శ్రద్ధ వుండి జ్ఞానం తెలుసుకోగలిగితే, దేవుని మీద శ్రద్ధవుంటే జ్ఞానమనే ధనం చాలా సులభంగా దొరకుతుంది. ఏమీ శ్రమ పడకుండా దొరుకుతుంది. నాకు మొదటి నుండి శ్రద్ధవుంది కాబట్టి మొదటి నుంచి నా దగ్గర ఆ ధనము ఉంది. కానీ ధనము ఉంది అని నాకు కూడ తెలియదు. మొదట ఒకప్పుడు క్రొత్తగా దయ్యాలు దేవతలు వచ్చి నమస్కారం పెట్టి, మేము చెప్పినట్టు వినగల్గినపుడు, మాకు ఆ ధనము ఉంది అని తెలిసింది. వీళ్ళంతా మమ్మల్ని ఎందుకు గౌరవిస్తున్నారు మా మాట ఎందుకు వినగల్గుతున్నారు? మాకు ఎందుకు భయపడుతున్నారంటే, నేను ధనికుడిని కాబట్టి వాళ్ళ దగ్గర ఆ ధనము లేదు కాబట్టి వాళ్ళు భయపడుతున్నారని తెలిసింది. అప్పటి నుండి ఇప్పటికి ధనం పెరుగుతుంది. ఆ ధనాన్నే నేను మీ అందరికీ పంచాలని అనుకున్నాను. పంచితే నాకేమీ తరిగేదికాదు. మీరు కూడా ఆ ధనాన్ని సంపాదించుకోవాలని కోరుతున్నాము.

సరే! ఇప్పుడు జ్ఞానమనే ధనము మీకు లభిస్తే మీరు నిజమైన ధనము కలవారైతారు. ప్రపంచ ఆస్తి అనేది ఏది అయితే ఉందో, అది కనిపించే ఆస్తి, ఇది కనిపించనటువంటి ఆస్తిగా మీరు లెక్క వేసుకోండి. కానీ ఇది ఆస్తి కాదు స్తి మాత్రమే. అది కనిపించేది అయితే ఇది కనిపించనిదిగా ఉంటుంది. అది నాస్తి అవుతుంది కాని జ్ఞానధనము నాస్తి కాదు. ప్రపంచ ధనము. ఎప్పటికైనాగాని నీకు దక్కకుండా పోతాది. నీకు సంబంధం లేకుండా పోతాది. చిట్ట చివరిలో నీవు మరణించినపుడు అయినా గానీ నీవు దాన్ని వదులుకొని పోవాల్సి వస్తుంది. అది నీ వెంటరాదు. అందువల్ల నీవు దానికోసము ఏమి శ్రమపడినా ఏమీ ప్రయోజనము లేదు. జ్ఞానము నా వెంట వచ్చే ధనము. ఇది ఎక్కడికీపోదు. ఇది స్థిరస్థాయిగా

ఉండే ధనము. ఎంతమందికి పంచినాగాని పెరుగుతుంది తరగదు. అట్లాంటపుడు నేను పంచవచ్చు కదా! నేను పంచాలని అనుకున్నాను, పంచుతున్నాను. అంటే మొట్టమొదట కొన్ని గ్రంథాలు వ్రాసిన తరువాత ఒక ఉద్దేశ్యము వచ్చింది. అంటే 9 సంఖ్య వచ్చేటట్లుగా 54 గ్రంథాలు వ్రాస్తే మంచిది అనుకున్నాము. సరే 54 గ్రంథాలు తొందరగా అయిపోయినాయి. ఆ 54 గ్రంథాలు వ్రాసిన తరువాత అంతటితో ఆగితే ఏం బాగుంటుంది? కాలం వుంది కదా! వృథా ఎందుకు చేయాలి? ఇంకా మనము చెప్పవలసిన జ్ఞానము కొంత వుంది. కాబట్టి 63 వ్రాస్తే తొమ్మిది అవుతుందికదా! అనుకొన్నాము. సరే ఆ 63 గ్రంథాలు కూడా తొందరగా అయిపోయినాయి. 63 గ్రంథాలు అయిపోయిన తరువాత మరలా ఏమి చేయాలనుకున్నాము అంటే, మళ్ళీ 9 సంఖ్య రావాలి అంటే, ఎంత కావాలి 72 గ్రంథాలు కావాలి. 72 వ్రాయాలనుకున్నాము. ఇప్పుడు 72 అయినాయి, ఇప్పుడు ఏమి చేయాలి మళ్ళీ మేము. 81కి పోవాలి, 81 కూడా అయిపోయాయి. తర్వాత 90 అయిపోయాయి. చివరకు 108 కావాలను కొన్నాను ఇప్పటికి 106 అయినాయి.

ఇవన్నీ ఎవరు వ్రాయించినారు. అంటే ప్రబోధానంద స్వామి వ్రాసినాడు అని మీరు అనుకుంటున్నారు. నేను గ్రంథాలు వ్రాసేటపుడు పబ్లిక్‌గా ఎవరన్నా మీరు చూశారా! చూసినవాళ్ళు ఎవరన్నా వున్నారా మీలో? సామాన్యంగా లేరు. కానీ ఎవడో ఒకడు గ్రుడ్డిగా నడ్డిగా చూసినవాళ్ళు ఉన్నారు. నేను గ్రంథాలు వ్రాసేటప్పుడు ఎట్లా వ్రాస్తూ వుంటాము అంటే, ఒకటి మంచి టేప్ రికార్డు పెట్టుకొని, డివిడి ప్లేయర్ పెట్టుకొని, బాగా సౌండ్ స్పీకర్లు పెట్టుకొని, ఫుల్‌సౌండ్‌పెట్టి అవి పాటలు పాడుతూ ఉంటే మేము తల ఊపుకుంటూ వ్రాస్తుంటాము. అంటే అక్కడ

ఆనందంగా ఆ పాటలు వింటుంటాము, ఇక్కడ వ్రాస్తుంటాము. ఆ పాటలు ఎంత స్పీడుగా పాడుతుంటాయో, ఎంత స్పీడుగా తబల కొడుతుంటే అంత స్పీడుగా పెన్ను పరుగెత్తుతుంది. ఒకవేళ పాటలు లేవనుకోండి వ్రాయడం లేటు అవుతుంది. దీర్ఘంగా ఆలోచనచేసి కొంతసేపు అటు చూసి, ఇటు చూసి ప్రక్కల చూసి అట్లా వ్రాయలేం. అందువల్ల మేము ఏమి చేశామంటే పాటలు వింటూ వ్రాస్తూ ఉంటాము. అంటే వింటూ రాయడం ఏందయ్యా? ఇది విచిత్రంగా! దేశంలో ఎక్కడా జరుగదు. మీరు చెప్పేది మేము నమ్మాలా! అని అనుకోవచ్చు. చూసిన వాళ్ళు చాలామంది ఉన్నారు. ఓ ప్రక్క చేత్తో లయ తాళం కొట్టుకుంటూ వ్రాసిన సందర్భాలు వున్నాయి. మీకు బహుశ భగవద్గీతలో, నాడికేంద్రాలలో వుండే శక్తులు గురించి 2000, 1000, 500, 250 అని మీకు గుర్తింపు పెట్టి వ్రాసినాము. ఆరో (బాణం గుర్తు) మార్కులు పెట్టి వ్రాసినవి ఉన్నాయి. దాని గురించి వ్రాసిన మ్యాటర్ (విషయం) ఉంది. ఆ విషయం వ్రాసేటపుడు నాకు బాగా జ్ఞాపకం వుంది. పెన్ను చాలా స్పీడుగా పరుగెత్తుతుంది. అంటే ప్రక్కన పాడే పాట స్పీడుగా (వేగంగా) పోతావుంది, కాబట్టి పెన్ను కూడా స్పీడుగా పోతావుంది. వాస్తవంగా అవి లెక్కాచారం ప్రకారం వ్రాయవలసినవి అన్ని 1000, 2000, 500, 250 ఇట్లా. అవి క్రొత్త లెక్కాచారము, ఎక్కడా ఏ గ్రంథాలలో ఇంతవరకు లేదు. ప్రపంచములోనే,వాటి గురించి ఎవరూ చెప్పలేదు. దాన్ని చెప్పాలంటే ఎంత డీప్‌గా చెప్పాలి? కానీ దానిమీద ధ్యాస ఉందా! ఏకాగ్రత ఉందా! ఏమీ లేదు! ఒక ప్రక్క పాట వింటూ వ్రాయడం జరుగుతుంది. ఇది ఎట్లా సాధ్యము? అని మీరు అడిగితే, చాలా సులభంగా సాధ్యమవు తుందని చెప్పాము. ఎందుకు అంటే వ్రాసేది నేను కాదు కదా! పాట వినేది నేను, వ్రాసేది ఎవరు! వెనుక వుండే వాడు ముందర ఉండేవాడు

ఎవరో ఒకరు వ్రాస్తూ ఉన్నారు. అంటే నాలో ఉండేటువంటి వాడు, వాడు వ్రాస్తుంటే మీకు జ్ఞానం తెలుస్తుంది. ఈ జ్ఞానం అంతా ఎవరు చెప్పాలి? ప్రపంచములో తెలియని జ్ఞానమంతా, ఇంతకు ముందు చాలాసార్లు చెప్పాను. అది నేను చెప్పినది కాదు, నాకేమీ తెలియదు. నేను పెద్ద చదువు కూడా చదువుకొన్న వానిని కాదు. నాకు ఏ శ్లోకాలు నోటికి రావు. మాటల పొందిక కూడా నా దగ్గర ఉండదు. మొరటుగా మాట్లాడుతుంటాను. చెప్పేది మాత్రము నూటికి నూరుపాళ్ళు ఒరిజినల్ జ్ఞానం, చెప్పేవాడు కలడు వాడే అసలైనవాడు. కాబట్టి మీరు శ్రద్ధగా ఆ జ్ఞానాన్ని వినండి. ఒకవేళ మనిషిగా నేను చెప్పుతూవుంటే మీరు వినక పోయినా ఫరవాలేదు. కానీ చెప్పేవాడు లోపల నుంచి చెప్పుతున్నాడు కాబట్టి మీరు అశ్రద్ధ చేయవద్దండి. ఒకవేళ మీరు వింటుంటారు. ఇది ఏదో చెప్పుతున్నాడు మనం వింటున్నాములే అని ఇప్పుడు కూడా అనుకుంటుండొచ్చు. ఇప్పుడు జాగ్రత్తగా వినండి. ఎందుకంటే చెప్పేది నేను కాదు అని మళ్ళీ చెప్పుతున్నాను. ఇదే మాటనే ద్వితీయ దైవగ్రంథములో మత్తయి 10లో వాక్యము 20లో వ్రాసియున్నారు చూడండి.

ఇప్పుడు ఈ ఆస్తి అంటే జ్ఞానధనము అనేది నీవు సంపాదించుకో గల్గితే ఏమవుతుంది అంటే జ్ఞానధనం వస్తుంది కదా! జ్ఞాన ధనం వస్తే ఏమవుతుంది. లోపల ఉండే వానితో దోస్తి కలుగుతుంది. లోపల ఆస్తి ఉంటే ఏమవుతుంది, దోస్తి కలుగుతుంది. బయట ఆస్తి వుంటే ఏమవుతుంది. బయట మనుషులతో దోస్తి కలుగుతుంది. బయట మనుషులలో దోస్తి కలిగితే ఏమవుతుంది అంటే, వాడు ఉండేవి కూడా గుంజుకొని పోతాడు. బయట మనుషులు అట్లే చేసేది. ఒకరికొకరు మోసం చేసుకుంటుంటారు. లోపలవానితో దోస్తి కల్గితే ఏమవుతుంది. నీవు మోసే బరువును వాడు

మోస్తాడు. అర్థమయిందా! నీవు ఏమి బరువు మోయవద్దురా! నేను మోస్తాను అని అంటాడు. ఇప్పుడు నేను వ్రాయవలసిన వ్రాతను, గ్రంథము ఆయనే వ్రాశాడు. నా బరువు అంతా ఆయన మోసాడు. ఎవరు నా దోస్తి. అందుకే దోస్తి అని అంటే ఏమని అర్థము? 'దో' అంటే రెండు అని మీకు తెలుసు. దోస్తి అంటే రెండవ వానితో పరిచయము. బైబిల్‌లో కూడా ఉంది. నీవు దొంగతనం చేసి అయినా నీ స్నేహితుని సంపాదించుకో అని చెప్పారు. స్నేహితులు ఉండేది నీకు, లోపల వుండేవాడు. నీవు, పొరుగు వానిని ప్రేమించుము అని అన్నాడు. పొరుగువాడు వుండేది? నీలోపలే వున్నాడు. బయట లేడు, బాగా గుర్తు పెట్టుకోండి, మీరు జ్ఞానం తెలుసుకోగల్గితే మీ లోపలవున్నాడు. ఆత్మే మీకు దోస్తి అవుతాడు. ఆ దోస్తి అయితే ఏమవుతుంది అంటే నీవు మోయవలసింది, ఆయన మోయడం జరుగు తుంది. ఆస్తి వస్తే దోస్తి వస్తుంది. బయట ఆస్తి వస్తే బయట దోస్తి వస్తుంది. లోపల ఆస్తి వస్తే లోపల దోస్తి మీకు దొరకుతాడు. ఆ దోస్తి దొరికితే ఒరే! నీ బరువు అంతా నేను మోస్తాను అని అంటాడు. ఎందుకంటే నీ బరువు మోసేదానికి ఆయన రెడీగా ఉన్నాడు. కానీ మీరు మాయంతకు మేము మోస్తాము అని అనుకుంటున్నారు. ఇంకొక దోస్తిని మీరు నమ్మడం లేదు. లోపల ఉండే దోస్తిని. ఒక తూరి (సారి) నమ్మండి. మీరు లోపల వుండే ఆస్తిని సంపాదించుకోండి. ఆ దోస్తి దొరికితే మీకు కర్మలన్నిటిని అనుభవించకుండా తప్పించుకొనే అవకాశం వస్తుంది. ఈ విషయాన్ని భగవద్గీత జ్ఞానయోగములో 36వ శ్లోకంలో ఈ విషయాన్ని చెప్పినాడు. ఎంత పాపాత్ముడివి అయినాకానీ ఆ పాపాన్ని నీవు అంటుకోకుండా తప్పించు కొనేటటువంటి ఉపాయం ఒకటి ఉంది అని చెప్పాడు. అంటే మురికి నీటితో కూడుకున్న సముద్రాన్ని అయినాగాని చిన్న పడవతో దాటిపోవచ్చును.

ఆ మురికి నీరును అంటకోకుండ దాటవచ్చును అని చెప్పాడు. ఆ రకంగా చెప్పుతూ మరల 37వ శ్లోకంలో ఏమి చెప్పినాడు అంటే ఇది ఎట్ల సాధ్యమయితుంది. అని మీకు అనుమానం కలుగవచ్చు. దానికి చిన్న ఉదాహరణ చెప్పుతాను చూడు అని ఏ విధంగా అగ్నిలో కట్టెలు కాలిపోతాయో ఆ విధంగా జ్ఞానం అనేటువంటి అగ్నిలో మీ కర్మలు అనేటువంటి కట్టెలు కాలిపోతాయి. అని చెప్పాడు. నేను భగవద్గీతను కంఠాపాటముగా చదువలేదు కానీ అక్కడ చెప్పినట్లు జ్ఞాపకం ఉంది. వేరే స్వామీజీలు అయితే టక టక నోటికి చెప్పేస్తారు. అంత ఎందుకు? నా దగ్గర ముందు కూర్చొన్న వాళ్ళు మీరు కూడా చెప్పుతారు. కొంతమంది శ్లోకాలన్నీ చెబుతారు. నాకు ఆ శ్లోకాలు చెప్పే దానికి రాదు. జ్ఞానం చెప్పేది మాత్రం వస్తుంది. జ్ఞానం కూడా ఎవరు చెప్పుతారు. లోపల వుండే ఆయన చెప్పాల్సిందే. ఆయనకు శ్లోకాలతో పని లేదు కదా! నాకు అంతకు పనిలేదు. కాబట్టి ఆ శ్లోకాలు మీకు జ్ఞాపకం చేసి చెప్పాలంటే, భగవద్గీత గ్రంథము తీసుకొని మేము చెప్పుతాము, ఏమీ అనుకోకుండ వినండి 36వ శ్లోకం ఏమి చెప్పుతున్నాదో చూడండి.

**జ్ఞానం యోగం 36వ శ్లోకము...**

శ్లో॥ అపిచేదసి పాపేభ్యః సర్వేభ్య పాపకృత్తమః ।
సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥

అని చెప్పుతాడు. దానిని తెలుగులో చెప్పితే. **“అఖిల పాపాత్ములయందు నీవు ఎంత యధమ పాపయుతుడైనా గానీ, అంటే పాపాత్ముల్లోకెల్లా పాపాత్ముడైనా గానీ కలుష జలధి ఎల్ల జ్ఞాన ప్లవంబుచే దాటగలవు నీవు.”** అంటే మురికి సముద్రాన్ని అయినాగాని జ్ఞానం అనేటువంటి చిన్న ఓడలో

దాటి పోగలవు నీవు అని చెప్పాడు. ఇక్కడ దేవుడు చెప్పినటువంటి విధానము వల్ల మనము కర్మల నుంచి బయట పడవచ్చును, అని మనకు ఒక ఆధారం దొరికింది. తరువాత ప్రక్క శ్లోకంలోనే ఏమి చెప్పాడు అంటే.

**జ్ఞానయోగం 37వ శ్లోకము..**

శ్లో॥ *యథైధాంసి సమిద్ధోగ్ని భస్మసాత్కురు తేర్జున ।*
*జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥*

**తెలుగు శ్లోకము :-**

*అగ్నియందెన్ని కట్టియలైనగానీ*
*భస్మమైనాశమొందెడుపగిదిపార్థ!*
*జ్ఞానమనునగ్ని చేసర్వకర్మచయము*
*భస్మమొనరింపబడుచుండు విస్మయముగ.*

ఏమాత్రము అనుమానము లేకుండా ఎంత పెద్ద కర్మలు అయినా గాని భస్మీ పటలం అయిపోతాయి అని అక్కడ చెప్పాడు అన్నమాట. ఇక్కడ మనకు ఎందుకు భస్మీపటలం అవుతాయి అంటే, నీలో ఉండేటువంటి దోస్తి అంటే స్నేహితుడు, ఆ కర్మలన్నిటిని తీసివేస్తాడు. ఆ కర్మలన్నిటినీ తీసివేస్తే ఏమాత్రము అనుభవించకుండా పోయేదానికి అవకాశము ఉంది. అంటే నీవు జ్ఞానం తెలుసుకోగల్గితే ఆ కర్మలన్నీ పోయేదానికి అవకాశం ఉంది. అంటే నీవు లోపల ధనాన్ని సంపాదించుకోగల్గితే, నీ కర్మలు లేకుండా చేసే శక్తి ఎవరికైతే ఉందో, వాడు ఆ కర్మలు లేకుండా చేస్తాడు అనే భావాన్ని ఇక్కడ ఇమిడ్చి చెప్పడం అయింది. ఇది ఒక్క భగవద్గీతలోనే చెప్పినారా అంటే, ఇది సృష్టి ఆదిలో చెప్పిన జ్ఞానం తిరిగి

మనుషులకు అర్థం కాకుండా వుంటే, మనిషిగా వచ్చిన కృష్ణుడు మనుషులకు చెప్పాడు. మనిషిగా వచ్చిన కృష్ణుడు మనిషికాదు. మనిషివలె వచ్చిన కృష్ణుడు మనిషి కాకుండ ఉండే కృష్ణుడు భగవంతుడు అయినంటివాడు ఈ జ్ఞానాన్ని మనుషులకు చెప్పాడు. ఇది చెప్పినపుడు భగవద్గీత గ్రంథంగా రూపొందినది. అది ఎవరి చేతనైతే ఈ అజ్ఞానం ప్రబలిపోయిందో ఎవరి చేతనయితే అధర్మాలు వ్రాయబడినాయో, వాళ్ళ చేతనే ఈ గ్రంథాన్ని వ్రాయించాడు. ఎవరు అధర్మాలు గురించి వ్రాశారు? ప్రపంచానికి అందరికి తెలిసేటట్టుగా వ్రాసినవాడు వ్యాసుడు. ఆయన వ్రాసిన అధర్మాల తరువాత, అతనితోనే భగవద్గీత గ్రంథాన్ని వ్రాయించాడు కృష్ణుడు. చూడండి! ఎంత తెలివిగా వ్రాయించాడు? చెప్పింది అర్జునుడికి, వానికి అర్థముకాక వ్యాసుని వద్దకు పోయి అడిగినాడు. అప్పుడు ఆయనకు (వ్యాసునికి) అర్థమయింది. అర్థమై నేను అజ్ఞానమంతా వ్రాసినాను, అధర్మాలు వ్రాసినాను అని చెప్పి ఆయన మరల ధర్మాలు గురించి వ్రాయడం జరిగింది.

ఈ రకంగా భగవద్గీత సంపూర్ణమైనట్టి జ్ఞానంతో మనకు వచ్చింది. మరల అంతటితోనే ఆగిపోయిందా అంటే ఇక్కడనే, ఈ భారతదేశంలో భగవద్గీత తెలిసినప్పటికీ మిగతా దేశాలలో ఈ జ్ఞానం తెలియదు కదా! ప్రపంచములోని మనుషులందరికీ జ్ఞానం అవసరం కదా! అది ఒకటే జ్ఞానం అవసరం. ఇంకొక జ్ఞానం అంటూ ఏదీ లేదు. ఉండేది ఒకటే విధానము, లోపల కర్మలు వున్నాయి. ఆ కర్మలు లేకుండా చేసుకొనే జ్ఞానము అంతా ఒకటే కాబట్టి, అది అందరికీ తెలియాలని ఉద్దేశ్యంతో మరల తరువాత ఇంకొక దేశంలో బైబిల్‌గా, ఇంకొక దేశంలో ఖురాన్‌గా చెప్పబడింది. ఆ గ్రంథాలలో కూడా ఇక్కడ చెప్పిన రెండు శ్లోకాల సారాంశము అక్కడ ఉంది. కానీ చాలామందికి తెలియదు. ముస్లీమ్‌లు

ఈయన ఏదో భగవద్గీత శ్లోకాలు చెప్పి, మా ఖురాన్‌లో కూడా వున్నాయి అంటాడు అని చెప్తుతూ ఉంటారు. ఎందుకు లేవు. బైబిల్‌లో ఎక్కడ వున్నాయి అంటే ఉన్నాయి. అక్కడ కూడా ఉన్నాయి. నీ కర్మలంతా లేకుండా చేస్తాను, అని చెప్పిన విషయాలు అక్కడ కూడా ఉన్నాయి. నీ పాపాన్ని క్షమిస్తాను, దేవుడు కరుణామయుడు. అపార కృపావంతుడు అని చెప్పినటువంటి మాటలు అక్కడ కూడా ఉన్నాయి. దేవుడు క్షమాశీలుడు, క్షమిస్తాడు అనే విషయాలు అక్కడ కూడా ఉన్నాయి. ఇప్పుడు ముస్లీమ్‌ను అడిగితే ఇది మా అల్లా అయితే క్షమిస్తాడు. మీ కృష్ణుడు ఎక్కడ క్షమిస్తాడు అని అంటారు. అల్లా ఏంటి కృష్ణుడు ఏంటి? నీకు అల్లాగా కనిపిస్తాడు. మాకు కృష్ణుడుగా కనిపిస్తాడు. అల్లా అన్నా కృష్ణుడు అన్నా అంతా ఒకటే. దేవుడు ఉండేది ఒకడే ప్రపంచములో ఇంక ఎవరూ లేరు అని మేము అంటే అది ఎట్లవుతుంది? మా అల్లా వేరు, మా దేవుడు వేరు, మీ దేవుడు వేరు అని కొంతమంది తెలియక మాట్లాడు తుంటారు.

మేము ఏమి చెప్తుతున్నాము అంటే మీదేవుడు, మా దేవుడు అనే ప్రసక్తే లేదు. ఇక్కడ ప్రపంచములో ఉండేది ఒకే దేవుడే. ఆ ఒక్క దేవున్నే మనము తెలుసుకోవాలి. చెప్పినది కూడా ఆ ఒక్క దేవుడే చెప్పినది. కాని ఈ రోజు అల్లా అని ఎవరినయితే అంటున్నారో, అల్లా అంటే ఏమి అర్థం? అంటే వాళ్ళు ఏమంటున్నారు. దేవుడు అంటున్నారు. అల్లా అనే పదం ఎక్కడ నుంచి వచ్చింది, అంటే మా ఖురాన్‌లో వ్రాయబడింది అంటున్నారు. ఖురాన్‌లో ఎక్కడ నుంచి వ్రాయబడింది. ఎవరు చెప్పితే వ్రాయబడింది. మహమ్మద్ ప్రవక్తగారికి జిబ్రయేల్ ఖురాన్ జ్ఞానాన్ని చెప్పినప్పుడే చెప్పినాడు. "అల్లా" అనే పదాన్ని 'అల్లా' అనే మాట చెప్పాడు. అల్లా అనేటివంటి పదం ఎక్కడిది. అంటే సృష్టి ఆదిలో జిబ్రయేల్ వినగల్గినాడు. సృష్టి ఆదిలోనే

అక్కడ తెలిసింది ఈయనకు ఎప్పుడో తెలిసింది ఈ జ్ఞానం. అక్కడే వినగల్గి ఆమాట ఇక్కడ చెప్పగల్గినాడు. ఈ అల్లాహ్ అనే పదం సృష్ఠి ఆదిలో ఉన్న టువంటింది గాని మధ్యలో వచ్చింది కాదు. ఏదో 1400 సంవత్సరముల క్రింతం వచ్చింది కాదు ఇది. ఈ ఇస్లాం మతం పుట్టినపుడు వచ్చింది కాదు. ఇది అనాదిగా ఉంది ఈ పదము సృష్ఠి ఆదిలోనిదని ఎవరికీ తెలియదు. ఎవరికీ తెలియదంటే హిందువులకు ఏమి తెలుస్తుంది. ముస్లీంలకు ముఖ్యంగా తెలిసి ఉండాలి. హిందువులకు అసలు తెలియదు. ముస్లీంలకు అంతకూ తెలియదు.

'అల్లాహ్' అంటే అర్థము ఈ గ్రంథములో వ్రాశాము, 'లాహ్' అంటే అంతు, 'అ' అంటే లేదు. **అల్లాహ్ అంటే అంతు లేనటువంటి వాడు.** గట్టులేనటువంటి వాడు అని అర్థం చెప్పడం జరిగింది. మనకు ఇంతగొప్ప అర్థం ఎక్కడా దొరకదు అనుకుంటాను. అంతం లేనటువంటి వాడు దేవుడు అని మనము ముందునుండి చెప్పుకుంటున్నాము. అంతులేనటువంటి దేవున్ని గురించి అల్లాహ్ అనడం జరిగింది. అదే అంతులేని దేవున్ని గురించి పరమాత్మ అనడం జరిగింది. అదే దేవున్ని గురించి, ప్రపంచాన్ని సృష్ఠించాడు కాబట్టి సృష్ఠికర్త అని అనడం కూడా జరిగింది. ఏ రకంగా చెప్పుకున్నా దేవుడు ఒక్కడే. ఆ దేవుడు అన్ని గ్రంథాలలోనూ అంటే మూడు గ్రంథాలలోనూ మీకు పాపక్షమాపణ జరుగుతుంది అని చెప్పాడు తప్ప, జరగదు అని చెప్పలేదు. నా జ్ఞానాన్ని మీరు తెలుసుకోగల్గినపుడు జరుగుతుంది. జ్ఞానం తెలియనపుడు ఏమీ జరగదు. మీ కర్మ అనుభవించవలసిందే అని చెప్పాడు. జ్ఞానం తెలియకపోతే ఏమవుతుంది. మేమే అన్ని చేసుకుంటాము అనే భావన మీకు వుంటుంది. ఇందాక చూడండి మన ముందరికి ఒక దేవతవచ్చి

మాట్లాడింది. ఏమని మాట్లాడింది. మేమే అన్నీ చేసుకుంటున్నాము. మా భక్తులే మాకు అన్ని అర్పిస్తున్నారు. మేము దేవతలం, ఎప్పటికీ ఉంటాము అని అనుకుందంట ఆమె. ఆ భావం మనుషులలో ఉంది, దేవతలలో ఉంది అందరిలోను ఉంది. ఆ భావము ఉన్నంత వరకు పాపాలు వస్తున్నాయి. మరల వాళ్ళు పుట్టడం జరుగుతుంది. అనుభవించడం జరుగుతుంది అనుభవించినపుడు ఒక్కొక్కరు ఒక్కో బాధ అనుభవిస్తున్నారు. ఒక్కొక్కరు ఒక్కో రోగం అనుభవిస్తున్నారు. కొంతమంది క్యాన్సర్ రోగంతో, కొంతమంది క్షయ రోగంతో, కొంతమంది హెచ్ఐవి రోగంతో కొంతమంది ఇంకొక రోగంతో భయంకరమైన రోగాలు అనుభవిస్తున్నారు. కొంతమంది ఏ రోగము అనేది తెలియదుకాని శరీరంలో బాధ మాత్రము వుంది, మరల ఏ రోగము అని కూడా నిర్ణయించలేరు డాక్టర్లు. ఇది ఫలానిది అని చెప్పలేరు. అట్లా వాళ్ళు కూడా బాధను అనుభవిస్తూ ఉన్నారు. ఇవన్నీ అనుభవాలు ఎందుకు వస్తున్నాయి. మన కర్మ వలన వస్తున్నాయి.

ఈ కర్మ లేకుండా పోవాలంటే ఏమి చేయాలి. జ్ఞానం అవసరం. జ్ఞానం అవసరమైతే ఏమి చేయాలి. భగవద్గీతలోనో, బైబిల్‌లోనో, ఖురాన్ లోనో ఏ గ్రంథములో అయినా జ్ఞానము ఉంది చదువుకోవచ్చు మీరు. మూడు గ్రంథాలలో ఉండేది ఒకటే జ్ఞానమే. కానీ అక్కడ వుండే భాషను బట్టి గ్రంథాన్ని బట్టి, వేరు వేరు జ్ఞానం ఉంది అనుకుంటున్నారు గానీ అందులో ఒకే ఒక జ్ఞానం ఉంది. వేరు వేరు జ్ఞానం ఏమీ లేదు. నీకు లోపల ఆత్మ అనేది ఒకడు వున్నాడు అని చెప్పుకుంటున్నాము. భగవద్గీత ప్రకారము. ఆత్మ ఉందని ఖురాన్‌లో ఉంది. అదే ఆత్మ ఉందని బైబిల్‌లో కూడా ఉంది. ఈ మూడు గ్రంథాలకు సంబంధించిన వాక్యాలు ఇప్పుడు వచ్చిన **"ఒక్కడే ఇద్దరు"** అనేటువంటి గ్రంథములో వివరించి చెప్పడం

జరిగింది. ఈ గ్రంథములో మీకు ప్రత్యేకమైనటువంటి విషయాన్ని ఏమి చెప్పినాము అంటే ప్రతి గ్రంథములోనూ ఒక క్రొత్త విషయం మీకు తెలియాలి కదా! మరల ఇప్పుడు నేను స్వంతం చెప్పినది కాదు, ఎందుకంటే పాటలు వినుకుంటూ కూర్చొన్నాను. నాకు ఏమీ తెలియదు కానీ, వ్రాసిన వాడు ఏమి వ్రాసినాడు అంటే, ఇంతకుముందు భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగం 48వ శ్లోకంలోనూ, 53వ శ్లోకంలోనూ ఒక విషయం చెప్పబడింది. అందులోని విషయము ఏమి అంటే? ప్రపంచములో ఉన్నటువంటి 4 అధర్మాలు ఏవి అయితే వున్నాయో, 4 అధర్మాలు గురించి చెప్పబడింది. వాస్తవముగా అధర్మాలు అంటే ఏమిటివో తెలియదు మనకు. వాస్తవంగా చాలామందికి ధర్మాలు అంటే ఏమిటివో తెలియదు.

మేము ఇంతకు ముందు కూడ చెప్పాము. జ్ఞానపరీక్ష పెట్టినపుడు అధర్మాలు 4 (నాలుగు). ధర్మాలు మూడు (3) ఉన్నాయి. అధర్మాలను అణచి వేసే దానికోసం, దేవుడు 3 ధర్మాలను ప్రవేశ పెట్టినాడు. అధర్మాలను తెలియజేసేదానికే విశ్వరూప సందర్శన యోగంలో 48, 53 శ్లోకాలలో 4 అధర్మాల గురించి చెప్పి వీటివలన దేవుడు ఏమాత్రము తెలియబడడు. దేవుడిని తెలుసుకొనేదానికి శక్యము కాదు అని చెప్పాడు. వేటివలన అయితే శక్యం కాదు అని దేవుడు చెప్పాడో, వాటినే మనమంతా అనుసరిస్తున్నాము. కాని ఇది మంచి పద్ధతి కాదని మేము చెప్పుతున్నాము. కృష్ణుడు అదేమాట చెప్పాడు. అంతకుముందు రావణబ్రహ్మ కూడా అదే మాట చెప్పినాడు. కాని ఎవరు చెప్పినా విననటువంటి మనుషులు ఈ రోజుకూడా అదే ఆచరణను అనుసరిస్తున్నారు. ఏమిటి ఆ నాలుగు అధర్మాలు అని అంటే, అవి మేము చెప్పడమేకాదు, పబ్లిక్‌గా భగవద్గీత గ్రంథములో ఏమని వుంది? **యజ్ఞ, దాన, వేదాధ్యాయణ, తపస్సులు ఈ నాలుగు అధర్మాలే.** ఈ నాలుగు

వలన దేవుడు తెలియబడడు. అధర్మములనే మనుషులు చేస్తున్నారు. భక్తి, జ్ఞానము అనే వాటిలోనికి మనిషి ప్రవేశిస్తే ధర్మములు తెలియని మనిషి అధర్మములయిన నాలుగింటిని చేస్తున్నాడు. ధ్యానము అనే పేరుతో తపస్సులు చేస్తున్నారు. అదే ధ్యానము. ఇంకా కొంతమంది యజ్ఞాలు చేయిస్తున్నారు. తరువాత ఇంకా బాగా చేసే దానికి వేదాలు చదివిస్తున్నారు. మరి ఈ మధ్యన ఒక టీవి ఛానల్‌లో కూడా చెప్పినారు. “అజ్ఞానం పెరిగిపోతుంది దేశంలో, యజ్ఞాలు చేయండి, యాగాలు చేయండి ఇవన్నీ చేయండి” అని చెప్పుతున్నారు. అంటే అజ్ఞానం పెరిగిపోతావుందంట. ఇవన్నీ చేస్తే తరిగిపోతాది అని చెప్పుతున్నారు. ఎక్కడ తరిగిపోతుంది? ఇవన్నీ ఉంటేనే అవి పెరిగేది అని మనము మొత్తుకుంటున్నాము. ఇక్కడ మనము ఎంతన్నా గట్టిగా అరుస్తూ చెప్పు, వీళ్ళు మాత్రం అవే చేయండి అని చెప్పుతున్నారు.

ఎట్లో వాళ్ళకి తెలిసిందేదో వాళ్ళకి తెలిసింది, మనకు తెలిసింది ఏదో మనకు తెలిసింది. ఇప్పుడు దేవుడు ధర్మాలు మూడే మూడు అని చెప్పినాడు. అవి ఏమని చెప్పినాడు అంటే **బ్రహ్మయోగము, కర్మయోగము** అనేటివి సాధారణమైన రెండు యోగాలు మనుషులు ఆచరించేటివి. ఇంకా దీనికంటే గొప్పది భక్తి యోగము అని చెప్పాడు. మూడు యోగాలు గురించి చెప్పినాడు. ఇవే మూడు ధర్మాలు. ఈ మూడు ధర్మాల వలన దేవున్ని తెలుసుకోవచ్చు అని చెప్పినాము. సరే మూడు ధర్మాల వలన దేవుడిని తెలుసుకోవచ్చు అని చెప్పితే, ఈ మూడు ధర్మాలను ఆచరించకోకుండా యజ్ఞ, దాన, వేదాధ్యాయణ, తపస్సులనే మనుషులు ఆచరిస్తున్నారు. అవి అయినాగాని మనుషులు అంతా అందరూ ఆచరిస్తున్నారా? అంటే హిందువులలో ఒక కులము మాత్రమే వేదాలు చదవడం ఉంది. యజ్ఞాలు

చేయడం ఉంది. ఇంకా కొంతమంది. కొంత కొంత భక్తి మార్గంలోనికి పోయిన వాళ్ళు ధ్యానము చేయడము ఉంది. తపస్సు చేయడం ఉంది. మిగతా వాళ్ళంతా పనులు చేసుకొని బ్రతుకుతుంటారు. వాళ్ళకి జ్ఞానమేదో అజ్ఞానమేదో ధర్మాలు ఏవో, అధర్మాలు ఏవో ఏవీ తెలియవు. వాళ్ళు తటస్థంగా ఉన్నారు. ఇప్పుడు మళ్ళీ ఆ లెక్కకిపోతే ఈ అధర్మాలు కల్గిన వాళ్ళు ఎంతమంది ఉన్నారు అంటే 100 మందికి 10 మంది తప్ప ఎక్కువ మంది లేరు. 1000 మందికి 100 మంది కూడా ఉన్నారో లేదో చెప్పలేము. ఇంకా తక్కువే ఉండవచ్చు.

ఇప్పుడు అన్నిటికంటే పెద్ద అధర్మము ఒకటి కొత్తగా ఇప్పుడు వచ్చింది. ఎప్పటి నుండి వచ్చింది? గత నాలుగు యుగాల నుంచి నాలుగు అధర్మాలు ఉంటే, ఇప్పుడు ఈ మధ్యన క్రొత్తగా కలియుగంలో ఒకటి పుట్టుకొచ్చింది. అది ఏసుప్రభువు వచ్చినప్పటి నుండి, అంటే ఏసు ప్రభువు ఇశ్రాయేల్ దేశంలో పుట్టినప్పటి నుండి అది ఒక రోగముగా మొదలయినది. మతము అనేది అధర్మముగా మొదలయినది. దేవుడు చెప్పినటువంటి నాలుగు అధర్మాలు అణిచి వేయడానికే ఆయన ఇంతకుముందు రెండుసార్లు వచ్చినాడు. మూడు గ్రంథాలు చెప్పినాడు. ఈ మూడు గ్రంథాల జ్ఞానమంతా నాలుగు అధర్మాలు లేకుండ చేసే దానికి చెప్తే, అంత పెద్ద జ్ఞానం, మూడు యుగాల నుంచి చెప్పితే, ఇప్పటికీ అర్థం కాలేదు. ఇంక ఇప్పుడు నాల్గవసారి కలియుగంలో మతము అనేది వచ్చింది. ఇది ఎంత శాతము ఉందంటే, 1000కి 999 మందికి ఉంది మతమనే ఈ రోగము పెద్ద అధర్మము అయిపోయింది. దేవున్ని తెలుసుకోవడానికి అవకాశమే లేదు. ఇది పెద్ద అధర్మంగా వచ్చింది ఇప్పుడు. ఈ అధర్మాలను తీసివేసేదానికి మరలా తిరిగి దేవుడు రావలసిందే! దానికి ప్రత్యేకమైన బోధ చెప్పాల్సిందే! ఇంతకు

ముందు చెప్పిన బోధలన్నీ దీనిముందర కుదరవు. ఇంతకు ముందు చెప్పిన బోధనలన్నీ దేనికి? నాలుగు అధర్మాలకు. ఇప్పుడు దీనికోసము ప్రత్యేకంగా చెప్పాలి. మరల దీనిని ప్రత్యేకంగా చెప్పాలంటే ఏసుప్రభువు తన శిష్యులకు ఏమి చెప్పినాడు అంటే నేను చెప్పవలసింది ఇంకా ఉంది. మీరు వినవల్సింది ఇంకావుంది. ఎందుకంటే నాతోనే ఇక్కడ నేను వచ్చినపుడే మొదలయింది. ఈ మతము అనేది క్రైస్తవ మతము అనేది. **ఇప్పుడు నేను ఈ విషయాన్ని చెప్పితే మీరు సహించుకోరు. మీరు ఒప్పుకోరు, అసలుకు ఇది జాడ్యంగా మారిపోయింది. తరువాత నా వెనుక వచ్చేవాడు చెప్పుతాడు మీకు అని చెప్పాడు. నా తరువాత వచ్చేటువంటి ఆదరణకర్త మీకు ఈ చెప్పవలసిన విషయాలు చెప్పుతాడు. నేను చెప్పవలసినవి ఇంకావున్నాయి. మీరు ఇప్పుడు దీనిని సహింపలేరు. మీకు అర్థము కాదు. మీరు చెప్పినా సహించరు** కాబట్టి తరువాత ఈ చెప్పవలసినది ఏదో చెప్పుతాము. ఈ మతం అనేదానిని గురించి, అప్పుడు చెప్పలేదు. మూసిపెట్టినాడు, సస్పెన్స్‌లో (రహస్యంగా) పెట్టినాడు ఆయన. దాని గురించి 'క్లూ' ఇచ్చిపోయినాడు. తరువాత వచ్చినప్పుడు చెప్పుతాను అని చెప్పాడు. ఇప్పుడు మనము ఏమి చెప్పుతున్నాము అంటే, ఆయన చెప్పబోయేది ఇదే అని కొంచెం మనకు అర్థమయింది. ఇప్పుడు 100కి 99 మందికి ఈ మతమనే అధర్మ జాఢ్యము వుంది.

ఇంతకు ముందు ఈ అధర్మాలు కొంతమందికే ఉండేవి. హిందువులలో ఉండేటివి. తరువాత మిగతా మతాలలోకి రెండు అధర్మాలు పోయినవి. వాళ్ళకి నాలుగు అధర్మాలు పోలేదు. ముస్లీమ్‌లు ఉన్నారు. క్రైస్తవులు ఉన్నారు. హిందువులకి ఉండే యజ్ఞాలు, వేదాలు, మా దగ్గర లేవుకదా! అని అనుకుంటున్నారు. అయితే దేవుని గురించి ధ్యానం చేసేది

వుంది వాళ్ళకు. దేవుని గురించి మనస్సులో అనుకోవడం ఉంది. అంటే దేవుని గురించి మనస్సులో అనుకోవడం తప్పేనా అంటే తప్పు అనే పెద్దలు చెప్పినది. దేవుని గురించి తపించేదాన్ని తపస్సు అంటున్నాము. కాని అది కూడ ఉండకూడదు అని చెప్పినారు. తరువాత దానాలు చేసేది ఉంది. ముస్లీమ్‌లలో లేదా? బక్రీద్ పండుగ రోజు దానాలు చాలా చేస్తారు. వారు హిందువులకంటే ఎక్కువ చేస్తారు. దానాలు అనేది క్రైస్తవులలో ఉంది, ముస్లీమ్‌లలో ఉంది. ధ్యానము అనేది క్రైస్తవులలో ఉంది, ముస్లీమ్‌లలో ఉంది. వారు వేరే పేర్లతో అనవచ్చు. వాళ్ళు ప్రార్థన అనే పేరుతో వాళ్ళు చేస్తున్నారు. దాని ప్రకారము వాళ్ళ దాంట్లో రెండు అధర్మాలు ఇరుక్కున్నాయి. హిందువులలో నాలుగు అధర్మాలు ఇరుక్కున్నాయి.

అధర్మాలు లేకుండా పోయేదానికి బైబిల్, ఖురాన్, భగవద్గీత మూడు గ్రంథాలు వచ్చినాయి. దైవగ్రంథాలు మూడు తరువాత వేరే గ్రంథము వచ్చే దానికి అవకాశము లేదు. ఎందుకంటే అంతిమ గ్రంథముతో చెప్పవలసిన నాలుగు అధర్మాలు గురించి, చెప్పవలసిన సమాచారము అంతా వచ్చేసింది. ఆ గ్రంథము తరువాత దైవ గ్రంథము వచ్చేదానికి అవకాశము లేదు. అంతిమ దైవగ్రంథము వచ్చేసిన తరువాత ఇంకో దైవగ్రంథము వచ్చేదానికి అవకాశమే లేనప్పుడు, ఐదవ అధర్మము. **మతము అనేది ఐదవ అధర్మము.** ఆ మతము పెట్టుకొని మనము అంతమై పోతావున్నాము. కాబట్టి ఈ మతము అనేది పెద్ద ఐదవ అధర్మంగా నేడున్నది. ఈ రోజు మీకు అందించిన క్రొత్త గ్రంథములో కూడా అదే వ్రాసాము. ఈ మతము అనేది పెద్ద అధర్మంగా వచ్చింది. ఇది ఎవరికీ తెలియకుండా ప్రాకి పోయింది. నాలుగు అధర్మాలు ఏదో 100కి 10 మందిలో వున్నాయి గాని, ఈ మతము అనేది 100కి 99కి ఇంకా ఎక్కువమందిలో వున్నాయి.

10 సంవత్సరముల చిన్న పిల్లవానిలో కూడా మతము అనే అధర్మము ప్రవేశించింది. ఇది ప్రతి ఒక్కరిలో ఉంది. ఏమాత్రము జ్ఞానము తెలియని వాళ్ళకు కూడా మతము అనేటువంటి ద్వేషము ఉంది. ఈ రకంగా తయారు అయిపోయింది. దీన్ని లేకుండా చేయాలి అంటే ఏమి చేయాలి. అంటే క్రొత్త జ్ఞానం కావాలి. ఇది అధర్మము అని తెలుసుకొనే దానికే క్రొత్త జ్ఞానము మనకు అవసరము. ఇప్పుడు తెలుసుకున్నాము. దీనిని లేకుండా చేసేదానికి పెద్ద జ్ఞానం కావాలి.

మరల దేవుడు ఏ పథకంతో దీనిని లేకుండా చేస్తాడో, మనకు తెలియదు కానీ లేకుండా మాత్రము చేస్తాడు. కానీ టైం (సమయం) పడుతుంది. ఒక రోగం లేకుండ పోవాలంటే మందులు వేసుకోగా వేసుకోగా ఒక వారానికో, పది రోజులలో ఆ రోగం పోతుంది అన్నమాట. అంత తొందరగా ఏదైనాగాని ఒక్కసారిగా రోగము పోదు. ఆ రకంగానే మనకు వచ్చిన అధర్మము అనే రోగము పోవాలి. నాలుగు రోగాలు ముందే ఉన్నాయి. ముస్లీంలకు రెండు రోగాలు ఉన్నాయి. హిందువులకు నాలుగు రోగాలు ఉన్నాయి. ఇప్పుడు అందరికీ కలిసి ఒక రోగము వచ్చింది ఐదో రోగము. పెద్దది వచ్చింది. ఇది ముస్లీంలకు ఉంది, హిందువులకు ఉంది, క్రైస్తవులకు ఉంది అందరికీ ఉంది. ఇప్పుడు తగులుకుంది. దీనిముందర దేవుడు ఎవరూ కనపడలేదు. కాబట్టి దేవుడు ప్రపంచానికంతా ఒక్కడే. ఆ సృష్టికర్త ఒక్కడే. ఆయన గురించి మనము తెలుసుకోవాలి. ఈ మతము అనేటువంటి అధర్మము నుంచి బయటపడాలి. మతము అనే అధర్మము నుంచి బయటపడాలంటే దానికి కావలసిన జ్ఞానం చాలా తెలుసుకోవాలి మనము. ఇంతకు ముందు ఉండే జ్ఞానమంత మనము తెలుసుకున్నాము అనుకొన్నా పూర్తి అర్థము కాలేదు. భగవద్గీతలో చెప్పినది

హిందువులకు అర్థం కాలేదు. బైబిల్‌లో చెప్పినది క్రైస్తవులకు అర్థంకాలేదు. ఖురాన్‌లో చెప్పినది పూర్తి ముస్లీంలకు ఏమైనా అర్థము అయిందా అంటే అది కూడా అర్థము కాలేదు. ఎందుకంటే వేరే భాషలో చదువుకోవాలంటే వాళ్ళకు ఆ భాష ఏదో అర్థము కాకుండా, దాని జ్ఞానమే తెలియకుండా పోయింది. అవే కొదువలు పడినాయి మనము తెలుసుకొనే దానికి. ఇంక ఐదోది పెద్దగా వచ్చింది. దీన్ని తెలుసుకోవాలంటే చాలా కష్టము. ఇది అధర్మము అని కూడా గుర్తింపు పడకుండా మనుషులలో దూరుకుంది. ఐదో అధర్మము మతము అని తెలిసినా మనము ఏమన్నా దానిని తీసేదానికి సాధ్యమయితుందా అంటే సాధ్యము కాదని చెప్పవచ్చును. అది సాధ్యము కాని పరిస్థితులలో మనలో దూరుకుంది ఇప్పుడు. దానిని మనము బయటకు నూకాలంటే (పంపించాలంటే), బయటకు త్రోయాలి అంటే దేవుడు ప్రత్యేకమైన జ్ఞానాన్ని మనకు ఇవ్వాలి. ఇప్పుడు వుండే జ్ఞానమే అర్థము కాక తికమక పడుతున్నాము. మళ్ళీ ఇంకొక జ్ఞానము అంటే ఎక్కడ అర్థమవుతుంది అని మీరు అడగవచ్చు. ఎట్లా అర్థమవుతుందో మనకు తెలియదు కానీ, ఏ జ్ఞానమో మనకు తెలియదు కానీ, చెప్పేవాడు చెప్పితే తెలుసుకోవాల్సిన బాధ్యత మనకుంది. దాంట్లో నుంచి బయట పడాల్సిన బాధ్యత మనకు ఉంది. ఎప్పుడైతే మతం అనే దాంట్లో నుంచి బయట పడుతావో, అప్పుడు నీకు దేవుడు తెలియబడుతాడు. లేకపోతే దేవుడు దేవుడు అనుకోవాల్సిందే. నీ యంతకు నీకు దేవుడు, వాళ్ళంతకు వాళ్ళు అల్లాహ్, వీళ్ళంతకు వాళ్ళు యెహోవా అనుకుంటుండాల్సిందే గాని, ఆ యెహోవా వారికి తెలియదు, అల్లాహ్ ఎవరో వీళ్ళకు తెలియదు, దేవుడు అంటే హిందువులకు తెలియదు. అధర్మాలు పోయే వరకు దేవుడు తెలియదు.

దేవుని గురించి మీకు తెలియాలంటే ఏం చేయాలి? త్రిమత రహిత జ్ఞానాన్ని తెలుసుకోవాలి. మూడు మతాలకు సంబంధములేని జ్ఞానం కావాలి. మూడు మతాలకు సంబంధంలేని జ్ఞానం మరల ఇప్పుడు ఎక్కడ దొరకుతుంది అని ఆలోచన చేయాలి. ఆ మూడు మతాలకు సంబంధించిన జ్ఞానము గ్రంథాలలో వెతుకుతూ ఉంటే మనకు క్రొత్త జ్ఞానం తెలుస్తుంది. అట్లా మీరు వెదకుకొనేదానికి ప్రయత్నంచేయాలి. అట్లా చేస్తూవస్తే అజ్ఞానం ఏదో, అధర్మము ఏదో మనకు తెలుస్తుంది. బయటవుండే ప్రజలకంటే మేము మేలు అనుకుంటే, మరల క్రొత్త అధర్మమును చెప్పి మీకు ఇది తెలియదు అని చెప్పుతున్నాడు అని మీరు అనుకోవద్దండి. మనము క్రొత్త దానిని తెలుసుకోవడమే మన కర్తవ్యము. జ్ఞానం ఇంతటితో అంతం కాలేదు. జ్ఞానము సముద్రంలాంటిది. దేవుడు ఏమి చేస్తాడు అంటే నీకు నిత్యము పనిపెట్టి పరుగెత్తిస్తున్నాడు. నీవు దేవునివైపు పరుగెత్తు, నీవు ప్రపంచము వైపు పరుగెత్తితే అలసట ఆగదు. గమ్యము దొరకదు. ఎంతసేపు పరుగెత్తినా, పరుగెత్తుతూ ఉండాల్సిందే కాబట్టి నీవు దేవుని వైపు పరుగెత్తు, దేవుడు తెలియబడుతాడు. గమ్యము దొరకుతుంది. అదే మోక్షము.

అందువల్ల మేము ఇక్కడికి వచ్చినోళ్ళందరికి అదే చెప్తున్నాము. ఒక మనుషులకే కాదు దేవతలకు కూడా చెప్తున్నాము. ఇంతకు ముందు ఒక దేవత వచ్చి మాట్లాడింది కదా! మాకు కూడా జ్ఞానము అవసరమే, నేను జ్ఞానము తెలుసుకుంటున్నాను. మీరు తెలుసుకోండి అని చెప్పింది. దేవతలు వచ్చి చెప్పడం ఎక్కడా మీరు కనీవినీ ఎరిగి ఉండరు. దేవతలు వచ్చి మాట్లాడడం ఇది మొదటిసారి కాదు ఇక్కడ, మాతో చాలాసార్లు మాట్లాడినారు. మీతో నేరుగా మాట్లాడటం ఇదే మొదటిసారి. దేవతలకు జ్ఞానం అవసరమని దేవతలు కూడా చెప్పుతున్నారు. ఆమె చెప్పేటప్పుడు

ఒక దేవత అంటే ఒక గుడిలో దేవత మాట్లాడుతుందని గుర్తించలేదు గాని, మేము చెప్పినాము ఆ గుడిలో దేవతే మాట్లాడింది. అది పెద్దగుడి. అక్కడికి పోయి చూడండి, ఎంత పెద్ద గుడో! అంత పెద్ద దేవతవచ్చి ఇప్పుడు జ్ఞానం తెలుసుకోవాలని ప్రాకులాడుతుంది. ఆమె ఒక్కతే కాదు ఇప్పుడు తెలుసుకొనేది. ఇక్కడ కొన్ని వందలమంది, కొన్ని వేలమంది ఇక్కడ జ్ఞానం తెలుసుకుంటున్నారు. వాళ్ళను నీవు తెలుసుకో అని చెప్పితే వాళ్ళను చూసి ఆమెకు కూడా కొద్దిగా జ్ఞానోదయము అయింది పెద్ద పెద్ద దేవతలు వచ్చి జ్ఞానాన్ని తెలుసుకుంటున్నారు.

మీరు కొంతమంది ఇక్కడ కూర్చొన్నారు. మేము ఇక్కడ జ్ఞానం కొరకు వచ్చి వింటున్నాము అని అనుకుంటున్నారు. మేము ఏమి చెప్పుతున్నాము అంటే కనిపించనటువంటి వాళ్ళు, చాలామంది మా జ్ఞానాన్ని ఆసక్తిగా వింటున్నారు. మీకంటే రెండింతలు మంది జ్ఞానాన్ని ఎక్కువ వింటున్నారు. మీరు కొంతమందే మీకంటే ఎక్కువమంది జ్ఞానం కోసము వచ్చారు. ఇంకా మీకు తెలియని రహస్యం ఏమిటంటే ఈ మధ్య నేను విన్నాను. ఒక 60 మంది జ్ఞాన ప్రచారంకి పోయినారంట. ఎక్కడికి? తిరుపతికి! అక్కడ జ్ఞానప్రచారం చేశారు. ఈ పోయినవాళ్ళు అన్నీ దయ్యాలే! 60 మంది దయ్యాలు కలిసి జ్ఞానం తెలుసుకొని, వాళ్ళు జ్ఞాన ప్రచారానికి పోయారు. వాళ్ళు ఎవరికి జ్ఞానం చెప్పినారు. దయ్యాలుగా ఉండేవాళ్ళకంతా జ్ఞానం చెప్పివుంటారు కదా! దయ్యాలు చాలామంది జ్ఞానము చెప్పడానికి తిరుపతి దగ్గరకు పోయి, తిరుపతి అంతా ప్రచారం చేసివచ్చినారంట. తిరుపతిలో ప్రచారం చేసి వచ్చేటప్పుడు వాళ్ళకి ఒక సంఘటన జరిగింది. ఇందాక మన వాళ్ళతో చెప్పితే నేను కూడా విన్నాను. నాకు కూడా క్రొత్తగా తెలిసింది ఒక ప్రసవం జరిగింటే ఒక పిల్లోడో పుట్టింటే,

అది ప్రాణం రాలేదని తీసుకొని పోయి పూడ్చినారు. పూడ్చిపెట్టిన తరువాత ప్రాణం వచ్చి, వాడు ఏడుస్తావున్నాడంట, ఆ పిల్లవాడు ఏడుస్తావుంటే వీళ్ళు చూసి, ఆ సూక్ష్మాన్ని ఎత్తుకొచ్చి, వీళ్ళు సాకుతావున్నారు. కొంత వింతే కదా! వాస్తవంగా ఇది జరిగింది. ఇప్పుడు జరుగుతా ఉంది. తరువాత వీళ్ళంతా ఇక్కడికి వచ్చిన తరువాత ఏమయిందంటే, మరలా ఉగాది పండుగకు పోయినారు, మరలా శ్రీరాముల నవమికి వచ్చినారు. ఇదంతా ఇక్కడ ఉండే గుత్తిలో ఈ విషయం జరిగిందని తెలిసింది నాకు. ఆ గుత్తిలో ఉండే సూక్ష్మాలంతా ఉన్నారే, వాళ్ళు ఏమి చేసినారంటే శ్రీరాముల నవమి చేసినారంట, గుడికట్టి సీతను రాముడిని పెట్టి శ్రీరాముల నవమి చేసినారంట, దెయ్యాలంతా! ప్రచారము పోయినవాళ్ళు వచ్చి ఏమి చేసినారంటే, మేము జ్ఞానం తెలుసుకున్నాము. మీరు జ్ఞానం తెలుసుకోకుండ, సీతారాముడికి పూజ చేసినారు, అసలుకు వాళ్ళకు ఎందుకు పూజ చేసినారు? దేవునికి పూజ చేయాలని వాదన పెట్టుకున్నారు. వాళ్ళు వీళ్ళు పేచీ పడినారు. వాదించుకున్నారు. చివరకు కొట్లాడుకున్నారు. కొట్లాడుకుంటే, ఈ 60 మంది ఏమి చేసినారంటే, వాళ్ళు కట్టెలు, కటారులు తీసుకొని వాళ్ళ మీద దాడి చేసినారంట. ఎవరి మీదికి శ్రీరాముల నవమి చేసిన వాళ్ళ మీదికి. వాళ్ళు పారిపోయినారు. వాళ్ళు పారిపోయిన తరువాత వీళ్ళు ఏమి చేసినారు. ఆ సీతను, రాముడిని తీసుకొని పోయి బావిలో వేసినారంట. బావిలోవేసి ఆ గుడి అంతాలేకుండా చేసినారంట. ఇది వాళ్ళు చెప్పగా తెలిసింది.

మనవెనుక మనకు తెలియకుండా ఎన్ని రకాలుగా జరుగు తున్నాయో! జ్ఞానాన్ని మనకు తెలియకుండా మనతో పాటే సూక్ష్మాలు కూడా ఇళ్ళు ఇళ్ళు తిరిగి ప్రచారం చేస్తున్నారంట. వాళ్ళు చచ్చిపోయిన తరువాత కూడ శ్రమపడుతుంటే, మనము బ్రతికి ఉండి, ప్రచారం చేసేదానికి

అవకాశం ఉండి, దేవుని జ్ఞానం తెలుసుకోనే దానికి అవకాశం ఉండి మనము తెలుసుకోలేకపోతే ఎట్లా మీరే చెప్పండి. కాబట్టి ఇప్పటినుండి మీరు ప్రతి ఒక్కరు దేవుని జ్ఞానాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నం చేయండి. మనకు తెలియకుండా మనవెనక దేవతలు, దయ్యాలు ఇప్పుడు మాట్లాడిన సుంకలమ్మకంటే పెద్ద దేవతలు, మామూలు దయ్యాలు వీళ్ళంతా జ్ఞానాన్ని తెలుసుకొని వాళ్ళు వెళ్ళి ప్రచారం చేసి, వాళ్ళు పదిమందికి చెప్పి వినని వాళ్ళని కొట్టినారు అంటే ఇది పెద్ద విచిత్రమే కదా! కాబట్టి మీరు ఏమి కొట్లాడుకోవద్దండి, వినేవాళ్ళకు చెప్పండి. వినని వాళ్ళకు ఊరికినే వదిలిపెట్టండి. అంటే మన వెనుక ఇన్ని జరుగుతున్నాయని మీకు చెప్పుతున్నాము. అంటే ఒక ప్రక్క దేవతలు, ఒక ప్రక్క దెయ్యాలు కూడా జ్ఞానం తెలుసుకుంటుంటే నడిమధ్య మనం మనుషులం అయివుండి జ్ఞానం తెలుసుకోకపోతే చిన్నతనం కాదా! చిన్నతనమే. అన్ని సౌకర్యాలు ఉండి మనం తెలుసుకొనేదానికి అవకాశం ఉంటే, వాళ్ళకు ఒకటివుంటే ఒకటి ఉండదు వాళ్ళకు అన్ని అవకాశాలు ఉండవు. అన్ని అనుకూలాలు ఉండవు, కానీ మనకు అన్ని అవకాశాలు, అన్ని అనుకూలాలు ఉన్నాయి. మనుషులుగా మరి మనకు అన్ని అనుకూలాలు ఉన్నప్పుడు, తెలుసుకోవడానికి ప్రయత్నం చేయండి. ఇటువంటి అవకాశాన్ని పోగొట్టుకో వద్దండి.

మీకు ఇక్కడ చెప్పే విషయాలన్ని క్రొత్త క్రొత్తగా కనిపిస్తూ ఉంటాయి. ఎక్కడా వినని విషయాలు ఇవన్నీ! ఆ విషయాలు కాకుండా ఈ జ్ఞానం కూడ అట్లే వుంటుంది. ఈ జ్ఞానమును మీరు తెలుసుకుంటూ పోతే, మీకు ప్రాక్టికల్‌గా ఎక్కడలేని సంతోషం కల్గుతుంది. ప్రపంచములో ఎప్పుడూ అనుభవించనటువంటి సంతోషము మీకు కలుగుతుంది. ఎప్పుడూ చవిచూడనటువంటి సంతోషాన్ని మీరు పొందగల్గుతారు. అంత

ఆనందాన్ని ఇచ్చేటటువంటి జ్ఞానాన్ని మీరు వృథా చేసుకోకుండా, కాలాన్ని వృథా చేసుకోకుండా సంపాదించుకోవడానికి మొదలు పెట్టండి. జ్ఞానధనం సంపాదించుకొంటే దోస్తి వస్తుంది. లేకపోతే మామూలుగా ప్రపంచపు ఆస్తి సంపాదించుకుంటే చివరకు నాస్తి. నీవు చనిపోయిన రోజున అవన్నీ పోతాయి. ఏమీ ఉండవు. నీవెంట ఒకటి కూడా రాదు. నీవెంట జ్ఞానధనము మాత్రమే నీ వెంట వస్తుంది. కాబట్టి నీవు ఎంత సంపాదించుకుంటే అంత నీ వెంట వస్తుంది. అంటే మనిషిగా ఏ మతములోనన్నా ఫరవాలేదు. నీకు దేవుడు జ్ఞానాన్ని ఇచ్చినాడు. నీవు ఈ మతములోవుంటే ఎక్కువ, ఆ మతంలో ఉంటే తక్కువ అనేది ఏమీ లేదు. ప్రతి మనిషికీ జ్ఞానాన్ని ఇచ్చినాడు. దైవ జ్ఞానాన్ని నీవు తెలుసుకోగల్గితే, అల్లాహ్ చెప్పినటువంటి జ్ఞానాన్ని తెలుసుకోగల్గితే నీవు కూడా 'అల్లాహ్' లోనికి పోతావు. అంటే అంతులేనివాడవు అవుతావు. ఆయనలోనికి కలిసిపోతావు. కాబట్టి ఇప్పటి నుండి అంటే ఈ ప్రపంచ విషయాల మీద శ్రద్ధ తగ్గించి, ప్రపంచ ఆస్తుల మీద శ్రద్ధ తగ్గించి, మీరు దేవుని జ్ఞానం మీద ఎక్కువ శ్రద్ధను పెంచుకోండి. అంటే కొంతమందిని మేము చూస్తున్నాము. సాధారణమైనటువంటి ఆశ కొంతమందికి ఉంది. విపరీతమైన ఆశ కొంతమందికి ఉంది. గుణాలు ఎలా పని చేస్తాయంటే ఉదాహరణకు కొంతమంది పది రూపాయలు పెట్టి టిఫిన్ చేస్తాములే అనుకుంటారు. కొంతమంది ఏమి చేస్తారంటే రూపాయితోనే ఏదో ఒకటి సర్దుబాటు చేసుకుంటాము అనుకుంటారు. వానికి డబ్బులు ఉంటాయి. వీనికీ డబ్బులు ఉంటాయి. కానీ లోభి అనేటువంటి ఒక గుణము ఉంది. అదే లోభితనం అనేది. ఆ లోభత్వమనేది, మనుషులకు డబ్బులు మిగుల్చుకోవాలి అనేటువంటి పరిస్థితిని చూపుతుంది కాని పెట్టాలని చూపదు. ఇప్పుడు ఆ డబ్బులు దగ్గర ఎవరైతే ఆశ లేకుండా

పోతారో, అంటే ప్రపంచ ధనం మీద ఆశ లేకుండ పోతారో వానికి జ్ఞానధనం మీద తప్పసరిగా ఆశ కలుగుతుంది. కాబట్టి జ్ఞాన ధనం మీద ఆశ పెట్టుకోండి. ప్రపంచధనం మీద ఆశ విడిచిపెట్టండి. అందువల్ల ఇప్పటి నుండి ఆస్తి ఏదో, నిజమైన ఆస్తి ఏదో మీరు తెలుసుకోండి నిజమైన దోస్తి కోసము ప్రయత్నం చేయండి. నిజమైన దోస్తి దేవుడు, ఆత్మ అని మీకు మరీ మరీ జ్ఞాపకం చేస్తూ ఈ సమావేశాన్ని ఇంతటితో ముగిస్తున్నాను.

## 82. జ్ఞానశక్తి

**(తేది : 04.04.2015)**

ఇప్పుడు రేపు జరుగబోయే పుట్టినరోజు పండుగకు పెద్దగా ఆర్భాటాలు ఏమీ ఇక్కడ జరుగవు. టపాకాయలు కాల్చరు, పూలదండలు వేసుకోరు, ఆర్భాటాలు చేయరు. కానీ పండుగ అని మాత్రము చెప్తారు, ప్రత్యేకించి జ్ఞానము చెప్పడము ఉంటుంది. ఈ రోజు పుట్టినరోజు అని అంటున్నాము. రేపు నా పుట్టినరోజు, కానీ ఈ రోజు కూడా పుట్టినరోజు ఒకటుంది. ఈ రోజు **"జ్ఞానము కబ్జా అయ్యింది"** అనే గ్రంథము పుట్టింది. మేము మొదటనే చెప్పాము, ఈ గ్రంథాలన్ని మాకు పుత్రులతో సమానము అని. ఇప్పటికి ఇది 57వ గ్రంథము కాబట్టి, నాకు 57 మంది కొడుకులుగా చెప్పుచున్నాము. ఈ రోజు ఒక కొడుకు పుట్టినట్టు మేము లెక్కించుకున్నాము. అది రేపు మేము పుట్టినట్టు. గ్రంథమును కూడా కొడుకులు అంటారు మీరు అని కొందరు అనుకోవచ్చు. అంటే కీర్తి ప్రతిష్టలు తెచ్చేవాళ్ళు ఎవరైనా కొడుకులే. ఇప్పుడు నాకు శారీరకంగా

బిందుపుత్రులు అనేటటువంటి వాళ్ళు ఒక నలుగురు ఉన్నారు. వాళ్ళు ఇప్పుడు పుట్టిన తరువాత పెరిగి కొంత పెద్దవారై కొన్ని సంవత్సరాలకు అంటే 20, 30, 40 ఏళ్ళకు వాళ్ళు ప్రపంచములో మంచి పేరు తెచ్చుకొని, ఫలానా అతని కొడుకులు అని పేరు ప్రతిష్ఠ తెచ్చుకుంటే, అది నాకు సంతోషమేసి అప్పుడు నేను సంతోషపడుతాను. వాళ్ళు అప్పుడు నాకు పేరు ప్రతిష్టలు తెచ్చినటువంటి వాళ్ళు అవుతారు. ఇదంతా అయ్యే వరకు చాలా కాలము పడుతుంది. కడుపున పుట్టిన పుత్రులకు ఆ విధానముంది. కానీ లిఖిత పుత్రులు అనేవాళ్ళు ఉన్నారు. లిఖిత పుత్రులు అంటే వ్రాయగా పుట్టినటువంటి వాళ్ళు. ఎంతమంది ఉన్నారు? అను ప్రశ్నకు జవాబుగా ఈ రోజు వరకు 57 మంది ఉన్నారు. మా అంచనాతో చివరకు నూటికి పైగా పుట్టగలరని పుడతారు అనుకున్నాము. దేవుడు తొందరగా గ్రంథ పుత్రులను పుట్టించే ఏర్పాటు చేస్తాడు అనుకుంటున్నాము. ఇంతకుముందు పుత్రులు పుట్టారు. తర్వాత ఈ పుత్రుడు పుట్టాడనుకోండి, కానీ పుట్టిన మరుసటి రోజే వాళ్ళు పేరు తెచ్చినారు. పేరు ప్రతిష్టలు తేవాలంటే, కడుపున పుట్టిన కొడుకులకు 20, 30 ఏళ్ళు పడుతుంది. వాళ్ళు చెడ్డ పేరు తేవచ్చు, మంచి పేరు తేవచ్చు. కానీ లిఖితంగా పుట్టినటువంటి పుత్రులు మాత్రము అందరూ మంచి పేరే తెచ్చారు. మీరంతా వాళ్ళను పొగుడుతున్నారు. మీరు వాళ్ళను పొగుడుతుంటే మాకు కూడా సంతోషమే. మా పుత్రులను మీరు పొగిడినప్పుడు మాకు కీర్తి ప్రతిష్టలు వచ్చినట్టే కదా! కాబట్టి మాకు సంతోషమే.

"జ్ఞానము కబ్జా అయ్యిది" అను పుత్రుడు పుట్టాడు. అతను ఈ రోజు నుండి మాకు కీర్తి ప్రతిష్టలు తెస్తాడు. కాబట్టి గ్రంథమును పుత్రుడు అంటున్నాము. మా పుత్రులు తెచ్చినంత పేరు ప్రఖ్యాతులు వాళ్ళ ఎవరి

పుత్రులు తేలేదు అని చెప్పవచ్చు. మీ కొడుకుల గురించి మీరు గొప్పగా చెప్పుకున్నట్టు, మీ గ్రంథాల గురించి మీరు గొప్పగా చెప్పుకుంటున్నారు అని వేరే వాళ్ళు అనవచ్చు. మేము ఏమి చెప్పుచున్నాము అంటే మా గ్రంథాల గురించి మేము గొప్పగా చెప్పుకోవడము కాదు, ఎవరి గ్రంథాలైనా ఒకటే, దానిలో సారాంశాన్ని బట్టి దానికి విలువ ఉంటుంది. ఆ సారాంశాన్ని బట్టి మీరు గొప్ప తక్కువ అని చెప్పుకోవడము జరుగుతుంది. మిగతా భగవద్గీతలు ఎన్నో ఉన్నాయి. అవన్నీ గ్రంథాలే, చాలామంది వ్రాశారు. కానీ ఇక్కడ వ్రాసినటువంటి **త్రైత సిద్ధాంత భగవద్గీత** గ్రంథముంది. ఆ భగవద్గీత గ్రంథము అన్నిటికంటే గొప్పది అని మీరు ప్రశంసిస్తున్నారు. కాబట్టి మేము సంతోషించాల్సిన పని వచ్చింది. మీ ముఖ స్తుతి కోసము కొందరు ఇది గొప్పగా ఉంది అని చెప్పివుండవచ్చు. అంతమాత్రమున మీరు మా పుత్రులే గొప్పవాళ్ళు, వేరే పుత్రులు తక్కువ వాళ్ళు అనుకోవడము పొరపాటు కదా! అని కొందరు ప్రశ్న వేయవచ్చు. దానికి మా జవాబు ఇట్లు కలదు. మేము ఎప్పుడూ పొరపాటుగా అనుకోము, ఉన్నది ఉన్నట్టు చెప్తాము. వాస్తవముగా లెక్కేస్తే వాళ్ళకంటే వీళ్లు గొప్పవాళ్లే. ఎందుకు గొప్పవాళ్లు? అంటే వాళ్ళ దగ్గర కనపడనిది ఏదో వీళ్ల దగ్గర కనిపిస్తావుంది. ఎవరి ఊహకు వాళ్ళకు పెద్దగా అనుకోవడము జరుగుతావుంది. అట్లా ఊహించుకునే దానికి కూడా కాకుండా మీరు ప్రత్యక్షంగా చూశారు. ఇక్కడ పుట్టినట్టి ప్రతి గ్రంథము చిన్న గ్రంథము కానీ, పెద్ద గ్రంథము కానీ ప్రతి గ్రంథము ఒక సంచలనాత్మక శక్తిగా ఉంది. వ్రాత రూపములో మీకు సమాచారాన్ని అందించడమే కాకుండా చేతల రూపములో, కర్మల నిర్మూలన చేసింది. కర్మల నిర్మూలన చేసిన గ్రంథాలు ఏవైనా ఉన్నాయా అంటే ఎక్కడన్నా ఉన్నాయా? చూశారా! మీరు ఎక్కడా చూడలేదు. కర్మల నిర్మూలన

చేసే గ్రంథాలు ఇవి ఒక్కటే అని చెప్పవచ్చు. అంటే ఇంతగట్టిగా మీరు ఎలా చెప్పుచున్నారంటే నేను చెప్పేది ఏమీ లేదు మీరే చూసుకోవచ్చు.

అనుభవిస్తున్న ఒక కర్మ మీకున్నప్పుడు మీరు భక్తిగా నమ్మి గ్రంథమును బాధ ఉన్నచోట పెట్టితే గ్రంథము మీ శరీరానికి అతుక్కుని ఆ కర్మను కాల్చేసే వరకు వదలడము లేదు. ఏడు వందల పేజీల గ్రంథము కూడా శరీరానికి కేవలము ఒక చిన్న కాగితము లాగా అతుక్కోవడము జరుగుచున్నది. ఇది ప్రత్యక్షముగా ఇతరులు కూడా చూడవచ్చును. బంక వేసి అతికించినట్లు, కాగితములాగా అతుక్కొని ఉంటుంది. అంత బరువు గ్రంథము కూడా అతుక్కొని ఉంటుందంటే దానిలో శక్తి ప్రత్యక్షముగా కనిపించినట్టే కదా! పుట్టినప్పుడు నుండి ఎక్కడైనా అటువంటి శక్తి ఏ గ్రంథాలకైనా కనిపించిందా? ప్రపంచము పుట్టినప్పుడు నుండి గ్రంథము మనిషికి అతుక్కోవడము ఎక్కడైనా జరిగిందా? జరుగలేదు. కాబట్టే మేము మా పుత్రులు పెద్దవాళ్ళు అంటున్నాము. మా వాళ్ళంటే? ఇక్కడ వ్రాయబడిన గ్రంథాలు అని తెలియవలెను.

ఇవి గొప్పవి అని చెప్పుచున్నాము. దీనిలో ఉండే సారాంశము అంతే, దానిలో ఉండే శక్తి అంతే. అవి కర్మను నిర్మూలన చేయడములో కూడా వెనుకాడవు. భగవద్గీత అంటే భగవద్గీతే కదా! మీది భగవద్గీతే, ఇంకొకరిది భగవద్గీతే కదా! భగవద్గీతలో తేడాలుంటాయా? అని కొందరడుగవచ్చు. దానికి జవాబు ఏమనగా! భగవద్గీతలో దేవుడు చెప్పిన భగవద్గీత ఒకటే కానీ, మనము అర్థము చేసుకోవడములో తేడా ఉంది. దానిని వివరించి చెప్పడములో తేడా ఉంది. ఒక శ్లోకాన్ని వివరించి చెప్పడములో మూడు నెలలు చెప్పినటువంటి వాళ్లు కూడా ఉన్నారు.

ఎంతకాలము చెప్పినా సారంలేనిది ఏమి చేస్తావు? సారము, సారాంశము ఎక్కడైతే ఉందో అక్కడ శక్తి ఉంటుంది.

ఎక్కడైతే జ్ఞానముందో దానిని జ్ఞానశక్తిగా మనము లెక్కించుదాము. ఆ జ్ఞానశక్తి దేనికి పనికి వస్తుంది అని లెక్కవేస్తే భగవద్గీతలో దేవుడు చెప్పినట్టు కర్మను కాల్చేదానికి మాత్రమే పనికొస్తుంది. భగవద్గీతలో **"యదైథాంసి సమిద్ధోగ్ని భస్మసాత్కురు తేర్జున!" అన్నాడు. ఏ విధముగా అగ్నిలో కట్టెలు కాలిపోతాయో అదే విధముగానే కర్మ అనేటువంటి కట్టెలు జ్ఞానము అనే అగ్నిలో కాలిపోతాయి అని చెప్పాడు.** ఆ విధముగానే మనకు ఈ జ్ఞానముతో ఏమి అవసరము అని అంటే, ఏమీ అవసరము లేదు. నీళ్ళతో మనకు ఏమి అవసరము ఉంది? దప్పిక లేనివాళ్ళకు నీళ్ళతో ఏమి అవసరము లేదు. ఎవరికి నీళ్ళతో అవసరము? దప్పిక ఉన్నవానికి నీళ్ళతో అవసరము. దాహము అయినవానికి నీళ్ళతో అవసరము, కానీ కర్మ లేనివానికి జ్ఞానముతో అవసరము లేదు. కర్మ ఉన్నవానికి జ్ఞానము అవసరమే. కర్మను పోగొట్టుకునే దానికి అవసరము. దాహం తీర్చేదానికి నీళ్ళు ఏ విధముగా అవసరమో, కర్మను తీర్చేదానికి జ్ఞానము ఆ విధముగా అవసరము.

చిన్న గ్రంథముకానీ, అది పెద్ద గ్రంథము కానీ, ఒక గ్రంథములో ఎంత జ్ఞానమున్నది అని భగవద్గీత గ్రంథము తీసుకొని మనము చూస్తే అది జ్ఞానమే. కానీ మనకు అర్థమయ్యే జ్ఞానము ఎంతవుంది? అని చూస్తే ఒక్కొక్కరికి ఒక్కొక్క రకంగా అర్థమైతుంది. తెలుగు భాషలో కొంతమందికి అర్థమవుతుంది, అరబ్బీ భాషలో కొంతమందికి అర్థమవుతుంది. తమిళంలో కొంతమందికి అర్థమవుతుంది. ఏదో ఒక భాషలో కొంతమందికి అర్థమవుతుంది. తెలుగులోనే ఒక పది భగవద్గీతలు ఉన్నాయి

అనుకుందాము. తెలుగు భాషలోనిది మనకు అందరికీ అర్థమైతుంది కదా! తెలుగు భాషలో ఉండే భగవద్గీతను ఒక్కొక్క దానిని బట్టి మనము సారాంశము చూస్తే, ఒక దానిలో 10 పైసల శక్తి మాత్రమే ఉంటుంది. ఒక దానిలో 5 పైసల శక్తి మాత్రమే ఉంటుంది. ఈ రకంగా 20, 25 పైసాల శక్తి వరకూ ఉండేటటువంటి గ్రంథాలున్నాయి, కానీ అంతకుమించి ఉన్నటువంటి గ్రంథాలు లేనేలేవు. ఇప్పుడు మనము ఇక్కడికి వచ్చి **త్రైత సిద్ధాంత భగవద్గీతను** ఏ రకంగా లెక్కవేసుకొని చెప్పుచున్నాము అంటే, ఇది శరీరానికి అతుక్కోవడము అంటే కొంతమందికి ఇది క్రొత్తగా వింతగా ఉంటుంది. కానీ చూసినవాళ్ళు చాలామంది ఉన్నారు. అవి అత్తుకున్న వాళ్ళు కూడా చాలామంది ఉన్నారు ఇక్కడ. శరీరానికి అతుక్కొని ఆ కర్మను పూర్తిగా కాల్చేసేంత వరకు వదలకుండా ఉన్నటువంటి గ్రంథము కాబట్టి, 99 పైసల శక్తి ఇందులో ఉంది. కేవలము 20, 25 పైసల శక్తి ఉన్నటువంటి గ్రంథాలు దేశమంతా ఉన్నాయి. అంతకంటే మించి లేవు అని మనము అంటూ, 99 పైసల వంతు జ్ఞానము ఇక్కడుంది అని మీరు చెప్పడము, సమంజసమేనా అని కొందరడుగవచ్చు. దానికి జవాబు ఏమనగా! కంటికి కనిపిస్తుంది కాబట్టి సమంజసము అని చెప్పుచున్నాము. ఇది గొప్పలు చెప్పుకోవడానికి కాదు. సత్యము చెప్పే నిమిత్తము మనము చెప్పుచున్నాము. సత్యము చెప్పకపోతే అర్థము కాదు కదా! సత్యము ఎప్పుడైనా బయటికి రావలసిందే కదా!

కాబట్టి ఏది సత్యము అంటే, ప్రపంచములో ఉండే భగవద్గీతలలో 20, 25 పైసలకంటే ఎక్కువ జ్ఞానము లేదు. టాప్ లెవల్ అంటే, మిగతా గ్రంథాలలో అంతా 5 పైసలు, 10 పైసలకంటే ఎక్కువ జ్ఞానశక్తి లేదు. శక్తి గ్రంథము చూస్తే కనిపించదు. గ్రంథము పెద్దగా ఉండవచ్చు, చిన్నదిగా

ఉండవచ్చు. కానీ అందులో శక్తి ఎంతమటుకు ఉంది అని లెక్కేసి చూస్తే, ఆ శక్తిని కొలిచే సామర్థ్యం ఉంటే 99 వంతులు దీనిలో (మేము వ్రాసిన గ్రంథాలలో) శక్తి ఉంది అని నేను చెప్పుచున్నాను. మిగతా దానిలో అంత శక్తి లేదు. చిన్న గ్రంథమైనా అంతే, పెద్ద గ్రంథమైన అంతే. ఏదన్నా ఒక గ్రంథములో తక్కువుందా అంటే ఏ గ్రంథములో కూడా తక్కువ లేదు. చాలామంది చూశారు ప్రతి గ్రంథాన్ని శరీరం మీద పెట్టి చూశారు. ఈ గ్రంథములో ఏముందో? శరీరానికి ఈ గ్రంథము అతుక్కుంటుందో లేదో అని కానీ ప్రతి గ్రంథము అతుక్కుంది. ఈ మధ్యన దుబాయ్ నుంచి హైదరాబాద్‌లో ఉన్న భాస్కర్ రెడ్డి అనే ఆయనకు ఒక ఫోన్ వచ్చింది. ఏమని వచ్చింది అంటే అతను మాకు ఇలా చెప్పాడు దుబాయ్‌లో ఒక వ్యక్తికి తలనొప్పి వచ్చిందంట. దిక్కు తెలియని పరిస్థితిలో గురువు అనే గ్రంథము పెట్టుకున్నాడట. అతను తలమీద పెట్టుకుంటే అది అట్లే చెంపకు అతుక్కుని పోయింది. అలా ఒక 10 నిమిషాల వరకు అట్లే అతుక్కొని తలలో ఉండే నొప్పినంతా లాగి అప్పుడు ఊడి వదలి వచ్చింది. అంటే అది ఎంత కర్మ ఉన్నదో ఏమో, ఆ కర్మనంతా లాగేసరికి 10 నిమిషాలు కాలము పట్టింది. అది 10 నిమిషాలు అట్లే అతుక్కుని ఉంది. అతుక్కొని ఆ కర్మనంతా తీసివేసింది అది **"గురువు"** అనే గ్రంథము. కేవలము గురువును గురించి మాత్రము అందులో చెప్పాము. అంతే గదా! గురువును గురించి చెప్పాము. కానీ గురువును గురించి చెప్పుకునే వాళ్ళు ప్రతి ఒక్కరు నేను గురువును అని చెప్పుకుంటున్నారు. దేశములో ఎందరో గురువు అని పేర్లు పెట్టుకున్నారు. కానీ ఇక్కడ మనము ఏమి చేసామంటే మొట్టమొదట సభ ప్రారంభములో ప్రార్థన చేశాము. అప్పుడు ఇట్లు చెప్పినాము. **"విశ్వరూపుడై ధరణి నీవు సాకార రూపమున వెలసిన**

**మూఢులను జ్ఞానులను చేయ బయల్పడిన ఓ గురురాయా! ఇదే నా మనః పూర్వక వందనము"** అని చెప్పినాము. గురువు అనేటటువంటివాడు విశ్వరూపుడుగా సాకార రూపముగా రావచ్చు, అటువంటి గురువు ఎక్కడైనా ఉంటే ఆయనకు నేను నమస్కారం చేస్తున్నాను అని చెప్పుచున్నాము. ఆయనకు నమస్కారం చేస్తున్నాను అని నేను అంటే చేసేవానివి నువ్వు గురువు కాదా" అని మీరు అడుగవచ్చు "నేను గురువునైతే ఇంకొకరికి ఎందుకు నమస్కారం చేస్తా?" గురువు ఒకడున్నాడు అన్న ఉద్దేశ్యముతో చేస్తున్నాము. కానీ ఎక్కడున్నాడంటే ఎక్కడున్నాడో తెలియదు. ఎక్కడో విశ్వమంతా వ్యాపించి ఉంటాడంట. ఎక్కడన్నా ఉండనీ! ఆయనకు నమస్కారం అని చెబుతాము.

ఎందుకంటే ఆయన జ్ఞానము మనకు అందిస్తాడు కాబట్టి, బాగా గమనిస్తే ఇక్కడ పెద్ద తతంగము ఉంది! అర్థముకాని తతంగం! అంటే ఇక్కడ ఒక గ్రంథములో తండ్రి కుమారుడు అనేమాట వచ్చింది. ఇంతకు ముందు నేను చెప్పాను నా గ్రంథము కొడుకు, నేను తండ్రిని అని. ఇప్పుడు నేను ఎవరికి తండ్రిని? నా గ్రంథానికి నేను తండ్రిని అంటే, నువ్వు తండ్రివా? తండ్రి అని ఎవరినీ పేరుపెట్టి పిలువద్దు అని ఉంది ఒకచోట. ఇప్పుడు మనము ఆ ప్రశ్న తీసుకుంటాము. తండ్రి అని ఎవరూ చెప్పుకోకూడదు, ప్రపంచములో ఎవడూ తండ్రి కాదు అని ఉంది. మళ్ళీ ఆ మాటను అతిక్రమించి మనము చెప్పినట్టేనా అంటే, నేను ఆ మాటను అతిక్రమించి ఏమాత్రము చెప్పలేదు. నేను ఎవనికీ తండ్రిని కాను. నా గ్రంథాలకు నేను తండ్రిని. ఇప్పుడు గ్రంథములో తండ్రి కుమారుడు అంటే నేను కుమారున్ని, నాకు తండ్రి ఒకడున్నాడు. నాకు పుట్టినవాళ్ళు ఇంకా ఉండవచ్చు. నాకు పుట్టినవాళ్ళు వీళ్ళు అనుకుందాము. కానీ నేను

కుమారున్ని, నాకు తండ్రి అంటూ ఒకడున్నాడు. కాబట్టి నేను ఆ స్థానంలో తండ్రిని అని చెప్పుకునే దానికి లేదు. నా తండ్రికి నేను కుమారున్ని సరే! ఆ తండ్రి ఎవరు? ఆ తండ్రిని చూసివుంటే ఇంకేముంది? అంతా పబ్లిక్ అయిపోతుంది. తండ్రిని ఎవరూ చూడలేదు. తండ్రిని చూడలేదా మళ్లీ అంటే, ప్రకృతి సంబంధ తల్లి తండ్రులను చూసివుండొచ్చు, కానీ వాళ్ళు నిజమైన తల్లి తండ్రులు కాదు. వాస్తవముగా తండ్రి అని ఎవరిని అంటున్నా మంటే నిన్ను ఎవడైతే పుట్టించినాడో వానిని తండ్రి అంటున్నాము. అంటే ఇదెక్కడి వింతయ్యా, నిన్ను పుట్టించిన వాళ్ళు నీ తల్లి తండ్రులే కదా! అని మీరు ప్రశ్న వేయవచ్చు.

**"తల్లి-తండ్రి"** అనే గ్రంథములో మేము మొదట నుండి వ్రాసి పెట్టాము. అలాగే తర్వాత **"హేతువాదము-ప్రతివాదము"** అనే గ్రంథములో కూడా వ్రాసిపెట్టాము. ఎవ్వరూ వాళ్ళ తండ్రికి పుట్టలేదు. నాకు ఇంతమంది కొడుకులున్నారు అని అనుకుంటున్నారు. అది బయటికి పేరుకు మాత్రమే కానీ వాస్తవముగా ఎవరూ ఎవరికీ పుట్టలేదు. కానీ పుట్టిన వాళ్ళంతా ఎవరికి పుట్టినారు? మొట్టమొదటనే భగవద్గీతలో గుణత్రయ విభాగ యోగము అనే అధ్యాయంలో మొట్టమొదటనే 3, 4 శ్లోకాలలో దేవుడు చెప్పాడు. ఏమని చెప్పాడంటే, **"ప్రపంచములో ఎవడు పుట్టినా గానీ, వాడు నాకు కొడుకే అవుతాడు. ప్రకృతి తల్లి అవుతుంది. నేను వానికి తండ్రిని అవుతాను"** అని చెప్పాడు. అంటే ప్రపంచానికంతా నేను తండ్రిని అని దేవుడు చెప్పాడు. ఇప్పుడు నేను నా తండ్రికి నేను కుమారున్ని అని అంటే, తండ్రి అంటే ఎవరు? అనే ప్రశ్న వస్తుంది. ఒక గ్రంథంలో ఒకాయన చెప్పినాడు **"నా తండ్రి ఒకాయన ఉన్నాడు"** అని అంటే **"మీరు నా తండ్రిని చూడలేదు"** అన్నాడు. ఇంకా ఏం చెప్పాడు? **"నా తండ్రి నేను**

**ఏకమై ఉన్నాము"** అని చెప్పాడు. ఇద్దరము కలిసే ఉన్నాము అన్నాడు. అంటే అదెట్లా సాధ్యమైతుంది అని మనకు ఒక ప్రశ్న వస్తుంది కానీ ఆధ్యాత్మిక రీత్యా లెక్కవేసుకుంటే నువ్వు కేవలము జీవాత్మవే. జీవాత్మ అనేటటువంటి వాడు ఎప్పుడైనా కుమారుడే.

జీవాత్మకు, తండ్రి అనేటటువంటివాడు, జీవునికంటే పెద్దవాడు. తండ్రి అనేటటువంటి చైతన్యం కలిగి, తరువాత శరీరములో గర్భముగా మారేదానికి అవకాశము ఇచ్చి, ఒక శరీరము తయారు కావడానికి ఏర్పాటు చేసేవాడు తండ్రి. ఆయన ఎవడు అంటే శరీరములో ఉండే ఆత్మే. శరీరానికి ఎవరైతే యజమానిగా ఉన్నాడో, ఆ యజమానే నీకు తండ్రిగా ఉన్నాడు. ఇక్కడ బాగా అర్థము చేసుకోండి. నీకు తండ్రి ఎవడు? అంటే జీవాత్మకు తండ్రి ఎవడు? అంటే నేను ఒక జీవాత్మను, నాకు తండ్రి శరీరములో ఉండే ఆత్మ కాబట్టి నేను నా ఆత్మతో కలిసివుంటే, తెలుసుకొని ఉంటే నేను నా తండ్రి ఏకమై ఉన్నాము. నేను వేరుగా లేను అని చెప్పినమాట ఒకటుంది. ఆ జ్ఞానము మనకు అర్థము కాలేదు. ఎవరికీ అర్థము కాలేదు. అది ప్రత్యేకించి క్రైస్థవ సమాజములో చెప్పబడింది. ఆ సమాజము మొత్తానికి ఎవ్వరికీ ఆ మాట అర్థము కాలేదు. ఇంకొకచోట పరిశుద్ధాత్మ అయిన నా తండ్రి అన్నారు. అంటే దేవుడు నా తండ్రి అన్నారు. ఇక్కడ దేవున్ని మనము తండ్రి అని చెప్పినామా? మీరు ఆలోచన చేసుకోండి. దేవున్ని తండ్రి అని చెప్పలేదు. ఎవ్వరిని తండ్రి అని చెప్పినాము? ఆత్మను తండ్రి అని చెప్పినాము, నా తండ్రి ఎవరు? అంటే ఆత్మ అని చెప్పినాము. దేవుడు అన్నిటికీ సంబంధము లేనివాడు అని చెప్పినాము. కానీ ఇంకోచోట దేవుడే తండ్రి అని చెప్పబడింది. దేవుడే తండ్రి అని చెప్పినప్పుడు, మరి ఈ మాట ఏమవుతుంది అంటే వాస్తవముగా దేవుడు తండ్రి అనే విధానము కూడా

ఒకటుంది. ఎప్పుడు దేవుడు తండ్రి అవుతాడు? నువ్వు ఆత్మవైతే ఈ ఆత్మకు దేవుడు తండ్రవుతాడు. నువ్వు జీవాత్మవైతే జీవాత్మకు ఆత్మ తండ్రవుతాడు. చూడండి ఎట్లుందో ఈ సంబంధ బాంధవ్యము.

ఈ రకంగా, అంటే నువ్వు డైరెక్ట్‌గా దేవునికి కొడుకువు కాదు నువ్వు ఎవరికి కొడుకువు? ఆత్మకు కొడుకువు. ఆత్మ ఎవరికి కొడుకు? దేవునికి కొడుకు. కాబట్టి నేను నా ఆత్మతో కలిసుండేదానికి అవకాశము ఉంది. కాబట్టి నేను నా తండ్రి కలిసి ఉన్నాము అనే వాక్యము చెప్పబడివుంది. అటువంటి అవకాశముంది. నువ్వు నీ తండ్రి కలిసిపోయిన తర్వాత నువ్వు లేవు. తండ్రి మాత్రము ఒకడు ఉంటాడు. అప్పుడేమవుతుంది? నువ్వు కుమారుడివి అవుతావు. తండ్రి దేవుడవుతాడు. అప్పుడు నేను ఏమనవచ్చు? నా తండ్రి అయిన దేవుడు అనవచ్చు. ఇప్పుడు ఆ మాటంటే ఏమవుతుంది? తప్పు అవుతుంది. అప్పుడు ఆ మాటంటే ఏమవుతుంది? రైట్ అవుతుంది, సరిపోతుంది. ఇట్లా జ్ఞానములో ఎంతస్థాయికి ఏ మాట మనము మాట్లాడుతున్నాము అని లెక్కవేసుకొని మాట్లాడితే అది జ్ఞానశక్తిగా ఉద్భవిస్తుంది, తెలియకుండా మాట్లాడితే ఏమాత్రము శక్తి ఉద్భవించదు. నేను ముందే చెప్పాను భగవంతుడంటే తెలియదు, దేవుడంటే తెలియదు, ఇద్దరినీ కలిపేసుకొని కొందరు మాట్లాడుతున్నారు. **భగవంతుడు దేవునికి కొడుకు అవుతాడు. భగవంతుని తండ్రి దేవుడవుతాడు.** కానీ లెక్కవేసుకుంటే ఇద్దరూ ఒకటే అవుతారు. ఇదంతా పెద్ద తతంగము అని చెప్పాము కదా! ఏమీ అర్థముకాదు. దీనిని అర్థము చేసుకోవాలంటే జ్ఞానము అనేది పూర్తి అర్థము కావాలి. జ్ఞానమనేది ఏమిటి? ఎక్కడున్నది? అని మనము లెక్కవేసుకుంటే జ్ఞానమనేది భగవద్గీతలో సంపూర్ణముగా ఉంది. మళ్ళీ భగవద్గీత చదివితే మనకు తెలుస్తుంది. ఎందుకు తెలియదు? నువ్వు జీవాత్మవని నీకు తెలుస్తుంది. నువ్వు ఏమీ తెలియని వాడివని నీకే తెలియదు.

వాస్తవముగా నువ్వు ఏమీ తెలియనివానివే అంటే నువ్వు జీవాత్మవు అన్న విషయము కూడా నీకు తెలియదు. నువ్వు ఎవరో కూడా నీకు తెలియదు. అటువంటి పరిస్థితిలో మనిషి ఉన్నాడు. ఇంతకు ముందు మనము చెప్పుకున్నాము. మనిషి చాలా తెలివైనవాడు అని చాలామంది చెప్పారు, మేము చెప్పలేదు. అంతేకాక మనిషి జన్మ చాలా పుణ్యం చేస్తే వస్తుంది అని చెప్పారు. దేశమంతా అదే చెప్పుచున్నారు. కానీ ఇక్కడ మేము ఏమి చెప్పుచున్నాము అంటే చాలా పాపము చేస్తే మనిషి జన్మ వస్తుంది అని మీకు వ్యతిరేఖముగా చెప్పినాము. ఇదే వాస్తవము. అది తెలియక చెప్పుకుంటున్నారు కానీ, వాస్తవముగా ఎక్కువ పాపము చేసిన వాళ్ళకే మనిషి జన్మ వస్తుంది. తర్వాత మనిషి చాలా తెలివైనవాడు అని అందరూ అంటున్నారు. మనిషి జంతువులకంటే, పక్షులకంటే చాలా తెలివి తక్కువ వాడు అని ఇక్కడ చెప్పుచున్నాము. ఇదేమిటయ్యా విచిత్రము, సర్కస్‌లో సింహాన్ని బోన్‌లో వేసి ఆడిస్తున్నాము. పక్షులను ఆడిస్తున్నాము ఎట్లా చెప్తే అట్లా వినేటట్టు చేసుకున్నాము. తెలివైనవాడే కదా! ఇట్లా చేసేది. అవి తెలివితక్కువవి కాబట్టి మనిషి చేతులో ఇరుక్కున్నాయి కదా! అని అంటున్నారు. ఎప్పుడో నువ్వు కూడా ఇరుక్కుంటావు ఎక్కడైనా తెలివి తక్కువవాని చేతుల్లో, నమ్మినావా పక్కా మోసము చేస్తాడు ఎవడో ఒకడు. అప్పుడు నువ్వు కూడా ఇరుక్కుంటావు. కానీ నువ్వు అప్పుడు తెలివితక్కువ వానివైతావా? తెలివి ఉంది, కానీ నీ తెలివికి నీకు సంబంధము లేదు. మనిషి దగ్గర ఏముందంటే మోసము ఉంది. జంతువుల దగ్గర అది లేదు. జంతువులు నమ్మితే పూర్తిగా నమ్ముతాయి కానీ మోసము చేసేది ఏమీ లేదు.

కానీ మనిషి దగ్గర మాత్రము, వాటికంటే ఎక్కువ మోసము ఉంది. మనిషి తన మోసముతో జంతువులను జయించడము జరిగింది

తప్పు తెలివితో కాదు. కాబట్టి మనిషి తెలివైనవాడు కానే కాదు. తెలివి తక్కువవాడు. మనిషి పుణ్యము చేసి పుట్టలేదు, చాలా పాపము చేసి పుట్టాడు అని చెప్పినాము. ఎందుకంటే అవి కర్మ అనుభవించేది తక్కువ, మనము అనుభవించేది ఎక్కువ. ఉదాహరణగా ఒక గాడిద, గాడిద పిల్ల ఉందనుకోండి, అవి రోడ్డు మీద పోతావుంటే ప్రక్కన ఒక బస్సు వచ్చి పిల్లను గుద్దింది, గాడిద పిల్ల చచ్చిపోయింది. గాడిద ఏమి చేస్తుందంటే ఒక రెండు నిమిషాలు లేదా 3 నిమిషాలు చూస్తుంది. లేకపోతే 5 నిమిషాలు చూస్తుంది. చచ్చిపోయింది ఏమీ ప్రయోజనము లేదు అని అక్కడి నుండి వెళ్ళిపోతుంది. మనము అయితే మూడురోజులు ఏడుస్తాము. ఏడుస్తామా? అంటే అది 5, 10 నిమిషాలు అనుభవించే బాధను మనము 3 రోజులు అనుభవిస్తాము. ఇప్పుడు చెప్పండి ఎవరు ఎక్కువ కర్మను అనుభవిస్తున్నారు? మనమే ఎక్కువ కర్మ అనుభవిస్తున్నాము. అప్పుడు ఎక్కువ పాపము చేసిన వాళ్ళు ఎవరు? ఎక్కువ కర్మను ఎవరు అనుభవిస్తున్నారు? మనమే ఎక్కువ కర్మ అనుభవిస్తున్నాము. అప్పుడు ఎక్కువ పాపము చేసినవాళ్లు ఎవరు? మనమే. అడవిలో జంతువులు కూడా అంతే. ఒక క్రూరమృగము వచ్చి జింక పిల్లను ఎత్తుకొని పోతుంది అనుకోండి. అప్పుడు తల్లి రవ్వంత విడిపించుకోవాలని చూస్తుంది. సాధ్యముకాక వదిలివేసి వెళ్ళిపోతుంది. ఒక జంతువు తన చిన్న పిల్ల నడవలేకపోతే, చీకటి పడుతుంటే వేరే క్రూర మృగాలు వస్తాయని, దానికి ప్రమాదమని నడిపించుకొని పోవాలని చూస్తుంది. అది నడవకపోతే అక్కడే వదిలేసి వెళ్ళిపోతుంది. కానీ మనము అలా వదల్లేము చచ్చిపోతే బాధపడతాము. ఈ రకంగా వాటికుండే బంధనాలు వాటికి ఉన్నాయి కానీ చాలా తక్కువ, అంటే కర్మ బంధనాలు చాలా తక్కువ. కాబట్టి అవి మనకంటే తక్కువ పాపము చేశాయి. మనము వాటికంటే ఎక్కువ పాపము చేసి పుట్టాము అని ఒక లెక్కలో చెప్పుకోవచ్చు.

ఇప్పుడు మనము ముఖ్యంగా చెప్పుకునేది ఏమిటంటే దైవ జ్ఞానము అనేది ఒకటుంది. అది దేనికి పనికి వస్తుంది? అది దేనికి శత్రువు? అది మనకు ఎందుకు అవసరము? ఇప్పుడు మీరంతా జ్ఞానము అంటున్నారు. అది ఎందుకో, ఏమో? ఏ అవసరానికి? మనకి కూటికి వస్తుందా! కులానికి వస్తుందా? బువ్వకు వస్తుందా? నీళ్ళకు వస్తుందా? అని అడుగుతారు కొంతమంది. జ్ఞానము కూటికి, కులానికి, బువ్వకు, నీళ్ళకు వస్తుందని మేము ఎక్కడా చెప్పలేదు. అవన్నీ నీ కర్మను బట్టే వస్తాయి. ఆ కర్మను లేకుండా చేసేదానికి ఇది ఉంది. ప్రతి ఒక్కటీ మనిషికి కర్మనుబట్టి జరుగుతూ వుంటుంది. ఆ జరిగే కర్మను లేకుండా చేసే విధానము జ్ఞానములో ఉంది. కాబట్టి కర్మకు వ్యతిరేఖమైనది ఏదైతే ఉందో, అది మనకు అవసరము దానిని మనము స్వీకరిస్తున్నాము. ఎందుకంటే కర్మకు వ్యతిరేఖమైనది జ్ఞానము. అయితే ఇప్పుడు కొంతమంది మళ్ళీ మేము చాలాకాలము నుండి జ్ఞానము తెలుసుకుంటున్నాము. మేము అనుభవించే కర్మ కొద్దిగా కూడా పోలేదు కదా! అంటున్నారు. అంటే నువ్వు వాస్తవమైన జ్ఞానము తెలుసుకుంటున్నావు, కానీ నువ్వు తెలుసుకున్న జ్ఞానములో, దానిని తీసివేసే శక్తి ఉందోలేదో అది చూసుకోండి. నువ్వు తెలుసుకుండేది జ్ఞానమే! జ్ఞానము కావాలని నువ్వు ప్రయాస పడుతున్నావు. 30 ఏళ్ళ నుంచి నేను జ్ఞానము తెలుసుకుంటున్నాను. ఒక్క రవ్వ కూడా కర్మ పోలేదు, ఏ కర్మ ఉంటే దానిని అనుభవిస్తున్నాను. మళ్లీ నా కర్మలు ఏమీ పోలేదే అని అంటే, కర్మ పోయేదానికి జ్ఞానము తెలుసుకోవద్దు అని కొంతమంది అంటారు. కర్మలు పోవాలనే ఉద్దేశ్యముతో జ్ఞానము తెలుసుకోవద్దు అంటున్నారు. వాస్తవమే అది.

నేను ఏమి చెప్తానంటే, ఏ ఉద్దేశ్యముతో తెలుసుకున్నా కానీ ఈ జ్ఞానము అనేది కర్మలను నిర్మూలన చేసే దానికే ఉంది. కర్మదహనము తప్ప వేరే పని లేదు. జ్ఞానమునకు అగ్నికి ఆనుకొని ఏదైతే ఉందో అదంతా కాల్చేసే పని. అది పొట్టుపడనీ, కట్టెపడనీ, ఏదైనా గానీ దానిని కాల్చేసే పని అగ్ని యొక్క ధర్మము. జ్ఞానము యొక్క ధర్మము ఏమి? కర్మను కాల్చేది జ్ఞానము యొక్క ధర్మము. 30 సంవత్సరాల నుంచి నువ్వు తెలుసుకునేది నిజమైన జ్ఞానమైతే నీ కర్మలు పోవాలి. కొత్తది వచ్చినా ఫరవాలేదు, పాతది పోతుండాలి. అలా పాతది పోకుండా అట్లే అనుభవిస్తూనే ఉన్నారు అనుకోండి, మళ్ళీ నీకు జ్ఞానము తెలుసుకొని ఏమీ ప్రయోజనము లేదు. అటువంటి జ్ఞానము తెలుసుకునే దానికంటే ఊరకనే ఉండడము మంచిది. ఇప్పుడు మీరు, మా జ్ఞానము మంచిది కాదంటారు. మీ జ్ఞానము మంచిదా అని అడగొచ్చు. మంచిదా కాదా! అని చెప్పేదానికి నువ్వు ప్రాక్టికల్‌గా చూసుకో. నీళ్ళు తాగితే దప్పిక తీరుతుంది అనుకోండి. ఉప్పు తింటే ఇంకా దప్పిక అవుతుంది. మంచినీళ్ళు త్రాగితే దప్పిక తీరుతుంది. ఉప్పు నీళ్ళు తాగినా ఏమీ ప్రయోజనము లేదు.

ఈ రకంగా జ్ఞానములో చాలా తేడాలు ఉన్నాయి. అంటే ఇంతవరకు జ్ఞానము అనేది ఒకటి ఉంది అని చెప్పుకున్నాము. జ్ఞానము గొప్పది అని చెప్పుకున్నాము. వాస్తవముగా గొప్పదే, అది ఒకటుండేది నిజమే! అది జ్ఞానమే కానీ జ్ఞానములో శక్తి ఎంత ఉంది? అని చూస్తాము. అట్లే మనుషులున్నారు, బాగా కసరత్తు చేసి, బాగా బలాన్ని పుంజుకొని శరీరానికంతా బలాన్ని ఎక్కించుకొని ఉంటారు. అలా అలవాటు చేసుకొంటారు. ఎంత పెద్ద బరువునైనా ఎత్తుతారు. ఎంత పెద్ద మనిషినైనా పైకి ఎత్తేస్తారు. ఉదాహరణకు రెజిలింగ్‌మాన్‌లు ఉన్నారు అంటే

కుస్తిపట్టేవాళ్ళు. ఒకడు నూరు కేజీల బరువున్నవాడు అయితే వాడు 200 కేజీలు ఎత్తి వేస్తాడు. అది అలవాటు అయిపోయింది. అందుకే 200 కేజీలను కూడా సులభముగా అలవోకగా ఎత్తేస్తాడు. కానీ ఇప్పుడు మేము 100 కేజీలు ఉన్నాము, కనీసము 20 కేజీలు కూడా ఎత్తలేము. అంటే మనకు అటువంటి శక్తి లేదు. ఆ రకంగా జ్ఞానములో శక్తి ఉండే జ్ఞానముంది, శక్తి లేని జ్ఞానము ఉంది. శక్తి ఉండే జ్ఞానము ఏం చేస్తుంది, నీ కర్మలను కాల్చివేస్తుంది. శక్తి లేని జ్ఞానము ఏమి చేస్తుంది? కర్మను ఏమీ చేయలేదు. మరి శక్తి ఉండే జ్ఞానము ఎక్కడుంది అంటే ఒకచోటే ఉంటుంది, అది ఎక్కడుంటుంది? దైవత్వము ఎక్కడుంటుందో అక్కడుంటుంది. దైవత్వాన్ని గురించి చెప్పేదే, శక్తి ఉండే జ్ఞానము. జ్ఞానము అంటే ఏమిటి? అంటే, దైవత్వాన్ని గురించి తెలిపేదే శక్తి ఉండే జ్ఞానము. దైవత్వాన్ని గురించి తెలుసుకుండేది జ్ఞానము అయితే మేము దాని గురించే కదా! తెలుసుకుండేది అని అంటే, నువ్వు దైవత్వము అనే పేరు పెట్టుకొనే జ్ఞానము తెలుసుకుంటున్నావు. కానీ అందులో దైవత్వము ఉందా లేదా మీరు చూడండి. నేను ఒక దేవతను మ్రొక్కుతున్నాను మరి నాకు జ్ఞానము లేదా? జ్ఞానశక్తి లేదా? అంటే దేవునికి మ్రొక్కితే జ్ఞానశక్తి వస్తుంది. దేవునికి సంబంధించిన జ్ఞానము తెలుసుకుంటే జ్ఞానశక్తి వస్తుంది కానీ, దేవతలకు సంబంధించి ఎవరికి మ్రొక్కినా కానీ, దేనిని తెలుసుకున్నా కానీ అది జ్ఞానము కాదు, అందులో జ్ఞాన శక్తి ఉండదు. జ్ఞానశక్తి లేదని దేవతలే నిరూపణ చేసుకుంటున్నారు. మీరు నిరూపణ చేస్తున్నారు. ఈ రోజు పౌర్ణమి చంద్రగ్రహణము. దేవతలు భయపడి గుడులలో తలుపులు అన్ని మూసేసు కున్నారు. ఈ రోజు ఉదయము 8 గంటలకు మూసేసి రేపు ఉదయము 6 గంటలకు తెరిచేవాళ్ళున్నారు. ఇప్పుడు గ్రహణము అని మూసేసినారు,

ఇప్పుడు ఎక్కడైనా చూసుకోండి, దేవాలయాలు అన్నీ మూసుకున్నారో లేదో? కానీ ఈ శ్రీకృష్ణ దేవాలయము తెరచుకొని ఉంది, మూయలేదు. దీనికి భయము లేదు. వాళ్ళకు భయముంది. "ఇది శక్తి, నా దగ్గరే శక్తి ఉంది. ఇంకొక శక్తి నన్ను ఏమి చేస్తుంది? అనే దేవుడు కృష్ణుడు. దేవతలకు ఉండేశక్తి పోతుంది" అని కాపాడుకోవాలని వాళ్ళున్నారు. వాళ్ళు కాపాడుకునే దానికి తలుపులు వేసుకొని కూర్చుంటే మీరు పోయి వాళ్ళను అడుక్కునేది ఏమి పెద్ద పని? ఏమైనా మంచి పనా అది? అది మంచి పని కాదు. వాళ్ళు కూడా చంద్ర గ్రహణానికి భయపడి తలుపులు వేసుకున్నారు. ఇప్పుడు చంద్రగ్రహణము, సూర్య గ్రహణము జరిగితే గ్రహణం రోజు గర్భిణీలు బయటికి రాకూడదు, కీడు జరుగుతుంది అని అంటుంటారు. అంటే వీళ్ళకేదో భయపడే కదా! లోపల ఉండేది?

దేవతలకు ఏమి కీడు జరుగుతుందో ఏమో కానీ తలుపులు వేసుకున్నారు. చంద్రగ్రహణము రోజు చంద్రున్ని చూస్తే మరి వాళ్ళకు ఏమి భయము? ప్రతి దేవాలయము మూతబడింది ఎందుకు అంటే వాళ్ళు శక్తిహీనులు, తక్కువ శక్తివంతులు, కానీ శక్తి ఉన్నటువంటి వాడు దేవుడు! నిజమైన దేవుడు! ఎక్కడున్నా ఉండనీ ఆ దేవున్ని ఏ గ్రహణమూ ఏమీ చేయదు, ఆయన శక్తి ఎక్కడా పోదు. కానీ ఇప్పుడు కృష్ణుడు మనిషి ఆయన దేవుడు కాదు. మన మాదిరి పుట్టిన మనిషి. మన మాదిరి పుట్టిన మనిషిని మనము ఏమి చేశాము అంటే, ఒక దేవాలయము కట్టి అందులో పెట్టి మన నమ్మకము కొద్దీ మనము పూజ చేస్తున్నాము. ఆ శక్తిని ఎవరూ ఏమీ చేయలేరు అన్న ఉద్దేశ్యముతో ఆ పని మనము చేస్తున్నాము. మళ్ళీ అంత గొప్పశక్తి ఏమి ఉంటుంది అంటే, మనము ఒక సూత్రము చెప్పినాము. మనిషి ఎప్పటికీ దేవుడు కాదు అని చెప్పినాము. మనిషి ఎప్పటికీ దేవుడు

కానప్పుడు అతనిని (కృష్ణుడిని) దేవునిగా నువ్వు ఎందుకు పెట్టుకున్నావు అని ప్రశ్న వేయవచ్చు. మీకు ఇంతకు ముందు ఒక ప్రశ్న పేపర్ ఇచ్చాము. మోసములో పెద్ద మోసము ఏది అని ప్రశ్న ఇచ్చి దానిలో అదీ ఇదీ చెప్పి, చివరలో ఒకటి చెప్పాము. మనిషిని దేవునిగా పూజించడము. దేవున్ని మనిషిగా పూజించడము అని రెండు ఆప్షన్‌లు ఇచ్చాము. కానీ ఏది పెద్ద మోసము అంటే **మనిషిని దేవునిగా పూజించడము పెద్ద మోసము.** ఏది కరక్టు? మోసము కాని పద్ధతి ఏమిటి? అంటే దేవున్ని మనిషిగా పూజించడము సరిపోతుంది.

కానీ మనిషిని దేవునిగా పూజించకూడదు. మనిషి ఎప్పటికీ దేవుడు కాడు. దేవుడు ఎప్పటికైనా మనిషి కావచ్చు. అంటే ఇదేమిటిది రెండు రకాలుగా చెప్తావు? మేక తోక, తోక మేక ఏదని అంటే అట్లా కాదు బాగా ఆలోచన చేసుకోండి, దేవుడు మనిషిగా రావచ్చు, కానీ మనిషి దేవునిగా మారేదానికి అవకాశము లేదు. **మనిషి మనిషిగా ఉండి చచ్చిపోయిన తర్వాత దేవుడవుతాడేమో కానీ, మనిషి ఎప్పటికీ దేవుడు కాడు.** దేవుడు మనిషికి జ్ఞానము చెప్పాలి అనే నిమిత్తము మనిషిగా వస్తాడు. అలా మనిషిగా వచ్చి జ్ఞానము చెప్తాడు. మనిషిగా వచ్చి జ్ఞానము చెప్పితేనే మనకు అర్థమవుతుంది, లేకపోతే అర్థము కాదు. ఒక గ్రంథములో అంటే దాని పేరు దైవ గ్రంథము. ప్రపంచానికంతా దైవగ్రంథము ఒకటే. అది మొదటిది ఉండవచ్చు, చివరిది ఉండవచ్చు, మధ్యలోది ఉండవచ్చు. నువ్వు మొదట తెరిచినా అదే, మధ్యలో తెరిచినా అదే, చివరిలో తెరిచినా అదే. అంతిమ దైవగ్రంథము అని ఒకటి ఉంది. ఇది అంతిమ అంటే మొదటిది ఏదో ఉండాలి కదా! ఇప్పుడు మధ్య గ్రంథము, చివరి గ్రంథము, మొదటి గ్రంథము మొత్తం మూడు దైవగ్రంథాలున్నాయి. మూడు గ్రంథాలలో వ్రాసినది ఒకడే!

అందులో జ్ఞానము ఒకటే! ఉదాహరణకు భారతము ఉంది. భారతములో ఉండేది కౌరవులు, పాండవుల సమాచారము తప్ప ఏమీ లేదు. కానీ వ్రాసినది ముగ్గురు. మొదట నన్నయ, తర్వాత తిక్కన ఆ తర్వాత ఎర్రాప్రగడ అని ముగ్గురు కవులు వ్రాశారు. ముగ్గురు కవులు వ్రాసినా అదే వ్రాశారు. పాండవులు కౌరవుల విషయము తప్ప ఇంకొకటి ఏమీ లేదు. ఇప్పుడు **భగవద్గీత ప్రథమ దైవగ్రంథము, బైబిల్ మధ్య దైవగ్రంథము. ఖురాన్ అంతిమ దైవగ్రంథము.** మరి ఇక్కడేముంది? దేవుడు, మనిషి. ఇది తప్ప ఏదీ లేదు అంతే కదా! దేవుడు మనిషి అంతేతప్ప రెండో దాని గురించి ఏమీ లేదు.

మూడు దైవ గ్రంథాలలో దేవుడు గురించి, మనిషి గురించి తప్ప మరి ఇంకొక సమాచారము ఏమీ లేదు. అప్పుడు దైవగ్రంథము అనేది ఒకటే కదా! దైవగ్రంథములో ఏమి చెప్పినారంటే, ఇందులో ఉండే విషయ జ్ఞానము మీకు అర్థము కాదు. ఇది ఏ మానవునికీ తెలియదు. ఇక్కడ ఈ గ్రంథములో ఉండేటటువంటి జ్ఞానము ఏ మానవునికీ తెలియదు. దేవునికి తప్ప! (నాకు తప్ప) ఏ మానవునికీ తెలియదు అని దేవుడు చెప్పితే, అప్పుడు మళ్ళీ దేవుడే చెప్పాలి కదా! ఈ విషయము ఆ గ్రంథములో ఉంది. "నాకు తప్ప ఏ మానవునికీ తెలియదు. చెప్పితే నేనే చెప్పాలి". ఆ మాటంటే, నేనే చెప్పాలని అర్థము. ఇదెలా ఉందంటే ప్రపంచములో పొడుగువాడు ఒకడే అంటే, మిగతా వాళ్ళంతా పొట్టివాళ్ళు అని అర్థము. ఇంకొకడు పొడుగువాడు లేడని అర్థము. అంతే కదా! ఒకడే పొడుగువాడు మిగతా వాళ్ళంతా పొట్టివాళ్లే. ఇప్పుడు మనము ఏమి అంటున్నాము అంటే, నాకు తప్ప ఏ మానవునికీ తెలియదు అన్నప్పుడు ఆయన చెప్తాడని మీరు ఊరకనే ఉండాలి కదా! కానీ వీళ్ళు ఏమి చేసినారు? గ్రంథాల మీద

గ్రంథాలు ఒకటి ఇంత పెద్దది, మరొకటి ఇంకొంత పెద్దది వ్రాసినారు. ఉండేది ఒకటే, దానిని వివరించి వ్రాసినారు. దేవుడు మీకు తెలియదని చెప్పాడు కదా! తెలియదు అని చెప్పినప్పుడు మీరు ఎందుకు వ్రాయాలి?

మా గురించి ఇంకొకాయన అంటాడు "ఆయన హిందువు కదా! అంతిమ దైవగ్రంథము ఖురాన్ కదా! హిందువు ఖురాన్ గురించి ఎట్లా వ్రాసినాడు? వ్రాసేదానికి ఎట్లా తెలుస్తుంది? ఏమని వ్రాస్తాడు? ఇందువు ఖురాన్ గురించి ఎలా వ్రాయగలిగినాడు? ఎట్లా తెలుస్తుంది?" అని ప్రశ్నించాడు. సరే! ఈ ఇందువుకు ఖురాన్ అన్న విషయము తెలియదులే. దేవుడు ఏమి చెప్పినాడు? మనిషికి తెలియదు అన్నాడు. మీకు ఎవరికీ తెలియదు పో అన్నాడు. మళ్ళీ మీరెందుకు ఖురాన్ వ్రాసినారు? అని మేము ప్రశ్న వేయవచ్చు కదా! మీకు ఎవరికీ తెలియదు అన్నప్పుడు మీరు ఎందుకు వ్రాసినారు? మీరూ ఊరికే ఉండాల్సింది. మళ్ళీ ఇందువు, ఒక ముస్లీమ్ గ్రంథాన్ని ఎలా వ్రాయగలిగినాడు అంటే, దేవుడు ఏమి చెప్పినాడు? నేను చెప్పినది అందరికీ సమానమే, నా లెక్కలో ఇందువులు లేరు, ముస్లీమ్‌లు లేరు అని చెప్పినాడు. దైవగ్రంథము దైవ గ్రంథమే. మనుషులకు అందరికీ వర్తించేది, మానవులకు అందరికీ సరిపోయేది అని చెప్పినాడు ఆయన. కాబట్టి మనిషి దాని గురించి చెప్పుకోవచ్చు, మాట్లాడవచ్చు. కానీ వివరించి చెప్పే స్థోమత ఏ మనిషికీ లేదు. దేవుని జ్ఞానాన్ని వివరించి చెప్పే స్థోమత ఏ మనిషికీ లేదు. బాగా వినండి! ఇప్పుడు మీరు నాకు ప్రశ్న వేయవచ్చు, ఏమని వేయాలి? "ఎదురుగా కూర్చొని చెప్పే నువ్వు మనిషివే కదా? మళ్ళీ దేవుని జ్ఞానము గురించి నేను బాగా క్లియర్‌గా చెప్పుచున్నాను, నాది బాగుంది. మా గ్రంథాలన్నీ కరక్టుగా ఉన్నాయని చెప్పుచున్నారు. మళ్ళీ నువ్వెందుకు చెప్పినావు" అని అడగొచ్చు, అలా ప్రశ్న అడగాలి. అడిగితేనే

సరిపోయేది. నేను ఇంతకుముందు చాలామార్లు చెప్పినాను ఈ ప్రశ్న మీరు అడగాలి, ఆ ప్రశ్నకు నేను జవాబు ముందే చెప్పినాను. మళ్ళీ చెబుతున్నాను. శ్రద్ధగా వినండి.

ఏ గ్రంథమూ మనిషిగా నేను వ్రాయలేదు. నేను మనిషిగా వ్రాసానని చెప్పానా? నాకు ఏమీ తెలియదు. నేను చదువుకున్నది 11వ తరగతే. నేను ఏ ఆశ్రమానికీ పోలేదు, ఏ గురువు దగ్గరికీ పోలేదు. ఎక్కడా ఏ గ్రంథమూ చదవలేదు, నాకెట్లా తెలుస్తాయి? వాస్తవముగా నాకు ఏమీ తెలియదు. మీకు చెప్పేటప్పుడు నేను కూడా ఒక వ్యక్తిగా వింటున్నాను. జ్ఞాపకము పెట్టుకోండి, మీరు ఇంతకుముందు విన్నారో లేదో ఈ మాట. మీరు ఎలా వింటున్నారో నేను కూడా అలాగే వింటున్నాను అని చెప్పాము. ఇప్పుడు చెప్పేవాడు ఎవడు? అంటే అది తెలిసినోడు ఎవడో, ఆ తెలిసినవాడు నాకు తప్ప ఎవరికీ తెలియదన్నాడు కదా! మళ్ళీ వాడే చెప్తున్నాడు, మనము వింటున్నాము. నేను చెప్తాను అని ఎవరికన్నా చెప్పినానా? నేను ఎప్పుడూ చెప్పలేదు. గ్రంథాలు నేను వ్రాశాను అని చెప్తున్నానా? నాకు ఏదీ తెలియదు, విషయము వ్రాస్తూంటే నాకు కూడా తెలుస్తూ ఉంటుంది. చెప్పుచున్నాను కాబట్టి మొదట తెలిసింది తర్వాత మీకు రెండోసారి తెలిసింది అని నేను చెప్పినాను. కానీ మొదట తెలిసి వ్రాసినా ఆ పేరు కూడా తెలియదు. మాకు గ్రంథం పేరు కూడా తెలిసియుంటే ముందే చెప్తాము ఫలానా గ్రంథమని, నేను ఇచ్చిన లిస్ట్‌లో లేని గ్రంథాలు ఎన్ని వచ్చాయి మీకు? ఇప్పుడు వచ్చిన గ్రంథం లిస్ట్‌లో ఉందా? లేదు. ద్రావిడ బ్రాహ్మణ గ్రంథం 15 రోజుల ముందు లిస్ట్‌లో ఉందా? లేదు. లిస్ట్‌లో లేని గ్రంథాలు వెంట వెంటనే వచ్చినాయి. లిస్ట్‌లో ఉన్న గ్రంథాలు ఇంతవరకు రాలేదు. మరి ఇవన్నీ చూసుకుంటే మరొక ప్రశ్న వస్తుంది. మనకు సంబంధము లేని

విషయము అయితే ఈ గ్రంథాలు నాకే పుట్టాయి అని నువ్వు చెప్పినావు కదా! అని మీరు ప్రశ్న వేయవచ్చు. ఇది కూడా ప్రశ్నే కదా!

నేను చెప్పినానా? ఇప్పుడు పరిస్థితి అపరిచితుడులాగా అయి పోయింది. ఎవడు చెప్పినాడో తెలియదు. పూర్తి మతి తప్పిపోతుంది, ఇక్కడే జాగ్రత్తగా అర్థం చేసుకోండి. ప్రతి మనిషిలోనూ ఇద్దరు ఉన్నారు. ఒకడు యజమాని ఒకడు గుమస్తా. గుమస్తా నువ్వు, జీవుడు. యజమాని ఆత్మ. యజమానిని గుమస్తాను ఇద్దరినీ చూసేవాడు ఒకడున్నాడు. వాడు యజమానీ కాదు, గుమస్తా కాదు. ఇద్దరినీ చూస్తున్నాడు. ఎవడు ఎట్లా ఉన్నాడు? ఏమి కథ అని, చూస్తున్నాడు. వాడు ఎవడు? పరమాత్మ! ఇప్పుడు నేను ఇక్కడ ఎవరిని గురించి చెప్పుచున్నాను? కాసేపు మన కథ విడిచి పెడతాము. ఇంకొక కథ చెప్పుకుందాం, ఒకసారి మా దగ్గరకు ఒకాయన వచ్చాడు. వచ్చి ఏమి చెప్పినాడంటే, ఒక సందర్భంలో, వేరే వాళ్ళెవరో ఆయనకు వాత పెట్టినారంట. అలా వాత పెట్టినప్పుడు అబ్బా అని చురుకుగా అరిచినాడు. అంటే వాత చురుకు తగిలింది, బాధపడినాడు ఆయన. ఇప్పుడు మనము, బాధపడినవాడు ఎవరు అని చెప్పాలి? జీవుడే. దానిలో అనుమానము లేదు, బాధలు అనుభవించేవాడు వాడే, జీవుడు! కాబట్టి జీవుడు, తర్వాత అదే మనిషే ఎవ్వరికీ తెలియని జ్ఞానము చెప్పినాడు. ఇక్కడ ఎవ్వరికీ తెలియని జ్ఞానము చెప్పేవాడు ఎవరు? ఆత్మ! అంటే యజమానే చెప్పాలి. పరమాత్మ (దేవుడు) చెప్పడు. నేను ఏమీ చేసేవాన్ని కాదు అని చెప్పాడు మొదటనే. కరక్టుగా జ్ఞాపకం పెట్టుకోండి! దేవుడు ఏమీ చేయడు, ఏమీ మాట్లాడడు అని జ్ఞాపకం పెట్టుకొని ఉండాలి. తను చెప్పిస్తాడు గానీ తను చెప్పడు. జ్ఞానము చెప్పినవాడు ఆత్మ. ఆత్మ ఒక శరీరానికి అధిపతి! ఇప్పుడు మళ్ళీ జ్ఞాపకము పెట్టుకోండి. ఇక్కడే మీరు బాగా జ్ఞాపకము పెట్టుకోవాలి.

ఆత్మ శరీరానికి మాత్రమే అధిపతి. శరీరము బయట అధిపతి కాదు. అంటే, బయట ప్రకృతికి అధిపతి కాదు. ప్రకృతికంతా అధిపతి పరమాత్మ దేవుడు. ప్రకృతికంతా భర్త పరమాత్మ దేవుడు. ఎప్పుడైతే వాత పెట్టినప్పుడు అబ్బా అని అరిచాడో, అదే వ్యక్తి, ఎవరికీ తెలియని జ్ఞానాన్ని బాగా సులభముగా ఎలా చెప్పగలిగినాడు. అరిచినప్పుడు జీవాత్మ, జ్ఞానము చెప్పేటప్పుడు ఆత్మ. ఇప్పుడు ఒక సంఘటన చెప్పుకుందాం. ఒకప్పుడు సముద్రము చెలరేగిపోయింది, మునిగిపోతాము అనేటంత తుఫాన్ లేచింది, అంతా గందరగోళము అయింది. ప్రకృతి భీభత్సంగా తయారైపోయింది. మరణము తప్ప రెండవది లేదు. అటువంటి సందర్భములు చాలామార్లు జరుగుతాయి. ఇంక మరణం తప్పదు అనేటట్టుగా ఉంటుంది. అప్పుడు **"ఆగిపో!"** అని ఒక మాట అంటే తుఫాన్ గప్‌చుప్‌గా ఆగిపోయింది. ప్రకృతి! శరీరములో అధిపతి మాత్రమే ఆత్మ. అణువణువున ప్రకృతికంతా అధిపతి పరమాత్మ, ఆత్మకంటే వేరుగా ఉండేవాడు **పర ఆత్మ.** ఆత్మకంటే పరంగా ఉన్నాడు, వాడు దేవుడు అంటే పరమాత్మ అనేవాడే దేవుడు! వారు ఆగిపో! అని చెప్పితే ఏమయింది? ప్రకృతి అంతా అణిగిపోయింది. ఏమీ కదలలేదు, మెదలలేదు. ఇందాక చెప్పినట్లు ఒకసారి వాత పెడితే అబ్బా అన్నవానిని ఏమనాలి జీవాత్మ! బాగా జ్ఞాపకము పెట్టుకోండి. మరి ఆ జీవాత్మ అనుభవించేవాడు కాబట్టి అబ్బా అని అరచినాడు. అబ్బా! అంటే నాయన అని అర్థము. వాళ్ళ నాయనను గుర్తు చేసుకున్నాడు, జీవుడు. తర్వాత ఎవరికీ తెలియని జ్ఞానము చెప్పినప్పుడు వాడు ఆత్మ. ఒక మనిషిలోనే ఇదంతా ఉంది. మళ్లీ వేరు వేరుగా అనుకుంటారు. ఒక మనిషిలోనే జరిగేదే ఈ తతంగము అంతా! ఈ తతంగము మీరు ఎలా గుర్తుపట్టగల్గుతారు? అదే మనిషే ప్రకృతిని శాసించినాడు. అప్పుడు

ఏమనాలి మనము, పరమాత్మ అనాలి. కానీ పరమాత్మ ఎక్కడా బయట పడడు. సందర్భానుసారము, నిరూపణ నిమిత్తము, ఎక్కడో ఒకసారి ఈ రకంగా చేయాల్సిందే తప్ప, లేకపోతే ఎక్కడా నిరూపణకు రాదు. ఒక మనిషిలో మూడు ఆత్మలున్నాయి అని నిరూపణకు వచ్చే నిమిత్తము అలా చేయాల్సిన పని వచ్చింది. **ఒకే మనిషి పరమాత్మగా ఉండి ప్రకృతిని శాసించవచ్చు. ఆత్మగా ఉండి జ్ఞానాన్ని చెప్పవచ్చు. జీవాత్మగా ఉండి కర్మను అనుభవించనూ వచ్చు.** ఇలా ఒకే మనిషిలో మూడు పనులు ఉన్నాయి. కానీ మన పని మనకు తప్ప ఇంకొకరి పని తెలియదు మనకు. మనము శాశ్వతమైన పోర్షన్‌లో ఉన్నాము. ఆ పనిని విడిచిపెట్టి ప్రక్క పని ఏమిటో చూడాలని అనుకుంటున్నాము. ఆత్మ దర్శనము చేసుకోవాలను కుంటున్నాము. అది మనకు సాధ్యము కాలేదు. ఆత్మజ్ఞానమే మనకు తెలియలేదు. ఆత్మజ్ఞానము తెలిస్తే, ఆత్మను తెలియవచ్చు. ఇప్పుడు ఈ రకంగా లెక్కవేసుకుంటే ఒక మనిషిలో మూడు ఆత్మలున్నాయి. మూడు ఆత్మలు ఒక మనిషిలో మెదులుతున్నాయి. వాడు ఎవ్వడు, ఎప్పుడు ఏమి మాట్లాడతాడో మనకు తెలియదు. ఎక్కడో ఎవరో ఒకచోట మాట్లాడటం జరుగుతుంది అలా మాట్లాడినవానిని గురువు అనవచ్చు, కానీ వాడెక్కడా తెలియబడడు. విశ్వమంతా వ్యాపించినటువంటివాడు, ఒక ఆకారములోకి వచ్చి, సాకార రూపములోకి వచ్చి, జ్ఞానాన్ని బోధించినప్పుడు వానిని గురువు అని నమస్కారము చేస్తున్నాను అని అన్నాము. విశ్వమంతా వ్యాపించిన వాడు, ప్రకృతియంతా వ్యాపించినవాడు, ప్రకృతికి అధిపతిగా ఉన్నవాడు పరమాత్మ దేవుడు. వాడు ఎప్పుడైనా మనిషిగా రావచ్చు. మనిషిగా వస్తే ఏమవుతుంది? వానిని భగవంతుడు అంటాము. వాస్తవముగా ఒక లెక్కలో భగవంతుడు అంటాము, ఒక లెక్కలో వానిని గురువు అంటాము. గురువు

అని పేరు పెట్టినాము. కానీ అట్లా వచ్చినవాడు ఎవరో ఎవరికీ తెలియదు. వాడు ఎట్లుంటాడంటే, పూర్వము అక్బర్ చక్రవర్తి ప్రజలలోకి వచ్చి తెలియ కుండా పోయినట్టు మారువేషములో వస్తే తెలియదు కాబట్టి వానిని గుర్తుపట్టలేము. గురువును ఎవరూ గుర్తు పట్టలేరు. గురువును ఎవ్వరూ గుర్తుపట్టనప్పుడు శిష్యులు ఎట్లుంటారు? శిష్యులుండరు. గురువుకు శిష్యులుంటారా? ఉండరు. గురువు అని తెలిస్తే కదా! ఉండేది? ఆయనకు శిష్యులు ఉండరు అన్నమాట. మళ్ళీ గురువు అనేవాడు తెలియబడడు అని గురువు అనే గ్రంథములో ఉంది. అది ఒరిజినల్ జ్ఞానము, వాస్తవమైన జ్ఞానము. ఆ గ్రంథములో వాస్తవమైన జ్ఞానముంది కాబట్టి, అందులో శక్తి ఉంది. ఆ శక్తి ఉంది కాబట్టే మన తలకు అతుక్కుంటుంది. తలనొప్పిని తీసేసింది. అది అబద్ధపు జ్ఞానము అయితే గ్రంథము ఏమాత్రము అంటుకుండేది కాదు. ఇనుప ముక్కను అయస్కాంతము అతుక్కున్నట్టు పచ్చి శరీరానికి ఒకటి అతుక్కుంటుందంటే, శరీరము పచ్చిది కదా! దీనికి ఏ ఆకర్షణ లేదు. ఈ పచ్చి శరీరాన్ని ఒక గ్రంథము అతుక్కుంటూ ఉందంటే ఏదో ఉంది. అందులో ఏదో కనపడని తతంగము ఉంది కదా! ఆ కనపడని తతంగము అంతా ఏమిటి? అంటే అదే జ్ఞానశక్తి, ఆ జ్ఞానశక్తి ఎక్కడుంది? గ్రంథములో ఉంది. ఏ గ్రంథములో ఉంది? ఇక్కడ పుట్టినట్టి ప్రతి గ్రంథములో ఉంది. అది చిన్న గ్రంథము కావచ్చు, పెద్ద గ్రంథము కావచ్చు. ఇక్కడ పుట్టిన ప్రతి గ్రంథములో ఉంది. కాబట్టి ఈ గ్రంథాలలో ఇటువంటి గ్రంథాలలో శక్తి ఉందని తెలియండి.

ఆ కుమారుడు పుడుతూనే పేరు ప్రతిష్టలు తెచ్చుకున్నాడు. చాలామంది ఆ గ్రంథము చదివి ఏమంటున్నారు అంటే చిన్న గ్రంథమైనా గానీ ఇది చాలా బాగుంది అంటున్నారు. అది వాస్తవముగా ఉండేది

అంతే. అందులో శక్తి ఉందా లేదా అంటే, అది నీ నమ్మకాన్నిబట్టి నీ కర్మను బట్టి తెలుస్తుంది. లేకపోతే తెలిసేది కాదు. మాకు తెలుసు, అది శక్తివంతమైంది, ఎందుకు అంటే దానిలో చెప్పినదంతా దైవజ్ఞానము. దేవుని గురించి చెప్పినది. దేవుని గురించి ఎవరు చెప్పాలి ఆత్మే చెప్పాలి. మనము చెప్పేదానికి కాదు. మనమంతా వాత పెడితే అబ్బా అనే వాళ్ళమే. మనకు తెలియదు. ఇప్పుడు మీరు పాద నమస్కారం చేయాలని చాలామంది వస్తారు. అది వద్దు అని చెప్పుచున్నాను నేను. ఆ పాద నమస్కారము చేయవద్దండి, మంచిది కాదు, నేను మీతో సమానమే, మీకంటే నేను ఏమీ పెద్ద కాదు అని చాలాసార్లు చెప్పినాను. అది ముందు చెప్పాను, ఇప్పుడూ చెప్తున్నాను. నూటికి నూరుపాళ్ళు వాస్తవము అది. కానీ మీకు మాకు పెద్ద అయినవాడు ఇంకొకడు ఉన్నాడు. వాడు మీకు తెలియడు. మాకు తెలుసు. మేము మాట్లాడకున్నా వాడు మాట్లాడతాడు, మేము వ్రాయకున్నా వాడు వ్రాస్తాడు. అట్లా వ్రాసినవే ఈ గ్రంథాలు! అట్లా మాట్లాడినవే ఈ ప్రవచనాలు.

ఈ రకంగా ఇప్పుడు ఈ జ్ఞానశక్తి అనేది ఏదైతే ఉందో, అది ప్రతి మనిషికి అవసరము. ఎందుకు అవసరము అంటే ప్రతి మనిషికీ కర్మ ఉంది, ఆ కర్మను పోగొట్టుకోవాలి అంటే, జ్ఞానము తప్పనిసరిగా మనకు అందరికీ అవసరమే. దైవజ్ఞానము తప్పనిసరిగా అవసరమంటే, దైవ జ్ఞానము ఎక్కడుంది అని చూస్తే బయట చాలాచోట్ల, చాలా సంస్థలు జ్ఞానాన్ని బోధిస్తున్నాయి. వాళ్ళు చాలా ఆర్భాటాలతో బోధిస్తున్నారు. చాలా ప్రకటనలు చేసి, చాలా ప్రచారము చేసి బోధిస్తున్నారు. అయితే ఇక్కడ ప్రకటనలు ఉండవు, ప్రచారము ఉండదు. ఏమీ ఉండదు. లోపల ఏమి వ్రాస్తానో అంతే కానీ బయటికి మాత్రము కనిపించేది ఉండదు. కానీ బయట

ఉపన్యాసాలు చెప్పేవాళ్ళు చాలామంది ఉన్నారు. అట్లాంటిది ఇక్కడ లేదు. కానీ ఇక్కడ శక్తి ఉంది అని చెప్పుచున్నాము. శక్తి ఉంది, లేదు అనేదానికి ఏమి తేడా? ఎట్లా మేము నమ్మవచ్చు అంటే, నేను చెప్పాను ఎక్కడనో విదేశాలలో వ్యక్తి నాకు తలనొప్పి వస్తే ఈ గ్రంథము పెట్టుకొంటే పోయింది అని వాళ్ళు చెప్పడమే కాకుండా, ఫోటోలతో సహా పంపించినారంటే అది విచిత్రమే కదా! ఇంతకు ముందు వేరేవాళ్ళకు గ్రంథాలు అతుక్కున్న ఫోటోలను, సి.డిలను కూడా చూశాము. అంటే ఎలా అతుక్కున్నాయని ఒక హేతువాదిని ప్రశ్నించాము మేము. జన విజ్ఞాన వేదికలో మామూలుగా టీవీలో ఎప్పుడూ అస్తమానము మాట్లాడే వ్యక్తిని, అన్నింటికీ అడ్డము మాట్లాడే వ్యక్తిని అడిగాము. అతను ఎలాంటి వాడంటే అవును అంటే కాదు అంటాడు, కాదంటే అవునంటాడు ఆ మనిషి. ఆ మనిషినే అడిగాము. ఈ గ్రంథాలు ఎందుకు అత్కుకుంటాయని, మనము ఇంకొక మనిషితో అడిగించాము. ఏమని అంటే "గ్రంథాలు అత్కుకుంటున్నాయి. ఈ గ్రంథాలు వ్రాసినాయన ఇదేదో పెద్ద మోసము చేస్తున్నాడు, పెద్ద మాయ చేస్తున్నాడు" ఏమి మోసము ఉంది కనిపెట్టి చెప్తారా అని అడిగించాము. అంటే ఏమి మోసము ఉందో చెప్తారని, ఏమి మోసముంది అని చెప్తాడు? ఫొటోలున్న డి.వి.డి. ఇచ్చాము.

ఆ అత్కుకునేదానికి కారణం ఏమీ చెప్పేదానికి కాదు కదా! చూస్తానులే అని డి.వి.డి. తీసుకున్నాడు. చూసినాడు, చూసిన తర్వాత మళ్లీ అడిగితే ఇంకా చూడలేదు టైమ్ లేదు అన్నాడు. మళ్ళీ అడగగా అడగగా, చూడలేదు అంటే ఏమి బాగుంటుంది అని నా దగ్గర డివిడి ప్లేయర్ లేదు అని చెప్పినాడు. అంత పెద్దవాని దగ్గర డివిడి ప్లేయర్ లేకుండా ఉంటుందా? సరేలే, మేము తీసుకొచ్చి ఇస్తాము అంటే వద్దు

వద్దులే మేము చూస్తాములే అన్నాడు. మేమే తీసుకొచ్చి చూపిస్తాము అన్నా కూడా చూడలేదు ఆయన. జవాబు చెప్పేదానికి సాధ్యము కాదు. ఇంకా వాళ్ళు ఏమిటి అంటే అడ్డదిడ్డముగా మాట్లాడితే మనము చెప్పలేము కానీ వాస్తవముగా దానికి ఏ సమాధానమూ చెప్పలేని పరిస్థితి ఉంటుంది. అవి ఎక్కడా జరగని విషయాలు! మనము ఏమి చెప్తున్నాము? ఒక వ్యక్తికి ఒక కర్మ ఉంటే ఆ కర్మ ఎంతవుందని ఆ మనిషికి తెలియదు. పూర్తి అనుభవించేంత వరకు అర్థము కాదు. అది 10 రోజులు ఉండవచ్చు 5 రోజులు ఉండవచ్చు, 3 రోజులు ఉండవచ్చు లేదా ఒక రోజు ఉండవచ్చు. కానీ కర్మ ఎంతవుందో ఎవరికీ తెలియదు. ఎంత గాఢంగా ఉందో తెలియదు. భగవద్గీతలో ఒక శ్లోకము ఏది కర్మనో, ఏది వికర్మనో, ఏది అకర్మనో పండితులకు కానీ ఏమాత్రము తెలియబడదు అని స్పష్టంగా చెప్పారు కదా! కర్మ విషయములో ఏ పండితునికి కూడా అర్థము కాలేదని చెప్పవచ్చును. పండితునికి కూడా ఆ కర్మ విషయము తెలియదు కానీ, కర్మ ఉండేది మాత్రము వాస్తవమే. జ్ఞానము ఉండేది కూడా వాస్తవమే. జ్ఞానము మీ కర్మను తీసేసేది కూడా వాస్తవమే. అయినా గానీ కర్మ పోయిందా లేదా అని నీకు తెలియదు. ప్రత్యక్షంగా కనిపిస్తున్నప్పుడు తెలుస్తుంది కానీ మామూలుగా తెలియదు. మామూలుగా తెలియాలంటే ఎట్లుంటుందో చూద్దాము.

ఇప్పుడు మేము ఉన్నాము, మాకు 19 సంవత్సరముల నుండి షుగర్. ఎప్పుడైనా చూస్తే 300 పైన ఉంటుంది. మన హోటల్ కౌంటర్‌లో ఉండే శ్రీనివాసులు ఒకతను నా వయస్సే అతనిది కూడ, నాకంటే ఇంకా 4, 5 ఏళ్ళు తక్కువే ఉంటాడు. ఒకరోజు ఏదో విషయంలో ఆయనకు నడిచే పని పెట్టాము. అతను ఒక్కరోజు నడిస్తేనే కాళ్ళు బొబ్బలు ఎక్కాయి.

రెండు కాళ్ళకు గాయమయింది. నాలుగు రోజుల్లో కాళ్ళలో నీరు కారతూ ఉంటే హైదరాబాద్‌లో 'కామినేని హాస్పిటల్'కు పంపించాము. అది బాగయ్యే దానికి 40,000 ఖర్చు పెట్టాము. అది ఇంకా పూర్తి బాగా కాలేదు. ఇంతవరకు అక్కడే ఉన్నాడు. ఆయన ఒక్క రోజు నడిస్తే కాళ్ళు బొబ్బలై సెప్టిక్ అయి 40,000 ఖర్చు పెట్టినా, బాధపోకుండా ఇప్పుడు హాస్పిటల్‌లో ఆయన కర్మ అనుభవిస్తున్నాడు. మాకు గాయమైనా దానంతటదే మానిపోతుంది. గాయమైనా గానీ మేము ఏమీ చేయకుండా దానంతకదే మాయమైపోతుంది. అంటే అప్పుడు మనిషికి మనిషికీ షుగర్‌లో ఏమి తేడా? ఆయనకు కూడా షుగర్ ఉంది రెండు వందల లోపలనే, మందులు వేస్తుంటే కంట్రోల్‌లో ఉంది. నాకూ షుగర్ ఉంది, నాకు కంట్రోల్ లేదు. ఆయనకు 3, 4 ఏళ్ళు అయింది షుగర్ వచ్చి, నాకు 19 సంవత్సరాలు అయింది. కానీ నా ముఖము చూస్తే షుగర్ ఉండే మనిషి అని నన్ను ఎవరూ అనుకోరు. సరే, మళ్ళీ గాయమైతే మానిపోవడము విచిత్రము కాదా? ఇంకొక విచిత్రముంది చూడండి.

2003లో వీపున ఒక రంధ్రము పడింది. లోపల అంతా వీపున భుజములకు చీము కూడింది. అది ఏమీ నొప్పి లేదు కానీ, అదేదో కర్మవుంది వచ్చింది. ఆ బాధ అనుభవించలేదు. నేను ఏమి చెప్పినా అనుభవించేవాడు జీవుడని చెప్పినాను కదా! వాత పెడితే అనుభవిస్తారు, దెబ్బ తగిలితే అనుభవిస్తారు. ఏదైనా అనుభవించాలి కానీ నాకు ఏ అనుభవమూ లేదు. అది ఒత్తితే బయటకు చీము చిమ్మేదన్నమాట. అలా ఒక 10, 15 రోజులు ఒత్తంగా ఒత్తంగా లోపలుండేదంతా బయటికి వచ్చింది. మరి షుగర్ ఉండే వ్యక్తికి చీము పట్టి లోపల గాయమైంది అంటే, అది తీవ్రంగా కావాలి కదా! అది కాలేదు, 10, 15 రోజులపైన దానికదే ఏమీ చీము రాకుండా

ఎండి పోయింది. మామూలుగా అయిపోయింది. ఇప్పటికీ ఆ రంధ్రము అట్లే ఉంది. మళ్ళీ 2009లో అలాగే అదే వచ్చింది. అంటే 2003 నుంచి 6 సంవత్సరాల తర్వాత 2009లో మళ్ళీ అదే వచ్చింది. అక్కడ కూడా మళ్ళీ చీము కారడము జరిగింది. అప్పుడు మేము విశాఖపట్నము దగ్గర అగనంపూడిలో కృష్ణుని గుడి కట్టిస్తున్నాము. అక్కడ అదే పనిమీద పోయి ఆ కార్యములో నిమగ్నమై ఉన్నాము. అప్పుడు దీనిని లెక్కపెట్టలేదు. కొంతమంది డాక్టర్లు చెప్పినారు ఆపరేషన్ చేసి లోపలుండే చీము అంతా బయటికి తీసేయాలి అన్నారు. అయినా నేను హాస్పిటల్‌కు వెళ్లలేదు. ఒక కనీసం 20 రోజులకు బాగైపోయింది. దీనినిబట్టి కర్మ అనే దానిని ప్రత్యక్షంగా అనుభవించకుండా మనము తప్పించుకున్నట్లే కదా! ఇది ప్రత్యక్ష సాక్ష్యం కదా! మనకు. ఈ విధముగా సాక్ష్యాలతో కూడుకొని ఉంటుంది జ్ఞానము. అంటే జ్ఞానము అంటే ఏదో మాటలతో కూడుకొని, గాలిలో పోయేమాటలు అనుకోవద్దండి. అక్షర రూపములో ఉండేదేలే ఏముంది? ఇవన్నీ అక్షరాలే కదా! అన్నీ కాగితాలే కదా! అన్నీ గ్రంథాలు కదా! అనుకోవద్దండి. శక్తివంతమైన గ్రంథాలున్నాయి. శక్తివంతమైన మాటలూ ఉన్నాయి అని నేను ఇంతకుముందు **'దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు'** అనే గ్రంథములో కూడా చెప్పాను. ఇప్పుడు కూడా అదే విషయాన్ని చెప్పుచున్నాను. జ్ఞానము అనేది శక్తివంతమైనదనీ, శక్తివంతమైన జ్ఞానము ఎక్కడుందని గ్రహించి, ఎక్కడైతే శక్తివంతమైన జ్ఞానముందో, దానిని మీరు తెలుసుకుంటారనీ, నేను మరీ మరీ కోరుతూ ఈ సమావేశాన్ని ఇంతటితో ముగిస్తున్నాము.

# 83. గురుచిహ్నం

**తేది : 31-07-2015**

ఇపుడు మనం గురువును ప్రార్థిస్తూ ఈ సమావేశాన్ని మొదలు పెడుతున్నాము. ఇది ప్రత్యేకమైన పౌర్ణమి, గురుపౌర్ణమి. ఈ గురుపౌర్ణమి అనేక సందర్భాలలో అంటే ప్రతి సంవత్సరము వచ్చింది మనకు. చాలా సందర్భాలలో ఈ గురుపౌర్ణమి సందర్భంలో గురువును గురించి చాలా చెప్పుకున్నాము. ఇంక గురువును గురించి ఏమీ లేదు అని ఒక గ్రంథమును వ్రాసుకొని, దాంట్లో ఇంతకంటే ఏమి లేదు అని చెప్పుకున్నాము. అయినా గానీ, లేదు అనుకుంటూనే ఇంకా కొంత చెప్పుకోదల్చుకున్నాము. ఎందుకంటే గురువు ఎవరో? ఇంతవరకు మనకు తెలియదు. గురువు తెలియదా ఏముందయా ఊరి, ఊరికి ఒకరు, ఇద్దరు గురువులు ఉన్నారు. ఒక ఊరిలో నలుగురు గురువులు ఉన్నారు. ఇంకొక ఊరికి పోతే పదిమంది గురువులు ఉన్నారు. ఒక్కొక్క మతంలో ఒక్కొక్క గురువు ఉన్నాడు. ఇంతమంది గురువులు ఉన్నారు. గురువును గురించి తెలియదు అనడమేంటి? అని మీకు ప్రశ్న రావచ్చు. కానీ గురువు అనే పేరుంది కానీ గురువు అనేవాడు లేడు. అంటే వీళ్ళంతా గురువులు కాదా? అని ప్రశ్న వస్తే, పేరుకు మనమంతా గురువులు అయివుండవచ్చు. ఇపుడు "శ్రీరామ" అని పేరు పెట్టుకున్నాము, ఊర్లో ఒక ఇంట్లో వాళ్ళ కొడుకుల పేర్లు శ్రీరామ అని పెట్టుకుంటారనుకోండి. అట్లా ఊర్లో నలుగురు శ్రీరాములుండారనుకోండి, ఊరి మొత్తం మీద. ఈ నలుగురు శ్రీరాముళ్ళు అవుతారా. ఒక్కరు కూడా దశరథ పుత్రులు కారు. పేరుకు మాత్రం శ్రీరాముల్లే. ఒకరు కూడా దశరథ పుత్రులు కారు. పేరుకు మాత్రం శ్రీరాముల్లే.

ఆ రకంగా గురువులు అనే పేర్లు పెట్టుకున్నంతమాత్రాన అందరూ గురువులు అవుతామా? అనుకుంటే అది అయ్యేదానికి సాధ్యం కాని పని. ఎందుకు? అంటే ఇపుడు మీరు గురువు అంటే జ్ఞానం చెప్పేవాడే కదా గురువు అని మీరు ప్రశ్న వేసుకోవచ్చు. వీరు జ్ఞానం చెప్పేవాళ్ళు గురువులు అవుతారు కదా! మరి వారు ఎంతోమందికి జ్ఞానం చెప్తున్నారు కదా! వాళ్ళని గురువులుగా మనం స్వీకరించవచ్చు కదా! అని మీరు ప్రశ్నించవచ్చు. దానికి జవాబు ఏమనగా! గురువు అనునది ఒక శాస్త్రబద్ధమైనటువంటి పేరు, శాస్త్రబద్ధమైన వచనం ప్రకారం 'గురువు' తెలియబడేవాడు కాదు. కన్పించేవాడు కాడు. అతను ఎవ్వరికీ తెలియడు. ఆ తెలియనటువంటి వాడు గురువు. మరి తెలియనటువంటి గురువుతో మనకేమి పని? అని ప్రశ్న రావచ్చు. మనకేమి పనిలేదు. ఆయనకే మనతో పని. మనకు పని వుంటే ఆయనను వెతకాలి మనం. ఆయనెవరు? అని తెలుసుకోవాలి. ఆయన మనకు తెలియదు. తెలియనపుడు మనకేమి పని? అంటే పనిలేదు నీకు. నీకు పని ఉంది అని మేము చెప్పుతున్నామా? నీవు అనుకున్నాగానీ ఆయన దొరకడు. కానీ ఆయనకు నీతో పని. ఆయనకు నీతో పని కాబట్టి ఆయన నీ దగ్గరకు వస్తాడు. నీకు ఏమి చెప్పాలో చెపుతాడు. ఏమి బోధించాలో అది బోధిస్తాడు, కానీ అతనిని గురువు అని నీవు కనుక్కోలేవు. చూడు ఎట్లుందో! గురువుని కనుక్కోనేదానికి అవకాశం లేదు. మరి అట్లా వచ్చే వాడే గురువే కదా! తెలియకపోయినా గురువే కదా! తెలియకపోతే గురువైనా ఒకటే, గురువు కాకున్నా ఒకటే నీకు. తెలిసినపుడే కదా! నీకు గురువు. తెలియనపుడు గురువు అయినా ఒకటే, కాకున్నా ఒకటే.

కాబట్టి మనం ఇపుడు ఏమి చెప్పుకున్నామంటే చివరకు గురువు అనేటటువంటి వాడు తెలియబడడు. మీరు ఒకటి చెప్పారు, దేవుడు

అంటే తెలియబడడు అని గురువు అంటే ఎందుకు తెలియబడడు? అని మీరు ప్రశ్న వేయవచ్చు. దానికి జవాబు ఏమనగా! దేవుడు ఎంతో! గురువు కూడా అంతే!! అంటే దేవుడూ, గురువూ ఇద్దరు ఒక్కటే! దేవుడు తెలియబడడు, కానీ గురువు కూడా తెలియబడడు. ఎందుకు తెలియబడడు? అంటే దేవుడే గురువు కాబట్టి తెలియబడడు. దేవుడు దేవునిగా ఉండవచ్చు, మళ్ళీ గురువుగా ఎందుకు రావాలి? గురువు అనే పేరు ఎందుకు పెట్టుకోవాలి? అని అడుగవచ్చు. దానికి జవాబు ఏమనగా! నీకు విద్య నేర్పితే గురువు అవుతాడు. దేవుడు విద్య నేర్పడు కదా! కాబట్టి ఆయనకు గురువు అనే పేరు పెట్టేదానికి లేదు. దేవుడు మారువేషములో విద్య నేర్పితే గురువు అవుతాడు. అంటే దేవుడు మాట్లాడడు, పని చేయడు, ఆయనకు పేరూ లేదు, ఏమీ చేసేవాడు కాదు. రూపమూ లేదు. అయితే మారువేషమయిన గురువుకు అన్నీ వున్నాయి. మాట్లాడతాడు, రూపమూ వుంది, పేరూ ఉంది. రూపం, పేరూ అన్నీ ఉండి ఎందుకు తెలియడు? అంటే అక్కడే రహస్యం ఉంది. అతను దేవుడు కాబట్టి, నిరాకారుడు దేవుడు. ఆకారం లేనటువంటి వాడు దేవుడు. గురువు అంటే ఆకారం ఉంది అని చెప్పుచున్నాము కదా! ఆకారము ఉన్నప్పుడు మనం ఎందుకు కనుక్కోకూడదు? అని అడగవచ్చు. అంటే ఆకారం లేనివాడే ఆకారంతో వచ్చినప్పుడు గురువు అవుతాడు. ఆకారం లేనివాడు ఎవడైతే ఉన్నాడో ప్రపంచంలో (దేవుడు), అతను ఆకారంతో వస్తే గురువు అవుతాడు. అంటే, ఇపుడు కొంతమంది సిద్ధాంతంలో దేవుడు భూమి మీదకు రాడు. ఆయన ఆకారంతో పుట్టడు. దేవుడు దేవునిగానే ఉంటాడు. దేవుడు దేవునిగా వుండి, మన దగ్గరకు వచ్చి పుట్టకుండా, మనకు జ్ఞానం నేర్పకుండా, మనతో మాట్లాడకుండా, గురువుగా రాకుంటే దేవునితోనే పనిలేదు మనకు. దేవునితో

నాకేమి సంబంధం లేదు పోవయ్యా మాకు అని చెప్పవచ్చు. నీవు దేవుడే అయినాగానీ మాకేమి నీతో ఉపయోగం లేదు.

కానీ దేవుడు అట్లా వదిలిపెట్టలేదు మనిషిని. దేవుడు ఏం చేస్తున్నాడంటే మన దగ్గరకు వస్తున్నాడు. మనకు తెలియని జ్ఞానాన్ని తెలియజేస్తున్నాడు. **"తెలియని జ్ఞానాన్ని తెలియజేస్తున్నాడు."** ఆయన తెలియజేసినపుడే మనకు బుర్రలో వెలుగుతుంది జ్ఞానం, లేకపోతే దైవ జ్ఞానము ఎంతమాత్రం తెలియదు. దేవుని జ్ఞానం మనకు తెలియాలి అంటే దేవుడే చెప్పాలి. మాట్లాడనటువంటి దేవుడు మాట్లాడి చెప్పాలి. ఎట్లా మాట్లాడతాడు? అంటే శరీరంతో ఉండి చెప్పాలి. మళ్ళీ శరీరంతో ఉండి జ్ఞానం చెప్పినపుడు మనం ఎందుకు కనుక్కోలేము? కనుక్కోవడానికి వీళ్ళేదు. ఇపుడు నేను లోపల ఉండాను, మీరు బయట ప్రబోధానంద స్వామి అంటే చాలా గొప్పవాడు. చాలా జ్ఞానం చెప్పినాడని పొగిడినారు. పొగుడుతూ ఉంటే అబ్బ నేను చాలా గొప్పవానినని నాకు కూడా అనిపిస్తాది లోపల. మీరు నన్ను ఒకసారి దేవున్ని అన్నారు. నేను దేవున్ని కాకపోయినా గురువునన్నా అవుతాను కదా! అని అనుకున్నాము. గురువు అంటే ఎవరైనా ఒప్పుకుంటారు. దేవుడంటే ఎవ్వరూ ఒప్పుకోరు కదా! మనలోపల నేనేమో పెద్దవానిని కదా అని వచ్చింది. అంతే ఏమి చేస్తాం మీరు అట్లా చెప్పితే మాకు వచ్చేదే కదా! ఎవరికైనా వస్తుంది. మళ్ళీ ఒక ప్రక్కన లోపల "ఒరే నీవు సరిగా నడవలేవు. నీవు ఎక్కడ దేవునివిరా!!" అని అనిపిస్తావుంది. నీవు సరిగా నడవలేవే నీవు ఎట్లా గురువు అయితావు. నీకెక్కడ గొప్పతనం వుంది. వాళ్ళు పొగిడినంతమాత్రాన నీవు ఎట్లా నమ్ముతున్నావు అనిపించింది. కరెక్టే, అది కూడా నిజమే! ఎందుకంటే మొన్న మూన్నాళ్ళు జ్వరం వచ్చి పడిపోయినాను. బువ్వ తినేదానికి కూడా లేదు. పండ్లరసం తాగి పడిపోయినాము.

ఇప్పుడు బాగుంది. ఇపుడు నేను దేవున్ని అనుకుంటే ఎట్లా అయితాది. అప్పుడేమో దేవున్ని అబ్బ, అమ్మా అని మాట్లాడి, బాధలో దేవుడా నన్ను రక్షించు అని, ఇపుడు మళ్ళీ నేను దేవుడు అనుకొంటే ఎట్లా అయితాది కాదు. మనం దేవుళ్ళం కాదు. సరే! మళ్లీ నీవు దేవునివి కాకపోయినా నీవు గురువు కావచ్చు కదా! అని అడగువచ్చు. దానికి నా జవాబు గురువు అని నేను ఒప్పుకోవడం లేదు. చాలాసార్లు చెప్పినాను మీరు గురువు అని అనొద్దండి. చెప్పడమే కాకుండా మీకు చాలామందికి చెప్పాము. నాకు నమస్కారాలు చేయవద్దండి. నమస్కారము చేస్తే అట్లా అనుకుంటా నేను కూడా. పెద్దవాన్ని అనుకుంటాను. నేను కూడా దేవున్ని అనుకుంటాను. అట్లు అనుకోవడము పొరపాటు కాబట్టి మీరు నమస్కారాలు చేయద్దండని చెప్పాము. ఈ రోజు కూడా ఒకరు వచ్చారు. లోపలికి వచ్చి నమస్కారము చేయను వస్తే, చూడయ్యా నేనూ కాలు దాచిపెట్టుకొని టేబుల్ క్రింద పెట్టి కూర్చున్నాను. బయట పెట్టితే మీరు మళ్ళీ వచ్చి మ్రొక్కుతారని టేబుల్ దగ్గరే కూర్చొని మాట్లాడుతున్నాను. మీరేం నమస్కారం చేయద్దు. మీరు వంగినాగానీ నా కాళ్ళు దొరకవు అంటే నమస్కారాలు చేయకూడదు. మీరు నాకు నమస్కారం చేసినారనుకోండి, దేవుడూ, మేమూ ఇద్దరం ఒకటే అయితాము. మీరు చేసే నమస్కారం ఏదో దేవునికి చేయండి మీకు ఫలితం ఉంటుంది. నాకు చేస్తే ఏమి ప్రయోజనం లేదు అని చెప్పాము. అంటే దేవుడు గొప్పవాడు ఆయన ఏ రకంగానైనా జ్ఞానం చెప్తుతాడు. మనము, ఏమీ తెలియని మనుషులం. ఏదో నాలుగు మాటలు నేర్చుకుంటానే మనం గురువు అనుకోవడం పెద్ద పొరపాటు. ఒకవేళ మీరు నన్ను పొగిడినా గానీ, మీ మాటలు పట్టుకొని నేను ఉప్పొంగి, ఉబ్బితబ్బిబైపోతే నాది అజ్ఞానము అవుతుంది. ఉండే జ్ఞానం కూడా పోతుంది మళ్ళీ. అందువలన

మీరు ఎట్లా మాట్లాడినా నా స్థాయిలో నేను గట్టిగా పట్టుకొని వుండాలి జారి పోకుండా. మీరు ఉబ్బించినా గానీ నేను ఉబ్బిపోకూడదు. నా జాగ్రత్తలో నేను ఉంటూ, నేనేమి చెప్పుచున్నానంటే, నేను సర్వ సాధారణమైన మనిషినే!, కానీ నేను వ్రాసిన జ్ఞానంలో గొప్పదనం ఉంది. నేను వ్రాసే జ్ఞానంలో గాదు, నేను చూపే జ్ఞానంలోనే గొప్పదనం ఉంది. అంటే అది నాకు ఎవ్వరిచ్చారు? ఆ దేవుడియ్యాల్సిందే మనకు. అది మన శక్తి ఏమీ కాదు దేవుడు ఇవ్వాల్సిందే! ఇపుడు సమస్య ఎక్కడ మొదలుపెట్టాం. గురువు దగ్గర మొదలుపెట్టాము ఎల్లప్పుడూ మన చుట్టూ మనం చెప్పుకొంటే బాగుండదు. గురువును గురించి చెప్పుకుందాము.

ఇపుడు గురువు అంటే తెలియనటువంటి వాడు. మనము గురువులం కాదు. మేము గురువులం కాదు. మీరు జాగ్రత్తగా ఎప్పుడూ గురువులూ అని అనద్దండి అని ఇపుడు మేము మొదటకే చెప్పేస్తున్నాము. ఇపుడు మరలా గురువులు కాకపోతే, అంటే మనకు జ్ఞానం ఎలా తెలుస్తుంది? అంటే గురువు చెపుతాడు అని నేను చెప్పుతున్నా కదా! నాకు జ్ఞానం ఎట్లు తెలుస్తుంది, నేను ఇక్కడికి వస్తున్నా కదా! అంటే, నీవు రావయ్యా ఎవరొద్దన్నారు. మీకు చెప్పేవాడు ఎవడు చెపుతాడు? గురువు చెపుతాడు. అంటే మీరు చెపుతున్నారు కదా! మీరు చెప్పే జ్ఞానమే వింటున్నాము, కదా అంటే, నేను గురువును అయితే కదా నీకు చెప్పేది, నేను చెప్పే జ్ఞానం గొప్పదని. నేను చెప్పేది నేను చెప్పినాగానీ, నీకు చెప్పాల్సింది గురువే! నీకు గురువు చెప్పితేనే నీకు ఎక్కుతుంది. అంత వరకూ నీకు ఈ జ్ఞానం అంటదు. ఇదంతా తికమకగా చెప్తారు మీరు. ఏమాత్రం అర్థం కాకుండా, జ్ఞానం తెలియబడుతుంది. జ్ఞానం గొప్పదే అని మీరు చెప్తున్నారు. ఇక్కడ చెప్పే జ్ఞానం కూడా గొప్పదే అని చెప్తున్నారు. మరలా ఇంకేం చెప్తున్నామంటే

ప్రపంచంలో ఎక్కడా లేని జ్ఞానం. ప్రపంచంలో ఎక్కడా లేని జ్ఞానశక్తి ఇక్కడ ఉంది. ప్రపంచంలో దొరకని జ్ఞానం ఇక్కడ దొరుకుతుంది అని చెప్పుచున్నారు. అయినా నేను గురువును కాదు అంటున్నారు.

గురువు అనేవాడు జ్ఞానమును ఎట్లా మాకు చెప్తాడు అంటే నోటితోనే చెప్తాడో, మాటలతోనే చెప్తాడో, ఎప్పుడు చెప్తాడో మనకు తెలియదు. కానీ నాకు చెప్పింటే, నేను మీకు చెప్తున్నాను. అంటే నువ్వు అయినా గురువును చూసుండాలి కదా! అంటే ఒప్పుకోడు. నేను చూసినాను అనుకో! వాడు ఇట్లా వున్నాడని చెప్పేదానికి నాకు చేతకాదు. నేను ఇంతకు ముందు చెప్పాను పోయిన మీటింగ్‌లో ఏమని? నిన్ను నడిపేవాడు ఒకడున్నాడు అని. **'తోలేవాడు'** అని ఒక సిడి కూడా ఇచ్చాము. పోయిననెల మీటింగ్‌కి. అక్కడ చివరిలో చెప్తూ, చెప్తూ ఇంక లాస్ట్ ఎండ్ అయిపోయింది ఉపన్యాసంలో ఏమి చెప్పాం. నిన్ను తోలేవాడు ఒకడున్నాడు. వాడు ఎట్లు తోల్తుంటే నీవు అట్లు పరిగెత్తుతున్నావు అని చెప్పాము. ఇపుడు నేను ఒక శరీరం ధరించి ఉండాను. నన్ను తోలేవాడు కూడా ఒకడున్నాడు. అంటే, నన్ను నడిపించేవాడు. ఆ నడిపించేవాడు ఏ రకంగా నడిపిస్తుంటే, ఆ రకంగా నేను నడుస్తుంటాను.

ఇపుడు ఎట్లా మాట్లాడాలి, ఏది ముందు మాట్లాడాలి, ఏది వెనకాల మాట్లాడాలి అని మాట్లాడించే వాడు కూడా వాడే, వాడు మాట్లాడిస్తుంటే నేను మాట్లాడుతున్నాము. వాస్తవముగా నాకేం తెలియదు. ఎందుకంటే మీరన్నా ఒక శ్లోకం గట్టిగా ధైర్యంగా చెప్తారేమో గానీ, నేను ధైర్యంగా ఒక శ్లోకం చెప్తాననే నమ్మకము కూడా నాకు లేదు. ఎందుకంటే నాకు రావు. జ్ఞానం చెప్పగలనేమో గానీ, పబ్లిక్‌గా శ్లోకం మాత్రం చెప్పలేను. అది కొన్ని

యేండ్లు నేర్చుకొంటేగానీ ఒకటి వస్తాది ఏది? ఇపుడుముందు చెప్పినా చూడు గురుబ్రహ్మ, గురువిష్ణు అది తప్ప ఇంకొకటి ఎప్పుడూ చెప్పను చూడండి. అదే వచ్చేది, వేరేది రాదు. మీరంటే ఏమైనా చెప్తారుగానీ, నాకు రాదు. సరే, ఎట్లన్నాగానీ ఇపుడు గురువు క్రిందికి మనం లెక్కేసుకొంటే, గురువు అనేటటువంటి వాడు ప్రపంచంలో జ్ఞానాన్ని బోధిస్తేనే మనకు తెలిసేది. నీకుగానీ, నాకుగానీ ప్రపంచంలో ఎవరికైనాగానీ, గురువు ద్వారానే దేవుని జ్ఞానం లభించాలి. మళ్ళీ గురువు ద్వారానే దేవుని జ్ఞానం లభించినపుడు మనం గురువును ఎందుకు కనుక్కోలేము? అంటే మనం కనుక్కొండేదానికి అవకాశం లేదు. మళ్ళీ గురువు మనకు ఎట్లా చెప్తాడు. మనల్ని ఆయన గుర్తించి చెప్తాడు. మరి ఆయన గుర్తించి అయినా మనకు కనపరాకుండా చెప్తాడా? కనిపించే చెప్తాడు. ఎదురుగా ఉండే చెప్తాడు. మాటలతోనే చెప్తాడు. మనమెందుకు గుర్తు పట్టలేము. ఎందుకు గుర్తు పట్టలేము అంటే ఆయనను గుర్తుపట్టేదానికి ఎవ్వరికీ అవకాశం లేదు అని ఒక సిద్ధాంతం ఉంది. ఒక శాస్త్రబద్ధత ఉంది. అంటే దేవుడే గురువయ్యే దానివల్ల, గురువు దేవునితో సమానం అయినదానివల్ల, ఆయన ఎవ్వరికీ గుర్తింపబడడు. ఆయనను గుర్తుపడితే మనం దేవుని యొక్క రహస్యాన్ని కొంత తెలుసుకొన్నట్లు అవుతుంది. కాబట్టి ఆయన ఎవరి చేతా గుర్తింప బడడు. ఇపుడు మళ్ళీ అంత గుర్తింపబడనటువంటి వానిని, ఇట్లే ఉంటాడు అట్లే ఉంటాడు అని మీరెట్లా చెప్తున్నారు? అది కూడా ప్రశ్నేకదా! మళ్ళీ ఏమాత్రం గుర్తు పట్టనపుడు మీరు ఇన్ని గీతలు, గీతలు పెట్టి చెప్తున్నారే, ఇట్లే ఉంటాడని, ఎట్ల చెప్తున్నారు? అంటే, నేను చూసినాకాని ఆయన ఆకారాన్ని చెప్పలేను కానీ, ఆయన శక్తిని, ఆయన పద్ధతిని, ఆయన పవర్‌ని చెప్పచ్చును.

గురువు అనేవాడు అందరిలో ఉన్నాడు. నాలో ఉన్నాడు. మీలో ఉన్నాడు కానీ అతనిని మనం గుర్తించలేము అని చెప్పాము. వాడే మనల్ని నడిపిస్తున్నాడని కూడా చెప్పాము. గురువు శక్తే ప్రపంచంలో నిన్నూ, నన్నూ అందరిని నడిపిస్తావుంది. మనల్ని ఒక్కరినే కాకుండా, గురుత్వాకర్షణ శక్తి అని పేరు పెట్టినటువంటిది ఏదైతే వుందో ప్రపంచంలో అది సూర్యగోళాన్ని, చంద్రగోళాన్ని, నక్షత్ర గోళాలను ప్రపంచంలో ఉన్నటువంటి సమస్త ప్రపంచాన్ని నడిపిస్తా వుంది. గోళాలను కూడా నడిపిస్తాంది కదా! ఈ రకంగా ప్రపంచంలో సమస్తాన్ని నడిపించే శక్తి ఒకటుంది. ఆ శక్తి మనలో కూడా వుంది. ఆ శక్తి ఎప్పుడైతే, ఎక్కడైతే మాట్లాడుతుందో అప్పుడు అక్కడ గురువు వున్నాడని మనకు లెక్క. ప్రపంచానికంతా అధిపతిగా వుండేటటు వంటి శక్తి, ప్రపంచాన్నంతా నడిపేశక్తి, మనుషుల్లో కూడా ఉండి మనుషులను కూడా నడుపుతా ఉంది. ఆ శక్తి ఎక్కడైతే తన జ్ఞానాన్ని బయటకు చెప్తావుందో, అక్కడ మనకు గురువు ఉన్నాడని మనకు లెక్క. అంటే, ఇపుడు మళ్ళా వాళ్ళకు ఒక గుర్తు వచ్చింది కదా! ఎక్కడైతే జ్ఞానం చెప్పబడతావుందో, అక్కడ గురువు ఉన్నాడని. మళ్ళీ అతన్ని మనం గురువుగా గుర్తించవచ్చునా? అని ప్రశ్న వేసుకుంటాం. అట్ల కూడా గుర్తించే దానికి అవకాశం లేదు. ఎందుకు లేదు? అంటే, ఒకవేళ గురువుగా అంటే, గురువు ఒక శరీరంతో చెప్పినాగానీ, ఒక ఆకారం కల్గి చెప్పినా కానీ, ఒక శరీరంలో మాటల రూపంలో చెప్పినా గానీ, స్వచ్ఛమైన జ్ఞానాన్ని చెప్పినా గానీ, ప్రపంచంలో ఎక్కడా ఎవ్వరికీ తెలియని జ్ఞానాన్ని చెప్పినా కానీ, ఆ మనిషికే అనుమానం వస్తుంది, నేను గురువునేనా అని. వాడు గురువు అయినా గానీ, నేను కాను అని వానికే అనుమానం వస్తుంది.

నేను గురువును కాదు అని నిర్ణయము చేసుకుంటాడు వాడు. ఎందుకంటే వానికి వాడు కూడా నమ్మకముగా చెప్పలేదన్నమాట. అటువంటి పరిస్థితి దేవుడు కల్పిస్తాడు. అందుకై గురువు ఎక్కడా తనకు తాను ప్రకటించుకోవడానికి వీల్లేదు. ఎక్కడా బయటపడడు అని చెప్పుతున్నాం. విచిత్రమైన విషయమే ఇది. ఎందుకంటే, ఎక్కడాగానీ దేవుడు తెలియబడడు అని ఉంది. అంటే ఇపుడు మీకు నేను చాలా లోతైన జ్ఞానాన్ని తీసుకొని వచ్చి చెప్పాను. పోయిన నెలలో చూడు, మిమ్మల్ని నడిపించేవాడు ఒకడున్నాడు, మీరు పుట్టినప్పటి నుండి మిమ్మల్ని తోలుతున్నాడు. మీరు తోలబడుతున్నారు. మిమ్మల్ని నడిపిస్తున్నాడు. మీరు నడవబడుతున్నారు. మళ్ళా ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకోండి ఎవడో నడిపించేవాడు అని చెప్పాము. అంటే మాకందరికి తెలియదు. మీరు చెప్తున్నారు కదా నడిపించే వాడు ఒకడున్నాడని, మమ్మల్ని వెనక్కి తిరిగి చూసుకో, వెనక్కి తిరిగి చూసుకో అని అంటే, నువ్వు వెనక్కి తిరిగి చూసుకున్నావా? అని మీరు ప్రశ్న వేయవచ్చు. అంటే మిమ్మల్ని ఇంతగా చెప్పినపుడు ఒక్కసారి చూసుకోండయా వెనక్కి తిరిగి, మీ గురువు మీకు తెలుస్తాడు. మిమ్మల్ని నడిపించేవాడు మీకు తెలుస్తాడు. అని మీకు ఇంతగా చెప్తున్నా కదా నేను. మీరు తిరిగి ప్రశ్నవేయచ్చు నాకు ఏమని? అంతగా మాకు బుజ్జగించి చెప్తున్నాడు అట్టున్నాడు, ఇట్టున్నాడని మళ్లా నీవు చూసినావా ఏమన్నా వెనక్కి తిరిగి అని అడుగవచ్చు. నేను చూసినా, చూడకున్నా మీరు నమ్మేదానికి అవకాశం లేదు. ఇపుడు నేనేం చెప్పాలంటే, మీకు తిరిగి చూసినా! అని చెప్పాల్సిందే నేను. ఎందుకంటే నేను చూడకపోతే మాకెందుకు చెప్తాండని? మీరు ప్రశ్న వేస్తారు.

నేను చూసినా అని అంటేనే (చెప్పితేనే) మీకు సరిపోయేది. కాబట్టి వెనక్కి తిరిగి చూసుకున్నాను. నాలో ఉండే తోలేవాన్ని నేను చూసుకొన్నాను. మీరు కూడా చూసుకోండి అని చెప్తాము ధైర్యంగా. అంటే నేను, నాకు తెలుసు, మీరెందుకు అట్లా మూర్ఖులుగా వుండారు? నేనేం మూర్ఖున్ని కాదు. నేను తెలుసుకున్నా కాబట్టి మీకు చెప్తున్నానని చెప్తాంలే. అంతేకదా! తెలీదు అని అంటే, మీరెందుకు చెప్తుతున్నారు అనే ప్రశ్న వస్తాది కాబట్టి. ఇపుడు ఆ లెక్కకుపోతే, నేనే మిమ్మల్ని వెనక్కి తిరిగి చూసుకోండి, మిమ్మల్ని నడిపేవాడు ఎవడో మీలోనే వుండాడు. ఒక్కసారి మీ లోపలికి చూసుకోండి అని మీకు అంత చెప్పినోన్ని, మీరు చూసుకున్నారా? లేదా? అని ప్రశ్నవేస్తే, ఇంకా నేనేమి చెప్పాలి అంటే అది నిజమో! అబద్ధమో! గానీ చూసుకున్నాననే చెప్పాలి. ఇంక అదే దారి. చూసుకున్నాక మళ్ళీ ఏమైంది. నీవు అపుడు చూసి ఉంటావు కదా లోపల ఉండేవాన్ని. చూడ్లేదు అంటే తప్పు అయితాది. మళ్ళీ అబద్దం అయితుంది. చూసినాను అని చెప్పాలి ఎందుకంటే, మీకు జ్ఞానం చెప్పాలంటే మళ్ళీ ఏమీ చూడంది మాకు ఎందుకు చెప్తావయ్యా, ముందు నువ్వు చూసుకో! మళ్ళా మాకు చెప్పు అని ప్రశ్న వస్తాది. కాబట్టి ఇపుడు మేము ఏమి చెప్పాలంటే, నేను చూసుకున్నానో లేదోగానీ, నేనేం చెప్పినా అంటే నేను నా ప్రయత్నం చేసినాను. మిమ్మల్ని ప్రయత్నం చేయమని చెప్తున్నాను. మీరు చూడ్లేదుగానీ, నేను చూసినాను అని చెప్పితే అపుడు మళ్లీ ఎట్లున్నాడు? అని మీరు ప్రశ్నవేస్తారు. ఇపుడు మీరు చూసుకున్నారు కదా! ఇప్పుడు చెప్పు ఎక్కడికి పోతావ్ ఇపుడు దొరికినావుకదా నీవు. నీవు చూసినా అన్నావు. ఇంతవరకు ఎవరూ చూడ్లేదు, చూడలేదు అని ఎవరికీ తెలియదని అన్నావు కదా! నీవు చూచానని అబద్దము చెప్పావు కదా!

ఇప్పుడు ఎక్కడికి పోతావు నీవు అని ప్రశ్నవేశావు అనుకో నేను ఇప్పుడు ఏం చెప్పాలి? అక్కడ కూడా దొరకకుండా చెప్పాలి. అక్కడ కూడా ఎవ్వరికీ దొరకకుండా చెప్పాలి. ఏం చెప్పాలి అంటే, నేను చూసుకున్నాను కరెక్టే! తోలేవాడు కన్పించాడు. నన్ను నడిపించేవాడు కన్పించాడు. ఎట్లున్నాడు? నేను ఎట్టున్నానో అట్టే వున్నాడు. అట్లా ఇట్లా చూస్తే, నేను ఎట్టుంటే, అట్టే ఉన్నాడు. ఈ విధముగా చెప్పవచ్చు. ఇప్పుడు చెప్పినట్లే లోపల యున్నవాడు ఉన్నాడు. ఇది సత్యము. మిమ్మల్ని నడిపించే వాడు ఒకడున్నాడు. ఆ నడిపించేవాడు ఎవడో మిమ్మల్ని మీరు చూసుకోండి అని చెప్తున్నాము. ఇక్కడ కథలు చెప్పలేదు, కారణాలు చెప్పలేదు. కాలక్షేపానికి ఏ స్టోరీలు చెప్పలేదు. యదార్థమైన జ్ఞానం చెప్తున్నా చూడండి. చాలా దగ్గరైన జ్ఞానాన్ని. ఇది లోతైన జ్ఞానం. ఏ గ్రంథాలు చదివినా ఇది కన్పించదు. ఏ పుణ్యక్షేత్రాలకు పోయినా లేనిపోని తిప్పలు తప్ప ఇది కన్పించదు. ఇపుడు ఈ లోతైన జ్ఞానంలో ఏమైందంటే, గురువును గురించి చెప్పాలంటే, నా గురువును నేను చూసినాను. నడిపించేవాడు అందరికీ గురువే కదా! ప్రపంచాన్నే, సూర్యగోళాన్ని, చంద్రగోళాన్ని అందరిని నడిపించేవాడు గురువు అయినపుడు, మనల్ని నడిపించేవాడు గురువే కదా! ఇపుడు మరలా నేను చూస్తే నాకేమి తెలిసింది? ఇంతమందికి చెప్పినపుడు నేను చూసుకోకుండా మీతో చెప్పితే ఏమి బాగుంటుంది.

కాబట్టి నేను చూసుకున్నాను. కన్పించినాడు. ఇప్పుడు చెప్పు. ఎట్లున్నాడంటే? నేను ఎట్లున్నానో అట్లే ఉన్నాడు అని చెప్పినాము. మరి ఇంక అదే మాకు తెలిసినట్టే కదా అని మీరు ప్రశ్న వేయచ్చు. కరెక్టే కదా అది. దానిని మేము ఒప్పుకోము. నాలో ఉండేవానిని నేను చూసుకున్నా నయ్యా, మీలో ఉండే వాన్ని మీరు చూసుకోమని మేము చెప్పినేది. నాలో

ఉండేవాన్ని నేను ఇట్లా ఉండాను చూడు అని నేను కన్పించి, మీరు నా మాదిరే అనుకోండి అంటే ఎట్లా అవుతుంది? నిన్ను నడిపేవాడు ఉన్నాడు, నిన్ను నడిపేవాన్ని నీలోనే నీవు చూసుకోమని చెప్పినది. ఎట్ల చూసుకుంటావు అబ్బా ఇది ఏమిటిదో తెలియదు, ఇది కనపరానిది ఏదో చెప్తా ఉన్నాడు. దినమూ పని చేసుకుంటాం మన పని ఏదో, మన కాళ్ళు, చేతులు మనకే కన్పిస్తావుండాయి అని కొంతమంది అంటారు.

వాళ్ళకు ఈ జ్ఞానం తెలియదు. కొంతమంది లోతైన జ్ఞానంలో ఉన్నారు. మనం చెప్పేదంతా అర్థం చేసుకొనే జ్ఞానులున్నారు. ప్రపంచంలో వాళ్ళేం చేస్తావున్నారంటే, కండ్లు మూసుకొని ధ్యాసంతా లోపలికి పెట్టుకోని చూశారు. ఆయనేదో ఇంతగా చెప్తున్నాడు. మనం చూస్తాం! లోపల ఏముందో అని మనల్ని నడిపించేవాడు ఎవడో చూస్తే, వాళ్ళకి ఆయన కన్పిస్తున్నాడు గానీ, వాళ్ళు గుర్తుపట్టలేకున్నారు. ఇంకేముంది గుర్తుపట్ట లేనపుడు ఏమి చేస్తావు కనపరానట్టేకదా! ఉన్నాడు వాళ్ళకు ఎదురుగనే! కానీ వాళ్ళు చూసినాగానీ వాన్ని గుర్తుపట్టలేని స్థితిలో ఉన్నారు. మళ్ళీ ఆ స్థితి ఎందుకుంది, ఇపుడు మనము వానిని గుర్తుపట్టాలంటే ఏమి చేయాలి. సరే కండ్లు మూసుకొని చూశావు. మనసును ప్రక్కకు పోకుండా చూశావు. బుద్ధి ప్రక్కకు పోకుండా చూశావు. మళ్ళీ నీకు కనపరాలేదా అంటే నీకు కన్పిస్తున్నాడు, కానీ వాన్ని నీవు గుర్తుపట్టలేదు. ఎందుకు గుర్తుపట్టలేదు? అంటే, అతన్ని గ్రహించుకొండే జ్ఞానం మనకు లేదు. ఒక వస్తువును చూడాలంటే, దానికి సంబంధించిన జ్ఞానం కొంత అవసరం మనకు. కాబట్టి ఆ జ్ఞానంలో పరిపక్వత చెందలేదు. జ్ఞానంలో పరిపక్వత చెందినపుడు గురువు నీకు తెలియబడతాడు. అర్థమయిందా! మనకు గురువు అనేదానికి **'గు కారస్య గుణాతీతః - రుకారో రూపవర్జితం'** అని లోపలైతే గుణాలు

లేకుండా ఉన్నాడు. పైకి అయితే రూపమే లేకుండా ఉన్నాడు. మళ్ళీ అటువంటి గురువును తెలుసుకోవాలంటే చాలా కష్టతరమైన పని.

కానీ ప్రపంచంలో గురువులేని విద్య ఎక్కడా లేదు. గురువు చెప్పితేనే ప్రతి విద్య మనకు తెలియబడతా ఉంది. మళ్ళీ ఆ గురువు ఎలా చెప్పగల్గుతున్నాడంటే, శరీరంతో ఉండి, ఆకారంతో ఉండి, మాటల రూపంతోనే చెప్పుచున్నాడు. అంటే, అతన్ని ఏమనాలి అంటే వాస్తవంగా దేవుడని చెప్పాలి. మరి దేవుడు మనిషి రూపంలో వస్తే, అతను గురువు అయితాడు. దేవుడు మనిషి రూపంలో వస్తే అంటే, మనం గుర్తుపట్టేదానికి వీలైతుందా? అంటే ఎందుకు కాదు. ఆయన ఏమి చెప్తున్నాడు. నా జ్ఞానాన్ని నేను చెప్తున్నాను అంటున్నాడు. ఎక్కడైతే నా జ్ఞానం చెప్పబడుతుందో, అక్కడ నేను చెప్పితేనే కదా, మీకు తెలిసేది అన్నాడాయన. నేను చెప్పితేనే కదా మీకు తెలిసేది, లేకపోతే ఎట్లా తెలుస్తుంది. నా జ్ఞానం నాకే తెలుసు. నా జ్ఞానం ప్రపంచంలో ఎవ్వరికీ తెలియదు. నాకొక్కనికి మాత్రమే తెలుసు. ఏ మానవ మాత్రునికి తెలియదు. అంటే గురువు మనిషి కాదు అని లెక్క. ఏ మనిషికీ నా జ్ఞానం తెలియదు అంటే, ఏ మనిషీ గురువు కాదు. నేను మాత్రం చెప్పగలను. అది చెప్పేవాడు మనిషికాదు. మనిషికాదు అంటే మనిషివలె ఉంటాడు కానీ మనిషికాదు.

ఇపుడు ఈ రకమైన చిక్కుబాటులో మనం గురువును గుర్తించలేకుండా పోతున్నాము. ఈ రోజు మనకు గురుపౌర్ణమి. గురువును గురించి అందరు ఆరాధిస్తున్నారు. ప్రత్యేకంగా దేవాలయాల్లోకి పోయి పూజ చేసి వస్తున్నారు. ఈయనే గురువు, ప్రపంచంలో ఎవర్లేరని. అది చేసేదెవరికి కన్పించే గురువుకు. కన్పించే గురువుకు పూజచేసి వస్తున్నారు. కన్పించేవాడు

గురువు అయితాడా? అని ప్రశ్న వేస్తే, అంటే మనం గురువును పెట్టుకొన్నట్లే పెట్టుకోవాల్సింది గాని, వాస్తవంగా పద్ధతి ప్రకారం శాస్త్రబద్ధత ప్రకారం గురువు అయ్యేదానికి అవకాశం లేదు. గురువని చెప్పకూడదు. మనం చేసే పూజ గురుపూజ అని పెట్టుకున్నాగానీ, అది గురుపూజ కాదు. మామూలు మనిషి పూజ అవుతుంది. మళ్ళీ గురువును గుర్తించగలము అంటే, గుర్తించేదానికి అవకాశమే లేదు అని మనం చాలా సందర్భాల్లో చెప్పుకున్నాం. ఇంతకు ముందు కూడా. దాన్ని గురించి ఒక గ్రంథం కూడా వ్రాసుకున్నాము. గురువును గుర్తించేదానికి వీల్లేదని. ఏ గురువు దగ్గరికి, ఏ శిష్యుడు చేరలేడు అంటే గురువును వీడు గుర్తించలేదు కాబట్టి వీడు అక్కడికి చేరలేడు. ఏ శిష్యుని దగ్గరికైనా గురువు చేరగలడు. నీవు జ్ఞానంకావాలని కోరుకో నీకు నేను జ్ఞానం చెపుతాను. అంటే, నీవు కోరుకుంటే, నీకు జ్ఞానం కావాలనుకుంటే, జ్ఞానాన్ని ఆయన నీ దగ్గరకు వచ్చి అందిస్తాడు. నీవు జ్ఞానం కావాలనుకొని ఎక్కడపోయి అడిగినా గానీ, అక్కడ గురువుగా మనిషి వుంటాడు, వాడు నీకు చెప్పలేడు.

నీవు జ్ఞానం కావాలని కోరుకుంటే, దేవుడు నీకు మనిషి రూపంలో వచ్చి జ్ఞానం చెప్పగలడు కానీ, నీవు పోయి మనుషులను జ్ఞానం అడిగితే వాళ్ళు జ్ఞానం చెప్పలేరు. జ్ఞానం చెప్పినా కానీ, అది దేవుని జ్ఞానం కాదు. **“ఏ మనిషి మీద నా జ్ఞానాన్ని ప్రసరింపచేయలేదు”. “ఏ మానవునికీ నా జ్ఞానం తెలియదు”. “నా జ్ఞాన రహస్యం ఏ మనిషికి తెలియదు భూమిమీద”.** ఇది శాస్త్రబద్ధమైన దేవుడు చెప్పిన మాట. **‘దేవుని మాట దేవుడే చెప్తాడు’** ఈమాట. చెప్పలేదా? దైవగ్రంథం అంతిమ దైవగ్రంథంలో 3-7లో ఏం చెప్తాడు అంటే, **“నా జ్ఞానంను నేను చెప్పాల్సిందే ఏ మానవునికీ తెలియదు నా జ్ఞానం”** అని చెప్పాడు. అంటే దైవ గ్రంథంలో, ఏదైన గ్రంథంలో

చెప్పినా, దైవగ్రంథం మాటే అది. కాబట్టి ఆ మాట ప్రకారం మనుషులు చెప్పేది జ్ఞానం కాదు. గురువు చెప్పేది మాత్రమే జ్ఞానం. గురువు మనకు చెప్పేది జ్ఞానమా? అంటే, ఇపుడు మనిషి చెప్పుచున్నాడా? గురువు చెప్పుచున్నాడా? అని మనం ఎట్లా కనుక్కోవాలి? అంటే, అది సాధ్యం కాదు, కానీ ఎవడైతే నీకేమి? జ్ఞానము అవసరమో దానిని చెప్పేవాడు గురువు.

నీవు చెప్పే లెక్క ప్రకారం అయితే ఎవరూ గురువు లేరు. మరి జ్ఞానం ఎట్లా వస్తుంది ప్రపంచంలో అని ఒక ప్రశ్న రావచ్చు. అది గురువే నీకు చెప్తాడు. ఎట్లా వస్తుంది అంటే, గురువే నీకు చెప్తాడు. నీవు కోరుకుంటే, నీవు కావాలనుకుంటే మాత్రం నీకు అందిస్తాడు. కోరుకోకపోతే మాత్రం మీకు అందించడు. నేను కోరుకున్నాను. నేను ఇంట్లోనే కూర్చుంటాను. నాకు ఎట్లా తెలుస్తుంది? అంటే, నీవు ఇంట్లోనే కూర్చున్నా కూడా తెలుస్తుంది జ్ఞానం. బయటకు పోవాల్సిన అవసరం లేదు. నేను ఎవరిని ఆశ్రయించాలి, నాకు జ్ఞానం కావాలి. నేను ఎవరిని ఆశ్రయించాలి? అని ప్రశ్న వేస్తే, నీవు ఎవ్వరిని ఆశ్రయించినా జ్ఞానం తెలియదు. మళ్ళీ నేను ఎవ్వరిని ఆశ్రయించినా జ్ఞానం తెలియకపోతే, నాకు జ్ఞానం ఎట్లు వస్తుంది అంటే ఆయనొచ్చి నీకు చెప్తాడు అయ్యా! నీకు గురువుతో అవసరం లేదు. గురువుకు నీతో అవసరం. ఎందుకు? నీకు జ్ఞానం చెప్పాలి కాబట్టి. ఆయన సిద్ధాంతం ఏమి? నా జ్ఞానం కావాలని ఎవరైతే కోరుకుంటారో, వాళ్ళకు నేను జ్ఞానాన్ని అందిస్తాను అన్నాడు. ఎవరు అందించేది? దేవుడే అందిస్తానన్నాడు. నీవు పోయి తీసుకొనేదానికి వీల్లేదు. నీవు పోయి ఎక్కడా అడిగేదానికి వీళ్ళేదు. ఎవరిని అడుగుతావు నీవు ప్రపంచంలో, మనుషులను అడగాల్సిందే.

కాబట్టి గురువైతేనే నీకు చెప్పాలి, గురువు ఎక్కడ వున్నాడని విషయం ఎవరికీ తెలియదు. గురుపూజ సందర్భంలో గురువును గురించి చెప్పుకుంటే, ఇక్కడిక్కడనే పెద్ద తతంగం ఉంది. నీకు జ్ఞానం కావాలని నీవు కోరుకో, నీవు ఇంట్లో వున్నా నీకు జ్ఞానం తెలియబడుతుంది. నేను ఏ ఆశ్రమాలకు పోలేదు, పోయే అలవాటు లేదు. అయినా నాకు జ్ఞానం కావాలని కోరుకొన్నాను. దేవుడయిన గురువు నాకు సంపూర్ణ జ్ఞానము ఇచ్చాడు. నేను ఎవ్వరినీ మనుషులను నమ్మను, అయినా నాకు జ్ఞానం లభించింది. నీవు జ్ఞానము కావాలని కోరుకో, నీకు తెలియజేసే బాధ్యత గురువుది. నిన్ను జ్ఞానంలోకి పంపించే బాధ్యత గురువుది. అర్థమయిందా! నీవు సక్రమంగా లేవనుకో, నిన్ను తప్పుదారిలో పంపించే బాధ్యత కూడా ఆయనదే! అర్థమయిందా గ్రంథాలు చదవండి. దైవగ్రంథాల్లో ఏముందో? అంటే, నిన్ను సరైన దారిలోనైనా పంపిస్తాను, తప్పుదారిలోనైనా పంపిస్తాను నా ఇష్టం అని చెప్పినాడాయన. నీ ఇష్టం లేదు. నీ ఇష్టం ఏమీ కుదరదు. నీవు సక్రమంగా ఉంటే నిన్ను మంచి దారిలో పంపిస్తాడు. సక్రమంగా లేకపోతే తప్పుదారిలో పంపిస్తాడు. బాధ్యత అంతా ఆయనది. నీకు సంబంధమే లేదు. నీవు జ్ఞానము కావాలని కోరుకో! అట్లు కాకుండా నాకు ఆ ప్రవక్త చెప్పినాడు, ఈ ప్రవక్త చెప్పినాడు, ఆ ధర్మశాస్త్రం చెప్పింది. ఆయన చెప్పిన ధర్మశాస్త్రంలోనే నా జ్ఞానమంతా ఉంది. అని నీవు అంటే, ఏ ప్రవక్తకు, అంటే ఏ మానవ మాత్రునికీ నేను జ్ఞానాన్ని అందివ్వలేదు. ఏ మనిషికీ నేను జ్ఞానాన్ని అందివ్వలేదు అని దేవుడంటాడు.

ఇపుడు గత చరిత్రలో గడిచిపోయిన చరిత్రలో మూసా అనేటటు వంటి వ్యక్తి ద్వారా జ్ఞానం చెప్పబడింది భూమి మీద. అంటే ఈ పేరు కొత్తగా ఉండొచ్చు. అది మనకు, అంటే పాత పేరునే కొత్తగా చెప్పుకున్నాము.

పాత మనిషినే క్రొత్తగా చెప్పుకున్నాము. మూసా అంటే ముద్ర. ముద్ర వేస్తే ఆక్కడికి శాసనం అయిపోయింది. అది ఇంక తీర్పు చెప్పినట్టే. అది రాజముద్ర మాదిరి పని చేస్తుంది. అంటే దేవుని జ్ఞానము శబ్దరూపంలో మనకు తెలియబడింది. సృష్ఠిఆదిలో దానికి 'జపర' అని పేరు పెట్టినాము. అంటే అది వాణి రూపంలో వచ్చిన బోధ మాత్రమే, గ్రంథం కాదు. బాగా జ్ఞాపకం పెట్టుకోండి. బోధ వచ్చింది గ్రంథం కాలేదు. దానికి ఒక పేరు పెట్టినాము, అదేదో ఒక పేరు అనుకుందాం లేండి. కానీ, గ్రంథం కాదది ఆ పేరును గ్రంథం అనుకుంటే చాలా పొరపాటు పడినట్లు అవుతుంది. అంటే దేవుని జ్ఞానం వచ్చింది మనకు. దేవుని జ్ఞానం వచ్చిన తర్వాత, వినడం అయింది. తెలుసుకోవడం అయింది, ఒకరికొకరు చెప్పుకోవడం అయింది. కానీ గ్రంథరూపంలో మాత్రం లేదు, దైవగ్రంథం రూపంలో లేదు. తరువాత కొంతకాలానికి అది చెప్పుకోని, చెప్పుకోని చివరకు అందరు మర్చిపోవడం జరిగింది. చెప్పుకుండే వాళ్ళంతా మర్చిపోయినారు. చివరకు జ్ఞానం తెలియని పరిస్థితి ఏర్పడింది. అపుడు గురువు బయటికి వచ్చాడన్న మాట. గురువు వచ్చి, జ్ఞానమును వెతుకులాడుచున్న వారికి చెప్తే బాగుంటుంది అని. ఈయన అక్కర కాదు. మనుషుల అక్కర కాదు. ఆయన వెతుకులాడుకొని ఎవర్నో ఒకరిని పట్టుకొని జ్ఞానం చెప్పిపోయినాడు. ఆ జ్ఞానం ఏమైంది? అంటే, గ్రంథ రూపం అయింది. ఆ గ్రంథానికి ఒక పేరు పెట్టాం. అంటే, మన దేశంలో భగవద్గీత అను పేరు అయితే, ఇంకొక దేశంలో తౌరాత్ అను పేరు పెట్టుకున్నాము.

ఇపుడు ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క భాష అన్నట్లు, ఒక్కొక్క ఎరుక అయినట్లు. మేము క్రొత్తగా వేరే ఊరికిపోతే, ఒకరు మాట్లాడు తున్నారు. ఏమిరా, మా జీపు తీసుకొని పోయి నీవు రెండు రోజులనుండి అక్కడే

పెట్టుకున్నావు అని అడిగితే, డ్రైవర్ ఏం చెప్తున్నాడంటే, పెండ్లి కూతురు పోయింటే, దేవులాడి, దేవులాడి పెట్టినాను ఎక్కడా దొరకలేదు అంటున్నాడు. ఏం దేవులాడేదిరా నాయనా. మాకు దేవులాడినాడంటే, కొత్త పదం అయింది. వెతుకులాడినాడు అంటే సరియైన పదం అవుతుంది. పెళ్ళి కూతురు తప్పిపోయింది, వెతుకుతున్నాము. ఆ టైం అయిపోయింది అని చెప్పింటే మాకు అర్థమయ్యేది. వాడు దేవులాడి, దేవులాడి అంటే మామూలుగా నీళ్ళల్లో ఏదన్నా పడితే దేవులాడతాం చూడు. అట్లే పెండ్లి కూతుర్ని యాడదేవులాడినాడురా వీడు అని మాకు అర్థంకాలేదన్న మాట. అంటే మనకు భాషల్లో ఏమి చెప్పినాడంటే, దేవులాడడం అంటే ఇపుడు తెలంగాణా లోకి పోతే వెతుకులాడడం అని అర్థం అవుతుంది. ఇంకొకచోటికి పోతే ఇంకొకరకం ఇక్కడికి పోతే అది నీళ్ళల్లో కదా దేవేసినట్టు వుంటుంది.

ఈ రకంగా భాషలో తేడాలు వస్తాయి కాబట్టి, ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క రకంగా చెప్తారు. ఆ రకంగా మొట్టమొదట మనకు గ్రంథరూపం అయినటువంటి దానిని మనం ఏమంటున్నాం అంటే **'భగవద్గీత'** అని పేరు పెట్టుకున్నాం చివరికి అది గ్రంథరూపం అయింది. ఆ గ్రంథము ఒక్కచోటే కాకుండా విశాలంగా పోయింది అది. విశాలంగా పోయినపుడు దాన్ని ఈ భగవద్గీత అనే పేరు లేకుండా వాళ్ళు, వాళ్ళ ఇష్టమొచ్చిన పేర్లలో ఒక పేరు పెట్టుకున్నారు. ఇది దేవుని గ్రంథమూ అని. దానికి అర్థంతో సరిపోయే పేరు పెట్టుకున్నారు. ఆ పేరే **"తౌరాత్"** అనే పేరు. దాని పేరు 'తౌరాత్' అని పెట్టి పోయినారు. అంటే, మనం ఏదైతే 'భగవద్గీత' అంటున్నామో దాన్ని 'తౌరాత్' అని పేరు పెట్టుకున్నారన్న మాట. అంటే, తౌరాత్–అంటే మూడు రాత్రులనేటటువంటి పేరు దానికి వచ్చింది. మనం ఇక్కడేమంటే 'భగవద్గీత' అని అంటున్నాము. దాన్ని భగవద్గీత అని మనం

పెట్టుకున్న పేరు ఇది. భగవంతుడు చెప్పినాడు అని ఒక గుర్తు. దాంట్లో ఉండే రహస్యం ఏమంటే మూడు ఆత్మల రహస్యం వుంది. కాబట్టి మనం మూడు ఆత్మల జ్ఞానమని కూడా చెప్పుకోవచ్చు దాన్ని. ఇంకొకరకంగా, ఇంకో రకంగా ఎట్లాయినా చెప్పుకోవచ్చు. ఈ రకంగా మొట్ట మొదట పుట్టి వచ్చిన జ్ఞానం దానికి ఒక పేరుంది కానీ, గ్రంథ రూపంలో లేదు. అది మొట్ట మొదట గ్రంథ రూపం అయింది. ఆ గ్రంథరూపం అయినటు వంటి దానికి మనం **భగవద్గీత** అని పేరు పెట్టినాము. దానిని విదేశాల్లో **తౌరాత్** అన్నారన్నమాట.

మొట్ట మొదట చెప్పిన జ్ఞానమే తౌరాత్ అయింది. ఆ తౌరాత్‌లో జ్ఞానమే, తర్వాత బైబిల్‌గా వచ్చింది అని మనం అనుకుంటున్నాం. దానిని ఇంకో దేశంలో ఏమన్నారు **ఇంజీల్** అన్నారు. బైబిల్‌ను ఇంజీల్ అన్నారు. తర్వాత అదే జ్ఞానమే, దాంట్లో వుండే సారాంశమే, ఇంకొక గ్రంథంగా వచ్చింది. దాన్ని మనం **ఖురాన్** అంటున్నాము. ఇంకోకరు ఏమంటున్నారో మాకు తెలియదు కానీ, మనమేమో అంతిమ దైవగ్రంథము అంటున్నాం. చాలామంది అదే పేరు పెట్టారు. మొట్టమొదట వచ్చిన జ్ఞానానికి "జపర" అను పేరు ఉందిగానీ, గ్రంథరూపం లేదు అది. తరువాత గ్రంథరూపం అయినాక పేరు వచ్చింది. ఆ పేరులో వుండే జ్ఞానమే మిగతా రెండు గ్రంథాలు అయింది. మొట్ట మొదట గ్రంథరూపం అయిన ఈ భగవద్గీత గ్రంథమును శ్రీకృష్ణుడు చెప్పినాడు అని అందరికి తెలుసు. ఇపుడు కృష్ణుడే వచ్చి చెప్పినాడు కాబట్టి మనకు తెలిసింది. అంటే, ఆయన అందరికి వరసపెట్టి చెప్పలేదు. ఎవరికో ఒకన్ని వెతుకులాడుకొని పట్టుకొని చెప్పినాడు. అయిపోయింది అక్కడికి. ఇంక చెప్పినట్టే లెక్క మనకు. అది బయటికి పోయింది మళ్ళీ. అది బయటికి పోయింది ఆ జ్ఞానం. బయటికి పోయిన

తరువాత అది మనకు ఒక్కొక్కరు ఒక్కోరకంగా పిలుచుకున్నారు. ఎట్లా పిలుచుకున్నా గానీ, అది మనకు అందిందే జ్ఞానం. మనం అందుకున్నామా? ఆయనిచ్చింటే వచ్చిందా మనకు. ఆయన వచ్చి ఇచ్చింటే వచ్చింది. మానవునికి జ్ఞానం కావాలి అని కోరుకున్నపుడు, అంటే మనిషి కోరుకున్నపుడు, ఎవరు కోరుకున్నారో ఏమో, ఎవరో ఒకడు కోరుకున్నోడు వుంటాడు. అంతా జ్ఞానం వద్దనుకుండేవాడు ఎవరూ లేరు. ఎవడో ఒకడు నాకు జ్ఞానం కావాలి, స్వచ్ఛమైన జ్ఞానం కావాలి అనుకున్నపుడు అది తెలియకుండా పోయినపుడు, అపుడు ఆయన వచ్చి చెప్పాలి కదా! ఆయన వచ్చి మనకు తన జ్ఞానాన్ని చెప్పినాడు. అదే భగవద్గీత అయింది. మొట్ట మొదట చెప్పిన జ్ఞానాన్నే మళ్ళీ అంటే గ్రంథరూపంలో అయిన జ్ఞానాన్ని మళ్ళా మొట్టమొదట సూర్యునికి చెప్పిన జ్ఞానాన్ని, మళ్ళీ మనకు చెప్పడం జరిగింది. అపుడు మళ్ళీ దాని పేరు ఇంజీలు అని పేరు పెట్టుకున్నాము.

మనకు వచ్చే భాషలో మనం భగవద్గీత అని పేరు పెట్టుకున్నాము. భగవంతుడు చెప్పినాడు. వేరేవాళ్ళకు వచ్చే భాషలో వాళ్ళు పేరు పెట్టుకున్నారు. దాన్ని తౌరాత్ అని ఇపుడు అంటున్నాము. ఇపుడు మనం కృష్ణుడిని ఏమనాలి? ఆయన వచ్చి మనకు జ్ఞానం చెప్పినాడా, మనం పోయి ఆయనను జ్ఞానం అడిగినామా? ఆయన వచ్చి మనకు చెప్పినాడు. ఎవ్వరూ పోయి ఆయనను జ్ఞానం అడగలేదు. ఆయనే వచ్చి, సందర్భం కలుగజేసుకొని అనుమానం వచ్చేటట్లుగా చేసి, అర్జునున్ని ఏడ్చేటట్లుగా చేసి, అపుడు చెప్పినాడు. చూడు, సమయం సందర్భం చూసి చెప్పగా అతనికి అప్పుడు కొంత ఎక్కింది. పూర్తి అర్థం కాలేదు. నేను విన్నది ఇదియని వేరే చోటికి పోయి వ్యాసునికి చెప్పినాడు. ఒరే! నీవు వినిందేది చాలా గొప్ప జ్ఞానమే ఎవ్వరికీ తెలియని రహస్యం ఇది అని వ్యాసుడు,

దానిని గ్రంథరూపంలోకి చేశాడు. అర్జునుడు ఏమి వ్రాయలేదుగానీ, అర్జునుడు విన్నోడు సందర్భానుసారము. అర్జునుడి ద్వారా వ్యాసుడు తెలుసుకొని వ్యాసుడు దానిని వ్రాసినాడు.

కాబట్టి ఈ రోజు మనముందర గురువైన భగవంతుడు చెప్పిన జ్ఞానం ఉంది. గ్రంథరూపంలో ఆ గురువు చెప్పిన జ్ఞానం ఉంది. ఆయన గ్రంథం ఉంది. ఆ దినము అర్జునుడు చూసి ఉండొచ్చయ్యా, మనం చూడ్లేదు కదా! కాబట్టి మనం మొత్తం మీద చూడలేదు ఇపుడు. ఒకవేళ ఆ పొద్దు ఆయన చూసినాడనుకో, వాడు గురువు అనుకున్నాడా ఏమన్నా? మా బావలే అనుకున్నాడు. అట్లేగదా అనుకునిండేది. అట్లా గురువు అనుకోలేదు కృష్ణుడు కనిపించినా గురువు అనుకోలేదు. చూడు ఎట్లా మాయ చేసినాడో ఆయన. ఇట్లా ఈ రకంగా ఆయన తెలియకుండా చెప్పి పోయినాడు. అంటే, ఇంతకు ముందు చెప్పాము చూడు, గురువు దగ్గరకు మనం ఎక్కడా పోలేమూ, ఎక్కడా వెతకలేమూ, ఫలానోడని గుర్తించలేమూ, గురువే మనల్ని గుర్తించి చెప్పాల్సిందే అని. కాబట్టి ఆ రూలు ప్రకారం, కృష్ణుడు అర్జునుడిని పట్టుకొని చెప్పినాడు జ్ఞానం. అర్జునుడు అడగలేదు. వానికి ఆ రకంగా చేసి అసలు ధర్మం చెప్పినాడు. ఈ రకంగా మనకు, మీ నిజజీవితంలో మీకు జ్ఞానం కావాలి అంటే, దేవుని జ్ఞానం కావాలి అంటే, వేడుకొనే పని తప్ప రెండోపని లేదు మీకు. నాకు జ్ఞానం కావాలి అని మీరు దేవున్ని వేడుకోండి. అదే సరిపోతుంది మీకు. దేవుడు మీకు తెలియజేస్తాడు.

మీరు ఎక్కడనో గురువు ఉన్నాడని వెతకాల్సిన పనిలేదు. ఉపదేశాల కోసం పోవాల్సిన పనిలేదు. ఉపదేశమనేది ఎక్కడ పోయినా ఇస్తారు.

మీకు అది జ్ఞానమే కాదు. నిన్నా, మొన్నా ఒక టివీలో చూడగా ఒకాయన అడుగుతున్నాడు. ఈ పుష్కరాలకు పోయి స్నానం చేసి వచ్చినాక మాకు పాపం అంతా పోయింది అంటే, పుష్కరాలకు పోతే పాపం ఎట్లా పోతుంది అని ఇంకొకాయన ప్రశ్న వేస్తున్నాడు. అంటే, ఇట్లా ప్రచారం చేస్తే, అంతాపాపం సంపాదించుకొని అక్కడికి పోయి మునిగొస్తే పీడపోతాది. అంతా పాపాత్ములు కారా. అసలుకు మీరు ఇట్లెందుకు చెప్తున్నారు అని ప్రశ్న వేస్తున్నాడన్నమాట. వాస్తవంగా పోయి అక్కడ స్నానం చేస్తే పాపం పోదు, మీ కర్మలు తెగిపోవు అని అపుడు మనం ఒక లెటర్ (ఒక వ్యాసం) కూడా వ్రాశాం. వ్యాసం కూడా వ్రాసిపెట్టాం. కంప్యూటర్‌లో పెట్టినారు మనోళ్ళు అది. అసలుకు ఈ పుష్కరస్నానమనేది ఇది సంబంధం లేదు. ఇది పాపాలు పోయేదానికి కాదు, పుణ్యాలు వచ్చేదానికి కాదు, మీదంతా అజ్ఞానం అని చెప్పాం. సరే అజ్ఞానమని ఎందుకు చెప్తున్నాం, దేవుడు ఏమన్నా జ్ఞానమని చెప్పినాడా ఎక్కడైనా చెప్పండి. భగవద్గీతలో ఎక్కడన్నా వుందా అది లేదు. భగవద్గీతలో స్వచ్ఛమైన జ్ఞానము వుంది. దానిని ఒక్కదానిని చూసి మీరు నేర్చుకోండి. దానిని ఒక్కదానిని చూసి మీరు అమలు పర్చుకోండి మీ జీవితాల్లో సరిపోతుంది. దానిని మాత్రం ముట్టుకోరు, దేవుడు చెప్పినదానిని ముట్టుకోరు, గురువు ఎదురుగా వచ్చి మనకు పబ్లిక్‌గా చెప్పినదాన్ని ముట్టుకోరు. ఎవరో మనుషులు చెప్పినదాన్ని పట్టుకోని ఆచరణ చేస్తారు. ఇదేం పద్ధతి అని అడుగుతున్నాం. సరే, అది గురువు చెప్పినది కాదు అది గుడ్డి విద్య. గురువు చెప్పినదే చూపున్న విద్య. కాబట్టి ఇపుడు గురువు చెప్పినది మన దగ్గర **'భగవద్గీత'** గ్రంథం ఉంది. అది గురువు చెప్పినటువంటిది. మీరు జ్ఞానం కావాలంటే దాన్నన్నా పట్టుకోండి, గురువు చెప్పినదే కదా!

గురువు కనపరాకపోతే సరే దాన్నయినా పట్టుకోండి. దాన్ని పట్టుకొంటే మనకు జ్ఞానం తెలుస్తుందా? ఇపుడు ప్రశ్న. ఇపుడు మనకు చివరకు ఒక డిక్లేర్ (నిర్ణయం) అయిపోయింది. ఏమని నిర్ణయం అయిపోయింది? గురువు చెప్పిన గ్రంథం మన దగ్గర ఉంది. గురువు లేకున్నాగాని గురువు చెప్పిన గ్రంథం మన దగ్గర ఉంది. కాబట్టి మనం గురువును ఆశ్రయించాలంటే గ్రంథాన్ని ఆశ్రయించాలి. మనుషుల్ని ఆశ్రయించకూడదు. ఏ మనిషికీ నా జ్ఞానాన్ని అందివ్వలేదని చెప్పాడు కదా! ఏ మనిషిలో నా జ్ఞానం లేదని చెప్పాడు కదా! కాబట్టి ఏ మనిషి దగ్గరకు పోయినా తన జ్ఞానం లేదు. మళ్లా లేనపుడు మనం ఏం చేయాలి? ఆ గురువు చెప్పినటువంటి జ్ఞానంను అందుకోవాలంటే మనకు భగవద్గీత వుంది. మనం దాన్ని ఆధారం చేసుకుంటాం. సరే, ఆ భగవద్గీతను ఈ రోజు మనం గురువు చెప్పిన జ్ఞానమని పట్టుకుంటాం. అంటే అది ఎంతమటుకు మనకు అర్థమవుతుంది. నీ ఇచ్ఛ అంటే శ్రద్ధ ఎంతవుందో, అంతే అర్థమవుతుంది మీకు. తూకమేసుకో నీకు అర్థమైతుంది. నాకు ఊరికినే అది కావాలనుకొంటేనే, అదేం రాదు. మీకు ఎంత శ్రద్ధవుంటే, అంత దాంట్లో నుండి మీకు అర్థమవుతుంది.

దేవుడు పెట్టిన శాసనమది. భగవద్గీత ఇంతమంది మనుషులకుంది, ఇన్ని రకాలుగా, ఇంతమంది మనుషులుంటే, అన్ని రకాలుగా అర్థమయింది వాళ్ళకు. ఏమన్నా ఒక పద్ధతిగా అర్థమయిందా? అర్థం కాలేదు. అర్థంకాకనే అజ్ఞానము అంతా మిగిలిపోయింది మనకు. అర్థమయింటే, ఈ పుష్కర స్నానాలకు పోరు. భగవద్గీతను ఒక గురువు ఇచ్చినాడు, ఆయన పోయినాడు అది మన దగ్గరుంది. మన ఇండియాలో ఉంటే భగవద్గీత ఉందిలేయ్యా. మనం ఇపుడు మీరు చెప్పే ప్రకారం పోతే, అమెరికాలోకి పోతే ఏ భగవద్గీత

ఉంది అక్కడ? మళ్ళా వాళ్ళు ఎట్లా దేవున్ని (గురువుని) ఎట్ల ఆశ్రయించాలా? వాళ్ళకు కూడా కనపరాడు కదా, మన మాదిరే! మనకు కనపరాడంటే, వాళ్ళకు కూడా కనపరాడు కదా! వాళ్ళు మనుషులే కదా! వాళ్ళు ఎట్లా గురువును ఆశ్రయించాలి? అని ప్రశ్న వస్తుంది. నీకు ఇక్కడ 'భగవద్గీత' అనే పేరుతో ఉంది. అక్కడ ఇంకొక గ్రంథాన్ని ఇచ్చినాడు. ఇదే గ్రంథాన్ని ఇచ్చినాడు ఇంకొక పేరుతో. ఆ గ్రంథాన్ని వాళ్ళు పట్టుకోని ఆశ్రయించి దానిలో ఉండే జ్ఞానాన్ని తెలుసుకోవచ్చు కదా! తెలుసుకోవచ్చు. అక్కడ తెలుసుకున్నా గానీ ఇదే జ్ఞానముంది. కాబట్టి, వాళ్ళకు కూడా ఒక దారి ఇచ్చినాడు. నీకు ఏ దారి ఇచ్చినాడో, వాళ్ళకు కూడా అదే దారి ఇచ్చినాడు. నీవు కూడా తెలుసుకోవచ్చు. కానీ మనం తెలుసుకొనే దానికి, ధ్యాస ఉండాలి. శ్రద్ధవుండాలి అని చెప్పినాడు. శ్రద్ధలేనపుడు అది తెలియబడదు. మనసులో శ్రద్ధవుండి, బయటకు ప్రయత్నం చేయకున్నా ఫరవాలేదు, దేవుడు నీకు అందిస్తాడు. బయటికి నీవు ప్రయత్నం చేయవద్దు. బయటికి ప్రయత్నం చేసి చాలామంది జ్ఞానం కోసం వెతుకులాడుతున్నారని, బయటికి అంతా లేనిపోని తిప్పలు పడుతుంటారు. వాళ్ళకు లోపల శ్రద్ధలేదు. కాబట్టి వాళ్ళకు జ్ఞానం రాదు. బయట చాలా జ్ఞానం ఉన్నోళ్ళ మాదిరి ఉంటారు. పనులు చేస్తున్నారు. కానీ లోపల శ్రద్ధలేదు కాబట్టి వాళ్ళకు జ్ఞానం రాదు. బయటకు ఏ శ్రమ పడకున్నాగానీ, లోపల శ్రద్ధవుంటే దాని మీద తెలుసుకోవాలనే ధ్యాసవుంటే, వానికి ఆటోమాటిక్‌గా తెలియబడుతుంది. రెండు సంవత్సరాలు వెనక్కి తిరిగి చూసుకొంటే ఆ పొద్దు ఏ జ్ఞానం లేదు మనకు. ఆ రోజుకి ఈ పొద్దుకి ఎంతో జ్ఞానం పెరిగింది ఎట్లావచ్చింది. మనకు శ్రద్ధ ఉంది కాబట్టి దేవుడు మనకు ఏ సమయంలో అందించాలో ఆ సమయంలో అందించాడు.

ఇపుడు నీవు తెలుసుకో! ఎంత కావాల్సింటే అంత తెలుసుకో, తెల్సుకుండేదానికుంది. ఇపుడు కొంతమంది అరవై యేండ్ల తర్వాత, అబ్బ నాకు ఇపుడు జ్ఞానం దొరికింది అంటున్నారు. ఆ దొరికింది ఎందుకు దొరకదు? నీ ధ్యాసను బట్టి దొరికింది ఇపుడు. ఇంత వరకు దొరకలేదు కదా! లేదు. ఇంతవరకు గురువు దొరకలేదు. అంటే గురువు బుక్కు దొరకలేదు మనకు. అంటే భగవద్గీతను చాలా చూసినారు. పేరేం భగవద్గీతే కానీ అందులో జ్ఞానం మూసివేయబడింది. దాని తెరలు తీసుకోవాలి అంటే, దేవుని గ్రంథం నీ దగ్గర వున్నాగానీ, ఇదంతా పెద్ద లిటికేషన్, లిటికేషన్‌గా ఉందని అనుకోవద్దండి మీరు. వాస్తవం మేము చెప్పేది. అంటే మీరు బాగా ఆలోచన చేసుకోండి. ఎక్కడ ఏమి లేదు చూడండి దీంట్లో. చెప్పేదంతా వాస్తవం. నూటికి నూరుపాళ్ళు వాస్తవం. మేమేమన్నా మనుషుల దగ్గరకు పోయి శ్రమపడి చెప్పినామా? ఇంకొకటా, ఇంగొకటా ఏమీ లేదు. నీలో శ్రద్ధను పెంచుకోమని చెప్పినాము. శ్రద్ధ లేకపోతే చూపాకారానికి ప్రజలందరు తెలుసుకొని, నేను భక్తున్ని, నేను జ్ఞానిని అనుకోవాలంటే ఆ ప్రజలు తెలుసుకొండేదానికి మాత్రం నీవు జ్ఞానిగా ఉంటావు. దేవున్ని తెలుసుకుండే దానికి మాత్రం నీవు అజ్ఞానిగా ఉంటావు, దేవుని లెక్కలో నీవు నిజంగా జ్ఞానివి కావాలంటే నీకు పూర్తి శ్రద్ధ ఉండాలి లోపల, శ్రద్ధ ఉన్నప్పుడు జ్ఞానమును దేవుడు తెలియజేస్తాడు.

ఆయన పని అదేనయ్యా. ఆయన తెలియజేస్తాడు నీకు. సులభంగా అర్థమవుతుంది. లేకపోతే అర్థం కాదు. నీవు కాదు, నీ ప్రక్కలో మనిషి కాదు, మీ ఊర్లో మనుషులందరు కలిసి కట్ట కట్టుకున్నాగానీ జ్ఞానము అర్థంకాదు. మేము చెప్పేది జాగ్రత్తగా వినండి, శ్రద్ధగా వినండి. మీరు శ్రమపడి ఎంతో దూరం నుంచి వచ్చారు. రెండు రోజులుగా వచ్చి

తిప్పలుపడి ఇక్కడ కాచుకున్నారు. సమావేశం అయిపోతానే ఇంక అంతా అయిపోయింది అని వెళ్ళిపోతారు. ఇది వాస్తవమే! అంటే దీనికోసమే వచ్చారు కాబట్టి, విన్నాక ఇంక మాకు పన్లేదు అని వెళ్ళిపోతారు. కానీ, ఆ వినేదేందో శ్రద్ధగా వినండి. శ్రద్ధే మనకు కావాల్సిందేది. దేవుడు మనకు జ్ఞానాన్ని ఇచ్చినాడు. జ్ఞానం కూడా మనకు అర్థం కాలేదు. గ్రంథరూపంలో వుంది అది మనకు. ఏ గ్రంథరూపంలో ఉంది? భగవద్గీత ఒక్కటే అని చెప్పలేదు. భగవద్గీత రూపంలో నీ దగ్గరవుంది. ఇంకోరూపంలో ఇంకో రకంగా ఉంది. కానీ, దైవగ్రంథం అని పేరు పెట్టినారు. దైవ గ్రంథం అనేది మూడు రకాలుగా వుంది అని చెప్పాము.

బైబిల్‌గా ఉంది. భగవద్గీతగా ఉంది. ఖురాన్ గ్రంథముగా వుంది. ఇవి పైకి చెప్పుకుంటే ఇంకా వివరంగా చెప్పుకుంటే, ప్రథమ దైవగ్రంథం, మధ్యమ దైవగ్రంథం, అంతిమదైవ గ్రంథం మూడు గ్రంథాలు. మూడు దైవగ్రంథాలుగా ఉంది. కానీ ఒకటే దైవగ్రంథమే ఇది. మూడు భాగాలుగా చింపుకోని చదువుకుంటున్నారు మీరు. మూడు భాగాలుగా, కాగితాలు కాగితాలుగా చింపుకొని చదువుకుంటున్నారు. ఒక్కటే బుక్కులోనివి ఇవన్ని, మూడు భాగాలుగా చదువుకుంటున్నారు. కానీ ఏ భాగాలలో చదివినా ఉండేది సమాచారం అంతేవుండాది. వేరే సమాచారం ఏమీ లేదు కానీ అది అర్థం కాకుండా పోయింది. కాబట్టి ఈ రోజు హిందువులకు భగవద్గీత జ్ఞానం అర్థంకాలేదు. అందులో సారాంశం తెలియలేదు. అంటే మీరు ఎట్లా చెబుతున్నారయ్యా. మీ ఇష్టమొచ్చినట్లు మీరు చెప్తే సరిపోతుందా? అని ప్రశ్నవేయచ్చు. ఎందుకంటే, మీరు అడిగే ప్రశ్న మేమే వేస్తుంటాం మళ్ళీ, దాటి పోకుండా, దాటేయడం లేదు. మీరు అడగచ్చునన్నమాట. ఇంతమంది స్వామీజీలు ఉన్నారు. నువ్వంటే మీటింగ్ పొద్దు మాత్రమే

ఎర్రగుడ్డలు వేసుకొని వచ్చి నేను ఒక సన్యాసినని లెక్కలో కూర్చుంటావు. సాధువును నేను. నేనూ జ్ఞానినని గుర్తింపుకు వస్తారు. వాళ్ళు అట్లా కాదయ్యా, రాత్రి–పగలు అవే గుడ్డలు వేసుకొని అవే లేనిపోని తిప్పలుపడి గడ్డాలు పెంచుకొని ఏమేమో తిప్పలుపడి ఆడ మునిగి, ఈడ మునిగి ఎన్నో తిప్పలుపడి, వాళ్ళు అంత శ్రమపడి జ్ఞానం చెప్తావుంటే వాళ్ళకు కూడా తెలియదా అంటే, వాళ్ళకు తెలియదనే చెప్తావుండేది. వాళ్ళకు తెలిసుంటే అట్లుండరు. ఎందుకుండరు? ఎట్లుండరు? అట్లుండరు. తెల్సుంటే అట్లుండరు. పని చేయకుండా, ఒకాయన చెప్తున్నాడు.

ఢిల్లీలో ఒక స్వామీజీ కలిసినాడు మాతో. కాషాయగుడ్డలు వేసుకొని ఉన్నాడాయన. అంటే, గుండంతా గీక్కోని ఇదంతా మొత్తం గుండే. బాగా పెంచుకో లేదుగానీ గడ్డం, తల రెండూ గోక్కున్నాడు. ఆయన కాషాయ గుడ్డల్లో ఉండాడు. చిన్నది తులసి మాల వేసుకుని వున్నాడు. మనం మామూలుగా ఉన్నాము. ఆయన స్వామీజీ కాబట్టి, మనం ఆయన దగ్గరగా పోయి మాట్లాడినాను. ఈడ కొంత ప్రజలు నా దగ్గరకు వస్తా వుంటారు. జ్ఞానం చెప్తాను అంటే, ఓహో ఈయన కూడా ఆ లెవల్లో వుండాడులే, జ్ఞానం తెల్సినోడని. ఆయన మనకు మర్యాద ఇవ్వడం, ఒకచోట కూర్చొని మాట్లాడనీయడం జరిగింది. కూర్చోంటే, టిఫిన్ చేస్తాం రండి స్వామీ అన్నాము. ఆ మీరంటే ఎక్కడంటే అక్కడ నేనట్లా తినకూడదు, బయటకు రాకూడదు అంటాడాయన. హోటల్‌లోకి అంటే, హోటల్లో తింటే నేనెట్లా స్వామి అవుతా, అదేనయ్యా నాకు గుడ్డలు ఉన్నాయి మాకు. అట్లా రాకూడదు. మీ రంటే ఈ గుడ్డలు కట్టుకుంటే ఏట్లయినా తిరగచ్చు. మేము అక్కడికి వచ్చేదానికి కాదు అంటాడు. అంటే వాళ్ళు అంత నియమ నిష్టలతో వుండి, ఈ పని చేయకూడదు, ఆ పని చేయచ్చు అని, మీరు చేసే పనులన్ని

మేము చేయకూడదు. ఎక్కడ అంటే అక్కడ వచ్చి మేము టిఫిన్ చేయకూడదు. ఏదంటే అది తినకూడదు మేము ఉడకపెట్టుకున్నదే మేము తినాలి. వేరే వాళ్ళు ఉడకబెట్టింది తినకూడదు అంటాడాయన. ఇంక హోటల్లో ఎట్ల తింటాడాయన. మేము ఎవరు ఉడకబెట్టినా తింటాం అని మనం అంటున్నాం. ఎవరు పెట్టినా తింటాం మనం. ఆయన పాపం లేనిపోని తిప్పలు పడుతున్నాడాయన. మళ్లీ, ఆయన అట్లా తిప్పలుపడి, వాళ్ళు ఉడకపెట్టుకున్నదే వాళ్ళు తిన్నాగానీ ఆయనకు జ్ఞానం ఏమైనా వుందా? అది శాస్త్రబద్ధముగా తెలియదు. ఎందుకంటే దేవుడు అందివ్వాలి కదా అది. ఎవరి పని? ఆయన పని. అందించే పని ఆయనది. వీళ్ళది కాదన్న మాట. నీవు పుట్టగోసి పెట్టుకో, మొలతాడు పెట్టుకో నీవు జంధ్యం వేసుకో, ఏమన్నా చేసుకో, నీవు తెల్సేది కాదు. ఆయన అందిస్తే నీకు తెల్సేది.

కాబట్టి నేను మామూలు గుడ్డలు వేసుకున్నా, నాకు ధ్యాస వుంది కాబట్టి ఆయన అందిస్తున్నాడు. నీవు ఎన్ని గుడ్డలు వేసుకున్నా, ఎన్ని తిప్పలుపడినా ఆయన అందివ్వలేదు. అంటే మనకు కూడా ప్రశ్న వస్తుంది. ఏమిటయ్యా నీవు మామూలుగా వుండి, అంతలక్కా పోయి హోటల్‌లో తింటే, నీకెందుకు జ్ఞానం ఇచ్చినాడు దేవుడు. ఆయనకెందుకు ఇవ్వలేదు, మళ్లీ పద్ధతిగా ఉన్నందుకు? అని మీరే అడగవచ్చు. అంటే హిందువులుగా మేము అడుగుతాం. మీరు స్వామీజీగా ఉండి మళ్లీ అంత పద్ధతిగా వున్నాగాని జ్ఞానం తెలియదు. మీరు ఎట్లంటే అట్లపోయి, ఎక్కడయినా హోటల్‌లో తినేవానికి మీకెట్లా వచ్చింది జ్ఞానం. ఎక్కడంటే అక్కడ తిరిగేవానికి. అని మీరు అడగవచ్చు. అంటే మేము ఏమి చెప్తున్నామంటే ఆయన సన్యాసి కాదుగా మళ్ళీ అని అనుకుంటున్నాం. ఆ సన్యాసి కాదేంది ఎర్రగుడ్డలు వేసుకున్నాడు, ఎర్రగుడ్డలు వేసుకున్నాడు కదా! కాషాయ వస్త్రాలు వేసుకున్న

వాడు సన్యాసి ఎట్లా కాడు? అంటే, భగవద్గీతలో దేవుడు భగవంతునిగా వచ్చి కృష్ణునిగా వచ్చి చెప్పిన మాటల్లో ఆత్మ సంయమయోగం అనే ఒక అధ్యాయం ఉంది. దాంట్లో మొట్టమొదటి శ్లోకంలో ఏమి చెప్పాడు అంటే **"అనాశ్రిత కర్మ ఫలం కార్యంకర్మ కరోతియః ససన్యా సీచ యోగీచ, ననిరగ్ని నచాక్రియః "** దాని ప్రకారం వీడే నిజమైన సన్యాసి, వీడే నిజమైన యోగి అని చెప్పాడు

నిజమైన యోగి, నిజమైన సన్యాసి అంటే, పనులు మానుకున్నటు వంటి వాడు సన్యాసి కాదు. పనులు చేసేవాడు సన్యాసి అంట. మనం పని చేస్తున్నాం కాబట్టి మనం సన్యాసులం అవుతాం. వాడు పని చేయలేదు కాబట్టి వాడు సన్యాసి కాదు. మనం పెండ్లి చేసుకున్నాం, మనం సన్యాసులం. వాళ్ళు పెండ్లి చేసుకోలేదు. కావున వాళ్ళు సంసారులు ఈ మాట విన్నవారు ఇదేంటి రివర్సులో చెప్తున్నారే అనుకోవచ్చు. రివర్సులో చెప్పడం లేదు. భగవద్గీతలో శ్లోకం అది. మీరు చదవండి. 'నచాక్రియ' అంటే పనులు చేయనటువంటివాడు 'ననిరగ్ని' అగ్నిలేనటువంటివాడు అని చెప్పినాడు. అంటే ఇపుడు వాళ్ళు అగ్నిహోత్రం చేయనటువంటి వాడు అని వ్రాసుకున్నారు వాళ్ళు. అగ్నిహోత్రం చేయనటువంటివాడు ఇదిగో ఈ విధముగా దేవుడు వీళ్ళని తప్పుదారి పట్టించాడు. జ్ఞానమనే అగ్నిలేనటువంటి వాడు సన్యాసి కాదు యోగికాదు అని చెప్పినాడు ఆయన. వాడు యోగీ కాదు సన్యాసీ కాదు. జ్ఞానం అనే అగ్ని ఉండాలి. ఒక మనిషిలో జ్ఞానం అనే అగ్నివుంటే వాడు నిజమైన సన్యాసి, నిజమైన యోగి. పనులు చేయనటువంటివాడు సన్యాసి కాడు. పనులు చేస్తే వచ్చేకర్మ అది భస్మీపటలం అయిపోతుంది. వాడు నిజమైన యోగి. పనులు చేయకుండావుంటే, వానికింక అది ఎట్లా రాదు, ఎట్లా కాలదు. అది కాలేది లేదు వచ్చేది లేదు. వచ్చినా కాలిపోవాలి.

అగ్గివుంటే కాలిపోతుంది. 'నచాక్రియః' అంటే పనులు చేయనటువంటివాడు అని అర్థము. పనులు చేస్తే నీవు యోగి అవుతావు. పనులు చేసినపుడు పాపం, పుణ్యం వస్తాది కదా! దాన్ని కాల్చేటటువంటి వాడు నిజమైన యోగి. పనులు చేయకపోతే, ఎట్లా రాదు. ఇంకేముంది నీవు బావిలో దూకినా అంటే నీళ్ళలో దూకినా తేమ కాకుండా వుంటే వాడు హంసలాంటి వాడు. బయట కూర్చొని, నాకేం తేమ కాలేదు అంటే బయట కూర్చుంటే తేమ ఎవరికీకాదు. నీకేనా! ఎవరికీ తేమకాదు. నీవు తేమలోకి దిగు. దిగినపుడు తేమకాకపోతే అపుడు వానిని హంస అనచ్చు. అంతే కదా! అంటే తేమకాదు కాబట్టి దిగకోకుండా నాకు తేమ కాలేదు అంటే, దిగకోకుండా తేమకాలేదు అంటే ఎట్లయితుంది. దిగకోకపోతే ఎట్లా కాదు. నీవు ఒక పని చేయకపోతే ఎట్లాగూ కర్మరాదు. నీవు పని చేసి, కర్మను జయించి అంటే కర్మను కాల్చినటువంటి వాడు నిజమైన యోగి అని ఇక్కడ చెప్పింది.

ఇపుడు మనం ఆయనను సన్యాసి అనాలా? మామూలు మనిషి అనాలా? ఆయనను అంటే పైన డ్రస్సు ఏదైనా ఉండనీలే మనకు సంబంధం లేదు. పనులు చేయకపోతే పనులకు సంబంధంలేదు ఇపుడు. ఈ శ్లోకం ప్రకారం అన్ని పనులు చేసినాగానీ మనం నిజమైన యోగులం అవుతున్నాము. నిజమైన జ్ఞానులం అవుతున్నాము. ఇపుడు ఆయన ఏం పని చేయకపోయినా గానీ నిజమైన జ్ఞానీ కాదు నిజమైన సన్యాసీ కాదు అని దేవుడు శ్లోకములో చెప్పాడు. చూడు ఎట్లుందో! ఇపుడు అంటే గురువును గురించి ఎంత చెప్పుకున్నా కూడా తెలియనది ఎంతో ఉంది. మీరు గంటసేపు చెప్తారు స్వామి, మాకేదో కొంతసేపు విన్నట్టు వుంటుంది. పది నిమిషాలు చెప్పినట్లువుంటుంది. ఇంక కొంత చెప్తే బాగుంటుందని. గురువును గురించి ఇంకా తెలుస్తుందని అనుకొంటున్నాము.

ఈ రోజు గురుపౌర్ణమి కాబట్టి మీరు అడిగినట్లే ఎక్కువ చెప్పేదానికి ప్రయత్నిస్తాను. గురుపౌర్ణమి సందర్భంలో ఈ రోజు రెండు గంటల సేపు చెప్తాలే. ఏమి ఎంతసేపైనా చెప్పొచ్చు. గురువుకదా! గురువును ఎంతైనా గుంజులాడవచ్చు మనం. అయినా ఆయన దొరికేవాడు కాదు. ఇపుడు ప్లేటు మార్చి కొంత చెప్తాము. ఒకటే ప్లేటు అయితే బాగుండదు. కొంత విషయమును మార్చి చెప్తాము. ఏమి మార్చుతున్నామంటే గురువునే, గురువును మాత్రం విడిచిపెట్టేది లేదు. కొంత ప్లేటు మార్చి చెప్తాము అన్నాను కదా! ఇప్పుడు మనతో గురువు ఒకమాట చెప్పినాడు. ఏం చెప్పినాడంటే ఒరే! నేను ఏది చెప్పితే అది వినండి మీరు. మీరు ఎంత తెలివిగా అడిగినా కుదరదు గానీ, గురువు చెప్పినది వింటే మీకు జ్ఞానం వస్తుంది అని చెప్పినాడు. ఇంకా ఆయనేం చెప్పినాడంటే, దేవుడు మీకు ఎక్కడున్నాడు? ఎట్లున్నాడు? అంటే మీకు నిజంగా చెప్తా చూడండి. దేవుడు ఎట్లున్నాడు? ఎక్కడున్నాడు? దేవుడు మాకు తెలియబడతాడా? అని మీకు ఏమైనా అనుమానం ఉంటే, అనుమానం పడాల్సిన పనేలేదు. దేవుడు మీకు అత్యంత సమీపంగా వున్నాడు. మీకు చాలా దగ్గరగా ఉన్నాడు దేవుడు. మీకు ఎక్కడో ఉన్నాడు దేవుడు, అని ఎక్కడెక్కడో పోయి టెంకాయ (కొబ్బరికాయ) కొట్టాల్సిన పనిలేదు. అంతదూరం పోవాల్సిన పని లేదు. నీకు అత్యంత సమీపంగా ఉన్నాడు. మీరు అనుకుండే ప్రతి ఒక్కటి వింటున్నాడు. నీవు రహస్యంగా లోపల ఏమనుకున్నా ఎట్లన్నా అనుకో, గట్టిగా అనుకో చిన్నగా అనుకో ప్రతి ఒక్కటి ఆయన వింటున్నాడు. మీరెంతో చిన్న దేవుడెంతో పెద్ద అంత పెద్దోడు ఇంత చిన్నోనిని నీవు అనుకొండేదంతా వింటున్నాడు. నీకు ఏమి కావాలో ఆయనకు తెలుసు. ఏమి కావాలో, ఎప్పుడు ఇవ్వాలో ఆయనకు తెలుసు. అపుడు ఇస్తాడు. నీవు కోరుకోవాల్సి పనిలేదు. నేను చాలాసార్లు చెప్తుంటా మా దగ్గరకు వచ్చి అది, ఇదీ ఆ కష్టం ఈ కష్టం

అంటే, నాకు చెప్పితే ఏం ప్రయోజనం. నాకు చెప్పొద్దు, ఇంకెవ్వరికీ చెప్పొద్దు నీవు. ఏమి ప్రయోజనం లేదు.

కానీ మనం అడిగితే ఇచ్చే మనిషి ఎవడూ లేడు. ఇంతకు ముందూ కూడా చెప్పినా, జ్ఞానం కూడా అడిగితే రాదు అనీ, వానికి (దేవునికి) ఇష్టమై వాడిస్తే నీకు వస్తుంది. ఇది కూడా అంతే! ఆయనకు అన్నీ తెలుసు. ఏమి ఇవ్వాలో, ఏమి ఇవ్వకూడదో తెలుసు. కాబట్టి మనకు ఇచ్చేదుంటే ఇస్తాడు. లేకపోతే లేదు. ఊరికనే ఉండు నీవు అంతే! ఊరక వుండడం కంటే ఉత్తమమైన పనిలేదు. నీవు ఏమి అడగవద్దు అని చెప్పినాము. నీవు ఎందుకు అడగద్దు అంటే, ఆయనకు తెలుసు. నీవు ఏమి అడగాల్సిన పని లేదు. దేవునికి తెలుసు. నీకు ఏది అవసరం అని. కాబట్టి ఆయనకు తెలుసు ఏది కూడా ఆయనను అడగద్దండి. ఆయన ఏమి ఇవ్వాలో అది ఇస్తాడు. ఇపుడు అదే నీకు చెప్తున్నాను. ఇపుడు నేను చెప్పేమాట అంతిమ దైవగ్రంథంలో '2'వ సూరాలో (అల్ బకరా అనే సూరాలో) '186'వ ఆయత్‌లో ఈ విషయం ఉంది. (2-186) **"నా దాసుడు నన్ను గురించి నిన్ను అడిగితే, (దేవున్ని గురించి ఎవరన్నా భక్తులు అడిగితే నీవేం చెప్తావు వాళ్ళకు. నా భక్తులు ఎవరైనా అడిగితే) నేను వారికి అతి సమీపంలో ఉన్నాను. (నేను వానికి చాలా దగ్గరలోనే ఉన్నాను.) పిలిచేవాడు నన్ను పిలిచినపుడు నేను వాని పిలుపుని విని జవాబు ఇస్తాను (ఎవ్వడు నన్ను పిలిచినా, ఎవ్వడు నన్ను అనుకున్నా, ఎక్కడ ఏమనుకున్నా, నేను వానికి జవాబు ఇస్తాను. వాని పిలుపు వింటున్నాను)"** ఎంతో జ్ఞానం చెప్పినాడు. ఆయన చెప్పినమాట వినవచ్చు కదా మీరు. మన ఇష్ట ప్రకారం మనం పోతాం అనేది. చూడు ఎట్లుందో అజ్ఞానము కాదా! ఆయన చెప్పినమాట ఏమోగాని, మనం చెప్పినట్లు ఆయన వినాలి అంటే అది ఎట్లవుతుంది.

మనమాట ఆయన వినడు. ఆయనకు బుద్ధి పుట్టినేది ఆయన చేస్తాడు. కానీ ఆయన చెప్పినేది నీవు వినాల్సిందే! కానీ ఇపుడు మనమేమన్నా కవిత్వం చేసి చెప్తున్నామా? నేను బుక్కు చూసి చెపుతాను. అది కూడా నిజమో, అబద్దమో నాకు తెలియదు కానీ, చూసి చదివి చెపుతాను బాగుంటుంది. (2-186) "నా దాసుడు నన్ను గురించి నిన్ను అడిగితే, (దేవున్ని గురించి ఎవరన్నా భక్తులు అడిగితే నీవేం చెప్తావు వాళ్ళకు. నా భక్తులు ఎవరైనా అడిగితే) నేను వారికి అతి సమీపంలో వున్నాను. (నేను వానికి చాలా దగ్గరలోనే వున్నాను.) **పిలిచేవాడు నన్ను పిలిచినపుడు నేను వాని పిలుపుని విని జవాబు ఇస్తాను** (ఎవ్వడు నన్ను పిలిచినా, ఎవ్వడు నన్ను అనుకున్నా, ఎక్కడ ఏమనుకున్నా, నేను వానికి జవాబు ఇస్తాను. వాని పిలుపు వింటున్నాను)" అర్థమయిందా! కాబట్టి వారు సరైనమార్గం పొందటానికి నా ఆజ్ఞను అనుసరించి మరియు నా యందు విశ్వాసాన్ని కల్గివుండాలి. మీరు సరైన దారిలో ఉండాలంటే, నా మాటను అనుసరించి ఉండండి. నా జ్ఞానాన్ని అనుసరించి ఉండండి. మళ్ళా నా జ్ఞానాన్ని అనుసరించి ఉంటే మీరు నా దారిలోకి ఈజీగా వస్తారు అని చెప్పాడు. ఇది దైవవాక్కు. దేవుని వాక్కు ఇది. అర్థమయిందా! దేవుడు చెప్పినట్టు వినాలి కదా మనము. నా జ్ఞానము ప్రకారం మీరు ఉండండి." ఈ వాక్యంలో ఇట్లా చెప్పినాడు. నా మాట మీరు వినండి అని చెప్పినాడు. నా జ్ఞానం ప్రకారం మీరు ఉండండి అని చెప్పినాడు. ఇప్పటినుండి ఉందాము అని ప్రతిజ్ఞ చేసుకున్నాము మనం.

కానీ ఆ ప్రతిజ్ఞ ఏమని చేసుకున్నాం. నీవు ఎట్లా చెప్పితే అట్లా వింటాము. ఒక గంట అయిపోయింది. ఇది రెండోగంట. మీరేం దిగులు చేయద్దండి. అంటే మీకు, కనపరాకుండా చెప్తున్నాము. కథ మాదిరి చెప్తాను.

మనకు రోగాలు వస్తాయి కదా! డాక్టర్ దగ్గరికి పోతాం కదా! డాక్టర్, మందు ఇస్తాడు కదా! మందు ఇచ్చినపుడు అల్లోపతి డాక్టర్లు మందులు ఇచ్చి ఊరికనే పంపిస్తారు. ఎందుకంటే వాడు ఏదో ఒకటి తిని మళ్ళీ రోగం పోకూడదు వానికి. మళ్ళీ రోగం ఉంటే మన దగ్గరికే వస్తాడు. మళ్ళీ వస్తే, మళ్ళీ కూడా మందు ఇవ్వవచ్చు. మళ్ళీ డబ్బులు వస్తావుంటా యని వీళ్ళ చింత. కానీ ప్రతిరోగానికి ఒక పత్యం ఉంటుందన్నమాట. ఒక రోగం వచ్చినపుడు వంకాయ తినకూడదు అని ఉంటుంది.

ఇంకొక రోగం వచ్చినపుడు గోంగూర తినకూడదు. అది తింటే దాని ఎఫెక్ట్ వుంటుందన్నమాట. ఇపుడు మనకు గోకుడు రోగం నవ్వలు వచ్చాయనుకోండి. నవ్వలు వస్తే డాక్టర్ దగ్గరికి పోతే నవ్వలకు మందిస్తాడు ఆ డాక్టర్ మందు ఇచ్చినపుడు ఏం చేస్తాం మనము, అది వేసుకున్నాం. వేసుకొని ఇంటికొచ్చిన తర్వాత గోంగూర చట్నీ ఫుల్‌గా తిన్నాము. ఆ మాత్రలు ఎక్కడ పోయినయోగానీ మళ్ళీ డబుల్‌గా గోకుతాం. గోంగూర ఏమి చేస్తాది అంటే ఇంకా ఎక్కువ నవ్వలు తెప్పిస్తుంది. పూర్తి బరికేటట్లు చేస్తుందన్నమాట. అంటే అపుడు డాక్టర్ గోంగూర చట్నీ తినొద్దు అని చెప్పింటే సరిపోయేది. అది చెప్పలేదు కదా! మనం తిన్నాం. మళ్ళీ ఆ నవ్వలు పోలేదు అని తిరిగి డాక్టర్ దగ్గరికి పోయినా మన్నమాట. అప్పుడు ఒకపూట అయితే కుదరదుగానీ వారం రోజులు వేసుకో అంటాడాయన. నీకు నవ్వలు ఎక్కువ ఉన్నాయి. అన్ని తగ్గిపోవాలంటే ఏమి చేయాలి, నీవు వారం రోజులుగా మందులు వేసుకోవాలంటాడు అనుకో. అపుడు వారం రోజులు డాక్టర్ దగ్గరకు పోవాల్సిందే. మందులు తినాల్సిందే! ఇలా ఈ కాలం అయిపోయింది. పూర్వం ఎట్లుండేది అంటే, ప్రతి రోగానికి ఒక ఔషధం ఉండేది. ఆ ఔషధానికి పత్యం ఉండేదన్నమాట. పూర్వం పత్యం

చెప్పేవాళ్ళు. ఇప్పుడు మీరు జ్ఞానం చెప్పకుండా రోగాలు పత్యం అని అంటారు అని అనుకోవద్దండి. ఇది జ్ఞానం కథే! అంటే మీకు అర్థం కావాలని చెప్తున్నా అర్థమయిందా! దేవుడు ఇంతకుముందు ఏమి చెప్పినాడు.

నా మాట మీరు వినండి అన్నాడు కదా! మనం రోగిష్ఠులము. మనకు బరుక్కుండే రోగం ఉంది ఇపుడు. మనం ఇపుడు అడుగుతున్నాం డాక్టర్ దగ్గరకు పోయినాం. డాక్టర్ దగ్గరికి పోయి మాకు ఈ గోకుడు రోగం ఉంది. ఏమి చెయ్యాలి అని అడిగాము అనుకోండి. ఒరే, నేను చెప్పినట్టు వినండి అన్నాడాయన. ఏమి వినండి అన్నాడు అంటే, క్రింద, మీద ఉండే ఆకు తినద్దు పో అన్నాడు. క్రింద, మీద ఉండే ఆకు అంటే ఏమిటిది గోంగూరని తెలియదు మనకు. అంటే ఏమన్నాడు? క్రిందా, మీద ఉండే ఆకు తినద్దు అన్నాడు. క్రిందా, మీద ఉండే ఆకు అంటే మనకు ఏమీ తెలియదు. ఆయనకు తెలిసిన భాషలో చెప్పినాడు. ఆ అట్లే కానీలే అన్నాము. పూర్తి అడగచ్చుకదా! తెలియనపుడు. అంటే పెద్ద తెలిసినోళ్ళ మాదిరి అట్లే కానీలే ఊ అని ఊ కొట్టి వచ్చినాము. ఇంటికి వచ్చిన తర్వాత ఏమి చేసినామంటే, అది క్రిందా, మీద ఏమి ఆకు ఉందో ఏమి అర్థం కాలేదు. మళ్ళా ఏమనుకున్నాడంటే అది ఏదో ఇది తోటకూర ఉంటాదిలే, అది ఆకుకూరలు అంటే అవే కదా! తోటకూర ఉంటాదని తోటకూరను విడిచిపెట్టినాడు. పత్యం ఏమో ఉన్నాడు పాపం. కానీ అక్కడ ఒకటి చెప్పింటే, వీడు ఒకటి అనుకొంటాడు.

కానీ డాక్టర్ లెక్కాచారంలో గోంగూర అది. క్రింద, మీద ఆకు అంటే. ఇపుడు ఇక్కడ మనకేం అర్థమయింది. తోటకూరని అర్థమయింది. గోంగూర పత్యం చెప్పింటే, తోటకూరను మనం విడిచిపెట్టినాము. అంతేకదా!

ఆయన చెప్పిన మాట విన్నామా మనం? డాక్టరు చెప్పిన మాట విన్నామా? వినలేదు. వినలేదు కాబట్టి నీవు తోటకూర అనుకొని, నీవు తోటకూరని విడిచిపెట్టినావు కాబట్టి నీవు మామూలు గోంగూర తిన్నావు కాబట్టి మళ్ళా నీకు ఆ రోగం పోలేదు. అట్ల ఎట్లయితే ఇక్కడ పొరపాటు పడినామో, అట్లగానే నీకు దేవుడు జ్ఞానం అందించాలంటే ఆయన కిందా, మీద ఆకు అనుకోకుండా పూర్తి చెప్పేవాడన్నమాట. చూపించి ఈ ఆకురా నాయన దీనిని తినొద్దు అని చెప్పేవాడు. అంటే సక్రమంగా పత్యం పెట్టాలనుకొంటే. వానికి ఇపుడు ఎట్టా వీడు ఉండకూడదని వానికి డబ్బులు రావాలని ఆ పని చేసినాడనుకో!

ఆ విధంగా ఇపుడు ఏమైంది అంటే దేవుడు కూడా నిన్ను సక్రమమైన మార్గంలో పంపించాలి అనుకుంటే, నీకు ఈ చెప్పిన జ్ఞానం అర్థం అయ్యేటట్లు చేస్తాడు. నీ పద్ధతి, నీ వ్యవహారం అంతా దేవునికి ఇష్టం లేదనుకో అపుడు ఏమి చేస్తాడు, నిన్ను తప్పుదారిలో పంపివ్వాలను కుంటాడాయన. అజ్ఞానమార్గంలో పంపివ్వాలనుకుంటాడు. అజ్ఞాన దారిలో పంపివ్వడమంటే, ఆయన చెప్పినది ఏమో కరెక్టే. కానీ అర్థం కాకుండా చేసినాడు నీకు. వైద్యం ఏమో వైద్యమే, పత్యం ఏమో పత్యమే. నీవు వాడింది కరెక్టే, మందులూ కరెక్టే కానీ అది మాత్రం శరీరానికి పని చేయలేదు. అర్థమయిందా. ఆ మందు మాత్రం శరీరానికి పని చేయలేదు. ఎందుకు పని చేయలేదు? అక్కడ చెప్పినట్టు లేదు. ఆయన భావం ప్రకారం లేదది. ఆయన అనుకొని ఉండేది గోంగూర, నీవు అనుకొని ఉండేది తోటకూర, అర్థమయిందా! ఇపుడు 186వ సూరా చెప్పినాము కదా! ఇపుడు 187 లోకి వస్తాం. 187 లోకి వచ్చిన తర్వాత, ఇపుడు జాండీస్‌కు ఒక పత్యం, క్షయ రోగానికి ఒక పత్యం, పడిశానికి ఒక పత్యమూ, ఈ ఆటలమ్మ,

తాటలమ్మకు ఒక పత్యం ఇట్లా ఉంటాయి కదా మనకు. అట్లగానే మనకుండే రోగానికి పత్యం చెప్పినాడన్నమాట. ఏమి పత్యం చెప్పినాడాయన. ఆయన ఏమి చెప్పినాడంటే, పవిత్రమైన దినాలు మీకు కొన్ని ఉన్నాయి. ఆ పవిత్రమైన దినాలుండాయి. అంటే ఒక్కొక్కసారికి ఒక్కొక్క పవిత్రమైన దినం వుందన్న మాట. అంటే ఒక్కొక్క సమాజంలో ఒక్కొక్క పవిత్రమైన దినం. ఇపుడు అర్థము చేసుకొంటే ముస్లీమ్‌లకు ఏమో రంజాన్ నెల పవిత్రమైన దినం అంటాము. హిందువులకు ఏమో మాఘమాసం అంటాము. లేకపోతే ఇంకొకరికి ఇంకోటి అంటాము.

ఈ రకంగా పవిత్ర దినాలు ఉన్నాయి. కానీ పవిత్ర దినాలలో మీరు మాత్రం ఈ పత్యం ఉండండని చెప్పాడు. పత్యం ఉండండి నేను చెప్పినేది తినద్దండి అని చెప్పాడు. ఆకలైతే మాకు ఇబ్బంది కదా అంటే, రాత్రిపూట తినండయా, పగలుపూట మాత్రం తినద్దు అని చెప్పినాడు. రాత్రిపూట తినండి, పత్యం లేకున్నా ఫరవాలేదు. పగలు పూట మాత్రం చాలా జాగ్రత్తగా పత్యం ఉండండి అని చెప్పినాడు. దాని దరిదాపులకు కూడా పోవద్దండి. ఆ ఆకు దరిదాపులకు కూడా పోవద్దండని చెప్పినాడు. నీవు చెప్పిన తరువాత మేమెందుకు వినము అని అనుకున్నాము. కానీ ఆయన ఏమి పత్యం చెప్పినాడో, ఆ పత్యాన్ని వదలి ఇంకొక పత్యాన్ని పట్టినాము. ఆయన గోంగూర చెబితే మనం తోటకూర పట్టుకున్నాం. ఆ రకంగానే ఇపుడు 187వ ఆయత్‌లో అది పబ్లిక్‌గా అందరికి ఉండేది ఇది. నేను కల్పించి చెప్పేది కాదు. దైవగ్రంథంలో ఉండే విషయం ఇది. మనిషి ఎట్లా పొరపాటుపడినాడు అంటే దేవుడు మనిషిని ఎట్లా తప్పుదారిలో పంపిస్తున్నాడు అనే దానికి ప్రత్యక్ష సాక్షం ఇది. ఒక మనిషి కాదు, ఒక రాష్ట్రం కాదు, ఒక దేశం కాదు యావత్ ప్రపంచం తప్పుదారి పట్టింది.

దేవుడు (గురువు) జ్ఞానము అందించినా మనం తెలుసుకోవాలంటే ఎట్లుంటుందో చూడండి అని చెప్పేదానికి ఇది ఉదాహరణ. ఆయన మనకు జ్ఞానం అందియ్యాలి, మనల్ని జ్ఞానులను చేయాలి అంటే ఎట్లయినా చేయగలడు. మనమెంత ప్రయత్నం చేసినా జ్ఞానులము కాలేము. మళ్ళీ తిరిగి దైవగ్రంథంలోకి వస్తాము. అంటే ఇపుడు మీకు ఒక ప్రశ్న రావచ్చు.

మీరు ఇంతకు ముందేమో 'భగవద్గీత' గ్రంథము తీసుకొని చెప్పే వాళ్ళు ఇపుడు ముస్లీమ్‌ల దగ్గరకు పోయి ఏమన్నా కాంట్రాక్టు తెచ్చుకున్నారో ఏమో మీకు జ్ఞానం చెప్తానని మీరు ఖుర్ఆన్‌లోనిదే చెప్తారే అని అడుగవచ్చు. దానికి మా జవాబు ఏమనగా! ముస్లీంల జ్ఞానం, హిందువుల జ్ఞానం క్రైస్తవుల జ్ఞానం అని వేరువేరు ఇక్కడ లేదు. దేవుని జ్ఞానం మాత్రమే నేను చెప్పుచున్నాను. ఇక్కడ చెప్పేది దేవుని జ్ఞానం బాగా జ్ఞాపకం పెట్టుకోండి, ఇక్కడ చెప్పేదంతా మూడు దైవగ్రంథముల జ్ఞానం ఇక్కడ ఏ మత సంబంధం లేదు. ప్రొద్దున ఒక ముస్లీం అంటే, వాళ్ళు ఏమంటే గురుపౌర్ణమి అని గురువుకు కృతజ్ఞత చెప్పుకోవాలనే ఉద్దేశ్యంతో కాషాయగుడ్డలు డ్రస్సు వేసుకొని, నెత్తిన టోపి పెట్టుకొని, కాషాయ టోపి పెట్టుకొని ఒక పిల్లోనికి చిన్న డ్రస్సు వేసి వాళ్ళు ఆనందం కొద్ది వాళ్ళు వేశారు మంచిదని. నామం పెట్టినారు కృష్ణుడు పెట్టుకొనే నామం పెట్టినారు. ఇట్లా పెట్టి, మధ్యలో ఎర్రనామం పెట్టి తీసుకొచ్చారు. వాళ్ళు బయట ఆడుకొంటుంటే కన్పిస్తూ వుంటుంది మాకు. మేము ఎల్లప్పుడు మిమ్మల్నే చూస్తూ వుంటాము. మీరు మమ్మల్ని చూడకున్నాగాని మేము మాత్రం మిమ్మల్ని చూస్తూ వుంటాము. ఎవరు ఏమి చేస్తున్నారు ఏమి కథ అని. ఆ పిల్లోడు మాత్రం కన్పిస్తూ ఉన్నాడు. మంచి డ్రస్సు వేసినారు బాగుందిది అని మేము అనుకుంటున్నాము. వాళ్ళు మేము స్వామికి చూపిస్తే బాగుంటుందని

చూపించారు. సరే వాళ్ళ భ్రమ ఎందుకు వద్దనాలి అని రమ్మని చెప్పినాము లోపలికి. పిల్చుకొని వచ్చి చూపించినారు. చూపిస్తే, అన్నీ బాగుండాయి. కానీ నామం పెట్టినారన్నమాట. నేను ఒకమాట చెప్పాను. మీరు ఏమను కోవద్దండి. డ్రస్సు బాగుంది, అన్నీ బాగున్నాయి. కాషాయ దుస్తులు అన్నీ బాగున్నాయి కానీ, ఈ నామం పెడితే హిందువు అని పేరు వస్తుంది మీకు. నామం పెట్టినారు కదా ఇది హిందువులకు సంబంధించిన నామం. అపుడు నేనేమంటా మీరు ముస్లీమ్‌లే, నీవు హిందువుల నామం పెట్టుకున్నావే, మీ ముస్లీమ్‌లు కూడా హిందువు నామము పెట్టుకున్నావే అని అంటారు. అప్పుడు ఆ మాట అంటారు. వాళ్ళతో అనిపిచ్చుకోవాలి కదా నీవు. ఇపుడు దేశంలో ఏ గురువులైనా వారి మతాన్ని ప్రోత్సహించి చెప్తున్నారు. హిందువుల నామం పెట్టుకుంటే గురువు సంతోషించాలి కదా. ఇపుడు నేను హిందువును కాబట్టి నేను సంతోషపడాలి. కానీ నేను సంతోషపడలేదు నేను ఏమి చెప్పినాను ఇది పద్ధతి కాదు మీకు. అంటే మీకు తెలిసో, తెలియక పెట్టినారు.

ఈ నామం లేకుండా చేసుకోండి అని చెప్పాను. ఇదేందయా బాగా కృష్ణుడు పెట్టుకొన్న నామం పెట్టుకుంటే, మీరు నామమే తీసేసుకోమని చెప్పినారే అని మీకు ప్రశ్న రావచ్చు. కానీ ఎందుకు చెప్పినామంటే, ఒక మాట చెప్పా నేను. దేవుని నామం పెట్టుకోండి ఏద్దైనాగానీ, మతానికి సంబంధించిన నామం పెట్టుకోవద్దండని చెప్పాము. నామము పెట్టుకొంటే హిందూ మతానికి సంబంధించినది అవుతుంది. శిలువ వేసుకుంటే అది మతానికి సంబంధించిన గుర్తు. దేవునికి సంబంధించిన గుర్తుపెట్టుకోండి. దేవుడంటే అల్లాహ్, అల్లాహ్ సంబంధించిన గుర్తుపెట్టుకోండి. అంటే అల్లాహ్ ముస్లీమ్‌లకు సంబంధించినది. మీ ముస్లీమ్‌లది కాదు ప్రపంచానికి

అంతా అల్లాహ్ ఒక్కడే ఉండేది. మా ముస్లీమ్‌ల విషయం అనద్దండి. దేవునికి సంబంధించిన గుర్తు పెట్టుకోండి. అంటే మా దాంట్లో దేవునికి సంబంధించిన గుర్తే లేదు అనవచ్చు. ఎందుకు లేదు, లేదా? ఉంది దేవుడు మీకు గుర్తు ఇచ్చినాడు. కానీ మీరు ఆ గుర్తు పెట్టుకోలేదు. ముస్లీమ్‌లకు గుర్తే కలదని ఇంతవరకు ప్రపంచానికే తెలియదు అంటే, ఇంకా 2-187 ఆయత్ తెలియకనే మీరంతా పస్తున్నారు. తెలియక మీరు పొరపాటుపడుతున్నారు. దేవుడు ఏమి చెప్పినాడో మీకు తెలియలేదు. ఇపుడు అదే సూరా, అదే ఆయత్తే ప్రక్కకు పోలేదు. ఇక్కడనే ఉన్నాము. ఆ 187వ ఆయత్‌లో ఎట్లా పొరపాటు పడినామో, ఇదే పొరపాటు దేవుని గుర్తు విషయములోపడినాము. ఇప్పుడు దేవుని గుర్తు ఎక్కడుందో మీ ఖురాన్ గ్రంథంలో చూడండి.

22వ సురాలో 32వ ఆయత్‌లో "మీరు నా చిహ్నాన్ని గౌరవించండి". అది నిజమైన భక్తి మార్గం. నా చిహ్నాన్ని మీరు గౌరవించండి అది నిజమైన భక్తిమార్గం అవుతుంది అని ఉంది కదా! అయితే చిహ్నాము విషయము తెలియదు. ముస్లీమ్ అంటే విశ్వాసి అని అర్థము. దేవున్ని నమ్ముకొన్నటు వంటి వాడు. ఎవడైనా గానీ, దేవుడ్ని నమ్ముకున్న వాడు విధేయుడు, విశ్వాసి అని అర్థం. ముస్లీమ్ అంటే విధేయుడు, విశ్వాసి అని తెలిసింది కదా! నేను దేవున్ని నమ్ముకున్నానయ్యా. నేను దేవునికి విధేయున్ని, నన్ను ఏమంటారు? ముస్లీమే అనాలి నేను ఒరిజినల్ ముస్లీమ్‌ని. ముస్లీమ్ అంటే, ఏదో ఒక మతం అనుకోవద్దండి. వాళ్ళ మత భ్రమలు వాళ్ళకు ఉండవచ్చు గాని మనకు లేవు. ముస్లీమ్ అంటే దేవుని విధేయుడు. దేవుని మీద విశ్వాసం ఉండేటటువంటి వాడు. దేవున్ని నమ్మినటువంటివాడు దేవుని మీద నమ్మకం కలిగినటువంటివాన్ని 'ముస్లీమ్' అంటాం. కాబట్టి నేను

నిజమైన ముస్లీమ్‌ను. ఈ రూలు ప్రకారం, ఖురాన్ గ్రంథంలో 22 సురా, 32వ ఆయత్‌లో చెప్పిన వాక్యం ప్రకారం. దేవుని చిహ్నాన్ని గౌరవించండి. అట్లా గౌరవిస్తే అంటే దానిని ధరిస్తే మీరు నిజమైన భక్తిమార్గంలో ఉన్నట్లే. ఇపుడు దేవుని చిహ్నం ఏందబ్బా? ఇపుడు ఇంతవరకు ఎక్కడా ముస్లీమ్ సమాజంలోనే లేదే. వాళ్ళు ఎవరూ ఖురాన్‌లో చెప్పుకోలేదే! మీరు ప్రత్యేకముగా చెప్తున్నారే! అనుకోవచ్చు. ఉండేది చెపుతున్నా ఖుర్‌ఆన్‌లో నేను నెంబర్‌తో సహా చెప్తున్నా పొరపాటుగా ఏమి చెప్పలేదు. నెంబర్‌తో సహా చెప్తున్నాను. నామం తీసెయ్యి, చక్రాలు పెట్టుకో అది దేవుని గుర్తే అవుతుంది.

అది ఏ మతానికి సంబంధం లేదు. క్రైస్తవ మతం కాదు, హిందూ మతం కాదు, ముస్లీమ్ మతమూ కాదు. ఏ మతమూ కాదు అంటే, మూడు మతాలకు సంబంధం లేనిది దేవుని గుర్తు. ప్రత్యేకముగా దేవుని గుర్తు ఇది. దేవుని గుర్తు ఇపుడు తెలిసిందా? దేవుని గుర్తును గౌరవించండి, నిజమైన భక్తిమార్గంలో వున్నట్లే. దేవుని గుర్తు ఎక్కడుంది. మన ముఖాల మీద ఉంది. ఇది ఏ మతానికి చెందింది. ఎక్కడైనా ఉందా ఏ మతానికి చెందినట్టు. ఎక్కడైనా ఉందా? ఇంతకు ముందు ఎన్నో మతాలు వున్నాయి. ఏ మతంలోనైనా ఇది ఉందా? లేదు. లేదు కదా! ఇపుడు ఇక్కడ దేవుని గుర్తు అని ఉంది. ఏమిటిది అది, మీకు చెప్పినేది వాస్తవంగా, 22వ సురా 32వ ఆయత్‌లో చెప్పిన గుర్తు ఏమిటిది, ఆ దేవుని గుర్తు. ఇది దేవుని గుర్తు. కాల, కర్మ చక్రాలు ఎక్కడైతే వుందో అది దేవుని గుర్తు. ఇది నిజమైన దేవుని గుర్తు. ఇది ఎవడైతే పెట్టుకున్నాడో! ఖురాన్‌లో 22వ సురాలో 32వ ఆయత్‌ను ఖచ్చితంగా ఆచరించినటువంటివాడే నిజమైన ముస్లీమ్. అవునా? కాదా? చెప్పండి. అంటే నేను ఖురాన్ గ్రంథం అని పేరేగాని,

మేము ఏమి చెప్తున్నామంటే ఇది దైవగ్రంథంలోని వాక్యం. దేవుని వాక్యం చెప్తున్నాము. మీకు తెలియకుండా పోయింది కాబట్టి, దానిని మీరు వేరేగా అనుకోవద్దండి. తెలుసుకోండి. దేవుడు పత్యం చెప్పినాడు మీకు. ఏమి పత్యం చెప్పినాడు. మళ్ళీ అక్కడికే వస్తాము. అంటే పవిత్రమైన దినాల్లో నేను చెప్పినట్టు మీరు నడుచుకోండి.

నా మాట వినమని 186లో చెప్పినాడు కదా! **"మీ మాట నేను వింటున్నాను. కాబట్టి దగ్గరగా ఉన్నాను మీకు. మీ మాట నేను వింటున్నాను, నా మాట మీరు వినండి. నా ఆజ్ఞ ప్రకారం మీరు నడుచుకోండి"** అని చెప్తూ, మళ్ళీ 187వ వాక్యంలో ఏం చెప్తున్నాడంటే మీరు పవిత్రమైన దినాల్లో, మీ భార్యలతో కాపురం చేసే దానిని ధర్మసమ్మతం చేసి చెప్తున్నాను వినండి అని అన్నాడు. అంటే మీరు భార్యలతో కాపురం చేస్తున్నారు కదా! కానీ ధర్మసమ్మతం చేస్తున్నాను. అంటే జ్ఞానం ప్రకారం మీరు ఎట్లుండాలో అట్లు ఉండండి అని చెప్తున్నాను. మీరు పగలు పూట ఆత్మద్రోహానికి పాల్పడు తున్నారు. కానీ ఇది మంచి పద్ధతి కాదు. దేవునికి ఇష్టం లేని పని. దేవునికి ఇష్టమైన పని ఏమి? రాత్రిపూట ఎట్లాన్నా ఉండండి. తినండి, తాగండి. పగలు మాత్రం ఉపవాసం వుండండి. అర్థం అయిందా! పగలు మాత్రం ఉపవాసం ఉండండి. రాత్రిపూట పత్యం, అవసరం లేదు. రాత్రిపూట మాత్రం పత్యం చెప్తున్నాను. తినండి, తాగండి ఏమి ఫరవాలేదు. పగలు పూట మాత్రం ఖచ్చితంగా పత్యం ఉండాల్సిందే! ఉపవాసం ఉండండి. దేవుని నియమాలు ఎక్కడైనా నీవు అనుసరించేటపుడు నీవు ప్రార్థనామందిరాలలో ఎపుడైనా గానీ, దీక్ష పడినపుడుగాని, ఎపుడైనాగానీ దేవుడు చెప్పినట్లు నడుచుకోవాలి. మీ భార్యలతో మీరు కాపురం చేయొద్దండి అంటే విడిచిపెట్టి పొమ్మని కాదు. దూరంగా ఉండండి అని చెప్పాడు.

ఈ ఆయత్ దేవునిది. ఇపుడు ఈ వాక్యంలో అదే ఉంది. ఖురాన్ గ్రంథం మీకు అక్కడ ఒకటి, అక్కడొకటి ఇచ్చాను నేను. మీరు చదువు కోవచ్చు. చదువుకుంటే, మీరు మీ పవిత్రమైన రాత్రులయందు మీ భార్యలతో ఉండేటటువంటిది ధర్మ సమ్మతం చేయబడినది. మీరు వారికి వస్త్రాలు. వారు మీకు వస్త్రాలు ఎంత బాగుందో చూడండి. వస్త్రాలు అంటే ధరించేటివి. మీరు వారికి దుస్తులు. వాళ్ళు మీకు దుస్తులు. అంటే మీరు వాళ్ళతోనైనా కాపురం చేయొచ్చు. వారు మీతోనైనా కాపురం చేయొచ్చు. ఒకరికొకరు దగ్గర సంబంధమైనటువంటి వాళ్ళు. అయినా గానీ మీకు ధర్మసమ్మతం చేసినాను. మీకు జ్ఞానాన్ని చెప్తున్నాను. కాబట్టి మీరు ఇక నుండి మీ భార్యలతో ధర్మసమ్మతంగా ఉండండి. రాత్రి ఉదయ కాలంవరకు రాత్రిపూట తినండి త్రాగండి. పగలు మాత్రం ఉపవాసం ఉండండి. అని చెప్తూ మొదట్లో అదే చెప్తున్నాడు, చివర్లో కూడా ఏమి చెప్తున్నాడంటే, ఎక్కడైనాగాని మీరు ఈ పవిత్రమైన దినాల్లో ఆ దేవుని గురించి ప్రార్థనా సమయాల్లోగాని, ఇంకొకటిగాని ప్రార్థనామందిరాలలో మీరు కొన్ని నియమాల ప్రకారం ఉండేపుడుగాని మీరు ఈ దేవుడు చెప్పినట్టు విని మీ భార్యలకు దూరంగా వుండండి. అని చెప్పాడు ఇక్కడ.

మొదట అదే చెప్పాడు, చివర్లో అదే చెప్పాడు. మధ్యలో మాత్రం కొంత, అంటే ఆ పత్యం ఉండాల్సిన పని లేదు రాత్రిపూట. పగలు పూట పత్యం ఉండండి అని చెప్పాడు. ఇది దేవుడు, నేను సమ్మతం చేసి చెప్తున్నాను. అంటే, దేవుడు చెప్పంది మనకెట్లా తెలుస్తుంది. ఏదైనా దేవుడు చెప్పాల్సిందే కదా! దేవుడు ఒక నియమం ఏర్పరిచినాడు. అది మనకెట్లా అర్థమయింది. అంటే, దేవుడు చెప్పినదాన్ని విడిచిపెట్టాం. భార్యలతో సంబంధపడే విషయాన్ని విడిచిపెట్టి, రాత్రిపూట తినండి, తాగండి అంటే రాత్రిపూట

వండుకొని తినేదానికే సరిపోయింది మనకు. రాత్రిపూట వండుకొని తినేదానికే సరిపోతావుంది. పగలు పూట పస్తు ఉండడం జరుగుతుంది. పగలు పూట తినకూడదు. ఏమి తినకూడదని చెప్పినాడాయన. మీ భార్యల దగ్గరకు పోవద్దండి. మీరు దూరంగా ఉండండి పగలు పూట. రాత్రి పూట ఎట్లున్నా ఫరవాలేదు అని ఒక నియమం చేసి చెప్పితే, వీళ్ళేం చేశారంటే తిండి దగ్గరకు పోయినారు వీళ్ళు. మొత్తం టోటల్‌గా యావత్ ప్రపంచం మొత్తం మోసపోయినారు. ఇక్కడ చెప్పినది ఏమి. పైన అదే చెప్పినాడు. క్రింద అదే చెప్పినాడు. మధ్యలో ఒక్కమాట చెప్పినాడు. రాత్రిపూట తినండి, తాగండి. పగలు పూట దాని దరిదాపులకు కూడా పోవద్దండి. ఉపవాసం ఉండండి. అని చెప్పితే అర్థంకాక పుల్లకూర అంటే తోటకూర అన్నట్లు అయింది. దేవుడు మనకు అర్థం కావాలంటే ఎట్లాయినా చేస్తాడు.

అర్థంకాకుండా ఇట్లాయినా చేస్తాడు, లోపల అర్థం కాలేదు ఒక్కరికి కాదు కొంతమందికి అర్థంకాలేదు అనుకోండి. మొత్తం సమాజమంతా అర్థము కాకపోయింది. అన్నము తినకూడదని దేవుడేమైన ఎక్కడన్నా చెప్పినాడా చెప్పలేదు. మళ్ళీ దేవుడు చెప్పని మాటను మనం అనుసరిస్తే, దేవునికి వ్యతిరేఖంగా ఆచరించినట్టు కాదా మనం. ఈ ఆయత్‌ను ఒకసారి కాకపోతే నాలుగుసార్లు చదువుకోండయ్యా, దేవుని గ్రంథం ఉంది. దేవుని గ్రంథంలో దేవుని వాక్యం ఉంది మనముందర. ఒకసారి కాకపోతే నాలుగుసార్లు చదువుకోండి. అక్కడ ఏమి చెప్పాడో చూడండి. సరే, మా ఇష్టం. మేము ఇట్లే ఉంటాము అంటే ఉండు దాని తప్పులేదు, నీవు ఉండకూడదు అనేం లేదు. మేము ఏమి చెపుతున్నామంటే, దేవుడు, నా మాట మీరెందుకు వినరు అన్నాడు. మీరు ఏదనుకున్నాగాని నేను మీ దగ్గరుండి వింటున్నాను. దానికి జవాబు చెప్తున్నాను. మీరు నా జ్ఞానాన్ని

ఎందుకు వినరు? అని చెప్పి, ఇట్లుండాది మీరు వినకోకుండా పోయింది అని చెప్పారు. అంతేకదా! మళ్లీ ఇపుడు ఒక్కరు పొరపాటు పడినారా, ఒక ఊళ్ళో పొరపాటు పడినారా, ఒక స్టేట్‌లో పొరపాటు పడినారా, ఒక దేశంలో పొరపాటు పడినారా? అని చూస్తే మొత్తం ప్రపంచం అంతా పొరపాటు పడింది.

వీళ్ళు వండుకొని తినేచోటికి పోయినారుగాని చెప్పిన ధర్మము అర్థము కాలేదు. రాత్రిపూట అంతా వండుకొని తిని, పగలంతా పస్తు ఉన్నారు. ఆయన చెప్పినది ఏమిటిది? వీళ్ళు చేసినది ఏమిటి? ఈ రకంగా మనం గురువు అనేవాడు మనలోపల ఉండి నీకు జ్ఞానాన్ని అర్థమయ్యే టట్లుగా చేస్తే, నీకు జ్ఞానం అర్థమయితాది. లేకపోతే నీకు అర్థంకాదు. నీకు జ్ఞానం అర్థం కావాలన్నా, అపార్థం కావాలన్నా ఎక్కడుంది? నీ లోపల ఉంది. వాడు ఎక్కడ ఉన్నాడు? నీ లోపల ఉన్నాడు. అర్థమయిందా! బయట ఆయన గ్రంథం ఉన్నా, అర్థం కాకుండా చేసేవాడు లోపల ఉన్నాడు. అర్థమయిందా! ఇపుడు మనం ఎక్కడిదో మనకు సంబంధం లేని గ్రంథం అయినాగాని, అర్థం చేసేవాడు లోపల ఉన్నాడు కాబట్టి మనకు అర్థమయింది. ఒక్కసారి చదివినా ఇది అర్థమైపోయింది. ఇక్కడ చెప్పిందేది ఇట్లా చెప్పింటే అట్లా చేస్తున్నారని అర్థమయిందా. లేదు అట్లా కొంతమంది ఏమంటారంటే ప్రశ్న వేయకూడదు దానిని గురించి. దేవుడు చెప్పినదాన్ని గురించి ప్రశ్న వేయకూడదు. మనం మాట్లాడకూడదు, ఏమి చెప్పితే అది వినాలి అన్నారు. మేము కూడా దేవుడు ఏమి చెబితే అది వినమనే చెప్పేది, నీవు ఇంకొకటి ఎందుకు వింటున్నావు. నీవు దేవుడు చెప్పినట్లు వింటున్నావా? అల్లాహ్ చెప్పినట్టు ఏమి చెప్పితే అది కరెక్టే. అల్లా చెప్పినట్టు వింటున్నావా? ఆయన ఆయత్‌లను మార్చేసి, అర్థం మార్చేసి ప్రజలకు

బోధిస్తున్నారు. అది పెద్ద పాపం అని చెప్పినాడాయన. ఒకాయన సాయి శంకర్ అనేటటువంటి ఆయన ఒక ప్రశ్న వేసినాడు ఒక ముస్లీమ్‌కు ప్రళయకాలంలో అంతా మనమంతా పోతాము. ప్రళయం వస్తుంది. అంతా మొత్తం ప్రపంచం అంతా నాశనం అయిపోతుంది. అపుడు దేవుడు వస్తాడు. దేవుడు వచ్చి అందరూ సమాధులలో వుండే వారందరిని లేపుతాడు అపుడు పాప, పుణ్యాలను అంతా లెక్కేసి వాన్ని నరకానికో, స్వర్గానికో పంపిస్తాడు అని ఒక ముస్లీమ్ చెప్పాడు.

అది ఖురాన్‌లో ఉంది అని, ఖురాన్‌లో ఆ వాక్యం వుండేది నిజమే గాని, ప్రళయం అంటే మాకు అర్థం కాలేదు అని అడిగినాడు. ఏమని అడిగినాడు? అంటే వానికి వ్యతిరేఖంగా గట్టిగా అడిగితే బాగుండదని, మాకేమో కొంత అర్థం కాలేదు. ప్రళయం అంత వచ్చి అంతా పోయిన తర్వాత ఇంక భూమి ఉండదు, నీరు ఉండదు, ఏమీ ఉండదు కదా! వానిని ఏ గుంతలోంచి లేపుతాడు. ఏ సమాధిలో నుండి లేపుతాడు అని అడిగినాడు. ఇంక వాడు జవాబు చెప్పాలి కదా! వానికి జవాబు చెప్పేదానికి లేదు. భూమే లేనపుడు, ఏ గుంతలో నుండి లేపుతాడు? అపుడు భూమి వుంది అంటే ప్రళయం ఎట్లా వచ్చింది అంటాడు. ప్రళయం వస్తే భూమి ఎట్లా వుంది అంటాడు ఈయన. రెండూ ఇబ్బందే కదా! ఏంటో సైలెంట్. అడగకూడదు, అల్లా చెప్పినాడు వినాలి, అంతే. రెండో ప్రశ్న వేయకూడదు. ఏమి చెప్పితే అది వినాల్సిందే అన్నాడు. వింటామయ్యా, నాకు మళ్ళీ అనుమానం ఉంది. అంటే, అనుమానం ఉండనీ, ప్రశ్న వేయకూడదు అంటాడు, వాడు జవాబు చెప్పేదానికి చేతకాక ప్రశ్న వేయకూడదు అంటున్నాడు. అలా ఏమన్నా ఖురాన్‌లో ఉందా? ప్రతిచోటా, నేను ప్రతి ఆయత్‌నూ విడదీసి చెప్తున్నా మీకు అర్థమయ్యేలాగా వివరంగా చెప్తున్నాను

అని ఉంది ఖురాన్‌లో. ప్రతి వాక్యాన్ని వివరంగా చెప్పాడు దేవుడు. అంత వివరంగా చెప్పితే అడక్కూడదు చెప్పింది వినాలి అని అంటే ఏమని అర్థం. నేను గుంతలోపడినాను. మీరు కూడా గుంతలో పడండి. బయటకు రావద్దండి అని అర్థం.

ఈ రకంగా జ్ఞానం అనేది ఎట్లుంది అంటే, మనకు జ్ఞానం కావాలి అని మనస్ఫూర్తిగా వేడుకొంటే, నీకు జ్ఞానాన్ని దేవుడు అందిస్తాడు. ఈ అంతిమ దైవగ్రంథంలో అదే మాట చెప్పాడు. నేను ఎవరిని నాకిష్టమైతే వానిని దగ్గరకు తీసుకుంటాను, ఎవరిని ఇష్టం లేకపోతే వానిని దూరం పంపించేస్తా అని చెప్పినాడు. చూడు ఆ రకంగా ఆయన చెప్పి, ఆయనేం చెప్పినాడంటే నా జ్ఞానం అత్యుత్తమమైనటువంటి జ్ఞానం. ఇది మనుషులు చెప్పే జ్ఞానం కాదు. నేను చెప్పే జ్ఞానం ఈ జ్ఞానం మీకు ఎక్కడా లభించదు. మళ్ళీ ఆ జ్ఞానం మీకు ఎట్లా లభిస్తుంది అంటే నేను చెప్పితేనే మీకు లభించేది. నా దయ లేకపోతే మీకు ఏమాత్రం అర్థం కాదు. ఒకవేళ గ్రంథరూపంలో వుంది నీవు ఏమి చెప్పే పని లేదు. మేము చదువుకుంటాం అని కూడా అనచ్చు కొంతమంది. ఇంకేముంది భగవద్గీత చెప్పినావు కదా! మా అంతట మేము చదువుకుంటాం. ఖురాన్‌ను కూడా మేము చదవుకుంటాం. మాకు అర్థమయితాది. ఎట్లోకట్ట అర్థం చేసుకుంటాం మేము. ఏమి నీవే చెప్పాలని ఏముంది. అని అనుకొంటే, ఒరే నేను లోపల ఉండి నీ బుద్ధికి అందిస్తే అర్థమయితాది. లేకపోతే అర్థంకాదు అని చెప్పినాడు. ఎవరికన్నా అర్థమయిందా? కాదు. ఎందుకు కాదు అంటే నేను అనుకుంటేనే అర్థమయ్యేది. నేను అనుకోకపోతే కాదు. రెండూ నా దగ్గరనే వున్నాయి.

**"నేను అనుకుంటే అంతటా ఉంటావు. నేను అనుకుంటే ఎక్కడ ఉన్నవానివి అక్కడే ఉంటావు."** ఎక్కడికి పోవు నీవు. నీకు అర్థం కాలేదు

పో, నేను చెప్పినేది. అంటే నీవు చెప్పినేది నాకేం అర్థం కాలేదు. అర్థం కాకుండేది ఏముంది. ఆయన అనుకొంటే ఏమైనా చేయగలడురా, బుక్కులో వుంది చూసుకోవాల్సింటే నా ఇష్టం. నేను ఇట్లయినా పంపిస్తాను, అట్లయినా పంపిస్తాను అన్నాడు. మళ్ళీ అదే కదా! వుండేది, వ్రాసినేది నేను. అట్లానా అంటాడు. అట్లేను మేము చెప్పినేది. అన్నాం సరే! ఖురాన్‌లో ఇంకొక వాక్యం ఉంది ఏమని 18వ సురా 22వ ఆయత్ ఒకటుంది. 18వ సురా 22వ ఆయత్, అంటే ఇది కూడా నీకు గురువు అనే వాన్ని గురించి చెప్పిండేది. ఇపుడు మనం చెప్పేది గురుపౌర్ణమి గురించి కదా! గురువు అనేవాన్ని గురించి చెప్పే విషయమే చెప్తున్నాం. ఇదంతా మళ్ళా వేరే బుక్కులోకి పోయినాడు, సురా అంటున్నాడు, ఆయత్ అంటున్నారే ఏదో ముస్లీమ్‌లది మాకు చెప్తున్నాడు అని అనుకోవద్దండి. నేను గురువు విషయమే చెప్తున్నాను. అది మీకు ముస్లీమ్‌లది అనుకున్నా, క్రైస్తవులది అనుకున్నా, హిందువులది అనుకున్నా నేను చెప్పేది మాత్రం 'దైవజ్ఞానము'.

నేను ఇక్కడ ఒక స్టిక్కర్ వేశాము **"మతాలు నిషేధము, నిషిద్ధం. కులాలు, అహేతుకం, అశాస్త్రీయం. కుల మతాలకు అతీత భావం ఉన్నటువంటి వాడు మా సంఘంలో చేరండి. 'ప్రబోధ సేవాసమితి' లో చేరండి"** అని చెప్పాము. కుల, మతాలకు అతీత భావం ఉందా నీ దగ్గర అన్ని కులాలు (మూడు మతాలకు) అతీతంగా ఉన్నాము. మేము ఆరు సంఘాలను స్థాపించాము. ఏమి చెప్తున్నామంటే, ఒక గుహ ఉందంట. ఒక గుహ. గుహ అంటే అర్థమయిందా. ఇంగ్లీషులో కేవ్ అంటారు కదా! ఆ ఒక గుహ ఉంది. ఆ గుహలో ముగ్గురుండారు అని ఒకడన్నాడంట. ఒక కుక్క ఒకటుంది. నలుగురు ఉండారని చెప్పినాడంట. ఎందుకంటే కుక్క కన్పిస్తావుంది. ముగ్గురు కనపరాలేదు. ఆ గుహ మొదట్లోనే కుక్క

అట్లా కాలు చాపుకొని కూర్చుందట. నాలుక అల్లాడించుకుంటూ కూర్చుంది అది. నాలుక ముందర పెట్టుకొని, కూర్చోని చూస్తావుంది. అంటే నేనేమన్నా కథ చెప్తున్నానని అనుకోవద్దయా, దీంట్లో 18వ సురాలో 22వ ఆయత్‌లో చదివినా అదే ఉంటుంది. నేను చెప్పుచున్నది ఖురాన్ గ్రంథంలోనిదే. 18వ సురా 22వ ఆయత్‌లో వాళ్ళు ముగ్గురు, నాలుగోది కుక్క అని అన్నాడంట ఒకడు. వాళ్ళు ముగ్గురుండారు లోపల. నాలుగోది కుక్కరా అని చెప్పినాడంట. వాళ్ళు ఐదుమంది ఉన్నారు. ఆరోది కుక్క అన్నాడంట ఇంకొకరు. ఏమన్నాడు. వాడు ముగ్గురు అంటే, నాలుగోది కుక్క మొత్తం నాల్గురు అయితారు అంటే, అట్లాకాదు వాళ్ళు ఐదుమంది ఉన్నారు. ఆరోది కుక్క అన్నాడంట. ఏయ్! మీరిద్దరు మీ ఇష్టం వచ్చినట్టు మాట్లాడితే ఎట్లా అయితాదిరా, వాళ్ళు తొమ్మిదిమంది వున్నారు. పదోది కుక్క అని ఇంకొకడు అన్నాడు. ఏయ్ మీకు ఏమీ తెలియదు లేరా నేను చూసినా వాళ్ళు మాట్లాడుకొంటే శబ్దం విన్పిస్తూ ఉన్నది నాకు, వాళ్ళు సుమారు ఇరవైమంది దాకా ఉన్నారు. ఇరవై ఒకటోది కుక్క అని ఇంకొకడు అన్నాడంట. ఏది నిజం. కుక్క మాత్రం కన్పిస్తావుంది. లోపల వుండే వాళ్ళు కన్పించలేదు, గుహలో ఉండేవాళ్ళు. ఏది నిజం. ఏది అబద్ధమో దేవునికి తెలుసు. లోపల ఎంతమంది ఉండేది అల్లాకే తెలుసునంట. దేవునికే తెలుసు.

దీంట్లోనే '22'వ ఆయత్ కదా చెప్పినేది. '18'వ ఆయత్ చూస్తాము ఇక్కడ. ఏముంది అంటే, వాళ్ళు నిద్ర పోతాంటే, ఎవరు గుహలో వుండే వాళ్ళు, దేవునికి తెలుసు అని ఎందుకు చెప్తున్నాడంటే, దేవుడు లోపలుండే వారిని పండబెట్టి వచ్చినాడంట. కాబట్టి ఎంతమంది ఉండారో తెలుసుకదా! వాళ్ళు నిదురపోయినప్పటికి నీవు వారిని మేల్కొనివున్నారని భావించి ఉంటావు మరియు మేము వారిని కుడి ప్రక్క నుండి ఎడమ ప్రక్కకు,

ఎడమ ప్రక్క నుండి కుడి ప్రక్కకు తిప్పి పడుకోబెట్టాము. సరే, ఒకవేళ తెలుసుకుందాం అని గుహ ద్వారం దగ్గర ముందుకుపోతే, గుహ ద్వారం ముందు కాళ్ళను చాచి కుక్క కూర్చుని ఉంది. కాలు చాపుకొని కుక్క కూర్చొని ఉందదంట. ఒకవేళ నీవు తొంగి చూడాలి అనుకొంటే వెనుదిరిగి పారిపోతావు. ఎందుకంటే కుక్క గుర్ అంటానే భయపడి పోతావు నీవు. వెనుదిరిగి పారిపోతావు.

గుహలోకి పోయి వచ్చినవాడు దేవుడు మాత్రమే. ఆయన పోయి వచ్చినాడు కాబట్టి, అక్కడ గుహలో ఎంతమంది ఉన్నారో ఆయనకే తెలుసు. ఇంక దేవునికి చాలా పరిచయంగా ఉండేవాళ్ళకు దేవుడు చెప్పివుంటే వాళ్ళకు తెలిసి ఉంటుంది. ఇపుడు దీనికి ఏమన్నా చెప్పితే, కొందరు ముతషాబిహాత్ ఆయత్ అది. మనకు తెలియదు. దానిని చూడవద్దు అంటారు. చూడకుండా వుంటే దేవుడు చెప్పిన జ్ఞానం ఎలా తెలుస్తుంది. అట్లాంటివి మనం విడిచిపెట్టాలి, చదువుకోకూడదు అంటారు. కుక్క ఏందో, గుహ ఏందో మనుషులు ఎవరూ చెప్పలేరు. దానిని విడిచి పెట్టాలి అంటారు. ఇప్పుడు చెప్పేవాడు ఎవడు? దేవుడు. అది చెప్పేవాడు ఎక్కడున్నాడు. అంటే దేవుడన్నా, గురువన్నా ఇద్దరు ఒక్కటే. మారు పేరుతో గురువు అంటాము. మారు పేరుతో దేవుడు అంటాము. మళ్ళీ గురువు లేడా దేశంలో ఉన్నాడు. నీవు అడిగితే చెప్తాడు. నీవు అడుగు అంతే! నీవు ఆయన్ను వెతికినా దొరకడు. నీవు అడిగి కూర్చో. ఎక్కడ ఉండేవానివి అక్కడ. ఆయనే వచ్చి చెప్తాడు.

ఈ గుహలో ఉండే వాళ్ళ కథగానీ, ఏదైనాగానీలే నీవు అడుగవయ్యా దానిని గురించి చెప్తాడు. కుక్క ఎక్కడుంది? గుహ మొదట్లోనే ఉందదంట. రెండుకాళ్ళు పెట్టుకోని ఉంది. నాలుక అల్లాడిస్తావుంది అది. 'గుర్'

అంటుంది అక్కడికి పోతూనే, బరుకుతాది మొరుగుతుంది. మన శరీరమే ఒక గుహ. దాంట్లో ఎంతమంది ఉన్నారు అంటే, ఎవరికీ తెలియదు. కానీ కొంతమందికి మాత్రం తెలుసు కానీ, ఈ గుహ మొదట్లోనే కుక్కవుంది అక్కడ. అది 'గుర్' అంటానే భయపడతారు దానికి. అది గుర్, గుర్ అంటూ ఉంటుంది. అపుడపుడు నిద్రపోయినపుడు చాలా శబ్ధం చేస్తుంది అది. గుర్, గుర్ అంటుంది. కుక్కే గుర్, గుర్ అనేది. కుక్కతో సహా ఎంతమంది ఉన్నారు. 26 మంది వున్నారు. కుక్కతో సహా లెక్కేస్తే. ఇదేంది కుక్కేంది. 26 ఏమిటి అని అనుకోవద్దండి. మన శరీరంలో 'జీవుని'తో సహా 25 మంది ఉన్నారు. 'ఆత్మ'తో కలిపితే 26 మంది అవుతారు అర్థమయిందా! 5 వాయువులు, 5 జ్ఞానేంద్రియాలు, 5 కర్మేంద్రియాలు, 5 జ్ఞానేంద్రియాల శక్తులు, 5 అంతఃకరణాలు. మొత్తం జీవునితో సహా '25' అవుతాయి. వీటన్నింటిని నడిపించే పవర్ ఒకడున్నాడు. ఎవరు? ఆత్మ.

26 మంది ఈ శరీరమనే గుహలో వున్నారు. 26 మంది అయితే 26 మందిలో ఇదొకటి. ఏది? కుక్క. 'గుర్, గుర్' 'గుర్ – గుర్' అంటుంది. ఎక్కడ? గుహ మొదట్లోనే కాబట్టి లోపల తొంగి చూడాలంటే కాదురా అది అని చెప్పినాడు. తొంగి చూడాలంటేకాదు. నీవు బయట తెలుసు కోవాలంటే లోపల జ్ఞానమెంతో తెలిసి ఉండాలి. నీ ప్రభువును అడగాలి. అంటే లోపలికి పోయి. మళ్ళీ ఆయన ఏం చేస్తున్నాడు. ఇట్లాపడుకున్నోన్ని మొత్తం అట్లా తిప్పి పండబెడుతున్నాడు. రాత్రిపూట తిప్పిపండబెడుతున్నాడు ఎడమ ప్రక్క పడుకున్నాడు కుడి ప్రక్కకు పడుకోబెడుతున్నాడు. కుడి ప్రక్క పడుకొని వుండేవాన్ని ఎడమ ప్రక్కకు పడుకోబెడుతున్నాడు. మీకు తెలిసి పడుకుంటున్నారా ఎవరన్నా? లేదు. అక్కడ ఆయనేమి చేసినావాడే!

తిప్పిపడుకోబెట్టేవాడు వాడే, బోర్లా పడుకోబెట్టేవాడు వాడే, ప్రక్కకు తిరిగి ప్రక్కకు పడుకోపెట్టేవాడు వాడే! ఎవడైతే ఆ శక్తి మనకు ఇచ్చి మనల్ని పడుకోబెడుతున్నాడో. వానికి తెలుసు. కానీ, కొంతమందికి తెలుసు. మేము చెప్పుచున్నాము కదా! మాకు తెలుసు. కాబట్టి, ఆయన ముందే చెప్పినాడు అందరికి తెలియదు అంటే బాగుండదని కొంతమందికి తెలుసు అని అన్నాడు.

మనం చెప్పుకున్నాము ఇది ఇంతకుముందే. పంచతత్వములను పంచీకరించక, మంచి యతులమన్న మాటలన్న, కుంచెమందు గజము గుడ్డు బెట్టిన చందంబు, అఖిల జీవసంగ ఆత్మలింగ". అని ఒకాయన పద్యం చెప్పేసినాడు. ఈ శరీరంలో పంచభూతాలకు వివరం తెలియకుండా పోతే, పంచతత్వములను పంచీకరించక ఐదు ఇంటూ ఐదుతో హెచ్చించి 25 భాగాలు ఉండాయని నీవు తెలుసుకోకపోతే, ఏవి ఎక్కడ ఉన్నాయో తెలుసుకోకపోతే, నీ శరీరంలో వుండే భాగాలను నీవు తెలసుకోకపోతే, నేను జ్ఞానిని అంటే, అటువంటివాడు ఏనుగు గంపకింద గుడ్డు పెట్టింది అని అంటే అది ఎంత అబద్ధమో, నేను జ్ఞానిని అనుట అంత అబద్దం అని చెప్పినాడాయన. ఆ రకంగా ఇపుడు మనం ఏమి చెప్పుకోవాలంటే, గురువుకు ఇష్టమైతే మనకు జ్ఞానాన్ని తెలియజేస్తాడు. ఇష్టం లేకపోతే మనకు జ్ఞానాన్ని ఏమాత్రం అందివ్వడు. మనకు గురువు జ్ఞానము ఇష్టమైంది కాబట్టి, మనం గురువుకు ఇష్టమే. ఎందుకంటే, మనము గురువు జపం చేస్తున్నాము. కాబట్టి మీరు నా కిష్టులే, కాబట్టి మీరు ఏదడిగితే అది నేను చెప్తాను. అని గురువే చెప్తున్నాడు.

నీవు ఎప్పటికీ జీవాత్మవే. నీవు శరీరంలో ఇరుక్కున్నటువంటి వానివే! నీ శరీరంలో నీతోపాటు చాలామంది ఉన్నారు. ఎంతమంది ఉన్నారో

నీకు లెక్క తెలియకపోతే చూసుకో, మొత్తం 24 మంది. ఒకడు అతీతుడు మళ్ళా. నీకంటే పెద్ద నడిపేవాడు. మొత్తం (టోటల్) 26 మంది వున్నారు. అంతేనా? అంటే, అందరిని ఒక కంటితో చూసేవాడు ఒకడున్నాడు. ఆయప్ప రెండు కండ్లతో చూడడు. ఒక్క కన్నే వుండేది సాక్షిగా చూసేవానికి. ఒక కన్నుతో అన్నీ చూస్తున్నాడు. ఎవరు ఏమి చేస్తున్నారు? అనీ, చూసేవాడు ఒకడున్నాడు కాబట్టి మొత్తం ఎంతమంది అవుతారు అక్కడికి, 27 మంది. కరెక్టు సంఖ్య. ఇపుడు గుహలో ఎంతమంది ఉన్నారు 27 మంది అని కచ్చితంగా మనం చెప్పవచ్చు. ఒక గుహలో 27 మంది ఉన్నారు. అంటే నీకంటే ఇద్దరు పెద్దోళ్ళు. 24 మంది నీకంటే చిన్నోళ్ళు. మొత్తం అంతా కలిసి 27 మంది ఉన్నారు. కానీ నీవు తొంగి చూడాలంటే మాత్రం కాదు. చెప్పినేది వినాల్సిందే! మీ దగ్గర ఖురాన్ గ్రంథం ఉందికదా! ఇది చదవండి. 18వ ఆయత్, 18వ వాక్యం, 22వ వాక్యం చదవండి. మీరు భీతిల్లిపోతారు. పరిగెత్తి పోతారు. చూడొద్దండి ఇది. భయపడతారు మీరు. పారిపోతారు. లోపలికి పోయి చూసేదానికి మీతో కాదు. నేను చెప్తున్నా వినండి అని చెప్పాడు.

"నేను ఏమి చెప్పినా అది జ్ఞానమే"! ఖురాన్‌లో చెప్పినేది చెప్పినా జ్ఞానమే, భగవద్గీతలోనిది చెప్పినా జ్ఞానమే, బైబిల్‌లోది చెప్పినా జ్ఞానమే! ఎందుకు అంటే, మీకు ఏమైన అనుమానం ఒకటి ఉంటుంది. భగవద్గీతలో దైతే జ్ఞానం అయితాది మిగతావన్నీ గీతతో సమానము కాదు కదా! అనుకోవచ్చు. దానికంతా శక్తి ఉంటుందా? మీరు వ్రాసిన గ్రంథాలున్నాయి. కర్మలు ఎక్కడైనా వుంటే పోయి అంటుకుంటున్నాయి శరీరానికి. పట్టి లాగినా రాలేదు. అటువంటిశక్తి మళ్ళీ మిగతా ముస్లీమ్ గ్రంథాలకు ఉంటుందా అని అడగచ్చు. ఈ మధ్యన ఒక గ్రంథం వచ్చింది. నేను వ్రాయలేదు. వేరే

వాళ్ళు వ్రాశారు. అంటే అంతిమ దైవగ్రంథ జ్ఞాన వాక్యాలనే తీసి వ్రాసి ఇంకొక భాషలోకి ట్రాన్సిలేషన్ చేసి వ్రాశారు. అది **"ఖురాన్‌లో ఆణిముత్యాలు"** అని ఒక గ్రంథం వ్రాశారు. అది బయటకు వచ్చింది చూశారు కదా మీరు. ఎర్రగ్రంథం అంటే మేము గ్రంథం తీసి అట్లా చూస్తే, ఇక్కడ ఏ గ్రంథం తయారైందో ఆ గ్రంథం అంతా శక్తి ఉంటుంది. అది ముస్లీమ్ గ్రంథం కానీ, హిందూ గ్రంథం గానీ, క్రైస్తవ గ్రంథం కానీ. అంటే మనం మొదట్నించి చెప్తున్నాము. ఆ మధ్య ఏదో ఒక చిన్న పురుగు (భుజంపైన) ఇక్కడ. పురుగుకుడితే అది చిన్న విషం ఉంటుంది కదా! చిమ, చిమా అని నొప్పి వస్తుంటే అపుడు ఏదో సమయానికి ఉంటే ఆ గ్రంథం పెట్టారు వీళ్ళు. పెడితే ఇద్దరు పట్టిలాగినా రాలేదది. గట్టిగా అంటుకొంది అక్కడ. వాళ్ళు మళ్ళీ ఇట్లా ఇగ్గితే పట్‌మంటాంది కానీ, శబ్ధం వస్తాది ఇది. వాళ్ళు సెల్‌ఫోన్‌లో వీడియో తీసుకున్నారు అది. ఇట్లా ఇగ్గితే పట్‌మని శబ్ధం వస్తుంది గానీ అది మాత్రం విడిచిపెట్టలేదు. ఆ లోపల ఉండే విషాన్నంత లాగేసే వరకు విడిచిపెట్టలేదు. అంటే ఓ ముస్లీమ్‌ల పేరు పెట్టిన గ్రంథం కూడా, అంటే శక్తే కదా అది జ్ఞానం జ్ఞానమేకదా! అంటే ఇపుడు అన్ని ఒకటే జ్ఞానమే, దేవుని జ్ఞానమే అనేదానికి నిరూపణగా ఆ గ్రంథం తగులుకోవడం జరిగింది. అది ఇగ్గినా, ఇద్దరు మనుషులు ఇగ్గినా రాలేదు. చివరకు వాళ్ళు లాగినా రాలేదు. అది పూర్తి విషమంతా లాగేంతవరకు వదల్లేదు. విషమంతా లాగిన తర్వాత ఓ 10-15 నిమిషాలకు దానంతకు అది ఊడి వచ్చింది.

ఇట్లా ప్రతి గ్రంథంలోనూ శక్తి ఉంది. అంటే, మళ్ళీ ఇట్లా పోయి అట్లా పోయి, నా గ్రంథాలకంతా శక్తి ఉంది. నా జ్ఞానానికంతా శక్తి ఉంది అని అంటావు కదా! నీవు అని అనవచ్చు. అంటే అది గురువు చెప్పిన

జ్ఞానం. అంటే దేవుడు అందించిన జ్ఞానం. దేవుని జ్ఞానానికి ఎట్లయినా శక్తి ఉంటుంది. ఇక్కడ వచ్చేదంతా దైవ జ్ఞానమే! ఎక్కడా ఏమాత్రం దైవ జ్ఞానం కాదు అనేదానికి అవకాశం లేదు. శాస్త్రబద్ధమైనటువంటి దైవ జ్ఞానం ఉంటుంది. మీరు ఎంతైనా తెలుసుకోవచ్చు. మీరు ఎంత పెద్దోళ్ళు అయినా గానీ ఈ జ్ఞానాన్ని మినహా, ఇంక ప్రక్కకు పోయేదానికి అవకాశం లేదు. ఎన్ని సంవత్సరాలకు అయినా, ఎవరైనా గానీ ఈ జ్ఞానం దగ్గరకు రావాల్సిందే! ఈ జ్ఞానం మినహా ఏ జ్ఞానం ఇంక లేదు. అంటే అపుడు మీరు ఆ గ్రంథాల్లో ఉండేదే చెప్తున్నారా అంటే, "లేనిది కూడా చెప్తాను. నా రూలు అది". కాల, కర్మచక్రాలు ఏ గ్రంథంలో ఉంది. ఉందా? లేదు. అట్లా లేనివి చాలా చెప్పినాను. జ్ఞాపకం చేసుకోండి. భగవద్గీతలోగానీ, బైబిల్‌లోగానీ, ఖురాన్‌లో గానీ ఏ గ్రంథంలో లేని జ్ఞానం చాలా చెప్పాను. ఇపుడు దీనికి చెప్తున్నాను. అంటే, కాల, కర్మచక్రాలు దేవునికి గుర్తు అని. అంటే మీకు మళ్ళీ అది కాదు అనేదానికి అవకాశం లేకుండా, ఇపుడు ఒక ఆయత్ చూపించా మీకు. చూపించానా లేదా? దాంట్లో ఏముంది? 22వ సురా 32వ ఆయత్‌లో ఏముంది **దేవుని గుర్తును గౌరవించినటువంటి చిహ్నాన్ని,** చిహ్నం అని పేరుంది ఇది దేవుని చిహ్నమే! కానీ, ఇట్లుంది అని ఎవ్వరికీ తెలియదు ఈ చిహ్నం. కానీ అట్లుందని మేము చూపించాం. అది ఎక్కడా లేదు గుర్తు. ఇట్లుండాది అనీ. దాని వివరము కూడా చెప్పాము. ఇదే దేవుని చిహ్నమును గురించి బైబిలు చివరిలోగల ప్రకటన గ్రంథములో 9వ అధ్యాయము 4వ వచనములో కూడా యున్నది.

అట్లాగ ప్రతి జ్ఞానం ఇక్కడ చెప్పినటువంటి జ్ఞానం చాలా గొప్పది. అది మీ విశ్వాసాన్ని బట్టి మీరు తెల్సుకొంటే, ఎంత జ్ఞానమైనా తెలుస్తాది. కానీ ఇక్కడికే రావాలి అనే అవసరం లేదు. నీవు ఇంటి దగ్గర ఉన్నా నీకు

తెలుస్తుంది ఈ జ్ఞానం. అది ఎట్లా తెలుస్తుంది అంటే ఏం చేస్తాదో తెలియదు. ఆయన రూలే అది. కాబట్టి జ్ఞానం తెలుసుకోవాలనుకొంటే ఏదో రకంగా ఆడిస్తాడు. ఆయన తెలియజేస్తాడు. కాబట్టి జ్ఞానం తెలుసుకోవాలనే ఆసక్తి కలిగి మీరు మెలగండి, ఇప్పటినుండి, ఇంతకుముందు ఎట్లన్నా వుండనీ. మనం ఇప్పటినుండి అసలైన దేవుని జ్ఞానం కావాలి అనుకోండి. ఇంతవరకు తెలిసిన జ్ఞానం అది అసలైన దేవుని జ్ఞానం కాదనే రూఢిగా అర్థమయింది. కాబట్టి ఇప్పటి నుండి ఏమి అనుకోవాలి మీరు, అసలైన దేవుని జ్ఞానం కావాలి అనుకోవాలి. అనుకొంటే మాత్రం దేవుని జ్ఞానం అందిస్తాడాయన. ఎవరు ఇస్తారు? ఆయనిస్తారు. నీవు వెతకాలా? నీవు వెతకాల్సిన పనిలేదు. ఆయన వెతుకుతాడు నిన్ను. నీవు కావాలనుకొంటే, వాని అడ్రసు, పోస్ట్ ఆఫీసులో అడ్రసు, మనకు జాబ్‌వస్తే మన ఇంటికి వెతుకులాడుకొంటూ వస్తాడే ఎక్కడున్నాడు? ఎక్కడున్నాడు? అని అట్లా వస్తాడు ఆయన. ఎవరు? ఆ గురువు వస్తాడు. దేవుడూ అంటే, దేవుడు రాడు, మళ్ళా దేవుడు ఎక్కడుంటాడో తెలియదు. మనం చెప్పాల్సింది గురువును. గురువు వస్తాడు. గురువు వచ్చి, మనకు జ్ఞానం చెప్తాడు. కానీ ఎప్పుడు చెప్పినాడోననే జ్ఞప్తి ఎవరికీ వుండదు. జ్ఞానం తెలుస్తుంది కానీ ఎప్పుడు చెప్పినాడో, ఎట్లా చెప్పినాడో ఆయన ఇంతకు ఆయనేనా, ఈయనేనా అని జ్ఞాపకం వుండదు. తెలియకుండా చెప్పేస్తాడు. ఎవ్వరికీ అర్థం కాకుండా చేస్తాడు. అదే దేవుడిలో ఉండేటటువంటి పని తనం. అందువలన ఇప్పటి నుండి ఇపుడు ఎంత దూరము నుండి మీరు వ్యయ, ప్రయాసలకు అంతా ఓర్చుకొని వచ్చారు. మళ్ళా దీనికంతా ఫలితం ఉండాలంటే, దేవుని జ్ఞానం మీద ఆసక్తి కలిగి, దేవుని జ్ఞానాన్ని తెలుసుకోండి. తర్వాత మీకు ఏమి చెప్తున్నామంటే, ఇపుడు 'జకాత్' అనే గ్రంథం వచ్చింది ఒకటి. ఆ జకాత్ అనే గ్రంథలో దైవసేవ

ఆర్థిక సేవ అని ఇది చేసి పెట్టి వ్రాశాము కొంత. దానిని మీరు చదువుకొంటే ఏమైతాది అంటే, '3' వ సురా '31' వ ఆయత్ యొక్క వివరం అంతా తెలుస్తుంది.

దేవుడు చెప్పిన దానిని గురించి మనం సక్రమంగా నడుచుకొన్నట్లు అవుతుంది. మీరు దేవుని జ్ఞానాన్నే పొందడం జరుగుతుంది. ఇప్పటి నుండి దేవుని జ్ఞానమే కావాలని మనసులో కోరుకోండి. దేవుడు మీకు వెతుకులాడు కొంటూ వచ్చి ఇస్తాడు. మీరేం వెతుకులాడే పని లేదు. దేవుడే వెతుకులాడు కొంటూ వచ్చి ఇస్తాడు. అంతే కదా! మనం జ్ఞానము కావాలనుకొని వెతుకుతుంటే దొరకదు. దేవుడే మనకు ఇస్తే, వస్తుంది. ఇప్పటి నుండి మీరు ప్రతి ఒక్కరు. ఇక్కడకు వచ్చినాగానీ, ఇక్కడకు రాకున్నాగానీ దేవుని జ్ఞానమే కావాలని కోరుకోండి. అర్థమయిందా! ఇంకొకటి ఏమంటే, ఈ గురువు అనే సమస్య మధ్యలో విడిచి పెట్టాము కదా! ఆయన ఎవరికీ తెలియడు. అయితే ఇంతకు ముందు కనుక్కొన్నవాడు లేడా అంటే, భీష్ముడు కనుక్కొన్నాడు. అయితే అపుడు ఆయన కనుక్కొన్నపుడు మనమెందుకు కనుక్కోకూడదనే పాయింట్ అడగవచ్చు. ఈ కాలములో ఏ విధముగా నయినా గురువును గుర్తించలేము అన్నది సత్యము.

# 84. సమాధి

**(తేది :- 12.09.2011)**

ప్రతి ఉపన్యాసం మొదట్లో మేము గురు శ్లోకాన్ని చెప్పుతూ ఉంటాము. మీరు ఎప్పుడూ ఇదే గురుశ్లోకాన్ని వింటూవుంటారు. నాకు వచ్చేది ఇది ఒక శ్లోకమే. వేరే శ్లోకము ఏదీ రాదు. మీరు చాలా శ్లోకాలు నేర్చుకొని ఉంటారు. కానీ మీకంటే మేము వెనుకబడివున్నాము. కాబట్టి శ్లోకాలు మాత్రము ఒకటి కూడా రాదు. అట్లే భగవద్గీత శ్లోకాలు అసలు రావు. నాకంటే భగవద్గీత శ్లోకాలు బాగా చదివే వాళ్ళు వుంటారు. కానీ ఆ శ్లోకాలు కూడా మాకు రావు. నేను నేర్చుకోవాల్సిన అవసరం లేదు. నేను ఎప్పుడూ నేర్చుకొనలేదు. నేర్చుకోవలిసిన అవసరం ఎందుకు లేదు అంటే, అది జ్ఞాపకం పెట్టుకొని దానినే చెప్పవలసిన అవసరం మాకు లేదు. మీరు పెట్టుకోవచ్చు, మీరు నేర్చుకోవచ్చు. మేము ముందుకు పోతూ ఉండాలి. ఎందుకంటే క్రొత్త క్రొత్త విషయాలు అన్వేషిస్తూ, మీకు తెలియజేస్తూ పోతూ ఉండాలి. కాబట్టి మేము ఆ శ్లోకాల మీద ధ్యాసకానీ, చదువుకోవడం గానీ, నేర్చుకోవడం గానీ ఏమీ ఉండదు. మేము ఒక గ్రంథము వ్రాసినపుడు మాత్రమే ఆ విషయం మాకు తెలుస్తుంది కానీ, తరువాత మీరు చదువుకొని, మీరు జ్ఞాపకం పెట్టుకొని ఉంటారు.

ఈ గ్రంథములో ఫలానా విషయాలు ఉన్నాయి. ఆ గ్రంథములో ఫలానా విషయాలు ఉన్నాయి అని మీరు చెప్పుతుంటే, ఉన్నాయా అని అనుకుంటాము మేము. ఎందుకంటే దానిలో ఉండేటటువంటి విషయాలు కూడా జ్ఞాపకం ఉండవు. మేము క్రొత్త విషయాలనే చూస్తూ పోతూ ఉంటాము. సరే ఇంతవరకు మేము ప్రతి నెల మీకు క్రొత్త విషయాన్నే

అందిస్తూ పోయినాము. ఇంక ఈ విధంగా ప్రతి నెల క్రొత్త విషయాలు అందిస్తూ పోతూ ఉండాలంటే క్రొత్త విషయాలు ఎక్కడి నుంచి మనకు వస్తాయి? కాబట్టి మేము సాధ్యమైనంత వరకు క్రొత్త విషయాలను అందించడానికి ప్రయత్నం చేస్తాము. అందించలేనపుడు మీరు పాత విషయాలనే తిరిగి చదువుకోవాల్సిన పని వస్తుంది. మీరు ఇంతకు ముందే చదువుకొని జ్ఞాపకం పెట్టుకుంటారు. పోయిన నెల ఒక గ్రంథాన్ని విడుదల చేశాము. **"సత్యాన్వేషి కథ"** అని బహుశ అందరూ దానిని చదివేవుంటారు అని అనుకుంటాను. దానిలో మీకు అన్ని క్రొత్త విషయాలే అందించాము. ఇప్పటికి మేము 40 గ్రంథాలు వ్రాసినాగానీ, ఆ 40 గ్రంథాలలో లేని విషయాన్ని మళ్ళీ దీనిలో క్రొత్తగా అందించాము. ఇప్పుడు ఈ నెల **"పునర్జన్మ రహస్యం"** అని ఒక గ్రంథాన్ని విడుదల చేశాము. మీరు తీసుకున్నారో లేదో కానీ, పునర్జన్మ రహస్యమనే ఈ గ్రంథము ఈ రోజు విడుదల అయింది. షాపులో దీనిని ఇస్తున్నారు. దీనిలో కూడా జనన మరణ సిద్ధాంతం చెప్పినపుడు, మరణ రహస్యం గురించి చాలా చెప్పినాము. మరణం ఎట్లా ఉంటుంది? అనేది సిద్ధాంతపరంగా చెప్పినాము. శాస్త్రబద్ధంగా ఇట్లే ఉంటుంది, దీనిలో ఏమీ మార్పు ఉండదు. ఎవరికి తెలిసినా తెలియకపోయినా ఇంత తప్ప ఏమీ లేదు అని చెప్పాము. తరువాత దాన్ని ఇంకా విశ్లేషించి, ఇంకా మీకు దగ్గరగా ఒక గ్రంథములో మరణ రహస్యాన్ని చెప్పాము.

ఇప్పుడు పునర్జన్మలు లేవు, మనిషి ఒకసారి పుడుతున్నాడు, ఒకసారి చస్తున్నాడు అనే వాదన హిందూ మతములో తప్ప చాలా మతాలలో ఉంది. పునర్జన్మలు ఉన్నాయి అని నిరూపణ చూపించే నిమిత్తము మరలా **"పునర్జన్మ రహస్యము"** అని ఈ గ్రంథము వ్రాయడం జరిగింది. ఈ గ్రంథము

చదివితే అందులో మీకు ఇంతవరకు చెప్పని క్రొత్త విషయాలు అన్నీ తెలియబడుతాయి. అంతే కాకుండా శరీరంలో మీరు అంటే జీవాత్మ అనేటటువంటి మీరు కాకుండా, మీకు తెలియకుండా అందరిలో ఒక వ్యక్తి ఉన్నాడు అని చెప్పాము. ప్రతి వ్యక్తిలోను ఇంకొక వ్యక్తి అంటే కనిపించని వ్యక్తి వున్నాడు, ఆ వ్యక్తినే ఆత్మ అంటున్నాము. నిన్ను ఏమంటున్నాము జీవాత్మ అని అంటున్నాము. కానీ ఆత్మ, జీవాత్మల విషయము మనిషి పూర్తిగా మర్చిపోయి తన అడ్రస్సు ఒకటి పెట్టుకున్నాడు. నేను ఫలానా పేరుగల వ్యక్తిని, నేను ఫలానా ఊరిలో ఉన్నాను. ఫలానా ఊరు ఫలానా జిల్లాలో ఉంది. ఫలానా జిల్లా, ఫలానా రాష్ట్రం, ఫలానా దేశంలో ఉంది అని ఇంత అడ్రస్సు పెట్టుకున్నాడు.

ఆ విధంగా ఒక మనిషి తాను జీవాత్మ అయినప్పటికైనా గానీ తాను జీవాత్మను అని మరచిపోయి, తనను, ఒక పేరు గల వ్యక్తిని అనుకొని, అతను ఎక్కడున్నాడు అంటే ఆ పేరుగల్గిన వ్యక్తి శరీరంతో సహా పోల్చుకుంటూ, అతను ఒక ఊరిలో ఉన్నానని, ఆ ఊరు ఒక జిల్లాలో ఉందని, ఆ జిల్లా ఒక రాష్ట్రంలో ఉందని ఈ విధంగా ఒక అడ్రస్సు కల్గివున్నారు. మేము ఒకసారి చిన్న వాక్యము వ్రాశాము **"నీ అడ్రస్సు నీకు తెలుసునా"** అంటే, అందరికి తెలుసు ఎందుకు తెలియదు. ఈ ప్రశ్న ఏమిటిది అని అనుకుంటారు. కానీ ఇక్కడ స్థూలం, సూక్ష్మం అని రెండు భాగాలు ఉన్నాయి. ఆధ్యాత్మికము అంతా సూక్ష్మంతో ఆధారపడి ఉంటుంది. స్థూలంతో ఆధారపడి ఉండదు. నీవు ఎవరు? అని అడిగితే నేను ఫలానా వ్యక్తిని అని మీ పేరు చెప్పినారు అనుకోండి, ఫలానా వ్యక్తిని అని నీవు పేరు చెప్పినపుడు ఆ చెప్పినటువంటి పేరు మీకు ఎప్పుడు వచ్చింది? నీవు పుట్టిన తరువాత, నీవు శరీరంతో పుట్టిన తరువాత కొద్ది

రోజులకు నెల, 2 నెలలకు, 3 నెలలకు మీ అమ్మ నాన్న మీ పెద్దలు ఆ పేరు పెట్టివుంటే వచ్చింది. ఆ పేరును నీవు చెప్పుకుంటున్నావు. ఫలానా వ్యక్తిని అని అది గుర్తింపుకోసం పెట్టినటువంటి పేరు కానీ అది నీవు కాదు. నీవు అది కాదు. ఆ పేరు లేకముందు నీవు ఎవరు? పేరు లేని వ్యక్తివి. పేరు లేని వ్యక్తి అయినాగాని నీవు ఉన్నావు. ఆ వ్యక్తి ఎవరు అని తనను తాను ప్రశ్నించుకొంటే అది జవాబు లేకుండా పోతుంది. ఎందుకంటే ఎవరూ ఆ ప్రశ్నను ప్రశ్నించుకోలేదు. తరువాత ఆ జవాబును గురించి వెతక లేదన్నమాట.

నేను ఎవరు? అనే ప్రశ్నను ఎవరూ వేసుకోలేదు. సరే తను ఎవరు అని ప్రశ్నించుకోకుండా పోయినా గానీ మనము ఆలోచన చేసి చూస్తే సర్వసాధారణంగా ఒక మనిషిలో అతనికి ఏ పేరు ఉన్నాగానీ ఏ అడ్రస్సు వున్నాగానీ ఒక శరీరంలో జీవాత్మ ఒకడు వున్నాడు. ఆ జీవాత్మ వుంటూ ఏమి చేస్తున్నాడు. ఏమి ఘనకార్యము సాధిస్తున్నాడు? అంటే ప్రపంచములో నీవు ఏ డిగ్రీలో వున్నా ఏ హోదాలో వున్నా, కష్టాన్ని, సుఖాన్ని అనుభవించడం తప్ప ఏమీ లేదు. మొత్తంగా సారాంశాన్ని చూస్తే, ఒక మనిషి ఏమి చేస్తున్నాడు అని చూస్తే, వాడు పెద్దవాడుగానీ, చిన్నవాడుగానీ ఎవడైనా గానీ తినేది అన్నమే గానీ ఎక్కువ తినలేడు. ధనికుడు అయితే ఎక్కువ అన్నం ఏమన్నా తినగల్గుతాడా అంటే అట్లా లేదు. ఆకలికి తగిన ఆహారాన్ని తింటాడు. అంత తప్ప ఇంకొకటి ఏమీ లేదు. అంటే ఏ మనిషి ఎట్లా బ్రతికినాగానీ ఆ మనిషి జీవితం మొదలుకొని జీవితం అంత్యం వరకు కష్టాలు,సుఖాలు అనుభవించే కొరకే బ్రతుకుతున్నాడు తప్ప ఇంకోటి ఏమీ కాదు. దీనిని బాగా నోట్ చేసి పెట్టుకోండి. అంత తప్ప ఏమీ సారాంశము లేదు. అదంతా పెద్దగా అర్థము కాకపోతే స్థూలంగా చెప్పుతాను సరే! నీ దగ్గర 10

రూపాయలు ఉన్నాయి అనుకోండి. ఇంకొకరి దగ్గర 10 లక్షలు ఉన్నాయి అనుకోండి. 10 రూపాయలు ఉన్నవాడు ఒక పూట అన్నమే తింటాడు. 10 లక్షలు ఉన్నవాడు కూడా ఒక పూట అన్నమే తింటాడు. వాడు ఏమి అనుభవించాడు, వీడు అనుభవించాడంటే అనుభవించేది ఏమీ లేదు. ఏ వ్యక్తికి అయినా బాగా డబ్బులు ఉన్నాయి అంటే అది ఊరికే లెక్కచారము కోసమే ఇంతవున్నాయి, ఇంతలేవు అని మనకు వట్టి లెక్కచారము కోసమే గానీ, ఇవి నీకు ఉపయోగపడేటివి కాదు. ఎందుకంటే నీవు అనుభవించేది కాదు. అనుభవించేది కేవలం తినే తిండి, కట్టుకొనే గుడ్డ అంతే తప్ప ఇంకొకటి ఏమీ లేదు. ఎంతవున్నాగానీ ఇవి పైన చూసే అనుభవాలే కానీ, లోపల సూక్ష్మంగా చూస్తే జీవుడు ఏమి చేస్తున్నాడంటే, పుట్టినప్పటి నుంచి చనిపోయేంత వరకు, అనుభవించేది తప్ప ఏదీ లేదు.

మీరు ఆలోచన చేసుకుంటే, పుట్టినప్పటి నుండి చనిపోయేంత వరకు ఏముంది సారాంశము అంటే కష్టాన్ని, సుఖాన్ని వివిధ సమయాలలో వేరు వేరు రూపాలుగా అనుభవిస్తున్నావు. కొన్ని సమయాలలో కష్టాన్ని కూడా అనుభవిస్తున్నావు. కొంతసేపు సుఖము ఉంటుంది, సుఖముపోతే తిరిగి కష్టము వస్తుంది. ఆ కష్టము పోతే సుఖము వస్తుంది. చివరకు ఈ విధంగా జీవితమంతా కొనసాగుతూ వస్తుంది. ఈ రకంగా మనము లెక్కవేసుకొని చూస్తే, ఒక వ్యక్తి శరీరంలో జీవాత్మగా ఉన్నాము అనే మాట మర్చిపోయి, తాను పైకి చెప్పుకొనే వ్యక్తిగా పై హోదాను లెక్కించు కుంటున్నాడు. పై డిగ్నిటీ అంటే యోగ్యతను లెక్కించుకుంటున్నాడు. తరువాత పైన ఉండే బలాన్ని లెక్కించుకుంటున్నాడు. నాకు ఇంత బలము వుంది అని, తనపైన ఉండేటటువంటి కులాన్ని లెక్కించుకుంటున్నాడు. నేను ఫలానా కులస్థుడనని తరువాత పైన ఉండేటువంటి విద్యను, నేను ఫలానా విద్యను నేర్చుకున్నాను, ఇంత చదువు చదివినాను అని అనుకుంటున్నారు.

ఈ రకంగా తాను జీవాత్మ అయినా గానీ, తను జీవాత్మ అని తెలియకుండా నేను డిగ్రీ చదివిన వ్యక్తిని అని, లేదా ఫలానా కులస్థుడనని, నాకు ఇంత ధనము కలదని పెద్ద ధనికున్ని అని ఈ రకంగా తన హోదాలను జ్ఞప్తి పెట్టుకొని బ్రతుకుచున్నాడు. సరే మీరు ఎంత జ్ఞప్తి పెట్టుకొని బ్రతికినాగానీ నీవు జీవాత్మవి అనే మాట పూర్తిగా మర్చిపోయావు. ఇక్కడ ఒక వాక్యం వ్రాశాము పెద్ద బోర్డులో ఉంది అది **"నీ అధికారం, నీ హోదా, నీ పలుకుబడి, నీ బలము, నీ ధనము ఇవన్నీ కొంత కాలమే! నీ శరీరము కూడా నీ మాట వినని రోజువుంది జాగ్రత్త"** అని చెప్పాము. నీ శరీరము కూడా నీ మాట వినని రోజువుంది జాగ్రత్త అంటే నీవు వేరు, నీ శరీరం వేరు, నీవు శరీరంలో నివాసము చేస్తున్నావు అనేది మర్చిపోయాము. మనము శరీరంలో నివాసము చేస్తున్నాము అనేది మర్చిపోయాము. వాస్తవంగా శరీరంలో నివాసము చేస్తూ మనము ఏం చేస్తున్నాము అంటే మనము మనల్ని మర్చి పోయి, నేను ఫలానా వ్యక్తిని అని పైన ఉండేటువంటి హోదాలను చూసుకోవడం జరుగుతావుంది. అట్లా లేకుండా ఆధ్యాత్మికరీత్యా అంటే అంతో ఇంతో జ్ఞానం తెలిసిన ప్రకారం చూసుకుంటే మనము ఒక శరీరంలో నివశించేటువంటి ఒక జీవాత్మను అని తెలియుచున్నది.

నీ శరీరం అంటే కొంత పొడవు, కొంత వెడల్పు, కొంత విస్తీర్ణము కల్గివుంది. మరి ఆ శరీరంలో నీవు ఎక్కడ వున్నావు? అని ప్రశ్న వేసుకుంటే ఇంతకు ముందు కూడా చాలామార్లు చెప్పాము. ప్రశ్న వేసుకుంటే నీవు వున్నావు. అంటే రవ్వంత! ఒక గోధుమ పిండి ఆడించినపుడు, జొన్నలు పిండి మిషనుకు వేసినపుడు చిన్న చిన్న రవ్వలు వస్తాయి కదా! ఆ పిండి రవ్వ ఎంత ఉంటుందో అంత అనుకోండి రవ్వంత అని చెప్పినాము. ఈ

రకంగా శరీరంలో రవ్వంత మాత్రమే నీవు ఉన్నావు. శరీరంలో రవ్వంత వుండి నేను ఇంత పెద్ద అనుకోవడం అసలుకు మనకు తెలియని తనం అనవచ్చు. ఆ రవ్వంతగా ఎక్కడున్నావు అని అంటే భ్రుకుటికి మధ్యమున ఉపజిహ్వాకు ప్రాక్ దిక్కున అని వేమన యోగి చెప్పారు. అది వాస్తవమే, ఆయన ఒక పద్యం చెప్పితే చిన్న పద్యమైనా గాని, అది పెద్ద గ్రంథముతో సమానముగా ఉంటుంది. అంత సారాంశము ఉంటుంది. పెద్దలు పెద్ద పెద్ద గ్రంథాలు వ్రాసినా గానీ, అందులో లేని సారాంశము ఒక పద్యంలో ఉంటుంది. ఉప జిహ్వాకు ప్రాక్ దిక్కున అంటే పై ప్రక్కన చిరునాలుకకు పై ప్రక్కన, భ్రుకుటి అంటే భూమధ్య స్థానం లోపల కరెక్ట్‌గా తల మధ్యలో ఒకచోట నీవు ఉన్నావు.

ఇప్పుడు మనము నుదుటి మీద కాల, కర్మ చక్రాలు పెట్టుకున్నాము కదా! ఇక్కడ అందులో క్రింద చక్రము గలదు. క్రింద చక్రంలో మూడు భాగాలు ఉన్నాయి. ఆ మూడు భాగాలలో ఏదో ఒక భాగంలో మనము నివాసం చేస్తున్నాము. అంతే రవ్వంతే, అది మనకు తెలియదు. నీ శరీరంలో అంటే, ఏ వ్యక్తి అయితే శరీరంలో ఉంటాడో ఆ వ్యక్తిని నడిపించే దానిని బట్టి, ఆ శరీరం నడుచుకుంటూ ఉంటుంది. అంటే వాని యొక్క మనో భావాలకు తగినట్టు ఉంటుంది. ఈ మధ్యన ఒక ఆమె ముదిగుబ్బ నుంచి వచ్చింది. ఆమె పేరు శారద, ఆమెలో మోహన్ అనే మగవాడు వున్నాడు. ఇంకొక ఆమె ఉంది అనుసూయమ్మ మళ్ళీ ఈ ఇద్దరు ఒక స్త్రీ, ఒక పురుషుడు ఇద్దరు ఉన్నారు. అంటే మూడవ శరీరంలో అంటే మూడవ వ్యక్తిగా ఉండే టటువంటి శరీరంలోకి వచ్చినపుడు, మగవాని మాదిరిగానే ప్రవర్తిస్తాడు. ఆ నడక, ఠీవి, చూపు అన్నీ వేరైపోతాయి. ఇంకొక ఆమె అనుసూయమ్మ ఆ శరీరంలోకి ప్రవేశిస్తే, ఆ శరీరంలోకి పైకి వస్తే ఆమె జలుబు చేసిన

వ్యక్తి ఆరోగ్యము ఎట్లు ఉందో అట్లే పైకి కనిపిస్తూ ఉంటుంది. నడవలేదు, పైకి లేవలేదు అంటే శరీరం అంత బలహీనము అయిపోతుంది. అదే మగవాడు ఉన్నపుడు శరీరం బలంగా ఉంటుంది. వేరే వాళ్ళతో కొట్లాడే అంతస్థోమత ఉంటుంది. ఈ రకంగా లెక్కేసుకొంటే మనము అంటే శరీరంలో ఎవరైతే వున్నారో, ఏ జీవుడు అయితే ఉన్నారో ఆ జీవున్ని అనుసరించి వీని శరీరము ప్రవర్తిస్తుంటుంది. వాడు నడిపే దాన్నిబట్టి ఉంటుంది. శరీరము వాహనంలాంటిది. నడిపే డ్రైవర్‌లాంటివాడు జీవుడు అనుకుందాం. అంటే మీకి పైకి అర్థమయ్యే విధంగా, వాడు నడిపే వాడు కూడ కాదు. కూర్చోని వెళ్ళే ప్రయాణికుడు అంతే!

ఇంకా వివరంగా చెప్పితే వాహనంలో కూర్చోని పోయే ప్రయాణికుడు. నడిపేవాడు వేరే ఉన్నాడు. ఆ నడిపేవాడు ఎవరు అంటే వాడే ఆత్మ, నీ శరీరాన్ని ప్రతిక్షణము, ప్రతి నిమిషము చూచేవాడు ఇంకొకడు ఉన్నాడు. వాడు ఏమాత్రము తెలియబడడు. ఇంతవరకు ఎవ్వరికీ తెలియబడలేదు. పెద్ద పెద్ద ఆధ్యాత్మికవేత్తలకు కూడా ఆత్మ అనే పదం తెలుసుకానీ, ఆత్మ ఎక్కడ ఉందో, ఎట్లు ఉంటుందో అనే విషయం తెలియదు. ఆత్మ అనుమాట తెలుసు. ఆత్మ అనే పదము వాడుకుంటున్నారు, కానీ ఆత్మ అనేది ఏమిటది ఎవరికీ తెలియదు. ఆత్మ అనేది శరీరమంతానిండి ఉంది. శరీరమంతా అణువణువునా వ్యాపించి ఉంది. వెంట్రుకలు మొదలుకొని గోరు వరకు వ్యాపించివుంది. నఖ, శిఖ పర్యంతం వ్యాపించి ఉంది అని చెప్పాము మనము. శరీరమంతా వ్యాపించివుండేది ఎవరు? ఒకే ఒక ఆత్మ! శరీరంలో ఒకచోట ఉండేది ఎవరు? జీవాత్మ. శరీరంలో ఒకచోట ఉన్నటువంటి జీవాత్మ శరీరమంతా నేను అనుకుంటున్నాడు. కానీ ఆత్మ ఏమని అనుకుంటా ఉంది? **“నేను అంతా నడుపుతావుంటే,**

**శరీరమంతా నేను అంటే, నీవు ఏమిటిరా, మొత్తము అంతా నేను అనుకోవడం పొరపాటు కాదా! సరే వాడు ఏమన్నా అనుకోనిలే నాకేమి మొత్తము శరీరము నాదే కదా!"** అని ఆత్మ అనుకుంటుంది. ఈ విధంగా అనుకోవడంలోనే అజ్ఞానంలో పడిపోయినాము మనం, అంటే పెద్ద అజ్ఞానం ఏమిటి? శరీరమంతా నేను అనుకోవడమే పెద్ద అజ్ఞానం.

ఈ రకంగా మొట్ట మొదట పెద్ద అజ్ఞానంలో పడిపోయి మనము అదే మార్గములో నడుచుకుంటూ పోతున్నాము. ఇంక జ్ఞానమార్గం ఏమాత్రం దొరకడం లేదు. అట్లే కొనసాగుతూ పోతావుంది. ఒకదానికొకటి ఒకదానికొకటి నేను అనుకోవడంలోనే, శరీరం నేను అని అనుకున్నపుడే అంత గందరగోళం ఏర్పడుతుంది. కానీ ఈ జీవితం అనేది ఈ విధంగా సాగుతూపోయినపుడు బాల్యం ఉంది, మనము యవ్వనాన్ని అనుభవించాము, సరే! కౌమారం వచ్చింది మనకు, తరువాత వృద్ధాప్యం కూడా రాబోతుంది. వచ్చిన వాళ్ళు కూడా ఉన్నారు. వృద్ధాప్యం అయిన తరువాత ఏమవుతుంది. అంటే మరణమే. అంటే ఎవరికి మరణము? శరీరానికి మరణం, నీకు మరణం కాదు. నీవు ఉన్నావు, నీవు ఏమీ కాలేదు. అర్థమయిందా! నీవు ఏమన్నా బాల్యంలో చిన్నవానివా, కాదు. బాల్యంలో కూడా ఒకటే స్థాయిలో ఉన్నావు, యవ్వనంలో కూడా ఒకటే స్థాయిలో ఉన్నావు, కౌమారంలో కూడా ఒకటే స్థాయిలో ఉన్నావు, తరువాత వృద్ధాప్యంలో కూడా ఒకటే స్థాయిలో ఉన్నావు. కానీ నీ శరీరం స్థాయిలు మారుతూ వచ్చింది. అర్థమయిందా! అపుడు పరుగెత్తేది ఇప్పుడు పరుగెత్తలేదు. ఈ విధంగా శరీరంలో మార్పులు ఉంటాయి. గానీ జీవాత్మలో ఏమాత్రం మార్పులు ఉండవు. ఈ విధంగా ఒకరోజు చనిపోవడం కూడా జరుగుతుంది. అది మాములు నిర్ణయమై ఉంటుంది.

ఈ జీవితమంతా ఎట్లా కొనసాగించాలి అనే దానికి ముందే, మనకు ఒక పథకం వుంటుంది. అంటే దానిని 'జా ఫతకం' అని అంటాం. 'జా' అంటే పుట్టుట, పుట్టినపుడే పథకం నిర్ణయించబడింది, శరీరం చనిపోయేంత వరకు ఏమి చేయాలి? ఏం తినాలి? ఏం మాట్లాడాలి? ఏ వ్యవహారంలో నీవు తిరగాలి? ఎప్పుడు ఏ క్షణం ఎట్లా ప్రవర్తించాలనేది అంతా ముందే నిర్ణయించబడివుంది. ఆ నిర్ణయం ప్రకారమే నీకు జరుగుతుంది. మరణం కూడా ఆ నిర్ణయం ప్రకారమే జరిగి తీరుతుంది. ఎవరూ దానిని తప్పించలేరు. 'జా పథకం' అనే పదములో మధ్యలో 'ఫ' ఎక్కడో గాలికి కొట్టుకొనిపోయింది. జాతకం అయింది అని మేము చెప్పాము. మీ జాతకం ప్రకారమే జరిగి తీరుతుంది తప్ప ఎవ్వరూ దానిని మార్చలేరు. నీ జాతకంలో విష ప్రభావం వలన చనిపోవాలి అనేది ఉందనుకో, పాము కాటు వలన చనిపోవాలి అని ఉంది అనుకోండి, అది ముందే నిర్ణయించబడింది. ఒకవేళ జ్యోతిష్యం తెలిసినటువంటి వ్యక్తులు, ఈయన పాము వలనే చనిపోతాడు, 8వ ఇంటిలో శత్రువుగా రాహుగ్రహం ఉంది కాబట్టి, రాహుగ్రహం విషానికి అధిపతి కాబట్టి, విషం వలనే చనిపోతాడు. రాహుగ్రహం పాములకు అధిపతి కాబట్టి పాము వలనే చనిపోతాడు. రాహుగ్రహంతో ఇంకొక గ్రహం కలిసివుంది అనుకోండి అదే, కుజగ్రహం అపుడు విషం తిని చనిపోతారు, ఇది పాము కరిచి చనిపోతాడు, విషం తిని చనిపోతాడు, అట్లా గ్రహాలు కలిసివుండే దానివల్ల, జ్యోతిష్య శాస్త్రము ప్రకారం ముందే ఇతను విషము తిని చనిపోతాడా, పాము కాటు వలన చనిపోతాడా అని చెప్పవచ్చును. విషప్రభావం వలన చనిపోయినాగాని ముందే గుర్తించేటువంటి అవకాశం ఉంది, సరే! అది ముందే గుర్తించినాము అనుకోండి, అది గుర్తించే దానికోసమే, మనము తెలుసుకొనే దానికోసమే జ్యోతిష్యశాస్త్రం ఉంది, కానీ

దానిని తప్పించే దానికి జ్యోతిష్యశాస్త్రంలో ఎటువంటి సాధన లేదు, ఉపాయము లేదు. అది ఏమి జరగాలని నిర్ణయము అయివుంటే అదే జరుగుతుంది. కానీ అది జరగకుండా పోయేదానికి, దానిని మార్చేదానికి ఇంకోటి ఏమి లేదు.  ఇంకొక మార్గం లేనే లేదు.  ఒక గుడికి పోయి పూజచేస్తే ఈ దోషం పోతుంది, ఇది తప్పిపోతుంది. నాగుపాము కరచి చనిపోయేది ముందే తెలిస్తే, నాగదేవతలకు పూజచేస్తే నాగుపాము కరవదు అని కొంతమంది చెప్పుకోవడం, ఆ పూజ చేయించడం, శాంతులు చేయించడం జరిగినా కానీ జాపథకంలో ఏమైతే నిర్ణయము ఉందో ఆ పథకాన్ని ఎవరు మార్చేదానికి వీలులేదు.

ఇదంతా మీకు తెలిసిన విషయమే, ఇంక తెలియని విషయము ఏమి అంటే చనిపోయినపుడు తీసుకొనిపోయి అంటే నీవు ఒక గుర్తింపు పొందిన వ్యక్తివి అనుకోండి, నీకు సంబంధించిన పొలములో పూడ్చిపెట్టి, పైన ఒక కట్ట కట్టి ఇది ఫలానా వాళ్ళ సమాధి అని పేరు పెట్టుతావు. చాలా సమాధులు మనం చూస్తూ వుంటాము. ఇది హిందూ మతములో గానీ, క్రైస్తవ మతములో గానీ, ఇస్లాం మతములోగానీ ఈ సమాధి అనే పేరు పూర్తి ఎక్కడైనా ఉంది. ఈ మతములో ఉంది ఈ మతంలో లేదు అనుకోకుండా అన్ని మతాలలోను ఈ సమాధి అనేది ఉంది.  చనిపోయిన తరువాత ఒక చిహ్నాన్ని పెట్టి అంటే ఫలానా పూడ్చిన జాగాను సమాధి అంటున్నాము. లేకపోతే కాల్చిన జాగాను సమాధి అంటున్నాము ఏదో ఒక జాగాను సమాధి అను గుర్తింపుగా దానికి పేరు పెడుతున్నాము. దీనికి ముందే శరీరంలో మనం నివశించేటటువంటి విషయం అంటే మనం ఎక్కడ నివశిస్తున్నాం? ఏ విధంగా తెలియక, అజ్ఞానస్థితిలో బ్రతికి పోయి, చనిపోయిన తరువాత కూడా ఏమి చేస్తున్నాం, ఒక వ్యక్తిని తీసుకొని పోయి

కట్ట కట్టి అక్కడ దాన్ని సమాధి అంటున్నాం. సమాధి అంటే ఏమిటి? అనే ప్రశ్న వేసినపుడు ప్రతి పదానికి ఒక అర్థము ఉంటుంది కదా!

ఇంతకు ముందు మనం చెప్పుకున్నాం జా పథకము. పథకము అంటే ముందే నిర్ణయింపబడినటువంటిది. అంతేకదా! ఇంగ్లీషులో, మనం ప్లాన్ అంటాము. జాతకము అను దానిని విశదీకరించుకొని చెప్పితే జా పథకము అని దీనికి ఈ అర్థము ఉందని మనం చెప్పుకున్నాము. అట్లాగానే సమాధి అంటే ఏమి అర్థము, అంటే 'ధీ' అంటే బుద్ధియని, సమాధి అంటే బుద్ధికి సమానమైనటువంటిది అని, బుద్ధికి సమమైనటువంటిది ఏది అంటే దేవుడని మనం తెలుసుకుంటే, అందరికి సమానంగా తెలుస్తాడు అనీ, అటువంటి దేవున్ని తెలుసుకొనేటువంటి స్థితిలో ఉండడమే సమాధి. కొంతమంది కళ్లుమూసుకొని కూర్చుంటే సమాధిలో కూర్చొన్నాము అంటారు. ఇంకా కొంతమంది పూడ్చిన తరువాత సమాధి అంటున్నారు. సరే, కళ్ళు మూసుకొని కూర్చొన్న వ్యక్తి సమాధిని తరువాత విచారిస్తాము. మనము, కానీ పూడ్చి పెట్టిన తరువాత సమాధి అనడం సమంజసమా అని అంటే బుద్ధివుంటే కదా! సమము అయ్యేది ఏదైనాగానీ మనిషి చనిపోయిన తరువాత బుద్ధి ఉండదు. నువ్వే లేవు బుద్ధి అంతకు లేదు సమాధి ఎట్లా అవుతుంది. సరే ఒక లెక్కలో చనిపోయినా తరువాత కట్టలుకట్టి దానిని మనము సమాధి అనడంలో ఇది ఆ పదానికి, ఆ అర్థానికి సరిపోనటువంటిది. ఇంక కొంతమంది ఏమి చెప్పుతున్నారంటే సమాధి అంటే సమము అయినటువంటిది. బుద్ధికి సమము అయినటువంటిది. ఇదంతా ఏమీ లేదుకాని, ఇవన్నీ మీరు మధ్యలో చెప్పుకున్నట్టి అర్థాలు, ఇదంతా ఏమీ లేదు పూడ్చిపెట్టి కనిపించకోకుండా చేస్తున్నామో అది కనిపించకోకుండా పోతుంది కదా!

శరీరములో ధ్యానమును సమాధి అంటున్నాము. చనిపోయిన తర్వాత పూడ్చిపెట్టిన దానిని సమాధి అంటున్నాము సరే పూడ్చిపెట్టిన దానిని సమాధి అనే దానికి ఆ పదంలో అటు సమాధి అనే పదములో ఈ పదము వద్దులే ఈ అర్థము వద్దు 'ధి' అంటే బుద్ధియని, 'సమాధి' బుద్ధికి సమము అయిన పదాన్ని వదిలేసి చూస్తే, సమాధి ఉండేది, కాదు క్రింద ధి కి పొక్కిలి ఉండేది కాదు అన్నమాట. సమ ఆది సమ+ఆది సమాది అయింది. ధి అనేది లేదు. సమాది పోయి సమాధి అయింది. జా పథకము అనే పదం ఎట్లాయితే జాతకం అయిందో, ఇక్కడ అక్షరమే కొట్టుకొని పోయింది కదా! అక్కడ పొల్లు వచ్చి కరుచుకుంది. ఆ విధంగా చాలా మన పదాలలో మార్పులు జరిగినాయి కాలక్రమములో అని చెప్పాము. మనము ఈ రకంగా వాస్తవంగా లెక్కేసుకుంటే ఆ పదము ఎటువంటిది, పూర్వము ఎట్లువుండేది అంటే సమ+ఆది సమాది. సమాధి అంటే ఆదిలో నుంచి సమంగా వర్తించేది. మీకు ఎప్పుడైతే సృష్టి ప్రారంభమైందో, సృష్టి ప్రారంభమైనప్పటి నుండి సమానంగా ఉంది. అందరికి దానిని సమాధి అంటున్నాము. ఇప్పుడు సమాధి నీకా, నీ శరీరానికా అంటే శరీరాన్ని ఒకడు పూడ్చి పెడతాడు. ఒకడు గంధపు చెక్కలు వేసి కాలుస్తాడు, ఒకడు ఇంకోటి చేస్తాడు ఇంకోటి చేస్తాడు. అది ఎక్కడా సమంగా లేదు. శరీరానికి చేసే పనులు సమంగా ఎక్కడా లేవు. అది సమాధి కాదు. పూర్వం నుండి సమానంగా ఉండేటువంటి పద్ధతులు లేవు శరీరానికి, కాబట్టి ప్రకృతితో కూడినట్టి శరీరానికి ఈ పదం వర్తించదు. ఎవరికి వర్తిస్తుంది. అంటే ఎల్లకాలం ఉండేటువంటి జీవాత్మకు వర్తించేటువంటి పదం, కానీ ఇది చైతన్యం లేనటువంటి శరీరానికి వర్తించేటటువంటి పదం కాదు అని మనకు తెలుస్తుంది.

ఈ సమాధి అనేది మీకు ఇప్పుడు కొత్త పదంగా ఉంటుంది. ఇంతకు ముందు చాలా విషయాలు చెప్పుకున్నాము. ఇప్పుడు ఈ చర్చలో మీకు సమాధి అనేది కొత్త చర్చ అవుతుంది అన్నమాట. ఇప్పుడు సృష్టి ఆది నుండి సమంగా ఉండేది ఏది వుంది అని మనము లెక్కేసుకొని చూస్తే, చనిపోయినపుడు ఉందా సమాధి? పుట్టినపుడు ఉందా మనిషికి? అంటే చనిపోయినపుడు సమాధి అనేది ఎవరికీ వర్తించదు. ఎందుకు వర్తించదు అంటే, అది శరీరాన్ని పూడ్చి పెట్టినటువంటిదే గాని జీవున్ని పూడ్చి పెట్టినేది కాదు. జీవుడు ఎక్కడా కనిపించడు, దొరకడు అర్థమయిందా! మళ్ళా ఈ సమాధి అనేటటువంటి పదం అన్ని మతాలలో ఉంది. కానీ అన్ని మతాలలోను ఒకే భావంతో ఉంది. ఏ భావము చనిపోయినపుడు పూడ్చిపెట్టే దానినే సమాధి అంటున్నాము అనేది మాత్రము, అందరికి నూటికి నూరుపాళ్ళు తెలుసు. సరే ఎవరినో ఒకరిని పూడ్చిపెట్టి అతను గొప్ప వ్యక్తి అయితే అతనిని అప్పుడప్పుడు పూజించడం గానీ, ప్రతి నిత్యం పూజించడంగాని జరుగుతావుంది.

ఆ రకంగా సమాధికి పూజ చేయడం కూడా ఉంది అంటున్నారు. కానీ ఇప్పుడు ఈ అర్థం తీసుకుంటే ఆది నుంచి సమంగా ఉండేది అని అర్థము తీసుకుంటే, ఆది నుండి సమానంగా ఉండేది కానేకాదు. ఎందుకంటే ఒక జన్మలో చనిపోతే ఒకచోట పూడ్చుతారు. ఇంకొక జన్మలో చనిపోతే ఇంకొకచోట పూడ్చుతారు. ఇంకొక జన్మలో చనిపోతే వాడు కుక్కగానో, నక్కగానో పుడితే వానిని ఈడ్చి పారేస్తారు. వానిని పూడ్చేది ఏమీ ఉండదు. ఇట్లా ఒక్కొక్క జన్మలో ఒక్కొక్క రకంగా ఉంటుంది. ఒక జన్మలో కాలిపోవచ్చు. బూడిద అయిపోవచ్చు. ఒక జన్మలో గుంతలో పెట్టి పూడ్చవచ్చు. ఈ రకంగా లెక్కేసుకుంటే సమంగా ఏ జన్మలోను లేదు కాబట్టి అది సమాధి

అనేదానికి అవకాశం లేనే లేదు. ఇంక సమాధి అనే పదం ఎక్కడనుంచి వచ్చింది మనకు అంటే, ఆది నుంచి సమంగా నీకు వర్తించేటువంటిది అని లెక్కేసుకొని చూస్తే, ఇప్పుడు దానిని అర్థము చేసుకొనే దానికంటే ముందు, శరీరంలో నేను ఒకన్ని ఉన్నాను అనే జ్ఞాపకం చేసుకోవాలి. ఎందుకంటే పునాది లేకుండా మిద్దెకడితే ఏ రకంగా ఉంటాదో దాని మూలంగా ఆరకంగా అయిపోతాది. నిన్ను నీవు తెలుసుకోకుండానే సమాధి విషయంలోకి పోయినాగానీ, అది చెప్పినాగాని మనిషికి అర్థంకాదు. అందువలనే మీకు రాబోయే నెలలో **"సమాధి"** అనే గ్రంథము అందించబో తున్నాము. ఆ సమాధి అనే గ్రంథములో పూర్తి సమాచారము ఉంటుంది. దాని గురించి ఇప్పుడు పునర్జన్మ రహస్యం ఏ విధంగా ఉందో, సమాధి అనేది కూడా ఆ రకంగా రహస్యంగానే ఉంటుంది.

మీకు ఆ విషయం కూడా పూర్తి తెలుస్తుంది. ఇప్పుడు దానికంటే మందు తెల్సుకొండేది ఏమంటే శరీరంలో మనము నివాసము చేస్తున్నాము. కొంత కాలమే నివాసము చేస్తాము. కొంతకాలము అయిన తరువాత ఈ శరీరాన్ని వదిలిపెట్టి పోవాల్సిన పని వస్తుంది. మనము ఎక్కడికిపోతాము అని ప్రశ్న వేసుకొని చూస్తే జవాబు లేదు. సరే చనిపోయిన తరువాత ఎక్కడికి పోయేది నీకు తెలియదు కాని ఒకవేళ జరుగబోయేది మనకు ఎట్లా తెలుస్తుంది. జరిగినది అయితే మేము చెప్పుతాము, జరగబోయేదాని గురించి ఎట్లా చెప్పేదానికి అవుతుంది? అని అనుకున్నాగానీ జరిగిండేదాని గురించి మనం ఆలోచన చేస్తే నీవు ఎక్కడి నుంచి వచ్చినావు. నీవు పుట్టినావు కదా! నీవు ఎక్కడ నుంచి వచ్చి పుట్టినావు అని ప్రశ్న వేసుకొని చూస్తే, ఇది జరిగిన విషయమేకాని, ఎక్కడి నుంచి వచ్చినావు అనే విషయం కూడా ఎవరికీ తెలియదు. ఎక్కడి నుంచి వచ్చినది తెలియదు ఎక్కడికి పోయేది

తెలియదు. మధ్యలో మాత్రము గుర్తుకు ఉంది. ఈ మతికి కూడా ఎప్పటి నుంచి వుంది 4, 5 సంవత్సరాల నుంచి 5, 6 సంవత్సరాలు నుంచి 1 వ సంవత్సరం నీకు మతికి ఉందా! పుట్టినపుడు నెలకు మతికి ఉందా ఏమి జరిగిండేది. మతికి లేదు జ్ఞాపకం లేదు. ఒక సంవత్సరం వరకు జ్ఞాపకం లేదు. లేదు తెలివైన వాళ్ళంటే 2 సంవత్సరాల నుండి జ్ఞాపకం ఉంటుంది. లేదు కొంచెం మొద్దు వాళ్ళు అయితే ఏమయితుంది. 4, 5 సంవత్సరాల నుండి జ్ఞాపకం ఉంటుంది. ఇంకా కొంతమందికి అయితే 7, 8 సంవత్సరాల నుండి జ్ఞాపకం ఉంటుంది. సరే ఎప్పటినుంచో ఒకప్పటినుంచి జ్ఞాపకం ఉంది. మధ్యలో వచ్చిన జ్ఞాపకమే ఇది. ఇప్పుడు చనిపోయేంతవరకు ఉంటుంది. అది నేను ఫలానా వ్యక్తిని అని జ్ఞాపకం ఉంది అంతే. చిన్న పిల్లప్పుడు కూడా నేను ఫలానా వ్యక్తిని అని తెలియదు, కానీ కొంతకాలం వచ్చిన తరువాత వ్యక్తిత్వం వచ్చిన తరువాత నేను ఫలానా వ్యక్తిని అనుకుంటున్నావు.

ఆ రకంగా చెలామణి అవుతున్నావు. ఎక్కడ నుంచి వచ్చినది కానీ, ఎక్కడ నుంచి పోయినది కానీ మనకు తెలియదు. ఒక సందర్భంలో భగవద్గీతలో కృష్ణుడు అర్జునుడితో చెప్పుచూ "బహూనిమే వ్యతీతాని జన్మాని తవచార్జున" అన్నాడు, నాకు ఎన్నో జన్మలు కల్గినాయి. నీకు కూడా అట్లే ఎన్నో కల్గినాయి. కాని "తాన్యహం వేద సర్వాణి" అన్నాడు. అన్ని నాకు తెలుసు ఎప్పుడు ఎక్కడ పుట్టినది ఏం జరిగినది. అవన్నీ నాకు జ్ఞాపకం ఉన్నాయి, ఎప్పుడు ఏం జరిగినది నాకు జ్ఞాపకం వుంది."నత్వం వేత్త" నీకు ఏమాత్రం తెలియదు. తెలుసునా! మీకు తెలుసునా! నాకు కూడా తెలియదులే, మరి కృష్ణుడు నాకు తెలుసు అన్నాడు. మీకు తెలియదు అన్నాడు. కాబట్టి మీరు అనే దానిలో మనము కూడా వ్యక్తులమే, మనకు

కూడా ఏమాత్రము ఎవ్వరికీ తెలియదు. మరి కృష్ణుడుకి మాత్రమే తెలిసి మనకు ఎందుకు తెలియకుండా పోయినది? ఆయనకు తెలిసిన తరువాత మనకు ఎందుకు తెలియకుండాపోయినది. అప్పుడే ఆయనను దేవుడు అనేది, మిగతా సమయములో అల్లరివాడు అనేది, చూడండి ఎట్లుందో? అవసరమైనపుడు ఇట్లానే అడుగుతాను. ఆయన మనలాంటి మనిషే, కాళ్ళు, చేతులు, అన్నీ ఉన్న మనలాంటి మనిషే, మనకు ఏదైతే ఏ పద్ధతి అయితే శరీరంలో ఉందో అదే పద్ధతి ఆయనకు కూడా ఉంది. ఆయనకు జ్ఞాపకం ఉండే శక్తి ఉంది. మనకు జ్ఞాపకం ఉంటే శక్తి లేదు. జ్ఞాపకము ఆయనకు ఎందుకు ఉంది, మనకు ఎందుకు లేదు అంటే, నేను ఫలానా జీవున్ని నా శరీరములో ఇంకొక ఆత్మ వుంది అదే నడుపుతుందనే జ్ఞానం ఆయనకు తెలుసు. కానీ జీవున్ని అనే జ్ఞాపకం మనకు లేదు. నేనే శరీరాన్ని నడుపుతున్నా, శరీరానికి అంతా నేనే పెద్దవాడిని, శరీరం మొత్తము నేనే అంటున్నాము.

ఇంతకు ముందు చెప్పినాను, ఈ గ్రంథంలో మీరు చదివితే చివరిలో ఒక విషయం ఉంది. ఏ విషయం అంటే, ఒకరు ప్రశ్నించారు అన్నమాట "మీరు గ్రంథంలో, ఫలానా ప్రశ్న మీకు రావచ్చు, మీరు అడగవచ్చు అన్నపుడు మాకు 5, 6 మందికి ప్రశ్న రావచ్చు, అప్పుడు మీరు అనడం సమంజసమే కానీ మేము చెప్పుతున్నాము మా జవాబు ఏమనగా అని మీరు వ్రాస్తూ ఉన్నారు. మీ జవాబు అంటే మీరు ఏకవచనంగా చెప్పుకోవాలి, కానీ ప్రతిచోట బహువచనంగా చెప్పుకుంటారు. నన్ను మీరు అడిగితే అని అంటారు మళ్ళీ ఒకచోట ఏకవచనంగా చెప్పుకుంటారు. ఎక్కువచోట్ల అంతా బహువచనంగా చెప్పుకుంటారు. మీరు బహువచనం చెప్పుకోవడం దేనికి? అని అడిగినారు. ఆ విషయం ఇంతకు ముందు కూడా చెప్పినట్లు

నాకు జ్ఞాపకం ఉంది. దానికి జవాబు ఏమి వ్రాసినాము అంటే, నేను జీవున్ని నేను ఎప్పుడు మీ మాదిరి జ్ఞాపకం లేకుండా ప్రవర్తించలేదు. నేను ప్రపంచ జ్ఞాపకం పెట్టుకోను. నేను కళ్ళ అద్దాల వెనుక వున్నానని, ఈ కంటి వెనుకవున్నానని నేను జ్ఞాపకంతో ప్రవర్తిస్తున్నాను. ఇక్కడి నుండి మిమ్ములను చూస్తున్నాను అనుకుంటున్నాను వెనుక నుండి చూస్తూ ఉన్నాను. తల లోపలి నుండి మిమ్మలను చూస్తూ ఉన్నాను గాని, ఈ కళ్ళ దగ్గర నుంచి చూడడం లేదు.

మిగతా ప్రజలకు మొత్తము శరీరాన్ని మరచిపోయి వేరే ధ్యాస ఉంటుంది. కాని అట్లా కాకుండా నన్ను నేను ఎరుకలో పెట్టుకొని, నేను ఏమి చేస్తున్నానని ధ్యాస నా మీద పెట్టుకొని, నాకు ఎంత స్థోమత వుంది అనే ధ్యాస పెట్టుకొని, నా స్థోమత నాకు తెలిసి బ్రతుకుతున్నాను కాబట్టి 'మేము చెప్పుతున్నది ఏమనగా' అని వ్రాశాము. మేము చెప్పుతున్నది ఏమంటే చెప్పేది రహస్యమే కానీ నేను ఒకన్ని కాదు చెప్పేది. ఇద్దరం కలిసి చెప్పుతున్నాము. మేము ఒకరు చెప్పలేదు అంటే నా వెనుక ఇంకొకడు వున్నాడు, వాడు నేను ఇద్దరు కలిసి చెప్పుతున్నాము కాబట్టి 'మేము చెప్పుతున్నది ఏమనగా' అని వ్రాస్తున్నాను గానీ 'నేను చెప్పునది ఏమనగా' అని ఎప్పుడూ వ్రాయలేదు. ఎందుకంటే నాకు విషయం తెలియదు కదా! నేను స్వయంగా ఒక్కన్ని చెప్పలేదు, శరీరం మొత్తానికి అధిపతి ఒకడు వున్నాడు. అతన్నే ఆత్మ అని అంటున్నాము మనము. జీవాత్మ ఒక్కచోట ఉన్నాడు. శరీరం అంతా ఆక్రమించి ఉండేటటువంటి వాడు ఒకడు వున్నాడు. శరీరాన్ని కదిలించేవాడు, మాట్లాడించేవాడు, మిమ్మల్ని బెదిరించే వాడు, ప్రతి పని చేయించేది వాడే! మనకు తెలిసిన పనులు కూడా అతని (ఆత్మ) వలనే జరుగుతున్నాయి. తెలియకుండా జరిగే పనులు కూడా అతని ఆత్మ

వలనే జరుగుతున్నాయి. తెలియకుండా జరిగే పనులు చాలా వున్నాయి. శరీరంలో ఆహారం జీర్ణమవుతుంది. ఊపిరి తిత్తులు కదులుతుంటే శ్వాస కదులుతుంది. గుండెకొట్టుకొని రక్తము ప్రసరింపబడుతావుంది. ప్రతి అణువణువులోను, ప్రతి ధాతు కణములోను మనకు తెలియకుండా ఎన్నో జరుగుతున్నాయి.

ఆ పనులు అన్నీ ఎవరు చేస్తున్నారు? నీ శరీరంలో ఉండే ఆత్మ చేస్తూ ఉంది. అర్థమయిందా! మళ్లీ నీవు ఏమి చేస్తున్నావు అంటే, నాకు కన్ను లేదు, కన్ను చూపిస్తే ఫలానిది అని దృశ్యం తెలుస్తూ ఉంది. వాస్తవంగా నేను గ్రుడ్డివానిని, కళ్ళు మూసుకున్నామనుకోండి, బయటి విషయం ఏమీ తెలియదు. కన్ను ఉంటే తెలుస్తుంది. ఆ రకంగానే, అన్ని రకాల గ్రుడ్డివాడు అయిన జీవునికి బయటి నుండి ఐదు భాగములుగా యున్న ఐదు జ్ఞానేంద్రియాలు ప్రపంచ జ్ఞానాన్ని తెలియజేస్తూ ఉంటే, ఈ ప్రపంచజ్ఞానం తెలుస్తూవుంది. లేకపోతే జీవునిగా ఉన్నటువంటి నాకు ఏమీ తెలియదు. మరి ఏమీ తెలియనివానివి ఈ నిర్ణయాలు అన్నీ ఎలా తీసుకుంటున్నావు, ఎలా చేయగల్గుతున్నావు. ఇన్ని పనులు ఎలా జరుగుతున్నాయి అని అడిగితే దానికి జవాబు ఇట్లు కలదు. ప్రతి మనిషి ఎన్నో పనులు చేస్తున్నాడు కదా! అనే ప్రశ్న వస్తే, మనిషిలో ఉండేటువంటి జీవాత్మ, ఏ పనీ చేయలేదు. ఆ శరీరములో ఉండేటటువంటి ఆత్మ అన్ని పనులు చేస్తూవుంటే, అన్నిటినీ నేను చేసినాను అని జీవుడు అనుకుంటున్నాడు. అది పెద్ద పొరపాటు. నీకు ఏమీ తెలియదు ఒక వాక్యం వ్రాశాము అక్కడ “నీకు ఏమీ తెలియదు, ఏమీ తెలియదు అనేది అసలుకు తెలియదు. ఏమీ తెలియదు అనే విషయం మొత్తానికే తెలియదు. కాబట్టి నాకు అన్నీ తెలుసు అని అనుకుంటున్నావు, నీకు ఏమీ తెలియదు అనే విషయం ఏమాత్రము తెలియదు” అని వ్రాసినాము

కదా! అది తెలియని దానివలన ఎవరు ఎన్ని చెప్పినాగానీ, వాస్తవం చెప్పినా గానీ నమ్మరు అన్నమాట. అన్నీ నాకు తెలుసుకదా! అని అనుకుంటారు.

కానీ తెలియని సత్యము కలదు. అది ఏమంటే మీ శరీరంలో ఉండేటటువంటి ఆత్మ మీ శరీరంలో ప్రతి చైతన్యాన్ని ఇచ్చి కదలిక ఇచ్చి కదిలిస్తూవుంది. సరే మీ ఆత్మ కదిలిస్తూ ఉంది కదా! నేను ఏమి చేయలేదు కదా! వేరే వానిని పోయి కొట్టినాను, అంటే నేను ఎందుకు కొట్టినాను? ఆత్మ కొట్టిందా అంటే ఆత్మ కొట్టింది. నేను కొట్టినాను అని ఎందుకు నీవు అనుకుంటున్నావు? కేవలం నీవు ఏమీ చేయనటువంటి వానివి అనుకోవాలి. మొట్ట మొదటనే చెప్పినాము, సుఖాన్ని దుఃఖాన్ని అనుభవించే దానికి జీవుడు శరీరంలో ఉండేది. వాడు ఏ పనీ చేయలేదు, పొరపాటుగా నేను చేసినాను అనుకుంటున్నాడు కాబట్టి పాపం, పుణ్యం వస్తుంది అర్జునా! అని భగవద్గీతలో దేవుడు చెప్పాడు. నీవు అట్లా అనుకుంటున్నావు కాబట్టి వస్తావుంది, ఈ చచ్చిపోయే దుర్యోధనుడుగానీ, దుశ్యాసనుడుగానీ, భీష్మడు గాని మొత్తం చచ్చిపోతారు. నీ చేతులో చచ్చిపోయేది ఉంది, 'జా' పథకంలో పథకం లేదా ప్లాన్ ప్రకారం జరుగుతుంది. ముందే చూపించాడు ఇట్లా జరుగుతుందని, ఇంతమందిని చంపితే నాకు పాపం వస్తుందని నీవు అనుకుంటున్నావు, నీవు చంపితే వస్తుంది, కానీ అసలుకు నీవు చంపలేదు. వాళ్ళు కాలంలో చచ్చిపోయేది రూలువుంది, రూలు ప్రకారము చచ్చిపోతారు, నేను చంపుతా అని నువ్వు ఎందుకు అనుకోవాలి? అది పెద్ద పొరపాటు! నువ్వు ఇంతేవున్నావు, నీవు ఏమీ చేయలేదు అని భగవద్గీతలో దేవుడు చెప్పాడు. వివరంగా చెబితే భగవద్గీతలో కృష్ణుడు చెప్పినది "నీవు ఉండేది రవ్వంతే! నీవు ఏమీ చేయలేదు, చేయించేవాడంతా వేరేవాడు చేయిస్తూ ఉన్నాడు. నీ శరీరము బొమ్మ మాదిరి ఆడుతా ఉంది, బొమ్మను ఆడించినట్లు

ఆడించేవాడు ఒకడువున్నాడు. నువ్వు జరిగే పనిలో కష్టాన్ని సుఖాన్ని మాత్రమే అనుభవిస్తున్నావు, అంతే తప్ప ఇంకోటి ఏమీ లేదు. నేను చేస్తూవున్నాను అనుకోవడమే పెద్ద పొరపాటు. నేను చేస్తూవున్నానని భీష్ముడినో, దుర్యోధనుడినో ఎవరినో ఒకరిని చంపినావు అనుకో. అపుడు నీకు పాపమే! వస్తుంది. చేయని పనులు నీవు నెత్తిన వేసుకున్నట్లే! ఎవడో బజారులో ఎవరినో ఖూనీచేస్తే, కోర్టులో నేనే చేసినాను అని ఒప్పుకొన్నట్లు ఉంటుంది. అంతే కదా! నేను గొప్పవాడిని అనిపించుకోవడానికి హత్య చేసినాను అని ఒప్పుకొన్నట్లుంది నీవు చేసినావు అంటే నీకే శిక్ష అంతే కదా!

ఆ విధంగా తెలివి తక్కువగా, తెలియనితనంలో చెయ్యని పనిని నీనెత్తిన వేసుకుంటున్నావు. వాస్తవంగా శరీరంలో ఏది జరగలేదు, అంటే నీ వల్ల జరగలేదు. జరిగేది జరుగుతూవుంది. వాస్తవమే, ఈ తతంగమంతా జరిపించేవాడు ఎవడు? నీ హితుడు! నీ స్నేహితుడు!! నీ పొరుగువాడు!! అంటే నీ ప్రక్కన ఉండేవాడు అనే విషయాన్ని పూర్తి మరచి పోయినావు, నీలో ఒకడు ఉన్నాడనే విషయాన్ని పూర్తి మర్చిపోయినావు. నీలో ఒకడు ఉన్నాడు వాడే ఆత్మ, వాడే నీ హితుడు, వాడే నీ స్నేహితుడు మేము అదే విషయాన్ని వ్రాశాము. ఈ గ్రంథములో కూడా హితుడు, స్నేహితుడు, పొరుగువాడు అనే విషయం అన్నీ వ్రాశాము. చిన్న గ్రంథములో ఇవన్నీ ఉన్నాయి. కానీ ఈ గ్రంథము యొక్క ప్రత్యేకత ఏమి అంటే, ఇంతవరకు మీరు చదివిన గ్రంథాలలో గానీ ఇతను చెప్పినటువంటి ఉపన్యాసాలలోగానీ ఆత్మ ఒకటుంది. అని మేము చెప్పుతూవచ్చాము, మీకు ఎంత వరకు అర్థమయిందో గానీ ఇప్పుడు ఈ గ్రంథం మాత్రం ఆత్మకు చాలా దగ్గరగా తీసుకుపోయి చూపిస్తుంది. ఈ గ్రంథములోని సమాచారమంతా ఆత్మను

దగ్గరగా తీసుకొచ్చి చూపిస్తుంది మీకు, తెలియని రహస్యాలు కూడా తెలియజేస్తుంది. ఇంతవరకు నమ్మని విషయాన్ని కరెక్ట్‌గా నమ్మేటట్లుగా, తెలిసేటట్లుగా చేస్తుంది. ఎందుకంటే ఆత్మ ఇన్ని పనులు చేస్తూ ఉంది అని తెలియజేయడం కోసమే ఇంత లోతుగా వ్రాశాము.

ఈ రకంగా ఈ గ్రంథములోని సారాంశాన్ని తెలుసుకుంటే మీకు ఆత్మ చాలా దగ్గరగా అర్థమవుతుంది. ఇంతవరకు తెలియని రహస్యమంతా మీకు తెలుస్తుంది. కొంతమందికి తెలుసు ఆత్మ ఉందని మీరు కొన్ని సంవత్సరాలుగా ఇక్కడ వింటున్నారు. తరువాత కొన్ని ప్రత్యక్ష ప్రమాణాలు కూడా మీకు అర్థమయినాయి. కానీ ఆత్మ ఒకటుంది అని తెలియని వాళ్ళు అన్నీ నేనే అనుకుంటున్నారు కదా! వాళ్ళు కొత్తలో, కొత్తగా ఈ జ్ఞానం తెలియని వారు ఉంటారు. వాళ్ళంతా నేను అనుకుంటుంటారు. వాళ్ళు ఈ గ్రంథము చదివితే కూడా అందులో ఏమి తెలుస్తుంది. నేను కాకుండా నా శరీరాన్ని నడిపేవాడు, నిర్ణయాలు తీసుకొనేవాడు, ఈ పనులన్నీ చేయించే వాడు ఒకడువున్నాడు. అందుకనే నేను ఎవరినీ చెడ్డ వాడు అనడం లేదు, ఎవరినీ మంచివాడు అనడంలేదు. ఒకడు దొంగతనం చేస్తే వానిని ఏమంటున్నాము, వాని కర్మ ప్రకారం వానికి జరగాల్సింది జరిగింది అంటాముగానీ వాడు చెడ్డవాడు అని మనం ఎప్పుడూ చెప్పలేదు, మంచి పనులు చేసేవాడని మంచివాడు అని ఎప్పుడూ అనలేదు నేను. మంచివానిని మంచివాడు అనలేదు. చెడ్డవానిని చెడ్డవాడు అని అనలేదు. ఎందుకంటే మంచివాడు కాదు, వాస్తవంగా వాడు గ్రుడ్డివాడు. వానిని మంచివాడు, చెడ్డవాడు అని మనం ఎందుకు అనాలి? చేయించేవాడు ఎవడో జీవునితో చేయిస్తే, చేయించిన వానిని మంచోడు, చెడ్డోడు అనాలి గానీ, యాంత్రికముగా చేసినవానిని మంచి చెడు అని చెప్పడము తప్పగును.

ఇప్పుడు ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిని హత్య చేస్తే వానిని ఖూనీకోరు అనడం పెద్దపొరపాటు. ఎందుకంటే నీకు పైకి వీడే కనిపిస్తున్నాడు, లోపల వుండే ఆత్మ కనిపించలేదు. జ్ఞానం ప్రకారం చూడడం లేదు, అజ్ఞానం ప్రకారం పై చూపుతో చూస్తున్నావు కనిపించే వ్యక్తి కనిపిస్తావున్నాడు, అతను కూడా నేనే హత్య చేశాను, నేనే ఖూనీ చేశాను అని అనుకున్నా ఫర్వా లేదు. ఎందుకంటే అతను తెలియని అజ్ఞాని. నీవు తెలిసిన జ్ఞానివైతే అతనిని ఖూనీకోరు అనడం చాలా పొరపాటు కాదా! ఇదే విషయాన్ని భగవద్గీతలో దేవుడు ఏం చెబుతాడు "లోకమున చంపునతడు" లోకములో ఉండేటటువంటి వాళ్ళనందరినీ చంపినా గానీ, వాడు హంతకుడు కాదు, హత్యా పాపము వానికి అంటదు. వాడు హంతకుడు కాడు. చంపినోడు హంతకుడు కాదట, ఇది ఏమి రూలు! అది జ్ఞానం రూలు అట్లాంటిది. ఎందుకంటే చంపినోడు నువ్వు అనుకుంటే నువ్వే అవుతావు కానీ, దేవుడు ఏమి చెప్పుతున్నాడు. నీవు కాదు చంపినోడు ఇంకొకడు వున్నాడు. వాడు చంపినాడు కాబట్టి నీవు (జీవాత్మ) హంతకుడు కాదు. వాడు (ఆత్మ) హంతకుడు నీకు పాపము రాదు. అంటే వానికి వస్తుంది పాపము. వానికి తెలుసు, పాపము ఎట్లాంటిదో, అది కాలిపోయే విధానము ఏదో! కాబట్టి నీకు ఏ పాపము అంటదు. తామరాకు మీద నీటి చుక్క వున్నప్పటికైనా గానీ దానికి తేమ ఏ విధంగా అంటదో, ఆ విధంగా నీవు శరీరంలో అహము లేకుండా ప్రవర్తించు. నీకే పాపమూ అంటదు. ఇప్పుడు అంతే కదా! చంపుకొనే దగ్గర వచ్చింది ఈ సమస్య మనకు, అర్జునుడు వానిని చంపితే పాపము వస్తాది కదా! అని అనుకున్నాడు.

మొత్తం భూమి కొరకు ఇంతమంది బంధువులను చంపితే ఎంత గందరగోళము? ఇదంతా చాలా పాపము సంపాదించుకున్నట్లు అవుతుంది,

నాకు యుద్ధం వద్దంటే కృష్ణుడు చంపమన్నాడు. జ్ఞానం తెలిసినవాడు చంపమని చెప్పుతాడా? ఖూనీ చేయమని చెప్పుతాడా? కానీ కృష్ణుడు చంపమనే చెప్పినాడు, ఏమని? చూడండి బోధ ఎట్లుందో! భగవద్గీతలో బోధ! అంటే మనము అర్థము చేసుకుంటే జ్ఞానము అవుతుంది. అర్థము చేసుకోకపోతే అజ్ఞానం అవుతుంది. అందుకని నీవు అర్థము చేసుకొనే స్థోమతను బట్టి ఉంటుంది. అక్కడ ఏమవుతుంది అంటే ఇదే కాదు, నీవు పుట్టినప్పటి నుండి చనిపోయేంత వరకు జీవితంలో ఎన్నో మంచి పనులు చేస్తున్నావు, ఎన్నో చెడ్డ పనులు చేస్తున్నావు. ఆ పనులలో పాపము వస్తావుంది. పుణ్యం వస్తావుంది. ఒక్కోసారి ఇంకా భయంకరమైన పాపము వస్తావుంది. ఆ పాపాన్ని గాని, ఏ పాపాన్ని గానీ తప్పించుకొనేటటువంటి విధానము ఒకటి ఉంది అని, ఆ విధానాన్నే భగవద్గీతలో కృష్ణుడు చూపించాడు.

ఆ విధానం ప్రకారం యుద్ధం చేయి, ఏ పాపం రాదు అని చెప్పినాడు. ఆ విధానం ప్రకారం ప్రపంచములో నీవు బ్రతకవలసిన అవసరం ఉంది. ఆ పద్ధతి ప్రకారం యుద్ధం చేయి అని చెప్పినాడు. యుద్ధం అర్జునునికే అవసరము కాబట్టి యుద్ధం చేయమని చెప్పాడు. మనకు యుద్ధం అవసరం లేదు. కానీ మనము ప్రపంచములో బ్రతుకుతున్నాము. బ్రతుకుతెరువులో కూడా పాపాలు వస్తున్నాయి. కాబట్టి నీవు ఆ పద్ధతి తెలిసి బ్రతికితే అప్పుడు ఏమౌతుంది. ఏ పాపం నిన్ను అంటదు. ఈ పద్ధతి అంతా తెలిసినపుడు శరీరంలో నీవు ఎవరు అనేది నీకే తెలిసిపోతుంది. శరీరంలో నీ స్థోమత ఎంత అనేది తెలిసిపోతుంది కదా! అపుడు అలా తెలిసిపోయినపుడు, చనిపోయినపుడు ఎవరు చనిపోతున్నారు నీ శరీరరం చనిపోతుందా! నీవు చనిపోతున్నావా అనేది కూడా తెలిసిపోతుంది కదా! కాబట్టి నీవు చనిపోలేదని శరీరము మాత్రము చనిపోతున్నదని అర్థమవు తుంది.

నీ శరీరం చనిపోతూవుంది. మనిషి ఒకేసారి పుడుతున్నాడు, ఒకేసారి పోతున్నాడు. అంటే పోతున్నాడు అంటే మోక్షమునకు పోతున్నాడు, సృష్ఠి ఆదిలో నీవు పుట్టావు, మోక్షములో లేకుండా పోతావు. అర్థమయిందా! అంతవరకు నీవు ఉంటావు. మధ్యలో నీవు తప్పించుకోవాలి అంటే నీవు జ్ఞానం తెలుసుకో! జ్ఞానం తెలుసుకోలేదు అనుకోండి తరువాత సృష్ఠి ఆది నుండి ఎప్పటికీ ఉంటావు. మనిషి ఒకేసారి జన్మిస్తున్నాడు. మనిషి సృష్ఠి ఆదిలో జన్మిస్తున్నాడు. సృష్ఠి ఆదిలో, దేవుడు పుట్టించినాడు చూడు అపుడు నీవు పుట్టావు, మరలా నీవు పుట్టలేదు. మరలా పునర్జన్మలు వస్తున్నాయి. శరీరాలు మారుతున్నావు, అంతే తప్ప నీవు అసలుకు చనిపోలేదు. నీ శరీరం చనిపోతూవుంది. నీవు అట్లే ఉన్నావు. అక్కడి నుంచి ఇంకొక దానిలోకి పోతున్నావు. తరువాత అక్కడ ప్రారంభమవుతూ ఉంది. ఇలా పునర్జన్మలు జరుగుతున్నాయి, అనేది అర్థంకావడానికి, ఈ గ్రంథం కవర్‌పేజీపై మేము ఏమి చేశామంటే మేమే స్వయంగా మా చేత్తో ఒక ఆర్ట్ వేశాము. ఇక్కడ చూడండి ఇక్కడికి నుంచి చిన్నగమొదలై ఇంతవరకు పెద్దగ వచ్చి, వీని మరణంలో అంత్యము అవుతుంది. మరలా పుట్టుకతో మొదలైవాడు పెద్దయి మరణం వరకు కాలంచక్రంలో తిరుగుతూనే ఉంటాడు. ఇంతకు ముందే చెప్పినాను రావణబ్రహ్మ కాలంలో, అంటే రావణుని కాలంలో మనము కూడా ఉన్నాము.

రామాయణంలో ఉన్న రామునికి, రావణబ్రహ్మకు. యుద్ధం జరిగినపుడు సైనికులుగా ఆ ప్రక్కనో నువ్వు ఈ ప్రక్కనో నేను వుంటాను. మరలా మనము ఇద్దరు కొట్లాడివుంటాము. కానీ మనకు జ్ఞాపకం లేదు అంతే! జ్ఞాపకం లేదు కాబట్టి అప్పటి నుండి ఉన్నాము, మరలా ఉన్నాము అనేది మర్చిపోయాము. తరువాత కురుక్షేత్ర యుద్ధంలో కూడా ఉండి

ఉంటాము. ఏ ప్రక్కనో ఓ ప్రక్కన ఉంటాము. మనము కూడా బ్రతుకుతెరువు కోసం అక్కడ పని చేసి ఉంటాము. ఇప్పుడు అక్కడ పుట్టి, ఇక్కడ పుట్టి, వెనుక ఎప్పుడో మనము 30, 40 సంవత్సరముల క్రితం పుట్టినాము అనుకోండి అప్పటి నుండి మాత్రమే మతికి ఉంది. వెయ్యి సంవత్సరముల క్రిందట కూడా ప్రపంచము ఉంది, మనమంతా ఉన్నాము కానీ ఏ శరీరంలో ఉన్నామో తెలియదు. మనము ఉన్నాము అని ఎట్లా గ్యారంటీ? ఇప్పటి నుంచే పుట్టాము అనుకుంటే సరిపోదా అని కొంతమంది ప్రశ్న వేయచ్చు. ఎట్లా గ్యారంటీ అంటే పుట్టిన తరువాత వెనుకటి జన్మ జ్ఞాపకము వచ్చింది. కొందరికి పుట్టిన తరువాత జ్ఞాపకము వచ్చి ఫలాన ఊరు, మా స్వంత ఊరు, ఫలాన వ్యక్తి నాకు భర్తగా ఉండేవాడు, ఫలానా వాళ్లు నాకు కొడుకులుగా ఉండేవాళ్ళు అని చెప్పినటువంటి వాళ్ళు ఉన్నారు.

చిన్న వయస్సులోనే 4, 5 సం॥లకే చెప్పడము జరిగింది. చెప్పితే ఇది వాస్తవమేనా! అని పరిశోధకులు పోయి పరిశీలన చేస్తే అది వాస్తవమే! అన్నీ సత్యాలే అయినాయి. వెనుకటి జన్మ జ్ఞాపకము వీళ్లకు వచ్చింది, కాబట్టి వెనుకటి జన్మలో వీళ్ళు ఉన్నారని తెలిసింది. ఒక జన్మలోన నీవు ఉన్నావనే విషయం నీకు తెలియబడింది. కాబట్టి అంటే వెనుకటి జన్మలు అందరికీ ఉన్నాయి అనే విషయము మన అందరికీ స్పష్టంగా నిరూపణకు వస్తావుంది. ఒక జన్మనేనా వెనుకటి జన్మ అంటే? అంతకు ముందు, కంటిన్యూగా పోతే చివరకు ఎక్కడకు పోతావు నీవు. సృష్ఠి ఆదిలోకి పోతావు. సృష్ఠి ఆది నుంచి ఉన్నావు. సబ్బులేని కాలములో కూడా మన్నురుద్దుకొని స్నానం చేసినావు. అంతేకదా! ఆకులు రుద్దుకొని స్నానం చేసివుంటావు. ఇప్పుడు సబ్బులు ఉన్న కాలములో లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానం చేస్తా ఉన్నావు. ఇంతే తేడా! అది శరీరానికి! కాలమార్పిడి అంతే. 65 సం॥

క్రితం ఒకటే సబ్బు ఉండేది. లైఫ్‌బాయ్ తప్ప ఇంకొకటి లేదు. ఇప్పుడు లక్స్ సబ్బుల నుంచి రకరకాల సబ్బులు వచ్చినాయి. అప్పుడు ఒకటే అగ్గిపెట్టె ఉండేది, సూర్యమార్కు అగ్గిపెట్టె తప్ప వేరెది లేదు. ఇప్పుడు చాలా వచ్చినాయి.

ఆ లెక్కలో అయితే కాలమార్పిడిలో ఎన్నోమార్పులు వచ్చినాగానీ, నీవు మాత్రము ఉన్నావు అనే విషయం నీకు స్పష్టంగా నిరూపణకు వచ్చింది. ఎట్లా? వెనుకటి జన్మ జ్ఞపకాలు వచ్చిన దానివలన! అందుకే పునర్జన్మ రహస్యములు అన్నీ దీనిలో వ్రాశాము. పోయిన జన్మలో జ్ఞాపకాలు ఎవరెవరికి వచ్చాయి? అవి ఎట్లా వాస్తవాలు? అని ఎట్లా పరిశీలనకు వచ్చాయి అనే విషయము కూడా మనకు ఈ గ్రంథములో తెలియబడింది. కల్పనాచావ్లా అనేటువంటి ఒక స్త్రీ పంజాబ్‌లో పుట్టి అమెరికాలో పెరిగింది. అమెరికాలోనే చదువుకుంది, అమెరికా అంతరిక్ష పరిశోధన కేంద్రము ఒకటి ఉంది 'నాసా' అని ఆ సంస్థలో పని చేసింది. పెద్ద హోదాలో ఉంది కాబట్టి అంతరిక్షంలో పరిశోధన చేసేదానికి ఆమె కూడా సెలెక్ట్ అయింది. విదేశస్థులు అంతా అన్ని దేశాల పెద్ద పెద్ద వ్యక్తులు, పెద్ద పెద్ద హోదాలు ఉండేటటువంటి ఇంజనీర్లు వీళ్ళంతా పరిశోధన చేసే దానికి సెలెక్ట్ అయినారు. 14, 15 మంది సెలెక్ట్ అయితే దానిలో ఈమె కూడా ఉంది. అంతరిక్షంలోకి ఈమె కూడా పోయింది. అంతరిక్షంలో అంతరిక్ష నౌకలో (పెద్ద రాకెట్లో) పోయిన తరువాత ఒక నెల రోజులు అక్కడ ఉండి పరిశోధనలు చేసి, మరలా తిరుగు ప్రయాణంలో వస్తున్నారు. తిరుగు ప్రయాణంలో వస్తున్నప్పుడు, భూమికి 16 నిమిషాలలో భూమి మీదకు వచ్చి దిగుతుంది అంతలో అది మధ్యలో పేలిపోయింది. అంటే భూమి వాతావరణంలోనికి వచ్చి పేలిపోయింది, భస్మీపటలం అయిపోయింది,

బూడిద అయిపోయింది. ఆ రాకెట్లో వాళ్ళు ముక్కలు ముక్కలు చిన్న బూడిదగా మారిపోయినారు. బూడిదగా మారి పొగమాదిరి కలిసిపోయినారు ఆకాశములో, అంటే అంత పెద్ద ప్రమాదం జరిగింది.

మొత్తము అక్కడికి పోయినవాళ్ళంతా చనిపోయినారు. ఎందుకు అట్లా ప్రేలిపోయిందో సరిగా తెలియలేదు. న్యూస్ పేపర్‌లో రాకెట్ ప్రేలి పోయినది చూశాము. తరువాత ప్రకటనలో ప్లేట్లు ఊడిపోయిన దానివలన ప్రేలిపోయింది అని చెప్పడము కూడా చూశాము. ఇప్పుడు ఆమె వెంటనే 10 రోజులకే ఇంకొక చోట పుట్టింది. 10 రోజులకే ఇదే పంజాబ్ రాష్ట్రములో పుట్టి, 3 సం॥లకే మాటలు వచ్చాయి. నేను ఫలానా కల్పనా చావ్లాను, అంతరిక్ష పరిశోధనలో పాల్గొని అక్కడ నుంచి వచ్చేటప్పుడు ఈ రకంగా ప్రమాదం జరిగింది. నేను ప్రమాదములో చనిపోయినాను అని మొత్తము అడ్రస్ అంతా చెప్పింది.

అప్పుడు విదేశీ విలేఖరులు విషయము తెలుసుకోవడానికి వచ్చినారు. ఎందుకంటే వాళ్లు నాసాకేంద్రము నుంచి పోయినవాళ్ళ సంబంధించి అడిగే దానికి వచ్చి ప్రశ్నలు వేస్తే అన్నిటికీ ఆమె జవాబులు చెప్పింది. ఆ రోజు ప్రమాదం ఎట్లా జరిగి చనిపోయినారు అంటే రాకెట్ పెద్ద మంచుగోళాన్ని ఢీ కొట్టిందని ఆమె చెప్పింది. మనము ఇంతకు ముందు **"దయ్యాల భూతాల యదార్థ సంఘటనలు"** అనే గ్రంథములో వ్రాశాము. ఎన్నో గోళాలు ఉన్నాయి మనకు తెలియకుండా అని, భూవాతావరణములో పెద్ద మంచుగోళం. ఉందని ఎవ్వరు కూడా చెప్పలేదు. ఆ రోజు కూడా ప్లేట్లు ఊడిపోయివుంటే చనిపోయారు అని చెప్పారు. వాళ్ళకు ప్రమాదం జరిగింది అని చెప్పారు గానీ, మంచుగోళాన్ని ఢీకొట్టిందని ఎవ్వరూ

చెప్పలేదు. కానీ ఆమె చెప్పింది ప్రత్యక్ష సాక్షి. ఆ రోజు మేము మంచు గోళాన్ని మా రాకెట్టు ఢీ కొట్టడం వలన ప్రేలిపోయింది అని చెప్పింది. అంటే ఈ రకంగా వెనుకటి జన్మల జ్ఞాపకాలు చెప్పిన దానివలన, అది నిరూపణకు వచ్చిన దానివలన మనము ఏమని అనుకుంటున్నాము అంటే ఇప్పుడు మనకు వెనుకటి జన్మలు ఉన్నాయి. మనము ఇంతకుముందు ఉండే వాళ్ళమని, మనకు తెలియదు, మనకు జ్ఞాపకం లేదు కాబట్టి తెలియదు అని చెప్పినాము. కృష్ణుడు చాలా జన్మలున్నాయని చెప్పాడు. ఒకటి కాదు రెండు కాదు, చాలా ఉన్నాయి అయితే అవి ఎవరికీ తెలియదు తెలియదు అనేమాట వాస్తవమే కదా!

వెనుకటి జన్మలు కూడా ఎవరు జ్ఞానకము చేస్తున్నారు. ఇన్ని పనులు నీతో చేయిస్తున్నాడే వాడే వాడు (ఆత్మ) వెనుకటి జన్మ నీకు తెలియబరచే దానికోసం జ్ఞాపకం తెప్పిస్తున్నాడు. అంతేతప్ప ఇంకొకటి ఏమీ కాదు. అతను తెప్పించివుంటే నీకు తెలుస్తుంది. ఈ రకంగా వెనుకటి జన్మ జ్ఞాపకాలు మనకు వచ్చిన దానివలన, వెనుకటి జన్మలు ఉన్నాయి అని తెలియడముతో మనము ఏమని అనుకుంటాము? నేను ఫలానా జన్మలో, ఈ వ్యక్తి అయితే, ఇంకో జన్మలో ఏ వ్యక్తిగా ఉన్నావో అని మనము మన మీద ధ్యాస పెట్టుకోవడానికి అవకాశము ఏర్పడుతుంది. అప్పుడు మనము కొంత వెనుకకు తిరిగి చూసుకుంటే, నీ ఆత్మ గురించి తెలుసుకోగల్గుతావు. దానినే ఆత్మను అధ్యాయనము చేయడమని, దానినే ఆధ్యాత్మికము అని అంటాము. ఆధ్యాత్మికము అంటే నీ ఆత్మను నీవు తెలుసుకోవడమే అధ్యాత్మికము. ఇంకొకటి ఏమీ కాదు. పుస్తకము చదువుకొని, నామము పెట్టుకుంటే ఆధ్యాత్మికము కాదు. గుడికి పోయి నాలుగు టెంకాయలు కొట్టినా, 10 గుడులకు పోయి గంటలు కొట్టి వచ్చినా అది ఆధ్యాత్మికము కాదు.

నీ ఆత్మను నీవు తెలుసుకోవడమే ఆధ్యాత్మికము అవుతుంది. వెనుకటి జన్మలో ఫలానా వ్యక్తిగా ఉన్నప్పుడు, మరి ఈ జన్మలో ఎందుకు ఇట్లా ప్రవర్తిస్తున్నాను? ఈ ప్రవర్తనకు కారణం ఏమిటి? అని ఆలోచన చేయవలసిన పరిస్థితి వస్తుంది, ఈ రకంగా వెనుకటి జన్మ జ్ఞాపకము వచ్చిన దానివలన, వెనుకటి జన్మలో నువ్వువున్నానని గుర్తు చేసే దానికోసము, అనేకమైన చిహ్నాలు మనలో ఉన్నాయి. జ్ఞాపకాలు వస్తే తెలుస్తూవుంది. లేకపోతే మిగతా విషయాలు తెలియడం లేదు. పుట్టుమచ్చలు ఎక్కడినుండి వస్తాయి. వెనుక జన్మ సంబంధముతోనే వస్తున్నాయి. ఒకనికి కడుపు పై పెద్ద పుట్టుమచ్చ వచ్చింది. ఎందుకు వచ్చిందంటే తుపాకీతో కాల్చివుంటే కడుపుకు రంధ్రము పడి చనిపోయాడు. మళ్లీ ఈ జన్మలో పుట్టివుంటే, సరిగా అక్కడే పెద్ద మచ్చ వచ్చింది, చూడండి ఎట్లువుందో అది? తరువాత వానికి జ్ఞాపకము వచ్చి చెప్పితే, వాడు పోయిన జన్మలో తుపాకీతో కాల్చబడి చనిపోయాడు. ఎక్కడైతే రంధ్రం పడి చనిపోయాడో అక్కడనే పుట్టుమచ్చ వచ్చింది. పుట్టుమచ్చ కూడా పెద్దగా ఉండి దానికి సంబంధించినదే అని అర్థమగునట్లున్నది.

ఈ రకంగా ఈ గ్రంథములో అటువంటి రహస్యాలు అన్ని తెలియబడుతాయి. అంటే వెనుకటి జన్మలో కూడా మనము ఉన్నాము అని తెలియడమే కాకుండా, వెనుకటి జన్మలలోనే కాకుండా అంతకుముందు జన్మలలో కూడా మనము అనేక పనులు చేస్తున్నామని రకరకాలుగా ఉన్నాము అని తెలియుచున్నది. ఒక పెద్ద ధనికుడు చివరకు బీదవాని ఇంట్లో పుట్టాడు. ఇప్పుడు కల్పనాచావ్లా పుట్టినది ఎక్కడ? రోజు కూలి పని చేసుకోనే వారి ఇంటిలో పుట్టింది. కల్పనాచావ్లా అంటే పరిశోధకురాలు, అంత పెద్ద పరిశోధకురాలు అంటే అమెరికాలో పెరిగి అమెరికాలో

చదువుకుంది, కానీ అటువంటి ఆమె ఈ రోజు ఎక్కడ పుట్టింది? పంజాబు రాష్ట్రములో ప్రతి రోజు దినకూలి చేసుకొనే వ్యక్తి ఇంటిలో పుట్టింది. అంటే అర్థం ఏమి ఉంటుంది అంటే, ధనికుడు బీదవానిగా పుట్టవచ్చు. బీదవాడు ధనికునిగా పుట్టవచ్చు అర్థమయిందా! ఇప్పుడు, "నేను విశ్వహిందూ పరిషత్తు, మేము హిందువులము, ముస్లీమ్‌లు మాకు సరిపోరు. క్రైస్థవులు మాకు సరిపోరు" అనేవాడు, పోయిన జన్మలో క్రిష్టియన్‌గా పుట్టి ఇప్పుడు హిందువుగా పుట్టినాడు. ఇంతకుముందంటే పోయిన జన్మలో వాడు క్రిష్టియన్, ఈ జన్మలో హిందువుగా ఉండి క్రిష్టియన్‌లను కొట్టాలని చూస్తాడు. చూడండి, ఎంత వ్యతిరేఖము? ఇంతకుముందు వీడు ఎవడు? వీడు క్రిష్టియన్? అంటే హిందువుగా ఇప్పుడు పుట్టాడు. ఒకప్పుడు క్రిష్టియన్‌గా ఉన్నవాడు ముస్లీమ్‌గా పుట్టాడు. ముస్లీమ్‌గా ఉన్నవాడు హిందువుగా పుట్టాడు. హిందువుగా ఉండినవాడు ముస్లీమ్‌గా పుట్టాడు. క్రైస్థవుడు ముస్లీమ్‌గా పుట్టాడు, హిందువు అనేవాడు క్రిష్టియన్‌గా పుట్టాడు. అన్ని విషయాలు మనకు ప్రతీదీ తెలిసిపోయినాయి. అంటే హిందువులు అయితే జన్మలు ఉంటాయని అంటారు. క్రైస్థవులు జన్మలు లేవు అంటారు. ఒకే జన్మ అంటారు. ముస్లీమ్‌లు కూడా పునర్జన్మలు లేవు అంటారు.

లెబనాన్ అనే దేశము ముస్లీమ్ దేశమే. ఆ ముస్లీమ్ దేశములోనే చనిపోయిన వాళ్లు, అదే ముస్లీమ్ దేశంలోనే ప్రక్క ఊర్లలో పుట్టి, ఫలానా ఊరు నాది అని చెప్పినవాళ్ళు ఉన్నారు. ప్రత్యక్ష సాక్ష్యం కాబట్టి అక్కడ కూడా ప్రత్యక్ష ప్రమాణంగా ముస్లీమ్‌లు మరలా పునర్జన్మకు వచ్చారనేది తెలిసిపోయింది.

ముస్లీమ్ దేశములోనే ముస్లీమ్‌లు చనిపోయి, ఇంకొక చోట పుట్టి మరలా జ్ఞాపకాలు వచ్చి వారిచేత చెప్పించినాడు దేవుడు. అంటే ప్రతి

మనిషికీ, మనిషి అయిన ఎవడైనాగానీ వారి మధ్యలో పెట్టుకొన్నది మతము! అంతే కదా! పుట్టిన తరువాత వచ్చింది మతము పుట్టుక ముందు లేదు, దేవుడు ముద్రకొట్టించి ఫలాన మతస్థునిగా పుట్టించలేదు. మధ్యలో వచ్చినప్పుడు నీవు ఫలానా మతస్థుడు అని అనుకుంటున్నావు. అది తప్పు, కాబట్టి ఏ మతస్థుడుగా ఉన్న ఎవడైనా తర్వాత జన్మలో ఏ మతస్థుని ఇంట్లోనైనా పుట్టవచ్చు. ఎక్కడైనా పుట్టవచ్చు అనే నిరూపణ దీనిలో చాలా వివరించాము. ఈ గ్రంథము చదువుకొంటే మీకు అన్ని విషయాలు బాగా అర్థమవుతాయి. ముఖ్యముగా ఏమిటి అంటే పోయిన జన్మలో నేను ఫలానా అడుక్కునే వానిగా ఉన్నావని తెలిస్తే, ఇప్పుడు ధనికుడిగా ఉన్న మనము ఎంత బాధపడుతాము? బాధపడడమే కాకుండా, అప్పుడు లేని సిరి ఇప్పుడు వచ్చింది, మనకు ఎందుకు గర్వము అనేది వస్తుంది అంటే తగ్గినడుచుకొనే పరిస్థితి వస్తుంది అర్థమయిందా! లేదు పెద్ద దుర్మార్గునిగా ఉన్నవాడు సన్మార్గునిగా పుట్టి ఉంటే, అప్పుడు అతను అంత దుర్మార్గంగా ఉన్నానా అని అనుకోవడము జరుగుతుంది. ఇవన్నీ రహస్యాలు! మనకు తెలిస్తే, అంటే జన్మ యొక్క రహస్యం మనకు తెలిస్తే మన జీవితాన్ని సక్రమముగా నడుపుకొని దేవునివైపు పోయేదానికి, ప్రయాణించే దానికి అవకాశము ఏర్పడుతుంది. ఆధ్యాత్మికము అనేది మనకు తెలుస్తుంది.

జీవితములో ఆధ్యాత్మికము తెలుసుకోగల్గితే, దైవత్వాన్ని తెలుసుకో గల్గితే ఈ పాపపుణ్య కర్మలు లేకుండా పోతాయి. చేసే పనులు చేయవద్దని చెప్పలేదు. నీవు దొంగతనాలు చేస్తున్నావు. అది నా వృత్తే అని అంటావు. నేను వద్దని చెప్పలేదు. నీవు దొంగవని చెప్పలేదు. ఇది చెడ్డ పని అని చెప్పలేదు. నీవు దొంగతనమే చేయి, ఫరవాలేదు. కానీ దొంగతనము ఎట్లు చేస్తున్నావు, ఎవరు చేయిస్తున్నారు శరీరములో? నీవే చేస్తున్నావా!

అంటే నీ శరీరములో ఎవరైనా చేయిస్తున్నారా? మొత్తము శరీరములో ఉండేది తెలుసుకో, నేను చెప్పినది బెత్తెడు వెడల్పు తలలో ఉండే రహస్యమే తెలుసుకోమంటున్నాను. బయట ఎక్కడో వెతుకులాడమని చెప్పలేదు. అంతేకదా! పెద్ద పెద్దవి కనిపెట్టమని చెప్పలేదు. ఇటు నుంచి అక్కడికి పోతే జానడే! ఈ జానెడులో ఉండేది బెత్తెడే! ఈ బెత్తెడులోని విషయము తెలుసుకుంటే అన్నీ తెలిసిపోతాయి.

ఆ రకంగా ఏమి చెబుతున్నాము అంటే, బయటి దృష్టి విడిచిపెట్టి లోపలి దృష్టి కలుగజేసుకొని, నిన్ను నీవు తెలుసుకోగల్గితే, అంటే ఈ జన్మకు ఎక్కడి నుండి వచ్చినాము, ఈ జన్మలు అయిపోయిన తరువాత ఎక్కడికి పోతాము అని తెలుసుకోగల్గితే మళ్ళీ పుట్టేది ఉంది. ఇంతకుముందు చచ్చిపోయి ఒకచోట మళ్ళీ పుట్టి వచ్చినావు. ఈ రకంగా మనము పుట్టి వస్తున్నాము కాబట్టి ఒకే జన్మ శాశ్వతము కాదు. మనకు ఎన్నో జన్మలు ఉన్నాయి. ఈ జన్మలన్నిటికీ కారణము పాపము, పుణ్యములే! అంటే మనము చేసుకున్న పాపపుణ్యాలే ఎంతకైనా దారి తీయవచ్చు. ఈ పాపపుణ్యాలు అనుభవించే దానికోసమే మనము పుట్టాము. ఇవి సంపాదించుకోవడము ఎందుకు? వాటిని అనుభవించడము ఎందుకు? వాటిని మనము దూరము చేసుకొనే శక్తి ఉంది. జ్ఞానముతో దూరంగా పోతాయి. మరి ఈ కర్మలన్నీ ఎట్లా పోతాయి. తెలియకుండా చేసుకొన్నాము అంటే, ఏమి చెప్పినాడు దేవుడు భగవద్గీతలో "యథైథాంసి సమిద్ధోగ్నిర్భస్మ సాత్కురు తేర్జునా" అంటాడు. **ఏ విధముగా అగ్నిలో కట్టెలు కాలిపోతాయో ఆ విధముగా నీ కర్మ అనే పాపపుణ్యాలనే కట్టెలు జ్ఞానమనే అగ్నిలో కాలిపోతాయి.** కాబట్టి నీవు జ్ఞానమనే అగ్నిని సంపాదించుకో అని చెప్పాడు ఆ అగ్ని సంపాదించుకుంటే కట్టెలు వేసి యజ్ఞము చేయవచ్చు పాపపుణ్యాలనే

కట్టెలు వేసి, ఆ యజ్ఞము చేయి ఫరవాలేదు. దానిని ఏమంటాము? జ్ఞానయజ్ఞము అంటాము. మనిషి రెండే రెండు యజ్ఞాలు చేయవచ్చు కానీ ఒక యజ్ఞమునే చేస్తున్నాడు. రోజూ చేస్తున్నాడు ఒక యజ్ఞము. కడుపు యజ్ఞ గుండము అయితే, జఠరాగ్ని అగ్ని అయితే, తినే ద్రవ్యాలను వేస్తున్నాము. ఇది ద్రవ్యయజ్ఞము అయ్యింది ఏమిటి! రోజుకి మూడుసార్లు ద్రవ్యయజ్ఞం జరుగుతుంది. జ్ఞానయజ్ఞం మాత్రము తలలో జరుగుతుంది. అంటే జ్ఞానముతో ఈ కర్మలు కాల్చుకొవచ్చు. కానీ ఈ యజ్ఞము ఎవరూ చేయడము లేదు.

దేవుడు ఏమి చెప్పాడు, ఈ జ్ఞానయజ్ఞము చేసుకో, కర్మలు నిలువ ఉన్నాయి ఇక్కడ, అవన్నీ కాలిపోతాయి. కాలిపోతే అనుభవించే పనే ఉండదు కదా! నీవు నా మాదిరి ఉండవచ్చు. నాకు జన్మలు జ్ఞప్తికి ఉన్నాయని చెప్పుతున్నాను కదా! నీకు ఆ విధముగా జ్ఞప్తికి వుంటాయి. నాకు ఇష్టము వచ్చినప్పుడు పుడుతాను నేను. నాకు అన్నీ జ్ఞాపకం ఉంటాయి. నీకు ఆ విధముంగా కాదు నీవు అస్వతంత్రుడువి. స్వతంత్రము లేదు నీకు. అంటే, నీకూ జన్మలు ఉన్నాయి, నాకూ జన్మలు ఉన్నాయి. నాకంటే నువ్వేం గొప్ప అని అనుకోవద్దు. నాకు అవసరము వచ్చినప్పుడు పుడుతా నేను, నీవు అట్లు కాదు. బలవంతముగా పుట్టుచున్నావు అని చెప్పినాడు. "యథాయథాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత" ఎప్పుడైతే ధర్మాలు అధర్మాలుగా మారిపోయినాయో అప్పుడు నేను పుడుతాను, నాకు అంతవరకు అవసరము లేదు. అప్పుడు నా అవసరము కొద్ది నేను పుడుతాను. నీవు అలా కాదు. నీ అవసరము కొద్దికాదు అవసరము లేకున్నా పుడుతావు, అవసరము ఉన్నా పుట్టాల్సిందే నీవు. దేవుడు నిన్ను ఈడ్చి ఈడ్చి కొడుతున్నాడు, ఆ జన్మలో నుంచి ఈ జన్మలోనికి, ఈ జన్మలో

నుంచి ఇంకొక జన్మలోకి, ఇంకొక జన్మలో నుంచి ఇంకొక జన్మలోకి, ఇది నిరంతరం నీకు. కాబట్టి తప్పించుకొనే దానికోసము నీవు ఏమి చేయాలి? జ్ఞానము తెలుసుకోవాలి అని చెప్పుతున్నాడు, సరే! ఇంతటితో మనము చాలిస్తాము.

## 85. యాదవ్

తేది: 24-08-2008

ఈ రోజు కృష్ణాష్టమి. కృష్ణాష్టమి సందర్భంగా గ్రంథాలు విడుదల చేసుకున్నాము. తర్వాత కార్యక్రమంగా జ్ఞానం చెప్పడం మొదలు పెట్టినాము. కానీ మేం అనుకున్న సమయానికన్నా ఆలస్యంగా మొదలైంది. అయినా ఇప్పటి నుండి సాయంకాలం వరకు, వేరే పని ఏమి లేదు కాబట్టి మనకు ఆలస్యం అయినా ఫరావాలేదు, మీరు శ్రద్ధ పెట్టి వినల్సిందిగా కోరుకుంటున్నాము.

శ్రీకృష్ణాష్టమి చాలా సంవత్సరాల నుండి మనం చేసుకుంటున్నాము. 'కృష్ణాష్టమి' అంటే చాలా విధాలుగా మనం అర్థం కూడా చెప్పుకున్నాము. కానీ ఈ రోజు దేశములో యాదవులుగా ఉన్నవాళ్ళు చేసుకునే ముఖ్యమైన పండుగ. అయినా ఈ ప్రాంతంలో యాదవులు ఎవరూ ఈ పండుగను పెద్దగా చేసుకోవడం లేదు. ఉత్తరదేశంలో యాదవులందరు ఈ పండుగను ముఖ్యంగా పెద్దగా చేసుకుంటావుంటారు. దీనిని ఒక పండుగగా కాకుండా ఒక ఆధ్యాత్మిక గుర్తింపుగా మనం ఈ పండుగను చేసుకోవాలనే ఉద్దేశ్యంతో మనం కృష్ణాష్టమిని చేసుకునేదానికి మొదలు పెట్టాము. అప్పటినుండి అదే

విధంగా మనం ప్రతి సంవత్సరము కృష్ణాష్టమి సందర్భంగా ఆధ్యాత్మిక జ్ఞానాన్నే మనం చెప్పుకుంటూ వచ్చాము. ఈ రోజు కూడ అదే ఉద్దేశ్యంతో మనం చెప్పుకొంటున్నాము.

కృష్ణుడు యాదవ వంశంలో పుట్టాడు అని చాలామంది అంటూ ఉంటారు. కృష్ణున్ని యాదవుడు అని అంటుంటారు. కానీ వాస్తవంగా అతను క్షత్రియ కుటుంబంలో పుట్టినవాడు. ఆయన ఇప్పుడు అనుకునే గొల్లవాళ్ళ ఇంట్లో పుట్టలేదు. కానీ కొంతమంది లేదు కృష్ణుడు యాదవుడే అని కొందరు, అంటే కాదు కృష్ణుడు క్షత్రియుడు అని కొందరు అనుకోవడం జరుగుచున్నది. దీనిని ఎవరూ పెద్ద పట్టింపుగా తీసుకోలేదు కానీ అందరూ యాదవులే అని అనుకుంటున్నారు. ఆయన క్షత్రియుడు అని ఎవరికీ తెలియదు. కొంతమందికి తెలిసినా కానీ వాళ్ళు కూడా కృష్ణున్ని యాదవుడు అంటే గొల్లవాళ్ళ కిందికే లెక్కేసుకుంటారు. మనకు తెలిసున్నంత వరకు చాలా రచనలలో కానీ, సినిమా రంగములో కానీ, నాటికలలో కానీ ఆయనను గొల్లవానిగానే చిత్రించి చాలా భక్తిపాటలు వ్రాయడం జరిగింది.

మరి ఆయన గొల్లవాడా? క్షత్రియుడా? అని మనం ప్రశ్న వేసుకొని చూస్తే, ఉత్తరదేశమంతా కృష్ణుడు యాదవుడు అని అనుకుంటున్నారు. దక్షిణ దేశంలో కూడ అదే పద్ధతే ఉంది అంటే ఇప్పుడు కృష్ణుడు యాదవుడా? క్షత్రియుడా? అనే సమస్యలో 90 పాళ్ళు యాదవుడని అనుకుంటూవుంటే, కేవలం పదిమంది మాత్రము క్షత్రియుడు అని అనుకుంటున్నారు. కానీ వాళ్ళు కూడ క్షత్రియుడు అనే మాటను కూడ గాఢంగా అనుకోవడం లేదు. సరే! ఈయన క్షత్రియుడా? యాదవుడా? అని మేము మిమ్ములను ప్రశ్నిస్తున్నాము. మీరు ఏమంటారు? అంటే చాలామంది యాదవుడే

అంటారు. అంటే గొల్లవాడే అంటారు. అంటే ఇప్పుడు మేము తిరిగి ప్రశ్నిస్తున్నాము. యాదవుడు అంటే గొల్లవాడా అని అడిగినాము. అప్పుడు అవును అన్నారు. యాదవులని పేరున్న వాళ్ళు చాలామంది ఉన్నారు కదా. అంటే అక్కడంతా ఉత్తర దేశమంతా యాదవులు అని పేర్లు చాలామందికి ఉంది. యాదవులు అంటే గొల్లవాళ్ళని అనుకుంటున్నామని అన్నారు.

భారతదేశ జనాభాలో ఉత్తరదేశంలో దాదాపు అంతా కలిపి యాదవులది సగం జనాభా ఉంటుందేమో. ఆ రకంగా ఉన్నారు ఇక్కడ దక్షిణదేశంలో చాలా తక్కువగానీ, ఉత్తర దేశంలో చాలామంది ఉన్నారు. కృష్ణుడు పుట్టింది కూడా ఉత్తర్‌ప్రదేశ్ చివరిలో మథుర ప్రాంతంలో పుట్టాడన్నమాట. ఆ మధురలో పుట్టి, ప్రక్కన 2, 3 కిలోమీటర్ల దూరంలో గల గోకులము అనే ఊరిలో పెరిగినాడు కృష్ణుడు. గోకులములో పెరిగిన తర్వాత యుక్తవయస్సు వచ్చే సమయానికి మథురకు తిరిగి వచ్చాడు. కృష్ణుని మేనమామ అయిన కంసుడు అనే రాజును చంపేసి, మధురకి ఈయనే అధిపతి అయినాడు. అయితే మధురను కృష్ణుడు అన్న బలరాముడు పరిపాలించినాడు కృష్ణుడు నిర్వాహణ పనులు చేసాడు అంతే. బలరాముడు పరిపాలన చేశాడు మధురను. ఈయన మధురలో కాపురం పెట్టుకొని, మధురలోనే కొన్ని సంవత్సరాలు జీవించినాడు. అంటే రాజులు, రాజకీయం అంటే శత్రువులు సహజంగానే ఉంటారు. జరాసంధుడు అనే పక్కదేశం రాజు ఈయన కృష్ణుని మీదికి అంటే మధుర మీదికి 17 సార్లు దండయాత్ర చేశాడు. 17 మార్లు దండయాత్ర చేసి, 17 మార్లు కృష్ణుని చేతిలో ఓడిపోయాడు, జరాసంధుడు. ఓడిపోయిన తర్వాత తాను గెలుస్తానను ఉద్దేశ్యముతో 18వ సారి వచ్చినప్పుడు కృష్ణుడు ఓడిపోయినాడు. జరాసంధుడు గెలిచినాడు.

అప్పుడు కృష్ణుడు ఏం చేసినాడు? ఓడిపోయిన తర్వాత పారిపోవాలి లేదా చంపేస్తాడు అన్న భయంతో రాత్రికి రాత్రే ఈయన పారిపోయినాడు. మథురకు పడమర దిశలో సముద్ర తీరమున గల ద్వారకకు పారిపోయినాడు. ఉత్తరప్రదేశ్ నుండి గుజరాత్ రాష్ట్రం సరిహద్దు సముద్రం ఒడ్డుకి పారి పోయినాడు. అక్కడ చిన్న గ్రామముగా యున్న ద్వారకను పెద్ద నగరముగా స్థాపించుకున్నాడు. సముద్రం ఒడ్డున ద్వారక అనే నగరము ఉండేది. ఇప్పుడది సముద్రములో మునిగిపోయింది. అలా ద్వారకలో నివాసం ఏర్పర్చుకున్నాడు. తర్వాత ఆ ద్వారకలోనే ఈయన అంత్యం అయిపోవడం కూడా జరిగింది. ఈ రకంగా ఆయన జీవితచరిత్ర ఒక మామూలు మనిషిగానే సాగింది. ఇవన్నీ మామూలు మనుషులు చేసుకునే పనులే! అంటే పోట్లాడడమూ, గెలవడమూ, పారిపోవడమూ ఇవన్నీ మనుషుల పనులే! కానీ ఇవన్నీ చూస్తే ఎందుకు ఈ రకంగా జరిగింది అంటే, అది మామూలుగా అందరికీ జరుగుతుంటుంది. ఏదో కర్మ ఉంటుంది కాబట్టి అలా జరుగుతూ ఉంటుంది.

ఇవన్నీ చూసిన తర్వాత ఎవరన్నాగానీ కృష్ణున్ని మామూలు మనిషి అనక దేవుడంటారా? ఎవరూ అనరు. ఎందుకంటే దేవుడైతే 18వ సారి ఎందుకు ఓడిపోయినాడు? అని ప్రశ్న వస్తుంది. ఓడిపోయి ఎందుకు ప్రాణ భయముతో పారిపోయినాడు? అని ఇంకో ప్రశ్న వస్తుంది. అడ్రస్ తెలియకుండా పోయి, అంత దూరంలో సముద్రం ఒడ్డున ఎందుకు నిలిచిపోయినాడు? ఇవన్నీ రకరకాల ప్రశ్నలు మనకు వస్తాయి. ఎందుకు వస్తాయి? అంటే ఆయన దేవుడు కాదు అనేదానికి 99 ప్రశ్నలు మనకు వస్తాయి. కృష్ణుడు దేవుడు అనేదానికి సమాధానములు ఉండవు. దేవుడు అనేదానికి ఒకటి రెండు సమాధానాలు మనకి దొరికినా అవి అంత

బలముగా ఉండవు. ప్రకృతి వైపు, మాయవైపు బలం ఉంటుంది కాబట్టి ఆ బలముతోనే ఆయన దేవుడు కాదు అని లెక్కకు చాలామంది వచ్చి, ఆయనను ఎవరూ గుర్తించలేదు. అయినా ఎవరు గుర్తించారో, ఎవరు గుర్తించలేదో మనము తెలుసుకోవాలంటే మనం తెలుసుకొనే విధానం ప్రకారం ఆయన జీవితమంతా కనిపిస్తుంది కదా. అందరిలా గానే పుట్టినాడు, పుడుతూనే అక్కడ ఉంటే చంపేస్తారు అని ఉద్దేశ్యంతో పక్క ఊరికి పోయి అక్కడ పెరిగినాడు. పెరిగిన తర్వాత కొంత కాలానికి మళ్ళీ వచ్చి ఆ మధురలోనే ఆయన ఉండడం జరిగింది. కొంతకాలం అయిన తర్వాత మళ్ళీ ఇంకొక రాజు చేతిలో ఓడిపోవడం జరిగింది, పారిపోవడం జరిగింది. ఇదంతా సర్వసాధారణ కథ అని మనం చెప్పుకుంటాము. ఇదంతా గమనిస్తే ఇప్పుడు **"దేవుడు అనేటటువంటివాడు భూమి మీదికి వస్తే ఏమాత్రము తెలియకూడదు"** అనే ముఖ్యమైన సూత్రం ఒకటుంది. మనం ఇంతకు ముందు భూమి మీదికి భగవంతుడు వస్తే అని చెప్పాము. భూమి మీదికి దేవుడు వస్తే అని చెప్పుకున్నాము. కొన్ని పాఠ్యాంశాల్లో పుస్తకాల్లో కూడా మనం వ్రాసుకున్నాము. ఈ రోజు విడుదలైన గ్రంథములలో కూడా అటువంటి ఈ పాఠ్యాంశం ఉంది.

కానీ ఆయన భూమి మీదికి వస్తే ఎవరికీ తెలియకూడదు. తెలియకూడదు అంటే ఏమి చేయాలి? ఆయన భూమి మీద ఏ రకంగా బ్రతకాలి అనేటటువంటి విధానాన్ని, ఆయనే సృష్ఠించుకొని, ఆ విధానం ప్రకారం వచ్చి భూమి మీద పుట్టి పోతాడు. మామూలు మనుషులు పుడితే ఎవరన్నా ఇట్లా పుట్టాలి, అట్లా పుట్టాలి అని, ఇట్లా పెరగాలి అని ఇట్లా జరగాలని సృష్ఠించుకొని వస్తారా? ఎవరూ అట్లా రారు. మనకు తెలియకుండానే ఒక కర్మ ఉంది, దానిప్రకారం మనల్ని అది పుట్టించి

పెంచుతుంది, బ్రతికిస్తుంది చివరకు చంపుతుంది. నీ ఇష్ట ప్రకారం ఏదీ జరగదు. నీ ఇష్టం ఉన్నా లేకున్నా జరిగేది జరుగుతుంది. ఇష్టమున్నా లేకున్నా కొన్ని ఇష్టం ఉండి జరుగుతాయి, కొన్ని ఇష్టం లేకున్నా బలవంతంగా జరుగుతాయి. అది కర్మప్రకారం జరిగే విధానం. అది మామూలు మనుషులకు ఉంటుంది.

కానీ ఇప్పుడు దేవుడు భూమి మీదికి వస్తే, అంటే దేవుడు అనే పదానికి ప్రత్యేకమైన అర్థముంది. దేవుడంటే ఎవరికీ కనిపించనటు వంటివాడు, ఇంద్రియ అతీతుడు, దేవులాడబడేవాడు, వెతకబడేవాడు కానీ కనిపించేవాడు కాదు. ఎవరికీ తెలియనట్టి అగమ్యగోచరుడు. ఆ రకంగా చెప్పుకుంటే ఎన్నైనా పదాలు మనం చెప్పుకోవచ్చు. తెలియనటువంటివాడు అని, తెలియనటువంటివాడు తెలిసే రకంగా, మనుషులకు కనిపించే రకంగా రావాలి. అంటే దేవుడు భగవంతునిగా వస్తాడు. భగవంతుడు అంటే ఏమి? దేవుడంటే ఏమి? దేవుడంటే మనకు ఎవరికీ తెలియనటువంటివాడు అన్నాము. భగవంతుడంటే కనిపించేవాడు. భగవంతునికి, దేవునికి మీ ఇష్టం వచ్చినట్టు చెప్పుకుంటున్నారే? అని ఎవరైనా అంటే మన ఇష్టం వచ్చినట్టు చెప్పుకునేది కాదు. అవి ఒక నిర్ణయమైన పదాలు, ఇంకా అవి అర్థంతో కూడుకొన్న పదాలు. కానీ మనం ఏమంటాం అంటే, ఇంతవరకూ దేవునికి భగవంతునికి అర్థం తెలియదు. దేవుడన్నా, భగవంతుడన్నా ఇద్దరూ ఒకటే రకమైన పదాలు అనుకుంటాము. కానీ దేవుడంటే ఏ ప్రత్యేకత లేనివాడు, భగవంతుడంటే ప్రత్యేకత కలవాడు. భగవంతుడంటే కంటికి కనిపించేవాడు. ఒక శరీరం ధరించినటువంటివాడు. మనలాగా మాట్లాడే వాడు, మనలాగా బ్రతికేవాడు భగవంతుడు. దేవుడు అంటే ఏమాత్రం కనిపించనటువంటివాడు, రూపము, పేరు ఏమాత్రం ఉండనటువంటివాడు.

ఒక్కచోట ఉండేవాడు కాదు. అన్నిచోట్ల ఉండేవాడు. దేవుడు. భగవంతుడు అన్నిచోట్ల ఉండేవాడు కాదు ఒక్కచోట ఉండేవాడు. శరీరంతో కనిపిస్తూ ఉండేవాడు. ఆ రకంగా వచ్చిన వ్యక్తినే శ్రీకృష్ణుడు అంటున్నాము. మీరు అంత గొప్పగా ఎందుకు చెప్పుకుంటున్నారు? అంటే కృష్ణుడు మాకేమి సొంతం బంధువు ఏమీ కాదు. లేకపోతే దూరం చుట్టం ఏమీ కాదు. ఉండే విధానం ప్రకారం లెక్కేసుకుంటే జరిగిన విధానం ప్రకారం లెక్కేసుకుంటే ఆయన సాక్షాత్తూ దేవుడు అని చెప్పుటకు అవకాశము గలదు.

దేవుడు భూమి మీదికి వచ్చి ఎవరికీ తెలియకుండా ఉండాలనే ఉద్దేశ్యముతో ఆయన కర్మను ఆయనే సృష్టించుకొని వస్తాడు. మనం పుడితే మనకు వెనకాల ఒక కర్మ ఉంటుంది అని చెప్పాము. ఆ కర్మ ప్రకారం మనకు జరుగుతుంది అని చెప్తాము. కానీ ఆయనకు ఎక్కడన్నా కర్మ ఉంటుందా? అంటే దేవునికి ఏ కర్మా ఉండదు. కానీ ఆయనే స్వయంగా దానిని రచించుకొని వస్తాడు. వ్రాసుకొని వస్తాడు, దేనిని కర్మను. ఇట్లా పుట్టాలి, ఇట్లా పెరగాలి, ఇట్లా జరగాలి అని. ఆ రకంగా భగవంతునిగా కృష్ణుని పాత్ర ఒకటి. భగవంతునిగా పుట్టినట్టి పాత్రల్లో మరల కృష్ణుని పాత్ర ఒకటి. అందుచేత భగవంతుడు అంటే కృష్ణున్నే భగవంతుడు అంటాము. కృష్ణుడు అనే పేరు తల్లిదండ్రులు పెట్టిన పేరు. భగవంతుడని పేరు పేట్టలేదు. కానీ ధర్మరీత్యా, జ్ఞానరీత్యా ఆయనకు వర్తించే పదం. భగవంతుడు. ఆయన దేవుడు కాబట్టి ఆయనను మనం తెలుసుకున్న తర్వాత భగవంతుడు అంటున్నాము. లేకపోతే ఆయన మామూలు కృష్ణుడే. కృష్ణుడు భగవంతుడు. కృష్ణ భగవాన్ అంటాము. ఆ రకంగా మనం కృష్ణున్ని భగవంతుడు అని చెప్పినా, ఆయన బ్రతికిన విధానాన్ని చూస్తే ఒకవైపు చాలా అల్లరిగా తిరిగినాడు అంటాము. దొంగతనాలు చేశాడు

అని అంటాము. ఇంకా ఎందుకు? శాశ్వతంగా పేరే పెట్టాం ఏమని? జైలు అంటే శ్రీకృష్ణ జన్మస్థానం అని, ఈ రకంగా ఆయనకు కొన్ని కొన్ని బిరుదులు అతికించి పెట్టినాము. మానసచోరుడు అంటే ఆడవాళ్ళ మనసు దోచినటువంటివాడు అని ఒక బిరుదు పెట్టినాము. ఈ రకంగా బిరుదులు అన్నీ ఆయనకు ఎలా ఉన్నాయంటే, ఒక ప్రక్కచూస్తే ఆయన దేవుడు కాదు అనే రకంగా ఉన్నాయి. ఇంకో పక్క చూస్తే ఆయన సాక్ష్యాత్తూ ప్రపంచమంతా అణువణువున వ్యాపించినట్టి దేవుడు అని తెలుస్తుంది.

సరే! రెండు కోణాల్లోనూ మీరు మొదటి కోణమైన ప్రపంచ కోణంలో అంటే గుణాలతో మనం మాయ నుండి ప్రకృతి కోణంలో గుణాలతో మనం మాయ నుండి చూస్తే ఏం తెలుస్తుంది? ఈయన శుద్ధ పనికిమాలిన వాడు, డబ్బులున్నాయి కాబట్టి సరిపోయింది. ఈయన ఏం తప్పు చేసినా వాళ్ళ అన్న బలరాముడు సరిదిద్దుకొని వచ్చేవాడు. ఎందుకంటే బలరాముడు పెద్ద బలమున్నవాడు. ఎవరైనా కొట్లాటకు పోతే మామూలుగా కట్టెలు తీసుకొని వేరేవాళ్ళ మీదికి కొట్లాటకు పోతాము. కానీ వాళ్ళ అన్న ఏమి తీసుకొని వస్తున్నాడు? పెద్ద నాగలి తీసుకొని వస్తున్నాడంట. కాబట్టి నాగలికి వీళ్ళు భయపడి వీళ్ళంతా ఏమి చేసినారంటే కృష్ణున్ని ఏమీ అనే వాళ్ళు కాదు. కొట్లాడే వాళ్ళు కాదు. కాబట్టి అది ఆయనకు చెల్లింది. ఆయన చాలా పనికిమాలినవాడు. ధనముంది కాబట్టి, అన్నీ చెల్లినాయి అని వాళ్ళు అనుకుంటారు. ఎవరిని? కృష్ణున్ని. అట్లా చెప్పుకొని ఇప్పటికీ ఏమి లెక్క వేస్తారంటే జరిగేది జరిగిపోయింది. ఆ కాలము అయిపోయింది కాబట్టి ఆయన దేవుడెట్లు అవుతాడు? ఆయనను దేవుడు ఎట్లంటారు? అని అంటారు. కానీ ఇప్పుడు ఎక్కడన్నా మీరు చూసుకోండి కృష్ణుని ఫోటో ఉందా? పటం ఉందా? కృష్ణుని కాసెట్ల పాటలున్నాయా అంటే,

సాయిబాబావి ఉన్నాయి, లక్ష్మీవి ఉన్నాయి, వెంకటేశ్వరునివి ఉన్నాయి అని చెప్తారుగానీ, అడిగితే కృష్ణునివా? మా దగ్గర లేవు అంటారు. ఎవరూ కొనరు అంటారు. అక్కడ ఉండేది తయారు చేసేది కూడా తక్కువే. మనం ఎక్కడ అడిగినా కానీ దొరకవు అన్నమాట. ఆ రకంగా కృష్ణుని ప్రచారం చాలా తక్కువ, ఇతర దేవతల ప్రచారం చాలా ఎక్కువగా ఉంటుంది. ఎందుకు? ఆయనను ఒక పనికిమాలిన వాని కిందికి లెక్కేసినారు ప్రపంచరీత్యా. మళ్ళీ మనము ఏమి చేసామంటే అదీ చూసాం, ఇదీ చూసాం, ఆయన ఆ రకంగా నటించాడు. ఆయన స్వయంగా నటించి ప్రజలకు ఆ విధంగా కనిపించాడు. ఏ విధంగా? పనికిమాలినవాని మాదిరి! అజ్ఞాని మాదిరి!! ఆడవాళ్ళ వెంట తిరిగే వాని మాదిరి ఆయనను బయట అందరూ అనుకునేటట్టు చేసినాడు. ఆయనను గుర్తుంచుకోకుండా చేశాడు. అటువంటప్పుడు జ్ఞానం ఉన్నవాడు నన్ను గుర్తిస్తాడు అని చెప్పాడు. మళ్ళీ ఆయన జ్ఞానం ఉన్నటువంటివాడు ఎవడైనాగానీ, ఆయనను గుర్తించొచ్చు గానీ, జ్ఞానం లేనటువంటి వాడు ఎవడూ కూడ గుర్తించలేడు. సరే మనం అజ్ఞాన దిశలో ఉన్నప్పుడు మనం కూడా కృష్ణున్ని నాలుగు తిట్లు తిట్టి ఉంటామేమో?

ఇప్పుడు మనము రెండవ కోణమైన పరమాత్మ కోణంలో చూస్తే అంటే జ్ఞానదిశలోకి వచ్చిన తరువాత జ్ఞానం అనేటటువంటి చూపును అద్దాన్ని పెట్టుకొని చూసిన తర్వాత ఆయనలో ఉండేటటువంటి గొప్ప విధానం మనకు అర్థమైతుంది. కాబట్టి కృష్ణుడు విశ్వమంతా అణువణువునా వ్యాపించినట్టి శక్తి అనుకుందాము, దేవుడు అనుకుందాము. మళ్ళీ ఆ దేవుడు భూమి మీదికి మనిషిగా పుట్టాల్సిన పని ఏం వచ్చింది? అన్ని రకాలుగా నటించాల్సిన పని ఏమి వచ్చింది? అని లెక్కేసుకుంటే, ముందే

చెప్పాముగా! ఆయనను ఎవరూ గుర్తించకూడదు అనే ఒక షరతుమీద ఆయన భూమి మీదికి వచ్చి ఉంటాడు. ఎవరు గుర్తిస్తారు? జ్ఞానులు మాత్రం గుర్తిస్తారు. అజ్ఞానులు ఎవరూ గుర్తించకూడదు. అజ్ఞాన దృష్టి ఉన్నట్టి వాళ్ళు ఎవరూ అతనిని గుర్తించలేరు. జ్ఞానదృష్టితో ఉన్నవాళ్ళు ఎవరన్నా అతనిని గుర్తించవచ్చు. ఇప్పుడు మనం జ్ఞానదృష్టిని, అజ్ఞానదృష్టిని రెండింటినీ లెక్కేసుకొని చూస్తే, ఆయనను అజ్ఞానదృష్టితో చూస్తే మనం గొల్లవాడు అంటాము, ఇంకోటి అంటాము, ఇంకోటి అంటుంటాము. ఎవరన్నా మనిషిగానే లెక్కేసి మాట్లాడతాము. కానీ జ్ఞానదృష్టితో చూస్తే ఆయనను మనం కూడా ఏమి అనాలి అంటే గొల్లవాడు అనే అనాలి. అంతే గదా! యాదవుడే అనాలి. యాదవుడని ఎందుకంటాము? అంటే అందరూ యాదవుడు అంటున్నారు. కాబట్టి అంటాము కానీ మనం ఎందుకంటాము? మనం ఎందుకనాలి అనేది కాకుండా ఆ విధంగా ఎందుకు అనాల్సిన పని వచ్చింది? పూర్వం ఎందుకు అలా అనేవాళ్ళు? ఈ పదం ఎక్కడి నుండి వచ్చింది? అని ఆలోచన చేస్తే, దానికి కొంత విధి విధానం ఉంది అని మనకు అర్థమవుతుంది.

ఒకసారి హైదరాబాదులో యాదవ కులంలో పెద్దాయన ఒకాయన, మా దగ్గరకు వచ్చి కలిసినప్పుడు, మీ పేరు ఏమి అని అడిగాము. ఆయన పేరు చెప్పి చివరిలో యాదవ్ అన్నాడు. యాదవులు చాలామంది హైదరాబాదులో కూడ ఉన్నారు, నాకు అర్థం కాలేదు. యాదవ్ అంటే ఏమిటి అన్నాము. యాదవ్ అంటే మేం గొల్లవాళ్ళం, మమ్మల్ని యాదవ్ అంటారు అన్నాడు. గొల్లవాళ్ళను యాదవులు అంటున్నారు. సరే గొల్ల వాళ్లు అంటే ఒక అర్థముంది. గొర్రెలను కాసేవాళ్ళో, ఆవులు కాసేవాళ్లో అని ఏదో ఒక పేరు ఉంటుంది. దానికి ఒక అర్థం ఉంటుంది. మరి

అప్పుడు గొల్లవాళ్లు అంటే గొర్రెలు కాసేవాళ్ళు. పూర్వం గొర్రెలు ఉన్నాయి కాబట్టి. ఇప్పుడు కూడ కొంతమందికి ఉండవచ్చు, ఉండక పోవచ్చు, అదే కులంగా దీనిని పరిగణిస్తాము. మరి యాదవులు అంటే ఏమి? దానికి ఒక అర్థం ఉండాలి కదా? అని అడిగాము. అప్పుడు ఆయన యాదవ్ అర్థం ఏం తెలియదు కానీ మమ్మల్ని యాదవులు అంటారు అన్నాడు. అందరూ యాదవులు అంటున్నారు, కాబట్టి ఆయన యాదవుడు అన్నాడు.

మా తాతగారు యాదవులు, మా నాయనగారు కూడ యాదవులే, మేం కూడా యాదవులే అని చెప్పుకుంటున్నాము. కానీ దాని గురించి పెద్దగా తెలియదు అన్నాడు. అయితే కృష్ణుడు కూడ మా యాదవుడే అన్నాడు. మా యాదవుడే మీ జ్ఞాని కాదు అన్నట్టు ఆయన చెప్పుచున్నాడు. సరేలే మీ యాదవుడే కానీ కృష్ణునికి యాదవుడు అని ఎందుకు పేరు వచ్చింది? అని అడిగాము. కృష్ణునికి యాదవుడని పేరు ఎందుకు వచ్చిందో తెలియదు. పూర్వం నుంచి ఆ పేరు వచ్చింది అంతే అని చెప్పుచున్నాడు. సరే మనం ఏమి చెప్పినాము అంటే, చూడు కృష్ణుని వల్లనే యాదవులు అని పేరు వచ్చిందా? లేక మీ అందరికీ మొదట నుండి ఆ పేరు ఉందా? కులం మొదట నుంచి ఉంది కాబట్టి మొదటి నుండి కూడా యాదవ అనే పేరు ఉండొచ్చు అని ఆయన చెప్పినాడు. మొదట నుండి గొర్రెలు కాస్తున్నారు కాబట్టి గొల్లవాళ్లు అనవచ్చు, మరి ఆవులను కాస్తున్నారు కాబట్టి గొల్లవాళ్లు అని పేరు వచ్చివుండవచ్చు? గొర్రెలు ఆవులు అన్నీ కాసేటివే కదా. అన్నీ కలిపి తోలుకుపోతున్నారు ఇప్పుడు. ఆ కాలంలో కూడా ఆవులు, గొర్రెలు అన్నీ ఉన్నాయి అన్నమాట, అందువల్ల ఆ పేరు ఉండొచ్చు కానీ యాదవులని పేరు కృష్ణుని పుట్టక ముందు మాత్రం లేదు, కృష్ణుని

తరువాత వచ్చినది అని మనం చెప్పినాము. మాకు తెలిసిన పద్ధతి ప్రకారం యాదవులు అనే పేరు ఎప్పటి నుండి ఉంది? కృష్ణుని తర్వాత వచ్చింది. కృష్ణుని వద్ద నుండే వచ్చింది. కృష్ణుడు ఎప్పుడైతే ఉన్నాడో అప్పటినుండే వచ్చింది. మరి కొంతమంది తెలిసిన జ్ఞానులు కృష్ణున్ని యాదవ్ అన్నారు. అజ్ఞానులకు ఏం తెలియదు కాబట్టి వాళ్ళను వదిలేస్తాము. జ్ఞానులు ఆ రోజు కృష్ణున్ని యాదవ్ అనేటటువంటి పేరుతో ఉచ్ఛాటన చేసారు కాబట్టి, అప్పటి నుండి ఆయన ఉన్నటువంటి కులానికంతా యాదవులనే పేరు వచ్చేసింది. ఆయన పుట్టినది క్షత్రియుడుగా, పెరిగినది గొల్లవాళ్ల ఇంట్లో అంటే యశోద, నందుని ఇంట్లో. అంటే నందునికి యశోదకు కొడుకుగా ఆయన పెరిగినాడు. పుట్టినది దేవకీదేవి, వసుదేవునికి కొడుకుగా పుట్టాడు. దేవకిదేవి గర్భంలో పుట్టి యశోద ఇంట్లో పెరిగినాడు. ఆయన యశోదకు కొడుకా? అంటే కడుపున పుట్టిన కొడుకు కాదు. పెంచిన కొడుకు మాత్రమే. చాలామంది యశోద కొడుకే అనుకుంటుంటారు. కానీ వాస్తవంగా లెక్కేస్తే ఆయన దేవకీదేవి కొడుకు. మరి వసుదేవుడు దేవకీదేవి క్షత్రియ వంశస్తులే కాబట్టి ఆయన పుట్టుక క్షత్రియవంశంలోనే జరిగింది. పెరగడం అంటే గొల్లవాళ్ల ఇంట్లో జరిగింది. కానీ యాదవుల ఇంట్లో కాదు. అప్పుడు యాదవులు లేరు అందరూ గొల్లవాళ్లే. ఆ గొల్లవాళ్ల ఇంట్లో పెరిగినాడు.

ఇప్పుడు యాదవుడు అనే పేరు ఎప్పటి నుండి వచ్చిందంటే, కృష్ణుని దగ్గర నుండి వచ్చిందని అన్నాము ఆ పేరు ఎవరు పెట్టారు అంటే? జ్ఞానులు పెట్టారు. ఆ రోజు పెద్ద పెద్ద జ్ఞానులున్నారు కదా! జ్ఞానులు పెట్టినట్టి పేరు అది యాదవుడని. యాదవ్ అని ఎందుకు పేరు పెట్టినారు? అని అంటే తెలంగాణలోకి పోతే ఇప్పుడు కూడ పల్లెలలో మేము వింటూ ఉంటాము. మేము చెప్పినది నీకు జ్ఞాపకం ఉందా అని అడిగితే 'యాద్

లేదు' నాకు అంటారు. యాద్ లేదు అంటే ఏమని? జ్ఞాపకం లేదు అని అర్థము. 'యాద్' అనే పదం సంస్కృతంలో ముఖ్యమైన పదం అంటే సంస్కృత భాషలో ఉండే పదము. అదే హిందీలో కూడ ఉంది. సంస్కృతానికి దగ్గరగా ఉండే భాష హిందీ. ఆ హిందీలో యాద్ అంటే జ్ఞప్తి. అదే పదాన్నే మనం తెలంగాణ భాషలోకి పోతే సగం హిందీ, సగం తెలుగు కలిపి మాట్లాడతారు. అక్కడ చారాణ, ఆఠాణా అంటారు కానీ పావలా, అర్ధరూపాయి అనరు. పుట్నాలు అంటారు కానీ పప్పులు అనరు. భాషంతా మిక్స్‌గా ఉంటుంది అన్నమాట. సగం హిందీ సగం తెలుగు. ఆ రకంగానే 'యాద్' అనే పదం.

ఇక్కడ తెలంగాణ భాషలో కూడ చాలాచోట్ల యాద్ అనేది మిక్స్ అయి ఉంటుంది. అంటే తెలుగు పదంగానే ఇది ఉంటుంది. కానీ తెలుగు పదం కాదు, హిందీ పదం. సంస్కృత పదము. 'యాద్' అనేటటువంటి పదం నుంచి పుట్టినదే యాదవ్! యాద్ అంటే ఏమి? జ్ఞప్తి. **యాదవుడంటే జ్ఞప్తి కలిగినటువంటివాడు.** జ్ఞప్తి కలిగినటువంటివాడు ఎవడు? మొదట కృష్ణుడే. అంటే తన మీద తనకి జ్ఞప్తి ఉండి, నేను ఫలానా అని తెలిసి బయటికి ఫలానా నటించేవాడు ఎవడు? కృష్ణుడు. మీరు ఫలానా అని రవ్వంత సేపు జ్ఞాపకం పెట్టుకోండి చూస్తాము. నేను మామూలుగా ఫలానా వ్యక్తిని అని బయట జ్ఞాపకం ఉంటుంది. నేను ఫలానవాణ్ణి అని, నేను ఫలానా రెడ్డినో, ఫలానా చౌదరినో అని బయటి పేర్లుంటాయి చూడండి. అలాంటి పేరు మీకు జ్ఞాపకం ఉంటుంది. కానీ బయట జ్ఞాపకం కాదు, ఆయన లోపల జ్ఞాపకం ఉండేవాడు. తాను మనిషిని కాను అని తను కేవలం ఒక ఆత్మనని, నేను మనిషి రూపంలో ఒక శరీరాన్ని ధరించి ఉన్నానని అనగా మనిషి శరీరం ధరించి నేను ఇక్కడ నటిస్తున్నాను అని

కర్మయోగాన్ని తూచా తప్పకుండా లోపల జ్ఞాపకంతో ఆచరించినటువంటి వాడు. కర్మయోగం అని భగవద్గీతలో చెప్పబడింది. కర్మయోగం అనేది జ్ఞాపకం ఉన్నప్పుడే ఆచరణకు వస్తుంది. జ్ఞాపకం లేకపోతే ఆచరణకు రాదు. అది జ్ఞాపకం పెట్టుకొని ఉంటేనే, మనిషికి కర్మయోగం అవుతుంది. జ్ఞానాన్ని జ్ఞాపకం పెట్టుకొని ఉంటేనే మనిషికి కర్మయోగం అవుతుంది. జ్ఞానము అంటే 'జ్ఞా' అనే అక్షరంతో మొదలవుతుంది. జ్ఞాపం, జ్ఞాపకము అంటే జ్ఞానమే. నీకు అది ప్రపంచ జ్ఞాపకం కావచ్చు, పరమాత్మ జ్ఞాపకం కావచ్చు. మనం చెప్పుచుండేది ప్రపంచ జ్ఞానమా? పరమాత్మ జ్ఞానమా? అంటాము. చూడు జ్ఞానమంటే పరమాత్మ జ్ఞాపకమా? అంటే దేవుని జ్ఞాపకమా? ప్రకృతి జ్ఞాపకమా అంటే ప్రపంచ జ్ఞాపకమా? అదే మనం లెక్కేసుకుంటా ఉంటాం. మనమంతా ప్రపంచ జ్ఞాపకంలో బ్రతుకు తుంటాము. మనం కూడ యాదవులమే, ఎందుకంటే ప్రపంచ జ్ఞాపకంలో ఉండాలి కాబట్టి. ఆయన దేవుని జ్ఞాపకంలో ఉన్నాడు కాబట్టి పరమాత్మ జ్ఞాపకంలో ఉన్నవాడు, అందుచేత నిజమైన యాదవుడు ఎవరు? ఆయన. కాబట్టి ప్రపంచ జ్ఞాపకంలో ఉండేవాళ్ళకి యాదవులు అని పేరు రాలేదుకానీ, పరమాత్మ జ్ఞాపకంలో ఉన్నట్టి అతనికి యాదవ్ అనేటటువంటి పదాన్ని తగిలించారు. ఆయనకు పెద్ద పెద్ద మహర్షులు, పెద్ద పెద్ద జ్ఞానులు అందరూ ఆ పేరును ఆయనకు బిరుదుగా అతికించారు.

యాదవ్ అంటే జ్ఞానం కలిగినటువంటివాడు, జ్ఞాపకం కలిగినటు వంటివాడు అని అర్థము. ఏ జ్ఞాపకం కలిగియుంది ఆయనకు? లోపల తన ఆత్మ మీద తనకు జ్ఞాపకం ఉంది. మనకు ఆత్మ అంటే ఏమో తెలియదు. మన ఆత్మ మీద మనం ఎప్పుడు జ్ఞాపకం పెట్టుకుంటాం? అది లోపల ఉంటుంది. లోపల జ్ఞాపకం ఎవరికీ ఉండదు. అంతా

బయట జ్ఞాపకమే. ఇప్పుడు చూస్తుంటే ఇక్కడ బయట జ్ఞాపకం ఉంటుంది. వింటూ ఉంటే బయట జ్ఞాపకమే ఉంటుంది. ఆ రకంగా ఇట్లా బయట వింటూ చూస్తూ అన్ని బయట జ్ఞాపకాల్లో మనం కలిసిపోయినాము. ఈ రకంగా బయట జ్ఞాపకాల్లో కలిసిపోయినటువంటి వ్యక్తి బయట యోచనలే చేస్తుంటాడు. బయట దానిని గురించే వాడు మాట్లాడతూవుంటాడు. అదే ధ్యాసలో ఉంటాడు. కానీ వేరే ధ్యాస ఉండదు. వేరే ధ్యాస ఎవరికి ఉంటుంది? అంటే జ్ఞానం తెలిసినటువంటి వాళ్ళకు మాత్రం ఉంటుంది. జ్ఞానం అంటే పూర్తి సంపూర్ణమైన జ్ఞానం తెలిసినటువంటివాళ్ళకు కొంత మరిచిపోతూ కొంత జ్ఞాపకం కలుగుతూ ఉంటుంది అన్నమాట. అప్పుడప్పుడు తన్ను తాను మరిచిపోతూ ఉంటారు. పూర్తి జ్ఞాపకం కలిగినటువంటివాడు భగవంతుడు. తన్ను తాను మరిచిపోకుండా చిన్నప్పటి నుండి పెద్దగా మారి, చివరకు శరీరాన్ని వదిలి పెట్టేంతవరకు జ్ఞాపకం కలిగినటువంటివాడు. తన మీద తను జ్ఞాపకం కలిగినటువంటివాడు భగవంతుడు. ఆ భగవంతుడే ఈ కృష్ణుడు. యాదవ్ అనేటటువంటి పేరు, ఆ బిరుదు కృష్ణునికి పూర్తి సంపూర్ణంగా వర్తించింది.

ఆ రోజు ఆ పేరును పెద్దలు నిర్ణయం చేసి, జ్ఞానం కలిగినటువంటివాడు అని శ్రీకృష్ణ యాదవ్ అన్నారు. శ్రీకృష్ణ భగవాన్ అని ఎట్లయితే అన్నామో మనం శ్రీకృష్ణ యాదవ్, కృష్ణ యాదవ్ అనే పేర్లు ఇప్పుడు కూడా మనం విన్నాము. కృష్ణ యాదవ్ అనే పేరును అది మనం యాదవులు కాకున్నా కానీ ఆ కృష్ణుడివల్ల ఆ కులానికి ఆ పేరు అతికించుకొని మనం ఏమి చేసాం అంటే గొల్లవాళ్లందరినీ మనం యాదవులు అని అనుకుంటున్నాం. ఈ మధ్య కాలంలో వాళ్ళు గొల్లవాళ్ళంతా యాదవులని చెప్పుకుంటున్నారు. గొల్లవాళ్ళంతా యాదవులా? జ్ఞానం తెలిస్తే

యాదవులైతారు. జ్ఞానం తెలియకపోతే ఏమైతారు? గొల్లవాళ్ళే అవుతారు. కాబట్టి ఇప్పుడు మనం ఒక ప్రశ్న వేసుకున్నాము కదా! కృష్ణుడు క్షత్రియుడా? గొల్లవాడా? అని. ప్రపంచపరంగా క్షత్రియుడు ఉండొచ్చు, గొల్లవాడై ఉండొచ్చు. జ్ఞానపరంగా ఆయన క్షత్రియుడు కాదు, గొల్లవాడు కాదు. ఆయన పుట్టినది క్షత్రియుల ఇంట్లో, మొత్తం పెరిగినదంతా గొల్లవాళ్ళ ఇంట్లో. కానీ ఇప్పుడు మనం క్షత్రియుడు అంటామా? గొల్లవాడు అంటామా? పుట్టినది రవ్వంత సమయం కదా, ఆ పుట్టినరోజు మాత్రం క్షత్రియుడు. పెరిగినదంతా గొల్లవాళ్ళ ఇంట్లో కాబట్టి జీవితమంతా గొల్లవాళ్ళ ఇంట్లో కాబట్టి గొల్లవాళ్ళు అనొచ్చు మనం. అట్లా చెప్పుకుంటే, ఇప్పుడు మళ్ళీ ఆయన గొల్లవాడా లేకపోతే క్షత్రియుడా? అంటే ఆయన ఏ దానికి సంబంధించిన వాడు కాదు. కానీ వాస్తవంగా యాదవుడు. నేను యాదవున్ని అన్నాడు. నేను యాదవున్ని అని కృష్ణుడు ఎప్పుడైతే చెప్పినాడో, అప్పటినుండి కృష్ణుడు పుట్టినటువంటి ఆ కులానికంతా యాదవులు అని పేరు వచ్చేసింది. మళ్ళీ యాదవ్ అనే దాని వెనకాల, దాని అర్థం ఈ విధంగా ఉంది. కాబట్టి యాదవులు ఎవరైనా ఉంటే, గొల్లవాళ్ళు ఎవరైనా ఉంటే మీరు జ్ఞానం తెలుసుకోండి అని మనం చెప్తాము. ఇప్పుడు గొల్లవాళ్ళు ఎవరైనా ఉంటే యాదవులా వాళ్ళు? కాదు. యాదవులు ఎవరైనా ఉంటే, జ్ఞానులు ఎవరైనా ఉంటే అని అర్థం. యాదవ్ అనే పదం ఎవరికి వర్తిస్తుంది? గొల్లవాళ్ళకు మాత్రమే కాదు, జ్ఞానం తెలుసుకున్న ఎవరికైనా గానీ వర్తిస్తుంది. అంటే యాదవ్ అనేటటువంటి పేరు ఎవరికైనా వర్తిస్తుంది. కాబట్టి జ్ఞానం తెలుసుకుంటే మనం యాదవులమవుతాము. ఇప్పటి నుండి మనం జ్ఞానం తెలుసుకుంటే శ్రీకృష్ణుని వంశంలో పుట్టినవాళ్ళం మనం అవుతాము.

ఈ రోజు కృష్ణాష్టమి అని కృష్ణున్ని గొప్పగా మనం చెప్పుకొని, ఆయనను ఆదర్శంగా తీసుకొని మనం గొప్పగా బ్రతకాలంటే మనం కూడా యాదవులు కావాలి. అంటే కులం మార్చుకోమని చెప్తారా మీరు అని అడగొచ్చు. నేను కులం మార్చుకోమని చెప్పలేదు. లోపల ఉండేటటువంటి పద్ధతి మార్చుకోమని చెప్పుచున్నాను. అజ్ఞాన జీవితాన్ని వదిలి జ్ఞాన జీవితంలోకి పొమ్మని చెప్తున్నాము. కానీ కులం మార్చుకోమని చెప్పడం లేదు కదా. యాదవ్ అనేది కులమా? కాదు. ఇంతవరకు కులం అని మనం అనుకున్నాము. యాదవ్ అంటే కులమేనేమో, గొల్లవాళ్ళను యాదవులు అంటారేమో అని మనం అనుకున్నాము. కానీ పద్ధతి ప్రకారం చూస్తే కృష్ణుడు యాదవుడే. ఆయన గొల్లవాడా? కాదు. మళ్ళీ కృష్ణుడు గొల్లవాడు కానప్పుడు, యాదవుడు ఎందుకన్నాము? అంటే జ్ఞానాన్ని బట్టి వాళ్ళు యాదవుడు అన్నారు. కాబట్టి మనం కూడా జ్ఞానం ప్రకారం యాదవులు అవుతాము కానీ, కులం మార్చుకునేది కాదు, అది కులం పేరు కాదు. యాదవుడు అనేది కులం పేరా? కానే కాదు. కాబట్టి మనం 'యాద్' అనే పదంతో జ్ఞాపకం అనేటి పదంతో, జ్ఞానం అనేటటువంటి పదంను మన శరీరంలో అమలుపరుచుకున్న రోజు మనం కూడా నిజమైన యాదవులైతాము. కృష్ణుడు యాదవుడుగా పుట్టాడు, యాదవునిగా బ్రతికాడు, యాదవునిగానే పోయాడు. మరి ఆయనలో ఆ రోజు అంత జ్ఞానం ఉండేది.

మనకు కొంత జీవితం అయిపోయింది. మరి ఈ జీవితం కంటే వెనక జీవితంలో మనం ఎట్లా బ్రతికినామో, ఏ కులంలో బ్రతికినామో ఇప్పుడు మనం మార్పు తెచ్చుకుంటే మనం కూడా యాదవులు కావచ్చు. శ్రీకృష్ణున్ని యాదవుడు అని ఎందుకన్నారు అంటే, మనం ఇప్పుడు ఆ

విషయాన్ని కొంత లెక్కేసుకుంటే, కృష్ణుడు యాదవుడు అనే దానికి జ్ఞానపరంగా దొరికినటువంటి ఆధారం ఇది. సరే ఆయనను యాదవుడు అని ఎందుకు అన్నారు జ్ఞానాన్ని బట్టి అన్నారు. మనం చూసుకునేదానికి, ఆయన జీవితంలో ఎక్కడైనా జ్ఞానం చెప్పినాడా? జ్ఞానం ప్రకారం బయటికి కనిపించాడా అంటే, ఆయన కనిపించలేదు అని చెప్పుచున్నాము కదా. కనిపించకూడదనే ఉద్దేశ్యముతో వచ్చినాడు. మళ్ళీ కనిపించుకోకుండా ఆయన పోయినాడు. యాదవునిగా ఎక్కడా కనిపించలేదు. జ్ఞానం పద్ధతి ప్రకారం చూసుకున్నా కానీ యాదవునిగా ఎక్కడా కనిపించలేదు. మళ్ళీ ఆ రోజు ఆయనను ఏ జ్ఞానులు అన్నారు? ఏ మహర్షులు అన్నారు యాదవుడని? మీకేమన్నా తెలుసునా? అని మీరు ప్రశ్న వేసుకోవచ్చు. ఒకే ఒక వ్యక్తి ఆయనను యాదవ్ అని. కృష్ణున్ని యాదవ్ అని అన్నాడు. ఒక వ్యక్తి ఎవరు? అంటే కృష్ణుడు యాదవుడని తెలిసిన వ్యక్తే అని వుంటాడు. కానీ తెలియనటువంటి వ్యక్తి ఎట్లాంటాడు? జ్ఞానం ప్రకారం యాద్ అంటే చాలా గొప్ప అర్థం ఉంది. **యాద్ కలిగినటువంటివాడే యాదవుడు** అని మనం చెప్పుకుంటే ఆయనకు జ్ఞానముంది అని ఎవరన్నా ఆ రోజు అనుకున్నారా? మనముందర ఉన్నాడు, మనముందరే పెరిగినాడు, మనముందరే కనిపించే రకంగా ఉన్నాడు. ఓసారి పారిపోయినాడు, ఓసారి గెలిచినాడు. ఈ రకంగా రకరకాల పనులు చేసినాడు కదా ఆయన. చేయలేని పనులు, చేయకూడని పనులు, అన్నీ చేసినాడు కదా ఆయన. మళ్ళీ ఆ రకంగా లెక్కేసుకుంటే జ్ఞానం ప్రకారం అయినా కానీ, ఆయనను ఎవరైనా యాదవుడు అంటారా? మీరు ఆ రకంగా చూస్తే యాదవుడు అన్నది ఎవరు? అంటే ఒక వ్యక్తి ఆయనను యాదవుడు అన్నాడు. ఆ యాదవ్ అని ఒకే ఒక వ్యక్తి అంటే, అది జీవితాంతం నిలిచిపోయి

అప్పటినుండి ఇప్పటికి 5000 సంవత్సరాల తర్వాత కూడా ఆయన బ్రతికినటువంటి గుంపునందరిని యాదవ్ అనే పేరు వచ్చేటట్లు చేసింది. అలా అన్న వ్యక్తి ఎవరు అంటే ఒకే ఒక భీష్ముడు. భీష్ముడు ఒక్కడు మాత్రమే కృష్ణున్ని యాదవ్ అన్నాడు. ఆయన యాదవుడని ఎవరికి తెలుసు? ఆ రోజుల్లో కేవలం ఒక భీష్మునికి మాత్రం తెలుసు. ఆ రకంగా భీష్ముడు ఒక్కడు అన్నట్టి ఒకే పేరును, ఈ రోజు దేశమంతా ప్రజలకు అది అతికించబడింది. కానీ అర్థం మనకు తెలియకుండా పోయింది.

యాదవ్ అనే పదానికి అర్థం కోసం మనం కృష్ణుడు యాదవునిగా ఎలా జీవించాడు అనే దానికోసం మనము ఇంతగా చెప్పుకోవాల్సిన పని వచ్చింది. కృష్ణాష్టమి సందర్భం కాబట్టి, కృష్ణున్ని మనం ఆదర్శంగా తీసుకొని బ్రతకాలంటే, ఆయనకు ఆ పేరు ఎందుకొచ్చింది? ఆయన యాదవునిగా ఎట్లా బ్రతికినాడు అని మనం చూసుకుంటే, తర్వాత మనం కూడా అదే విధానంలో ఆయనను ఆదర్శంగా తీసుకొని బ్రతికేదానికి అవకాశ ముంటుంది. కాబట్టి యాదవ్ అనేటటువంటి పదానికి మనము అంతగా అర్థం చెప్పుకోవాల్సిన పని వచ్చింది. ఇప్పుడు ఆయనకు ఏమి జ్ఞాపకం ఉంటుంది? ఏమి జ్ఞానం ఉండింది ఆయనలో? భీష్ముడు ఆయనలో ఏమి చూసి యాదవుడు అని అన్నాడు అని మనం మళ్ళీ ఒక ప్రశ్న వేసుకోవచ్చు. ప్రశ్న వేసుకుంటేనే మనకు సమాధానం దొరుకుతుంది. ప్రశ్న లేకపోతే అసలు సమాధానం దొరకదు. సరే అప్పుడు ఆ లెక్కన చూసుకుంటే ప్రతి శరీరం పుట్టినట్లే, కృష్ణుని శరీరంలో కూడ, కృష్ణుడు మనిషిగా పుట్టాడు. దేవుడైనా మనిషిగా పుట్టి, మనిషిగా తిరిగినాడు. కాబట్టి ఆయన శరీరంలో కానీ, మన శరీరంలో కానీ అన్ని శరీరాల్లో ఒకటే, సూత్రబద్ధంగా ఉండే పద్ధతి ఒకటుంది. అదేమిటంటే మనం శరీరంలో జీవిస్తూ ఉన్నాము. ఆ

విధంగా కృష్ణుడు కూడా శరీరంలో కొంతకాలం జీవించాడు. మనం ఎంతకాలం బ్రతుకుతామో మనకు తెలియదు. కానీ ఆయన దాదాపు 126 సంవత్సరాలు బ్రతికాడు. మనం కృష్ణున్ని ఎట్లా చూస్తామంటే, ఎప్పుడు చూసినా యుక్తవయస్సు వాని మాదిరి చూస్తుంటాము. మనం బొమ్మలన్నీ ఎట్లా పెట్టుకున్నాం అంటే, బాగా యుక్తవయస్సులో ఉండే బొమ్మలు పెట్టుకున్నాం. కాబట్టి కృష్ణున్ని ఎప్పుడూ మనం యుక్త వయస్సువాడు అనుకుంటున్నాము. మనకు అట్లా అలవాటు అయిపోయింది. ఓ మనిషి అయిన తర్వాత యువకునిగా ఉంటాడు, ముసలివానిగా ఉంటాడు. ముసలివానిగా ఎప్పుడు మాట్లాడినాడు, యువకునిగా ఎప్పుడు మాట్లాడినాడు అని ఆలోచన ఏమాత్రము మనము చేయలేదు.

రామాయణం ఉంది, రామాయణంలో రావణాసురుడు అంటేనే వాడు పనికిమాలినోడు దుర్మార్గుడు అని అంటాము. సీతను ఎత్తుకొచ్చాడు అంటాము. ఆయన సీతను 80 ఏళ్ళ వయస్సులో తెచ్చుకున్నాడు. 80 ఏళ్ళ వయస్సులో ఏమి చేద్దామని ఆమెను ఎత్తుకొచ్చినాడు? ఏమన్నా రవ్వంతన్నా బుద్ధి ఉందా! మనకు మాట్లాడుకునే దానికి? 80 ఏళ్ళ వయస్సులో ఎత్తుకొచ్చినది మాత్రం వాస్తవమే. కానీ ఆయన ఏం ప్రతిపాదించాడు? అంటే ఏమని లెక్కేస్తాం మనం? కామాంధుడు అన్నాము. 80 ఏళ్ళ వయస్సులో ఏమి కామం ఉంటుంది ఆయనకు? ఏమి ఆశ ఉంటుంది? కానీ ఆయనను తప్పుగా అర్థం చేసుకున్న మనం ఏమీ చేసామంటే, 80 ఏళ్ళ వయస్సులో ఉన్నటువంటి రావణ బ్రహ్మను మనం రావణాసురుడు అనేసి, ఒక రాక్షసునిగా చిత్రీకరణ చేసాము. రావణుడిని ఎప్పుడూ యుక్తవయస్సుగానే చూసి, యుక్తవయస్సుగానే లెక్కేసి, యుక్తవయస్సుగానే మాట్లాడుకుంటూ వచ్చాము. అలాగే కృష్ణున్ని ఎప్పుడు

చూసినా ప్రతి నిత్యము యుక్తవయస్సు ఉండేవానిగానే చెప్పుకున్నాము. అర్జునునికి రథం నడిపినప్పుడు దాదాపు 90 ఏళ్ళ వయస్సుంటుంది. కురుక్షేత్ర యుద్ధం చేసిన తర్వాత దాదాపు 36 సంవత్సరాలకు కృష్ణుడు చనిపోయాడు. 90 ఏళ్ళ వయస్సులో కూడా ఆయన గురించి ఏం చెప్తారంటే ఆడవాళ్ళ వెంట తిరిగినాడు అంటారు. ఎప్పుడో చిన్నప్పుడు తిరిగి ఉండవచ్చు కానీ, ఎప్పటికీ అదే పదం వాడితే ఏమి బాగుంటుంది? అట్లా ఇవన్నీ మనకు తెలియనివి చాలా మాట్లాడుతుంటాము. ఒకమాట మాట్లాడితే దానికి ఏదైనా పద్ధతి, పాడు ఉండాలి. కొంత అర్థంపర్థం ఉండాలి. ఎప్పుడూ ఏదో ఒకటి మాట్లాడడం ఇంకొకరి గురించి తప్పుగా చెప్పడం చేస్తుంటాము. ఏదైనాగానీ ఆలోచన చేయం ఆ రకంగా బయటికి మనం ఎట్లా మాట్లాడుకున్నా కానీ, ఆ రోజు భీష్ముడు ఆయనలో ఏమి చూసాడు?

కృష్ణునికి దగ్గర దగ్గర 90 ఏళ్ళ వయస్సులో, వాళ్ళ ముని మనవళ్ళకు ముని మనవళ్ళు పుట్టారు భీష్మునికి మనవళ్ళ తరువాత మనవళ్ళు ఉన్నారు. అట్లాంటి సందర్భంలో ఆయన యుద్ధం చేస్తున్నాడు. కురుక్షేత్రయుద్ధంలో ఆయన యుద్ధం చేసాడు కదా! భీష్ముడు, యుద్ధం చేసినప్పుడు ఈ పాండవుల పక్క సైన్యమంతా ఆయనను ఎదుర్కో లేకపోయింది. పాండవుల సైన్యంలో ఉన్న అర్జునుడు కానీ, భీముడు కానీ, నకులుడు కానీ ధర్మరాజుగానీ ఎవ్వరు కూడా ఆయనను ఎదిరించ లేకపోయారు. యుద్ధంలో పోరాడుతున్నారు, ఆయన పద్ధతి ప్రకారం యుద్ధ ధర్మం ప్రకారం, యుద్ధం ఎట్లా చేయాలో అట్లా చేస్తున్నాడు. 18 రోజులు భారత యుద్ధం జరిగితే, కురుక్షేత్ర యుద్ధం జరిగితే 8 రోజులు ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేకపోయారు, ఎవరు? పాండవులు,

8 రోజులు భీష్ముడు సైన్యాధ్యక్షునిగా ఉన్నంతవరకు ఒక్కరు కూడా ఏమీ చేయలేకపోయినారు. ఒక్కరిని కూడా వీళ్ళు అవతల వైపు వాళ్ళను చంపలేదు. పాండవులు తమను కాపాడుకునేదానికి సరిపోయింది. ఇంక వాళ్ళు ఒక నిర్ణయానికి వచ్చారు. భీష్ముడు ఉన్నంతవరకు ఎటువంటి పరిస్థితుల్లోనూ మనం జయించలేము, యుద్ధం సాగదు అని పూర్తి నిరుత్సాహ పడిపోయినారు.

కృష్ణునికి కూడా రథం తోలలేక ఇట్లా తోలి, అట్లా తోలి ఈయనకు నీరసం వచ్చింది, ఏమి చేస్తారు? భీష్ముని దాడి తట్టుకోలేకున్నారు. భీష్ముడు వేసే బాణాలకు అర్జునుడు తట్టుకోలేక పోతున్నాడు. ఈయనకు కూడా 8వ రోజు కోపం వచ్చింది ఎవరికి? కృష్ణునికి. మాములు మనుషులైనప్పుడు కోపం రాక ఏం చేస్తుంది? ఈ ముసలివానితో మీకు పెద్ద ఆటంకము అయింది. ఈయన ముసలివాడే అనుకో, ఆయన ఇంకా పెద్ద ముసలివాడు. ఈ పెద్ద ముసలివానితో పెద్ద తిప్పలైంది. ఇక మీతో కాదుకానీ మేము ముసలివాళ్ళం ముసలివాళ్ళం మేమే కొట్లాడతాము అని ఆయన ఏమి చేసినాడు, ఇంక పోయే రథం నుండి కిందికి దూకినాడు, నిన్ను చంపేస్తా అని చక్రం తీసుకున్నాడు. అర్జునుడిని "నీతో కాదు, నేను నిన్ను కాపాడుతాను భీష్మున్ని చంపేస్తాను" అని చెప్పేసి దూకినాడు. పూర్తిగా కోపం వచ్చింది కృష్ణునికి. భగవంతుడే ఆయన కానీ ఆ సందర్భం అది. అక్కడ ఒప్పుకునే పద్ధతి ఏది? నేను యుద్ధం చేయను, కత్తి పట్టను, ఆయుధం పట్టను, యుద్ధం చేయనని చెప్పినాడు కదా. ఊరకనే సలహా చెప్తుంటాను అంత తప్ప ఏమీ చేయను అని చెప్పినాడు కదా. మళ్ళీ అట్లాంటప్పుడు, చెప్పిన మాటలన్ని పక్కన పారేసి, అన్యాయంగా చక్రం తీసుకొని నేను చంపుతాను అని ఆయన మీదికి వచ్చాడు.

యుద్ధములో కృష్ణునికి సంబంధం లేదు. కేవలము రథం నడిపే దానికి మాత్రం వచ్చినాడు. మరి భీష్మునికి మీదికి పోతే భీష్ముడు ఎవరు? అని చూస్తే అంతవరకు వీళ్ళందరినీ ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాపినట్టి భీష్ముడు ఏమి చేసాడు తెలుసునా? అది తెలుసుకునే ముందు ఏమి జరిగిందో కొంతగా చూద్దాము. కృష్ణుడు ఎప్పుడైతే కిందికి దూకినాడో, అప్పుడు అర్జునుడు ఏమి చేసినాడు అంటే బావా! నువ్వు చంపితే మాకు చెడ్డ పేరు వస్తాది, మరి కృష్ణుడు చంపినాడని చెడ్డ పేరు వస్తుంది అని గట్టిగా నడుము పట్టుకున్నాడు. విడిపించుకొని పోతున్నాడు. కృష్ణుడు అప్పుడు మన మాదిరి వాళ్ళు అంగీలు వేసుకునే వారు కాదు. ఊరికే టవల్ కప్పుకొని పోయాడు. ఎక్కడ పట్టుకుంటే బాగుంటది, గోచీ పట్టుకుంటే ఊడిపోతాది అని గట్టిగా నడుము పట్టుకున్నాడు. పట్టుకుంటే కృష్ణుడు లాక్కొనిపోతున్నాడు అర్జునుడిని కూడా లాక్కొని పోయేటటువంటి సందర్భం అది. అంత భీకరంగా కనిపిస్తావుంది. ఆ సందర్భంలో అట్లా కనిపించినప్పుడు ఆయన ఏమి చేసినాడు? అంతవరకు భయంకరంగా యుద్ధం చేసినట్టి భీష్ముడు, కృష్ణుడు ఎప్పుడైతే రథం దూకి చక్రం తీసుకుని చంపుతానని అన్నాడో, అర్జునుడు ఎప్పుడైతే అడ్డుకుని అతన్ని గట్టిగా పట్టుకుంటున్నాడో అట్లాంటప్పుడు భీష్ముడు మళ్ళీ తిరిగి నన్ను ఎట్లా చంపుతావు అని కోపం రెట్టించిపోవాలి కదా. కానీ రెట్టింపు కోపం రాకుండా అంతవరకు భయంకరంగా యుద్ధం చేసినట్టి భీష్ముడు ఏమి చేసాడంటే ఆ ధనస్సును క్రిందపడవేసి, నమస్కారం చేస్తూ దిగి వచ్చాడు. చేతులు జోడించి వినయ విధేయతతో కృష్ణునికి ఎంతో సంతోషంగా ఎదురు వచ్చాడు ఆయన. ఏమని వచ్చాడు? అంటే నీ చేతిలో నా ప్రాణం పోతే అంతకంటే భాగ్యం ఏముంది అంటు వచ్చాడు.

వాస్తవానికి పాండవులు భీష్ముని చంపాలని ప్రయత్నం చేసినా కానీ అసలు వాళ్ళు చంపేది ఏముంది? ఈయన వాళ్ళను చంపాలని వెళ్తుంటే, ఆయన నుండి తప్పించుకోవడానికి పాండవులకు తలనొప్పి అయిపోయింది. ఆయన వేసే బాణాల ధాటికి తప్పించుకోలేకపోతున్నారు. అటువంటి పరిస్థితిలో ఉన్నట్టి వాళ్ళకు, అంత భయంకరమైనట్టి యుద్ధం చేసినవాడు, చేతులు జోడించి రావాల్సిన పని ఏమి వచ్చింది? ఎంత పెద్ద సైన్యాన్ని ఏమాత్రం లెక్క చేయకుండా యుద్ధం చేసేవాడు, కేవలం ఒక్క కృష్ణుడు కిందికి దూకితే చేతులు జోడించి రావడం అంటే ఎంత గొప్పతనం అది? అంటే కృష్ణునిలో ఉండేటి గొప్పతనం గ్రహించాడు భీష్ముడు. చేతులు జోడించి భీష్ముడు వస్తుంటే ఈయన కోపం తగ్గిపోయింది. ఎవరికి? కృష్ణునికి. ఇంక కొడతానంటే కొట్టు చూద్దాం అని వచ్చేవానిని కొట్టవచ్చు. కానీ కొట్టు అనేవాన్ని ఎవడు ఏం చేస్తాడు? కొట్టు అని వస్తే ఊరకున్నాడు. ఇంకేం కొడతాం అని. వాడు ఎదురుగా కొట్లాటకి వస్తే వానిని మనం కొట్టొచ్చు. వాడు కొట్టు అని ముందే ఒప్పుకున్నాడు. ఇంక ఏం కొడతాం? కొట్టినా ఒకటే, కొట్టకున్నా ఒకటే ఈయన అనుకున్నాడు. ఆ రకంగా ఏం చేసినాడంటే కోపం చల్లారిపోయి ఇక మళ్ళీ వెనక్కి వచ్చాడు. భీష్ముడేమో వచ్చిన ఛాన్స్ పోయింది అనుకున్నాడు. ఈ అర్జునుడు ఎంత పని చేసే నాకు అని? అంటే ఆ రకంగా ఒక సందర్భంలో జరిగింది.

ఈ సందర్భాన్ని ఎందుకు చెప్పుకుంటున్నాం మనం అంటే, కృష్ణుడు ఎంతటి గొప్పవాడో ఎవరికి తెలుసు? భీష్మునికి తెలుసు. కాబట్టి అంత భయంకరంగా యుద్ధం చేసేటటువంటివాడు పాపం వెంటనే దిగివచ్చి నమస్కారం చేసాడు. అర్జునుడు లాక్కొని పోయాడు, కాబట్టి కృష్ణుని కోపం తగ్గిపోయింది. భీష్ముడు తనను ఎట్లా చంపుతావో చంపు చూస్తా

అని కృష్ణునితో అంటే ఈయన చంపేసేవాడేమో! భీష్ముడు ఎటువంటి కోపం కూడ ప్రదర్శించకుండా వినయంగా దిగి వచ్చాడు అంటే కృష్ణుడు ఏం చేసాడు? పాపం తన్నుతాను కంట్రోల్ చేసుకొని, ఈయనను అర్జునుడు లాక్కొనిపోయి రథంపై కూర్చోపెట్టినాడు. నువ్వు రథం నడుపు చాలులే, నేను చూసుకుంటా అని అన్నాడు. సరేలే అని మళ్ళీ కృష్ణుడు పోయి రథం నడిపినాడు. మరి అర్జునుడు పోయి ఆయన రథం ఎక్కి యుద్ధం చేసాడు. అది మొదలు పెట్టాక పొద్దున 8 గంటలకో 9 గంటలకు జరిగింది. 9 దాకా చేసినా వీళ్ళు ఆయన ప్రతాపానికి వీళ్ళు తట్టుకోలేరు. అప్పుడు కూడ కోపం వచ్చి కృష్ణుడు దిగి వచ్చినాడు. ఎందుకులే అని ఆయన యుద్ధం చేయకుండా మానుకున్నాడా? అప్పుడు కూడ విడిచిపెట్టలేదు ఆయన. అప్పటికి దాదాపు 120 సంవత్సరాలు ఆయనకు కూడ ఉన్నాయి. ఎవరికీ? భీష్మునికి 120, 130 సంవత్సరాలు ఆయనకు ఉన్నాయి. అంత వయస్సులోనూ అందరికీ తాత అయిన అంత వయస్సులోనూ, అంత భయంకరంగా యుద్ధం చేస్తే, చివరికి వచ్చి ఈ రోజు కృష్ణుడు, అతని మీదికి పోయినప్పుడు అర్జునుడు అడ్డుపడినప్పుడు, ధర్మరాజు మిగతా పాండవులు ఏమనుకొన్నారంటే, భీష్ముని చంపడం మనతో కాదు అని అనుకున్నారు. అర్జునుడు, కృష్ణున్ని విడిచిపెట్టి ఉంటే, కృష్ణుడు ఆ ముసలివాడిని చంపేసి ఉండేవాడు. ఆ ముసలివాడు చచ్చిపోయివుంటే బాగుండును కదా! మనవాడు (అర్జునుడు) అనవసరంగా అడ్డం పోయాడు, అడ్డం పోకపోతే యుద్ధ నీతి అంతా చెడిపోతాది, అన్యాయమైన యుద్ధం అవుతుంది, చెడ్డపేరు వస్తుంది అని ఆ రోజు అర్జునుడు అనుకున్నాడు. ఎలాగో మళ్ళీ వాళ్ళంతా కూర్చొని చర్చించుకున్నారు. నువ్వు ఎందుకు అడ్డం పోయావు అని అర్జునున్ని అడిగారు. అలా చేయకపోతే అన్యాయ

యుద్ధం అవుతుంది కదా! అని అర్జునుడన్నాడు. అలా ఆ రోజు ఏం జరిగింది అంటే అన్నదమ్ములంతా కూర్చోని మాట్లాడుకున్నారు. ఇంక చివరకు ఏమీ చేసినారంటే చేతులు ఎత్తేసినారు. ఇక సరే ఎలాగో అలా కానీ ఆ ముసలోడు ఉన్నంతవరకు, మన తాత ఉన్నంతవరకు మనతో కాదు. (తాతే కదా ఆయన. వీళ్ళకు తాతే వాళ్ళకు తాతే.) మనము జయించలేము. మనకు ఈ యుద్ధంలో జయము అనేది ఉండదు అని వీళ్ళు ఒక నిర్ణయానికి వచ్చి, చివరకు కృష్ణున్ని అడిగినారు.

మేము ఏమి చేయాలి? మా గతి ఏమి? ఇట్లా ఎన్నాళ్ళు యుద్ధం చేసినా అసలు సైన్యాధ్యక్షునిగా ఉన్నట్టి భీష్ముడు ఓడిపోడు. మనం ఓడిపోవాల్సిందే చివరకు. మాకు జయం కలగాలంటే ఏమి చేయాలి? ఏదో ఉపాయం చెప్పు" అని. ఇవన్ని మోసాలు దగాలు చేసేదాట్లో చాలా ప్రావీణ్యుడు, ఎవరు? కృష్ణుడు. ఏదో ఒకటి మోసం చేయి. పబ్లిక్‌గా నువ్వు మోసగాన్ని అనే రకంగా చంపేదానికి పోయినావు అంత పబ్లిక్‌గా కనపడవద్దు. నేరుగా కనపడవద్దు పరోక్షంగా ఏదో ఉపాయం చెప్పు మాకు అన్నారు. ఆయన కూడా చెప్పాడు. ఏమీ ఉపాయం చెప్పినాడంటే "ఆయనను జయించేదానికి మీతో కాదు. భీష్ముడంటే చాలా తక్కువగా అంచనా వేసుకోవద్దండి. చాలా గొప్పవాడు ఆయన. ఆ జీవుడే గొప్పవాడు కాబట్టి ఆయన గొప్పవాడు అని చెప్పినాడు. మీకు ఒకటే ఒకటి ఉపాయం ఆయన దగ్గరికేపోండి. నేను చక్రం తీసుకొని వెళ్తే ఏం చెప్పాడు? చంపు అని వచ్చినాడు. ఇక నేను ఏమి చేసినాను? చంపలేక వెనక్కి వచ్చినా. చంపు అని వచ్చినాడు కాబట్టి ఇంక ఎందుకులే అని వెనక్కి వచ్చినాను. నాకు కోపం చల్లారిపోయింది. మీరు కూడా అట్లే ఆయన దగ్గరికి పోండి. ఏమన్నా చేసుకో నువ్వు! మేము కొట్లాడం కానీ చంపేయి నువ్వే అని

పోండి. ఇదే మీకు చెప్పే ఉపాయం. ఏమంటే మీరు ఆయన దగ్గరికే పోయి మేము ఎట్లా గెలవాలి అని ఉపాయం అడుగుపోండి. ఆయన చెప్తాడు. మేం గెలవాలంటే ఏమి చేయాలి అని అడుగుపోండి అని చెప్పాడు. వీళ్ళు ఏమి చేసారంటే వాళ్ళకు యుద్ధ నీతి ఉంటుంది అన్నమాట. ఇన్ని గంటల నుండి ఇన్ని గంటల వరకు యుద్ధం అని, గంట కొడతారు శంఖం ఊదితే అదే గంట! శంఖం ఊదితే అప్పటినుండి యుద్ధం ప్రారంభమవు తుంది. మళ్ళీ శంఖం ఊదితే యుద్ధం నిలిచిపోతాది. గొంతుమీద కత్తి పెట్టినోడు కూడా చంపకూడదు. దానిని గొంతు నుంచి అట్లే తీసేయాల్సిందే. అది యుద్ధ నీతి.

ఆ రకంగా యుద్ధనీతి ప్రకారం సాయంకాలం యుద్ధమైపోయింది. సాయంకాలం అంతా ఇవతల అవతల ఎవరు విడుదుల్లోకి వాళ్ళు పోయినారు. పోయినప్పుడు పాండవులు కూర్చొని మాట్లాడుకున్నారు. మాట్లాడుకున్నప్పుడు కృష్ణుడు, భీష్మున్నే అడుగుపోండి అని చెప్పి ఉపాయం చెప్పినాడు. వీళ్ళ తరపున ధర్మరాజు పోయినాడు. భీష్ముని గుడారం దగ్గరికిపోతే, ఇట్లా ధర్మరాజు వచ్చాడు మీతో మాట్లాడాలంటా అని వాళ్ళు భీష్మునికి చెప్పినారు. సరే రమ్మను అని చెప్పినాడు. ఈయన పోయి నమస్కారం చేసుకొని కూర్చొన్నాక, ఏమి ధర్మరాజా ఇలా వచ్చినావు? అంటే మేము ఎట్లా గెలవాలో మాకు అర్థంకాలేదు. నువ్వున్నంత వరకు మేము గెలవలేము. మాకు అపజయమే తప్ప ఇంకొకటి లేదు. అదే పొద్దున కృష్ణుడు నీ మీదికి కొట్లాటకు వచ్చాడు కదా, తరువాత మేం అంతా సమావేశమై మాట్లాడుకుంటే, కృష్ణుడు ఉపాయం చెప్పినాడు. మీతో కాదు మీరు పోయి ఆయననే అడుగుపోండి. ఆయనే ఏదన్నా ఉపాయం చెప్తాడు అనీ, ఏము చెప్తావో ఉపాయం వినాలి అని వచ్చాను అని భీష్మున్నే అడిగినారు

వీళ్ళు! అంటే ఎవరు చెప్పినారు ఉపాయం? కృష్ణుడు చెప్పినాడు. కృష్ణుడు చెప్పినాడు అంటే ఈయనకు కొత్త ఉత్సాహం వచ్చేసింది. ఎవరికి? భీష్మునికి కృష్ణుడు చెప్పినాడు అంటే, ఆయన మీద ఎంత గౌరవం ఉండేది, ఎంత ఉన్నతమైన భావం ఉండేది మనకు అర్థమైతుంది చూడండి. ఆయన సంతోషపడి అట్లయితే నేను ఒక మాట చెప్తాను, కృష్ణుడు చెప్పినాడు కాబట్టి. కృష్ణుడు చెప్పకపోతే మీరు శత్రువులే నేను కూడ శత్రువునే మీకు. యుద్ధంలో శత్రువులు శత్రువులే. నేను నా పద్ధతి ప్రకారం యుద్ధనీతి ప్రకారం నేను యుద్ధం చేయాల్సిందే. కృష్ణుడు నన్ను అడగమన్నాడు కాబట్టి నేను చెప్పడం నాకు పద్ధతి. అది న్యాయం కానీ, అన్యాయం కానీ నేను చెప్తాను.

మీరు మీ వైపు ఒక నపుంసకున్ని తెచ్చుకొని, రథంలో పెట్టుకోండి. నేను నపుంసకునితో యుద్ధం చేయను, నేను మగవాళ్ళతో చేస్తాగానీ సగం ఆడ సగం మగవాళ్ళతో నేను చేయను. కాబట్టి మీరప్పుడు ఏమన్నా చేసుకోండి. నా చేతిలో ధనుస్సు ఉన్నంతవరకు మీరు నన్ను జయించలేరు. నా చేతిలో ధనుస్సు ఎప్పుడు ఉండదో, అంటే నపుంసకుడు ఎప్పుడు ఎదురుగా ఉంటే అప్పుడు నేను వానితో యుద్ధం చేయను అని కింద పారేస్తాను. అప్పుడు మీరు ఏమన్నా చేసుకోపోండి అని భీష్ముడే చిన్న ఉపాయం చెప్పినాడు. ఎవరికీ తెలియకుండా అప్పుడు ధర్మరాజు అట్లాగే అని పోయినాడు. అప్పుడు మాట్లాడుకున్నారు. కృష్ణునికి చెప్తే కృష్ణుడు సరేలే అని, శిఖండి అనేటటువంటి ఒక నపుంసకున్ని తీసుకొచ్చి అర్జునుని రథంలో యుద్ధానికి తీసుకొని పోతే, ఆయన మరుసటి రోజు భీష్ముడు యుద్ధం చేయకపోతే, యుద్ధం చేయకుండా ధనస్సు కిందేస్తే, అప్పుడు ఈయన శిఖండిని చాటున ఉంచి అర్జునుడు ఆయనను బాణం వేసి

చంపేస్తాడు. ఎవరిని? భీష్ముడిని కానీ చంపేయలేదు, బాణాలు వేసి గాయపరుస్తాడు. శరీరం నిండా తొందర తొందరగా బాణాలు విడిస్తే, శరీరం నిండా గుచ్చుకొనిపోతాయి అనుకో, కుచ్చుకొనిపోయినప్పుడు అప్పటికే, 120 సంవత్సరాలు వృద్ధాప్యంలో ఉన్నట్టి భీష్ముడు కిందపడి పోతాడు అన్నమాట. అంటే ఆయన కిందపడే స్థాయిలో ఉన్నప్పుడు, ఆయన భూమి మీద పడితే మంచిదికాదు అని చెప్పి, కృష్ణుడు అర్జునుని చేతనే ఒక బాణంతోనే ఒక మంచం చేయించి, దానిమీద పడేటట్టు చేస్తారు.

భీష్ముడు మంచము మీద పడిపోయాడు అప్పుడు భీష్ముడు, ఇంతమంది బంధువులున్నారు కదా! పాండవులు కౌరవులు అందరూ బంధువులే కదా. వాళ్ళు ఎవరినీ పిలవలేదు ఎవరినీ పలకరించలేదు కానీ కిందపడిపోయి అంటే అవసాన దశలో, చివరి దశలో ఉన్నప్పుడు ఒకే ఒక కృష్ణుని పేరు ఉచ్ఛరించాడు. ఏమని ఉచ్ఛరించాడు? అంటే కృష్ణునితో నేను మాట్లాడాలి అన్నాడు. నా మనవళ్ళతో మాట్లాడతాను లేకపోతే ఇంకొకరితో మాట్లాడతాను, కొడుకులతో మాట్లాడతాను అనలేదు ఆయన. కృష్ణునితో మాట్లాడాలి అంటే అప్పుడు ఏమి చేసారంటే కృష్ణునికి ఆ సమాచారాన్ని చేరవేస్తారు. అందరికంటే పెద్దవాడు సైన్యానికంతా అధ్యక్షుడు యుద్ధరంగంలో కిందపడిపోయినప్పుడు, యుద్ధం అంతా ఆపేసి ఇటువైపు వాళ్ళు, అటువైపు వాళ్ళు అక్కడికి వచ్చినారు.

అప్పటికి భీష్ముడు ఎవరితోనూ మాట్లాడలేదు. కృష్ణునితో ఒకే ఒకమాట అన్నాడు. "నన్ను నీలోనికి ఐక్యం చేసుకో. నన్ను నీలోనికి కలుపుకో" అన్నాడు. నన్ను నీలోనికి ఐక్యం చేసుకో అంటే ఈ పక్కన ఉన్న పాండవులకు అర్థం కాలేదు, అటు ప్రక్కన ఉన్న కౌరవులకు అర్థం

కాలేదు ఈయన చెప్పే పదం. **"నన్ను నీలోనికి ఐక్యం చేసుకో"** అంటే ఏమిటో అర్థంకాక ఏం మాట్లాడుతున్నాడు అని అనుకొన్నారు. ఆయన నన్ను నీలోనికి ఐక్యం చేసుకో అని ఒకమాట అన్నాడు. కృష్ణుడు వెంటనే ఇంకొకమాట అన్నాడు. ఉత్తరాయణం వచ్చేంతవరకు ఆగు అన్నాడు. ఉత్తరాయణం వచ్చేంత వరకు ఆగు అంటే ఉత్తరాయణం వచ్చేదానికి అప్పటికి 10 రోజులు కొదువ ఉంది అన్నమాట. ఎందుకంటే దక్షిణా యణంలో యుద్ధం జరుగుతుంది. దక్షిణాయణం చివరిలో ఇంకా 10 రోజుల్లో ఉత్తరాయణం వస్తుంది అనగా ఈయన కిందపడిపోయినాడు. దేవునిలోకి ఐక్యం అయిపోయేవాడు ఎవడైనా గానీ ఏ సమయంలో చనిపోతే ఐక్యం అయిపోతాడు అనేదానికి దేవుడు భగవద్గీతలో ఒక సూత్రం చెప్పాడు. **పగటి పూట సూర్యరశ్మి ఉన్నప్పుడు, శుక్లపక్షంలో ఉత్తరాయణంలోనే చనిపోతే అంటే ఆ చనిపోయినటువంటివాడు మాత్రం దేవునిలోనికి ఐక్యం కావాలనుకున్నట్టివాడు, యోగి అయినటువంటి వాడు చనిపోతే అప్పుడు దేవునిలోకి ఐక్యం అయ్యేదానికి అవకాశం ఉంది.** అది దక్షిణాయణం కాబట్టి అదే అయిపోయేంత వరకు ఉండు అంటే 10 రోజులు ఆగు అన్నాడు. దక్షిణాయణం అయిపోయేంతవరకు ఆగు అని ఆయన వివరం చెప్పలేదు. 10 రోజులు ఆగు అన్నాడు అంతే. నన్ను నీలోనికి ఐక్యం చేసుకో అని ఒకమాట అటువైపు నుండి ఆయన అంటే, ఇటువైపు నుండి 10 రోజులు ఆగు అన్నాడు. 10 రోజులు ఎందుకు ఆగాలి అని మిగతా వాళ్లకు అర్థం కాలేదు.

ఏమి అవసరం ఉంది, ఏమి పని ఉంది అని వీళ్ళకు అర్థంకాలేదు. పడిపోయినాడు అది ఏమిటో వీళ్ళకు అర్థం కాని భాష అయి పోయింది. వాళ్ళు మాట్లాడుకున్నది. సరే ఆ రకంగా ఆయన 10 రోజులు యుద్ధ

రంగంలో అట్లేపడి ఉన్నాడు. ప్రాణం పోలేదు. 10 రోజుల తర్వాత ఉత్తరాయణం వచ్చింది. ఉత్తరాయణంలో ఈయన ప్రాణం పోయింది. ఆయన కృష్ణునిలోనికే ఐక్యం అయిపోయినాడు. దేవునిలోనికి ఐక్యం అయి పోయినాడు, ఎవరు? భీష్ముడు. కృష్ణునిలోని గొప్పతనాన్ని అంతగా గుర్తించినటువంటివాడు భీష్ముడు. కృష్ణుడు ఎవరైనది గుర్తించినటు వంటివాడు భీష్ముడు కాబట్టి ఆ భీష్ముడు పెట్టినటువంటి పదమే యాదవ్. ఆ పదం ఈ రోజుకీ దేశవ్యాప్తంగా, ప్రపంచవ్యాప్తంగా యాదవ్ అనేటటువంటి గుర్తింపు గొల్లవాళ్ళకు తెచ్చింది. ఆయన గొల్లవాళ్ళలో ఉండి, తిరిగి వాళ్ళ సాంగత్యంలో ఉన్నాడు కాబట్టి, ఆ పదం వీళ్ళకు వచ్చేదానికి అవకాశం ఉంది, అవకాశం ఏర్పడింది. కానీ ఆ పదం వాళ్ళకు తగునా? తగదా? అంటే ప్రపంచపరంగా అయితే, కులపరంగా అయితే యాదవ్ అనేది సరిపోతుంది. జ్ఞానపరంగా అయితే అసలు ఆ జ్ఞానం ఉంటే కదా! జ్ఞానం ఉంటే సరిపోతుంది, జ్ఞానం లేకపోతే ఆ పదం వర్తించదు. ఎవరికి వర్తిస్తుంది? నువ్వు ఏ కులం అన్నా కానీ ఈ జ్ఞానం ఉన్నట్టి వానికి యాదవ్ అనేటటువంటి పదం వర్తిస్తుంది. మళ్ళీ కృష్ణుడు ఆ రోజు గొల్లవాడా కాదు, క్షత్రియ వంశంలో పుట్టాడు. పుట్టాడు కాబట్టి పెరిగింది ఎక్కడైనా ఉండని పుట్టిందే కదా! మొదలు ముఖ్యం. కాబట్టి ఆయనకు యాదవ్ అని ఎందుకు పేరు వచ్చింది అంటే జ్ఞానం వల్ల వచ్చిన పేరు కానీ ఇంకొక రకంగా వచ్చిన పేరు కాదు. మరి అటువంటి జ్ఞానం మనకుంటే మనం కూడా ఏమైతాం? అంటే భీష్ముడు ఉండి మనల్ని యాదవ్ అని పిలవాల్సిన పని లేదు. నీకు ఆ పేరు పెట్టాల్సిన పని లేదు కానీ పద్ధతి ప్రకారం నిన్ను యాదవ్ అనవచ్చు. ఆ రోజుల్లో అంటే ఈ పదం లేని రోజు, జ్ఞానం తెలియని రోజు మళ్ళీ అంత గుర్తింపుగా యాదవ్ అనేటటువంటి పేరుతో

భీష్ముడు ఈయనను పిలిచినాడు. భీష్మునికి ఏ పద్ధతిలో ఈయన కనిపించాడు? కృష్ణుడు ఏ పద్ధతిలో కనిపించాడు? సాక్ష్యాత్తూ ప్రపంచమంతా వ్యాపించినట్టి దేవునిగా కనిపించాడు. కాబట్టి ఆ రోజు అంత గొప్పగా అతన్ని పెట్టుకున్నాడు, అంత గొప్పగానే ఆయనను యాదవ్ అని పిలిచాడు. యాదవ్ అనే పదం ఎవరి ద్వారా వచ్చింది. మొట్టమొదట పిలిచింది భీష్ముడు. ఇప్పుడు మనం అనుకుంటున్నాము అనుకోండి. ఇప్పుడు ఆయనా లేడు, ఈయనా లేడు. ఈ రోజు ఆయన కథను మనం చెప్పుకుంటున్నాము. అదేదో కాలక్షేపానికి కాదు, కర్మక్షేపానికి చెప్పుకోవాలి.

మనం కర్మను పోగొట్టుకునేదాని కోసం, వాళ్ళ కథను మనము చెప్పుకొని వాళ్ళు అనుసరించిన విధానాన్ని మనం కూడా అనుసరిస్తే బాగుంటుందని అనుకుంటున్నాము. ఈ రోజు కృష్ణాష్టమి, శ్రీకృష్ణుని జ్ఞాపకార్థం ఇక్కడ ఒక పండుగగా మనం దీనిని ప్రతి సంవత్సరం చేసుకుంటున్నాము. మరి ఈ పండుగలో మనం తెల్సుకోవాల్సింది ఏమిటి అంటే కేవలం జ్ఞానం యొక్క విశిష్టతనే మనం తెలుసుకోవాలి కానీ, ఇతర ప్రపంచ విషయాలు ఇక్కడ ఉండవు. ఈ కాలంలో ఎక్కడైనా ఏ స్వామిజీ దగ్గరికి పోయినాగానీ, ఏ గుడికి గోపురానికి పోయినా గానీ లేకపోతే ఏ గురువు దగ్గరికి పోయినా, అక్కడికి పోతే మా సంసారాలు బాగా జరుగుతా యని, అక్కడికిపోతే మా జీవితాలు సుఖంగా ఉంటాయని ఏ రోగాలు రాకుండా పోతాయి లేకపోతే ఇంకోటి ఆదాయం ఎక్కువగా వస్తుందని, వ్యాపారాలు బాగా జరుగుతున్నాయని ప్రతి దేవాలయానికి గానీ, ప్రతి స్వామి దగ్గరికి గానీ పోతున్నారు. చివరకు టీవీలో కూడా స్వామీజీలంతా అవే ప్రచారాలు చేస్తున్నారు. మా దగ్గరికి వస్తే మేము మిమ్ములను సుఖసౌఖ్యాలతో జీవించేటట్టుగా చేస్తాము అంటున్నారు. స్వామీజీలు.

మాలాంటి వేషం వేసుకున్న స్వామీజీలంతా ఏమి చెప్తున్నారు? మీరంతా మా దగ్గరికి వస్తే మీకు ఆయురారోగ్యాలు, తర్వాత ధనం అంతా కలుగుతుంది అని చెప్పుచున్నారు. మా దగ్గరికి వచ్చిన తర్వాత ధనవంతులైనారు చూడండి అని చెప్పుచున్నారు.

ఒకసారి టీవీలో ఒకాయన చెబుతున్నాడు. "నాకు ఇంతకుముందు ఏం తెలియదు, నేను ఈ మార్గంలోకి వచ్చాక 2, 3 సంవత్సరాల నుండి వస్తున్నాను. నాకు ఇంట్లో చాలా బాధలుండేవి మా సంసారం చాలా గందరగోళంగా ఉండేటిది. వీళ్ళ దర్శనానికి వచ్చాకా అవన్నీ పోయినాయి. నేను చాలా బాగున్నాను. నాకు ఇప్పుడు మంచి ఉద్యోగం వచ్చింది. డబ్బులు ఏం తక్కువ లేవు. బాగా గడుపుతున్నాను, బాగా జీవితం సాగుతుంది సుఖంగా ఉన్నాను అని ఇవి చెప్పుచున్నాడు. కానీ ఇక్కడ, నేను డబ్బులొచ్చేది, సుఖం వచ్చేది, ఆరోగ్యంగా బ్రతికేది చెప్పలేదు. మీకు రోగాలొస్తాయో బీదవానిగా బ్రతుకుతారో, షావుకారుగా బ్రతుకుతారో డబ్బులు వస్తాయో ఇది మా చేతుల్లో లేదు. ఆ చెప్పే స్వామీజీల చేతుల్లో కూడా లేదు. అది కూడ గ్రహించుకోండి జ్ఞాపకం పెట్టుకోండి. ఎక్కడన్నా పోతే, ఏ స్వామీజీ దగ్గరకన్నాపోతే మాకు వస్తాయేమో ఏమైనా లాభాలు అనుకుంటున్నారేమో మీరు. మీ ముందరే మీ తలలో వ్రాసిపెట్టబడింది. ఏది ఎప్పుడు రావాలనేది. దాని ప్రకారం జరుగుతుంది. వాళ్ళు ఆ రకంగా కూర్చొని మీతో ఆ మాటలు చెప్పి, వాళ్ళు బ్రతుకుతున్నారు. వాళ్ళకు కూడ ఆ కర్మ వ్రాసిపెట్టబడింది. వాళ్ళు ఈ రకంగా బ్రతకాలి, మీరు ఈ రకంగా బ్రతకాలి, అని ప్రతి క్షణం మన కర్మ అనేది లిఖితమై ఉంది. దానిప్రకారం మనకు జరుగుతుంది. ఎప్పుడు ఆదాయం రావాలన్నా, ఎప్పుడు నష్టం రావాలన్నా, ఎప్పుడు కష్టము రావాలన్నా మన తలరాత

ప్రకారమే జరుగుతుంది. కానీ దీనిని ఎవడూ మార్చి రాయలేడు. దీనిని ఒక్క రవ్వ పొల్లు కూడా తీసివేయలేడు. మీరు తిరుపతికి పోతే చాలా బాగా జరుగుతుంది అని పోయేవాళ్ళు, అక్కడే చచ్చిపోయినోళ్ళు చాలామంది లేరా? అక్కడికి పోయి కాళ్ళు విరగగొట్టుకున్న వాళ్ళు లేరా? కర్మ ఎక్కడకు పోయినా విడిచిపెట్టదు. దేవుని గుడిలో ఉన్నా కూడా అది పీడిస్తుంది. పోయే మార్గంలోనైనా పీడిస్తుంది. కానీ ఇక్కడ చెప్పే సమాచారం ఏది అంటే, మీ ఆయుష్షుకు గానీ, ఆరోగ్యానికి గానీ, ధనానికిగానీ, సుఖానికిగానీ, సౌఖ్యానికి గానీ సంబంధించిన విషయాలు ఉండవు. మీ ఆత్మపరంగా అంటే జ్ఞానం చేకూర్చేటివి ఉంటాయి.

ఆత్మపరంగా జ్ఞానం చేకూరితే ఏమవుతుందంటే, కర్మరాని విధానం ఇక్కడ నేర్పిస్తాము. సుఖాలు కలుగుతాయనే కొత్త విధానం మేము నేర్పించం కానీ వచ్చిన కర్మనంతా లేకుండా చేసుకొని, దేవుని దగ్గరికి పోయే విధానం మేము నేర్పిస్తాము. అంతే కానీ సుఖంగా, సౌఖ్యంగా మీ సంసారాలు బాగుపడతాయని మేము ఏమి చెప్పము? అది ఎప్పటికీ లేదన్నమాట. ఎందుకు లేదు అంటే మాతో కాదు. మీతో కాదేమో వాళ్ళతో అవుతుందేమో అంటే వాళ్ళతో కాదు, ఇంకొకరితో కాదు ఎవరితోనూ కాదు. ప్రపంచంలో దేవుడు ఆ విధానమే పెట్టలేదు. ఆ రూలే పెట్టలేదు. ఎవ్వడిని ఎవడూ బాగు చేయలేడు, ఎవ్వరిని ఎవడూ చెడగొట్టలేడు. ఎవరంతకు వాళ్ళు బాగుపడాలి, ఎవరంతకు వాళ్ళు చెడిపోవాలి. కర్మ ఎట్లుంటే అట్లే జరుగుతుంది. ఇది ప్రపంచపరంగా జరిగేది. జ్ఞానపరంగా అయితే నువ్వు సొంతం సంపాదించుకోవచ్చు. **'శ్రద్ధవాన్ లభతే జ్ఞానం'** అని చెప్పాడు దేవుడు. నీకెంత శ్రద్ధ ఉంటే అంత తొందరగా నీకు జ్ఞానం కలుగుతుంది. కానీ శ్రద్ధ ఉన్నంతమాత్రాన ధనంమాత్రం కలుగుతుందని లేదు. అందరికీ

ధనికులు కావాలని శ్రద్ధ ఉంది. కానీ అందరూ అయినారా? లేదు. కుంటుకుంటూ కుంటుకుంటూ బ్రతుకుతున్నారు. ఏమయ్యా! బాగా బ్రతుకుతున్నావా? ఏముంది, ఏదో గెంటుతూ ఎట్లానో గెంటుకొస్తున్నా అంటాడు. గెంటుకొస్తున్నా అంటే కుంటుకొస్తున్నా అని. అందుకే మనం ఏమీ అంటున్నాము అంటే ప్రతి ఒక్కరికి కుంటుకుంటూ బ్రతికేటటువంటి విధానం ఉంది. కాబట్టి సాఫీగా, సీదాగా సంతోషంగా బ్రతికేది ఎవనికీ లేదు. ఎవరికైనా ఉందా ప్రపంచంలో? సంతోషంగా ప్రశాంతంగా బ్రతికేటటువంటి విధానం ఎవ్వరికీ లేదు. ఏదో ఒకటి లోపల ఉంటుంది. కాబట్టి కుంటుకుంటూ బ్రతికేది. కాబట్టి మీకు ఏమీ చెప్పినాను అంటే మీకు బాగా జ్ఞాపకం ఉండాలి అని దీనిని **కుంటుంబం** అంటున్నాడు. భార్య పిల్లలతో ఉండేదాన్ని ఏమంటాము? కుటుంబం. కుంటు కుంటూ ఉండేది కాబట్టి కుటుంబం అంటున్నాము. కుంటుంబం అనే పదంలో మొదటి సున్నాపోయి కుంటు అనేది కుటు అయింది. కుంటుంబము అనేది కుటుంబము అయింది. మరి మన కుటుంబమంతా బాగు పడుతుందా అంటే, దాని పేరే కుంటుకుంటూ ఉండేది కదా! ఎప్పుడు బాగుపడుతుంది? దానికి కుంటుకుంటూ ఉండేది అని ముద్ర వేయబడింది. కాబట్టి ఈ కుంటుకుంటూ ఉండే జీవితాల కోసం నువ్వు పరిగెత్తాలనుకో వద్దు. అది ఎప్పటికైనా పరిగెత్తినా నడిచినా కుంటుకుంటనే ఉంటుంది. అది సాఫీగా సాగేది కాదు. కానీ నీ జీవితంలో దైవజ్ఞానాన్ని సంపాదించుకొని దేవున్ని తెలుసుకునే ప్రయత్నం చేయమని ఇక్కడ మనం చెప్తుంటాము.

ఆ కోణంలోనే ఈ రోజు మనం శ్రీకృష్ణ జన్మాష్టమి సందర్భంగా జ్ఞానాన్ని తెలియజేసుకుంటూ, అంటే యాదవ్ అనేటటువంటి పదానికి ఎంత అర్థం ఉందని తెలుసుకొన్నాము. ఆ రోజు భీష్ముడు ఏ విధంగా

పిలిచాడు? భీష్ముడు కృష్ణున్ని ఏ దృష్టితో చూసాడు? అని మనం ఇప్పుడు జ్ఞాపకం చేసుకున్నాము. ఇది ఇంతవరకు తెలియదు అనుకుంటాము. కృష్ణుడు తెలుసు, భీష్ముడు తెలుసు, కృష్ణుడు, భీష్ముని మీదకి కొట్లాటకి పోయినాడు అని కూడా తెలుసు. భీష్ముడు అంతగా కొట్లాడకుండా, రవ్వంతన్నా రోషం లేకుండా ఎందుకు దిగిపోయినాడు అనుకోవచ్చు మీరు. ఆయనకు అన్నీ ఉన్నాయి. కానీ ఎందుకు దిగిపోయినాడంటే అవతల వచ్చేవాడు ఎవడు? చాలా గొప్పవాడు. ఈయన జింకే ఆయన సింహమే అనుకున్నాడు. కాబట్టి ఈయన చేతులెత్తి పోయినాడు. మరి ఆ సందర్భము ఎందుకు వచ్చింది? అంత పరాక్రమ వంతుడైన భీష్ముడు, మరి ఎందుకు ఆ రకంగా కృష్ణుని ముందు అతను వంగిపోవాల్సిన పని వచ్చింది, అంటే అతనిలో గుర్తింపు అయినటువంటిది ఏదో ఒకటి ఉంది, అంటే జ్ఞానం కలిగినటువంటి భీష్ముడు జ్ఞానదృష్టితో, కృష్ణున్ని చూసినటువంటి భీష్ముడు ఆ గుర్తింపునేదో అతనిలో తెలుసుకున్నాడు. కాబట్టి ఆయన అంత గొప్ప పవిత్ర భావంతో కృష్ణున్ని యాదవునిగా చూసుకున్నాడు. కృష్ణున్ని గొల్లవానిగా చూసుకోలేదు, క్షత్రియునిగా చూసుకోలేదు.

ఇది యుద్ధరంగంలో విషయం మనం చెప్పుకున్నాం. అంతకు ముందు ఇంకో విషయం చూస్తే ఒకసారి కౌరవులు, పాండవులు కలిసి ఒకసారి సభ చేసినప్పుడు ఆ సభలో భీష్ముడు, కృష్ణునికే అగ్రతాంబూలం ఇవ్వాలనీ, ఎందుకంటే ఆయన 'యదుసింహుడు' అని చెప్పాడు. ఇక్కడున్న వారంతా జింకలే ఆయన సింహం అని చెప్పాడు. ఆ రోజు అక్కడున్న వాళ్ళందరినీ సభలో ఉండేవాళ్ళందరినీ జింకలుగా పోల్చి, కృష్ణున్ని ఒక్కన్ని సింహానిగా పోల్చినాడంటే ఈయన చేసే పనులన్నీ బాగా కనిపించినాయా ఆయనకు? భీష్ముడు బయట ప్రపంచ పనులేవీ చూడలేదు. ఆయనలో

లోపలున్న గొప్పతనం ఏదో ఈయన గ్రహించుకున్నాడు. కాబట్టి కృష్ణునికి అగ్రతాంబూలం ఇవ్వమని అన్నప్పుడు కొంత రభస అయింది. ఎందుకంటే శిశుపాలుడు అనేవాడు ఈయన వాళ్ళకు బంధువే అని తిట్టినాడు. కృష్ణున్ని అలాంటి వాడు, ఇలాంటి వాడు ఈయనకు ఎందుకు అగ్రతాంబూలం ఇవ్వాలి అని సుమారుగా తిడ్తూ ఉంటే, నూరు తప్పులు అయ్యేంతవరకు ఉండి, నూరు తప్పులు అయిన తర్వాత ఇంక వీడు ఉండకూడదని శిశు పాలుడిని ఈయన చంపేసినాడు. అట్లా జరిగిందని కూడా మనం చరిత్రలో చదువుకున్నాము. సరే ఏది ఎట్లా పోయినా కానీ మనము కృష్ణున్ని ఈ రోజు గొప్పగా చెప్పుకోవాల్సిన అవసరం ఏం వచ్చింది? అంటే వాళ్ళకు తెలిసిన జ్ఞానం ప్రకారం ఆ రోజు ఆయనను యాదవుడు అనుకున్నారు. మనకు తెలిసిన జ్ఞానం ప్రకారం మనం ఏం అనుకోవాలి అంటే, ఆయన సాక్ష్యాత్తూ పరమాత్మ. ఆ రోజు శరీరంలో ఉండి భగవంతుడైనాడు. శరీరం వదిలిపెట్టి పోయి పరమాత్మ అయినాడు.

ఈ రోజు ఆయన ఎక్కడ ఉన్నాడు అంటే గుడిలో ప్రతిమ రూపంలో ఉన్నాడని మనం అనుకోలేదు. గుడి స్థాపించింది నేనే, ప్రతిమను పెట్టినది మేమే. మరి అక్కడ దేవుడున్నాడు, అక్కడ పోయి మొక్కుకోండి అని మేం చాలామందికి చెప్తుంటాం. మరి గుడిలో ఉండే ప్రతిమనే అంటే కృష్ణున్నే దేవుడు అనుకోవడం లేదు అంటున్నానంటే, ఎందుకంటాను అంటే ఆయన జ్ఞాపకార్థం ఆయనను ఆదర్శపురుషునిగా పెట్టుకున్నాము. ఆయన ఇప్పుడు ఎక్కడున్నాడంటే, అణువణువున వ్యాపించి ఉన్నాడు. మనలోపల ఉన్నాడు, మన బయట ఉన్నాడు. అందరి లోపల ఉన్నాడు, అందరి బయట ఉన్నాడు. ఎవరు? కృష్ణుడు. పరమాత్మగా సర్వాంతర్యామిగా వ్యాపించి ఉన్నాడు అన్నమాట. అటువంటి కృష్ణున్ని ఆ రోజు బ్రతికినప్పుడు కృష్ణుడు

అనేటటువంటి పేరు అతనికుంది కాబట్టి ఆ పేరుతో మనం ఈ రోజు అతను పుట్టిన పండుగను అతని జ్ఞాపకార్థంగా చేసుకుంటూ మనం 'శ్రీకృష్ణ జన్మాష్టమి' అని పేరు పెట్టుకున్నాము. ఆయన అష్టమి రోజే ఎందుకు పుట్టినాడు అనేదానికి కారణం ఇంతకుముందు తెలుసుకున్నాము. ఆయన ప్రతి ప్రవర్తన ఎందుకు ప్రవర్తించినాడో కూడా ఇంతకుముందు మనం తెలుసుకున్నాము.

కానీ ఈ రోజు ప్రత్యేకంగా మనం కొత్తగా కొంత జ్ఞానం తెలుసుకోవాలంటే యాదవ్ అనేటటువంటి పేరు ఎందుకొచ్చింది అనేదానిని ఈ రోజు కొత్తగా తెలుసుకున్నాము. కొన్ని విషయాలు మనకు తెలుస్తూ ఉంటాయి. కానీ దాని గురించి మనం పూర్తి ఆలోచన చేయం. భీష్ముడు ఉన్నాడు, కృష్ణుడు ఉన్నాడు. భీష్ముడు ఆయనను చనిపోయేటప్పుడు పిలిచినాడు. ఎందుకు పిలిచినాడు అంటే ఏదో గొప్పతనం ఆయనలో ఉంది అనే కదా! పిలిచినది. అలా అనుకోవడం లేదు మనం. జరిగిపోయిన దానిని గురించి యోచన చేయడం లేదు. ఇట్లా యోచన చేస్తూ పోతే ఆయనలో ఉండేటటువంటి గొప్పతనాన్ని గ్రహించినటువంటివాడు ఎవరు? భీష్ముడు అని మనకు తెలుసు, ఆయనలో గొప్పతనం ఏముంది? అని మళ్ళీ ఇప్పుడు మనం ప్రశ్న వేసుకుంటాం. ఆయనకు ఏదో కనిపించింది, అది ఆయన బుద్ధికి గొప్పగా కనిపించి ఉండవచ్చు. ఆయన బుద్ధి ప్రకారం ఆయన పిలిచియుంటే మనమంతా ఆయన చెప్పినట్టు పోయేదేనా? మనకు కొంత ఆలోచన ఉండాలి కదా? మనం కొంత ఆలోచన చేయాలి కదా? అంత గుడ్డిగాపోతే ఎలా? అది మూఢనమ్మకం కాదా? అని కొందరు హేతువాద పద్ధతి ప్రకారం ప్రశ్న వేసుకోవచ్చు. అట్లా ప్రశ్న వేసుకుంటే, హేతువాద పద్ధతి ప్రకారమైనగానీ యోచనచేస్తే మనం ఏమి మాట్లాడు

తుంటాము అంటే, కొన్ని సందర్భాల్లో **నేను** అని మాట్లాడు తుంటాము, కొన్ని సందర్భాల్లో **మేము** అని మాట్లాడుతుంటాము.

మేము వ్రాసిన వ్రాత తిరుగులేనిది అని చెప్తుంటాము. మేము వ్రాసిన వ్రాత తిరుగులేనిది అని ఒక గ్రంథంలో ఎక్కడో వ్రాశాము. అంటే మేము అంటే ఎంతమంది ఉండాలి? ఇద్దరో ముగ్గురో ఉండాలి అవతల. నేను అంటే ఒకడే ఉంటాడు. నేను వ్రాసిన వ్రాత తిరుగులేనిది అని వ్రాసారా, మేము వ్రాసిన వ్రాత తిరుగులేనిది అని వ్రాసారా అంటే మేము వ్రాసిన వ్రాత తిరుగులేనిది అని ఉంది అక్కడ. ఏముంది దీంట్లో అంటే, జాగ్రత్తగా గమనించి "నేను" కు "మేము" కు తేడా ఉంది కదా? ప్రతి పదాన్ని మనం అర్థం చేసుకొని చూస్తే కొన్ని మాటల్లో మేము అంటుంటాము, కొన్ని మాటల్లో నేను అంటుంటాము. కొంత మనం పూర్తి జ్ఞానులం కాదు, అట్లాని పూర్తి అజ్ఞానులం కూడా కాదు. కొంత జ్ఞానము ఉంటుంది, కొంత అజ్ఞానం ఉంటుంది. జ్ఞానంలో ఉన్నప్పుడు మాత్రం ఏమంటుంటాం? మేము చెప్పేది అంటుంటాం. అజ్ఞానంలో ఉన్నప్పుడు ఏమంటాము నేను చెప్పేది అని అంటాము. ఇది ఏమయ్యా అపరిచితుడులాగా డబుల్ యాక్షన్ రవ్వంతసేపు అట్లా, రవ్వంతసేపు ఇట్లా అన్నట్టు అని అనుకోవచ్చు. అంటే 'నేను' అన్నా 'మేము' అన్నా ఏదన్నా కానీ అర్థం ఒకటే కదా. బహువచనంగా మర్యాద పూర్వకంగా చెప్పుకునేది మేము అని, ఏకవచనంగా చెప్పేది నేను అని.

వేరే వాళ్ళను మర్యాదపూర్వకంగా మాట్లాడిస్తే మనం మీరు అని మాట్లాడించాలి. అంత పెద్దగా గుర్తింపు లేక మర్యాద తెలియకపోతే నువ్వు అని మాట్లాడిస్తుంటాం. నువ్వు అనేది పద్ధతికాదు. మీరు అనేది ఇతరులను

గౌరవించినట్టు మాట్లాడినట్టు అని చెప్పుకుంటుంటారు మనవాళ్ళు. ఈ విషయం స్కూల్లో చెప్పింటారు మనము వినుంటాము. మన పెద్దలు ఏమి చెప్పినారంటే ఎవరినైనా మనం గౌరవప్రదంగా ఉచ్ఛరించేటప్పుడు మీరు అని చెప్పండి. నువ్వు అని పిలువద్దు అని చాలామందికి చెప్పివుంటారు. నువ్వు అంటే గనుక అది చాలా తక్కువ చేసి మాట్లాడినట్టు, అందుచేత ఎవరినైనా గానీ మీరు అని మాట్లాడేది అలవాటు చేసుకోండి అని చెప్పారు. అంటే వేరే వాళ్ళను మాట్లాడించినప్పుడు, మీరు ఎక్కడినుంచి వచ్చారు అని అడిగేది ప్రశ్న. మీరు భోంచేసారా? అని అడుగుతాం అంటే, గౌరవంగా మాట్లాడించేటప్పుడు. పెద్దవాళ్ళ దగ్గరికి పోయి మనం ఏమంటాం? మీరు భోంచేసారా? మీరు ఎప్పుడు వచ్చారు? అంటాము. మనం అక్కడ ఎంతమందిని అడుగుతున్నాం? అడిగేది ఒక్కరినే! కానీ మన పెద్దలు ఏం చెప్పారు? ఒక్కరినే నువ్వు అడుగుతున్నా కానీ, మీరు అనే పదాన్ని అంటే బహువచనం వాడండి అన్నారు. బహువచనంగా చెప్పమని పెద్దలు ఎందుకు చెప్పారు? అంటే, నిన్న మొన్న పెద్దలు కాదు పూర్వం నుంచి అట్లే చెప్పారు. మరి ఆ పెద్దలు ఎందుకు చెప్పారు? జ్ఞానం ఉన్నోళ్ళు కాబట్టి ఆ మాట చెప్పారు. ఏం జ్ఞానముంది వాళ్ళకు? లోపల ఇద్దరు ఉన్నారు కాబట్టి వాళ్ళను మీరు అనండి అని చెప్పినారు. కనిపించేది ఒకడైనాగానీ ఉండేది ఇద్దరు. ప్రతి మనిషిలోనూ అంటే మనిషి కనిపిస్తున్నా గానీ నివాసం చేసేది ముఖ్యమైన వాళ్ళు ఇద్దరున్నారు. ఆత్మ, జీవాత్మ. కాబట్టి ఎప్పుడైనా గానీ మీరు అనేటటువంటి పదంతో ఇతరులతో మాట్లాడండి అప్పుడు సరిపోతుంది. అది జ్ఞానం పద్ధతి. ఇప్పుడు జ్ఞానం పద్ధతి లేదు, అది ఈ కాలంలో గౌరవం పద్ధతి అయిపోయింది కానీ పూర్వం అది జ్ఞానం పద్ధతి. అంటే మీరు అనేటటువంటి పదం వాడి ఎవరినైనా గానీ మీరు అని

మాట్లాడించాలి. ఇద్దరు ఉన్నారు కాబట్టి మనం ఆ రకంగా మాట్లాడాల్సిన పని వచ్చింది. పూర్వం అట్లా మాట్లాడే వాళ్ళు. కానీ అది ఈ రోజు కూడా ఇద్దరున్నారు, కానీ అది తెలియక ఒక్కన్నే మీరు అని పలికితే గౌరవము అని అనుకుంటున్నారు తప్ప, మీరు అనేదాంట్లో ఎంత అర్థముండి వాళ్ళు ఆ విధంగా ఎందుకన్నారు అనేది మనకు పూర్తి తెలియదు.

కానీ ఈ రోజు మేము వ్రాసిన గ్రంథాల్లో చాలాచోట్ల 'మేము' అనే వ్రాస్తుంటాము. పదం అంతా ఎక్కడైనా చూసుకోండి, మీరు బాగా గమనించండి మేము అని ఉంటుంది. ఎక్కడో ఒకచోట నేను అని ఉంటుంది. నేను అన్నచోట సరిచేస్తుంటాము వ్రాసిన తర్వాత టైపింగ్ అయిపోయిన తర్వాత నేను అన్నచోట మాత్రం ఎందుకు 'నేను' నేను అనేది పొరపాటు కదా మేము అని వ్రాయాలి కదా! అని మళ్ళీ దానిని సరిచేసి మేము అని పెట్టాము. కానీ మేము అన్నచోట నేను అనాలి కదా, బహువచనంగా ఎందుకు చెప్పుకోవాలి అని మమ్మల్ని మీరు అడుగవచ్చును. మమ్మల్ని మేము అనుకునేది ఏం బాగుంటుంది? నేను అనేది బాగుంటుంది కదా! దానిని తగ్గించి చెప్పుకోవాలి కదా! అని మనం, మేము అనేది కొట్టేసి నేను అని పెట్టాము. కరెక్షన్‌లో మేము అని ఎక్కడుంటుందో అక్కడ మేము అనే పెట్టేస్తున్నాము. అలాగే నేను అనేది ఎక్కడైతే ఉందో దానిని అట్లే పెట్టేస్తాము. ఎట్లా వ్రాసి ఉండేది అట్లే పెట్టేస్తాము. దానిని మార్చం. ఎందుకు మార్చము అంటే ఇప్పుడు చాలాచోట్ల మేము గ్రంథములలో చెప్పివుంటాము. ఈ గ్రంథాన్ని వ్రాసినది నేను కాదు, అని ఉంటుంది కానీ, మేము కాదు అని ఉండదు. ఎందుకంటే అక్కడ నేను కాదు. నా వెనకల ఉండేటటువంటివాడు వ్రాయించినటువంటిది. ఇందులో తప్పులు ఒప్పులు ఏమైనా ఉన్నాగానీ అవి ఆయనకే సంబంధం తప్ప నాకు సంబంధం

లేదు. నేను నిమిత్తమాత్రుడిని ఒక కలములాంటివాడిని. పెన్నులాంటి వానిని, పెన్నుతో వ్రాస్తే అది ఎంత వ్రాయిస్తే అంత వ్రాస్తుంది కదా?

ఆ రకంగా లోపల ఏ విధంగా ప్రేరేపించి ఏ యోచన నాకు వచ్చి ఉంటే ఆ యోచన నేను వ్రాసాను. కాబట్టి నేను దీనికి బాధ్యున్ని కాదు. ఎంత పెద్ద జ్ఞానం చెప్పినా నేను చెప్పలేదు, అది మేము చెప్పాము. మళ్ళీ అపరిచితుడు అయినట్టు అవుతుంది. ఏమిటిది? ఈయన అంతా ఉల్టా సీదా మాట్లాడతాడు సినిమాలో మాదిరి అని అనుకోవచ్చు. కానీ మేము చెప్పేది వాస్తవం, నేను చెప్పలేదు. మేము చెప్పుచున్నాము. మేము ఎంత చెప్పినా మీకు బుద్ధి రాలేదు. నేను చెప్పినా వినకపోయినా పర్వాలేదు కానీ, మేము చెప్పితే మాత్రం తప్పనిసరిగా విను. ఇదేమి విచిత్రంగా ఉంది? ఈ పదాలు చాలాచోట్ల ఉంటాయి. కానీ మీరు గమనించి ఉండరు. ఇప్పటి నుండి గ్రంథములో చూసుకోండి చాలాచోట్ల ఉంటాయి. ఎందుకు ఆ విధంగా చెప్పాల్సిన పని వచ్చింది? అంటే నేను చెప్పనటువంటి పదాలు ఏవైతే ఉన్నాయో వాటిని వదిలేసి మేము అనే ఉంటుంది. ఇద్దరం కలిసి చెప్పితే ఏమవుతుంది మేము అవుతుంది. ఒక్కరు చెప్పితే ఏమవుతుంది? నేను అవుతుంది. కాబట్టి నేను ఈ గ్రంథాన్ని వ్రాయలేదని ఒప్పుకుంటున్నాను. మేము వ్రాసాము, మా మాటకు తిరుగులేదు అని అక్కడ వ్రాస్తున్నాము. నేను వ్రాయలేదంటావు, మేము వ్రాసాము, నేను వ్రాసింది తప్పనిసరిగా జరుగుతుంది అంటున్నావు. ఇది ఏమి విచిత్రం అనుకోవచ్చు. కానీ మేము, నేనులో ఏమి తేడా ఉంది అంటే, మనం కృష్ణునిలో నువ్వునూ గ్రహించాము, అలాగే 'నేను' ను గ్రహించాము. అతనిని కృష్ణుడు అని ఒక్కనిగా చూసాము. కానీ భీష్ముడు ఏమి చేసాడు? ఇద్దరిని గ్రహించాడు ఇద్దరూ ఉన్నారని అన్నాడు. యుద్ధంలో కృష్ణున్ని కౌరవులు

కోపగించుకున్నప్పుడు అన్నాడు. ఏమన్నాడు ఆయన తలచుకుంటే క్షణములో భూమండలమంతా సర్వనాశనమైపోతుంది. ఆయనను ఇంటికి పోయాక కౌరవులు, భీష్మునితో అవతల శత్రుపక్షమువాడైన కృష్ణుడు యుద్ధంలో చక్రం తీసుకొని వస్తే, నువ్వు యుద్ధము చేసేది పోయి నువ్వు లొంగి వంగుకొని అతని దగ్గరికి పోతావా? అని ఈయనను అడిగినారు. ఎవరిని? భీష్మున్ని. ఆ రోజు యుద్ధ సమయములో పాండవులు ఎలా సమావేశం పెట్టుకున్నారో, అలాగే కౌరవులు కూడా సమావేశం పెట్టుకున్నారు. పెట్టుకొని ఆయనను "నువ్వు ఇట్లా పోవడానికి కారణం ఏమి! మర్యాద పోతుంది కదా! ఇలా చేస్తే భయపడి పోయినట్టు కదా? అని అడిగినారు. అంటే ఆయన ఏమి చెప్పినాడు తెలుసునా?

కృష్ణుడు అంటే ఆయన బహువచనంగా చెప్పి, ఆయన వస్తే ప్రచండమే, భూమండలమే నాశనమైపోతాది, వారు అనుకుంటే (కృష్ణ పరమాత్మ అనుకుంటే), కాబట్టి నేను ఒక లెక్కా అసలుకు! నేను ఆయన ముందర ఒక అణువును. ఆయనకు కోపం వచ్చిన తర్వాత ఆయన చక్రం తీసుకొని వస్తే నేను నిలబడేదానికి అవకాశం ఉందా? మీతో కాదు నాతో కాదు ప్రపంచంలో ఎవరితో కాదు అని ఆయన చెప్పాడు. కృష్ణునికి ఉండే విధానం ఆయన చెప్పాడు. ఆయన ఎంత గొప్పగా తీసుకున్నాడు? ఆ రకంగా కృష్ణునిలో ఆత్మను, జీవాత్మను ఇద్దరిని గుర్తించినటువంటివాడు భీష్ముడు. ఆ రకంగానే మనం ఈ రోజు ప్రతి చదువులోనూ, ప్రతి మాటలోనూ ఇద్దరిని గుర్తించి నీలో నువ్వు ఇద్దరిని గుర్తించుకో, బయట ఇద్దరిని గుర్తించుకునే అలవాటు చేసుకున్నావనుకో నువ్వు ఇప్పుడు గ్రంథం చదువుతున్నావు. మీరు అని ఎక్కడ వ్రాసాను నేను అని ఎక్కడ వ్రాసాను అనేది జ్ఞాపకం పెట్టుకొని చదివేటప్పుడు మళ్ళీ చూసుకోండి. మీరు

చదువుతుంటారు, దాంట్లో ఉండే విషయం మీద మీకు జ్ఞాపకం పోతూ ఉంటుంది కానీ పదాల మీద పూర్తి జ్ఞాపకం ఉండదు. పదాల మీద జ్ఞాపకం ఉంటే ఈ రోజు 'యాదవుడు' అనే పదానికి కూడా మీరు ఆలోచన చేసేవారు. ఈయన క్షత్రీయుడా? యాదవుడా? అని. యాదవుడు అంటే, ఈ పేరు ఎందుకు వచ్చింది అని ప్రతి పదం మీద ఆలోచన చేసేవాళ్ళు. కానీ అటువంటి ఆలోచన చెయ్యకుండా గ్రుడ్డిగా ప్రవర్తిస్తుంటాము. ఈ రోజు హేతువాద పద్ధతిలో భీష్మునికి ఏమి కనిపించింది అంటే, ద్వంద్వం కనిపించింది, అంటే ఇద్దరు కనిపించినారు. ఎవరు అంటే **జీవాత్మ, ఆత్మ** ఇద్దరూ కనిపించారు. అది మామూలు సమయంలో. తర్వాత కొన్ని సమయాల్లో ఏమి కనిపించింది? ఆయన యుద్ధరంగంలో కింద పడిపోయాక **"నన్ను నీలోనికి ఐక్యం చేసుకో"** అన్నప్పుడు ఎవరు కనిపించారు? ముగ్గురు కనిపించారు. పరమాత్మ కూడా కృష్ణునిలో కనిపించాడు. కాబట్టి అడిగింది ఎవరిని? పరమాత్మను అడిగినాడు నేరుగా. నువ్వు చంపు అని ఎవరిని అడిగినాడు? ఆత్మకు చెప్పాడు ఆయన. కానీ జీవాత్మగా కృష్ణుడిని ఎప్పుడూ చూడలేదు. ఎవరు? భీష్ముడు.

ఆ రకంగా మనం జ్ఞానాన్ని తెలుసుకుంటే కృష్ణుడు జీవాత్మగా ఎప్పుడు ఉన్నాడు? ఆత్మగా ఎప్పుడు ఉన్నాడు? పరమాత్మగా ఎప్పుడు ఉన్నాడు. మూడు పాత్రలు ఆయనలో ఎప్పుడు జరిగినాయని మనం తెలుసుకోగలుగుతాం. ఇద్దరే కాదు ముగ్గురు ఉన్నారు. కాబట్టి మీరు అనే దాంట్లో ఎంతో అర్థం ఉంది. మనం ఒక్కరం అనే గుర్తింపు ఉంది మనకు. నువ్వు జ్ఞానం తెలుసుకోని జ్ఞాపకం పెట్టుకుంటే, నిన్ను నువ్వు గుర్తించుకోవచ్చు. నిన్ను నువ్వు గుర్తించుకుంటే ఇంకా ఇద్దరూ ఉన్నారు. నువ్వు వాళ్ళను గుర్తించలేవు. వాళ్ళు ఇద్దరు ఎప్పుడు ఏమీ మాట్లాడతారో

ఏమో తెలియదు. ఆ రెండోవాడు జ్ఞానాన్ని చెప్తు ఉంటాడు. మూడవ వాడు ఎప్పుడు ఏమి చేస్తాడో కూడా తెలియదు. ప్రపంచాన్నంతా ఒక్క క్షణంలో నాశనం చేయమన్నా కూడా నాశనం చేసేటటువంటి అధికారి ఈశ్వరుడు. అధిపతి ఎవరు? మూడవవాడు. శరీరంలో ఉండే వాడు, శరీరానికి అధిపతి మాత్రం ఒకడున్నాడు, వాడు రెండవవాడు. మనం చాలా విషయాల్లో, మనం బోధల్లో ఈ విషయాన్ని ప్రస్తావించి చెప్పింటాము. ఇప్పుడు మీకు నేను అంత లోతుగా చెప్పితే ఇక్కడ జ్ఞానం తెలిసినటువంటి వాళ్ళు ఉన్నారు. కాబట్టి మీకు బాగా అర్థమైతుంది. ఏమాత్రం జ్ఞానం తెలియకుండా, ఎప్పుడూ వినకుండా ఏదో ఒక కృష్ణాష్టమి జరుగుతుంది పోయి చూస్తాము అనుకున్న వాళ్ళకు ఇది విసుగేస్తుంది. ఏమి అర్థం కాని పరిస్థితి ఏర్పడుతుంది. అందువలన నేను ఏమి చెప్తున్నానంటే, మనం ఈ రోజు కృష్ణుని జన్మదినం కాబట్టి జ్ఞానం చెప్పుకోవాలి. కాబట్టి మనం ఇంత లోతుగా చెప్పుకోవాల్సిన పని వచ్చింది. మీరు ఈ జ్ఞానం పూర్తి అర్థం కావాలంటే, విసుగులేకుండా మీరు గ్రంథాలు చదవండి. వరుసగా అంటే ఒకదాని తర్వాత ఒకటి, ఒక అడుగు తర్వాత ఒక అడుగు వేస్తే ఎంత ఎత్తుకయినా మనం ఎదుగొచ్చు. అలా అడుగు తర్వాత అడుగు వేసుకుంటూ పోతే ఎంత ఎత్తు అయిన ఎక్కి పోవచ్చు. కానీ ఒక్కసారిగా మనం కొండ మీదికి ఎగిరి దూకలేము. అట్లా ఇంత పెద్ద జ్ఞానం ఒకటేసారిగా మీ తలకు ఎక్కాలంటే కష్టం.

మేము రాసిన గ్రంథాలు ఉన్నాయి. ప్రతి ఒకటి క్షుణ్ణంగా చదువుకుంటూ పోతే, చదివింది అర్థమవుతూ పోతే, జ్ఞానం అంటే ఏమిటి? అదెక్కడుంది అని తెలుసుకోవచ్చు. శరీరంలోనే జ్ఞానము ఉందని తెలుసుకోవచ్చు. అంతే కాకుండా ఆశలన్ని వదిలిపెట్టండి అనేది కూడా

ఉంటుంది. ఆశలతో ఎక్కడికి పోవద్దండి అనేది ఉంటుంది. మీరు ఆశలతో ఏ గుడికి పోయినా, ఏ దేవుని దగ్గరికి పోయినా, ఏ స్వామీజీ దగ్గరికి పోయినా అవన్నీ నెరవేరవు అని మనం ఇంతవరకు చెప్పుకున్నాము కదా. ఆ రకంగానే ఇక్కడ భగవద్గీత ప్రకారం జ్ఞానం చెప్పబడుతుంది. చాలామంది భగవద్గీతనే ఎందుకు పట్టుకున్నారు? మీరు వేదాలను పట్టుకోకూడదా? అని కొంతమంది వేద ప్రియులు అడుగుతూ ఉంటారు. కానీ మాకు వేదాలకు చాలా దూరము. ఈ మాటను మళ్ళీ జ్ఞాపకం పెట్టుకోండి మీరు. మేము చెప్పినాము అని చెప్పకూడదు, ఎందుకంటే మేం చెప్పినామంటే మీరు నువ్వేం పెద్దవా అని కొట్లాటకు వస్తారు. కానీ కృష్ణుడు ఏమి చెప్పినాడో కృష్ణుని మాటే మా మాట అనుకోండి. మేము చెప్పిన మాటే దాంట్లో భగవద్గీతలో ఉంది అనుకోండి. అయినా కానీ ఏం చెప్తున్నాం భగవద్గీతలో వేదాలను ప్రక్కన పెట్టేసినాడు. **"త్రైగుణ్య విషయా వేదా"** అన్నాడు ఆయన. మూడు గుణాలతో నిండుకున్నవి వేదాలు, అని చెప్పినాడు. ఇంకా ఏమి చెప్పినాడంటే, ఈ వేదాలే మాయ అని చెప్పినాడు. 'త్రైగుణ్య విషయ వేదా' అన్నప్పుడు గుణాలే వేదములు అన్నప్పుడు గుణాలను వదిలేయి అని ఆయన చెప్పాడు. గుణాలను వదిలేస్తే నువ్వు ఈ మాయను జయించగలవు అని చెప్పాడు. **'మమమాయ దురత్యయా'** అంటాడు. నా చేత సృష్ఠింపబడినదే మాయ. నేను సృష్ఠించిన మాయ ఏమీ చిన్నగా ఉండదు, అది పెద్దగానే ఉంటుంది. ఆ మాయను మీరు జయించాలంటే దుస్సాధ్యము అని చెప్పాడు. మరి అటువంటి దుస్సాధ్యమైన మాయను జయించాలంటే ఏమీ చెయ్యాలి? **"నన్ను శరణుజొచ్చితే మీరు దాన్ని సులభంగా దాటగలరు"** అని చెప్పాడు. ఆ మాయ అనేది ఏమిటిది అంటే, నీలో ఉండే గుణాలే అని చెప్పాడు.

మాయ ఎక్కడుంది అని చెప్పితే భగవద్గీత ప్రకారం ఎక్కడా లేదు, ఎక్కడో బయట లేదు. చాలామంది చెప్తుంటారు నువ్వు మాయలో పడినావు అంటారు. మాయ బయటుంటే కదా పడేదానికి? అది ఎక్కడా లేదు. మన తలలోనే ఉంది. దాంట్లోనే పడతాము. క్లుప్తంగా చెబితే మాయ గుణాల రూపంలో మన తలలో ఉంది. దాంట్లో మనము ఇరుక్కొని ఉన్నాము. మాయలో ఇరుకున్నాం అన్నమాట. కాబట్టి మాయలో మీరు ఇరుక్కున్నారు, అంటే మాయ పక్క ఉన్నారు. నా పక్క రండి అని చెప్తున్నాడు దేవుడు. భగవద్గీతలో నేను మాయకు వ్యతిరేఖంగా ఉంటాను. నాకు వ్యతిరేఖంగా మాయ ఉంటుంది. అది మాయ అయితే తిరగేస్తే నేను 'యమా' అవుతాను. 'నేను దండనాధికారుల్లో యముడునై మీ శరీరాలలో ఉన్నాను.' యమలోకం ఎక్కడో లేదు. యమధర్మరాజు ఎక్కడో లేదు. యమధర్మరాజు మీ శరీరంలోనే ఆత్మగా ఉన్నాడు అని చెప్పాడు ఆయన. నేనే అని చెప్పాడు ఆయన. ఈ లెక్కలో చూసుకుంటూ పోతే, మన శరీరంలోనే జ్ఞానమంతా ఉంది మీరు తెలుసుకుంటే. ఇంకోచోటికి పోవలసిన పని ఏమి లేదు. **మన శరీరాన్ని వదిలిపెట్టి బయటి జ్ఞానాన్ని కలుగజేసేవి వేదాలు. శరీరాంతర్గతంగా చెప్పేటటువంటిది భగవద్గీత.** శరీరాంతర్గతంగా కాకుండా బయట చూపు అంటే బయట ఆరాధనలు, బయట పనులు, బయట భక్తి అదంతా నేర్పించేది ఏది? వేదాలు! బయట లాభాలు అంటే బయట నువ్వు ఈ పని చేస్తే ఇంత లాభం వస్తుంది. ఈ మంత్రం జపిస్తే ఈ కోరిక నేరవేరుతుంది. అని చెప్పేవి ఏమిటివి? వేదాలు. మంత్రపఠనాన్ని బోధించేటివి వేదాలు, యజ్ఞాలను యాగాలను చేయమని చెప్పేటివి వేదాలు. కానీ ఇక్కడ యోగాన్ని చేయమని చెప్పేది భగవద్గీత. యజ్ఞాలకు సంబంధం లేనటువంటిది ఇది. అంటే వేదాల సెక్షన్ వేరు, భగవద్గీత సెక్షన్ వేరు. మా జీవితంలో ఏ

సెక్షన్‌లోకి మేము పోయినాము? భగవద్గీత వైపు మేము పోయాము. వేదాల వైపు మేము పోలేదు. కాబట్టి వేదాలు మేము వదిలేసి అక్కర్లేదు అని పక్కన పెట్టేసాము. మీకు వేదాలు ఏమీ తెలియదా అంటే, ఏం తెలియనిదే ముంది, తెలిసే కదా విడిచిపెట్టినది. అంటే వేదాలు భగవద్గీతకంటే పెద్దవి అంటారు. కానీ ప్రపంచం పుట్టినపుడే దేవుడు సూర్యునికి భగవద్గీతను చెప్పినాడు.

ఇప్పుడు భగవద్గీతలో చెప్పిన జ్ఞానం ఎప్పుడు చెప్పబడింది? సృష్ఠి ఆదిలో ప్రపంచం పుట్టినప్పుడు చెప్పబడింది. ముందు చెప్పిన జ్ఞానం ఏది? భగవద్గీత. ప్రపంచం పుట్టిన తర్వాత వేదాలు చెప్పబడినాయి. తర్వాత వచ్చిన జ్ఞానం ఏది? వేదాలు. అంటే ముందు పుట్టినవి వేదాలా? భగవద్గీతా? ప్రపంచం పుట్టుకలో పుట్టినది భగవద్గీత. దానినే అర్జునునికి మళ్ళీ నీకు చెబుతున్నా, జ్ఞాపకం పెట్టుకో అని చెప్పాడు. కృష్ణుడు సృష్ఠి ఆదిలోనే సూర్యునికి చెప్పబడినట్టి ఈ జ్ఞానాన్ని నీకు చెప్తున్నాను. అంటే ఎప్పటిది ఇది? సృష్ఠి ఆదిలో చెప్పినటువంటిది భగవద్గీత. ఆ భగవద్గీతను నీకు ఇప్పుడు చెప్తున్నాను జ్ఞాపకం పెట్టుకో అని అర్జునునికి కృష్ణుడు చెప్పాడు. కాబట్టి ఈ జ్ఞానం సృష్ఠి ఆది లోనిది. సృష్ఠి ఆదిలో పుట్టినది గొప్పదా? సృష్ఠి తర్వాత పుట్టినది గొప్పదా? ఆదిలో పుట్టినదే గొప్పది. ఆదిలో పుట్టినట్టి జ్ఞానం గొప్పది కాబట్టి భగవద్గీతనే మేము ఆధారం చేసుకొని, భగవద్గీత ప్రకారం మేము మాట్లాడడం జరుగుతుంది. భగవద్గీత ప్రకారమే మా రచనలన్నీ ఉంటాయి. దానిని ఆధారం చేసుకొనే మేము యోగాలు ఆచరించడం కూడ జరుగుతూ ఉంటుంది. దాని పద్ధతి ప్రకారమే మీరు కూడా ఆచరించండి అని చెప్పి కృష్ణున్ని ఆదర్శంగా తీసుకొని, మీరు జీవితాన్ని గడపండి అని చెబుతూ ఆయన చెప్పిన జ్ఞానాన్ని ఆదర్శంగా తీసుకొని

మన జీవితాన్ని గడుపుకోవాలని మనం చెప్పడం జరిగింది. ఇంతవరకు అదే చెప్తున్నాము. తర్వాత కూడ అదే చెప్పబోతాము.

ఈ నేపథ్యంలో మా పద్ధతి నచ్చనటువంటి వాళ్ళు మమ్మల్ని ఏమంటున్నారు? అంటే ఇది పరమత బోధ అంటున్నారు. ఇప్పుడు చెప్పేదంతా పరమత బోధనా మీరే ఆలోచన చేయండి. తల ఉన్న ఎవడూ ఆ మాట అనడు ఇది పరమత బోధ అని. ఎందుకంటే ఇది అన్ని మతాలకు సంబంధించింది. మేము, నువ్వు అనేది అన్ని మతాల్లో ఉంది. అన్ని శరీరాల్లో ఉండే దేవున్ని మేము చెప్తున్నాము కానీ ఒక మతంలోది చెప్పలేదు. కానీ చాలామంది తెలియనటువంటి వాళ్ళు, మమ్మల్ని హేళనగా మాట్లాడు కోవడము, అంటే ఈయన చెప్పేది జ్ఞానమే కాదు అని కూడా అనడం జరిగింది. కానీ కొంతమంది ఈయన చెప్పేది ప్రపంచంలో ఎవరూ చెప్పనటువంటి చాలా రహస్యమైన జ్ఞానం చెప్తున్నాడు అని అంతో, ఇంతో జ్ఞానం తెలిసినటువంటి వాళ్ళు ముందుకు వస్తూ ఉంటే, జ్ఞానులు కానటువంటి వాళ్ళు, ఏమి చేసినారంటే ఈయన చెప్పేది జ్ఞానమే కాదంటున్నారు. వాళ్ళు చెప్పేదాని ప్రకారం మాది జ్ఞానం కాదంటున్నారు. అంటే వాళ్ళకు తెలిసిన జ్ఞానం ఏది? వేదాలకు సంబంధించిన జ్ఞానం. కాబట్టి వాళ్ళ పద్ధతి ప్రకారం మనది జ్ఞానం కాదు, వాస్తవమే. అయితే వేదాలు తెలియనోళ్ళు ఏమి చేస్తారు మేము చెప్పేదంతా చూస్తే, నూటికి నూరుపాళ్ళు సత్యము అనుకొంటారు.

చిన్న ఉదాహరణ చెప్తా ఈ మధ్య దాదాపు 2 నెలల క్రితం అనుకుంటా అంటే రెండు, రెండున్నర నెలల క్రితం హైదరాబాద్‌లో వెంకటేశ్వర కళ్యాణము (శ్రీనివాస కళ్యాణము) అని పెద్ద ఉత్సవం పెట్టారు. తిరుపతి దేవస్థానం వాళ్ళు వచ్చి, అక్కడ తిరుపతి దేవస్థానంలోనే శ్రీనివాస

కళ్యాణం పెడితే బాగుండదు ప్రజలంతా అక్కడికి రాలేరు. ఎన్నో కష్టాలు పడి జనాలు వేలమంది తిరుపతి పోయి వస్తున్నారు. అక్కడ దర్శనము కష్టమే, అన్నీ కష్టమే. మరి వీళ్ళ దగ్గరికే దేవున్ని తీసుకొస్తాము అని ఇప్పుడు వెంకటేశ్వరున్ని ఊరూరా తిప్పుతున్నారు. జనం అక్కడపోతే బాగుండదు, వెంకటేశ్వరున్ని ఊరూరు తీసుకొచ్చి తిప్పితే భక్తి బాగా పెరుగుతుందని వాళ్ళు ఏం చేసారంటే, హైదరాబాద్‌లో పెద్దగా తిరుపతిలో లాగా తిరుపతి గుడి మాదిరి తయారు చేసి, స్టేజీ కట్టి అంతా తిరుపతివలె వెంకటేశుని మాదిరి పెట్టి, ఉత్సవ విగ్రహాలు తీసుకొచ్చి పెట్టి, బేగంపేట పెరేడ్ గ్రౌండ్‌లో శ్రీనివాస కళ్యాణం అని పెద్ద ఉత్సవం చేసారు. కొన్ని వేలమంది అక్కడ కలిసి ఆ శ్రీనివాస కళ్యాణాన్ని తిలకించి పరమపవిత్రులు అయిపోయినారు అని చెప్పుకుంటున్నారు. అది టీవీలో లైవ్ కార్యక్రమం కూడా వేసారు. మేము బజారుకు పోయి, సికింద్రాబాద్ నుంచి వస్తూ, వస్తూ బ్రిడ్జి మీద నుండి వస్తున్నాము. క్రింద పెద్దగ్రౌండ్ ఉంది. నేను కారులో ఉండి చూసాను. ఏమిటి? ఇంత జనం ఉన్నారు, కోలాహలంగా ఉంది అనుకొన్నాము. మళ్ళీ తర్వాత ఇంటికి వస్తే, టీవీలో అంతా అదే చూపిస్తున్నారు. అన్ని ఛానల్స్‌లో అదే చూపిస్తున్నారు. శ్రీనివాస్ గార్గేయ అనే ఒక బ్రాహ్మణుడు ఇలా చెప్తున్నాడు, "తిరుపతిలో ఉండే సాక్ష్యాత్తూ వెంకటేశుడే ఇక్కడ ప్రత్యక్షంగా ఉన్నాడు. ఆయన కళ్యాణం ఇక్కడ జరుగుతుంది. ఆయనను ఇక్కడ ప్రత్యక్షంగా మనం చూస్తున్నాము" అని పక్కన ఉండి మాటలు చెప్తున్నారు. ఆ కార్యక్రమం అయిపోయిన తర్వాత శ్రీనివాస మూర్తి అనే ఇంకొక ఆయన చెప్పాడు. ఆయన భక్తి కార్యక్రమమే అని బాగా వింటున్నాము. ఆయన నామాలు ఏ విధంగా ధరించాడో చూడండి. ఆయన ఏడు కొండల మీద అధిష్టించాడు చూడండి." అని

చెబుతున్నాడు. చెప్పేదంతా, ఎక్కడిదో తెలుసునా? 1980వ సంవత్సరంలో మేము వ్రాసినటువంటి మన **"ప్రబోధ"** గ్రంథంలోనిదే.

ఆ గ్రంథంలో ఇప్పుడు దేవాలయ రహస్యాల్లో ఉన్నటువంటి సమాచారము ఏదైతే ఉందో, అంటే నామాల గురించి, తర్వాత ఏడు కొండల గురించి దాంట్లో ఉన్నాయి. అవే కంఠాపాఠం చేసి శ్రీనివాస మూర్తి అనే ఆయన చెప్తున్నాడు. ఆయన సొంతం కనిపెట్టినట్లు చెప్పినాడు. ఇవన్నీ మేము వ్రాసినవే! మేము అంటున్నాము. మేము వ్రాసినవి నేనే వింటున్నాను. వింటూ, ఇదంతా ఎక్కడిది? అసలుకు నేను వ్రాసినది కదా! అని ఒక ప్రక్క అనిపిస్తుంది. ఆ మేము వ్రాసినవి అందరికీ తెలిసింది అని ఒక ప్రక్క అనిపిస్తుంది. సరేలే! ఈ రోజు ఆ గ్రంథంలోది ఎ టూ జడ్ ఆయన కంటిన్యూగా చెప్పినాడన్నమాట. అక్కడ వెంకటేశుని గురించి తిరుపతి దేవస్థానం గురించి నేను ఏం చెప్పినానో, ఏడు ద్వారాల గురించి ఏం చెప్పినానో. ఏడు కొండల గురించి ఏమి చెప్పినానో అదే చెప్పినాడు. నామాల గురించి ఏం చెప్పానో అదే చెప్పాడు. శరీరంలో ఏడు ద్వారాలు ఉన్నాయని నేను ఎట్లా చెప్పినానో, ఎ టు జడ్ కంఠాపాఠం చేసి ఆయన చెప్పాడు. ఆయన ఎట్లా చెప్పాడు. అంటే దానిని బాగా జీర్ణం చేసుకొని, సొంతం అతనే కనిపెట్టిన మాదిరి చెప్పేసినాడు. అంటే అది చాలా ఆహ్లాదకరంగా అనిపించింది. అంత నిగూఢమైన అర్థం ఈయన చెప్తున్నాడు కదా! శ్రీనివాసమూర్తి అంటే మాది కాపీరైట్, ఈయన చెప్పినాడు అని రెండు మూడు రోజుల తర్వాత అనుకుంటా ఏమి చేశాము అంటే, శ్రీనివాస్ లెక్చరర్ గారు ఉన్నారు చూడండి, అతన్ని ఇంకొక ఆయనను బి.జి. నాయుడు గారిని, ఇంకొక వ్యక్తిని శ్రీనివాసమూర్తి దగ్గరకు పంపించాము. ముగ్గురు నలుగురు ఆయన దగ్గరికి పోయినారు.

వీళ్ళు పోయి "సార్! మీరు చాలా బాగా మాట్లాడారు. నామాల గురించి చాలా బాగా అర్థం చెప్పారు. ఏడు ద్వారాల గురించి చాలా గొప్పగా చెప్పారు. ఏడు కొండల గురించి చాలా అర్థం చెప్పారు. ఇంత అర్థం ఎక్కడా ఎవ్వరూ చెప్పలేదు. ప్రపంచంలో మీరు చెప్పారు" అంటే, ఆయన అదేనయ్యా జ్ఞానమంటే అని చెప్పాడు. అంటే అటువంటి జ్ఞానం ఎక్కడైన ఉంటేనే మీరు చెప్పారు. కాబట్టి మాకు కూడా తెలుసుకోవాలని ఉంది. ఏమన్నా పుస్తకాలు ఉన్నాయా అంటే, అది పుస్తకంలో లేదు. అది పుస్తకాల్లో ఉండేది కాదు. అప్పటికప్పుడు వచ్చిన జ్ఞానం అది. అది వేదంలో ఉంటుంది అన్నాడు. మనవాళ్ళు అది ఏదో చెప్పండి స్వామీ, ఆ వేదాలు తెచ్చుకొని చదువుకుంటాము అంటే, అది మీకు అర్థం కాదు. ఆ వేదాలంతా సంస్కృతంలో ఉంటాయి, మీకు అర్థమయ్యేది కాదు అని చెప్పాడు. అంటే మేము చదువుతాము అంటే అర్థం కాదు అంటాడు. సంస్కృతంలో ఉంటుంది అంటాడు. మీకేమన్నా కావలసి ఉంటే నేను చెప్తాలేండి ఎందుకు శ్రమపడేది? వేదాల్లో మీకేం అర్థమైతాది, పెద్ద పెద్ద గ్రంథాలవి వాటిలో ఏంటేంటో చాలా ఉంటాయి. మీకు అవన్నీ అర్థం కావు. ఈయన చెప్పిన ముక్కలన్నీ పెద్ద పెద్ద గ్రంథాల్లో ఉన్నాయని చెప్తున్నాడు. ఫలానా ప్రబోధ గ్రంథంలోది అని చెప్పలేదు ఆయన. సరేలే! అని వీళ్ళు ఏమి చేసారంటే, ఆయనతో మాట్లాడినప్పుడు ఒక విషయం గమనించారు. ఆయన శ్రీనివాస కళ్యాణం జరిగిన రోజు టీవీలో మాట్లాడినప్పుడు మూడు నామాలు పెట్టాడు. పెద్దగా వెంకటేశుని నామాలు మాదిరి పెట్టాడు. అక్కడ ఉండేది అంతా నామాలోళ్ళే కదా? వీళ్ళు ఆయన దగ్గరకు పోయిన రోజు చూస్తే విభూది రేఖలు పెట్టాడు. వీళ్ళు "ఏమయ్యా! అప్పుడు నామాలు పెట్టారు? ఇప్పుడు విభూది రేఖలు పెట్టారేంటి? అంటే ఆయన "ఏ పార్టీకి పోయినప్పుడు ఆ

పార్టీ జెండా ఎత్తుకుంటాము కదా? ఒకటే పార్టీలో ఉంటామా మనం? వెంకటేశుడు కాబట్టి నామాలు పెట్టుకోవాల్సిన పని వచ్చింది. మేము మొదట నుండి శైవులమే" అన్నాడు.

"దశావతారం" సినిమాలో వైష్ణవుడిని రాయి కట్టి నీళ్ళల్లోకి వేసినా కానీ, నేను ఓం నమో నారాయణ అంటాను, నామం తుడిపేయను అని చెప్పాడు కదా? పైగా నిలువున చీల్చినా నిలువు నామాలు తుడిపేయను అని పాట పాడాడు ఆయన. మీరేమో శైవులంటారు, కొంతసేపు అడ్డ నామాలు, కొంత సేపు నిలువు నామాలు పెట్టారు అని వీళ్ళు అంటే "అదంతా చాదస్తం అయ్యా! కాలాన్ని బట్టి పోతుండాలి. సమయాన్ని బట్టి పోతుండాలి" అన్నాడు. అంటే జ్ఞానం కూడా సమయాన్నిబట్టి, కాలాన్నిబట్టి మారిపోతుంది అని అర్థం. ఇంత పెద్దోళ్ళే ఈ రకంగా చెప్తున్నారంటే ఎట్లుందో చూడండి.

ఆ రకంగా, అంటే మేం చెప్పిన జ్ఞానం ఈ రోజు బయటికి ప్రాకి, ఈ రకంగా చెప్పుకుంటున్నారంటే వాళ్ళ పేరుతో చెప్పుకోనీలే కానీ అది వేదాల్లోది కాదు అని చెప్పకుండా వాళ్ళు వేదాల పేరు అతికించుకొని దాన్ని చెప్పుకుంటున్నారు. వేదాల్లోది కాదు అది కానీ వేదాల పేరు అతికించుకుంటున్నారు. సరే ఎట్లా అతికించుకున్నా కానీ, జ్ఞానం జ్ఞానమే! మేం ఏమి చెప్తున్నాము అంటే, నా పేరు ఉండాల్సిన పని లేదు, జ్ఞానం బయటికి పోయి మనుషుల్లోకి ప్రాకిపోవాలి అని చెప్తున్నాము. ఆ రోజు టీవీ ఛానల్‌లో అంత పెద్ద జనాభాలో చెప్పుకుంటున్నారు. టీవీలో కొన్ని లక్షలమంది చూసి ఉంటారు. కానీ ఆ రోజు మన గ్రంథాల్లో కొంతమంది చదివినా కానీ, ఈ రోజు వాళ్ళ ద్వారా కొన్ని లక్షలమంది అక్కడ ప్రత్యక్షంగా

వినగలిగినారు కదా, అలాగే పరోక్షంగా ఆ జ్ఞానాన్ని వినగలిగినారు. చాలులే! వాళ్ళ పేరే పెట్టుకోని! నామాలు పెట్టుకోని చెప్పితే ఏమి, విభూది రేఖలు పెట్టుకొని చెప్పితే ఏమి మనకేం? మన జ్ఞానం చెప్తున్నాడు కదా, మన జ్ఞానం ఈ పొద్దు కాకపోతే రేపైనా, రేపు కాదు ఎల్లుండైనా, కొన్ని వేల సంవత్సరాలకైనా ప్రపంచమంతా ప్రాకిపోతుంది అని ఎన్నో రోజుల నుండి చెప్తున్నా నేను. కానీ ఈ రోజు ప్రాకిపోయింది కదా. నేను చెప్పిన వెంకటేశు ని నామాలకు, ఏడు ద్వారాలకు, ఏడు కొండలకు చెప్పిన అర్థము.

టీవీల ద్వారా గానీ నేను ప్రత్యక్షంగా చెప్పకపోయినా, పరోక్షంగా వాళ్ళ ద్వారా ప్రాకిపోతుంది ఇది. ఎవరో ఒకరి ద్వారా ప్రాకిపోతుంది. పుట్టించేది మేము పెరిగేది ఎక్కడయినా పర్వాలేదు. ఆ రకంగా దానికి సంతోషించాం మేము. కానీ ఇప్పుడు మనం ఏమి చెప్తున్నాము అంటే, ఇట్లా ఈ రకంగా మేము చెప్పినటువంటి జ్ఞానం బయటికి పోయి బయట చెప్పబడుతుంది అనేది వాస్తవం. అది ఎప్పటికైనా జరుగుతుంది. ఎందుకంటే జ్ఞానానికి సంబంధించి హేతువాదులు వేసే ప్రశ్నకు ఎక్కడా జవాబు లేదు. వేదాల్లో కానీ, ఇంకోచోట కానీ ఎక్కడా ఎవరి దగ్గర కూడా దానికి జవాబు లేదు. నాస్తికవాదులు వేసే ప్రశ్నలకు జవాబు లేదు. అది నాస్తికవాదంగానే మిగిలి పోతావుంది. హేతువాదంగానే మిగిలిపోతుంది. దానికి సమాధానం లేదు. కానీ ఎక్కడ జవాబు ఉంది అంటే, త్రైత సిద్ధాంతంలో ఒకే ఒక్క మన రచనలలో మాత్రం జవాబు ఉంది. హేతువాదులకు సైతం, నాస్తికవాదులకు సైతం జవాబు చెప్పగలిగేటటు వంటిది ఒకే ఒక్క త్రైతసిద్ధాంతం. కాబట్టి ప్రతి ఒక్కరికీ సమాధానం దొరుకుతుంది.

ఈ రోజు ఈ సభలో ముస్లీమ్‌లు ఉన్నారు. ఇటు క్రైస్తవులు ఉన్నారు. అటు చివరి జిల్లా ఎక్కడ ఆదిలాబాద్ జిల్లా నుండి వచ్చిన వాళ్ళు ఉన్నారు, ఇటు శ్రీకాకుళం జిల్లా నుండి వచ్చిన వాళ్ళు ఉన్నారు. అటువైపు నుండి ఇటువైపు నుండి మేము ఈ చివరలో కర్ణాటక బార్డర్‌లో అనంతపురం జిల్లాలో ఉన్నాము. మేము మరి దూరం నుండి వాళ్ళు వచ్చి ఈ జ్ఞానము చాలా గొప్పది అని వింటున్నారంటే వాళ్ళు ఏమన్నా మిగతా స్వామీజీల దగ్గరికి పోయినట్టు అక్కడికి పోతే లాభాలు వస్తాయి, కోరికలు నెరవేరుతాయని ఉద్దేశ్యంతో వచ్చినారా? లేదు. ముందే మేము చెప్పినాము కోరికలకు అతీతంగా ఉంటాము, జ్ఞాన లాభం మాత్రము ఉంటుంది. కాబట్టి నాయన గంటు దొరుకుతుంది, అమ్మగంటు దొరకదు అని చెప్పినాను నేను. నాయన గంటు, అమ్మ గంటు అంటే ఏమిటిది? అని మీరు ప్రశ్న వేయవచ్చు. ప్రపంచ లాభమంతా అమ్మ గంటు. దేవుని జ్ఞానమంతా నాయన గంటు. కాబట్టి ఇక్కడ నాయన గంటు దొరుకుతుంది. అమ్మ గంటు దొరకదు. మీకు ఈ అమ్మ గంటు, నాయన గంటు తెలియాలంటే, రాత్రికి ఒక నాటకముంటుంది. ఆ నాటకంలో దాని వివరం తెలుస్తుంది అన్నమాట. యమధర్మరాజు వస్తాడు అప్పుడు ఆయన చెప్తాడు, నాయన గంటు ఏమి, అమ్మ గంటు ఏమి అని. దాంట్లో వివరం చాలా బాగుంటుంది. ఆ నాటకం గురించి నేను చెప్పాల్సిన పని లేదు. రాత్రికి మీరు ప్రత్యక్షంగా చూడొచ్చు. ఈ విధంగా మనం జ్ఞానం తెలుసుకునేదానికి భగవద్గీత ఎన్నో ఆధారాలతో కూడుకొని ఉంది మనకు. అటువంటి భగవద్గీతను చెప్పినటువంటివాడు శ్రీకృష్ణుడు. అంటే కృష్ణుడు ద్వాపర యుగంలో చెప్పినాడు కదా, ప్రపంచం పుట్టుకలోనే భగవద్గీత ఉంది అని మీరంటున్నారు. అప్పుడు కృష్ణుడు చెప్పలేదు కదా?

దేవుడు స్వయంగా నేనే చెప్పినా అని చెప్తున్నాడు కదా? మరి భగవద్గీతకు మీరు కృష్ణుని పేరు ఎందుకు చెప్తున్నారు, మీరు అడగొచ్చు. ఈ రోజు కృష్ణుని రూపంలో చెప్పినా కానీ, ఆ రోజు సూర్యునికి ప్రత్యక్షంగా దేవుడే చెప్పినా కానీ అది కృష్ణుని బోధ అనవచ్చు, దేవుడు బోధ అంటే ఈయనే కృష్ణుడు ఆయనే దేవుడు కాబట్టి, మరి ఆయన మీదనే మనం చెప్పుకోవచ్చు. కాబట్టి అటువంటి బోధను చాలా గొప్పగా తీసుకొని, మనం ఆ జ్ఞానాన్ని అంటే మనం శ్రీకృష్ణాష్టమి సందర్భంగా కృష్ణుని జ్ఞానాన్ని మనం జ్ఞాపకం పెట్టుకొందాము. మనం జీవితం అనేటటువంటిది ప్రతి దినం గడుస్తూ పోతూవుంది. గడుస్తూపోతూవుంటే ఏదో మనం సంపాదన కోసం సంపాదించుకుంటున్నాం, తింటున్నాం. సంపాదించుకుంటూ తింటూ మళ్ళీ మిగిలించుకోవాలని ప్రయత్నం చేస్తున్నాము. అట్లా మిగిలించుకుంది ఎంత అని చూసుకుంటున్నాం. అలా చూచుకోకుండా ఎవరన్నా ఉన్నారా?

మాకు తెలిసిన ఒక వ్యక్తి వ్యాపారం చేస్తాడు. కేజీకి కమీషన్ ఇంత అని చూస్తాడు. ఎన్ని కేజీలు అమ్మినాను, ఎంత కమీషన్ వచ్చింది అని చూస్తాడు. సంవత్సరానికంతా మొత్తం వేసుకుంటాడు. ఓహో! ఒక సంవత్సరం ఇంత సంపాదించాను అనుకుంటాడు. ఆ రకంగానే మనం జీవితమంతా గడుపుతూ వస్తున్నాము. ఆ జీవితం గడిపినదాంట్లో ఒక సంవత్సరం పొడవున మనం ఏమి జ్ఞానము సంపాదించినాము, ఏమి తెలుసుకున్నాం జ్ఞానము? అని ఎవరూ చూసుకోవడం లేదు. ఎందుకు చూసుకోవడం లేదు అంటే, సర్వసాధారణంగా బ్రతకడం అలవాటు చేసుకున్నాము. కానీ జ్ఞానదృష్టి ఎవరికీ లేకుండా పోయింది. మేము ఏమీ చెప్పినామంటే, పుట్టిన తర్వాత నేను మూడు రకాల ఉద్యోగాల్లో చేరడం జరిగింది. ఒక రకం ఉద్యోగం కోసమే ప్రాకులాడడం చాలామందికి

జరుగుతూ ఉంటుంది. నేను ఒక ఉద్యోగాన్ని వదిలేసి, రెండో ఉద్యోగంలోకి పోయి, దాన్ని కూడ వదిలేసి మూడవ ఉద్యోగం వస్తే నాకు అది వద్దే వద్దు అని పక్కన పారేసాం అన్నమాట. కానీ బ్రతుకుతెరువు కోసం ప్రాకులాడ కుండా ఏ రకంగా బ్రతకాలో ఆ రకంగా బ్రతకగలుగుతాము అని దాని మీద ధ్యాస లేకుండా, అది ముందే మనకు దేవుడు నిర్ణయించి పెట్టివుంటాడు, దాని ప్రకారం జరుగుతుందని దానిని లెక్కపెట్టుకోలేదు. నేను జ్ఞానాన్ని సంపాదించుకోవాలి. మనం పుట్టిన తర్వాత ఏమి సాధించగలిగినాము అని దృష్టి పెట్టుకోవాలని మేము ఇతరులకు చెప్పుచూ వచ్చాము. కానీ ఒక రోజు ఒక ఆఫీసరు అడిగాడు, నువ్వు ఉద్యోగం వదిలిపెట్టి పోతున్నావు, బయటికి పోయి బ్రతకాలంటే చాలా కష్టం అవుతుంది. ఉద్యోగంలో ఉంటే డబ్బులు వస్తుంటాయి కదా. నువ్వు తెలుసుకునే జ్ఞానం ఏదో ఉద్యోగం చేస్తూ తెలుసుకో అని చెప్పాడు. నేను తెలుసుకునేది ఎట్లాగూ ఉద్యోగం చేస్తూ తెలుసుకోవచ్చును.

అయ్యా! తెలుసుకునే పాత్ర నాది కాదు తెలిపే పాత్రగా ఉండాలి నాది అని చెప్పాను నేను. తెలుసుకునే పాత్ర ఉద్యోగం చేస్తూ ఎక్కడో తెలిసిన చోటికి పోయి తెలుసుకోవచ్చు. కానీ నాది తెలిపే పాత్ర కావాలని చెప్పాము. నువ్వు చెప్పేది నాకేం అర్థమే కాలేదయ్యా! ఏమీ తెలుసుకోవచ్చు జ్ఞానం ఇంకొకరికి చెప్పొచ్చు. కానీ ఉద్యోగం వదిలిపెడుతున్నామంటే బ్రతుకుతెరువు విడిచిపెడుతున్నట్లే అన్నారు. ఇంక మేము ఒకటే మాట చెప్పాం. “పుట్టిన కోడి, కుక్క జంతువులన్నీ బతుకుతున్నాయి. అవి ప్రొద్దున లేచిన వెంటనే నిత్యము ఏదో ఒకటి సంపాదించుకొని తినాలని చూస్తున్నాయి. మన ఇంట్లో పశువులున్నాయి ఎద్దులు అవీ, ఏదో ఒక పని చేస్తాయి, ఏదో ఒకటి తింటాయి. అది తినేది గడ్డి, మనం తినేది

అన్నము అంతే తేడా. ఆ కడుపుకి ఆకలి కోసం అవి తింటున్నాయి. దానికోసం ఏదో ఒక పని చేస్తున్నాయి. హాయిగా పడుకొని నిద్రపోతున్నాయి. మనం కడుపుకోసం ఏదో ఒక పని చేస్తున్నాం, ఏదో సంపాయించుకొని ఏదో వండుకొని తింటున్నాం. కానీ మనం అవి నిద్రపోయినంత హాయిగా నిద్రపోలేదు. సరే ఎలాగో అలా నిద్రపోయినామో నిద్రపోలేదో దాని కథ వేరు, కానీ అవి ఏమి చేసినాయి మనం ఏం చేసినాం అంటే అవి పని చేశాయి, ఏదో ఒక గడ్డి తింటున్నాయి, మనం ఏదో పని చేసి ఏదో అన్నము తింటున్నాము. అంతే తప్ప దానికీ మనకీ ఏమి పెద్ద తేడా లేదు. ఒకదానికొక సాంగత్యం ఉంది, పిల్లలు పుట్టి సంతానం పెరగడం. మనకు కూడా ఒకరికొకరి సాంగత్యం ఉంది, పిల్లలు పుట్టి సంతానం పెరుగుతా వుంది. లెక్కేసుకుంటే చివరికి ఏమైంది? అవి మనం అంతా సమానమే. అవి చివరకు చచ్చిపోతాయి, మనము చచ్చిపోతున్నాము. అవి ఏమి సాధించినాయి? ఏమి సాధించలేదు. మనం ఏమి సాధించినాము మనం కూడ ఏమి సాధించలేరు. చివరకు దానితో సమానంగా మనము బ్రతకాల్సిన పని వచ్చింది.

జీవితం లెక్కేసుకుంటే మన ఇంట్లో పశువు మన ముందరే బ్రతుకుతూ ఉంది. దాని జీవితమంతా గడిపేస్తుంది. మనమంతే, మన జీవితం కూడ ఆ రకంగానే సాగిపోతుంది కానీ ఆలోచనచేస్తే ఇంకోటి ఏమి లేదు. కానీ అటువంటి జీవితం నాకు అవసరం లేదు అనుకున్నాను నేను. బ్రతుకుతెరువు కోసం బ్రతుకుతాము, ఏదో మామూలుగా సాఫీగా జరిగిపోతుంది. జరిగిపోయిన తరువాత ఒక రోజు చనిపోవడం కూడా జరిగిపోతుంది. దానివల్ల ఏమి సాధించినట్టు? అట్లుకాకుండా, మన జీవితంలో మనం ఏదో ఒకటి తెలుసుకొని, అంటే అసలైన సారాంశమేదో

తెలుసుకొని దానిని ఇతరులకు తెలిపితే మంచిది అనేది మేము అనుకున్నాము. కాబట్టి దానికోసమే మిగతావాళ్ళకు కూడా చెప్పి నాకు ఈ పద్ధతి బాగాలేదు, నాకు నచ్చలేదు. నేను జ్ఞానం తెలుసుకొని జీవించాలి అనుకున్నాను. తర్వాత నేను తెలుసుకున్న జ్ఞానాన్ని ఇతరులకు పంచాలను కున్నాను అని చెప్పాము. మా పెద్దలు కొంతమంది ఉండే వాళ్ళు, ఇంకా చుట్టాలు పక్కాలు అంతా వచ్చి ఏందయ్యా? నువ్వు అసలుకు ఏమి చేస్తున్నావు? అందరూ ఉద్యోగం చేసుకుంటూ బాగా హాయిగా బ్రతుకుతా వుంటే, నువ్వు ఉద్యోగం వదిలిపెట్టి వచ్చి ఉన్నావు. ఇదేమన్నా తెలివి ఉండే లక్షణమేనా? నువ్వు చేసేది చాలా తెలివితక్కువ పని అంటే, నేను తెలివి అని చెప్పినానా? నాది జ్ఞానం అని చెప్తున్నా. తెలివికి జ్ఞానానికి చాలా తేడా ఉందయ్యా అని చెప్పాము. సరేలే! ఇలా నాకు హితం చెప్పినాయన ఏమి చేసేవాడు అంటే, ఇంట్లో కాఫీ తాగడు. అట్లా బయటికి పోతే ఎవడో ఒకడు కనిపిస్తాడు తన కింద గుమస్తా ఎవడన్నా కనిపిస్తే రండి సార్! కాఫీ తాగుదాం రండి అంటే వాని దగ్గర కాఫీ తాగి వస్తాడు. ఇంకో బజారుకి పోతే, ఇంకోడు కనిపించి వాడు టిఫిన్ తినిపిస్తాడు. ఈ రకంగా టిఫిన్, భోజనం అంతా వేరే వాళ్ళ పైసలలోనే తింటాడు. ఆయన ఐదు పైసలు ఖర్చు కాగూడదు అనుకుంటాడు. ఒకాయన ఇంటికి వచ్చిన దగ్గరి బంధువునైతే పెరుగు వేసుకోండి అని స్పూన్ తీసుకొస్తాడు అంటే స్పూన్‌తో వేస్తాడు అన్నమాట, గరిటెతో వేయడు. ఒక స్పూన్ రెండు స్పూన్‌లు వేసేసరికి వీడు వద్దు వద్దులే అంటాడు. ఆ! చాలు ఎక్కువైందిలే అంటాడు ఈయన.

ఈ రకంగా సంపాదించాలని చూస్తాడు, నాకు నీతి చెప్పిన ఆయన. ఆయన సంపాదించి సంపాదించి లేనిపోని తిప్పలు పడినాడు. అతను

తండ్రిలాంటి వయస్సుండేవాడు, నేను కొడుకులాంటి వయస్సు ఉండేవాడిని. మరి మొదటి నుండి, చిన్నప్పటి నుండి చూస్తున్నా లేనిపోని తిప్పలుపడి కొంత ఆస్తి సంపాదించినాడు. ఇట్లయితే నువ్వు బ్రతకలేవు అని నన్ను అన్నాడు. నేను బ్రతికేది ఏముందయ్యా అది ముందే నిర్ణయమై ఉంటుంది అని చెప్తూ వచ్చాము. చివరకు ఈ రోజు మన దగ్గరకు వచ్చి ఆయన ఏమి అంటాడు అంతే మేము ఎంత సంపాదించినా, మీరు మాకంటే చాలా పెద్దోళ్ళు అయినావు అంటారు. 30 లారీలు పెట్టుకున్నావు నువ్వు. నాకు ఒక లారీ కూడ లేదు. 30 ఎకరాల ఆస్తి ఉంది నీకు. నాకు నీలో సగం కూడ ఆస్తి లేదు అని అన్నీ తక్కువ తక్కువ చెప్పుకుంటాడు. అపుడు మేము నువ్వు ఆ పొద్దు బుద్ధిలేదు అంటివి కదయ్యా. నాకు తెలివి లేదు ఎట్లా బతుకుతావు అది ఇది అని చెప్పి ప్రతి నిత్యము మనమే సంపాదించు కోవాలి అని అందరి నెత్తిన టోపీలు పెట్టి బ్రతికినావు కదా నువ్వు? మరి నువ్వు నన్ను ఈ రోజు పెద్దోడు అంటున్నావు అంటే, అదేమో నీకు అదృష్టం అంటాడు. అదే నేను చెప్పినది ఆ అదృష్టం కొద్దే బతుకుతాడు మనిషి. నువ్వు ఎంత సంపాదించుకోవాలన్నా సంపాదించుకోలేవు అని చెప్పాము.

నాకు 25 ఏళ్ళ కిందటే అంటే 40 ఏళ్ళకే నేను మామూలుగా జీపులో తిరిగేవాన్ని. ఆ రోజు ఆ జీపులు మామూలు జీపులే పెద్దవి అప్పుడు. ఇప్పుడు మాదిరి పెద్ద పెద్ద కార్లు లేవు, లక్షల రూపాయల కార్లు లేవు. ఆ రోజు జీపులే ఉన్నాయి, నాకు ఆ రోజు జీపు ఉంది. ఆ రోజు ఒక బిల్డింగ్ ఉండేది నాకు, ఫోన్ కనెక్షన్ ఉండేది, నేను హాయిగా బ్రతికేవాన్ని. ఆ రోజే నాకంటే పెద్దోనివి అన్నాడు ఆయన. ఈ రోజు మరీ పెద్దోడివి అయ్యాను. సరేలే! మీకంటే ప్రపంచంలో మరీ పెద్దోన్నే, జ్ఞానంలో మరీ పెద్దోన్నే అంటే జ్ఞానంలో ఆయన లెక్కేయలేదు. ప్రపంచం దృష్టిలో

చూసి ఆయన చెప్తున్నాడు. ఆయన వస్తే ఏమి చేస్తాడు? గుత్తి బస్టాండ్‌లో దిగితే రిక్షాలో పోతే ఐదు రూపాయలు ఖర్చు అవుతుందని ఏమి చేస్తాడు అంటే ఆటోకి పోతే 10 రూపాయలు ఖర్చు అవుతుందని ఇక్కడి నుండి అక్కడికి నడిచి పోతాడు. ఆ పది రూపాయలు మిగులుతుంది కదా అని ఆలోచిస్తాడు. రైల్వే స్టేషన్‌కు పోవాలనుకుంటే, ఆ రైల్వే స్టేషన్ దగ్గర ఈ కరంట్ ఆఫీసు సబ్‌స్టేషన్ ఉంది. దాంట్లోనే రెవెన్యూ ఆఫీసు కూడ ఒకటి ఉంది. దాంట్లో పింఛన్ తీసుకుంటాడు ఆయన. గుంతకల్లులో కాపురం చేస్తుంటాడు, అక్కడికి వచ్చి పింఛన్ తీసుకొనేదానికి, బస్టాండ్‌లో దిగి అక్కడికి నడిచిపోతాడు దగ్గర దగ్గర స్టేషన్ దగ్గరికి ఒకటిన్నర కిలోమీటర్ నడుస్తాడు. మేము ఎప్పుడూ నడిచేవాళ్ళం కాదు. నడిస్తే ఆ 10 రూపాయలు మిగులుతుంది కదా అని ఆయన దృష్టి. మా ఉద్దేశ్యం ఏమంటే 10 రూపాయలు మిగిలాలి అని జీవితంలో ఉంటే మిగులుతుంది లేకపోతే లేదు అని మా దృష్టి. నేను ప్రయత్నం చేసి సంపాదించుకుంటాను అని అతను అసలుకు మన ప్రయత్నం లేకనే ఏదన్నా జరుగుతుంది అని నేను అనుకొంటాను. కానీ ఆ రకంగా లెక్కేసుకోరు చాలామంది. నేనే స్వయంగా సంపాదించుకుంటున్నాను అనుకుంటారు. ప్రపంచ విషయంలో నీదేమీ లేదు అని మనం చెప్తుంటాము.

ఈ రోజు కూడ ఆయన, నా ముందర నడుచుకుంటూ పోతుంటాడు. నేను కారులో పోతూవుంటే పోతూపోతూ ఏమయ్యా నడుచుకుంటూ పోతున్నావు? ఎక్కు అంటే అప్పుడు ఎక్కుతాడు. నన్ను ఆ రోజు, నువ్వు చెడిపోతావు బ్రతకలేవు అన్నావు కదా? మరి ఇప్పుడు నేను నడిపే కారులోనే పోతున్నావు చూడు అని చెప్పాము. నీ అదృష్టం అట్లుంది అంటాడు. మరి నేను కూడా అదే కదా! మొదటినుండి చెప్పినది. ఏదైనా

గానీ అదృష్టాన్ని బట్టే ఉంటుంది అని చెప్పినాము. ఆయన ఈ రోజు ఏం చెప్తాడు? సరేలే! నువ్వు ఒక కారు పెట్టుకోవచ్చు కదా, ఒక కారు కాదు ఈ రోజు నీకు 5 కార్లు ఎందుకున్నాయి అంటాడు. ఆయన మొన్ననే వచ్చి ఈ ప్రశ్న వేసినాడు. నీకు 8 లక్షల ఖరీదు చేసే సఫారీలు రెండున్నాయి, 20 లక్షల ఇండోవర్ ఉంది, ఇవికాక మళ్ళీ రెండు వ్యాన్‌లు నువ్వు పెట్టుకున్నావు. మొత్తం 5 బండ్లు నీకెందుకు? నువ్వు ఫాక్షన్ లీడర్‌వా? మాకు ఒక ఫోన్ వచ్చింది. ఏమని వచ్చిందంటే ఇక్కడ మందిరానికి వేరే వాళ్ళు వచ్చారు, వాళ్ళు స్వామిని చూడాలన్నారు అని మనవాళ్ళు అంటే, స్వామి ఎక్కడ ఉంటాడయ్యా, స్వామి ఎక్కడుండెదీ ఎవరికీ అర్థం కాదు. నాకు కూడా తెలియదు స్వామి ఎక్కడుండేది అని చెప్పినాము. స్వామి లేడు అని చెప్పాము ఎప్పుడో వస్తాడు అని చెప్పాము అంటే వాళ్ళు ఎందుకొచ్చారు ఏమి కథ అని అడిగి విచారించాము. వాళ్ళు "ప్రబోధ ఆశ్రమం వారికి చాలా గొప్ప జ్ఞానం ఉంది" అని మాకు బ్రహ్మం గారు వ్రాసిన కాలజ్ఞానంలో దొరికింది కాబట్టి, ప్రబోధాశ్రమము ఎక్కడుందని మేము చాలా సంవత్సరాలుగా విచారించాము. ఇంక చివరకు ఇక్కడుంది అని అడ్రస్ తెలిసింది. అందుకే మేము ఇక్కడ వచ్చాము అని చెప్పారు అని మనవాళ్ళు చెప్పినారు. కాలజ్ఞానంలోనే బ్రహ్మంగారు 350 సంవత్సరాల క్రితమే వ్రాసిపెట్టాడంట ఏమని? **"ప్రబోధాశ్రమము వారు గొప్ప జ్ఞానం గలవారు"** అని దాని ఆధారంతో వాళ్ళు వెతుకుతూ వస్తే, ఎట్లానో దొరికింది అడ్రస్, వాళ్ళు ఇక్కడికి వచ్చారు. ఆ పుస్తకం కూడ చూపించారు. ఇదిగో తాటి ఆకుల గ్రంథంలో ఇట్లా ఉంది చూడండి.

కానీ "ఈ రోజు మీరు హిందువులు కాదు, మీరు జ్ఞానాన్ని బోధించలేదు, అజ్ఞానాన్ని బోధిస్తున్నారు. వేరే మతాన్ని బోధిస్తున్నారనే మన

వ్యతిరేఖులంతా, అజ్ఞానులంతా, బ్రహ్మంగారు వ్రాసినది చదివితే, ఆ రోజు బ్రహ్మం గారికి ఏమన్నా పైత్యం ఎక్కిందేమో, ప్రబోధాశ్రమము ఉత్తమమైన జ్ఞానం కలిగింది అని వ్రాసారు అని విమర్శించేవారు, ఆ రోజు బ్రహ్మం గారు అంత గొప్పగా ఎప్పుడో ఏ కాలంలోనో ఉండే మన గురించి ఆయన వ్రాస్తే, ఈ రోజు మనం ఆయన మాటకు విలువ ఇచ్చి అయినా జ్ఞానం చెప్పాలి కదా. బయటికి ఉత్తమమైన జ్ఞానం మనం చెప్పాలి. కాబట్టి ఉత్తమమైన జ్ఞానం చెప్పాలంటే మనం గ్రంథము వ్రాసేది మంచిదని మళ్ళీ వ్రాస్తున్నాము. ఆ రకంగా ఇప్పుడు ఈ గ్రంథాలు రాయడం జరిగింది. ఈ మధ్యన మూడు గ్రంథాలు వ్రాస్తూ విసుగొచ్చి పక్కన వేసినప్పుడు మళ్ళీ వాళ్ళు ఏమి చేసారంటే, ఆ పుస్తకాన్ని తీసుకొచ్చి మాకు చూపించారు. ప్రస్తుతానికి ఆ పుస్తకం కూడ మా దగ్గర ఇక్కడ కూడ ఉంది. వాళ్ళు ఎవరో తెచ్చి ఇంకా నాలుగు పుస్తకాలు ఇచ్చి పోయినారు. బ్రహ్మంగారి పుస్తకాలు ఇవి. ఈ పుస్తకాల అడ్రస్ కూడ దీంట్లో ఉంది ఉషారాణి, డోర్ నంబర్ 511, రమణ నిలయం, నాల్గవ వీధి, శింగమ్ రోడ్, రామాశ్రమం దగ్గర తిరువన్నామలయ్. ఇది తమిళనాడు అడ్రస్. తమిళనాడులో ఈ బుక్కు ప్రింట్ అయింది. ఈ పుస్తకంలో 159వ పేజీలో ఒక వాక్యం ఉంది అది బ్రహ్మంగారి కాలజ్ఞానము అనే తాళపత్ర గ్రంథము నుండి, నేరుగా తీసుకొని వ్రాసినదట. ఈ గ్రంథం ఆ ఓరియంటల్ కాలేజీ తిరుపతిలో లైబ్రరీలో ఉందట. ఆ లైబ్రరీలో ఈ కాలజ్ఞానం తాళపత్ర గ్రంథాలు ఉన్నాయంట. ఆ తాళపత్రాల గ్రంథాల నుంచే వ్రాసినటువంటిది ఇది. దాని కాపీ అన్నమాట. వాళ్ళు తెలుగులో పుస్తకంగా ప్రింట్ చేసి పంపించారు. ఉషారాణి అనే ఆమె కాలజ్ఞాన తాళపత్ర గ్రంథాలను పరిశోధన చేసినప్పుడు ఇవన్నీ కనిపించాయి. అందులో నుండి ఆమె వ్రాసిందన్నమాట.

దాంట్లో **"ప్రబోధాశ్రమము వారు ఉత్తమమైన జ్ఞానం కలిగినటువంటివారని"** స్వయంగా వీరబ్రహ్మంగారు చెప్పినట్టి వాక్యాన్ని ఆమె వ్రాసి పెట్టింది.

ఆ విషయం చెప్పిన తరువాత మరి బ్రహ్మంగారు అంత గొప్పగా చెప్పితే అజ్ఞానులు ఏమనుకుంటే మనకేముంది అని, మనము వీళ్ళను లెక్కపెట్టుకోకుండా, పనికిమాలినోళ్ళకిందికి లెక్కేసి, అజ్ఞానుల కిందికి లెక్కేసి, ఏమి చెప్పినామంటే, వీళ్ళను వదిలేసి మళ్ళీ మేము గ్రంథాలను తిరిగి వ్రాయడం జరిగింది. బ్రహ్మంగారు "నువ్వు ఎందుకు ఊరుకుంటావయ్యా? వాళ్ళతో నీకేం పని నువ్వు వ్రాసేది నువ్వు వ్రాయి" అన్నట్టుంది మాకు. దానివల్ల మళ్ళీ మేము గ్రంథాలు వ్రాయడం జరిగింది. ఆ గ్రంథాలు ఈ రోజు రిలీజ్ అయినాయి. మీరు వాటిని చూసి చదువుకోవచ్చు. ఈ కార్యక్రమం నేను చెప్తూపోతే ఎంతసేపయినా కొనసాగుతుంది. కానీ ఇంతసేపు మీకు అంటే వినేవాళ్ళకు కొంతమంది ఆసక్తిగా వింటున్నారు, కొంతమంది తూగి కిందపడుతున్నారు. వాళ్ళ బాధలు మేము చూడలేక చాలించుకోవాల్సిన పని వస్తుంది. అంటే ఇంత హాయిగా ఉంటుందా జ్ఞానం అనిపిస్తుంది మాకు. వేమన యోగి ఒక పద్యం చెప్తూ చెప్తూ ఏం చెప్పినాడంటే "మంత్ర జలము కన్నా మంగళి జలం హెచ్చురా" అన్నాడు. అంటే మంత్ర జలం, పేరుతో బాపనోళ్ళు నీళ్ళు చల్లుతారంట మంత్రాలు చదివి, అట్లా చల్లితే ఏమన్నా నిద్రలో ఉన్నా ముఖాన నీళ్ళు చల్లితేనే మెలుకువలోకి వస్తారు. అన్నట్టు, హుషారు అవుతారు. మంగళోళ్ళు నెత్తిన నీళ్ళు చల్లి తలమీద చెయ్యి పెడితేనే హాయిగా నిద్ర వస్తాదంట. వేమన యోగి ఏమన్నాడంటే మంత్రజలం కన్నా మంగళ జలమే హెచ్చు అన్నాడు. మంగళి జలము వలన హాయిగా ఉంటుందట. ఆయన ఏ అర్థంతో చెప్పినాడో కానీ, మంగళ అంటే శుభకరమైన జ్ఞానం అని అర్థం. కానీ ఇది మంగళ

జలమన్నట్టుంది ఇది మీకు నెత్తిన నీళ్ళు చల్లి చెయ్యి పెడితే ఎంత హాయిగా ఉంటుందో అంత హాయిగా ఇక్కడ జ్ఞానము వింటూ నిద్రపోతున్నారు. ఒక అతను తూలుతావుంటే, ఒక అతను కింద పడిపోతావుంటే ఇవన్నీ మాకు కనిపిస్తున్నాయి, కానీ మీకు కనపడలేదు. నన్ను చూస్తుంటారు మీరంతా. నేను మిమ్మల్ని చూస్తుంటాను కాబట్టి నేనేమో ఉషారుగా మాట్లాడుతున్నాను. మీరు ఎన్ని రకాలుగా ఉషారులో ఉన్నారో మాకు అర్థమైతుంది కాబట్టి. చాలాసేపు మిమ్మల్ని పీడిస్తే బాగుండదు కాబట్టి నేను ఇంతటితో చాలించాలనుకున్నాను.

తర్వాత మీకు చెప్పే విషయము ఏమంటే ఈ రోజు అంటే సాయంకాలం, దగ్గర దగ్గర 6 గంటలు అవుతుంది, ఇప్పుడు మీరు తొందరగా దేవునికి పూజ చేసుకొని, మళ్ళీ తొందరగా మొదలుపెట్టుకొంటే పూజ అయిపోతుంది. మళ్ళీ విడిది తీసుకొని పోవద్దండి. సినిమాలకు ఇంటర్‌వెల్ విడిచిపెట్టినట్టు, బయటికి పోయివస్తాం అనద్దండి. ఇక్కడి నుంచి పోతూనే అక్కడ కూర్చోని పూజ చేసుకోండి. ఒక 20 నిమిషాల్లో పూజ అయిపోతుంది. పూజ అయిపోయిన వెంటనే భోజనం పెట్టే కార్యక్రమం చేయండి. మనవాళ్ళు కొంతమంది సేవ చేసేవాళ్ళంతా భోజనం పెట్టే వాళ్ళు తొందరగా పెట్టండి, ప్రతి పని అందరూ చేస్తేనే ఆ కార్యక్రమం అయిపోతుంది. భోజనం పెట్టేది తొందరగా అయిపోతే అంటే 7:30 గంటలకు సాధ్యమైతే నాటికలుంటాయి. ఆధ్యాత్మికతకు సంబంధించిన నాటికలు. ఇంతకుముందు ఆ నాటికలు అంటే దానివల్ల జ్ఞానమే అందులో ఉంటుంది.

తర్వాత మీకు ఉత్సాహం కలిగించేదానికి కొన్ని డాన్స్ ప్రోగ్రామ్స్ కూడ ఉంటాయి. అంటే ఇంతకుముందు జూనియర్ ఆర్టిస్ట్‌లను తీసుకొచ్చి

జూనియర్ చిరంజీవి, జూనియర్ వెంకటేష్, జూనియర్ బాలక్రిష్ణ, జూనియర్ రాజబాబు వీళ్ళందరిని తీసుకొచ్చి మీకు చూపించాము. జూనియర్ నాగార్జున వీళ్ళందరిని. ఇక్కడ స్టేజీ మీద వాళ్ళతో డాన్స్ చేయించాము. మీకు హుషారు కలిగించేదానికి అంటే ఉత్త జ్ఞానమే కాదు, దీంట్లో చాలా సంతోషంగా ఉంటుంది అనేటట్టుగా ఈసారి అట్లా లేదు కానీ వాళ్ళందరిని పిలుచుకరాలేదు. ప్రతి సంవత్సరం అట్లే చేస్తే బాగుండదనీ, ఇప్పటికి 2, 3 సార్లు పిల్చుకొచ్చాము, ఇంక వద్దనుకొన్నాము. కేవలం ఆధ్యాత్మికమే మనం గొప్పగా పెట్టుకుంటే బాగుంటుది. దానికి సంబంధించిన నాటికలే మేము తయారు చేసి, మీ ముందర ప్రదర్శించడం జరుగుతుంది. ఈ రోజు మా వాళ్ళు తయారు చేసిన నాటికలు ఉన్నాయి. జ్ఞానులు చేసేటివి వాళ్ళు తరువాత పోయిన సంవత్సరం మేము ప్రత్యేకంగా ఒక నాటిక వ్రాసి ఇవ్వండి అంటే నేను జ్ఞానం ప్రకారం వ్రాసివ్వాలి కాబట్టి వ్రాసి ఇచ్చింటే అది కూడా ప్రదర్శించారు. దాని పేరు "మూఢ పండితుడు" అని. తర్వాత ఈసారి భూలోకంలో యమలోకం అని ఒక నాటిక వ్రాసి ఇచ్చాము. కానీ ఇది సినిమా పేరుంది అని చెప్పారు మా వాళ్ళు. సినిమా పేరు కూడ భూలోకంలో యమలోకం అని పేరుందంటే సినిమా పేరు మనం పెట్టుకుంటే ఏ బాగుంటుందని దానిని ఇంకొక పేరుగా మార్చి "అమ్మగంటు, నాన్నగంటు" అని అంటున్నారు.

ఈ రోజు అమ్మగంటు నాన్నగంటు అనేది ఏమిటిదని మీకు నాటికలో తెలుస్తుంది. దాంట్లో యమధర్మరాజు స్వయంగా వచ్చి మీకు చెప్తాడు. మేము చెప్పితే బాగుండదు. యమధర్మరాజు చెప్పేదంతా ఇప్పుడు వినకపోతే అక్కడ చూస్తాడు మీ కథ. నా లోకంలోకి వచ్చినప్పుడు మీ కథ చూస్తాను అంటాడు. కాబట్టి ఆయన చెప్పేది మీరు వినాల్సిందే తప్పనిసరిగా.

నాటిక చూడండి తరువాత పోయిన సంవత్సరం ఇంతకు ముందు సంవత్సరము రెండు మూడు సంవత్సరాలుగా మా అబ్బాయి నా చిన్న కొడుకు మణింధర్ డాన్స్ చేసి మీకు చూపించాడు. అంటే మణింధర్ స్వామి కొడుకు డాన్స్ చేస్తూవుంటే చాలా సంతోషంగా ఉంటాది. ఈలలు వేసి అరుస్తారు అంటే మీకు సంతోషం ఉత్సాహం తెప్పించేదానికి మణింధర్ ఈ సంవత్సరం కూడ డాన్స్ చేస్తాడు. రెండో అబ్బాయి కృష్ణుని పాత్ర వేస్తాడన్నమాట ఈ రోజు. ఇంతవరకు రెండో అబ్బాయి ఎప్పుడు కనిపించలేదు. రెండో అబ్బాయి కృష్ణుని పాత్ర వేస్తాడు. ఆ కృష్ణుని పాత్ర ముందర ఈయన డాన్స్ చేస్తాడు, ఏమి డాన్స్ తెలుసునా? అంటే సినిమా డాన్సే. అంటే వీళ్ళు కొత్త రకంగా స్టెప్స్ వేసి చేస్తారు. సినిమాలో ఉండేదంటే దశావతారం సినిమాలో ఈ మధ్యన విడుదలైన దశావతారం సినిమాను మీరు చూసింటారు బహుశా. ఆ సినిమాలో 'లోకనాయకుడు' అని పాటుంది. అంటే లోకానికంతా నాయకుడు ఒకడుంటాడు అంటే కృష్ణుడే నాయకుడని, కృష్ణున్ని ఇక్కడ పెట్టి లోకనాయకుడని పాట పాడుతూ డాన్స్ చేస్తారు, ఈయనే లోకనాయకుడని. మణింధర్ డాన్స్ ఉంటుంది కాబట్టి మణింధర్ డాన్స్ అంటే చాలా సంతోషం అనుకుంటా మీకు కొంతమందికి. తర్వాత జ్ఞాన నాటికలుంటాయి.

# 86. దేవుడు ఒక్కరా! - ఇద్దరా!

**(తేది :- 28.09.2015)**

మీకు ఈ రోజు **'ఏది నిజమైన జ్ఞానము'** అనే క్రొత్త గ్రంథము అందించబడింది. ఆ గ్రంథాన్ని వ్రాయవలసిన అవసరము ఎందుకు వచ్చిందంటే, దానిలోని విషయము ఏమిటి అంటే? భూమిమీద ఎంతోమంది మనుష్యులు ఉన్నారు. వారిలో అందరూ జ్ఞానము తెలుసుకోకపోయినా, కొంతమంది మాత్రము జ్ఞానము తెలుసుకొని, మాదే నిజమైన జ్ఞానమని పోటీపడి చెప్పుకోవడము జరుగుతావుంది. అట్లే ఒకరి జ్ఞానాన్ని ఒకరు విశ్వసించడము లేదు. కానీ ప్రపంచానికంతా ఉండేది దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే అనే విషయాన్ని పూర్తిగా మరిచిపోయి, మాదే నిజమైన జ్ఞానము అనీ మీ దేవుడు వేరు, మా దేవుడు వేరు అనే స్థితికి వచ్చేశారు. అట్లే పేర్లు కూడా వేరే పెట్టుకొన్నారు. మా దేవుని పేరు మీరు చెప్పవద్దండి, మీ దేవుని పేరు మేము చెప్పము, అట్లే మా జ్ఞానము వేరు, మీ జ్ఞానము వేరు కానీ మా జ్ఞానమే గొప్పది అంటున్నారు. అంటే ఈ విషయములో ముగ్గురు అంటే హిందువులు, క్రైస్థవులు, ముస్లీమ్‌లు ముగ్గురు పోటీ పడుతున్నారు. భూమిమీద పన్నెండు మతాలు ఉన్నాగానీ, ఈ పన్నెండు మతాలలో పై మూడు మతాలే పెద్దవి. ఈ మూడు మతాలలో ఉండే జ్ఞానమే గొప్పదనుకుందాము. సరే మనము కూడా ఈ మూడు మతాలలో ఉండే జ్ఞానమే పెద్దదని ఒప్పుకుంటున్నాము. మూడు మతాలకు సంబంధించిన మూడు దైవగ్రంథాలు వాస్తవమైన పెద్ద గ్రంథాలే! ఇది దైవ గ్రంథము, ఒకటి కాదు అని చెప్పేదానికి ఏమాత్రము అవకాశము లేదు. ఎందుకంటే ఒకే గ్రంథాన్ని మనము మూడు గ్రంథాలుగా చింపుకొని

చదువుకుంటున్నాము కాబట్టి అది వేరు, ఇది వేరు అని చెప్పుకోవడానికి అవకాశము లేదు. కాబట్టి మూడు గ్రంథాలు మనకు ఒకటే జ్ఞానాన్ని ఇస్తున్నాయి. మనము ఇంతకు ముందే చెప్పుకున్నాము. ఈ గ్రంథాలలో మాటలు తేడాగా ఉంటాయి కానీ, భావము ఒకటే ఉంటుంది.

ఒకచోట అమ్మి అంటారు, మరొకచోట అమ్మాయి అంటారు. కానీ ఆ రెండు మాటల ఉద్దేశ్యము ఒకటే. అట్లా పై మాటలలో భాష వేరే ఉంది, అని అనుకోకూడదు. ఆ రకంగానే ఖురాన్‌లో చెప్పిన భాష వేరే ఉండవచ్చు, బైబిల్‌లో చెప్పిన భాష వేరే ఉండవచ్చు, భగవద్గీతలో చెప్పిన భాష వేరే ఉండవచ్చు. కానీ మూడు గ్రంథాలలోని భావము ఒక్కటే, మీరు దానిని గుర్తించండి అని చాలామార్లు చెప్పాను. కానీ అది తెలియక కొందరు ఏమి చేస్తున్నారంటే మేము చెప్పే జ్ఞానాన్ని విని మీరు మొత్తము అజ్ఞానాన్నే బోధిస్తున్నారు. మీరు చెప్పేది సత్యము కాదు, అట్లాగే ప్రజలను తప్పుదారి పట్టిస్తున్నారు అని, మా జ్ఞానమే సత్యమైనది అని అంటున్నారు. మీ జ్ఞానమేమిటి అంటే, మా గ్రంథములో ఉండే జ్ఞానమే గొప్పది అంటున్నారు. మరి మేము కూడా చెప్పేది మీ గ్రంథములోని జ్ఞానమునే కదా! అని మనము అంటే, వాళ్ళు మా గ్రంథములోని జ్ఞానాన్ని తీసుకొని మీరు తప్పుగా ప్రచారము చేస్తున్నారు అంటున్నారు. ఎట్లా తప్పు అని మనమడుగుతూ, మీ గ్రంథములోని జ్ఞానము మీకు అర్థము కాలేదని చెప్పడానికే దేవుడు నన్ను అదే పనిగా పంపించాడు. నేను ఇంతకు ముందు చెప్పాను నాకు ఏమీ జ్ఞాపకము ఉండదు, జ్ఞాపకశక్తి తక్కువ అని, అంటే మీకంటే నేను తక్కువ వాన్ని అయినా ఇక్కడ జ్ఞానము చెప్పుచున్నాను. మరి ఏమి గొప్పతనము అంటే, ఇది నేను చెప్పే జ్ఞానము కాదు, అది దేవుడు అందించే జ్ఞానము అని చెప్పుతున్నాము. నాకు ఏమాత్రము

సంబంధము లేదు. ఆ దేవుడు అందించే జ్ఞానమే కానీ నేను మధ్యవర్తి లాంటి వాడినే కానీ నా స్వతహాగా నేను ఏ జ్ఞానము చెప్పలేదు. ఎందుకంటే ఉదయము విషయమే సాయంత్రము అయ్యే సరికి నాకు జ్ఞాపకము ఉండదు, మరి అంత పెద్ద జ్ఞానము ఎక్కడ జ్ఞాపకము ఉంటుంది?

సరేలే, మరి అంత పెద్ద జ్ఞానము మనము చెప్పుచున్నాము అంటే, ఎలా అని చూస్తే, హిందువులకు భగవద్గీత ఉంది, అందులో శ్లోకాలు ఉన్నాయి. మరి పెద్ద పెద్ద స్వామీజీలు అందులోని శ్లోకాలకు అర్థాలను వివరించి చెప్పారు. మరి అంత పెద్ద స్వామీజీలు వివరించిన వివరాలను వారు చెప్పేది తప్పు అని మేము చెప్పుచున్నాము. వాళ్ళు పెద్ద స్వామీజీలే, వాళ్ళను పెద్ద స్వామీజీలే అని మేము కూడా ఒప్పుకుంటున్నాము. అట్లే మేము వాళ్ళను గౌరవించుచున్నాము. కానీ జ్ఞానము దగ్గరకు వచ్చేసరికి వాళ్ళు చెప్పింది తప్పు అని చెప్పేస్తున్నాము. మరి వాళ్ళను అక్కడ గౌరవించి, ఇక్కడికి వచ్చేసరికి ఎందుకు తప్పు అని చెప్పుచున్నాము? అంటే ఇక్కడ నేను కాదు చెప్పేది, ఇక్కడ చెప్పే ఆయన ఎవరో ప్రత్యేకంగా ఉన్నాడు. తప్పు చేసిన వారిని తప్పే అని చెప్పుచున్నాడు కానీ ఇంకొకరకంగా ఒప్పుకోవడము లేదు. ఈ రకంగా దేవుడు ఏమి చేస్తున్నాడంటే, మాకు తెలియని జ్ఞానాన్నే అందించి, మీకు సక్రమమైన మార్గములో చెప్పిస్తున్నాడు. భగవద్గీతలోని సంస్కృత శ్లోకాలకు పూర్తి అర్థాలు, భావములు మాకు తెలియక పోయినాగానీ, సంస్కృతం తెలిసిన వాళ్ళకంటే ఎక్కువగా చెప్పించాడు. అది వాస్తవమైన జ్ఞానమే అని మనకు బయటపడింది. మరి ఇప్పుడు ఇటువంటి రోగము ఒక హిందువులలోనే ఉందా అంటే, ఈ రోగము అన్ని మతాలలో ఉంది. భగవద్గీతలో కాలుష్యము ఏర్పడింది, అది అర్థము కాకుండా పోయింది. అది వాస్తవమే మరి ఈ సమస్య ఒక గ్రంథములోనే

ఉందా అంటే అన్ని గ్రంథాలలోను, అన్ని మతాలలోను ఉండే సమస్యే ఇది. మరి వాళ్ళకు ఎవరు వివరంగా చెప్తారు. అంటే ఎక్కడైనా గానీ గురువనేవాడే చెప్పాలి గురువు సాకారుడు, దేవుడు నిరాకారుడు, దేవుడు చెప్పడు. ఆయన చెప్పడము ఇక అయిపోయింది. ఆయన ఏ రకంగా చెప్పించాడో మళ్ళీ ఆ రకంగానే చెప్పాలంటే గురువు మాదిరి వచ్చే చెప్పాలి. అలా గురువు అనే మాటను అడ్డము పెట్టుకుంటాడు. మరి గురువు అంటే ఎట్లుంటాడు అంటే, ఎవరికీ తెలియదు.

మరి చాలామంది వచ్చి మమ్మల్ని గురువుగారు అంటే, మీరు అలా అనవద్దండి, నేను గురువునుకాను, నేను సామాన్యమైన వ్యక్తినే, మీరు నమస్కారము చేయవద్దండి, దేవునికే నమస్కారము చేయండి అని చాలాసార్లు చెప్పాను నేను. కానీ ఎప్పుడు గురువు కాదు, ఎప్పుడు గురువును నేను అంటే ఈ పీఠము మీద కూర్చున్నప్పుడు పూర్తిగా వందకు వందశాతము గురువునే నేను. బాగా జ్ఞాపకము పెట్టుకోండి. ఎక్కడైనా సత్యమే చెప్పుతాము, కలము పట్టుకొని గ్రంథము వ్రాసేటప్పుడు వందకు వందశాతము గురువునే నేను. అక్కడ ఏ శ్లోకము కనిపించినా, ఆ భావము లోని సత్యము నా కంటి ముందర మెదులుతూ ఉంటుంది. వేరేవాళ్ళు చెప్పేది సత్యమా కాదాయని తెలుస్తుంటుంది. మరి అంతపెద్ద వాళ్ళు చెప్పిన దానిలో కూడా తప్పు ఉంటే అది తెలుస్తుంది. ఎవరు చెప్పినా కానీ అందులో ఉండే సత్యమేదో కనిపిస్తుంటుంది. కాబట్టి మేము సత్యాన్నే చెప్పాల్సిన పని వస్తుంది. మరి అంత పెద్దవాళ్ళు చెప్పింది సత్యము కాదు అని నిజమైన సత్యాన్నే మేము చెప్పుతున్నాము అంటే, అది చెప్పే వానిని నేను కాదు, నా వెనుక ఉండేటటువంటి గురువు. అది ఇంతకు ముందు కూడా నేను చెప్పాను. ఆ గురువనే వాడే అన్నీ చెప్పుతాడు అని చెప్పాము.

మరి ఈ కాలములో ఎంతపెద్ద జ్ఞానము చెప్పినా గానీ, ఇతరులు మా జ్ఞానాన్ని మీరు ఎలా చెప్పుతారు అంటారు. అంటే మీరు హిందువులుగా ఉండి మా క్రైస్థవుల జ్ఞానాన్ని, మా ముస్లీమ్‌ల జ్ఞానాన్ని ఎలా చెప్పుతారు అని మిగతావారు కూడా అనడము జరుగుతూవుంది. మీరు హిందువు కాబట్టి భగవద్గీతా జ్ఞానము మీకు తెలిసి ఉండవచ్చు, అంటే హిందువైనంత మాత్రాన భగవద్గీత తెలుస్తుందా? ఒక మతములో పుట్టినంతమాత్రమున జ్ఞానము తెలుస్తుందనే నిబంధన ఏమీ లేదు. శ్రద్ధ ఉండి, దేవుడు తెలియజేస్తే ఎవరికైనా జ్ఞానము తెలుస్తుంది. లేకుంటే ఎవరికీ తెలియదు. మేము ఏమి చెప్పుచున్నామంటే ఒక హిందువుల జ్ఞానమే కాదు. ఎక్కడ ఎవరు తప్పుదారి పట్టిపోతున్నారో? ఎక్కడ దేవుని వాక్యాన్ని తప్పుగా అర్థము చేసుకుంటున్నారో, ఆ వాక్యాన్నంతా సరిచేసి చెప్పడమే నా కర్తవ్యము అని గ్రంథములో వ్రాయడము కూడా జరిగింది.

ఇప్పుడు ఇంతకుముందు చెప్పిన ప్రత్యేకమైన పేరు విషయాని కొస్తాము. రేపటి నెలలో మీకు వచ్చే గ్రంథములో ప్రత్యేకించి, ఒక పేరు వస్తుంది. అలాగే ఈ జరుగుతున్న సమావేశము యొక్క సిడి మీకు రేపు ఉదయము వస్తుంది కదా! ఆ సిడిలో ప్రత్యేకించి ఒక పేరు వస్తుంది. అది ఏమిటంటే **"త్రిమత ఏకైక గురువు"**. ప్రపంచములో ఒకే ఒక గురువు, మూడు మతాలకు ఒకే గురువు, త్రిమత ఏకైక గురువు ఎక్కడున్నాడంటే ఇక్కడే ఉన్నాడు. అతను మీకు ఏ మతములోని జ్ఞానాన్ని అయినా చెప్పుతాడు. ఒక మతములోనే గురువుంటాడు, అంటే ఏ మతములోనైనా గురువు గురువే కాబట్టి అక్కడ టైటిల్ త్రిమత ఏకైక గురువు అని ప్రకటించడము జరుగుతూవుంది. మరి జ్ఞాపకశక్తే సరిగా లేదు నాకు అన్నప్పుడు, త్రిమత ఏకైక గురువు అనే పేరును మీరు ఎట్లా పెడుతున్నారు

అని మీరు నన్ను అడగవచ్చు. అది నా పేరు కాదు, ఆ పేరు ఇతరుల చేత నాకు పెట్టబడిన పేరు. ఎందుకంటే ఆ పేరు పెట్టబడింది కాబట్టి, ఈ పీఠము మీద కూర్చున్నందుకు మూడు మతాల జ్ఞానాన్ని నేను చెప్పవలసిందే. కానీ ఎక్కడైనాగానీ, ఏ విషయములో గానీ సత్యము ఉంటేనే చెబుతాము. సత్యము లేకుంటే చెప్పమన్నమాట. మేము వ్రాసే ఏ గ్రంథమైనాగానీ సత్యసమేతముగా ఉంటుంది. సత్యబద్ధముగా ఉంటుంది. సత్యముతో కూడుకొని ఉంటుంది. అది దేవుని జ్ఞానము కాబట్టి దేవుని జ్ఞానము అబద్ధముగానీ, అసత్యముగా గానీ ఎక్కడా ఉండదు. అది చెప్పినాము అంటే నూటికి నూరుపాళ్ళు నిజము. అది ప్రాక్టికల్‌గా జరిగితీరుతుంది, ఏది? దేవుని జ్ఞానము. అటువంటి దేవుని జ్ఞానాన్నే మేము ఇక్కడ చెప్పుతాము. "మరి అంత సత్యబద్ధముగా చెప్పుతున్న జ్ఞానాన్ని ఒక లెక్కలో మాకు ఏమీ తెలియదు అంటారు. జ్ఞాపకము లేదు అంటారు. ఒకసారి నేనే చెప్పుతాను అంటారు. ఒకసారి నేను చెప్పను అంటారు. మరి ఇది ఎలా?" అంటే "అపరిచితుడు" సినిమా మాదిరిగా ఉంటుంది. ఎందుకంటే ఒకసారి ఇట్లా చెప్పడము, ఒకసారి అట్లా చెప్పడము అంటే వాస్తవమే అది. ఒకప్పుడు నేను (జీవాత్మను) మరియొకప్పుడు ఆత్మ మాట్లాడుతుందని తెలియాలి.

సత్యము చెప్పినప్పుడు సత్యమే చెప్పుతాము. ఎప్పుడైతే జ్ఞానము చెప్పాలని మేము పీఠము మీద కూర్చున్నామో అప్పుడు జ్ఞానమే చెప్పుతాము. ఎప్పుడైతే మేము జ్ఞానము మీకు తెలియజేయాలనుకున్నామో అప్పుడు జ్ఞానమే చెప్పుతాము. ఇంతకుముందు ఇక్కడ పీఠము మీద కూర్చున్న తర్వాత, అప్పటికప్పుడు ఏదైతే ఆలోచన వస్తుందో, దానినే అప్పటికప్పుడే చెప్పుతాము. కానీ ఇప్పుడు మరొక నిబంధన ఏర్పడింది మాకు. ఏమిటంటే

ఈ రోజు మేము చెప్పే జ్ఞానాన్ని మీకు సిడి రూపములో మీకు అందించాలంటే, నిన్ననే ఆ సిడిలపై ప్రింట్ చేయించాలి, అంటే సిడిపైన అతికించే రంగుల పేపరును ముందే హైదరాబాద్‌లో ప్రింట్ చేయించాలి కాబట్టి అలా చేయించాలంటే ముందే చెప్పే జ్ఞానము యొక్క పేరు చెప్పాల్సి వస్తుంది. మరి ఇలా ముందే చెప్పే జ్ఞానము యొక్క పేరు ఎలా చెప్పాలి? పీఠము మీద కూర్చున్న తర్వాత లోపలి నుండి ఎలా చెప్పితే అలా చెప్పేవాళ్ళమే కదా! మరి ఇప్పుడు ముందే ఎలా చెప్పాలి. కానీ చెప్పకపోతే సిడిల మీద పేరు ప్రింట్ కాదు కాబట్టి రెండు మూడు రోజులముందే పేరు చెప్పాలి. అట్లా చెప్పిన పేరే ఈ రోజు సమావేశము యొక్క పేరు అదే **"దేవుడు ఒక్కరా? ఇద్దరా?"** ఇంతకుముందు ముందే పేరుపెట్టి గ్రంథాలను వ్రాసేవాళ్ళము.

ఇప్పుడు అట్లాగే ముందే పేరు చెప్పి ప్రక్కకు పోకుండా సమావేశములో జ్ఞానము చెపాల్సి వస్తుంది. ప్రక్కదారిలోకి పోకూడదు. చెప్పిన దానిని గురించే జ్ఞానము చెప్పాలి. గుర్రానికి కళ్ళకు రెండువైపుల రెండు పట్టీలు కట్టి ఉంటారు. ఎందుకంటే ప్రక్కలకు ఏమాత్రము కనబడకుండా ముందుకే కనిపించే విధముగా వాటిని కడుతారు. ఆ రకంగా మేము కూడా సిడి మీద ఏమి ప్రింట్ చేసి ఉంటారో దానినే ప్రక్కకు పోకుండా చెప్పాలి మేము. సరే ఏదో ఒక రకంగా తిప్పలుపడుతాము. ఇప్పుడు మేము ఒక ప్రశ్న వేస్తాము. ఇది మాకు ప్రశ్నే మీకు ప్రశ్నే. ఆ ప్రశ్న విచిత్రముగా ఉంటుంది. ఎందుకు అంటే దేవుడు ఒక్కడే అని సర్వప్రపంచానికి తెలుసు. అన్ని మతాలకు తెలుసు, ఇంతకుముందు మేము కూడా ప్రపంచానికంతా దేవుడొక్కడే అని చెప్పాము. మరి ఈ విషయము, ఇంతకుముందు చెప్పిన విషయము మాకు జ్ఞాపకము కూడా

ఉంది. మరి ఒక్కడే అని చెప్పి, ఇప్పుడేమో ఇద్దరా? అని అడగడములో అర్థము ఏముంది? ఇద్దరా అంటే ఏమి, ఒక్కడే అని చెప్పాము అంటే ఏదో లిటిగేషన్ దీనిలో ఉంది. కొన్ని మాటలు మనకు అర్థము కావు. ఒకటి చెప్తే, ఒకటి అర్థమవుతుంది మనకు. జ్ఞానము ప్రకారము ఆయన ఏమి చెప్తాడో ఆ విషయము మనకు అర్థము కాదు. కాబట్టి దేవుడు ఒక్కరా, ఇద్దరా? ఒక్కడంటే ఏమవుతుందో ఏమో, ఇద్దరంటే ఏమవుతుందో ఏమో, ఇద్దరంటే తప్పు అవుతుందో ఏమో, మరి ఒక్కడే అంటే మనకు తెలుసు, తెలిసి మళ్ళీ ఇద్దరు అని ఎందుకు అడుగుతున్నాము అని మరొక వైపు అనుమానము వస్తుంది. ఈ రకంగా మనము సందిగ్ధములో పడిపోతాము.

సత్యమును మనము చూపించినా మనిషి సందిగ్ధములో పడిపోవుటకు అవకాశము ఉంది. నేను గతములో 40 సంవత్సరాల క్రిందట ఒకటి చూశాను. ఇప్పుడు జరుగుతున్నట్లుగానే ఒక గుడిలో ఒక జ్ఞాన సభ జరుగుతూవుంది. సుమారుగా ముప్పై, నలభైమంది కూర్చొని ఒక గురువు చెప్పుచుంటే వింటున్నాము. అక్కడ గురువులు జ్ఞానము చెప్పుచున్నారు. ఇది మంచి పద్ధతే కదా! అని, మనము కూడా ఏమైనా జ్ఞానము తెలుసుకోవచ్చని అనుకొని అక్కడికి వెళ్ళికూర్చున్నాము. కూర్చున్న తర్వాత సరిగ్గా 12.30 ని॥లకు గురువు ఇలా అన్నాడు. "మీరు ఎప్పుడు దేవున్ని చూడలేదు కదా! ఇప్పుడు దేవున్ని చూపుతాను చూడండి అని చెప్పేసరికి అప్పటి వరకు కొంత మబ్బుగా ఉన్న మనము కూడా ఒక్కసారిగా హుషారుగా మారిపోయాము. ఏమి చూపుతాడో చూస్తాము" "ఇప్పటి వరకు మీరు ఎప్పుడూ దేవున్ని చూడలేదు కదా! చూడండి ఇప్పుడు చూపుతున్నాను, జాగ్రత్తగా చూడండి. నిద్రలో ఉండేవాళ్ళు కూడా బయటకు రండి" అని చెప్పితే, అప్పుడు మనము సరే అనుకొని జాగ్రత్తగా చూడడము

మొదలు పెట్టాము. అప్పుడు ఆయన ఒక అగ్గిపెట్టె తీసుకున్నాడు, దానిని చూపుతూ ఇది ఏమిటి అని అడిగినాడు. ఈ ప్రశ్నను ఆ గుడిలోని పూజారినే అడిగాడు. అప్పుడు ఆయన ఏమన్నాడంటే ఇది అగ్గిపెట్టె అన్నాడు. తూ, ఇది అగ్గిపెట్టెనా అని అన్నాడు ఇతడు, అప్పుడు పూజారే నిజమే కదా! ఇది అగ్గిపెట్టకదా, అని ఇతనికి అర్థము కాలేదు, అతడేమో నీకు బుద్ధి ఉందా, ఇది అగ్గిపెట్టెనా అని అనుకున్నాడు.

గురువుగారు రెండవసారి గద్దించి అడిగేసరికి, ఆ పూజారికి అప్పుడు అనుమానము వచ్చింది. అది అగ్గిపెట్టేనా అని, ఇప్పుడు ఆ విధముగానే దేవుడు ఒక్కడే అని మనకు తెలుసు. కానీ మేము అడిగే ప్రశ్నకు, ఎలాగ అని అడగడానికి మీకు కూడా అనుమానము వచ్చింది. ఏమని? ఒక్కడంటే ఏమిటో, ఇద్దరంటే ఏమిటో అని, అక్కడ ఆయన దీనిని అగ్గిపెట్టె అంటారు అందరూ అని అనుమానంగా నమ్మకము లేకుండా చెప్పాడు. ఇది ఎట్లా ఉంది అంటే దేవుడే ఒక్కడే అని అందరూ అంటావుంటారు అని అన్నట్లుంది. అంటే ధైర్యంగా ఆయన చెప్పలేదు. అప్పుడు గురువు ఇది అగ్గిపెట్టె కాదు, ఇప్పుడు చూడండి బాగా, అగ్గిపెట్టే దేవుడు అని చెప్పాడు. అప్పుడు మాకు అనిపించింది ఏమిటి? ఇతడు దేవున్ని చూపిస్తానని అగ్గిపెట్టెను చూపించాడు. ఇతను చూపిస్తున్నాడు కదా! మనము చూస్తుంటే ఆయన అగ్గిపెట్టెను విడివిడిగా, ఇది పెట్టె, మందు, ఇది పుల్ల అని విడివిడిగా వేసి ఇప్పుడు చెప్పు ఇది అగ్గిపెట్టెనా అని అడిగాడు. విడివిడిగా వేస్తే అప్పుడు అగ్గిపెట్టె ఎలా అవుతుంది. అని అతను కూడా ఇదిమ పెట్టె, అది మందు, అది పుల్ల అని అతను కూడా అన్నాడు. అక్కడున్న వాళ్ళు కూడా అదే పాట పాడాల్సి వచ్చింది. ఇట్లా ఆ రకంగా ఆయన అగ్గిపెట్టెను చూపించి, అగ్గిపెట్టె కాదు అని ఎట్లా

అన్నాడో, ఆ రకంగానే ఇప్పుడు దేవుడా? అంటే మీకు కూడా అనుమానము రావచ్చు. దేవుడు ఒక్కడే అనేమాట సత్యము కానీ ఇంకొక ప్రశ్న కూడా ఉంది. దేవుడు ఒక్కడా, ఇద్దరా? అని మనకు ఎందుకు ఈ ప్రశ్నవచ్చింది. ఇంతకుముందు ఇలాంటి ప్రశ్న ఎప్పుడూ మనకు రాలేదు కదా! సరే భగవద్గీతలోని పురుషోత్తమ ప్రాప్తి యోగము 11వ శ్లోకములోనికి పోయి ఇప్పుడు మనము చదువుకుందాము. అక్కడేమన్న మన అనుమానము తీరుతుందేమో...

శ్లో॥ 11. యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మ న్యవస్థితమ్ ।
యతన్తో ప్యకృతాత్మానో నైనం పశ్యన్త్య చేతసః ॥

"దేహమందున్న దయ్యును దెలియగలరు, యత్నమొనరించు యోగులీయాత్మరూప మకృత బుద్ధుల చేతసులైన వార లెంత యత్నించినను దాని నెఱురగలేరు."

శరీరములో ఉండే ఆత్మను, దేవునిలోనికి ఐక్యం కావాలనే ప్రయత్నము చేసేవాళ్ళయిన యోగులందరూ కనుక్కొనగలరు. అంటే **యోగాన్ని ఆచరించే వాళ్ళంతా యోగులు, దేవుడు గొప్పవాడు అనుకునే వాళ్ళందరు జ్ఞానులు అనుకుందాము.** వాళ్ళకు అంతో ఇంతో జ్ఞానము ఉందని, కానీ యోగులంటే ప్రయత్నించే వాళ్ళు, ఆ జ్ఞానాన్ని తెలుసుకొని ప్రయత్నము చేసేవాళ్ళను మనము యోగులు అంటాము. వాళ్ళు ఎక్కడ ఉన్నదానిని తెలుసుకోవాలనుకుంటున్నారు? శరీరములో ఉండేటటువంటి ఆత్మను తెలుసుకోవాలనుకుంటున్నారు. ఇంతవరకు ఆత్మ అంటే ఎవరో ఈ శ్లోకము ద్వారా మనకు తెలియదు. ఆత్మ అని పేరు పెట్టబడి చెప్పబడింది. అంతేకానీ దేవుడనిగానీ, ఇంకొకటనిగానీ పేరు పెట్టలేదు.

భగవద్గీతలోని 15వ అధ్యాయము వరకు 'ఆత్మ' అనే ఒక్క పేరే చెప్పబడి ఉంది. జీవునికైనా అదే పేరుంది, దేవునికైనా అదే పేరుంది, ఆత్మకైనా అదే పేరుంది. అంతేకానీ విడిగా ఏమీ లేదు. ఇక్కడేమి చెప్పినారంటే ప్రయత్నము చేసే యోగులంతా ఆత్మను తెలుసుకోగలరు అని చెప్పాడు. మరి ఇది చదివినప్పుడు, మరి ప్రయత్నము చేసే యోగులు శరీరములోని దేవున్ని ఎందుకు తెలుసుకోవాలనుకుంటున్నారో అని మనకు ఒక ప్రశ్న వస్తుంది. దానికొరకు ఇదే అధ్యాయములోని 15వ శ్లోకానికి పోదాము అక్కడ ఏమి చెప్పుచున్నారంటే..

శ్లో॥ 15. సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనంచ ।
వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవి దేవచాహమ్ ॥

"నేను అఖిల భూతములనందు, హృదయపీఠి, అంటే సర్వ జీవరాశుల హృదయపీఠములో నేను ఉన్నాను. "నా వలన కలుగు స్మృతియు జ్ఞానంబు, ఊహ అంటే నా వల్లే స్మృతి, జ్ఞానము, ఊహా అన్నీ మీకు కలుగుతున్నాయి. అంటే మీ స్వంత తెలివి ఏమీ పని చేయలేదు. "లెరుక పరుచు వేదంబులెల్లనన్నే" అంటే వేదాలన్ని తెలియపరుచుచున్నాయి. "వేదఫలదాతయును, వేద విదురుడను అన్నీ నేనే! ఇంకొక విషయమేమీ కాదు, ఎవరిని అంటే నన్ను, అంతేకానీ ఇక్కడ తెలియదు? నేను అంతా ఎక్కడ ఉన్నాను. "నేను అఖిల భూతములందు ఉండు హృదయ పీఠి'' హృదయ పీఠములో ఉన్నాను, అంటే హృదయమెక్కడుంది. తలనుండి క్రింది వరకు ఉండే వెన్నుపాము వరకు ఉంది దానినే బ్రహ్మనాడి అని, హృదయము అని అంటున్నాము. ఆ వెన్నుపాము నుండే మనకు స్మృతి, ఊహ అన్నీ మనకు కలుగుతున్నాయి. జ్ఞానము అన్నీ కలుగుతున్నాయి.

అది ఒకవేళ ఆగిపోతే ఆ మనిషి కోమాలోకి వెళతాడు. ఇక్కడ కూడా ఇప్పటి వరకు అతను ఎవరో తెలియలేదు. మనకు పేరు తెలియదు, ఎవరి గురించి చెప్పుచున్నాడో తెలియదు. ఇప్పుడు మనము ఇంకోచోటికి వెళితే "అజోపి సన్నవ్యయాత్మ భూతనామీశ్వరోపిసన్" అంటాడు. అవ్య యాత్మ అంటే నాశనము లేనటువంటిది ఏదో, అదే నేను. అజో అంటే పుట్టుక లేనటువంటి వానిని నేను. నాశనము లేనటువంటి వాడిని నేను. అంతేకాక "భూతానీశ్వరోపిసన్" సర్వ జీవరాశులకు ఈశ్వరుడను నేనే అన్నాడు ఆయన. సర్వజీవరాశులకు నేనే దేవున్ని అంతేకదా! "అజోపి సన్న వ్యయాత్మ భూతానామీశ్వరోపిసన్" అంటే చావు, పుట్టుకలు లేని నేను సర్వజీవరాశులకు దేవున్ని అని చెప్పాడు ఆయన. పుట్టుక ఉంటే నాశనము ఉంటుంది. నాశనము ఉంటే పుట్టుక ఉంటుంది. అంటే ఎక్కడైతే నాశనము లేనటువంటి వాడు ఉంటాడో, వాడే సర్వజీవరాశులకు, ఈశ్వరుడు అంటే అధిపతి. "భూతానామీశ్వరోపిసన్" అంటే సర్వ జీవరాశులకు నేను అధిపతిని అంటాడు, అతను దేవుడు. ప్రపంచములో అధిపతి ఎవరైతే ఉన్నాడో ఆయన దేవుడు. ఇప్పుడు దేవుళ్ళు ఎంతమంది అనే ప్రశ్న మళ్ళీ వచ్చింది. ఇప్పుడు మళ్ళీ మొదటికి వద్దాము. దేవుడు ఒక్కడా? ఇద్దరా? ఒక్కడే. గట్టిగా చెప్పండి, అప్పుడు అందరూ గట్టిగా దేవుడు ఒక్కడే అన్నారు. అప్పుడు స్వామివారు అబ్బా ఫరవాలేదు అన్నారు. ఎప్పుడు ఈ విధముగానే మనము ఒప్పుకోవచ్చు. కానీ ఎవరైతే నాశనము లేనటువంటివాడు ఉన్నాడో వానిని దేవుడు అంటున్నాము. ఆ రకంగా 15వ అధ్యాయములో ఇంకొక శ్లోకమును మనము చూద్దాము. అంటే 16వ శ్లోకాన్ని మనము చూద్దాము.

శ్లో॥ 16. ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే ॥

"లోకములో పురుషులు ఇద్దరు, లోకమందుగల పురుషులలో గలవు రెండు తెరంగులు" అంటే రెండు రకాల పద్ధతులున్నాయి, రెండు రకాల భేదాలున్నాయి. పురుషుడొక్కడే అయినా రెండు రకాల తేడాలున్నాయి. వానిలో "సర్వభూతములందు క్షరుడు గలడు, అంటే నాశనమయ్యేవాడు ఉన్నాడు. కానీ వానితోపాటు "అక్షరుని పేరు కూటస్థుడంద్రు బుధులు" ఎవరైతే అక్షరుడిగానైతే ఉన్నాడో వానిని కూటస్థులందురు. కూటదస్తుదంటే, క్షరునితో పాటే కలిసి ఉన్నాడు. అంటే ఇనుప ముక్క ఒక్కటే, నల్లగా ఉంటుంది చూడండి, పొడువుగా ఉండే ఒక కడ్డీ తీసుకుంటాము. దానిని ఇనుము అంటాము. దానిని కొలిమిలో పెట్టి బాగా కాల్చిన తర్వాత అది ఎర్రగా అవుతుంది. ముక్క ముక్కగానే ఉంది గానీ అప్పుడు నల్లగలేదు ఎర్రగా అయ్యింది. దానిని కూడా ఇనుప ముక్కే అంటాము. దానికి ఏమి కలిసి ఉంది, అంటే అందులో అగ్ని కూడా కలిసివుంది. అందుకే ఆ ఇనుప ముక్క ఎర్రగా మారింది. అంటే దానిలో ఏముంది అగ్ని+ఇనుము రెండు ఉన్నాయి. అంతకుముందు ఒకటే ఉండేది, కానీ ఇప్పుడు రెండూ ఉన్నాయి. ఆ రకంగా కూటస్థునిగా ఉన్నాడు. ఎవరూ ఈ రెండవవాడు, అంటే రెండవ పురుషుడు, వారినే ఏమంటున్నాము క్షరుడు, అక్షరుడు అంటున్నాము. అంటే అక్షరున్ని నాశనము కానటువంటివాడు అంటున్నాము. ఈ రెండు చెప్పిన తర్వాత 17వ శ్లోకములో ఏమున్నదంటే, ఇంకొక పురుషుడున్నాడు, ఆయన వీరిద్దరికంటే ఉత్తముడు అని చెప్పాడు.

శ్లో॥ 17. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

"ఎవరైతే ముల్లోకములు ఆవహించి, ఈ ముల్లోకాలను భరిస్తున్నాడో అతన్నే మనము ఈశ్వరుడు అని అంటున్నాము. అంటే అధిపతి, దేవుడు అంటున్నాము.

"ఉత్తముడగు పురుషుండు అన్యుండుగలడు" ఉత్తమమైన పురుషుడు ఈ ఇద్దరుకాక ఇంకొకడున్నాడు. "వాడే పరమాత్మ అనే పేరు బరగుచుండు" ఆయనను పరమాత్మ అని మనము ఉచ్ఛరిస్తున్నాము. "అతడు లోకత్ర యంబు నందావహించి అవ్యయుండైన ఈశ్వరుండై భరించు" అతను ముల్లోకాలను ఆవహించి దేవుడై ఉన్నాడని చెప్పాడు. ఈ కథంతా ఎందుకు చెప్పుచున్నాను. ఏమని చెడగొట్టడానికి, ఇప్పుడు చెప్తాను ఏమని చెడగొడ్తానో చూడండి. ఎక్కడైతే నాశనము లేనటువంటి వాడు ఉన్నాడో, వాడిని ఏమంటున్నాము దేవుడే అంటున్నాము. అనుమానము ఏమీ లేదు. నాశనము లేనటువంటి వాడు దేవుడు, అటువంటి నాశనము లేనటువంటి వాడు నీ శరీరములో ఉన్నాడు. అందుకే ప్రయత్నము చేసే యోగులు అతన్ని తెలుసుకుంటున్నారు. ఎవరిని అంటే ఆ దేవునిగా ఉండేవాడిని. అతను శరీరములో ఎట్లున్నాడు అంటే హృదయపీఠములో ఉండి, నీకు స్మృతి, ఊహ, జ్ఞానము అన్నీ ఇస్తున్నాడు. నాకు ఈ చెప్పే జ్ఞానము ఎవరిస్తున్నారు? నాలో ఉండేవాడు ఇస్తున్నాడు. అతనెవరు? అని ప్రశ్న వేస్తే, ఇద్దరు పురుషులున్నారు అని ముందే చెప్పుకున్నాము కదా! వారిలో ఎవరైతే అక్షరుడో అతనే నాకు ఇస్తున్నాడు, ఎవరైతే నాశనము కానివాడో వాడు ఇస్తున్నాడు. మరి నాశనము కానివాడు ఎవరు? దేవుడు. దేవుడు

నాశనమవుతాడా? నాశనము కాడు, నాశనము కానివాడు ఎవరైతే ఉన్నాడో వాడే దేవుడు. ఎవడు నాశనమవుతున్నాడో వాడు జీవుడు. నాశనము కానివానికి పుట్టుకే లేదు, పుట్టితేనే కదా! నాశనమయ్యేది. కానీ పుట్టుకా లేదు, నాశనము లేదు. ఈ రెండూ లేవు, ఎవరికి? దేవునికి! చెప్పండి ధైర్యంగా మీరందరూ అగ్గిపెట్టి ఉదా॥ మాదిరిగా చేయకండి. అట్లా కాకుండా దేవునికి పుట్టుకా లేదు నాశనము లేదు. నాశనము లేనివాడే దేవుడు. అతనెట్లున్నాడు మూడు లోకాలను ఆవహించి, ఈ మూడు లోకాలను భరిస్తున్నాడు. అట్లే శరీరములో కూడా అక్షరుడు అనే ఒకతను కూడా ఉన్నాడు. ఇప్పుడు ముగ్గురు పురుషులు ఏర్పడి ఉన్నారు అని తెలిసింది కదా! మీకు. వీరిలో ఒక పురుషుడేమో నాశనమయ్యేవాడే అతన్ని వదిలిపెట్టి, మనమే ఎప్పుడో ఒకసారి నాశనము కావలసిందే. కాబట్టి అందుకే తిట్టుకుంటాము. నాశనము అయిపో అని, మరి ఆ లెక్కలో చూస్తే ఒకడు నాశనమయ్యేవాడు, ఇద్దరు నాశనము కాని వారు ఉన్నారు.

మరి ఈ నాశనము కానివారిని ఇద్దరిని ఏమనాలి, ఇద్దరిని దేవుళ్ళే అనాలి. ఇప్పుడు దేవుడు ఒక్కడే అని మీరెట్లంటారు. లెక్కాచారము ప్రకారము ఇప్పుడు ఎంతమంది దేవుళ్ళు, ఇద్దరు దేవుళ్ళు. ఆ ఇద్దరిలో యోగులంతా ఎవరిని తెలుసుకొనే ప్రయత్నము చేస్తారు, ముల్లోకాలను ఆవహించి ఉండే దేవుడు గురించి ప్రయత్నము చేస్తారా లేక లోపల ఉన్న దేవుని గురించి ప్రయత్నము చేస్తారా? భగవద్గీతలో ఏమి చెప్పినారు? శరీరమందున్న ఈ దేవున్నే యోగులందరూ ప్రయత్నము చేసి కనుక్కుంటారు అని చెప్పినారు. అంటే యోగులు శరీరము లోపల ఉండే దేవున్నే తెలుసుకోవాలనుకున్నారు, బయట ఉండే దేవున్ని ఏమైనా తెలుసుకోవాలను

కున్నారా? ఆ రకంగా వాళ్ళు అనుకోలేదు. అప్పుడు బయట ఉండే దేవునితో నీకేమి పని? ఆయన బయట ఉంటే ఉండవచ్చు, అతనూ దేవుడే, నువ్వు చెప్పే ఆయన ఉన్నాడని, లేదని మేము కూడా ఏమీ చెప్పలేదు. నీ లోపల ఒకతను ఉన్నాడా లేదా? ఆయనను దేవుడంటామా లేదా? ఆయనను అక్షరుడు అంటామా లేదా? అక్షరుడే అంటాము. మరి అక్షరుడంటే నాశనము కానివాడు, వాడే నీకు బుద్ధి, జ్ఞానము, ఊహ అన్నీ అందిస్తున్నాడా లేదా? అందిస్తున్నాడు. నీ శరీరములో జరిగే అన్ని పనులను నడిపి స్తున్నాడా లేదా? నడిపిస్తున్నాడు. సర్వ ప్రపంచాన్ని, సర్వజీవరాసులను నడిపిస్తున్నాడా లేదా? నడిపిస్తున్నాడు. అసలు నీకు తండ్రి ఎవరు? అతనే, మరి అటువంటప్పుడు, ఈయన కాదు అని మళ్ళీ ఇంకొకతన్ని ఎందుకు తెచ్చి పెట్టుకున్నావు అని ప్రశ్న వేస్తున్నాను? ఈయన దేవుడే కదా! అట్లే మూడు లోకాలను ఆవహించి ఉన్నాయన కూడా దేవుడే, ఆయన కూడా దేవున్ననే చెప్పాడు. భగవద్గీత ప్రకారము ఈయనా దేవుడే, ఆయనా దేవుడే, ఈ విధముగా ఇప్పుడు మీకు ఎంతమంది దేవుళ్ళు అయినారు. ఇద్దరు దేవుళ్ళు అయినారు. లోపల ఒక దేవుడు, బయట ఒక దేవుడు. ఇలా ఇద్దరు దేవుళ్ళున్నారు ఇప్పుడు పెద్ద సందిగ్ధమే ఇది. కొత్త పదము ఇది, కొత్తపాట, ఇంతవరకు ప్రపంచానికంతా ఒకే దేవుడే అని చెప్పాము. కానీ శరీరములో ఉండే అక్షరుడనే దేవుడు ఊరకే ఉన్నాడా లేదు, నీకు స్మృతి, ఊహ, జ్ఞానము నేనే అందిస్తున్నాను అన్నాడు. అందిస్తున్నాడా లేదా? అంటే శరీరములో అన్నీ చేస్తున్నాడా లేదా? ఇంకొక శ్లోకము ఉంది.

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితమ్" అంటే మీ శరీరాలలో ఉండి, మీరు తినే ఆహారన్నంత నేనే జీర్ణం చేస్తున్నాను అన్నాడు. మరి అతను ఎవరు? మీ శరీరములో ఉండి చాలా పెద్ద పనులు

చేసే ఆయనను ఏమంటారు? అక్షరుడు అంటారు. మిమ్మల్ని పిల్లలప్పటి నుండి నేనే పెంచినాను, ముసలివాణ్ణిగా కూడా నేనే చేశాను, చనిపోయేటప్పుడు కూడా నేనే చంపినాను. మరలా నేనే పుట్టించాను అంటున్నాడు ఎవరూ? ఆ రెండవ వాడే? నిన్ను ఇక్కడ నుండి ఇంకొక జన్మకు తీసుకొని పోయేదెవరు? రెండవ వాడే? క్రొత్త జన్మ తీసుకోవాల్సి నప్పుడు ఈ శరీరము నుండి నిన్ను తీసుకొనిపోయి క్రొత్త శరీరములో ప్రవేశపెట్టించే వాడు ఎవడు? రెండవవాడే? అక్కడ జన్మ కలిగింపజేసేవాడు ఎవరు రెండవవాడే? ఏ శరీరములో నిన్ను ప్రవేశపెట్టాలో నిర్ణయము చేసేవాడు కూడా రెండవవాడే? దేవుడు ఏదీ పట్టించుకోడు, ఏ పనీ చేసేవాడు కాదు. ఆయన, దేవుడు పని చేస్తాడా? చేయడు. మరి అన్ని పనులు ఎవరు చేస్తున్నారు? ఈయనే చేస్తున్నాడు, ఆయన పని చేయని దేవుడు, ఈయన పని చేసే దేవుడు. అంటే ఇద్దరూ ఉన్నారు. పని చేసేవాడు, పని చేయనివాడు. ఖురాన్‌లో మీకు చెప్పినాడు జ్ఞాపకము చేసుకోండి. 2వ సూరాలో, 117 లో ఏమి చెప్పాడు. **"దేవుడు సర్వ ప్రపంచాన్ని సృష్ఠించాడు, సర్వ జీవరాశులను సృష్ఠించాడు కానీ ఆయన ఏమి చేయాలనుకున్నా కేవలము అయిపో అంటే అయిపోతుంది."** మళ్ళీ 53వ సూరా, 38వ ఆయత్‌లో ఏమి చెప్పినాడు. **"దేవుడు సర్వప్రపంచాన్ని సృష్ఠించాడు. ఆయన ఆరు రోజులు శ్రమపడి ఈ ప్రపంచాన్ని తయారు చేశాడు. ఆరు రోజులు శ్రమపడి చేసినా ఆయనకు అలసట లేదు."** ఇక్కడ శ్రమపడి పని చేసినాడు. అక్కడేమో అనుకుంటే అయిపోయింది ఇక్కాడా దేవుడే, అక్కడా దేవుడే, ఇక్కడ ఆరు రోజులు పని చేసినది దేవుడే. అక్కడ పని చేయనిది దేవుడే. ఈ రకంగా ఆయన ఏమీ చేయడు, ఈయన అన్నీ చేస్తాడు. అక్కడ కూడా ఇద్దరు దేవుళ్ళు ఉన్నారు మీకు, కానీ ఆ విషయాన్ని మీరు గమనించలేదు,

ఆలోచన చేయలేదు. కానీ ఈ దేవున్ని తెలుసుకోనిది, ఆ దేవుడిని తెలుసుకోవడానికి కాదు. సర్వ ప్రపంచములోని అణువణువునా వ్యాపించిన దేవుడున్నాడు. అతనికి పేరు లేదు, అతనిని దేవుడు అనే దానికి కూడా అవకాశము లేదు.

ఈ రకంగా ఆయనను ఏమనాలో కూడా ఎవ్వరికీ తెలియదు. అగమ్యగోచరుడు సత్యాసత్యుడు, నిత్యానిత్యుడు, ఆయనకు ఇది అది రెండూ పెట్టవచ్చును. సత్యాసత్యుడు అంటే సత్యమూ ఆయనే, అసత్యమూ ఆయనే. ఈ రకంగా ఫలానా అని ఆయనను గుర్తించడానికి అవుతుందా. ఈ రకంగా మూడవ ఆయనను ఫలానా విధానముగా నిర్ణయము చేయడానికి రాదు, ప్రపంచమంతా నిండి ఉన్న ఆయనను ఏ రకంగాను నిర్ణయించలేరు, చెప్పలేరు. అట్లే నిత్యానిత్యుడు అంటే నిత్యము ఉండేవాడు, నిత్యము లేని వాడే. శాశ్వితాశాశ్వితుడు శాశ్వితుడుగా ఉన్నాడు, అశాశ్వితునిగా ఉన్నాడు. అంటే రెండు రకాలుగా చెప్పవచ్చును. ఆయన ఏ పనీ చేసేవాడు కాదు. అంటే మరి ఇంత ప్రపంచాన్ని ఎలా సృష్టించాడు అనేది ప్రశ్నే కదా! నేను పని చేసేవాడిని కాదు అని చెప్పుచూ ఆరు రోజులు అలసట లేకుండా శ్రమపడి పని చేశాను అని కూడా చెప్పుతున్నాడు. మరి ఇప్పుడు మీరు దీనిని ఏమంటారు? ఇదేమిటి రెండు రకాలుగా చెప్పితే ఎలా? అంటే ఆయన నిత్యానిత్యుడు, సత్యాసత్యుడు. ఆ రకంగా ఆ లెక్కలోకి వెళ్ళినప్పుడు ఆయన చెప్పేదంతా సత్యమే. అసత్యుడేమీ కాదు, సత్యబద్ధుడే ఆయన. ఇక్కడ బాగా ఆలోచించాల్సిన అవసరము ఉంది. లేకపోతే సందేహములో పడిపోవాలిసి వస్తుంది. నేను పని చేస్తున్నాను, నేను పని చేయను అని రెండు రకాలుగా చెప్పుచున్నాడు. ఇక్కడ దేవుడొక్కడేనా అనే ప్రశ్నకు మీకు జవాబు వస్తుంది. అంటే దేవుడొక్కడే అయినా ఇద్దరుగా

ఉన్నాడు. నేనే మార్గము, నా వల్లే మీరు తెలుసుకుంటారు అని బైబిల్‌లో చెప్పినాడు. నేను తప్ప వేరే దారిలేదు. నేనే గమ్యము అంటే మార్గము ఆయనే. గమ్యము ఆయనే. ఆయన రెండుగా ఉన్నాగానీ, మార్గము ఆయనే. గమ్యము ఆయనే ఆ రకంగా దేవుడు ఒక్కరా? ఇద్దరా? అని మనము లెక్కేసుకొని మనము చూసుకుంటే, దేవుడు ఒక్కడే అని మనము చెప్పుకున్నాగానీ, శాస్త్రబద్ధముగా చూస్తే దేవుడు రెండు రకాలుగా ఉన్నాడు ఒకతను శరీరములోపల, ఒకతను శరీరము బయట. శరీరము బయట ఆయనను నీవు తెలుసుకోవాలంటే అవకాశమే లేదు. అలా తెలుసుకొనే విధానమే లేదు. ఏ రకంగానూ, తెలుసుకొనే జ్ఞానమే లేదు. మరి ఆయనను తెలుసుకోవాలంటే ఎలా అని అడిగితే దానికి ఒకటే మార్గము ఉంది. ఎలా అంటే శరీరములో ఉండే దేవున్ని నీవు తెలుసుకుంటే, శరీరము బయటవుండే దేవుడు నీకు తెలియబడుతాడు. అప్పుడు ఇద్దరు దేవుళ్ళు ఉన్నారని అనుభవానికి రాగలదు.

నీవు శరీరము లోపల ఉండే దేవుని గురించే ప్రయత్నము చేయాలి. శరీరము బయట ఉండే దేవున్ని గురించి తెలుసుకోవడానికి అవకాశమే లేదు. అసలాయనను గురించి ప్రయత్నము చేయమని కూడా ఆయన చెప్పలేదు. ఎప్పుడు కూడా యోగులంతా ఎవరిని గురించి ప్రయత్నము చేస్తున్నారో వాళ్ళ మాదిరిగా మనము కూడా ప్రయత్నము చేయవలసిందే గానీ, ఇంకొక రకంగా ఏమీ లేదు. కాబట్టి పెద్దపెద్ద జ్ఞానులంతా ఏమి చేస్తున్నారు. శరీరములో ఉండే ఆయనను తెలుసుకోవడానికే ప్రయత్నము చేస్తారు. మళ్ళీ ఇక్కడికి అంటే గ్రంథాల దగ్గరకు వద్దాము. మనకు భగవద్గీతను, బైబిల్, ఖురాన్ ఈ మూడు గ్రంథాలున్నాయి. భగవద్గీతలోని ప్రతి శ్లోకము శరీరము అంతర్‌గతముగానే ఉందని చెప్పాము. శరీరము

బయట ఎక్కడా చెప్పలేదు. మీరు బయటకు పోయి చూడరాదు. ప్రతి శ్లోకాన్ని శరీరము లోపలే చూసుకోవాలి. అట్లే మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ భూమిమీదికి వచ్చి చెప్పిన ఖురాన్ గ్రంథము ఉంది. ఆయన ఆకాశము నుండి భూమిమీదకు దిగివచ్చి ఈ జ్ఞానాన్ని అందించాడు. ఆయన చెప్పిన ప్రతి వాక్యము (ఆయత్) శరీరాంతర్గతంగానే చెప్పాడు. శరీరాన్ని దాటి ఒక్క ఆయత్‌ను కూడా చెప్పలేదు. ఒకవేళ బయట ఉండేది ఏమైనా ఉంది అంటే, అది దానికి సంబంధించినది కాదు. అంటే పొలంలో ధాన్యము తయారైనప్పుడు, అది స్వచ్ఛముగానే పుడుతుంది. మనము వండుకొని తినడానికి, ఆ కంకులలోని గింజలను వేరేచేసి సంచులలో పోసి తీసుకొని వచ్చేటప్పుడు భూమిమీద ఉన్న రాళ్ళు రప్పలు కలిసిపోతాయి. ఆ రకంగానే దేవుడు చెప్పిన జ్ఞానము కూడా గ్రంథరూపములో మానవుల చేత వ్రాయబడినప్పుడు, ఆ మనుష్యుల యొక్క భావాలు కూడా అందులో కలిసిపోయి ఉండవచ్చు. ఈ రకంగా ఏమాత్రము దేవుని జ్ఞానము కానటువంటి వాక్యాలు కూడా అందులో కలిసి ఉండవచ్చు. వాటిని గుర్తించి మనము జాగ్రత్తగా చదువుకోవాలి, లేకపోతే అర్థము కాదు. మనము బజారు నుండి బియ్యము తెచ్చుకొని అట్లే వండుకుంటామా? అందులోని రాళ్ళు, పొట్టు వేరుచేసి వండుకున్నట్లుగా గ్రంథములోని జ్ఞానాన్ని కూడా ఏది సత్యమైనది, ఏది అసత్యమైనది అని చూసుకోవాలి. అందుకే ఆయన ముందే నా జ్ఞానమంతా సత్యబద్ధముగా ఉంటుంది చూసుకోండి అని ఖురాన్‌లో చెప్పాడు. సత్యసమేతంగా ఉంటుంది. సత్యముతో కూడుకొని ఉంటుంది. అని చాలా హెచ్చరిక చేసి చెప్పాడు.

ఈ రకంగా జిబ్రయేల్ చెప్పిన ప్రతి వాక్యము శరీర అంతర్గతమైన విషయాన్నే సూచించినది కానీ మరొకటి ఏమీ చెప్పలేదు. ఆ శరీర

అంతర్గతముగా ఉన్న జ్ఞానాన్నే మనము జోడించుకున్నందున మనకు, ఖురాన్ జ్ఞాన వాక్యముల ద్వారా ఎంతో గొప్ప జ్ఞానము బయటకు తెలిసింది. శరీరము బయటకు చూసి వుంటే మనకు తెలిసేది కాదు, లోపలికి చూడటం వలన ఎంతో పవిత్రత మనకు కనిపించింది. ఎంత గొప్పగా ఉందో కూడా మనకు అర్థము అయ్యింది. ఆ రకంగానే భగవద్గీతను దానిలోని శ్లోకాలను శరీర అంతర్గతముగానే చూచినందువల్లనే దాని యొక్క ప్రత్యేకత మనకు తెలిసింది. కానీ శరీరాన్ని వదలి బయట ఎక్కడా చెప్పలేదు. ఎందుకు అంటే నీవు తెలుసుకోవలసినది శరీరములోనే, నీవు ఉండేది శరీరము లోపలే, ఎవరైనా శరీరము బయట ఉన్నారా? లేరు. కాబట్టి నీ శరీరము పరిధిలో నువ్వు ఉంటూ, నీ శరీరము పరిధిలో ఉన్న దేవున్ని తెలుసుకో. అట్లే ఖురాన్‌లో చూస్తే ఒక వాక్యములో దేవుడు భూమిని, ఏడు ఆకాశము లను సత్యబద్ధముగా నిర్మించాడు లేదా అవతరింపజేశాడు. లేదా తయారు చేశాడు అని ఉంది అంటే ఇప్పుడు ఏడు ఆకాశములు అనేవి ఎక్కడున్నాయి. ఉండేది ఒకే ఆకాశము కదా! ఈ రకంగా బయట చూసుకుంటే నీకు ఏమీ అర్థము కాదు. ఎందుకంటే పై విషయము శరీరము లోపలికి చెప్పబడింది. భూమి, ఆకాశములను వాటి మధ్యలో ఉండే సమస్తమును దేవుడు సృష్టించాడు. పైన తల ఆకాశము, క్రింద కాళ్ళు భూమి ఆ రెండింటి మధ్యలోని దానిని సమస్తము దేవుడు సృష్టించాడు. మరి దేవుని యొక్క సృష్టి నీ శరీరములోనే ఉంది కాబట్టి నీవు కూడా దేవుని కొరకు శరీరములోనే వెతకాలి. ఈ రకంగా పూర్వము జ్ఞానులు శరీరములోనే దేవున్ని వెతుక్కోవడానికి, ఒక మంత్రాన్ని చెప్పేవారు. వీడేమో ఆ మంత్రాన్ని గొణిగి, గొణిగి వెళ్ళి పోయే వాడు. వారికి ఏమీ అర్థమయ్యేది కాదు, ఎన్ని రోజులున్నా మంత్రమే. లోపల ఉండే దానిని చూసుకునే

మార్గము చూడాలి గానీ, గొణికితే ఏమి ప్రయోజనము? బయట ధ్యాస నుండి లోపలికి ధ్యాసను మళ్ళించడానికి వాళ్ళు ఒక ఉపాయము చెప్పినారు. ధ్యానము చేసుకోమన్నారు. ధ్యానము అంటే లోపల, దానికొరకు కళ్ళు మూసుకొని కూర్చోని, బయట ఆలోచన చేస్తుంటాడు. బయట ఆలోచన చేస్తే ఏమి వస్తుంది, బయటి ప్రపంచమే తెలుస్తుంది. లోపల దాని గురించి తెలుసుకోవడానికి లోపలనే ఆలోచన చేయాలి కానీ నీవు చేసేది అంతా బయటిదే. ఈ రకంగా దేవుడు మన శరీరములో ఉండే పురుషుని గురించి తెలియజేశాడు.

శ్లో॥ 16. ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే ॥

"కూటస్థో క్షర ఉచ్యతే" అంటాడు. రెండు రకాల పురుషులున్నారు. నాశనమయ్యే వాడొకడు, నాశనము కాని వాడొకడు. ఇక్కడే మూడవ పురుషున్ని గురించి కూడా చెప్పి ఉంటే సరిపోయేది, కానీ ఎందుకు చెప్పలేదు. అంటే శరీరములో ఉండేవాళ్ళను గురించి మాత్రమే చెప్పాలి, బయటి వాళ్ళ గురించి చెప్పకూడదు. అది బయటిది తర్వాత అవుతుంది. ఈ రెండు కాకుండా ఉత్తమమైన పురుషుడొకడున్నాడు అన్నారు కానీ ఎవరో చెప్పలేదు. ఆయనను అధిపతి అంటాము అని మాత్రమే చెప్పాడు. ఇప్పుడు శరీరములో ఈశ్వరుడు ఎవరున్నారు, శరీరములో ఉండేవాన్నే అంటే రెండవవానిగా మనము ఎవరిని చెప్పుకున్నామో అతనే మనకు అధిపతి. నీ శరీరములో ఉండే ఎవరైతే నీకు ఈశ్వరుడుగా ఉన్నాడో, అధిపతిగా ఉన్నాడో వానిని నీవు తెలుసుకొంటే, శరీరము బయట ఉండే అధిపతి నీకు తెలుస్తాడు. కాబట్టి ఇప్పుడు నీకు దేవుళ్ళు ఎంతమంది అవుతారు.

ఒక్కడా ఇద్దరా, ఇంతకుముందు అందరూ ఒక్కడే అన్నారు. కానీ ఇప్పుడు ఏమనాలి, ఇద్దరూ అనాలి. ఈ రకంగా మిమ్మల్ని మేము దారి మళ్ళించాము. ఇద్దరూ ఉండేది వాస్తవమే, కానీ బయట ఉండేవాడిని తెలుసుకోవాలంటే లోపల ఉన్న ఆయనలోనే మీరు కలిసిపోవాలి, అప్పుడు ఆయన బయటి దేవునిలో కలుపుతాడు

ఆ రకంగా అప్పుడు ఒక్కడే అవుతాడు. నీ శరీరములోని దేవునిలోనికి నీవు ఐక్యమైనపుడే, నిన్ను శరీరము బయట ఉండే దేవునిలోకే ఈ దేవుడు చేరుస్తాడు. అప్పుడే ఆ దేవుడు తెలియబడుతాడు గానీ అంతవరకు ఎవరూ తెలుసుకోలేరు. నీవు దారిని తెలుసుకొని, నీవు ఆ దారిలో నడిస్తే, ఆ దారి ఎక్కడ ముగుస్తుంది అంటే గమ్యములో ముగుస్తుంది. అదే గమ్యము అట్లా నీవు చేరాలనే ఊరుకు చేరుతావు. దారే లేకపోతే చేరేదానికే అవకాశము లేదు. కాబట్టి ఎవరైనా దారిగుండా పోవాల్సిందే, అందుకే నేనే మార్గము, నేనే గమ్యము అన్నాడు. మరి ఆ మార్గముగా ఉండేది ఎవరు? నేనే గమ్యముగా ఉండేది, ఎవరు, నేనే. ఆ బయట ఉండేది ఎవరు, లోపల ఉండేది ఎవరు, నేనే! నేను ఒక్కన్నే! అయినా ఇద్దరిగా నీవు చూసుకుంటేనే, చివరిలో నీకు నేను ఇద్దరిగా కనిపిస్తాను. 1+1 ఏమవుతుంది. అంతా రెండనే చెప్పుతారు. కానీ ఇక్కడ ఒకటే అవుతుంది. 1+1=1 అవుతుంది. ఎట్లా అంటే ఇదీ ఒక్కటే, అది ఒక్కటే రెండూ కలిస్తే ఒకటే అవుతాయి కదా! ఏమన్నా తేడా ఉందా. కాబట్టి లోపల ఉండే ఆత్మ ఏదైతే అవుతుందో, బయట ఉండే ఆత్మ కూడా ఒకటే అవుతుంది. ఇది పని చేసే ఆత్మ, అది పనిచేయని ఆత్మ. ఇప్పుడు మనము పని జరుగుతా ఉందా అని చూస్తే పని జరుగుతోంది. ఇప్పుడు ఖురాన్‌లో రెండు వాక్యాలున్నాయి. వాటిని ఎలా చెపుతాము మనము

రెండింటిని సమానముగానే చెప్పుతాము. అంటే ఇందాక మనము చెప్పుకొన్న వాక్యాలలో ఒకటి బయటి దేవుని గురించి చెప్పినది, మరొకటి లోపలి దేవుని గురించి చెప్పినది. మరి బయట దేవుని గురించి చెప్పిన వాక్యాలు లోపలి దేవునికి ఎలా వర్తిస్తాయి అంటే, ఏవైతే ఆకాశము, భూమి బయటయితే ఉన్నాయో అవి లోపల కూడా ఉన్నాయి. వాటి మధ్య ఉన్న సర్వము కూడా మనలో ఉన్నాయి. అవన్నీ దేవుని చేతనే సృష్ఠించ బడుతున్నాయి కాబట్టి శరీరము లోపల ఉన్న దేవున్ని తెలుసుకొనగలిగితే, శరీరము బయట ఉన్న దేవుడు కూడా తెలియబడుతాడు. మేము దాదాపు 35 సంవత్సరాల క్రితమే **"జనన మరణ సిద్ధాంతము"** అనే గ్రంథము వ్రాసినాము. దానిలో మరణ సిద్ధాంతము ఉంది. ఆ మరణ సిద్ధాంతములో ఏముంది, జీవాత్మవయిన నీవు ఆత్మలో కలిసిపోతే, ప్రత్యేకమైన ఆత్మగా మారినది పరమాత్మలో కలిసిపోతుంది. దానినే మోక్షము పొందటము అంటాము. అంతవరకు కలిసే దానికి ఏమీ లేదు. అంతటా ఉన్న దేవునిలోనికి నీవు కలవడానికి నేరుగా చేరడానికి అవకాశము లేదు. నీవు ప్రత్యేకమైన ఆత్మగా మారినప్పుడే, కలవడానికి అవకాశము ఉంటుంది. ఇది ప్రపంచములో మొట్టమొదట చెప్పిన జ్ఞానము, ఇతరుల చేత చెప్పబడేది కూడా కాదని చెప్పినాము. ఇంతకంటే ఎక్కువ ఎవరూ చెప్పలేరని కూడా చెప్పినాము.

35 సంవత్సరాల క్రితమే ఆ మాట అక్కడ వ్రాసినాము. ఆ విధముగా అక్కడ ఇద్దరు దేవుళ్ళున్నారు, మొదటిగా లోపలి దేవున్ని తెలుసుకొంటేనే బయటి దేవుడు తెలుస్తాడు. నీ మొదటి దేవుడు ఎవరు అని భగవద్గీతలోని పురుషోత్తమ ప్రాప్తి యోగములోని 11 వ శ్లోకాన్ని,

15వ శ్లోకాన్ని చదివాము. 11వ శ్లోకములో ఏముంది "ప్రయత్నము చేసే యోగులు శరీరములో ఉండే ఆత్మనే తెలుసుకోవడానికి ప్రయత్నము చేయుచున్నారు. ఆ విధముగా ప్రయత్నము చేస్తూ, చేస్తూ చివరికి ఆత్మను చేరుకోగలుగుతారు." అట్లే 15వ శ్లోకము ప్రకారము "సర్వ జీవరాశుల హృది స్థానములో నుండి, స్మృతి, ఊహ, జ్ఞానము నేనే కలిగిస్తున్నాను అని ఎవరు చెప్పారు? శరీరములోనే ఉండే దేవుడే! ఖురాన్‌లో ఏముంది? "మీరు అంతరంగములో ఏమనుకున్నా నాకు తెలుసు, నాకు తెలియకుండా ఏమీ జరుగదు. మీ ఊహ సైతము నాకు తెలుసు." అంటే ఎవరికి తెలుసు లోపల ఉండే దేవునికి తెలుసు. ఆయన లోపలే ఉన్నాడు. మీరు ఏమనుకున్నా ఆయనకు తెలుసు కాబట్టి ఆయన నుండి తప్పించుకోవడానికి ఎవరికీ వీలుకాదు. ఎందుకంటే నేను మీకు కాపలాగా ఉన్నాను. ఈ రకంగా లోపల ఉండే దేవున్ని గురించి, బయట ఉండే దేవున్ని గురించి కూడా గ్రంథములో ఉంది. లోపల ఉండే దేవుని గురించి ఆరు రోజులు పని చేసినాను అని ఉంది, బయట ఉండే దేవుని గురించి ఏమాత్రము పని చేయడు అని ఉంది. మరి ఈ రెండు వాక్యాలను ఎట్లా సమన్వయము చేస్తాము మనము. అంటే ఇట్లా సమన్వయము చేస్తాము. లోపల ఉండే ఆయన ఈ మాట చెప్పినాడు, బయట ఉండే ఆయన ఈ మాట చెప్పినాడు. బయట ఉండే ఆయన ఆ మాట చెప్పినాడని తెలియనివాళ్ళను అడిగితే ఏమంటారు? మేము చెప్పినది మాత్రమే వినాలి, అంతకంటే ఎక్కువ అడుగరాదు అంటారు. అంటే అర్థము ఏమని, వాళ్ళ దగ్గర జవాబు లేదు. మరి మనము ఇప్పుడు జవాబు చెప్పుతాము. ఏ గ్రంథములోని దానికైనా మనము జవాబు చెప్పుతాము. ఎందుకు? గురువు అని ఉంది కాబట్టి, ఏ గ్రంథానికైనా జవాబు చెప్తాము. భగవద్గీత, బైబిల్, ఖురాన్

ఇలా ఏ గ్రంథాల గురించైనా చెప్తాము. ఇప్పుడు భగవద్గీతలోని దాని గురించి చెప్పలేదా? సర్వ జీవరాశుల హృది స్థానములో నేను ఉన్నాను, నా వల్లే స్మృతి, జ్ఞానం, ఊహలు అన్నీ మీకు కలుగుతున్నాయి. యోగులంతా ప్రయత్నము చేసి నన్నే తెలుసుకోగలుగుతున్నారు. శరీరములో ఉన్న నన్నే తెలుసుకోగలుగుతున్నారు. ఎప్పుడైతే నేను అర్థమవుతానో అప్పుడు బయటివాడు తెలియబడుతాడు. ఎప్పుడు తెలుస్తాడు బయట ఉన్న మూడవ వాడు. అంటే ఇంకొక పురుషుడున్నాడు చూడండి. ఉత్తమమైన పురుషుడు. ఆయనకు పేరు లేదు. దేవుడని అనుకుందాము. దేవుడని అనడానికి కూడా లేదు. ఎందుకంటే ఆయనకు పేరులేదు, నిత్యానిత్యుడు అని చెప్తాము, శాశ్వితుడు, అశాశ్వితుడు, స్థిరుడు అస్థిరుడు.

మీకు గ్రంథము వ్రాస్తున్నాము ఇప్పుడు ఏమని **"ప్రతిమ-విగ్రహ"** అని. వీళ్ళు ప్రతిమను విగ్రహా అంటారు, విగ్రహాన్ని ప్రతిమ అంటారు. వీళ్ళు ఏమి చెప్పుతున్నారో మాకు గందరగోళముగా ఉంది అని అనుకుంటున్నారు కదా! అట్లే మనల్ని ప్రశ్నిస్తున్నారు ప్రతిమనైనా మనిషే చేసినాడు, విగ్రహమునైనా మనిషే చేసినాడు అక్కడ తేడా ఏముంది. అట్లే మనుష్యులు చేసిన ప్రతిమగానీ, విగ్రహాన్ని గానీ మీరు దేవుడని ఎట్లా అంటారు అని ప్రశ్నిస్తున్నారు. మంచి ప్రశ్నే అది. మనిషి విమానాన్ని తయారు చేసినాడు, మరి మనిషికంటే వేగంగా పరుగెత్తుతుంది. మరి మనిషి తయారు చేసినంతమాత్రాన అది మనిషికంటే తక్కువగా ఉందా, ఎక్కువగా ఉందా, అట్లే దేవుడు చెప్పిన జ్ఞానాన్ని మనుష్యులు గ్రంథ రూపములో వ్రాశారు కదా! మరి ఆ గ్రంథాన్ని ఎందుకు అంత పవిత్రముగా దేవుని మాదిరిగా చూసుకుంటున్నారు అని మేము ప్రశ్నిస్తున్నాము.

మనిషి వ్రాసిన గ్రంథమే కదా! దానిని పైననే పెట్టాలి, క్రింద పెట్టకూడదు. దానిపైన ఇతర పుస్తకాలు పెట్టరాదు, ఇతర పుస్తకాల పైన దానిని పెట్టాలి. దానిని చాలా జాగ్రత్తగా చూసుకోవాలి. స్నానము చేసే ముట్టుకోవాలి, ఎందుకంటే దేవునితో సమానము. సరే దేవునికి ఉండే మహత్యమే దానికి ఉంది. అంత పవిత్రత కూడా ఉంది. మరి మనిషి వ్రాసినదే కదా! అది. దానికి మరి అంత పవిత్రత ఎందుకు వచ్చింది అనే ప్రశ్న మీరు వేయవచ్చు కదా! కానీ మనిషి వ్రాసినా దానికి పవిత్రత ఉంది. అట్లే మనిషి చేసినంతమాత్రమున పవిత్రత పోదు. ఏ దానికైనాకానీ నిజానికి మనిషి ఏమీ చేయలేదు, లోపల ఉన్నవాడే చేస్తున్నాడు. పైకి కనిపించే బొమ్మే వీడు. నిజానికి నేను చేశాను, నేను చేశాను అని పొగుడుకుంటున్నాడు. కానీ వీడు ఏమి చేతకానివాడే, లోపల ఉన్న దేవుడు ఇతన్ని బోర్లాపడుకోపెడితే బోర్లాపడుకొంటాడు, వెల్లకిలా పడుకోబెడితే వెల్లికిలా పడుకొంటాడు. వెల్లికిలా పడుకొంటే తెల్లవారేసరికే త్రిప్పి పడుకోపెడతాడు దేవుడు. కాబట్టి నీకు తెలుసా నీవు ఎప్పుడు పడుకొన్నావో, తెలియదు. ఇంట్లో పడుకొని ఉన్నవాళ్ళు బయట లేస్తున్నారు. కానీ నీకు తెలియదు. అట్లే బయట పడుకొని ఉంటావు తెల్లవారేసరికి ఇంట్లో పడుకొని ఉంటావు. ఎట్లా పడుకొన్నావో, లోపలికి ఎప్పుడు వచ్చావో నీకు తెలియదు. ఆ రకంగా దేవుడు నిన్ను ఏమైనా చేయవచ్చు. అన్నింటికి అధిపతి ఆయన. ఆయన ఎట్లున్నాడు అంటే శరీరము లోపలా అధిపతే, శరీరము బయట అధిపతే. కానీ ఆయన ఇంట్లో ఒక రకంగా, బయట ఒక రకంగా ఉన్నాడు.

ఒక కుటుంబములో పదిమంది ఉంటే వాళ్ళందరితో చక్కగా పని చేయించటానికి ఎంతో కోపంతో వాళ్ళందరిని గద్దించి పని చేయించాల్సి

వస్తుంది. కానీ బయటకు వస్తే ఎంతో ప్రశాంతంగా ఉండాల్సి వస్తుంది. బయట కూడా కోపాన్ని ప్రదర్శిస్తే ఏమి బాగుంటుంది. కాబట్టి లోపల ఒక రకంగా, బయట ఒక రకంగా ఉండాల్సివస్తుంది. అట్లాగే దేవుడు లోపల అన్ని పనులు చేస్తాడు, బయట మాత్రము ఏ పనులు చేయడు. ఆయన బయట అయిపో అంటే అయిపోతాయి. నిజమే ఆయన ఏ పని చేయడు, బయటి దేవుడు. ఆ రకంగా దేవుడు ఏమైనా చేయగలడు, ఏమీ చేయడు.

ఈ రకంగా రెండూ ఆయనకు వర్తిస్తాయి. మరి శరీరాంతర్గతముగా జరిగే పనులను మనము ఏమైనా గుర్తించగలిగినామా అని లెక్కేస్తే అసలు ఆ ఆలోచనే మనకు రాలేదు. ఎందుకంటే అన్ని నేనే చేస్తున్నాను, ఏ ఆలోచనైనా నాకే వచ్చింది, ఏ పనైనా నేనే చేశాను అనుకొంటున్నాము తప్ప నేను చేయలేదు అని ఏమాత్రము ఆలోచించలేదు. మరి మా విషయానికి వస్తే ఉదయానిది, సాయంత్రానికి జ్ఞాపకము ఉండదు. నడవటానికి కూడా సరిగ్గా కాదు. కానీ కొన్ని విషయాలలో నేను గొప్ప అని ఎందుకు చెప్పుతున్నానంటే, నేను కాదు కాబట్టి, నా వెనుకాల ఉండేవాడు చెప్పుతున్నాడు కాబట్టి కొన్ని విషయాలలో నేనే గొప్ప. ఇంకా బాగా జ్ఞాపకము పెట్టుకోండి. నా శరీరము ఉంది, ఆ శరీరములో నేను ఎక్కడో ఒక్కచోట ఉన్నాను. ఈ శరీరమంతా నిండి ఉండే ఆయన ఉన్నాడు. ఆయన నన్ను నడిపిస్తున్నాడు. నా శరీరాన్ని నడిపిస్తున్నాడు. కానీ అంతా నేను చూస్తున్నాను కాబట్టి బయటికి డాంబికంగా చెప్పుకొన్నా ఏమీ ప్రయోజనము లేదు. తెలియనివాళ్ళు నేనే నడుస్తున్నాను అనుకుంటారు. కానీ తెలిసినవాన్ని నేను ఎలా చెప్పుకోవాలి? నేనే నడుస్తున్నాను అంటే ఆయన ఏమాత్రము కదలకుండా చేస్తాడు. కాబట్టి రాత్రి రెండుగంటలప్పుడు

జ్ఞానము వ్రాయడానికి పేపరు, కలము పట్టుకొన్నప్పుడే ఏమి చెప్తాము అంటే, "నీ శరీరములో నేను ఉన్నాను నాకు అధిపతిగా నీవు ఉన్నావు. నీ శరీరములో నేను ఒక భాగానిగా ఉన్నాను. కాబట్టి నా అధిపతి ఇప్పుడు సక్రమమైన పద్ధతిలో జ్ఞానాన్ని వ్రాయించుతావు" అని అనుకుంటున్నాను. "నీవు అన్నింటికి అధిపతివే, నీవు జ్ఞానాన్నైనా వ్రాయించగలవు. అజ్ఞానాన్నైనా వ్రాయించగలవు. ప్రజలకు అవసరమైన జ్ఞానాన్ని సక్రమమైన పద్ధతిలో వ్రాయించగలవు అని ఆయనను కోరుకుంటున్నాను" అని చెప్పడము జరుగుతూవుంది. మళ్ళీ మొత్తము నీ ఇష్టమే అని చెప్పి పేపరు మీద మేము కలము పెడుతున్నాము. అంటే ఎవరు అధిపతి, ఆయనే అధిపతి, లోపల ఉండే ఆత్మే అధిపతి. నేను ఆత్మ ఎట్లా ఆడిస్తే అట్లా ఆడేవానినే అనుకుంటున్నాను. అంతేకదా! ఇప్పుడు గురువు ఆయన! శిష్యుడెవరు నేను కాబట్టి మీరు ఎట్లా చెప్పితే నేను అట్లా వింటాను. మీరు ఏది వ్రాయిస్తే అదే వ్రాస్తాను. మీరు ఏది చెప్పితే అదే నేను వాళ్ళకు చెప్పుతాను. అందుకే చెప్పిన జ్ఞానము ఎవరు చెప్పారని అంటాము. ఆయన అంటే గురువు చెప్పాడని అంటాము. కాబట్టి గురువే చెప్పుతాడు. ఏ గురువు అంటే మూడు మతాల గురువు. ఆయన అన్ని మతాలలోని రహస్యాలను చెప్పుతాడు. అన్ని రహస్యాలు ఆయనకు తెలుసు, ఎందుకంటే అక్కడంతా ఒకటే జ్ఞానమే కదా! ఉన్నది. నీవు ఎక్కడైనా చెప్పుకో శరీరములోని జ్ఞానమే, ఏ మతములోనిదైనా అదే జ్ఞానమే, దానికి అధిపతిని నేనే కాబట్టి నాకు తెలియనిది ఏముంది. ఏ వాక్యమైనా అడుగు నేను చెప్తాను. ఖురాన్‌లో ఉన్నట్లు నేను పని చేయను అంటే నిజమే, నేను పని చేయను అన్నా నిజమే! నేను పని చేస్తాను అంటే నిజమే నేను పని చేస్తాను. అంటే లోపల చేసే అతను ఉన్నాడు, బయట చేయనతను ఉన్నాడు.

కాబట్టి అంతా అతనే చెప్పాడు. లేదంటే ప్రశ్న అడుగరాదంటే షరియత్ అని నిబంధన పెట్టుకోవాల్సి వస్తుంది మనము. కానీ అట్లా నిబంధన పెట్టుకోకూడదు మనము. ఎందుకంటే ప్రతి దానికి వివరము ఉండాలి. కాబట్టి ఇప్పటి నుండి నీ శరీరములోనే దేవుడున్నాడు అనే భయముతో మీరు మెలుగుతూ ఉండండి. లేకపోతే తిరుపతికొండకు పోయినప్పుడు అక్కడే దేవుడున్నాడని మీరు మ్రొక్కుకోవచ్చు గబగబా. తర్వాత ఎట్లైనా ఉండవచ్చు అనుకుంటే కదరదు. దేవుడు లోపలే ఉన్నాడు. జాగ్రత్తగా మసులుకోండి. మనము చేసే పాపము, పుణ్యము అన్నీ ఆయన చూస్తున్నాడు. చూడడమే కాదు లెక్కచారంగా మొత్తము వ్రాసుకొంటున్నాడు. నాకే 15 ఎకరాల భూమి ఉంది, 15 కోట్ల రూపాయల డబ్బు ఉంది, నాకేమిలే అని నీవు అనుకున్నావో నిన్ను ఇక్కడ చంపి, ఏమీ లేనివాని ఇంట్లో నిన్ను పుట్టిస్తాడు. అప్పుడు నీవు ఏమీ లేకుండా పోతావు. ఇప్పుడు ఇక్కడ నేను ఏమీ లేదు అనుకుంటున్నాను కాబట్టి, 50 ఎకరాల భూమి ఉన్న వాళ్ళ ఇంట్లో ఏమాత్రము రిజిస్ట్రేషన్ కూడా అవసరము లేకుండానే పుట్టించవచ్చు. ఏమాత్రము వ్రాయించుకోవాల్సిన అవసరము లేదు, డబ్బులు పెట్టి కొనాల్సిన అవసరము లేదు. తీసుకొనిపోయి అక్కడ పుట్టిస్తే చాలు. అప్పుడు అక్కడి ఆస్తి మొత్తము నాకు రావచ్చు.

ఈ రకంగా ఆయన ఏమైనా చేస్తాడు. కాబట్టి అన్నిటికి అధిపతి ఆయన, ఏమైనా చేయగలడు అని మనము శరీరములో భయముతో ఉండాలి. కాబట్టి భయము లేకుండా ఆ దేవుడేమి చేస్తాడులే అని మన ఇష్టము వచ్చినట్లు నడుచుకుంటే ఆయన అన్ని లెక్కపెట్టుకొని, నిన్ను మాత్రము లెక్కాచారంగా ఎక్కడ కొట్టాలో అక్కడ కొడతాడు. మొన్న కర్నూల్‌లో ఊరేగింపు జరిగినప్పుడు, ముస్లీమ్‌లు అంతా పాల్గొన్నారు.

దానిలో మనము ఏమి చేశాము ముస్లీమ్‌లు సామరస్యంగా ఉండాలనే ఉద్దేశ్యముతో ముస్లీమ్‌ల టోపి మన హిందువులు కూడా పెట్టుకున్నారు. దానిలో ఏమాత్రము తప్పులేదు. ఎగతాళిగా, హేళనగా ఏమి పెట్టుకోలేదు. ఎప్పుడైనా ముస్లీమ్‌ల దగ్గరకు వెళ్ళితే హిందువులకు కూడా టోపి పెడతారు కదా! అప్పుడు సామరస్యముగా ఉండాలి అనే ఉద్దేశ్యముతోనే కదా పెట్టేది. అట్లాగానే మన వాళ్ళు పెట్టుకున్నారు. పెట్టుకుంటే మీ హిందువులంతా ముస్లీమ్‌ల టోపీలు పెట్టుకోకూడదు అని వాళ్ళు అరచి అందరినీ టోపీలు తీసివేయాలని, తీసివేయించారు. అప్పుడు హిందువులేకాక ముస్లీమ్‌లుగా ఉన్న వాళ్ళు కూడా టోపీలు తీసివేయాల్సిన పని వచ్చింది. ముస్లీమ్‌లు బురఖాలను కూడా తీసివేయాల్సిన పని వచ్చింది. అట్లే టోపీలు కూడా తీసివేయాల్సిన పని వచ్చింది. దేవుడు చూస్తున్నాడు కదా! అంటే దేవుడు ఏమీ చేసేవాడు కాదు, కానీ ఆయన పాలకులైన గ్రహాలు, భూతాలు చూస్తున్నాయి కదా! చూసి ఇట్లా చేస్తున్నారు మీరు అని మక్కాలో ఒకేసారి ఏడు వందలమందిని చంపాయి. కర్నూల్‌లో ఆ సంఘటన జరిగిన తర్వాతనే కదా! మరి అలా చంపింది? కాబట్టి ఈ రకంగా మీరు చేసే తప్పులకు శిక్షలు ఈ విధముగా ఉంటాయి చూడండి అని దేవుడు మక్కాలోనే ఈ పనిని చేశాడు. కాబట్టి ఇప్పటికి కూడా ఏ దానినైనా మనము చౌకగా తీసుకోకూడదు. జాగ్రత్తగా మెలగండి, మన శరీరములోనే దేవుడున్నాడనే భయముతోనే మీరు మెలగండి, అట్లే ఇప్పటినుండి సక్రమమైన మార్గములో మీరు నడవాలని కోరకుంటూ ఈ సమావేశాన్ని ఇంతటితో ముగిస్తున్నాము.

# 87. అక్షర జ్ఞానము

**(తేది :- 10.05.2017)**

ఇదొక శుభదినం ఎందుకంటే, మనం ఈ రోజు జ్ఞానాన్ని చర్చించుకుంటున్నాము. ఈ జ్ఞానాన్ని చర్చించుకొనే అవకాశం వస్తుందో, రాదో అనుకున్నాను ఎందుకంటే అలాంటి పరిస్థితి ఏర్పడింది. అలాగే వంద గ్రంథాలు వ్రాస్తానో, వ్రాయలేనో అని కూడా సంశయము కలిగేటటు వంటి పరిస్థితి ఏర్పడింది. ఈ రోజు ఇలా మీ ముందు కూర్చొని మాట్లాడుతా ననే నమ్మకము కూడా నాకు లేదు. కానీ దేవుడు అవకాశం ఇచ్చాడు. ఈ రోజు నాలోనుండి పలికించే ఆత్మను మొట్టమొదట ప్రార్థిస్తూ, మంచి జ్ఞానాన్ని అందజేయాలని కోరుకుంటూ, అదే జ్ఞానాన్ని మీ అందరికీ బాగా అర్థమయ్యేలాగా చేయాలని ప్రార్థన చేస్తూ ఈ సభను ప్రారంబిస్తున్నాము.

ఇక్కడ ఈ రోజు చెప్పబోయే అంశము 'అక్షరజ్ఞానము'. ఏదేమైనా, ఎంతసేపు చెప్పుకున్నా మూడు ఆత్మల గురించే చెప్పుకుంటాం. బైబిల్‌ను చెప్పుకొనే క్రైస్థవులు ఎంతసేపు చెప్పుకున్నా ఏసుప్రభువును గురించే చెప్పుకున్నట్లు, మనం కూడా మూడు ఆత్మల గురించే చెప్పుకుంటాము. కానీ ప్రతి నెల మీకు ఒక కొత్త విషయం అందిస్తూనే వస్తున్నాము. చెప్పేది ఒకే అంశం అయినాగానీ మీకు ప్రతి నెల ఒక కొత్త ఆధ్మాత్మిక భావాన్ని అందిస్తూనే వస్తున్నాము. దేవుడు ఆ విధంగానే నాకు అందజేస్తున్నాడు. దానినే మీకు అందివ్వడము జరుగుచున్నది.

ఇప్పుడు కూడా మనం మొట్టమొదట చెప్పుకొనేది ఏమిటంటే, మనం ఉన్నాము. మనకు తెలుసు మనం ఉన్నామని, మన వెనకాల ఇంకొకడు ఉన్నాడని చాలామందికి ఏమాత్రమూ తెలియదు. కానీ

ఉండేది మాత్రం వాస్తవం. నీ వెనుక, నా వెనుక, అందరి వెనుక ఒకరు ఉండి, లోపల నడిపిస్తున్నా ఆ విషయం మాత్రం చాలామందికి తెలియడము లేదు. మనమే నడుస్తున్నామని అనుకుంటున్నారు. ఎందుకంటే మొట్ట మొదట పుట్టినప్పటినుండి ఇదే అలవాటు మనకున్నది. మేము మొదటినుండి చెపుతునట్లుగానే, ఇదేమీ కొత్త విషయం కాదుగానీ నీ శరీరములో నీకు తెలియకుండా, నిన్ను నడిపించేటటువంటి వాడు ఒకడున్నాడు. సరే వాడు ఎట్లున్నాడు అంటే ఏమాత్రమూ తెలియబడడు. నీవలే ఉంటూ, నిన్ను మభ్యపెడుతూ, నిన్ను నడిపిస్తూ నీవే నడుస్తున్నావు అని చెప్పేటటువంటి వాడు. ఆ రకంగా చెప్పడం వల్ల ప్రతి విషయం, ప్రతి పని, ప్రతి మాట అన్నీ నేనే చేస్తున్నాను, అన్నీ నేనే మాట్లాడుతున్నాను అని జీవుడు అనుకోవడం జరుగుతూ ఉన్నది. మనం జీవాత్మగా ఈ శరీరంలో ఉన్నా, అట్లే ఆత్మ కూడా శరీరములో ఉంటూ మనల్ని ఆడిస్తూ ఉంటే మనం ఆడుతున్నాము, అని మేము చెప్పిన విషయం ఎంతవరకు అర్థం అయ్యింది అని చూస్తే, ఇక్కడికి వచ్చేటటువంటి వాళ్లకు బాగానే అర్థం అయ్యిందని అనిపిస్తూ ఉంది. ఇక్కడికి రానివాళ్లకు మాత్రం ఆత్మ విషయం తెలియదని చెప్పవచ్చును.

ఇక్కడ ఈ రోజు ఉదయం క్రైస్థవులు మరియు ముస్లీమ్‌లు బైబిల్ మరియు ఖురాన్‌లలోని విషయాలను చర్చించుకున్నారు. వాళ్లు చర్చించాల్సిన విషయాలను అందించినది మేమే. వాళ్లు ఆ వాక్యముల గురించి చెప్పుకోవడము మరియు చర్చించుకోవడము చూస్తే నాకంటే బాగా చెప్పారని అనిపిస్తూ ఉంది. వాళ్ల చర్చను చూస్తుంటే వాళ్లు జ్ఞానాన్ని చాలా వేగంగా అందుకుంటున్నారని అనిపిస్తూ ఉంది. కొంతమంది చాలా వేగంగా అందుకుంటున్నారు, కొంతమంది అందుకోలేకపోతున్నారు. కొంతమంది దేవుడొక్కడే అంటున్నారు. మేము కూడా **ఆరాధించాల్సిన**

**దేవుడొక్కడే** అని అంటున్నాము. నీవు పూజ చేయాల్సింది ఒకే దేవున్నే, ఆరాధించాల్సిన దేవుడొక్కడే అని అంటున్నాము. నీవు పూజ చేయాల్సింది ఒకే దేవున్నే, అలాగే దేవతలను వదిలిపెట్టి ఒకే దేవున్నే మనము ఆరాధించాలి, నేను అదేపని చేస్తున్నాను, మీరు అదేపని చేయండని చెపుతున్నాను. కొంతమందికి అర్థంకాక మేము చెప్పేదంతా అజ్ఞానం అని ప్రచారం చేసుకొంటున్నారు. అర్థంకాని వాళ్లు ఎలా ప్రచారం చేసుకొన్నా పర్వాలేదు మనకు మాత్రం జ్ఞానం అర్థమయ్యింది, అదే మనకు చాలు.

ఇప్పుడు ముఖం మీద ముద్ర ధరించేటటువంటి వారందరూ త్రైతసిద్ధాంతాన్ని తెలుసుకున్నటువంటి వాళ్లే. త్రైతసిద్ధాంతము అనుసరించే వాళ్లు తెలుసుకుంటున్న ఈ ముద్ర బైబిల్‌లో ఉంది, ఖురాన్‌లో ఉంది. అట్లే ఈ రెండు గ్రంథాలకు ఆధారమైన భగవద్గీతలో కూడా ఉంది. దానిని ఆధారము చేసుకొని మనము దేవుని ముద్రను రూపొందించుకొని, ఆ ముద్రను ఈ రోజు మనం నొసళ్ల మీద ధరిస్తున్నాము. ధరించనటువంటి వాడు చాలా ఇబ్బంది పడతాడని దైవగ్రంథములో వ్రాయబడి ఉన్నది. అటువంటి ఇబ్బందుల నుండి బయటపడాలనే ఉద్దేశ్యముతో మనం ఈ రోజు ఈ దేవుని ముద్రను ధరిస్తున్నాము. ఈ ముద్రను మూడు మతముల వాళ్లు ఇక్కడ ధరించడము జరుగుతూ ఉంది. క్రైస్థవులు ధరించారు, ముస్లీమ్‌లు ధరించారు, హిందువులు ధరించారు. మరి ఇప్పుడు వీళ్లను ఏ మతస్తులు అని అనుకోవాలి? ఈ విషయంలో ఒక్కొకరు ఒక్కో రకముగా మాట్లాడుకుంటున్నారు. హిందువును క్రైస్థవుడు అంటున్నారు, క్రైస్థవున్ని హిందువు అంటున్నారు. క్రైస్థవులను వారి యొక్క ఊరికి వెళ్లినప్పుడు మీరు హిందువుల్లో చేరిపోయారని వాళ్ల వాళ్లు అనడము జరుగుతూ ఉంది. ఇక ముస్లీమ్‌లు బొట్టుపెట్టుకుంటే ఇది ఎక్కడా లేనటువంటి పద్దతి,

మీరు చెడిపోవడమే కాకుండా మొత్తం మతమునే గందరగోళం చేసారని అంటున్నారు. ఈ రకంగా అందరికి రకరకాల చిక్కులు వచ్చి పడ్డాయి. మనము ధరిస్తున్న ఈ ముద్రను గురించి **'దేవునిముద్ర'** అనే గ్రంథములో వ్రాశాము. దేవుని ముద్ర మూడు మతాలకు సంబంధించిన దైవగ్రంథాల్లో ఉందని కూడా వ్రాశాము. మూడు గ్రంథాల్లోను ఈ ముద్రకు సంబంధించిన సారాంశము ఉందని చెప్పాము. ఈ విధముగా దీని గురించి ఎంతో వివరణ ఇచ్చినా అర్థంకాలేదు. అందువలన ఇప్పటి నుండి మేము ఒక కొత్త ఆచరణను రూపొందించాము.

మనవద్ద హిందూ, క్రైస్థవ, ముస్లీమ్‌లు ముగ్గురు ముద్ర ధరిస్తున్నారు. ఇక నుండి హిందువులు ఈ ముద్ర ధరించినప్పుడు ముద్ర క్రింది భాగములో కుంకుమ బొట్టు స్టిక్కర్‌ను ధరించండి. దీనివల్ల వీళ్లు హిందువులే అని అర్థం అవుతుంది. అట్లాగే క్రైస్థవులు ఈ ముద్రను ధరించినప్పుడు, క్రైస్థవులే విమర్శిస్తున్నారు కాబట్టి, వాళ్లు విమర్శ నుండి తట్టుకునే దానికొరకు ముద్ర క్రింద నక్షత్రం గుర్తు స్టిక్కర్‌ను ధరించండి. అట్లాగే ముస్లీమ్‌లకు మేము ఏమి చెపుతున్నాము అంటే మీరు ఒకవేళ ముద్ర ధరిస్తే ఇతరులు విమర్శించే అవకాశం ఉంది కాబట్టి, ముద్ర క్రింది భాగములో చంద్రుని బొమ్మ స్టిక్కర్‌ను అంటించుకోండి. ఈ రకంగా ముస్లీమ్‌లు చంద్రుని బొమ్మను, క్రైస్థవులు నక్షత్రం బొమ్మను, హిందువులు కుంకుమ బొట్టును ధరించడం వలన ఏ సమస్యా లేకుండా పోతుంది. ఏ మతస్తులయినా వాళ్లను, వారి మతస్తులే అని అనుకుంటారు. దీనివల్ల ఎలాంటి ఇబ్బందులు ఉండవు. ఈ పద్ధతిని వాళ్ల కొరకు మనం పాటించాలి, మన కొరకు కాదు. తర్వాత ఇంకా మేము చెప్పేది ఏమిటంటే, ఈ దేవతలను ఆరాధించవద్దని, పూజించవద్దని మొదటి నుండి మేము చెపుతూనే ఉన్నాము. ఎందుకంటే నేను నిన్న

చూశాను, పదిహేను రోజుల క్రితం ఒక నాలుగేళ్ల చిన్న అమ్మాయిని ఇక్కడికి తీసుకొని వచ్చారు. బహుశా ఇద్దరు తల్లిదండ్రులు చాలా బాధపడుతున్నారు. ఆ అమ్మాయికి ఫిట్స్ వస్తున్నాయట. ఎక్కడికి తీసుకొని వెళ్ళినా నయము కాలేదట. ఇక్కడికి వస్తే బాగవుతుందనే నమ్మకంతో వాళ్లు వచ్చారు. 15 రోజుల నుండి ఇక్కడే ఉన్నా ఏమాత్రం నయము కాలేదు. అప్పుడప్పుడు ఫిట్స్ వస్తూనే ఉన్నాయట. మేము బయటికి రాము కాబట్టి మాకు ఈ విషయం తెలియదు. నాకు సి.సి కెమెరా కనెక్షన్స్ ఉన్నాయి. అట్లాగే ఇంటర్‌నెట్ కనెక్షన్ హైదరాబాద్ వరకు ఉంది కాబట్టి, హైదరాబాద్ నుండి చూసినా ఇక్కడి 64 కెమెరాల దృశ్యాలు కనిపిస్తాయి. కాబట్టి అక్కడా తెలుస్తుంది, ఇక్కడా తెలుస్తుంది. ఇక్కడ జరిగే విషయం హైదరాబాద్‌లో కూడా తెలుస్తుంది. కాబట్టి నేను ఈ విషయాన్ని చూసి గమనించి ఈ రోగము మందులకు గానీ, ఇంకోదానికి గాని బాగాకాదు. కాబట్టి డాక్టర్ల వద్ద తీసుకొని వచ్చిన మందులు వద్దని చెప్పి, అక్కడ ఉండే మా మనిషి చేత ఒక ప్రత్యేకమైన మందు ఇప్పించాము. దానిని ఆ పాప చేత తినిపించ మని చెప్పాము. మేము ప్రత్యక్షంగా అక్కడ లేము కనుక మా మనిషి చేత ఆ మందును ఇప్పించాము. వాళ్లు ఆ మందును వాడినప్పుడు శరీరంలో ఉండే చెడు అంతా బయటకువచ్చి ఫిట్స్ అణిగి పోయాయి. కానీ కాళ్లు, చేతులు వేగంగా అల్లాండించడం, నాలుక కొరుక్కోవడము, తల్లిదండ్రులను కూడ కొరకడము ఇవన్ని జరుగుతు ఉన్నాయి. ఆ దృశ్యం చూసి దూరము నుండే మేము అడిగాము. మీరు ఇంట్లో వేరే దేవతలను ఏమైనా పూజిస్తారా, మ్రొక్కుబడి ఏమైనా ఉందా అని అడిగాము. అప్పుడు వాళ్లు ఇంకా ఏమి చెప్పకముందే విషయము అర్థమై మీరు ఏదో దేవతను పూజిస్తున్నారు, మీకు ఏదో మొక్కుబడి బాకీ ఉంది, అందుకే ఆ దేవత మీ పాప శరీరంలోకి

వచ్చి ఆ రకంగా చేస్తూ ఉంది. మీ అమ్మాయికి ఫిట్స్ అందుకే వస్తున్నాయి అని మేము చెప్పాము. ఈ విషయము మేము చెప్పిన వెంటనే అప్పుడు, వెంటనే అక్కడే ఉన్న మా మనిషి ద్వారా ఆ దేవతకు ఇలా చెప్పించాము 'మీరు ఆ అమ్మాయిని విడిచిపెట్టి ఇక్కడి నుండి పోండి లేకపోతే నీకంటే పెద్ద దేవతను పంపించి నిన్ను శిక్షింప చేపిస్తానని.' అలా చెప్పించిన వెంటనే ఆ దేవత అణిగి పోయింది. అంటే మందులతో, ఇంకొక దానితో తగ్గనిది మాటతోనే అణిగిపోయింది. ఇలా దేవతలు ఏమి చేస్తుంటారంటే, చిల్లర పనులు చేస్తూ ఉంటారు. నాలుగు సంవత్సరాల అమ్మాయి మీదకి వచ్చి అంత భయంకరంగా బాధపెడుతున్నారంటే మరి దేవతలు ఎలాంటి వారో చూడండి.

ఎవరు ఆ దేవత అంటే జంబులమ్మ అని చెప్పారు చివరకు సరే ఏ అమ్మో ఆయమ్మ, అందుకే దేవతలను మ్రొక్కవద్దండి అని చెప్పుచున్నాము. మేము మొదటినుండి దేవతలకు వ్యతిరేఖమే, దేవతలకు మ్రొక్కినా తిప్పలే, మ్రొక్కకున్నా తిప్పలే అని ఒక ఆధారంగా చెప్పాము. అందుకే దేవున్ని మ్రొక్కాలి, దేవతలను మ్రొక్కితే ఇలాగే పీడిస్తారు. సరే మేము ఏం చేస్తున్నామంటే ఇది బోధిస్తు, దేవుడొక్కడే అని అందరికి చెప్పాము. ముస్లీమ్‌లకు ఒక దేవుడు, క్రైస్థవులకు ఒక దేవుడు, హిందువులకు ఒక దేవుడు అని చెప్పలేదు. ప్రపంచానికంతా ఉండేది ఒకే దేవుడు అని చెప్పాము. మీరు ఆరాధించవలసింది ఒకే దేవున్నే అని చెప్పాము. ఆ ఒకే దేవుడు ఎవరు అని ప్రశ్న వస్తే, అతను నీ శరీరంలోనే ఉన్నాడు. ముస్లీమ్‌లు పడమర వైపుకు తిరిగి నమాజ్ చేస్తారు. అట్లే హిందువులు తూర్పుకు తిరిగి నమస్కారం చేస్తారు.

గుడిలోకి పోతే ప్రతిమ ఎదురుగా నిలబడి పూజ చేస్తారు. అంటే నీవు నమస్కరించేది, నీవు పూజ చేసేది నీముందర ఉన్న దేవున్నే, నీ వెనకాల ఉన్న దేవునికి నీవు నమస్కారము చేయలేదు. దేవుడనేవాడు నీ శరీరంలో ఉన్నాడు, శరీరంలో ఒక్కచోట నువ్వున్నావు బాగా గుర్తు పెట్టుకుంటే శరీరమంతా ఇంకొకరున్నారు అతనే నీ పొరుగువాడు. అతనే నీ దేవుడు, అతన్నే నీవు ఆరాధించవలసింది. నీవు దేవుడు అని చెప్పాల్సింది అతన్నే. అట్లే శరీరం లోపల, శరీరం బయట అంతటా మరొకరున్నారు. అతనికి ఎలాంటి పేరు లేదు కాబట్టి అతన్ని కూడా దేవుడనే అంటున్నాము. కానీ ఆయనను ఎవరు ఆరాధించాల్సిన అవసరంలేదు, ఆయన ఏ ఆరాధనకు ఒప్పుకోడు, ఆయనకు ఏ ఆరాధనతో అవసరంలేదు. నీ ఆరాధనలు ఏవి ఆయనకు పనికిరావు, నీ ఆరాధనలను ఏమాత్రము లెక్కచేయడు. అటువంటి విధానం లోపలా, బయటా, అంతటా ఉన్నాయనది. **అట్లే ఆయన ఏ పని చేయడు, ఆయనకు ఏ అవసరము లేదు. ఏ అక్కరా లేదు, ఎవరితో సంబంధము కూడా లేదు, అందరికంటే పెద్దవాడు ఆయనే.** ఈ విషయములన్నీ అంతిమ దైవగ్రంథమైన ఖురాన్‌లో 112వ సూరాలో వ్రాయబడి ఉన్నాయి. ప్రపంచములో అన్ని విషయాలలో ఆరితేరి ఉండి, ఈ విషయం వద్దకు వచ్చేసరికి ఎందుకు అర్థంకాలేదు. అర్థం అయి ఉంటుంది, కానీ దేవుడు గొప్పవాడు అని అనుకుంటున్నారు. దేవుడు అంటే ఎవరు అనే ప్రశ్న రాలేదు. మనకు పెద్దలు ఏదైతే చెప్పితే అది ఇట్లే ఉంటుంది అని అనుకుంటున్నాము.

**ఆరాధించవలసిన దేవుడు ఒకడున్నాడు, ఆరాధనలతో అక్కర లేనివాడు ఒకడున్నాడు.** నీ ఆరాధనలో అక్కర ఉండే దేవుడొకడున్నాడు. నీవు ఎంత ఆరాధిస్తే అంత, ఏ రకంగా ఆరాధిస్తే ఆ రకంగా, నీ కర్మను

కాల్చివేసి, అంతే ఫలితమిచ్చే దేవుడొకడున్నాడు. నీకు ఏమాత్రము సంబంధము లేని దేవుడొకడున్నాడు. మరిక్కడ ఇద్దరు దేవుళ్లు అవుతారు. ఇట్లా ఇద్దరూ దేవుళ్లున్నారు అని చెప్పితే లేదు మాకు ఒకరే దేవుడున్నారు, మా గ్రంథములో ఒకే దేవుని గురించే చెప్పారు. మీరే ఇద్దరు దేవుళ్లన్నారు అని బోధిస్తున్నారంటే, మీ గ్రంథమేమి, మా గ్రంథమేమి. మూడు గ్రంథాల్లోను ఇద్దరు దేవుళ్లున్నారు అనే చెప్పారు. నీవు కన్నులున్న గ్రుడ్డివాడివై నీకర్థం కాలేదు. నీవు బుర్రలో ఆలోచన చేయడం లేదు. **"ఏ అక్కరా లేదు, ఏ అవసరం లేదు"** అని ఒకచోట, **"అహర్నిషలు పని చేస్తున్నాను"** అని ఒకచోట చెప్పారు. ఏ పని చేసేవానిని కాను అని ఒకచోట, 24 గంటలు పని చేస్తాను అని ఒకచోట చెప్పినపుడు మరి ఇద్దరూ దేవుళ్లవుతారు కదా. చెప్పినవారిలో అతనెవరు, ఇతనెవరు అని ఆలోచించడం లేదు మనము. అట్లే ఆరాధించవలసిన దేవుడొక్కడే, ఆరాధన అవసరం లేని వానిని కూడా దేవుడే అనాలి. ఇద్దరిని మ్రొక్కమని నేను చెప్పలేదు. నీ శరీరంలో ఉండి ఎవరైతే నడిపిస్తున్నాడో, వాడే నీకు సంబంధం. ఎవరైతే నడిపించకుండా, నీతో ఏమాత్రం సంబంధం లేకుండా, అన్నీటికి అతీతంగా, అందరికంటే పెద్దవాడిగా ఉండి, నీవు ఏ దేవున్నైతే దేవుడు అని ఆరాధిస్తున్నావో, ఆ దేవున్ని కూడా సృష్ఠించి నిలబెట్టినటువంటి వాడు ఆయన. కాబట్టి ఆయనకు నీతో ఏ సంబంధం లేదు. ఎందుకు సంబంధం లేదంటే నీవు మ్రొక్కే దేవుడు నీ ఎదురుగా ఉంటాడు కానీ, ఆ దేవుడు నీ వెనకల, నీ ప్రక్కన , నీ వెనక, నీ పైన, నీ క్రింద ఉంటాడు. నీవు ఒక ప్రక్కకు మ్రొక్కితే మిగతా 7 దిక్కులు ఆయనే ఉన్నాడు. నీవు అన్ని దిక్కులు మ్రొక్కలేవు కదా! నీవు మ్రొక్కేది ఒక్క దిక్కుకే కదా! ఇంకా లెక్కెస్తే చుట్టూ ఉంటే ఎనిమిది దిక్కులే కాకా పైన, క్రింద కలిపితే మొత్తం పది దిక్కులు అవుతాయి. మరి నీవు

మ్రొక్కేది ఒక్క దిక్కే మిగతా తొమ్మిది దిక్కులకు నీవు మ్రొక్కలేవు కదా, అంటే నీకు ఎప్పటికీ ఆయనకు మ్రొక్కేదానికి చేతకాదు. నీ మొక్కుదల ఆయనకు అవసరంలేదు, అంత గొప్పవాడు ఆయన. ఆయన ఏమీ చేయడు, కానీ ఆయన అనుకునేవన్ని జరిగిపోతాయి. ఎందుకంటే ఆయన గుమాస్తాలు చేస్తారు.

ఆయన ఎవరికీ తీర్పు తీర్చడు ఆయన అన్నింటికీ అధిపతి ఆయినప్పటికీ తీర్పు తీర్చడు, నీవు ఇట్లా పుట్టు, ఇట్లా బ్రతుకు, ఇట్లా చావు అని ఎవరికీ చెప్పడు. ఎందుకంటే ఆయన చేయాల్సిన పనిని ఇంకొకరు చేస్తున్నారు. ఆయన తీర్పుతీర్చే అధికారం వేరే వాళ్లకు ఇచ్చాడు. నిన్ను పుట్టించి, నిన్ను చంపి, జీవితమంతా బ్రతికించి, ఏడిపించి, నవ్వించి, ఆడించి, పాడించి అన్ని చేయించేటటువంటి అధికారం ఎవరికైతే ఉందో అతనే నీ దేవుడు. అట్లాంటి నీ దేవునికి కూడా ఆయన అధిపతిగా ఉన్నాడు. ఇదే విషయమే మీరు ఉదయం మాట్లాడినప్పుడు మీకు బాగా అర్థం అయిందనుకుంటాను. **తండ్రి, కుమారుడు** అనే విశ్లేషణ మీకు బాగా అర్థం అయింది, ఆ విషయాన్ని మీరు చాలా బాగా చెప్పుకున్నారు, ఇంకా కొంతమందికి బాగా అర్థం కాకపోవచ్చు. కాబట్టి ఈ విషయాన్ని బాగా అర్థం చేసుకోండి.

దేవుడు రెండు రకాలుగా ఉన్నాడు. ఆ రెండు రకాల వారిని దేవుడే అనాలి. ఒకరిని దేవుడు మరొకరిని దయ్యం అనే దానికి వీలులేదు. ఆయనను దేవుడే అనాలి, ఈయనను దేవుడే అనాలి. కానీ ఒక దేవునితోనే నీకు పని, ఆ ఒక్క దేవున్నే నీవు ఆరాధించవలసినది. ఆ ఒక్క దేవుడే 24 గంటలు నీకు పని చేసిపెడుతున్నాడు. ఏమాత్రము అలసిపోలేదు ఏమాత్రము

కునుకులేదు నీవు నిద్ర పోయినా ఆయన మేల్కొనే ఉన్నాడు. ఈ విషయాన్నే ఖురాన్ గ్రంథము 2వ సూరా 255వ ఆయత్‌లో చెప్పారు. మరి అంతగా శ్రమపడేవాడు ఆయనైతే, నాకు ఏ సంబంధము, ఏ అక్కరాలేదు అని 112వ సూరాలో ఎలా చెపుతాడు? అక్కడ చెప్పినోడు ఇంకొక ఆయన అని ఎందుకు అర్థము కాలేదు? చెవుల్లోకి నీళ్లు ఏమైనా పోసుకున్నారా, ఇంకేమైనా పోసుకున్నారా, మెదడు పని చెయ్యకుండా ఉండేదానికి అక్కడ ఆ మాట అర్థమైనప్పుడు, ఈ మాట ఎందుకు అర్థం కాలేదు మీకు? మీరు దేవున్ని గురించి బోధిస్తున్నారంటే, ఇద్దరు దేవుళ్లను గురించి బోధించాలి కదా, ఒక్కదేవున్ని గురించి ఎందుకు బోధించుచున్నావు. నీకు అర్థం కాలేదని తెలుస్తూవుంది. నేను ఏ పని చేయను అన్న దేవుడు ఒకడున్నాడు. నేను పని చేస్తాను అన్న దేవుడు ఒకడున్నాడు. 3వ సూరా 18వ ఆయత్‌లో ఏమి చెప్పారు, నీవు ఆరాధించాల్సిన దేవుడు ఒకడున్నాడు. అని పెద్ద దేవుడే చెప్పాడు. ఆయనే నీకు దేవుడు, ఆయననే నీవు ఆరాధించవలసినది అని చెప్పారు. 6వ సూరా 102వ ఆయత్‌లో కార్యకర్తగా నేనున్నాను అని, నీశరీరములో ఉండే దేవుడు చెప్పాడు. అన్ని పనులు నేను చేస్తున్నాను అని చెప్పాడు. ఉదయం లేచావు పండ్లు తోముకున్నావు. నీ దృష్ఠిలో ఏమనుకుంటున్నావు బ్రెష్ చేసుకొని, పండ్లు తోముకున్నాను అనుకుంటున్నావు, కానీ నిజానికి తోముకున్నది నీవు కాదు, ఆ చేయి ఆడాలంటే ఇంకొక శక్తి పని చేయాలి. ఆ పని జరగాలంటే ఇంకొక శక్తి పని చేయాలి, ఆ శక్తి పని చేయకపోతే నీవు ముఖము కూడా కడుక్కోలేవు, వేరే వాళ్లు కడిగించాల్సి వస్తుంది. కాబట్టి నీ శరీరంలో అన్నీ ఆడించి, అన్ని అల్లాడించి, పని చేయించేవాడే నీ పొరుగువాడు. వాడు నీ ప్రక్కనే ఉన్నవాడు, నీ పొరుగువాడు ఎవడు, నాశనం లేనటువంటివాడు. అతన్నే అక్షరుడు అని చెప్పాము.

భగవద్గీతలోని పురుషోత్తమ ప్రాప్తి యోగం లోని 16, 17 శ్లోకాలలో ఈ విషయం ఉంది. క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అనే విషయం ఈ 15వ అధ్యాయంలో చెప్పబడి ఉంది. ఇక్కడ మూడు పేర్లు చెప్పబడి ఉన్నాయి. ఒకటి పేరు కాదు, రెండే పేర్లు, వారే ఇద్దరు పురుషులున్నారు ప్రపంచంలో అని చెప్పారు. ఈ రకంగా భూమి మీద రెండు రకాల పురుషులున్నారు. వీరిలో నాశనమయ్యే పురుషుడు, నాశనం కాని పురుషుడు ఒకడున్నాడు అని చెప్పాము. నాశనమయ్యే పురుషుడు ఎవరూ అంటే జీవాత్మ అయిన నీవు అని చెప్పాము. నాశనం కాని పురుషుడెవరు? అంటే పురుష జాతికే సంబంధించిన 'ఆత్మ' కూడా ఒకటి ఉందని చెప్పాము. ఆత్మ కూడా ఉంది అంటే ఆడదని కాదు, పురుషుడనే అర్థం చేసుకొవాలి పురుష సంబంధమైన వాడే అని అర్థం చేసుకోవాలి.

ఈ విధముగా ఆత్మ అనేవాడొకడున్నాడు, జీవాత్మవు నీవు ఉన్నావు, నీవు ఎప్పటికైనా నాశనము కావలసిందే, జీవాత్మగా లేకుండా పోవలసిందే కానీ ఎప్పటికీ నాశనం కాకుండా ఉండేవాడు ఆత్మ, ఆయనెట్లున్నాడంటే నీ వలెనే ఉంటాడు. శరీరాన్ని నా శరీరము అని అనుకుంటున్నావు కదా, నీ శరీరాన్ని అద్దంలో చూసుకుంటున్నావు కదా! ముక్కు, ముఖము, అన్నీ కనిపిస్తున్నాయి కదా! నీ ఆకారము యొక్క సైజంతా కనిపిస్తుంది కదా! ఆ సైజంతా ఎవరు నిండుకొని ఉన్నారు, నీలో ఉండే ఆత్మనే. నీవు ఈ ఆకారంలో ఒక్కచోట ఉన్నావు. కానీ అద్దములో చూసుకొని నా కళ్లు బాగున్నాయి, నా పళ్లు బాగున్నాయి అనుకుంటున్నావు. నిజానికి పైకి కనిపించే ఆకారంతో కానీ, సైజ్‌తో కానీ నీకు ఏమీ సంబంధము లేదు. పళ్లు నీవి కావు, ముక్కు నీది కాదు, నాలుకా నీది కాదు, ఏదీ నీది కాదు, నీవు లోపల ఎక్కడో పడి ఉన్నావు. లోపల ఎక్కడో ఉండి తిప్పలు

పడుతున్నావు అట్లాంటి పరిస్థితి నీది. కానీ అన్ని చేసేవాడు ఆయన, ఆయన నాశనము కాడు. కాకున్నా నీవలే అంతా ఆక్రమించి, శరీరమంతా ఉన్నాడు. పోతపోసినట్టు, నఖశిక పర్యంతం, అణువణువునా వ్యాపించి నిండుగా ఉన్నాడు. ఖాళీ గ్లాసులోకి నీళ్లు పోస్తే ఎట్లాగైతే పూర్తిగా ఆక్రమించుకుంటాయో, అలా ఆత్మ శరీరమంతా వ్యాపించి ఉంది లేదా ఉన్నాడు.

కాబట్టి ఆయనను నీ పొరుగువాడు అని చెప్పవచ్చును. ఎప్పుడు చూసినా జీవాత్మా, ఆత్మ, పరమాత్మ తప్ప ఇంకొకటి లేదా అని కొందరు అడుగవచ్చు. మూడు గ్రంథాలలో ఉండే సారాంశమంతా ఇదే. భగవద్గీత, బైబిల్, ఖురాన్ మూడింటిలో మూడు ఆత్మల సారాంశము ఉంది. అందుకని మొట్టమొదటనే త్రైత సిద్ధాంతము గురించి చెపుతున్నాము అని చెప్పాము. బైబిల్‌లో మత్తయి సువార్త 28వ అధ్యాయములోని 19వ వచనంలో ఏముంది? **తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ** అని చెప్పారు. అట్లే ఖురాన్ గ్రంథము లోనికి పోతే 50వ సూరా 21వ ఆయత్‌లో ఏముంది? తోలబడే వాడివి నీవని, తోలేవాడు ఇంకొకరు ఉన్నాడు, చూస్తూ సాక్షిగా ఉండేవాడు మరొకడున్నాడు అని చెప్పారు. సాక్షిగా ఉన్నవాడు ఏ పని చేయడు, పెద్ద దేవుడాయన తోలే దేవుడు ఇంకొకడున్నాడు, తోలబడేవాడివి నీవు. అతను ఎట్లా పరుగెత్తిస్తే అట్లా పరుగెత్తుతావు. బజారుకు పోవాలంటే బజారుకు, ఇంటికి పోవాలంటే ఇంటికి, పడుకోమంటే పడుకుంటావు, లేవమంటే లేస్తావు, ఎగరమంటే ఎగురుతావు, దూకమంటే దూకుతావు, పాట పాడమంటే పాడుతావు. పాట బాగా పాడేవాడు ఒకడున్నాడు, బాగా పాడనివాడు ఒకడున్నాడు, రకరకాలుగా పాడిస్తున్నాడు ఆయన. వీడు బాగా పాడుతాడు, వాడు బాగా పాడడు అని మనం అనుకుంటాం, కానీ

బాగా పాడేవాడు ఆయనే, బాగా పాడనివాడు ఆయనే. ఈ విషయంలోనే ఇంతకు ముందు బాలసుబ్రమణ్యం గురించి చెప్పాము. బాలసుబ్రమణ్యం బాగా పాడుతాడు అంటే, బాలసుబ్రమణ్యం స్వతహాగా ఏమీ పాడటం లేదు. బాలసుబ్రమణ్యం లోపల ఉండే వాడు పాడుతున్నాడు అని చెప్పాము. కానీ మనకు అది అర్థం కాలేదు, కానీ ఆ పాడే అతను ఎవరు? అంటే అతనే నీ పొరుగువాడు.

ఇంతవరకు మనకు అర్థం అయ్యింది, ప్రారంభం నుండి ఇదే మనం చెప్పుకుంటున్నాము. ఇప్పుడు ఇదే విషయాన్ని కాస్తంత మార్చి చెప్పుకుంటాము. అది కూడా ఈ జ్ఞానానికి సంబంధించే ఉంటుంది. మనము చిన్న పిల్లలప్పుడు ప్రాథమిక పాఠశాలకు పోయి చదువు నేర్చు కున్నాము. మనకు అక్కడ అక్షరాలు నేర్పించారు. మేము చదువుకునేటప్పుడు మా చదువులో మాకు నేర్పింది ఏమంటే అ, ఆ, ఇ, ఈ అని చెప్పారు. (ప్రేక్షకులలో ఉండే సాయిశంకర్ అనే అతనిని లేపి) సాయిశంకర్ మీరు టీచర్‌గా ఉన్నారు, మీరు చెప్పండి అక్షరాలను (అనగా సాయిశంకర్ వేగంగా అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ అనగా) అంత వేగంగా వద్దు నిదానంగా చెప్పండి. వినేవాళ్ళు చాలామంది ఉన్నారు. నిదానంగా అతనితో అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఎ, ఏ, ఐ ఒ, ఓ, ఔ అం, అః అని చదివించి అతన్ని కూర్చోమని ఆజ్ఞాపించి, మీరు ఇప్పుడు అక్షరాలు విన్నారు కదా! దీనిని ఏ భాష అంటారు, తెలుగుభాష అంటారు. తెలుగు భాష ప్రపంచములో మొట్టమొదట పుట్టిన భాష అని నేను చెప్పాను కదా, కానీ మీకు తెలుసో తెలియదో, చూశారో చూడలేదో ఏదో, మీరు చెప్పితే మేము నమ్మాలా? అని కొందరడుగవచ్చు. నిజానికి నేను చెప్పేది ఎప్పటికీ వాస్తవమే ఉంటుంది. ప్రపంచంలో మొట్టమొదట పుట్టిన భాష తెలుగు భాష. ఈ

తెలుగు భాష జ్ఞానముతో కూడుకొని పుట్టింది. ఎప్పుడైతే ఆకాశవాణి నుండి పరమాత్మ జ్ఞానము బయటకు వచ్చిందో, అది ఎప్పుడైతే ప్రజలలోకి వచ్చిందో, ఈ జ్ఞానాన్ని బట్టి మొదట పుట్టిన భాష తెలుగు భాష, అందుకే తెలుగు భాష ఆత్మజ్ఞానానికి దగ్గరగా ఉంటుంది. తెలుగు అక్షరాలు కూడా జ్ఞానానికి చాలా దగ్గరగా ఉంటాయి అని 'తెలుగు' అనే చిన్న గ్రంథము కూడా మీకు ఇంతకుముందే వ్రాసి ఇచ్చాము. మేము ఏ గ్రంథము వ్రాసినా సంచలనంగా ఉంటుంది. కొత్తగా ఉంటుంది, దానిలో కొత్త విషయాలే ఉంటాయి. ఈ రోజు అక్షర జ్ఞానము అని పేరు నిర్ణయించి చెపుతున్నాము కదా! అక్షర జ్ఞానము అంటే ఏమిటి? అంటే నీవు అక్షరాలు నేర్చుకున్నావు కాదా! తెలుగు భాషను మొట్టమొదట నేర్చుకొన్నాము. వేరేవాళ్లు వేరే భాషను నేర్చుకొంటారు, మనమేమో తెలుగు భాషను నేర్చుకొన్నాము. మన అదృష్టం ఏమిటి అంటే ప్రపంచంలో మొట్టమొదట పుట్టిన భాష తెలుగు భాష. ఆ తెలుగు భాషను చిన్నప్పుడు నేను కూడా నేర్చుకోవడం జరిగింది. మీరు నా తర్వాత పుట్టి మీరు నేర్చుకొన్నారు, నేను మీకంటే కొంత ముందుపుట్టి, ముందు నేర్చుకున్నాను. అప్పుడు అఆ, ఇఈ, ఉఊ మొదలైనవి మేము నేర్చుకున్నాము. సరే అది ఎలాగైనా ఉండని గాని, ఈ జ్ఞానము ప్రకారం ఈ భాషను ఎట్లా తయారు చేసినారు? అనే ప్రశ్నను వేయవచ్చు అంతేకదా! ఇప్పుడు దానికి నేనేమి చెపుతున్నానంటే, నీవు జీవాత్మగా ఉన్నావు. నీకంటే అధికంగా ఆత్మ ఉంది. ఆ ఆత్మ కనబడకుండా ఉంది నీ వెనకాల, నీవు ముందర ఉన్నావు. అది నీతో పని చేయిస్తా ఉంది, నీ పొరుగువాడిగా ఉంది, నీ ప్రక్కనే ఉండే వాడిగా ఉంది. అందుకే నీవు 'అ' అయితే అతను 'ఆ' అయ్యాడు. ఎవరు? నీ ప్రక్కనే ఉండేవాడు. మొదట ఉండే అక్షరం దీర్ఘము లేకుండా చిన్నగా ఉంటుంది, ప్రక్కన ఉండే

అక్షరం దీర్ఘంగా ఉంటుంది. నీవు హ్రస్వం (అ) ఆయన దీర్ఘం (ఆ) ఆయనే ఆత్మ, జీవాత్మ తక్కువ, ఆత్మ ఎక్కువ కాబట్టి జీవాత్మను పోల్చి ఒక అక్షరము, ఆత్మను పోల్చి ఒక అక్షరము చెప్పారు. ఈ రకంగా జీవాత్మను పోల్చి 'అ', ఆత్మను పోల్చి 'ఆ' అని చెప్పారు. అర్థమయ్యిందా? ఇది అంత తొందరగా అర్థంకాదు కాబట్టి, దానితోనే ఆపకుండా, ఇ, ఈ, అని కూడా చెప్పారు. నీవు 'ఇ' అయితే ఆత్మను 'ఈ' అని చెప్పారు. నేను పెద్ద ధనవంతున్ని అనుకుంటే, ఆయన నీకంటే పెద్ద ధనవంతుడు. నీవు బీదవానివి అనుకుంటే, ఆయన నీకంటే పెద్ద బీదవాడు. నీవు ఏది అనుకుంటే అతను నీకంటే పెద్దవాడు, అట్లాని చెప్పి నీవు ఎన్ని రకాలుగా ఉంటే అన్ని రకాలుగా ఉన్నాడని ఒక శబ్ధంతో మొదలు పెట్టి అంతటితో ఆగకుండా అ, ఆ లోనే వదలకుండా ఇ, ఈ లలో కూడా చెప్పారు. నీవు ఇ, అయితే ఆయన 'ఈ' అని చెప్పారు. మనకు ఇంతకు మందు ఈ అక్షర జ్ఞానము తెలియదు, ఇప్పుడు నేర్చుకోండి. అక్షర జ్ఞానమంటే ఏమిటో, మీలో ఉపాధ్యాయులు చాలామంది ఉన్నారు. అప్పుడు ఆ చదువు ఏమి నేర్చుకున్నారో గానీ, ఆ చదువులో ఎంత సారాంశము ఉందో ఇప్పటికి అర్థం అయివుంటుంది. నీ ప్రక్క ఉండే ఆత్మ పెద్దవాడు అని చెప్పేదాని కొరకు, నీవు నల్లగా ఉంటే అతను నల్లగానే ఉంటాడని, నీవు తెల్లగా ఉంటే అతను తెల్లగా ఉంటాడని, అఆ, ఇఈ, ఉఊ, అని అక్షరాలను మార్చి ఇక్కడ చెప్పారు.

ఒక్క అక్షరంతో చెప్పితే కుదరదు అని అక్షరాలను మార్చి, మార్చి చెప్పినారు. ఇక్కడ జీవాత్మ, ఆత్మ అని చెప్పాకా, అంతటితోనే ఆగకుండా ఎ, ఏ, ఐ అని కూడా చెప్పారు. ఎందుకంటే నీవు జీవాత్మవు, జీవాత్మ ప్రక్కల ఆత్మ ఉంది, దాని ప్రక్కల దీర్ఘంగా పరమాత్మ కూడా ఉంది అని చెప్పినారు. అంతేకదా! అంతటితో ఆగకుండా ఒ, ఓ, ఔ అనే అక్షరాలతో

కూడా పై విధంగానే జీవాత్మ, ఆత్మ, పరమాత్మల గురించే ఎంతో వివరంగా మూడు అక్షరాలలో జ్ఞానం ఇమిడ్చి చెప్పడం జరిగింది. ఇంతవరకు ఈ విషయం అక్షరాలు చెప్పే టీచర్లకు తెలియదు. నేర్చుకుంటున్న విద్యార్థులకు కూడా తెలియకుండా పోయింది. ఇలా రెండు రెండు అక్షరాలను చెపుతూ పోయి, మూడు అక్షరాలను కూడా చెప్పారు. ఈ రకంగా ఆత్మ, జీవాత్మలనే కాకుండా, జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను కూడా చెప్పారు. ఇది మొట్టమొదట మనం కొంత తెలుసుకోవాల్సిన జ్ఞానం. ఇలా కొంత తెలుసుకున్న తర్వాత, కొంత అర్థం చేసుకున్న తర్వాత అంటే జీవాత్మ, ఆత్మ, పరమాత్మల గురించి కొంత అర్థం చేసుకొన్న తర్వాత మరలా ముందుకు వెళ్ళారు. మొదట జీవాత్మ, ఆత్మలను అర్థం చేసుకోవడానికే చాలా సమయం పడుతుంది. కనుక జంట అక్షరాలను నాలుగుచోట్ల చెప్పి తర్వాత రెండు చోట్ల మూడు అక్షరాలను ఐదవసారి, ఆరవసారి కలిపి చెప్పి పరమాత్మను అర్థం చేయించే కృషి చేశారు. భగవద్గీతలో కూడా మొదట క్షర, అక్షర అను రెండు ఆత్మలను చెప్పి, తర్వాత మూడవవాడయిన పరమాత్మను గురించి చెప్పారు.

ఇక్కడ నుండి ఇంకా కొంత మార్చి చెప్పినారు. దైవభావాన్ని తీసుకొని వచ్చి, అక్షరాల రూపంలో చిన్నప్పుడే నీకు నేర్పించారు, కానీ నీకు గుర్తులేదు. వాస్తవమా! కాదా! చెప్పండి. ఈ రకంగా ఎవరూ ఈ విషయాన్ని అన్వేషించి చెప్పలేదు. సరే ఇప్పుడు మనం చెప్పుకుంటున్నాము. ఈ రకంగా జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అర్థం అయ్యాక, చివరిలో అం అః అని చెప్పినారు. ఇది ఎందుకు చెప్పినారు అని చూస్తే నీవు ఉత్త **అ** అయితే నీకంటే పెద్ద **ఆ** అవుంతుంది అంటే ఆత్మ అవుతుంది. అట్లే అః లో రెండు సున్నాలు వచ్చాయి అంటే పరమాత్మ అవుతుంది. ఇరకంగా అం, అః అంటే నీకంటే ఆత్మ పెద్ద అయితే, ఆత్మకంటే పరమాత్మ పెద్దవాడని,

ఈ అక్షరాలలో ఆ ప్రక్కన ఒక సున్నా, ఆ, ప్రక్కన రెండు సున్నాలు పెట్టి చూపారు. తండ్రి, కుమారుడు అని ఒక గ్రంథములో చెప్పారు కదా! ఆ రకంగా ఇద్దరు ఒకటే అని చెప్పేదానికి ఈ రకంగా చెప్పారు. ఈ రకంగా ఆత్మ పరమాత్మ రెండు ఒకే సెక్షన్ అని అక్కడ చివరిలో చూపించారు. ఇలా ఇవి ప్రాథమికంగా నేర్పించే అక్షరాలు. ఇలా ప్రాథమికంగా నేర్పించే అక్షరాలలో జీవాత్మ, ఆత్మలకు కూడా జంట అక్షరాలను, జీవాత్మ, ఆత్మ పరమాత్మలకు గుర్తుగా మూడు అక్షరాలను, ఆత్మ, పరమాత్మలకు గుర్తుగా తిరిగి సున్నాలతో కూడిన అక్షరాలను ఎంతో జ్ఞానవంతంగా చెప్పి ఒక స్థాయిలో జ్ఞానాన్ని అర్థం చేయించారు అని చెప్పవచ్చును. ఇంకా బాగా జ్ఞానాన్ని అర్థం చేసుకోవడానికి ఇంకో పద్ధతిని కూడా ఈ అక్షరాల్లోనే ఏర్పాటు చేసి పెట్టారు. మీరు బాగా జాగ్రత్తగా గమనించండి ఒక అక్షరముంటే దాని ప్రక్కన ఇంకొక దీర్ఘమైన అక్షరాన్ని పెట్టారు. నీవు జీవాత్మవు అయితే నీ ప్రక్కన దీర్ఘంగా ఉండే అక్షరం ఉంటుంది. నీవు తేలికగా ఉండే వాడివి అయితే నీ ప్రక్కన తూకంగా అంటే బరువుగా ఉండేది ఇంకొకటి ఉంటుంది. నీవు 'క' అక్షరము అయితే అది 'ఖ' అవుతుంది. నీవు 'గ' అక్షరము అయితే అది 'ఘ' అవుతుంది. ఈ రకంగా జీవాత్మ, ఆత్మలకు గుర్తు జంట అక్షరాలను సూచించి, మరలా ప్రక్కనే పరమాత్మకు కూడా గుర్తుగా మూడు అక్షరాలను కూడా సూచించారు. ఉదా! డ, ఢ, ణ ఇందులో ట, ఠ జీవాత్మ ఆత్మలకు గుర్తు అయితే 'ణ' పరమాత్మకు గుర్తు అవుతుంది, "ణ" అనేది ప్రత్యేకంగా ఉంది కదా! డ ఢ కు సంబంధం లేకుండా 'ణ' ఉంది. అంటే పరమాత్మ ప్రత్యేకంగా ఉన్నాడు అని డ, ఢ, ణ అని పెట్టినారు. అట్లే త, థ, ద, ధ, న పెట్టినారు.

ఇది కూడా ప్రత్యేకంగానే ఉంది కదా! జీవాత్మకు, ఆత్మకు గుర్తుగా త,థ, జీవాత్మ, ఆత్మ, పరమాత్మకు గుర్తుగా ద, ధ న పెట్టారు. పరమాత్మకు సంబంధం లేదు కాబట్టి ప్రత్యేకమైన శబ్దంలో పెట్టి అక్షర జ్ఞానాన్ని సంపూర్ణంగా చిన్నప్పుడే నేర్పించారు. ఈ జీవాత్మ, ఆత్మలను గురించి తెలుసుకొని, జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను కూడా తెలుసుకున్నప్పుడు నీవు ఏ రకంగా ఉన్నాకానీ, అంటే ఏ పనులు చేసినా కానీ, మంచి వానిగా ఉన్నా, చెడ్డవానిగా ఉన్నా, పాపము అంటదు, పుణ్యము అంటదు అన్న జ్ఞానాన్ని మనకు బోధించడము జరిగింది. భగవద్గీతలో అదే చెప్పడము జరిగినది. ఆ విషయాన్ని ఇక్కడ బోధించే దానికొరకు, నీకు అర్థం అయ్యే దానికొరకు ఏం చేసారంటే ముందు అక్షరానికి, వెనక అక్షరానికి సంబంధము లేకుండా ఉండే అక్షరాలను క్రింద పెట్టడము జరిగింది. అవే య,ర,ల,వ,శ, ష, స హ, ళ, క్ష ఈ రకంగా వేరు అక్షరాలు పెట్టడము జరిగింది. అంటే నీవు వేరువేరు రూపాలలో ఏ రకంగా ఉన్నాగానీ అంటే చెడ్డవానిగా ఉన్నా, మంచివానిగా ఉన్నా, నీకు పాప పుణ్యాలు అంటవు అనే గుర్తింపు ఇక్కడ మిగతా అక్షరాలలో చెప్పడం జరిగింది. అయితే ఈ విషయము ఎవరికీ అర్థం కాలేదు. ఈ మూడు ఆత్మలు ఉన్నాయనే విషయము ఎవరికీ తెలియదు. నీవు జీవాత్మ అయితే, నిన్ను ఆడించేది ఆత్మ అని నీకు తెలియదు. సరే ఇప్పుడు ఇవన్ని లెక్కేసుకుంటూపోతే దీనిని **అక్షర జ్ఞానము** అంటాము. ఈ అక్షర జ్ఞానాన్ని ఎప్పుడైతే మనము తెలుసుకోగలిగినామో నీవు వెనక్కి వెళ్లి చూసుకో, చిన్నప్పటి నుండి ఈ జ్ఞానము నేర్పబడినా ఈ జ్ఞానము ఎందుకు అర్థంకాలేదు అని లెక్క వేసుకుంటే దాని గురించి ఎవరూ చెప్పలేదు. దానిని అర్థంకూడా చేసుకోలేము అట్లే ఇన్ని రోజులు గడిచి పోయాయి. మేము చదువంతా నేర్చుకున్నాము కానీ చదువును ఈ రోజు వెనక్కి తిరిగి చూస్తే చదువులోనే ఎంతో సారాంశము ఉంది.

ఇప్పుడు ఈ అక్షర జ్ఞానములో మూడు ఆత్మలు ఉన్నాయి కదా! ఈ అక్షరాలు మూడు ఆత్మలు ఉన్నాయని తెలియజేశాయి కదా! మరి ఈ మూడు ఆత్మలు ఎక్కడ ఉన్నాయి అని చూస్తే శరీరంలో రెండు ఉన్నాయి, శరీరం బయట కూడా ఒకటి ఉంది. శరీరంలో ఒకచోట ఉండేది నువ్వు, శరీరమంతా వ్యాపించి ఉండే వాడు నీ ప్రక్కవాడు వాడే ఆత్మ, శరీరంలో ఉంటూ, శరీరము బయట కూడా ఉండేవాడు ఒకడున్నాడు. వాడు సర్వము వ్యాపించినటువంటి వాడు. నీకు ముందు ఉన్నాడు, వెనక ఉన్నాడు, పైన ఉన్నాడు, కింద ఉన్నాడు అంతటా ఉన్నాడు. భగవద్గీతలోని విశ్వరూప సందర్శన యోగంలో, ఏ ప్రక్కన నేను మ్రొక్కాలి, అందుకే మ్రొక్కువాడను ముందుకు, మ్రొక్కువాడను వెనకకు, పైకి, కిందకు, అన్ని దిక్కులు నేను మ్రొక్కుచున్నాను. ఒక్క దిక్కు మ్రొక్కితే పరమాత్మను మ్రొక్కినట్లు కాదు అని అర్జునడు ఒప్పుకున్నాడు. భగవద్గీతలో మరి ఆ శ్లోకాన్ని మనము చదివినప్పుడు మనకు అర్థం కాలేదా? మనం మ్రొక్కేది ఒక ప్రక్క దేవున్నే కదా! మరి ఒక ప్రక్క మ్రొక్కితే ఆయనను మ్రొక్కినట్లు కాదు గదా! ఆయనకు మ్రొక్కె దానికి వీలుకాదు గదా, ఆయన మ్రొక్కేంచుకునే వాడు కూడా కాదు గదా అని మనకు ఎందుకు తెలియలేదు. ఎందుకో తెలియలేదు, సరే ఖురాన్ గ్రంథములో వెళ్లి చూస్తే పని చేసేవాన్ని కాదు అని చాలాచోట్ల చెప్పాడు.

కానీ నేను అనుకుంటే పనులన్నీ అవుతాయి, నేను ఏమాత్రం చేయను అన్నాడు. మరి నీవు అనుకుంటే పనులన్ని ఎట్లవుతాయి. చంపేది నేనే, పుట్టిచ్చేది నేనే, అన్ని పనులు చేసేది నేనే, నేనే అనుకుంటే అవుతాయి. కానీ ఆ పనులు నేను చేయను, ఆ పనులు చేసేవాడు ఇంకొకడు ఉన్నాడు. అతనే నా కుమారుడు నేను తయారు చేసి పెట్టినటువంటి వాడు ఒకడున్నాడు

అని చెప్పాడు. ఎవరిని తయారు చేసి పెట్టినాడు అంటే ఆయన "అం" ను తయారు చేసిపెట్టాడు. పరమాత్మ రెండు సున్నాలు కలిగినవాడైతే, ఒక సున్నా కలిగిన ఆత్మను తయారు చేసి పెట్టినాడు.

ఆయన పరమాత్మగా ఉండి ఆత్మను తయారుచేసి పెట్టినాడు. శరీరంలో అన్ని అధికారాలు ఆత్మకు ఇచ్చాడు. తీర్పుతీర్చే అధికారము అంటే మరలా జన్మకు పంపించే అధికారము, చేసుకునే పాపాలకు శిక్షలు వేసే అధికారము, అన్నీ ఆయనకు ఇచ్చి పంపమనడము జరిగింది. ఆ విధంగా తీర్పుతీర్చే ఆధికారము, చంపే అధికారము, బ్రతికించే అధికారము అన్నీ ఆయనకు ఇచ్చినాడు మరలా ఆయనను (ఆత్మను) ఈయనే (పరమాత్మే) పాలిస్తున్నాడు కాబట్టి నీవు అతన్నే మ్రొక్కు అని చెప్పాడు. నీవు ఆరాధించవలసినది దేవున్నే (ఆత్మనే) ఇతనే నీకు ఆరాధ్య దైవము ఇతనే నీకు అల్లాహ్ ఈ అల్లాహ్ తప్ప వేరే అల్లాహ్‌లేడు, వేరే ఆరాధ్య దైవము లేడు, అంటే నేను తయారు చేసి పెట్టిన ఆత్మనే నీవు ఆరాధించవలెను. ఆయనే నిన్ను పరుగెత్తిస్తున్నాడు, నేను సాక్షిగా చూస్తున్నాను, ఆయన నిన్ను (ఆత్మనే) అన్నీ చేయిస్తున్నాడు. కాబట్టి నీవు మ్రొక్కవలసింది ఆయననే, ఆరాధించల్సింది, ప్రార్థించాల్సింది ఆత్మనే నన్ను కాదు. నీవు ఆరాధించాల్సిన అల్లాహ్ ఈయనే అని చెప్పడం జరిగింది. 3వ సూరా 18వ ఆయత్‌లో బాగా చూసుకోండి. **"అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యదైవం లేడని స్వయంగా అల్లాహ్, ఆయన దూతలు, జ్ఞానసంపన్నులూ సాక్ష్యమిస్తున్నారు."** కానీ దానిని మనము లెక్కలోకి తీసుకుంటున్నామా. ఏమంటున్నామంటే, అట్లాకాదు రెండవ వాడు లేడు, ఉన్నవాడు ఒకడే నేను ఒక్కన్నే దేవున్ని, నన్ను పూజించమని చెప్పియున్నాడు అని అంటున్నారు. కొంతమంది తెలివి తక్కువ మనుష్యులు "నేనొక్కన్నే దేవున్ని, అల్లాహ్‌ను నేనొక్కన్నే,

ఆరాధ్య దైవము నేనొక్కన్నే, నన్ను ఒక్కడినే ఆరాధించు" అని చెప్పాడు అంటున్నారు. అంతేకాక "వేరొక దేవుడు లేడు, నీవు వేరొక అతను ఉన్నాడని కావాలని చెపుతున్నావు" అని అంటున్నారు. సరే నేను ఇంకొకతను ఉన్నాడని కావాలని చెప్పితే 112వ సూరాలో **"నేను ఏ అక్కరా లేనివాన్ని, ఏ సంబంధము లేనివాన్ని"** అని ఎందుకు చెప్పాడు. 112వ సూరాలో ఉన్నది ఎందుకు అర్థం కాలేదు మీకు, ఆ మాటకు సమాధానము ఏమని చెపుతారు? ఏ పని నేను చేసేవాడిని కాదు అన్నప్పుడు ఆ మాటనేమంటాము మరి ఈయన పని చేసేవాడు అవుతాడా? మరి నీదగ్గర ఆ మాటకు జవాబు ఉండదు. ఆ మాట గురించి ఆలోచించి జవాబు చెప్పరు. మొన్న ఒక ముస్లీమ్ ఇంకొక ముస్లీమ్‌కు ఫోన్ చేసాడు. అంటే మన దగ్గర జ్ఞానంలో తర్ఫీదు అయ్యే ఒక ముస్లీమ్‌కు ఇంకొక ముస్లీమ్ సొదరుడు ఫోన్ చేసాడు. ఏమని ఫోన్ చేసాడు అంటే మీరు అక్కడ త్రైతసిద్ధాంతము స్వామి దగ్గరకు పోతున్నారు. ఆయన అంతా ఇస్లాంకు వ్యతిరేఖంగా బోధిస్తున్నారు. ముస్లీమ్‌లకు అంతా వ్యతిరేఖంగా బోధిస్తున్నాడు. అల్లాహ్‌కు అంతా వ్యతిరేఖంగా బోధిస్తున్నాడు అన్నాడు. దానికి ఈయన మేము పోతున్నాము కదా అక్కడకు. అల్లాహ్‌కు వ్యతిరేఖంగా ఏమీ చెప్పలేదు అని ఈయన చెప్పాడు. లేదు మీరంతా ముఖానికి చక్రాలు ధరిస్తున్నారు ఖురాన్ గ్రంథములో ఎక్కడా లేదు కదా అన్నాడు. దానికి ఈయన **"ముఖాన ధరించమని లేదు కానీ గౌరవించమని ఉంది కదా, మరి ఎలా గౌరవించాలి? పూలు వేసి గౌరవించాలా? లేక పూజించి గౌరవించాలా? అంత ఎందుకు గానీ, ఖురాన్ గ్రంథములో ఐదవ సూరాలో, 68వ ఆయత్‌లో, ఇంజీలు, తౌరాత్, ఖురాన్ ఈ మూడు గ్రంథాలు చదివినటువంటివానికే దేవుని జ్ఞానము అర్థమయ్యేది అని చెప్పినారు కదా. ఈ మూడింటిని చదవకపోతే**

**జ్ఞానము అర్థంకాదు అటువంటివాడు ఏ ధర్మములో లేనట్లే అని చెప్పినారు కదా! మరి మీరు ఈ మూడు గ్రంథాలు చదివారా?"** అని అడిగాడు. అందుకు ఆ వ్యక్తి నేను చదివినాను అన్నాడు. దానికి మన మనిషి "మూడు గ్రంథాలు చదివినాను అంటున్నావు కదా మరి తౌరాత్ అంటే ఏమిటి" అన్నాడు. అంతే అవతలి వ్యక్తి గబుక్కున ఫోన్ పెట్టేశాడు. ఎందుకంటే జవాబు చెప్పలేక అని అర్థమయింది. మరి అన్ని మాటలు మాట్లాడినవాడు ఎందుకు ఫోన్ పెట్టేశాడు. చేతనైతే చెప్పొచ్చు కదా! ఫలానాది అని, నేను చదివినాను అన్నప్పుడు, ఫలానా గ్రంథము చదివినాను అని చెప్పొచ్చు కదా! మరి చెప్పలేక పోయాడు. అంటే మన వాళ్లు ఇక్కడ జ్ఞానం తెలుసుకొని ప్రశ్న వేస్తే, వేరేవాళ్ళు జవాబు చెప్పలేని పరిస్థితిలో ఇరుకుంటున్నారు.

నా దగ్గర జ్ఞానంలో తర్ఫీదు అయ్యే వ్యక్తి ప్రశ్న అడిగితే జవాబు చెప్పలేని వాడు, నేను అజ్ఞానాన్ని బోధిస్తున్నాను అని ప్రచారం చేస్తున్నాడు. మరి ఇది ఎలా ఉందంటే అటువంటి వానిని ఒక కుక్క అనుకొని, వానిని లెక్కపెట్టుకోవద్దని అంటున్నాము. అలాగే కుక్కలు ఏనుగును చూసి మొరుగు తుంటాయట, దూరంగానే ఉండి మొరుగుతుంటాయి. కాళ్లకు దగ్గరగా గానీ, తొండమునకు దగ్గరగా గాని రావు. దూరంగానే మొరుగుతుంటాయి. ఏనుగు దానిని చూసుకుంటే పోతే సమయమంతా వృథా అయిపోతుంది. గంటకు 30 కిలోమీటర్లు నడిచే ఏనుగు ఎందుకు సమయం వృథా చేసుకోవాలి. అందుకే దాని పని అది చేస్తూ ఉంటుంది. ఆ రకంగా కోతులు కిచ కిచ మని అంటాయట ఏనుగును చూసి. ఎందుకంటే మా కొమ్మలు ఎక్కడ విరిచేస్తుందో, మాకు ఎక్కడ స్థలము లేకుండా పోతుందో అని అట్లా కోతులు, కుక్కలు రకరకాలుగా మొరగడం, అరవడం చేస్తూ ఉంటాయి. వాటిని లెక్కపెట్టుకోవట ఏనుగులు ఆ రకంగా మనపని ఏమంటే

మన జ్ఞానాన్ని మనము చెబుతున్నాము. ఈ రోజు ఎంతోమంది నా దగ్గరకు వస్తున్నారు, నా జ్ఞానమంతా మీరు గొప్పగా వింటున్నారు. నాకు అదే సంతోషం, ఎవరో మీది సరైన జ్ఞానము కాదు అంటే నేను ఎందుకు ఇబ్బంది పడాలి? ఇంతమంది అవును అని ఒక్కడు కాదు అంటే నేను ఎందుకు వానిని చూడాలి. నాది అజ్ఞానం అని నేను ఎందుకు అనుకోవాలి. మరి ఇక్కడికి వేలాదిమంది వస్తున్నారు, జ్ఞానం తెలుసుకుంటున్నారు, సంతోష పడుతున్నారు. అలాంటివాళ్ళు మనది తప్పు జ్ఞానం అంటే అది ఎలా నిజమౌతుంది? కాబట్టి వాళ్లు ఎట్లాగైనా అనుకోని మనము చెప్పే జ్ఞానము మనము చెప్పతున్నాము. అది మీ అందరికి బాగా నచ్చుతుంది. తర్వాత వివరంగా అర్థం అవుతుంది. మీకు తెలుసు ఇది ఎలాంటి జ్ఞానము. అంటే ఈ త్రైతసిద్ధాంత జ్ఞానము అంటే ఏమిటో మీకు బాగా తెలిసింది. అట్లే ఈ మధ్యన అంటే 350 సంవత్సరాల క్రితము జ్యోతిష్యము అని కొంత వ్రాశారు, దానికి 'కాలజ్ఞానము' అని పేరు పెట్టి ఆ కాలజ్ఞానములో జరగబోయే విషయల గురించి వ్రాస్తు "ప్రబోధాశ్రమాన్ని" గురించి వ్రాశారు. అది ఇప్పుడిప్పుడు మనకు తెలిసింది. ఆ విషయాలు కొన్ని మీకు కూడా తెలుసు. వాటిని చూసి కొంతమంది ఏమి చేస్తున్నారంటే అవి బ్రహ్మంగారు వ్రాశారు అని ఎందుకు ఒప్పుకోవాలి లేదు వీళ్లంతకు వీళ్లు కావాలని వ్రాశారని అంటున్నారు. కొంతమంది అట్లా కూడా ప్రచారం చేసేవాళ్లు ఉన్నారు. అట్లాంటి వాళ్లు ఉన్నారని దేవుడు ఈ కాలంలో ఇంకొక పద్ధతిని బయటకు తీశాడు. ఇంకొక అతనికి వేరే ఇంకొక అతను ప్రక్కలో నిలబడి చెపుతున్నాడట కనిపించకుండా ఉండి అనేక విషయాలను చెబుతుంటే ఈయన వ్రాసుకుంటూ ఉంటాడట, దేశంలో ఒక భక్తిపరుడు లేదా యోగి అని అంటున్నాము. గతంలో యోగసాధన చేసాడు ఆయన ఒక గొప్ప

వ్యక్తే అనుకుందాము. ఆ వ్యక్తికి ఇంకొక వ్యక్తి జ్ఞానం చెప్పితే ఇతను వింటూ వ్రాసుకుంటున్నాడట. ఆయన ఇప్పటికి అంటే నేను చూసినప్పటికి నలభై నోట్ బుక్స్ వ్రాశాడు. 2006 నుండి 2012 వరకు ఒక నలభై బుక్స్ వ్రాసి పెట్టాడు. చేతి వ్రాత బుక్కులు, అందులో ఎప్పుడు చెప్పారో సమయంతో సహా వ్రాసిపెట్టాడు. ఆ వ్యక్తి చెపుతుంటే ఈయన వ్రాస్తున్నాడు. ఒకవేళ ఈయన వ్రాయలేకపోతే మళ్లీ ఆయన చెప్పుతున్నాడు. ఈయన వ్రాస్తున్నారు, చెప్పే విషయం తప్పిపోయినా ఆ విషయాన్ని తిరిగి చెపుతున్నాడు ఆయన. ఆ రకంగా 40 నోట్ బుక్స్ వ్రాసి పెట్టినాడు ఆయన 40 నోట్‌బుక్స్ నా వద్దకు తీసుకురావడం జరిగింది. నేను చూశాను, మంచి మంచి వాక్యాలు అందులో ఉన్నాయి. భవిష్యత్‌లో బ్రహ్మంగారు చెప్పినట్లు జరగబోయే విషయాలు అందులో కొన్ని ఉన్నాయి. సరే ఆయన ఏమి చేసాడంటే ఈ మధ్యకాలంలో అంటే రెండు మూడు నెలల నుండి కొన్ని వాక్యాలు కనిపించని ఆయన చెబుతుంటే ఈయన వ్రాస్తు ఉన్నాడు. ఆ వాక్యాలను చూస్తే వాటిలో మన పేరు వచ్చింది. ఏది అంటే ప్రబోధానంద స్వామి అని, త్రైతసిద్ధాంతము అని రెండు వాక్యాలు వచ్చాయి. ఈ రెండు పేర్లు ఎట్లా వచ్చాయంటే ఆయనెవరో చెపుతుంటే ఈయన వ్రాశాడు.

ఈయనకు తెలియదు ప్రబోధానంద స్వామి అంటే, కానీ ఏమంటే ఈయన వచ్చిన వాక్యాలు రాశాడు. ఈ వచ్చిన వాక్యాలు రాసిన దాన్ని చూసి ఇక్కడికి వచ్చే వాళ్ళు చూచి, ఈ ప్రబోధానంద స్వామి అంటే మా స్వామివారు, మేము వెళ్లే స్వామే అని చెప్పారన్నమాట. వాళ్లకు పూర్వం ఉన్న పరిచయం వల్ల వాళ్లు అక్కడికి పోయి చూడడం జరిగింది. ఆ వాక్యాలను వీళ్లు గుర్తించడం జరిగింది. ఆ వాక్యాలు ఫలానా వాళ్లవి అని కూడా చెప్పడం జరిగింది. అట్లా వచ్చిన 24 వాక్యాలను పంపించారు,

నేను చూశాను. నిన్న సాయంకాలం కూడ ఒక వాక్యం వచ్చిందని నాకు మెసేజ్ పంపించారు. ఆ వాక్యం ఇప్పుడు నా వద్ద ఉంది. దానిని ఇప్పుడు చదివి చెపుతాను చూడండి. నిన్న సాయంకాలం వచ్చిన వాక్యము చూడండి. "త్రైత ధ్యాన వ్యవస్థ రూపుదిద్దుకోనున్న పరిస్థితి సర్వానికి కలుగనున్నది" త్రైతము అనే పేరు ఇక్కడ బయటకు వచ్చింది. త్రైతసిద్ధాంతము అని వచ్చింది, త్రైతసిద్ధాంత ఆదికర్త అని మా పేరు వచ్చింది త్రైతము అని కూడ వచ్చింది. ఇప్పుడు ఇన్ని పేర్లలో ఉన్న వాక్యాలన్నీ వెలువడ్డాయి. మరి వాళ్ళు ఎట్లా చెపుతున్నారో మాకు తెలియదు కానీ, ఈ పేర్లన్ని వెలువడ్డాయి.

ఇంకా ఎన్ని పేర్లు వస్తాయో మనకు తెలియదు కానీ, వాళ్లు చెప్పేది చూస్తే అది విచిత్రంగా, ప్రత్యేకమైన భాషగా ఉంది మనము మాట్లాడే భాష కాదు. ఆ పదాలు కూడా వేరుగా ఉన్నాయి. ఇందాక చదివినప్పుడు, ఖచ్చితంగా మనం మాట్లాడినట్లు ఉందా? లేదు వేరు రకంగా వాళ్ల భాష ఉంది. అది చూస్తే మన జ్ఞానం కనబడనటువంటి వాళ్లు కూడా గుర్తించి చెప్పుకుంటున్నారు అని మనకు సంతోషం కలుగుతూ ఉంది. అది వాస్తవమే! ఎందుకంటే కనబడని వాళ్లు కూడా ఈ జ్ఞానాన్ని తెలుసుకుంటున్నారని మేము మొదటినుండి చెపుతున్నాము. అది ఎవరి వరకు చేరిందో, ఎంతవరకు చేరిందో మనకు తెలియదుగానీ, చాలా దూర ప్రాంతాలకు చేరింది, చాలా ముఖ్యమైన వాళ్లకు చేరింది. అంత ముఖ్యమైన వాళ్లు, కనబడని వాళ్లు కూడా జ్ఞానం తెలుసుకుంటున్నప్పుడు, మనం జ్ఞానం తెలుసుకోకపోతే ఏమి బాగుంటుంది. కానీ మనం ఏమి అనుకుంటున్నాము అంటే కొంత చదువుతూనే అంతా మనకు తెలుసు అనుకుంటున్నాం, అలా అనుకో కూడదు, ప్రతి గ్రంథాన్ని బాగా పరిశోధన చేయాలి, ప్రతి గ్రంథము లోనూ

క్రొత్త క్రొత్త విషయాలు ఉంటాయి. వాటిని చదివి తెలుసుకోవాలి. ఇప్పుడు మనం గంటసేపు మాట్లాడుకున్నాము. ఇందులో క్రొత్త విషయం ఉందా లేదా? ఉంది, ఎందుకంటే నీవు చదివిన చదువే నీకు అర్థం కాలేదు. అక్షరాల్లోనే జ్ఞానం ఉంది, అక్షరజ్ఞానం అని చెప్పాము మరి ఈ రోజు ఇది ప్రత్యేకంగా తెలియబడిన విషయమే కదా! కానీ నాకైనా ఏమి తెలుసు, నేను ఆనాడు చదువుకున్నాను ఈ చదువు, కానీ నిన్న మొన్నటి వరకు నాకు కూడా తెలియదు ఈ అక్షర జ్ఞానము అయినా మీకు ఈ రోజు చెపుతున్నాను అంటే చెప్పేవాడు వేరు అని చెప్పుచున్నాను. నేను "క" అయితే ఆయన "ఖ" అవుతాడని చెప్పాను కదా! అలాగే నేను రవ్వంత, ఆయన ఎక్కువ. అలాగే ఆయన చెప్పితే నేను చెప్పేవాన్నే గానీ నాకు కూడా స్వయంగా ఏమీ తెలియదు.

ఒకవేళ మీరు స్వయంగా నాకు తెలుసునేమో అని నన్ను అడుగుతారని నేను ఎవరికీ కనబడకుండా దాచి పెట్టుకొని ఉన్నాను. ఎందుకంటే మీరు నన్ను అడిగితే నేను చెప్పలేను కదా! మీరు చిక్కు ప్రశ్నలు నన్ను అడిగితే నేను చెప్పలేను. అప్పుడు మర్యాద పోతుందని, ఉన్న బోధ ఉందనీ ఆయన చెపుతాడు మీ అందరికి, అని నేనే ఎవరికి కనపించకుండా ఉన్నాను. మీకు ఇప్పుడు చెప్పేది కూడా కనబడకుండానే చెపుతున్నాను అనుకోండి. ఎలాగైతే ఏముంది ఈ రకంగా లెక్కాచారానికి క్రొత్త జ్ఞానాన్ని మీకు ఇస్తున్నాను. క్రొత్త జ్ఞానము ఇచ్చామా లేదా చూసుకోండి మీరు మీ ఇంటికి పోయి చూసుకోండి బాగా **అ, ఆ ఇ,ఈ** అక్షర జ్ఞానం ఎంత బాగుందో అని అనుకుంటారు. నేను **"అ"**, అయితే ఆయన **"ఆ"** అయినాడు, నేను **"ఇ"** అయితే ఆయన **"ఈ"** అయినాడు ఒకవేళ నేను **"ఉ"** అయితే ఆయన **"ఊ"** అయినాడు నాకంటే పెద్దోడే అన్ని రకాలుగా అనుకోవచ్చు

కదా మీరు! అట్లాగా ఆ విషయం నాకు కూడా తెలియదు ఇప్పుడు చెప్పి ఉంటే చెపుతున్నాను అంటే అందించేవాడు ఆయన, పలికించేది ఆయన, పైకి కనిపించేది నేను! అంటే ఫలానా ప్రబోధానంద స్వామి చెపుతున్నాడు మాకు అనుకుంటారు. కానీ నేను కాదు అని చెపుతున్నాను. ఒకసారి ఒక వ్యక్తి వచ్చి స్వామి ఉన్నారా? అని అడిగితే స్వామి లేడు అని చెప్పాము. ఆ ప్రక్కనే నేను ఉండి స్వామి లేరు అని చెప్పాము. మరి ఎప్పుడు ఉంటారు స్వామి అంటే ఫలానప్పుడు రండి, ఉపన్యాసం ఉంటుంది, అప్పుడు రా అని చెప్పాము. సరేలే అని ఆ రోజు ప్రత్యేకంగా వచ్చినాడు ఆయన. స్వామీ ఉన్నాడా అంటే ఆ రోజు ఉన్నాడు అని చెప్పాము. ఎక్కడ ఉన్నాడు అంటే నీతో మాట్లాడుతూ ఉన్నాను కదా అన్నాను. మీరే కదా ఆ రోజు మాట్లాడినది, మీరే కదా స్వామి లేరు అని అన్నారు. అవును ఆ రోజు లేడు, ఈ రోజు ఉన్నాడు అని చెప్పాము. అప్పుడు మాట్లాడినది, ఇప్పుడు మాట్లాడినది మీరే కదా అన్నాడు. అప్పుడు మాట్లాడినది మేము కాదు, ఇప్పుడు మాట్లాడేది స్వామి అని ఆ మనిషికి చెప్పాము ఇప్పుడు అడుగు ఏమిటో జవాబు చెపుతాము అన్నాము. ఆ మనిషికి దయ్యామా, మనిషా అర్థం కాలేదు. ఈ రకంగా ప్రతి ఒక్కరిలో మనిషి దయ్యం ఇద్దరూ ఉంటారు.

నీవు మనిషన్నా అనుకో, దయ్యమన్నా అనుకో నీలో ఇద్దరూ ఉన్నారు. కానీ నువ్వు మాట్లాడడము లేదు, ఆయనే మాట్లాడుతున్నాడు. కానీ నీవే మాట్లాడుతున్నానని అనుకుంటున్నావు అదే పెద్ద పొరపాటు, అందుకే బైబిల్‌లో మత్తయి సువార్త 10వ అధ్యాయము, 20వ వచనములో ఏం చెప్పారంటే **"నీవు మాట్లాడే ప్రతి మాట నీ తండ్రియే మాట్లాడుతున్నాడు కానీ మాట్లాడే వానివి నీవు కాదు"** అని చెప్పారు. వాస్తవంగా నీవు కాదు

అని చెప్పారు. ఎక్కడైనా రాజసభలోకి నీవు పోయి విరీక్షించబడి, ప్రశ్నించబడితే అక్కడ ఏమి చెప్పాలని నీవు భయపడవద్ధు, అక్కడ ఏం చెప్పబడాలో అది చెప్పబడుతుందని చెప్పాడు. నీవు చెప్పేవాడివి కాదు అప్పుడు నేను చెపుతాను నీకెందుకు, అప్పుడు ఏమి మాట్లాడాలో ఆయన మాట్లాడుతాడు నీకెందుకు? అని కూడ బైబిల్‌లో చెప్పబడి ఉందన్న మాట. ఈ రకంగా లెక్కేసుకుంటే నీది ఏమీ లేదు, నీవు ఏమీ చేయలేదు, నీవు ఏమి మాట్లాడేవాడివి కాదు అనేది సంపూర్ణంగా మనకు అర్థం అవుతుంది. ఒక వ్యక్తి నేను టిచర్‌ను కదా, నేను చదువు చెప్తేనే కదా పిల్లలకు చదువు వచ్చేది, నేను చెప్పకపోతే ఎవ్వరు వచ్చి చెప్పుతారు ఇక్కడ నేను జీతం తీసుకుంటున్నాను, చదువు చెపుతున్నాను, మీరేమిటి అంతా లేనిపోని తికమక జ్ఞానం చెప్పుతున్నారు. దీనిని జ్ఞానమంటారా ఎవరైనా.

ఈ రకంగా లెక్క ప్రకారం చూసుకుంటే మనకు పూర్వం అక్షరాలు నేర్పించడములోనే, ఈ తెలుగు భాషలో జ్ఞానంతో కూడుకొన్న అక్షరాలను తయారు చేసి, ఆ అక్షరాలను మనకు నేర్పడం జరిగినది. దానినే అక్షర జ్ఞానం అన్నారు. అంటే అక్షరాలను మనకు నేర్పడం జరిగింది, దానినే అక్షరజ్ఞానం అన్నారు, అక్షర జ్ఞానము అంటే ఏమని అర్థం? ఆత్మజ్ఞానము అని అర్థం ఇప్పుడు హెడ్డింగ్ అక్షర జ్ఞానము అని అంటే అక్షరాల జ్ఞానము అని మీరు అనుకున్నారు. కానీ దాని నిజమైన పేరు ఆత్మ జ్ఞానము అని, అంటే నాశనము లేనటువంటి జ్ఞానము అని అర్థము. నీకు అక్షర జ్ఞానము తెలుసునా అంటే ఆత్మజ్ఞానం తెలుసునా అని అర్థం చేసుకోవాలి. ఆత్మజ్ఞానం తెలియకపోతే తెలియదు అని చెప్పాలి. తెలిసి ఉంటే తెలిసింది అని చెప్పాలి. అక్షరజ్ఞానం తెలుసునా అంటే చదువు వచ్చిన వాళ్లంతా నాకు అక్షర జ్ఞానము తెలుసు అంటున్నారు. ఒక చదువు రాని అతనిని అడిగాము నీకు అక్షర

జ్ఞానము తెలుసా అని, అతను నాకు తెలుసు అక్షర జ్ఞానం అని అన్నాడు. అంటే చదువు వచ్చిన వానికి అక్షర జ్ఞానం తెలుసు, చదువు రాని వానికి అక్షరజ్ఞానం తెలుసా అంటే, వాళ్లు అక్షరాలు చిన్నవే, నా అక్షరాలు గట్టివి అంటాడు అతడు. ఎట్లా అంటే వాళ్లు జ్ఞానం లేకుండా ఉత్తగనే చెప్పుకుంటున్నారు.

నాకు జ్ఞానం తెలుసు కాబట్టి, నిజమైన ఆత్మ జ్ఞానం ఉంది అని ఒప్పుకున్నాడు చదువు రాకపోయినా, మిగతావాళ్లకు అది లేదు కాబట్టి వాళ్లకు అక్షరజ్ఞానం లేదు అని చెప్పడం జరిగింది ఈ రకంగా లెక్కేసుకొని వాళ్ల కథ, వీళ్ల కథ మనకు వద్దు కానీ, మన కథ మనం చూసుకుందాము, మనకు అక్షర జ్ఞానం ఉందా అని ప్రశ్న వేసుకుందాం, అంటే ఉంటే ఉంది, లేకుంటే లేదు అనుకుందాం. మీ ఇంటికి పోయి మీ నాన్న గారిని అడగండి, వాళ్లు అక్షరజ్ఞానం లేకుండా ఇన్ని పుస్తకాలు ఎలా చదువుతాం ఇంత చదువు ఎలా చదవాం, అని అంటారు. అప్పుడు మీరు అది అక్షర జ్ఞానం కాదు, అక్షర జ్ఞానం అంటే వేరు, దీర్ఘాలు, పొల్లులు ఎందుకున్నాయి అని అర్థం చేసుకుంటే అది నిజమైన జ్ఞానం అంతే కదా! అట్లాకాకుండా వాళ్లు ఏమి చెప్పితే అది ఊ అని పలికితే పెళ్ళి చేసుకునేటప్పుడు, బాపనయ్యగారు మంత్రం చెప్పినట్లు, ఎట్లా చెప్పితే అట్లా పలికినట్లు చెప్పితే ఎట్లా అవుతుంది. దానికి అర్థం తెలియదు కదా అర్థం తెలిసి చెప్పితే మొదటి వాడు చిన్నవాడు, రెండవ వాడు పెద్దవాడు అని అర్థం అవుతుంది. అట్లే క్రిందకి వస్తే మొదటివాడు మెత్తటి వాడు, రెండవవాడు గట్టివాడు అని తెలుస్తుంది.

ఆ రకంగా దీర్ఘాలు పెట్టినా, ఒత్తులు పెట్టినా ఎట్లా పెట్టినా గానీ రెండవ వాని మీద మీకు ధ్యాస వస్తుంటే ఫరవాలేదు. కానీ రెండవ వాని

మీద ధ్యాస రావడం లేదు. బైబిల్‌లో, ఖురాన్‌లో, భగవద్గీతలో ఎన్నో విధాలుగా చెప్పినా గానీ, బైబిలో చదివినవాళ్లను చూశాను, వాళ్ళు మాట్లాడుకుంటుంటే చాలా సంతోషం అయ్యింది మాకు. ఈ జ్ఞానం కొంత అర్థం అయ్యింది అనే అనుకోవాలి. పూర్తిగా అర్థం కాకపోయినా, కనీసం అర్థం అయ్యే స్థాయికి వాళ్లు వచ్చారు. కొంతమందికి బాగా అర్థం అయ్యింది. ఎవరైతే తండ్రి, కుమారుడు ఉన్నారో, ఎవరైతే ఇక్కడ పనిచేసే వాడు, పని చేయని వాడు ఉన్నాడో వారిలో పని చేయని వాడు తండ్రి, పనిచేసే వాడు కుమారుడు. నాకు తీర్పు తీర్చే అధికారం ఉంది కానీ తీర్పు తీర్చను. నేను ఎవరికి తీర్చలేదు, యోహాన్ సువార్త 5వ అధ్యాయములో 22వ వాక్యం లో ఏముంది. **నేనే ఎవరికీ తీర్పు తీర్చను, కానీ తీర్పు తీర్చే అధికారము నా కుమారునికి ఇచ్చాను. ఆయన తీర్పు తీరుస్తాడు. అంటే ఆయన తీర్చకుండ, ఆయన అధికారాన్ని ఇంకొకరికి ఇచ్చాడు అంటే ఆయన దేవుడే కానీ, ఆయన దూరంగా ఉన్నాడు. ఆయనను ఎవరూ పూజించే దానికి కాకుండా దూరంగా ఉన్నాడు, ఆయన దేవుడే కానీ ఆయన దూరంగా ఉండేవాడు.** నీకు ఒక దేవుడున్నాడు అతన్ని నీవు పూజించాల్సింది, ఆరాధించాల్సింది. ముస్లీమ్‌లకు అదే చెపుతున్నాము. నీవు దేవున్ని ఆరాధిస్తున్నావు. ఆరాధించు, తూర్పు తిరిగి నమాజ్ చేస్తున్నావు. నీవు నీలో ఉండే ఒకే అల్లాహ్‌కే, అంతేకదా! నీ ఎదురుగా ఉండే అల్లాహ్‌కు ఎందుకంటే నీవు ఉన్నావు, అంటే నీ ఎదురుగా అతను ఉన్నాడు. నీప్రక్కనే ఉన్నాడు ఆ అల్లాహ్‌యే కానీ ప్రక్కలోనే కాకుండా, నీ క్రింద, పైనా, చుట్టు ఉండే అల్లాహ్ కూడా ఒకతను ఉన్నాడు. కాబట్టి ఆ అల్లాహ్‌ను విడిచిపెట్టి నీవు ఉన్నావు అంటే క, ఖ ను చదివి మిగతాది విడిచిపెట్టినట్లే ఎ, ఏ ను చదువుకొని ఐ ను విడిచి పెట్టినట్లే ఒ ఓ ను చదువుకొని ఔ ను

విడిచిపెట్టినట్లే అంటే పూర్తి అక్షరాలు నేర్చుకోనట్లే. పూర్తి మూడు విషయాలు నీవు ఎప్పుడైతే నేర్చుకున్నావో, ఈ మూడు అక్షరాలు నీకు అర్థం అయి ఉండాలి.

ఈ రకంగా లెక్కేసుకుంటే, నేను ఫలానా అనుకోకుండా, నేను ఫలానా అయితే దానికి తోక కూడా ఆయన ఉన్నాడు. పెద్దగా, నేను రవ్వంత ఉంటే ఆయన గట్టిగా పలికేవాడు ఒకడున్నాడు, నేను చిన్నాయప్ప అయితే ఆయన పెద్దాయప్ప ఉన్నాడు ఒకాయన అని జ్ఞాపకం ఉంచుకోవాలి. నేను ఒక్కడినే కాదు నా శరీరంలో నాకంటే పెద్ద ఒకాయన ఉన్నాడు, ఆయనే ప్రతి పని చేస్తున్నాడు, నేను నిద్రపోయేవాడిని కాదు, కునుకు రాదు నాకు, అంటే ఆహర్నిషలు శ్వాసను ఆడిస్తున్నాను. ఏమాత్రము నిన్ను రక్షించడములో అలసిపోను, నిన్ను బతికించడంలో, నీ ఊపిరి ఆడించడం, నీ గుండెను ఆడించడంలో, 24 గంటలు ఆడించేటట్లుగా చేసి అలసి పోకుండా పని చేస్తున్నాను. ఆ విధంగా అలసిపోకుండా పని చేసేవాడినే నీవు ఆరాధించాలి, ఆయనే నీకు అల్లాహ్ ఏమి పని చేయకుండా, చూసుకుంటూ ఉండేటాయన ఒకయన ఉన్నాడు, ఆయనను కూడా అల్లాహ్‌యే అనాలి. ఈ విధంగా ఇద్దరిని అల్లాహ్ అనాలి కానీ నీవు ఆరాధించాల్సింది ఒక అల్లాహ్‌నే, ఇద్దరిని ఆరాధించమని చెప్పలేదే నేను. లెక్క ప్రకారం ఇద్దరు ఉన్నారని చెప్పాను. కానీ మ్రొక్కమని చెప్పేది ఒక్కరికే కదా, మరి అది ఎందుకు అర్థం కాలేదు. ఆ గ్రంథములో కూడా ఉన్నది అదే కదా! అలానే లేదు మా గ్రంథములో, మా మతం ప్రకారం ఉండేది ఒక్కడే, ఏకైక అల్లాహ్. ఆ ఏకైక అల్లాహ్‌ను పుట్టించినటువంటి వానిని పుట్టించినవాడు ఎవడు ఒ, ఓ చెప్పేవానివి ఔ చెప్పవా నీవు. అందుకే అక్షరజ్ఞానం కావాలి మీకు, ఒ, ఓ, ఔ అంటే ఎ, ఏ, ఐ అంటే ముగ్గురు

ఉన్నారని లెక్క, మరి అం అః అంటే వాళ్ళు ఇద్దరు ఒకటే అని లెక్క, ఎట్లుంటే వాళ్ళు తండ్రి, కుమారుడు అని అర్థం. అర్థమయ్యిందా అం, అ: అంటే, మరి మీ దాంట్లో ఎక్కడా లేదు కదా అం, అ: అనేది, కానీ తెలుగు అక్షరాలలో ఉంది. తెలుగు అక్షరాలు మనకు జ్ఞానం బోధించినాయి, అంటే ఆ ప్రక్కన రెండు సున్నాలు ఉండేది ఒకటుంది. అది పరమాత్మ, అట్లే ఒక సున్నా ఉండేది ఉంది. అది ఆత్మ, అట్లే ఏ సున్నా లేకుండా, ఉత్త ఆత్మ ఉంది అది జీవాత్మ, అ అంటే జీవాత్మ, అం అంటే ఆత్మ, అః అంటే పరమాత్మ ఇప్పుడు అర్థం అయ్యిందా. అక్షర జ్ఞానం, ఇది నిజమైన అక్షర జ్ఞానం. మరి టీచర్లు చాలామంది ఉన్నారు. మీకు అర్థం అయి ఉండవచ్చు గానీ అందుకే నాకు మాత్రం ఇంతకుమందు అర్థంకాలేదు. నాకు నిన్ననే అర్థం అయ్యింది, ఈ రోజు చెపుతున్నాను మీకు ఇంటికి పోయి చెప్పుకోండి మీ పిల్లలకు ఈ సమావేశము ఇంతటితో ముగిసింది, ఓం తత్సత్!

## 88. జ్ఞానము దగ్గర జాగ్రత్త !

**(తేది: 10-08-2014)**

ఈ దినము సభ తర్వాత కృష్ణాష్టమి వస్తుంది. ప్రతి సంవత్సరము కృష్ణాష్టమి ఇక్కడ బాగా జరుపుకొనేవాళ్ళము. కానీ ఈ సంవత్సరము ఇక్కడ జరుపుకోకుండా, ప్రతి ఊర్లోను జరుపుకొనేటట్లుగా ఏర్పాటు చేశాము. ఇప్పటికి 50, 60 ఊర్లలో కృష్ణాష్టమి చేసే విధానంగా ప్రత్యేకంగా వాళ్ళతో చేయిస్తున్నాము. ఇంతకుముందు చేయనివాళ్ళతో కూడా చేయిస్తున్నాము. అది కృష్ణుడు మనకు జ్ఞానము తెలియజేశాడు అనే ఉద్దేశ్యముతో, ఆయన

గౌరవార్థము ఈ పండుగ చేస్తున్నాము తప్ప మరొక ఆలోచనగానీ, ఉద్దేశ్యము గానీ మనకు లేదు. దేవుడు భగవంతునిగా వచ్చి జ్ఞానాన్ని తెలియజేసిన సందర్భము ఒకటి ఉంది. దానికి గుర్తుగా మనము ఆ రకంగా వచ్చింది భగవంతుడే, కృష్ణుడు అనే ఉద్దేశ్యముతో మనము కృష్ణాష్ఠమి జరుపుకోవడము జరుగుతుంది. కానీ ఇక్కడ దేవునిగా కాకుండా, కృష్ణున్ని భగవంతునిగా మాత్రమే మనము లెక్కించి, ఆయన ప్రతిమ పెట్టుకొని మనము ఊరేగింపు చేయడంగానీ, పదిమందికి తెలియజేయడంగానీ జరుగుతుంది. కానీ మనము శాస్త్రబద్ధంగా మాట్లాడితే దేవున్ని దేవుడే అనాలి, భగవంతున్ని భగవంతుడే అనాలి. దేవున్ని భగవంతుడు అనిగాని, భగవంతున్ని దేవుడని గానీ అనకూడదు.

కానీ ఈ సమాజము ఈ రోజు ఎట్లా అయిపోయిందంటే, దేవుడంటే అర్థం తెలియదు, భగవంతుడు అంటే అర్థం తెలియదు. దేవుడు అని చెప్పవలసిన చోట భగవంతుడని, భగవంతుడని చెప్పవలసిన చోట దేవుడని అంటున్నారు. ఇప్పుడు నేను చెప్పేది సామాన్య ప్రజల విషయంకాదు, బాగా జ్ఞానం తెలిసిన పెద్దలే ఈ విధంగా చెప్పడం జరుగుతుంది. జ్ఞానం ఎవరికి తెలుసు అంటే, దీనికి ఒక కొలతలేదు, ఒక పరీక్ష లేదు, ఏమీ లేదు అన్నమాట. ఎవరంతకు వాళ్ళు మాకు జ్ఞానం బాగా తెలుసు అనుకుంటున్నారు. నేనే గొప్ప జ్ఞానిని, అన్ని మార్కులు నాకున్నాయి అని అనుకుంటున్నారు. దీనికి ఒక పరీక్ష అంటూ ఉండి, దీనికి ఒక పెద్ద అంటూ ఉండి, వీడు ఉత్తీర్ణుడు వీడు అనుత్తీర్ణుడు, వీడు జ్ఞాని, వీడు అజ్ఞాని అని చెప్పే విధానం ఇందులో లేదు. కానీ దేవునికి తెలుసు ఎవరు అజ్ఞాని అని, కానీ దేవుడు ప్రత్యక్షంగా ఏమీ చెప్పడు కదా! అట్లే ఆయన ప్రత్యక్షంగా ఏమీ చెయ్యకుండా, ఆత్మ రూపంలో ఉండి చేస్తుంటాడు. ఆయన

ఏం చేయాలో ఆయన చేస్తుంటాడు. ఎవ్వరిని జ్ఞానానికి దగ్గరగా చేర్చాలో వారిని జ్ఞానానికి దగ్గరగా చేరుస్తాడు. అట్లే ఎవరిని జ్ఞానమునకు దూరంగా చేర్చాలో వారిని దూరంగా పంపిస్తాడు. అది కాలక్రమేపీ జరుగుతుంది. కాలమే జవాబు చెబుతుంది. కానీ మనం ఏమి చేస్తున్నామంటే మేము జ్ఞానులమే, మేము చేసేదంతా మంచి పనే అనుకుంటాము. ఎవరు చేసేది వాళ్ళకు మంచి పనిగానే అనిపిస్తుంది వాని పనిని వాడు సమర్థించు కుంటాడు. కానీ మనం చేసే పనిని మనం సమర్థించుకున్నా గానీ, దీనిని ఒక శాస్త్రపద్ధతితో పోలిస్తే, ఇది సరియైనదా, కాదా అని తెలుస్తుంది. కానీ ఆ రకంగా ఎవ్వరూ ఆలోచన చేయడం లేదు.

శాస్త్రీయంగా ఆలోచన చేయుటకు మనకు ఒక శాస్త్రమంటూ ఉంది. అదే దేవుడు చెప్పిన శాస్త్రము. దానిని బ్రహ్మావిద్యా శాస్త్రము అంటాము. దానినే పెద్ద శాస్త్రము, ధర్మశాస్త్రము అని కూడా అంటాము. మరి ఈ ధర్మశాస్త్రము ఏదైతే ఉందో, బ్రహ్మ విద్యా శాస్త్రము ఎదైతే ఉందో దానిప్రకారము కొలత వేసి మనం చేసే పనిని లెక్కించాలి. ఉదా: దేవుడు భగవద్గీతలో బాహ్యయజ్ఞములు సరియైనవి కావు, అంతరముఖంగా చేసే యజ్ఞాలే సరియైనవి అని చెప్పాడు. బాహ్య యజ్ఞములు అధర్మములతో కూడియున్నవి అని చెప్పాడు. ఈ విషయాన్ని మనం స్వంతంగా చెప్పలేదు భగవద్గీతలో చెప్పిన శ్లోకాలే ఇక్కడ ఉన్నాయి అని చెప్పి **యజ్ఞములవలన గానీ, దానముల వలన గానీ, తపస్సుల వలన గానీ, వేదాధ్యయనముల వలనగానీ దేవుడు తెలియబడడు.** అవి ధర్మాలు కాదు, అధర్మాలు అని పై శ్లోకాల ఆధారంగా మనం చెప్పాము. ఇది మేము స్వంతంగా చెప్పిన విషయం కాదు. దేవుడు చెప్పిన విషయమే మేము ఇక్కడ చెప్పాము. మరి హిందువులుగా ఉన్నవాళ్ళు దేవుడు చెప్పిన విషయాలను ఒప్పు

కోకుండా, వాళ్ళకు ఇష్టము వచ్చినట్లు వాళ్ళు, ఇవే యజ్ఞాలు, మేము బయట చేసేవే యజ్ఞాలు, మేము బయట చేసే యజ్ఞాలను మీరు కాదు అంటున్నారు.

కాబట్టి మీరు వేరే మతస్తులు అని మనల్ని అంటున్నారు. మరి కృష్ణుడు చెప్పిన మాటలను నేను చెప్పినందువలన నేను వేరే మతస్తున్ని అయితే, మరి కృష్ణుడు ఏ మతస్తుడు కావాలి, కృష్ణుడు కూడా వేరే మతస్తుడు కావాలా? సమాజంలో మనమే సరియైనవారమా, ఇతరులు సరియైన వారు కాదా! జ్ఞానం చెప్పిన దేవుడు కూడా సరియైనవాడు కాదు అనే లెక్కలోనికి వచ్చారు. దొంగకు దొంగ చింత, వేశ్యకు వేశ్య చింత అన్నట్లు ఎవరి చింత వారికి ఉంటుంది. ఇట్లా వారివారి మనోభావము వారిది, వీని మనోభావము వీనిది. కానీ మీరు చేసే పని చట్టవిరుద్ధము అని చెప్పినాము అనుకోండి, మరి చట్టవిరుద్ధము అయినప్పుడు దొంగ ఏమి చేస్తాడంటే నా మనోభావాలు దెబ్బ తింటున్నాయి, మొదటి నుండి మా తాత దొంగతనము చేసేవాడు, మా నాన్న దొంగతనము చేసేవాడు, నేను దొంగతనము చేసేవాడిని. ఇప్పుడు వద్దంటే ఎట్లా మా మనోభావాలు దెబ్బతింటాయి అని అంటాడు. అతని మనోభావాలు చాలా ఉండవచ్చు కానీ దానికి ఒక చట్టం ఉంది కదా! అట్లే మా అవ్వ వేశ్యగా ఉండేది, మా అమ్మ వేశ్యగా ఉండేది, నేను వేశ్యగానే ఉంటాను అని అంటే, చట్టం ఒప్పుకోవాలి కదా! మనకు ఒక చట్టం అంటూ ఉంది. ఆ లెక్కప్రకారం మనం కరెక్టా! కాదా!! అని చూసుకోవాలి. ఆ లెక్కగానే మనము జ్ఞానములోకి వస్తే, మనము సక్రమంగా ఉన్నామా లేదా మనం చేసే పని సరియైనదేనా కాదా అని చూసుకోవడానికి ఒక శాస్త్రీయతను వాడుకుంటున్నాము. అదే బ్రహ్మవిద్యా శాస్త్రము. ఈ శాస్త్రము ప్రకారము మనము చేసేది సరియైనదా,

కాదా అని తెలిసిపోతుంది. దానిప్రకారం లెక్కేసి యజ్ఞాలు చేయడం సరియైనదా, కాదా అని చూస్తే భగవద్గీతలోని విశ్వరూపసందర్శన యోగం 48, 53 శ్లోకాల లోను, అక్షర పరబ్రహ్మ యోగములోని 28వ శ్లోకములోను ఈ విషయాన్ని చెప్పడం జరిగింది.

అక్షర పరబ్రహ్మ యోగములో ఏమి చెప్పినారు, ఈ యోగాన్ని తెలుసుకొనేవారు ఎవరైతే ఉన్నారో వారు వేదముల అధ్యయణము వలన, దానముల వలన, యజ్ఞముల వలన, తపస్సుల వలన వచ్చే పుణ్యఫలాన్ని అతిక్రమించి, దానిని దాటి నా వరకు చేరుతాడు అంటే మోక్షాన్ని చేరుతాడు. పై వాటినన్ని అతిక్రమించినటువంటివాడు అవుతాడు, వాటితో సంబంధం లేనివాడు అవుతాడు. అంటే పైవాటివల్ల ఏమి వస్తావుంది పుణ్యం వస్తావుంది అని అక్కడ చెప్పారు. పుణ్యం వస్తే ఏమవుతుంది, దానిని సుఖాల రూపంలో అనుభవించడానికి మళ్ళీ పుట్టాల్సివస్తుంది. ఆ సుఖాలు ఏ రూపంలో, ఏ రకంగా ఉంటాయో తెలియదు కానీ, వాటిని అనుభవించాల్సిందే. దానినే సుకర్మ లేదా మంచికర్మ అంటాము. పాపాన్ని చెడ్డకర్మ అంటాము ఇట్లా పై వాటివల్ల పుణ్యం వస్తుందని చెప్పినాడు గానీ, దేవుడు తెలుస్తాడు అని గానీ, జ్ఞానము తెలుస్తుంది అనిగానీ చెప్పినాడా? మోక్షానికి పోవచ్చని చెప్పినాడా? చెప్పలేదు. మరి హిందువులుగా పేరు పెట్టుకున్న వాళ్ళందరూ, మీరు యజ్ఞాలు చేయవద్దు అని మేము చెప్పటం లేదు. చెయ్యి పుణ్యం వస్తుంది నీకు. కానీ దేవుడు తెలియాలంటే అవి పనికిరావు. కొంతమంది ఏమంటున్నారంటే, మీరు యజ్ఞాల గురించి వ్రాస్తూ యజ్ఞాలు లోపలే జరుగుతున్నాయి, బయట యజ్ఞాలు లేవు అంటున్నారు. కాబట్టి మీరు హిందువులే కాదు అని అంటున్నారు. వాళ్ళు చేసే తప్పుడు పనికి మేము గురువులుగా ఉండి, జ్ఞానులుగా ఉండి విరుద్ధంగా మాట్లాడితే, విరుద్ధంగా

మాట్లాడకూడదట, దేవుడు చెప్పిన విషయాలు చెప్పకూడదట. భగవద్గీతను చెప్పకుండా మూసిపెట్టుకోవాలా? వారు చెప్పినట్లు అజ్ఞానము చెప్పితే సక్రమమైన వాళ్ళు, లేకపోతే సక్రమమైనవాళ్ళు కాదా! చూడండి ఇది ఎట్లా ఉందో, ఈ మధ్యన మూడు రోజుల క్రితము మన ప్రచారవాహనము భువనగిరికి పోయింది. హిందువులలో ఎవ్వరూ చేయని పనిని మనము చేస్తున్నాము. ప్రతి ఇంటికి మనవాళ్ళను పంపించి, హిందువులుగా ఉన్న వాళ్ళు జ్ఞానం తెలుసుకోండి అని, **“దేవాలయ రహస్యాలు”** తెలుసుకోండి, **“ఇందూ సాంప్రదాయాలు”** తెలుసుకోండి అని 100 గ్రంథాలను ప్రచారము చేశారు. ఈ విధంగా 100 గ్రంథాలను మనము ప్రచారం చేస్తున్నాము. దాంట్లో **“ఇందువు క్రైస్తవుడా”** అనే గ్రంథము కూడా ఉంది. **“మతమార్పిడి మహా పాపము, దైవ ద్రోహము”** అని కూడా ఉంది.

ఇట్లా ఉన్నాగానీ మీరు క్రైస్తవులు, హిందువుల ముసుగులో క్రైస్తవాన్ని ప్రచారము చేస్తున్నారు అని అనడం సమంజసమేనా? అని అడుగుతున్నాను. ఇది భువనగిరి వాసులకు సూటిగా నేను వేసే ప్రశ్న. వాళ్ళకేకాక ఈ విధంగా ఎక్కడైనా, ఎవరైనా మాట్లాడేవాళ్ళు ఉంటే వాళ్ళందరికి బహిరంగంగా నేను చెపుతున్నాను. మేము వ్రాసిన 100 గ్రంథాలలో ఏ గ్రంథములో గానీ ఒక మతాన్ని గురించి ఇది మంచిది, ఇది మంచిది కాదు అని మేము చెప్పినట్లు మీరు చూపిస్తే నేను 10,00,000/ (పది లక్షలు) మీకు బహుమతిగా ఇస్తాను. ఫలానా గ్రంథములో మీరు మతాన్ని సమర్థించారు అని చూపించండి, మీకు పై బహుమతి నేనిస్తాను. దేవుడు చెప్పిన విషయాన్నే నేను మీకు రేకెత్తించి చెపుతున్నాను కానీ, నేనేమీ స్వయంగా చెప్పలేదు, ఒక మతాన్ని గురించి స్వయంగా ఎక్కడా చెప్పలేదు. మేము చెప్పిన గ్రంథాలలో మూడు మతాల్లో ఉండే గ్రంథాల గురించి మేం

చెప్పాము. ఏ గ్రంథాన్ని మేము తక్కువ చేయలేదు, ఇస్లాం మతంలో ఉండే పవిత్ర ఖురాన్ గ్రంథము గురించి నేను చెప్పలేదా! బైబిల్‌లోని వాక్యాలను చెప్పలేదా! భగవద్గీతలోని విషయాలను కూడా చెప్పలేదా! చెప్పాము. మూడు గ్రంథాల విషయాలను చెప్పాము. కానీ ఇక్కడేమంటే తెలివి తక్కువవాళ్ళకు, అర్థంకాని విషయం ఉంది. హిందూమతములోనే అద్వైతము ఉంది. విశిష్టాద్వైతము, ద్వైతము ఉందనే విషయం తెలియనివాళ్ళకు త్రైతము కూడా ఉందని ఎట్లా తెలుస్తుంది. అద్వైతము ఒకటి, ద్వైతము రెండు అన్నప్పుడు, త్రైతము మూడవది ఎందుకు ఉండకూడదు. ఎప్పుడైతే త్రైత సిద్ధాంతము అని ఉంటే అది క్రైస్తవులది అంటున్నారు. వీళ్ళకు అంతే అర్థం అయ్యేది. ఇంతకంటే ఎక్కువ అర్థం కాదు, జ్ఞానం తెలియదు. ఈ రోజు హిందూ మతము నాశనమైపోతా ఉంది అంటే, మరిపోదా, మీకు ఒక ముక్క కూడా జ్ఞానం తెలియదు. మరి నాశనంకాక ఏమవుతుంది చెప్పండి. ట్రినిటీ అనేది ఒకటి క్రైస్తవములో ఉంది. వాళ్ళు ఏమన్నా చెప్పుకోని, త్రైతసిద్ధాంతము అని మనము ఇక్కడ చెపుతున్నాము.

అద్వైత సిద్ధాంతము ఏ రకంగా ఉందో, ద్వైత సిద్ధాంతము ఏ రకంగా హిందూమతములో ఉన్నాయో, ఆ రకంగానే త్రైతసిద్ధాంతము కూడా ఉంది. ఇప్పుడు ఈ సిద్ధాంతము పుట్టింది, సిద్ధాంతకర్తగా కూడా మేము ప్రత్యక్షంగా ఇక్కడ ఉన్నాము. మీకు ఏమన్నా అనుమానము వస్తే మా వద్దకు రండి అడగండి, గ్రుడ్డిగా మాట్లాడటమేనా? ఈ రకంగా మీరు గ్రుడ్డిగా మాట్లాడినారనుకోండి, దానివల్ల ఏమొస్తుంది, కనిపించకుండా ఒక ఫలితం వస్తుంది. దానిని కర్మ ఫలితము అంటాము. అది భయంకర మైనది. దేవుని విషయంలో జోక్యం చేసుకొని వ్యతిరేఖముగా మాట్లాడినారా, అది మాత్రం తిరుగులేని పాపం అవుతుంది. ప్రపంచ విషయంలో జోక్యం

చేసుకుంటే ఏమవుతుంది, పాపం వస్తుంది, అది అనుభవిస్తే పోతుంది. ఒక గంటో, రెండు గంటలో కానీ ఇది మాత్రము ఒక్కసారి అనుభవిస్తే పోదు, జన్మ జన్మకు అనుభవించాల్సి ఉంటుంది. అనేక జన్మలలో అనుభవించాల్సి వస్తుంది. దేవునికి దయలేదా అంటే ఎందుకు ఉంటుంది. దయలేని వాడే దేవుడు. దయ ఉన్నాయన దేవుడు కాదు, దయ ఉన్న వాళ్ళు మనుష్యులు. పై విధంగా చేసిన వాళ్ళకు శిక్షపడుతుంది. ఒకసారి భయంకరమైన ప్రమాదం జరిగి చనిపోతారు అప్పుడేమంటాము, ఏమి పాపం చేసుకొన్నామో అంటే అప్పుడు ఎట్లా తెలుస్తుంది ఏమి చేశామో, పోయిన జన్మలోది, ఈ జన్మలో జ్ఞాపకం ఉంటుందా అంటే అది ఏమాత్రముండదు. మహబూబ్‌నగర్‌లో మనం జ్ఞానప్రచారం చేస్తుంటే, మా ఊర్లో జ్ఞానప్రచారం చెయ్యొద్దండి అని కొందరు చెప్పారు.

అదే మహబూబ్‌నగర్ విషయంలోకి పోతే ఒకతను భగవద్గీతను తీసుకొని చదివి, ఈ జ్ఞానము బాగుంది అని 10 భగవద్గీతలు తీసుకొని, చదవండి అని ఆయన పంచుకున్నాడు. చూడండి ఎలా ఉందో లోకం. మరి ఆయన హిందువే, ఈయన హిందువే. ఆయన చదివి ఇతరులు కూడా తెలుసుకునే విధంగా గ్రంథాలను పంచినాడు. మరి ఆ రకంగా మీరు ఎందుకు చదవలేక పోయారు. చదవకుండా మీ ఇష్టము వచ్చినట్లుగా ఇది జ్ఞానము కాదు, అంటే ఏమవుతుంది జ్ఞానాన్ని ఇది జ్ఞానము కాదు అంటే ఏమవుతుంది భయంకరమైన పాపము అవుతుంది. మా ఇష్టం వచ్చినట్లుగా మేము చేస్తాము, మా ఇష్టం వచ్చినట్లుగా జరుగుతుంది. అంటే ఇది వాస్తవమే ఈ రకంగా చేయించేవాడు కూడా దేవుడే మీకు జ్ఞానం తెలియకూడదని ముందే దేవుడు నిర్ణయించియున్నాడు. మీరు జ్ఞానము తెలుసుకోవడము దేవునికి ఇష్టము లేదు. కాబట్టి మీలో ఆ రకమైన బుద్ధి

పుట్టించి, మా కొద్దు జ్ఞానం అని చెప్పించాడు. అందువల్ల మీరు ఆ రకంగా మాట్లాడినారు కానీ అదీ కూడా దేవుడే చేయించాడని మీకు తెలియదు కాబట్టి, మేమే చేశాము అని అనుకుంటున్నారు. కాబట్టి మీకు భయంకరమైన పాపం వస్తుంది. తప్పనిసరిగా వస్తుంది. మీరు చేసిన ఆరోపణకు, ఇది జ్ఞానం కాదు, ఇది ఇతర మతాలకు సంబంధించి అని అంటుంటే, భగవద్గీత ఎక్కడయినా క్రైస్తవ మతమునకు సంబంధించి ఉంటుందా? త్రైత సిద్ధాంత భగవద్గీత అని పేరు పెట్టి మీకు ఇస్తే అది క్రైస్తవులకు సంబంధించిందా? బుద్ధి ఉన్నవాడు మాట్లాడవలసిన మాటలేనా ఇవి?

ఆదిశంకరాచార్యుడు అద్వైతసిద్ధాంతము మీద భగవద్గీత వ్రాశాడు దానికి అద్వైత సిద్ధాంతము అని పేరులేదు కానీ, అద్వైతమే అది. ఆదిశంకరాచార్యులు ఎక్కడ చెప్పినా అద్వైత సిద్ధాంతమే. శంకర భాష్యము అని ఒక భగవద్గీత ఉంది. వాళ్ళ చేతనైనంత వాళ్ళు భగవద్గీతను చెప్పినారు మంచిగానే, మరి ఆ భగవద్గీతను ఏమీ అనటం లేదు. కారణమేమిటి, త్రైతసిద్ధాంత భగవద్గీత అంటే ఇది భగవద్గీత కదా, దీని గురించి మాట్లాడటము ఎందుకు? భగవద్గీత ఏమైనా వేరు మతాన్ని బోధిస్తావుందా. సరే ఎక్కడైనా హిందూమతము అనే పేరునైనా ఎక్కడైనా అది చెప్పిందా, లేదు హిందూమతము అనే పేరు కూడా పెట్టి చెప్పలేదు. సర్వమానవులకు వర్తించే జ్ఞానము అది. అందరికి పనికివచ్చేది, అర్జునుడు బాధపడినట్లుగా, మీరు బాధపడటం లేదా? ఏ మతస్థుడైనా బాధపడుతున్నాడు కదా! ఆ బాధలకు నివారణగా చెప్పినటువంటిది భగవద్గీత. కానీ అర్థం కాలేదు ఈ మనుష్యులకు. అర్థం కాకుండా ఇష్టం వచ్చినట్లు మాట్లాడితే ఏమవుతుంది, అంటే అజ్ఞానము అవుతుంది. దేవుని జ్ఞానానికి నీవు ఆటంకం

కలుగజేసినవాడివి అవుతావు. ప్రపంచ విషయాలలో ఆటంకం కలుగజేస్తే పాపం వస్తుంది. అది అనుభవిస్తే పోతుంది. కానీ దేవుని జ్ఞానానికి ఆటంకం కలిగిస్తే భయంకరమైన పాపం వస్తుంది. అదే క్షమించరాని పాపము. క్షమించబడదు, అది రెండు యుగాల పర్యంతం అనుభవించాల్సి వస్తుంది. ఒక జన్మకాదు, రెండు జన్మలు కాదు, రెండు యుగాలు అంటే ఎన్ని జన్మలు ఉంటాయో చూసుకోండి.

ఆ రకంగా అనుభవించాల్సిన పని వస్తుంది. అనవసరంగా గాలికి పొయ్యేదానిని నెత్తిన వేసుకొని, భయంకరమైన పాపాలను అనుభవిస్తున్నారు. మరి అది మీకు కనబడలేదు. ఎట్లా అనుభవానికి వస్తున్నాయో, ఎట్లా శిక్షలు పడుతున్నాయో మీకు కనబడలేదు. ఈ రోజు ఇరాక్‌లో యుద్ధము జరుగుతావుంది. అనవసరంగా కాల్చుకొని చనిపోతావున్నారు. అనవసరంగా బాంబులు వేసుకొని చనిపోతున్నారు. ఏమి పాపం చేశారో అంటే, ఏమి పాపం చేసింది ప్రస్తుతానికి మనకు తెలియదు. ఇంతకు ముందు పాపం చేసి ఉంటేనే అక్కడికి పోయి ఉండేది. ఇంతకుముందే చెప్పినాను నేను. నిన్న బస్సు, రైలు ముందర కొట్టుకొని గుద్దుకొంది, విమానాన్ని తీసుకొని వెళ్ళి గుద్దిచ్చింది, నెలకు తర్వాత పైన ఉండే విమానాన్ని క్రింది నుండి కాల్చితే అది మొత్తం పోయింది. ఇట్లా ఒకటి కాదు రెండు కాదు ప్రతి దినము భయంకరమైన సన్నివేశాలు ఎన్నో జరుగుతున్నాయి. వీటన్నిటికి కారణం వెనక ఏదో ఉంటుంది. తప్పులేనిది శిక్షపడదు, ఆ శిక్షపడింది అంటే ఫలితం ఉంటుంది. కానీ ప్రపంచ సంబంధమైనది అయితే ఆ ఒక్క శిక్షతో అయిపోతుంది. కానీ దైవిక సంబంధమైనదైతే ఆ ఒక్క శిక్షతో అయిపోదు, జన్మ జన్మలకు శిక్ష ఉంటుంది. ఈ విధంగా రెండు యుగాల పర్యంతం ఉంటుంది. మరి ఈ విషయాన్ని మరిచిపోకూడదు, అర్థమయ్యిందా!

ఇప్పుడు అంత గ్రుడ్డిగా త్రైత సిద్ధాంతము అనగానే అది క్రైస్తవ మతమునకు సంబంధించింది అనడం తప్పు అవుతుంది. "మీరు యజ్ఞాలను గూర్చి వ్రాశారు. మేము యజ్ఞాలు చేసే వాళ్ళము. మాకు చిన్నతనం అయ్యింది, మా మనోభావాలు దెబ్బతిన్నాయి" అంటే, నీ మనోభావాలను కృష్ణుడే దెబ్బతీసినాడు, మేము తీసింది ఏముంది. కృష్ణుడు ఆ రోజే చెప్పినాడు. భగవద్గీతను చదువు ఏమి చెప్పినాడో విశ్వరూపసందర్శనము 48, 53 శ్లోకాలలో మరి అక్కడ చెప్పిన జ్ఞానము ఎవరికైనా అర్థం అవుతుంది. ఆ రోజు కృష్ణుడు చెప్పడమే కాకుండా, కృష్ణునికంటే ముందు అంటే కృష్ణుడు చెప్పింది ద్వాపరయుగం చివరిలో, కానీ త్రేతాయుగంలో అంటే ద్వాపర యుగంకంటే ముందు యుగంలో, రావణబ్రహ్మ అని ఒకాయన ఉన్నాడు. ఆయన త్రికాల జ్ఞాని, బ్రహ్మజ్ఞాని, ప్రపంచములోనే గొప్ప జ్ఞాని. ఆ రోజుల్లో ప్రపంచములోనే ఉత్తమమైన జ్ఞాని ఆయన. అంటే పెద్ద జ్ఞాని, అంతపెద్ద జ్ఞాని కూడా ఈ యజ్ఞాలు మంచివి కావు అని ఆయన ధ్వంసం చేయించాడు ఆ రోజుల్లో నేను చెప్పేదేంటి, వాళ్ళు ఆ రోజు చేసినారు కదా! మరి ఆ రోజు చెప్పిన వాళ్ళదేముంది. వాళ్ళను రాక్షసులను చేస్తిరి. ఇంకా వేరే వాళ్ళందరిని కోతులను చేస్తిరి, ఒకరినైతే ఎలుగుబంటిని చేసినారు. ఇట్లా చేసి రామాయణమంతా గందరగోళము చేసి, మనుష్యులను జంతువులలోకి చేర్చి మీ ఇష్టం వచ్చినట్లుగా మీరు వ్రాసుకున్నారు. అది ఎవరూ అడిగే వాళ్ళులేరు. మేము చెప్పేదే వేదం అంటున్నారు. సరే ఎట్లన్నాపోని ఇప్పుడు కూడా అవే యజ్ఞాలు, అవే యాగాలు కొనసాగిస్తున్నారనే ఉద్దేశ్యంతో ద్వాపర యుగంలో కొనసాగించ లేదా? కొనసాగించినప్పుడు ఏమి చెప్పినాడు, అధర్మాలు చెలరేగి పోయినాయి, ధర్మాలకు ఆటంకం కలిగింది గ్లాని ఏర్పడింది. కాబట్టి

నేను తిరిగి వచ్చి ధర్మాలను నెలకొల్పుతున్నాను అని కృష్ణుడు చెప్పాడు. ఎంతోమంది మహర్షులు ఉన్నారు. ఎక్కడ చూసినా యజ్ఞాలు చేస్తున్నారు. మరి కృష్ణుడు ధర్మాలు అధర్మాలుగా మారిపోయినాయి అంటున్నాడు కదా! ఇప్పటి కాలముకంటే అప్పటికాలమే మేలు అని మీరు అనుకుంటుండవచ్చు. అంటే దేవుడు ఏమి చెప్పినాడంటే ఇవన్నీ అధర్మాల పనులు చేస్తున్నారు. అజ్ఞానపు పనులు చేస్తున్నారు. ఇవన్నీ ఎక్కువై పోయినాయి అని ఆ రోజు ఏం చేసినాడు, ఆయన తిరిగి జ్ఞానం చెప్పడం జరిగింది.

జ్ఞానం చెప్పినప్పుడు ఈ శ్లోకాలు చెప్పినాడు. **వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ, దానేషు** అని విడివిడిగా చెప్పినాడు అంటే వేదాలు, యజ్ఞాలు, తపస్సులు, దానాలు పనికిరావు అని చెప్పినాడు. అదే విషయాన్ని మేము చెప్పినాము. కానీ మేము కొత్తగా కల్పన చేసి చెప్పినామా, చెప్పలేదు. సరే మీరు హిందూమతాన్ని ఉద్ధరించేవాళ్ళు, మేము పాడుచేసే వాళ్ళము అని వేరే మతాన్ని ప్రచారం చేసి, అందరిని వేరే మతంలోకి చేరుస్తున్నాము అని మీరు అంటే, ఇంతకుముందు ఇక్కడ ఒక ముస్లీమ్ స్త్రీ మాట్లాడింది. ఆషాబీ అని ఆమె దేనిగురించి మాట్లాడింది. వాళ్ళ మతాన్ని గూర్చి మాట్లాడిందా లేదు, ఏ మతాన్ని గూర్చి మాట్లాడలేదు, దేవున్ని గూర్చి మాట్లాడింది. నాకు జ్ఞానం తెలిసింది అని చెప్పింది. సరేలే ఆ ముఖాన చక్రాలు ఉన్నాయి కదా, మరి మార్చగలిగినారా అంతమటుకు మీరు ఇతర మతాల వాళ్ళకు జ్ఞానము చెప్పగలిగినారా, ఇతర మతస్తులు మీదేమైనా జ్ఞానాన్ని నేర్చుకుంటున్నారా? మీరు ప్రసాదం ఇస్తే దాన్ని ప్రక్కకు పారవేస్తున్నారు. నీ ముందరనే, మీరు దేవుని ప్రసాదం అని ఇచ్చారనుకోండి, వాళ్ళు మీముందరే ప్రక్కకు పారేస్తున్నారు, వాళ్ళు ఎవరైనా తీసు కుంటున్నారేమో చూడండి. దాన్ని క్రైస్తవులు గానీ, ముస్లీంలు గానీ ఎవరైనా

తీసుకుంటున్నారా, తీసుకోవడం లేదు. కానీ ఇక్కడ ఏ ప్రసాదం ఇచ్చినా పారవేస్తున్నారా చూడండి. ఎవ్వరూ పారవేయరు ఇక్కడ మరి మీరు ఇస్తే పారవేయడం ఏమిటి, మేము ఇస్తే తీసుకోవడము ఏమి పారవేయకుండా? మరి మీరు ఏ మతస్థుల వారికి జ్ఞానం చెప్పకుండా, మీ మతస్తులవారినే, వేరే మతాల్లోకి పోతే, పోతా ఉన్నారు, పోతా ఉన్నారు. మన మతం క్షీణించిపోతా ఉంది అంటున్నారు. మరి మీరంతా ఏమి చేస్తున్నారు, మతము మారి పోతావున్నారు, మేము రక్షణ చేస్తా ఉన్నాము అని మీరంటుంటే మరోప్రక్క పోతానే ఉన్నారు. మరి మీరు ఏమి చేస్తున్నారు, పోయేవాళ్ళను మరి మీరు ఏమీ అడ్డుకున్నారు. ఆ ఏమి అడ్డుకోవడం లేదు. ఇట్లా దౌర్జన్యాలు చేస్తా ఉన్నారు. దౌర్జన్యాలతో ఎవరూ మారరు.

కానీ జ్ఞానముతో ఎవరినైనా మార్చవచ్చును. ఇప్పుడు మనం చెప్పే జ్ఞానములో దైవికం ఉంటే వారంతట వారే అప్రయత్నంగానే మారిపోతారు. ఇక్కడ దైవికం ఉంది కాబట్టే, క్రైస్తవులు, ముస్లీంలు అందరూ ఆకర్షితులైనారు ఇక్కడ ప్రతి మనిషి, ప్రతి మనిషిలోని మనస్సు, బుద్ధి కూడా ఆకర్షితమైంది. మేము మతాలను ఆకర్షించలేదు. కాబట్టి వాళ్ళు మతాలు అనే భావాన్ని విడిచిపెట్టి, వాళ్ళ మనస్సు, వాళ్ళ బుద్ధి ఇక్కడి జ్ఞానానికి ఆకర్షింపబడి వాళ్ళు ఇక్కడికివచ్చి, ఇది గొప్పజ్ఞానము అని అంటున్నారు. అదే హిందువులు ఎంతోమంది భగవద్గీతను చదివినారు. చదివిన తర్వాత వాళ్ళు ఈ జ్ఞానం గొప్పది, అనే ఉద్దేశ్యంతో మరలా ఇతరులకు వాళ్ళు భగవద్గీతలను పంచినారు. మరి వాళ్ళు కూడా హిందువులే కదా. మీరు మత సంఘము తోక పెట్టుకున్నంత మాత్రాన, మేము హిందూమతాన్ని రక్షిస్తాము అని అనుకుంటే అయిపోయిందా? మీరు హిందుమతాన్ని రక్షిస్తున్నారా? అసలు హిందూ ధర్మాలు ఏవో మీకు తెలుసా? హిందూ ధర్మాలు ఎవరికి తెలియదు?

హిందువులకు దైవ గ్రంథమేది అంటే వేదాలు అంటారు. హిందువుల గ్రంథము పేరు కూడా తెలియదు. క్రైస్తవులను అడిగితే బైబిల్ అంటారు. ముస్లీంలను అడిగితే ఖురాన్ తమ గ్రంథమంటారు.

హిందువులను అడగండి ఒకడు చెప్పడు, ఒకడు చెపుతాడు. ఒక పదిమందినడిగితే ఒక్కడు చెపుతాడు, ఏమని చెపుతాడు. అదే వేదాలు అంటారు. వేదాలకు మనకు ఏమి సంబంధం. ఎప్పుడు పుట్టినాయి అవి, వాటి పుట్టుపూర్వోత్తరాలు తెలుసా మీకు? మరి వాటిని ఎవరు వ్రాశారో తెలుసా, మీకు తెలియదు. కుడి తెలియదు, ఎడమా తెలియదు. అసలు వాటి చిరునామానే తెలియదు. ఏమీ తెలియకుండా, పెద్ద తెలిసినవాళ్ళ వలె మాట్లాడుతారు. జ్ఞానమనేది ప్రపంచం పుట్టుకలోనే పుట్టింది. వేదాలు మొన్న మొన్న పుట్టినటువంటివి. సరే పుట్టినాయి కాబట్టి మీరు పొరపాటుపడినారనే ఉద్దేశ్యంతో దేవుడు ఏమి చెప్పినాడు. **'త్రైగుణ్యా విషయావేదా'** అన్నాడు. అంటే వేదాలలో ఉండేది గుణాల విషయాలే, వేరే ఏమీ లేదు అని భగవద్గీతలో చెప్పినాడు. వేదాలలో ఏమున్నాయి గుణాల విషయాలు తప్ప ఏమీ లేవు. మళ్ళీ ఏమి చెప్పినాడు **'గుణమయి మమమాయ'** అన్నాడు. ఈ గుణాల రూపంలోనే నా మాయ ఉంది. దాన్ని మీరు దాటలేరు. **మమ మాయ దురత్యయా** అంటే నా మాయ దాటటం దుస్సాధ్యం, నా మాయను మీరు జయించలేరు, అంత భయంకరమైనది నా మాయ అని చెప్పినాడు. అట్లా ఈ రకంగా మాయ చాలా గొప్పది. ఎవరినైనా ముంచేస్తుంది. మీకు జ్ఞానము ఏమీ తెలియదు. కాబట్టి జ్ఞానాన్ని గురించి మీరు వ్యతిరేఖముగా మాట్లాడితే చాలా తప్పు, పెద్ద శిక్ష పడుతుంది. ఒకవేళ ఎవరైనాగానీ మాదే సరియైనది, మేము చెప్పేదే సరియైనది అని అనుకుంటే నేను ఇప్పుడు చెపుతున్నాను, మేము వ్రాసినది 98 గ్రంథాలు ఇప్పుడు

మీకు ప్రత్యక్షంగా అందుబాటులో ఉన్నాయి. మరలా ఉగాది పండుగ వచ్చేసరికి 108 అవుతాయి. ఇప్పుడున్న గ్రంథాలలో గానీ, రాబోయే గ్రంథాలలోగానీ, ఎక్కడైనా గానీ, మీరు చెప్పేది క్రైస్తవమతం కదా! మీరు క్రైస్తవ మత పక్షాన ఈ గ్రంథము ఉంది అని మీరు అంటే చూపండి. మీకు బహిరంగముగా ఇప్పుడు చెపుతున్నాను. సభా ముఖంగా పది లక్షల రూపాయలు మీకు బహుమతి ఇవ్వడానికి మేము సంసిద్ధముగా ఉన్నాము. ఇన్ని గ్రంథాలలో ఎక్కడైనాగానీ, ఫలానా గ్రంథము మొత్తము చదివి, ఇక్కడొక వాక్యము, అక్కడొక వాక్యము చూపరాదు. ఆ గ్రంథమును మొత్తము చదివి, సారాంశాన్ని తీసుకొని ఈ గ్రంథము ఫలానా మతాన్ని ప్రోద్భలం చేసే విధంగా ఉంది అని చెప్పమనండి.

మేము స్వయంగా చెప్పినది ఏమీ లేదు, ఉండేది ఏమున్నా భగవద్గీత లోనిది చెప్పి ఉంటాము, లేదా ఇంకా మిగతా గ్రంథాలలోనిది చెప్పి ఉంటాము. మూడు గ్రంథాలు ఒకటే అని చెప్పాము. మీకు అసలే తెలియదు, మిగతా రెండు దైవగ్రంథాలు కూడా భగవద్గీతను గొప్పగా పొగిడి చెప్పినాయి. ఇట్లు ఎవరికీ తెలియని రహస్యం కూడా నేను చెప్పినాను. భగవద్గీత అంటే గొప్పది అని చెప్పేదానికే మిగతా గ్రంథాలు కూడా వచ్చినాయి. మిగతా రెండు గ్రంథాలు కూడా ఇలా చెప్పిన వాక్యాలు కూడా ఆ గ్రంథాలలో ఉన్నాయి. వాటిని నేను చూపించి చెప్పినాను. మీకు తెలుసునా, అది తెలియదు. ఈ రకంగా జ్ఞానం తెలియకుండా మాట్లాడితే మిమ్మల్ని మాయ ముంచెత్తుతూ ఉంది అని చెప్పాము. తెలియకుండా మాట్లాడే వాళ్ళు మాయలో మునిగిపోవడము జరుగుతుంది.

ఆరు సంవత్సరాల క్రిందట అనుకుంటాను, కర్నూలుకు వరదలు వచ్చినాయి. ఆ వరదలు వచ్చినప్పుడు ఏమి జరిగింది తెలుసా, నీళ్ళు

ఇండ్ల లోపలికి వచ్చేసాయి. నది పొంగింది, నీళ్ళు ఇండ్లలోకి వచ్చాయంటే, వాస్తవమే రావచ్చు, పోవచ్చుకానీ తర్వాత ఏమి అయ్యిందంటే, నీళ్ళన్ని పోయాక, చూస్తే నీళ్ళు వచ్చిన ఇళ్ళలో సగానికి పైగా బురద పేరుకొని పోయింది. ఇళ్ళు పది అడుగుల ఎత్తు ఉంటే 8 అడుగుల ఎత్తు పైగా పేరుకొని పోయింది. '8' అడుగుల బురద ఎక్కడి నుండి వచ్చింది అనే ప్రశ్న మొదలైంది మాకు. ఆరు నెలలు ఆ బురదను మొత్తం బయటకు తీసుకొని పోవాల్సివచ్చింది కర్నూల్ వాళ్ళకు, ట్రాక్టర్స్ పెట్టి ఆరు నెలలు బయటకు తోలితే అప్పుడు తగ్గిపోయింది. ఆ బురదంతా ఎక్కడి నుండి వచ్చింది అంటే నీళ్ళల్లో కొట్టుకొని వచ్చింది. డ్యామ్‌లో నీళ్ళు ఎక్కువ అయినందుకు గేట్స్ ఎత్తడం వల్ల నీళ్ళు వచ్చాయి. మరి అంత బురద ఎట్లా వచ్చింది మీకు, సరే నీవు తెలివిగా ఏం చెప్తావంటే, నీళ్ళు వచ్చినప్పుడు మట్టి ఉంటుంది కదా! అదే బురదగా వచ్చి పేరుకొని పోయింది అని చెప్తావు. మరి ఆ బురద ఎట్లాంటిది, ఆ నీళ్ళు ఎట్లాంటివి, అని ప్రశ్న మరలా మొదలైంది. అవి వర్షం పడి ఉంటే వచ్చిన నీళ్ళు కాదు, అది వరద కదా! కర్నూల్ వాళ్ళు ఎవరైనా మీరు ఆలోచన చేసి చూసుకోండి వెనక్కి వెళ్లి చూసుకోండి. అవి వర్షం నీళ్ళా, నిలిచిన నీళ్ళా? గుంతలో నిలిచిన నీళ్ళు వచ్చినాయా, పై నుండి వర్షం నీళ్ళు వచ్చినాయా? గుంతలో నిలిచిన నీళ్ళు వచ్చినాయి. చాలా పెద్ద గుంతలో నిల్చిన నీరు వచ్చింది. పెద్ద గుంతలో జంతువులు పడిపోయి, కళేబరాలు పడిపోయి, శవాలు పడిపోయి కుళ్ళిపోయి, చెడిపోయి వాసన వస్తుంటాయి చూడండి, ఆ నీళ్ళు. ఆ బురద వచ్చి ఇక్కడ పడింది. అవి ఏ నీళ్ళు దక్షిణాఫ్రికాలో ఒక అడవిలో పూర్తిగా మురిగిపోయి పూర్తిగా నిలిచిపోయిన నీళ్ళు ఉంటాయి కదా! వాటికి ఎక్కడా సంబంధం లేకుండా నిలిచిపోయి, జంతువులు వాటిలో

పడిపోయి చనిపోయి, నానా రకాలవి పడి చనిపోయి, కొన్ని జంతువులు ఒకచోట గడ్డితింటే వచ్చి ఇందులో పడి చనిపోయాయి. ఇట్లా లెక్కేస్తే ఆ జంతు కళేబరాలు పడి, నీళ్ళు మురిగిపోయి, కొన్ని రోజులు వాసనపట్టిన నీళ్ళు అవి వచ్చి ఇక్కడ చేరినాయి, అర్థమయ్యిందా! ఇదేదో కొత్తది చెప్పుతున్నారు, ఎప్పుడు ఏదో ఒకటి కొత్తది చెప్పుతారు అని మీరు అనుకోవచ్చు. కానీ కొత్త కథేం కాదు ఉన్న కథే అది. వాసన వచ్చే నీళ్ళు వచ్చాయా? రాలేదా? అడగండి కర్నూల్ వాళ్ళను. ఆ బురదను తీసుకొని పోవాలంటే గుడ్డను నాలుగు మడతలు మడిచి ముక్కుకు అడ్డం పెట్టుకోకపోతే ఆ దుర్వాసన తట్టుకోలేరు.

మేము హైదరాబాద్ నుండి కార్లో వస్తుంటే మా ప్రక్కనుండి బురద ట్రాక్టర్ అలా వెళ్ళితే ఆ గాలి తగిలితే సుమారు 1 కిలోమీటర్ పొయ్యేంత వరకు కూడా ఆ వాసనను మమ్ములను వదలలేదు. అంతేకాదు దాని వాసన జ్ఞాపకం చేసుకుంటే కూడా భయంకరంగా ఉంటుంది. మరి అంత బురద వాసన ఉండేది ఎక్కడి నుండి వచ్చింది. బురద రావచ్చు కానీ ఇంత భయంకరంగా ఉండే వాసన బురద ఎలా వచ్చింది. మీరు దేవునికి వ్యతిరేఖంగా మాట్లాడిన పాపానికి అందరిని లెక్కేసి, ఒక్కచోట కుప్పేసి, బురద దక్షిణాఫ్రికాది తీసుకొని వచ్చి అందరికి పెట్టింది. అంటే ఏమిటి శాస్త్ర సమ్మతం లేకుండా మీరు ఇష్టం వచ్చినట్లుగా చెప్పుతున్నారు. మీరు చెప్పేదంతా మూఢనమ్మకం కాదా! అని ప్రశ్న వేయవచ్చు. మీరు చెప్పేదంతా మూఢ నమ్మకం కదా! అని అడుగవచ్చు. అంటే మూఢ నమ్మకముగానే నేను చెప్పేది కనిపిస్తుంది. కానీ ఇదే శాస్త్రబద్ధం అవుతుంది. కొన్ని రోజుల తర్వాత నేను ఇప్పుడు నోటితో చెప్పిన మాటే శాస్త్రబద్ధం అవుతుంది. కానీ కొన్ని రోజులకు శాస్త్రబద్ధం అవుతుంది.

అంత గ్యారెంటీగా ఎట్లా చెపుతున్నారు మీరు. ఇంతకుముందు చెప్పిన విషయాలన్నీ శాస్త్రబద్ధం అయినాయి. మీకు జ్ఞాపకం ఉందో లేదో ఇంతకు ముందు నేను చెప్పిన విషయాలు విచిత్రంగా ఉన్నా, మరలా కొన్ని రోజులకు శాస్త్రబద్ధం అయినట్లు వార్తలు వచ్చాయి. శాస్త్రవేత్తలే వ్రాసుకున్నారు వాటిని ఇట్లా జరిగింది, అట్లా జరిగిందని మరి ఇది నీకు అనుమానంగా ఉంటే పోయిన సంవత్సరము కేదార్‌నాథ్‌లో పెద్దగా ప్రమాదం జరిగింది. అంటే లోయలో పోయే వాళ్ళందరిని వరద ముంచెత్తింది. అక్కడ ఇండ్లను మొత్తం ఊడ్చేసింది. జరిగిందా లేదా? జరిగింది. అక్కడ జరగడానికి, ఇక్కడ జరగడానికి పూర్తి సంబంధం ఉంది. వాళ్ళు ఏదో దైవికమైన పాపము చేసుకొని ఉంటేనే అట్లాంటివాళ్ళకు జరిగింది. ఆ యాత్రీకులు దేవుని దగ్గరకే పోతా ఉన్నారు కదా! అంటే దేవుని దగ్గరకే కానీ ఏ దేవుని దగ్గరకో, అంటే కేదార్ నాథ్‌లో ఉండే దేవుని కోసం. అంతటా ఉండే దేవునికోసం కాదు. అంటే వీళ్ళు చేసుకున్న పాపాన్ని కరెక్ట్‌గా దేవుడు అక్కడ అమలు పరిచాడు. దేవునికోసం పోయినోళ్ళు. దైవభక్తితో పోయినోళ్ళు, ఎంతో ఇష్టంతో పోయినోళ్ళు, వాళ్ళను తిప్పలు పెట్టాల్సి వచ్చినంత పని వచ్చింది. మరి నిజంగా దేవుని భక్తి కోసం పోయివుంటే వాళ్ళకెందుకు ఆ శిక్షపడింది?

ఇంకా జరిగిన విషయం ఏమంటే అక్కడ పడిన శిక్ష ఎట్లాంటిది అంటే, కర్నూల్‌లో పడిన శిక్షలాంటిదే అక్కడపడింది. అక్కడ కొండల్లో, గుట్టల్లో ఇరుక్కొని పోయినవాళ్ళు కాపాడడానికి వెళ్ళిన ఒక మిలట్రీ ఆఫీసర్ చెపుతున్నాడు. వాళ్ళను తాళ్ళుకట్టి పైకి గుంజి, హెలికాప్టర్‌లో తీసుకొని వచ్చి, రకరకాలుగా కాపాడిన మిలట్రీవాళ్ళు ఇలా చెపుతున్నారు. చాలా శ్రమపడి వాళ్ళను రక్షించారు. ఒక మిలట్రీ కమాండర్ అంటే ఒక మేజర్

ఏమి చెపుతా ఉన్నాడంటే “అవి వాస్తవంగా వర్షం ద్వారా వచ్చిన నీళ్ళు కాదు.” కరెక్ట్‌గా రికార్డు ఉంది మీరు మాటల రూపంలో చెప్పిన దానిని చూసుకో వచ్చు “అవి నిలిచిన నీళ్ళు, ఎక్కడో నిలిచిన నీళ్ళు, మురిగిపోయిన వాసన వస్తున్నాయి. మా బట్టలు కాపాడేటప్పుడు తడిసిపోయాయి. వాటిని ఉతికినా గానీ వారం రోజుల వరకు కూడా ఆ చెడు వాసన పోలేదు.” అని చెప్పారు. కాపాడేటప్పుడు వాళ్ళ బట్టలు తడిసాయట, వారం రోజులపాటు వాసన భరించలేకపోయారట. వాటిని ఉతికినా గానీ భయంకరమైన వాసన పోలేదు. ఆ వాసనకే చాలామంది చనిపోయారు. మళ్ళీ ఇప్పుడు ప్రశ్న. అక్కడ వర్షం వచ్చి, వరదవచ్చి నీళ్ళు వచ్చాయి. వాటి ధాటికి అన్నీ కొట్టుకొని పోయాయి. అని మనం అనుకుంటున్నాము కదా! కానీ అక్కడ ప్రత్యక్ష సాక్షి ఏమి చెప్పుతున్నాడు. అవి వచ్చిన వర్షం నీళ్ళు కావు, వర్షం వచ్చిన నీళ్ళు అట్ల వాసన ఉండవు. కానీ చాలా దుర్వాసనతో కూడుకొన్న నీళ్ళు ఇవి. అట్లే పేరుకొని పోయిన బురద కూడా భయంకరంగా ఉంది. తడిసిన మా బట్టలను ఉతికినాగానీ వారం రోజులు వాసన పోలేదు. అంతవాసన వచ్చినాయి అవి అని ప్రత్యక్ష సాక్షి చెప్పిన విషయాలు.

మరి ఈ రకంగా లెక్కేసుకుంటే, అక్కడ జరిగిన సంఘటన ఏమిటి మరి ఆ నీళ్ళు ఎక్కడివి, ఇట్లాంటి వాసన వచ్చే నీళ్ళు ఎక్కడి నుండి వచ్చి ఉంటాయి అని ప్రశ్న వేసుకోవచ్చు కదా! ఒక గంటసేపు వర్షం కురిస్తే అది పది సెంటీమీటర్లు నమోదు అయ్యింది. కానీ ఒకచోట వంద సెంటీమీటర్ల వర్షంపడితే వచ్చేంత నీళ్ళు వచ్చాయట. మరి గంట సమయంలో ఇంత వర్షం ఎటువంటి పరిస్థితుల్లోనూ కురవలేదు, ఇది వాస్తవం. అంటే గంటసేపు వర్షం పడితే అన్ని నీళ్ళు ఎట్లా వచ్చినాయని అక్కడున్న వాళ్ళే ప్రశ్న వేస్తున్నారు. ఇది ఎవరికీ తెలియని రహస్యం.

కానీ మనిషి చాలా సులభంగా దానిని వదిలి వేస్తున్నాడు. జరిగిన సంఘటనను ఏమాత్రం ఆలోచించ కుండా వదిలివేయడం జరుగుతావుంది. కానీ ఆలోచన చేస్తే మనకు ఎట్లా శిక్షలుపడుతున్నాయి. ఎక్కడి నుండి శిక్షలు పడుతున్నాయి. మనకు తెలియకుండా ఎందుకు ఇలా జరుగు తున్నాయి అనే ఆలోచనలోకి మనిషి రావడం జరుగుతుంది. కానీ ఈ విషయాలను చాలా సాధారణంగా తీసుకుంటున్నాడు. ఎందుకోసము ఇలాంటివి వస్తున్నాయి. అని వాటిని ఆలోచించలేదు. ఇన్ని నీళ్ళు ఎట్లా వచ్చినాయి అని చూసుకోలేదు, భయంకరమైన పెద్ద పెద్ద గుండ్లు ఎందుకు వచ్చిపడినాయో కూడా ఆలోచన చేయలేదు. నీటి ప్రవాహానికి అవి కొట్టుకొని వచ్చి ఉంటాయి వాస్తవమే, కానీ అన్ని నీళ్లు ఎట్లా వచ్చాయి. ఆ నీళ్ళు ఎక్కడివి. ఇవన్ని నేను స్వయంగా చెప్పుతున్న ప్రశ్నలు కాదు. టెలివిజన్‌లో వాళ్ళు చెప్పిన ప్రశ్నలే ఇవి.

రక్షణ నిమిత్తము వెళ్ళిన మిలట్రీ కమాండర్ చెప్పిన విషయాలను చూస్తే ఈ కర్నూల్‌కు సంబంధించిన విషయం జ్ఞాపకం మనకు వస్తా ఉంది. దీనికి దానికి పోలికలు ఉన్నాయి. మరి ఈ బురద నీళ్ళు ఎక్కడి నుండి వచ్చాయి అనే ప్రశ్నకు సమాధానం కావాలంటే ఒక శాస్త్రీయత ఉంటేనే మనకు సమాధానం లభిస్తుంది. అంటే శాస్త్రము ఉంటేనే మనకు తెలుస్తుంది. ఇంతకుముందు జలంధర్ చెప్పాడు కదా. ఒక సీక్రేట్ ఏదైనా ఛేధించాలంటే దానికి ఒక శాస్త్రము అవసరము అని. అట్లా మనకు కూడా ఒక శాస్త్రము అవసరము. మరి ఆ శాస్త్రము కొంతమందికి పూర్తిగా తెలుసు, మరి కొంతమందికి తెలియదు. మరి ఆ శాస్త్రము ప్రకారము లెక్కించి చూస్తే ఎక్కడో దక్షిణాఫ్రికాలోని మురిగిపోయిన నీళ్ళు ఇక్కడికి వచ్చినాయి. అక్కడ పేరుకొన్న బురదంతా ఇక్కడకు వచ్చినట్లు ఇక్కడ

కనబడింది. అక్కడినుండి ఇక్కడికి ఎలా వచ్చింది అని ఎవ్వరూ చెప్పలేరు. ఇప్పుడు మీరే చెపుతున్నారు కదా! అంటే ఎవ్వరూ చెప్పలేదు కాబట్టే ఇప్పుడు మేము చెపుతున్నాము. నేను ఇప్పుడు చెప్పినాను అనుకోండి. అదే తర్వాత నేను చెప్పింది శాస్త్రము అవుతుంది. తర్వాత కొన్ని కోట్లు ఖర్చుపెట్టి, ఇట్లా కూడా జరిగాయి, ఇట్లా కూడా జరుగొచ్చు అని పరిశోధన చేసి పరిశోధకులు చెప్పితే అప్పుడు మీరు ఇది నిజమని నమ్ముతారు. ఇప్పుడు అట్లా లేదు కదా! అట్లా లేకుండా చెపుతున్నాను కదా! ఇది నమ్మేదానికి అవకాశం లేదు.

ఇట్లాంటి మాటలనన్నింటినీ శాస్త్రబద్ధత, హేతుబద్ధత లేనటువంటివి అంటారు. కానీ ఇవన్నీ శాస్త్రబద్ధతతో కూడుకొన్నవే. హేతుబద్ధతతో కూడుకొన్నవే ఇవి పూర్తి శాస్త్రము ప్రకారము చెప్పేటటువంటివి. కానీ ఈ శాస్త్రము అందరికీ తెలియదు. ఏదో పైన స్థూలంగా ఉండే శాస్త్రము తెలుసుకొని, అది ఎట్లా అవుతుంది, ఇది ఎట్లా అవుతుంది అని అంటారు. 12 గ్రహాలు ఉంటాయి అని జ్యోతిష్యములో చెప్పితే, ఒకాయన నిద్రలో చెప్పారు, కలవరింతలో చెప్పారు అన్నాడు. అంటే దీనిని నిద్రలో చెప్పామా, కలవరింతలో చెప్పామా? శాస్త్రబద్ధంగా చెపుతున్నాము. జ్యోతిష్య శాస్త్రప్రమాణంగా చెపుతున్నాము అని అంటే వాడు హేళనగా మాట్లాడటము జరిగింది. ఆ విధంగా హేళన చేసిన వాళ్ళకు ఒక ప్రశ్న వేశాము. ఆయన ఎవరినీ నమ్మడు, వివేకానందుడు జ్యోతిష్యము లేదని చెప్పినాడు. జ్యోతిష్యాన్ని మొత్తం అబద్ధం అని చెప్పినాడు అంటే, వివేకానందుడు. జూన్ 27వ తేదీన పంచాంగం తీసుకొని జూలై 4వ తేదీని పెన్నుతో రౌండప్ చేసినాడు. మీకు తెలుసో తెలియదో నాకు తెలియదు కానీ, వారం రోజుల ముందే పెన్‌తో గుర్తువేశాడు. అదే రోజు చనిపోవడం జరిగింది. జూలై 4వ

తేదీనే ఎందుకు గుర్తువేశాడు అనే ప్రశ్న వచ్చింది. కానీ ఎవరూ దానిని పట్టించుకోలేదు. కానీ మనము ఏమి అడుగుతున్నామంటే మరి ఆయనకు జ్యోతిష్యము తెలియకుంటే జూలై 4వ తేదీనే ఎందుకు గుర్తించాడు. ఎందుకు రౌండప్ చేసినాడు. మరి ఆ రోజే అంటే, గుర్తించిన రోజే ఎందుకు చనిపోయినాడు? అని మనము అడిగి అతని జీవిత చరిత్రలలో ఉన్న విషయాన్ని అతనికి చూపించాము. అప్పుడు అతను ఏమీ మాట్లాడ లేకపోయాడు. ఈ రకంగా శాస్త్రమును హేళనగా మాట్లాడిన వాళ్ళకు మేము చెప్పేది ఏమంటే మేము చెప్పేది శాస్త్రమే, ఇంకా చెప్పితే ఇది సూపర్‌సైన్స్ మీకు పైపై సైన్స్ తెలుసు, ఇది మామూలు సైన్స్ కాదు.

మాకు పూర్తి సైన్స్ తెలుసు అని మనము చెపుతున్నాము. ఆ సైన్స్ ప్రకారమే ఇది చెప్పేది. అంటే మనము చెప్పేదానిని ఏ సైన్స్ ఒప్పుకోలేదు. వాళ్ళు చెప్పేది కొత్తగా చెపుతున్నారు. కొత్తగా అంటే వాళ్ళు చెప్పేదంతా వాళ్ళ ఇష్టమొచ్చినట్లు చెపుతున్నారు. నీటి ఆవిరి వలన మేఘము తయారైతాదని వాళ్ళు చెప్పినారు. నేనేమి అడుగుతున్నానంటే ఏ శాస్త్రవేత్త అయినా నీటి ఆవిరి తీసుకొని మేఘాన్ని తయారు చేయమను. ఒక పెద్ద ట్యాంకర్ నీళ్ళు ఇస్తాము, నీళ్ళంటిని వేడి చేస్తే నీటి ఆవిరి అవుతుంది కదా! ఆ ఆవిరితో కనీసము చిన్న మేఘాన్నయినా తయారు చేయగలరా? మీరు చెప్పండి. అంటే తయారు చేయలేదు. అది మేఘము తయారు కాదా! సారాయిని కాస్తే ఏమవుతుంది, ఆవిరవుతుంది. ప్రక్కకు వెళ్ళిన ఈ ఆవిరి చల్లారి తిరిగి నీరుగా మారుతుంది. ఆ సూత్రాన్ని పట్టుకొని వీళ్ళు ఏమి చెప్పినారంటే, నీళ్ళు ఆవిరై, పైకిపోయి, మేఘమై మళ్ళీ అక్కడి నుండి వాన పడుతుందని చెప్పినారు. కానీ ఆ ప్రక్రియ ఇక్కడ జరిగేదే గానీ, పైన జరిగేది కాదు. ఆ ప్రక్రియ క్రింద జరిగేదే కానీ పైకి పోయి

జరుగుతుందని వాళ్ళు అనుకున్నారు. ఇది అర్థంకాని సమస్య అయ్యింది వీళ్ళకు. కాబట్టి మాట్లాడే ఏ శాస్త్రవేత్త అయినా, మీకు తెల్సిన సైన్స్ ప్రకారము, మీ సైన్స్ ప్రకారము ఒక చిన్న మేఘాన్ని తయారు చేయనైనా చేయండి లేదా కనీసం చిన్న మేఘాన్నయినా లేకుండా చేయండి. మీకు తెలిసిన సైన్స్ ప్రకారం కనీసం ఒక చిన్న మేఘాన్నయినా తయారు చేయగలరా, శాస్త్రవేత్తలకు మేము ప్రశ్న వేస్తున్నాము. చేయలేరు మీరు. అట్లే కనీసం ఉన్న మేఘాన్ని అయినా లేకుండా చేయగలరా? చేయలేరు మీరు. ఎందుకంటే అది ఆ మేఘము యొక్క ఇష్టం. మేఘము ఎవ్వరి కోరిక మీద ఆధారపడి లేదు, అది దాని ఇష్ట ప్రకారమే నడుస్తుంది.

మేఘము అతీతమైన ఆకాశ శక్తి, మేఘమే ఒక రోగమని కూడా గతంలోనే చెప్పాము. ఒకసారి మేఘము భూమి మీదకు వచ్చిందంటే కొన్ని రోగాలను ఇక్కడ వదిలిపెట్టి వెళుతుంది. మరొక సందర్భములో ఎప్పుడైనా మేఘము భూమి మీదకు వస్తే ఉన్న రోగాలను కూడా తీసుకొని వెళు తుంది. అప్పటి వరకు ఆ రోగాలకు డాక్టర్స్ ఎన్ని మందులిచ్చినా పోలేదు. ఎంత ప్రయత్నము చేసినా పోని ఆ రోగాలు, మేఘము భూమి మీదకు వచ్చినప్పుడు ఆ మేఘం వాటిని తీసుకొని పోయిందని మనము అనుకోవచ్చు. ఒక్కోసారి మేఘం భూమి మీదకు వచ్చినప్పుడు కొత్త రోగాలను తీసుకొని వచ్చి విడిచి పెట్టవచ్చు. ఈ విధంగా మేఘాలు చేసే పనులు ఎవరికీ తెలియదు. కానీ ఇది కూడా సైన్సే (శాస్త్రమే). కాబట్టి గతంలోనే మేము చెప్పాము, మేఘము ఎవ్వరి ఆధీనములో ఉండదు. మనమే దాని ఆధీనములో ఉన్నాము. ఈ రకంగా పరిపాలన చేసే కొన్ని శక్తులు మేఘాలకు ఉన్నాయి. అందుకే వాటిని భూతాలు అంటున్నాము అనే విషయాన్ని కూడా చెప్పాము. ఆ విధముగా ఈ రోజు బురద తీసుకొని ఇక్కడ వేయడానికి

కారణం ఆ మేఘాలే. ఇప్పుడు ఇంకా కాస్తా వివరంగా చెబుతాము చూడు. ఇప్పుడు బురదను తీసుకొనివచ్చే ఈ మేఘాలే. బురదనేకాక, చేపలను, కప్పలను, మొసళ్ళను కూడా తీసుకొని వచ్చి వేస్తాయి. వేటినైనా ఒకచోటు నుండి ఇంకొక చోటుకు మేఘాలే రవాణా చేస్తాయి. అంతేకాదు ఈ రోజు దేనినైనా తనలోకి మేఘము తీసుకొన్నదనుకోండి, నెల రోజులు తనలో ఉంచుకొని ఎక్కడ అవసరమైతే అక్కడికి తీసుకొని వెళ్ళి భూమిమీద వేస్తుంది. మరి ఈ నెల రోజులు ఇవి మేఘంలో కనిపిస్తాయా? స్థూలంగా ఉండే పదార్థం ఏమైనా కనిపిస్తుందా? కనిపించదు అట్లే భయంకరమైన బురదను గానీ నీటిని గానీ తనలోకి తీసుకొన్నదనుకో మరి ఆ బురద, నీళ్ళు కనిపిస్తున్నాయా, కనిపించవు. భూమిమీద పడవేసేటప్పుడు మాత్రమే లేదా పడ్డ తర్వాత మాత్రమే కనిపిస్తాయి. ఈ రకంగా మేఘాలు చేస్తాయి. కానీ ఇది మనకు తెలియని సైన్స్, ఇది పెద్ద సైన్స్. తెలుసుకుంటే ఇది పెద్దసైన్సే. ఇంతకు ముందే **"దయ్యాల భూతాల యదార్థ సంఘటనలు"** అనే గ్రంథములో 300 పేజీల తర్వాత ఇదే విషయాన్ని మేము వ్రాశాము. మరి వాటిని చదివి తెలుసుకుంటే చాలా గొప్పగా ఉంటాయి. ఈ రకంగా మనకు తెలియని రహస్యం ఇది. ఈ రకంగా మనం తెలుసుకుంటూ వెళు తుంటే మనకు తెలియని రహస్యాలు ఎన్నో ఉన్నాయి.

మరి ఇలాంటి తెలియనిదంతా తెలుసుకోవాలంటే అంటే రహస్యం తెలుసుకోవాలంటే దానికి సైన్స్ అవసరము. ఇప్పుడు మీకు తెలియని ఒక రహస్యం గురించి చెప్పాను నేను ఏమిటి, కేదార్‌నాథ్‌లో విపరీతమైన బురద వచ్చిన విషయం. మరి ఆ బురదగానీ, నీళ్ళుగాని దుర్వాసనతో కూడుకొన్నవే. మరి ఆ నీళ్ళుగానీ, ఆ బురదగానీ ఎక్కడ నుండి వచ్చింది అనే ప్రశ్న వేసుకుంటే, అది రహస్యం మీరలాంటి రహస్యాన్ని తెలుసుకోవా

లంటే దానికి జ్ఞానమన్నా కావాలి లేదా విజ్ఞానమైనా కావాలి. జ్ఞానం అంటే లోపలి విషయం, విజ్ఞానమంటే బయటి విషయం. కనిపించే విషయాన్ని విజ్ఞానము అంటాము, కనబడని దానిని జ్ఞానము అంటాము. మరి ఈ రకంగా నేను జ్ఞానం ప్రకారం చెప్పాము. ఈ రకంగా చెప్పేది సత్యమా అంటే? శాస్త్రబద్ధంగా చెప్పింది ఎందుకు సత్యము కాదు. మరి సత్యము కాదు అనడానికి కూడా మీకు ఏమాత్రం అవకాశం లేదు. ఇది ఎక్కడి నుండి వచ్చింది అనే ప్రశ్నను నేను మీకు వేస్తాను. మరి మీరు చెప్పగలరా? ఈ వాసన ఉన్న బురద ఎక్కడి నుండి వచ్చింది అనే ప్రశ్నను నేను వేస్తాను. మీరు చెప్పగలరా?

ఏం చెప్తారు చివరికి ఇవి నిలిచిన నీళ్ళు అని చెప్తారు. మరి కేదార్‌నాథ్‌లో ఎక్కడ నిలిచి ఉన్నాయి? కొండల్లో గానీ, గుట్టల్లో గానీ ఎక్కడైనా గానీ ఉన్నాయా, లేవు. వర్షం వస్తేనే వచ్చాయి ఆ నీళ్ళు. మరి కనీసం ఇక్కడైనా నదిలో నిలిచిన నీళ్ళు ఉన్నాయా? ఇక్కడ కూడా వర్షం ద్వారా వచ్చిన వరదనీటికే తుంగభద్రనది, ప్రాజెక్ట్ నిండింది. నిండిన నీటిని విడిచిపెట్టారు, అందుకే బురద వచ్చిందన్నారు. మరి ఆ బురద ఎట్లా వచ్చింది. అలంపూర్ దేవాలయాల్లో అయితే సగం దేవాలయాలు బురదతో పేరుకొనిపోయాయి. ఆ దేవాలయాలు మునిగిపోయాయి. కర్నూల్ కూడా మునిగిపోయింది. అక్కడ కాకుండా వేరే ఎక్కడా మునిగిపోలేదు కేవలం అక్కడే ఆ కాస్త ప్రదేశమే మునిగి పోయింది. మరి అక్కడే ఎందుకు జరిగిందంటే మీరు చేసిన తప్పులను దృష్టిలో పెట్టుకొని, అందరిని అంటే ఆ తప్పు చేసిన వాళ్ళందరిని ఒకచోట చేర్చి, ఇటువంటి శిక్షలు వేయడానికి మేఘము సమాయత్తమవుతుంది. మీకు తెలియకుండా చేస్తుంది ఇవన్నీ శిక్షలు, భయంకరంగా ఆకలిగొని, పిల్లలు పాలు అని అరవడం, పెద్దలు

ఆకలి అని అరవడం జరిగింది. వాళ్ళు ఈ నీళ్ళలో మునిగిపోయి ఏమి చేయలేక, బాధపడ్డారు. వాళ్ళు వంట చేసుకోవడానికి వీలుకాదు ఇంకొక చోట తెచ్చుకోవడానికి కూడా లేదు. కనీసం హోటల్‌కు వెళ్ళి తెచ్చుకుందా మనుకుంటే హోటళ్ళు కూడా లేవు. కేదార్‌నాథ్‌లో ఇదే కదా జరిగింది. పాపం ఒకామె ఏడుస్తావుంది. ఏమని, నేను ఎంతో పెద్ద బ్రతుకు బతికాను, ఒక రోజంతా ఏమీ దొరకక ఆకలితో ఉండాల్సివచ్చింది. ఎంతో కష్టంగా గడపాల్సివచ్చింది అని ఏడుస్తావుంది. మరీ నీవు ఎట్లైనా బ్రతికి ఉండవచ్చు కానీ తప్పు, తప్పే. ఎక్కడో ఇరుక్కొనిపోయి ఒకరోజు రాత్రంతా అక్కడే ఉండి పోయిందట. మిలట్రీవాళ్ళు వచ్చి రక్షించి బయటకు తీసుకొచ్చాక అప్పుడు చెప్తావుంది. అంటే ఎవరేం చేస్తారు. నీవు చేసుకున్న తప్పుకు నీకు శిక్షపడింది.

ఈ రకంగా లెక్కేసి మేము చెప్పేది ఏమంటే దైవ జ్ఞానం విషయంలో ఏమాత్రం పొరపాటుగా మీరు మాట్లాడినా, పెద్ద శిక్షకులోనవుతారు. మాయలో నుండి వాళ్ళు బయటపడాలని చెప్తే, మీకు తెలివి ఉంది మాకు లేదు అని హేళనగా మాట్లాడితే ఏమని అర్థం. అప్పుడు దేవునికి కోపం వస్తుంది. దేవునికి కోపం వస్తే ఏమవుతుంది, ఇప్పుడు మనం చెప్పుకున్నలాంటివే జరుగుతాయి. ఇట్లాంటివి జరిగినప్పుడు మేము ఏమి తప్పు చేసి ఉంటామో అనుకుంటారు. మరి నీవు ఏమి తప్పు చేశావో నీకు ఎలా తెలుస్తుంది. ఆ తప్పు నాకు గుర్తుందా, నీకు గుర్తుందా, నీకుగానీ, నాకుగానీ గుర్తులేదు. కానీ తప్పు తప్పే అనుభవానికి వచ్చినప్పుడు మాత్రం ఎవ్వరికీ అర్థంకాదు. అంతమాత్రాన తప్పు చెయ్యలేదు అనుకోవద్దు. ఇప్పుడు నేను హెచ్చరిస్తున్నాను కదా! ఇలాంటి తప్పులన్నీ మీరు చేయవద్దండి, ప్రపంచ విషయంలో నీవు తప్పుచేసి ఉంటే ఏదో ఒకటి జరుగుతుంది.

కష్టం వస్తుంది పోతుంది అంతే కానీ దేవుని జ్ఞాన విషయంలో హేళనగా మాట్లాడితే ఈ జన్మలోను, వచ్చే జన్మలోను, మళ్ళీ జన్మలోనూ వరుసపెట్టి ఇలాంటివే ఉంటాయి. లేనిపోని తిప్పలుపడాల్సి వస్తుంది. మరి దేవుని విషయాన్ని చాలా సులభంగా తీసుకొని, లెక్కలేకుండా మాట్లాడే వాళ్ళకు నేను చెప్పే హెచ్చరిక ఇదే దేవుని విషయంలోనే అహర్నిషలు పాటుపడుతూ, ఇంతమందికి జ్ఞానం తెలియజేస్తూ, 98 గ్రంథాలను ఇప్పటి వరకు మీకు అందించాము. ఆ గ్రంథాలలో ఎంత పెద్ద జ్ఞానం ఉందో తెలుసు. ఆ గ్రంథాలను చదివి మిగతా మతస్తులంతా ఏ రకంగా మారిపోయినారో తెలుసు. కానీ ఎవ్వరిని కూడా మేము మతము మార్చుకోమని చెప్పలేదు. **"మత మార్పిడి మహాపాపము, దైవ ద్రోహము"** అనే గ్రంథాన్ని కూడా పోయిన నెలలో మీకు ఇచ్చాము.

అందులో ఈ మతం మంచిది, ఆ మతం చెడ్డది అని కాకుండా, దేవుడు ఏ మతంలో పుట్టించి ఉంటే ఆ మతంలోనే ఉండండి అని చెప్పాము. అంత వ్రాసినా మీరు క్రైస్తవ మతం బోధిస్తున్నారు. మా ఊర్లో ప్రచారం చేయవద్దు అంటే, వాళ్ళ తలకాయలో తెలివి ఎంత ఉందో మీరు ఆలోచన చేయండి. అంటే వాళ్ళ తెలివి ఎట్లన్నా ఉండనీ, బయట ఎవ్వరన్నా చెప్పి ఉంటే వీళ్ళు మాట్లాడుతున్నారు, వేరే వాళ్ళు ప్రేరేపణ చేసి పంపించి ఉంటారు. వీళ్ళువచ్చి మాట్లాడుతుంటారు. మరి మాట్లాడితే ఆ పాపం వాళ్ళకు వస్తుందా, వీళ్ళకు వస్తుందా అంటే అందరికి వస్తుంది. కలసికట్టుగా వాడు చెప్పి పంపించి ఉంటే నీవు ఎట్లా వచ్చావు, కాబట్టి నీకు కూడా శిక్ష తప్పదు. ఆ భయంకరమైన శిక్ష మీరు అనుభవించాల్సిన పని పస్తుంది. తప్పనిసరిగా ఇటువంటి శిక్షలు పడుతాయి. నేను ఎంత బాగా బ్రతికి ఉంటినో, ఇట్లా అయిపోతిని అంటే అట్లే అయిపోతావు. కాబట్టి మనం

ఏమి చెపుతున్నాము అంటే ఒకవేళ ఎవరైనా ఇట్లా మాట్లాడవద్దండి, దేవుని జ్ఞానాన్ని గురించి, మీకు ఏమైనా అనుమానం ఉంటే మీరు మమ్ములను అడిగి తెలుసుకోండి. ప్రత్యక్షంగా మేము ఉన్నాము కదా!

జవాబు చెప్పలేని పరిస్థితి ఉంటే, మీరు మాట్లాడటం ఊరకనే అడ్డం, దిడ్డంగా మాట్లాడటం, మీరు క్రైస్తవ మతాన్ని ప్రచారం చేస్తున్నారని, అదొకటి, ఇదొకటి మాట్లాడటం పొరపాటు. అట్లా కాకుండా మేము ఒకటే మాట చెపుతున్నాము. మా గ్రంథాల్లో ఏ గ్రంథములోనైనా ఏ మతాన్నయినా గానీ నేను బోధించినట్లు మీకు తెలిస్తే, ఆ గ్రంథము మాకు తెచ్చి చూపించండి, పది లక్షలు బహుమానం మీకు ఇస్తాము. చర్చావేదిక పెట్టించి, ఆ గ్రంథము కరెక్టో, కాదో వాళ్ళ చేత చెప్పించి, ఎందుకంటే నీవు ఒక్కడివే కాదు కదా! తెలియదు అంటే మేము ఒప్పుకోము. నీవు చాలా చెప్పుతావు కానీ పదిమంది పెద్ద మనుష్యులు కలిసి చెప్పితే వాళ్ళు నిజంగానే మతమార్పిడి గురించి, మతాల గురించి మాట్లాడినారు, వ్రాసినారు అని చెప్పితే మేము పది లక్షలు ఇచ్చే దానికి సంసిద్ధంగా ఉన్నాము. మరి చేతనైతే మా గ్రంథాలను తీసుకొని ముందుకు రండి ఎవరైనా? అని భువనగిరి వాళ్ళకు చెపుతున్నా నేను. మీరు పోయి చెప్పండి పర్వాలేదు, నేను కరపత్రం కూడా ఇస్తాను మీరు వెళ్ళి పంచండి పర్వాలేదు. వాళ్ళకే కాదు, అందరికి అంటే దేశమంతా ఇస్తాను.

కాబట్టి మేము ఏమి చెప్తున్నామంటే దేవుని విషయంలో చాలా జాగ్రత్తగా ఉండండి, పొరపాటున కూడా ఎవరూ మాట్లాడవద్దు, మాట్లాడితే లేనిపోని భయంకరమైన పాపము వస్తుంది. అది ఏ రూపంలో అనుభవించాల్సి వస్తుందో ముందే ఎవరికీ తెలియదు, కానీ బాధలను మాత్రము తప్పనిసరిగా అనుభవించాల్సి వస్తుంది. కాబట్టి ఇప్పటినుండి

చాలా జాగ్రత్తగా ఉండండి. దేవుని విషయంలో మాత్రం చాలా మెలుకువగా ఉండి మాట్లాడండి. మీరు ఒకవేళ ఈ విషయాన్ని తెలుసుకొని, భక్తిగా ఉన్నాగానీ, జాగ్రత్తగా ఉండండి. లేకుంటే ఉల్టా కొట్టడానికి అవకాశం ఉంది. మీలా ఇంతకు ముందు పెద్ద జ్ఞానులము అనిపించుకున్న వాళ్ళు కూడా వెనక్కి పోయారు. మాయ ఎవరినైనా మార్చేస్తుంది.

కాబట్టి మీరు కూడా అలా లేకుండా ఉండండి. అట్లే వేరే వాళ్ళకు కూడా చెప్పండి మీకు తెలిసిన విషయము. మాయ అనేది దేవుని సొమ్ము. దేవుడనుకుంటే మాయే పని చేసి మిమ్మల్ని ప్రక్కకు పంపిస్తుంది. దేవుడు పంపించడు. మాయే పంపిస్తుంది మిమ్మల్ని. కాబట్టి జాగ్రత్తగా ఉండండి అని చెప్పండి. కాబట్టి దేవుని విషయంలో చాలా జాగ్రత్తగా ఉండండి అని చెప్తూ ఇంతటితో ముగిస్తున్నాము.

~ ఓం తత్సత్ ~

## 89. తల్లి - తండ్రి

**(తేది :- 11.10.2011)**

ఈ రోజు మీకు ఒక క్రొత్త గ్రంథము వచ్చింది **'సమాధి'** అనే గ్రంథము. ఇంతకుముందు పౌర్ణానికి **"పునర్జన్మ రహస్యము"** అనే గ్రంథము వచ్చింది. ఈ పునర్జన్మ రహస్యమునకు, ఈ సమాధి అనే గ్రంథము అనుబంధముగా ఉంటుంది. దానికి దీనికి సంబంధము ఉంటుంది. దానితో కనెక్షన్‌గా ఉంటుంది కాబట్టి అది చదివిన తర్వాత ఈ గ్రంథము చదివితే బాగుంటుందని, ఈ గ్రంథాన్ని ఇప్పుడు రిలీజ్ చేశాము. ఈ

గ్రంథములో ఉండే విషయాలు మీకు క్రొత్తగా ఉంటాయి. ఎందుకంటే ఇందులో ఎక్కువ ఖురాన్‌లో ఉండేటటువంటి వాక్యాలను తీసుకొని చెప్పడము జరిగినది. ఇవి క్రొత్తగా ఉంటాయి కాబట్టి జాగ్రత్తగా చదువుకొని, అర్థము చేసుకుంటారని అనుకొంటున్నాము. ఇక ఇప్పుడు చెప్పబోయేది ఏమంటే "తల్లి–తండ్రి" అనేటటువంటి పదము బహుశా అందరికి తెలుసు. ప్రతి మనిషికి అంటే తెలివి ఉన్నవానికి, తెలివి లేనివానికి, చిన్నపిల్లోనికి, పెద్దోనికి ఎవ్వరికైనా గానీ తల్లి–తండ్రి అని అంటే ఫలానా వాళ్ళు అని గుర్తింపు ఉంటుంది. మిగతా విషయాలు ఏవీ గుర్తింపులేకున్నా గానీ, తల్లి–తండ్రి విషయములో మాత్రము చాలా గుర్తింపు ఉంటుంది. ఒకవేళ పెద్ద వయస్సు వచ్చిన తర్వాత అడిగినా గానీ అదే చెప్తుతాము. చిన్న వయస్సులో వచ్చినాగానీ వాళ్ళనే చెప్పుతాము. వేరే వాళ్ళను మార్చము అన్నమాట. పెద్ద వయస్సు వచ్చిన తర్వాత ఇంకొకరిని, చిన్నవయస్సులో ఇంకొకరిని చెప్పము కదా! ఎప్పటికీ ఒకటే తల్లిదండ్రులని మనము చెప్పుచుంటాము.

ఈ రకంగా తల్లి–తండ్రి అనేటటువంటి వాళ్ళు ప్రతి మనిషికీ ఉన్నారు. ఆ విషయము అందరికి తెలుసు. దానిని గురించే చెప్పుచూ ఉంటారు. ఆ తల్లి, తండ్రీ అనేవాళ్ళు మనకు ఉన్నారు అని ఇక్కడ మనము బయటకు చెప్పుకున్నా ఈ తల్లి, తండ్రి అనేవాళ్ళు సమంజసమా! అసమంజసము, అనే యోచన చేయాల్సిన పని వస్తుంది. తల్లి, తండ్రి అనే పదము అందరికి తెలిసినా కానీ, వాస్తవముగా తల్లితండ్రులు ఎంతమందికి తెలుసు? అని అంటే అందరికీ తెలుసు అని చెప్పుతాము. కానీ ఇక్కడ రెండు రకాలుగా ఉన్నారని జ్ఞానము లేనివాళ్ళు, జ్ఞానము ఉన్నవాళ్ళు అనేటటువంటి వారికి తల్లి తండ్రి యొక్క విధానము రెండు రకములుగా

కలదు. జ్ఞానము లేనివాళ్ళు, ప్రపంచములో ఉన్నటువంటి వాళ్ళు అందరూ, మొత్తము ఫలానావాళ్ళు నాకు తల్లితండ్రులు అని వేలుపెట్టి చూపించగలిగితే, జ్ఞానము ఉన్నటువంటి వాళ్ళు కొద్దిగా సంశయపడాల్సిన పని వస్తావుంది. అదేమి విషయము ఎందుకు? జ్ఞానము ఉంటేమి, జ్ఞానము లేకపోతేమి? చిన్న వయస్సులోగానీ, పెద్ద వయస్సులోగానీ ఒకే తల్లి, తండ్రుల పేర్లు మనము చెప్పి, ఒకే వ్యక్తులను మనము చూపినప్పుడు జ్ఞానము లేనప్పుడు ఒక రకము, జ్ఞానము ఉన్నప్పుడు ఒక రకము అనేది ఎట్లా వచ్చింది? అని మనము ప్రశ్నించుకొని చూస్తే, జ్ఞానము లేనప్పుడు చాలామందికి తల్లి, తండ్రుల విషయము తెలుసు. తల్లితండ్రులు గొప్ప వాళ్ళు అని తెలుసు.

తర్వాత ఇంకా కొంతమంది ఏమి చేస్తున్నారంటే తల్లి-తండ్రులు పూజ్యం భావము కలిగినటువంటి వాళ్ళు, పూజ్యనీయులు అంటే మనము గౌరవింపతగినటువంటివాళ్ళు. తర్వాత మనము పూజ చేయాల్సి నటువంటి వాళ్ళు అని కూడా తెలుసు. ఇంకా కొంతమంది మామూలుగా ప్రతి నిత్యము తల్లి, తండ్రికి పాదనమస్కారము చేసుకునే వాళ్ళు కూడా ఉన్నారు. ఇంకా కొంతమంది ఏమి చేస్తున్నారంటే 'తల్లి-తండ్రి, గురువు-దైవము' అని చెప్పుచున్నారు. అంటే మొట్టమొదట తల్లికి నమస్కారము చేయాలి, తర్వాత తండ్రికి నమస్కరించాలి, ఆ తర్వాత గురువుకు, ఆ తర్వాత దేవునికి అంటున్నారు. మొట్టమొదట తల్లి ముఖ్యమైన దైవము అని చెప్పుచున్నారు. ఇంకా కొంతమంది ఏమి చెప్పుచున్నారంటే 'మాతృదేవోభవ', 'పితృదేవోభవ', 'ఆచార్య దేవోభవ' అంటున్నారు. అంటే మొట్టమొదట తల్లే పెద్ద దేవత. తర్వాత తండ్రి, తర్వాత ఆచార్యుడు అంటే గురువు తర్వాత దేవుడు అని ఇట్లా గురువును మూడోస్థానానికి చేర్చారు. దేవున్ని ఏకంగా నాలుగో స్థానములోకి చేర్చారు. తల్లిని మొదటి

స్థానములోకి పెట్టినారు. మళ్ళీ ప్రపంచములో ఇంతమంది ఇన్ని రకాలుగా చెప్పుచున్నప్పుడు పరమాత్మ జ్ఞానము తెలిసినటువంటి వాళ్ళు ఆ మాటను ఎందుకు చెప్పలేకపోయినారు. ఇప్పుడు చెప్పే వాళ్ళు కూడా అంతో, ఇంతో జ్ఞానము తెలిసినటువంటి వాళ్ళే కదా! ఈ మాట చెప్పేది. ఏ జ్ఞానము లేనటువంటి వాళ్ళు, సంస్కృతము రానటువంటి వాళ్ళు, వాళ్ళకు ఏమీ తెలియదు. ఏ జ్ఞానము తెలియదు. అటువంటి వాళ్ళు తల్లి గొప్పది అనవచ్చు, అనుకుంటూ పోవచ్చు. సంస్కృతము తెలిసినటువంటి వాళ్ళు, కొంత జ్ఞానము తెలుసుకొన్నటువంటి వాళ్ళు కూడా మాతృదేవోభవ అంటున్నారు. తర్వాత తల్లి తండ్రి–గురువు దైవము అంటున్నారు. కాబట్టి ఈ జ్ఞానము ఉన్నవాళ్ళు, జ్ఞానము లేనివాళ్ళు ఒకటే మాటను చెప్పుచున్నారు కదా! అంటే, మనము ఇంకా కొంత లోతుకు పోయి చూడాల్సిన పని వస్తావుంది. అంటే ఈ ప్రపంచ జ్ఞానము ఉన్నప్పుడు ఏ రకంగా తల్లి తండ్రీని మనము లెక్కించుకుంటున్నామో అందరూ ఇదే విధముగా లెక్కించుకుంటున్నాము. ప్రతి ఒక్కరికి కనిపించేటటువంటి తల్లితండ్రులు తెలుసు. వాళ్ళ పేరే మనము చెప్పుకుంటున్నాము. కానీ పరమాత్మ జ్ఞానము తెలిసినప్పుడు నీవు ఎవరికి పుట్టావు? అని ఒక గురువు ఒక శిష్యున్ని ప్రశ్నించినాడంట ఒక సందర్భములో అంటే మా అమ్మా–నాన్నాకు పుట్టాను అని చెప్పినాడంట ఎవరు? అని అంటే, ఫలానావాళ్ళు అని చెప్పాడు.

ఇంకొక వ్యక్తి ఒక ఉద్యోగానికి పోయినప్పుడు అప్లికేషన్ ఫారమ్‌లో పేరెంట్స్ అని ఉండేటటువంటి చోట మామూలుగా తల్లి–తండ్రుల పేర్లు వ్రాశాదన్నమాట. అట్లా అప్లికేషన్‌లోగానీ, ఎవరన్నా ప్రశ్న అడిగినప్పుడుగానీ శరీర తల్లితండ్రుల పేర్లే మనము చెప్పుచున్నాము. ఆ విధముగానే ఒక

గురువు ఒక శిష్యున్ని అడిగితే, మీ తల్లి-తండ్రులు ఎవరు? అని అంటే ఫలానావాళ్ళు అన్నాడు. నీవు ఎవరికి పుట్టావు? అంటే ఫలానా వాళ్ళకే పుట్టాను అని చెప్పాడు. సరే! ఇంకొకన్ని లేపి అడిగాడన్నమాట తన దగ్గర ఎంతోమంది జ్ఞానము వినేవాళ్ళు ఉన్నారు. శిష్యులు ఉన్నారు కదా! మళ్ళీ ఇంకొకరిని శిష్యున్ని అడిగాడు. నీ తల్లితండ్రులు ఎవరు? అంటే ఇప్పుడు తెలిసి వీళ్ళు ఉన్నారు. తెలియక ఉండేవాళ్ళు ఎవరుండారో నాకు తెలియదు అన్నాడు. అంటే ఇప్పుడు తెలిసినవాళ్ళు కొంతమంది, తెలియని వాళ్ళు కొంతమంది ఉంటారా! దేశములో ఎక్కడన్నా? కానీ తెలిసే ఉంటారు కదా! అంటే వాస్తవముగా ఇప్పుడు పైన కనిపించే వాళ్ళు వీళ్ళే. అది మళ్ళీ ధైర్యముగా చెప్పాడన్నమాట. ముందు అటూ, ఇటూ చెప్పి మళ్ళీ వీళ్ళేను అని చెప్పాడు. సరే ఇంకొక శిష్యున్ని లేపి అడిగాడు. ఏమని అడిగారు? నీ తల్లితండ్రులు ఎవరు? అని అంటే అతను మౌనముగా ఉండిపోయాడు.

సరేలే, నీవు ఎవరికి పుట్టావు అని రెండో ప్రశ్న వేశాడు ఆయన. ఎట్లైనా ఒకటే కదా! నీవు ఎవరికి పుట్టావు అన్నా ఒకటే, నీ తల్లితండ్రులు ఎవరు? అన్నా అడిగినా ఒకటే అవుతుంది. నీవు ఎవరికి పుట్టావు? శిష్యుడు ఏమి చెప్పాడంటే వీళ్ళకే, కనిపించేవాళ్ళకే అని చెప్పాడు. మొదట కొంత అనుమానము పడి, వాడేమి ఇలా అందరూ చెప్పినది నేను చెప్పితే బాగుంటుందో, బాగుండదో కొంత వేరైటీగా చెప్పితే బాగుండును అని అనుకున్నాడుగానీ, అంతే తప్ప వానికి తెలిసి ఏమి చెప్పలేదన్నమాట. మళ్ళా ఈయన రెండో ప్రశ్న అడిగితే నీవు ఎవరికి పుట్టినావు? అని అడిగినప్పుడు కనిపించే వాళ్ళనే చూపించాడు. కనిపించే ఫలానా తండ్రి, ఫలానా తల్లికి మేము పుట్టాము. వాళ్ళిద్దరు నాకు తల్లిదండ్రులని అన్నాడు. అప్పుడు మళ్ళీ ఇంకొక శిష్యున్ని కూడా ఆయన లేపి అడగడము జరిగింది.

ఏమని, నీ తల్లితండ్రులు ఎవరు? అని అంటే, అతనూ మౌనముగా ఉండిపోయాడు. సరేలే నీవు ఎవరికి పుట్టినావు? అంటే అప్పుడు కూడా మౌనముగా ఉన్నాడు. మళ్ళా ఇప్పుడు వీళ్ళందరు ఫలానా వాళ్ళు తల్లి, తండ్రులని చెప్పుచున్నారు కదా! నీకూ అలాంటి వాళ్ళు ఉంటారు కదా! మళ్ళీ నీవు ఎందుకు చెప్పకుండా ఉన్నావు? అని అంటే, నేను పుట్టలేదు కదా! అన్నాడు ఆ శిష్యుడు. నేను వాళ్ళకు పుట్టలేదు అన్నాడు. వాళ్ళకు పుట్టలేదు అంటే ప్రక్కనుండే వాళ్ళు పక్కున నవ్వినారు. నేను ఆయనకు పుట్టలేదు. కాబట్టి ఆయన నాకు తండ్రి కాదు అని చెప్పాడు. మళ్ళా తల్లి అంటే ఆమెకు కూడా నేను పుట్టలేదు అన్నాడు. ఆమెకు పుట్టలేదు, ఆయనకు పుట్టలేదు అయితే నేను పుట్టనప్పుడు వాళ్ళు నాకెట్ల తల్లితండ్రులు అవుతారు?

కాబట్టి వీళ్ళు నాకు తల్లితండ్రులు కారు. నేను వాళ్ళకు పుట్టలేదు. అంటే ప్రక్కనుండే వాళ్ళు ఇప్పుడు నాలుగైదుమంది సమాధానము చెప్పారు కదా! ఆ నాలుగైదుమంది సమాధానము చెప్పిన తర్వాత ఇప్పుడు ఈ మనిషి ఈ మాట అంటే, వాళ్ళంతా ఏమి తెలివితక్కువవాడు వీడు, మాకంతా తెలిసింది వీనికి తెలియదా! వీడు పుట్టలేదు అంటున్నాడు. వీళ్ళకు పుట్టలేదు అంటాడు. వీడు వీళ్ళకు పుట్టకపోతే ఎవరికి పుట్టినాడు వీడు అని వాళ్ళు మనసులో అనుకున్నారన్నమాట. ఇది మనము కూడా అనుకుంటాము ఆ మాట. వాడు చెప్పడము పొరపాటు. కనిపించే తల్లి, తండ్రులు ఉన్నారు కదా! వాళ్ళకే పుట్టినాడు కదా! ఇప్పుడు వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకొని కొన్నాళ్ళు కాపురము చేసిన తర్వాత వీళ్ళకు పుట్టడము జరిగింది. పుట్టిన తర్వాత ఫలానా పేరు వాళ్ళే పెట్టారు. అన్నీ అయి పెరిగిన తర్వాత ఇప్పుడు నేను వాళ్ళకు పుట్టలేదు అంటే తప్పుకదా! అని వాళ్ళంతా అనుకున్నారు. వాళ్ళంతా అనుకోవడమే కాకుండా మనము కూడా ఆ

రకంగానే అనుకుంటాము. వాడు చెప్పడము పూర్తి తప్పు అని అయితే అది వాస్తవముగా తప్పా? తప్పు అయినా అయితే అంతగ్రుడ్డిగా అతను అంత తప్పుగా ఎట్లా చెప్పుతాడు? అతను అంతో, ఇంతో ఆత్మజ్ఞానము, పరమాత్మ జ్ఞానము తెలిసినటువంటి వ్యక్తి. అప్పుడు ఈ గురువు మళ్ళీ విషధముగా అడిగాడు. నీవు పుట్టలేదు అంటున్నావు, వాళ్ళంతా పుట్టినాము అనుకుంటున్నారు. వాళ్ళు పుట్టినట్లు నీవు ఎందుకు పుట్టలేదు? అని అడిగాడు. దానికి అతను నేనే కాదు, వాళ్ళు కూడా పుట్టలేదు. వాళ్ళు పొరపాటుపడి మేము పుట్టినాము అని చెప్పుచున్నారు అని చెప్పాడు. వీడెంత తెలివి తక్కువవాడు, వాడంటే పొరపాటుపడినాడు అనుకో! మమ్మల్ని కూడా పొరపాటు చేస్తున్నాడు వీడు. మేము కూడా పుట్టలేదు అంటాడు. వీడెక్కడ మనిషి అని అక్కడున్నవారు అనుకున్నారు. వాస్తవముగా ఈయన, మనకు చెప్పేమాట ఎట్లుందంటే లోకవిరుద్ధముగా కనిపిస్తావుంది. కానీ నూటికి నూరుపాళ్ళు సత్యమని ప్రశ్నించిన ఆ గురువుకు తెలుసు.

ఆ రకంగా అందరూ సందిగ్ధములో పడినప్పుడు అతని గురువు ఏమి చెప్పినాడంటే ఇప్పుడు ఇంతమంది ఈ ప్రశ్నకు జవాబు చెప్పినారు. ఈ ప్రశ్నకు ఈ జవాబు చెప్పినటువంటి వాళ్ళలో, ఈ మనిషే సరైన సమాధానము చెప్పినాడు. చివరిలో చెప్పినటువంటి ఈ మనిషే కరెక్టుగా చెప్పాడు. ఏమని? కనిపించే తల్లి తండ్రికి పుట్టలేదు. ఈయన కూడా పుట్టలేదు. అది నూటికి నూరుపాళ్ళు వాస్తవమే! అప్పుడు గురువు మాట విన్న వారందరూ ఈయన కూడా వాని ప్రక్కకు పోయినాడు అనుకున్నారు. గురువు కూడా అతని ప్రక్కే మాట్లాడుతున్నాడే అనుకున్నారు. కానీ ఇప్పుడు సమస్య ఏమంటే, గురువు దానికంతా సమాధానము చెప్పాలిసిన పని వచ్చింది. ఇప్పుడు వీడేమో సత్యము చెప్పుచున్నాడు. వాళ్ళేమో వీడు

తప్పు అనుకున్నారు. ఇప్పుడు దానికి సమాధానము ఇది సత్యము, ఇది అసత్యము అని గురువే చెప్పాలి కదా! అప్పుడు గురువు ఏమి చెప్పాడు అంటే "ప్రపంచములో అంటే ప్రతి ఒక్కడు పుట్టాడు కానీ, ఎప్పుడు పుట్టినాడని తెలియదు. ఏమనుకుంటున్నారు నేను పుట్టి, నా వయస్సు 40 సంవత్సరములు, నా వయస్సు 50 సంవత్సరాలు, నా వయస్సు 60 సంవత్సరాలు అనుకుంటున్నారు మీరు. అది నీ వయస్సు కాదు, నీ శరీరానికి వయస్సు అది. నీ శరీరము పుట్టి 40-50 సంవత్సరాలు అయిండవచ్చు. కానీ నీవు పుట్టినప్పటి నుండి ఉన్న వయస్సు కాదది."

నీవు ఎప్పుడు పుట్టావు? అంటే జగతి పుట్టినప్పుడు, సృష్ఠి ఆదిలో నీవు పుట్టావు. 'మనిషికి ఒకే జన్మ కలుగుతుంది' మనిషి ఒకేసారి జన్మిస్తాడు మళ్ళీ, మళ్ళీ జన్మించడు అని చెప్పాడు. ఒకేసారి జన్మించేది ఏమిటి? మనము సృష్ఠి ఆదిలో పుట్టినాము అనేది వాస్తవమే గానీ, ఇప్పుడు మళ్ళీ పుట్టినాము కదా! అని కొందరికి అనుమానముండవచ్చును. దానికి జవాబు ఏమనగా! మళ్ళీ పుట్టింది నీ శరీరము నీవు కాదు. ఒక పక్షి ఒక చెట్టు మీద కూర్చొంది అనుకోండి. పక్షి ఎందుకు కూర్చుంది? అంటే దానికి ఆహారము దొరికే దానికోసము, దాని ఆహారము దొరికే నిమిత్తము అది బ్రతికే నిమిత్తము ఒక గంటసేపు ఒక చెట్టు మీద కూర్చుంది. మళ్ళీ ఆ చెట్టు విడిచిపెట్టి ఇంకొక తుమ్మచెట్టు మీదికి పోయి వాలింది. దానిమీద తొండలో, బల్లులో ఉంటాయి అని వేపచెట్టు మీద ఎంతసేపు కూర్చుంది? ఒక గంటసేపు కూర్చుంది అనుకుందాము. మళ్ళీ తుమ్మచెట్టు మీదికి పోయింది ఒక అర్ధగంటసేపు కూర్చుంది. మళ్ళీ అక్కడి నుంచి లేచిపోయింది ఇంకొక చెట్టుమీద కూర్చుంది. అక్కడి నుంచి, అక్కడ కొద్దిసేపు కూర్చుని మళ్ళీ అక్కడి నుంచి లేచిపోయి, మళ్ళీ ఇంకొక చెట్టుమీద కూడా కూర్చోవడము జరిగింది.

ఈ రకంగా ఈ పక్షి ఏమి చేసింది అంటే తను బ్రతికే నిమిత్తము ఈ చెట్టు మీద కొంచేపు, ఆ చెట్టు మీద కొంచేపు, ఈ రకంగా అది ఉంటూ పోయింది. ఇప్పుడు వేప చెట్టు మీద ఎంతసేపు ఉంది? అంటే గంటసేపు అని చెప్తాము. తుమ్మచెట్టు మీద ఎంతసేపు ఉంది? అంటే అరగంటసేపు అంటాము. గిరశపు చెట్టు మీద ఎంతసేపు అంటే గంటసేపు అని చెప్తాము అనుకోండి. అది ఉండే దానినిబట్టి చెప్తాము. అది ఎంత టైమ్ ఉందో అంత టైమ్ అని చెప్పుచున్నాము. ఈ రకంగా ఒక చెట్టు మీద ఉండే సమయము వేరువేరుగా ఉండాయి గానీ, పక్షి మాత్రము ఒక్కటే కదా! పక్షి ఇక్కడి నుంచి లేచిపోయి ఆ చెట్టుమీద కూర్చొని ఉంది, ఆ చెట్టు మీద వాలినప్పుడు దానిని తుమ్మచెట్టు మీద పక్షి అంటున్నాము. మళ్లీ గిరిశపు చెట్టు మీద వాలినప్పుడు గిరిశపు చెట్టుమీద పక్షి అంటున్నాము. వేపచెట్టు మీద వాలినప్పుడు వేపచెట్టు మీద పక్షి అంటున్నాము. తుమ్మ చెట్టుమీద ఎంతసేపు ఉంది అంటే దాని సమయము చెప్తాము. ఈ రకంగానే 'ఈ పక్షిలాంటి వాడు జీవుడు'. ఈ జీవుడు ఎప్పుడు పుట్టాడు? అంటే 'సృష్టి ఆదిలో దేవుని చేత పుట్టించబడినాడు. సృష్టిఆదిలో దేవుని చేత సృష్టింపబడ్డాడు. జీవునికి ఎప్పటికీ మరణము లేదు. జీవుడు ధరించిన శరీరానికి మరణము ఉంది. ఇప్పుడు ఒక శరీరములో కొంతకాలము ఉన్నటువంటి జీవుడు, ఈ చెట్టు మీద కొంతకాలముండి పక్షి లేచిపోయి ఇంకొక చెట్టు మీద వాలి ఉన్నట్లు, ఒక శరీరములో కొంతసేపు ఉన్నటువంటి, కొంత కాలమున్నటువంటి జీవుడు ఆ శరీరము శిథిలావస్థకు వచ్చినప్పుడు దానిమీద ఉండేదానికి, దానిలో ఉండేదానికి యోగ్యముకానప్పుడు, ఆ శరీరాన్ని వదలిపెట్టి ఇంకొక శరీరాన్ని ఆశ్రయించడము జరుగుతావుంది.

ఆ రకంగా శరీరాన్ని ఆశ్రయిస్తున్నాడు. ఏ శరీరాన్ని ఎంతసేపు ఆశ్రయించాడు అనేది కొలతవుంది కానీ, జీవునికి కొలత లేదు. వీడు మొదటినుంచి ఉన్నటువంటివాడు, జీవుడు. ఒక శరీరములో ఉన్నాడు అంటే ఆ శరీరము యొక్క ఆయుష్షును చెప్పవచ్చు కానీ, జీవునికి ఆయుష్షును చెప్పేదానికి కాదు. జీవుని ఆయుష్షు ఎంత? అంటే సృష్ఠి ఆది నుండి ఇప్పటికి ఎంత జరిగిందో అంత. ఇప్పుడు నీ ఆయుష్షు ఎంత అని ప్రశ్నిస్తే మనము ఏమి చెప్పాలి. ఎంతవరకు ఉంటాదో మనకు తెలియదు. నీవు జీవునివే, నీవు మోక్షము పొందేంత వరకు ఉండవచ్చు. మోక్షము తొందరగా పొందుతావో, తొందరగా పొందవో నీకు తెలియదు. కానీ జీవుని యొక్క అంత్యం ఎప్పుడు? అంటే ఒకటుంది. అంత్యముంది, పుట్టుకా ఒకటివుంది, నాశనము కూడా ఒకటుంది. అది మోక్షము పొందినప్పుడే నాశనము అయ్యేది. భగవద్గీతలో 'పురుషోత్తమ ప్రాప్తి యోగము' అనేటటువంటి అధ్యాయములో ఏమి చెప్పాడంటే జీవున్ని క్షరుడు అన్నారు. 16, 17 శ్లోకాలలో ఇది చెప్పబడింది. ఈ వీని పేరు క్షరుడు అని చెప్పారు. ఎవని పేరు? జీవుని పేరు క్షరుడు అంటే నాశనము అయ్యేటటువంటి వాడు. ఇది ఎప్పుడో ఒకసారి కాలము జరిగి జరిగి, ఎప్పుడో ఒకసారి నాశనము అవుతాడు. ఎప్పుడు నాశనము అయితాడంటే, ఈ శరీరాన్ని వదిలిపెట్టి 'మోక్షము' పొందినప్పుడు ఇంకొక శరీరాన్ని ఆశ్రయించు కోకుండా, మోక్షము పొందినప్పుడు వాడు నాశనమైపోతాడు. అప్పుడు నాశనమైనప్పుడే, ఇంకా వాడు లేడు. కాబట్టి ఇంకొక శరీరములోకి చేరుకోవలసిన అవసరము లేదు.

ఈ రకంగా జీవుడు ఒకసారే పుడతాడు, ఒకసారే నశిస్తాడు. ఇప్పుడు మళ్ళీ మనము పుట్టామే అంటే, నీవు పుట్టలేదు, నీ శరీరము

పుట్టింది అర్థమయిందా! ఎవరైనా పునర్జన్మ తీసుకున్నారు. పునర్జన్మ అంటే నీ శరీరము పుట్టింది కాబట్టి దానిని 'పునర్జన్మ' అంటున్నాము. ఇంకొక శరీరములో చేరుతున్నావు కాబట్టి దానిని పునర్జన్మ అంటున్నాము. కానీ జన్మ అనకూడదు అని **'పునర్జన్మ రహస్యము'** అని పోయిన నెలలో విడుదల చేసిన గ్రంథములో బాగా క్లియర్‌గా వ్రాసి ఇచ్చాము. జన్మవేరు, పునర్జన్మ వేరు. మనిషికి పునర్జన్మలు ఎన్నైనా ఉండవచ్చు జన్మ మాత్రము ఒక్కటే! అది ఎప్పుడు? మొట్టమొదట సృష్టి ఆదిలో నీవు జన్మించినావు. ఆ జన్మ అట్లే ఉంది నీకు అని చెప్పడము జరిగింది. మీకు జ్ఞప్తికి ఉందో లేదో, మీరు చదువుకొన్న వాళ్ళకు మతికే ఉంటుంది అది. ఇప్పుడు ఆ లెక్కప్రకారము పోతే నీవు జన్మించినేది ఒక్కసారి అయితే, జన్మించినేది ఒక్కసారే కదా! జన్మించినేది ఒక్కసారి అయితే ఎవరికి పుట్టినావు నీవు? అని ప్రశ్నించుకొంటే దానికి జవాబు ప్రకృతి పరమాత్మకు పుట్టావు అని చెప్పవచ్చు. భగవద్గీతలో 'గుణత్రయ విభాగ యోగము' అనేటటువంటి అధ్యాయములో మొట్టమొదట మూడవ శ్లోకములోనే చెప్పబడింది. ఏమని చెప్పాడంటే ప్రకృతి నీకు తల్లి 3వ శ్లోకము, 4వ శ్లోకములో అంటే నేను ప్రకృతికి 'బీజదాత' గా ఉన్నాను. సర్వ జీవరాసులూ నా వల్లే పుడుతున్నాయి. సర్వ జీవరాసులకు శరీరాన్ని ప్రకృతి తయారు చేసి ఇస్తావుంది. కాబట్టి ఈ ప్రకృతి తల్లిలాంటిది. నేను తండ్రిని అని చెప్పాడు. ప్రకృతి తల్లి, నేను తండ్రిని ఎవరికి? ఆ సర్వజీవరాసులకు అంటే ఒక మనిషిగా కాకుండా ఏ రూపములో పుట్టినా కానీ, ఏ గర్భములో పుట్టినటువంటి జీవరాశికైనా గానీ నేనే తండ్రిని, తల్లి ప్రకృతి అని చెప్పాడన్నమాట. ఇప్పుడు తల్లి-తండ్రి ఎవరు అనేది తెలిసింది. మనము చెప్పుకొన్నట్టు కాదు. దేవుడు చెప్పినట్టు భగవద్గీతలో భగవంతుడు చెప్పిన ప్రకారము తల్లి, తండ్రి ప్రకృతి-పరమాత్మే

జీవునికి అని తెలిసింది. ఈ శరీరాన్ని తయారు చేసి ఇచ్చింది ప్రకృతి. అందులో చైతన్యం ఇచ్చి నిన్ను కదిలించేవాడు దేవుడు. కాబట్టి ప్రకృతికి బీజదాతగా ఉన్నటువంటి దేవుడు. నీకు తండ్రి పరమాత్మే, తల్లి ప్రకృతి అని అక్కడ క్లియర్‌గా చెప్పాడన్నమాట. అయితే అదే విషయాన్నే మనము తీసుకొని వచ్చి ఈ జ్ఞానము ప్రకారమే ఈ గురువు అడిగినప్పుడు శిష్యుడు ఏమి చెప్పాడు? నేను వీళ్ళకు పుట్టలేదు అన్నాడు. ఎవరికి పుట్టినది తెలియుటకు భగవద్గీతలో శ్లోకము చెప్పినాడాయన ఏమని? **"సర్వ యోనిషు కౌంతేయ మూర్తయ్య సంభవంతి యాహా' అని అంటే, ఏ యోనిలో పుట్టినటువంటి వాడైనాగానీ అటువంటి వాడికైనా గానీ తల్లి ప్రకృతి, తండ్రిని నేను"** అని చెప్పినటువంటి శ్లోకాన్ని ఈయన చెప్పినాడు. కాబట్టి ప్రకృతే తల్లి, పరమాత్మే తండ్రి అని చెప్పాడన్నమాట.

ఈ రకంగా ఈ ప్రకృతి, పరమాత్మలు ఇద్దరూ తల్లి తండ్రులుగా ఉన్నప్పుడు వేరేవాళ్ళ పేర్లు నేను ఎట్లా చెప్పాలా అన్నాడు శిష్యుడు. నిజమైన తల్లి-తండ్రి ఎవరైతే ఉన్నారో, నాకు ఎవరైతే తల్లి-తండ్రులలో వాళ్ళ పేర్లు చెప్పుతాగానీ నా శరీరానికి తల్లితండ్రులైనప్పుడు వాళ్ళ పేరు నేను చెప్పాల్సిన పని లేదు. నీవు నన్ను అడుగుతున్నావా? నా శరీరానికి తల్లితండ్రులని అడుగుతున్నావా? అంటే నీకు తల్లితండ్రులు ఎవరు? అని అడిగాడు గురువు గారు. నీ శరీరానికి తల్లితండ్రులు ఎవరు? అని అడగలేదు, ఇప్పుడు పైకి కనిపించే దానికి, నీ శరీరానికి కారణ భూతులుగా కన్పిస్తున్నారు. వీళ్ళు కూడా కారణము కాదు. నీకు ప్రాక్టికల్‌గా అర్థమయ్యేదానికి, ఒక స్త్రీ, ఒక పురుషుడు ద్వారా నీవు పుట్టినట్టు తెలియుటకు ఒక శరీరాన్ని పుట్టింపజేస్తున్నాడు. అంతేకానీ వాస్తవము వెనుదిరిగి చూస్తే, ఆ లోపల జరిగేటటువంటి విధానము చూస్తే వీళ్ళు కూడా కారణము కాదు అని

తెలుస్తుంది. సరే, మనకు పైకి కనిపించే కారణము ప్రకారము చూస్తే, ఇప్పుడు పైకి కనిపించే తల్లి, తండ్రులు ఉన్నారు. నీ శరీరానికి తల్లి–తండ్రులున్నారు నీకు కాదు. నీకు తల్లి తండ్రులు ఎవరు? అని అంటే, శాశ్వితముగా ఎప్పటికీ 'ఒకరే తండ్రి (పరమాత్మ), ఒకరే తల్లి (ప్రకృతి). నీకు ఒక తండ్రి ఉన్నప్పుడు, ఇంకొక తండ్రి పేరు చెప్పాలిసిన పని లేదు. 'పొరపాటుగా ఎక్కడైనాగానీ ఎవ్వరినీ తండ్రి అని పేరు పెట్టి పిలవవద్దు అని చెప్పినారా? లేదా? మూల గ్రంథాలలో దేవుడు చెప్పినాడా? లేదా? మూల గ్రంథాలలో మత్తయి 23–9లో ఇలా చెప్పాడు దేవుడు? **"తండ్రి అని ఎవరినీ పేరుపెట్టి పిలవద్దు. ఒక్కడే మీ తండ్రి ఆయన పరలోక మందున్నాడు"** అని చెప్పినాడు. మీ తండ్రి శాశ్వితుడైనట్టి వాడు పరలోకములో ఉన్నాడు. నీవు తండ్రి అని ఎవ్వరినీ పేరుపెట్టి పిలవవద్దు అని ద్వితీయ దైవ గ్రంథమయిన ఇంజీలులో చెప్పాడు. నీ శరీరానికి తండ్రి అయినవాడు ఒకడుంటాడు. వానిని పిలుచుకో నీవు కావలసి ఉంటే అదియు వివరము తెలిసి తాత్కాలిక తండ్రిగా పిలచుకో. శాశ్విత తండ్రి అని ఎవరినీ పేరు పెట్టి పిలవవద్దండి. మేము ఏమి చెప్పుచున్నామంటే ఇక్కడొక చెడు సాంప్రదాయము వచ్చింది మనకు. అంటే, ఈ భక్తుల్లో, జ్ఞానులలో వీళ్ళంతా ఏమంటే మా ఇంట్లో వాళ్ళని చూస్తే నాన్న అని పిల్చేది మొదలుపెట్టినారు. నాయన అని అది నాయన, ఇది నాయన అంటే రూలుకంతా వ్యతిరేఖము నేనే చెప్పుచున్నాను. అట్లా పిలువకూడదని దేవుడు ఈ రకంగా చెప్పినాడని చెప్పుచున్నాను, మళ్ళీ మీరు నాయన, అనకూడదంటే మాకు అట్ల అలవాటు అయింది అంటారు. సరే నీ అలవాటు ఎట్లైనా పోనీలే గానీ, ఇంకొకరికి అంటించవద్దండి ఈ అలవాటు అని చెప్పాము. మీరు పిలుస్తావుంటే ఏమి చేస్తారు. ఇంకొకరు అట్లే

అలవాటు చేసుకుంటారన్న మాట. ఆ అలవాటు మంచిది కాదు. మీరు ఎట్లా పిలిచినా నేను పలుకుతాగానీ ఈ పదము మాత్రము మంచిది కాదు. ఎందుకంటే దానికి అర్హుడు ఒకడే ఒకడున్నాడు అతడే దేవుడు. అతడే తండ్రి అని పిలిపించుకుంటే దానికి నిజమైన అర్హుడు ఎవరు? ఒక్కడే ఒకడు దేవుడు. మళ్ళీ దేవున్ని పెట్టుకొని, దేవుడే దీనికి అర్హుడని తెలిసి, నేను పిలుపించుకుంటే నాది తప్పు కాదా? నూటికి నూరుపాళ్ళు తప్పే అవుతుంది అర్థమయిందా! కాబట్టి ఆ పదము పెట్టి నన్ను పిలవవద్దండి అని నేను చాలాసార్లు చెప్పాను. అందువలన వివరము తెలిసి తాత్కాలిక తండ్రియను భావముతో మీ ఇంటిలో శరీర తండ్రిని తండ్రియని పిలుచుకోండి.

ఈ లెక్కప్రకారము ఇప్పుడు నీకు తల్లి-తండ్రులెవరు? అన్ని ప్రశ్న వేసుకొంటే నా శరీరానికి ఉండే తల్లి-తండ్రులు మామూలుగా జన్మజన్మకు మారుతూవున్నారు. పోయిన జన్మలో ఎవరున్నారో ఏమో నాకు తెలియదు కానీ, ఈ జన్మలో మాత్రము వీళ్ళు ఫలానా వాళ్ళు తల్లి-తండ్రులు అని మనము చెప్పుకున్నా ఫరవాలేదు. కన్పించే తల్లితండ్రులు శరీరానికి తల్లి తండ్రులైతే, ప్రకృతి పరమాత్మే నాకు తల్లి-తండ్రులు. నా శరీరానికి తల్లి తండ్రులైతే కనిపించేవాళ్ళు. ఇప్పుడు రెండు రకాల తల్లితండ్రులు ఏర్పడినారన్న మాట. అదే ఇప్పుడు మీకు 'సమాధి' అనే గ్రంథాన్ని రిలీజ్ చేసి ఇచ్చాము. ఈ రోజు మీకు ఆ 'సమాధి' అనే గ్రంథములో ఒక ప్రశ్న వచ్చింది. ఏమని వచ్చింది అంటే ఇప్పుడు మాకంటి ఎదుటే, మేము చూస్తున్నట్లే, ఒక వ్యక్తి మా ఊర్లో పెళ్ళి చేసుకున్నాడు. ఒకటిన్నర సంవత్సరము క్రితము అనుకో! పెళ్ళి చేసుకున్న తర్వాత భార్యతో కాపురము చేస్తున్నాడు. తర్వాత భార్య గర్భవతి అయ్యింది. తర్వాత కొడుకు పుట్టాడు.

ఆ కొడుకుకు దగ్గర దగ్గర ఆరు నెలలో, సంవత్సరమో వయస్సు వచ్చింది అనుకో! ఇప్పుడు పుట్టెంటుకలు తీపివ్వాల అనేది ఒకటుంది మనకు సాంప్రదాయము.

ఆ పుట్టెంటుకలు తీయించే దానికి ఒక కార్యక్రమము పెట్టుకున్నాడు. అందరిని పిలిచి, భోజనాలు పెట్టి, పుట్టెంటుకలు తీపించే దానికి అందరికి పత్రిక అచ్చువేసి పిలిచినాడన్నమాట. పత్రిక వ్రాసి ఏమని పిలిచినాడు? నేను ఫలానా వ్యక్తిని. నాకు ఫలానా కొడుకు పుట్టినాడు. ఫలానా పేరుండే కొడుకు. ఆ కొడుకుకు నేను పుట్టెంటుకలు తీపిస్తున్నాను. ఆ కార్యక్రమముకు అంతా మీరు వచ్చేసి దీవించిపోండి! అని ఒక పత్రిక అచ్చు వేయించి అందరికి పంచాడు. ఆ పత్రికలో, ఫలానా వాని కొడుకు, ఫలానావాడు తండ్రి, ఫలానాయమ్మ తల్లి అని ఉంది. అది ఎవరు చూసినా ఒప్పుకుంటారు. దీనిని తప్పు అని ఎవరూ అనరు కదా! వీళ్ళకు కొడుకు పుట్టింటే, నడి మధ్యన దేవుడు వీడు నా కొడుకే, వాడు నా కొడుకే, అందరూ నా కొడుకులే, అంటే ఎవరికి పుట్టినా నా కొడుకే అంటే ఎట్లా ఇది. ఇది మంచిదా? అది న్యాయమా? అన్యాయమా? అని ప్రశ్న వేశాము. పిల్లవాడు నిజముగా వీరన్నకు పుట్టినట్లు మాకు తెలుసు. వీరన్న కొడుకే అని నాకు తెలుసు. అయినాగానీ నడిమధ్య పిల్లవాడు నా కొడుకే అంటే నడిమధ్య ఈ మాట దేవుడు చెప్పడం అన్యాయం కాదా? అని ఒకరు ప్రశ్న వేశారన్న మాట. ఆ ప్రశ్న వేసినట్టు మేమే వ్రాశాము. ఆ ప్రశ్న వేసినది ఎవరు? గ్రంథము వ్రాసిన మేమే అడిగాము. జవాబు కూడా నేనే చెప్పాలి. అంటే ప్రశ్న ఎలా ఉంది? మామూలుగా సాధారణంగా ఉంది కదా! మామూలు సాధారణ వ్యక్తులు అడిగినట్టే ఉంది. ఇది అన్యాయము మాట కదా! ఇప్పుడు మాకు తెలిసినట్టువాడు తండ్రి, తల్లి నిజమే పిల్లవాడు వాళ్ళకు

పుట్టిండేది నిజమే! ఫలానోళ్ళ కొడుకు అనేది నిజమే. పుట్టింటుకలు తీపిస్తాండరని పత్రిక ఇచ్చినది నిజమే. అన్నీ కరెక్టే! నడిమధ్య పిల్లవాడు కూడా నా కొడుకే అని భగవద్గీతలో చెప్పడము దేవునిది అన్యాయము కాదా? అని ప్రశ్న వేసినాము. దానికి మనము సరైన సమాధానము చెప్పాలి. ఇప్పుడు ఆ మాట ఎట్లుంది? కరెక్టే కదా! ప్రశ్న వేయవచ్చు. అది అడగడము తప్పులేదు. ఎందుకంటే రీజన్‌గా ఎవరైనా అడుగుతారు.

ఇప్పుడు ఆ విషయాన్ని విశధీకరించి చెప్పినప్పుడు అర్థమైతే, ఓహో ఇట్లయితే నా కొడుకు కాదు అనుకుంటాడు తండ్రి ఈరన్న దేవుని కొడుకే అనుకుంటాడు, అర్థమయిందా! విశదీకరణం అర్థము కాలేదనుకో అప్పుడు దేవునిదే అన్యాయము అని మనము కూడా అంటాము. ఆ లెక్కప్రకారము మీరిప్పుడు ఈ ప్రశ్న. మీకు మీ దగ్గరికి వచ్చిన గ్రంథములో, ఈ రోజు వచ్చిన గ్రంథములో ఉంది. దీని వివరము కూడా క్షుణ్ణముగా వ్రాయబడి ఉంది. దానిలో పూర్తి వివరము చెప్పకుండానే, ఉదాహరణ చెప్పినంత మాత్రమునే ఆ విషయము అర్థమైపోతుంది. కేవలము ఉదాహరణ మాత్రమే! దానికి ఏమి వ్రాశామంటే, ఉదాహరణ ఒక పుస్తకాన్ని ఒక రచయిత రచించాడు, తయారు చేశాడు. నేనే అనుకుందాము లేండి. నేను ఫలానా గ్రంథాన్ని వ్రాశాను, వ్రాసినప్పుడు గ్రంథకర్త అంటే రచయిత అని దానిలో పేరు పెట్టాము. ఏమి పేరు ఉంటాది, ఎవరు వ్రాసింటే వాళ్ళ పేరు ఉంటాది కదా! ఆ "ప్రబోధానంద యోగీశ్వరులు" అని పేరు పెట్టినాము దానిమీద. అతను దీని రచయిత ఫలానా వ్యక్తి అని అర్థమయిందా! నూరు సంవత్సరాలు అయిన తర్వాత చినిగిపోయిందనుకోండి. అంతా పేపర్లు అన్నీ అప్పుడు క్రొత్తగా దానిని తయారు చేయించుకొన్నాము, మళ్ళీ ఆ బుక్‌ను క్రొత్త పేపర్లువేసి, క్రొత్త అచ్చు వేసి క్రొత్తగా తయారు

చేసినాము. క్రొత్తగా తయారు చేసినప్పుడు కూడా దాని గ్రంథకర్త ఎవరు ఉన్నారు. మొదట ఏ వ్యక్తి ఉన్నాడో ఆ వ్యక్తే ఉన్నాడన్నమాట. మళ్ళీ ఆ పొద్దు ఎవరైతే తయారు చేసినాడో వాడు లేడు లేడనుకో, పేపరు పాతది అయిపోయిందనుకో వ్రాసిన విషయము. ఆ పేపరును తీసుకొని పోయి జీరాక్స్ మిషన్‌లో పెట్టినారనుకోండి, మళ్ళీ క్రొత్త పేపరు మీద క్రొత్త అక్షరాలు వస్తాయి. పాత పేపరు రాకుండా క్రొత్త పేపరు మీద క్రొత్త అక్షరాలు ప్రింటై వస్తాయి, అర్థమయ్యిందా!

ఇప్పుడు అట్లే వచ్చినాగానీ, అప్పుడు జీరాక్స్ మీషన్ ఏమి దానిని తయారు చేయలేదు కదా! ఉండే విషయాన్ని అచ్చువేసి పంపించింది కానీ, క్రొత్త పేపరు మీద అచ్చు వచ్చింది గానీ, విషయమేమో పాతదే, వ్రాసినోడు పాతవాడే! ఆ రకంగా నిన్ను అంటే ఒక పేపరు ఏ విధముగా పాతది అయిపోయినా మళ్ళీ దానిని జిరాక్స్ మిషన్‌లో క్రొత్త పేపర్లు మనము చేసుకొంటున్నామో, ఆ రకంగానే మొట్టమొదట ప్రపంచము పుట్టుకలోనే నీవు పుట్టావు. నీ శరీరము పాతదైపోయినప్పుడు, అందులో ఉండే విషయము కాదు. విషయము ఎట్లా క్రొత్తదిగానే ఉంటుంది. విషయము పాతపడదు. విషయము ముద్రించబడినటువంటి పేపరు, పాతదైపోయేది. ఈ రకంగా నీవేమి బాగుంటావు. నీవేమి పాతపడిపోవు, చినిగిపోవు నీవు. నీవు బాగుంటావు. నీ శరీరము పాతబడిపోయినప్పుడు, శిథిలావస్థకు వచ్చినప్పుడు ఆ క్రొత్త శరీరాన్ని మార్చుకుంటున్నాము. క్రొత్త శరీరముగా మార్చుకొని అదే జీవుడు దానిలో అట్లే వస్తున్నాడు మొదట ఏ జీవుడున్నాడో, అదే జీవుడు వస్తున్నాడు. క్రొత్త శరీరముగా మార్చబడుతున్నాడు. ఏ విధముగా పాతపేపరులో ఉండే విషయము, అలాగే ఉంటూ పేపర్ క్రొత్త దయిందో అలాగే ముందున్న జీవుడు అలాగే ఉంటూ శరీరము క్రొత్తదవుతూ వుంది.

కానీ పేపరు మాత్రము జిరాక్స్ మిషన్‌లో మారింది. అదే రకంగా నీవేమో అట్లే ఉన్నావు గానీ, నీ శరీరము మాత్రము క్రొత్తది వచ్చింది. ఎక్కడినుండి? తల్లి తండ్రుల నుంచి. ఈ తల్లితండ్రులు జిరాక్స్ మిషన్‌లాంటి వారే, గ్రంథకర్త మొదట వ్రాసినోడే అని చెప్పాము. అంతేకదా! ఇప్పుడు మనమంతా పైకి కనిపించేటటువంటి తల్లితండ్రులంతా జిరాక్స్ మిషన్ లాంటి వాళ్ళే. కానీ దానిలో విషయము వ్రాసినోడు? మొదట ఎవరు వ్రాసినాడో వాని పేరు ఉంటుంది. వాడు మారేదానికి కాదు. నీవు ఎన్నిమార్లు క్రొత్త శరీరాన్ని ధరించినా గానీ, నిన్ను ఎవడు తయారు చేసినాడో వాని పేరు ఉంటుంది గానీ, నడిమధ్య వీడు తయారు చేయలేదు కదా! తయారయిండేది ఏమిటిది? పేపరు క్రొత్తగా వచ్చింది. నీ పాతపేపరు పోయింది, క్రొత్త పేపరు వచ్చినట్లు, నీ పాత శరీరము పోయింది, క్రొత్త శరీరము వచ్చింది. అంతతప్ప ఇంకోటి ఏమీ లేదు. ఈ పాత పేపరును జిరాక్స్ మిషన్‌లో పెట్టి క్రొత్త పేపరుగా మార్చుకొన్నట్లు, దేవుడు ఏమి చేస్తున్నాడంటే, ఈ తల్లితండ్రులు అనే రెండూ మిషన్లు పెట్టి, ఆ మిషన్లలో ఏమి చేసినాడు జిరాక్స్ పేపరు తీసినట్టు, నిన్ను మళ్ళీ, అంటే నీ శరీరాన్ని తీసి, అందులో నిన్నే పెట్టాడు. నీవు పాతవానివే, మొదట నిన్ను తయారు చేసినోడు ఎవడు అంటే మొట్టమొదట నిన్ను తయారు చేసినవాడు వాడే! కానీ శరీరాన్ని తయారు చేసినది కనిపించేవాళ్ళు అనుకోండి. కానీ వీళ్ళ వెనకాల ఇంకా రహస్యము ఉంది చెప్పుకొంటే, ఆ శరీరము కూడా వీళ్లేమన్నా చేస్తారా? అంటే వీళ్ళకు ఏమీ తెలియదు. బువ్వ (అన్నము) తిని పడుకోవడము తప్ప ఏమీ తెలియదు. ఏ మనిషి కాలునో, ముక్కునో ఎవరన్నా తయారు చేసినారా? చెప్పండి. ఎవరికి ఎవ్వడూ తయారు చేయలేదు. చేసిన వాళ్ళు వేరే వాళ్ళు ఉన్నారు.

కాపురము చేసినారు గర్భము వచ్చింది, నెలలు నిండినాయి. అంతేకానీ శిశువు ఎట్లా తయారైనదో వీళ్ళకు కూడా తెలియదు. కానీ తయారు చేసినోడు ఎవరు? అంటే వాడు వేరు. అయితే ఆ లెక్క ప్రకారము పోతే మనిషి ప్రమేయం ఏమీ లేదు. కానీ నేనూ అని అనుకుంటున్నాడు. కొంతమంది ఏమంటారంటే, తొమ్మిది నెలలు మోసి కన్నాము అంటారు. తొమ్మిది నెలలు ఎప్పుడన్నా మోశారా? మూట భుజాన వేసుకొంటే, ఒకవేళ మోసినట్లే అవుతుంది. ఇప్పుడు చెయ్యివుంది, నేను చెయ్యిని మోస్తున్నానా? కాలుంది కాలును మోస్తున్నానా? ఈ శరీరములో ఎన్ని భాగాలున్నాయో, ఏ దానిని ఎవ్వరూ మోసినట్లు కాదు. ఈ రకంగానే శరీరములో ఒక భాగంగా గర్భము తయారై వస్తుంది. ఎవ్వరూ మోయడము లేదు. అది ప్రత్యేక బరువూ కాదు. ఆ మాట మాత్రము ఇట్లా అంటాము మనము. ఏదీ కరెక్టుగా మాట్లాడము. మనము మాట్లాడే మాట. ఏది కూడా సరిగ్గా ఉండదు. అంతా అబద్దాలే. ఎవరన్నా మోసినారా చెప్పండి మీరు. ఎప్పుడన్నా బరువు కనిపించిందా? ఎవరూ మోయలేదు. అన్నీ అబద్దాలే! ఆ లెక్కప్రకారము పోతే, వాస్తవమైనటువంటి తల్లి–తండ్రి ఎవరని తెలిసింది మనకు ఇప్పుడు. ఆత్మ ప్రకృతి ఇప్పుడు మనము ఆ లెక్కకుపోతే, పైకి కనిపించేదానికి మాత్రమే మనము తల్లితండ్రులుగా కనిపిస్తున్నాము గానీ, నిజమైన తల్లితండ్రులెవరు అంటే ఆత్మ మాయ అనవచ్చు. ప్రకృతి పరమాత్మ అనవచ్చు. మాయ మాత, అంటే మాయే తల్లి. ఇప్పుడు మాయ నాకు చాలా ఆటంకపరుస్తావుంది అని దానిని తిడతారు. ఎవరిని తిట్టినట్లు నీవు? మీ అమ్మను నీవు తిట్టినట్లే! నీవే మీ అమ్మను తిట్టినట్లవుతుంది. ఈ మాయ నిన్ను దైవమార్గములోనికి తీసుకపోతుంది. అట్లు కాకపోతే దేవుని మార్గములోకి పోనీకుండా నన్ను భ్రష్టుపట్టించేస్తుంది. మాయను కనిపిస్తే

చెప్పుతో కొట్టిండేవాడిని అని అంటాడు ఒకడు అయితే, మాయను నీవు చూసినావా! అది కనిపించేటట్లుగా ఉంటే, ఇంకేమి మాయను కొట్టేవాల్లే అయితే అది కనిపించదు కదా!

ఈ మాయ ఎట్లుంది? మన శరీరములో గుణముల రూపములో వుంది. గుణములు కనిపించవు అందువలన మాయ కనిపించదు. మాయను గురించి దేవుడు ఏమి చెప్పినాడంటే, ఒరే! నీవు ఏమన్నా అనుకోరా అది నా మాయ అంటే నా భార్య. నా భార్యను తిడితే, నన్ను తిట్టినట్లే కదా! అన్నాడు. ఇంకా ఆయనేమి చెప్పినాడు అంటే భగవద్గీతలో విజ్ఞాన యోగములో **"మమమాయా"** అన్నాడు. మాయ ఎవరిది? నాది. మమమాయ, నా మాయ. కానీ నా మాయ చాలా పెద్దది. దుస్సాధ్యమైనది, ఎవ్వరూ దానిని దాటలేరు **'మమమాయ దురత్యయా'** అన్నాడు. దురత్యయా అంటే అది దుస్సాధ్యమైనది అన్నాడు. ఎవ్వరూ దాటలేరని చెప్పినాడు దేవుడు. మళ్ళీ ఎవ్వరూ దాటలేనప్పుడు మాయలోనే చిక్కుకొని పోతాము కదా! అంటే, చిక్కుకోవాల్సిందే తప్పదు. దాటడం నీ చేత కాదు అని చెప్పినాము కదా! మరి ఎట్లుంది? అంటే **'గుణమయి మమమాయ'** అంటే, ఈ మాయ ఎక్కడుంది? బయట లేదు. గుణమయి, గుణాలతో కూడుకొని నీ తలలోనే ఉంది. 'గుణమయి మమమాయ దురత్యయా' అన్నాడు. అంటే గుణాలతో కూడుకొని ఉన్న నా మాయను. మీరు దాటాలంటే దుస్సాధ్యం, కాని పని అని చెప్పాడు. మళ్ళీ నీవే దుస్సాధ్యము అని చెప్పినప్పుడు మేమెందుకు ప్రయత్నము చేయాలి అని అనుకోవద్దండి. కానీ 'మా మేవయే ప్రపద్యంతే, మాయా మేతాం తరంతితే' అన్నాడు. ఎవడైతే, నన్ను ఆరాధిస్తాడో, నన్ను గొప్పగా తెలుసుకొంటాడో, నేనే నిజమైన దేవున్ని అనుకొని నన్ను ఆరాధిస్తున్నాడో అటువంటివానికి మాత్రము ఈ మాయ

ఏ ఆటంకము కలుగజేయదు. వాడు మాయను సులభముగా దాటిపోగలడు. మాయా మేతాం తరంతితే! మాయను సులభముగా దాటి తరించి పోగలడు. ఎవడైతే నిజమైన దేవున్ని కనుక్కొని, నిజమైన దేవుడు ఒకడున్నాడని, అతన్నే ఆరాధిస్తున్నాడో, వానికి మాత్రము మాయ ఆటంకము చేయదు.

ఎందుకు చేయదు అంటే నా భర్తనే ఆశ్రయించినాడు కాబట్టి నేను ఆటంకము చేయను అనుకుంటుంది. నా భర్తను ఆశ్రయించినాడు కాబట్టి, నేను అతన్ని ఏమీ చేయను. నా భర్తను ఆశ్రయించుకోకుండా, వేరే వాళ్ళందరిని నా ముందర గొప్ప అంటే నేనెందుకు విడిచిపెడతా! వేరేవాళ్ళందరిని గొప్పంటే నేనెందుకు విడిచిపెడతా? దేవునికి దూరము పంపిస్తాను. కొందరు మనుషుల జ్ఞానము తెలుసుకొనేదానికి వచ్చాను. జ్ఞానము గొప్పదని వచ్చాను. దేవున్ని తెలుసుకోవాలని వచ్చాను అని చెప్పుచూ ఇంటికి పోయి వినాయకుడిని మ్రొక్కినాడు అంటే అక్కడ నటించి ఇక్కడికి వచ్చి, దేవునికంటే గొప్పవాడు వినాయకుడు అనేకదా! నీవు మ్రొక్కుతుండేది. దేవతలందరికంటే దేవుడు గొప్పవాడు అయినప్పుడు వినాయకునికి ఎందుకు మ్రొక్కుచున్నావు. దీనినిబట్టి నీవు నటిస్తూ వున్నావు అని చెప్పవచ్చు.

నీవు దేవుడు ఒకడే గొప్ప, ఇంకెవరూ లేరు అని అనుకున్నప్పుడు, దేవున్నే నీవు గుర్తు చేసుకో! దేవుడు ఒక్కడే గొప్ప అని, ఆయనే ఒక ప్రవక్త రూపములో వచ్చినాడు. లేకపోతే భగవంతుని రూపములో వచ్చినాడని, ఆ రూపాన్నే మేము పెట్టుకున్నాము. ఆ రూపాన్నే మ్రొక్కుచున్నాము, ఇంకో రూపాన్ని పెట్టుకొని మ్రొక్కితే మాది కూడా తప్పు అవుతుంది. నన్ను కూడా ఈ మార్గములో లేకుండా మాయ పంపించేస్తుంది. మాయ

ఎంతోమందిని ప్రక్కకు సాగతోలింది. పొండి, పనికి రారు పొండి అని ఇప్పుడు మనల్ని ఎందుకు పంపివ్వలేదు ప్రక్కకు? అంటే, మనము ప్రక్కకు పోయేదానికి అవకాశము లేదు. ఎందుకు లేదంటే, మనము వేరేవాళ్ళను గొప్పగా చెప్పుకోలేదు కదా! దేవుణ్ణే గొప్పగా చెప్పుకొంటున్నాము కాబట్టి, ఆ దేవునికి మనము నచ్చినాము కాబట్టి, దేవునికి నచ్చితే, ఆమెకు మనము నచ్చినట్లే! ఎవరికి? మాయకు నచ్చినట్లే! కాబట్టి మాయను మనము జయించాలి అంటే, దేవునికి మనము ఇష్టపడి ఉండాలి. దేవునికి మనము ఇష్టముగా ఉండాలంటే 'అనన్యా చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే' అని అంటాడు. అన్యచింత లేకుండా, ఇతరత్రా దేవతల మీద ధ్యాస లేకుండా ఎవడైతే నన్నే తెలుసుకొని గొప్పగా ఆరాధిస్తాడో! 'అనన్యా చింతయంతో మాం' ఇతరత్రా చింత లేకుండా, ఇతర చింత అంటే ఇతర దేవతల మీద చింత లేకుండా 'యే జనాః పర్యుపాసతే' ఎవడైతే నన్ను ఉపాసిస్తాడో అటువంటి వాడు నా ఇష్టుడు. అయితే నా ఇష్టుడు అయితే ఎవరికి ఇష్టుడైతాడు. నా భార్యకు కూడా ఇష్టుడే! కాబట్టి అప్పుడు నా వరకు సులభముగా రావచ్చు. లేకుంటే నీవు నటించి దేవుడే గొప్ప అనుకొని, ఇంకొక దేవున్ని నీవు మ్రొక్కినావనుకో, అప్పుడు మాయ నిన్ను గుర్తుంచు కొని దేవునివద్దకు రాకుండా చేస్తుంది.

అందరూ ఉన్నచోట దేవుడు గొప్ప అని చెప్పుచూ, ఎవరూ లేనిచోట ఇంకొక దేవున్ని మ్రొక్కుచున్నాడు? కాబట్టి వీన్ని దేవునికి దూరముగా పంపివ్వాలి అని మాయ అనుకొని ఏ రకంగా ఆత్మజ్ఞానము తెలియకుండా దూరముగా పంపివ్వాలో ఆ రకంగా పంపిస్తుంది. ఆ రకంగా మాయ ఎంతోమందిని దైవమార్గము నుండి దూరముగా పంపినది, ఆ మాయ అనేదే ప్రకృతి, మాయ అనేది ప్రకృతి అని ఎట్లా చెప్పుచున్నారు? శాస్త్రబద్ధత

ఉందా? అంటే, ప్రకృతి జనితములైనటువంటి గుణములు అని భగవద్గీతలో చెప్పినాడు. ప్రకృతి జనితములైనటువంటివి గుణములు. ప్రకృతి చేతనే గుణములు పుట్టాయి. ప్రకృతిలోనే గుణములు పుట్టాయి ఆ గుణములే మాయ. మాయే గుణములు మాయే ప్రకృతి, ప్రకృతి మాయ తల్లీ పిల్లల్లాంటివి. చాలా గొప్పశక్తి కలిగినటువంటిది తల్లి ప్రకృతి. ప్రకృతికి పుట్టిన మాయ చాలా గొప్పశక్తి కలిగినటువంటిది. నీకు నిజమైన తండ్రి ఎటువంటి వాడు అంటే, మరీ గొప్పవాడు. దేవుడు ఇట్లున్నాడు, అట్లున్నాడు అని ఎవ్వరూ అంచనా వేసి చెప్పలేరు. దేవుడు ఎట్లున్నాడని ఎవ్వరికీ తెలియదు, ఎవ్వరూ చెప్పలేరు కూడా! అటువంటి వాడు దేవుడు. కాబట్టి అటువంటి దేవున్ని మనము ఇట్లున్నాడు అని చెప్పలేము. దేవునికి తోడుగా ఉన్నటువంటిది ప్రకృతి దేవుడే శక్తి ఇచ్చి నిలబెట్టినటువంటిది ప్రకృతి. ప్రకృతికి పుట్టినది గుణరూపమైన మాయ. శక్తివంతమైన ప్రకృతికి పుట్టిన మాయ మానవులకు దుస్సాధ్యమైనదని భగవద్గీతలో "మమ మాయా దురత్యయా" అని చెప్పారు.

ఈ రకంగా మనకు మాయ తల్లిగా ఉంది. ఆత్మయిన దేవుడు తండ్రిగా ఉన్నాడు. ప్రకృతి అవ్వగా ఉంది. పరమాత్మ తాతగా ఉన్నాడు అని చెప్పవచ్చును. ఈ రకంగా ప్రకృతి పరమాత్మల యొక్క పాత్ర ఏమిటి అంటే నీ యొక్క తల్లితండ్రులయిన ఆత్మ, మాయను పుట్టించి దాని ద్వారా నిన్ను పుట్టించాడు. ఇప్పుడు నీ పుట్టుక ఆత్మ మాయ ద్వారానే జరిగింది. ఎప్పుడు జరిగింది? సృష్టి ఆదిలో జరిగింది. నీవు ఎన్ని జన్మలు మారినా, ఎన్ని శరీరాలు మారినా జన్మజన్మకూ తల్లి తండ్రులు శాశ్వితముగా ఉండేవాళ్ళు వాళ్ళు. ఏదో ఒక పుస్తకము ఎన్ని సంవత్సరాలు గడిచినా, ఎన్నిసార్లు మళ్ళీ రీప్రింట్ చేసినా, దానిని మరీమరీ ప్రింట్ చేసినా గ్రంథ

రచయిత మారడు కదా! రచయిత ఫలానావాడు వ్రాసినాడు అని ఉంటుంది కదా! ఆ రకంగా నీవు ఎన్ని శరీరాలు మారినాగానీ, ఎన్నిసార్లు పునర్జన్మ తీసుకున్నాగానీ, జన్మ కాదు పునర్జన్మ అని జ్ఞాపకము పెట్టుకోండి. నీకు తండ్రి ఎవరు? దేవుడు. ఈ మాట ఖురాన్‌లో చెప్పబడింది, బైబిల్‌లో చెప్పబడింది. భగవద్గీతలో "నేనే తండ్రిని అందరికి" అని చెప్పినాడు. ఈ మూడింటినీ మూడు మూలగ్రంథాలు అంటాము. మూడు మూల గ్రంథాలలోనూ ఇదేమాట చెప్పబడింది. ఇంకొకచోట ఒక రకము, ఇంకొకచోట ఒక రకము ఏమీ చెప్పలేదు, అంటే మూడు చోట్లా దేవుడే చెప్పించాడు ఈ మాట మూడు మతాలలో ఎంతమందికి తెలుసు? మూడు మతాలలోనూ, ఈ విషయం సంపూర్ణంగా తెలియదనే చెప్పవచ్చును. ఇతర మతములోకి పోయి చూసినా వాళ్ళకు ఏమాత్రము తెలియదు. అంతో ఇంతో తెలిసిండేది హిందూమతములో మాత్రమే. ఇది ఇక్కడి నుంచే చెప్పాలన్న మాట. హిందూ మతములోనే ఎక్కడ ఏ జీవరాశి పుట్టినాగానీ అట్లే మిగతా అన్ని మతములలో పుట్టినా గానీ వానికి తల్లిని, తండ్రిని నేను మాయ అని బాగా స్పష్టముగా చెప్పినాడు. అంటే ఈ విషయాలు ఒక భగవద్గీతలోనూ, బైబిలులోనూ, ఖురాన్‌లోనూ అన్నింటిలో ఒకే రకంగా చెప్పినప్పటికైనా గానీ, ఇటు భగవద్గీతలో చెప్పినటువంటి విషయము హిందువులకు అర్థము కాలేదు. బైబిల్‌లో చెప్పినటువంటిది క్రైస్థవులకు అర్థము కాలేదు. ఖురాన్‌లో చెప్పినటువంటిది ముస్లీమ్‌లకు కూడా సరిగా అర్థము కాలేదు. వాళ్ళకు ఒక్కడే దేవుడని నమ్మకము ఉంది గానీ, జ్ఞాన వివరము పూర్తిగా అర్థము కాలేదు. అర్థము కానప్పుడు దేవుడు అర్థము చేయాలి కాబట్టి, అలాంటి వాళ్ళకు వివరముగా అర్థమయ్యేటట్లు చేయాలి అని కోరుకుంటున్నాము.

మనుషులలోనే వాళ్ళ ఊహలకు జ్ఞానమును అందించి ఆత్మ దేవుడు వ్రాయిస్తాడు. ఇప్పుడు వ్రాసిన **'సమాధి'** అనే గ్రంథములో కేవలము 90% ఖుర్‌ఆన్‌లో ఉండే విషయాలే వ్రాశాము. అంటే ఖుర్‌ఆన్ అంటే ఎటువంటిది అని మీకు తెలియదు. ఎప్పుడూ మీరు ఆ గ్రంథమును చూడలేదు. దానిని చదివి ఉండరు. ఇప్పుడు ఇక్కడ చదివితే కొన్ని విషయాలు, ఖురాన్‌లో విషయాలు బయటపడతాయి. ఖురాన్ అంతా అట్లే ఉంటుందా? అంటే, ఇంతకుముందే చెప్పినా నేను, బైబిల్‌లో కేవలము నాలుగే నాలుగు సువార్తలు పనికి వస్తాయి. 66 పాఠాలలో ఆ నాలుగు పాఠాలే పనికి వస్తాయి మీకు. మిగతా పాఠాలు మీకు అర్థము కాకున్నా ఫరవాలేదు. అవి జ్ఞానమే అయినా వాటిని మీరు చదువక పోయినా ఫరవాలేదు.

ఆ రకంగానే ఇప్పుడు 114 సూరాలు ఉన్నాయి. దీనిలో సూరాలంటే పాఠములు అని అనుకోండి. ఖుర్‌ఆన్‌లో 114 సూరాలలో ఎన్ని పనికి వస్తాయి అంటే కొన్నిటిని అర్థము చేసుకొన్నా దేవుని జ్ఞానము అర్థమవుతుంది. కొన్ని వాక్యములను (ఆయత్‌లను) తెలుసుకోగల్గితే సంపూర్ణమైన జ్ఞానాన్ని అందిస్తాయి. భగవద్గీతలో నూటికి నూరుపాళ్ళు జ్ఞానము ఉంది అని చెప్పాము. నూటికి నూరుపాళ్ళు జ్ఞానము ఉంది. ఉన్నప్పుడు మనము కొన్ని శ్లోకాలను ఎందుకు బయటకు తీసిపెట్టాము. అంటే అది జ్ఞానము కాదు అని తీసిపెట్టాము. జ్ఞానము కాదని, ఉన్నదానిని ఏరుకొని దీనిని నూటికి నూరుపాళ్ళు చేసుకున్నాము మనము. ఉన్న విషయాన్ని నూటికి నూరుపాళ్ళుగా మనము తెలుసుకున్నాము. అది అర్థమైనది అక్కడికి. అదే రకంగానే బైబిల్‌లో కూడా నాలుగు సువార్తలే మనకు పనికొచ్చేది అంటే మిగతాది కూడా జ్ఞానమే! కానీ నీవు దాంట్లో

పడినావంటే సముద్రములో పడినట్లే, మళ్ళీ ఈదలేవు. బయటకు రాలేవు. గట్టు దొరకదు నీకు. నీకు దేవుడు చెప్పినటువంటి విషయాలు స్పష్టమైన విషయాలు నాలుగు సువార్తలలోనే ఉన్నాయి. ఆ నాలుగు సువార్తలు చదువుకొని తెలుసుకుంటే, సంపూర్ణమైన (నూటికి నూరుపాళ్ళు) జ్ఞానము నీకు వస్తుంది. సంపూర్ణమైన జ్ఞానము వస్తుంది కాబట్టి అవి మాత్రమే తెలుసుకొంటే చాలు అని కూడా ఇంతకుముందు మనము చెప్పాము. ఇప్పుడు ఖురాన్‌లో ఎంతనో, బైబిల్‌లో ఎంతనో, భగవద్గీతలో ఎంతనో దానిలో కూడా కొన్ని సూరాలలో ఉండే కొన్ని ఆయత్‌లు అంటే, కొన్ని వాక్యాలు మాత్రమే మీరు తీసుకొని చదవగల్గితే సరిపోతుంది. అంటే మీకు ఏది పనికొస్తుందో, ఏది పనికిరాదో తెలియదు. కాబట్టి మేమే కొన్ని విషయాలు తీసుకొని, అంటే ఈ సమాధి అనే పేరు పెట్టినటువంటి విషయాన్ని తీసుకొని చెప్పాల్సిన పని వచ్చింది. ఈ సమాధి అంటే అందరికి ఏమి తెలుసు? చచ్చిపోయిన తర్వాత శవాన్ని తీసుకొని పోయి పూడ్చిపెట్టినది సమాధి అని అంటాము.

నీ సమాధి అని అంటే నీవు దానిలో ఉంటేనే కదా! నీకు సమాధి అయ్యేది. నీవు లేనప్పుడు నీకు సమాధి ఎక్కడుంది. ఆ మాటకు అర్థమేలేదు, అర్థమయిందా! మళ్ళీ నీ సమాధి అంటే నీవు ఉన్నప్పుడు సమాధి. నీ సమాధి అని వ్రాయబడి ఉంది. నిన్ను సమాధి నుంచి లేపుతాను అన్నాడు దేవుడు. అంత్యకాలములో తిరిగి నిన్ను లేపుతాను, ఎక్కడినుంచి నీ సమాధి నుంచి తిరిగి నిన్ను లేపుతాను అన్నాడు. అంటే మనోళ్ళు చాలామంది ఏమని అర్థము చేసుకొన్నారు. అంటే, చచ్చి పోయిన తరువాత తీసుకొని పూడ్చిపెడతారు. పూడ్చిపెట్టిన తర్వాత మళ్ళీ అప్పుడు దేవుడు వచ్చి లేపుతాడు అని అనుకున్నారు. పూడ్చిపెట్టిన తర్వాత కొన్నాళ్ళకు అంత్య

కాలములో అంటే, ప్రళయము వచ్చిన తర్వాత అప్పుడొచ్చి లేపుతాడు. అని అట్లే వ్రాసుకున్నారు, అట్లే అర్థము చేసుకున్నారు. దానిని అంత తప్ప వేరే అర్థము కాలేదు ప్రజలకు. అంటే మనమేమంటున్నామంటే అప్పుడు శరీరము కుళ్ళిపోయి ఉంటుంది కదా! అంటే, కుళ్ళిపోయినా దేవుడు లేపుతాడు. దేవునికి అన్నీ చేతనౌతాయి నిజమే! ఎవరిని లేపుతాడు? నిన్ను లేపుతాడు. నీవు ఎక్కడున్నావు? గుంతలో ఉన్నావా? నీ శరీరము గుంతలో వుంది. నీవు ఎక్కడికో పోయినావు. నిన్ను లేపుతానన్నాడు, నీ శరీరాన్ని కాదు లేపుతా అని చెప్పింది. ఇది మనము అర్థము చేసుకోవడములో చాలా పొరపాటు పడినాము. ఖురాన్‌లో చెప్పిన విషయాలు చాలా గొప్పగా ఉన్నాగానీ, వాటిని అవగాహన చేసుకోవడములో మనము పొరపాటు పడిపోయి, దానిని వేరు విధముగా అర్థము చేసుకొని, దేవుని విధానాన్ని అంతా ఉల్టా సీదా చేసుకున్నాము.

బైబిల్‌లో అట్లే చేసుకున్నాము, భగవద్గీతలో అట్లే చేసుకున్నాము, ఖుర్‌ఆన్‌లో కూడా అట్లే చేసుకొన్నాము. ఒక ఖుర్‌ఆన్‌లోనే కాదు, బైబిల్‌లో కూడా పూర్తి అట్లే ఉంది, భగవద్గీతలో కూడా అట్లే ఉంది. ఈ రకంగా మనము అర్థము చేసుకున్నాము. అంటే మీరు చెప్పినదే! కరెక్టా! అని ఎవరైనా అడగవచ్చు. ఏమి మేమనుకున్నది కరెక్టు కాదా? మా ప్రవక్త ఇట్లే చెప్పాడు అని కొందరు అనవచ్చు. ప్రక్కన చెప్పినది సత్యమే. అయినా అది మనకు అర్థము కాలేదు. అనేదానికి నిరూపణగా మనము ఏమి చెప్పుతున్నామంటే, ఒక ముస్లీమ్ ఒక రోజు చనిపోయేముందు క్రొత్త బట్టలు తొడిగించుకున్నాడట. క్రొత్త బట్టలు తొడిగించుకొని ఇంక చనిపోతాను క్రొత్త బట్టలు తొడగమన్నాడంట. క్రొత్త గుడ్డలు తొడిగినారు అతనికి, తొడిగిన తర్వాత ఈ ప్రవక్త భార్య ఆయిషా చూసింది అతన్ని. ప్రవక్త

భార్యలలో చిన్నాయమ్మ పేరు "హజరత్ ఆయేషా". హజరత్ అంటే గొప్పగా పిలిచే పదము. హజరత్ మహ్మద్ అన్నా, హజరత్ ఆయేషా అన్నా మనము శ్రీ అన్నట్లు హజరత్ అనేది గౌరవపదము. ఆయేషా అనే ప్రవక్తగారి చిన్న భార్య. ఆమె క్రొత్త గుడ్డలు ధరించిన వానిని చూసిందన్న మాట. చూసి ఎందుకు క్రొత్తబట్టలు తొడిగిస్తున్నారు అని అడిగింది. ముస్లీమ్ చనిపోతే తిరిగి లేపబడతాడు కదా! పాతబట్టలతో లేస్తే ఏమి బాగుంటుంది? క్రొత్త బట్టలతో లేవాలని వేసుకున్నాను అన్నాడంట. బ్రతికి ఉన్న రోజులలోనే ఈ ముస్లీమ్ అట్లా చెప్పాడు అంట. అప్పుడు ఈమె నవ్వి ప్రవక్త చెప్పినది అట్లకాదు, మీకు అట్ల అర్థమయిందేమో! దుస్తులతో లేపబడుతాడు అని ఎప్పుడూ చెప్పలేదు. దుస్తులు అంటే కర్మలు అని అర్థము. ఈ వేసుకొనే దుస్తులు కాదు. మనకు అంటుకొని ఉంటాయి, కర్మలు అవి అని చెప్పింది ఆమె. అప్పుడు ప్రవక్త ఉండే రోజులలోనే ఆయన చెప్పినమాట సరిగా అర్థము కాలేదు. ఆయన పోయి మనకు ఇంతకాలము అయ్యింది. ఇప్పటికి 1430 సంవత్సరాలు అయింది. 1430 సంవ్సరాలు అయివుంటే మనము కరెక్టుగా ఆయన మాటను అర్థము చేసుకున్నామని రూఢి ఏమి? నమ్మకము లేదు కదా!

కాబట్టి ఆయన మాట మనకు సరిగ్గా అర్థము కాలేదు. అర్థము చేసుకుంటే ఆ మాట చెప్పము. నిన్ను లేపుతాడని చెప్పినాడు గానీ, నీ శవాన్ని లేపుతాడు, నీ శరీరాన్ని లేపుతాడు అని చెప్పలేదు ఆయన. సమాధి నుండి లేపుతానన్నాడు గానీ, పూడ్చి పెట్టిన గుంతలోనుండి నిన్ను లేపుతానని చెప్పలేదు. పూడ్చి పెట్టిన గుంత సమాధి అని చెప్పలేదు సమాధి నుండి లేపబడతాడు అంటే, ఆ అర్థము చేసుకోలేక మనము ఏమి చేశామంటే, గందరగోళ పరిస్థితిలో వేరుగా అర్థము చేసుకున్నాము. అట్లా వేరుగా

అర్థము చేసుకొనేది మంచిది కాదు, లేపబడుతాము అంటే మనము కూడా ప్రతిరోజు లేపబడతావున్నాము పడుకుంటాను, నిద్రపోతాను అంటే ఎవరయినా లేపగలరు. నిన్ను శరీరములో లేపుచున్నాడా నిన్ను గుంతలో నుండి లేపుతున్నాడా? ఎక్కడి నుండి లేపుతున్నాడు? నీవు నిద్రపోతే శరీరమే నీకు సమాధి అవుతుంది. నీవు ప్రతి రోజు చచ్చిపోతున్నావు. ప్రతిరోజు లేపుతున్నారు చచ్చిపోయినోడు, నిద్దురపోయినోడు ఇద్దరూ ఒక్కటే అని, మనము అప్పుడప్పుడు అంటున్నాము. నిద్ర నుండి లేవడమే సమాధి నుండి లేవడము అని తెలియాలి.

ఇప్పుడు ఈ 'సమాధి' అనే గ్రంథము చదివితే అందులో వివరంగా అర్థమౌతుంది. సమాధి అంటే ఏమని? దేవుడు ఏ రకంగా లేపుతున్నాడనీ, నీవు లేపబడినప్పుడు క్రొత్తగా దేవుని చేత లేపబడినప్పుడు శరీరము మీద నూలు పోగు కూడా ఉండదు అని చెప్పాడు ప్రవక్తగారు. అప్పుడు ఈ ఆయేషా అనే ప్రవక్త చిన్న భార్య ఇలా అడిగింది. ఏమీ మీరు ఇట్లా చెప్పుతున్నారే, మేము ఆడవాళ్ళము కదా! మాకు మర్యాద పోదా? అని అంటే అప్పుడు ప్రవక్త ఇలా చెప్పాడు. సమాధి నుండి లేచినప్పుడు ఏ ధ్యాసా ఉండదు అని ప్రవక్త చెప్పాడు. శిశువుగా పుట్టినప్పుడు ఏ ధ్యాసా లేదు. శరీరము మీద నూలుపోగు కూడా ఉండదు అప్పుడు అని వివరము చెప్పినాడాయన. అంత వివరముగా చెప్పినాగానీ, తిరిగి గుంతలో నుండే లేపుతాడని మళ్ళీ చెప్పుకున్నాము మనము. తిరిగి గుంతలో నుండే లేపుతాడని అనుకున్నాము. ఆ రకంగా కాదు వేరేరకంగా మనము అర్థము చేసుకోవాలనే విషయము మనకు ఇప్పుడు వివరంగా తెలుస్తావుంది. సమాధి అంటే నీ శరీరములో నీవు జ్ఞప్తి లేకుండా ఉన్నప్పుడు దానిని సమాధి అంటాము.

ఎప్పుడైతే నీవు సమాధిలో అణిగిపోయినావో మొత్తముగా, బయటి ధ్యాస లేకుండా లోపల అణిగిపోయినావో అప్పుడు సమాధి చేయబడినావు. పుట్టిన శిశువు కూడా బయట ధ్యాస లేకుండా పడివుంటుంది. శరీరములో జీవుడు చేరినాగానీ, మొట్టమొదట ధ్యాస ఎప్పుడైతే వస్తుందో అప్పుడు సమాధినుండి లేపబడటం జరుగుతుంది. అదే నీవు సమాధి నుండి లేపబడటం. ఇప్పుడు క్రొత్తగా తయారైనటువంటి శిశువే సమాధి. ఆ శిశువులోనికి ఈ జీవుడు ఎప్పుడు దూరినాడో, అప్పుడు సమాధి అయినాడు వాడు దానిలో అప్పుడు మళ్ళీ ఆత్మే దానిని లేపుతుంది, కాబట్టి దేవుడు నిన్ను లేపినట్టే. ఈ రకంగా శిశువు నుండి క్రొత్తగా ఎవడైతే లేపబడు తున్నాడో, వాడు సమాధి నుండి లేపబడుతున్నాడు అని లెక్కించబడింది. సమాధి అంటే శరీరము అని పూర్తి వివరము దీనిలో వివరించబడింది. ఇదంతా క్రొత్త విధానము. ఏందయ్యా ఇంతవరకు గుంతలో పూడ్చేది అనుకొంటూ ఉంటే ఈయన మళ్ళీ శరీరము అంటాడు. శరీరాన్ని పూడ్చే సమాధిని గుంత అనుకొంటే, మనము ఇక్కడ ఇంకొక రకంగా చెప్పుచున్నాము. దేశములో ఉండేదంతా ఒక రకంగా అర్థమైతే, ఈయన ఒక రకము చెప్పుచున్నాడు అనుకుంటారు. పోయిన నెల మీటింగ్‌లో చెప్పినా 'సమాధి' అంటే అర్థము. సమంగా నీకు ఆది నుంచి ఉండేది. ఆది నుంచి సమానంగా ఉండేది ఇదే! ఏది? శరీరమే! ఆది నుంచి సమానముగా ఉంది నీకు. దీనిలో ఏమి కలిగినా సుఖదుఃఖాలు కలుగుతున్నాయి. ఏమాత్రము తేడా లేదు. దీనినే సమాధి అంటారు అనేది కూడా మనము చెప్పాము. ఇంతవరకు అర్థమయిందా! ఇప్పుడు ఏమి చెప్పినాము, తల్లి తండ్రి ఎవరు? అనే విషయాన్ని మీరు బాగా అర్థము చేసుకోండి. తల్లి తండ్రి అర్థమైతే సమాధి అనేది కూడా అర్థమైతుంది.

ఇవి అంతా ఒకదానికొకటి అనుబంధముగా ఉన్నాయి. **జనన మరణ సిద్ధాంతానికి, మరణరహస్యము అనుబంధము. మరణ రహస్యమునకు పునర్జన్మ రహస్యము అనుబంధము. పునర్జన్మ నుండి సమాధి అనుబంధము. సమాధి నుండి తల్లి తండ్రి అనేది కూడా అనుబంధమే.** రేపు నెల మీకు బహుశా ఈ 'తల్లి-తండ్రి' అనే గ్రంథము అందించబడుతుంది. ఇది ఇప్పుడు చెప్పుచున్నాము ఇంతటితో ఈ సమావేశాన్ని ముగిస్తున్నాము.

## ౧౦. మాత్ర - మందు

**(తేది :- 05.10.2017)**

సృష్టికర్త అయిన పరమాత్మ చూస్తూ ఉండగా, అందరి శరీరములలో ఆడించేటటువంటి ఆత్మ జ్ఞానమును పలుకుతూ ఉండగా, వినేటటువంటి జీవుడు శ్రద్ధగా జ్ఞానాన్ని అర్థము చేసుకోవాలని కోరుతూ ఈ సభను ప్రారంభిస్తున్నాము.

ఈ రోజు చెప్పబోయేటి అంశము మాత్ర-మందు. మాత్ర చాలామార్లు విన్న పేరే, మందు అనేది కూడా విని ఉండే పేరే. కానీ మనము చెప్పుకునే జ్ఞానమంతా ఇంతకుముందు చాలామార్లు పూర్తి సంపూర్ణముగా చెప్పుకున్నాము. ఇప్పుడు చెప్పబోయేది కూడా అందులోని భాగమే అయినా కొత్త రకంగా ఉంటుంది. నేను హిందూమతంలో పుట్టాను, నన్ను హిందువని చాలామంది అంటారు. తర్వాత ఇక్కడికి వచ్చిన వారిలో ముస్లీంలున్నారు, క్రైస్థవులున్నారు. మూడు మతస్థులు ఇక్కడ కలిసున్నారు. మా జ్ఞానాన్ని చాలామటుకు అందరూ ఒప్పుకుంటున్నారు. కానీ కొద్దిమంది మాత్రం విమర్శించడం జరుగుతుంటుంది. ప్రతిచోట ఏదో ఒకటి

లోపముంటుంది. మనుషుల్లో ఉండే లోపాలను బట్టి వాళ్ళు మాట్లాడడం జరుగుతూ ఉంటుంది. ఆ లోపాలను మా మీద ఎత్తుతూ, మీది సరైన జ్ఞానం కాదు అనడం కూడా జరుగుతూ ఉంటుంది. సరే అందరికీ నచ్చే విధంగా ఎవరూ చెప్పలేరు. నా వరకు నేను శాస్త్రబద్ధమైన జ్ఞానం మీకు అందివ్వాలని కోరుకుంటూ, అదే జ్ఞానాన్ని ఇంతవరకూ అందిస్తూవచ్చాను. ఇంతకు ముందే సంపూర్ణమైనజ్ఞానాన్ని మీకిచ్చాను అందులోనే భాగంగా ఇప్పుడు చెప్పేది కూడా ఉంటుంది. కొత్తది ఏమీ కాదు కానీ, వినేదానికి మీకు క్రొత్తగా ఉంటుంది అంతేగానీ ఇంకోటి ఏమీ లేదు. నేను ఇందువును అని ఒకమాట చెప్పినప్పుడు అన్ని మతస్థులు, సర్వ జీవరాసులు జ్ఞానం తెలిస్తే, ఇందువులుగానే ఉంటారు అని చెప్పాను.

ఒక సందర్భంలో, ఒక ముస్లీమ్ వచ్చి ఏమన్నాడంటే నేను ముస్లీమ్‌ని కదా నేను ఇందువెట్ల అయితాను అన్నాడు. తర్వాత క్రైస్థవుడు వచ్చి నేను క్రైస్థవుడిని కదా నేను ఇందువెట్ల అయితాను అన్నాడు. మీరు అందరూ ఇందువులైతారు జ్ఞానం తెలిస్తే అని అంటే, మతం మారమంటావా నువ్వు అని అడిగినారు. మేము మతం మారమని ఇంతవరకూ ఎప్పుడూ చెప్పలేదు. ఒక మతం నుంచి ఇంకో మతంలోకి పోవడము దైవద్రోహం అవుతుంది అని చెప్పినాము. అంతేగానీ నేను మతం మారమని ఎక్కడా చెప్పలేదు. ఇందువు అనేదానికి అర్థము తెలిస్తే మీరు ఈ విధంగా అడగరు అన్నాను. అప్పుడు వారు మీరు చెప్పేమాటలు మేము ఎట్లా అర్థము చేసుకోవాలి అని అడిగారు. నేను ఒకమాట ఉదాహరణగా చెప్పాను. వాళ్ళకు ఏమని చెప్పానంటే ఇప్పుడు వైద్యముంది, వైద్యంలో ఒక డాక్టరు మందు ఇస్తాను అని చెప్పి మాత్ర ఇస్తాడు. ఆ మాత్రలో మందుంటుంది, మాత్ర శరీరంలోకి పోయి కరిగిపోయి అందులోని ఆ మందు పని చేస్తుంది. ఆ వైద్యం పేరు

అల్లోపతివైద్యం అనుకుందాము. అల్లోపతిలాగ ఇంకో వైద్యం కూడ కలదు. అదే హోమియోపతి వైద్యము అంటాము. ఇంకోటి, న్యాచురోపతి కూడా ఉంది. ఇంకా రకరకాల వైద్యాలున్నాయి, ఇప్పుడు ఈ మూడు రకాల వైద్యాల పేర్లు చెప్పుకున్నాము. మనం హిందువులు, క్రైస్థవులు, ముస్లీమ్‌లు అని ఎట్లైతే మూడున్నాయో, అట్లే మందులు కూడా మూడు రకాలు ఉన్నాయి. ఒకటి అల్లోపతి మందు, రెండు హోమియోపతి మందు, మూడవది న్యాచురోపతి మందు అనుకుందాము. సరే అల్లోపతి మందు టాబ్లెట్ ఇస్తారు, ఆ టాబ్లెట్ రోగము పోవడానికి రోగానికి వేసుకుంటున్నాము. ఆ టాబ్లెట్‌లో ఏముంటుంది? మందు ఉంటుంది? అది కనిపించదు. మాత్ర కనిపిస్తుంది గానీ మందు కనిపించదు. అది శరీరంలో పనిచేస్తుంది. అది ఏమి పనిచేస్తుందో ఏమోకానీ రోగం పోవచ్చు, పోకుండా ఉండవచ్చు. ఒక డాక్టరు దగ్గరికి పోతే ఒక మాత్ర ఇచ్చాడు. ఆ మాత్ర పని చేయలేదని ఏమీ చేసినావు అంటే ఈ డాక్టరు నాకు సరిగా మందులు ఇవ్వలేదు, అని ఇంకో డాక్టరు దగ్గరికి పోతావు. ఇంకో డాక్టరు ఇంకో మందు ఇస్తాడు. అల్లోపతి డాక్టరే, ఆ డాక్టరు ఇస్తే నీ రోగము పోయిందంటే ముందు డాక్టరు ఇచ్చిన మందులు పని చేయలేదు. ఈ డాక్టరు ఇచ్చిన మందు పని చేసింది అని అనుకుంటావు. కానీ ఏ డాక్టరు ఇచ్చినా మాత్ర అంటే ఆయన ఒకరకం మాత్ర ఇచ్చినాడు, ఈయన ఇంకో రకం మాత్ర ఇచ్చాడు అనుకోండి. అప్పుడు నువ్వేమనుకున్నావు అంటే దానికిపోలేదు దీనికి పోయింది అంటావు. అదీ మందే ఇదీ మందే. అంటే ఆ మందు పని చేయలేదు ఈ మందు పని చేసింది, అందువలన శరీరంలో నీ రోగం పోయింది. అక్కడ మాత్ర అనేది ఒకటుంది మందు అనేది ఉంది. తర్వాత హోమియోపతి దగ్గరికి పోయినాము అనుకోండి, హోమియోపతిలో కూడా మాత్రలు ఇస్తారు.

అందులో కూడ మందుంటుంది, ఆ మందు కూడ పని చేస్తుంది. నీకొచ్చిన రోగం పోయేదానికి, అయినా నీ రోగము పోలేదు అనుకో, న్యాచురోపతిలోకి పోతే ఒకాయన ఆకు నూరి ఇస్తాడు. గుళిక అది వేసుకుంటే నీకు రోగం పోయింది. ఇట్లా అల్లోపతిలో చాలామంది వైద్యులున్నారు, హోమియో పతిలో కూడ వైద్యులు ఉన్నారు. తర్వాత న్యాచురోపతిలో కూడా వైద్యులున్నారు. కానీ ప్రతి వైద్యుడు ఒకే మందు ఇస్తాడా! అంటే నమ్మకం లేదు. నొప్పులనిపోతే ఒక డాక్టరు ఒక మందు ఇస్తే, ఇంకో డాక్టరు ఇంకోరకం మందు ఇస్తాడు. అంటే అందరూ ఒకటే మందు వాడరు. ఒక్కొక్కరు వాళ్ళ తెలివికొద్ది ఇంకో మందుకు పోకుండా ఉండోచ్చు, ఇంకోమందుకు పోవచ్చు. ఇలా ఏ విధంగా అయిన జరుగు తుంది. ముగ్గురు డాక్టర్లు ఇచ్చేటివి కూడా మందులే. కానీ పేర్లు హోమియోపతి, అల్లోపతి, న్యాచురోపతి. ఆ రకంగా ఇప్పుడు మనం జ్ఞాన విషయంలో వచ్చేసరికి మూడు మతాలున్నాయి. మూడు మతాలకు మూడు గ్రంథాలున్నాయి. మూడు దైవగ్రంథాల్లోనూ జ్ఞానమే ఉంది, ఇంకోటి ఏమీలేదు. ఎవరు ఏ మతం జ్ఞానాన్ని చదువుకున్నా అది నీకు దేవుని జ్ఞానమే అందిస్తుంది.

నువ్వు అల్లోపతిలోకి పోయినాగానీ, ఆ మాత్ర మందే ఇస్తుంది. హోమియోపతిలోకి పోయినాగానీ ఆ మాత్ర మందే ఇస్తుంది. న్యాచురో పతిలోకి పోయినాకానీ ఆకు గుళికే, ఆ గోలిలో నీకు మందే ఉంటుంది. అట్లాగానే ఇందు అనే తెలుగు పదం ప్రకారం, తెలుగు శబ్దం ప్రకారము ఇందు అనే పేరు ఎందుకు వస్తుందంటే, చంద్రుడుకు ఇందు అని పేరుంది. చంద్రుడంటే జ్ఞానానికి అధిపతి. సర్వజ్ఞానములకు అధిపతి చంద్రుడు. బ్యాంకుల్లో క్యాషియర్‌లు డబ్బును ఇచ్చినట్లు మనకు భూమిమీదికి జ్ఞానాన్ని

ఇచ్చేవారు చంద్రుడు అనే గ్రహం. చంద్రుడు అను గ్రహం పేరు ఇందువు కాబట్టి, ఎవరైతే జ్ఞానం తెలుసుకున్నాడో వానిని ఇందువు అంటారు. జ్ఞాని అనే పదానికి ఇందువు అనేపదం సరైనది.

పూర్వం భారతదేశంలో పూర్తి అంటే వేరే మతం లేనప్పుడు, ఒకే ఒక సమాజం ఉన్నప్పుడు, ఆ సమాజమంతా జ్ఞానం తెలుసుకున్నప్పుడు, అంతా జ్ఞానులుగా ఉన్నప్పుడు, గొప్ప జ్ఞానులుగా ఉన్నపుడు భారతదేశమంతా ఇందువులు ఉండేవారు. భారతీయులంతా ఇందువులే అని చెప్పేవాళ్ళు. కానీ ఇందువు అనేది ఒక మతం పేరు కాదు. మందు పేరు అని అర్థము చేసుకోండి. ఇందు అనేది జ్ఞానం పేరు, దేవుని జ్ఞానం పేరు. అల్లోపతిదైనా మందే, హెూమియోపతిదైనా మందే, న్యాచురోపతిదైనా మందే. మందు అనేది ఏ వైద్యవిధానానికైనా వర్తిస్తుంది. కాబట్టి అన్నిటికీ మందు అనేది సరిసమానమైన అర్థాన్ని ఇస్తుంది. ఆ రకంగానే ఇందు అంటే జ్ఞాని అనే అర్థము ఉంది. కాబట్టి వాడు ముస్లీమ్ మతంలోని వాళ్ళు దేవుని జ్ఞానం తెలుసుకుంటే ఆతనిని ఏమనాలంటే జ్ఞాని అనాలి. క్రైస్థవులు జ్ఞానం తెలుకున్నా వాన్ని జ్ఞాని అనాలి. హిందువుల్లో జ్ఞానం తెలుసుకున్నా వానిని కూడా జ్ఞానే అంటాము. ఈ జ్ఞాని అనే పదము అన్ని మతముల వారికి సమానముగా వర్తిస్తుంది. ఈ జ్ఞాని అనే పదము క్రైస్థవులకు వర్తిస్తుంది. ముస్లీమ్‌లకు వస్తుంది, హిందువులకు వర్తిస్తుంది, ముస్లీమ్ మతంలో జ్ఞానులు ఉండవచ్చు, క్రైస్థవమతంలో జ్ఞానులు ఉండవచ్చు, హిందు మతంలో జ్ఞానులు ఉండవచ్చు. కానీ జ్ఞాని అనేటటువంటివాడు ఒక హిందూ మతానికే పరిమితం కాదు, అన్ని మతాలకు సంబంధించినటువంటివాడు.

అయితే ఈ జ్ఞాని అనే పదము ఏ రకంగా ఉచ్ఛాటణ జరుగుతూ వచ్చిందంటే హిందువు అనే పేరుతో వచ్చింది. చంద్రుడు అనే పేరుతో

మనకుంది. కాబట్టి చంద్రుడనే పేరు వర్తిస్తుంది. చంద్రుడు అనేటటువంటి గ్రహము జ్ఞానానికి అధిపతి. కాబట్టి ఆయన పేరే ఉచ్చరిస్తూ ఇందువు అనే పేరు పూర్వం నుంచి వచ్చింది. ఇప్పుడు ఇందు అనే పదము హిందూ అనే పదంగా మారిపోయింది, అంటే హిందువు అనే పదం ఒక మతంగా ఉంది. కానీ ఇది జ్ఞానం కాదు, నేడు హిందు అనే పేరు పెట్టుకున్న వాళ్ళంతా జ్ఞానులా అంటే కాదు అని చెప్పవచ్చు. జ్ఞానం తెలుసుకున్నటు వంటివాడు జ్ఞాని అవుతాడు. భగవద్గీత జ్ఞానం తెలుసుకున్నట్టి వాడు జ్ఞాని అయితాడు. ఆ జ్ఞానిని ఏమనాలి? ఇందువు అనాలి. అదే బైబిల్ జ్ఞానాన్ని తెలుసుకున్నట్టి వానిని మనం ఏమి అనాలి అంటే వాడు కూడా జ్ఞానే కాబట్టి వాడు కూడా ఇందువే అవుతాడు. ప్రతి మనిషి 12 గ్రహాల నీడలోనే ఉన్నాడు. ప్రతి మనిషికి 12 గ్రహాల వల్లనే ప్రతీది లభ్యమైతావుంది. అట్లగానే దేవుడు అందించేటటువంటి జ్ఞానం కూడా ఈ చంద్రుని ద్వారా మనకు లభ్యమైతావుంది.

ఏ మతంలో జ్ఞాని ఉన్నా వాన్ని మనం ఏమనాలి ఇందువు అనాలి. ఇందువు అనే పేరు ఒక సమాజానిదా అంటే, కాదు ముస్లీమ్ సమాజానిదైనా కావచ్చు, క్రైస్థవ సమాజానికైనా మనం పిలువచ్చు. ఇందువు అంటే జ్ఞాని అను గౌరవమైనటువంటి పదము. జ్ఞానము తెలిసినటువంటివానిని గౌరవంగా పిలిచేటటువంటి పదం ఇందువు. మనము ఒక క్రైస్థవుడిని నువ్వు ఇందువు, స్వచ్ఛమైన ఇందువు అంటే నేనేంటికి ఇందువు అయితాను. నేను క్రైస్థవున్ని అంటే తప్పు అవుతుంది. ఇందువు అనేది మతానికి సంబంధించిన పదం కాదు. కేవలం జ్ఞానానికి సంబంధించిన పదము. నువ్వు జ్ఞానివి అని గౌరవంగా చెప్పేటి పదం తప్ప ఇంకోటి ఏమీ కాదు. కాబట్టి ఈ అర్థము తెలియక చాలామంది ఏమి చేసారంటే దీనిని కూడా

మతానికి అంటిపెట్టుకొని ఇందువు అంటే ఒక మతం అనుకుంటున్నారు. కాబట్టి ఆ పదాన్ని ఏమని చెప్తున్నామంటే ఇందువు అంటే ఒక మతానికి సంబంధిచినటువంటిది కాదు. ఏ మతానికి కట్టుబడిలేదు, కాబట్టి అన్ని మతాల్లోనే ఇందువులు ఉండోచ్చు. అంటే జ్ఞానం తేలిస్తే ఎవడైనా ఇందువు కావచ్చు, ఇంకా నేను ఏమీ చెప్తున్నాంటే ఏమాత్ర అయినాకానీ అల్లోపతిమాత్ర కానీ, హెూమియోపతి మాత్ర కానీ న్యాచురోపతిలో ఉండేటి ఆకు నూరి ఇచ్చే ఒక ఉంటగానీ, అది మందుగా నీకెట్ల శరీరంలో పనిచేస్తుందో ఆ రకంగా, ముస్లీమ్ జ్ఞానమైనాగానీ, క్రైస్థవ జ్ఞానమైనాగానీ, హిందూ జ్ఞానమైనాగానీ, ఏ జ్ఞానమైన గానీ నీకు ఇందువు అని చెప్పబడుతుంది కానీ ఇంకొకటి ఏమీ కాదు. నువ్వు అల్లోపతి డాక్టరు ఇచ్చిన మాత్ర నాకు మందు అన్నట్లే ప్రతి మాత్రలో దాంట్లో మందు ఉంది. ఇందులో ఉంది అందులో మందులేదు అని కాదు. ముఖ్యమైన సారాంశం మాత్రలో ఉండేదంతా మందే, కానీ ఇప్పుడు ఒకొక్క డాక్టరు ఒక్కొక్కమందు ఇచ్చినట్టు, ప్రపంచంలో బోధకులు ఎంతోమంది ఉన్నారు. ఆ బోధకులంతా రకరకాల బోధలు చెప్పుచున్నారు.

రకరకాల డాక్టర్లు, రకరకాల మందులు ఇచ్చినట్లు మీకు, రకరకాల బోధకులు రకరకాల బోధలు చెప్పుచున్నారు. ఇప్పుడు ఒక పెద్దాయన చెప్పాడు, ఏమని చెప్పాడు, నేను చాలాచోట్ల తిరిగినాను చాలాచోట్లకు పోయినాను, ఎన్నో బోధలు విన్నాను. నాకు దేవుడనేవాడు తెలియలేదు, సరే నీకు రోగము పోలేదు అని అంటున్నావు. ఎన్నో మందులు తిన్నాను, ఎన్నో మాత్రలు వేసుకున్నాను రోగము పోలేదు అని అంటే, రకరకాల బోధలున్నాయి. ప్రపంచములో ఈ బోధలన్నీ నీకు ఒకటే మందు, ఒకటే జ్ఞానాన్ని ఇస్తాయని నమ్మకం లేదు. అందువల్ల నువ్వు పూర్తి నీ రోగము

పోలేదు, అంటే ఇప్పుడు ప్రపంచంలో బోధకులు ఎంతోమంది ఉన్నారు. వాళ్ళు చెప్పేటటువంటి బోధలన్నీ ఎన్నో విధాములుగా ఉన్నాయి. అన్నీ రోగాన్ని పోగొట్టే సామర్థ్యం కలిగియున్నాయా అంటే కలిగియుండవచ్చు ఉండవచ్చు, కలిగియుండక పోవచ్చు. కానీ ఏది సమర్థమైనటువంటి మందుగా ఉండి నీ రోగాన్ని పోగొడ్తుతుంది. నువ్వు తినంగా తినంగా తెలుస్తుంది, ఒక్కసారిగా ఏదీ తెలియదు. కొంతమంది ఫలనాచోట ఉండే జ్ఞానమే గొప్పది. అంటే ఇంకొకాయన చెప్తాడు మా గురువుగారు చెప్పినేది గొప్ప అంటాడు. అట్లా ఒకరు చెప్పితే వినరు. కానీ అనుభవపూర్వకంగా తెలుసుకుంటే అర్థమైతుంది జ్ఞానం. ఏది గొప్పది అని అనుభవపూర్వకంగా ఎట్లా తెలుసుకోవాలంటే అక్కడుండేటి జ్ఞానమంతా చూడు, తర్వాత ఇక్కడుండే జ్ఞానాన్ని చూడు. ఇలా అనేకమైన జ్ఞానాలను చూసిన తర్వాత ఒక జ్ఞానాన్ని పోల్చుకుంటూ వస్తే ఏది గొప్పది, ఏది గొప్పది కాదు అని తెలుస్తుంది. ఏదైతే నీకు గొప్పదని తెలిస్తుందో దానిని నువ్వు ఆశ్రయిస్తే అప్పుడు నీలోఉండే రోగము పోయేటటువంటి మందు దొరికింది అనుకోండి. అప్పుడు ఆ మందు దొరికిందనుకో, నువ్వు వేసుకునే మాత్రే స్వచ్ఛమైన మాత్ర అని తెలుస్తుంది. మాత్రవేరు, మాత్రలో ఉండేటటువంటి మందువేరు మాత్రలు అనేకరకాలు మాత్రలో ఉండేటటువంటి మందులు కూడా హెచ్చు తగ్గులుగా శక్తి కలిగియున్నాయి.

ఇట్లా ఈ బోధలు అనేక రకాలు. ఈ బోధల్లో కూడ శక్తివంతమైన బోధలు, జ్ఞానవంతమైన బోధలు, జ్ఞానహీనమైనబోధలు రెండు రకాలున్నాయి. అందువల్ల మీరు జ్ఞానవంతమైన బోధలనే వినండి. కాబట్టి మనం ఏమి చెప్తున్నామంటే మీరు అల్లోపతిమాత్ర వేసుకుంటున్నామా, హెూమియోపతి మాత్ర వేసుకుంటున్నామా, న్యాచురోపతిమాత్ర వేసు

కుంటున్నామా అని బాగా ఆలోచన చేసి వేసుకోండి. దీంట్లో ఏది మీకు మంచి అవుతుందో, మీ రోగాన్నీ ఏదైతే పోగొడ్తావుందో దానిని ఆశ్రయించండి. 100లో 90 మంది అల్లోపతి మందు వాడుతున్నారు. కానీ ఒక 8 మంది హెూమియోపతి మందు వాడుతున్నారు. ఇద్దరూ మాత్రం న్యాచురోపతిమందు వాడుతున్నారు అనుకోండి. ఒక తేలుకుట్టింది అనుకోండి అంటే నొప్పితో బాధపడు తున్నాడు. అది రోగమే అంటే బాధ పొందుతున్నాడు, ఆ బాధను తీసేసే దానికి అల్లోపతి డాక్టరు ఒక మందు ఇస్తాడు. హెూమియోపతి డాక్టరు ఒక మందు ఇస్తాడు. తర్వాత న్యాచురోపతి డాక్టరు ఒక మందు ఇస్తాడు. అంటే మూడు తేలు నొప్పిని తీసేసే మందులే. ఒకటి తొందరగా తీసేస్తుంది, ఒకటి ఆలస్యంగా తీసేస్తుంది. ఇంకొకటి ఇంకా చాలా తొందరగా తీసేస్తుంది. అల్లోపతి దగ్గరికి పోతే ఆయన ఏమి చెస్తాడంటే ఒక ఇంజెక్షన్ ఇస్తాడు, కుట్టినచోటే వేస్తాడు. ఎక్కడైతే తేలు కుట్టిందో అక్కడ నుండి నొప్పి మొదలవుతుంది కదా! అక్కడ ఇంజెక్షన్ వేస్తే ఆ నొప్పి వెంటనే లేకుండా పోతుంది. తేలు కుట్టినచోట ఇంజెక్షన్ వేస్తే అక్కడ నొప్పి లేకుండా పోతే, మొత్తం పై నుండి క్రింది వరకు నొప్పి కనిపించకుండా పోతుంది. అది ఒక 15, 20 నిమిషాలు లేకుండా పోతుంది. విషము బలంగా ఉందనుకో నొప్పి మళ్ళీ వచ్చేస్తుంది. అంతేగానీ పూర్తిగా పోతుందని నమ్మకం లేదు.

ఈ మందు పని చేసినంతవరకే ఉంటుంది అది. హోమియోపతి మందులోకి పోతే ఆయన ఏదో మందిస్తాడు ఒక 15 నిమిషాల తర్వాత వరకు అది తగ్గదు. ఆలస్యంగా పోతుంది. అల్లోపతి వెంటనే పోతుంది తర్వాత వస్తుంది. హోమియోపతి ఆలస్యంగా పోతుంది తిరిగి రాదనుకోండి. ఇంకొకటి ఏమిటంటే ఈయన సూది గుచ్చినాడు. ఆయన మాత్రలను

నోటిలోనికి వేసాడు. ఈయన సూది గుచ్చితేనే పోయింది, ఆయన మాత్ర వేసిన తర్వాత 10-15 నిమిషాలకు నొప్పి పోయింది. ఇంకొకాయన దగ్గరకు పోతే ఒక ఆకు తీసుకుంటాడు, అది నలిపి ఉంట చేసి మ్రింగే దానికి కూడా ఇవ్వడు. ఇలా చూపిస్తే ఆ రోగం పోతుంది, ఆ నొప్పి పోతుంది. అప్పుడు ఎక్కువమంది అల్లోపతి వాడుతున్నారని దీనిని నమ్ముతావా, అంటే మంచి మందంటావా, తక్కువమంది వాడుతున్నారని దీనికంటే అది తక్కువదంటావా. ఇంకా తక్కువ మంది కేవలం నూటికి ఇద్దరు వాడే న్యాచురోపతి చెట్టు ఆకులు న్యాచురల్‌గా పుట్టిన ఆకు వైద్యం. అది ఆ ఆకు నలిపి ఇలా చూపిస్తూ, తేలు కుట్టిన వ్యక్తిని తాకకుండా, ఆకు మందు వేయకుండానే ఆ నొప్పి పోతుంది. హోమియోపతి మందు నోట్లో వేస్తేనే నొప్పి పోతుంది. అల్లోపతి సూది గుచ్చితేనే నొప్పి పోతుంది. వీటిలో ఏది మంచిది అంటారు? మనకు తేలు కుట్టింది, తేలు కుడితే అల్లోపతి డాక్టరు దగ్గరకు పోతే నొప్పి పోయింది గానీ మళ్ళీ వచ్చింది ఏమి ప్రయోజనం లేదు. నొప్పి పోవాలి కదా! నొప్పి 10 నిమిషాలు పోయింది. 11వ నిమిషంలో మళ్ళీ వచ్చింది. హోమియోపతి దగ్గరకు పోతే మందు ఇచ్చాడు, కానీ 15 నిమిషాల తర్వాత పోయింది, తర్వాత రాలేదు. కానీ ఆలస్యంగా పోయింది. ఇప్పుడు నేచరోపతి డాక్టరు దగ్గరికి పోతే ఒక ఆకు తీసుకున్నాడు ఆయన అలా నలిపి దగ్గరికి తీసుకొస్తేనే నొప్పి పోయింది. మూడు రకాల వైద్యులు కాకుండా ఇంకొక వైద్యం ఉంది. దానిని వైద్యం అనే అనాలి. ఎక్కడైతే రోగం నయమవుతుందో దానిని వైద్యం అనాలి. ఇంకొక డాక్టర్ దగ్గరకి పోతే ఆయన ఇలా మనల్ని చూస్తే చాలు తేలు కుట్టిన రోగం పోయింది.

ఇప్పుడు ఎవరు మంచి వైద్యుడు. అంటే వాటిని నమ్ముతారు. ఆకు చూపిస్తేనే, నోట్లో వెయ్యకుండా తేలుకుట్టిన వ్యక్తిని ఏ వైద్యం చేయకుండా, ఆకు చూపిస్తే నొప్పి పోతుంది అంటే, అది మాకు నమ్మశక్యం కాదు అంటారు. వాస్తవమే ఇంకొకటి ఏమంటే వేరే వైద్యుని దగ్గరకి పోతే వైద్యుడు చూస్తానే పోయిందనేది, అది పూర్తి నమ్మము అంటారు. సరే ఇది నమ్మకాల మీద ఆధారపడి ఉంది. ఇప్పుడు కంటికి కనిపించేది ఏది హోమియోపతి మందు, అల్లోపతి మందు 15 నిమిషాలు పోయింది. 15 నిమిషాల తర్వాత వచ్చింది. హోమియోపతి మందు 15 నిమిషాల తర్వాత పోయింది. అంటే ఈ రెండూ నీకు అనుభవాన్ని లేట్‌గా తీసేస్తున్నాయి. ఇది కొద్దిసేపు పోయింది కొద్దిసేపుంది అల్లోపతి మందు అది కొద్ది సేపు తర్వాత పోయింది ఇంక లేదు. ఆ కొద్ది సేపుంది కదా! తర్వాత ఈ ఆకు వైద్యం దగ్గరికి పోతే అది తీసుకొని అది నలిపి చూపిస్తే పోయింది. దానికో ఆకు తెచ్చుకొని నలిపి చూపించే దానికి రెండు నిమిషాలు టైమ్ పట్టింది. ఇంకొక వైద్యుని దగ్గరికి పోతే రెండు బారల దూరంలో ఉన్నప్పుడే అతను చూస్తూనే అది పోయింది. ఇది ఇంకా త్వరగా పోయింది కదా! ఇప్పుడు ఏది బాగా పనిచేసింది అని మీరు లెక్కేస్తే మీకు నమ్మకమున్నా, నమ్మకం లేకపోయినా చూస్తూనే ఒకని దగ్గర పోయింది. అది గొప్పది లేదు దానికంటే ఇంకో రవ్వంత తక్కువ రకం అనుకుంటే అది ఆకు నలిపి ఇంకా నీ నోరులో వెయ్యలేదు. కడుపులోకి వెయ్యలేదు అది పోయింది అదొక రకం. ఈ రెండిటిని పోల్చుకుంటే నీ చూపు ఆయన మీద పడుతూనే పోయింది. లేదు ఆయన చూపు నీ మీద పడుతూనే పోయిందనుకో, ఏదో ఒక రకంగా పోయింది. ఇది చాలా తొందరగా జరిగింది కదా. ఆకు ఒక నిమిషం ఆలస్యం అయ్యింది. ఇప్పుడు ఈ రకంగా మీకు ఒకే వైద్యంలో నాలుగు రకాల తేడాలు కనిపించినాయి.

అట్లాగానే ఒకే జ్ఞానంలో దేవుడు ఒకడే, దేవుని జ్ఞానం ఒకటే అని చెప్పుతున్నాము. ఉండేది దేవుడు ఒకడే, దేవుని జ్ఞానం ఒకటే కానీ చెప్పే బోధకులు చాలా రకాలుగా ఉన్నారు. మనుషులకుండే బాధలు ఒకటే, బాధలను తీర్చేటటువంటి ఔషధం ఒకటే. ఔషధాన్ని ఇచ్చేవారు రకరకాల మనుషులున్నారు కాబట్టి ఒకడు తొందరగా పనిచేసేదానిని ఇస్తున్నాడు. ఒకడు తక్కువగా పనిచేసేదానిని ఇస్తున్నాడు. ఒకడు కొద్దిగా నిమిషం ఆలస్యంగా పని చేసేది ఇస్తున్నాడు. ఒకడు వెంటనే పోయేటి దానిని కూడా ఇస్తున్నాడు. కాబట్టి నువ్వు ఏదైతే నాకు తొందరగా పనిచేస్తావుందో, దాని మీద నువ్వు నమ్మకం పెంచుకున్నట్టు, దాని మీద విశ్వాసం పెంచుకున్నట్టు దేవుని జ్ఞానం ఏదైతే ఉందో ఏ బోధకుడు చెప్పితే నీకు తొందరగా అర్థమయితావుందో ఏ బోధకుడు చెప్పితే నీ కర్మలు తొందరగా తెగి పోతున్నాయో, ఏ బోధకుడు చెప్పితే నీలో ఉండేటి కర్మలు పోయి, తొందరగా జ్ఞానశక్తి లభిస్తుందా ఉందో, ఏ బోధకుడు చెప్పితే నీకు హృదయంలో సంతోషము కలుగుతా ఉందో, ఆ బోధను స్వీకరించేటి పద్ధతి నువ్వు అవలంబించు అని చెప్పుచున్నాము.

అంతా దేవుని జ్ఞానమే, జ్ఞానం కాదని చెప్పలేదు. ఏ జ్ఞానం నీకు అర్థమైతావుందో చూసుకో, ఏ జ్ఞానం శాస్త్రబద్ధంగా ఉందో చూసుకో, ఏ జ్ఞానం నీకు తొందరగా నీ కర్మను తీసేస్తావుందో చూసుకో. అంతేగానీ మతము అనేది దేవునికి జ్ఞానానికి సంబంధం లేదు. నీది పెద్ద వయస్సు అయి ఉండొచ్చు, చెప్పేవాడు బోధకుడు చిన్నవయస్సు అయి ఉండవచ్చు, ఆ బోధకుడు చెప్పినా నీకు కర్మలు పోవచ్చు. అందువల్ల నీకు తెలియబడేటి జ్ఞానం ఏది నీకు మంచిదో నిర్ణయం తీసుకోవాలి. కానీ ఒకరు చెప్పితే బాగుందనుకోవడం అది మంచిది కాదు. అట్లాగానే ఒకరు చెప్పి అది

బాగలేదు అని అంటే అట్లనుకోవడం కూడా మంచిది కాదు. ఇప్పుడు మేము జ్ఞానం చెప్పుచున్నాము. ఇప్పుడు నా వరకు నేను ఏమి చెప్పుచున్నాను అంటే మనుషులంతా ఒకే జాతి అనే సిద్ధాంతం నాది. మనుషులనే వాళ్ళు పుట్టిన తరువాత మతాలుగా ఏర్పడిపోయినారు. కుటుంబంలో వాళ్ళ తల్లితండ్రులను బట్టి నాది ఫలానా మతమని నిర్ణయించుకుంటున్నాడు. పుట్టిన తర్వాత వచ్చింది మతం, పుట్టుక పూర్వం లేదు. పుట్టిన తర్వాత బుద్ధి వచ్చిన తరువాత నాది ఫలానా మతం అనుకుంటున్నాడు. కానీ ఆ చిన్నవయస్సులో మనిషికి మతము లేదు. ఇవన్నీ వయస్సు వచ్చిన తరువాత వచ్చిన మతంలో సంబంధం లేకుండా దేవుడనేవాడు ఒకడే నీకున్నాడని, అందరికీ ఒకటే రకం జన్మ నీకు ఇచ్చినాడని, ఒకటే రకమైన శరీరాన్ని ఇచ్చినాడని అందరికీ ఒకటే రకమైన జ్ఞానం అవసరమని నేను చెప్పుచున్నాను.

అందువల్ల నేను చెప్పే జ్ఞానం అందరికీ ఎట్లుంటుంది అంటే నాకు చాలా సులభమే. నేను ముస్లీమ్ జ్ఞానమైనా మాట్లాడతాను, క్రైస్తవజ్ఞానమైనా మాట్లాడతాను, ఇందువుల జ్ఞానమైనా మాట్లాడతాను. ఎందుకంటే మూడు జ్ఞానాలు ఒకటే కోవలో ఉన్నాయి నాకు. ఇది ఎలా అయితే అర్థమైందో అదీ అలాగే అర్థమవుతుంది. భగవద్గీత ఎట్లా అర్థమయిందో నాకు బైబిల్ అట్లే అర్థమవుతుంది, ఖురాన్ అట్లే అర్థమవుతుంది. కానీ ఇప్పుడు చెప్పే బోధకులు వేరు వేరుగా ఉన్నారు అని నేను చెప్పాను కదా! మతాలవారిగా బోధకులు చీలిపోయారు. మతాల వారిగా జ్ఞానం చీలిపోయింది అలా ఉండకూడదు. దేవుడు ఒకడే, జ్ఞానం ఒకటే. ఇప్పుడు ఈ రకంగా చీలిపోయినప్పుడు ఏమి చేస్తారంటే ఒకరినొకరు విమర్శించుకుంటున్నారు. కానీ ఇప్పుడు ఇక్కడికి వచ్చే వాళ్ళను చూడండి. మీరు ఉదయం చూసారు

క్రైస్థవులు ముస్లీమ్‌లు కలిసి మీటింగ్ చేసుకున్నారు. ఇదెక్కడైనా జరిగే పనేనా. క్రైస్థవులు, ముస్లీమ్‌లు, హిందువులు కలిసి ఒకచోట కూర్చొని మాట్లాడుకునేది మీరు చూశారు. క్రైస్థవులు ఏమి చేసారు? ఖురాన్‌లో ఉండేటటువంటి వాక్యాల గురించి వివరముగా చెప్పుచున్నారు. దాని గొప్పతనాన్ని గురించి చెప్పారు. ఖురాన్‌లో ఇంత గొప్ప జ్ఞానముంది అని చెప్పారు. ముస్లీమ్‌లు ఏమి చేసారు? బైబిల్‌లో గొప్ప జ్ఞానముంది అని ముస్లీమ్‌లు చెప్పారు. ఇద్దరు ఒకరికొకరు అంటే క్రైస్థవులేమో ముస్లీమ్ జ్ఞానం, ముస్లీమ్‌లేమో క్రైస్థవ జ్ఞానం చెప్పుకున్నారు. వాళ్ళ మతాలు అనేవి అడ్డం రాకుండా ఇది బైబిల్, ఇది ఖురాన్ అనేది లేకుండా అందులో ఉండే జ్ఞానం ఒకటే అనే ఉద్దేశ్యంతో మంచి సద్భావంతో వాళ్ళు చెప్పుకోవడం జరిగింది. ఇదెక్కడైనా జరుగుతుందా? జరగడం లేదు. ఇక్కడ కూడా మేము ఏమి చెప్పుచున్నామంటే వాస్తవంగా భగవద్గీత రాయడం జరిగింది. తర్వాత ఖురాన్ వివరంగా వ్రాయడం జరిగింది. **త్రైత సిద్ధాంత భగవద్గీత** అనే పేరుతో భగవద్గీతను వివరించి వ్రాయడం జరిగింది. ఖురాన్ కూడా జ్ఞాన వాక్యాలు, వజ్ర వాక్యాలు అనేటువంటి రెండు గ్రంథాలుగా వ్రాసాము.

ఈ మధ్య వ్రాసినటువంటి **'వజ్ర వాక్యాలు'** అనే గ్రంథము చాలా మంది చదివారు. హిందువులు చదివినారు, ముస్లీంలు చదివినారు, కానీ ఒకే మాట చెప్తున్నారు. వాళ్ళు అందరూ ఫోన్ చేసి ఏమి చెప్తున్నారంటే, ఈ గ్రంథం చదివిన తర్వాత, అంటే వజ్ర వాక్యాలు అనే గ్రంథం చదివిన తర్వాత, మేము ఇంక చనిపోయినా పర్వాలేదు, మాకు దిగులు లేదు అని చెప్తున్నారు. అంటే వాళ్ళకు అంత సంతోషము కలిగింది. అంత జ్ఞానం తెలిసిపోయింది. అంత స్థాయిలో ఈ జ్ఞానం చెప్పబడింది. అది ముస్లీమ్ గ్రంథం అనేటటువంటి పేరే గానీ, అంతిమ దైవ గ్రంథములో వజ్రవాక్యాలని

పేరే గానీ అది అందరికీ, సర్వమానవాళికి సంబంధించిన గ్రంథం. అలాగే ఇప్పుడు క్రైస్తవులదైన బైబిల్‌కు సంబంధించనటువంటి నాలుగు సువార్తలున్న **"ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు"** అను గ్రంథం వ్రాస్తున్నాము. అంటే బైబిల్ వివరించి వ్రాస్తున్నాను. కానీ అక్కడ విషయం ఏమి అంటే ఎక్కడైతే క్రైస్థవులకు వాక్యము అర్థం కాలేదో, ఎక్కడైతే క్రైస్థవులకు అర్థం కాకుండా వదిలి పెట్టేసారో వాటినే చెప్తున్నాను తప్ప ఇంకోటి ఏమీ చెప్పలేదు. బైబిల్‌లో **"ఇది తెలియకపోతే మీ పాపాల్లో ఉండి మీరు చనిపోతారు"** అని ఉంది. దానికంటే ముందు ముఖ్యంగా మూడు వేరు వేరు వాక్యాలొచ్చాయి. **"నేను పోతున్నాను, నేను ఎక్కడికి పోతున్నానో మీకు తెలియదు. మీరు నన్ను వెతుకుతారు కానీ నేను కనిపించను".** వెతుకుతారంటే కనిపించరనే కదా! అర్థం, దేవులాడబడేవాడు దేవుడు అని మనం అర్థం చెప్పాము కదా! వెతకబడేవాడు దేవుడు, నన్ను వెతుకుతారు. నేను కనిపించను. మీ పాపాల్లో ఉండి మీరు చనిపోతారు ఎందుకంటే **"నేను ఫలానా వాణ్ణి అని మీకు తెలియదు. నేను ఎక్కడికి పోతున్నానో మీకు తెలియదు. నన్ను వెతుకుతారు కానీ మీ పాపాల్లో మీరుండి చనిపోతారు"** అని చెప్పినాడు కదా? రెండో వాక్యంలో ఏమి చెప్పినాడు? **"మీరు దిగువ వారు, నేను ఎగువవాడిని. మీరు ఈ లోక సంబంధులు నేను ఈ లోక సంబంధుడను కాను".** అని చెప్పాడు. కానీ ఈ విషయం మీకు తెలియకపోతే మీ పాపాల్లో ఉండి మీరు చనిపోతారు. ఇక మూడో వాక్యం అద్భుతంగా చెప్పాడు ఏమని చెప్పినాడు నేనే ఆయనను అని, ఆయనంటే ఎవరు తెలియకపోతే యోహాన్ సువార్త 8వ అధ్యాయం 24 వ వచనము చూసుకోండి. 21వ వచనము, 23, 24 వచనములలో ఈ మూడు వాక్యాలు ఉన్నాయి. మరియొకప్పుడు ఆయన నేను వెళ్ళిపోవుచున్నాను, మీరు నన్ను వెదుకుదురు

గానీ మీ పాపములలోనే ఉండి చనిపోవుదురు. నేను వెళ్ళు చోటుకి మీరు రాలేరని వారితో చెప్పెను. అప్పుడాయన మీరు క్రింది వారు, నేను పైనుండువాడను. మీరు ఈ లోక సంబంధులు, నేను ఈ లోక సంబంధుడను కాను. సరే ఇప్పుడు చివరిలో ఏముంది నేనే ఆయనను అని మీరు విశ్వసించని ఎడల మీరు మీ పాపములలోనే ఉండి చనిపోవుదురని వారితో చెప్పెను.

నేనే దేవుడిని అని తెలియకపోతే అంటే చెప్పినది ఎవరు? మామూలుగా కట్టుకునేదానికి మారు వస్త్రము లేని వ్యక్తి. కనిపించే వ్యక్తి 33 సంవత్సరాల వయస్సులో చిన్నవయస్సులో ఉన్నటువంటి వ్యక్తి ఏమి చెప్పాడు. నేనే ఆయనని కనిపించేవాడే దేవుడని తెలియకపోతే మీ పాపాల్లో ఉండి మీరు చనిపోతారని చెప్పాడు. భగవద్గీతలో నేను మనిషిగా వచ్చి పుడతాను, మీకు జ్ఞానం చెప్పడానికి వస్తాను, ధర్మస్థాపితం కోసం నేను వస్తాను అని చెప్పాడు. మనిషిగా పుట్టి వస్తాను అని చెప్పాడు. బైబిల్‌లో కూడా అదే చెప్పాడు. నేను దేవుడనై మనిషిగా వచ్చినాను, నేను పోతాను. ఎక్కడ నుంచి వచ్చానో, నేను ఎక్కడికి పోతానో మీకు తెలియకపోతే మీ పాపాలు ఒకటి కూడా పోవు అని చెప్పినాడు. తర్వాత నేను పైనుండువాడను, క్రింద ఉండేవాడను కాదు అని రెండో వాక్యంలో చెప్పినాడు. మీరు ఇహ లోకవాసులే నేను ఇహ లోకవాసిని కాను అని చెప్పినాడు. తర్వాత మూడవ వాక్యంలో నేను ఆయననే అని మీకు తెలియకపోతే మీరు మీ పాపాల్లో ఉండి చనిపోతారు అని చెప్పాడు. ఇది ప్రతి యుగంలో జరిగే పనే. ప్రతి యుగములో ఆయన ధర్మస్థాపన కొరకు వస్తున్నాడు. సరే ఈ వాక్యాలు మీకున్నాయి. మీరు చూసారు కదా! ఈ వాక్యాలు క్రైస్థవులు చెప్పడం విన్నారా? లేదు, ఎందుకంటే ఏవైతే అర్థం

కాలేదో అవి మూసి పెట్టేసారు. బైబిల్ సంబంధం లేని వాక్యాలను చెప్పుచున్నారు. ప్రార్థన చేయాలి అని ఏదో ఒకటి చెప్తారు. కానీ జ్ఞానము అభివృద్ధి అయ్యేదానికి చెప్పినారా? ఏసు ఫలానా వాడు అని తెలుసుకునే దానికి చెప్పినారా? ఆయన మూడు వాక్యాలు చెప్పినాడు. మీ పాపాల్లో ఉండి చనిపోతారు అని అయితే ఆ వాక్యం మీరు చెప్పగలిగినారా? లేదు. అందుకే నేను ఏమి చెప్తున్నానంటే ఎక్కడైతే మీకు అర్థం కాకుండా వదిలిపెట్టారో దానిని నేను మీకు చెప్తున్నాను అన్నాడు. అదే ఖురాన్‌లోకి పోతే ఒక గుహ ఉంది, ఆ గుహకు కొన్ని ద్వారాలున్నాయి. ప్రథమ ద్వారం దగ్గర కుక్క ఉంది, కుక్క రెండు కాళ్ళు పెట్టుకొని కూర్చుంది, అది గుర్ అంటూ వుంది. దాని దగ్గరికి పోతే మొరుగుతుంది, లోపలకు పోలేము, లోపల 5 మంది ఉన్నారు, లోపల 7 మంది ఉన్నారు, అని ఒకరికొకరు అంచనా వేసుకుంటారు అని చెప్పినారు. దానిని ఎవరన్నా చెప్పుకుంటున్నారా? గుహ, కుక్క ఖురాన్‌లో ఎవరూ చెప్పకోవడం లేదు. ఎక్కడైతే వదిలివేసారో దానిని మేము చెప్పాము. ఇలా మీకు తెలియని జ్ఞానం ఎక్కడైతే ఉందో దానిని నేను చెప్తూ వచ్చాను తప్ప ఇంకోటి ఏమీ కాదు.

ఏ గ్రంథంలోనైనా జ్ఞానమే ఉంటుంది. భగవద్గీతలో "నేను ప్రతి యుగంలో పుట్టి వస్తాను" అని చెప్పినాడు. ఆ విధంగానే ఆయన ప్రతి యుగంలోనూ పుట్టాడు. కృష్ణుడు భగవద్గీతను చెప్పినాడు. తర్వాత ఇందువులుగా నేను చెప్పేమాట ఏమంటే ఇందువులకు అందరికీ ఒకవేళ పరిచయం లేకుండా పోవచ్చు, మిగతా మతస్థులకు కానీ మీరు ఆలోచన చేయండి. కృష్ణుడు భగవద్గీత చెప్పాడు. ఎప్పుడు చెప్పాడు అని తెలియదు. ఎప్పుడు అర్జునుడు విన్నాడో తెలియదు. ఏ వయస్సువాడు అనేది తెలియదు.

కృష్ణున్ని ఒకే వయస్సుగా మనం చిత్రపటం చూపుతాము కానీ మిగతా వయస్సుల్లో చూపము. కానీ మనకు తెలియదు, తెలియక చూపలేదు. మేము ఏమి చేశామంటే భగవద్గీత ఆయన 90 సంవత్సరాల వయస్సులో చెప్పినాడు అని మేము కృష్ణున్ని తెల్ల గడ్డము, తెల్ల వెంట్రుకలు వేస్తే, కృష్ణున్ని ముసలివాడిని చేసి హిందువులను అవమానం చేసినాడు అని హిందువులు అన్నారు. ముసలి వాడు కాకపోతే కృష్ణుడు యువకునిగా ఉన్నప్పుడు భగవద్గీత చెప్పినాడా? సరే! ఏదో వయస్సులో భగవద్గీత చెప్పినాడు కదా! ఆయనకేమన్నా మర్యాద ఇచ్చినారా? ఎవరైనా కృష్ణున్ని దేవుడంటున్నారా? ఆయన జారుడు, చోరుడు అంటున్నారు. వయస్సులో అంత అల్లరిగా తిరిగినాడు అన్ని అబద్ధాలు చెప్పినాడు. ఆ తరువాత దొంగతనాలు చేసినాడు అని చెప్తారు. మీకు కులగురువు ఎవరు అని దొంగలను అడిగితే కృష్ణుడని మొక్కు కుంటున్నారు. దొంగలు ఇంటి గురువు, కుల గురువు కృష్ణుడు అని చెప్పుకుంటున్నారు. ఇప్పుడు ఆయన దేవుడే అని మనం విశ్వసించితే కానీ మన పాపాలు పోవు. కానీ దేవుడే అని విశ్వసించడం లేదు మనం. మనం ఏమి చేస్తున్నాము అంటే వాళ్ళను మనుషులుగా లెక్కించి, వాళ్ళు చేసిన పనుల్లో తప్పులెంచుతూ వాళ్ళను చెడ్డవాళ్ళుగా చిత్రిస్తున్నాము తప్ప ఇంకొకటి కాదు.

కృష్ణుడు ద్వాపర యుగంలో స్వయంగా పరమాత్మ కృష్ణుని పేరుతో శరీరం ధరించి వస్తే ఆయన భగవంతుడని ఈ రోజు మనమంటున్నాము. భగవంతుడంటే వాస్తవమైన దేవుడని అర్థం. అవతరించినట్టి దేవుడని అర్థం. ఆయన వచ్చి పుట్టి మనకు జ్ఞానం చెప్పిపోతే ఆయన్ని దేవుడని ఎవరూ గుర్తించలేదు. అయన 126 సంవత్సరాలు బ్రతికితే ఆయనను ఏమాత్రం ఒక్కరు కూడా ఆయన్ను గుర్తించలేదు. అదే రకంగా ఇక్కడ ఏసుప్రభువు

ఏమి చెప్పినాడంటే మూడు అవకాశాలు ఇచ్చినాడు. ఆయనను కనుక్కునే దానికి నేను వెళ్ళి పోవుచున్నాను. నేను ఎక్కడికి పోతానో మీకు తెలియదు. నన్ను వెతెకుతారు కానీ మీకు తెలియదు. కాబట్టి నేను ఎప్పుడు వెతకబడేవాన్నే. అంటే దేవులాడబడేవాన్నే అంటే దేవున్నే కాబట్టి నేను ఫలానావాడిని అని తెలియదు. కాబట్టి మీ పాపాల్లో ఉండి మీరు చనిపోతారు. అది మొదటి వాక్యం. దాని ప్రక్కనే రెండవ వాక్యంలో మీరు దిగువవారు నేను ఎగువవాడను. మీరు ఇహలోక వాసులు, నేను ఇహలోక వాసిని కాను అని చెప్పినాడు. మీరు ఈ లోకవాసులు, నేను ఈ లోకవాసిని కాను అని చెప్పినాడు. ఈ విషయం మీకు తెలియదు కాబట్టి మీ పాపాల్లో ఉండి మీరు చనిపోతారని రెండవ వాక్యం చెప్పాడు. మూడవ వాక్యం దిమ్మ తిరిగిపోతుంది. ఒకటే అర్థం తెలుసుకునేదానికి చూడు ఎంత బాగా చెప్పినాడో **"నేనే ఆయనని తెలియక పోతే మీరు మీ పాపాల్లో ఉండి చనిపోతారు."** సరే! ఈ వాక్యాలు ఇప్పుడు నేను గొప్పగా చెప్పుచున్నాను. మళ్ళీ క్రైస్థవులు దీనిని ఎప్పుడైనా చెప్పుకున్నారా? చెప్పుకోలేదు.

ఈ విధంగా క్రైస్థవులు కానీ, ముస్లీమ్‌లు కానీ, హిందువులు కానీ ఎక్కడైతే వాళ్ళు వదిలేసారో ఆ వదిలినట్టి వాక్యాలు నేను చెప్తున్నాను. వివరం తెలియకుండా ప్రక్కన పెట్టిన వాటిని గురించి చెప్తున్నాను. అది కూడా శాస్త్రబద్ధంగా చెప్తున్నాను. కొంతమంది ముస్లీం సోదరులు బాగా అర్థం చేసుకున్నారు, జ్ఞానం చాలా గొప్పగా ఉంది అనుకుంటున్నారు. సరే! మంచిదే. తర్వాత క్రైస్థవులు కూడా చాలామంది ఈ జ్ఞానం గొప్పదని చెప్పుకుంటున్నారు. కానీ వాళ్ళ మతాలు అడ్డం వచ్చినందువల్ల ఇక్కడికి రాకుండా కనిపించకుండా ఉన్నారు. ఇక్కడికి వచ్చినోళ్లంతా తెగింపు చేసి, ఎవరన్నా ఏమన్నా అనుకోనీలే మాకేం అని ఇక్కడికి వచ్చినారు.

మిగతా వాళ్ళు ఏము చేసారంటే  మేము అక్కడికి పోతే మా మతము వాళ్ళు ఏమనుకుంటారో అని భయపడి రావడం లేదన్నమాట.  మేము ముస్లీమ్ గ్రంథం వ్రాసినామంటే కొన్ని వేలమంది ముస్లీమ్‌లు చదువు తున్నారు.  కానీ బయట పడకుండా ఉన్నారు. ఆ గ్రంథం హైదారాబాద్ మొత్తం చదువుతున్నారు. అంతేకాదు, మేము వ్రాసిన గ్రంథం ఆవిష్కరణ కాగానే, వెంటనే దుబాయ్‌లో ఉన్న వారు కూడా చదువుతున్నారు.  కానీ ఆ విషయం బయటకు తెలియదు. కానీ ఇక్కడ ముఖ్యంగా ఏమి చెప్పుకోవాలంటే నేను ఇందువుల జ్ఞానం ఎంతో గొప్పగా చెప్పుచున్నాను.

కొంతమంది హిందువులు అర్థం చేసుకోకుండా మమ్మల్ని విమర్శిస్తున్నారు. అంటే ఎక్కువ మంది కాదు, చాలా తక్కువ మంది. నేను చెప్పేది జ్ఞానమే కాదు అంటున్నారు. హైదరాబాద్ జూబ్లిహిల్స్‌లో పెద్దమ్మ గుడి అనే దేవాలయం ఉంది.  అక్కడ పెద్ద పెద్ద రాజకీయ నాయకులు, సినిమావాళ్లు అంతా పూజలు చేస్తారు, మొక్కుతారు. కానీ అక్కడ పూజింపబడే పెద్దమ్మ దేవతలాంటి దేవతలే ఇక్కడికి వచ్చి, భయ భక్తులతో జ్ఞానం తెలుసుకుంటున్నారు. కానీ ఈ జ్ఞానం హిందువులుగా ఉండి, తెలుసుకునే స్థోమత కలిగి ఉండి కూడా తెలుసుకోకుండా మాట్లాడుతున్నారు.  మేము వ్రాసిన గ్రంథాలలో శక్తి ఉంది, ఆ గ్రంథం మీ కర్మలను పోగొడుతుంది.  కర్మలు పోగొట్టే ఆత్మశక్తి ఆ గ్రంథాలలో ఉంది అని మేము చెప్పితే, చాలామంది ఆ గ్రంథాలు ఉపయోగించు కున్నారు.  వాళ్ళ కర్మలను గ్రంథాలవల్లే పోగొట్టుకున్నారు.  రోగాలు పోతే ఇంక హాస్పిటల్‌లు ఎందుకు, డాక్టర్లు ఎందుకు అని అడుగుతున్నారు. నిజమే అవసరం లేదు.  కానీ అందరికీ రోగాలు పోతాయా? నమ్మి విశ్వసించి పెట్టుకున్న వాళ్ళకే పోతాయి కానీ నమ్మని వాళ్లకి, విశ్వాసం లేని వాళ్ళకు

ఎలా పోతాయి? గ్రంథమే ముట్టుకోని వాళ్ళకు ఎలా పోతాయి. చాలా మంది పెద్ద పెద్ద సైంటిస్ట్‌లు మా గ్రంథాలు పరీక్ష చేసినారు. వాళ్లు మనది ఒక గ్రంథం పెడితే అది అతుక్కుంటే, వేరే గ్రంథం పెట్టి చూసారు, అది అతుక్కోలేదు. మళ్ళీ మనది పెడితే అతుక్కుంది. వాళ్ళకు అర్థం కాలేదు. ఇవన్నీ కూడా ప్రత్యక్షంగా జరిగే విషయాలే. కానీ నోరుందని విమర్శిస్తున్నారు తప్ప ఇంకొకటి ఏమీ లేదు. ఇలా విమర్శించేవారు చాలా మంది ఉంటారు. కుక్కలు మొరుగుతుంటే ఏనుగు ఏమాత్రం వెనక్కి తిరిగి చూడదంట. అట్లాగానే వీళ్ళు ఇటువంటి చిన్నచిన్న విమర్శలు చేస్తుంటే నేను ఏమాత్రం వెనక్కి తిరిగి చూడను. నా దారి ఎప్పుడు ముందుకే ఉంటుంది. వెనక్కి తిరిగి చూసే ప్రసక్తే లేదు. నేను చెప్పేది చెప్తున్నాను. మేము భతవద్గీత వ్రాస్తాను చూడండి అని చెప్పినాము.

త్రైత సిద్ధాంతం అనే ఒక సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని వ్రాసాము. అదే సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని బైబిల్ వ్రాసాము. అదే సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని ఖురాన్ వ్రాసాను. ఎక్కడైనా తప్పు పట్టేదానికి ఎవరికీ అవకాశము లేదు. మా జ్ఞానము వేరు, మీ జ్ఞానము వేరని అనేవాళ్ళందరూ మేము వ్రాసిన జ్ఞానంవేరని చూపించేదానికి అవకాశం ఉందా? క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడని ఎక్కడైతే చెప్పినారో అదే క్షరుడు, అక్షరుడు, పురుషోత్తమున్ని తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ అని బైబిల్‌లో చెప్పినారు. కాదనే దానికి ఎవరికీ అవకాశం లేదు. అదే ఖురాన్‌లోకి వచ్చేసరికి తోలేవాడు, తోలబడేవాడు, చూసేవాడని ముగ్గురిని చెప్పారు. భగవద్గీతలో ముగ్గురు, బైబిల్‌లో ముగ్గురు, ఖురాన్‌లో ముగ్గురు. ఆ ముగ్గురు ఒకే కోవకు చెందిన వారే. భాష వేరు వేరుగా ఉంది, మీరు అర్థం చేసుకోవడం వేరు వేరుగా ఉంది. నీ శరీరంలో ఉండి నడిపించేవాడు ఎవడయితే

ఉన్నాడో వానిని ఆత్మ అంటున్నాము. నువ్వు పరుగెడుతుంటే నిన్ను తోలబడేవాడు అంటున్నాము. నువ్వు జీవాత్మవు. చూసేవాడు, సాక్షిగా ఉన్నవాడు పరమాత్మ. ఇది ఖురాన్‌లో చెప్పిన సత్యము. అదే సత్యాన్నే నువ్వు కుమారుడివి, నీలో ఉండే ఆత్మ తండ్రి, ఆ పరమాత్మను పరిశుద్ధాత్మ అని బైబిల్‌లో అంటున్నాము. అది మీకు తెలుసో తెలియదోగానీ ఉండే సత్యము అదే. భగవద్గీత చూస్తే క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అంటే జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనేటటువంటి మూడున్నాయి. ఈ మూడు సిద్ధాంతం ఇక్కడే చెప్పారు కానీ ఎక్కడా ఇంతవరకూ చెప్పుకోలేదు.

సరే! మీరు ఏం అర్థం చేసుకున్నా కానీ, మీలో ఉండేటటువంటి మీరు ఏ మతస్థులైనా కానీ మీ శరీరం ఒకటే. ముస్లీంలకు ముక్కుంది, హిందువులకు ముక్కుంది, క్రైస్థవులకు ముక్కుంది. ఇది క్రైస్థవ ముక్కు అని ఏమన్నా తేడాగా ఉందా? ఇది ముస్లీమ్‌ల ముక్కు అని తేడాగా ఉందా? ఇది హిందువుల ముక్కు అని తేడాగా ముద్ర ఏమైనా వేసినారా? లేదు అందరికీ ఒక్కటే ముక్కే, అందరికీ ఒకటే శ్వాసే, అందరికీ ఒకటే రక్తమే, అందరికీ ఒకటే జీవన విధానమే. పుట్టుక ఉంది, బ్రతుకుంది, చావుంది. ముస్లీం చచ్చిపోతాడు, క్రైస్థవుడు చచ్చిపోతాడు, హిందువు చచ్చిపోతాడు. అందరికీ జీవితం ఒకటే రకంగా జరుగుతూ ఉంది. మనం పుట్టిన తర్వాత రకరకాల మార్గాలను అవలంభిస్తున్నాము. కానీ ఆ మార్గాలు తప్పు కాదు. ఒకసారి ఒక ముస్లీమ్ వచ్చి నేను ముస్లీమ్‌గా ఉన్నాను, నాకు ఏ జ్ఞానం అర్థంకాలేదు, మీ హిందువుల్లోకి మారతాను అన్నాడు. అప్పుడు మేము హిందూ మతంలో ఏ జ్ఞానం చెప్పబడిందో అదే జ్ఞానమే ఖురాన్‌లో ఉంది, దేవుడు నీకు మతాన్ని ఇచ్చినాడు, అట్లే జ్ఞానాన్ని కూడా ఇచ్చినాడు. నువ్వు దాంట్లో జ్ఞానాన్ని తెలుసుకో అని చెప్పినాము. నువ్వు టోపి పెట్టుకో, నువ్వు

ముస్లీమ్ అని ప్రకటించుకో, నువ్వు ఖురాన్ చదువు, ఖురాన్ జ్ఞానాన్ని తెలుసుకో, కానీ మతాలు మారితే ఏం ప్రయోజనం లేదు. నువ్వు జ్ఞానాన్ని తెలుసుకో, జ్ఞానివి అవుతావు, నువ్వు జ్ఞానివి అయితే ఇందువే అవుతావు అని చెప్పినాము. ఎవరైనా జ్ఞానులు కావాలంటే మీరు మీ మతంలోనే ఉండి జ్ఞానం తెలుసుకోవచ్చు. మీకు అర్థం కాకపోతే మమ్మల్ని అడగండి! చెప్తాము, మేమున్నంత వరకు చెప్తాము. మేము లేనప్పుడు చెప్పేదానికి కాదు. ఒక మతము వారిని అడిగితే వేరే మతములోనిది జ్ఞానమే కాదు అంటారు. ఇంకొక మతము వారిని అడిగితే వేరే మతములోనివి ముట్టుకోనే ముట్టుకోవద్దు అంటారు. చాలామంది భగవద్గీత ఇంట్లో పెట్టుకోవద్దు అని బయట గానీ, దేవాలయాల్లో గానీ పెడుతూ ఉంటారు. కానీ ఇదంతా కుట్రలతో చేసిన పని అని మేము చెప్పుచుంటాము.

భగవద్గీత గానీ, బైబిల్ గానీ, ఖురాన్ గానీ ఒకే జ్ఞానాన్ని బోధిస్తున్నాయని, అంతిమ దైవ గ్రంథము ఖురాన్‌లో 5వ సురాలో 42, 44, 46, 48, (5-68) ఆయత్‌లలో ఇదే మాట చెప్పినారు. కాబట్టి మీరు తెలుసుకుంటే భగవద్గీత జ్ఞానం, బైబిల్ జ్ఞానం, ఖురాన్ జ్ఞానం ఒకటే అని తెలుస్తుంది. ఈ జ్ఞానాన్ని తెలుసుకోవాలని ప్రయత్నం చేస్తే తప్పకుండా దేవుని జ్ఞానం తెలియబడుతుంది. ఖురాన్ గ్రంథంలో మీరు భగవద్గీత గానీ, తర్వాత ఇంజీలు (బైబిల్) జ్ఞానం గానీ తెలియకపోతే మీరు ఏ మతంలో లేనట్లే అని చెప్పినారు. ఈ మూడు మతాలు మూడు గ్రంథాలు ఒక్కటే అని తెలియకపోతే నువ్వు జ్ఞానివే కాదు, నువ్వు ఏ ధర్మములో లేనట్లే అని చెప్పారు. నువ్వు బైబిల్‌ను, భగవద్గీతను, ఖురాన్‌ను మూడు గ్రంథాలు చదవక పోతే నువ్వు ఏ మతములోనూ లేనట్లే అని 5వ సురా 68వ ఆయత్‌లో ఉంది చూసుకోండి. దేవుడు జ్ఞానాన్ని చెప్పినాడు మీరు జ్ఞానం

తెలుసుకోవాలని చెప్పినాడు. మీరు జ్ఞానం తెలుసుకోవాలని ప్రయత్నం చేస్తున్నారు, కానీ మట్టిని తీసుకొని మాత్రగా వేసుకుంటున్నారు, మందు తీసుకొని మాత్రగా వేసుకోవట్లేదు. మందు ఉంటగా చేసినా, బంక మట్టి ఉంటగా చేసినా మాత్ర అవుతుంది, ఔషధాలు ఉంటగా చేసినా మాత్రగా అవుతుంది. కానీ మీరు ఏ మందు వేసుకుంటున్నారు? ఒకరు 5 శాతం మందు కలిసిన మాత్ర, ఒకడు 10 శాతం మందు కలిసిన మాత్ర వేసుకుంటున్నారు. ఇంకొకరు 30, 40, 50 శాతం మందు ఉన్న మాత్ర వేసుకుంటున్నారు. ఒకరు ఎక్కువ మందు కలిసిన మాత్ర, ఒకరు తక్కువ మందు కలిసిన మాత్ర వేసుకుంటున్నారు.

ఒక వ్యక్తి మా దగ్గరికి వచ్చి నేను ఒక గురువు దగ్గరికి పోయాను, నేను 10 సంవత్సరాలనుండి జ్ఞానం వింటున్నాను, ఆ గురువు దేవతలకు మొక్కుతాడు, నన్ను మొక్కిస్తాడు, ఆయనకు జ్ఞానం తెలియలేదు, నాకు తెలియలేదు, ఏదన్నా అడిగితే అది చెప్పడు, ఇప్పుడు నా గతి ఏమిటి అని అడిగాడు. అప్పుడు మేము "ఆయన మందు ఇస్తున్నాడు, నువ్వు వేసుకుంటున్నావు నిజమే. ఆ మాత్ర నీకు పని చేయలేదు. ఎందుకు పని చేయలేదంటే దాంట్లో మందు లేదు. అంటే చెప్పే జ్ఞానము సరిగ్గా లేదు. మరి ఏమి చేయాలి అంటే మంచి మందుగల మాత్ర ఎక్కడ దొరుకుతుందో అక్కడికి వెళ్ళు" అని చెప్పాము. మంచి మాత్ర ఎక్కడ దొరుకుతుందంటే వేసుకుంటూ వెళ్ళు తెలుస్తుంది. నీ రోగం బాగైతే ఆ మందు బాగా పని చేసింది అనుకుంటావు. వేసుకుంటూ వెళ్ళు, ఎవరు వద్దన్నారు? ఇంకో చోట బోధకుడు అనే ఒక డాక్టరు కనిపిస్తాడు, మాత్ర వేసుకో. ఆ మాత్ర పని చేసిందా, రోగం పోయిందనుకో పర్వాలేదు. పని చేయలేదా ఇంకో డాక్టరు దగ్గరికి వెళ్ళు. మనం డాక్టర్లను వెతుకుతూ ఉండాలి. మనం

పుట్టినప్పటి నుండి ఒకే డాక్టరు దగ్గరికి పోతున్నామా? ఎంతోమంది డాక్టర్లను మార్చాము. అలాగే బోధకులను కూడా మార్చుకుంటూ పోవాలి. చాలామంది మార్చుకుంటూ వచ్చారు. నా దగ్గరికి వచ్చి చతికల పడి పోయారు. కానీ చాలామంది ఇలా మారకుండా ఉన్నారు. చాలామంది మార్చుకుంటూ వచ్చారు, ఇక్కడికి వచ్చి మాకు మంచి మందు దొరికింది అంటున్నారు. వారికి ఏమి దొరికిందో గానీ నువ్వు ముందు నీ కర్మ పోయిందో లేదో చూసుకో. ఏ గ్రంథం అయితే నువ్వు చదువుతావో, ఏ జ్ఞానం అయితే నువ్వు తెలుసుకుంటావో, అప్పుడు కళ్ళ వెంట నీకు ఆనంద భాష్పాలు రాలతాయో అది నిజమైన జ్ఞానం అని తెలుసుకో అని చెప్పాము. ఏ గ్రంథం చదివినా కానీ కనుల వెంట నీళ్ళు రాలేదు. కానీ ఈ గ్రంథం చదివితే కళ్ళ నుండి నీళ్ళు వస్తున్నాయి అంటే ఇది నీకు సంతోషం కలుగజేస్తుంది. కళ్ళ వెంట నీళ్ళు వస్తే సంతోషమే కదా! కాబట్టి చాలామంది కళ్ళ నుండి నీళ్ళు వచ్చేటటువంటి జ్ఞానాన్ని తెలుసుకుంటున్నారు.

మీకు జ్ఞానమనేది మీరు కావాలని కోరిక బలంగా పెట్టుకున్నప్పుడు మీకు అది దొరుకుతుంది. ఇంతకుముందు చెప్పిన మాత్ర ఎంత వరకు పని చేస్తుంది చూసుకోండి అని చెప్పినాము. ఇప్పుడు అల్లోపతి మాత్ర, హోమియోపతి మాత్ర, నేచురోపతి మాత్ర తర్వాత ఏ పతి లేకుండా ఉండే మాత్ర ఉంది. అల్లోపతి డాక్టరు ఇంజెక్షన్ వేసినాడు, ఆ రోగం పోలేదు, హోమియోపతి డాక్టర్ ఆల్కహాల్ కలిపిన మాత్ర ఇచ్చినాడు అది కూడా పోలేదనుకోండి, ఇంకోచోటకి పోతే ఆకు రాసినాడు, నొప్పి పోయింది. ఇంకా ఆకు రాస్తే నొప్పి పోయేది ఏమైనా ఆలస్యం అవుతుందంటే, ఆకు కూడా రాయకుండా ఊరికే చూస్తేనే నొప్పి పోయేది ఒకటుంది. దాని దగ్గరకైనా వెళ్ళండి. ఇంతకు ముందు **“దయ్యాల భూతాల యదార్థ**

**సంఘటనలు"** అనే గ్రంథంలో ఈ వైద్యాన్ని గురించి వ్రాసాము. మందు ఉంది, తర్వాత మాట ఉంది. మందు అంటే ఏ మాత్రలోనిదైనా మందే. మందు వేసుకుంటే పని చేసేటటువంటి వైద్యం కొంత వుంది. మాటతో కూడా పని చేసే వైద్యం ఒకటుంది. పో అంటే రోగం పోతుంది, అది మాటతో పోతుంది, దానికి మందు లేదు. అది ఎలా పని చేసిందో తెలియదు. ఇది మందు వేసుకుంటేనే పోతుంది. దీనికంటే అది చాలా గొప్పది కదా. ఆ రకంగా గొప్ప జ్ఞానాన్ని వెతుక్కోండి. మీరు ప్రతిచోట బుద్ధి ఉపయోగిస్తారు, జ్ఞానము దగ్గరకు వచ్చే సరికి ఎందుకు బుద్ధి ఉపయోగించరు. మీకు ఏది తెలిసిందో అదే గొప్పది అనుకుంటారు. బయట ప్రపంచంలో అయితే బాగా తెలివిగా ప్రవర్తిస్తావు. ఎవడైనా 10 రూపాయలు తక్కువ ఇస్తే 10 రూపాయలు తక్కువ ఇచ్చినావు చూడు అని లెక్కలు వేసి చెప్తావు, అన్ని నిఘాలు ఉంటాయి. జ్ఞానం దగ్గరకు వస్తే 10 రూపాయల జ్ఞానం కానీ, 5 రూపాయల జ్ఞానంగానీ ఏది పెట్టినా ఒప్పుకుంటావు. 4 రూపాయి జ్ఞానం పెట్టినా ఒప్పుకుంటావు అలా ఎందుకు ఒప్పుకోవాలి ఇది శాస్త్రబద్ధమైన జ్ఞానమా! కాదా! అని చూడాలి కదా!

కొంతమంది డబ్బులకోసం మాట్లాడుతూ ఉంటారు. ఒక గురువు వేరే గురువును తక్కువగా చేయాలి అనుకుంటే తన శిష్యునితో ఆ గురువును విమర్శించండి అని చెప్పితే అప్పుడు ఆ శిష్యుడు ఆ గురువును విమర్శిస్తుంటాడు. వేరే గురువును ఎంత విమర్శిస్తే అబ్బా నా శిష్యుడు బాగా విమర్శించినాడని ఆ గురువు అంత సంతోషపడుతాడు. అది నిజమెంత, అబద్ధం ఎంత అని ఆలోచన చేయరు, ఊరికే అలా చేసే వాళ్ళున్నారు. కొంతమంది ప్రబోధానంద స్వామికి చెడ్డపేరు రావాలి నీకు లక్ష రూపాయలిస్తాము రోజూ నువ్వు ఏదో ఒకటి విమర్శ చేస్తూ ఉండు

అంటే వాడు రోజూ ఫేస్‌బుక్‌లో విమర్శ చేస్తుంటాడు. ఇవన్నీ కుక్కలు అని మేము అనుకున్నాము. ఇది కుక్కల జాతి, మొరుగుతూనే ఉంటుంది, మనకు ఏమీ ప్రయోజనం లేదు. వాడు ఎంత మొరిగినా మన దగ్గరికి వచ్చేవాళ్ళు రాకుండా పోతారా, మా దగ్గరికి వస్తే జ్ఞానం తెలియకుండా పోతుందా? మీరు ఇంతమంది వస్తున్నారంటే ఎవరైనా గానీ వాళ్ళ మాట విని రాకుండా పోయినారా? ఎవరూ పోయేదానికి అవకాశం లేదు, ఎవరూ పోరు. ఎందుకంటే తేనె తేనే! పానకం పానకమే! అదీ తియ్యగా ఉంటుంది, ఇదీ తియ్యగా ఉంటుంది. కానీ దీనికి అది ఎప్పటికీ సమానం కాదు.

కాబట్టి ఏమి చెప్తున్నానంటే ఎవడో ఏమో అంటున్నాడని నేనెందుకు ఉలిక్కిపడాలి? నాకు ఎక్కడ నష్టం వచ్చింది? నాకెక్కడ నష్టం రాలేదు కదా! నా జ్ఞానం వినే వాళ్ళు చాలామంది ఉన్నారు. కొంతమంది ప్రబోధానంద స్వామి పని అయిపోయింది, హాస్పిటల్‌కు పోయినాడు, ఇంక తిరిగి రాడు అని చెప్పుకుంటున్నారు. మేము ఆసుపత్రికి పోయినాము, క్రితం నెల కూడా మీటింగ్ చెప్పలేదు. ఈ నెల మీటింగ్ చెప్పాలనే ఉద్దేశ్యంతో, 3 రోజులు అనుమతి తీసుకొని వచ్చినాము. మళ్ళీ మూడు రోజులు తరువాత మేము తప్పనిసరిగా మళ్ళీ హాస్పిటల్‌కు వెళ్ళాలి. కానీ అందరూ మేము ఆసుపత్రికి పోతే వయస్సు అయిపోయింది, చస్తాడో బ్రతుకుతాడో అని అనుకుంటున్నారు. మేము ఆసుపత్రికి పోతే తిరిగి వస్తామో లేదో అని మాకు కూడా అనుమానమే కానీ ఒక గ్రంథంలో నీకు 72 గానీ లేకపోతే 81 సంవత్సరాల ఆయుష్షు ఉంటుంది, అప్పటివరకు ఉంటావు అని ఇంకొ పెద్దాయన చెప్పాడు. అంటే ఇప్పుడు మాట్లాడే నేను వేరు, చెప్పే మనిషి వేరు. ఈ పని చేసేవాడిని నేను, నోరు కదిలించే వాడిని నేను, చెయ్యి కదిలించే వాడిని, పైకి క్రిందికి అల్లాడించేవాడిని

నేను, కానీ చేయించేవాడు వేరే ఆయన. అందుకే బైబిల్ గ్రంథములో మత్తయి సువార్త 10వ అధ్యాయములో 20వ వాక్యంలో **"ప్రతి మాట మాట్లాడువాడు నీ తండ్రే కానీ నువ్వు కాదు".** మీ తండ్రి ఆత్మ అంటే నీ తండ్రి నీలో దేవుడై ఉండేవాడు ఎవడైతే ఉన్నాడో, వాడు నీలో ఉండి మాట్లాడుతున్నాడు  కానీ మాట్లాడే వానివి నువ్వు కాదు కదా! సరే ఇప్పుడు నేను మాట్లాడుతున్నాను అనుకుంటున్నావు, కానీ నువ్వు మాట్లాడిన మాట ఏదీ లేదు. నీలో ఉండేటటువంటి దేవుడు, అధిపతి ఎవడైతే ఉన్నాడో వాడే మాట్లాడుతున్నాడు. మనిషి ఉన్నాడు, మనిషిని కదిలించేవాడు, మెదిలించే వాడు, లోపలుండేవాడు అతడే అధిపతి, డైరెక్టర్.  ఆయన ఎలా కదిలిస్తే మనిషి అలా కదులుతున్నాడు. బాలసుబ్రమ్మణ్యం గాయకుడు పాడే పాట ఎవరు పాడుతున్నాడంటే, లోపలుండే వాడు పాడుతున్నాడు అని చెప్పవచ్చు. ఆ రాగాలు అన్నీ ఆయనవి. గొంతు శబ్దమంతా ఆయనది. ఈ బాల సుబ్రమ్మణ్యం అనే ఈ వ్యక్తి నేను అందరికంటే మంచి గాయకున్ని, నేను బాగా పాడుతున్నాను అనుకుంటాడు. లేదు ఒకసారి గొంతు పాడయితే అతను ఏమీ చేయలేడు.  మళ్ళీ సరిగా చేసుకోలేడు, ఆయన చేతిలో ఏమీ లేదు. మనిషి బలముతో జరిగే పని అంతా నాదే అనుకుంటున్నాడు. ఇప్పుడు నేను జ్ఞానం చెప్తున్నాను. అజ్ఞానంలో అయితే నేను మంచి జ్ఞానం చెపుతున్నాను, అందరికంటే బాగా జ్ఞానం చెప్తున్నాను అనుకుంటాను. కానీ జ్ఞానం ప్రకారం అయితే నేను ఒక్క ముక్క చెప్పలేదు. చెప్పేవాడంతా ఎవడు చెప్తున్నాడు? మన శరీరంలో ఉండే ఆత్మ చెపుతుంది. నా శరీరంలో ఉండే ఆత్మ చెప్తుంది. ప్రతి మాట ఆయనే మాట్లాడుతున్నాడు. నేను మాట్లాడలేదు. ప్రతి మాట ఆయనే మాట్లాడినప్పుడు ఈ జ్ఞానమంతా ఆయనదే కదా! నాది కాదు అని చెప్పినాము.

భగవద్గీత గ్రంథం తీసుకొని చెప్పేటపుడు ఈ భగవద్గీత నేను చదువుకోలేదు. నేను కంఠాపాఠం చేయలేదు. నాకు ఈ శ్లోకాలు రావు. నేను ఉన్నది ఉన్నట్లు సత్యం చెప్పినాను, అబద్ధం చెప్పలేదు కదా. నేను చూసి చదివినా కానీ పూర్తి కరెక్టుగా చదువుతానని నమ్మకం లేదు. ఒకవేళ ఎక్కడైనా తప్పు పోతే మీరు ఏమి అనుకోవద్దండి అని చెప్పినాము. భగవద్గీత చదివేదే రాదు ఇలాంటి వాడా భగవద్గీత జ్ఞానం చెప్పేది అని కొందరు హేళన చేస్తుంటారు. తప్పులు చదివి వివరం చెప్పేవాళ్లు ఎంతమంది లేరు, నేను తప్పు చదివినా, ఒప్పు చదివిన మీకు శ్లోకం ముఖ్యం కాదు, శ్లోకంలో జ్ఞానమే ముఖ్యం. ఫలానా పేజీలో ఫలానా దాంట్లో ఇది ఉంది, అది ఉంది అని ఒక బోధకుడు టకటక నోటికి చెప్పేస్తారు. ఎక్కడో వేదంలో చెప్తాడు, పురాణంలో చెప్తాడు, ఉపనిషత్తులలో చెప్తాడు, ముస్లీంలా ఖురాన్ చెప్తాడు. ఎక్కడ ఏ పేజీలో ఏది ఉన్నా కూడా చెప్తాడు. వానికి జ్ఞాపక శక్తి ఉంది, నాకు జ్ఞాపక శక్తి లేదు. భూమి మీద చాలామందికి జ్ఞాపక శక్తి ఉంది, కానీ జ్ఞానశక్తి లేదు, నాకు జ్ఞాపక శక్తి లేదు. నాకు అది అవసరం లేదు. అందువల్ల నేను ఎప్పుడు భగవద్గీతను పట్టుకొని కంఠాపాఠం చేయడం లేదు. ఎప్పుడూ చదవలేదు నేను. నాకు అవసరం లేదు. ఏదీ కూడా నాకు అవసరం లేదు, జ్ఞాపకం ఉంటే చెప్తాను లేదంటే లేదు. ఫలాన చోట బైబిల్‌లో ఇలా వ్రాసినారు, ఖురాన్‌లో ఇలా వ్రాసినారు అని చెప్తాను. కానీ ఆయత్‌ల పేర్లు, సూరాల పేర్లు నేను చెప్పను, ఆ అవసరం లేదు. ముఖ్యంగా చెప్పేది ఏమిటంటే ఈ హిందువులు ఎవరైతే ఉన్నారో వాళ్లకు దేవుడు ఎవరు? అనే విషయం ఏమాత్రం తెలియదు. కనిపించిన గుడి, కనిపించిన ప్రతిమలను మ్రొక్కి ఆయనే దేవుడు అనుకుంటున్నారు. కానీ ఒక్కడు దేవుడని నమ్మకం లేనే లేదు. శాస్త్రం ప్రకారం దేవుడనేవాడు ఎప్పటికీ

కనిపించడు. ఎవరితోనూ మాట్లాడడు. దేవునికొక ధర్మం ఉంది. రూప, నామ, క్రియలు లేనివాడు దేవుడు అంటే ఆకారం ఉండదు, పేరు ఉండదు, పని చేయడు. ఈ విషయం మూడు గ్రంథాలలోనూ స్పష్టంగా వ్రాసారు, కానీ ఆ విషయం చాలామందికి తెలియదు. హిందువులుగా ఉన్నట్టి వాళ్ళు ఏమీ చేస్తున్నారంటే దేవుని విషయం తెలియక పోగా, ఎవరు ఏది చెప్తే దాని వెంట పోతున్నారన్న మాట.

చాలామంది నా పాదాలకు నమస్కారం చేయడానికి వస్తే, నేను ముఖ్యం కాదు దేవుడే ముఖ్యం, ఇది తప్పు అని చాలాసార్లు చెప్పాను. మీరు నమస్కారం చేయవలసినది దేవునికి, మీరు నమస్కారం చేయాలనుకో కృష్ణుని గుడి ఉంది, అక్కడకు పోయి నమస్కారం చేయండి. ఆయనను దేవుడు అనుకోండి, నన్ను ఎందుకు దేవుడు అనుకోవాలి. మనిషిగా ఉండేవాడెవడూ దేవుడు కాదు. దేవుడు ప్రత్యక్షంగా మాట్లాడడు అని చెప్తున్నాము. అయితే కృష్ణున్ని దేవుడు అని ఎందుకు అనుకోవాలి? క్రైస్థవులు ఏసును ఎందుకు దేవుడని అనుకోవాలి? వాళ్లు కనిపించే మనుషులే కదా! మాట్లాడే మనుషులే కదా! అని కొందరు ప్రశ్నించవచ్చును. దేవుడు ఏమి చెప్పినాడంటే, నేను మనిషిగా వచ్చి పుడతాను అని చెప్పినాడు కానీ, ఫలానా వ్యక్తిగా వచ్చి పుడతాను అని చెప్పలేదు. ఆయన మనిషిగా వచ్చి పుట్టిన తరువాత, ఆయన చెప్పిన జ్ఞానాన్ని బట్టి మనం కనుక్కున్నాము. కృష్ణుడు చెప్పిన భగవద్గీతను బట్టి మనము ఈయన మనిషి కాదు దేవుని అవతారము అని అనుకున్నాము. నేనే ప్రత్యేకమైన మనిషిని తయారు చేయబోతున్నాను అని ఖుర్‌ఆన్‌లో 15వ సూరా, 28వ ఆయత్‌లో చెప్పినాడు. ప్రత్యేకమైన మనిషిని తయారు చేయబోతున్నాను, తయారు చేస్తాను, చేసి అతనిలో నా ఆత్మనే ఊది పంపిస్తాను, ఊది పంపిస్తే దేవదూతలంతా ఫలానవాడని

గ్రహించుకొని, దేవదూతలంతా ఆయనకు నమస్కారం చేస్తారు. దేవదూతలకు తెలుసు వచ్చినవాడు ఎవరు అయి ఉన్నది. కాబట్టి అతనికి వీళ్ళంతా నమస్కారం చేస్తారు. కానీ మనుషులు మాత్రం గ్రహించుకునే దానికి అవకాశం లేదు. అందుకే మనుషులు నమస్కారం చేయలేరు. కృష్ణుడు వచ్చి పోయిన తర్వాత దేవుడంటున్నాము కాని ఉన్నప్పుడు ఎవరూ దేవుడు అనలేదు. పోయిన తర్వాత అన్నా మాలాంటి వారు ఒక పది మంది అంటున్నాము.

కానీ మిగతావాళ్ళంతా కృష్ణున్నే అజ్ఞాని, చోరుడు, వ్యభిచారి అని అంటున్నారు. ఏసును ఈ రోజు ప్రభువా నువ్వే దేవుడు అంటున్నారు కానీ ఆ రోజు రాళ్ళతో కొట్టి ములుకులు గుచ్చి చంపినారు. ఆ రోజు ఇప్పుడు మళ్ళీ ప్రతి యుగంలోనూ జ్ఞానం చెప్తాను మీకు అని చెప్పినాడు కదా ఇప్పుడు కలియుగంలో ఏసుగా వచ్చిపోయాడు అనుకుందాము. ద్వాపరయుగంలో కృష్ణుడుగా వచ్చాడని అనుకుందాము. మొదట త్రేతాయుగంలో కూడా వచ్చాడు. త్రేతాయుగంలో ఎవరు దేవుడు? అని ప్రశ్న వస్తే చాలామంది "త్రేతాయుగంలో రాముడు దేవుడు" అంటారు. హిందువులు మొత్తంగా ఇదే చెప్తారు. అంటే జ్ఞానం ప్రకారం చెప్తున్నారా, ఒకరు అంటుంటే చెప్తున్నారా అంటే, చాలామంది ఇతరులు అంటుంటే చెప్తున్నారు కానీ జ్ఞానంప్రకారం ఏమి చెప్పడం లేదు. ఎప్పుడన్నా కాని రాముడు జ్ఞానం చెప్పినాడా? ఎప్పుడూ చెప్పలేదు. ఆయన ఏదో చిన్న వయస్సులో విశ్వామిత్ర మహర్షి వచ్చి పిలుచుకు పోతాడు. అక్కడ సీతను పెళ్ళి చేస్తారు. పెళ్ళి చేసి ఇంటికి వస్తూనే ఆస్తి పంపకాల్లో ఏదో పేచీలు వస్తాయి. పెద్ద కొడుకు రామునికే పట్టాభిషేకం చేయాలి అని అంటే, అట్లా కాదు అని చిన్న భార్య మొండి చేసి ఆమె కొడుకుక్కి పట్టాభిషేకం చేయాలి,

ఈయనను అడవికి పంపించాలని కోరిక కోరితే ఆ రకంగానే ఆయనను అడవికి పంపించడం జరుగుతుంది. అడవిలో 14 సంవత్సరాలు ఉన్న తర్వాత సీత పోయిందని తరువాత ఇబ్బంది పడి తెచ్చుకోవడం జరుగుతుంది. అయోధ్యకు రాకముందే తెచ్చుకున్న తరువాత ఆమెను అడవికి పంపించడం జరుగుతుంది. ఇదే రామాయణం జరిగిపోయింది ఆయన జీవితములో ఎప్పుడన్నా ఎవరికి ఒక ముక్క జ్ఞానం చెప్పినేది ఏమీ లేదు. ఆయన దేవుడని మీరు అంటున్నారు మేము కూడ అంటాము. అనకపోతే ఇక్కడ చూడు దేవుడు కాదంట అంటారు మళ్ళీ దేవుడు కాదని మనము ఎందుకు అనాలి. మీరు దేవుడంటే మేము దేవుడంటాం కానీ మీకేమన్నా జరిగిందా! అంటే ఏమీ జరగలే అట్లే దేవుడు దేవుడు అనుకుంటూ పోవాల్సిందే మీరు జ్ఞానం ఎక్కడైనా చెప్పినారా? లేదు మనం ఎవరైతే జ్ఞానం చెప్పినారో వాళ్ళను దేవుడనుకుందాము. జ్ఞానం చెప్పినోన్ని ఏమో పనికిమాలినోడు అంటారు, జ్ఞానం చెప్పనివాడినేమో దేవుడంటారు. ఇదీ మనుషుల పని.

కృష్ణుడు అంతగా పెద్ద భగవద్గీత చెప్పిపోతే ఆయనను ఒక ముక్క కూడ దేవుడని ఒప్పుకోరు. రాముడు ఏమీ చెప్పలేదు ఆయన దేవుడు అని అంటారు. సరే మేం కూడా దేవుడంటాము. కాదని ఏ గ్రంథంలో కూడా వ్రాయలేదు. ఆయనను కాదని ఎక్కడైనా విమర్శించినామా? ఒకరిని విమర్శించే పని మనకు ఎందుకు? మనం చెప్పుకునే జ్ఞానం మనం చెప్పుకుంటే సరిపోతాది. రాముడు దేవుడు కాదు అని మేం ఎప్పుడూ చెప్పలేదు. ఎవరి విశ్వాసం వాళ్ళకు మీరు నమ్మినారు నమ్మండీ మాకు రాముడు దేవుడు అనేటి విశ్వాసం ఉందో లేదో మేము చెప్పం కాని నలుగురుతో పాటు నారాయణ అని అంటాము. మీరు గోవిందా అంటే మేము గోవిందా అంటాము. అంతే మాకు పూర్తి నమ్మకం ఉందో లేదో

మేము బయటికి చెప్పము. ఉందనే చెప్తాము మేము కూడా. సరే ద్వాపర యుగంలో కృష్ణుడేమో దేవుడు, కలియుగంలో ఏసు ఏమో దేవుడు అని మీరెట్లు చెప్తున్నారు? మీకెట్లా తెలుసు, ఆ రోజు ఎవరికీ తెలియదు. ఈ రోజు ఎవరో ఊరికనే అనుకుంటున్నారు అందరూ నమ్మలేదు మీరెట్ల చెప్తున్నారు అని నన్ను ఒకరు ఒక ప్రశ్న వేసారు.

ఈ మధ్య కాలంలో గ్రంథం వ్రాశాము. మేము పోయిన నెల ఆ గ్రంథము మీకేం వ్రాశామంటే, దేవుడని మేము ఎవరికీ కిరీటం పెట్లేదు. కానీ దేవుడు పుడుతాడని తెలుసు మాకు, కానీ ఎవరు ఖచ్చితంగా దేవుడు అంటే ఎవరంతకు వాళ్ళు తెలుసుకోవాల్సిందే. నేను దేవుడంటే నువ్వు నమ్మకూడదు. నువ్వు దేవుడంటే నేను నమ్మకూడదు. సరే నీయంతకు నీకెట్ల తెలిసింది అని ఒక ప్రశ్న వేసినారు. నీకెట్ల తెలిసింది ఆయన దేవుడని నీకు నమ్మకం ఎట్లా కుదిరింది? ఎట్లా రూఢీ చేసుకున్నావు అని అడిగితే, నాకు రూఢీ అంతా ఒకటే పరమాత్మ దేవుడుగా పుడతాను అన్నాడు కదా! పుట్టేవాడు ఎవడు పరమాత్మే కదా! సృష్ఠికర్త అయిన దేవుడు ఆయన పరమాత్మగా ఉండేవాడు ఎవడు, ఎవడైతే పరిశుద్ధాత్మగా ఉన్నాడో ఆ దేవుడు పుడతానని చెప్పాడు. ఆయన పుట్టినప్పుడు ఏమైతది అంటే ప్రకృతిని శాసించే శక్తి ఆయనకుంది. ప్రకృతికంతా పెద్ద ఆయన, అర్థమైందా! ఇది ఖురాన్‌లో ఇద్దరు దేవుళ్ళను చెప్పినారు సృష్ఠికర్త ఒకడు ప్రప్రథమంగా సృష్ఠించినటు వంటివాడు ఒకడు 3వ సురా 18వ ఆయత్‌లో ఉందనుకుంటా బహుశ ప్రప్రథమంగా సృష్ఠించినటువంటి వాడు ఒకడున్నాడు. తర్వాత సృష్టి చేయబడినవాడు ఒకడున్నాడు. ఈ ప్రపంచాన్ని జీవరహితమైన ప్రపంచాన్ని సృష్ఠించినటువంటివాడు ఒక దేవుడు. మళ్ళీ జీవరాసులని పుట్టించేదానికి ఇంకొకడిని తయారు చేసినాడు ఆయనే అల్లాహ్, ఆయనే మీరు ఆరాధించ

వలసిన అల్లాహ్. ముస్లీమ్‌లు ఒకే ఒక దేవున్ని ఆరాధించాలి, రెండో దేవున్ని ఆరాధించకూడదు అది శాసనం.

ఎవరికైనా శాసనమే హిందువులకు కానీ ముస్లీంలకు కాని ఎవరికైనా గాని అది దైవగ్రంథములో చెప్పిన జ్ఞానం కాబట్టి ఒకే దేవున్ని ఆరాధించాలి. వాస్తవమే ఆరాధిస్తాము ఏ దేవున్ని ఆరాధించాలి? అల్లాహ్‌ను ఏ అల్లాహ్‌ను? ఒకే అల్లాహ్ ఇదే విషయమే 16-51లో కూడా చెప్పాడు. అల్లాహ్ ఈ విధంగా సెలవిచ్చుచున్నాడు ఏ విధంగా మీకు ఆరాధ్య దైవము ఇతనే ఈ అల్లాహ్‌నే అని చెప్పినాడు. ఏ అల్లాహ్? నేను చూపించే అల్లాహ్‌నే అని చెప్పినాడు. ఈయననే మీరు ఆరాధించండి, నాకు భయపడండి, చెప్పేది ఎవరు? అల్లాహ్‌నే, ఏ అల్లహ్ గురించి చెప్తున్నాడు? మీరు ఆరాధించేటటువంటి అల్లాహ్‌ను గురించి నమాజ్ చేయవలసిన ఆ అల్లాహ్‌ను గురించి చూపిస్తున్నాడు. ఇతనినే మీరు నమాజ్ చేయాలి అని ప్రార్థన చేయాలి. మళ్ళీ ఆ చెప్పే ఆయన ఎవరు అంటే అల్లాహ్ ఈ విధంగా సెలవిస్తున్నాడు. కావున ఆయన అల్లాహ్‌నే, ఇప్పుడు ఏ అల్లాహ్, ఇప్పుడు గందరగోళం మొత్తంగా ముస్లీమ్ ప్రపంచానికంతా ఇద్దరు అల్లాహ్‌లు ఉన్నారని తెలియకుండా పోయింది. ఒకే అల్లహ్ అనే భావముంది ఒకే అల్లాహ్ అని మేము కూడా చెప్తున్నాము.

వాస్తవమే అంటే మీరు నమాజ్ చేయాల్సింది ఒకే అల్లాహ్‌నే, రెండో అల్లాహ్‌ను గురించి నమాజ్ చేయకూడదు. అది 16వ సూరా 51వ ఆయత్‌లో కూడా ఈ విధంగా చెప్పినారు, 16వ సూరా 51వ ఆయత్‌లో ఏమీ చెప్పారో చదువుతారా? **“అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు ఇద్దరూ ఆరాధ్య దైవాలను కల్పించుకోకండి. ఆరాధ్య దైవం**

**ఆయన ఒక్కడే, కాబట్టి మీరంతా కేవలం నాకే భయపడండి"**
అంటే అల్లాహ్, ఎవరు సెలవిస్తున్నారు? ఎవరు చెప్తున్నారు? అల్లాహ్ ఈ విధంగా చెప్తున్నారు. అల్లాహ్ సెలవిస్తున్నాడు ఈయనే మీకు ఆరాధింపదగిన అల్లాహ్. ఏమి చెప్పినాడు చదువు ఒకసారి, ఇద్దరు ఆరాధ్య దైవాలను కల్పించుకోండి ఎవరు సెలవిస్తున్నాడు? అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు. అల్లాహ్ ఇద్దరు ఆరాధ్య దైవాలను కల్పించుకోకండి, ఆరాధ్య దైవంమటుకు ఆయన ఒక్కడే. మీకు ఇంకొకాయన ఉన్నాడు. ఆయన్నే, మీకు ఆరాధ్య దైవము, మీరు నమాజ్ చేయాల్సింది ఆయన్నే, నన్ను ఆరాధించవద్దండి. నాకు కేవలం భయపడండి. నేను ఉన్నానని అదే కదా! చెప్పినది చివరిలో. కాబట్టి మీరంతా కేవలం నాకే భయపడండి. నాకు భయపడండి, ఆయనను నమాజ్ చేయండి అని చెప్పినాడు.

ఈ ఇద్దరు అల్లాహ్‌ల విషయం ముస్లీమ్ ప్రపంచానికే తెలియకుండా పోయింది. చెడ్డగా చెప్పలేదు మంచే చెప్పుచున్నాము. ఉండే ఆయత్‌ను గురించి చెప్పుచున్నాము. ఆయత్‌కు వివరం చెప్పమనండి, అవి చెప్పరు. ఆ ఆయత్‌లు చెప్పరు సరే ఇప్పుడు ఈ ముస్లీం ప్రపంచానికి ఏ విధంగా ఇద్దరూ అల్లాహ్‌ల విషయం తెలియకుండా పోయిందో, అంటే ఆరాధింప దగిన వాడు ఒకడే కాని ఇంకొకడున్నాడని తెలియదు. ఇప్పుడు అదే విషయాన్ని క్రైస్థవుల్లో చూస్తే ఇద్దరూ కుమారులంటే ఎవరో తెలుసునా? బహుశా తెలియదు. మళ్ళీ క్రైస్థవ ప్రపంచానికి ఇద్దరు కుమారుల గురించి ఎందుకు తెలియదు? అదే అక్కడ లోపం. ఆ ఇద్దరు కుమారుల గురించి మేము చెప్తున్నాము. అక్కడ ఇద్దరు అల్లాహ్‌ల గురించి చెప్తున్నాము. అక్కడున్న ఆయత్ గురించి చెప్తున్నాను. ఇక్కడ ఉండే వాక్యం గురించి

చెప్తున్నాము. ఇంకోటి రెండవది ఏమీ చెప్పలేదు. మీకు వివరంగా చెప్పుచున్నాము. అక్కడ అల్లాహ్ ఏమి చెప్పుచున్నాడు. అల్లాహ్ సెలవిస్తున్నాడు, ఏమని ఇస్తున్నాడు “మీరు ఆరాధింపదగినటువంటివాడు ఒకడే అల్లాహ్” అన్నాడు. ఇంక అందరికీ అదే కదా ఉండేది అంతవరకే నిలిచిపోయినారు. మీరు నాకు భయపడండి అనే విషయం వదిలి పెట్టేసినారు.

ఈ రకంగా లెక్కేసుకుంటే మీరు అంటే ఎవరిని ఆరాధిస్తున్నాము? అనేది అంటే ఎవరినో ఒక్కరినే ఆరాధించాల్సింది. ఇంకొకడు ఉన్నాడో లేదో తెలియదు, ఏమన్నా అంటే అల్లాహ్ ఒకడే! అని వాళ్ళు అంటారు. ఏమన్నా అంటే కుమారుడు ఒకడే! అని మీరంటారు. హిందువుల దగ్గరికి వస్తే ఫలానా దేవుడని ఎవరూ చెప్పలేరు. ఒకడు రాముడంటే, ఒకడు రంగడు అంటే, ఇంకోడు ఇంకొకరిని చెప్తాడు. ఒక్కరు కాదు స్వామి అందరూ దేవుళ్ళే! వీళ్ళకు, ఎవరికి హిందువులకు, ఇట్లా ప్రపంచములో మేము ఫలానవాడే దేవుడని చెప్పితే ఏమంటారు? చాలా గందరగోళం. కృష్ణుడు దేవుడని మేమంటే నవ్వుతారు అన్నమాట. వీళ్ళు చూడు ఎంత పెద్ద జ్ఞానమో వీళ్ళది. కృష్ణుడు అంత పనికిమాలినోడ్ని దేవుడంటున్నారు. దేవుడు భూమిమీద పుట్టితే ఆయన మనిషిగా వస్తే, ఆయన ఏం చెప్పినాడు మూర్ఖులు, మూఢులు నన్ను అవమానిస్తున్నారు. ‘అవజానంతి మాం మూఢ’ అంటాడు అంటే మూఢులు నన్ను అవమానిస్తారు. ‘మాను షీం తనుమాశ్రితమ్ మానుషీం’ అంటే మనిషిగా నేను తనువు ఆశ్రయించి వచ్చాను కాబట్టి, మనిషి శరీరం ధరించి వచ్చాను కాబట్టి మూఢులు నన్ను అవమానిస్తున్నారు. ‘పరంభావ మజానంతో మమ భూత మహేశ్వరమ్’ అంటాడు. నేను సర్వజీవరాసులకు దేవున్ని అని తెలియక వీళ్ళు నన్ను

అవమానిస్తున్నారు. చెప్పినాడు. దేవుడు వచ్చి పుడితే శరీరం ధరించి వచ్చి పుడితే ఆయన సర్వ జీవారాసులకు ఈయన దేవుడు అనే విషయం తెలియక ఆయనను మూఢులైనట్టి మనుషులు అవమానం చెస్తున్నారంట. అది ఆ పొద్దుంది ఈ పొద్దు ఉంది, ఎప్పటికీ ఉంది అది అట్లా జరిగింది అని చెప్పినాడు.

ఈ రోజు కూడా ఆయనను అట్లే చెప్తున్నారు అన్నమాట, ఆయనను కనుక్కోలేకపోయారు. ఎవరిని కృష్ణున్ని. దేవుడు ఎప్పుడు వచ్చినా, ఏ రూపంలో వచ్చినా కనుక్కోలేరు. అప్పుడు కృష్ణునిగా వచ్చినా కనుక్కొలేదు తర్వాత ఇంకో రకంగా వచ్చాడు, కనుక్కోలేదు. సరే ఇంకో రకం చెప్పితే త్రేతాయుగంలో ఒకాయన వచ్చినాడు. భగవంతుడు త్రేతాయుగంలో ఇంకో అవతారంలో వచ్చినాడు. ఇంకో ఆకారంలో వచ్చినాడు. వస్తే ఆయనను పూర్తి దుర్మార్గునిగా చేసి, పూర్తి అజ్ఞానిగా చేసి, అంతకంటే నీచుడు ఇంకా లేడు అనే రకంగా చిత్రీకరించి చెప్పినారు. ఆయనను ఇదేందయ్యా ఇంత అన్యాయం అంటే నువ్వు తప్ప ఎవరూ అనలే ఆయనను దేవుడని. నేను తప్పా అంటే ఏమి? అంటే ఎవరు తప్పా? ఒకరు తప్పా విడిచిపెట్టండి. ఏది సత్యమో ఇది మాట్లాడితే వెయ్యిమంది అసత్యం మాట్లాడితే అసత్యం సత్యం అయితుందా! సత్యం అసత్యం అయితుందా! ఒక్కడు చెప్పినా నిజం నిజమే, వెయ్యిమంది అసత్యం మాట్లాడినా అసత్యం అసత్యమే, అది నిజం కాదు. వెయ్యిమంది మాట్లాడితే అది నిజం కాదు, ఒక్కడు చెప్పినాడని సత్యము అసత్యము కాదు. ఆ రకంగా నేను ఒక గ్రంథం వ్రాశాను. ఇప్పుడు బ్రహ్మ అంటే దేవుడు, రావణబ్రహ్మ అని పేరు పెట్టినం, బ్రహ్మ క్రింద రావణబ్రహ్మ. సరే! రావణబ్రహ్మ అని పేరు మాకు తెలుసు. నువ్వు కూడా వేషం వేసుకొని, టోపి పెట్టుకున్నావు అని చెప్పారు. కృతయుగంలో

జ్ఞానం చెప్పబడింది. కృతయుగంలో అందరూ జ్ఞానులుగా ఉన్నారు. దేశానికి ఇందూ దేశం అని కృతయుగములోనే పేరు వచ్చింది.

కృతయుగంలో వచ్చిన పేరు ఈ రోజుకు కూడా మనకు ఉంది. కానీ ఈ రోజు ఇందువులు ఎవరూ లేరు, అంతా అజ్ఞానులే. ఈ రోజు జ్ఞానులు ఎవరూ లేరు. కానీ ఆ రోజు ఉండే పేరు ఈ రోజు కూడా ఉంది. జ్ఞానులు అజ్ఞానులుగా మారిపోయారు కాబట్టి ఏమీ చేసినారంటే, దేవుడు తన జ్ఞానం మనకు భూమి మీదకి చెప్పేదానికి వచ్చి, ప్రజలకు జ్ఞానం చెప్పాలని చెప్పాడు. ప్రజలకు జ్ఞానం చెప్పినాడు కదా! అప్పుడు ఆయన జ్ఞానం చెప్పితే ఆయన జ్ఞానాన్ని ఎవరూ గ్రహించుకోకుండా, ఆయనను సర్వసాధారణ మనిషిగా లెక్కేసినారు. ఆయనను సర్వసాధారణ మనిషిగా లెక్కేసి ఆయనను ఈ రోజు చెడు వ్యక్తిగా చెప్పినారు, ఆయనను దుర్మార్గునిగా చిత్రీకరించినారు. అందుకే ఏసుప్రభువు ఏమి చెప్పినాడు అంటే మాములు మనిషిగా వచ్చినప్పుడు నన్ను మీరు గుర్తించ లేదు అని చెప్పినాడు. ఏమని గుర్తించలేరు, ఆయనే నేనని, అంటే ఆ దేవుడే నేనని గుర్తించలేదు. కాబట్టి మీ పాపాల్లో ఉండి మీరు చచ్చిపోతారు పో! అని చెప్పాడు. ఆయన చెప్పినాడా లేదా చెప్పండి. చెప్పినాడు, ఎందుకు చెప్పినాడు? నేను ఫలానా వానిని అని మీకు తెలియదు, తెలుసుకోలేరు. నేను పైనుండువాడను మీరు కిందుండువారు. మీరు ఇహ లోకవాసులు, నేను పరలోక వాసిని. ఈ విషయం మీకు తెలియదు కాబట్టి మీ కర్మల్లో పడి మీరు చచ్చిపోతారు. మీ కర్మలు పోవు క్షమించబడవు మీకు అని చెప్పినారు. కానీ నేను పోతున్నాను నన్ను వెతుకుతారు. నేను కనపడను మీకు, మీ పాపాల్లో మీరు చచ్చిపోతారు అని చెప్పినాడు. చివరిలో అదే చెప్పినేది, నేను ఆయనేనని తెలియకపోతే అంటే ఎంత గొప్పగా చెప్పినేది,

నేను ఆయనే నని తెలియకపోతే అంటే ఎంత గొప్పగా చెప్పినాడో చూడండి. ఆయనే అని పబ్లిక్‌గా నేను ఫలానా అని చెప్పేసినాడు.

భగవద్గీతలో కృష్ణుడు చెప్పలేదా **"నన్నే ఆరాధించండి, నన్నే మ్రొక్కండి, నన్నే నమ్ముకోండి, నన్నే చేరండి"** అని చెప్పలేదా అర్జునునికి చెప్పినాడు. 'సర్వేషు కాలేషు మామనస్మర' అన్నాడు. నన్నే స్మరించుకో అర్జునా, నీకు మోక్షం వస్తాది చివరలో అని చెప్పినాడు. చెప్పలేదా? భగవద్గీతలో చాలాచోట్ల చెప్పాడు. కానీ నన్నే నమ్ముకో, నన్నే మ్రొక్కు అని చెప్పినా ఎవరూ ఆయనను నమ్మలేదు. కానీ ఒకచోట మాత్రం ఆయన బయట పడలేదు. నన్ను మ్రొక్కండి నేను దేవుడు అని చెప్పలేదు. కృష్ణుడు కానీ, ఏసు కానీ చెప్పినాయనని మ్రొక్కలేదు. ఇంకా చెప్పకపోతే ఆయనకు ఏమి మ్రొక్కతారు? ఇప్పుడు మేం వ్రాసే గ్రంథములో హెడ్డింగ్ ఉంది. మీకు హెడ్డింగ్ మాత్రం చెప్తున్నాను ఏమంటే బ్రహ్మ అని పెట్టి దానికింద రావణ బ్రహ్మ అని పెట్టి, దానికింద ఏమి పెట్టాము అంటే భగవాన్ రావణ బ్రహ్మ అని పెట్టినాము. అంటే ఇప్పుడు కృష్ణ భగవాన్ అని కృష్ణునికి వెనక పేరు భగవాన్ ఉంటుంది. అట్లగానే ఏసు భగవాన్ అని ఏసుకు వెనక భగవాన్ ఉంటుంది. కానీ రావణబ్రహ్మకు వెనకల భగవాన్ అని పేరు ఉండదు. ప్రత్యేకించి ఏముంటుంది 'భగవాన్' అని ముందు ఉంటుంది, ఈయనకు. ఇప్పుడు ప్రపంచంలో మనుషులు ఎంతోమంది భగవాన్ అని పేరు పెట్టుకున్నారు. భగవాన్ రమణ మహర్షి అంటే రమణనంద మహర్షి వెనకుంటుంది భగవాన్ ముందుంటుంది. అట్లాగానే ప్రతి పేరు ఏదైనా గొప్ప వాళ్ళ పేర్లు ముందర అంతా భగవాన్ అనేది ముందుంటుంది. కానీ భగవాన్ అనేది ఒకే ఒక వ్యక్తికి ముందు ఉండాలి. ఇంక అంతకంటే ఎవరికీ ముందు ఉండకూడదు.

ఏ వ్యక్తికి ముందుండాలి? ప్రపంచములో భగవంతుడు మొట్ట మొదట ఎవరిగా పుట్టాడో వాళ్ళకే భగవాన్ అని మొదట ఉండాలి. తర్వాత భగవంతుడు ఎన్నిసార్లు భగవంతుడిగా పుట్టినా గానీ ఆ భగవాన్ అనేది వెనుకుంటుంది. కృష్ణుడు భగవంతుడే అంటే దేవుడే భగవంతుడుగా పుట్టినాడు కానీ కృష్ణునికి వెనక ఉంది. రెండోసారి పుట్టినోడు, మూడోసారి పుట్టినోడు, నాలుగోసారి పుట్టినోడు, ఐదోసారి పుట్టినోడు, ఆరవ సారి పుట్టినోడు ఎన్నిసార్లు అయినా పుట్టని, భగవాన్ అనేది వెనక ఉంటుంది. కానీ ముందు ఉండకూడదు. ముందు ఎవరికి ఉండాలి? ప్రపంచంలో మొట్టమొదట ఎవడైతే భగవంతునిగా పుట్టాడో వానికే ముందుంటుంది. ఇంకా లెక్కకుపోతే ఇది పెద్ద విచిత్రమే, ఏదో తప్పు పదాలు పెట్టి మమల్ని తప్పుదారి నడిపించినట్టు అయితాది. మీకు ఆ గడిచిపోయిన జ్ఞానం వద్దు తెలుసుకునే జ్ఞానాన్ని తెలుసుకుంటే చాలు. మీరు ఇప్పుడు తెలుసుకోవాలిసిన జ్ఞానమంతా ఏమి, నేను ఎవరు? అని ప్రశ్న వేసుకోండి? దేవుడెవరో వద్దు, దేవుని కథ ఆయనది ఆయనకే వదిలిపెడదాము.

దేవుడెవరు? అంటే ప్రపంచం పుట్టినప్పుడు నుండి ఆ ప్రశ్న ఉంది. ఆ ప్రశ్నను తెలుసుకోవాలంటే ఇప్పుడు మీకు అయ్యే పని కాదు. అంత పెద్ద ప్రశ్న కానీ మీకు చిన్న ప్రశ్న ఇస్తాను, మీకు ఏమని ఇస్తాను, నేనెవరు? అని మిమ్మల్ని ప్రశ్నించుకోండి. ఆలోచన చేయండి, ఇంకా ఆలోచన చేయండి. అంటే ఇప్పుడు సాయిశంకర్ గారిని అడిగితే నేను హెడ్‌మాస్టర్ అంటాడు. నువ్వు హెడ్‌మాస్టర్ నిన్న మొన్న వచ్చింది లేవయ్యా. అంతకు ముందు ఎవరు అంటాము. అంతకుముందంటే ఎవరంటే మనిషిని అంటాడు. మనిషి అనేదుంది. మాములుగా ఉంది కానీ అందరూ మనుషులే, అది మనుషులు అనేది కామన్ అది వద్దు, మనిషి శరీరంలోకి వస్తే మనిషి

అంటాము, గొర్రె శరీరంలోకి పోతే గొర్రె అంటారు, ఎద్దు శరీరంలోకి పోతే ఎద్దంటారు. అది శరీరాన్ని బట్టి వచ్చిన పేరు గానీ అసలు నీ పేరు ఏమిటి అంటాము. వాడు వెతుకులాడి వెతుకులాడి నేనెవరు? నేనెవరు? అనీ, అట్లా లోపల, లోపల ఆలోచన చేసుకొనిపోతే వానిది అయోమయం, ఎవరనేది వానికి అర్థం కాదు. ఆలోచన చేసుకోండి చూద్దాం, మీరు జవాబు తెలుసుకోండి. నేను ముస్లీమ్‌ను, నేను హిందువును, నేను క్రైస్థవున్ని అనే పేరు విడిచిపెట్టండి, పుట్టిన తర్వాత వచ్చినవి ఇవి. అది నువ్వు హిందువు కాదు, క్రైస్థవుడు కాదు, ఇంకోటి కాదు, ఇంకోటి కాదు. నిన్ను ఎవరో నువ్వు చూసుకో! ముందు ఆ ప్రశ్నకు జవాబు తెలుసుకో చాలు, నీకు జ్ఞానం వచ్చినట్టే, అప్పుడు దైవ గ్రంథాల మీద ఆధారపడాలి. నీకు దేవుడు దైవగ్రంథం ఇచ్చాడు. ముస్లీమ్ అయితే ఖురాన్, క్రైస్థవుడు అయితే బైబిల్, హిందువు అయితే భగవద్గీత చాలు, మీరు అది తెలుసుకోండి. ఇక్కడికి వచ్చి ముగ్గురిది కలిపేసి చెప్తాము మేము. బైబిల్, ఖురాన్, భగవద్గీత అంటే మాకు దేవుడు ప్రత్యేకంగా ఇచ్చిన అనుబంధం. ఒక వాక్యం చదువుతుంటే అందులో రహస్యం సులభంగా అర్థమైతావుంటుంది. మీకు అర్థంకాదు ఒక వాక్యంలో మీరు నన్ను పైకెత్తి అంటే అది ఆ వాక్యం చదివితేనే మాకు అర్థమైతుంది, ఇది మీనింగ్ అని కానీ అది స్థూలంగా చూస్తే మీనింగ్ ఒక రకంగా ఉంటుంది. అట్లాగానే అత్యధికంగా చెప్పినట్టి సూక్ష్మమైన విషయాలు ఖురాన్ గ్రంథములో ఉన్నాయి. ఆ సూక్ష్మమైన విషయాలు చదివితే వళ్ళు గగురుపొడుస్తుంది అన్నమాట. ఇప్పుడు కనీసం అంటే 30,000 మంది హిందువులు ఖురాన్ గ్రంథం చదివినారు. చదివి ఏమంటున్నారంటే భగవద్గీతకంటే మించి ఉంది అని చెప్పుచున్నారు, అంటే అంత బాగా అర్థమైంది వాళ్ళకు. భగవద్గీతలోని సారాంశమే భగవద్గీతను

మించి ఉందంటే అంత బాగా అర్థమైంది. అంత బాగా డీప్‌గా చదివినారు. చాలా మంచిగా చదువుతున్నారు, క్రైస్థవులు చదివినారు ముస్లీంలు చదివినారు, హిందువులు చదివినారు. కానీ అందరికంటే హిందువులు, క్రైస్థవులే బాగా ఒప్పు కుంటున్నారు. ముస్లీమ్‌లు కొంత ఆలోచన చేస్తున్నారు. ఇది చదవాలంటే గందరగోళంలో పడిపోయినారు. వాళ్ళు ఎప్పుడూ వినని విషయం అనేసరికే కొంత గందరగోళం అయిపోయింది.

ఈ రకంగా లెక్కేసుకుంటూపోతే ఇప్పుడు రకరకాల బోధలు ఉంటాయి, రకరకాల మాత్రలుంటాయి. రకరకాల వైద్య విధానాలు ఉన్నట్టు మనకు అల్లోపతి, హోమియోపతి, న్యాచురోపతి, రకరకాలు ఉన్నట్టు, మనకు ఈ జ్ఞానం కూడా ఉంది అంటే మతాలు కూడ ఉన్నాయి. ఆ మతం ఈ మతం ఇంకో మతం ఇంకో మతం అని ఎన్ని మతాలున్నా గాని, ఈ వైద్య విధానాలు అనుకోండి, బోధలన్నీ మాత్రలు అనుకోండి. అందులో జ్ఞానం సరైనదా లేదా చూసుకోండి. ఇప్పుడు ఒక బోధకుడు చెప్పుచున్నాడు ఈ దేవుడే గొప్ప, నేను 12 సంవత్సరాల నుంచి మ్రొక్కు తున్నాను మీరు మ్రొక్కండి అని చెప్పినాడు అనుకో! అది బోధే అది కూడా మాత్రే, ఆ మాత్ర మీకు పనికిరాదు మీ రోగం పోదు, దానికి ఆ దేవత ఏమి చెప్పుతుంది. మేము కూడ జ్ఞానమును తెలుసుకోవాల్సిందే అని చెప్తా ఉంది జుబ్లిహిల్స్ పెద్దమ్మ. ఇక్కడికి వచ్చి ఏమని చెప్తావుంది, మేము కూడా జ్ఞానం తెలుసుకోవాల్సిందే, అందరూ మొక్కినారు నన్ను, రకరకాల కోరికలు కోరినారు, నేను అన్ని కోరికలు తీర్చలేదని వాళ్ళు ఇప్పుడు తిడుతున్నారు నన్ను. నాకు తీర్చే శక్తి ఎక్కడుంది అంటుంది ఆయమ్మ. విన్నారా లేదా మీరు? విన్నారు కదా! "వజ్ర వాక్యాలు" గ్రంథంలో వ్రాసాము, దేవతలంటే ఇట్లా, వాళ్ళు వాళ్ళకు ఈ శక్తి ఉంది, మీరు కనిపించే

మనుషులు, వాళ్ళు కనిపించని మనుషులు, మీరు ఉన్నట్టే వాళ్ళుంటారు. వాళ్ళకు ఏమీ పెద్ద శక్తులుండవయ్యా మీరు వాళ్ళని పైకి పొగడినారు శక్తులని, దండిగున్నాయని పొరపాటుపడినారు. అట్లంతా ఏమి లేదు, మీరు అట్లా నమ్ముకోవద్దండి, జ్ఞానం తెలుసుకోండి అని చెప్పినా నేను. ఆ రకంగా మాత్రలుండాయి. ఏ మాత్రో చూసుకోండి దాంట్లో మందు బాగా ఉందో లేదో చూసుకోండి, అంటే మీరు వైద్యులు చాలామంది ఉన్నారు.

ఇక్కడ మాత్రలంటే వాటికి పోవద్దండి, సీసాల్లో వేసుకునే మాత్రలకు పోవద్దండి, చెప్పే మాత్ర–మందు బోధే, మాత్ర. ఇప్పుడు నా మాత్ర ఉంది, నా మాత్ర వేసుకుంటే ఏమైతాది ఘటామని మీ రోగాలన్నీ పోతాయి, మీకుండే రోగాలు పోతాయి, కళ్ళకు నీళ్ళు కారుతాయి. కారతాయా లేదా చెప్పండి, కారినాయా? మా మాత్ర అట్లా పవర్‌ఫుల్‌గా ఉంటుంది, ఘాటుగా ఉంటుంది. నా మాత్ర పూర్తి వేసుకోవాలి. వేసుకోకుండా చప్పరించి అట్లా వాసన చూసి నాలుకతో నాకితే ప్రయోజనం లేదు, పూర్తిగా మింగి చూడండి తెలుస్తుంది. అప్పుడు తెలుస్తుంది నా మాత్ర ఎట్లాంటిదో! కాబట్టి మీరు ఇప్పటి నుంచి స్వచ్ఛమైన జ్ఞానాన్ని తెలుసుకుంటారని, ఆ మంచి మందును అందుకుంటారని, మాత్రలు కూడా మంచివి వేసుకుంటారని, నా మాత్రే మందు, నా మందే కరెక్టు అని నేను చెప్పలేదు. కానీ మీరు చూసి వేసుకోండి, టెస్ట్ చేసి అట్లా వేసుకుంటారని, వచ్చే నెల మళ్ళీ వచ్చి మళ్ళీ కొత్త జ్ఞానాన్ని తెలుసుకుంటారని కోరుకుంటున్నాము. ఇంతటితో ఈ సభను ముగిస్తున్నాము.

# 91. గ్రంథము - బోధ

**(తేది :- 24.01.2016)**

ఈ సమావేశములో కలిసిన ప్రజలందరికి జ్ఞానం సక్రమముగా అర్థం కావాలని కోరుకుంటూ ఈ సమావేశాన్ని ప్రారంభిస్తున్నాము. ఇక్కడ చాలామంది ఈ జ్ఞానాన్ని గురించి వారి యొక్క భావాన్ని తెలియజేసారు. వాటిలో కొన్ని మాటలు మాత్రం విన్నాము, కొన్ని వినలేక పోయాము. కానీ వాళ్లు చెప్పుకునే జ్ఞానం చూస్తే నేనే వాళ్లకంటే తక్కువ జ్ఞానినేమో అనిపిస్తుంది. వారు అంత భావాన్ని వ్యక్తం చేస్తున్నారు. ఇక్కడికి వచ్చిన అందరినీ కలిపి టోటల్‌గా ఏమి చెప్పుచున్నానంటే, నేను చెప్పిన జ్ఞానాన్ని బాగా తెలుసుకుంటున్నారని నాకు బాగా అర్థమైంది, నేను చెప్పిన దానికంటే ఇంకా ఎక్కువ తెలుసుకుంటున్నారని కూడా నాకు అర్థమైనది. ఇదే విధముగా మీరు భవిష్యత్తులో కూడా జ్ఞానం తెలుసుకోవాలని కోరుతూ ఇప్పుడు ఈ సభను ప్రారంభిస్తున్నాము.

ఇక్కడికి వచ్చి మీరు నాకు నమస్కారం చేసుకోవాలన్న ఉద్దేశ్యంతో, దర్శనం కావాలన్న ఉద్దేశ్యంతో ఇక్కడికి రావద్దండి అని మేము చాలామార్లు చెప్పాము. నన్ను ఒక స్వామిగా చూడవద్దు అని చెప్పాము. మీరు నన్ను స్వామిగానే చూస్తున్నారు. స్వామిగా చూసే భావము లేకుండాపోతే అప్పుడు మీకు మంచి లాభం కలుగుతుంది అని నేను మొదటి నుండి చెప్పుచున్నాను. కానీ మీరు దాన్ని పోగొట్టుకోలేక వచ్చిన ప్రతిసారి దర్శనం కావాలి అని అడగడం జరుగుతున్నది. అయినా కానీ కొంతమందిని పిలిచి మేము మాట్లాడి పంపిస్తున్నాము. కానీ నిన్న ఒక వ్యక్తి మూడు నెలలుగా వరుసగా వచ్చి మాకు దర్శనం కావాలని అడిగితే, మూడవసారి నేను దగ్గరికి పిలిచి

చెప్పినాను. నన్ను చూడాలని అనుకొని మీరు భ్రమపడొద్దండి నేను ఇలాగే ఉంటానని నమ్మకం లేదు. ఏదో ఒక రోజు ఈ శరీరాన్ని వదిలిపెట్టి పోయే రోజు కూడా వస్తుంది. ఆ రోజు నేను లేను అనుకోండి ఇక ఆ రోజు స్వామి లేడు కదా, దర్శనం లేదు కదా అని మీరు రాకుండా మానుకుంటారు. మీరు రావలసింది జ్ఞానం కోసము దేవుని కోసము. ఇక్కడికి ఆ ఉద్దేశ్యంతో రావాలి కానీ నన్ను ఒక స్వామిగా చూడడానికి వెళుతున్నాము, స్వామి దర్శనం కోసం పోతున్నాము అన్న ఉద్దేశ్యము ఉండకూడదు అని నేను చెప్పాను. ఇప్పుడు కూడా అదే చెప్పుచున్నాను. ఈ భ్రమను వదిలిపెట్టి స్వామిని చూడాలి, స్వామే జ్ఞానం చెప్పుచున్నాడు అనుకోవద్దండి, స్వామి జ్ఞానం చెప్పేవాడు కాదు. నేను చాలాసార్లు చెప్పాను ఒకవేళ నన్ను స్వామిగా అనుకోవచ్చు కానీ, నేను స్వామిని కాను అని చెప్పాను. నేను ఎక్కడనో శరీరంలో ఒక మూల ఉండేటటువంటి జీవాత్మను మాత్రమే జీవుడు అయిన నేను మాట్లాడేవాన్ని కాదు, కాని నా భావాన్ని వ్యక్తం చేసేవాడు ఒకడున్నాడు. ఏమి మాటలు మాట్లాడినా కానీ ఆ లోపల ఉండేటటువంటి ఇంకొక వ్యక్తి మాట్లాడతాడు. ఆ శరీరానికంతా అధిపతిగా ఉండేవాడు మాట్లాడు తున్నాడు. నాలోనే కాదు మీలో కూడా అలాగే మాట్లాడుతున్నాడు. పనులు చేసేవాడు కూడా వాడే. కానీ మీరు ఏమనుకుంటున్నారంటే నేనే మాట్లాడు తున్నాను అని మీ భావము ఉన్నదానివలన అది మీరు మాట్లాడినట్లుగానే దేవుడు లెక్కించుకుంటున్నాడు. ఇప్పుడు మా భావంలో మేము మాట్లాడడం లేదు. మాట్లాడేది కూడా శరీరంలో ఉండే అధిపతి అని మేము చెప్పడంవల్ల మేము మాట్లాడినట్లు కాదు. వాస్తవంగా మేము మాట్లాడడం లేదు. కానీ మాట్లాడేవాడు ఎవరు? అంటే "తోలేవాడు ఒకడున్నాడు తోలబడేవాడు ఒకడున్నాడు" అని ఖురాన్ గ్రంథములో చెప్పారు. అది దైవ వాక్కు.

చూసేవాడు కూడ ఒకడున్నాడు వాడు దేవుడు, కానీ నన్ను తోలేవాడు ఒకడున్నాడు వాడు దేవుడు కాదు కానీ, దేవునితో సమానంగా ఉండే టటువంటివాడు. దేవుని తర్వాత ఉండేటటువంటి వాడు. ఆయన ఏమి చేయిస్తే అది మనం చేస్తున్నాము. ఇప్పుడు ఈ మాట మాట్లాడుతున్నాము కదా, ఈ నోరు అల్లాడిస్తున్నాము కదా మీరు ఏమి అనుకుంటారు అంటే ఫలానా ప్రబోధానంద స్వామి మాట్లాడుతున్నాడు, ఆ మాటలు వినాలి అని వచ్చారు. వినండి మంచిదే కాని ఫలానా మనిషి అనుకోవడంలో పెద్ద పొరపాటు ఉంది. కనిపించే వానిని నేను కాను. కనిపించేవాడు జీవుడు కాదు, కనిపించేవాడు అధిపతి శరీరంలో ఉండేటటువంటి ఈశ్వరుడు. అతను మాట్లాడుతున్నాడు అని చాలాసార్లు చెప్పాను.

ఈ రోజు మీకు **"హిందూమతములో సిద్ధాంత కర్తలు"** అను గ్రంథమును అందించడము జరిగినది. హిందూమతంలో సిద్ధాంత కర్తలు అంటే ఎవరైనది కూడా హిందూవులకు చాలామందికి తెలియదు. కొంత మందికి ఆదిశంకరాచార్యుడు తర్వాత ఇంకొకరు ఉన్నారని మాత్రము తెలుసు. వీరు హిందూమతంలో గొప్పవాళ్లు అన్న విషయం తెలుసుకానీ సిద్ధాంతకర్తలు అన్న విషయము కూడా చాలామందికి తెలియదు. కొంత మందికి నూటికి 10 మందికి మాత్రం వీరి విషయము తెలుసు, ఆ నూటికి 10 మంది ఏమి చేస్తున్నారంటే సిద్ధాంకర్తలు అనేదానిని కూడ వాళ్లు సక్రమంగా అర్థం చేసుకోకుండా వారికుండే భావాలు వీళ్లు గ్రహించుకో లేకుండా పోయిన దానివలన వాళ్లను గురించే మేము గ్రంథము వ్రాయవలసిన పని వచ్చింది. వాళ్లను గురించే కాకుండా మమ్ములను కూడా కలుపుకొని దానిలో వ్రాయవలసి వచ్చింది. ఎందుకంటే నేను కూడా ఒక సిద్ధాంతకర్తనే. ఎవరు? నేను, నేనంటే ఎవరు? అది తెలియదు.

ఇప్పుడు ఎవరు మాట్లాడుతున్నారో తెలియదు. కానీ ఇక్కడ అపరిచితుడు మాదిరే ఉంటుంది. అంత ఎప్పుడు ఎవరు మాట్లాడతారో తెలియదు. నేనంటే ఎవరో మీకు తెలియదు. కనిపించేవాడు అనుకోవద్దండి, కనిపించని వాడు కూడా మాట్లాడతాడు కనిపించేవాడు కనిపించనివాడు కాకుండా ఇంకొకడు కూడా మాట్లాడతాడు ఇంకోకసారి, కానీ వాడు మాట్లాడేవాడు కాదు, కానీ మాట్లాడతాడు అవసరం వస్తే, అందువల్ల ఒక జీవునిగా నన్ను లెక్కించుకోవద్దండి అని చెప్పుచున్నాను, అంటే నన్ను గౌరవించవద్దండి అంటే ఏమాత్రం కూడ నన్ను గొప్పవాన్ని అనుకోవడం పెద్ద పోరపాటు, నేను నా లేవల్‌లో నేను జీవాత్మనే. కానీ మీ లెవల్‌లో మీరు ఎలా అనుకున్నా కానీ అది తప్పు అవుతుంది. మీరు ఒక వ్యక్తిని గుర్తుగా పెట్టుకోవద్దు. వ్యక్తి లోపలుండే శక్తిని గుర్తుగా పెట్టుకొండి. అందువలన మీకు ఏమి చేశానంటే "మీకు కనిపించే శరీరం ఉండదు ఎప్పటికైనా ఇలాగే అయిపోతుంది చూడు" అని కృష్ణమందిరానికి ముందు సమాధి కట్టి చూపించాము. కొంత కాలమైన తరువాత మీరు చూడబోయేది కూడా అదే అక్కడుంటాడు స్వామి అని. కానీ ఇక్కడ కనిపించేవాడు ఇప్పుడు ఉండవచ్చు, కానీ ఈ శరీరమే మళ్లీ అక్కడుంటుంది, అది ముందే ఒక సమాధి కట్టి చూపించాము. అంటే ఎవరి మరణాన్ని వాళ్ళు గుర్తించరు కానీ చూపించరు నేను ముందే చూపిస్తున్నాను. ఎవరికైనా ఇది తప్పదు. రేపు ఇటువంటి స్థితి వస్తుంది, మేము కూడా ఆ స్థితిని మీకు గుర్తు చేస్తున్నాము. మీరు మమ్మల్ని చూడాలి అనుకోవద్దండి, మేము అలా మారిపోయే పరిస్థితి వస్తుంది అని చెప్పాము. దానికంటే తర్వాత ఇప్పుడు మీరు ఉండి కూడా మీరు అలా చూపించారు కదా ఎదురుగా వచ్చి మీరు ఎందుకు మాట్లాడరు అని అడుగవచ్చును. దానికి జవాబు ఇలా కలదు. ఎదురుగా వచ్చి మాట్లాడితే మీరు నన్నే

చూస్తారు, నా మీదే మీ ధ్యాస పెరుగుతుంది. నన్ను గౌరవిస్తారు తర్వాత నమస్కరిస్తారు. ఆ నమస్కారము నాకు ఉండకూడదు అది దేవునికే ఉండాలి అని మేము కోరుకుంటున్నాము. కాబట్టి నేను కనిపించడం లేదు, ఎంత చెప్పినా కానీ మీరు నాకే నమస్కరిస్తున్నారు. నా వెనుక ఉండే దేవునికి మీరు నమస్కరించడం లేదు. అది మంచి పద్ధతి కాదు అని మేము తెలియజేసే నిమిత్తమే నేను కనపడకుండా ఉండాలి అనుకున్నాను. అవసరం వస్తే మేమే కనిపిస్తాము మాట్లాడతాము. ఇంతకు ముందు ఒక అబ్బాయి చెప్పాడు నేను వచ్చి మూడు నెలలు అయింది, నాకు స్వామి కనపడలేదు, ఉన్నట్లుండి బజారులో కనిపించాడు అని, వాస్తవమే అది. అంటే ఎప్పుడు ఏమి జరుగుతుందో చెప్పలేము మీ ఇంటికే నేను రావచ్చు, కానీ మీ ఇంటికొచ్చినా మీరు తలుపు కూడా తీయకపోవచ్చు. ఒకసారి నేను విజయనగరం పోయాను. విజయనగరం పోయి తలుపు తడితే 12 గంటల వరకు మేలుకొన్నారంట 12:30 కు నిద్రపోయారు. ఫోన్ చేస్తే ఎత్తలేదు. తలుపు తడితే తియ్యలేదు. సరే నేను వచ్చాను అని గుర్తుండాలి కదా ఒక గ్రంథాల కట్ట అక్కడ పెట్టి వచ్చాను. నేను వచ్చినాను అని గుర్తుగా వాళ్ల ఇంటి ముందర. వారు తరువాత చూసుకున్నారు అక్కడ గ్రంథాల కట్ట ఉండేది గ్రంథాల కట్ట ఎక్కడి నుంచి వచ్చిందంటే ఉదయం ఫోన్ చేసాను అయ్యా 12:30కు వచ్చాను. మీరు తలుపు తీయలేదు ఫోన్ చేసాను, తలుపు గట్టిగా తట్టాను. పక్కవాళ్లు దొంగలు అనుకుంటారేమోనని భయపడి నేనే వెనక్కి వచ్చాను. నేను వచ్చినా కూడా మీరు తలుపు తీయలేదు మీదే తప్పు అని చెప్పాము. అంటే స్వామి రావాలి స్వామి రావాలి అని కోరుకున్న వాళ్లు మరీ స్వామి వచ్చినప్పుడు ఎందుకు తలుపు తీయలేదు? అంటే దేవుడు ఆ రకంగా వాళ్లను నిద్రలోకి పంపించి తీయకుండా చేసాడు.

మనల్ని ఆడించేవాడు ఒకడుంటాడు, మన వెనుక ఒక శక్తి ఉంది, ఆ శక్తి మనల్ని నడిపిస్తూ ఉంటుంది, అది ఎలా నడిపిస్తే అలా నడుస్తుంటాము, దేనికి మనము బాధ్యులము కాదు. ఒక వ్యక్తిని చెడ్డవాడు అంటే వాడు చేసిన చెడు అందులో ఏమి లేదు కానీ వాడి వెనక నడిపించే కర్మ ఆ రకంగా చేయించింది అని మనం ఎందుకు అనుకోకూడదు? అలా అనుకోవచ్చు. ఒకానొక రోజు ఒక వ్యక్తి ఏసు ప్రభువును దోషిగా నిలబెట్టి నీ మీద తప్పులు, ఆరోపణలు చాలా ఉన్నాయి. నువ్వు సత్యం ఏదో చెప్పు నాకు ఇది నిజమా అబద్ధమా నువ్వు పలుకకుండా ఉన్నావు, నువ్వు పలికి చెప్పితే ఫర్వాలేదు, చెప్పకపోతే నేను ఏమీ వ్రాస్తే అది నేరవేరుతుంది. నిన్ను శిక్ష అయినా వేయచ్చు, రక్షణ అయినా చేయచ్చు. నేను ఇప్పుడు చేతితో ఏది వ్రాస్తే అది జరిగి తీరుతుంది. నేను వ్రాస్తే నీకు మరణం అయినా తప్పదు కాబట్టి నాకు ఏదో ఒక సమాధానం చెప్పు అన్నాడు. అప్పుడు ఆయన ఏమి చెప్పినాడు అంటే ఏ నిర్ణయము నువ్వు సొంతంగా తీసుకోలేవు. నీ పై అధికారి ఒకడున్నాడు నీ లోపల ఆయన ఏమి నిర్ణయం తీసుకుంటే అది నువ్వు వ్రాయగలవు. నువ్వు సొంతంగా వ్రాయలేవు, లోపల ఉండే ఆయన ఏమి చెప్పినా కానీ అది నాకు సమ్మతమే, కాబట్టి నేను ఏమి చెప్పను ఆయన ఏమి చెప్పితే, ఏ శిక్ష వేస్తే అది అనుభవిస్తాను అని చెప్పాడు. అప్పుడు నువ్వుకాదు నీ వెనుకల ఇంకోకడున్నాడు అని ఆయన ఆ రోజు చెప్పాడు. ఈ రకంగా నేను కూడా అదే విషయాన్ని ఇప్పుడు చెప్పుచున్నాను. నేను అనేటటువంటి వానిని నేను కాను, నా వెనుక ఇంకోకడున్నాడు. వానిని మీరు ధ్యాసలో పెట్టుకోండి అని చెప్పుచున్నాను. నన్ను గురించే కాదు మీలో కూడా ఇంకోకడున్నాడు అన్ని అతనే చేయిస్తున్నాడు. ఆ విషయం ఇక్కడ వచ్చి

జ్ఞానం తెలుసుకున్న తర్వాత తెలుస్తుంది. ఆ విషయాలు మీకు తెలియనిది అర్థం కాదు అని చెప్పాము. సిద్ధిపేట నుంచి ఒక వ్యక్తి వచ్చాడు. నేను రెండు మాటలు మధ్యలో విన్నాను 5 సంవత్సరముల పిల్లవానికి వచ్చిన జ్ఞానము 50 సంవత్సరాల పెద్ద మనిషికి కూడా ఈ రోజు అర్థము కాకుండా పోయింది. ఎందుకు అంటే వారికి ఉండే శ్రద్ధ అటువంటిది. వారికి ఆ శ్రద్ధ లేదు కాబట్టి అది తెలియలేదు. మీరు కూడ శ్రద్ధగా వినండి ఇప్పుడు నేను చెప్పబోయే విషయం ఏమంటే మేము ఇవాళ ఒక గ్రంథం వ్రాసాము. కానీ ఆ గ్రంథము వ్రాసినప్పుడు కూడ మీకు ఒక విషయం చెప్పాను. వ్రాస్తున్నవాడు ఫలాన వాడు అని మీరు అనుకోవచ్చు కానీ నేను కాదు అని చెప్పాము. కొందరు నువ్వు ఎవరు? అని అడిగారు. నేను ఆత్మను అని చెప్పితే మీరు నమ్ముతారా అని అడిగాము. మీరు ఎలా చెప్పగలరు? కనిపించేది ఎవరు? కనిపించేది మనిషి ఆత్మ అని చెప్పితే ఎలా నమ్ముతాము? అందరి దగ్గర ఆత్మ ఉంది, మా ఆత్మ మాట్లాడలేదే అంటే మీ ఆత్మ మాట్లాడతావుంది. నువ్వు అనుకోలేదు అది మాట్లాడతూ ఉంది అని, నేనే మాట్లాడుతున్నాను అని నువ్వు అనుకుంటున్నావు. నువ్వు ఏమీ మాట్లాడలేదు, నీకు ఏమి చేతకాదు, ఏమి చేయలేదు, చేసేదంతా ఆయనే, మాట్లాడేదంతా ఆయనే. నువ్వేమనుకుంటున్నావు నేను ఒక్కడినే ఉన్నాను. వేరేవాడు లేడు అనుకుంటున్నావు.

నాకు తెలుసు నేను ఎవర్రై ఉండేది, నా పరిధిలో నేను ఉంటాను, అందువలన మీరు నమస్కారం చేస్తే నాకు ఏమాత్రము సరిపోదు. ఎంత పెద్ద ఘోరమైన తప్పు చేస్తున్నారు వీరు అనుకుంటాను. ఆ తప్పు చేసేదానికి అవకాశం లేకుండా నేను దూరంగా ఉన్నాను. మీరు ఎలాగు నన్ను విడిచిపెట్టరు. నేను కనిపిస్తే మాత్రం తప్పనిసరిగా నమస్కారం చేస్తారు.

అది నాకు ఎలాగు సరిపోదు. అందువలన నేను మీకు దూరంగా ఉంటున్నాము. అంతే తప్ప ఇంకొకటి ఏమీ లేదు. ఇప్పుడు దూరంగా ఉండేవాడు ఎవడు? దగ్గరగా ఉండేవాడు ఎవడు? మళ్లీ ఇదోక ప్రశ్నే ఇది ఏమాత్రం అర్థము కానీ సమస్య, ఎవడు ఏమి మాట్లాడుతున్నాడు ఇది నేను చాలాసార్లు చెప్పాను, ఇది గందరగోళము. మీరు కొంత జ్ఞానం తెలుసుకుంటే అర్థమవుతుంది లేకపోతే అర్థం కాదు. ఈ జ్ఞానం తెలియనంత వరకు ఇది ఏమీ అర్థం కాదు.

ఇప్పుడు మేము గ్రంథము వ్రాశాము అని చెప్పుచున్నాము కదా! సరే ఆ గ్రంథము వ్రాసిన విషయం నేను ఇక్కడ మాట్లాడుతున్నాము కదా! గట్టిగా మాట్లాడుతున్నాను బాగా వినిపించేటట్లుగా మాట్లాడుతున్నాను కానీ మాట్లాడాలంటే నా శరీరంలో నాకు బలము కావాలి. బలము లేనిది నేను మాట్లాడలేను బలహీనమైన వ్యక్తి ఎలా మాట్లాడతాడు చిన్నగా మాట్లాడుతాడు. వాడు మాట్లాడే దానికి కూడా బలము లేదు, ఒక వ్యక్తి నాలుగు రోజులు అన్నం తినకుండాపోయి మాట్లాడితే, వాడు నోరు కదిలిస్తున్నాడు శబ్దం బయటికి రాలేదు, ఎందుకంటే ఆ శరీరంలో బలము లేదు. బలము లేని దానివలన అతను మాట్లాడినా, అతని నోటి నుంచి శబ్దము బయటికి రాలేదు, వినపడలేదు. కానీ నోట్లో మాట బయటికి వినిపించాలి అంటే ఆ వ్యక్తి గట్టిగా మాట్లాడాలి. ఆ శబ్దము బయటికి రావాలంటే ఏమి కావాలి? గట్టిగా చెప్పండి బలము కావాలి. ఏమి కావాలి బలం కావాలి. ఆ బలము ఎక్కడినుంచి వస్తుంది? ఇప్పుడు చెప్పండి ఆత్మ డైరెక్ట్‌గా అందించలేదు శరీరం ద్వారా వస్తుంది మీకు. శరీరంలో ఎక్కడ నుంచి వస్తుంది? ఒకటేసారి ఆత్మ అని డిపి దగ్గరికి పోతున్నారు. డిపి దగ్గరకి పోవద్దు, నువ్వు మాట్లాడాలంటే గొంతులో బలం రావాలి.

గొంతులో బలం రావాలంటే శరీరంలో బలం రావాలి. శరీరంలో బలం రావాలంటే శరీరానికంత బలం ఎక్కడ నుంచి వస్తుంది, ఏడో నాడీకేంద్రం ద్వారా వస్తుంది అని చెప్పుచున్నాము. ఈ విషయము తిరుపతి దేవస్థానంలో కూడా అంటే తమిళనాడులో ఎక్కడ పోయినా ఈ ఆత్మ జ్ఞానాన్ని వాళ్ళు ప్రతిష్ఠించి దేవాలయాలు స్థాపించారు. అందుకే ఏడు ద్వారాలు అక్కడ పెట్టారు, దేవుని దర్శనానికి వెళ్లినప్పుడు గర్భగుడికి ఏడు ద్వారాలున్నాయి, ఇటు ఏడు అటు ఏడు ఉన్నాయి, అవి ఏమిటి? ఏడు నాడి కేంద్రాలున్నాయి, ఏడు గ్రంథులున్నాయి. మన శరీరములో ఉన్నాయి కదా! వాటికి గుర్తుగా ఏడు+ఏడు ద్వారములు పెట్టారు.

మనము గుడికి పోయి అక్కడ ప్రదక్షణ చేసి రావడం లేదు. కానీ మనం శరీరంలో ఉండే విషయము మనం చెప్పుకుంటున్నాము. ఇదేం జ్ఞానమయ్యా ఇదేదో పెద్ద జ్ఞానం చెపుతాడని వస్తే మళ్లీ శరీరంలోకి పోయి బలం అంటాడు, జీర్ణము అంటాడు నవ్వేదంటాడు, మాట్లాడేదంటాడు దానికంతా బలం కావాలి అంటాడు. ఈ బలం కావాలంటే మళ్లీ నాడీ కేంద్రాలు అంటాండు. దానివలన డాక్టర్ల దగ్గరికి పోతే మేలు కదా! వీళ్ల దగ్గరికి ఎందుకు రావాలి అనుకోవద్దండి మీరు. డాక్టర్ అంటే తెలుగులో వైద్యుడు అని అర్థం. ఇంగ్లీష్‌లో డాక్టరు అంటే తెలుగులో వైద్యుడు. వైద్యుడు అంటే ఏమి వైద్యుడు అంటే తెలిసినటువంటి వాడు అని, వైద్యుడు అంటే మందులు ఇచ్చేవాడు కాదు. వైద్యుడు అంటే తెలిసినటువంటివాడు అని మేము చేప్పేది అదే నీకు ఏదైతే తెలిసిందో మీకు అది తెలియజెప్పాలని ఉద్దేశ్యంతో నేను చెప్పుచున్నాను. ఇది మీకు అసలైన జ్ఞానం కావాలి కదా. ఆ జ్ఞానం కావాలంటే ఏమీ చేయాలి? మనం శరీరంలోకి లోపలి దృష్టి పెట్టి మాట్లాడాలి. బయట దృష్టి వద్దు, బయట ఎన్ని దేవాలయాలున్నా,

పెద్ద పెద్ద దేవాలయాలున్నా ఆ దేవాలయాన్ని గురించి మాట్లాడుకోలేదు ఏ దేవుని గురించి కూడా మాట్లాడుకోలేదు. లోపల నీ శరీరంలోనే దేవుడున్నాడు, ఆ దేవుని గురించి మనం మాట్లాడుకుంటాము.

హిందువులకైతే శరీరంలో దేవుడున్నాడు, ముస్లీమ్‌లకు ఉన్నాడు. అంటే మనిషి అన్నాక ఎవరికైనా గానీ ఒకటే దేవుడున్నాడు. వాళ్లందరికీ శరీరంలోనే ఉన్నాడు, ఖురాన్ గ్రంథములో ఒక విషయం వ్రాయబడి ఉంది. అది ఎవరికీ తెలియలేదు అంటే ఉన్న విషయం ఏమీ అర్థమైందో ఏమో కానీ, వాస్తవమైన భావం వాళ్లకు అర్థం కాలేదు. **"ఆకాశమును భూమిని వాటి మధ్య ఉండే సమస్తమును అల్లాహ్ సృష్టించాడు"** అని ఉంది, అంటే ఏమాంటారు. ఈ పైన కనిపించే ఆకాశము, క్రింద కనిపించే భూమి వీటన్నిటిని దేవుడు సృష్ఠించాడు అని అంటున్నారు. అంటే ఇది పైన ఉండేటటువంటి భావాన్ని చెప్పుకుంటున్నారు. వాస్తవంగా అక్కడ చెప్పింది పైనుండే భావము కాదు, నీ శరీరంలో ఉండే భావము. ఆకాశము అంటే నీ తల, భూమి అంటే నీ కాళ్లు వాటికి మధ్య ఉండే సమస్తము అంటే తలకు కాళ్లకు మధ్యలో ఉండేటటువంటి సమస్తాన్ని నేను సృష్టించాను అని దేవుడు చెప్పాడు. నిన్ను మొత్తం సృష్ఠించినటుంటి వాడు ఎవరు దేవుడు. ఖుర్ఆన్ గ్రంథములో అల్లాహ్ అన్నారు. అల్లాహ్ అన్నా దేవుడే. దేవుడన్నా వాళ్లు వేరే మతంలో ఏమైనా అనుకొని దేవుడే ఆయన వాళ్లు మతంలో దేవున్ని ఎట్లనుకున్నా ఫర్వాలేదు. కానీ నీ శరీరంలోకి పోయి చూస్తే నువ్వు నడవాలన్నా, పరిగెత్తాలన్నా ఇంకొక పని చేయాలన్నా, మాట్లాడలన్నా నీకు ఒక బలం కావాలి. ఆ బలం ఎక్కడి నుంచి వస్తావుంది? ఏడు నాడికేంద్రాల ద్వారా వస్తుంది. ఇప్పుడు నేను మాట్లాడుతున్నాను నాకు ఏడు నాడీకేంద్రాల్లో ఒక నాడీకేంద్రం ద్వారా నాకు బలము అందిచ

బడుతూవుంది. అందువలన నేను గట్టిగా మాట్లాడుతున్నాను, ఈ బలం ఎక్కడ నుంచి వచ్చింది నాకు? గొంతు దగ్గర ఒక నాడీ కేంద్రం ఉంది ఆ గొంతు దగ్గర ఉండేటటువంటి నాడీకేంద్రంలో ఒక శక్తి ఉంది. ఆ శక్తి గొంతుకు వచ్చింది, ఆ గొంతులో నుండి మాట వస్తావుంది. ఇప్పుడు వాస్తవానికి వస్తే నాకు నాడీకేంద్రాలలో ఒక నాడీకేంద్రం వలన మాట మాట్లాడే శక్తి నాకు వచ్చింది అని చెప్పుచున్నాము. మీరు పరిగెత్తాలంటే కాళ్లకు శక్తి ఎక్కడి నుంచి వస్తుంది. కాళ్లకు కూడా నాడీకేంద్రం నుండి శక్తి వస్తాది నువ్వు పరిగెత్తగలుగుతున్నావు.

ఒకచోట నుంచి పరుగెత్తాలంటే, మాట్లాడలంటే, ఒక చోటనుంచి ఆలోచన చేయాలంటే, ఒక చోటనుంచి తిన్న అన్నం జీర్ణము అవ్వాలన్నా ఒకచోట నుంచి ఈ రకముగా మనకు ఏడు నాడీ కేంద్రాల నుండి నీ శరీరంలో శక్తి లభిస్తుంది. దీని మీద మీకు ధ్యాస రాలేదు. ఏవో గ్రంథాలు చదువుతున్నారు ఎక్కడో దేవుడున్నాడు అనుకుంటున్నారు. ఎక్కడో దేవాలయాలకు పోతున్నారు. అక్కడ దేవుడున్నాడు అనుకుంటున్నారు కానీ నీ శరీరంలో ఉండే దేవుని మీద నీకు ఏమాత్రం దృష్టి రాలేదు అని మేం చెప్పుచున్నాము. ఆ దృష్టి రావాలి వస్తే ఏమైతుంది? ఈ నాడీ కేంద్రాల ద్వారానే, నువ్వు ప్రతీ పని చేయగలుగుతున్నావు అని తెలుస్తుంది. సరే ఇప్పుడు నేను మాట్లాడగలుగుతున్నాను నాడీకేంద్రం ద్వారానే, నేను ఉపన్యాసం చెప్పుచున్నాను అంటే ఇప్పుడు శక్తి ద్వారానే పని జరుగుతుంది. ఈ నాడి కేంద్రం ఏడు నాడీకేంద్రాలు తర్వాత శరీరంలో గ్రంథులు ఏడున్నాయి. మాములుగా కొద్దిగా చదువుకున్నట్టి ఎవరికైనా గానీ ఈ విషయం తెలుసు. అంటే శరీరంలో ఏడు నాడీ కేంద్రాలున్నాయి, ఏడు గ్రంథులు ఉన్నాయని. కానీ ఈ రోజు మీకు సిద్ధాంతకర్తలు అని వ్రాసిన

గ్రంథములో “సప్తమి నిర్ణయము సప్తమి నిక్షయము” అని చెప్పాడు. సప్తమి సత్యము సప్తమి నిక్షయము అని రెండు మాటలు అంటే సప్తమి సప్తమి అని రెండుసార్లు ఎందుకు చెప్పాడు.

ఆయన వ్రాసిన కాలజ్ఞానంలో ముఖ్యమైన మాటల్లో **“ప్రబోధ ఆశ్రమం వారు సప్తమి నిక్షయము సప్తమి సత్యము అని బోధిస్తారు”** అని ముందే చెప్పాడు. ఇది చెప్పేది వాళ్లు రెండు విడిగా చెప్పారు, సప్తమి అని ఒకటి ఇంకో సప్తమి అని మరొకటి ఒకటి ఒక సప్తమి ఏడు నాడీకేంద్రాల్లో ఒక నాడీ కేంద్రం ద్వారా వస్తావుంది. ఇప్పుడు మనం చాలాదూరం పోలేదు. మీరు చాలా వైద్యం తెలిసినోళ్లున్నారు అంటే డాక్టరు పని చేసే వాళ్లు ఉన్నారు శరీరం యొక్క లోపల ఏయే భాగాలు ఎట్లున్నాయి అని తెలిసిన వాళ్లున్నారు. మీకంతా తెలుసు ఈ నాడీ కేంద్రాలు ఉన్నాయి అని, ఈ నాడీ కేంద్రాల్లో ఉండే శక్తే మనకు దైవము అని తెలియదు. సరే నువ్వు ఇందువుగా, ముస్లీమ్‌గా, క్రైస్థవుడుగా ఎవరైనా గానీ ఆ శక్తే ఈ రోజు గ్రంథము వ్రాయించింది, తర్వాత ఆ శక్తే ఇప్పుడు మాట్లాడుతావుంది. రెండు విషయాలు ఇప్పుడు మళ్లీ ప్రశ్న వేస్తాము. మనం ఇప్పుడు ఉపన్యాసం చెప్పేది ఎవరు? అని అంటే ఒప్పుకుంటారా మీరు? ఒప్పుకొని తీరాల్సిందే, తప్పదు అది తెలియకున్నా ఒప్పుకోవలసిందే మీరు, సరే గ్రంథం వ్రాసింది ఎవరు? ఏడు నాడిల్లో ఉండే శక్తి కాదు, ఇప్పుడు పడిపోతాం మనం ఏడు నాడీ కేంద్రాలలో ఉండే శక్తి కాదు. ఇంతవరకు చెప్పి మళ్లీ ఏదో మారుస్తాడు అని అనుకోవద్దండి. ఇట్లే మేము చేప్పేదంతా, ఏడు నాడీ కేంద్రాల్లో ఉండే శక్తి కాదు. దాని పేరే గ్రంథము, ఏడు గ్రంథులలో ఉండే శక్తి వ్రాస్తావుంది.

అది అరచేది కదలకుండా మెదలకుండా ఉంటుంది. నీ శరీరంలో శక్తి రావాలంటే ఏడు నాడీ కేంద్రాల ద్వారా వస్తుంది. నీ శరీరంలో ఆరోగ్యం కావాలంటే ఏడు గ్రంథుల ద్వారా వస్తుంది. వాస్తవమే ఏడు గ్రంథులు ద్వారా జరిగే పని ఏమాత్రం కదలకుండా మెదలకుండా చేస్తూ ఉంటుంది, అది బయటికి తెలియదు. ఇప్పుడు నేను మాట్లాడే మాట బయట తెలుస్తావుంది కదా, ఇది నాడీ కేంద్రాలో ఉండే శక్తి ద్వారా వస్తావుంది. గ్రంథం వ్రాయాలంటే ఏడు గ్రంథుల్లో ఉండే శక్తి వ్రాస్తావుంది. దానివలన దానిని ఏమంటున్నాము గ్రంథులలో ఉండే శక్తి వ్రాస్తుంది. కాబట్టి ఏమంటున్నాము గ్రంథము అంటున్నాము. ఏడు నాడీకేంద్రాల్లో ఉండే శక్తి మాట్లాడిస్తావుంది కాబట్టి బలము అంటున్నాము. ఈ రోజు నేను గట్టిగా మాట్లాడుతున్నానంటే నాకు బలము కావాలి, ఎక్కడినుంచి వచ్చింది. నాకు బలము నేను ఉపన్యాసం చెప్పాలంటే బలము కావాలి, ఏడు నాడీ కేంద్రాల ద్వారా వచ్చింది. అది మీకు అర్థమైపోయింది ఇప్పుడు, గ్రంథం వ్రాయాలంటే నాకు ఎక్కడునుంచి వస్తుంది శక్తి? కదలకుండా మెదలకుండా ఏ మాట మాట్లాడకుండా ఏ బలము ఉపయోగించుకోకుండా చెయ్యి కదులుతూ ఉంది, వ్రాయిస్తూ ఉంది. ఆ శక్తి ఎక్కడినుంచి వచ్చింది చేతికి? గ్రంథుల ద్వారా వచ్చింది. గ్రంథుల ద్వారా వచ్చే శక్తి గ్రంథాన్నీ వ్రాయిస్తుంది. నాడీ కేంద్రాల ద్వారా వచ్చే శక్తి ఈ ఉపన్యాసం చెప్పిస్తుంది నేను ఏమి అడుగుతున్నానంటే నా చేత నువ్వు గ్రంథం వ్రాయించినా, నా చేత ఉపన్యాసం చెప్పించినా కొత్త విషయంగా ఉండాలి.

కొత్తగా ప్రజలకు అర్థం కావాలి అది తెలియని రహస్యం అర్థం కావాలి అని నేను కోరుకుంటున్నాను. కాబట్టి ఆ లోపలుండేటటువంటి అధిపతి ఏమీ చేస్తున్నాడంటే ఆయన మీకు కొత్తగా ఉండేటి విషయాన్నే

అందిస్తున్నాడు. ధ్యాసగా వినండి ఇది, కొంతమంది నిద్రపోతున్నారు, వాళ్లు దయచేసి మేలుకొని జాగ్రత్తగా వినండి. ఎందుకంటే ఇది బయట ఎవరూ చెప్పని విషయాలు. నేను ఇక్కడ చెప్పడం జరుగుతుంది. ఇది చాలా దగ్గరగా ఉంది అనుకుంటాము కానీ దూరంగా ఉండే విషయం మీకు అర్థం కానీ విషయం. శరీరంలో ఉండే గ్రంథులు వ్రాయించే దానిని గ్రంథము అంటాము. మాట్లాడించే దానిని ఏమంటున్నాము మనం నాడీకేంద్రాల ద్వారా బలాన్ని మనం మాటల రూపంగా మాట్లాడుతున్నాము, ఉపన్యాసం అంటున్నాము.

ఈ రకంగా నేను ఎన్నో ఉపన్యాసాలు చెప్పాను. అలాగే ఎన్నో గ్రంథాలు వ్రాసాను. అన్ని గ్రంథలు వ్రాసిన శక్తి ఏది? ఈ శరీరంలో ఉండేటటువంటి గ్రంథుల్లో ఉండే శక్తి. ఈ నాడీ కేంద్రాల్లో ఉండే శక్తి నాకు అవసరమే ఈ గ్రంథుల్లో ఉండే శక్తి నాకు అవసరమే, సప్తమి నిర్ణయము సప్తమి సత్యము అని వీరబ్రహ్మం గారు ఆ వాక్యాన్ని ఇక్కడ చెప్పడం జరిగింది. ఆ వాక్యాన్నీ ఈ రోజు మీకు అందించిన గ్రంథములో కూడా మేము వ్రాసాము. అది మీరు చదువుకోవచ్చు.

వీరబ్రహ్మం గారు ఏమి వ్రాసారు అనే విషయం కూడా అక్కడ ఉంది. ఈ రకంగా మనం చెప్పుకుంటూ పోతే మీ శరీరంలోకి ధ్యాస ఎప్పుడైతే వస్తుందో అప్పుడు మీకు దేవుని ధ్యానం మీద ధ్యాస కలుగుతుంది. దేవుడు అంటే ఏమి? అనే సత్యము తెలియబడుతుంది. అంతవరకు తెలియదు. మేము ఇక్కడ ఏమి చెప్పుచున్నాము. అయ్యా మీరు దేవాలయాలకు పోయి పూజలు చేస్తున్నారు. చేయండి, కానీ తెలిసి చేయండి ఏది చేసినా కానీ మేము **"దేవాలయ రహస్యాలు"** అనే గ్రంథం వ్రాసాము.

ప్రతి పనికి అక్కడ అర్థం చెప్పాము. మేము చేయద్దు అని చెప్పలేదు అర్థం తెలిసి చేయండి అది దేవునికి చెందుతుంది. అర్థం లేకుండా అక్కడికి పోయి కొబ్బరికాయాలు కొట్టి, నేను ఇది ఇస్తాను నువ్వు నాకు అది ఇవ్వు అని బేరం చేస్తే దేవునితో వ్యాపారం చేసినట్లు అవుతుంది. అది మామూలుగా పద్ధతి కాదు అని, తర్వాత ఇంకో విషయం ఏమి అంటే "చిల్లర రాళ్లను మ్రొక్కుతుంటే చిత్తము చెడునురా ఓరే ఓరే" అని బ్రహ్మం గారు ఒక పాట పాడి చెప్పినాడు. ఆ రకంగా మీరు చిల్లర రాళ్లకు మ్రొక్కొద్దు అని అసలైన దేవున్ని మ్రొక్కండి అని చెప్పాము. వీళ్లు నాస్తికత్వం బోధిస్తున్నారు అని అంటే నేను నాస్తికత్వం బోధించలేదు, అస్తికత్వాన్ని బోధిస్తున్నాను. నీకేమన్నా ఆస్తి ఉంటే ఆస్తి అంటాము. లేని దానిని నాస్తి అంటాము. నేను నాస్తికున్ని కాదు నేను ఆస్తికున్నే. మీరు అక్కడ దేవాలయం దగ్గరికి పోతే, కృష్ణుని గర్భగుడి దగ్గరికి పోతే అప్పుడు ఒక పెట్టె ఉంది అక్కడ "ఇది ఉంది" అని వ్రాసారు.

నీ దగ్గర ఏమి ఆస్తి ఉందో అది నా దగ్గర ఇది ఉంది అని నువ్వు దేవునికి ఇస్తున్నావు కాబట్టి **"ఇది ఉంది"** అని నువ్వు ఇస్తున్నావు దేవునికి కాబట్టి ఇది ఉంది అని దాంట్లో వ్రాసాము. ఆ వాస్తవమైన భావం అది హుండీ అని, డబ్బా అని ఇంకోటి అని రకరకాలుగా మనం పేర్లు పెట్టుకున్నారు అవన్ని తప్పు భావాలు. వాస్తవమైన భావం నా దగ్గర ఇది ఉంది అని చెప్పడమే నా దగ్గర ఏముంది అని చెప్పాం, మీ దగ్గర ఏముందని వేస్తారంటే ఏదో ఒకటి 10 రూపాయలో 20 రూపాయలో నూరు రూపాయలో ఏదో ఒకటి వేసి నా దగ్గర ఇది ఉంది అని అక్కడ దేవునికి ఇస్తున్నారు. నేను ఏమి చెప్పినాను నా దగ్గర ఇది ఉంది అని నా జ్ఞానాన్ని నేను బయటికి చెప్పుచున్నాను, నా దగ్గర ఉండేది ఏముంది జ్ఞానం తప్ప

ఏమిలేదు. అందువలన మీరేమి చేస్తారంటే ఈ లోపలుండేటటువంటి శక్తులు మీదకి లోపలుండేటటువంటి గ్రంథుల మీదికి ధ్యాస మళ్లించాలంటే అక్కడ ఎవరో ఒకరుండారు అని దానికంతా ఆదికర్తగా ఉండేవాడు ఒకడున్నాడు అని మీరు తెలుసుకోవాలి. ఆదికర్తగా ఉండేటటువంటివాడు రెండు రకాలుగా నాకు జ్ఞానం తెలియజేస్తున్నాడు ఒకటి గ్రంథ రూపంలోనూ, ఒకటి మాటల రూపంలోనూ మాటల రూపములో నాడీ కేంద్రాల ద్వారా గ్రంథం రూపంలో గ్రంథుల ద్వారా, అందువలన గుర్తింపుగా దానికి గ్రంథము అని పేరు పెట్టాము. ఇంతకుముందు కూడా చెప్పాము. గ్రంథుల్లో నుండి చలించబడేదే గ్రంథము అని సరే ఈ రకంగా మీకు రెండు రకాల విషయాలు జ్ఞానాన్ని చెప్పుచున్నాను అయితే ఈ జ్ఞానాన్ని చెప్పడంలో మీరు ఏమీ చేస్తున్నారంట, కొంతమంది వీళ్లు దేవతలకంతా వ్యతిరేకంగా మాట్లాడు తున్నారు తర్వాత వచ్చి ప్రత్యేకంగా మతాన్నే బోధిస్తున్నారు అంటున్నారు. ప్రత్యేకమైన మతం ఏమీ లేదు. మీకు ఏ మతముందో ఆ మతం నాది అని చెప్తున్నాము.

ఒక ముస్లీమ్ వచ్చి మీరు హిందువులు, మీరు హిందువులకు సంబంధించిన జ్ఞానం బోధించండి అంటే నేను హిందువును కాదు నేను వాస్తవమైన సత్యమైన ముస్లీమ్‌ను. నీకు తెలియని జ్ఞానమంతా నాకు తెలుసు, ఖురాన్‌లో నీకు తెలియని జ్ఞానమంతా నాకు తెలుసు. కాబట్టి నేను నిజమైన ముస్లీమ్‌ను, నీకు తెలియదు కాబట్టి నువ్వు ఇంకా తక్కువ ముస్లీమ్‌వే అని చెప్పాము. ఒక క్రైస్థవుడు వచ్చి లేదు మా ప్రభువు విషయాలు మాకు తెలుసు, మీకు తెలియవు అంటే 'ప్రభువు దేవుడు అని చెప్పేది నేను' మీరు దేవుని కూమారుడు అని చెప్పుచున్నారు. దేవుని కుమారుడు అని మీరు చెప్పుచున్నారు, నేను దేవుడు అని చెప్పుచున్నాను. హిందువుల

దగ్గరకు పోతే హిందువులు ఏమి చేస్తున్నారంటే మా మీద విరుచుకు పడుతున్నారు. ఈయన త్రైత సిద్ధాంతము అంటాడు, త్రైతసిద్ధాంతం అంటే క్రైస్థవులది, త్రినిటి అని దానిని అంటారు, దాని బోధిస్తున్నారు. అది తెలుసుకుంటే నువ్వు కూడ బాగుపడుతావు అని నేను చెప్పుచున్నాను. నేను క్రైస్థవులది బోధించలేదు నాకు మూడు గ్రంథాలు దైవగ్రంథాలే. **ప్రథమ దైవ గ్రంథము, ద్వితీయ దైవ గ్రంథము, అంతిమ దైవ గ్రంథము** అని మూడు గ్రంథాలను దైవ గ్రంథాలుగా నేను లెక్కేస్తున్నాను. మూడు గ్రంథాల్లో ఉండే విషయాలు నేను చెప్పుచున్నాను. మీకు అర్థం కాలేదు మూడు మతాలు నా మతాలే, నేను త్రిమత ఏకైక గురువు అని నాకు ఒక బిరుదు పెట్టుకున్నాను. అదన్నా చూసి మీరు బాగుపడుతారని త్రిమత ఏకైక గురువు అంటే మూడు మతాలకు ఒకే ఒక గురువు ప్రపంచంలో ఒకడున్నాడు.

ప్రపంచంలో ఏకైక అంటే ఒకడే, ఆ ఒకడు ఎవరు అంటే ప్రబోధానంద స్వామి పేరు ముందర ఆ పేరు పెట్టాము. ప్రబోధానంద స్వామి తప్ప మూడు మతాలకు గురువు లేదు. మా మతానికి నువ్వు గురువు ఎలా అవుతావు, మీ మతంలో నువ్వు ఏందో చెప్పు అంటున్నాము. మేము జ్ఞానం చెప్పి నువ్వు ఫలానది మతం అంటే అది నీ జ్ఞానం అని ఎక్కడన్నా చెప్పినాడా, దేవుడు సమస్త మానవులకు తెలియజేసినటువంటి జ్ఞానం అని చెప్పాడు. మరి నీ జ్ఞానం ఎట్లయితుంది, అది నా జ్ఞానం కూడ, నేను కూడా దాంట్లో భాగాస్తున్నే, ఖురాన్‌లో నేను భాగాస్తునే, బైబిల్‌లో నేను భాగాస్తున్నే, భగవద్గీత నాదే. నా భగద్గీతలో ఉండే విషయాలు నా ఖురాన్‌లో ఉన్నాయి, నా బైబిల్‌లో ఉన్నాయి. నేను నా నా అని చెప్పుకుంటూ పోతే మీరు వేరే వేరేగా మీరు మీరు అని ఎందుకు చెప్పుచున్నారు అని

అడుగుచున్నాను. ఇప్పుడు మీకు ఎక్కడైన బేధం ఉందా చెప్పండి మీరు బేధాలు పెట్టుకుంటున్నారు. మీరు మతాలను పెట్టుకుంటున్నారు. మతాల పేర్లు చెప్పుకుంటున్నారు. మతాల మత్తులో గందరగోళం అయిపోతున్నారు. అలా కాకుండా నేను ఏమి చెప్పుచున్నానంటే, మీ మత గ్రంథాల్లో ఒకే దేవుడు అని కాకుండా ఇద్దరు దేవులున్నారని చెప్పినారా ఎక్కడైనా ఎక్కడా చెప్పలేదు. ప్రపంచానికంతా ఒకటే దేవుడున్నాడు, వాడే సమస్తాన్ని పుట్టించాడు, నిన్ను పుట్టించినోడు వాడే. మరి వాన్ని తెలుసుకోవడంలో తప్పు ఏముంది ఒక మతానికి చెందినోడు ఇంకో మతానికి చెందినోడని ధ్యాస ఏమిలేదు.

అన్ని మతాలకు సమామైనట్టి జ్ఞానం ఇక్కడుంది. ఏ మతములో వాక్యమైన ఇక్కడ సులభంగా చెప్పబడుతుంది. ఆ మతములో అర్థంకాని వాక్యం ఏమాన్నా ఉంటే అది ఆ మతస్థులకే కానీ నాకు మాత్రం అన్ని వాక్యాలు సంపూర్ణంగా తెలుసు, నేను ధైర్యంగా చెప్పుచున్నాను. అది ఎందుకంటే నాకు తెలుసు కాబట్టి చెప్పుచున్నా అది, మీరు తెలియాలి అనుకుంటే నా దగ్గరికి రాండి మీకు సమాధానం దొరుకుంతుంది, ఏ వాక్యానికైనా వివరం మీకు దొరుకుతుంది. ఎక్కడా అర్థం కాని విషయానికైనా ఇక్కడ వివరం దొరుకుతుంది. అంత అహంకారంగా నువ్వు ఎందుకు మాట్లాడుతున్నావు అంటే అహంకారం అనేది నాలో భాగామే, నేనే మొత్తం శరీరం అయ్యి ఉన్నప్పుడు, అహంకారం నాకేందే ఉండేది శరీరం మొత్తం నేనే. అధిపతినైననప్పుడు శరీరంలో ఉండేటివన్నీ నావే బుద్ధి నాదే, చిత్తము నాదే అహం కూడా నాదే నేను అహంతోనే మాట్లాడతాను. నాకు అన్ని తెలుసు నేను శరీరమంతటా నేను ఉన్నాను. కాబట్టి నాకు అన్ని తెలుసు, శరీరమంతటా ఉంటే బైబిల్ ఉంది భగవద్గీతలో, ఖురాన్‌లో విషయం

ఎలా తెలుసు బైబిల్ చెప్పినదంతా శరీరంలో విషయమే, భగవద్గీతలో చెప్పినదంతా శరీరంలో విషయమే, ఖురాన్‌లో చెప్పినది కూడా అంతా శరీరంలో ఉండే విషయమే, శరీరము బయటికిపోతే ఏ వాక్యం కూడా ఏమాత్రం అర్థం కాదు. కాబట్టి శరీరంలో ఉండే లోపలి జ్ఞానాన్ని మీరేప్పుడైతే తెలుసుకుంటారో అప్పుడు గ్రంథములోని వాక్యము అర్థమైతుంది లేకపోతే అర్థం కాదు అని చెప్పుచున్నాము. ఇప్పుడు ప్రతి ఒక్కడు ఏమి చేస్తున్నాడు అంటే ఇది నా శరీరము అని అనుకోవడమే పెద్ద పొరపాటు. నీదే అయితే నువ్వు ఒక రోజు ఆ శరీరము నుంచి వెడలగొట్టబడతావు, శరీరము నీ సొంతం అయితే నువ్వు ఉండోచ్చు కదా. అట్లే ఎవరైనా ఉన్నారా? ఎవ్వరూ లేరు. ఆ శరీరాన్ని వదిలిపెట్టి పోవాల్సిన పని వస్తుంది. వాస్తవానికి నీవు ఎవరో కూడ నీకు తెలియదు అని ఒక గ్రంథంలో, ఒక వాక్యం నాకు కనపడతూ ఉంది. ఆ రకంగా ప్రతి మనిషికి వాడేవడో వానికి తెలియకుండా పోయింది. అయినా వాడు సొంతగా నేను ఫలానా అనుకుంటున్నాడు.

ఆ ఫలానా నువ్వు కాదు అని చెప్పుచున్నాము. మరి నేను కాదు అన్నప్పుడు నా మాటను పట్టుకొని నేను ఎవరు అనే ప్రశ్న వేసుకొని, నువ్వు వెతుకులాడుకో అప్పుడు నీకు ఖురాన్‌లో దొరుకుతుంది. భగవద్గీతలో నూటికి నూరుపాళ్ళు దొరుకుతుంది. మిగతా గ్రంథములో కూడా తెలుస్తుంది. మీకు దొరకపోతే అడగండి ఇవన్ని వీళ్ళు మతమార్పిడి కోసం చెప్పుచున్నారు అని అంటే అది పెద్ద పొరపాటు **"మతమార్పిడి దైవ ద్రోహము–మహా పాపము"** అని నేను ముందే చెప్పినాను. నువ్వు క్రైస్థవునివైతే నీ గ్రంథంలోని సత్యమును తెలుసుకో ఇంకో మతంలోకి వెళ్లవలసిన పని లేదు. నువ్వు ఇందువైతే ఇంకో మతంలోకి పోయి నేను జ్ఞానం తెలుసుకుంటాను అనేది పెద్ద పోరపాటు. నువ్వు ముందు భగవద్గీతలో

తెలుసుకో, నువ్వు ముస్లీమ్ అయితే అంతకంటే గొప్ప జ్ఞానం ఏముంది, హిందువులో చాలామంది కనీసం ఇప్పటికి 50,000 మంది నేను వ్రాసినటువంటిది **"అంతిమ దైవగ్రంథంలో జ్ఞాన వాక్యాలు"** అనే గ్రంథము చదివినారు. ఒక ముస్లీమ్ గ్రంథంలో ఇంత గొప్ప జ్ఞానం ఉందని ఇంతవరకు మాకు తెలియదు అంటున్నారు. ఖురాన్‌లో అంత గొప్ప జ్ఞానం ఉందని కొన్ని వాక్యాలకే హిందువులు పొగుడుతున్నారు. మిగతా వాళ్లు ఎవరైనా పోగడగలుగుతారా అలా ఖురాన్‌ను చూసి లేదు. కక్షలు, అసూయాలు, దౌర్జన్యాలు ఒకరికి ఒకరు చంపుకోవాలన్నా ఉద్దేశ్యం తప్ప ఇంకోటి ఏమి లేదు. ఈ రోజు అంతా అదే జరుగుతూ ఉంది.

ఈ రకంగా ఒకరిని చూస్తే ఒకరికి అసూయలు ఎందుకు వచ్చాయి? వాళ్లది వేరు, మనది వేరు అనుకుంటున్నారు. అలా వేరు అని ఎక్కడన్నా ఉందా? ఖురాన్‌లో **"సమస్త మానవులకు నేను బోధించినది"** అని అల్లాహ్ చెప్పినాడు. నేను ఒక ముస్లీమ్‌లకే అని చెప్పినాడా ఎక్కడన్నాయినా ఏమి లేదు. **"నన్ను నమ్మినోడు ఎవడైనా ముస్లీమ్"** అన్నాడు. నమ్మకము (విశ్వాసము) ఎవరికుంటే వాడు ముస్లీమ్ అన్నాడు. నమ్మకం ఉంటే వాడు నా భక్తుడు అన్నాడు. ముస్లీమ్ అంటే ప్రత్యేకమైన మతం కాదు, విశ్వాసి అని అర్థం. దేవుడిని ఎవడైతే నమ్ముతాడో వారంతా విశ్వాసులు. నేను దేవున్ని నమ్మినాను, నేను విశ్వాసిని దేవుడు చెప్పిన లెక్కప్రకారం నేను ముస్లీమ్‌నే, ఆ లెక్కకుపోతే ఏ మతంలో అయినా కానీ సమస్త మానవులకు తెలియజేయనది ఏమనగా! అని ఉంది. కానీ ఇంకోటి ఏమి లేదు కదా! అందరికీ సంబంధించిన విషయమే ఆ గ్రంథలలో ఉండేటి జ్ఞానం తెలుసుకుంటే సంపూర్ణమైన జ్ఞానం తెలుస్తుంది. అదే శరీరంలో ఉండే జ్ఞానము, శరీరంలో ఉండే జ్ఞానము అంటే మీరు చెప్పింది

మా ఖురాన్‌లో లేదే అని కొంతమంది అనొచ్చు మా బైబిల్‌లో లేదే అని కొంతమంది అడగొచ్చు, బైబిల్‌లో లేదని ఎవరు చెప్పారు? **"నేను నా తండ్రి ఏకమై ఉన్నాము"** అన్నప్పుడు నేను, నా తండ్రి అని ఎవరు? అంటున్నారు తెలుసునా? క్రైస్థవులకు తెలియదు. అది అంత లోతుగా తెలియదు, వాక్యం చదువుతున్నారు నేను నా తండ్రి ఏకమైయున్నాము అనే విషయం తెలియదు. ఇంకోచోట **"నా ప్రాణం నా చేతుల్లో ఉంది. నా ప్రాణాన్ని నేనే వద్దు అనుకుంటే అది పక్కన పెట్టగలను కానీ ఎవరూ నా ప్రాణం తీయలేదు"** అని చెప్పాడు. మళ్లీ అప్పుడు అధికారిగా ఎందుకు చెప్పాడు ఆ మాట. ఇంకోచోట నాకు తెలియకుండా నువ్వు ఏమి చెయ్యలేవని ఎందుకు చెప్పాడు. ఈ రకంగా లెక్కేసుకుంటూ పోతే మనకు తెలియకుండా ఇంకెవరో మన శరీరంలో ఉన్నారు అనే ధ్యాస పెట్టుకొని ఆ శరీరంలో ఉండే వాన్ని తెలుసుకోవాలని ప్రయత్నం చేయండి.

అనవసరంగా శ్రమ పడుతున్నారు. ఈ రోజు ఎక్కడన్నా చూడు ప్రమాదాలు జరిగినాయి అంటే దేవాలయాలకు పోయేటటువంటి వాహనాలే ప్రమాదాలకు గురి అవుతున్నాయి. ఎందుకంటే భక్తి సరిగా అక్కడ లేదు, అక్కడ చేసే పనులకు భావం సరిగా లేదు. అందువలన ఇప్పుడు మేం చెప్పే విషయం ఏమి అంటే, మీ దృష్ఠి అంతా శరీరంలోకి చూపు మళ్లించుకొండి, శరీరంలో ఉండేటటువంటి జ్ఞానం తెలుసుకొండి. ఆ రకంగా మీరు జ్ఞానం తెలుసుకుంటూ పోతే నీకు శరీరంలో ఉండే జ్ఞానమే తెలియబడుతుంది. శరీరంలో ఉండేటటువంటి అధిపతి తెలియబడుతాడు. శరీరంలోనే దేవుడున్నాడు అని తెలుస్తాడు. అందుకే **"చివరి క్షణంలో ధ్యాస నా మీద పెట్టుకుంటే నువ్వు మోక్షము పొందగలుగుతావు"** అన్నాడు. చివరి క్షణంలో ఎక్కడ పెట్టుకోవలి మనం ధ్యాస అంటే భగవద్గీతలో ఒక

విషయం చెప్పారు ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ... అని అంటే ఓం అనేటి అక్షరం మీదికి అని అంటే ఓం అనే అక్షరం గోడ మీద వ్రాసాదే కదా అంటే గోడ మీద వ్రాస్తే తూడిపేస్తే పోతుంది అది అక్షరము క్షరము అంటే నాశనమయ్యేది, అక్షరము అంటే నాశనం కానిది. క్షరము అంటే నాశనమయ్యేది అక్షరము అంటే నాశనం కానిది, తూడిపేస్తే పోదు అది మళ్లీ ఆ ఓం అనేటటువంటిది ఎక్కడుంది అంటే నీ నాడీకేంద్రాల్లో ఉంది, నీ ఏడు గ్రంథుల్లో ఉంది ఆ శక్తి, మీద నువ్వు ధ్యాస పెట్టుకోగలిగితే పెట్టుకొని శరీరాన్ని వదలగలిగితే శరీరంలో ఉండేటి శక్తి మీద నువ్వు ధ్యాస పెట్టుకొని నువ్వు శరీరాన్ని వదలగలిగినప్పుడు ఆ శరీరం అప్పడే మైతుంది. అంటే తప్పనిసరిగా నువ్వు మోక్షం పోందగలుగుతావు, ఇంకో జన్మకు పోవు, నాలోనికే వచ్చి ఐక్యమైతావు అన్నాడు.

కాబట్టి ఆ రకంగా దృష్టి రావాలంటే ఇప్పుడు మనం ఏమి చేయాలి, ఇప్పటినుండి శరీరంలోకి మనం దృష్టి మళ్లించే దానికి కావాలిసిన అవసరమైన బోధలను వింటూ పోవాలి, ఈ అవసరమైన బోధలనంతా మీకు ఇక్కడ తయారైన గ్రంథాల్లో దోరుకుతుంది, ఆ గ్రంథాలు మీరు చదువుకుంటే మీకు తెలుస్తూ ఉంటుంది, అంటే కొన్నిచోట్ల కఠినంగా చెప్పాల్సిన పని వస్తుంది, కఠినంగా చెప్పాల్సిన చోట అదే రకంగా చెప్పాము. కఠినంగా చెప్పినా కానీ ఆ వాక్యాలు మీ మంచి కోసమే, మీ చెడు కోసం ఏమాత్రం కాదు. అటువంటి వాక్యాలు చదువుకున్నప్పుడు మీకు ఇబ్బంది కలుగుతుందేమో అని మీరు అడిగినట్లుగా కాకుండా మేమే ప్రశ్నలు వేశాము, మేమే జవాబులు చెప్పాము. మీకు ఒక గ్రంథంలో కానీ ఆ ప్రశ్నలు ఎలా ఉంటాయి అంటే చాలా ఘాటుగా ఉంటాయి, ఏమాత్రము జవాబు చెప్పలేరు అనేటట్టుగా ఉంటాయి. పూర్తి విమర్శనా పూర్వకంగా ఉంటాయి, ఒకసారి

చదివి చూడండి తెలుస్తుంది. మళ్లీ అటువంటి ప్రశ్నలు మేము వేసినప్పుడు దానికి జవాబు చెప్పలేనట్టుగా ఉంటుంది. కానీ దానికి సులభంగా జవాబు చెప్పగలుగుతున్నాము, మళ్ళీ ఆ ప్రశ్నకు జవాబుంటుంది. అంత కఠినంగా అడిగి మళ్లీ మీకు జవాబు చెప్పాల్సిన పని ఎందుకు వచ్చింది అంటే జ్ఞానం అనేది అలా విమర్శనా పూర్వకంగా ఉంటుంది. కానీ ప్రతి దానికి జవాబు ఉంటుంది, జవాబు లేనటువంటిది అజ్ఞానం అయితుంది. అందువలన మా ప్రశ్నలు చాలా కఠినాతికఠినంగా ఉంటాయి. ఇప్పుడు వచ్చిన గ్రంథములో కూడా అటువంటి ప్రశ్నలుంటాయి, ఆ ప్రశ్నలకు జవాబును చెప్పడం జరిగింది అంటే అంత కఠినంగా అడగాల్సిన పని ఏమి వచ్చింది? అసలు నీకు జ్ఞానముందా, నీ త్రైతసిద్ధాంతం అంటే గొప్పది అని నువ్వు ఎలా చెప్పుచున్నావు? నీకు ఏమి నిరూపణతో చెప్పుచున్నావు? అని నిలదీసి అడిగినట్లు ఉన్నాయి.

ఒక సందర్భంలో ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేరు అనేటట్టుగా ఉంటాయి. కానీ సింపుల్‌గా ఏమి చెప్పినాము అంటే ఆ ప్రశ్న గాటైన ప్రశ్న అని మీకు కూడా తెలిసేటట్టుగా ముక్కులో వెంట్రుక పట్టుకున్నట్టు నువ్వు అడుగుతున్నావు. మూతి మీద మీసం లాగితే ఎంత బాధ ఉంటుందో అలా అడుగుతున్నావు. నువ్వు ముక్కుసూటిగా అడిగే ప్రశ్నకు నేను నాలుక సూటిగా జవాబు చెప్తా చూడు అని చెప్పాము. అటువంటి ప్రశ్నను అడిగినా ఫర్వాలేదు అటువంటి ప్రశ్ననే నాకు కావాలసింది దానికి జవాబు చెప్తాను చూడు అని చెప్పా మళ్లీ ఆ జవాబును మీరు వినగలుగుతున్నారు కదా, మళ్లీ ఆ జవాబును వినగలిగినప్పుడు ఇంత కఠినంగా ప్రశ్న ఎవరు ఏస్తారు? అంత కఠనమైన దానికి జవాబు ఎలా చెప్తారు? ఒకే వ్యక్తిలో రెండు రూపాలని మీరు ఆలోచన చేసుకోవచ్చు ప్రశ్నలుంటాయి

మళ్ళీ అటువంటి ప్రశ్నలకు జవాబు ఎలా వచ్చింది? ఇక జవాబు చెప్పలేని పరిస్థితి, నవ్వు ఏమి చెప్పినా వినము నీ గొప్ప కోసం నువ్వు చెప్పు కుంటున్నావు అని అడిగినా నేను, ఏమి చెప్పినా విననుు అన్నప్పుడు కూడా దానికి జవాబు చెప్పాము. మీరు చెప్పేదంతా మిమ్మల్ని మీరు గొప్ప చేసుకునే దానికే అని అడిగిన ప్రశ్నలు కూడ ఉన్నాయి, దానికి కూడా మేము జవాబు చెప్పాము. ప్రతి ప్రశ్నకు జవాబు చెప్పుచూ వస్తున్నాము, కానీ మీరు గ్రహించుకోగలిగితే దానిలో ఎంతో జ్ఞానముంది కానీ మాకు నమ్మకం ఏర్పడింది మీరు గ్రహించుకుంటున్నారు. ఎందుకంటే నేను ఇంతకుముందు కొంతమంది మాట్లాడినప్పుడు కొన్ని మాటలు మాత్రం విన్నాను అన్ని వినలేకపోయాను. ఆ రెండు మూడు మాటలు విన్నప్పుడే తెలిసింది వీళ్లు నాకంటే గొప్ప జ్ఞానులు అని, అంతటి గొప్పతనాన్ని మీలో కనపరచారు. గొప్పదనం కనిపించింది అంటే నేను చెప్పే మాటలన్నీ మీకు ఎక్కుతున్నాయి, కొంతమందికి ఎక్కడం లేదు అంటే విమర్శనగా చూస్తుంటారు. చూడండి వాళ్లకు అదే దృష్టి తప్ప ఇంకోక దృష్టి ఉండదు, ఇంతకుముందు ఒక పద్యం చెప్పాను అది చెప్పొచ్చో, చెప్పకూడదో అని చెప్పినాము అయినా మీరు విన్నారు.

ఒకయన ఏమి చెప్పాడంటే ముగ్గురు సిద్ధాంతకర్తల పక్కలో ఈయన ఫోటో పెట్టుకున్నాడే అర్హుడా ఈయన? సాధారణ మనిషిగా యున్న ఈయన సిద్ధాంతకర్తల ప్రక్కన ఫోటో పెట్టుకున్నాడు అని ఆశ్చర్యంగా ఆయన అంటున్నాడు. వాళ్ల పక్కలో నేనుండేదానికి అర్హుడనో కాదో అని మీకు అనుమానం వచ్చింది. నేను బట్టబయలు చేసేస్తున్నాను చూడు నా పక్కలో వాళ్లుండే దానికి వాళ్లు అర్హులో కాదో మీరు చూసుకోండి, నేను ఏమి చేస్పాల్సిన పనిలేదు మీరే చెప్పండి మీకు విషయమంతా తెలిసిపోతుంది.

ఈ రోజు నా స్థోమత ఏదో నాకు తెలుసు కానీ, మీకు తెలియాలంటే నేను కూడ కొంత గట్టిగా అరచి చెప్పాల్సిందే, అంటే నాడీకేంద్రాల ద్వారా వచ్చేటటువంటి శక్తితో చెప్పాల్సిందే ఆ శక్తితో ఉపన్యాసం చెబుతున్నాను. ఆ శక్తి శక్తే కదా అందుకే మెప్పించుకుంటుంది, మిమ్మల్ని అంతా తలకాయ ఊపేటట్టుగా చేస్తుంది. ఏమి ఫర్వాలేదు, తర్వాత గ్రంథం వ్రాస్తూ ఉంది ఆ శక్తి దాంట్లో కూడా మీతో గొప్పగా అనిపించుకుంటుంది. ఎంతటి వ్యక్తి అయినా కానీ నన్ను విమర్శించాలని చూసిన వ్యక్తి ఎవరైనా కానీ నా గ్రంథాలు చదివివాడు విమర్శించమను చూస్తాను. వాడు విమర్శించలేడు ఇక వాడెవడైనా గానీ ఒప్పుకొని నాకే ఓటు వేయాల్సిందే. మేము ఓటు వేయమని అడగం కానీ నాకు వాడు ఓటు వేస్తాడు. అటువంటివి నా గ్రంథాలు, నేను ఎక్కడా బయటికి పోలేదు. నా గ్రంథాలు బయటికి పోతున్నాయి, నా గ్రంథాలు పోతే నేను బయటికి పోయినట్టే. అందువలన నేను ఎక్కడా కనపడను అని మీకు చెప్పాను మరి మీరు నన్ను చూడాలను కుంటే ఎప్పుడైనా చూడొచ్చు నేను మిమ్మల్ని చూస్తున్నాను, మీరు నన్ను చూస్తున్నారు కానీ నేను ఫలానా అని మీకు తెలియదు. మరి అటువంటి స్థితిలో మనం ఉన్నాము ఒకొరికకరు చూసుకున్నా అర్థం కాని పరిస్థితి మనకు ఉంది. అంత అజ్ఞానంలో పేరుకొని పోయినాము, కూరుకొని పోయినాము. ఆ అజ్ఞానం నుండి బయటపడాలంటే మనం ఏమి చేయాలి? గ్రంథాలు చదువుకుంటే జ్ఞానం తెలుస్తుంది. గ్రంథాలు చదువుకుంటే అసలైన జ్ఞానం ఏదో తెలుసుంది. జ్ఞానం వల్ల మనం బయటపడవచ్చు, అంటే దానికి కొందరు ఇట్లనుకొంటారు. బయటికి పోయి పని చేసుకొంటే డబ్బులోస్తాయి, డబ్బులోస్తే హాయిగా బ్రతకొచ్చు. అన్ని పెట్టుకొని లాస్ట్‌లో ఏముంది చచ్చిపోయినప్పుడు గంధం చెక్కలతో కాల్పించుకొని చచ్చిపోవచ్చు

అంతకంటే ఏముంది అనుకుంటారు. మీ ఆలోచన మంచిదే సరే గంధపుచక్కలో కాల్చేది నిన్నా నీ శరీరాన్నా? నీ శరీరాన్ని మరి నీకేమి వస్తుంది. గంధపు చెక్కల్లో కాలిస్తే నీకు ఏమీ రాదు. నువ్వు పోయింటావు ఎప్పుడో నీ వెంట వచ్చేది ఏది కర్మ అంటే పాపం, పుణ్యం. నువ్వు చేసుకున్నా పాపపుణ్యం నువ్వెంత బ్రతికినా కానీ నీ బ్రతుకుకు సంబంధించిన దంతా ఇక్కడే నిలిచి పోతుంది. ఆ ధనమంతా ఇక్కడే నిలిచిపోతుంది, ఆ పేరు ప్రఖ్యాతులన్ని ఇక్కడే నిలిచిపోతాయి. నీ వెంట ఒక్కటి కూడా ఏమి రాదు. నువ్వు మాత్రం ఖాళీగా పోవల్సిందే, మళ్ళీ పోయి అక్కడ ఏమి చేస్తామంటే ఇక్కడ అయితే మనం భూములు కొనింటాం 120 ఎకరాలు, మనకు 5 ఎకరాలు లేదుకానీ మనం పుట్టినప్పుడు 120 ఎకరాలు కొంటాము. అక్కడ సంపాదించి ఇక్కడ సంపాందించి ఎట్లో అట్లా చేసి తెలివితో సంపాందించి 120 ఎకరాలు భూమిని నేను సంపాందించి నాను. మా నాయన 5 ఎకరాలు ఇచ్చినాడు.

నేను 120 ఎకరలు సంపాయించినాను అని గొప్పగా చెప్పు కుంటాడు, చివరకు విడిచిపెట్టి పోతాడు. ఇక్కడ చచ్చిపోయినంక ఏమైతాది 120 ఎకరాలు పోతాది. పట్టా చేపించుకుంటాడు 120 ఎకరాలు పట్టా చేపించుకొని ఉంటాడు. ఖర్చులు పొయే అన్ని పోయే అని డబ్బులు పోయే అన్ని పోయే 120 ఎకరాల భూమి పోయే, నువ్వు అక్కడికి పోయిన తరువాత బీదవాళ్ళ ఇంట్లో పుట్టింటావు. సెంటు జాగా లేదు మళ్ళీ అప్పుడు కొనాలి అనుకో మొదట నుండి మళ్ళీ కొనాలి. ఎకరా ఎకరా కొనాలి మళ్లి తీసుకుపోయి. ఆఫీసుకు పోయి సంతకం పెట్టినీ పేరు మీద వ్రాయించు కోవాలి మళ్ళీ ఏమైతాది అది నాది అనుకుంటాము. 120 ఎకరాలు పోయి చివరకు 5 ఎకరాలు సంపాందించినా బాగా సంపాదించినాను

అనుకుంటావు. ఇదంతా లేనిపోని తతంగం పడేదానికంటే జ్ఞానం తెలుసుకోవచ్చు కదా! నీ వెంట గొప్ప శక్తి వస్తుంది కదా! దైవమే నీ వెంట వస్తుంది కదా! ఇవన్నీ ఉండేటివి పోయేటివి నీకేమి ఉపయోగపడవు. దైవం నీ వెంట ఉంటే ఏమైతాది నీ కర్మలు కాలిపోతాయి, నువ్వు చేసుకున్న పాపాలు పోతాయి. దేవుడు క్షమాశీలుడు, దయాశీలుడు అని ఖురాన్‌లో చెప్పినారు. భగవద్గీతలో కర్మదహుడు కర్మ దహించి వేస్తాడు అని చెప్పినారు. ఇంకా బైబిల్‌లోకి పోతే పాపక్షమాపణ ఉంది నీకు, నువ్వు ఎంత పాపం చేసుకున్నా క్షమాపణ ఉంది అన్నారు.

జ్ఞానం తెలుసుకోగలిగితే, తెలియకపోతే ఏమి చేయలేము "నేను నా తండ్రి ఏకమైయున్నాము" అనే విషయం తెలిస్తే నీకు క్షమాపణ ఉంది. ఇక్కడ ఏమి చెప్పినాడు **"నా నిబంధన రక్తం వల్ల మీకు పాపం కడిగి వేయబడుతుంది"** అన్నాడు, కొట్టివేయబడుతుంది అన్నాడు. నా రక్తంతో అని చెప్పలేదు. ఇప్పుడు క్రైస్థవులంతా ఏమి చెప్పుచున్నారు? ప్రభువు రక్తంతో మన పాపమంతా కడుక్కుంటారు అంటే ప్రభువు రక్తం ఎక్కడున్నది ఆ రోజే అది కారిపోయింది. ప్రభువు రక్తంతో కడుక్కునేదానికి ఎక్కడా అది సంబంధం లేదు. ప్రభువు రక్తం ఎంతమందిని కడుగుతుంది. అలాగైతే ఆయన చెప్పిన వాక్యం ఎటువంటిది 'నా నిబంధన' అనేది గాలిలో కలిపేసి వాళ్లు రక్తం అంటున్నారు. అక్కడ బాగా స్పష్టంగా చెప్పినాడు నా నిబంధన రక్తము అనగా బంధం లేనటువంటిది, నా శరీరంలో ఉండే సారాంశము అంటే నా జ్ఞానం. నా జ్ఞానం ఏం చేస్తుంది మీకు, మీ కర్మను లేకుండా చేస్తుంది, మీ పాపాన్ని క్షమించి వేస్తుంది. మీరు అనుభవించకుండా చేస్తుంది. ప్రత్యక్షంగా చూపించాడు. గ్రుడ్డివాని కనుల మీద చేతులు పెడితే వానికి చూపు వచ్చింది, కుంటివాడు లేచి నడిచిపోయేటట్లుగా చేసాడు.

అంటే అటువంటి పాపం నుంచి కూడా క్షమించబడినారు. అటువంటి క్షమాపణలు కూడ కొన్నిసార్లు ప్రత్యక్షంగా చేసి చూపించి ఇది నిజమైన జ్ఞానం అని ఆయన ఆ రోజు చెప్పాడు. మళ్లీ అంత గొప్ప జ్ఞానాన్ని మనం ఎందుకు తెలుసుకొకూడదు? నువ్వు హిందువైతే భగవద్గీత చదువుకో, నువ్వు క్రైస్థవుడైతే బైబిల్ చదువుకో, బాగా సంపూర్ణంగా నీకు అర్థమయ్యేటట్లుగా ఇంకో గ్రంథం వద్దు. నువ్వు ముస్లీమ్ అయితే ఖురాన్ మించినది లేదు. దానిని చదువుకో కానీ ఖుర్ఆన్ని ప్రక్కన పెట్టి హదీసులను ముస్లీమ్‌లు చదువుచున్నారు, ఆచరించుచున్నారు. తర్వాత హిందువులైతే భగవద్గీతను పక్కన పెట్టి వేదాలను పట్టుకొన్నారు. క్రైస్థవులు ప్రభువు చెప్పిన వాక్యాలు చదవకుండా ఆయన చెప్పిన నాలుగు సువార్తలు అంటే ప్రత్యేకమైన సువార్తలు చదవకుండా 62 పాఠాలు చదువుతారు. అది ఇది అని మిగతా గ్రంథంలో వాక్యాలు చెప్పుకుంటారు. ముఖ్యముగా ఈ నాలుగు సువార్తలలో వాక్యాలు చెప్పుకోవడం లేదు.

ఈ రకంగా దేవుని జ్ఞానాన్ని విడిచిపెట్టి ప్రక్క మార్గంలో మనం పోతున్నాము. అటువంటి ప్రక్క మార్గంలోకి పోకుండా మీరు అసలైన మార్గంలోకి రావాలంటే, నీవు జ్ఞానం తెలియని వ్యక్తివైనా ఇప్పుడినుండి జ్ఞానంలోకి వచ్చేదానికి పూర్తి అవకాశముంది, ఏ అర్హతలు అవసరం లేదు. బయట ప్రపంచంలో ఒక కాలేజీలో చేరాలంటే మందు నీకు పరీక్ష పెడతారు. ఒకటి పరీక్ష వ్రాయమని నువ్వు ఈ కాలేజీలో చదివేదానికి అర్హుడువో కాదో చూసి వాడు మార్కులు వస్తే చేర్చుకుంటాడు లేకపోతే లేదు. అది బయట ప్రపంచం చదువు, కానీ జ్ఞానం దగ్గరికి వస్తే ఈ చదువు నేర్చుకునే దానికి ఈ బ్రహ్మవిద్యను నేర్చుకునే దానికి, నీకు ఏ పరీక్షలు అవసరం లేదు. ఎప్పుడూ సంపూర్ణంగా ఈ జ్ఞానం తెలుసుకునే దానికి అవకాశం

ఉంది. నీకు ఏ కర్మ దీనిని నిర్ణయించ లేదు. కాబట్టి నీకు ఎప్పుడైతే శ్రద్ధ ఉందో అప్పుడు జ్ఞానాన్ని తెలుసుకోవచ్చు. ఏమి తెలియని వ్యక్తి నాకేం జ్ఞానం తెలియదు అంటే ఏమి తెలియకుండడమే మంచిది. ఇంతకుముందు జ్ఞానం తెలిసింటే ఇంకో దాంట్లోకి నువ్వు పోయేవాడివి. కాబట్టి ఇప్పుడు నీకు ఏమి తెలియదు కదా!

ఇప్పుడు మంచి దాంట్లోకి వచ్చేదానికి అవకాశముంది. లేదు నేను దాంట్లో ఉన్నా, దీంట్లో ఉన్నా అంటే ఇక దాంట్లోనే ఉంటావు నువ్వు బయటకి రాలేవు. కోడి పిల్లను గంప కిందపెడితే బయటికి రాలేకపోతుంది కదా, ఆ రకంగా ఇంకో ఆయన వస్తాడు, నా దగ్గరికి నేను ఉపదేశం తీసుకున్నాను మళ్లీ మీ దగ్గర ఉపదేశం తీసుకొవచ్చునా అని, నువ్వు తీసుకున్నావు కదా మళ్లీ తీసుకోవాల్సిన అవసరం ఏముంది నీకు. అసలుకు ఇక్కడ ఇస్తుంటే ఉపదేశం నీకు కావాలి అనుకోవచ్చు, ఇక్కడ ఇచ్చేది లేదే ఇచ్చేవాళ్ళు దేశమంతా ఉన్నారు. ఎక్కడ చూసినా ఉపదేశం అని కానీ ఇక్కడ ఉపదేశాలు ఇవ్వబడవు, జ్ఞానం చెప్పబడును. ఏ ఉపదేశాలు ఇవ్వబడవు జ్ఞానం మాత్రం చెప్పబడును. కాబట్టి ఉపదేశం లేదు అసలు మా దగ్గర ఇచ్చేదానికి లేదు. మాకే లేదు ఉపదేశము, నీకు ఇచ్చేదానికి అవకాశం లేదు, నువ్వు జ్ఞానం కావాలిస్తే చెప్పు మేము ఇస్తాము అని చెప్పాము. అందువలన ప్రతి మనిషి జ్ఞానం తెలుసుకునే దానికి అవకాశం ఉంది. దానికేమన్నా అర్హతలు కావలేమో అని అనుకోకుండా, దేవుడు ఏం చేసాడంటే ముందుగా నువ్వెట్లున్నా ఫర్వాలేదు అని చెప్పాడు. ఒకడు ఏం చేస్తున్నాడంటే దొంగతనం చేశాడు. దొంగతనంతోనే కొంత జీవితం గడిపినాడు. తర్వాత జ్ఞానము దేవుడు మతికి వచ్చేసరికి ఏమిటి? ఇది అని సరే ఇదంతా బాగానే ఉంది కానీ దేవుడు గొప్పవాడే, జ్ఞానం గొప్పదే అన్ని బాగానే ఉన్నాయి.

నేను దొంగను కదా నేను ఎలా అర్హుడుని అవుతాను. ఏదో మంచివాళ్లకు అయితే జ్ఞానం అబ్బుతుంది మాలాంటి వాళ్లకు ఎలా అబ్బుతుందని వాడే మార్కు వేసుకున్నాడు. నేను పనికిరాను అని అనుకున్నాడంట.

మేము ఏమి చెప్పుచున్నామంటే నువ్వు కూడా పనికొచ్చేవానివే. దొంగవైనా ఫర్వాలేదు నువ్వు దొంగతనం చేస్తే నీకెందుకు తెలియదు. దొంగతనం వేరు, జ్ఞానం వేరు అది నీ కర్మ కొద్దీ జరిగేది. కాబట్టి ప్రపంచంలో నువ్వు జ్ఞానం తెలుసుకుంటున్నావా లేదా అదే ముఖ్యం, కాబట్టి నువ్వు దొంగను, బజార్లో కూలి పని చేస్తున్నాను, మూటలు మోసి బ్రతుకుతున్నాను అనుకోవద్దు. అది ఏదన్నా కానీ నీకు సంబంధం లేదు. నువ్వు జ్ఞానం తెలుసుకోవాలి, శ్రద్ధ ఉంటే నువ్వు జ్ఞానివైతావు, ఈ రోజు పెద్ద పెద్ద స్వామిజీలున్నారు, పెద్ద పెద్ద ఆశ్రమాలు పెట్టుకున్నారు, పెద్ద పెద్ద సంస్థలు పెట్టుకున్నారు. మళ్లీ వాళ్లంతా గొప్పవాళ్లు, వాళ్ల ముందర నా జ్ఞానం ఎంత అని నువ్వు అనుకోవద్దు. నీ జ్ఞానం ముందు వాళ్ల జ్ఞానం ఎంత అని నువ్వు ప్రశ్న వేసుకో, చూసుకో నీకే తెలుస్తుంది.

నీకు తెలిసినంత వాళ్లకు తెలియదు అని తెలుస్తుంది, ఇప్పుడు మీరైతే కొంతకాలం నుండి ఒక సంవత్సరం కాలం నుండి ఇక్కడ జ్ఞానం తెలుసుకున్నారనుకొండి. కనీసం ఒక 10 గ్రంథములు చదివారు అనుకొండి ఈ 10 గ్రంథములు సంబంధించిన జ్ఞానం వాళ్ల దగ్గర ఉందా? అని లెక్కేసుకొండి మీరు అట్లన్నా కాని ఆ 10 గ్రంథములు సంబంధించిన జ్ఞానం కూడా వాళ్ల దగ్గర ఉండదు. అటైనా నువ్వు గొప్పవానివే కదా ఆ 10 గ్రంథములు చదివినోనివి, అలా ఎందుకు అనుకోకూడదు. కానీ నువ్వు ఏదో నేను ఈ పని చేసుకునేవాన్ని, ఆ పని చేసుకునేవాన్ని నాకు ఇది అబ్బుతుందా అనుకొవద్దు, ఒకరు వ్యాపారం చేస్తుంటారు. ప్రొద్దున లేచిన

దగ్గర నుండి మోసం చేయాలి ఆ వ్యాపారంలో మోసం చేసేవాన్ని అయితే జ్ఞానము నాకెట్లా అబ్బుతుంది అని అనుమానం వస్తుందేమో అని దేవుడే ఏమి చేసాడంటే ఆయన జీవితంలో మోసం పని కూడా చేశాడు. చేయలేదా కృష్ణుడు చేసాడు. బయటి ప్రపంచములో మీరు ఏమి చేస్తారో అవన్ని చేసాడు. కాబట్టి జ్ఞాని అజ్ఞానివలే ప్రవర్తించి, వానిని కలవర పెట్టుకోకుండా నువ్వు జ్ఞానం తెలుసుకునే దానికి అర్హుడవని నిరూపించెటట్టుగా ఆయన చూపించాడు. కాబట్టి ఆయనును ఆదర్శంగా తీసుకోని మళ్లీ ఆయన అన్ని పనులు చేసాడు జ్ఞానమే సంపూర్ణంగా చెప్పాడు. మళ్లీ నువ్వెందుకు తెలుసుకోకూడదు.

నువ్వు ప్రయత్నం చేయి నేను అర్హుడిని కాదు అనేటటువంటి ఆ భ్రమను నువ్వు తీసేసుకో, జ్ఞానం తెలుసుకునే ప్రయత్నం చేయి. అతి తక్కువ కాలంలోనే గొప్ప జ్ఞానివి కాగలవు. నేను దేవున్ని విమర్శించాను మళ్లీ ఇప్పుడు దేవుని దగ్గరకు పోయేదానికి ఎలా అవుతుంది? అంటే సరేలే, బిడ్డ ఏమి చేస్తాడంటే తండ్రి ఎత్తుకున్నప్పుడు కాలుతో తంతాడు. ఎత్తుకొన్నప్పుడు కాళ్ళు తగులుతాయి తంతాడు. బిడ్డ కాలుతో తన్నాడు అని పక్కన పడేస్తాడా వాడు పారేయడు. వానికి తెలియదు కదా! అనుకుంటాడు. వానికి కాలు తెలియదు, ముఖం తెలియదు ఏమి తెలియదు. కాబట్టి తన బిడ్డ ఎన్ని తప్పులు చేసిన తండ్రి ఎలాగైతే క్షమించుకుంటాడో ఆ రకంగా దేవుడు మనం తెలియకుండా ఎన్ని చేసినా కానీ, ఎన్ని మాట్లాడినా కానీ అవన్ని తెలియనితనంతో చేసినవి. నువ్వు ఇప్పుడు జ్ఞానం తెలుసుకో అవన్ని వదిలేసేయి. క్షమించేవాన్ని నేను ఉన్నాను కదా, దైవజ్ఞానము ఒక్కటే తెలుసుకోమని అని అడుగుతున్నాను అంతే, నీకు చెప్పేది అదే నువ్వు జ్ఞానం తెలుసుకో నేను ఏమి అడగలేదు. కొంతమంది ఏం చేస్తారంటే

లేదు అక్కడ ఏదో తెలుసుకుందాం అని పోతే ప్రతినెల పోవాలంటే చార్జీలు ఎక్కడనుంచి వస్తాయి పని విడిచిపెట్టి పోవాలి, అని అనుకోవద్దు, ఇక్కడికే రమ్మని చెప్పలేదు. నువ్వెక్కడున్నా జ్ఞానం తెలుసుకోవచ్చు.

నీ ఇంటి దగ్గర నువ్వు జ్ఞానం తెలుసుకునే దానికి ఈ రోజు జ్ఞానమును గ్రంథరూపంలో దేవుడు పంపించాడు. సరే నా దగ్గరికి వస్తే మాటలు రూపంలో పలికిస్తున్నాడు. ఆయన సరే వచ్చినోళ్లు వినోచ్చు లేకపోతే ఇంటిదగ్గర వినచ్చు, నేడు ఇంటర్‌నెట్ ద్వారా నేను ఇప్పుడు చెప్పే ఉపన్యాసం ప్రపంచమంతా పోయేటట్లుగా చేశారు. అది అందరూ చూస్తున్నారు, వింటున్నారు. మీకు జ్ఞానం తెలుసుకోమని చెప్పాను కదా. ఇలా ఆటంకాలు కలుగుతాయనే దేవుడు ప్రత్యక్షంగా తెలియజేసేది మీకు ఇప్పుడు. ఇలా ఆటంకాలు కలిగినా కానీ, మీ శ్రద్ధను మాత్రం మళ్లీంచు కోకుండా దేవున్ని తెలుసుకోవాలని మళ్లీ రెండోసారి చెప్పుచున్నాము. కొన్ని కష్టాలు ఉంటాయి. అయినా మీరు భయపడొద్దు అడిగి ఇంకా తెలుసుకునే దానికి ప్రయత్నం చేయండి. నన్ను నడిపించేవాడు కూడా లోపలవాడే. మేము చెప్పేవాళ్లం కాదు ఆయనే గట్టిగా చెప్పి, ఊరకనే ఉంటాడు. మళ్లీ ఇంటి దగ్గర ఉంటాడు మేము ఇబ్బందిపడాలి అని మీరు అనుకోవద్దండి. మీ వెంట ఉన్నాడు ఇప్పుడు చెప్పేవాడు ఎవడైతే ఉన్నాడో వాడు మీ వెంట ఉన్నాడు, మీరు పడే అగచాట్లన్ని చూస్తున్నాడు. మీరు దేవుని కోసం, జ్ఞానం కోసం ఎంత మీరు శ్రమపడుతున్నారో చూస్తున్నాడు. కాబట్టి మీరేమి మీ శ్రమ వృథా పోదు, మీరు ఎంత పని చేసినా అంతా రికార్డ్ అవుతుంది. ఖుర్‌ఆన్ గ్రంథములో 2వ సూరా, 186వ ఆయత్‌లో **"మీకు నేను అత్యంత సమీపమున ఉన్నానని"** చెప్పాడు. బైబిలులో **"నీ పొరుగు వానిగా ఉన్నానని"** చెప్పాడు.

దేవుని విషయంలో మాత్రం ఎవరూ నష్టపోరు. మీ ప్రయత్నం మీరు చేయండి. దేవుని జ్ఞానం తెలుసుకోండి. మీరు చాలా దూరప్రాంతాల నుంచి ఇక్కడ తెలుసుకోవాలని వచ్చారు. మేము మీకు తగినంతా జ్ఞానాన్ని అందిస్తున్నామో లేదో అని మటుకు ఒక ప్రక్క అనుమానం ఉంటుంది. అందిస్తూన్నామనే తృప్తి కూడా ఉంది ఎవరూ చెప్పని విషయాలు మేము ప్రత్యేకించి చెప్పుచున్నాము. ఆ విషయాలు మీరు గ్రహించుకొని ఈ విషయాలు బాగా జీర్ణింప చేసుకొని మీరు లాభాన్ని పొందుతారని మేము అనుకుంటున్నాము తర్వాత రాబోయే, గ్రంథాల్లో ఇట్లే గొప్ప రహస్యాలు అందివ్వాలని చెప్పే ఉపన్యాసాలు గ్రంథులు ద్వారా వచ్చేటటువంటి గ్రంథాలు కానీ, నాడుల ద్వారా వచ్చేటటువంటి ఉపన్యాసాలు కానీ మీకు మంచి జ్ఞానాన్ని అందించాలని కోరుకుంటూ ఈ సమావేశాన్ని ఇంతటితో ముగిస్తున్నాము. మీకు నేను ఇంతకు ముందే చెప్పాను ఈ దర్శనం అనేది వద్దు అని, దర్శనం అంటే కనిపించడం అని దర్శించడం చూడడం అని, అంటే దేవుడు కనపడనివాడు, ఆయన జ్ఞానం కనిపించేది. మనం కోరుకోవాల్సింది దానిని, కనిపించే నన్ను కాదు. కాబట్టి ఆ ధ్యాసతో మీరు ఈ దర్శనం అనేదానిని మానుకోండి. అవసరం వస్తే నేనే మిమ్మల్ని దర్శనం చేసుకుంటాను. నేను పిలిచి మాట్లాడిస్తున్నాము కదా! మిమ్ములను అవసరం వస్తే, మీ దర్శనం నేను చేసుకుంటాను. మా దర్శనం మీకు అవసరం లేదు. అందువలన మీరు సంతృప్తిగా జ్ఞానం తెలుసుకోవాలని కోరుతూ ఇంతటితో ముగిస్తున్నాము.

# 92) 6-3=6

**(తేది 13.06.2014)**

రాబోయే పౌర్ణమి గురుపౌర్ణమి లేదా వ్యాసపౌర్ణమి అవుతుంది. దానికంటే ముందు వచ్చేటటువంటి ఈ పౌర్ణానికి మీకు ఒక చిన్న గ్రంథాన్ని అందించాము. “దేవుని గుర్తు 963” అనేది. ఇంతకుముందు వ్రాసినటువంటి గ్రంథమే అది. 64 పేజీల గ్రంథానికి 32 పేజీలు కలిపి ఇంకొక పెద్ద గ్రంథము చేసినాను. దానిని 32 పేజీల గ్రంథము కొత్తగా వచ్చింది అనుకోండి, దానిని మీరు చదువుకోవచ్చు. తరువాత వచ్చే నెలకు **“మత మార్పిడి-దైవద్రోహము”** అనే ఒక గ్రంథము వస్తుంది మీకు. అంటే ముందే పేరు చెప్పుతున్నాము. మేము ఎప్పుడు చెప్పినాగాని వ్రాయబోయేముందు ఒక పేరు పెట్టుకొంటే ఆ పేరుకు తగినట్టు వ్రాస్తామన్నమాట. నేను ఏ గ్రంథానికైనా ముందు మేము పేరు పెడుతాము. సరే, ఇప్పుడు ఆ గ్రంథము వచ్చినప్పుడు దానిగురించి చెప్పుతాము. ఇప్పుడు ఈ గ్రంథములో ఉండే విషయాలు కొన్ని తీసుకొని చెప్పుతాము. దీనిలో పోయిన నెల మీకు 3 6 9 (మూడు,ఆరు,తొమ్మిది) విశిష్టత గురించి కొంత తెలియజేశాను. అంటే 3 6 9 లో ఉండే గొప్పతనాన్ని గురించి మీకు కొంత తెలియజేయడము జరిగింది. తరువాత అందులో చెప్పని విషయము ఏమి అంటే మూడుకు గానీ, ఆరుకుగానీ, తొమ్మిదికిగానీ మూడిటికి ఒక ప్రత్యేకత ఉంది అని చెప్పడమైతే జరిగిందిగాని, ఆ మూడిటిలో ఏమి ప్రత్యేకత ఉంది అని అంటే మూడిటికి మూడు కొమ్ములు ఉంటాయి. ఒక కొమ్ము జీవాత్మకు, ఒక కొమ్ము ఆత్మకు, ఒక కొమ్ము పరమాత్మకు గుర్తు. ఆ రోజు ఈ మూడు కొమ్ములు ఉండాయనే విషయము చెప్పలేదు. సాధారణముగ చెప్పినానుగాని

ప్రత్యేకించి మూడు కొమ్ములు ఉన్నాయని చెప్పలేదు. సరే, ఒక 5,6 సంవత్సరముల క్రితము హైదరాబాదులో ఎవరో ఒక బోర్డును చూసి సృష్టికర్త కోడ్ 666 అని వ్రాసి ఉంటే దానిని చూసి, ఇది తప్పు, దేవునికి ఈ పేరు పెట్టకూడదు, దేవుని పేరు ప్రత్యేకమైనది, దేవుని గుర్తు ప్రత్యేకమైనది. 9 అనేదే దేవుని గుర్తు. తరువాత దేవుడు మూడుగ విభజించినాడు కాబట్టి 6,3 అని మధ్య మధ్యలో విభజించినాడు కాబట్టి 963 అనేదే దేవుని గుర్తు అని మనము ఒక గ్రంథమే వ్రాసి విడుదల చేయడము జరిగింది. కానీ "మొప్పికి మొగలి రేకు ఇస్తే మడిచి ఎక్కడో పెట్టుకున్నాడంట" అని చెప్పుతారు సామెత.

ఆ రకంగ నేను ఏమి ఇచ్చినానో దాని ప్రత్యేకత తెలియని వాళ్ళు ఏమిచేశారంటే ఏ మాత్రము దాని విలువ తెలియకుండా మాట్లాడి నారు, అది క్రైస్తవుల గ్రంథము అని. అంటే వీళ్ళను ఏమనాలి అని అంటే మొప్పి అనేవాడు ఎట్లుంటాడో, మొగలి రేకుకు ఎంత విలువ ఇస్తున్నాడో, అంత విలువ ఇచ్చినారు ఈ గ్రంథానికి అని అర్థమయినది. ఆ హిందువులే ఏమన్నారు? ఇది క్రైస్తవుల గ్రంథము అన్నారు. అంటే వీళ్ళు ఎట్లావాళ్ళంటే చూసుకోండి మరి! హిందూ ధర్మము బాగుపడాలి అంటే ఎట్లా బాగుపడతది! హిందువులుగ ఉన్నవాళ్ళు మేము హిందూ రక్షణ చేస్తాము అంటారు. ఒక్క హిందూ ధర్మము కూడ వారికి తెలియదు. హిందూ ధర్మాలు తెలియనప్పుడు హిందూ సమాజము అనేది రక్షించబడదు. కాబట్టి హిందూ సమాజము రక్షించబడాలి అంటే హిందూ ధర్మము తప్పనిసరిగా తెలిసి వుండాలి ప్రతి మనిషికి. తెలియనివాడెవడూ రక్షించలేడు. ఆ రోజు హిందూ ధర్మసూత్రము ప్రకారము భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగములో 16,17 శ్లోకాలలో చెప్పినటువంటి సారాంశాన్ని బట్టి 963 అని చెప్పడమే

కాక ఆ శ్లోకములో ఏ విధముగ 963 అన్వయించింది అనేటటువంటి దాని గురించి వివరముగ చెప్పాము. ఏది కూడ ఊరకనే మొండిగ చెప్పకుండ వివరముగ చెప్పాము. అంటే ఈ విషయాన్నే మనము 5,6 సంవత్సరముల క్రితము ఒక గ్రంథరూపములో చెప్పితే, ఇదే విషయాన్నే నూటా యాభై (150), వంద(100) సంవత్సరముల క్రితము కొంతమంది శాస్త్రవేత్తలు ఈ 9 6 3 అనేది చాలా గొప్పవి అని చెప్పారు, మూడు సంఖ్యలలో.

ఇప్పుడు కొత్తగా ఇచ్చిన **'దేవుని గుర్తు'** అనే గ్రంథములో 'నికోలాటెస్లా' అనే శాస్త్రవేత్త ఏమని వ్రాశాడంటే ఈ 3 6 9 అనేది సృష్ఠికి మూలము. ఈ 3 6 9 గురించి సృష్ఠిరహస్యాన్ని తెలుసుకోవచ్చు అని చెప్పినాడు. ఈ శాస్త్రవేత్త మనము చెప్పక పూర్వమే ఎప్పుడో చెప్పినాడు. మనకు తెలియదు ఆ విషయము. మనము ఏమి చేసినాము అంటే ఐదారు సంవత్సరముల క్రితము 3 6 9 గురించి చెప్పాము. అంటే 9 చాలా విశిష్టమైనది, 6 ఆత్మకు సమానము, 3 జీవాత్మకు సమానము అని మనము చెప్పుకోవడము జరిగినది. ఈ 3 6 9 యొక్క విశేషత ఆ రోజు శాస్త్రజ్ఞులే తెలియజేశారు. నేను ఏదో చెప్పితే ఈయన ఏదో సరిచేసి చెప్పినాడు అనుకోకుండ వాళ్ళు ఈ రోజు సాక్ష్యముగా నిలబడినారు. అంటే మేము ఏమి చెప్పినాగాని శాస్త్రవేత్తలు శాస్త్రముగా దానికి నాకంటే ముందో నా కంటే తరువాతో చెప్పడము జరుగుతావుంది. నేను ఈ మధ్య చెప్పాను పురుషకణముతో సంబంధము లేకుండా స్త్రీ గర్భము ధరించవచ్చు. ఇంతకుముందు జరిగినది ఆ విధముగా అని చెప్పాము. బయటికి ఏ పరిశోధనా చెయ్యలేదు. ఎవరికీ ఏ పరిశోధనా కనిపించదు. ఏమి పరిశోధన చేసినాము అంటే, మెదడులోనే పరిశోధన చేశాము. అంతర్ముఖముగనే పరిశోధన చేసి, ఆ విషయాన్ని తెలియ చెప్పాము. తెలియచెప్పిన తరువాత

ఒక నెలకు, ఒక పేపరులో ఒక స్టేట్‌మెంట్ వచ్చింది. అమెరికా శాస్త్రవేత్తలు ఓ విషయాన్ని కనుగొన్నారు అని, ఏ విషయాన్ని కనుగొన్నారు? పురుష కణముతో సంబంధము లేకుండా చాలామంది గర్భము ధరించినట్లు వాళ్ళు నిరూపణ తీసుకువచ్చారు. పరిశోధన చేసి కనుగొన్నార్నమాట. అంటే మేము చెప్పిన విషయమే తరువాత వాళ్ళు చెప్పడము జరిగింది. అట్ల నేను చెప్పిన తరువాతకానీ, అంతకంటే ముందుకానీ చెప్పడము జరిగింది. కానీ వాళ్ళు ఏమి చెప్పినారు అన్న విషయము నాకు తెలియదు.

నూటయాభై సంవత్సరాల పూర్వమే నాకంటే ముందే ఈ 3 6 9 విషయాన్ని గురించి శాస్త్రవేత్తలు చెప్పారు. ఆ చెప్పినప్పుడు మనకు వాళ్ళు ఏమి చెప్పినారో తెలియదుగానీ తరువాత మధ్యలో మనమేమి చేసినామంటే ఆధ్యాత్మికరీత్యా, జ్ఞానాన్ని అనుసరించి నేను చెప్పడము జరిగింది. వాళ్ళు ఏ ఉద్దేశ్యముతో చెప్పినారో, ఏ భావముతో చెప్పినారో నాకు మాత్రము తెలియదు. తెలియకుండా మేమేమి చెప్పినామంటే మా ఉద్దేశ్యము ప్రకారము జ్ఞానరీత్యా, సంపూర్ణమైన జ్ఞానము ఇది అని చెప్పడము జరిగింది. ఈ రకంగా వాళ్ళు ఆ రోజు చెప్పడమే కాకుండా వాళ్ళు చేతులతో బయటికి గుర్తులు చూపించినారన్నమాట. ఏమి చూపించినారు? అని అంటే ఒకాయన ఏమి చెప్పినాడంటే వెలిగే బల్బును చూపించాడు. ఈ గ్రంథములో ఒక బొమ్మ ఉంది. వెలిగే బల్బును చూపించి మళ్ళీ ఆ తరువాత ఏమి చేసినాడంటే తలవైపు మూడువేళ్ళను చూపించాడు. మూడు వేళ్ళనే ఎందుకు చూపించాడు? వెలిగే బల్బును ఎందుకు చూపించాడు? నికోలాటెస్లా అనే అతను ఓ ఫోటో దిగినప్పుడు ఆ ఫోటోలో ఈ చిత్రము ఉందన్నమాట. ఓ బల్బును ఎడమచేత్తో పట్టుకొని, కుడిచేత్తో మూడు వేళ్ళను తలవైపు చూపించడము జరిగింది.



**"If you only knew the magnificence of the 3, 6, and 9, then you would have a key to the universe."**

**"3, 6 మరియు 9 యొక్క విశేషతను తెలుసుకొంటే విశ్వము గురించి తెలుసుకోగల అవకాశము కలదు."**

**- నికోలా టెస్లా**

ఈ రకంగా ఎందుకు చూపించాడు? అంటే ఆ రోజు ఆయనకే తెలుసు. మనకు ఈ రోజు తెలియదు కదా! అది ఎందుకు చూపించినాడో? అనే ప్రశ్న వచ్చింది మనకు. ఎవరికైనా వస్తుంది చూస్తే. కానీ ప్రశ్న వేస్తే జవాబు ఉండదు. జవాబు ఎవరు చెప్పాలి? చూపించినవాడే దాని జవాబు చెప్పాలి, అంతే కదా! లేకపోతే మనము ఎవరితో అనుకుంటే ఎట్లైతాది? కుదరదు. తరువాత 'ఐన్‌స్టీన్' అనే ఇంకొకాయన ఇంకొక బొమ్మను చూపించాడన్నమాట. అంటే అతను ఫోటో. అతను బోర్డు మీద ఏమి వ్రాశాడంటే **"6–3=6"** అని వ్రాసినాడు. ఇది గణిత శాస్త్రములో అంతా తప్పే. అంటే అంత పెద్ద శాస్త్రవేత్త తెలిసి తప్పు వ్రాస్తాడా? అంటే తప్పు వ్రాయడు. కానీ ఏమి వ్రాసినాడాయన "6–3 = 6" అని వ్రాసినాడు. 6 రాసి బోర్డు మీద మళ్ళ ఏమి చేసాడంటే "= 6" ప్రక్కన అట్ల పెట్టి, "6–3" క్రింద అండర్‌లైన్ చేశాడు. అండర్‌లైన్ చేయడమే కాకుండా, అది




- ఐన్‌స్టీన్

చూపిస్తూ తను ఓ ప్రక్క ఏమి చేశాడంటే, నోట్లోనుంచి నాలుక బయట పెట్టి చూపించాడు. అంటే ఆయన నాలుక బయట పెట్టి చూపించడము కారణము ఏమి? ఈ అండర్‌లైన్ చేయడము కారణము ఏమి? ఆ వ్రాసిన అక్షరాలకు కారణము ఏమి? ఆ వ్రాసిన అక్షరాలు ఏమిటివో మనందరికి తెలుసు. 6,3 అనేవి. 6 లో 3 తీసివేస్తే 6 ఎట్లా అవుతుంది? 6 లో 3 తీసివేస్తే మూడే అవుతుందిగాని 6 ఎట్లా అవుతుంది? అనే ప్రశ్న అందరికి వస్తుంది. కానీ మళ్ళీ ఆ ప్రశ్నలకు జవాబు ఎవరు చెప్పాలి? ఆ రోజు ఆ వ్రాసినవానిని అడుగవలసిందే మనము. అంతే కదా! వ్రాసినవాడు వంద సంవత్సరాల క్రితమే చనిపోయాడు. ఇంకొకాయన సుమారుగా డెబ్బై సంవత్సరాల క్రితమే అంటే దగ్గర దగ్గర 1955లో చనిపోయినాడు.

అంతకుముందు ఒకాయన చనిపోయాడు. మళ్ళీ వీళ్ళెవరు చెప్పేదానికి అవకాశమే లేదు, మనకు అందుబాటులో లేరు వాళ్ళు. వీళ్ళు చెప్పలేరు ఎట్ల. మళ్ళీ ఈ విషయము మనకు ఎలా తెలుస్తుంది? అని ప్రశ్న వస్తుంది.

ఇప్పుడు మనము ప్రశ్న వేసుకున్నాము, ఏమని? ఆ రోజు ఎవరో వాళ్ళు చెప్పిన దానిని మనము తిక్కోళ్ళ లాగా వినాలా? లేకపోతే ప్రశ్న వేసి అడగాలా? లేకపోతే వాళ్ళు చెప్పినేది అంతా కరెక్టే అని 'ఊ' కొట్టాలా ఎందుకు 'ఊ' కొట్టాలి? అంటే వాళ్ళు పెద్ద శాస్త్రవేత్తలు కాబట్టి. అంటే అట్లా వద్దు, ఇట్లా వద్దు. సత్యము తెలుసుకో. సత్యము తెలుసుకోవాలంటే ఏమి చేయాలా? వాళ్ళనే అడగాలి, వాళ్ళే చెప్పాలి మనకు. పోనీ, వ్రాసిన వాళ్ళు ఉన్నారా? అంటే వాళ్ళు లేరు. మళ్ళీ ఎవరు అందుబాటులో ఉన్నారు మనకు? నీవు తెలుసుకోవాలంటే అందుబాటులో ఉంటారు. ఎవరున్నారు? ఆ రోజు వాళ్ళ దగ్గర ఎవరైతే ఉన్నారో వాళ్ళే ఈ రోజు ఉన్నారనుకో మనకు ఎదురుగా, అప్పుడు ఆయనను అడగవచ్చు కదా! మనము? వాళ్ళ ప్రక్కలో ఆ రోజు ఎవరైతే ఉన్నారో వాళ్ళే ఈ రోజు మనముందర ఉంటే ఏమి జరుగుతుంది? నీవు అడుగుతావు కదా! అడగొచ్చునా లేదా చెప్పండి? అప్పుడు ఆయన చెప్పేదానికి అవకాశము ఉందా లేదా చెప్పండి? అవకాశము ఉంది. అప్పుడు వాళ్ళు చనిపోయినా కానీ, వాళ్ళు ఉన్నప్పుడు వాళ్ళ దగ్గర ఉండేటటువంటి వ్యక్తులు, ఇప్పుడు మన దగ్గర కూడా ఉన్నారు, మనముందరే ఉన్నారు. మనతో ఎక్కడ దూరముగా లేరు, మనతో సంబంధముగా మనకు ఎదురుగనే ఉన్నారు, మనము మాట్లాడవచ్చు వాళ్ళతో. ఇప్పుడు మనము ఎవరిని అడగాలా ఆ ప్రశ్నను? ఆ రోజు వాళ్ళు ఎవరైతే ఉన్నారో వాళ్ళు ఈ రోజు మనదగ్గర

కూడా ఉన్నారు కాబట్టి వాళ్ళను అడిగితే వాళ్ళు ఆ రోజు ఏ ఉద్దేశ్యముతో ఆ రకంగా చూపించినారో అది మనకు తెలియజేస్తారు. ఆ ఉద్దేశాన్ని మనము సులభముగా తెలుసుకోవచ్చు. ఇప్పుడు ఇది ఎలా సాధ్యమయ్యా! వాళ్ళు ఆ రోజు ఉన్నోళ్ళు ఎవరున్నారో ఏమో! మళ్ళ నీకెట్ల కనిపిస్తున్నారో ఏమో! మాకేమి కనపరాలేదు అని మీరు అడగవచ్చు. ఒకవేళ నీవు అడుగుతావేమో మేము అడగలేము కదా! నీవు అడగవచ్చు, మేము అడగలేని పరిస్థితిలో మేము ఉన్నాము కదా అని మీరు అనవచ్చు. నేను ఎంతమటుకు అడుగుతున్నానో మీరు అంత అడుగవచ్చు అని నేను చెప్తున్నాను.

చాలామంది మా దగ్గరకు వచ్చి నమస్కారము చేసేటప్పుడు మీరు నమస్కారము చేయవలసిన పని లేదు. నాలో ఎటువంటి గొప్పతనము లేదు. మీరు ఎంతో నేను అంతేనూ. మ్రొక్కడము మంచిది కాదు అని చెప్పుచున్నాము. మీరు ఎంతో నేను అంతే అని చెప్పినాను కదా! అటువంటప్పుడు నాలో ఏమి ప్రత్యేకత లేదు కదా! లేకున్నప్పుడు మళ్ళ నాకే కనిపించి నీకు కనపరాకుండా పోవడానికి కారణము ఏమి? అంటే అది కూడ నాలో ప్రత్యేకత ఏమీ లేదు. మీకూ కనిపిస్తున్నాడు, నాకూ కనిపిస్తున్నాడు. నేను అడుగవచ్చు, మీరూ అడుగవచ్చు. అయితే నేను ఎందుకు అడుగుతాను ఇంకొకరిని? ఇంకొకరు లేరు, నేనొక్కడినే ఉన్నాను అని మీరనుకున్నారు. నేనేమంటున్నానంటే లేదు, నేనొక్కడినే కాదు, ఇంకొకడు కూడా ఉన్నాడు అని నేను అనుకుంటున్నాను. నా ప్రక్కలో ఇంకోడు కూడా ఉన్నాడు, అహర్నిశలు నాతోడు మనిషి, నా పొరుగు మనిషి ఒకడున్నాడు. నాకు పొరుగు మనిషి ఎవడైతే ఉన్నాడో ఐన్‌స్టీన్ ఉన్న రోజు కూడా అతనికి కూడా పొరుగు మనిషిగానే ఉన్నాడు ఇతను. నాకు ఎవడైతే పొరుగు మనిషిగా ఉన్నాడో, ఆ ఐన్‌స్టీన్ అన్న శాస్త్రవేత్త,

నికోలాటెస్లా అనే శాస్త్రవేత్త ఎవరతై ఉన్నారో, వాళ్ళకు కూడ పొరుగు మనిషిగానే ఈయన ఉన్నాడు.

కాబట్టి ఆ రోజు ఏ ఉద్దేశ్యముతో ఆ చిత్రాలు చూపారో, ఆ ఉద్దేశాన్ని సులభముగా మనము ఆయనను అడిగి తెలుసుకోవచ్చు. ఆయన ఎవరు? మీరు ఎవరిని గురించి చెప్పుచున్నారో మాకు అర్థము కాలేదు. అంటే నాలో ఏ ఆత్మ అయితే ఉందో మీలో అదే ఆత్మే ఉంది, మీలో ఏ ఆత్మ అయితే ఉందో ఆ రోజు నికోలాటెస్లాలోగానీ, ఐన్‌స్టీన్‌లోగానీ అదే ఆత్మ ఉంది. ఆ రోజు ఆ ఆత్మకు తెలియకుండా వాళ్ళు కదలలేదు, మెదలలేదు. వాళ్ళని కదిలించినది ఆత్మే, మెదిలించినది ఆత్మే, ఏ ఉద్దేశ్యము ఉండేది అక్కడ ఆ ఉద్దేశాన్ని బయలుపరిచేది కూడా లోపలి నుంచి అదే ఆత్మే. కాబట్టి ధైర్యముగా ఈ రోజు మనము ఆ ఆత్మను అడిగి ఆ రహస్యమును తెలుసుకోవచ్చు. ఆయన ఎట్లా వాడు? అంటే నీవు జ్ఞానము అడిగితే చెప్తానుగానీ, మిగితావి అడిగితే నేను చెప్పను అంటాడు. జ్ఞానాన్ని గురించి అడిగితే నీకు ఎంత కావాలంటే అంత చెప్తాను అని అంటాడు. ఈ పొరుగువాడు. నేను ఆత్మను. నా పని ఇదీ. నేను ప్రపంచరీత్యా ఎట్లా నడుచుకోవాలో అట్లే నడుచుకుంటాను. జ్ఞానరీత్యా మాత్రము నేను చెప్పనిది ప్రపంచములో జ్ఞానము తెలియదు.

కాబట్టి నేనే చెప్పాలి, జ్ఞానములో నీవు ఏ ప్రశ్న అడిగినా నేను చెప్తాను. ఈయనకు అన్నీ తెలుసు అని నీవు ఏమి చేస్తావు అంటే ప్రపంచమునకు సంబంధించినదో, నీకు లాభము వచ్చేదో అడిగితే నేను చెప్పను. అట్ల కూడా అడుగవచ్చు. ఏ విషయము అడిగినా చెప్తాడు అని అన్నపుడు, దేవుని విషయము చెప్పినపుడు ప్రపంచ విషయము ఎందుకు

చెప్పడు? అని అంటే ఆయన అది చెప్పాలని రూలు లేదు. నేను ఏమి చెప్తాను, జ్ఞానసంబంధమైన విషయాలు మాత్రమే చెప్తాను అని ఆయన అంటాడు. ఎందుకంటే జ్ఞానసంబంధ విషయాలు ఇప్పుడు అంత పెద్ద శాస్త్రవేత్తలు ఏమి రహస్యము చెప్పినేది? ఈ పొద్దు నేను అడిగితే ఆయన చెప్పుచున్నప్పుడు, అంత పెద్ద రహస్యాన్ని, ఎప్పుడు నూటా యాభై సంవత్సరముల క్రితము చనిపోయినవాళ్ళు చెప్పిన రహస్యాన్ని, నేను ఈ రోజు చెప్పితే, ఈ పొద్దు కేరళ లాటరీనో లేకపోతే, మద్రాసు లాటరీనో ఏది వచ్చేది చెప్పమంటే చెప్తాడు కదా ఆయన, ఏముంది? మనము ఆ లాటరీ నెంబరు కొనుక్కుంటే సరిపోతుంది కదా! అంటే అలా అడిగితే ఆయన చెప్పడు.

ప్రపంచానికి సంబంధించింది చెప్పడుగానీ, జ్ఞానవిషయాలైతే చెప్పుతాడు. ప్రపంచ విషయాలు నీవు అడగాల్సిన పని లేదు ఎందుకంటే అవన్ని కర్మ ప్రకారము జరుగుతాయి. కాబట్టి నేను జోక్యము చేసుకోవడానికి వీలులేదు. అవి నాకు సంబంధము లేదు అని చెప్పాడు. అందువలన ప్రపంచ విషయాలు చెప్పడుకానీ చెప్పేదంతా జ్ఞానమే చెప్పుతాడు. అందువలన జ్ఞానమునకు సంబంధించిన విషయాలు అన్నీ మీరు అడిగి తెలుసుకోవచ్చు. అందువలన ఖుర్ఆన్ గ్రంథములో 2-186 లో నీవు అడిగేదానికి జవాబు చెప్పుతానన్నాడు. సరే ఇప్పుడు మనమేమి చెప్తాము అంటే మేము చిన్నప్పటి నుండి చూసేవాళ్ళమన్నమాట. ఒక వ్యక్తిని ఇంకొక వ్యక్తి ఏరా! ఈ పొరపాటు పని చేసినావు అంటే "ఆ..! చేసినాను ఏం చేయమంటావు!" అని అనేవాళ్ళు. అంటే జరిగిపోయింది అలా అనే వాళ్ళు. ఇంకా కొంతమంది ఏమంటే నాలుకను ఎగరేసేవాళ్ళు అంటే 'అట్ల అయిపోయింది ఏమి చేయమంటావు అని' నాలుకను ఎగరేసే

వాళ్ళు అంటే చాలామంది మీరు చూసేవుంటారు. ఏమన్నా అన్నప్పుడో లేదా పొరపాటు జరిగినప్పుడో అది నాకు సంబంధము లేదు, నేను చేయాలని చేయలేదు, అదలా జరిగిపోయింది అని అనేవాళ్ళట. అంటే నాలుక ఎగరేసేవాళ్ళు. చాలామంది నాలుకను బయటికి పెట్టి ఎగరేసేవాళ్ళని చూసివుంటారు మీరు. ఎందుకిట్ల అంటున్నారు? అదేదో నోటితో చెప్పొచ్చు కదా! మళ్ళీ నాలుక ఎందుకు బయటికి పెట్టాలి అంటే అది అలవాటన్న మాట. అంటే తనకు తెలియకున్నాగానీ ఆత్మ ఏమి చేస్తాది అంటే నాలుక అలా బయట పెట్టి చూపిస్తదన్నమాట.

ఈ మధ్యన రెజ్లింగ్ అని T.V లో వస్తుంది మామూలుగా టీ.వీ.లో 10 స్పోర్ట్స్ ఛానల్‌లోనో ఆ రెజ్లింగ్ అనే ఆట చూసేటప్పుడు దాంట్లో రెజ్లియన్స్ ఉంటారు కదా, కుస్తీ పట్టేవాళ్ళు! అండర్‌టేకర్ అనే ఒక వ్యక్తి ఉన్నాడు. ఆ వ్యక్తే, చాలా అద్భుతాలు చేస్తూ వుంటాడాయన. అంటే మామూలు మనుషుల మాదిరి కాకుండా కొన్ని అద్భుతాలు అందులో ఉంటాయన్నమాట. ఆ అద్భుతాలు ఏమి జరుగుతాయి అనే విషయములో అదే పనిగా అతని మ్యాచ్ ఉన్నప్పుడు నేను చూసేవాన్ని. పెట్టెలో వేసి, పెట్రోలు పోసి కాల్చినా కూడ మళ్ళీ ఆయన లేచి వచ్చేవాడు. అది ఎట్లా లేచివస్తాడు? చచ్చిపోయినా కూడ అని మనకు అర్థము కాకుండా ఉండేది. అది ఏదో మనకు తెలియని విషయము. సరే, జ్ఞానము అయితే అడుగుదాము, దానితో మనకు పని ఏమి అని మనము దానిని గురించి అనుకోలేదు. కొన్ని జ్ఞానవిషయాలైతే మనము తెలుసుకోవచ్చు, ప్రపంచ విషయాలు మనకు సంబంధము లేదు. మ్యాచ్ అంతా గెలిచిన తర్వాత సామాన్యముగా అతను ఓడిపోడు, బహుశ గెలుస్తాడు. గెలిచిన తర్వాత

ఏమి చేస్తాడంటే రెండు మోకాళ్ళ మోపున కూర్చొని, నిలబడుకొని కాదు, మోకాళ్ళ మోపున కూర్చొని, అంతా అయిపోయిన తర్వాత చివరిలో నాలుక బయట పెట్టి ఆయన ప్రత్యేకముగా చూపించేవాడు.

ఈ మధ్యన రాలేదు 2 సంవత్సరాల నుంచి ఆయన. ఇంతకు ముందు జరిగిన మ్యాచ్‌లు ఉంటాయి చూడండి. మామూలుగా నెట్‌లో అన్న ఎక్కడన్నా అవి జరిగినేటివి చూడండి. మ్యాచ్ అయిపోయిన తర్వాత, గెలిచిన తర్వాత, ఓడిపోయినప్పుడు కాదు, గెలిచిన తర్వాత నాలుక బయటికి పెట్టి చూపేవాడన్నమాట. గెలిచినాడు సరేలే అందరూ పోతారు మామూలుగా ఎగురులాడుకుంటూ పోతారు. మామూలుగ నేను గెలిచినాను నేను గెలిచినాను అని చేయి ఊపుకుంటూ ఎగురుకుంటాపోతారు. ఈయన అలా ఎగిరేది లేదు, దుమికేది లేదు ఏమి లేదు. ప్రత్యేకించి నాలుక బయటపెట్టి చూపడము మాత్రమే జరుగుతావుంది. మళ్ళీ నాలుక అలా పెట్టి ఎందుకు చూపుతున్నాడు. అదీ ఒక వ్యక్తే మళ్ళ. దాంట్లో 60, 70 మంది రెజ్లింగ్ ఆడేవాళ్ళు ఉన్నారు. వాళ్ళందరూ అలా ఎందుకు చేయలేదు. వీనిలో ఏదో ప్రత్యేకత ఉంది. ఈ ప్రత్యేకమైన మనిషి ఎందుకు ఆ రకంగా చూపుతున్నాడు? ఇది ఏమన్నా జ్ఞానానికి సంబంధించినదా? అజ్ఞానానికి సంబంధించినదా? ఇదేదో జ్ఞానానికి సంబంధించినది. ఎందుకంటే శరీరములో వాళ్ళకు తెలియకుండానే 'మన కర్మ' అని తలవైపు చేయి చూపినట్లు, కొంతమంది నాలుకను తీసి చూపిస్తున్నారు. జరుగుతూవుంది అది చూశాము మేము. ఈయన అదే పనిగ చూపుతున్నాడు. అదీ మోకాళ్ళ మీద కూర్చొని విధేయతగ, శ్రద్ధగ, భక్తిగ. చూడండి ఎట్ల ఉందో. గెలిచినాను అనే గర్వము ఎక్కడా కనిపించలేదు. ఆ కారణము ఏమి? అని అంటే నేను దీనికి కారణము కాదు ఈ గెలుపుకు. ఈ గెలుపుకు నేను కారణము కాదు

అనే ఉద్దేశాన్ని చెపుతున్నాడాయన. ఈ గెలుపుకు నేను కాదు కారణము. ఇక్కడ గెలిచిన బలానికి నేను కాదు కారణము. ఈ శక్తి నాది కాదు.

ఈ శక్తి అంతా ఎవరిది? ఈ గెలుపు అంతా ఎవరిదీ? అంటే ఆత్మది అనే దానికి గుర్తుగా ఆయన ఏమి చేశాడు ఆ రకంగా నాలుక బయట పెట్టి చూపినాడన్నమాట. మనకు ఎట్ల తెలిసినది ఆయన పెట్టినేది? నేను చెప్తున్నాను కదా! ఆయన ప్రక్కలో ఎవరు ఉండారో నా ప్రక్కలో వాడే ఉన్నాడని, అడిగితే చెప్తాడు కదా! ఏముంది పెద్ద రహస్యము! అంటే ఎట్ల అడగాలి? అంటే జ్ఞానము తెలుసుకుంటే మీరు కూడా అడుగవచ్చు. ఎట్ల అడగాలనేది ఏమి లేదు చూడు ప్రత్యేకత! అతని దగ్గర ఎవరైతే ఉన్నారో ఆ రోజు, ఈ రోజు మన దగ్గర అతనే ఉన్నాడు ఆయనను అడిగితే మనము తెలుసుకోవచ్చు. ఆ రోజు అతను ఏమి చెప్పాడు? నాకు ఈ గెలుపుకు సంబంధము లేదు. నేను ఊరికినే అల్లాడిస్తే అల్లాడిన వాన్నే, కదిలిస్తే కదిలే వాన్నే. నన్ను కదిలించినోడు, అల్లాడించినోడు వేరేవాడు ఉన్నాడు. వాడే వీడు అని ఆ గుర్తుకు ఏమి చేశాడు అంటే నాలుకను చూపాడు. బయటికి చూపించడమే కాకుండ బోర్డు మీద ఏమి చేశాడంటే “6-3=6” అని వ్రాసాడు. అర్థమయిందా! మళ్ళీ ఇక్కడ ఐన్‌స్టీన్ ఈ విధముగా నాలుకను బయట పెట్టి చూపించే దానికి, ఆ రోజు అండర్‌టేకర్ బయటపెట్టి చూపించేదానికి ఏదో కారణము ఉంది అని మనము వెతకడము చేశాము. ప్రశ్నించడము చేశాము. సరే, ఆ ప్రశ్నకు మనకు ఏమి జవాబు తెలుస్తుంది అంటే నేను జీవాత్మను ఉన్నాను శరీరములో. తర్వాత ఆత్మ కూడ మీకు తోడుంది అని అది మొదట్నుంచి మనము తెలుసుకున్న విషయమే కానీ మనము ఏమనుకుంటామంటే నేను జీవున్నే అని అనుకుంటున్నారు. ఆత్మ ఒకటి ఉంది అని అనుకోవటము లేదు ఎవ్వరూ. అది కూడా మనము

చెప్పుకున్న విషయమే. ఎందుకంటే ఎక్కడవుంది ఆత్మ అసలుకు, నేను ఎత్తాలని అనుకుంటే ఎత్తుతున్నాను, దించాలనుకుంటే దించుతున్నాను. ఆత్మ ఎత్తేది, ఆత్మ దించేది ఏముంది ఆత్మ లేనే లేదు నేనే ఎత్తుతున్నాను నేనే దించుతున్నాను అని అనవచ్చు. ఆ రకంగానే నాలుక ఉంది.

నాలుక జీవునికి ఆత్మకు బాగా గుర్తింపుగా ఉంది కాబట్టి నాలుకను చూపాల్సిన పని వచ్చింది. ప్రత్యేకించి శరీరములో ఇన్ని అవయవాలు ఉన్నాగాని నాలుకనే ఎందుకు చూపాల్సిన పని వచ్చింది? అని అడిగితే నాలుక రెండు విధాలుగా కనిపిస్తుంది. జీవాత్మగా కనిపిస్తుంది, ఆత్మగా కనిపిస్తుంది. ఎందుకంటే మన ఇష్టము వచ్చినట్లు అల్లాడిస్తాము నాలుకను మనము. పైకి క్రిందికి ఎట్లంటే అట్ల. నా ఇష్టము వచ్చినట్లు అల్లాడిస్తున్నాను. పైకి అంటే పైకి ఉంటుంది, క్రిందికి అంటే క్రిందికి ఉంటుంది, లోపలకి అంటే లోపల ఉంటుంది, బయటకు అంటే బయట ఉంటుంది కాబట్టి నా ఇష్టము వచ్చినట్లు అల్లాడుతుంది. కాబట్టి ఇది జీవాత్మకు గుర్తు అనుకోవచ్చు మనము అంటే జీవుడు అనుకోవచ్చు. మన ఇష్టము వచ్చినట్టు మనము అల్లాడిచ్చుకోవచ్చు. నీ బుద్ధి పుట్టినప్పుడు నీవు అల్లాడించుకోవచ్చు. ఏముందిది, నా ఇష్టము వచ్చినట్లు అల్లాడుతుంది ఇది అని నీవు అనుకోవచ్చు. నీ ఇష్టము వచ్చినప్పుడు అల్లాడిస్తే అల్లాడుతుంది. అది మాత్రము వాస్తవమే. నీవు అల్లాడించుకోకున్నా అల్లాడుతుంది. అది కూడా వాస్తవమే. మీరు గమనించుకోండి నీవు మాట్లాడుతున్నావు. ఎట్లా ఆడియ్యాలి అని, ఆ శబ్దాన్ని ఎట్లా కంట్రోల్ చేయాలి అని, అది ఎంత వేగముతో అల్లాడుతుందో ఏమో, నీకే తెలియదు. మాట్లాడే ప్రతి నోటిలోనూ నాలుక అల్లాడుతుంది. కానీ తెలిసి అల్లాడిస్తున్నావా? లేదు. దానికి అదే అల్లాడుతుంది. ఎట్ల అల్లాడాలో అట్ల అల్లాడుతుంది. అన్నము తినేటప్పుడు

నాలుక పళ్ళ క్రిందపడకుండ ఆహారమును తోస్తావుంది. అది ఎట్ల తోయాలో అట్ల తోస్తావుంది. నీవు ఏమన్నా తోస్తావున్నావా ఇట్లా అట్లా అని. ప్రక్కకో పైకో క్రిందికో అంటున్నావా నీవు? నీకు దానిమీద ధ్యాసే లేదు. నీకి ధ్యాస లేనప్పుడు కూడా అది అంతకు అదే అల్లాడుతుంది. అప్పుడు ఎవరు అల్లాడిస్తున్నారు?

నీకు తెలియకుండ ఉండేవాడు ఎవడో ఇంకోడు అల్లాడిస్తున్నాడు. నీవు అల్లాడించుకోవాలని నీవు కూడా అల్లాడిస్తావు. కాదనలేదు. అప్పుడు ఊరకనే ఉంటాడు లోపలోడు, అల్లాడీ నువ్వే అని. అల్లాడిస్తే నేనే అల్లాడిస్తాను అనుకుంటుంటాడు. అప్పుడు ఒకసారి నీవు అల్లాడిచ్చి అన్నిసార్లు నేనే అల్లాడిస్తున్నానని నీవు అనుకోకపోతే నేను అనుకున్నప్పుడే కదా అల్లాడించేది అనుకోనప్పుడు కూడా అల్లాడుతుంది ఎందుకు అల్లాడుతుందో అలా అని ఆలోచన చేసినావా నీవు? చేయలేదు. మీరు అట్ల ఆలోచన చేయలేదు. ఇంతవరకు ఎవరైనా ఆలోచన చేసినారా ఎవడో వేరేవాడు అల్లాడిస్తున్నాడని? నీవు అల్లాడిస్తే అల్లాడే నాలుక నీవు అల్లాడించుకోకున్నా, నీ ప్రమేయము లేకున్నా అల్లాడుతుందంటే దానికి ఎవరో కారణము ఉన్నారని ఎందుకు అనుకోలేదు? నీవు అనుకున్నప్పుడు అల్లాడుతుంది కాబట్టి జీవునికి గుర్తుగా ఉంది. నీవు అనుకోకున్నప్పుడు కూడా అల్లాడుతావుంది కాబట్టి అది స్వయంశక్తి ఆత్మకు చైతన్య గుర్తుగా కూడా ఉంది. ఈ రకంగా నాలుక అనేది ఇటు జీవాత్మగా కనిపిస్తావుంది, అటు ఆత్మగా కూడా కనిపించి, జీవాత్మకు ఆత్మకు రెండిటికి గుర్తుగా ఉంది. నాలుక అనేది జీవాత్మకు ఆత్మకు రెండిటికి గుర్తుగా కనిపిస్తావుంది శరీరములో. నీవు అనుకున్నప్పుడల్లా కదులుతావుంది కాబట్టి జీవాత్మకు గుర్తుగా కనిపిస్తావుంది. నీకు ఏమాత్రము సంబంధము లేకుండ ఉన్నప్పుడు కూడా కదులుతావుంది కాబట్టి ఆత్మకు

గుర్తుగా కనిపిస్తావుంది. కాబట్టి ఈ రెండు విధానములు ఒక నాలుకలో బాగా కనిపిస్తాయి కాబట్టి నాలుకనే మనము జీవాత్మగా ఆత్మగా పోల్చి చెప్పవచ్చు. తర్వాత మన ప్రమేయము లేకుండా ఏమన్నాపని జరిగితే, ఆ పనిని నీవు ఏమిచేస్తావంటే జరిగింది, ఏమి చేయాలి అంటావు. అంటే నీకు తెలియకుండ ఆ నాలుక వస్తావుంది బయటికి. అంటే వాడు చేయలేదు నేను చేసినాను అని. ఎదుటివాడు చూసేదానికి కూడా అరేయ్! నువ్వు పొరపడుతున్నావు, వాడు కాదు చేసినేది, నేను అని. అంటే ఆత్మను అని. అట్లగా మీకు తెలియకుండనే మీ నాలుక బయటికి వస్తుంది. ఎందుకు వస్తావుంది? అంటే ఇది మామూలుగా అందరూ చూసే ఉంటారు బహుశ ఇది చాలాచోట్ల వుంటుందన్నమాట. ఎందుకు వస్తావుంది అంటే ఆ రకముగా ఇతను ప్రమేయము లేదు అని.

మన దగ్గర జిహ్వానందస్వామి ఉన్నాడు. ఏం స్వామీ ఇంత పొరపాటు పని చేసినావు అంటే నాలుక ఎగురేసి 'ఆ...' అంటాడాయన. ఆయన చేసేటివన్నీ పొరపాట్లే. ప్రొద్దున్న లేచినప్పటి నుండి 10,11 అన్న చెప్పుతాడు. ఖచ్చితముగ డజనో, డజనుకంటే తక్కువ చెప్పుతాడు. ఏమన్న అడిగితే మాత్రము నాలుక ఎగిరేస్తాడు. అంటే ఆ నాలుక ఎగరేయడములో అర్థమేమి? నోటితో చెప్పడన్నమాట. నాలుక ఎగిరేయడము అంటే నాకు సంబంధము లేదు అన్నట్టు. అంటే నీవు అన్నా లేకపోతే లోపల ఉండేవాడు అన్నాగాని ఈ మనిషికి సంబంధము లేదు అన్నట్టు. చేసినేది నేను అని వాడు చెప్తున్నాడని అనుకుందాము మనము. అంతేకదా! అదే జవాబు ఇతను కూడా చెప్పుతాడు అనుకుందాంలే. ఎక్కడన్నాగానీ, ఎవరన్నాగానీ ఆ రకముగా నాలుక ఎగరేసి చెప్పడము జరుగుతావుంది. అదే విధముగానే ఈ ఐన్‌స్టీన్ అనే వ్యక్తి ఈ నాలుకను చూపించడములో

అర్థము ఏముంది అని అంటే ఈ మూడు ఆరు అంటే ముందు ఆరు వ్రాసి మైనస్ మూడు చేశాడు. **(6–3)** దీనికింద అండర్‌లైన్ చేశాడు. 6 అంటే ఆత్మకు గుర్తు, 3 అంటే జీవాత్మకు గుర్తు, ఈ రెండింటికి క్రింద అండర్‌లైన్ చేశాడు. ఈ రెండే చూడు నిన్ను చూపుతుండేది అంటే 3 గా ఉంది, 6 గా ఉంది ఇది. ఏది? నాలుక.

కాబట్టి నాలుకను చూపించాడు. అండర్‌లైన్ చేశాడు నేను చూపిస్తున్నది ఇదే అని. అంటే ఈ మూడు ఆరుగా ఉండేది ఇది నీకు అని అర్థము. ఎంత బాగా చూపించినాడు చూడు. ఆ రకముగా ఆయన చూపించడము జరిగింది. అర్థమయిందా! మళ్ళ ఈ మైనస్ అయిన తర్వాత ఆరే ఎందుకు వచ్చింది అని అడగవచ్చు. అంటే జీవాత్మ ఆత్మ కలిసి వున్నప్పుడు, విడివిడిగ చెప్పుకుంటే జీవాత్మను 3 గా ఆత్మను 6 గా చెప్పుకుంటున్నాము మనము. అర్థమయిందా! అంటే ఆత్మ నుంచి జీవాత్మ విడిపోయినాగానీ అది మాత్రము మళ్ళీ ఆత్మగానే ఉంటుంది. అర్థమయిందా! నీవు ఆత్మ నుంచి ప్రక్కకు పోయినాగానీ, వాడు లేడనుకున్నాగానీ, నీవు మైనస్ అయిపోయినాగానీ వాని దగ్గర నుంచి అది మాత్రము 6 గానే ఉంటుంది. దాని విలువ మారదు. నువ్వు (+) గా ఉన్నా, మైనస్ (–) గా ఉన్నా అది మాత్రము దానిగానే ఉంటుంది. అర్థమయిందా! మనము ఒక వాక్యము వ్రాశాము క్రొత్తగా ఈ రోజు ఏదో చార్టులో (ఫ్లెక్సీ) మీద. ఆరు మూడు అయినా మూడు ఆరు అయినా ఆరు ఆరే మూడు మూడే అని. అంటే ఆ వాక్యము కూడా దీనికి సంబంధించినదే. ఆరు మూడు అయినా, మూడు ఆరు అయినా అంటే జీవాత్మ ఆత్మతో కలిసినా, ఆత్మతో జీవాత్మ కలిసినా, జీవాత్మ జీవాత్మే ఆత్మ ఆత్మే అని అర్థము  అర్థమయిందా! ఇది ఇంకో భాషలో చెప్పితే మళ్ళా తెలుగులో చెప్పితే అట్లే ఉంటుంది.  ఈ

రకముగా లెక్క వేసుకొని చెప్తే మనకు ఇప్పుడు ఈ ఆత్మల విధానము పెద్దలు ఏమి చెప్పారంటే 3,6,9 గా చూపించి చెప్పడము జరిగింది. ఈ 3, 6, 9 గా చెప్పినప్పుడు దాని గుర్తుగా కూడా నాలుకను చూపించినారు.

ఇంకా దేవుడు అనేవాడు 9 గా ఉన్నాడు కాబట్టి ఆ దేవునికి ఎంత విలువ ఉంది అని చెప్పేదాని కోసరము మూడో ఆత్మను గురించి చెప్తున్నాము మనము. దేవునికి ఎంత విలువ ఉంది అని చెప్పేదానికి శాస్త్రవేత్తలు ఏమి చెప్పారంటే ఈ మూడు (3), ఆరు (6), తొమ్మిది (9) రక రకాలుగా విశ్లేషణ చేసి చూశారు. రకరకాలుగ విభజించి చూశారు విభజించి చూసి ఎక్కడ కూడ దానిలో మార్పు రావడము లేదు. తొమ్మిది (9) లో ఎక్కడ మార్పు రాదు. తొమ్మిది విశేషమైనది అని చాలా రకాల చిత్రాల రూపములో చూపించడము జరిగింది. ఆ చిత్రాలన్నిటినీ మేమిక్కడ చిత్రీకరించి ఈ గ్రంథములో చూపాము. కాబట్టి ఈ గ్రంథము విశేషత గొప్పగ ఉంది అని దీనిని బట్టి మీరు తెలుసుకోవచ్చు. ఇంతకుముందు సృష్ఠికర్త కోడ్‌గా వచ్చిన గ్రంథమే ఇది. దాంట్లో 32 పేజీలు పెంచాము. 32 పేజీలలో ఇది కొంతభాగము. కొంతభాగము ఏమి చెప్పాము అంటే 3,6, 9 ఎలా తయారయింది అని చెప్తూ, అంటే తెలుగు భాషలోనే మొట్టమొదట తయారయిందని చెప్తూ, దానికి మూడు కొమ్ములు ఉన్నాయని చెప్పడము జరిగింది. ఈ రకముగ 3,6,9 మొట్టమొదటి నుండి మన మధ్యలో ఉన్నాయి అవి. చిన్నపిల్లప్పటి నుండి మనము చూస్తున్నాము. మామూలుగ ఏ పందెంలో నైనా వన్ (1), టూ (2), త్రీ (3) అని పరిగెత్తిస్తారు. ఈ రకముగా పందెం మొదటిలో 3 పెట్టి పంపిస్తారన్న మాట. తర్వాత తిప్పలు పడేది వీళ్ళకు స్టాట్ అయ్యింది అని, అంటే జీవాత్మ తిప్పలు పడేదానికి 1,2,3, అని చెప్పి స్టాట్ చేస్తారన్నమాట. ఈ రకముగా అవి మనకు

చిన్నప్పటినుండి అనుబంధముగా ఉన్నాయి, మనతో కలిసి మెలిసి ఉన్నాయి అయినా ఈ 3, 6, 9 గురించి మనము పూర్తి తెలుసుకోలేదు. తెలుసుకుంటే ఇంత రహస్యము ఉంది. అర్థమయిందా! తరువాత ఈ శాస్త్రవేత్తలు కూడా వాటిని గురించి ఏమి చెప్పారంటే మనము చెప్పుకుండేదే కాకుండ శాస్త్రబద్ధముగా వాళ్ళు చెప్పిన విషయాలు మనము చెప్పుకున్నాము.

అలాగే మనము చెప్పిన విషయాలు వాళ్ళు చెప్పారు. అంటే ఆధ్యాత్మిక కోణములో, మనము చెప్పుకుంటే గణితశాస్త్ర కోణములో వాళ్ళు చెప్పారన్న మాట. వాళ్ళు గణితశాస్త్ర కోణములో చెప్పినాగాని మనము ఏమి చేసినామంటే వాటిని మళ్ళించి, తిప్పించి ఇంకొక రకముగా చేసి ఆధ్యాత్మికములో చూపినాము. ఆ రోజు వాళ్ళు ఇదే ఉద్దేశ్యముతోనే చూపినారో లేదో నాకు తెలియదు మళ్ళీ ఇప్పుడు మనకు చెప్పేవాడు ఆ ఉద్దేశ్యముతో చెప్పుతున్నాడు. ఎవరు? ఆరో నెంబరువాడు (ఆత్మ) చెప్పుతున్నాడు ఆ రకముగా. ఎవరికి చెప్పుతున్నాడు? మూడో నెంబరు (జీవాత్మకు) వాళ్ళకి. ఎవరిని గురించి? తొమ్మిదో నెంబరు గురించి. అర్థమయిందా! ఈ రకముగా మనము లెక్కేసుకుంటే మనమంతా తొమ్మిదో నెంబరు గురించి తెలుసుకోవాలా! ఎవరు చెప్పితే తెలుస్తాది? ఆరవ నెంబరు వాడు చెప్పితే తెలుస్తాది. ఎవరు తెలుసుకోవాలా? మూడో నెంబరు మనము తెలుసుకోవాలి చివరకు. అది పద్ధతన్నమాట సరే, మూడవ నెంబరు మనము తెలుసుకోవాలంటే కొంతకు కొంత ఆరవ నెంబరుగా మారితే కదా తెలిసేది. 6వ నెంబరుతో అనుసంధానము పెట్టుకొంటేనే కదా తెలిసేది. వాడు జ్ఞానము చెప్పేవాడు మనకు, ఎవరు? 6వ నెంబరువాడు. మధ్యలో మనుషులు ఎవరూ చెప్పరు. భగవద్గీతలోగానీ, ఖుర్ఆన్ గ్రంథములోగానీ, బైబిలు గ్రంథములోగానీ చెప్పడము ఏమంటే చెప్పేవాడు ఒక్కడే. ఎవడు?

6వ నెంబరువాడే, మధ్యలో ఏ మనుషులు చెప్పరు. మనుషులు చెప్పినేది జ్ఞానము కాదు. మనుషులు చెప్పినేది మనము కూడా ఒప్పుకోలేదు ఇంతవరకు.

బైబిలులో 66 పాఠాలలో 62 పాఠాలను తీసి పక్కన పెట్టినాము. అది బైబిలే కాదు అన్నాము మనము. దేవుడు చెప్పినేది బైబిలు. ఏసు చెప్పినేదే జ్ఞానము అని చెప్పినాము. అంటే నాలుగు (4) సువార్తలు అర్థమయిందా! మిగితాది ఒప్పుకోలేదు మనము. అంటే ఎవరు చెప్పితే జ్ఞానము కాదో అనేది కూడ మనము చెప్పుకున్నాము. మనుషులు చెప్పినేది ఏదీ జ్ఞానము కాదు. 3వ నెంబరు వాళ్ళు చెప్పితే జ్ఞానము కాదు అర్థమయిందా అట్లన్నగాని. 6వ నెంబరు చెప్పితే జ్ఞానము అవుతుంది. 6వ నెంబరు ఎవరు? ఆత్మ అనేవాడు చెప్పితే తెలుస్తుందన్నమాట. ఈ ఆత్మ ఎవరిని గురించి చెప్తుంది? 9వ నెంబరు గురించి చెప్తుంది. అంటే పరమాత్మను గురించి చెప్తుంది. నీవు 9వ నెంబరు గురించి తెలుసుకోవాలంటే ఏం కావాలి? 6వ నెంబరుతో కనెక్షన్ పెట్టుకోవాలి, 3వ నెంబరు వాళ్ళు. 6వ నెంబరుతో కనెక్షన్ పెట్టుకోవాలి ఎట్లంటే పున్నమి రోజు వస్తాము కదా! పున్నమి రోజు వచ్చి, గంట సేపు కనెక్షన్ పెట్టుకొని పోతాము. అంతే కదా! అట్ల ఉండకూడదు అహర్నిశలు పెట్టుకోవాలన్నమాట. అర్థమయిందా! పున్నమి రోజు వచ్చి కనెక్షన్ పెట్టుకొని పోతే కుదరదు. కరెక్ట్‌గా నెలకొక రోజే మీరు భక్తులు అంటాడు దేవుడు. మిగితా 29 రోజులు ఎవరో నాకు తెలియదు పో అంటాడు కనిపించినాగాని. అట్ల కాకుండ ఈ 30 రోజులు మనము దేవునికి భక్తులుగా ఉండాలన్నమాట. 30 రోజులు దేవుని భక్తులుగా ఉండాలంటే ఏమి చేయాలి? అంటే అహర్నిశలు ఆత్మతో సంబంధము పెట్టుకో అని భగవద్గీతలో చెప్పుతాడన్న

మాట. "నీవు యోగివేకమ్ము" అని చెప్పినాడు. అంటే యోగముతో కూడుకొనివుండు ఎప్పటికీ, మిగితావి వద్దు అన్నాడు. "తపస్విభ్యోధికో యోగీ కర్మభ్యశ్చాధికో యోగీ జ్ఞానిభ్యో మతోధికః తస్మాద్యోగీ భవార్జున" అని చెప్పినాడు కదా! కాబట్టి నీవు యోగివేకమ్ము అని చెప్పినాడు కదా!

ఆ రకముగా ఆత్మతో కనెక్షన్ పెట్టుకుంటే ఏమవుతాము మనము? యోగులము అవుతాము. మిగితా వాటితో కనెక్షన్ పెట్టుకుంటే రకరకాలు అయితాము. అర్థమయిందా! బయటి విషయముతో సంబంధము పెట్టుకొని ఒక దేవుని పేరుతోనో, దేవుని శ్లోకముతోనో, దేవుని మంత్రముతోనో లేక ఏదో దేవుడు ఒక పేరు పెట్టుకొని మంత్రముతో కనెక్షన్ పెట్టుకుంటే అది ఏమయితాది? తపస్సు అయితాది. తపస్సులకంటే యోగి అధికుడు కాబట్టి యోగివేకమ్ము అని భగవద్గీత 6-27లో చెప్పినాడు. యోగివేకమ్మన్నప్పుడు మనము ఏమి చెప్తున్నామంటే నీవు 6తో కనెక్షన్ పెట్టుకో. ఎక్కడికి పోయినా 3 లో ఉండి 3 తో కనెక్షన్ పెట్టుకుంటే పనికి రావు నీవు. 3లోనే ఉంటావు నీవు గాని 6 కావు. కాబట్టి ఈ 3 అనేది అంటే ప్రపంచ విషయాలన్నీ 3కి సంబంధించినవి. నీవు కూడ 3కి సంబంధించిన వాడివే కాబట్టి ప్రపంచ విషయాల సంబంధము పెట్టుకోవద్దు. ప్రపంచ విషయాలతో సంబంధము పెట్టుకోకుండా ఉంటే ఏమౌతుంది? అప్పుడు జ్ఞాన విషయాలు నీకి సంపూర్ణముగ తెలిసే అవకాశము ఉంటుంది. అర్థమయిందా! 6 తో కనెక్షన్ పెట్టుకున్నట్లు అవుతుంది. అప్పుడు నేను ఎలాగ చెప్పగలుగుతున్నాను ఈ రోజు, నాకు ఏమి చదువులేదు పెద్దగ, ఆశ్రమాలకు, గురువుల దగ్గరకు పోయి తిరిగిందేది లేదు, ఎక్కడ సంబంధము లేకుండా ఈ రోజు అంటే కొన్ని కొత్త కొత్త విషయాలన్నీ మనము చెప్పుకుంటున్నాము. ఏమాత్రము ప్రపంచ సంబంధము లేకుండ అసలైన జ్ఞానము చెప్పుకుంటున్నాము అని

అంటే అది ఎవరి ప్రేరణ వలన జరుగుతావుంది మనకు? ఆత్మ ప్రేరేపణ వలన జరుగుతావుంది, ఆత్మ అందించిన దానివలన జరుగుతావుంది. మనము ఈ రోజు అదే చెప్పుకుంటున్నాము. అది నాకు ఒక్కనికే కాదు. మీకు కూడా ఆత్మ అనేవాడు ఉన్నాడు. మీకు కూడా స్వయముగా బోధిస్తాడు. అర్థమయిందా! ఆయన ఏమి చేయాలన్నా చేస్తాడు. ఎవరి ఆధీనములో ఉంటాడాయన? తొమ్మిది (9) ఆధీనములో ఉంటాడు. అంటే దేవుని ఆధీనములో ఉంటాడు. అంటే ఆయన ఏమి చేయడు, ఉలకడు, పలికేవాడు కాదుకాని ఈయన మాత్రము ఉలికి పలికి అన్నీ చేస్తాడు.

అందువలన మనము ఏమి చేయాలి అంటే ఆయన (పరమాత్మ) ఎవరో మనము చూడలేదు కాని ఈయనను (ఆత్మను) మాత్రము మనము తెలుసుకోవచ్చు. ఈయన ద్వారా విషయాలు గ్రహించవచ్చు. గ్రహించే విషయాలు ఎట్లా ఉంటాయి అంటే అవి దైవికమైన విషయాలుగ ఉంటాయి. అవి ఏ గ్రంథములో వ్రాయకున్న ఫరవాలేదు తెలుస్తాయి. అన్నీటికంటే అసలైన జ్ఞానముగా ఉంటుంది. అటువంటి జ్ఞానముతో మనము సంబంధము పెట్టుకోవాలంటే ఏమి చేయాలి? అంటే మనము ఎల్లకాలము ఆత్మతో సంబంధపడి ఉండాలన్నమాట. అలా కాకుండా మేము ప్రపంచ విషయాల్లోనే సంబంధపడి ఉంటాము ఎప్పుడో ఒకసారి తీరిక దొరికినపుడు కనెక్షన్ పెట్టుకుంటాము అంటే సరిపోదు. అట్లాగనే మీలో చాలామంది ఎట్లున్నారంటే మనకు సంబంధము లేదు, నెలకు ఒకసారి అక్కడ మందిరము దగ్గరికి పోయి, ఆయన చెప్పిన జ్ఞానము విని వస్తే అక్కడికి అయిపోయింది జ్ఞానము! అని అనుకోవద్దండి. అర్థమయిందా! అది కాదు కాని జ్ఞానము! కావాలంటే ఆత్మతో అహర్నిశలు సంబంధపడి ఉండాలి! ఇక్కడ చెప్పేదే జ్ఞానము అనుకోవద్దండి.

ఇక్కడ చెప్పేది కూడా జ్ఞానమే. కానీ ఇక్కడ చెప్పేది నెలకు ఒకసారే. అయితే మీ ప్రక్కలో ఉండేవాడు ఎప్పుడైనా బోధిస్తాడు మీకు. తెలుసుకోవాలి అనే ధ్యాస కలిగివుండండి మీరు. తెలుసుకోవాలి అనే ధ్యాస కలిగివుంటే మీకు ఎప్పుడైనాగాని తెలియబడుతుంది. ఆ తెలుసుకోవాలనే ధ్యాస వుండాలి అంటే ఏమి చేయాల? ఈ రోజు వచ్చారనుకోండి ఇంతమంది నా దగ్గరికి. ఇంతమందిలో ఎవరితో మాట్లాడాలి? ఎవరితోనూ మాట్లాడేదానికి కాదు. నేను మాట్లాడుతాను, నేను మాట్లాడుతాను అని మీరంటే నేను ఎవరితో మాట్లాడకుండ, నన్ను నేను లోపల దాచిపెట్టుకొని కూర్చోవాలి. ప్రతి రోజు బయటికి వచ్చేవాళ్ళము కూడ ఆ రోజు బయటికి రాకుండా ఉండాలి. ఎందుకు? వస్తే చుట్టుకుంటారు చుట్టూర. మళ్ళ ఎవరూ ఏమీ మాట్లాడరు, చూసుకుంటు ఉంటారు. అందువల్లన వద్దులే అని లోపల ఉండాలి. మీకు తీరిక వున్న సమయములో రాండయ్యా! వచ్చి మీకు ఏమన్నా తెలియని విషయాలేమైనా ఉంటే తెలుసుకొని పోవచ్చు. మేము మాట్లాడమన్నామా? మేము చెప్పమన్నామా జ్ఞానవిషయాలు! తీరిక సమయాలలో రావచ్చు కదా!

మనము తెలుసుకోవడము తప్పనిసరిగా అవసరము. మేము విన్న దానితోనే సరిపుచ్చుకుంటే బాగుండదు. ఎందుకంటే ఒకాయన ఈ మధ్యన ఒక ప్రశ్న వేశాడు. ఏమని ప్రశ్న వేసినాడు? మేము భగవద్గీత చదివితే దానిలో మీరు చెప్పిన దానిని బట్టి చూస్తే కత్తితో ఒక చేయి తెగిపోయినపుడు జీవాత్మ తెగదు, ఆత్మ తెగుతుంది అని మీరు వ్రాసినారు. అదెలా? అంటే వాస్తవమే వ్రాసినేది. జీవాత్మ ఎక్కడో లోపల గుణచక్రములో ఉన్నాడు. వాడు ఎందుకు తెగుతాడు?

శరీరములో చేతి వరకు ఉండేవాడు ఆత్మే, శరీరము అంచువరకు ఉన్నాడు కాబట్టి వాడు తెగిపోయినాడు. అంటే ఒక జానెడు చేయి తెగిపోయింది కదా! తెగిపోయిన తరువాత వాడు కుంటివానిగా ఉన్నాడు. వాడు చచ్చిపోయిన తరువాత వాడు కుంటి చేయిగానే ఉంటాడా? సూక్ష్మ శరీరములో అని అడిగినాడాయన. అంటే వాడు ఇప్పుడు కుంటివాని మాదిరిగానే ఉన్నాడు కదా! వాని చేయి కుంటిగా ఉంటుందా పూర్తి ఉంటుందా అని అడిగినాడు. అంటే మంచి ప్రశ్నే అది. అది రావలసిన ప్రశ్నే. అది ఎదురుగా ఉండి తెలుసుకుంటే సరిపోదా! ఇపుడు జాబు వ్రాసినాడు ఆయన నాకు! నేను జాబులో ఏమని చెప్పాలి ఆయనకు? ఒకవేళ చెప్పాననుకో మొట్ట మొదట చెప్పినదే అర్థము కాలేదు గ్రంథములో వ్రాసినేది. మళ్ళీ ఇది కూడా వ్రాసినేదే కదా, జాబు వ్రాసినా వ్రాసేదే కదా నీకు. ఎంతమటుకు అర్థమయితాది. అదే గ్రంథములో చెప్పినదే మళ్ళ వ్రాయాలి నేను. అంతకంటే ఏమి ఎక్కువ వ్రాసేదానికి లేదు. మళ్ళీ అప్పుడు అదే అర్థమయితాది ఏమని? ఆత్మ కుంటిదని అర్థమయితాది. మనిషి కాదు కుంటోడు ఆత్మ కుంటిది అని అర్థమయితాది. అంటే కొంత వివరముగా చెప్పాల్సిన పని వచ్చిందనుకో. అప్పుడు దానిని వ్రాసేదానికి కాదు. మేము కూడా మూడే (జీవాత్మనే) కాని ఆరు (6) (ఆత్మ) చెప్పిన విషయాన్నే మేము చెప్పుతున్నామని మొదటి నుంచి చెప్పుతున్నాము. ఈ బుక్కులో కూడ అదే వ్రాశాము అంటే ఐన్‌స్టీన్, నికోలా టెస్లా ఎవరో వాళ్ళు ఏమి అంచనా వేసినారో మనకు తెలియదు. కానీ వాళ్ళు చెప్పిన విషయము నాకు ఏమి తెలియదు అయినా గాని అడిగి తెలుసుకున్నాము. ఎవరినీ? ప్రక్కలో ఉండేవాన్ని అంటే ఆరు (6) ను. ఆరును అడిగి తెలుసుకుంటే ఏమి చెప్పినాడు అంటే ఈ విధముగా చెప్పుతున్నాడు చూడు అని చెప్పాము.

మా మీద ఏమాత్రము బరువు పెట్టుకోకుండా చెప్పినేది ఎవరు? లోపల ఉండేటటువంటి వాడే చెప్పుతున్నాడని వివరము వ్రాశాము. అందువల్ల మేము ఏమంటున్నామంటే మనము మనుషులమే, మనకు ఏమీ తెలియదు. మనుషులు చెప్పినటువంటి జ్ఞానము సంపూర్ణమైన జ్ఞానము కాదు. ఒకే ఒక ఆత్మ చెప్పుతుంది అది సంపూర్ణమైన జ్ఞానము. దేవుడు కూడ ఎక్కడా చెప్పడు. ఆ దేవుని విషయాన్ని దేవునిగా కూడ చెప్పుతుంది ఆత్మ, దేవుడు (పరమాత్మ) చెప్పడుగానీ దేవునిగా కూడ శాసించి చెప్పుతుంది. ఆత్మ ఎందుకంటే ఆరునే (6) పెడితే ఆరే (6) అవుతుంది, తలక్రిందుల పెడితే తొమ్మిది (9) అవుతుంది. అందుకే మన పెద్దలు తయారుచేయడము కూడ అట్లే తయారుచేసినారు చూడు ఆరుని, తొమ్మిదిని. ఇంగ్లీషులో కూడ అట్లే తయారుచేసినారు. మన తెలుగును చూసే వాళ్ళూ అట్లే తయారు చేసు కున్నారు. ఇందులో ఏదో రహస్యము వుందని. అట్లాగే ఉంచితే ఆరు (6) తలక్రిందుల తిప్పితే తొమ్మిది (9) అయితాది అది. అందువల్ల నటించే ఆత్మ అని చెప్పుకున్నాము. అది జీవునిగా నటిస్తుంది. అటు దేవునిగా నటిస్తుంది. అట్ల ఏమైనా చేస్తుంది అది. అది తొమ్మిదిగా ఉంటుంది అటు ఆరుగా ఉంటుంది, ఎట్లైన ఉంటుంది అది. కాని ఇది ఆరు అని ఎవరికి తెలియదు. ఇంతవరకు ప్రపంచములో ఎంతోమంది జ్ఞానులు ఉన్నారు.

ఎంతోమంది స్వామీజీలు, ఎంతోమంది పెద్ద పెదోళ్ళు వచ్చి పోయినారుగాని అటు జీవున్ని ఇటు దేవున్ని గురించి చెప్పుకున్నారుగానీ మధ్యలో వున్న ఆత్మ గురించి ఎవరు చెప్పుకోలేదు. ఆత్మ అనే పదము చాలా వినియోగించబడింది. ఆత్మ అనే పదము చాలాచోట్ల చెప్పుకోబడింది. అయినాగాని ఆత్మ అనేటువంటిది అసలు ఎవ్వరో కూడ తెలియదన్నమాట. తెలియకుండ రహస్యముగ విచిత్రముగా ఏమాత్రము ఎవరు ఎంత

ప్రయత్నము చేసినా తెలియకుండ ఉండేది. ఆత్మ అది తెలియకుండానే అది నటిస్తావుంది. అందువల్ల గుప్తముగా ఉంది అని అన్నాము దాన్ని. మన శరీరములో. రహస్యముగ ఉండే దాన్ని ఏమంటాము 'గుప్తుడు' అని, 'రహస్యుడు' అని అంటాము. అంటే 'చిత్రగుప్తుడు' అని కూడా దానికి ఒక పేరు వచ్చింది. విచిత్రముగ ఎక్కడ ఎవరికి తెలియకుండా ఉంది. నీవు తెలుసుకోవాలని అనుకున్నాగాని నేను తప్ప ఎవరూ లేరని అనుకుంటావు అదే అంటాది అంటే ఆత్మే అంటాది. అదే అనిపించి నీ చేత, నీవు అన్నట్లు బోధిస్తాదన్నమాట, నేను తప్ప ఎవరు లేరు అని. మనము ఆలోచన చేస్తావుంటే, మనకు ఇష్టము వచ్చినట్లు ఆలోచనలు వస్తాయి. ఆలోచించినట్లు మనమే చేస్తున్నాము. మనకే ఫలితము వస్తావుంది. కష్ట సుఖాలు కూడా మనకే వస్తావున్నాయి.

మనమే డబ్బులు సంపాదించుకుంటున్నాము, మనమే పోగొట్టు కుంటున్నాము, మళ్ళ నడిమధ్య ఇంకోడు ఎక్కడున్నాడు? ఈయన చెప్పే దానికి ఒకడు ఉన్నాడు అంటే ఎక్కడున్నాడు అసలుకు ఎవరికి తెలియకుండా? ఇంతమందికి తెలియనిది ఈయనకు ఒకనికే తెలుసునా? అని అదే అనిపిస్తుంది, ఏది? ఆరే (6) ఆత్మే అందువల్ల అది ఏమైనా చేస్తుంది జ్ఞానమైన అదే బోధిస్తుంది. అజ్ఞామైనా అదే బోధిస్తుంది. కానీ జ్ఞానము కావాలి అని అనుకున్నప్పుడు మాత్రమే జ్ఞానము బోధిస్తుంది నువ్వు ఉందో లేదో అని, అటో కాలు, ఇటో కాలు పెట్టుకొని నీవు అడుగవద్దు. సంపూర్ణముగ జ్ఞానము మీద విశ్వాసము కల్గి నీవు అడిగితే, ఎంత పెద్ద జ్ఞానాన్నైనా నీకు తెలియజేస్తుంది. ఆత్మకు తప్ప దేవుని విషయము ఎవరికీ తెలియదు. అర్థమయిందా! అందువల్ల ఏ మనిషీ దేవుని విషయము చెప్పలేడు అని దేవుడు చాలాచోట్ల చెప్పాడు. మనుషులకు ఏ మాత్రము

తెలియదు. ఎవరు బోధిస్తారు? మనుషులకు ప్రపంచ విషయాలు తప్ప ఇంకేమి తెలియవు ఆత్మ చెప్పితేనే మనకు తెలియబడేది. అందువల్ల మనము ఏమనుకోవాలి? అంటే ఆత్మను గురించే ఆలోచన చేయాలి. ఆత్మ గురించే అర్థము చేసుకోవాలి ఆత్మను గురించి మనము రకరకాల తెలుసుకునే ప్రయత్నము చేయాలి.

జ్ఞానము అనే దాన్ని మనము అంత సులభముగ గ్రంథముల ద్వారానే అర్థమయితాదని అనుకోవాల్సిన అవసరము లేదు. ఒకవేళ అర్థము అయితే మరీ మంచిది అర్థము కాకపోతే అడిగి తెలుసుకోండి. అడిగేదానికి అవకాశము లేదు అనేదానికి ఏమీ లేదు ఇక్కడ. ఎందుకంటే మేము ఉండేది కొద్ది రోజులు ఇక్కడ సంపూర్ణముగ 10 సంవత్సరములు 20 సంవత్సరములు ఉంటాము అనేది నమ్మకము లేదు. ఈ రోజు మాట్లాడే వాన్ని రేపు ప్రొద్దున పడిపోవచ్చు. ఈ రోజు మా నోట్లో నుంచి మాట వస్తూ ఉంది. రేపు రాకుండ పోవచ్చు. ఈ రోజు కదిలి నడుస్తున్నాము రేపు కదలకుండా పోవచ్చు. ఇప్పటికే పెద్ద కష్టమయింది. ఎందుకంటే ఇప్పుడు ఇక్కడ నుంచి అక్కడికి నడిచి పోతావున్నాను. మీ ముందర ఊరికే నడుస్తావున్నాను. నేను బయట అయితే అసలు నడవలేము. కట్టె ఉండాలి. ఇంకొక మనిషి తోడు ఉండాలి మళ్ళీ. ఎక్కడైనా క్రింద పడుతామేమోనని భయము ఉంటుంది. అటువంటి పరిస్థితి వస్తుంది. శాశ్వతముగ మేము ఇక్కడే ఉండేదానికి అవకాశము లేదు. ఉండినన్ని రోజులు మీరు తెలుసుకోవడానికి ప్రయత్నము చేయండి. ఎందుకంటే ఉన్నప్పుడే మేము చెప్పే అవకాశము ఉంది మేము చెప్పకపోతే వేరేవాళ్ళు చెప్పేదానికి అవకాశము లేదా? అంటే చెప్పొచ్చు. కాని వాడు పలుకుతాడో లేదో, ఎవడు? ఆరవవాడు. వాడు పలుకుతాడు అని నమ్మకము లేదు.

అర్థమయిందా! మీ ఇష్టము వచ్చినపుడు మీరు వస్తే నేను ఎట్లా చెప్తా? అంటాడు. కాబట్టి మీరు వాడు నేను చెప్పుతా! అన్నప్పుడు ఆయన చెప్పినప్పుడు మనము ఎందుకు తెలుసుకోకూడదయ్యా! తెలుసు కోవచ్చు. మీరు కూడా తెలుసుకోవచ్చు. మీరు ఆ విధానము నేర్చుకొనేదానికి ప్రయత్నము చేయండి. ప్రయత్నము చేస్తు ప్రతి నెల మీరు జ్ఞానము తెలుసుకొని ముందుకు పోతారని ఆశిస్తూ ఈ సమావేశాన్ని ఇంతటితో ముగిస్తున్నాము.

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము గాదు.**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము గాదు.**

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

# సుప్రసిద్ధి బోధ




Author : The Only Guru of Three Religions

The Spiritual Emperor, Thraitha Theorem Originator

Sri Acharya Prabodhananda Yogeeshwarulu



www.thraithashakam.org